

శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీశివపురాణము

శ్రీ ముదిగొండ నాగవీరేశ్వరకవి
విరచితము



శ్రీ కవీంద్రఘటాపంచాననేత్యాది బిరుదాంచితులును శతావధానులు నగు
బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులవారిచే
పరిష్కృతము

తృతీయ ముద్రణము.

హైదరాబాదు
ప్రీమియర్ పవర్ ప్రెసునందు ముద్రితము.

 1964 [వెల రు. 15
పోస్టేజీ ప్రత్యేకము,

# ప్రథమ ముద్రణమందలి పీఠిక

కవిసమ్రాట్టు శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు

శ్రీః

ఈ శివపురాణ మష్టాదశపురాణములలో నొకటి. దీని యాంధ్రీకర్త బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారు. ఇన్నాళ్ళకీ మహాగ్రంథము తెలుగులోని కనువదింపఁ బడుట భాషాసరస్వతి యదృష్టము. అదృష్ట మేలననగా నొక గ్రంథము మంచి కవిచేతిలోఁ బడుట పుణ్యవిశేషము. ఆకాశిపోకాశికవి కావ్యమును బాడుచేసి సమర్థుఁడు మరల ముట్టుకొనుటకుఁగూడ కొంకునట్లు చేయును. మొదట నీకవియొక్క మహాప్రతిభావిశేషము, వైదుష్యము, రచనలోని నేర్పు అనంతమార్గముల విహరించగల యీయన పద్యరచన, పూర్వకవులయందలి పరమాదరము, విమర్శనీయములు. వీనిలోఁ గొన్నిటిని స్థాలీపులాకన్యాయముగ నెత్తి చూపి తరువాత పురాణమును గుఱించి ముచ్చటించెదను. ఒక గ్రంథ మొకకవి వ్రాయుట కధికారము కావలయును. ఆ యధికార మీయన యొద్ద నెంతవఱ కున్నది? అందులో నియ్యది మహాగ్రంథము. అనంతమైన శక్తి కలవాఁడు గాని యిట్టి గ్రంథము వ్రాయుటకుఁ దలపెట్టడు. పుట కిఱువది యెనిమిది పంక్తుల చొప్పున నిది యేడువందల యెనుబది పుటల గ్రంథము. సుమారాఱువేల పద్యములు.

అప్పకవి సత్కవియొక్క లక్షణము చెప్పుటలోఁ బూర్వకవీశ్వర వాక్ప్రయోగ దక్షతగూడ నొక్కటిగాఁ జెప్పెను. ఈకవికి శ్రీనాథుఁడు, పోతన్న, తిక్కన్న, చేమకూర వేంకటకవి ప్రధానముగా నభిమాన పాత్రములు. వీరిలోఁ బోతన్నగారియం దీకవికిఁగల భక్తికిఁ బరిమితి లేదు. ఎన్నిచోట్లనైనఁ బోతన్నగారిపద్యములు పుణికి పుచ్చుకొనును. దీని కచ్చముగాఁ బోతన్నగారి యందలి భక్తి కారణము కాకపోవచ్చును. విష్ణుపారమ్యమును బోధించు పురాణము భాగవతము. ఈ పురాణము శివపారమ్యమును బోధించునది. భాగవతములో సర్వదా విష్ణుదేవునకుఁ బరమాత్మత్వము చెప్పఁబడును. ఇచట శివునకుఁ జెప్పఁబడును. రెండును భక్తిమతములే. రెండును మఱల వైదికమతములే. ఈ గ్రంథములకు సామ్యము మిక్కిలి యున్నది. అందుచేత నీకవి భాగవతమువలెఁ జాలచోట్ల రచన చేయుట వస్తుమర్యాదను బాటించుట యేమో! భక్తిని బోతన్నగా రిట్లు చెప్పిరి.

ఈ చూపించిన యుదాహరణలవలన యీకవి యెంతమందికవుల ననుకరించినను నీయన యభిమానము పోతన్నగారియందే యెక్కువ. చివరకు దన వంశవర్ణనము చేయుచు,

సీ. ఎవ్వాని శుభనామ మేప్రొద్దు నుడివిన, జనులకు పాపసంచయములోలఁగు.
(శి. పు. 6 పే.)

ఈరీతిగా నెన్నియేనియుఁ జూపింపవచ్చును. ఇది పూర్వకవుల వాక్ప్రయోగ దక్షత. ఈ మహాపురాణమునం దున్న గుణము లన్నియు చిట్టాగా వ్రాసి చూపించను గాని యొక్కొక్కగుణమున కొకటిరెం డుదాహరణములుగా చూపింతును.

శబ్దప్రయోగౌచిత్యము :

గీ. ఎంతయేనియు శుశ్రూష హెచ్చుచుండె, చెప్పమిప్పుడు కృపతోడ శివుని తత్త్వము
(శి. పు. 9 పే.)

ఇందలి శుశ్రూషాశబ్దము వ్యుత్పత్త్యర్థములో నెంత యందముగా నున్నది!

గీ. చారుకస్తూరికాగరుచందనాను, లేపనసుగంధబంధురాటోప మెసఁగ
వాఁడురుచిరతరామూల్యవస్త్రయుగ్మ,కలితుఁడగువాఁడు శంభుండు కాంచఁబడియె
(శి. పు. 48 పే.)

ఇందు "కాంచఁబడియె" నన్నప్రయోగము మిక్కిలి యుచితముగానున్నది.

శా. ఐనన్ బుత్త్రిక! శైవతత్త్వమును విశ్వాద్యుండు ప్రత్యక్షుఁడుం
డేనుఁ నిక్క మెఱుంగఁ జాల మిఁక నే నెట్లే నరుక్కానిన్ దీపము
ట్లేనిప్పట్ల నెఱుంగఁ జెప్పెదను విన్మీ! నాదు నైదుమ్మవి
జ్ఞానశ్రీపరిమాణ మెంతవఱ కొజ్జంజేసి రంజించునో ! (శి. పు. 20 పే)

పద్యరచన స్వతంత్రమైన పలుకుబడిలోనుండి పుట్టినది. "ఒజ్జంజేసి రంజించునో" యన్నమాట పలుకుబడిలోని ప్రౌఢి కుదాహరణము.

ఉ. కోరుము నీదు వాంఛితము కోమలి! నే నొడగూర్తు నందు ద
వ్వారయ కేను బల్కితి... (శి. పు. 174 పే)

దూర మాలోచింపక యనుటకు దవ్వారయ కనుటలోఁ బ్రౌఢికలదు.

శా, ఆవజ్రాంగుఁడు పద్మజున్ గని మహావార్థంబునన్ మ్రొక్కి నా
నావేదోక్తుల సన్నుతుల్ సలిపి వాగ్జ్నాథా! మదీయాంగనా
భావారూఢునిఁ బుత్రు నిమ్ము..... (శి. పు. 174 పే.)

'మదీయాంగనాభావాపాదునిఁ బుత్త్రిని' యనుటలో భావగాంభీర్యమును జూడుఁడు!

లయగ్రాహి. కొండ అలు కొంది ధృతిఁజెంది సురబృందముల
నం దురమునం దెదిరి గ్రమ్మందిరి కడంకన్ (శి. పు. 35 పే)

ఇది తారకాసురకుమారుల యుద్ధము ఈయుద్ధభాగములో లయగ్రాహి యింతసుకుమారముగా వ్రాయుట శైలిలో నొక మృదువైన పాక మేర్పడినవాఁడుగాని వ్రాయలేఁడు.

ఉ. ప్రొద్దు కడుఁగ వడిఁబడమి కొండ్లఁ గిలుఁగ బురము లనంబడఁగ
పొద్దును దప్పి తారలు హిమాంశుఁడు దాగుచు దిగ్గుమందు రే
సుద్దియు లేక బిక్కవడి చూచుచు నుండు జముండు మేటి యా
పద్దశఁ గద్దుచుంటి మిది పద్మభవా! కనరాదె నీకిటుల్.

చ. ఎపుడొ దివంబు పైఁబడి సురేసులతో నిసుమ్ము బోవరు ర
క్షపుడును జేతి చూడి కడు నబ్బుర మొందుచు దిబ్బ సేతు మం
చవక్కృతు లాడి పోవుదురు హా! యిఁక నేమి యొనర్తు మిత్తరిన్
దెవదేవలాడు మామదుల దీనతఁదీర్చు మనుగ్రహమ్మునన్ ॥

(శి. పు. 402 పే)

ఈపద్యములలోని వర్ణన యే పూర్వకవులును జేసినది కాదు. మిన్నుస్వర్గమంతయు బూడిద చేయుదుము, దిబ్బ సేయుదుము అనుటలో నున్న యౌచిత్యము చెప్పరాకుండ నున్నది. ఈ మాటలయందు దాయాదులయొక్క మాత్సర్యము పరమరమ్యమైన వ్యంగ్యభూత మైనది. ఇందు రసము చిప్పిలుచున్నది. మొదటిపద్యము మిక్కిలి చిత్రముగా నున్నది. ఈరచన మహాకవులుమాత్రమే చేయఁగలరు. సామాన్యులు చేయలేరు. ఇది యంతయు నీకవియొక్క స్వతంత్ర వాదమాత్యము.

సంస్కృతము :—

తెలుఁగుకవులు సంస్కృతసమాసములు గూర్చుటలో సులభార్థము సులభగ్రథనము చేయవచ్చును. అట్లుగాక, అర్థవత్తుగా, తార్కికసంబద్ధముగా సమాసగ్రథనము చేయుట యొక ప్రతిభాలక్షణము.

ఉ. కన్నను గాంచి యుద్వృత్తుఁ గాంచి మునీంద్రుఁడు మన్మథాస్త్రసం
పన్నమనమ్ములో నృపతివర్యున కిట్లనె...(శి. పు. 13 పే)

ఇచటి "మన్మథాస్త్రసంపన్నమనమ్ము" అన్నసమాసము ఇందాఁకటి "మదీయాంగనాభావాపాదుని" అన్న సమాసము వంటిది. ఒక విలక్షణమైన భావము

గర్భమునందుఁ గల కూర్పు. ఇట్టి సమాసములు చేయుటకుఁ గవికిఁ బ్రతిభ కావలయును.

తెలుఁగులు :—

ఉ. గెల పండిన యనటుల జొ,బ్బిలు పానకములఁ దనర్చు విరివగు సెమ్మా
వులఁ బండ్ల మెక్కి యుక్కునఁ, జెలఁగి వదరఁ జేసె రామచిల్కలదంబుల్

(శి. పు. 73 పే)

సీ. సంజ కెంజాయల జానగు చందురు... (శి. పు. 90 పే)

సీ. ఎలమావులును, నిమ్మ, లీత, చిట్టీతలు... (శి. పు. 117 పే)

ఇట్లనేకపద్యములు అచ్చ తెనుఁగుతనమునే వెలయించుకొనుచుండును.

ఉ. ......భీతచిత్తులై
ఎప్పటి కప్పుడే గడప నెంతురు కాలము కంజసంభవా!

ఈరీతిగా లోకసంగ్రహణము, తెలుఁగు పలుకుబడి, తెలుగుమాటల సమృద్ధి కూలంకషముగా నున్న రచన యిది.

వేదపరమార్థజ్ఞత :—

ఈగ్రంథ మంతయు వైదికార్థములనే చెప్పును. కాని, యొక మహావిషయమును జెప్పఁదలఁచితిని. తారకుని చేత దెబ్బలు తిని కుమారస్వామి మూర్ఛపోయెను.

గీ. స్కందుఁ డద్దాన మూర్ఛిల్లి క్షణములోన
ఋషిగణస్తూయమానుఁడై తెలివి చెంది (శి. పు. 330 పే)

మూర్ఛపడిన స్వామి ఋషిస్తోత్రములచేత మేల్కొనె ననుట శివతత్త్వస్ఫూర్తి మద్వాక్యము.

శిల్పము:— శిల్పమన్నశబ్దమున కర్థమిదమిత్థమని చెప్పుటకు వీలులేదు. లోకోత్తర సౌందర్య మెచ్చట పొడసూపునో యది శిల్పమని చెప్పవచ్చును. కథను జెప్పుటలోఁ గ్రొత్త రకముగాఁ జెప్పుట గొప్ప శిల్ప మని నాయుద్దేశ్యము. ఆంధ్ర వాఙ్మయములో కథా కథనరమ్యత పలుమంది పలురకములుగాఁ జూపించిరి. ఈ కవి కొన్నిచోట్ల కథను జెప్పుటలో రమ్యతనే చూపించెను.

చివరకు శివుఁడు పార్వతి నంగీకరించెను. దివ్యస్త్రీలు పరిహాసము చేసిరి. అంత నిందిర యిట్లనియె, సావిత్రియిట్లనియె, అదితియిట్లనియె. ఆ వెంటజాహ్నవి

యిట్లనియె, నిట్లు దేవతా స్త్రీలందఱు తలాయొకమాట యనిరి. ఇవి చిన్నచిన్న వచనములు. వారందరన్నమాటలు పద్యములు. ఈ రచనవలన పెండ్లిసంబర మంతయు, పరిహాస మంతయు, పెండ్లికొడుకులో ముత్తైదువలాడు ముచ్చటలే వ్యంగ్యభూతములై కథా ఘట్టము పరమ సౌందర్య మనిపించుకొన్నది. వారట్లనిరి; వీరిట్లనిరి, అని వచనములు వ్రాసి, యన్నమాటలు పద్యములుగా వ్రాయుట, పోతన్నగారి భాగవతములోని యొక రచనాపద్ధతి. ఈ రచనా పద్ధతిని విస్తృతమున నీ సౌందర్యోత్పాదనకై వినియోగ పరచుట యీకవియొక్క ప్రతిభ. మరల నీ రచనాపద్ధతినే శివుఁడు తన వీర్య మేమైనదని, కాదకులలో జూపించెను. శ్వేతాద్రివాయుస్వర్ణదీవసుమత్యాదులు కుమారునికథఁ జెప్పుదురు. అచటఁగూడ నీ సౌందర్య మున్నది.

ధ్వనులు. ధ్వనియన్న శబ్దమే విచిత్రమైన యర్థముగలది. సుకవిరచనలో రస మెప్పుడును వ్యజ్యమాన మగుచునే యుండును. కాని యల్పాల్పధ్వనులు, వస్తుకృత వస్త్వాదులు, శబ్దగతాదులు ప్రత్యేకముగా నుండఁ గొందఱు పండితులు వానినే చూచి యదియే ధ్వని ప్రధానకావ్య మనుకొందురు. శబ్దగతములైన మఱి కొన్ని వ్యంగ్యములు చూడుడు.

గీ. అరయ నాధారశూన్యమౌ నాకసంబు నందు తొక్కులు లేని నాడెంద మనెడు
పులు గగురుచుండె నద్దాని భూరిదయను నరసి ప్రోచునుగాత చంద్రార్ధమౌళి
(శి. పు. 211 పే)

ఈవాక్యము పార్వతి సప్తర్షులతో నన్నది. ఇది యలంకార కృతవస్తుధ్వని. రూపకాలంకారముచేత జీవుఁడు, ఇది శైవము కనుక నీ జీవుని రక్షించు పరమేశ్వరుఁడు వ్యంగ్యభూతు లగుచున్నారు.

పాకము:—చ. అరుణమరీచి యంత నుదయాచలపీఠము నెక్కి పర్వత
స్ఫురదసమాన మంజుకరపుంజములన్ వెలయించి యూర్ధ్వని
స్ఫురదమలాంశుజాలములఁ శైలవరోన్నతశృంగపల్వలాం
తరపలినాళిఁ గూడఁ బ్రియదమ్మునఁ బూయఁగఁ జేసె వాసిగన్.

* * *

వ్యయ, కార్తిక శుద్ధ సప్తమీ గురువారము.

# ప్రథమ ముద్రణమందలి ఉపోద్ఘాతము

బ్రహ్మశ్రీ తూములూరి శివరామకృష్ణ శాస్త్రిగారు, మదనపల్లి.

శ్రీ॥

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరేశ్వర శాస్త్రిగారిచే శివపురాణ మాంధ్రీకరింప బడినది.

అనూచానశైవాచార్య వంశమున జన్మించి తద్విజ్ఞానమును సమగ్రముగ గ్రోలుట వీరి యాంధ్రీకరణమున కొక ప్రధాన యోగ్యత. ఆంధ్రీకరణమున నన్నయాదుల మార్గమే యవలంబింపఁబడినది. రసవంతములగు ఘట్టములఁ బెంచుట, నీరసములను దుంచుట యను పద్ధతివలన తెలుఁగున పురాణములు కావ్యశోభ నొందినవి. కాని యీమార్గమునం దొక లోప మున్నది. పురాణములలోని విమర్శనీయాంశములు సంస్కృత భాషానభిజ్ఞులకు సమగ్ర రూపమునఁ బ్రకటమగుట లేదు.

శివపురాణమున నుమాఖండమున గల స్పష్టకాలజ్ఞానము, మృత్యుంజయ యోగములు మొదలగు ఘట్టము లింకను విపులీకరించినను లాభదాయకములే. లేదా, ఆ యుదాత్తయోగముల మూలమును తగిన వివరణముతో ప్రకటించినను మేలే.

సమకాలికుల కవిత్వశైలినిగూర్చి ముచ్చటించుట వివిధవిమర్శలకు తావిచ్చును. వినను బురాణవాఙ్మయముపై మనోగతభావములఁ బ్రకటించుటకు వ్రాయు నీ పంక్తులలో నాకుఁ దోచినంతవఱకు నీ యాంధ్రకవితలోని గుణములఁ జూపుట అప్రకృతము కాదు.

గ్రంథపఠన మారంభించినది మొదలు సమాప్తిచేయువఱకు నెచ్చటను విసుగుజనింపలేదు. ఉత్తరోత్తరము రసవంతమై యాకర్షించినది. ప్రాచీన కవులయందలి సర్వసామాన్యమగు చక్కనిశైలియు ధారాశుద్ధియు నీకవివర్యునకు దైవదత్తములు. కనుకనే యీ మహాగ్రంథము నిర్విఘ్నముగ నాంధ్రీకరింపఁ బడినది.

కవితాహంకారమున గాక శివకైంకర్య దీక్షాతత్పరతచే నీగ్రంథ మాంధ్రీకరింపఁబడినది. పద్యరూపమున నీ గ్రంథము నాంధ్రీకరించు సదృష్టము తొలుత తనకే సంభవించినదని యీకవి మురియుచున్నాఁడు. పోతనవలెనే యీ ఘనకార్యమున తన జన్మము కృతార్థమైనదని యుప్పొంగుచున్నాఁడు. పితరుల కీగ్రంథ మంకితమిచ్చుటచే పితౄణము ఆంధ్రీకరణముచే ఋషిఋణము, భక్తి విశేషముచే దేవఋణములు దీరినవి. ఈగ్రంథమందంతటను భక్తి యంత

ర్వాహినియై ప్రవహించినది. నిరంతర శివనామామృతాస్వాదపరిపూత మగు జిహ్వ నుండి యీ కవిత స్రవించినది.

ఒకే శైలూషి సందర్భానుగుణముగ వివిధభూమికల ధరించినట్లు భావానుగుణముగా శైలి పలువిధముల మార్పు నొందినది. అప్రయత్నముగ రచింపఁబడినట్లు అనేకపద్యములు గోచరించును. శివుని పైదండెత్తు మన్మథుని వర్ణించుసందర్భమున అతని సౌకుమార్యము ఈపద్యమున మనోహరముగ గోచరించుచున్నది.

ఉ. వాడిన రాలిపోవు సుమవర్గము కాండచయంబు పుష్ప నా
నేడకొ బారు వ్రుల్గు లోకమేమన వారువముల్ స్వరూపమే
జాడను లేని తెమ్మెరలు చప్పవజీరులు తోడునుండు రే
ఱేఁ డబలల్ బలంబులు సరే యిఁక రుద్రునితోడఁ బోరుటల్.

(శి. పు. 184 పే. 99 ప)

సీసపద్యరచనయందు శ్రీనాథుని పోకడలు కొన్నిమొదలఁ గన్పించుచున్నవి.

సీ. ఇంద్రనీలముదాలు నీసడింపఁగఁజాలు, నీలంపు మైనిగనిగల వాని
వేయి రేకుల తమ్మివిరుల గెల్వఁగఁజాలు, విరిపైన కనుదోయి వెలయువాని
చెనటుల నమయింపఁ జేవగల్గినసాధ, నములొప్పు నాల్గుహస్తములవాని
అమృతంబుకన్న తీయగనొప్పు మాధురి, గురియించు సెమ్మోము కొమరువాని
గీ. పలురకములైన రతనాల వెలసి ధగధ, గలుదనర్చు కిరీటంబు గ్రాలువాని
కౌస్తుభంబను మణి యెదఁ గలుగువాని, పసిడిపుట్టంబు గట్టిన బాలు నొకని.

(శి. పు. 23 పే. 189 ప)

సీ. చాపబాణాంకుశచటులపాశారవిం, దము లొప్పు నాల్గుహస్తములతోడ
బాలేందురేఖావిభాసితం బగుచు నం, దంబుఁ జెందిన కిరీటంబుతోడ
పద్మరాగచ్ఛాయ పరిధవించిన మనో, జ్ఞములైన మాల్యాంబరములతోడ
మందహాసపు సిరి మానుగుల్కెడు దయా, స్పదములై తగు కటాక్షములతోడ
గీ. భవ్యకాశ్మీరగంధలేపములతోడ
ముంగురులు మూగు కస్తూరిబొట్టుతోడ
భువనములనెల్ల భ్రమసేయు మూర్తితోడ
శంకరార్ధాంగలక్ష్మి సాక్షాత్కరించె. (శి. పు. పే140 ప72)

స్త్రీనిందాస్తుతులు శివకేశవులచే మిక్కిలి మనోహరముగాఁ జేయఁబడినవి. సతీవియోగము నొందిన శివుఁడు స్త్రీని నిందించుటయు, లక్ష్మీపతి యగు కేశవుఁడు గృహస్థాశ్రమధర్మమును బొగడుటయు సందర్భసహజములు.

సీ. అపవిత్రములలోన నగ్రిమం బగు చోటు, బొంకుల కెల్లను బుట్టినిల్లు
కపటవర్తనములఁ గనఁ జేయు నెఱజాణ, చెడుగోఁతఁబడఁద్రోయు చెడ్డఘోటి
అనువుగా భ్రమసేయు నైంద్రజాలికవిద్య, నమ్మయేలినచోటి నాగుఁబాము
సాహసంబుల కెల్ల జంకనట్టి వలఁతి, పాయంగ సేయని పరమధనము

గీ. ఒనరఁగాఁ గట్టుత్రాడులందుక్కుగొలుసు, మణికసంతోష మొసగుకోర్కెలరిగ
స్త్రీ యనఁగ దానిలోఁబొత్తు జెందవలదు, బ్రహ్మనిష్ఠుల కెందేని బహ్మనయున!
సీ. అఖిలతాపంబుల హరియించు నౌషధం, బార్తికంథిని దాటునట్టి నౌక
చిత్తంబు రంజిల్లఁ జేయఁ జాలిన విద్య, సకలసౌఖ్యములకు జన్మభూమి
ప్రతిదినంబును గ్రొత్త బరగు చక్కనివిందు, కొమరారుకొలముల కమరగిరువు
అన్నపానంబుల నందఁ జేసెడు దైవ, మతిథిజనంబుల సరఁకుతల్లి
గీ. దేవయజ్ఞంబునందు నెంతేని తోడు, శిష్టసుఖములయందుఁ బొల్గొంచు జోడు
ఆత్మసతి యగుఁగావున నందఱకును, బెండ్లి యాడంగఁదగు గాదె పేర్మి యలర.
(శి. పు. పే 209 ప 67.)

పోతనవిష్ణుభక్తివలె గ్రంథకర్తశివభక్తి వెల్లువగా పారినది.

సీ. శీతాంశుధరు నెంచు చిత్తంబు చిత్తంబు, భవు సమర్చన సేయు పాణి పాణి
ప్రమథనాథుని జేరు పదములు పదములు, శివుని సన్నుతి సేయు జిహ్వ జిహ్వ
విశ్వేశు కథ విను వీనులు వీనులు, కాలకాలుని జూచు కనులు కనులు
పరమేశుఁ గొల్చెడు భాగ్యంబు భాగ్యంబు, దర్పకారికి నొంచు తనువు తనువు
గీ. పురహరునిఁ గొల్వఁబూనిన బుద్ధి బుద్ధి, శ్రీశనాయకునకు మ్రొక్కు శిరము శిరము
శంకరుని భక్తిఁబడసిన చదువు చదువు, నాగభూషణు సేవించు నరుఁడు నరుఁడు.
సీ. పరమశివార్చనాపదవి నొందఁగ లేని, యుక్కగా దది పాపదొక్క గాని
ఖండేందుధరభక్తి గనకయున్నట్టి య, న్నరుఁడు గా డాతండు నఱుఁడుగాని
శ్రీకంఠమూర్తిని జెలగి మ్రొక్కఁగ లేని, శిరము గా దది పాపభరము గాని
భోగిభూషణుపూజఁ బూని సేయఁగ లేని కేలు గా దది చెడ్డ కేలు గాని
గీ. శంకరుని మదిఁ జెందఁగాఁ జాలనట్టి, తెలివి గా దది యొక చెడ్డ తెవులు గాని
అమ్మహేశ్వరు కొలువుకై యమరనట్టి, కలిమి గా దది పేరడ్సు బలిమి గాని

(శి. పు. 215 పే. 116ప)

సందర్భానుగుణముగ లోకోక్తు లీకవిత నలంకరించినవి.

చూపులగుఱ్ఱమువలె నత డేపుమెయిం బెరుగుచుండ (శి. పు. 53 పే. 40 ప )
ఉడుము కేటి కోరి! యూరివార్త (శి. పు. 82 పే. 141 )
పరులకోసరముగ బావి దూకుట మేలె ( శి. పు. 98 పే. 257 ప )
కొండ నెత్తి తలం దాల్చుకొనఁ దరంబె ( శి. పు. 184 పే. 100 ప )
ఇత్యాదులు పెక్కులు.

గ్రంథరాజమా! ఆచంద్రార్కము వర్ధిల్లుము.
ఓం తత్సత్ శివమ్.

# విద్వదభిప్రాయములు



శ్రీ కింకవీంద్రఘటాపంచానన నేత్యాద్యనేక బిరుదాంచితులును గవిచక్రవర్తులును గలాప్రపూర్ణులునగు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులవారు. శతావధానులు-

శ్రీమత్పరదేవతాయైనమః

శివపురాణము

దీనిని శ్రీ ముదిగొండ నాగవీరేశ్వరశాస్త్రిగారు తెలిగించిరి. వీరి తెలుఁగు ముక్కుముక్కగాఁగాక స్వతంత్రరచనవలెనున్న ధారాశుద్ధిగలిగి నిర్దుష్టమై ప్రసాదగుణము గలిగి రసవంతముగ నలరుచున్నది. ఈ కవికి సంస్కృతాంధ్రములయందసాధారణమైన సాహిత్యమున్నదని యిందలి రచనయే తెలుపుచున్నది. మూలములోనున్న విషయములు కొన్ని నేటికాలమునకు రుచింపవనితోఁచి, సంగ్రహించి యనువదించుట గమనింపఁదగిన యంశము. ఈయన జన్మము చేతనే ముక్కిలి శివభక్తుఁడు; కాక ప్రవర్తనచేతఁగూడ నసిధారావ్రతమగు శివభక్తిగల నిషధయోగ్యుఁడు. నాకీయన శిష్యకోటిలోనివాఁడగుటచే నింతకన్న నధికముగా వ్రాయక యుపాస్యుండగు సదాశివుఁడీయనకు నిరామయాయుర్భాగ్యాదులొసంగి కాపాడుఁగాకయని యాశీర్వదించుచు నింతటితో ముగించుచున్నాఁడను.



బ్రహ్మశ్రీ కాశీకృష్ణాచార్యులుగారు. అవధాని శిరోమణులు, గుంటూరు.

శ్రీలక్ష్మీహయగ్రీవో విజయతే

శ్రీరస్తు చి॥ ముదిగొండ నాగవీరయ్య మహాకవి నాశీర్వదించి వ్రాయు నభిప్రాయము. ఆశీరుభయకుశలోపరి.

సహజకవితాలంకృతా! మీ శివపురాణము నాకందిన మొదటిదినముననే గ్రంథమును దెఱచితిని. అప్రయత్నముగ 293 వ పుటలో నట్టడుగుననున్న కందము "జిహ్వ పెరుగూరుగాయలు" అను పద్యము కాఁటఁబడి "యింత పెద్దపుస్తకమును ప్రత్యక్షర పరిశీలనాపద్ధతితోఁ ద్వరగాఁ జూడఁగల శక్తిలేని వృద్ధుఁడనైతిఁగదా!" అని నామనంబునకు విచారమునుగల్గించెను. మీ గ్రంథమునందలి పీఠికోపోద్ఘాతములను మున్నుఁజదివి సాంగోపాంగముగఁజదివి గ్రంథమునందుఁగూడఁ గొంతవఱకు నాయా భాగములఁజదివి పరమానందమును నొందితిని. సహజకవితా ప్రియుఁడనగుటచే నట్టి కైత తారసిల్లినప్పుడు దాని నామూ

గీ. ఒసరఁగాఁ గట్టుత్రాడులందుక్కుగొలుసు, క్షణికసంతోషమొసగుక్రొక్కారుతీగ
స్త్రీ యనఁగ దానితోఁబొత్తు జెందవలదు, బ్రహ్మనిష్ఠులకెందేని బద్మనయన!

సీ. అఖిలతాపంబుల హరియించు నౌషధం, బార్తికంధిని దాటునట్టి నౌక
చిత్తంబు రంజిల్లఁ జేయఁ జాలిన విద్య, సకలసౌఖ్యములకు జన్మభూమి
ప్రతిదినంబును గ్రొత్త బరగు చక్కనివిందు, కొమరారుకాలమున కమరతరువు
అన్నపానంబుల నందఁ జేసెడు దైవ, మతిథిజనంబుల నరఁయుతల్లి
గీ. దేవయజ్ఞంబునందు నెంతేని తోడు, కష్టసుఖములయందుఁ బాల్గొంచు జోడు
ఆత్మసతి యగుఁగావున నందఱకును, బెండ్లి యాడంగఁదగు గాదె పేర్మి యలర.
(శి. పు. పే 209 ప 67.)

పోతనవిష్ణుభక్తివలె గ్రంథకర్తశివభక్తి వెల్లువలై పాఱినది.

సీ. శీతాంశుధరు నెంచు చిత్తంబు చిత్తంబు,భవు సమర్చనసేయు పాణి పాణి
ప్రమథనాథుని జేరు పదములు పదములు, శివుని సన్నుతి సేయు జిహ్వ జిహ్వ
విశ్వేశు కథ విను వీనులు వీనులు,కాలకాలుని జూచు కనులు కనులు
పరమేశుఁ గొల్చెడు భాగ్యంబు భాగ్యఁబు, దర్పకారికి నొంచు తనువు తనువు
గీ. పురహరునిఁ గొల్వఁబూనిన బుద్ధి బుద్ధి,శ్రీశసాయకునకు మ్రొక్కుశిరముశిరము
శంకరుని భక్తిఁబడసిన చదువుచదువు, నాగభూషణు సేవించు నరుఁడు నరుఁడు.

సీ. పరమశివార్చనాపదవి నొందఁగ లేని,యిక్కగా డది పాపడొక్క గాని
ఖండేందుధరభక్తి గనకయున్నట్టి య, న్నరుఁడు గా డాతండు వఱఁడుగాని
శ్రీకంఠమూర్తిని జెలగి మ్రొక్కఁగ లేని, శిరము గా దది పాపభరము గాని
భోగిభూషణుపూజఁ బూని సేయఁగ లేని కేలు గా దది చెడ్డ తేలు గాని
గీ. శంకరుని మదిఁ జెందఁగాఁ జాలనట్టి, తెలివి గా దది యొక చెడ్డ తెవులు గాని
అమ్మహేశ్వరు కొలువుకై యమరనట్టి,కలిమి గా దది పేరడ్డు బలిమి గాని

(శి. పు. 215 పే. 116ప)

సందర్భానుగుణముగ లోకోక్తులీకవిత నలంకరించినవి.

చూపులగుఱ్ఱమువలె నత డేపుమెయిం బెరుగుచుండ (శి. పు. 53 పే. 40 ప)
ఉడుము కేటికోరి! యూరివార్త (శి. పు. 82 పే. 141)
పరులకోసరముగ బావి దూకుట మేలె (శి. పు. 98 పే. 257 ప)
కొండ నెత్తి తలం దాల్చుకొనఁ దరంబె (శి. పు. 184 పే. 100 ప)

ఇత్యాదులు పెక్కులు.

గ్రంథరాజమా! ఆచంద్రార్కము వర్ధిల్లుము.

ఓం తత్సత్ శివమ్.

# విద్వదభిప్రాయములు

శ్రీ కింకవీంద్రఘటాపంచానవేత్యాద్యనేక బిరుదాంచితులును గవిచక్రవర్తులును గలాపరిపూర్ణులునగు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిలవారు. శతావధానులు–

శ్రీమత్పరదేవతాయైనమః

శివపురాణము

దీనిని శ్రీ ముదిగొండ నాగవీరేశ్వరశాస్త్రిగారు తెలిగించిరి. వీరి తెలుఁగు మక్కికిమక్కిగాఁగాక స్వతంత్రరచనకున్న ధారాశుద్ధిగలిగి నిర్దుష్టమై ప్రసాదగుణము గలిగి రసవంతముగ నలరుచున్నది. ఈ కవికి సంస్కృతాంధ్రములయం దసాధారణమైన సాహిత్యమున్నదని యిందలిరచనయే తెలుపుచున్నది. మూలములోనున్న విషయములుకొన్ని నేఁటికాలమునకు రుచింపవనితోఁచి, సంగ్రహించి యనువదించుట గమనింపఁదగినయంశము. ఈయన జన్మముచేతనే మిక్కిలిశివభక్తుడు; కాక ప్రవర్తనచేతఁగూడ నసిధారావ్రతమగు శివభక్తిగల నిషథయోగ్యుడు. నాకీయన శిష్యకోటిలోనివాఁడగుటచే నింతకన్న నధికముగా వ్రాయక యుపాస్యుండగు సదాశివుఁ డీయనకు నిరామయాయురారోగ్యాదులొసంగి కాపాడుఁగాకయని యాశీర్వదించుచు నింతటితో ముగించుచున్నాడను.

---

బ్రహ్మశ్రీ కాశీకృష్ణాచార్యులుగారు. అవధాని శిరోమణులు, గుంటూరు.

శ్రీలక్ష్మీ హయగ్రీవో విజయతే

శ్రీరస్తు చి॥ ముదిగొండ నాగవీరయ్య మహాకవి నాశీర్వదించి వ్రాయు నభిప్రాయము. ఆశీరుభయకుశలోపరి.

సహజకవితాలంకృతా! మీశివపురాణము నాకందిన మొదటిదినముననే గ్రంథమును దెఱచితిని. అప్రయత్నముగ 293 వ పుటలో నట్టడుగుననున్న కందము "జిడ్డుపెరుగూరుగాయలు" అను పద్యము నాకంటఁబడి "యింతపెద్దపుస్తకమును ప్రత్యక్షర పరిశీలనాపద్ధతితోఁ ద్వరగాఁ జూడఁగల శక్తిలేనివృద్ధుఁడనైతిఁగదా!" అని నామనంబునకు విచారమునుగల్గించెను. మీగ్రంథమునందలి పీఠికోపోద్ఘాతములను మున్ముందిని సాంగోపాంగముఁగ జదివి గ్రంథమునందుఁగూడఁ గొంతవఱకు నాయా భాగములఁజదివి పరమానందమును నొందితిని. సహజకవితా ప్రియుఁడనగుటచే నట్టికైతదారికినప్పుడు దాని నామూ

లాగ్రిమనుభవింపకపోతినని విచారమేగాని అభిప్రాయమొసంగుటకు నా యీ అనుభవముచాలు. మీపుట్టుకైతను మీజిజ్ఞపెరుగు పద్యము చూచినతోడనే వర్ధించుచున్నది. కావున మీది పెట్టుకైతకాదు. అవకాశమున్నచో చూచు కొలఁది మీగ్రంథములో నాల్గవపాలంతసదభిప్రాయ మీయవచ్చును. సుప్రసిద్ధులగు బ్ర॥ శ్రీ॥ విశ్వనాథసత్యనారాయణశాస్త్రి తూములూరి శివరామ కృష్ణశాస్త్రి మహోదయులువ్రాసిన పీఠికోపోద్ఘాతములనే నేనుగూడ నాదిలో నీగ్రంథమును జూచియున్నయెడల వ్రాసియుందును. కావున వారు వ్రాసిన విషయము లన్నియు మీశివపురాణమునందుగలవని నాకుఁదోచినది. అందుచే నారెంటిని నేను యథార్థములని హృదయపూర్వకముగ విశ్వసించు చున్నాఁడను. ఐనను నాసొంతముగగూడ రెండుపద్యముల నీదిగువవ్రాయుదును.

ఉ॥ బమ్మెరపోతరాడ్రచిత ♦ భాగవతమ్మె భవత్పురాణ ర
త్నమ్మునకీడుజోడని మ ♦ నమ్మున నమ్ముచు విష్ణుశంభు శ
బ్దమ్ములఁ దీయ నీదుకృతి ♦ భాగవ తమ్మయి యద్ది నీపురా
ణమ్మయి గ్రాలుచుండెడు న ♦ నారత మీధరనంచు నెంచెదన్.

ఉ॥ తియ్యదనంబునందుఁ గవి ♦ తిక్కనఁ జిక్కదనంబునందు న
న్నయ్యకవీంద్రుఁ గమ్మదన ♦ మందల మెఱ్ఱనసూరి గేరదో
యయ్య! త్రిమూర్తులీవొకఁడ ♦ వై తివహో! ముదిగొండనాగవీ
రయ్య! మహాకవీ! శివపు ♦ రాణమహాకృతిసిద్ధవాగ్గతిన్.

నేను వయోవృద్ధుఁడనగుటచే నీయభిప్రాయము నాశీఃపూర్వకముగ వ్రాసితిని.

ఇతిశం—కాశీకృష్ణాచార్యః

27-3-1947

---

శ్రీశైవమహాపీఠాధ్యక్షులు, శతాధికగ్రంథకర్తలు, శివయోగి, మహోపాధ్యాయ బ్ర॥ శ్రీ॥ ముదిగొండ నాగలింగ శాస్త్రిలవారు- 4-3-1947

గీ॥ అనఘ! నీకృతిరత్నంబు ♦ నాంధ్రశివమ,హాపురాణంబుఁగనుఁగొంటి♦నాదరమున
కూర్పునేర్పున నెలకొన్న♦కోమలతను,నామదికిఁగూర్చెనిద్దియా♦నందగరిమ. ౧

గీ॥ గ్రంథబహుళ నమేయార్థ ♦ గౌరవమున, గొప్పదై దుస్తరంబగు ♦ నిప్పురాణ
జలధిలంఘింప నలఁతుల♦కలవియె యిది,భవవనధితోడదాఁటితి♦భవునికృపను. ౨

ఉ॥ శైవుఁడ వాత్మవంశవర ♦ జాతుఁడవున్ విబుధాంధ్రభారతీ
కోవిదమౌళివిన్ గవివి ♦ గోపతివాహపురాణరూపసం
భావితకీర్తిమైదగు భ ♦ వత్కృతి యీగతి నస్మదీయమో
దావహ మౌట వింతయొటు ♦ లన్యులనే తనియించుచుండగన్. 3

క॥ అగజాపతిమహిమోన్నతి, నగణితఘనసుగుణమణిగ ♦ ణాభరణంబై
నెగడుచునుండిన నీకృతిఁ, దగుగతిఁ బొగడంగ నవ్వి ♦ ధాతకు వశమే? ౪

సీ॥ మనుజభావము విప్ర ♦ జనువునరాజిల్లె, నద్దిశైవాన్వవా♦యజత నెగడె
శైవవంశ్యతయును ♦ సాహితిచే నొప్పె, సాహితి కవితచే ♦ సఫలమయ్యె
కవితయు సన్నుతిఁ ♦ గాంచెసర్వోత్తర, మాంధ్రశివపురా ♦ ణాఖ్యకృతిని
నౌర!సద్గుణరాజి♦యన్యోన్యభూషణ, భూష్యతనొక్కెడఁ ♦ బొసఁగఁగలవె?

గీ॥ నీలగళుకృప నీయంద ♦ నిలిచెగాక, నిట్టిశుభగుణపంక్తికి♦ హేతువైన
పూర్వపుణ్యంబు నీయది♦పొగడదరమె, యీఢ్యగుణపూర్తి!నాగవీ♦రేశశాస్త్రి!

క॥ భవవిలయకారి హరవై, భవనిలయంబైసమస్త ♦ భవికాలయశో
భ వజలుచుండిననీకృతి, భువివెలయుఁగాత మెల్ల ♦ పుడు గాశివలెఁ.

గీ॥ ససుతదారుఁడవగునీకు♦శంకరుండు, సంపద చిరాయువుసుఖం బొ♦సంగుగాత!
ధరణినీకృతియాచంద్ర ♦ తారకముగ,నిర్మలభవద్యశంబుతో ♦ నిలుచుగాత! ౬

గీ॥ జనచయంబుభవత్కృతి, జదువుచుండి, సమధికంబైతనర్చెడు ♦ శంభునికృప
నాయురారోగ్యయుక్తమై♦యనవరతము,నున్నతానందమునుబొందు♦చుండుఁగాత!

గీ॥ అనుచుముదిగొండనాగలిం♦గాహ్వయుండు, రసికజనతాతిహృద్యమై ♦ యెసఁగు
నాంధ్ర, శివపురాణంబుగూర్చివి♦శేషమైన,తనదునామోదముందెల్పె♦దద్‌జ్ఞులలర.

---

శ్రీ మహామహోపాధ్యాయాద్యనేక బిరుదాంచితులు ఆంధ్రభారతకవులు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవారు కవిసార్వభౌములు—

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారికి—

అయ్యా! మీరచించిన గ్రంధమంతయుఁ జదువఁజాలనైతిని. అక్కడక్కడ గొంచము కొంచముగా జదివితిని. కవిత్వము మిక్కిలి చక్కగా నున్నదని మనవి చేయుచున్నాను. మీరు కవితావిషయములో గొప్ప శూశ్రూష చేసియున్నారు. తత్ఫలితముగా నిట్లు సుకవిత్వ మలవడినదని పండితులు తలంచుచున్నారు.

చిత్తగించవలెను,

1-3-47 రాజమహేంద్రవరము శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

---

శ్రీతిరుపతి వెంకటేశ్వర ప్రాచ్యవిద్యాపీఠ ప్రధానోపాధ్యాయులు, సంస్కృతాంధ్రవాఙ్మయపరిశోధకాగ్రణులునగు బ్ర॥శ్రీ॥ వేటూరి ప్రభాకరశాస్త్రులవారు.

ఆర్య! మీచే రచితప్రకటితమైన శివపురాణమునందందు హాయిహాయిగాఁ జదివి యానందించినాను. మీరు మీప్రజ్ఞను జిరకాలము డాచియుంచుకొని పరితృప్తి పరచుకొని యీగ్రంథమును రచియించితిరి. శ్రీగురుపాదులు వెంకట

శాస్త్రిగారును, మిత్రులు గుణగ్రహణపరాయణులు సత్యనారాయణకవిగారును మెచ్చుకొన్న మీగ్రంథమును నాబోటివాఁడు మెచ్చుట సిద్ధసాధనము. తదాపీదమస్తు.

మీగ్రంథము మహాగ్రంథము. మీరుమహాకవులు. గ్రంథయోగ్యతకు దగిన రచనా యోగ్యతగలవారు మీరు. మీరచనారీతి మంచిపురాణఫక్కినిసాగినది. కుమార సంభవాది సంస్కృతాంధ్ర ప్రాచీనకృతులలోనిశివకథలుమీపురాణములోనున్నవి. ప్రాచీనకవులీ శివపురాణమును జాల సంగ్రహించి తమకృతులందు వినియోగించుకొనిరి. మీగ్రంథ మేతత్పురాణ ప్రయోజనమును సర్వవిధముల నాంధ్రులకు సమకూర్ప గలిగియున్నది.

నిరుపమము, గుణబహుళమునగు మీరచన శ్రీవెంకటశాస్త్రిగారి రచనపు బోలికలు గలదై నాకు వేడ్కగొల్పినది.

తీరికలేమిచేఁ బర్యాప్తముగా జదువుటకును బరితృప్తిరసవిమర్శముగాఁ బ్రశంసించుటకును జాలకున్నాను. క్షమింపుడు.

1-3-47 మిత్రుఁడు వేటూరి ప్రభాకరశాస్త్రి

---

శతావధానులు బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రులవారు–

అయ్యా! తాము వయస్సుచేఁ గనిష్ఠులయ్యు గుణములచే జ్యేష్ఠులు. తా మీ శివపురాణము రచించి గురువులను బుత్రవంతులుగను, గురుపుత్రులను భ్రాతృమంతులుగను జేసినందులకు మిమ్మభినందించుచున్నాను. అది యటుండె. శ్రుతులవిదపఁ బురాణములు జ్ఞానభాండారములు– తాము వాని తలుపొకటి చక్కఁగా తెరచితిరి. చిత్తగింపవలయును.

13-3-1947 వేలూరి శివరామశాస్త్రి, కృష్ణా జిల్లా.

---

శ్రీభోగేశ్వర సత్యవత్యుపాఖ్యానాది మహాకావ్య నిర్మాతలు బ్రహ్మశ్రీ మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రులవారు–

శివాయ గురవేనమః

ఆశిస్సు

ఆర్యా॥ ముదిగొండనాగవీరే । శ్వరకవికృతశివపురాణకావ్యమిదం
జీయాదారవిచంద్రం । కవిజన పరితోషలాలనాసాంద్రం. ౧

మ॥ కవితాచార్యుఁడు వెంకటేశ్వరు పరిష్కారమ్మునుంగాంచి; పైఁ
గవిసమ్రాట్టు సువర్ణ పీఠమును సింగారించు, మీ మాతృభ
క్తి విశేషమ్మురుదారనిట్లు పొడవై దీపించు నీకావ్య మాం
ధ్రవధూటీశుభకర్ణపాశసుమసౌందర్యమ్ములం దిద్దుతన్. ౨

శా॥ శైవుండై జనియించినందులకు నీ జన్మమ్ము సార్థమ్ముగా
దేవుండిచ్చు కవిత్వశక్తి జననీ దివ్యాంఘ్రి సంసేవనన్
దావుల్గూర్చి వెలార్చితీ శివపురాణమ్మున్ గవుల్మెచ్చ, మే
ధావి గ్రామణి! నాగవీరయకవీ! ధన్యుండ వీవెంతయున్, 3

మ॥ వినియుంటిన్ వినిపింప నచ్చటచటన్ విన్నాడ నేడెంతయున్
గనుగొంటిన్ భవదీయ సత్కృతిని శ్లాఘ్యమ్మయ్యె నీపూన్కి, స
జ్జనతామాన్యము భక్తిబంధురము నీ సౌజన్యభావప్రకా
శనమీ కావ్యము సత్కవీంద్రసుమనస్సంతోష పోషమ్మగున్. ౪

ఉ॥ లీరిక చాలకున్న, నిజదేహమునన్ సరిలేకయున్న నీ
వోరిమితోడ నింతటి మహోన్నత కావ్యము చేయ జేసె, గౌ
రీ రమణుండు దాఁ దన చరిత్ర ప్రసిద్ధివహించు పొంటె నా
కారుణికోత్తముం డొసఁగుఁగావుత నీకుఁ జిరాయురున్నతుల్! ౫

23-2-47 మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి.

ఈ మల్లికార్జున శాస్త్రిలవారి తృతీయపుత్రులును. శ్రీకాంచీమాహాత్మ్యాది గ్రంథరచయితలును, ఉభయభాషాప్రవీణులును నగు బ్ర॥ శ్రీ॥ మల్లంపల్లి వీరేశ్వర శాస్త్రిగారు.

అ భి నం ద న ము.

శా॥ మామా తామహవంశ్యుఁడేయనిన సమ్మానమ్ము, నారాధ్యభా
సామాన్యమ్మభిమాన, మద్యతనతా సంకోచభావమ్మునున్
ప్రేమమ్మున్ విడనాడి మీకృతి నెడన్ వీక్షింపఁగా, నాంధ్రభా
షామంజీరరవానుకారియగుచున్ సంతోషము ల్గూర్చెడిన్. ౧

మ॥ కలఁడా శైవులయందు నేడును మహాకావ్యక్రియాదక్షు, కో
మలభవ్యప్రతిభాభిరాముఁ డని వేమారున్ విచారింప నీ
విలసద్భావగభీర, మీరసగుణాన్వితమ్ము, నానాజనుః
ఫల మీకబ్బము దెల్పె నీప్రమథ భావమ్మున్ గవిగ్రామణీ! ౨

ఉ॥ కవులబుణమ్ముదీర్చికొనఁగల్గిన, నిన్నొకపాటివానిఁగాఁ
గవియనరాదుగాక, శివకావ్యకథాకథనాధురీణునిన్
గవియనఁజెల్లదే? బిరుదు కైకొన నొల్లని నీవినీతికిం
దవునిది నాగవీరయబుధప్రవరా! సుకవీ! మహాకవీ! ౩

23-2-47

సర్వతంత్ర కళాశాలాప్రధానాచార్యులు బ్రహ్మశ్రీ తాడేపల్లి సాంబమూర్తి శాస్త్రిగారు – బెజవాడ.

అయ్యా! నాయభిప్రాయమును శబ్దసంక్షేపమున దెలుపుకొనుచున్నాను.

గీ॥ తేనెలొల్కెడి పల్కుల తీపిఁ బల్కు
వెలఁది ఘల్కులతళ్కులు వెలయఁ బూర్వ
సత్కవీశ్వరపద్ధతిఁ జాటినట్టి
శివపురాణమ్ము నీసాంబశివుఁడు మెచ్చె.

22-2-47 తాడేపల్లి సాంబమూర్తిశాస్త్రి.

---

ఆంధ్రవిశ్వకళా పరిషత్ప్రధానాచార్యులు, సౌందరనందాది కావ్యనిర్మాతలు బ్ర॥ శ్రీ॥ పింగళి లక్ష్మీకాంతకవి ఎం. యే. గారు–

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారికి నమస్కారములు. మీరు దయతోఁబంపిన శివపురాణమందినది. చాలకృతజ్ఞుడ. మీగ్రంథము నామ మాత్రమున పురాణమేకాని రచనలో కావ్యమువలెనున్నది. అనగా పురాణో చితమైన ప్రసన్నధారాళతయు కావ్యోచితమైన రసదీప్తియు కలవన్నమాట. గ్రంథముచదివి నేను చాల ఆనందించితినని వ్రాయుట పునరుక్తిః చిత్తగించ వలెను.

25-2-1947 పింగళి లక్ష్మీకాంతము, వాల్తేరు.

---

విద్వత్కవిరాజ, కవికులశేఖర, ప్రాచ్యసాహిత్య విద్యాప్రవీణ బ్ర॥ శ్రీ॥ సరిపెల్ల విశ్వనాధశాస్త్రిగారు, ఎం. ఏ. ప్రొఫెసర్ నిజాం కళాశాల, హైద్రాబాద్–ద.

అభినవపోతన శ్రీముదిగొండ నాగవీరేశ్వర కవీంద్రుని శివపురాణకృతి:

మ॥ శివపారమ్యము భక్తి నుత్కలిక లక్షీణంబుగా నిండఁగాఁ
గవితావాహిని కావ్యకల్పకముగాఁ గల్యాణనిత్యోత్సవ
మ్మవలీలన్ హృదినింప పోతన మహోద్యాన ప్రసూనమ్ములన్
శివభావమ్మతిమాధురీరుచుల వాసింగన్న సత్కావ్యమీ

గీ॥ శివపురాణ ముదారము నవ మతులము, నాగవీరేశ్వరుకృతిఁ గనంగనుర్వి
గుణసమంచితము హితమ్ము గురుతరమ్ము, పోతనార్యుడెఁ నాగేశుఁ డితఁడరయ.

ఉ॥ భక్తి విరక్తి లోకహితవర్తన నిర్మల శైవదీక్షవాక్
శక్తి రసైక దక్షతయు సారవిశాలనవార్ద్రభావముల్
యుక్తియు నచ్ఛశిల్పము మహోదయమై తగు మీదుకావ్యమా
ముక్తికి భుక్తికిన్ దగిన మూర్తి రచించితివో కవీశ్వరా!

8-3-1947 సరిపెల్ల విశ్వనాధశాస్త్రి, హైదరాబాద్.

బ్రహ్మశ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు బహు గ్రంథకర్తలు. మహబూబుకాలేజీ ప్రధానాంధ్ర పండితులు, శికిందాబాద్.

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు రచించిన శివపురాణము నాదరముతో జదివితిని. శ్రీ శాస్త్రిగారు కవిత్వమున సిద్ధహస్తులు. పెక్కుగ్రంథములను విరచించిరి. పరమేశ్వరుడు వీరికి దీర్ఘాయురారోగ్యములొసఁగి వీరిచే నితోధికమగు సారస్వత సేవను జేయించుగాకయని నాయాశయము.

25-3-1947 సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

---

# ప్రథమ ముద్రణంపుమున్నుడి

శ్రీ శివాభ్యాన్నమః

శ్లో॥ అష్టాదశ పురాణానాం । కర్తాసత్యవతీ సుతః
కామికాద్యాగమానాంతు । శూలపాణిర్మహేశ్వరః

స్కాందపురాణ సూతసంహిత.

పరమకారుణికాంతరంగుండగు పరమేశ్వరుని యుద్బోధంబున జగత్కల్యాణము కొఱకై చెలికారపునుడుల వ్యాసభట్టారకుండు రచించిన పదునెనిమిది పురాణములలో మేలిమి మీఱు శివపురాణమును ప్రాచీనాంధ్ర కవివర్యులు మొదలుకొని నేటివఱకలరుకవివర్యులెవరును బద్యరూపముగఁ దెనిగించుకుంటుట నాభాగధేయవిశేషము. నేనొకప్పుడొకరియింటనున్నయాశివపురాణంబునుజూచి కొంచెముభాగము చదివి యానందించి తదాంధ్రీకరణేచ్ఛ యనివార్యంబుగఁ బొడమ నావాసరమందే పొత్తంబు నారంభమునొనర్చి యనతికాలంబుననే కొండొకభాగంబు దెలిఁగించి విజ్ఞులగువారలకుఁ జూపెట్టఁగా నవ్వారుమురిసి నాయుద్యమంబున కూఁతయొసంగిరి. అంత నేనామోదముతో మఱికొంత రచించి శ్రీశ్రీకవిచక్రవర్తులును నాగురులునునగు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులవారు శతావధానుల వారి సముఖమునకేగి వారికి వినిచితిని. వారును విని యానందించి మఱికొన్ని విశేషంబులు నాకుఁగఱపి యేతదాంధ్రీకరణ ప్రయత్నమునకుఁ బూర్తిగ నుత్సాహంబొసంగిరి. మొదటఁగొన్ని ఖండంబులు మాత్రమేరచించి ముగించుదమనుకొని యట్లొకటి రెండుమారులు మధ్యమధ్యఁ జాలగాలము విరామంబొనర్చియు మహామహులగు కొందఱి ప్రోత్సాహముతో నెట్లో శివానుగ్రహంబు బలిమితో నిప్పటివఱకు శివపురాణబును సర్వంబు నాంధ్రీకరింపఁ గలిగినందులకు భక్తవత్సలుండగు శివునకును, నిందు నాకుఁ

ప్రేరకులగు వారలకును జోతలొనర్చెదను. ఇఁక శివపురాణంబును గుఱించియు నాయాంధ్రీకరణంబును గుఱించియు నొకించుక ముచ్చటించెదను. శ్రీదేవీ భాగవత ప్రథమస్కంధములోని,

శ్లో॥ మద్వయంభద్వయంచైవ । బ్రత్రియం వచతుష్టయమ్
అనాపలింగ కూస్కాని । పురాణానామనుక్రమః ॥

యనెడు శ్లోకోక్తి ననుసరించిన యష్టాదశమహాపురాణ పరిగణనలో నీ శివపురాణము చేర్పఁబడక యుపపురాణములలోఁ జేర్పఁబడినందునఁ గొందఱిద్దాని నుపపురాణంబనియందురు. ఇట్లే భాగవతమన, దేవీభాగవతమేకాని శ్రీభాగవతము కాదని యా శ్లోకముయొక్క తాత్పర్యము. అందులకు శ్రీభాగవతవాదు లట్లొప్పుకొనరు. శ్రీభాగవతమే మహాపురాణంబనియు, దేవీభాగవత ముపపురాణంబనియుఁ జెప్పుదురు.

శ్రీ భాగవతమందుఁగల మహాపురాణ పరిసంఖ్యలో శివపురాణము పేర్కొనఁబడినది. శ్రీభాగవతే ద్వాదశస్కంధే సప్తమాధ్యాయే.

శ్లో॥ బ్రాహ్మ్యంపాద్మం వైష్ణవంచ । శైవం లైంగంచగారుడం
నారదీయం భాగవతం । ఆగ్నేయంస్కాంద సంజ్ఞితం
భవిష్యద్బ్రహ్మకైవర్తం । మార్కండేయంచ వామనం
వారాహమాత్స్యకౌర్మాణి । బ్రహ్మాండాఖ్యము తిత్రిషట్
బ్రహ్మన్నేతం సమాఖ్యాతం । శాఖాప్రణయనం మునేః ॥

మఱియందే ద్వాదశాధ్యాయమునం దష్టాదశపురాణంబుల పరిమితియుఁ గూడ నిట్లు నిర్దేశింపఁబడియె.

శ్లో॥ బ్రాహ్మ్యందశసహస్రాణి । పాద్మం పంచోన షష్టిచ
శ్రీవైష్ణవంత్రియోవింశ । చ్చతుర్వింశతి శైవకం
దశాష్టౌ శ్రీభాగవతం । నారదం పంచవింశతి ॥ ఇత్యాది.

ఇట్లే స్కాందపురాణ సూతసంహితయందు,

శ్లో॥ బ్రాహ్మ్యం పాద్మం వైష్ణవంచ । శైవం భాగవతం తథా ॥ అని యుపక్రమించి—బ్రహ్మాడంచేతి పుణ్యోయం । పురాణానామనుక్రమః ॥ యనియు, నిట్లే విష్ణుపురాణము, కౌర్మము, మాత్స్యము వామనపురాణము, లింగపురాణము మున్నగువానియం దష్టాదశమహాపురాణ సంఖ్యలో శివపురాణము లెక్కింపఁబడినది. ఏకారణముననో దేవీభాగవతమందుమాత్రము "వచతుష్టయం"

బని వాయు పురాణంబును మహాపురాణంబుగఁ గైకొని యీయది యువ పురాణములందుఁ జేర్చబడియె. ఆవాయుపురాణముగూడ శివపారమ్య ప్రతిపాదకమే. బహూక్తి ప్రామాణ్య ప్రాబల్యంబునను, వైయాసిక శైలీ పరిజ్ఞాన పరిపాటీ విశేషంబునను శ్రీశివపురాణ మష్టాదశ మహాపురాణ మాలారత్నం బనియే విజ్ఞులారయుదురని విశ్వసించెదను.

ఇఁక నీయది సంహితాభేదంబులతో రెండుతీరులఁ బలుకడల ముద్రింపఁ బడినది. అందుఁ ప్రధానములై శ్రీకాశీపట్టణ ముద్రితగ్రంథంబొక్కఁడును, బొంబై పట్టణ ముద్రితగ్రంథ మొక్కఁడును, గన్పట్టుచున్నవి. గ్రంథంబులు రెండును సాకల్యంబుగఁ జదివినపిమ్మట నొక్కటిగానే కన్పట్టును గానీ గ్రంథములలో నేదేనియొక భాగము మాత్రముఁ జదివెడువారికి వేఱువేఱు గ్రంథములు రెండని దృఢముగాఁ దోఁచును. అందు నాకు మొదట దొరికినది బొంబైప్రతి, అద్దాని ననుసరించియే పరివర్తనము చేసితిని. పిదపఁ గాశీప్రతిగూడఁ బరికించితిని గాని మార్పు చేయవలసిన యవసరమగుపడలేదు. ఇఁక నాపరివర్తనమందు

“క॥ మక్కికి మక్కి యొనర్చుట, చక్కనిమార్గంబుగాని ♦ చందమగుటనా
చక్కిడనాడి నాయీ, ఫక్కిన్ బొనరింతు లలిత ♦ పద్ధతి మెఱయన్.”

అని నేను గ్రంథారంభములో నొడివినట్లు నేను మక్కికిమక్కిగాఁ దెనిఁగింపక శ్రీభారత కవులు, శ్రీనాథకవీంద్రుఁడు మున్నగువారి పథంబుననుసరించి యొకచో మూలముకన్నఁ బెంచియు, మఱియొకచోఁ దగ్గించియు, నిఁకనొకచో వేఱురీతిగఁ బొనరించియు, వేఱొకచో స్కాందపురాణము, శ్రీభాగవతము, మహాభారతము, శ్రీజాబాలోపనిషత్తు, కాలాగ్ని రుద్రోపనిషత్తు మున్నగు వానినుండి విశేషాంశంబులఁ గొన్నిటిఁ గైకొని యిందుఁ జేర్చియును, గొన్నిచోట్ల యథామూలం బనునట్లనుసరించియును గొంచెము స్వతంత్రించియే తెనిఁగించితిని.

ఇఁకను మూలగ్రంథములో సంహితలుగాను, వానిలోఁ బ్రత్యేకభాగంబులు ఖండంబులుగా నున్నవి. నేనిందు సంహితలను పేరుఁదొలఁగించి యన్నిటికిని ఖండంబులని యేర్పరచితిని. మఱియు శివలీలల నెఱింగించు శతరుద్రసంహితకు లీలాఖండంబనియు లింగచరిత్రంబులఁ దెల్పు కోటిరుద్రసంహితకు లింగవైభవ ఖండంబనియుఁ బేరిడితిని. మఱియుఁ బ్రారంభమందున్న విద్యేశ్వర సంహిత యను దానిని సందర్భమునుబట్టి చివరయందద్ది రాణించునని చివరలో విద్యేశ్వరఖండముగా జేర్చితిని. ఇఁకనిందుఁ బార్వతీఖండ కుమారఖండంబులను, లింగవైభవఖండంబును మూలమున కన్నఁ బెంచి వ్రాసితిని. కైలాసవాయవీయ

విద్యేశ్వర ఖండంబులను మూలముకన్నఁ దగ్గించి వ్రాసితిని. లీలా ఖండంబు నుమాఖండంబును గొంచెము గుంచించియు, సృష్టి సతీయుద్ధఖండంబులను యథారూపంబులుగను విరచించితిని. ఇఁక మూలమం దొకమాఱు చెప్పిన యుపాఖ్యానంబులను శివలీలలను వక్తృ శ్రోతృ విభేదంబుచేఁ బలుమాఱులు మరల మరలఁ జెప్పబడియుండుట నవ్వాని నట్లు చెప్పినఁ బునరుక్తి గాకున్నను బాఠకులకు విసువు కల్గించునని యిందుమానితిని.

రెండుమాఱులు చెప్పిన యుపమన్యు చరిత్రంబు ఘట్టమందు రెండవమాఱి ద్దానికి మాఱుగాఁ బద్మ పురాణమునుండి కొనివచ్చి మార్కండేయచరిత్రంబును వ్రాసితిని. ఇఁకను షణ్ముఖునకు భార్యాద్వయోద్వాహ చరిత్రంబును స్కాందపురాణమునుండి గ్రహించిరచించితిని. మఱియు బ్రహ్మదేవుని పంచమ శిరఃఖండన చరిత్రంబుమాత్రము లీలాఖండములో నొకమాఱును లింగవైభవ ఖండమందొకమారు నించుక భేదంబుతోఁ జెప్పఁబడినది. ప్రసక్తినిబట్టి వక్తృ శ్రోతృభేదంబున మూలానుసారంబుగఁ దెనిగింపక తప్పినదికాదు. ఇఁకనందందుఁ గొలఁదిపాటిమార్పు లొకచో వేఱురీతిగఁ బొనరించియు ననెడు నుడి కుదాహరణంబుగ నొనరించితిని. ఇవ్విధంబుగ నౌచితి చెడనియట్లుగాఁ గొంతస్వతంత్రించి కృతిని వ్రాసినను గోపాలుఁడూరిపొలిమేరను మీఱక యెట్లుపసుల మేపుకొనుచుఁ గాచుకొనునో యట్లే నేనును మూలగ్రంధమునకు దవ్వగనడువక మూలంబు సరస బరికించుచునే పరివర్తనం బొనరించితిని.

పలువురు పూర్వమహాకవులు ద్రొక్కిన మార్గంబాట గుణగ్రహణపారీణులగు పాఠక మహాశయు లిద్దానినేరంబుగ యోజించెదరని భావించెదను.

ఇఁకను పార్వతీఖండములోని హిమాద్రి వర్ణనాది ఘట్టములలో శ్రీకాళిదాస మహాకవి తమ కుమారసంభవ కావ్యములో వర్ణించిన కల్పనలు గొన్ని గన్పట్టును గావున నాకల్పన లాకావ్యమునుండి యెత్తి వ్రాసినట్లు చదువరులకుఁ దోచును గాని యాకల్పనలన్నియుఁ గృష్ణద్వైపాయనునవే. శ్రీకాళిదాస మహాకవి శ్రీవ్యాసునియందలి గౌరవబుద్ధిచేతనో, శ్రీవ్యాసకల్పనల యందలి స్వారస్య విశేషాస్వాదలాలస చేతనో యవ్వారికల్పనలను శ్రీశివపురాణమునుండియు మఱి యితర పురాణములనుండియుఁ బడసి తఱుచుగాఁ దమ కావ్యంబులయందు వాడి యున్నారు. తావన్మాత్రమున వారికేమి యపకర్ష గలుగలేదు. ఇఁక నేనిందు మూలములోని శ్లోకములను దెనిఁగించినందుననే కాళిదాస కల్పనలను దొంగిలించినట్లుగా విజ్ఞులు దలంపరని హెచ్చరించెదను.

శ్రీవ్యాసకల్పనలను శ్రీకాళిదాస మహాకవ్యనువాదంబులను గనుఁగొనుఁడు.

శివపురాణ పార్వతీఖండ ప్రథమాధ్యాయమున,

శ్లో॥ అస్త్యుత్తరస్యాందిశివై । గిరిశో హిమవాన్మహాన్
సర్వతో హిమునిశ్రేష్ఠ । మహాతేజాస్సమృద్ధిభాక్
పూర్వాపరౌ తోయనిధీ । సువిగాహ్యా స్థితో యతః
నానారత్నాకరో రమ్యో । మానదండ ఇవక్షితేః ॥

కాళిదాసకవికృత కుమారసంభవకావ్యమందలి ప్రథమసర్గములో,

శ్లో॥ అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా । హిమాలయోనామనగాధిరాజః
పూర్వాపరౌ వారినిధీవిగాహ్య । స్థితః పృథివ్యా ఇవ మానదండః ॥

శివపురాణ పార్వతీఖండసప్తమాధ్యాయమున,

శ్లో॥ దృష్టిః పుత్రవతోఽప్యద్రేః । తస్మిన్ తృప్తిం జగామ న
అపత్యే పార్వతీత్యాఖ్యే । సర్వసౌభాగ్య సంయుతే ॥
మధో రనంతపుష్పస్య । చూతే హి భ్రమరావళిః
విశేషసంగా భవతి । సహకారే మునీశ్వర !
పూతో విభూషిత శ్చాపిస బభూవ తయా గిరిః
సంస్కారవత్యేవ గిరా । మనీషీచ హిమాలయః
ప్రభామహత్యా శిఖయా । సదీపో భవనస్య చ
త్రిమార్గయేవ సన్మార్గ । స్తద్వద్గిరిజయా గిరిః ॥

కాళిదాసకవికృత కుమారసంభవకావ్యమందలి ప్రథమసర్గములో,

శ్లో॥ మహీభృతః పుత్రవతోఽపిదృష్టి । స్తస్మిన్నపత్యే నజగామతృప్తిమ్
అనంతపుష్పస్య మధోర్హిచూతే । ద్విరేఫమాలాసవిశేషసంగా ॥
ప్రభామహత్యా శిఖయేవ దీపః । త్రిమార్గయేవ త్రిదివస్యమార్గః
సంస్కారవత్యేవ గిరా మనీషీ । తయా సపూతశ్చ విభూషితశ్చ ॥

శివపురాణపార్వతీఖండ సప్తమాధ్యాయమున,

శ్లో॥ అథ దేవీ శివా సాచో । పదేశసమయే మునే
సహావిద్యా స్సుప్రీత్యా । యత్తచిత్తా చ సద్గురోః
ప్రాక్తనాజన్మ విద్యాస్తాం । శరదీవ ప్రపేదిరే
హంసాళి స్స్వర్ణదీం నక్త । మాత్మభావో మహౌషధీం ॥

కాళిదాసకవికృతకుమారసంభవప్రథమసర్గములో,

శ్లో॥ తాంహంసమాలా శ్శరదీవగంగాం । మహౌషధీం నక్తమివాత్మభాసః
స్థిరోపదేశా ముపదేశకాలే । ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః ॥

శివపురాణపార్వతీఖండషోడశాధ్యాయమున,

శ్లో॥ తేన కుర్విరా ఉపాయాః న । స్వర్వ్యేహత బరా కృతాః
వికారే సన్నిపాతేవా । వీర్యవం త్యేవధాని చ
యత్రాస్మాకం జయాశాహి । హరిచక్రే సుదర్శనే
తత్కుంఠిత మభూత్తస్య । కంఠే పుష్పమి వార్పితమ్ ॥

శివపురాణ పార్వతీఖండషోడశాధ్యాయమున,

శ్లో॥ తతోనై వవధాయోగ్యో । యతో వృద్ధి ముపాగతః
విషవృక్షోపి సంవర్ధ్య । స్వయం ఛేత్తు మసాంప్రతమ్ ॥

కాళిదాసకవికృతకుమారసంభవద్వితీయసర్గమందు,

శ్లో॥ ఇత స్సదైత్యః ప్రాప్తశ్రీః । నేత ఏ వార్హతిక్షయమ్
విషవృక్షోపిసంవర్ధ్య । స్వయంఛేత్తు మసాంప్రతమ్ ॥

శివపురాణ వాయవీయ సంహిత త్రియోదశాధ్యాయములో,

శ్లో॥ త్వం హి వాగమృతం సాక్షాద్ । అహ మర్థామృతం పరం
వాగర్థమయ మేవైతత్ । జగత్ స్థావరజంగమమ్ ॥

కాళిదాసకవి రఘువంశప్రథమసర్గములోఁ బ్రథమశ్లోకము,

శ్లో॥ వాగర్థా వివసంపృక్తౌ । వాగర్థ ప్రతిప త్తయే॥

శివపురాణవాయవీయసంహితోత్తరభాగచతుర్థాధ్యాయమున,

శ్లో॥ భూమ్యం భోగ్ని మరుద్వ్యోమ । క్షేత్రజ్ఞార్కనిశాచరాః
అధిష్ఠితామహేశస్య । శర్వాద్యైరష్టమూర్తిభిః ॥

కాళిదాస శాకుంతలనాటక నాందీశ్లోకము సువిదితమే. ఇట్లు కాళిదాస మహాకవి శివపురాణమును బలుమాఱులు చదివి తద్గతభావ విశేషంబులను గ్రహించి తనదు కావ్యంబులందుఁ గీల్కొల్పుట పాఠకులకెఱుకగాకయుండదు.

ఇంకను బార్వతీఖండములో మేనకాకుపితావస్థ కొండొక రసాభాసాస్పదం బుగ నుండును కాని యదియంతయు శివమాయా విశేషవిలసితంబే యగుట శ్రీపరమేశ్వరియగు పార్వతీదేవివలె నెగ్గలేక శివపరీక్షయం దోటమిఁజెందిన మేనకచేయిదమును జెప్పెడు నాభాగంబును బూర్తిగ వదిలివేయక కొంత కుప్తపఱచి విరచించినందులకును, లింగవైభవఖండములో మూలములోఁ జెప్పఁ

బడని మఱికొన్ని దివ్యలింగములు తెలుగు, తమిళము పేరులుగల యూరు లందు వెలసియుండుట నవ్వానిస్వరూపంబు లారసి యిందుఁ జేర్చినందులకును, మన్నింప విమ్మకులకు మనవి చేసికొనియెదను.

ఇఁక మూలగ్రంథరచనాకాలంబున కిప్పటికాలంబునకుఁ బ్రపంచధర్మంబులు చాలగ మార్పై యుండుటను బట్టి చదువరుల కందందుఁ గొన్ని యెడల నించుక వ్యత్యాసంబుగఁ దోచినఁ దోఁచవచ్చును గాని విజ్ఞులట్టివానిఁ బాటింప రని తలంచెదను.

సంస్కృతాంధ్రవ్యాకరణాంశములు:—ఈకృతియందలి నాల్గవపేజీలో శైవాచార్యసత్కృతి యందలి చంపకమాలలోని "అలికమునన్ గృశానుదృశ ♦ నంద నిశంకరు" డనునెడ దృక్ఛబ్దమునకు టాప్ప్రత్యయము చేసినరూపము యథా వాచా నిశాదిశా అను భాగురిమతరీత్యా ఆకారాంతముగా (టాబంతము) చేసికొని యద్దాని తత్సమముగా యోజించఁగోరుతాను.

కౌశలశబ్దము, స్వార్థమందు (కుశలశబ్దార్థమందు) ఒకటి రెండుచోట వాడబడినది. సూ–ప్రజ్ఞాదిభ్యశ్చాణ్ నుండి సాధువు చేసికొనవలయును.

పునీతశబ్దము రెండుమారులుచ్చరింపఁబడినది. ఇయ్యది సంస్కృత శ్రీభాగవతములో వ్యాస భట్టారకునిచే వాడఁబడినది.

శ్రీ భాగవతేఽష్టాదశాధ్యాయే బలివచనే

30 శ్లో॥ తథాపునీతాతనుభిః పదైస్తవ.

లింగవైభవ ఖండంబులోని కృత్తివాసేశశబ్దము మూలగ్రంథమందు సంజ్ఞావాచకంబుగఁ బఠించుటఁ జేసి యద్దాని నేను నట్లే యనువదించితిని.

ఇఁక నాంధ్రనియతియందుఁ గవిత్రియేతరులగు పెక్కురు మహాకవుల ప్రయోగంబుల ననుసరించి ప్రస్తుతము దేశ్యములట్లు కన్నట్టు నితర భాషాపదములను గొండొక గ్రహించితిని. అట్లే విశ్రమ ప్రాసంబులందు రేఫశకటరేఫ సాధర్మ్యంబునుగూడ నిర్విశంకంబుగ నంగీకరించితిని.

ఇఁక నాకవనంబును గూర్చి నే నేమియు వ్రాయఁజాలను. సౌరభంబున్న రసజ్ఞులే యాస్వాదించి యానందింతురు. సహృదయాః ప్రమాణం.

ఇఁకను మా గురులును గింకవీంద్రఘటాపంచాననాది బిరుదాంచితులును నగు శ్రీకవిచక్రవర్తులు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిలవారు శతావ

ధానులు పుత్త్రోవా శిష్యోవా యను వచన ప్రకారము *నాయందలి శిష్య వాత్సల్యముచే నా యీ కృతినిఁ బరిశోధించుటకుఁ గాను ముందుగఁ దమకును నాకును నిష్టదైవమగు శ్రీపరదేవతను గూర్చి,

మ. జననీ! శైవపురాణమొక్కరుఁడుమ ♦ చ్ఛాతుర్యిండు దెల్గించెదా
నిని నేనిప్డు బరిష్కరింపవలయున్ ♦ నీదౌకటాక్షావలో
కనమున్ లేక ఘటించుటెట్టు లిది మ ♦ త్కాసంబు శాసించి మా
టనుదక్కింపు మతండు యోగ్యుఁడు గిరీ ♦ డ్భక్తుండు కామేశ్వరీ!

అని స్తుతించి గ్రంథము నంతయు సమగ్రముగాఁ బ్రత్యక్షర శోధనముగా సవిమర్శముగా దిలకించి పరిష్కరించి గ్రంథమును నిర్దుష్టంబు నొనరించి నందులకు వారి యడుగుఁదమ్ముల కనేక ప్రేమపూర్వకాభివందనముల సమర్పించుకొనుచున్నాఁడను.

మఱియు నాకవనములో నాకును మా శ్రీశాస్త్రిలవారికిఁ గూడ మఱుఁగై కొన్ని దోసఁగులు మిగిలిన మిగులవచ్చునేమో. అట్టివానిని సదయులును, గుణదోషగ్రహణ పారీణులు నగు పరిశీలకులు నాకుఁ దెల్పిన పునర్ముద్రణమందు దిద్దికొనియెదను.

ఇఁకను బ్రూఫులు దిద్దికొనుటయందలి పొరపాట్లచేఁ బలుచోట్లఁ బరుష సరళవ్యత్యయంబులును, నరసున్నల తబ్బిబ్బులును రేఫశకటరేఫ వ్యత్యాసంబులును, విసంధులు, స్పేసుల తాఱుమాఱులు మున్నగునవి పొసంగినవి. పాఠకులవ్వానిని అంటనివత్తులు, సున్నలేగాక, అక్షరంబులను మఱియు న స వ వ థ ధ డ ఢ మున్నగు నక్షరంబులను యథోచితంబుగ దిద్దికొన వేడికోలు.

---

* నేనొకప్పుడొక గొప్ప తెవులు ముప్పున గారింపఁబడి రాజకీయ వైద్యాగారమందుండినప్పుడు శ్రీ శ్రీ శాస్త్రిలవారాశీర్వదింపుచు నీపద్యమును వ్రాసి పంపిరి. ఆమీఁద వెంటనే యారోగ్యమును జెందితిని.

చ. పరమశివాంఘ్రిభక్తునక ♦ పారకృపారస మూర్తియైన శం
కరుఁ డొగి నాగవీరయకు ♦ గాదిలి శిష్యున కాయువున్ నిరం
తరమగు సౌఖ్యమున్ సిరియు ♦ ధన్యత మాన్యత యిచ్చి వెంకటే
శ్వరుఁ డిడునాశిషంబునకు ♦ భవ్యయశంబు ఘటించుఁగావుతన్.

క్షీరసాగరము బిల్డింగ్సు,
గవర్నరుపేట, బెజవాడ. 29-3-1944

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి.
శతావధాని.

మఱియు భ్రమచేఁ గొన్ని పద్యములందు విశ్రమప్రాసంబులు లోపించినవి.
అవ్వానిని మఱికొన్ని మిక్కిలి యవసరంబులైన యచ్చుదోసఁగులను దప్పొ
ప్పుల పట్టికలోఁ జూపుచున్నాఁడ నవ్వాని నట్టులు సవరించికొని చదువుకొనఁ
బ్రార్థన.

ఇఁక నొకమా టడుగుటతోడనే పీఠికను వ్రాయుట కంగీకరించి పొత్తమును
బంపినమీఁద దయతో నానుపూర్విగఁ గృతి నంతయుఁ జదివి సవిమర్శముగాఁ
బీఠికను వ్రాసిపంపిన యుదారచరిత్రులు, విద్వత్కవివతంసులు శ్రీరాజా
రంగాప్పారాయ కళాశాలా ప్రధానాంధ్రోపాధ్యాయులును, కవిసమ్రాట్టులు
నగు బ్రహ్మశ్రీ విశ్వనాథ సత్యనారాయణ ఎమ్. ఏ. గారికిని, శివపురాణ రచనా
కాలంబునందే కొన్ని భాగంబులను విని యానందించి, పరిష్కరించి యద్దాని
పరిపూర్తిమీఁదఁ దా మొక పీఠికను వ్రాసి యిచ్చెదమని పిదప గ్రంథముఁ
బంపినంత సాకల్యంబుగఁ జదివి వాత్సల్యముతోఁ బీఠికను వ్రాసిపంపిన విద్వ
ద్వర్యులును, మదనపల్లి థియసాఫికల్ కళాశాలా ప్రధానాంధ్రోపాధ్యాయు
లును, వైయాకరణ శిరోమణులును నగు బ్రహ్మశ్రీ తూములూరి శివరామ
కృష్ణ శాస్త్రులవారికిని శాశ్వతము త్రికరణపూర్వకముగఁ గృతజ్ఞతాభి వంద
నముల సమర్పించుకొందును. మఱియు గ్రంథముద్రణమునకై విస్తార ధనము
లిచ్చి యచ్చొత్తించిన శ్రీనిధుల కతోధిక శ్రేయోభాగ్యంబు లిచ్చుటకుఁ బర
మేశ్వరునిఁ బ్రార్థించుచుఁ బాఠకమహాశయుల నిఁక శివపురాణపఠన భాగ్య
పదవిం బ్రవేశ పెట్టుచు నింతతో నీయుపోద్ఘాతంబును ముగించుచున్నాఁడను.

ఇట్లు
బుధజనవిధేయుఁడు,
ముదిగొండ నాగవీరయ్య శాస్త్రి
శికింద్రాబాద్ (దక్కన్.)



శ్రీః

# ద్వితీయముద్రణోపోద్ఘాతము

## ఉపాధ్యాయపరిషదధ్యక్షులు:- బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు భాషారాధనతత్పరులై పదేండ్లక్రిందట నాంధ్రీకరించి యాంధ్రవాగ్దేవి కభినవ గ్రైవేయముగా నర్పించిన యీ శివపురాణ మాంధ్రలోకమునకు సుపరిచితమే. ఇది భాషాభిమానులయు భక్తులయు గౌరవాదరము లంది యచిరకాలమున ద్వితీయముద్రణభాగ్య మొందుటయే ప్రశంసార్హమై దీని పాఠకరంజకత్వమును బ్రకటించుచుండ నిది యిట్టిదని చెప్పఁ బూనుట పునరుక్తమే.

ఈశ్వరానుగ్రహమున భరతఖండముపాలిటి భాగ్యదేవతగా నావిర్భవించిన చతుర్దశ విద్యాత్మకమైన విజ్ఞానరత్నఖనిలోనిది పురాణవిద్య. వైదికవాఙ్మయమున నందందుఁ గనవచ్చు నతిపురాతనములైన వృత్తాంతములను విశదీకరించుట కారణముగా నది పురాణ మనఁబడినది. లౌకిక వాఙ్మయమునందు ముందు శ్రీమద్రామాయణము పిదప భారతసంహితయు నావిర్భవించిన తరువాతనే బ్రాహ్మాది సంజ్ఞలఁ బురాణములు ప్రభవింప నారంభించినవి.

ప్రథమ పురాణోత్పత్తి మొదలుగా నెడతెగక భరతఖండ మంతటను బురాణపఠనశ్రవణములు రెండును భారతీయార్యజాతుల నిత్యకృత్యములై యుండెడి వనుట సుప్రసిద్ధము. దానంజేసియే యైహికాముష్మిక విజ్ఞానము సార్వజనీనమై వ్యాపించుచు వచ్చినది. అదే అక్షరాస్యులు కానివారికిఁ గూడ నీతియు భగవద్భక్తియు గలుగుటకును ఆస్తికమతము లింతదనుక దేశము నలుదెసల నిలిచియుండుటకును దేశ మెన్ని కష్టములపాల్పడినా హిందూ మతాచారములు నిర్మూలము గాక నేఁటికిని దృగ్గోచర మగుచుండుటకును విగ్రహారాధనవిధి వివిధమతములవారిని విడువకుండుటకును ముఖ్యహేతువగుట ముమ్మాటికి సత్యము. మఱియు అట్టి పురాణపఠనశ్రవణాచార మార్యావర్త దక్షిణాపథముల నలముకొన్న కాలమం దనఁగా క్రీస్తు పూ. ఏకాదశాబ్ది మొదలుగా క్రీ॥ శ॥ అష్టాదశశతాబ్ది కడపటివఱకుఁ గలమధ్యకాలమందు తత్తన్మతాభినివిష్టులగు పౌరాణికుల భక్త్యుత్సాహాతిరేకము కారణముగాఁ దత్తద్దేవతా మహత్త్వప్రతిపాదకమైన నూత్నగ్రంథము కొంచెముగానో గొప్పగానో శైవ వైష్ణవ

శాక్తాది పురాణముల నన్నిటం బ్రవేశించి యున్నదనుటయు సత్యము. అట్లొ సేతు హిమాచల మార్యజాతులవారు భక్తిమార్గముల నిత్యసంతుష్టులగుచున్న కొలందిని దాము నందందు పుష్టిగాంచుచు వచ్చి నేడు ప్రత్యక్షమగుచున్న మహా పురాణములలోని దీశివపురాణము.

ఇది చిరకాల మాంధ్రముగాకపోవుట శ్రీనాగవీరయ్య శాస్త్రిగారి యదృష్టము. తగిన విద్వత్కవిచేతిలోం బడుట భక్తలోకము భాగ్యము. స్వతంత్రించి యొకకావ్యము నిర్మించుటకంటె సంస్కృతగ్రంథమును దెలిగించుట మిక్కిలి కష్టము. అందును పదునొకండు ఖండాత్మకము లైన పెద్దభాగములతోడి యిరువదినాల్గువేలగ్రంథమగు నీ మహాపురాణమును భక్తపాఠకజన మనోరంజన మగు సులభశైలి నాంధ్రీకరించుట కష్టాతికష్ట మని వేఱ వచింపనేల? అట్టి ఘనకార్యము నిర్వహించి కృతార్థులైనవారు శ్రీనాగవీరేశ్వరకవిగారు. ఆమహాకృత్యమందలి కొన్ని విశేషవిషయములను బాఠకులదృష్టికిఁ దెచ్చుటకై యీచిన్నవ్యాసము వ్రాయుచున్నవాఁడను నేను. ఈ పని యైనా నేటిగ్రంథప్రకటనాచారమును బట్టి వచ్చినదిగాని యన్యముగాదు.

"పురాణం పంచలక్షణ" మ్మనులాక్షణికోక్తి కనుగుణముగా నిది ముందుగా సృష్టిఖండముతో నారంభమైనది. నారదుఁడు లేనిపురాణము లేదుగాని యీ ఖండమందలి యీ దేవర్షికథ యపూర్వము నద్భుతమునై కనవచ్చును. ఇది శివపురాణమగుట మొట్టమొదటనే శివమహత్త్వ మప్రతిహత మని యుద్బోధించుటకో యన "శ్రీవిష్ణువు భూతలమున శ్రీరాముఁడై యవతరించి వానర సాహాయ్యంబు నభిలషించు" ననుటకు హేతువుగా శివమాయావిష్టుఁడగు నారదమహర్షి శాపము చూపఁబడినది. రుద్రాదులయుత్పత్తులచే సార్థకమైన యీఖండమందలి చిన్నచిన్న కథలెల్ల పాఠకులకు సుబోధకములగునట్లు చక్కని శయ్య నాంధ్రీకరించుటలో నీకవి కృత్యాద్యవస్థ నెక్కువగాఁ జవిచూచియుండు నని చెప్పక తప్పదు. అది యటుండ నీ పురాణ ముపదేశించిన శైవము ద్వైతముగాక శివాద్వైత మన్న విశేషవిషయము గూడ నీ ఖండమే తెల్పుచున్నది.

గీ॥ సచ్చిదానందరూపుఁడ♦సత్యమూర్తి, యగు పరబ్రహ్మ మేనుమూ♦డగువిధముల
బ్రహ్మవిష్ణుహరాఖ్యలఁ♦బరగి సృష్టి, రక్షణాంతములొనరించు♦టట్టులేక.

ఒకచోట వర్ణింపఁబడినవిషయ మా పురాణమునందే మఱియొకచో వర్ణింపఁబడుటయు, ఒకపురాణములో వర్ణితమైన కథ మఱియొకపురాణములో వర్ణితమగుటయు సర్వపురాణ సాధారణమేకాని, యీపురాణములో నితర శైవ పురాణములలో లేని నూతన వర్ణన లెక్కువనుట తథ్యము. పార్వతి శివుని పరిచర్య నాచరించు విషయము పెక్కుచోట్ల వర్ణితమే కాని యది యిందలి పార్వతీ

ఖండమున నొకింత క్రొత్తదారి తొక్కినది. ఆమాటలు కొన్ని - హిమవంతుఁడు శివుని సమీపించి నాకూఁతురు చేయుసపర్య నంగీకరింపు మని కోరఁగా నతండన్నమాట.

ఉ॥ ...ఈపగిదిఁ బల్కకు మింక నగాధిరాజ! యో
షావళి యేడ? యోగులస ♦ మక్షము లేడ ? యెడందఁ గాంచుమా !

(శివపురాణము - ౧౮౭ పుట)

అపుడు తండ్రిని వారించి పార్వతి శివున కుత్తరమిచ్చినది. అందలిమాటలురెండు.

వ. లోకమునందు దేహు లెంతవఱ కింద్రియజన్యజ్ఞానానుభవంబు గలిగి యుందు రంతదనుకఁ బ్రాకృతులాట స్పష్టంబు

ఉ॥ మాటలు వేయునేల విను ♦ మా! యనుమానము మాని సర్వముం
దేట యొనర్చెదన్ బ్రకృతి ♦ నేన్ బురుషుండవు నీవు సుంత యేన్
బాటక మే దిటన్ సగుణ ♦ మూర్తివి నాదయ నొందు పీవు నా
కూటమిఁ బాసి సుంత యొన ♦ గూర్పఁగలాఁడవె నిర్గుణుండవై ॥

అందుకు శివునిప్రత్యుత్తరము శివపురాణము ౧౮౯-౧౯౦ పుటలు

మ॥ గిరిజా! నీవిటు సాంఖ్యవాదినివి కాం♦క్షింపన్ నిషేధింప ని
ష్ఠురమా నట్టులె చేయు ప్రత్యహము ని♦చ్చోనాకు శుశ్రూష నేఁ
బరమేశానుఁడ నేని మాయకు దురా ♦ పస్థాన భూతుండ నే
దరమే నన్నుఁ జలింపఁజేయుటకుఁ గాం♦తాలోక చూడామణీ !

ఇఁక నీ ఖండము చతుర్థపంచమాశ్వాసములందుమా, అవి చదువువారు "పార్వతీపరమేశ్వర కల్యాణము" అను ప్రబంధము చదువుచున్నట్లు భావింపక పోరు. అందలి రచన ప్రబంధశైలినే యాశ్రయించినది.

ఇందలి ఖండములన్నియుఁ బ్రత్యేక మొక్కొక్క కావ్యముగాఁ బాఠకులు చదివి యానందింపఁదగినట్లు శ్రీశాస్త్రిగారి యనువాదము మృదుమధురమై మంచి పాకమునఁ బడినది. ఇందు కొకటి రెం డుదాహరణములు:- ఉత్ప్రేక్షాలంకృతమైన సాంధ్యరాగ వర్ణనము:

ఉ॥ అంత దినాంతమై యలర ♦ నర్యమదేవుఁ డపూర్వదిక్సతిన్
సంతస మొప్పఁ జేర నది ♦ జానుగ మానికపున్నివాళి న
త్యంతముదంబుతో నొసగఁ ♦ నారతనంబులదీప్తి తీర నా
వింతగ సాంధ్యరాగరుచి ♦ విశ్వవిమోహన మొచు భాసిలెన్ ॥

ఇఁక నిది పార్వతికిఁ బతివ్రతాధర్మములు బోధించు విప్రసతిమాట—

చ॥ ఒకసతి భానుమండలికి ♦ నుచ్చతరస్థలి నుండె భర్తతో
నొకసతి దాఁద్రిమూర్తులను ♦ నుయ్యెల బాలురఁ జేసి యూపె నిం
కొకసతి వింధ్యగర్వహర ♦ ణోగ్రుని జీవితరాజ్ఞి యయ్యె వే
ఱొకసతి మిత్తి గెల్చె మఱి ♦ యొక్కతె భానుని నాఁగె నంబికా!

కుమారస్వామి జననము తారకాసురసంహారము మొదలగు కథాభాగములను బాఠకు లాయాపురాణాదులఁ గని యుండకపోరు గాని ఆ విషయములను సవిస్తరముగా వివరించు నిందలి కుమారఖండము చదివి యాహ్లాదింపఁదగినది.

దాని తరువాత లీలాఖండ మందుమా యది శివలీలలకుంబోలె సుకవితా లీలలకును గుఱిస్త్రై యలరారుచున్నది. అందలి వొకకథాంశము.

పుణ్యమూర్తులు మహారాజ దంపతులునై నుతిగన్న నలదమయంతుల చరిత్ర భారతమునందును నైషధాది కావ్యములందును వర్ణితమగుట విదితము. వారి పూర్వజన్మవృత్తాంత మిందలి యతినాథ లీలలో హృద్యముగా నభివర్ణిత మైనది. సద్వర్తనులు శివభక్తులు వనేచరులునైన భిల్లదంపతులలో భిల్లి దమయంతిగాను, భిల్లుఁడు నలుఁడుగాను జన్మించిరి. వారిపెండ్లికి రాయబారము నల్ప మహేశ్వరుఁడు రాజహంసయై జన్మించెను. ఈ కథలోఁ గర్మవశమున భర్త మృతి చెందగా భార్యయగు భిల్లి సహగమనము చేయఁబూని చితికిఁ బ్రదక్షిణ మాచరించి యతినాథరూపమున నందున్నశివుఁడు వినుచుండ శివభక్తి పతిభక్తుల మూర్తియో యన శివుని మనసార ధ్యానించుచున్నమాట యిది:

క॥ తెలిసీ తెలియనినాచేఁ, తల ననుచిత మెంతయేని ♦ తనరెడుఁ గృప నా
కలుషములఁ బాపు మిదె జోఁతలు చేసెద దేవదేవ! ♦ దర్పకదమనా!

భారతమందలి చిన్నకథ యాధారముగా భారవిమహాకవి కిరాతార్జునీయమొనరించెననుట ప్రసిద్ధము. ఆకథ వాయుపురాణమందువలె నీ శివపురాణమందు నీషద్భేదముగాఁ గనవచ్చును. ఇట్లే యెన్నోకథ లతిసంగ్రహముగానో సంగ్రహముగానో యన్ని పురాణములందును గనవచ్చు ననుట పాఠకులెఱుఁగని విషయము కాదు.

మఱి యుమాఖండమందలి యొకటి రెండు విషయములు.

శ్రీకృష్ణుఁడు శివునిగూర్చి తపస్సుచేయుట బహుత్ర కనవచ్చును. రుక్మిణీదేవి పుత్రవాంఛదీర్ప నతఁడు తపస్సొనర్పఁ గైలాసయాత్ర సాగించినట్లే జాంబవతీ పుత్త్రవాంఛ తీర్చుటకై తప మాచరింప హిమాలయయాత్ర యొనర్చినాఁడు. ఇందలి విశేషము కృష్ణునికి మహర్షియగు నుపమన్యుఁడు ముందుగా శైవదీక్ష

యిచ్చుట. మఱియుఁ దపోనంతర మతనికిఁ బార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై యెనిమిదేసి వరములిచ్చుట. అవి చాలవనుకొని యుమాదేవి భక్తునియెడఁగల వాత్సల్యముతో,

"నే మాటకైనఁ బల్కను భార్యా సహస్రకౌశల్యంబును దారవాల్లభ్యంబును బాంధవప్రేమను గనెదవు. నీ యింట నిత్యమేడువేల ద్విజులు కుడుతురు" అనుచు మఱికొన్ని వరము లడుగకనే యిచ్చెను.

తొలిముద్రణమం దతిసంగ్రహముగా నున్న శ్రీరామచరిత్ర మీ ముద్రణమందు పుష్టిఁగాంచి యింపగురూపముతో దర్శన మిచ్చుచున్నది. మురారి కవి యన్నట్లుగా నిట్టి యవతారపురుషుఁడు జగత్తులో మఱియేఁడి! అట్టి సీతా రాములను స్తుతింపని పురాణమేది? రావణసంహారానంతర మగ్నిపరీక్షయైనంత బ్రహ్మ దేవుఁడు సీతను శ్రీరామునికప్పగించుచుఁ బల్కిన మాటలివి.

చ॥ పరమపతివ్రతామణిని ♦ బామరుఁడట్టులు పల్కి తగ్నులం
దుఱుక నుపేక్ష చేసితి వి♦దొప్పనె చెప్పుము రామచంద్ర! నీ
చరిత మెఱుంగనైతి వల♦చక్రధరుం డగు విష్ణు వీవ యీ
సురుచిరగాత్రి శ్రీరమణి ♦ యమ్మలుమాన్పసతిఁ గ్రహింపుమా!

ఈ పురాణము శివాద్వైతపర మని కైలాసఖండముకంఠోక్తి నిట్లన్నది.

క॥ అద్వైతము శివవాదం। బాద్వైతంబును సహింప ♦ దరయు మది మునీం
*ద్రా! ద్వైతము నశ్వరము శి। వాద్వైత మనశ్వరంబు ♦ మారు వొప్ప నిలన్.

ఇం దుపాంత్యముగా నున్న వాయవీయఖండము శైవతత్త్వసారబోధక మనుట నిస్సంశయము. ఇతరపురాణములందును ఈ పురాణమందలి యితర ఖండములందును జగదుత్పత్తిస్థితిలయాది ప్రసక్తి లేకపోలేదు కాని యీ ఖండ మందు వాటిప్రశంస వినూతనమై వేద్యాంశముఁ గనఁజేయ విస్తరించినది. ఇఁక కట్టకడపటి విద్యేశ్వరఖండము ప్రధానముగా భక్తులకును శివతత్త్వజిజ్ఞాసువు లకును పూజాజపలింగధారణాదిక ముపదేశించుచు శైవమతము దేశమున విస్తరింపఁ జేయువిధానము నభివర్ణింపుచు మోక్షసిద్ధికి భక్తి మూల మను పరమసిద్ధాంతమును ప్రతిపాదించినది. వేదశాస్త్రాభిమతమైన పూజాభిషేకాది విధానముల శివుని నిష్కామబుద్ధితో నర్చించువారు తుదను శివసాయుజ్యము నొందుదురని సాయుజ్యముక్తి నుపదేశించినది.

---

* టిప్పణి–శివాద్వైతము–చిదచిచ్ఛక్తి విశిష్టశివాద్వైతము–ఇదియే శైవాచార్యులచే నంగీకృతమైనది.

ఇ ట్టిపురాణము నీతిభ క్తిము క్తిమార్గము లుపదేశించుచు నాంధ్రిభాగవతము మాడ్కి నాదరణీయమై వెలయుచున్నది. ఈరెండును పరస్పరసన్నిహితములైన పురముల జన్మించిన వగుటచే అక్కగారిపోకడలు కొన్ని యీచెల్లెలు నేర్చుకొన్నది. అదిసహజము గదా. ఇందొకతె శ్రీవిష్ణువు నింకొకతె శ్రీశివు నాశ్రయించిరన్న పేరేకాని,

"యథా శివమయోవిష్ణు । రేవం విష్ణుమయశ్శివః" అన్న యద్వైతభావ మీయిద్దఱి హృదయముల నంతర్యాతమైయున్నది. కావున శ్రీమద్భాగవతము కైవడి నీ శ్రీశివపురాణము నాంధ్రులయాదరాభిమానముల నందఁగలదని యాశించుచున్నాను. ఇఁక నిందలికథావిషయప్రశంసను సంగ్రహించుచు శివ కేశవులు వివాహవిధినిగూర్చి తెలిపిన భేదాభిప్రాయములుమాత్రము తెలిపెదను.

ఈక్రిందివిషయము పార్వతీఖండము మూడవయాశ్వాసములోనిది.

"లోకములో కామునివంటిదుష్టుఁడు లేఁడు. వానిమూలముగా దేవమానవ లోకముల జరిగిన యకార్యము లన్నియిన్ని కావు. కావుననే నేను వానిని మాడ్చితిని. మీ రెవ్వరును స్త్రీలను చేరనీయవద్దు. నేను పార్వతిని పెండ్లాడను" అనుచు శివుఁడు దేవతలకుబోధించి యెక్కువగా స్త్రీనిందగావించెను. అపుడు శ్రీవిష్ణువు లోకములో స్త్రీవంటివస్తువే లేదనుచు స్త్రీస్తుతి గావించి నీవు లోకరక్షణార్థమై పార్వతిని పెండ్లాడఁదగునని శివుని వేఁడుకొనెను. వినఁజదువ నింపైన యీప్రసంగ మవశ్యపఠనీయము. ఇఁక నీపురాణమందలి భాషావిషయమును గూర్చి రెండు మాటలు. శ్రీనాగవీరయ్యశాస్త్రిగారు శ్రీనాథపోతనాదుల రీతుల ననుసరించి ధారాశుద్ధిగా రసవంతముగా రచన సాగించి రనుట నిర్వివాదము. అర్వాచీనాంధ్రకవుల రచనలో దొరలినట్లే యిందు నందందు కొన్ని లాక్షణికదోషములు దొరలకపోలేదు. వైయాకరణులకుఁ గాళిదాసకృతులలోఁ దప్పులుకనరాలేదా? అందుకే "ప్రమాదోధీమతామపి" అన్నారు పెద్దలు. ఇంతకు నింతటియుద్గ్రంథము నిర్మించునపు డెంతటివారి కయినఁబొరపాట్లు రాకపోవు. తిక్కనవంటి మహాకవిరచనలో నొకచోట (శాంతి 1–14) "గాండివినొవ్వ బల్కితిటు కర్ణునిజంపక వచ్చితేని" అను ధర్మరాజవాక్యమున్నది. ఉత్తమపురుషక్రియలోని ద్రుతము లోపింపరా దని యతనికిఁ దెలియ దందురా? "పల్కితిని గర్ణుని జంపక" యనుట కెట్లో "పల్కితిటు" పడినది. అది కవిప్రమాదమో లేఖకప్రమాదమో! అట్లే యీపురాణమందలి 618 పుటలో "అగ్నులం దుఱుక నుపేక్ష చేసితివి యొప్పునె" అని మధ్యమ పురుషేకారము నకు సంధిలేని దోషము కనవచ్చినది. అది కేవలము ప్రమాదమే. "ఉపేక్ష చేసి తివిదొప్పునె" అనఁ దగినచోటు గదా! మఱియొకచో 649 పుటలో.

"మునీం । ద్రా ద్వైతం బశ్వరముశి । వాద్వైత మనశ్వరంబు" అనుచో "అశ్వరము" పడుటయుఁ బ్రామాదికమే "మునీం । ద్రా ద్వైతము నశ్వరముశి" అని సులభముగా ననిన సరిపోవును. ఇట్లు వెదకదొరకొన్నచో జ్ఞానకృతములో, అజ్ఞానకృతములో ఏవో దోషములు దొర్లని పుస్తకమే కనఁబడదు. అందుచేతనే ఆర్యక్షేమేశ్వరకవి యిట్లు నీతి చెప్పినాఁడు.

"దృష్టం కిమపి లోకేస్మి । న్ననిర్దోషం ననిర్గుణం। ఆవృణుధ్వమతో దోషాన్। వివృణుధ్వం గుణాన్ బుధాః"

అబ్బయామాత్యుఁ డిట్లుచెప్పినాఁడు
"సుకవులసూక్తులందు సరసుల్ నెరసుల్ వెదుకంగఁ బోరు"

ఇఁక నీవ్యాసము ముగించుటకు ముందు వల్లీసౌందర్యవర్ణనమందలి వొకటి రెండు. భిల్లతనూజ యగువల్లి పెండ్లికూఁతురు. శివతనూజుఁ డగుకుమారస్వామి పెండ్లికొడుకు. వారి కన్యోన్యము మోహము గలిగింప రాయబారము సల్పి వాఁడు నారదుఁడు. శ్రీనాథాదు లొనర్చిన శృంగారవర్ణనలను తలపింపఁ జేయున దీఘట్టము.

పుటలు 313-318.

"గీ॥ బాలయొడలిచాయ ♦ పసకోడి యపరంజి
యప్పు చెంది స్వర్ణ ♦ ముయ్యెఁ బుడమిఁ
దగినవారితోడఁ ♦ దగుఁ గాక మచ్చరం
బధికులందు నొంద ♦ హాని గాదె."

"క॥ కమలము కమలము శశిబిం, బము శశిబింబమె యరయ స ♦ వతు వచ్చునొకో
కమనీయకోమలం బగు, రమణీమణిమోముతో న ♦ రాతివిభూతీ!"
"సీ॥ చక్రవాకస్తని ♦ సారంగలోచన । భాసురశంకరా ♦ భరణవేణి-"
"సీ॥ కెంపువా తెరఁజూచి♦యింపుఁ జెందితిగాని । యార్తి దీరఁగఁ దేనె♦నాననైతి"
"సీ॥ అవధూతయై పృథ్వి♦యంతఁ గ్రుమ్మరు వేల్పు । జడదారి యేటి కి♦చ్చటికివచ్చె"
"సీ॥ లలితవీక్షాప్రియా ♦ లాపాక్షరములఁ జే । తములర్పఁ బ్రణయంబుఁ దలఁపనైతి,"
"ఉ॥ దాయనుబోలెఁ బాసితిఁ గ ♦ దా యను వేటొకమాట తోఁచలేదా యను."

ఇట్లు సరసఫణితిని వల్లీ కార్తికేయుల యన్యోన్యావలోకనము మొదలుగా వివాహమువఱకుఁగల కథాభాగమంతయు నింపగు వర్ణనలతో నలరారుచున్నది. ఇది తనివిదీరఁ జదువఁదగినపురాణముగాని యేవో నాలుగుపద్యము లుదాహరించి నంతమాత్రమున సరిపడునా? ఈకృతి ఆంధ్రవాణికి మఱియొకమణిహారము.

ఈమహాగ్రంథముతొలిముద్రణమే చక్కనిపీఠికచే నుపోద్ఘాతముచే నలంకృతమై యున్నది. శ్రీనాగవీరయ్యశాస్త్రిగారును నేనును బరస్పరము చూచుకొన్నవారము గాము కాని వారు శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి శిష్యులగుటచే విఖ్యాతయశస్కులును మాగురువర్యులునగు శ్రీచర్లబ్రహ్మయ శాస్త్రి గురుపాదులవిద్యావంశములోఁ జేరియున్నారు. అది కారణముగానో, ఈముద్రణమునకు మఱియొక యుపోద్ఘాతము చేర్చుతలంపుతోనో నన్నిది వ్రాయఁ గోరిరి. ఏమయితే నేమి! ఆవిద్వత్కవీంద్రునియభిలాష మన్యథాకరించుట యపచారమని తలంచి నా నేర్చినకొలఁది నీవ్యాసము రచియించితిని. దీనియౌచిత్యానౌచిత్యములకుఁ బాఠకలోకమే ప్రమాణము.

ఓం శాంతిః.

ధవళేశ్వరము 12-1-58

మల్లాది సూర్యనారాయణశాస్త్రి
విశ్రాంత సంస్కృతాంధ్రాధ్యాపకుఁడు
ఆంధ్రవిశ్వకలాపరిషత్కలాశాల.

---

## ద్వితీయముద్రణంబు విజ్ఞప్తి

పాఠక మహాశయులారా !

పరమేశ్వరానుగ్రహముచే శివపురాణ ద్వితీయముద్రణ మిప్పటివఱకుఁ బూర్తియైనది, లోగడ ముద్రణమందు దొరలిన ప్రామాదికంబులగు నచ్చుతప్పులను జాలవఱ కిందు దిద్దితిని. లోగడముద్రణమం దుమాఖండములో నైదాఱు పద్యములలో సంకుచితముగ నిమిడ్చియున్న రామాయణచరిత్రమునిందు విపులీకరించి 350 పద్యములను వ్రాసి ద్వితీయాశ్వాసముగ నమర్చితిని. అందందు రామణీయకమున కలరి శ్రీవాల్మీకీయము నందలిశ్లోకంబుల ననుసరించితిని. అది యొక దోసంబుగ గుణజ్ఞులు భావింపరని తలంచెదను.

లింగవైభవఖండమందలి శివవ్రతములలో లఘురుద్రమహారుద్రాతిరుద్రస్వరూపంబులను రుద్రజపాభిషేకహవనభేదంబులను శ్రీభట్టభాస్కరభాష్యమేరుతంత్రంబులనుండి గ్రహించి చేర్చితిని.

ఇఁక వాయవీయఖండమందు మున్ను వదలిన షడధ్వపరిశోధనము మున్నగు వానిని, సూత్రప్రాయముగ వ్రాసినభగవద్విభూతి మున్నగువానిని యథాతథముగ విశదీకరించి వ్రాసి రెండవయాశ్వాసము రచించితిని.

శైవాగమకారణోత్తరమునుండి శ్రీబ్రహ్మవిద్యోపాసనాపురశ్చరణాదులను గ్రహించి యిందుఁ జేర్చితిని.

విద్యేశ్వరఖండమందు శ్రీశైపుల మహాశివలింగ పూజావిధానంబుగూడ శైవాగమోక్తప్రకారంబుగ సక్రమంబుగఁ దెనిగించి కూర్చితిని.

మఱియు నందందుఁ గొన్నియెడల నౌచితి ననుసరించి యించుక హెచ్చించితిని. సహృదయు లివ్వాని నన్నిటి నాదరియుదురని యాసించెదను.

ఇఁక మూలగ్రంథమందునను నాంధ్రీకృతగ్రంథమందునను గొన్ని యాక్షేపములను మిత్రులగువారు సూచించిరి గాని ముద్రితగ్రంథమందలి నాదుమున్నుడిలో శివపురాణరచనాకాలంబున కిప్పటికాలంబునకుఁ బ్రపంచధర్మంబులు చాలగ మాఱ్పై యుండుటనుబట్టి చదువరుల కందందుఁ గొన్నియెడల నించుక వ్యత్యాసముగఁ దోచవచ్చును గాని విజ్ఞులవ్వానిని పాటింప రని వ్రాసియుంటిని.

ఇఁక నిర్గుణంబును దేశకాలవస్తు పరిచ్ఛేదశూన్యంబునునగు బ్రహ్మతత్త్వంబుగాక తక్కిన సగుణులగు త్రిమూర్తులు జగదభ్యుదయంబునకై కామాభిలాషతోఁ ద్రిశక్తులనొందుటయు సంతానంబులనొందుటయుఁ బురాణంబులందునను తదనుసృత కావ్యనాటకాదులందునను ప్రసిద్ధమే. అందుచే ఆత్మశక్త్యనుబంధకృత కామభావోక్తు లవ్వారియెడల దూష్యంబులుగావు.

పార్వతీపరమేశ్వరభోగవర్ణనమునుగుఱించి తత్కథాసంవిధాననిబంధనంబందు శ్రీవాల్మీకిమహామునీంద్రునకును శ్రీకృష్ణద్వైపాయనమహర్షికిని వైరుధ్యము గన్పట్టక యే యుభయమునులును శ్రీరామాయణశివపురాణాదులందొక్కేవిధముగఁ దదీరీతి నుదాహరించిరి. అర్వాచీనులగు అలంకారికులుమాత్రము నిషేధించిరి. శ్రీకాళిదాసాదిమహాకవు లాసిషేధము నెక్కుడుగఁ బాటింపలేదు. కవికులగురులీ కాళిదాసులు కుమారసంభవకావ్యమందొకసర్గమంతయు అష్టమసర్గమంతయు శ్రీపరమశివుని సంభోగవిషయముగ రచించిరి. ఇతరకవులుకూడ శంభురహస్యాది గ్రంథము లందు

శ్లో॥ దాసేకృతాగసి భవత్యుచితః ప్రభూణాం పాదప్రహార ఇతిసుందరి నాస్మిదూయె—

ఇత్యాది పరమశివునికామోపచారోక్తుల ననువదించిరి. ఇఁక నిషేధముతక్క నసామాన్యజనుల కేళీవిశేషంబు లుద్ఘాటించినట్లు మిక్కిలి వచ్చి గాకుండ ప్రౌఢోక్తి నుదాహరించిన నద్ది చరితార్థమగును.

శ్రీవాల్మీకివ్యాసోక్తు లార్షంబు లగుట నయ్యవి యించుక మేరనుదాటినను వానికి వంకలేదు. శ్రీకాళిదాసు మున్నగువా రుచితరీతినే యనువదించిరి. ఇఁక శివపురాణమూలగ్రంథమందును అద్దాని సముచితసరణిఁ దెనిఁగించివ్రాసిన నా యీ కృతియందు నీయాక్షేపమునకవకాశము లేదు.

అలంకారశాస్త్రమందేకాక శబ్దశాస్త్రఛందశ్శాస్త్రాదులందుగూడ తత్తన్ని బంధనంబు లవ్వానియందు బిగువుగఁ బ్రతిపాదింపఁబడినను "నిరంకుశాః కవయః" అనెడురీతిని మహాకావ్యకులు మొదలుచేసి సామాన్యుల కావ్యములవఱకుఁ గూడ ఈయవి సార్వత్రికంబుగ నిబంధితవిధులకు లోఁబడియుండక కొండొక మీఱుచునే యున్నవి. అవ్వానిని విజ్ఞులు రసైకగ్రాహులై పాటించుట లేదు.

ఇఁక శివుని వైరాగ్యధీరత శివపురాణపార్వతీఖండప్రథమాశ్వాసమందలి(300) పద్యములో నెఱుఁగఁదగును. శివుఁడు దన్నువరించి సేవించుచున్న పార్వతీదేవి స్వాగ్రమందుఁబరిచర్యలొనర్చుచుండఁగాఁ దదను సంధానార్థమై ప్రయత్నించుచున్న మన్మథు నస్తమింపఁజేసి పార్వతిని బొమ్మని రతీదేవికి వరమిచ్చి తత్క్షణంబున ఆస్థలినిబాసి కైలాసగిరినిఁ జేరినట్లుగాఁ జెప్పఁబడియుండఁగా ఇట్టి శివుని విరాగియన వలయునా ? సామాన్యఋషి యనవలయునా ? పరమేశ్వరుఁడనవలయునా? యోజింపుఁడు. లోకోత్తరరమ్యవస్తుసందర్శనంబునఁ దద్వస్తుప్రశంస యొకదోసంబుగాదు.

తపస్సు చేయుచున్న పార్వతీదేవిని బరీక్షించుటకై శివుఁడు సప్తర్షులను బంపఁగా వారు శివాజ్ఞచే ఛలంబుగఁ బార్వతీదేవితో గొన్ని యనుచితంబులనే పలుకుదురు. అయ్యవి యథోక్తవచనంబులుగాక ఛలోక్తులగుట ననుచితంబులైనను ననుచితంబులుగావు. జుగుప్సాకరవచనంబులనుటలోఁ గాలభేదంబును బట్టి అయ్యదియుఁ బొసంగదు. ఇట్టివి ఇతిహాసశ్రేష్ఠంబగుమహాభారతమం దనేకంబులు గలవు. వానియం దొకటెందు వ్రాసి చూపుట యనుచితముగాదు.

భారతోద్యోగపర్వమందు మహాపతివ్రతయగు నింద్రాణిని నహుషవరణంబునకై దేవాచార్యునిసన్నిధానంబుఁ జేరి యర్థించుక్రతుభుక్కుల యనుచితవచనంబులును వాని కేవమొంది యుల్లసమాడి నిరసించినవాచస్పతి యుచితోక్తులును శచీదేవీసూక్తులును విదితములు.

గుణనిధికథను నేను కాశీఖండమునుండి గ్రహింపలేదు. అది శివపురాణములోనిదే. శివపురాణముసృష్టిఖండములో ౧౭-౧౮ అధ్యాయములలోఁ గలదు.

శ్లో॥ ఆసీ త్కాంపిల్యనగరే । సోమయాజికులోద్భవః । దీక్షితో యజ్ఞదత్తాఖ్యః । యజ్ఞవిద్యావిశారదః ॥

యదాయదైవ తాంపృచ్ఛే। దయే గుణనిధిస్సుతః । నదృశ్యతే మయా గేహే । కల్యాణి! విదధాతికిం ॥ తదాత దేతి సా బ్రూయా దిదానీంస బహిర్గతః। స్నాత్వా సమర్చ్యవై దేవా । నేతావంత మనేహసం। అధీ త్యాధ్యయనార్థంస। ద్విత్రైస్మిత్రై స్సమం యయా । ఏకపుత్రేతి తన్మాతా । ప్రతారయతి దీక్షితం ॥ నతత్కర్మచ తద్వృత్తం। కించిద్వేత్తి సదీక్షితః ॥ ఇత్యాది అధ్యాయద్వయపరిమితము॥ ఇద్దాని భాషాంతరీకరణమందు నేను గవితాచమత్కృతి యేమియుఁజూపలేదు. ఇది ఇం దొక ప్రధానకథ గాకుండుటను ఇట్టివి పెక్కులు కథ లిందుపలబ్ధంబులై యుండుటచేతను నిద్దాని సామాన్యధారలోనే వ్రాసినాను. శ్రీనాథకవివరేణ్యు లుల్లేఖించి రసోల్బణముగ వ్రాసిరనిన కాశీఖండమూల గ్రంథము స్థలపురాణం బగుట నందుఁ బ్రధానకథానాయకవిషయంబుఁగూర్చి పెంచక గుణనిధిచరిత్రంబు వైశ్వానరచరిత్రంబు బుధజన్మచరిత్రంబు గళావత్యుపాఖ్యానంబు మున్నగాఁ గలకథలతోనే నిండింపఁబడినది. అట్టిగ్రంథంబు వ్రబంధీకరణమందు శ్రీనాథకవిబుధు లీయుపకథలనే కొని యివ్వానియందు రసనిష్పాదనం బొనరించిరి. ఎట్లైనను శ్రీనాథకవిసార్వభౌములకును నాకును గొండంత యంతరం బున్నదని నే నెఱుంగుదును. ఇఁక వారికిని నాకును మా కవితలకును బింబప్రతిబింబభావ మెట్లు పొసఁగును?

తారకాసురయుద్ధభాగంబందుఁ దారకుని జంపెదనని వీరభద్రుండు సంరంభింపఁగా నారదముని యడ్డుపడి నివారించుటనుగూర్చి తారకాసురుని వీరభద్రుఁడు చంపఁగలిగినయెడలఁ గుమారోదయంబునకై యట్టి విస్తారయత్నం బేటికనిరి. ఇందు శ్రీవీరభద్రుఁడు దేవతాపీడనంబున కోర్వక కుమారునికి సత్వరయుద్ధంబును బ్రోత్సహించుటకై తా నట్లు కడంగెను గాని యన్యముగాదు. నారదుఁ డను మానపడి వీరభద్రునితో నట్లనుడివెను. మఱొకమాఱుగూడ ఇట్లే శ్రీ వీరభద్రుఁడు సంరంభముఁ జూప గుమారుఁ డనికి దొడంగెను.

శ్రీ భైరవకృత విధాతృపంచమశిరఃఖండన మందొకచోటఁ గరాంగుళీనఖాగ్రంబులఁ జిదిపెననియు వేఱొకచోట నసి విచ్ఛేదించెననియును వ్రాయుట యందలి భిన్నభిన్నసరణినిగూర్చి పూజ్యపాదు లొకరడిగిరి. మూలములో నట్టు లుండుట నద్ది మన్వంతరభేదముచే నట్లు జరిగియుండవచ్చునని యూహింపవలసి యున్నది. ఇట్లె భారతమందుగూడ కర్ణజన్మవృత్తాంత మొకచోట సూర్యానుగ్రహముచేఁ గుంతీగర్భ మితరులకదృశ్యమై దశమమాసంబందుఁ బ్రసూతి నొందినదనియు వేఱొకచో సద్యఃకర్ణమార్గంబునుండి కర్ణుఁడు జన్మించెననియును గలదు. ఏతాదృశంబుల నన్నిటిని వాచ్యలక్ష్యవ్యంగ్యతాత్పర్యార్థముల ననుసరించి సమన్వయించుకొనవలయును. ఒకేమార్గమున నిర్వాహముగాదు*.

* అసి సదృశములగు నఖాగ్రంబులని యన్వయించుకొనవలయును.

పంచచూడానారదసంవాదంబును జతుర్యుగధర్మములు మున్నగునవి భారత ములోని విందున్నవనియుఁ బురాణాంతరంబులందుండిన యితరవిషయము లనేకము లిందు మరలఁ జెప్పబడినవనియు ననిరి. సామాన్యముగ నన్ని పురాణముల యందును జతుర్యుగధర్మములును వర్ణాశ్రమధర్మములును స్త్రీపురుషధర్మములు మున్నగునవి చెప్పఁబడియే యున్నవి. వీనిలో నొక్కటినేని చెప్పని పురాణమే యరుదు. భాగవతము విష్ణుపురాణము శివపురాణము దేవీభాగతము భారతేతిహాసము జైమినీ భారతము మున్నగు సర్వార్థగ్రంథములం దివి కలవు. అందుచే నొకదాని కుపకర్షముగాని మఱొకదాని కపకర్షముగాని కలుగ లేదు. అన్నియవసరధర్మములగుటను నేయొకటి చదివినను నవ్వి తెలియఁబడ వలయు నని ప్రణేత లట్లువ్రాసిరి. కర్తైక్యంబుననుగూడ నివి యన్నిపురాణంబులందును నితిహాసంబందు యోజింపఁబడియుండును. ధర్మంబులు మాత్రమే కాదు పెక్కులుకథ లనేకోపాఖ్యానంబులుగూడఁ బలుకడల నుపపాదితంబులై యున్నవి. దాననేమియు బ్రత్యవాయంబు లేదు. పునరుక్తియుఁగాదు. అది సర్వపురాణసాధారణమే!

వేఱొకమిత్రులు మూలగ్రంథములోనివిశేషంబు లన్నియు విడువక తెనిగింప వలయు ననియు అట్లు దెనిఁగింపకున్న వాని నన్నిటిని మూలమునకుఁ దగిన వివరణముతోఁ బ్రకటించినను మేలేయనిరి. ఇందు నేను వారు వ్రాసిన యట్లు అట్టివిశేషంబులను జారవిడువక తెనిఁగించియే వ్రాసితిని. చాలవఱకుఁ బునరుక్తములుగఁ దోఁచు కథలను అనవసరపు విపులీకరణంబులను విడిచితినని నామనవి.

ఇట్లార్థికశంకలు గాక శాబ్దికప్రసంగమందుఁ గూడ చాలఁ అనుపదమును ధృతప్రకృతికముగాదనియు కళయని యొకమిత్రుఁడు దెలిపెను. కళాపదంబులకు "తిజ్మధ్య శేషషష్ఠీ" త్యాదిపరిమితి కలదు, అపరిమితవ్యూహములోనిది యిది కాదు. తత్పరిమితంబులకన్న భిన్నంబులు ధృతప్రకృతికములే. ఇందులకు మహాకవుల ప్రయోగంబులు ప్రతిగ్రంథమందుఁగలవని చూపుట పెచ్చు.

చ. అనవిని చాలఁదల్లడిలి ♦ యాయకనాయకు కంఠమున్ రయం...

కళాపూర్ణోదయము ఆ. 3

చాలఁ ద్వారవతి యొప్పుసౌభాగ్యములన్—

కళాపూర్ణోదయము

(శ్రీశ్రీ మ॥ సూర్యనారాయణశాస్త్రిగారిచే సంశోధితము)

ఇఁక నీయాక్షేపములకెల్ల నేనిట్లుసమాధానంబులను వ్రాయుట మూల గ్రంథమునకును ఆంధ్రీకృతగ్రంథమునకును సుంతకలంకము వాటిలునేమో యను శఙ్కచేఁ బ్రసక్తమైనది గాని వేఱుగాదు.

ఇఁక నాయాంధ్రీకరణంబునుగూర్చి ప్రథమ ముద్రణమందలి మున్నుడిలో విశదము చేసియే యుంటిని. ఎల్లప్పుడును "సహృదయాఃప్రమాణం" బనియే విశ్వసించెదను. ఈకూర్పులోఁగూడ నందం దొదవినముద్రణప్రమాదంబులను దిద్ది శుద్ధపత్రికలోఁ జేర్చితిని. ఇఁక నేవేని యున్నచో యథోచితముగదిద్ది చదివి కొన వేడికోలు.

ఇఁక నిం దుపోద్ఘాతమును వ్రాసియిచ్చుటకై లేఖాద్వారంబున అభ్యర్థన మాత్రా వ్యవధానంబుననే శ్రమయనక సాదరంబుగ నంగీకరించి పాత్రముఁ దెప్పించికొని చదివి విమర్శన పూర్వకముగ నుపోద్ఘాతమును వాత్సల్యంబుతో వ్రాసి పంపిన విద్వత్కవివరేణ్యులాస్మాకీనగురుసతీర్థ్యులు గురుతుల్యు లాంధ్ర విశ్వకలాపరిషత్కళాశాలావిశ్రాంత సంస్కృతాంధ్రోపాధ్యాయులునగు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిలవారికిఁ గృతజ్ఞుడనై భక్త్యంజలులతోఁ ద్రికరణ పూర్వకాభివందనంబుల నర్పించుచున్నాను.

మఱియు నీగ్రంథంబు నాదరంబుతోఁ జదివి స్వాభిప్రాయంబులను వ్రాసి పంపినట్టివిద్వత్కవివర్యులకు నమోవాకంబులర్పించెదను.

ఈ గ్రంథ పునర్ముద్రణమునకు భారము వహించి సర్వసన్నాహంబొనరించి యంతలోఁ గాలవిపాకంబున దేహంబుఁ బాసిన ఉదార శ్రేష్ఠుఁడు మ॥ రా॥ శ్రీ గోపిసెట్టి రత్నయ్యశ్రేష్ఠి యాత్మకు శాంతిగలుగుఁగాక.

ఇఁక నీయనదత్తపుత్త్రుఁడు చి॥ చంద్రమౌళికి చిరాయురారోగ్యభాగ్యముల నిచ్చుటకును, ఈగ్రంథ పునర్ముద్రణమందు సాహాయ్యమొనర్చినట్టి మిత్రుఁడు మ॥రా॥శ్రీ తవుట రాజయ్యకును నిర్విఘ్నంబుగ సౌకర్యయుతముగనీ శివ పురాణగ్రంథమును ద్వితీయముద్రణంబొనరించినట్టి మిత్రుఁడు ప్రీమియర్ ముద్రాక్షరశాలాధికారి మ॥రా॥శ్రీ కొండ శంకరయ్యకును దీర్ఘాయురారోగ్యైశ్వర్యంబుల నిచ్చుటకును బరమేశ్వరుని బ్రార్థించుచున్నాడను.

ఇట్లు విద్వత్కవివిధేయుఁడు
ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి

# విద్వదభిప్రాయములు

## ఆంధ్ర విశ్వకళాపరిషచ్చరిత్రాధ్యాపకులు
## బ్రహ్మశ్రీ లోకారాధ్యులైన మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, వాల్తేరు.

ఆర్యా!

మీరు ప్రేమాదరములతో పంపిన శ్రీ శివపురాణమును కృతజ్ఞతా పూర్వక వందనములతో నందుకొన్నాను. శివసంబంధమైన కథలతో శివమాహాత్మ్యమును బోధించి శివభక్తి నుద్దీపింపఁ జేయు నీయుద్గ్రంథమును రచించి శైవమతావలంబకు లందఱి కృతజ్ఞతకుఁ బాత్రులైనారు. ఇటీవల ప్రకటితమైన తెలుగు శైవవాఙ్మయమున అంతేకాదు ఆంధ్రవాఙ్మయమునందే ప్రధానస్థాన మాక్రమింపఁ దగిన మహాగ్రంథ మిది. ఈ పురాణమును రచించి ఆంధ్రవాఙ్మయమునకే వన్నెకూర్చినారు. సంపూర్ణముగ శివకథాసంహిత యనఁ దగిన ఈ శివపురాణమును ఆంధ్రీకరించిన సుకృతులు మీరే యనుకొందును.

మతమునెడల నాదరము తగ్గుచు ఆంధ్రవాఙ్మయముమీఁద నభిమానము వెనుకటికంటె క్రమముగా నధిక మగుచున్న యీ కాలమున వాఙ్మయముమీఁద ననురక్తిగల సాహితీప్రియులు గూడ ఈ మహాగ్రంథము నాదరింతురని నా విశ్వాసము. ఈపురాణ మంతయు నొక యమృతధుని ప్రతిపద్యము నొక రసాత్మకతరంగము హృద్యమై యలరుచున్నది. శబ్దార్థగాంభీర్యముతో గౌరవోదంచితమైన రీతితో నిండలి కవిత్వము రమ్యముగా సాగిపోయినది. ఈపురాణము మధుర మైన ద్రాక్షాపాకములో బడి చదివినకొలఁది జవు లూరించుచున్నది. ఇది ప్రాచీనప్రబంధ ఫక్కి నడచి స్వతంత్రగ్రంథ మనిపించుచున్నది. కాని ఆంధ్రీకరణ మనిపించుటలేదు. గ్రంథము చదువుచున్నపు డెడనెడ ప్రాచీనాంధ్రమహాకవుల పోకడలు గోచరించి మన మలరించుచుండును. నట్టుపొట్టలేని చక్కని ధారతో పటిష్ఠమైన సంస్కృత సమాసజటిలతతో చేతోమోదము కూర్చు అచ్చ తెలుగుపదముల చెలువముతో భావానుగుణమైన శబ్దార్థపుష్టితో మనోహరమైనశైలితో గ్రంథ మంతయు మురువు గొలుపుచున్నది. ఇట్టి గ్రంథమును రచియించి నందుకు మిమ్మభినందించుచున్నాను. మీ కివే నాజోతలు.

8-3-58 మల్లంపల్లి సోమశేఖరశర్మ

---

## శ్రీ శైవమహాపీఠాధ్యక్షులు విద్వచ్ఛిరోమణులు శ్రీ లోకారాధ్యులు
## బ్రహ్మశ్రీ ముదిగొండ వీరేశలింగశాస్త్రులవారు ప్రిన్సిపాల్
## శ్రీ విశ్వేశ్వర ఓరియంటల్ కాలేజి వరంగల్. 18-3-1958

అష్టాదశ మహాపురాణములలో శివపురాణ మొకటి. ఇట్టి మహాపురాణము సులభశైలిలో బండితపామరుల కెల్ల రుచించునటుల ఆంధ్రభాషలోనికి పరివర్తించిన మహాకవులు శ్రీ లోకారాధ్యులు ముదిగొండనాగవీరయ్యశాస్త్రిగారు.

ఇందలి ప్రతిపద్యము సాలంకారము సాభిప్రాయముగ నుండుటయే గాక కథాసందర్భసంఘటన మత్యంతరమణీయముగా నున్నది. పంచ లక్షణలక్షితమై సలక్షణముగ సులలితరీతులచే సహృదయుల హృదయము నాకర్షించుచున్నది.

శివచరిత్రములు శివభక్త చరిత్రములు శివలింగభేదములు పార్థివలింగ ప్రాణలింగ పూజావిధానములు తత్ఫలములు ధాన్యాదులు పుష్పపత్రము లెట్టివి శివార్చన కర్హములైనవో వాటిఫలము లేవో సుస్పష్టముగ వచింపఁబడినవి,

పార్థివలింగపూజకును ఇష్టలింగపూజకును భేదము చక్కఁగా వచింపఁబడినది. శైవసిద్ధాంతము ద్వాదశపూజలు చతుర్వింశత్యుపచారములు మున్నగు శైవసంప్రదాయము లనేకములు నిరూపింపఁబడినవి. శివస్వరూపమహిమాచరిత్రజిజ్ఞాసులకు నింతకంటే ఉత్తమగ్రంథము లేదు. శ్రీశాస్త్రిగారు ద్రాక్షాపాకములో సుకవిలోకమును మెప్పించిన తమ పేరును సువర్ణాక్షరములతో కవీంద్రమనశ్శిలాశాసనముల నంకితముచేసి యాంధ్రభాషాజనని యాశీర్వచన పాత్రు లయిరనుట యత్యుక్తిగాదు. అతిశయోక్తిగాదు. శాస్త్రిగారి కవిత్వము గంగా ప్రవాహమువలె నడచుచు తుదివఱకు పాఠక హృదయములను తన వెంట గైకొని పోవుచున్నది. ముదిగొండ వీరేశలింగశాస్త్రి

---

బ్రహ్మశ్రీ దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రిగారు, ఆకాశవాణి, హైద్రాబాదు.

పెద్దగ్రంథాలు వ్రాయడానికిగాని చదవడానికిగాని ఇవి కానిరోజులు, లోకంలో మహావేగ మనేది ఒకటి వచ్చి పడింది, నిలకడా, శాంతి లేదు. మానవుని జీవితయాత్రకొక గమ్యస్థాన మున్నట్లు కనిపించదు. అట్టి గమ్యస్థానం లేనపుడు యాత్రామార్గం తీర్చి దిద్దుకోవడం కూడా ఉండదు. దారిబత్తెము కూడ బెట్టుకొనే అవసరమూ ఉండదుకదా. ఏనిముషాని కానిముషమే బ్రదుకడంతో సరిపోతూ ఉంటుంది ప్రజలలో ఆస్తిక్యబుద్ధి తగ్గిపోవడమే దీనికి మూలమేమో! ఏభాగవతమో రామాయణమో పుచ్చుకొని చదవడమంటే పాతపురాణం పోనిద్దూ అని పెదవి విరుస్తారు. అంతటిఓపిక లేదంటారు.

ఈ శివపురాణం శ్రీముదిగొండ నాగవీరయ్యశాస్త్రులవారు రచించినారు. వీరి సాహసము దీక్ష శివభక్తి సామాన్యమైనవికావు. పేరుకోసమో ప్రతిష్ఠకోసమో రచించినగ్రంథంగా కనిపించదిది. కవితనే బడాయి కనిపించదెక్కడా ఈగ్రంథములో. శివు డుద్బోధిస్తుంటే కవి ఏమిచేయఁగలడు? సద్భావముతో ఈకృతిచేశా డంటే, మరిన్నీ భాస్వరవిభవేష్టలింగగతభక్త్యతిమాత్రపవిత్ర

గాత్రుడును గురుజనపూజనోత్సుకుడును పవిత్రితలోకవరాజన్యఖ్యాత్యుడున్నూ ఈకవి. అంతేకాక వీరితండ్రిగారు "బాలకవనమ్మునఁబ్రేమముఁజెంది కావ్య మొండొకఁడుగ్రహింపనెంచె." మున్ను పోతన్న భాగవతంరచించి భగవంతునకంకితమిచ్చాడు. పింగళిసూరన్న పితృఋణము తీర్చ తండ్రికి కావ్య మంకితం చేసాడు. తల్లిదండ్రులకన్న ఇతరము పరములేదు. కనుక ఈసుకృతకృతిలో ఒక ఆశ్వాసము తండ్రికి మరొకటి తల్లికి సమర్పించాడు (చూ-49-50-51-52 పద్యములు) ఇటువంటి మహాపురాణాలు కథా ప్రధానాలు కావటంవల్ల అకథను ధారాళంగా ప్రసన్నంగా స్పష్టంగా చెప్పగలిగీ ఉండాలి. అంతేకాదు. ఆచెప్పే పద్ధతి మనోహరంగా కూడాఉండాలి. అనగా కథా గమనానికి అడ్డంవచ్చే దీర్ఘ వర్ణనాదులకొరకు ప్రాకులాడగూడదేమో అనిపిస్తుంది. ప్రతిపాద్య విషయం కంటె దాన్ని చెప్పేపద్ధతిమీదనే ఎక్కువగా మనమునిలిపేది కావ్యమార్గం. పురాణమార్గం అటువంటిదికాక ముఖ్యవిషయాన్ని సూటిగా మనస్సుకు హత్తజేస్తూ పోతుంది. ఈకవి ఈరహస్యాన్ని చక్కగా గమనించారని గ్రంథం అంతా సాక్ష్యమిస్తుంది. పార్వతీబాల్యక్రీడావర్ణనం ప్రభాతవర్ణనఘట్టాలలో కవి అవలంబించిన సంయమాన్ని పరిశీలించగలరు.

( శివపురాణము పార్వతీఖండము. ౧౩౬ పేజీ )

గీ॥ ప్రబలసింహంబులను గొంతుఁ • బట్టి లాగి
తెచ్చి యెక్కివనంబెల్లఁ • దిరుగుఁ గాలి
గున్న యేనుఁగుఁ గొనివచ్చి • కొమరుఁడనుచు
నెత్తికొని ముద్దిడును ప్రియం • బెసక మెసగ.

సీ॥ జనని నే నిఁక నాడు • సంతాన మీరని, పండ్లోగిరంబులు • పంచిపెట్టు
జగము లేలెడుదొర • సాని నే నీరలు. ప్రజలంచుఁ బరువొప్పఁ • బనులుసెప్పు
కామధేనువు నేను • గడమనురభు లీర, టంచుఁ గోర్కులను యో • జించితీర్చు
కల్పవల్లిని నేను • స్వల్పలతలు మీర, లని నిజౌన్నత్యంబు • పమరఁజూపు

గీ॥ గురుగు లమరించు బ్రహ్మాండ • గోళము లని
బొమ్మలనుగూర్చి హరిపద్మ • భువు లనుచును
బంతులాడును రవిహిమ • భాను లనుచు
శైలరాజకుమారి శై • శవము గూరి.

సీ॥ బాల విపంచికా • వాదనం బొనరించుఁ, బరమేష్ఠిరాణి సం • బరముఁజెంద
కాళి గాత్రమున రా • గముల నాలాపించు, నిందిర హృదయంబు • డిందుపడఁగ
లలిత నర్తనకౌశ • లంబుఁ జూపించు న, వ్విద్యాధరాంగనల్ • వెఱఁగుఁజెంద
శివ చిత్రములిఖించుఁ • జెలువుగా వలరాజు, రాణి ధైర్యంబు గ • రంబుసడల

తే-గీ॥ అనుపమానమనోజ్ఞగా • నంబు లల్లు
నల్లగురుకావ్య దేవులు • డిల్లవడఁగ

బరమకల్యాణి గిరివరే ♦ శ్వరకుమారి
లీల లేమని లెక్కింపఁ ♦ బోలు నెలమి.

(శివపురాణము పార్వతీఖండము. ౨౬౩ పేజీ)

క॥ ఉవ్విళ్ళూరుచుఁ బతికై, నెవ్వగఁబాసికొని సుఖము ♦ నెక్కొనుతఱి లేఁ
బువ్వుంబోంట్లకు వెగటుగఁ, జివ్వనఁ దెలనయ్యె దెసలు ♦ చెలువలరారన్.

క॥ బిగువైనమగలకౌఁగిళు, లఁగడున్ సొలపొందియున్న ♦ లలనలు నెట్లో
వగతో వదలిచికొని యి, మ్ముగఁ బడకగదులను బాసి ♦ పోయిరి వేగన్.

చ॥ అరుణమరీచి యంత నుద ♦ యాచలపీఠము నెక్కి సర్వత
స్స్ఫురదసమానమంజుకర ♦ పుంజములన్ వెలయించి యూర్ధ్వని
స్సరదమలాంశుజాలముల ♦ శైలవరోన్నతశృంగపల్లవాం
తరనళినాళిఁ గూడఁ బ్రిమ ♦ దమ్మునఁ బూయఁగఁజేసె వాసిగన్.

ఆ యీ వర్ణనల యందు నన్నయాదిపూర్వకవిమార్గాలను స్ఫురింపచేస్తూ ఉంటారు వీరు. (చూ—కొలకుల కేళికావనుల ఇత్యాది) ఈగ్రంథం శివపార మ్యాన్ని చెప్పేదికావడంవల్ల కవి ఆరాధ్య శైవుడు కావడంవల్ల శివమహి మాభివర్ణనాదులు చేసేఘట్టాల్లో ఈకవిరచన తన్మయత్వావస్థను పొంది పోత న్నను స్ఫురింప జేస్తూ ఉంటుంది. అంతేకాని సోమనాథుని ఆవేశంలో మాత్రం చేర దనేదికూడా గమనించ దగింది.

శివభక్తిప్రతిపాదనం ఒకయెత్తు అంతకంటె అధికమైనది మరొకటిఉంది. కథావశంచేత ప్రసక్తమయ్యేధర్మాలను నీతులను చెప్పవలసివచ్చినపుడు అవి కథా ప్రవాహంలో మునిగిపోకుండా వానిని పైకితేల్చి సూటిగా ఎత్తి చెప్ప వలసి ఉంటుంది. అవి కథలోనుంచి మొలుచుక వచ్చినవే అయినా కమలకోర కాలవలె చేతికందుతూ ఉండాలి. అట్టి పట్టులుకూడా ఈకవి బాగా సమర్థించా రనేది ఇచట ప్రశంసింప వలసిఉంది. ఆంధ్రమహాకవుల మార్గా లన్నీక్షుణ్ణంగా తెలిసినవాడు కావటంవల్ల ఈకవి పూర్వులఆంధ్రీకరణపద్ధతులను చక్కగా గ్రహించి తన ఆంధ్రీకరణం మక్కికి మక్కి కాకుండా లలితంగా నిర్వహిం చడం మెచ్చదగింది. ప్రతిపాద్యవిషయం శివభక్తి. కవి శివభక్తుఁడైన ఆరా ధ్యుఁడు కవిత్వము కథాగౌరవానికి తగినదీ కావడంవల్ల ఈగ్రంథం సర్వ విధాల గణనకెక్కుతుం దనేది నిర్వివాదం.

నాగవీరయ్యశాస్త్రిలవారు పిత్రౄణముక్తినీ శివానుగ్రహాన్నీ సంపాదించు కోవడమే కాక లోకానికి ఆస్తిక్యాన్ని కూడా ప్రసాదించి ధన్యత నార్జించు కొన్నారు.

దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి

శ్రీ శివభారతకర్త: కవిసమ్రాట్టు-బ్రహ్మశ్రీ గడియారము వెంకటశేషశాస్త్రిగారు, ప్రొద్దుటూరు.

## శ్రీ శివపురాణ మహాకృతి ప్రశంస

పూజ్యశ్రీ ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిలుగారి సన్నిధికి-

మహాశయా !

చ॥ జయము శుభమ్ము మీకగుత ! సంతతశాస్త్ర పురాణ సంహితా
ధ్యయన పరా! ప్రసన్న కవితావర ! శ్రీముదిగొండ నాగవీ
రయ విబుధోత్తమా ! శివపురాణముఁ దావకమున్ బఠించి వి
స్మయ కుతుకోర్మి ఖేలన వశంవదమై మది పల్లవించెడిన్ ॥ 1

క॥ ఒకచేత నింతగ్రంథము । సకల పురాణేతిహాస సారము, పురుషా
ర్థకలా కలాపపూరం । బకలంకము వ్రాయఁదరమె యన్యకవులకున్ ॥ 2

ఉ॥ వ్యాసుని ప్రౌఢసూక్తు లనువాదము సేయుట గొప్పః నైక వి
న్యాసములైనవాని నొక యాంధ్రమహాకృతిగాఁ గవిత్రయో
పాసిత రీతులన్ బొదుగు టబ్రము: మీకృతియో స్వతంత్ర శా
వ్యాసమశోభలన్ సహృదయ స్పృహణీ యరుచుల్ వెలార్చెడిన్ ॥ 3

ఉ॥ వేదములన్ బురాణముల విశ్రుతముల్ బహుధర్మకర్మ సం
వాదములెల్లఁ బల్కు, యలవాని పరస్పర తారతమ్య సా
మ్యాదుల వింగడించి, 'యిదియంతయు నీశ్వర భక్తియోగ సం
పాదితమై వెలుంగు' ననుపాకము మీకృతి మూఁదలించెడిన్ ॥ 4

క॥ శివదైవ మిట్టిదనుచున్, శివతత్త్వం బిట్టిదనుచు శివలీలా వై
భవ మింత దొడ్డదనుచున్, సవిశేషము పల్కునీదు సత్కృతి సుకృతీ ! 5

ఉ॥ కేవల ధర్మరూఢిఁ బలికించుట గాదిది, వాఙ్నిరూఢి శా
స్త్రివగతార్థ వాద మెవయన్ వివరించుటగాదు: శైవగా
థావలిలో సుధారసమునుండి కథా కథన ప్రసక్తి స్మో
దావహ కావ్యభాషఁ బురుషార్థములన్ వెలయించు-టంతయున్
సావయవాభిరామ మగునట్టు లొనర్చితివయ్య ! యీకృతిన్ ॥ 6

చ॥ సరళత నిండుగా వెలయు శయ్య, సమర్థ పదప్రయోగ చా
తురి, తతసంస్కృతాంధ్రములతో సరితూఁగిన కూర్పుతీర్పు, భా
సురనవభావ కల్పనలు సూటిగ వచ్చునఁ బోయఁ జాలు నే
ర్పరితన-మింతయున్ శివపురాణము నందభిరామమై తగున్ ॥ 7

శా॥ నానాదివ్య కథాఢ్యమౌ శివపురాణంబం దుమా శర్వ ము
ఖ్యానేకప్రణయానుబంధచరితోద్య న్నాయికా నాయక
స్థానీయుల్ గల: రర్హ శీల గుణవత్తన్ వారిఁ జిత్రించుచోఁ
దేనెల్ నింపితి వన్నిపాత్రలను భక్తిన్ రక్తి సారించుచున్ ॥ 8

ఉ॥ కావ్యముగాఁ బురాణకృతిగా నితిహాసముగాఁ బ్రబంధశా
స్త్రవ్యముగాఁ దదీయగుణసంపదలన్ వెలుఁగొంది, సాదర
శ్రావ్యతమించు మీశివపురాణమునన్ దనుపొంది, పద్య ర
త్నవ్యపదేశమైన యభినందన మిట్లొనరింతు సత్కవీ! ॥ 1-7-1959

బ్రహ్మశ్రీ దివాకర్ల వెంకటావధానిగారు ఎం. ఏ.
ఉస్మానియా యూనివర్సిటీ హైద్రాబాద్
(ఆంధ్ర పత్రికనుండి)

ఈ శివపురాణము సాహిత్యపరులకును శివపూజాపరాయణులకును ప్రామాణికమైన యుద్గ్రంథమై విలసిల్లుచున్నది. శ్రీ నాగవీరయ్యశాస్త్రిగారు సంస్కృతాంధ్రములందు మంచి పండితులు. ఆ యుభయసారస్వతములందు పూర్వ మహాకవిక్షుణ్ణములైన మార్గములలో బహువారములు పయనించి యందలి సమవిషమ సన్నివేశము లెఱింగినవారు. మతముచే వారు శైవు లందుచే శ్రీమద్భాగవతము పోతన మహాకవిచేతవలె ఈ శివపురాణము వీరి చేతఁబడి పలుతావులందు మెఱుఁగెక్కి వన్నెలు తీర్చుకొన్నది. కథలను నడుపుటయందును, సంభాషణములను సాగించుటయందును, వర్ణనములు కావించుటయందును వారు చాల కౌశలము ప్రదర్శించినారు. పోతన విష్ణుమహిమాభి వర్ణన ఘట్టములందువలే వీరిందు శివమహిమాభి వర్ణన సన్నివేశములందు తన్మయులై భగవదావేశమునొంది రచన సాగించిరి. రసపాత్రపోషణమునను నీతి ప్రవచనమునను వారి మార్గము ప్రశంసనీయమై యున్నది. కవిత్వము పూజామహాత్మ్యాదులు చెప్పు సందర్భమునగూడ ధారాశుద్ధి శోభితమై సహజగతిలో చెల్వారుచున్నది. రచన సర్వత్ర నిర్దుష్టమైయున్నది.

శ్రీ శాస్త్రిగారింత పెద్దగ్రంథమును రచించి ఆంధ్రులకును ఆంధ్రభాషకును చాలా మేలు కావించినారు,

21-6-1959 అవధాని.

---

బ్రహ్మశ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు, కాకినాడ.

సదాశయా!

ఉత్తమ శివభక్తులైన మీ శివపురాణరచన మత్యుత్తమముగ నిర్వహింపఁబడినది. శ్రీనాథుఁడు కాశీఖండమున కుబేరవృత్తాంతమునం దెలిపిన, "కీల్పరికించిన దేవతావలంబన రతిభావమై పరఁగుభావన కౌశల మీ ప్రకారమై" యనుసూక్తికి మీరచన సర్వథా తార్కాణము. ఈశ్వరార్చన కళాశీలుర కవితానిర్మాణము విలక్షణము. మీ కృతిని బఠింపుచు నెంతేని పరమానందము నందుచుంటిని. 28-6-59

ఉ॥ కావ్యముగాఁ బురాణకృతిగా నితిహాసముగాఁ బ్రబంధతా
స్తవ్యముగాఁ దదీయగుణసంపదలన్ వెలుఁగొంది, సాదర
శ్రావ్యతమించు మీశివపురాణమునన్ దనుపొంది, పద్య ర
త్నవ్యపదేశమైన యభినందన మిట్లొనరింతు సత్కవీ! ॥ 1-7-1959

బ్రహ్మశ్రీ దివాకర్ల వెంకటావధానిగారు ఎం. ఏ.
ఉస్మానియా యూనివర్సిటీ హైద్రాబాద్
(ఆంధ్ర పత్రికనుండి)

ఈ శివపురాణము సాహిత్యపరులకును శివపూజాపరాయణులకును ప్రామాణికమైన యుద్గ్రంథమై విలసిల్లుచున్నది. శ్రీ నాగవీరయ్యశాస్త్రిగారు సంస్కృతాంధ్రములందు మంచి పండితులు. ఆ యుభయసారస్వతములందు పూర్వ మహాకవిక్షుణ్ణములైన మార్గములలో బహువారములు వయనించి యందలి సమవిషమ సన్నివేశము లెఱింగినవారు. మతముచే వారు శైవు లందుచే శ్రీమద్భాగవతము పోతన మహాకవిచేతవలె ఈ శివపురాణము వీరి చేతఁబడి వలుతావులందు మెఱుగెక్కి వన్నెలు తీర్చుకొన్నది. కథలను నడు వుటయందును, సంభాషణములను సాగించుటయందును, వర్ణనములు కావిం చుటయందును వారు చాల కౌశలము ప్రదర్శించినారు. పోతన విష్ణుమహి మాభివర్ణన ఘట్టములందువలే వీరిందు శివమహిమాభివర్ణన సన్నివేశము లందు తన్మయులై భగవదావేశమునొంది రచన సాగించిరి. రసపోషణ మునను నీతి ప్రవచనమునను వారి మార్గము ప్రశంసనీయమై యున్నది. కవి త్వము పూజామహాత్మ్యాదులు చెప్పు సందర్భమునగూడ ధారాశుద్ధి శోభితమై సహజగతిలో చెల్వారుచున్నది. రచన సర్వత్ర నిర్దుష్టమైయున్నది.

శ్రీ శాస్త్రిగారింత పెద్దగ్రంథమును రచించి ఆంధ్రులకును ఆంధ్రభాషకును చాలా మేలు కావించినారు,

21-6-1959 అవధాని.

---

బ్రహ్మశ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు, కాకినాడ.

సదాశయా!

ఉత్తమ శివభక్తులైన మీ శివపురాణరచన మత్యుత్తమముగ నిర్వహింపఁ బడినది. శ్రీనాథుఁడు కాశీఖండమున కుబేరవృత్తాంతమునం దెలిపిన, "కీల్పరి కించిన దేవతావలంబన రతిభావమై పరఁగుభావన కౌశల మీ పరికారమై" యనుసూక్తికి మీరచన సర్వథా తార్కాణము. ఈశ్వరార్చన కళాశీలుర కవితానిర్మాణము విలక్షణము. మీ కృతిని బఠింపుచు నెంతేని పరమా నందము నందుచుంటిని. 28-6-59

మన్మథుడు ఇంద్రునితో మాటాడుతూ తన ప్రభావం ఇలా చెప్పుకుంటాడు.

"క్షణమాత్రంబున మహిళే
క్షణశృంఖలఁ గట్టివేసి గాసిరొనర్తుఁ
రణరంగరిపువిదారణ
చణమగుకులిశంబదేల స్వల్పంబునకై." (పార్వతీఖండం 2 ఆ. ప 88)

ముక్కంటికంటి మంటలలో మన్మథుఁడు దగ్ధమయ్యాక, రతి విలపిస్తూన్న ఘట్టంలో

"అకట మహేశ! నీకుఁ దగునాలును గూర్పఁగ నామనో విభుం
డకుటిలబుద్ధితో సుమచయంబును గుప్పిన యంత నీవిటుల్
వికట కృశానునేత్ర పరివృద్ధ కరాళతరార్చిఁ గాల్పఁ దా
వకహృదయంబునందుచిత భంగిని గన్పడెఁగా! పశుప్రభూ!
(పార్వతీఖండం 2 ఆ. 144 ప)

మిమ్ము నాలుమగల మెలకువతో కూర్ప
వేడ్కసేయనాడు విభుఁడు; నీవు
మమ్ము నాలుమగల మతివేఱు చేసితే
దయను బాసి కఠిన తరచరిత్ర! (పార్వతీఖండం 2 ఆ. ప. 145)

ఇది సంస్కృతంలోంచి అనువదించిన గ్రంథంలా కనిపించదు. సార్థకములైన సంబోధనలు సరళమైన పదబంధం, ధారాళమైన శైలి, పెనవేసుకొన్న స్వతంత్రరచన, అని అనడానికి కావ్య రసాస్వాదనలో నిండిన మనస్సు కలవారు ఎవరున్నూ సందేహించరు. అందుకే మొదటే అన్నాను నాగవీరేశ్వర కవిగారు పోతనామాత్యులవలె చరితార్థులయ్యారని.

ఈ మహాగ్రంథాన్ని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి శతావధానులుగారు ప్రత్యక్ష రశోధనగా చదివి పరిష్కరించారట. గురుపాదుల అనుగ్రహ భాగ్యాన్ని సంపూర్ణంగా పొందిన ఉత్తమ శిష్యులు కనక నాగవీరేశ్వర కవిగారు దాని ఫలాన్ని ఉత్తమ సిద్ధాంతరీత్యా పొందగలిగారు. ఈ పురాణ ప్రబంధంలో చివరదైన విద్యేశ్వరఖండం శైవమతానుయాయులకే కాక సముచితులైన వారికి అందఱికి అవశ్యం పఠనీయం. మధ్యమధ్య వచ్చే ఉపాఖ్యానాలలోకూడా కవిగారు కవితకేకాక వస్తువుకు కూడా తగినబలం ఇచ్చి ఉదాత్తంగా సంతరించడం సామాన్యకవికి అసాధ్యం అనిపించింది.

ఈ మహాగ్రంథం గొప్పతనం ప్రత్యేకంగా చెప్పవలసినవి రెండు విషయాలు ప్రత్యక్షదైవతములైన తలిదండ్రులకు అంకితం ఇవ్వటం. శ్రీవిభుఁడు అనే పద్యం నుండి చివరవఱకూ సమానంగా, మాననీయంగా, గ్రంథం అనువదించటం.

ఇట్లు
యామిజాల పద్మనాభస్వామి.

మన్మథుడు ఇంద్రునితో మాటాడుతూ తన ప్రభావం ఇలా చెప్పుకుంటాడు.

"క్షణమాత్రంబున మహిళే
క్షణశృంఖలఁ గట్టివేసి గాసిరొనర్తున్
రణరంగరిపువిదారణ
చణమగుకులిశంబదేల స్వల్పంబునకై." (పార్వతీఖండం 2 ఆ. ప 88)

ముక్కంటి కంటి మంటలలో మన్మథుఁడు దగ్ధమయాక, రతి విలపిస్తూన్న ఘట్టంలో

"అకట మహేశ! నీకుఁ దగునాలును గూర్పఁగ నామనో విభుం
డకుటిలబుద్ధితో సుమచయంబును గుప్పిన యంత నీవిటుల్
వికట కృశానునేత్ర పరివృద్ధ కరాళతరార్చిఁ గాల్పఁ దా
వకహృదయంబునందుచిత భంగిని గన్పడెఁగా ! పశుప్రభూ !
(పార్వతీఖండం 2 ఆ. 144 వ)

మిమ్ము నాలుమగల మెలకువతో కూర్ప
వేడ్కసేయనాదు విభుఁడు; నీవు
మమ్ము నాలుమగల మఱివేఱు చేసితే
దయను బాసి కఠిన తరచరిత్ర ! (పార్వతీఖండం 2 ఆ. ప. 145)

ఇది సంస్కృతంలోంచి అనువదించిన గ్రంథంలా కనిపించదు. సార్థకములైన సంబోధనలు సరళమైన పదబంధం, ధారాళమైన శైలి, పెన వేసుకొన్న స్వతంత్రరచన, అని అనడానికి కావ్య రసాస్వాదనలో నిండిన మనస్సు కలవారు ఎవరున్ను సందేహించరు. అందుకే మొదటే అన్నాను నాగవీరేశ్వర కవిగారు పోతనామాత్యులవలె చరితార్థులయారని.

ఈ మహాగ్రంథాన్ని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి శతావధానులుగారు ప్రత్యక్షరశోధనగా చదివి పరిష్కరించారట. గురుపాదుల అనుగ్రహ భాగ్యాన్ని సంపూర్ణంగా పొందిన ఉత్తమ శిష్యులు కనక నాగవీరేశ్వర కవిగారు దాని ఫలాన్ని ఉత్తమ సిద్ధాంతరీత్యా పొందగలిగారు. ఈ పురాణ ప్రబంధంలో చివరదైన విద్యేశ్వరఖండం శైవమతానుయాయులకే కాక సముచితులైన వారికి అందఱికి అవశ్యం పఠనీయం. మధ్యమధ్య వచ్చే ఉపాఖ్యానాలలోకూడా కవిగారు కవితకేకాక వస్తువుకు కూడా తగినబలం ఇచ్చి ఉదాత్తంగా సంతరించడం సామాన్యకవికి అసాధ్యం అనిపించింది.

ఈ మహాగ్రంథం గొప్పతనం ప్రత్యేకంగా చెప్పవలసినవి రెండు విషయాలు ప్రత్యక్షదైవతములైన తలిదండ్రులకు అంకితం ఇవ్వటం. శ్రీవిభుఁడు అనే పద్యం నుండి చివరవఱకూ సమానంగా, మాననీయంగా, గ్రంథం అనువదించటం.

ఇట్లు
యామిజాల పద్మనాభస్వామి.

ఉ॥ రంజనసేయగా శివపు। రాణము చక్కని తెన్గుబాసలో
మంజుల సత్కవిత్వమున । మక్కువతో రచియించి పాపపుం
భంజన మాచరించితివి । పండిత వర్యులు మెచ్చ బాపురే!
యంజలి జేతు నీప్రతిభ । కార్య సమాదరణీయ వైభవా!

చ॥ సరసములైన వాక్యముల । చక్కని శయ్యను గూర్చి భావసం
భరితములైన పద్యముల । బాగుగ వ్రాసి రసాలవాలమై
గరిమ వహింప సత్కథల । గ్రాలగ శైవపురాణరాజముం
విరచన జేసినావు పృథి । వీసుర మాన్యకవీంద్రచంద్రమా!

ఉ॥ సంచితపూర్వ పుణ్యఫల । శాలివిగావున నిట్టి యీశ్వరా
భ్యంచిత తత్వసంగతుల । నద్భుత రీతిని వ్రాసి భక్తులం
ముంచితి బత్తి సంద్రమున । మోదముతోడం దరించి తీవు గ
ర్వించెద మెల్ల శైవులము । విజ్ఞుని నిం గనువారమౌటచే ॥

ఉ॥ ఈశ్వరు బూజసల్పి పర । మేశ్వరు సత్కరుణార్ద్రదృష్టి సూ
రీశ్వరులెల్ల మెచ్చ రచి।యించితి శైవపురాణరాజముం
విశ్వజనుల్ నుతింప సుక।వీశ్వరులెల్ల గణింప నాగవీ
శేశ్వర శాస్త్రివర్య! వచి।యింతు నిజంబు నిజంబిదే సుమీ॥

ఉ॥ బమ్మెర పోతరాజ కవి । భాగవతంబును భక్తియుక్తుడై
కమ్మని పల్కులం బొదిగి । కౌతక మొప్ప రచించి నట్లు జి
త్తమ్మున భక్తిభావములు । తద్దయు బొంగగ నల్లె నేర్పుమై
సమ్మతి సజ్జనుల్ బొగడ । సల్పితి శైవపురాణరాజముం ॥

చ॥ అభినవ పోతనాఖ్యుడని । యందరు నిన్ను నుతింప భక్తిస
ద్విభవము జూపి యాంధ్రమున । దివ్యపురాణము వ్రాసి శూలి స
న్నిభుడితడంచు సజ్జనులు । నిత్యము నిన్ను గణించువట్లు ధీ
ప్రభలు వెలుంగ గ్రాలితివి । పండితవర్య! నిజంబిదే సుమీ ॥

ఉ॥ గట్టిగ దెల్పుచుంటి శితి । కంఠుని దెల్పు పురాణరాజి జూ
పట్టు పదింటి దివ్యరస । భావసమన్వితమై రహింప నీ
యట్టి కవీంద్రులే తగుదు । రయ్యదివ్రాయ దదుద్యమంబు జే
పట్టి రచింపుమయ్య! శివ । భక్తి రసామృత వృష్టిం దుష్టిగాం॥

శా॥ వీక్షం జేయ భవత్పురాణ మదిగం । భీరార్థ బోధామృత
త్ర్యక్షప్రాభవ తత్వబోధన క్రియా । దక్షంబునా నట్లు బ

త్యక్షంబొప్ప రచించినావు మధురా । హ్లాదోక్తి జాలంబుచే
ద్రాక్షాపాకమునై నటింప సుకవీ । ధన్యుండ వీవన్నిటన్ ॥ 9

ఉ॥ శైవమత ప్రచారమును । సల్పగజేయు ప్రచారమందు మే
ధావి! భవత్పురాణమది । తథ్యము మాకు సహాయ మయ్యె త
ద్భావ పంపరల్ జనుల । భావములందున నాటుచుంటివో
పావనధీప్రభావ! నిను । భావమునందున సంస్మరించుచున్॥ 10

సీ॥ పటిమ నన్నయవాక్య । పదరసామృతమాని, ప్రకటించు నీభావ । భాగ్యగరిమ
సోమయాజికవీంద్రు । సూక్తిమార్దవమొంది, నీమృదుభావంబు । నిలువబెట్టు
శంభుదాసుని వాక్య । సారంబుఁ జవిచూచి, భవదుక్తిసారంబు । వాసిఁదెలుప
భక్తపోతనకవి । భక్తివాహిని మున్గి, భవదీయ శివభక్తి । పటిమదెలుప

తే॥గీ॥ వసుధ శ్రీనాథ కవిరాజ వాక్య ఫణితి
కవితమై యొప్పి నీదగు ఘనత దెలుప
సరససత్కవి పండిత సమితియందు
తాండవంబాడు నీకవితా లతాంగి॥ 11

సీ॥ మొదట భారద్వాజ । మునివరుండేవంశ, మునకు మూలంబౌచు । ఘనతజెందె
మహితోద్భటారాధ్య । మహనీయుఁడేవంశ, జలధికి జంద్రుఁడై । వెలిగెమున్న
వీరభద్రారాధ్య। విఖ్యాత నాముఁడే,కులవార్ధి విధుఁడౌచు। వెలసెఁదొల్లి
శశిమౌళి భక్తుఁడై । శంకరారాధ్యుఁడే, వంశాబ్ధి సోముఁడై । వన్నెకెక్కె

తే॥ నాగలింగాది సత్య విజ్ఞాన ధనులు
జనన మొందిన ముదిగొండ జలధియందు
పుట్టినాఁడవు నీపూర్వ పుణ్యవశత
నాగవీరార్య! సత్యవిజ్ఞాన ధుర్య! 12

ఆ॥వె॥ నీకు శివుఁడుగూర్చు । నిత్య సౌభాగ్యంబు
కలిమి, బలిమి, తెల్వి । ఘనతరముగఁ
బెద్ద బ్రతుకు నిచ్చి । ప్రేమచూడ్కులఁబ్రోచు
హరుని రాణి నిన్ను । ననవరతము ॥ 13

# తృతీయ ముద్రణ విజ్ఞప్తి.



శ్రీపార్వతీపరమేశ్వరుల యకారణ కరుణా ప్రసాద భాగ్యంబునను, ఆంధ్ర పాఠక మహాశయుల సౌహార్ద్రాతిశయంబునను, శివపురాణ మిప్పటికి తృతీయ ముద్రితంబైనది. ఈ ముద్రణమందుఁ బూర్వముద్రిత గ్రంథంబులందు సంకుచితంబైన శ్రీపంచాక్షరీ దీక్షావిధానమును తదుపాసనాక్రమమైశద్యంబును, మంత్రార్థంబును, మఱొక పద్య శతంబునఁగూర్చి చేర్చితిని. మఱియు నందందుఁ బెక్కు పద్యంబుల నౌచితి ననుసరించి చేర్చితిని. ఇట్లు నా నేర్చినయట్లు సంతరించి ప్రకటించితిని. వ్రాయఁదగిన విషయంబులన్నియును, ఈ కృతిపై నొరులొనర్చిన ప్రశ్నంబులును, దదుత్తరంబులును నితఃపూర్వ ముద్రిత గ్రంథములందే ప్రచురించినాను. ఎల్లప్పుడును ఔచిత్యానౌచిత్యములయందు సహృదయాః ప్రమాణంబనియే నమ్ముచున్నాను.

ఈ తృతీయ ముద్రణారంభమునుండి వ్యాధి పరంపరతో నే నలయుచున్న కతమున బ్రూపులు సరిగఁ జూడకుండుట నచ్చుతప్పులు పెక్కులగుపడుచున్నవి. వాని గొంతవఱకు శుద్ధపత్రికలోఁ జేర్చితిని. మిగిలినవాని యథోచితముగ దిద్దికొని చదువుకొనుటకై చదువరులు ప్రార్థితులు.

ఇట్లు విధేయుఁడు

ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి





కృతికర్త
శ్రీముదిగొండ నాగవీరయ్యాశాస్త్రి

## నా యితర పుస్తకములు.

1. శివభక్తవిజయ కథావళి (వచనము)
ఇందు 55 శివభక్తుల కథలుండును.
శైలి సులభము. వెల రు: 6-50పై

2. శారదత్తవిజయము (పద్యకావ్యము) గొప్ప శైవా
చార్యుని విజయ చరిత్రము. ఆంధ్ర విశ్వ విద్యాలయ
మందు భాషాప్రవీణ పరీక్షకు 3 సంవత్సరములు
పాఠ్యమైనది. వెల రు. 2-00

3. సుభద్రాకల్యాణము (భారతనాటకము)
మద్రాస్ విశ్వవిద్యాలయమందు 3 సంవత్సరముల విద్వాన్
పరీక్షకును, ఉస్మానియా విశ్వవిద్యాలయమందు
3 సంవత్సరములు బి. ఓ. యల్. పరీక్షకును
పాఠ్యమైనది. వెల రు. 1-50 పై.

4. అభినవరామాయణము (పద్యకావ్యము) శివపురా
ణాంతర్గతము, సులభముగ రామాయణమంతయు
జదువుకొనవచ్చును. వెల రు. 1-00

5. భ్రామరీ ద్విశతి (పద్యములు) శ్రీశైల భ్రమరాంబా
వైభవము. వెల 75 న.పై

అన్నిటికి పోస్టేజీ వేరుగ నుండును.

విలాసము:-

ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి
నెం. 43 మారెడుపల్లి
సికిందాబాదు - ఆం. ప్ర.

# తప్పొప్పులు

| పేజీ | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 26 (పీఠికలో) | 27 | దేకము | రేకము |
| 29 | 19 | సామంలు | సామంబు |
| 39 | 3 | వారనెల్ల | వారలెల్ల |
| 116 | చివఱ | కరబు | కరంబు |
| 157 | 5 | ఉగ్రి | ఉగ్రి |
| 166 | 14 | మోాము | మోమొ |
| 169 | 5 | బడెనాడు | బడె నాడు |
| 224 | 4 | నిర్ధరిణి | నిర్ఝరిణి |
| 284 | 23 | తకు్కంభిని | వకు్కంభిని |
| 316 | 18 | నందంపు | యందంపు |
| 316 | 26 | అనుమీా | అనుమా |
| 328 | 30 | దరమిడికూల్చు | దఱిమివధించు |
| 331 | 16 | రుషుండై | రుష్టుండై |
| 393 | 24 | భగవాన్ | భగవన్ |
| 393 | 26 | బాణస | బాణస్య |
| 410 | 10 | హారునిగగ | హారునిగని |
| 424 | 1 | సిద్ధి | సిద్ధ |
| 441 | 21 | తుమ్రండ | తుండ |
| 459 | 27 | గోటిపిల్లి | గోటిపల్లి |
| 460 | 15 | ళుభావ | శుభావ |
| 498 | 23 | అదేవి | ఆదేవి |
| 504 | 25 | మ | శా |
| 522 | 26 | నికరబంత | నికరంబంత |
| 551 | 11 | ణంబుల | ణముల |
| 592 | 16 | వృషు | వృష్టు |
| 647 | 8 | నామదేవు | వామదేవు |
| 683 | 28 | హైతు | హేతు |
| 712 | 11 | శ్రీయాద్రి | శ్రీమోాద్రి |
| 713 | 21 | యెఱుంగ | యెఱుంగు |
| 715 | 24 | భయ | యభ |
| 719 | 18 | వలయున | వలయునని |
| 720 | 17 | జుంబు | ణంబు |
| 727 | 23 | ్రుద | రుద్ర |
| 732 | 8 | "యతే | "యాతే |
| 735 | 21 | బాణి | బాణ |

సవరణలు

3 16 పాృధు భదుృ

38 18 కందపద్యములోని 3-4 పాదములు దొలగించి ఈ క్రింది క్రొత్త పాదములు జదువవలెను.

(స) శివ! నీకైంకర్యంబును
శివ! నీకారుణ్యమిమ్ము చేమోడ్పులివే

388 7 నరయకయ య్మాన్య (స) నరయక యన్యుని నమ్మాన్య

460 6 కాంతమూర్తి(స) కరుణదనర

468 24 సుమారుగం గొంచెము దూరమున్న (స)
సుమాళము చేరువలోననున్న

699 24 వ బంతినుండి, ఈ క్రొత్త పద్యమును జేర్చి చదువవలెను.

క॥ తిమిరఘ్నునకును మఱియును, హిమఘ్నున కరిఘ్నునకు మహేశునకు నఘో।
ద్యమలోలఘ్నునకుం బ్రణామములు కృతఘ్నఘ్నునకు నమరమాన్యునకున్॥

—*—
*

# విషయసూచిక

## పార్వతీఖండము-ప్రథమాశ్వాసము

## ద్వితీయాశ్వాసము



## తృతీయాశ్వాసము

## పంచమాశ్వాసము



## కుమారఖండము - ప్రథమాశ్వాసము

పేజీ



## ద్వితీయాశ్వాసము



## తృతీయాశ్వాసము

## యుద్ధ ఖండము

### ప్రథమాశ్వాసము

## ఉమాఖండము-ఆ ౧





## ఉమాఖండము-ఆ. ౨

## కైలాసఖండము—ఆ ౧



పేజీ

## వాయవీయఖండము—ఆ ౧

## వాయవీయఖండము - ఆ. ౨.



## విద్యేశ్వరఖండము.



కృతిపతులు

బ్రి॥ శ్రీ॥ ముదిగొండ వీరభద్రారాధ్యులు

వారి ధర్మపత్ని శ్రీ లక్ష్మిదేవమ్మగారు



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## సృష్టిఖండము.

### ప్రథమాశ్వాసము.



విభుఁ డాత్మనేత్రసర ♦ సీరుహపూజ నొనర్చి యేమహా
దేవుని సుప్రసాదనియ ♦ తిన్ గొనె సర్వసుపర్వచక్రర
క్షావహమైనచక్రము సు ♦ ధాంశుఁ డిఁ కెవ్వనిఁ జెంది దక్షశా
పావధినొందె నట్టి సద ♦ యాత్ము శివున్ బరమాత్ముఁ గొల్చెదన్.

చ॥ పెనిమిటిపెందొడన్ జనవు ♦ పెంపునఁ జక్కఁగ నెక్కి యక్కనన్
దనయు గణేశు నెత్తికొని ♦ తావలచేతఁ గుమారు నెమ్మొగం
బును దయమీఱఁ బుణ్కుచు న ♦ మోనమయంచు వచించుమాధవా
ద్యనిమిషనాథశేఖరుల ♦ నాదటఁ బ్రోచునుమన్ భజించెదన్. 2

క॥ సకలామరసముదయమునఁ, బ్రకటితముగఁ దొల్తపూజఁ ♦ బడసి ప్రమథనా
యకుఁడై కడు మాతాపిత, లకు మురుపిడుదంతిముఖుఁ ద♦లఁతు మదిఁ బ్రణతిన్. 3

ఉ॥ రుద్రమహోగ్రరోషమయ ♦ రూపముఁ జేకొని దక్షుమూర్ధమున్
రౌద్రతరార్భటిన్ దునిమి ♦ రాక్షసమర్దనముఖ్యులన్ భయో
న్నిద్రులఁ జేసి భర్తలను ♦ నిత్యము సాఁకెడు భద్రకాళికా
భద్రుఁడు వీరభద్రుఁడు శు ♦ భంబిడుఁగావుత మాకు నిచ్చలున్. 4

ఉ॥ అందముచిందునిందుకల ♦ నందికఁ జెందిన యాఱుమోములన్
బొందుగ దారలిర్వుర క ♦ పూర్వముదం బొనరించుచున్ రహిన్
గందువలాడుచున్ శిఖిని ♦ గాతుక మొప్పఁగ నెక్కి భక్తరా
జిం దయ సాఁకు వేలుపవ ♦ జీరు మహారాజు మదిన్ నుతించెదన్. 5

చ॥ ఘనుఁడు శిలాదమౌనివరు ♦ గాదిలినందనుఁ డీశ్వరాంశసం
జనితుఁ డనన్యసాధ్యనియ ♦ మస్ఫురదుగ్రతపోభిరామపా
వనఘృణిభాసమానుఁడును ♦ పాశుపతాగ్రణియైన నందికే
శుని గణవర్య మౌనికుల ♦ సోముని నామనమందుఁ గొల్చెదన్. 6

క॥ ఆదివృషభమును జగముల, నేదఁగఁ బరమేశకరుణ ♦ నేర్పడిన చతు
ష్పాదవరంబును ధర్మా, పాదకమును గొలుతు శివుని ♦ వారువము నెసఁగన్. 7

సీ॥ మధురసౌరభచారు ♦ మకరందబంధుర, శోణాబ్జ మొకకేల ♦ సొంపుచిలుక
లలితరాగాయతా ♦ లాపశోభితహేమ, వల్లకి యొకచేత ♦ వన్నెదొలుక
రసవస్త్వలంకార ♦ రమ్యభావోదార, పుస్తక మొకకేలఁ ♦ బొంకమొలుక
భర్తృపావననామ ♦ పరమజపోజ్జ్వల, మణిమాల యొకచేత ♦ మానుగులుక
గీ॥ సురభిసౌవర్ణపుష్కరాం ♦ తరమనోజ్ఞ, కర్ణికాసీనధాత్రము ♦ ఖమున నమరు
వాణి నిర్జితశుకపిక ♦ వాణి వాణి, గరిమనొసఁగ భజింతుఁ జొ♦క్కమగుభక్తి. 8

సీ॥ షట్కాలశివలింగ ♦ సమయసమర్చాభి, రాము శ్రీవేమనా ♦ రాధ్యగురుని
నిగమాగమార్ణవ ♦ నిష్ణాతుఁబావన, భావుని వీరమ ♦ ల్లావధాని
శబ్దవిద్యాపార ♦ చతురుఁ జిత్రాపూరి, వంశ్యు సీతారామ ♦ పండితేంద్రు
శతవధానమనీషి ♦ చంద్రులఁ గిజ్కవి, గజకేసరుల శత ♦ గ్రంథకవుల
గీ॥ మఱియు నేమానిరాజయ్య ♦ మంత్రశాస్త్ర,వక్తమున్నగునాచార్య♦వరులనాదు
చిత్తమున మేలిభక్తి న♦ర్చించి యుంచి,తోక్తులనొకండు కృతిసేయ♦నూహచేసి.

ఉ॥ శైవపురాణమెందును బ్ర ♦ శస్తము శర్వకథాసుధాభిధా
రావహసర్వభాగవిభ ♦ వాస్పదధామము భూరివిస్ఫుర
ద్భావరసాభిరంజకము ♦ పాఠకకోటికిఁ బూరుషార్థల
క్ష్మీవిలసన్నివాసమని ♦ చిత్తమునం దిగురొత్తువేడ్కతోన్. 10

చ॥ తెనుఁగొనరింపఁబూనితి సు ♦ ధీప్రవరుల్ మదిఁబొంగ భారతీ
కనదురురత్నసంకలిత ♦ కాంచనకాంచికలాపకింకిణీ
ఘనతరనిస్వనం బెసఁగఁ ♦ గా వికసల్లలితారవిందసం
జనితనితాంతసౌరభల ♦ సన్మధురోక్తుల రక్తు లేర్పడన్. 11

## —* కవిస్తుతి *—

గీ॥ ఘనుల వల్మీకభూ వ్యాస ♦ కాళిదాస, భాస భారవి భవభూతి ♦ బాణ భట్టి
మాఘ శ్రీహర్ష బిల్హణ♦ మల్హణాది, సంస్కృతకవీంద్రపదసార♦సముల కెఱఁగి.
వ. ఆంధ్రకవులందు

ఉ॥ అంచితభక్తిఁగొల్తు విబు ♦ ధావళి కున్నతవైభవంబునన్
బ్రోంచదమేయహర్షజన ♦ కాక్షరచారుపదప్రదాతలా
కాంచనగర్భ విష్ణు శశి ♦ ఖండకిరీటులఁ బోటిసేయుచున్
మించిననన్నయాదికవి ♦ నేతల భారతధాతలన్ మదిన్. 13

క॥ భీమకవివరుని నాచన, సోముని శ్రీనాథబుధుని ♦ సూరన్నను బ్రి
జ్ఞామాన్యుఁబెద్దనార్యు ను, ధీమహితుని ధూర్జటిని ను ♦ తింతు స్తుతమతిన్. 14

వ॥ శివకవులందు

క॥ హరలీలాకరు నుద్భట, గురు శివదివ్యావతారుఁ ♦ గొలఁచెద మదిలో
హరువు మెయి మల్లికార్జున, వరపండిత దేశికేంద్రుఁ ♦ బాల్కురికి కవిన్. 15

సీ॥ అలకుమారాభ్యుద ♦ యమురచించిన శివ, లంకమృత్యుంజయ ♦ లలితరచను
దేవిభాగవతాది ♦ దివ్యప్రబంధముల్, వ్రాసిన ముల్గుపా ♦ పయకవీంద్రు
చెన్నబసవని చె ♦ న్నెన్ను కబ్బమునుగూ, ర్చినయట్టి యత్తలూ ♦ రికవిధీరు
హాలాస్య ఖండంబు ♦ నావటించినమల్ల, మపలి బుచ్చనకవిన్ ♦ మహితగవిని

తే॥ ధర్మగుప్తాభ్యుదయకావ్య ♦ ధననిధాను, కాశినాథాన్వవాయు వీ ♦ రేశబుధుని
ద్వాదశారాధ్య గురుచరి ♦ త్రంబుపేర, భాగవతములిఖించిన ♦ ప్రౌఢుఁగొలుతు.

శా॥ ఎందెందేనియు భ్రాంతిహేతుకముగా ♦ నేదేన్ దోసంగుండుటో
ప్పం దద్జ్ఞేంద్రులకేని యంతనెయెటుల్ ♦ పోనోపు సర్వంకషా
స్పందప్రోద్ధతభారతీరుచిరశుం ♦ భద్గుంభసంరంభముల్
మందుల్ దీనినెఱుంగఁజాల రది క్షే ♦ మంబౌను మాకెంతయున్. 17

శా॥ శ్రీనాథాది మహాకవీశ్వరులు ని ♦ స్సీమోల్లసద్వాగధీ
శానీదత్తవరప్రసాదకవితా ♦ సామ్రాజ్యధౌరంధరీ
శ్రీనాథుల్ మును నీపురాణమును నాం ♦ ధ్రిన్ గూర్ప నూహింపర
ద్దానన్ నాయది భాగధేయమనిచే ♦ తంబందు భావించితిన్. 18

క॥ అద్యతనులలోఁ గొందఱు, విద్యాపారీణులగు సత్క ♦ వివరులు దీనిన్
హృద్యముగాఁ దెనిగింపఁగ, నుద్యోగించియును దిరుగ ♦ నుడిగిరి పూన్కిన్. 19

ఉ॥ డొంకలఁజేరి పోకడ క ♦ డున్ గడుసుందనమొప్పఁ జూపుచే
బింకమె? మాఱుమూలలఁ బ్రి ♦ వేశమొనర్పక పల్కుమాధురిన్
బొంకముదప్పనీక రస ♦ మున్ దనరింపఁగఁ జాలు మేలిని
శ్శంకపథంబు నే కృతికొ ♦ సంగెద సత్కవిరాజు లౌనన్. 20

చ॥ తిరుపతి వేంకటేశకవి ♦ ధీరులు కావ్యములందు భారత
స్ఫురితపథానురోధగతి ♦ సొంపులు నింపిరి నేనునట్లె యా
దరమెసఁగంగ వారిసువి ♦ ధానపుథంగి నెఱింగి కబ్బమున్
బరఁగ రచింతు దీనిపరి ♦ పాకము లోకమెఱుంగు గావుతన్. 21

చ॥ ఘనుఁడు శిలాదమౌనివరు ♦ గాదిలినందనుఁ డీశ్వరాంశసం
జనితుఁ డనన్యసాధ్యనియ ♦ మస్ఫురదుగ్రతపోభిరామపా
వనఘృణిభాసమానుఁడును ♦ పాశుపతాగ్రణియైన నందికే
శుని గణవర్యు మౌనికుల ♦ సోముని నామనమందుఁ గొల్చెదన్. 6

క॥ ఆదివృషభమును జగముల, నేదఁగఁ బరమేశకరుణ ♦ నేర్పడిన చతు
ష్పాదవరంబును ధర్మా, పాదకమును గొలుతు శివుని ♦ వారువము నెసఁగ. 7

సీ॥ మధురసౌరభచారు ♦ మకరందబంధుర, శోణాబ్జ మొకకేల ♦ సొంపుచిలుక
లలితరాగాయతా ♦ లాపశోభితహేమ, వల్లకి యొకచేత ♦ వన్నెదొలుక
రసవస్త్వలంకార ♦ రమ్యభావోదార, పుస్తక మొకకేలఁ ♦ బొంకమొలుక
భర్తృపావననామ ♦ పరమజపోజ్జ్వల, మణిమాల యొకచేత ♦ మానుగులుక

గీ॥ సురభిసౌవర్ణపుష్కరాం ♦ తరమనోజ్ఞ, కర్ణికాసీనధాత్రము ♦ ఖమున నమరు
వాణి నిర్జితశుకపిక ♦ వాణి వాణి, గరిమనొసఁగ భజింతుఁ జొ♦క్కముగుభక్తి. 8

సీ॥ షట్కాలశివలింగ ♦ సమయసమర్చాభి, రాము శ్రీవేమనా ♦ రాధ్యగురుని
నిగమాగమార్ణవ ♦ నిష్ణాతుఁ బావన, భావుని వీరమ ♦ ల్లావధాని
శబ్దవిద్యాపార ♦ చతురుఁ జిత్రాపూరి, వంశ్యు సీతారామ ♦ పండితేంద్రు
శతవధానమనీషి ♦ చంద్రిలఁ గిఱ్ఱవి, గజకేసరుల శత ♦ గ్రంథకవుల

గీ॥ మఱియు నేమానిరాజయఁ ♦ మంత్రశాస్త్ర, వక్తమున్న గునాచార్య♦వరులనాదు
చిత్తమున మేలిభక్తి న♦ర్చించి యుంచి, తోక్తులనొకండు కృతిసేయ♦నూహచేసి.

ఉ॥ శైవపురాణమెందును బ్ర ♦ శస్తము శర్వకథాసుధాభిధా
రావహసర్వభాగవిభ ♦ వాస్పదధామము భూరివిస్ఫుర
ద్భావరసాభిరంజకము ♦ పాఠకకోటికిఁ బూరుషార్థల
క్ష్మీవిలసన్నివాసమని ♦ చిత్తమునం దిగురొత్తు వేడ్కతోఁ. 10

చ॥ తెనుఁగొనరింపఁబూనితి సు ♦ ధీప్రవరుల్ మదిఁబొంగ భారతీ
కనదురురత్నసంకలిత ♦ కాంచనకాంచికలాపకింకిణీ
ఘనతరనిస్వనం బెసఁగఁ ♦ గా వికసల్లలితారవిందసం
జనితనితాంతసౌరభల ♦ సన్మధురోక్తుల రక్తు లేర్పడన్. 11

## —* కవిస్తుతి *—

గీ॥ ఘనుల వల్మీకభూ వ్యాస ♦ కాళిదాస, భాస భారవి భవభూతి ♦ బాణ భట్టి
మాఘ శ్రీహర్ష బిల్హణ♦ మల్హణాది, సంస్కృతకవీంద్రపదసార♦సముల కెఱఁగి.

వ. ఆంధ్రకవులందు

చ॥ *అలికమునన్ గృశానుదృశ ♦ నందనిశంకరుఁ డాఱుమోములన్
వెలయనిశక్తిహస్తుఁడు ప ♦ విత్రతపంబును గోలుపోనికా
శలుఁడలగాధినందనుఁడు ♦ శాంభవభాష్యవిరాజి నాదుజో
తలఁగొను శైవపండితవి ♦ ధాతృఁడు శ్రీపతిపండితుం డిటన్. 28

గీ॥ శంకరాచార్యమూర్ధన్యు ♦ సర్వనైగ, మార్థబోధు విద్యారణ్యు ♦ నఖిలగణ్యు
వరమపాశుపతాగ్రియ ♦ పట్టభద్రు, నప్పయాహ్వాయదీక్షితు ♦ నభినుతింతు. 29

గీ॥ ఘనభవకరాళపంకలం ♦ ఘనపటిష్ఠు, బ్రహ్మవిద్యాప్రబోధన ♦ ప్రౌఢుఁ బావ
నమతిఁగల్యాణపూర్వానా♦నందయతిని, వేమఱునుతింతు నాదుహృ♦ద్వేశ్మమందు.

క॥ ఆయుర్వేదకళానిధి, యై యనురాగమున నన్ను ♦ నావిద్యను బ్రి
జ్ఞాయుతుఁ జేసిన నపరా, త్రేయు ములుగు రామలింగ ♦ దేశికుఁ గొలుతున్. 31

చ॥ శివపురవంశసింధుభవ ♦ శీతలరశ్మి శిరీషపుష్పపే
లవహృదయుం డలంకృతిక ♦ లాలలితుండును నాకు నెయ్యుఁడున్
శివుని భజింపఁ దత్పదముఁ ♦ జెందినయట్టిఁడు నైనమల్లయా
ఖ్యవిబుధవర్యు నెంచెద మ ♦ దాత్మమునందుఁ దగాత్మ మెచ్చుచున్. 32

గీ॥ మఱియు నామామ ధైర్యర♦మామహితుఁడు, శివపురాన్వయపాథోధి♦శీతభానుఁ
డాఢ్యుఁడుశివార్చనాపర♦మాంతరంగుఁ,డట్టిదుర్గాహ్వాయునిమది♦యందుగొలుతు.

గీ॥ ఘనుఁడు భోగేశ్వరాదిస ♦ త్కావ్యసవిత, మల్లమపలికులాబ్ధిహి♦మకరమూర్తి
మల్లికార్జునశాస్త్రిమా♦మకకవిత్వ, మండనావహుఁ డాత్మస♦మర్చ్యుఁ డెపుడు. 34

వ. మఱియును

గీ॥ తరాములూర్యన్వయసుధాబ్ధి♦సోముఁడిభ్య, సభ్యచరితుండు శాబ్దిక♦చంద్రుఁడస్మ
దీయకృతిరత్నమున్ సానఁ♦దీర్చె నట్టి, దిట్ట శివరామకృష్ణశా♦స్త్రిని నుతింతు.

క॥ ఇఁక నెందఱోమనీషులు, ప్రకటితకవితాకళావి ♦ రాజితు లీమా
మకకృతికి వన్నెఁ గూర్చిరి, యకలంకమతిన్ నుతింతు ♦ నవ్వారిసిరిన్. 36

వ. ప్రాచీనాచారంబుకతన నస్మదీయవంశచరిత్రంబు నొక్కించుక ముచ్చటించెద.

## —* వంశానుక్రమణిక *—

క॥ ధరణిన్ బ్రాహ్మణశాఖల, హరువగు నారాధ్యశాఖ ♦ యలరునొకం డం
దిరవగు మావంశము భా, సురభారద్వాజగోత్ర ♦ శోభితమగుచున్. 38

క॥ యాజుషశాఖాధ్యయన, భ్రాజితమై యిష్టలింగ ♦ భాస్వత్తరపూ
జాజాగరూకమై కడు, రాజిలు ననవరత మార్య ♦ రాజిస్తుతమై. 39

వ. అందు

* 28 శ్రీపతి పండితారాధ్యులు : పూజ్యపాదులగు వీరుగూడ వైయాసిక సూత్రములకు శ్రీకర భాష్యంబను పేరితో సవిశేష శివాద్వైత భాష్యంబును రచించిరి.

శా॥ శ్రీకాశీశ్వరలింగదివ్యకరుణా ♦ శ్రీభాగ్యజాతుండు లో
కైకఖ్యాతమహాతపోనియతవీ ♦ వ్యద్భవ్యతేజుండు వీ
ఝాకౌశల్యనిరస్తకల్యధికప ♦ జ్కస్తోముఁ డొప్పెం దెఁ జం
ద్రాకల్పోపముఁ డుద్భటార్యగురుమా ♦ ర్తాండుం డిలామండలిన్. 40

సీ॥ ఏ గురుండుండె ఖం ♦ డేందుమౌళీష్టని, వాసమా ముదిగొండ ♦ పట్టణమున
ఏ సుధీశ్వరుఁడొందె ♦ హిమగిరిజాభయా, సౌభాగ్యసుందరీ ♦ సాధ్వీపాణి
ఏ దేశికాగ్రణి ♦ యిచ్చె భోజాదిరా, జాధిరాజుల కిల ♦ నభవదీక్ష
ఏ మహాత్ముఁడు వాపె ♦ నీశశాపంబు భూ, తంబులై యున్న గం ♦ ధర్వతతికి
గీ॥ అట్టి నిరపాయగేయ వి ♦ ఖ్యాతపూత, వికచకమలవనామోద ♦ నికరసార
కీర్తిపూర్తివిరాజితా ♦ ఖిలదిగంత, రాళమండలుఁ డారాధ్య ♦ రాజమౌళి. 41

సీ॥ భంజించె బౌద్ధాది ♦ పాషండమతములఁ, బ్రతివాదు లెల్ల న ♦ బ్రంబుఁ జెంద
రంజించె భారతీ ♦ రమణమతంబు శాం, భవు లెల్ల మేటిసం ♦ బరముఁ జెంద
విరచించె హారలీల ♦ వెలయ నలంకార, సంగ్రహకావ్యంబుఁ ♦ జతురులలర
నార్జించె నిష్టలిం ♦ గార్చనా ఘనయోగ, లబ్ధనిర్వాణక ♦ ల్యాణలక్ష్మి
గీ॥ భక్తులుప్పొంగఁ గరతల ♦ భ్రాజమాన, శాంభవప్రాణలింగాను ♦ సంగతాత్ముఁ
డై యనశ్వర గౌరీశ్వ ♦ రాధివాస, భాసురంబగు కైలాస ♦ పదముఁ జెందె. 42

గీ॥ అట్టియారాధ్యమకుటుని ♦ యన్వయమునఁ, బుట్టి చెలువొందిరనఘులు ♦ భూరియశులు
చంద్రశేఖర దేశిక ♦ చంద్రముఖ్యు, లవనిఁ బలువురు కలిదోష ♦ హరణచణులు. 43

వ. ఉద్భటగురుండు మొదలుచేసి వీరందఱు పెక్కుతరంబులవఱకు ముదిగొండ యందుఁ గాపురముండుట ముదిగొండవా రనం బరంగిరి. 44

క॥ మును రామలింగసత్కవి, జనమాన్యుం డుద్భటార్య ♦ చరితవిరచనం
బొనరించి వీరివంగడ, మన నెట్టిదొ యెఱుఁగఁ జేసె ♦ నందఱు మెచ్చన్. 45

వ. పదంపడి వీరివంశ్యు లతిశయాభివృద్ధిన్ జెంది వేఱువేఱు గ్రామంబులందు వసించి పెక్కుతరంబులు గడచుట నన్యోన్యజ్ఞాతిధర్మంబుఁ బాసి పెక్కు తెగలవారైరి. అవ్వానిలో సుప్రసిద్ధు లనేకులు పొడమి పేరుఁ బెంపున్ గాంచినవార లందుఁ గొందఱి నిందుఁ జేర్కొందు. 46

సీ॥ చిన్మయదీక్షాది ♦ శివమతగ్రంథక, ల్పకశాఖి శ్రీవీర ♦ భద్రగురుఁడు
షడ్దర్శనాగమ ♦ శౌండుండు కేదార, లింగపండితరాజ ♦ పుంగవుండు
నందిగామన్ వేద ♦ నయనముల్ వీరభ, ద్రావధానియును లిం ♦ గావధాని
కొండవీడున నున్న ♦ కుసుమకోమలకావ్య, కమనీయవీరభ ♦ గవతధాత
గీ॥ పాణినీయాగమాంత వి ♦ భాసితోరు, బాదరాయణఘనకలా ♦ భరితమహిత
పాండితీస్ఫూర్తి రచితశై ♦ వప్రబంధ. రంగదురుకీర్తి శ్రీనాగ ♦ లింగశాస్త్రి. 47

శా॥ శ్రీకాశీశ్వరలింగదివ్యకరుణా ♦ శ్రీభాగ్యజాతుండు లో
కైకఖ్యాతమహాతపోనియతదీ ♦ వ్యద్భవ్యతేజుండు వీ
క్షాకౌశల్యనిరస్తకల్యధికప ♦ ఙ్క్తిస్తోముఁ డొప్పెందెఁ జం
ద్రాకల్పోపముఁ డుద్భటార్యగురుమా ♦ ర్తాండుం డిలామండలిన్. 40

సీ॥ ఏ గురుండుండె ఖం ♦ డేందుమౌళీష్టని, వాసమౌ ముదిగొండ ♦ పట్టణమున
ఏ సుధీశ్వరుఁడొందె ♦ హిమగిరిజాభయౌ, సౌభాగ్యసుందరీ ♦ సాధ్విపాణి
ఏ దేశికాగ్రణి ♦ యిచ్చె భోజాదిరా, జాధిరాజుల కిల ♦ నభవదీక్ష
ఏ మహాత్ముఁడు వాపె ♦ నీశశాపంబు భూ, తంబులై యున్న గం♦ధర్వతతికి
గీ॥ అట్టి నిరపాయగేయ వి ♦ ఖ్యాతపూత, వికచకమలవనామోద ♦ నికరసార
కీర్తిపూర్తివిరాజితా ♦ ఖిలదిగంత, రాళమండలుఁ డారాధ్య ♦ రాజమౌళి. 41

సీ॥ భంజించె బౌద్ధాది ♦ పాషండమతములఁ, బ్రతివాదులెల్లన ♦ బ్రంబుఁ జెంద
రంజించె బార్వతీ ♦ రమణమతంబు శాం, భవులెల్ల మేటిసం ♦ బరముఁ జెంద
విరచించె హారలీల ♦ వెలయనలంకార, సంగ్రహకావ్యంబుఁ ♦ జతురులలర
నార్జించె నిష్టలిం ♦ గార్చనా ఘనయోగ, లబ్ధనిర్వాణక ♦ ల్యాణలక్ష్మి
గీ॥ భక్తులుప్పొంగఁ గరతల♦భ్రాజమాన, శాంభవప్రాణలింగాను ♦ సంగతాత్ముఁ
డై యనశ్వర గౌరీశ్వ ♦ రాధివాస, భాసురంబగు కైలాస ♦ పదముఁ జెందె. 42

గీ॥ అట్టియారాధ్యమకుటుని♦యన్వయమునఁ, బుట్టి చెలువొందిరనఘులు♦భూరియశులు
చంద్రశేఖర దేశిక ♦ చంద్రముఖ్యు, లవనిఁబలువురు కలిదోష♦హారణచణులు .43

వ. ఉద్భటగురుండు మొదలుచేసి వీరందఱు పెక్కుతరంబులవఱకు ముదిగొండయందుఁ గాపురముండుట ముదిగొండవారనం బరంగిరి. 44

క॥ మును రామలింగసత్కవి, జనమాన్యుం డుద్భటార్య ♦ చరితవిరచనం
బొనరించి వీరివంగడ, మన నెట్టిదో యెఱుఁగఁ జేసె ♦ నందఱు మెచ్చన్. 45

వ. పదంపడి వీరివంశ్యు లతిశయాభివృద్ధిన్ జెంది వేఱువేఱు గ్రామంబులందు వసించి పెక్కుతరంబులు గడచుట నన్యోన్యజ్ఞాతిధర్మంబుఁ బాసి పెక్కు తెగలవారైరి. అవ్వానిలో సుప్రసిద్ధు లనేకులు పొడమి పేరఁ బెంపున్ గాంచినవార లందుఁ గొందఱ నిందుఁ జేర్కొందు. 46

సీ॥ చిన్మయదీక్షాది ♦ శివమతగ్రంథక, ల్పకశాఖి శ్రీవీర ♦ భద్రగురుఁడు
షడ్దర్శనాగమ ♦ శౌండుండు కేదార, లింగపండితరాజ ♦ పుంగవుండు
నందిగామన్ వేద ♦ నయనముల్ వీరభ, ద్రావధానియును లిం ♦ గావధాని
కొండవీడున నున్న ♦ కుసుమకోమలకావ్య, కమనీయవీరభా ♦ గవతధాత
గీ॥ పాణినీయాగమాంత వి ♦ భాసితోరు, బాదరాయణఘనకలా ♦ భరితమహిత
పాండితీస్ఫూర్తి రచితశై ♦ వప్రబంధ. రంగదురుకీర్తి శ్రీనాగ♦లింగశాస్త్రి. 47

## —* కృ తి స మ ర్ప ణ ము *—

గీ॥ తల్లిదండ్రులకన్న ని ♦ తరము పరము, లేదనివచించు శాస్త్రని ♦ నాదసరణి
తల్లిదండ్రులకీప్రబం ♦ ధంబొసంగి, ధన్యతనుగాంతు నెల్లవి ♦ ధముల నేను. 55

ఉ॥ నాజనకుండు చాలఁ గవ ♦ నంబునఁ బ్రేమముఁ జెందికావ్యమొం
డోజ గ్రహింప నెంచియును ♦ యోగములేక గతించె నిప్పు డా
యోజఁ దలంచి తల్లికిని ♦ నొప్పగ నాదగుతండ్రి కీకృతిన్
భ్రాజితభక్తి నిచ్చెదను ♦ భర్గుఁడు దీని ననుగ్రహించుతన్. 56

క॥ ఒకయాశ్వాసముఁదల్లికిఁ, నొకయాశ్వాసంబుఁదండ్రి ♦ కొసఁగెద నాయీ
సుకృతకృతి నిద్ది వారల, కకలంకయశంబు నొసఁగు ♦ నాకల్పముగాన్. 57

క। కృతిపతులఁట తలిదండ్రులు, కృతి శైవమహాపురాణ ♦ గీతంబఁట యీ
కృతిరచయితనగు నేనిటఁ, గృతకృత్యుఁడనగుట కొండు ♦ కృపి గావలెనే. 58

*క॥ ఉద్బోధకుఁ డీశ్వరుఁడట, సద్భావముతోడ నిద్ది ♦ సల్పుటయఁట యీ
పద్భంగము లేకయె కృతి, యద్భుతగతిఁ బూర్తినొంది ♦ యలరుటయరుదే. 59

ఉ॥ మ్రొక్కులు మ్రొక్క వేల్పులకు ♦ మోదముతో ననుఁగన్నయంత నే
మిక్కుటమైన రోగములు ♦ మేకొని నన్నలయింపఁ జింతతోఁ
బొక్కుచుఁ జెక్కుపాట్లుపడి ♦ పొంకముఁగూరిచి పెంచి పెండిలిన్
జక్కఁగఁజేసి పెండ్లమును ♦ సంతతినిన్ నను సాఁకు తల్లికిన్. 60

గీ॥ నన్నుఁగని పదుమూడేండ్లు ♦ నాకునిండు, దాఁక నాకిష్టవస్త్రప్ర ♦ దానమున ము
దంబుఁ గూర్చుచు విద్దెలఁ ♦ దార్పఁగడఁగి, యంతఁదాశివుఁజేరిన ♦ యట్టిపితకు.

వ. సమర్పితంబుగా నేనాంధ్రీకరింపఁబోవు శివపురాణంబునకుఁ గథాక్రమంబు. 62

## -* గ్రం థా రం భ ము *-

ఉ॥ ఎల్లజగంబులన్ సలుప ♦ నెంచి విరించినిఁగాంచి ప్రజ్ఞ శో
భిల్లఁగఁజేయు వేదములఁ ♦ జేర్మి నొసంగినవాని దీప్తి సం
ధిల్ల సమస్త దేహులకు ♦ ధీస్ఫురణంబుఁ బొనర్చువాని నా
యుల్లమునందుఁగొల్తు మమ ♦ నొప్పినడాతోడవాని నాదటన్. 63

* పాఠాంతరము : ఉద్భవకరుఁ డీశ్వరుఁడఁట.

క॥ శ్రీశైలసన్నికృష్టను, దేశోజ్జ్వలశివపురాఖ్య ♦ దివ్యపురభవా!
ఈశార్చనాభిరతకో, టీశారాధ్యేంద్రవరదు ♦ హిత! లక్ష్మ్యంబా! 64

వ. అవధరింపుము.

క॥ నైమిశవనమున లోక, క్షేమార్థము శౌనకాద్య ♦ ఖిలమానులు చే
తోమోదమొదవ సూతుని, తో మధురాలాపచయచ ♦ తురతరఫణితిన్. 65

ఉ॥ పావనమూర్తి! నీవలనఁ ♦ బల్మఱు వింటిమి విస్ఫురత్స్వరా
ణావగతప్రమోదభరి ♦ తాద్భుతదివ్యకథాప్రబోధలన్
భావమునందు సంతసము ♦ పర్వెడు నైనను దృప్తిగా దదే
మో? విన వేడ్కయే పొడము ♦ నుక్తుల రక్తుల శక్తి యెట్టిదో! 66

క॥ నీవలె విద్యావిభవము, నీవలెఁ జాతుర్యధుర్య ♦ నిపుణత మఱియున్
నీవలె నవరసరుచిరవ, చోవిలసితధార లెవఁడు ♦ చూఱఁగొను ధరణ్. 67

గీ॥ పారమేశ్వరవిజ్ఞాన ♦ భరితమూర్తి, వఖిలకల్యాణజనక నా ♦ నాగమార్థ
వేదివి పరాశరాత్మజు ♦ విమలచిత్త, మునకు నచ్చినశిష్యుఁడ ♦ వనఘ! నీవు

గీ॥ ఎల్లవిద్యలసారంబు ♦ నెఱిఁగినట్టి, దిట్టవైనను బరులకుఁ ♦ దెలివిగలుగ
బోధసేయకయున్న దాఁ♦ బొందునఘము, కలిమిగలిగియు నొసఁగని♦కఠినుఁబోలె.

క॥ విద్యయు బోధనమును నన, వద్యాచారప్రచార ♦ వైభవము గడున్
హృద్యగతి మెఱయు నీకడఁ, జోద్యముగాదొక్క! యున్ని♦సొంపులుగుదురన్.

—* శౌనకాదిమునులు సూతుని శివపురాణమును వినుచుమని యడుగుట *—

ఉ॥ ఏది వినన్ మనంబునకు ♦ హెచ్చగు సంతస మావహిల్లి వే
ఱేది వినంగ వేడ్కజని ♦ యింపదు ముక్తి సతీకరగ్రహం
బేది వినన్ లభించుఁ ♦ బరమేశ్వరుఁ డేది వినన్ బ్రసాద మా
పాదన సేయు నట్టిది కృ ♦ పన్ సెలవిమ్ము మహాత్మ! మాకికన్. 71

ఉ॥ ఎందునుగానిచూడ జగ ♦ దీశ్వరబోధకమా చరిత్రమే
డెందమునందుఁ గుందడఁచి ♦ తీవిగ మోక్షవధూటిసంగమం
బందిక గానొసంగఁదగు ♦ నన్యమిఁకట్టిదిగాదు గాన మా
కిందు నవేందుభృచ్చరిత ♦ మే విన నింపగు సొంపగుఙ్జమీ! 72

క॥ కావునను శివపురాణము, వేవేగఁ మాకు నిపుడు ♦ వినిపింపుము సూ
తా! విద్వజ్జనగీతా!, నీవైదుషిదీప్తు లెంతో ♦ నేరిమి దనరణ్. 73

వ. అనుడు నంత సూతుం డాహ్లాదంబుతో

—* సూతుఁడు హర్షించి ప్రారంభము సేయుట *—

ఉ॥ ధన్యుఁడనైతి వంగడము ♦ తథ్యమబాధ్యయశంబునొందె సౌ
జన్యనిధానులున్ బుధులు ♦ సారతపోనిధులైన మీరు సా
మాన్యుఁడనైన నానుడుల ♦ మచ్చికతో విని మెచ్చి క్రమ్మఱన్
మాన్యతతో వినన్ గడఁగి ♦ మంజుతరోక్తుల నిట్లుగోరుటన్. 74

ఉ॥ అందును నెల్లలోకముల ♦ కాదిమకారణుఁడై దనర్చు న
య్యిందుధరున్ భజించు నల ♦ యింపగు శైవపురాణరాజమున్
విందొనరింపుమంచు సర ♦ విన్ ననుఁగోరుట కింతయంతయం
చుం దలపెట్టరానిసిరిఁ ♦ జొక్కితి నిక్కితి సాటివారిలోన్. 75

సీ॥ శివపురాణము భువిఁ ♦ జేకుఱదనుక నే, బ్రహ్మహత్యాదిపా ♦ పములు పొదలు
శివపురాణము భువిఁ ♦ జేకుఱదనుక నే, కలిమహోత్పాతము ♦ ల్పొలుచుచుండు
శివపురాణము భువిఁ ♦ జేకుఱదనుక నే, కాలకింకరులసం ♦ కటములొదవు
శివపురాణము భువిఁ ♦ జేకుఱదనుక నే, శాస్త్రంబులు వివాద ♦ సరణిమించు
గీ॥ శివపురాణ మిఁకనుభువిఁ ♦ జేరదనుక, దివ్యవిజ్ఞానమెంతయుఁ ♦ దేజరిలదు
శివపురాణంబిఁకనుభువిఁ ♦ జేరదనుకఁ, బరమశివతత్త్వమెఱుఁగఁగాఁ ♦ బడదు పుడమి.
గీ॥ అట్టి శైవపురాణము ♦ నవని వినిన, జదివినను దత్ఫలంబు నేఁ ♦ జాటఁగలనె?
పద్యమే నర్థపద్యమేన్ ♦ బఠనసేయ, వినిన సర్వాఘవితతులు ♦ విడుపునొందు.
వ. కావున నింతకన్న మేలు తెఱంగు వేఱొక్కండు లేదిఁక సత్వరం బుపక్రమించెద
వినుం డన్న నవ్వారలు హర్షంబుతో. 78

—* శౌనకాదిమునులు సూతునితో శివతత్త్వంబు తీరెఱింగింపుమనుట *—

గీ॥ ఎంతయేనియు శుశ్రూష ♦ హెచ్చుచుండె, జెప్పుమిప్పుడు కృపతోడ ♦ శివునితత్త్వ
మేమెఱుంగ మగుణుఁడైన ♦ యీశ్వరుండు, గుణము నెట్టులఁ జెందెనో ♦ గోవిదేంద్ర!
ఉ॥ సర్గముకన్న మున్నుఁ బుర ♦ శాసనుఁ డెట్టులనుండు నింక నా
సర్గపుమధ్య నెక్కరణిఁ ♦ జక్కఁగఁ గ్రీడ యొనర్చు దానియు
త్సర్గమునం దెటుల్ మరలఁ ♦ దా వసియించుఁ గృపాళు! సెప్పుమా
భర్గుఁడు లోకశంకరుఁడు ♦ పన్నుగ నెట్లు ప్రసన్నుఁడయ్యెడున్. 80

చ॥ అతఁడు ప్రసన్నుఁడై జనుల ♦ కర్మిలి నెట్టి ఫలంబొసంగు? నా
వితతదయాకరుండు గడు ♦ వేగిరమొంది ప్రసన్నుఁ డౌనటం
చతులితమౌ ననుగ్రహము ♦ నారయునంచును భక్తకోటులన్
వెతవడనీయఁడం చెపుడు ♦ విందుము విందుగఁ దెల్పు తత్కథన్. 81

గీ॥ బ్రహ్మ విష్ణువు రుద్రుండు♦పరమశివుని, యంశములటంచు నందుఁబూ♦ర్ణాంశుఁడల్ల
రుద్రుఁడని వినుచుందుమా♦ రుచిరమూర్తి, విస్ఫురితలీలలను విని♦పింపుమనఘ!

క॥ రుద్రావిర్భావంబును, రుద్రాణీజన్మకథ ని ♦ రూపింపు విప
శ్చిద్రాజులు మెచ్చఁగ వి, ద్వద్రమణా! నీదుకీర్తి ♦ వర్ధిలుభువిలోన్. 83

వ॥ అనిన విని సూతుండిట్లనియె|

క॥ ధన్యులు గృతకృత్యులు మీ, రన్యులవలెఁగాదు నిర్మ ♦ లాంతఃకరణుల్
మాన్యులు మురియుచు వినుతు న, నన్యాదృశమైన ప్రమథ♦నాథకథనొగిన్. 84

గీ॥ శివకథానైష్ఠికమనీష ♦ చెలువుమీఱ, వెలసెనేనియు జాహ్నవీ ♦ సలిలమట్లు
పూతులనొనర్చు నాండ్రను ♦ బూరుషులను,బృచ్ఛకుని వినువారిని♦ వినుచు వాని.

క॥ భవరోగౌషధ మిదివినుఁ, డవిరళమోదమున నీప్సి ♦ తార్థప్రదమీ
శివచరితము నారదమా, నివరేణ్యుఁడు దండ్రిఁడినడుగ ♦ నీరజభవుఁడున్. 86

గీ॥ సంతసంబలరఁగ నాత్మ ♦ జన్మునకు వ, చించె నట్టుల మదికి రు ♦ చించునటుల
తపసులార! భవత్సన్ని ♦ ధానమందు, శాంకరయశంబు గానంబు ♦ సల్పువాఁడ.

## -* కథా ప్రారంభము *-

### —* నారదముని తపస్సొనరించుట *—

క॥ అని వేగమె సూతుఁడు దన, మనమునఁ బరశివచరణస ♦ మర్చాణమును న
ష్ఠానరించి యిట్లు పలికెను, ఘనమధురమరందసూక్తి ♦ కౌశల్యమునన్. 88

ఉ॥ నారదమౌనివర్యుఁ డొక ♦ నాఁడు మహేశ్వరభక్తియోగదీ
ప్తారతుఁడై తుషారగిరి ♦ కందరరాజమునొంది స్వర్ణదీ
చారుతరంగశీకరర ♦ సప్రసరప్రకరాలవాలమా
లూరరసాలసాలతరు ♦ లుంగలవంగవనంబు నొక్కెడన్. 89

ఉ॥ కాంచి మనంబునచ్చియుటఁ ♦ గాపురమొంది వియన్నదిన్ గడున్
మించినవేడ్కఁ గ్రుంకులిడి ♦ మేలుగ లోన 'శివోహ'మంచు మో
జించుచు నుండెనంతఁ గడ ♦ చెన్ జిర మాపయి వృత్రభేది వీ
క్షించి మునీశ్వరవ్రతముఁ ♦ జేవఁదొలంగి కలంగె నెంతయున్. 90

గీ॥ సంయమి దివంబుఁ దనకైవ♦సంబుఁ జేసి,కొనఁగమదిఁబూనితపసుఁగై♦కొనియెనిట్లు
లేకయుండిన నిట్టుల ♦ లోకదీప్తిఁ, బెద్దకాలంబొనర్చునే ♦ బిట్టుతపసు. 91

క॥ నేనూరకున్న నీఁటులే, మానక స్వారాజ్యమూడి ♦ మహితాత్మకుఁడీ
మౌనీంద్రు నొందు నిందను, మానము లే దెంత యేని ♦ మదిఁ బరికింపన్. 92

ఉ॥ కావున నిప్డె తాపసుని ♦ గర్వమణంగఁగ నత్తపంబునేఁ
బూవిలుకాని సాయమున ♦ బూదిరయొనర్చెదనంచు వేగన
ఖ్భావజు నాత్మలోఁ దలఁపఁ ♦ బంచశిలీముఖుఁ డేగుదెంచి తా
దేవర ! యేమిసెల్వనుడు ♦ దేవవిభుండనె నివ్విధంబుగాఁ. 93

చ॥ మునివరుఁడైన నారదుఁడు ♦ మూర్ఖత నాకధరాధిపత్యముఁ
మనమునఁగోరి ఘోరముగ ♦ మంచుమలఁ దపియించుచుండె నీ
యనుచరరాజిఁ దోడ్కొని ర ♦ యమ్మున నమ్మునిఁజేరి కామవే
దనకు వశుఁబొనర్చి బలి ♦ తంపు తపమ్మును వమ్మొనర్పుమా ! 94

మ॥ అని పంపఁ మరుఁడంత మాధవుఁ ద్రియా ♦ మాదీశు గంధానిలుఁ
దనవెంటన్ గొనిపోయి మానివరుచి ♦ త్తం బుత్తలంబొంది స్త్రీ
జనతాసక్తముగాఁగఁజేయఁగడఁగన్ ♦ సర్వేశ్వరానుగ్రహం
బున నమ్మౌని రవంతయేనిఁ జలనం ♦ బున్ జెందకందుండుటన్. 95

చ॥ కని మదనుండు భీతిఁగొని ♦ క్రిన్నన నింద్రునిఁజేరి తద్విధం
బును నవబోధచేసి చనెఁ ♦ బొల్పగు నారదశక్తి కెంతయున్
మనమున మెచ్చె దేవపతి ♦ మౌని చిరంబు తపించి యంత సి
ద్ధిని గడియించినానని మ ♦ దిన్ గరువంబువహించి మించుచున్. 96

## —* నారదముని త్రిమూర్తులయొద్ద కేగుట *—

క॥ కాముని జయించితిని నిఁకఁ, గామారినిఁ బోటిసేయఁ ♦ గంటె నిజతపం
బీమ్మాద్రి సిద్ధిఁజెందె నిఁ, కేమని యత్తపసుమౌని ♦ హెచ్చగుకలిమిన్. 97

శా॥ కైలాసంబునకేగి యాత్మసుతపో ♦ గంభీరభాగ్యంబు స
ర్వాలంకారునితోడఁ జెప్పటకునై ♦ యచ్చోటికింబోయి యు
న్నీలగ్రీవునిఁజేరి మ్రొక్కి మిగులన్ ♦ నీటొప్ప నాత్మోన్నతిన్
వాలాయంబుగఁ దెల్పె శంకరుఁడు "వా ♦ హ్వా" యంచు హర్షించఁగా. 98

చ॥ శివుఁడు మునీంద్రుగర్వమును ♦ జిత్తమునందు నెఱింగియున్ గడున్
బ్రవిమలమైన భక్తజన ♦ వత్సలతఁ విడనాడ కమ్ముని
ప్రవరునితోడ నిట్లనెఁ జి ♦ రంబు తపంబొనరించి సిద్ధినై
భవమును జెందితీవు ముని ♦ వర్య ! కడున్ గడు సంతసించితిన్. 99

క॥ ఏన నొకమాట సెప్పెద, మానసమున నుంపు దీని ♦ మఱవకు మెపుడున్
మౌనీంద్రా! వైకుంఠుని, తోనుడువకు నీతపంబు ♦ తోరపుసిద్ధిఁ. 100

కII అని బోధించిన విని ముని, మనమున నదిలెక్కఁ గొనక ♦ మఱియుఁ గమలజ
న్మునియొద్దకేగి యట్టులె, తనకామజయంబుఁ దెలుపఁ ♦ దద్జ్ఞుఁ డతండున్. 101

కII శంకరు ననుగ్రహంబునఁ, బంకజసాయకజయంబు ♦ వాటిలె మునికా
పొంక మెఱుంగక యితఁడిటు, మంకుతనమ్మొందె పదరు ♦ మాన్పద నిట్టుల్.

కII అనికొని నారదమునితో, ననియెఁ గుమారా! మహేశ్వ ♦ రానుగ్రహ మ
ట్లనువుగ మన్మథజయమున్, బొనరించిన దండుఁగులుకఁ ♦ బోకు మెడందన్. 103

ఉII మున్నట శంకరుండు తప ♦ మున్ బొనరించుచునున్న మన్మథుం
డన్నిటలాక్షు గెల్వఁజని ♦ యంతముఁ జెందెఁ దదీయదేవి యా
పన్నగభూషణున్ గొలిచి ♦ భర్త ననంగునిగాఁగ నొందె నా
పున్నెపుభూమి శాంకరవి ♦ భూతి జయించితి వీవు కామునిన్. 104

కII చను మదరిపాటుఁ జెందకు, తనుజ! యనుడు నారదుఁడు హి ♦ తవునరయక య
వ్వనజాక్షుని చెంగటకే, గిన నాతం డరసి వేడ్కఁ ♦ గిల్కొను మదితో. 105

ఉII ఏమి మునీంద్ర! లెస్సె? యిపు ♦ డెచ్చటనుండి మదీయధామమున్
బ్రేమము మీఱఁ జేరితివి ♦ పెద్దయుఁ బ్రొద్దులు మంచుఁగొండలో
నేమము మీఱఁగాఁ దపసు ♦ నెగ్గఁగఁ జేసితివయ్య! నీకు దీ
టేమహి వచ్చునే వెఱఋ ♦ షీంద్రులలో నొకఁడేనిఁ జూడఁగన్. 106

—* నారదుఁ డహంకరించుట *—

ఆII అనిబహూకరింప ♦ నమ్మునిపొగరునఁ, దనదుతపసు పెంపుఁ ♦ దమ్మివిల్తు
గెలుపు హెచ్చుమీఱఁ ♦ గేరుచుఁ జెప్పెను, హరియు వినియె మంద ♦ హాసమలర.

వ. అంతఁ బుండరీకాక్షుండు,

కII విని యొందజయ్యమైన శి, వుని మాయాసరణిఁ దపసి ♦ పొలుపఱియిట్టుల్
మనసిజుని నిల్వరించితి, నని పొరకోఁతలను ♦ గోయు నజ్ఞతబలిమిన్. 108

గీII అనిమనంబునఁ దలఁచి ది ♦ వ్యఋషియుల్ల
మలరఁగా బల్కె మునియును ♦ హరుసమొంది
కంజనయనునితో నెఁ ♦ గాముఁ డేమి
సేయగలఁడు మహాత్మక! ♦ చేవమీఱి. 109

కII అని గర్వపడి మునీంద్రుఁడు, చనియెను దనయిచ్చకలిమిఁ ♦ జక్రాయుధుఁ డ
మ్మునిపైఁ గినిసి శివేచ్ఛన్, దనమాయను ద్రోవలోనఁ ♦ దనరఁగఁ జేయన్. 110

మ॥ హరినిన్ బాసి మునీంద్రుఁ డెందొ చనఁబో ♦ నధ్వంబునం దొక్కచోఁ
బుర మొక్కండగుపట్టెఁ గర్బురమయ ♦ ప్రోత్తుంగహర్మ్యంబు సుం
దరనారీనరవర్గసేవితము నా ♦ నావస్తువిస్తారబం
ధుర మత్యద్భుతవైభవంబు ముని యు ♦ ద్భూతాభిలాషాత్ముఁడై. 111

—* నారదుఁడు శ్రీమతినిఁ జూచి మోహించుట *—

మ॥ నగరుం జొచ్చి నరేంద్రుమందిరము నొం ♦ దన్ బోవఁగా నందు భ
వ్యగుణుం డప్పురి నేలు శీలనిధియన్ ♦ బ్రఖ్యాతభూనేత రూ
పగుణాలంకృతయైన శ్రీమతియనా ♦ బాలన్ స్వకీయాత్మజన్
దగురాజన్యన కీఁదలంచి పురమ ♦ త్యంతంబు గై సేసియున్. 112

ఆ॥ రాజవరుల నెల్ల ♦ నోజమైఁ బిలిపించి, తగస్వయంవరము బొ ♦ సఁగఘటించి
పుత్రిహస్తమందుఁ ♦ బూదండనిడి మది, కిష్టమైనవాని ♦ కేయుమనియె. 113

ఉ॥ అత్తఱి మౌనియుం జెదరి ♦ నట్టిమనంబున నందుఁజేర రా
జోత్తముఁ డాతఁ డమ్మునికి ♦ నొప్పుగఁబాద్యము నర్ఘ్యమిచ్చి మేల్
ముత్తెపుగద్దె నెక్కనిడి ♦ పుత్రినిఁ దోడ్కొనివచ్చి మౌనిరాట్
సత్తముపాదపద్మములఁ ♦ జక్కఁగ మ్రొక్కఁగఁజేయ నాతఁడున్. 114

ఉ॥ కన్ననుజూచి యచ్చెరువుఁ ♦ గాంచి మునీంద్రుఁడు మన్మథాస్త్రసం
పన్నమనంబుతో నృపతి ♦ వర్యునికిట్లనెఁ బార్థివేంద్ర! యీ
సన్నుతగాత్రి దివ్యతను ♦ జాతవలెన్ గనుపట్టుచున్న దీ
చిన్నది యెవ్వతో చెపుమ ♦ చెచ్చెర ముచ్చటదీర నాకిఁకన్. 115

వ. అనిన నజ్జననాథుం డిట్లనియె.

చ॥ మునివర! నాదుకూఁతురు స ♦ ముజ్జ్వలరూపనిధాన దీనికి
ష్టనుపుగ భర్తఁగూర్పఁగ స్వ ♦ యంవరమున్ బొనఁగించినాఁడ నా
తనుజకుఁ గల్గుభాగ్యమును ♦ దద్జ్ఞులు మీర లెఱింగియుండ్రు నా
మనమలరన్ వచింపుఁడు న ♦ మస్కృతులన్ బొనరింతు మీకొగిన్. 116

ఆ॥ అనుడు మౌనియనియె ♦ నధిప! నీకూఁతురు, కలిమిచెలువవోలె ♦ వెలయుసిరుల
విభుఁడు మరునిఁగన్న ♦ వెన్నుఁడే యనఁదగు, నట్టులమరు మీఱు ♦ హారుసమునను.

క॥ అనినాఁడివి నారదుండా, జనపతికడనుండి విష్ణు ♦ సన్నిధికి వెసన్
జని యాయనఘునకా రా, తనయ స్వయంవరవిధంబుఁ ♦ దగఁజెప్పె వెసన్. 118

మ॥ హరి! నామానసమున్ హరించె నృపక ♦ న్యారత్న మెట్లోనమున్
జరితార్థున్ బొనరించు మేల్సొబగు సం ♦ ధానింపు మాలోక సుం
దరియా నగ్గరితన్ పరిగ్రహము నొం ♦ దంజాలనేనిన్ బొరిం
బొరిఁ బుష్పేషుశరార్చిఁ గాల్పఁబడుదున్ ♦ బోనాడుదున్ బ్రాణముల్. 119

గీ॥ మేల్మిబంగారుబొమ్మ య♦మ్మొలఁతలక్ష్మి, తోడ నెనవచ్చు నీకైనఁ♦దోయజాక్షి
అరమరయొనర్పకఱుతయం♦దలరుచుండ, నేయుఁగావున నీరూప ♦ మిమ్మునాకు.

గీ॥ అనుచుఁ గడు వేడుటయు హరి ♦ యల్లననగి
యనియె మోమోటమరయనే ♦ యకట నీదు
మాట నేఁ ద్రోసివేతునే ♦ మౌనితిలక!
చనుమటులె యిచ్చితిని జక్కఁ ♦ దనపురూపు. 121

క॥ హరివచనమ్మును విని ముని, హరుసంబున నృపసుతాస్వ ♦ యంవరశాలన్
బిరబిరఁ జేరియచ్చట, హిరణ్యపీఠిని వసించె ♦ నెంతయుఁ బేర్మిన్. 122

క॥ హరియొసఁగెన్ మునికి మనో, హరమగు తనమేలిరూపు ♦ నట్టువఱకుఁబై
హరిశిరసున్ గూరిచె నిది, యరయక మునిగూరుచుండె ♦ నచట మురియుచున్.

ఉ॥ అచ్చటివారలందఱును ♦ నమ్ముని యాకృతిఁజూచి నవ్వుచున్
బిచ్చబికారి యీతఁడిటఁ ♦ బెచ్చగుపూనికిఁ గూరుచున్న వాఁ
డిచ్చెలిఁ బెండ్లియాడుతమి ♦ నీ దొరలన్ విడనాడి యీతనిన్
మెచ్చి వరించునే? యకట ♦ మీనవిలోచన యెట్టులేనియున్ 124

క॥ క్రోఁతికిఁ గొబ్బరికాయయె, యీతరుణీమణికి నాథుఁ ♦ డీతండైనన్
గోఁతిమొకము ముని యితఁడి, ట్లాతురపడుచుండెఁ గన్నె ♦ నాసించికడున్.

గీ॥ అనుచు నచ్చటివా రను ♦ కొనుచునుండి
రా జగన్మోహిని యనంగ ♦ నలరు రాచ
కొమిరె కూర్చుండియున్న భూ ♦ రమణవరుల
నొక్కొకరిఁ జూచుచుం బాయు ♦ చుండె నందు. 126

క॥ నారదమునినిన్ గని చె, న్నారెడు రూపంబు వాన ♦ రాస్యముఁ గని లోఁ
గూరిమిఁ జెందక తొలఁగెను, సారెకు ముని యఱ్ఱుసాచి ♦ చక్కఁగనుఁగొనన్.

—* విష్ణుమూర్తి శ్రీమతినిఁ బెండ్లాడి వైకుంఠమునకుఁ దోడ్కొని పోవుట *—

క॥ అత్తఱిఁ గమలాక్షుండా, బిత్తరియెడ వేడ్కఁజెంది ♦ పేరిమి నొకరా
జోత్తముఁడై యటఁ జేరుడు, నత్తలిరుంబోఁడి నూచి ♦ హారము వేసెన్. 128

ఉ॥ అంత సరోజనేత్రుఁడు ప్రి ♦ యంబున నక్కలికిం గ్రహించి బల్
సంతసమొప్పఁగాఁ దనదు ♦ సద్మముఁ జేరె నరేంద్రులెల్లరున్
జింతిలి వేగవేగముగ ♦ స్వీయపురంబుల తోవఁబట్టిర
ట్లంతయుఁ జూచి నారదుఁడు ♦ హా! యిది యేమి యటంచుఁ గించతో. 129

ఉ॥ వారిని వీరినిం దఱిసి ♦ బాలిక నెవ్వఁడు గొంచుఁబోయె బం
గారుసరంబు నాయుఱతఁ ♦ గామిని వేయఁగఁబూనియుండె మీా
రారయఁ డెందునున్నదొ ర ♦ యంబుననంచు మునీంద్రుఁడాడ గౌ
రీరమణప్రియుల్ మఱిమ ♦ ఱిన్ మునిఁగాంచుచు నిర్వురచ్చొటన్. 130

చ॥ నగుచు నిటుల్ వచించి రల ♦ నాతుక నెత్తుకపోయె విష్ణు వ
మ్మగువ నినున్ వరించునొకొ ♦ మర్కటవక్త్రుఁడ! చాలుఁజాలు నీ
మొగమును గన్నరోఁతవాడ ♦ మున్ గడుఁ జక్కఁదనాలబాలకున్
దగుదునటంచు నెట్టులు మ ♦ నంబున నెంచితొ? కొంచకింతయున్. 131

క॥ బంగరువిరిసరమును నా, రంగారుమరాళరాజ ♦ రాజగమన సా
రంగవిలోచన హరియఱు, తం గై సేసెను గ్రహించెఁ ♦ దన్వి నతండున్. 132

ఆ॥ ఇటుల వారు చెప్ప ♦ నీరసతోమముని, వారిఁజూచి గినిసి ♦ మీారలిట్లు
నన్ను వెక్కిరించి ♦ నారు గావున భువి, దనుజయోనిఁ బుట్టుఁ ♦ డనిశపించె. 133

క॥ వారలు జ్ఞానధనము చే, కూరిన వారాట మదినిఁ ♦ గుందకయె శివే
చ్ఛారీతి నడచునని య, న్నారదునిన్ దూఱరైరి ♦ నడచిరెచటికో. 134

—* నారదుఁడు విష్ణుమూర్తిని శపించుట *—

ఉ॥ అంత మునీంద్రు డాత్మముఖ ♦ మద్దమునన్ బరికించి విస్మయ
క్రాంతమనస్కుఁడై దనుజ ♦ ఘస్మరుఁ డిట్టులొనర్చె నంచు లోఁ
జింతిలి భగ్గుభగ్గుమను ♦ శీఘ్రురుషాగ్ని భరంబుతో నిశా
టాంతకుఁ జేరి నిల్చి కడు ♦ నాతతరౌద్రమయోక్తి నిట్లనెన్. 135

ఉ॥ మోసమటుల్ పొనర్చితి వ ♦ మోఘవచస్కుఁడవంచు నెంచి నే
నాసనుజెంది యట్లు నిను ♦ యాచనచేసినదానికిట్లు బల్
దోసమనాకచేసితివి ♦ తుంటరి! కొంటెతనంబు చెయ్యి వి
శ్వాసవిఘాతుకా! యురక ♦ సల్పిన నేరము రిత్తవోవునే. 136

ఉ॥ పూనికతోడఁ గట్టికుడు ♦ పున్ నిను నీయఘు మెంచిచూడు నా
మానసమున్ గరంచిన కు ♦ మారినిఁ జేకొని పల్వురందు నా
కీ నగుఁబాటుఁగూర్చితివి ♦ హెచ్చుగ నీవిటు స్త్రీకృతంబునన్
బూనెదుగాక పెన్వగను ♦ బూనెదుగా కపహాస మిద్ధరన్. 137

క॥ మఱియుఁ వానరముఖమును, సరియని నాకిచ్చినట్టి ♦ చందమునకు వా
నరులే శరణంబౌదురు, నరుఁడవు నీవగుచు వగఁగ ♦ నంగల వవనిన్. 138

గీ॥ ఇట్లుముని శాపమిచ్చిన ♦ నీశ్వరేచ్ఛ, యనుచుఁ బురుషోత్తముండెద్ది ♦ యనక కినుక
లేక యానందమున నుండె ♦ నీక మెఱయ, శంకరునిమాయ యంతన ♦ జ్జటిలుఁ బాయ.

మ॥ మునివర్యుండు ప్రబోధమొంది కినుకన్ ♦ భోగీంద్రతల్పుఁ జెపిం
చిన దోసంబున కెంతయేని మది ని ♦ స్సీ! యంచు భీతాత్ముఁడై
వనజాక్షుసిఁ జేరి మ్రొక్కి చెడితిన్ ♦ బాపంబిటుల్ కట్టికొం
టిని సర్వామరవంద్యు శ్రీవిభుని నే ♦ నిందించి కుందించితిన్. 140

ఉ॥ ఎట్లుమహాత్మ! నిన్ను శపి ♦ యించినదోసము నాకుఁ బాయు నీ
వెట్లు భరించి యొందఁగల ♦ వీ చెడు తాపసి యేవమైనయీ
తిట్లు సహింప రాని వికఁ ♦ దీండ్రిపుటల్కను ముక్కముక్కయా
వట్లుగ నన్నుఁ జెండఁదగు ♦ నండజకేతన! చక్రధారచేన్. 141

క॥ అప్పగిది సేయువేనిన్, దెప్పరమగు నిరయమొంది ♦ దిక్కఁగనక బల్
ముప్పున మఱిగెద నిఁక నా, తిప్పలు పాయునటులేవి ♦ ధింపుము శిక్షన్. 142

చ॥ అని యనినంత శ్రీదయితుఁ ♦ డల్లననవ్వి మునీంద్రుతోడ ని
ట్లనె మునిరాజ! యేలయిటు ♦ లాత్మ మలంగెద వంత యీశ్వరే
చ్ఛను నడుచున్ మఱొక్కరి వ ♦ శంబగునే? పసిలేనియిట్టి వే
దనఁగొన కమ్మహేశ్వరు నె ♦ దన్ దలపోయుము పాయుమజ్ఞతన్. 143

చ॥ సకలముఁ గాలచక్రమును ♦ శంకరుడే తిరుగంగఁ జేయు నా
యకుఁడతఁ డన్నియాత్మలకు ♦ నక్షరమూర్తి, కృపానువర్తి, మా
మకదయితుండు నిచ్చలు ర ♦ మాసతి యేనును దత్పదాబ్జముల్
దికమక లేక కొల్చెదము ♦ దివ్యమునీ! గుఱుతింపు మింపుగన్. 144

ఉ॥ వినను గూడ శాంభవ మ ♦ హాద్భుత మాయకులోఁగి యెప్పుడే
డ్డేనును బ్రహ్మదేవుఁడు మ ♦ హేంద్రుఁడు మోహమునొందుచున్ వగన్
బూనుచునుండు మట్లగుటఁ ♦ బూని మఱెవ్వరు దాఁటఁజాలు వా
రానియతిన్ గరంబెఱిఁగి ♦ యక్కట వెక్కసపాటు మానుమా. 145

—* విష్ణుమూర్తి నారదునకు హితోపదేశంబు చేయుట *—

ఉ॥ నీదగు హాంకృతిన్ మలుఁప ♦ నీలగళుండటు గూర్చెనీకునున్
నీదుముఖంబునన్ మరల ♦ నేర్పగ నాకును శాపసూక్తినా

పాదనచేసె దానవగరు ♦ వంబు భయంబును మాను చిత్తమా
హ్లాదమునొంద నిందుధరు ♦ నన్వహమున్ భజనంబొనర్పుమా. 146

శా॥ దానన్ నీకఘముల్ దొలంగు సుచరి ♦ త్రఖ్యాతి యేపొందు వి
జ్ఞానంబబ్బును డెందమందుఁగల నా ♦ నాసంకటాంకూరముల్
లోనన్ మగ్గు శుభైకమూర్తివయి యీ ♦ లోకంబులన్ మించు వీ
నీనేర్పున్ గని చేతురింక జనముల్ ♦ నిత్యంబు శర్వార్చనన్. 147

క॥ మనసున వాకున గాత్రం, బున శంకరుఁగొల్చునతఁడె ♦ బుధుఁడును పుణ్యుం
డును ధన్యుండును వైదికుఁ, డును జీవన్ముక్తుఁడగుఁ గ ♦ దుర్ బేర్మి మెయిన్.

క॥ శివనామం బనిమెడుఘన, దవహేతికి నఘవనములు ♦ దగ్ధములగు నా
శివనామతరినిఁగొని యీ, భవనీరధి దాఁటవలె ను ♦ పాయమున మునీ! 149

క॥ భవదవమధ్యంబునఁ జి, క్కువడి నడచుచున్ గరంబు ♦ కుందెడువారల్
శివనామ సుధారస వృ, ష్టివలనఁ దెలిపిగొనికాంతుర్ ♦ సేమంబు భువిన్. 150

క॥ పలుజన్మంబులఁ దపసున్, సలిపిననేగాని భక్తి ♦ శంకరునియెడన్
గలుగదు కలిగినయేని స, కలదేవుల సరిగ శివునిఁ ♦ గనునట్లమరున్. 151

గీ॥ లాఁతివేల్పులసరిగ బా ♦ లశశిధరుని, యెడఁబ్రపత్తియొనర్చిన ♦ యేని మనసు
నందుఁజాపల్యవైఖరి ♦ నొందియమరు, నేని యాభక్తివితయగు ♦ నెఱుఁగుమార్య!

క॥ వినుముని! యెందునుసామ్యము, గననిదిమై చపలగుణము ♦ గననిదియై వా
సినిమెఱయు శంభుభక్తి భు, విని సర్వార్థంబులొసఁగు ♦ వేడ్కలుమించన్. 153

క॥ నుదుటను బూదియు నఱుతన్, రుదురాకలు నాల్కలో వి ♦ రూపాక్షునిపే
రొదవినచో నవ్వాఁడఘు, విదళనము నొనర్పఁగలఁడు ♦ విజ్ఞవతంసా! 154

క॥ బావలసొమ్ములదోఁచియు, బాఁపలఁగొట్టియును వేఱు ♦ పాపంబుల నా
టోపంబున సల్పియు నా, పాపంబులఁబాయు శివుని ♦ భక్తిఁబడసినన్. 155

క॥ ఆపాదమస్తకము భ, స్మాపాదన మొందుమెప్పు ♦ దఖిలాంగములం
దోపిక రుదురక్కలఁగొను, శ్రీపంచాక్షరజపంబు ♦ సేయుము పూనీ! 156

క॥ శివకథలఁ జెప్పుమెప్పుడు, శివకథలను వినుచునుండు ♦ శివభక్తులనున్
శివునిన్ గొలుచుచునుండుము, శివతీర్థంబులకుఁజనుము ♦ సేమంబొనరున్. 157

ఉ॥ అందును వారణాసికిఁ బ్ర ♦ యాణమొనర్పుము దేవమౌని! ము
న్నందుగ శంకరుం డచటఁ ♦ బొంగుచు భూధరరాజకన్యతో

నందనరాజితో నమర ♦ నాయకముఖ్యులతోడ వాసమున్
బొందివసించు నయ్యదియ ♦ పూర్వము సృష్టికి శిష్టతల్లజా! 158

ఉ॥ అచ్చటనుండి యెల్లయుభ ♦ వాయతధామము లీక్షచేసి సొం
పెచ్చఁగ సత్యలోకమున ♦ కేగి భవద్గురు సారసోద్భవున్
హెచ్చుగఁ బూజసేసి పర ♦ మేశ్వరతత్త్వ మెఱుంగఁగోరు మా
సచ్చరితుండు శైవజన ♦ సత్తముఁ డర్థమెసంగఁ జెప్పెడున్. 159

క॥ అనిపనిచిన నతఁడును గడు, మనమున సంతసముఁ జెంది ♦ మధువైరికి వం
దనములఁ బొనర్చి రయమున, ఘనపుణ్యవితాన రాశిఁ ♦ గాశిన్ జేరెన్. 160

గీ॥ చేరి మిన్నేటియం దభి ♦ షేకమొంది, విశ్వనాథునిఁ దద్దేవి ♦ విఘ్నపతినిఁ
గొలిచి భైరవుఁ బూజించి ♦ జలజనయను, మాధవుని భజియించి సం ♦ బరము మెఱయ.

శా॥ శ్రీశైలేశు భజించి భ్రామరిని సం ♦ సేవించి శ్రీకాళహ
స్తీశున్ దత్సతిఁ బూజచేసి నటనా ♦ ధీశున్ దదీయప్రియన్
బ్రాశస్త్యంబుగఁ గొల్చి పాండ్యవిభు దా ♦ రాయుక్తు నర్చించి రా
మేశున్ బర్వతవర్ధనిన్ బ్రియముమై ♦ నీక్షించి సేవించియున్. 162

గీ॥ ఏకసహాకారవిభుని నా ♦ గేశుఁ ద్ర్యంబ, కేశు ఘుశ్మేశు నుజ్జయి ♦ నీశుఁ బ్రణవ
నాథు శ్రీభీమశంకర ♦ నాథు సోమ, నాథుఁ గేదారనాథుఁ ద ♦ న్నలినదృశల. 163

—* నారదుఁడు బ్రహ్మయొద్దకేఁగి శివతత్త్వంబుఁ జెప్పుమనుట *—

క॥ కొలిచి యజుఁ జేరఁజని జో, తలసలిపి స్వవృత్తమెల్లఁ ♦ దాఁ దెలిపి వెసన్
నెలఁ దలఁ దాల్చినదొరయ, క్కలిమిఁ దెలియఁగోరి భూరి ♦ కౌతుకమమరన్.

గీ॥ శివునితత్త్వం బెఱుఁగఁగోరి ♦ చేరినాఁడ, తండ్రి! నిన్నద్ది తెలుపు మా ♦ తత్త్వవేది
వీవగుట నగుణుండైన ♦ యీశ్వరుండు, గుణత నెట్టులఁ జెందెనో ♦ కోవిదేంద్ర!

ఉ॥ సర్గముకన్న మున్ను స్మర ♦ శాసనుఁ డెట్టుల నుండు నింకఁ దా
సర్గపుమధ్య నెక్కరణిఁ ♦ జక్కఁగఁ గ్రీడయొనర్చు దానియు
త్సర్గమునం దెటుల్ మరలఁ ♦ దావసియించుఁ గృపాళు! చెప్పుమా
భర్గుఁడు లోకశంకరుఁడు ♦ పన్నగ నెట్లు ప్రసన్నుఁడయ్యెడున్. 166

చ॥ అతఁడు ప్రసన్నుఁడై జనుల ♦ కర్మిలి నెట్టి ఫలంబొసంగు నా
వితతదయాకరుండు కడు ♦ వేగిరమందె ప్రసన్నుఁడౌనటం
చతులితమౌ ననుగ్రహము ♦ నారయునంచును భక్తకోటులన్
నెతవడనీయఁడం చెపుడు ♦ విందుము విందుగఁ దెల్పు తత్కథన్. 167

పాదనచేసె దాన గరు ♦ వంబు భయంబును మాను చిత్త మా
హ్లాదమునొంద నిందుధరు ♦ నన్వహమున్ భజనంబొనర్పుమా. 146

శా॥ దానన్ నీకఘముల్ దొలంగు సుచరి ♦ త్రఖ్యాతి యేపొందు వి
జ్ఞానంబబ్బును డెందమందుఁగల నా ♦ నాసంకటాంకూరముల్
లోనన్ మ్రగ్గు శుభైకమూర్తివయి యీ ♦ లోకంబులన్ మించు వీ
నీనేర్పున్ గని చేతురింక జనముల్ ♦ నిత్యంబు శర్వార్చనన్. 147

క॥ మనసున వాకున గాత్రం, బున శంకరుఁగొల్చునతఁడె ♦ బుధుఁడును పుణ్యుం
డును ధన్యుండును వైదికుఁ, డును జీవన్ముక్తుఁడగుఁ గ ♦ డున్ బేర్మిమెయిన్.

క॥ శివనామం బనియెడుఘన, దవహేతికి నఘవనములు ♦ దగ్ధములగు నా
శివనామతరినిఁగొని యీ, భవనీరధి దాఁటవలె ను ♦ పాయమున మునీ! 149

క॥ భవదవమధ్యంబునఁ జి, క్కువడి నడచుచున్ గరంబు ♦ కుందెడువారల్
శివనామ సుధారస వృ, ష్టివలనఁ దెలివిఁగొని కాంతురు ♦ సేమంబు భువిన్. 150

క॥ పలుజన్మంబులఁ దపసున్, సలిపిననేగాని భక్తి ♦ శంకరునియెడన్
గలుగదు కలిగినయేని స, కలదేవుల సరిగ శివునిఁ ♦ గనునట్లమరున్. 151

గీ॥ లాఁతివేల్పులసరిగ బా ♦ లశశిధరుని, యెడఁబ్రపత్తియొనర్చిన ♦ యేని మనసు
నందుఁజాపల్యవైఖరి ♦ నొందియమరు, నేని యాభక్తివితయగు ♦ నెఱుఁగుమార్య!

క॥ వినుముని! యెందునుసామ్యము, గననిదియై చపలగుణము ♦ గననిదియై వా
సినిమెఱయు శంభుభక్తి భు, విని సర్వార్థంబులొసఁగు ♦ వేడ్కలుమించన్. 153

క॥ నుదుటను బూదియు నఱుతన్, రుదురాకలు నాల్కలో వి ♦ రూపాక్షుని పే
రొదవినచో నవ్వాఁ డఘ, విదళనము నొనర్పఁగలఁడు ♦ విజ్ఞవతంసా! 154

క॥ బావలసొమ్ములదోఁచియు, బాఁపలఁగొట్టియును వేఱు ♦ పాపంబుల నా
టోపంబున సల్పియు నా, పాపంబులఁబాయు శివుని ♦ భక్తిఁబడసినన్. 155

క॥ ఆపాదమస్తకము భ, స్మాపాదన మొందుమెప్పు ♦ డఖిలాంగములం
దోపిక రుదురక్కలఁగొను, శ్రీపంచాక్షరజపంబు ♦ సేయుము పహానీ! 156

క॥ శివకథలఁ జెప్పుమెప్పుడు, శివకథలను వినుచునుండు ♦ శివభక్తులనున్
శివునిన్ గొలుచుచునుండుము, శివతీర్థంబులకుఁజనుము ♦ సేమంబొనరున్. 157

ఉ॥ అందును వారణాసికిఁ బ్రి ♦ యాణమొనర్పుము దేవమౌని! ము
న్నందుగ శంకరుం డచటఁ ♦ బొంగుచు భూధరరాజకన్యతో

క॥ సత్యము జ్ఞానమనంతము, వ్యత్యయరహితంబునఁ జి ♦ దాత్మకమగుచున్
నిత్యానందమునగుచుఁ బ, రిత్యక్తోపద్రవ నుల ♦ రె నొకమహామటన్. 177

గీ॥ అప్రమేయ మనారంభ ♦ మద్వితీయ, మాకృతివిహీన మవికార ♦ మగుచు నిర్వి
కల్పమును నిర్గుణం బాత్మ♦కారణంబు, నగుచు నిర్మాయమైయల♦రారు నొకఁడు.

## —* శివుఁడు సగుణుండై యేర్పడుట *—

గీ॥ విగ్రహాము లేక యీరీతి ♦ వెలసి కొంత, కాలమైనంతఁ దనుదానె ♦ కల్పనంబు
చేసికొని యొకమూర్తియై♦చెలువుమిగిలె, లీలమెయిమించు నేరిమి♦మేలుమీఱ.

వ. మఱియు నమ్మూర్తియు.

క॥ సర్వైశ్వర్యగుణంబుల, సర్వజ్ఞానమునఁ దనరి ♦ సర్వగమగుచున్
సర్వమునుఁ బరికింపుచు, సర్వాద్యయు సర్వవంద్య ♦ సర్వదయగుచుఁ. 180

గీ॥ సర్వమును బొనరించుచు ♦ శాంతశుద్ధ, రూపమైశ్వర మిభ్భంగి ♦ యేపుమిగుల
నంత నంతర్థినొందెఁ జి ♦ దాత్మమైన, యప్పరబ్రహ్మమెల్లెడ ♦ నమరునద్ధి.

క॥ ప్రాచీనంబయి రూపం, బేచొప్పడనట్టి బ్రహ్మ ♦ మిటు గొనరూప
ర్వాచీనులైన వారుఁ, బ్రాచీనులు శివునిగా స్మ ♦ రణ చేసిరొగిన్. 182

వ॥ అంతఁ గొంతకాలంబునకు.

## —* సగుణశక్తి యేర్పడుట *—

గీ॥ ఏకకుండయి తనయిచ్ఛ ♦ నెసఁగునీశ్వ
రుండు దనమూర్తినుండి యొ ♦ కొండు శక్తి
తనువు సృష్టించె నయ్యది ♦ తనను బాయ
కుండునట్టిది నీడ య ♦ ట్లొందికగను. 183

క॥ దానినె ప్రకృతినిగాఁగఁ బ్ర, ధానముగా మాయఁగాఁగ ♦ దద్‌జ్ఞులనుదు ర
ద్దానినె బుద్ధికి మాతను, గా నెఱుఁగుము త్రిగుణకలిత ♦ గా నెఱుఁగు మునీ!

క॥ ఆపెయె యంబిక వినుమా, యాపెయె సకలేశ్వరియును ♦ నరుదొప్పఁగ న
య్యాపెయె త్రిదేవజననియు, నాపెయెయగు మూలకార♦ణాఖ్య కుమారా!

వ. మఱియు నమ్మహేశ్వరి రూపవిశేషంబుల గుఱించి పేర్కొనుటకు శక్యంబు
గాదు. 186

సీ॥ శంఖచక్రగదాసి ♦ శరకార్ముకాభయ, వరదాష్టహ స్తముల్ ♦ వాసిమీఱ
ఇందుసహస్రభా ♦ యిష్టవిద్యుతి వొల్చ, ముఖదీధితిచ్ఛటల్ ♦ మురిప మెసఁగ
ఫుల్లారవిందవి ♦ స్ఫూర్తి మీఱెడువాలు, కనుదోయికాంతి చొ♦క్కముగనిగుడ
నవరత్నమయములౌ ♦ నగలనొప్పిదమైన, తనువెంతొ మేల్మి సం♦తసమునీన

గీ॥ తలఁపఁగ నశక్యమగు తేజ ♦ మలరుచుండ
నఖిలమున కాదిహేతువై ♦ హరువుమీఱ
నొక తెయైయుండి పెక్కురై ♦ యొప్పు పెంపు
గలిగి యమ్మాయ పొదలు మేల్ ♦ చెలువమమర. 187

గీ॥ పరమపూరుషుఁడై నయా♦భర్గుఁడవ్వుడు, ఫాలచంద్రుఁడుముక్కంటి♦ పంచ ముఖుఁడు
దశభుజుండును గర్పూర♦ధవళుఁడై శి, రమునగంగను జేతశూ♦లమునుదాల్చె.

క॥ అట్టిశివుండును శివయును, బెట్టిదమగుప్రాస్కినొక్క ♦ పీడమరిచి యం
దిట్టలమగు ప్రేమిడికొడి, గట్టి యొనర్చిరి చిరంబు ♦ కాపురమనఘా! 189

క॥ శివులకు నివాసమైతగి, శివనగరంబనఁగఁ బరగెఁ ♦ జేవమెయి లయం
బవుట నెఱుంగమిచే భువి, నవిముక్తంబనెడు నాహ్వ ♦ యంబును గొనియెన్.

క॥ ఆనందమూర్తులైన భ, వానీభవులకు విహార ♦ వనతలమై గా
ఢానందజనకమగుటది, యానందవనంబనంగ ♦ నవనిన్ వెలసెన్. 191

క॥ అచ్చోట శివుఁడు శక్తియు, నచ్చపుఁదపసునను గాట ♦ మగు యోగమునన్
హెచ్చగు విహారగరిమల, మెచ్చవసింపుచు నొకప్డు ♦ మేలుగమదిలోన్. 192

శా॥ లావుల్ జేవయు నోర్పునేర్పు బలము ♦ ల్లానంబు నుత్సాహ మొ
ప్పౌ వైదుష్యము చెల్మికల్మిగల నీ ♦ టౌ పుత్రుఁబుట్టించి మా
యీ వైరాజ్యవిభున్ బొనర్చిన భరం ♦ బెల్లన్ దలన్ దాల్చు, మా
కావిశ్రాంతియు యోగకేళి యనపా ♦ యంబై ముదంబిచ్చుతన్. 193

గీ॥ అట్లులైనఁ దలఁపులను ♦ నలలు సత్వ
మనెడు రతనంబులును రజ ♦ మనెడువిద్రు
మలతయును దామసములౌ మొ ♦ సలులు గలిగి
లోఁచు నుల్లంపుకడలి సం ♦ క్షోచపఱచు. 194

ఉ॥ ఆతఁడె మాయనుగ్రహము ♦ నంది సృజించుఁ జరాచరంబు ల
ల్లాతఁడె సర్వజంతుతతి ♦ నర్మిలిఁ బ్రోచుచునుండు నెవ్వఁడె
ప్డాతఁడె యెల్లలోకముల ♦ కంతము గూర్పఁగలండు నిక్కమ
ట్లీతఱి నట్టివాని నొక ♦ యాద్యునిఁబుట్టగఁ జేయుటొప్పగున్. 195

క॥ అవ్వాని సాయమున మే, మివ్వనమున యోగభోగ ♦ హృద్యక్రీడల్
నివ్వటిలంగ రచించెద, మివ్విరుసగననుచు ఘనత ♦ రేచ్ఛావశతన్. 196

క॥ ఈలాగిరువురు దృఢముగ, నాలోచనసేయ నంత ♦ నా పరమశివుం
డాలోకసుందరిని నవు, డాలోకించెను సుధామ ♦ యాయతదృష్టిన్. 197

వ. అంత

## —* విష్ణుమూర్తి జననము *—

క॥ వేడుకతో వారలు గని, రీ డెందునులేని యంద ♦ మింపగువానిన్
మూడు జగంబులనేలెడు, వోడిమిగలవానిఁ దమ్ముఁ ♦ బోలినవానిన్. 198

సీ॥ ఇంద్రనీలముడాలు ♦ నీసడింపఁగఁజాలు, నీలంపుమై నిగ ♦ నిగలవాని
వేయిరేకులతమ్మి ♦ విరులగెల్వఁగఁ జాలు, విరివైనకనుదోయి ♦ వెలయువాని
చెనఁటుల సమయింపఁ ♦ జేవగల్గిన సాధ, నములొప్పు నాల్గు ♦ హస్తములవాని
అమృతంబుకన్నఁ దీ♦యఁగనొప్పుమాధురిఁ, గురిపించునెమ్మోము♦గొమరువాని

గీ॥ పలురకములైన రతనాల ♦ వెలసి ధగధ, గలు తనర్చు కిరీటంబు ♦ గ్రాలువాని
కౌస్తుభంబను మణియెదఁ ♦ గలుగువాని, పసిఁడిపుట్టంబుఁగట్టిన ♦ బాలునొకని.

ఉ॥ కాంచినతోడ బాలకుఁడు ♦ గ్రక్కునడాసి నమస్కరించి బల్
మించిన భక్తిసంపదను ♦ మేకొని యోకరుణాలవాల ! కాం
క్షించెద నీకృపాగరిమఁ ♦ జేయఁగలట్టిది చెప్పుమన్నఁ బ్రే
మించి మహేశుఁ డిట్లనియె ♦ మెచ్చుచు సారసుధామయోక్తులన్. 200

సీ॥ జగములనెల్ల నిం ♦ డఁగఁజాలు తేజంబు, వెలయుట విష్ణునా ♦ వెలసెదీవు
కమలంబులను బోలు ♦ కనులు గల్గుటఁజేసి, కమలాక్షుఁడను పేరు♦గాంతువీవు
రాకాసిమూకలఁ ♦ బోకార్చుటన్ జేసి, దైత్యారి యనుపేరఁ ♦ దనరఁగలవు
బంగారుపుట్టముల్ ♦ పసమీఱఁజుట్టుటఁ, గాంచనాంబరుఁడను ♦ ఖ్యాతిగందు

గీ॥ వంతమొందక చెందెద ♦ వచ్యుతాఖ్యఁ, జక్కని కురుల్గలుగుటఁ గే♦శవసమాఖ్య
యెల్లజీవుల మనసుల ♦ నెల్ల రంజ, నము నొనర్చుట హరినామ ♦ మమరునీకు.

క॥ పురుషులలోఁగడు నుత్తమ, పురుషుఁడవై యొప్పుకతనఁ ♦ బురుషోత్తముఁడం
చు రచింతువు సిరిఁజేకొని, ధర శ్రీధరుఁడనెడు పేరు ♦ దాల్తువు వత్సా ! 202

వ. మఱియు నల్లనివాఁడ వౌటఁగృష్ణుండవనియును నాలుగు భుజంబుల నొప్పుటఁ జతుర్బాహుఁడవనియును విశ్వంబునెల్ల భరించువాఁడ వౌటంజేసి విశ్వంభరుఁ డవనియునుఁబరఁగుచు నీఁకను బలుపేరులను సార్థకంబులుగానొనర్చి ధరించెదవు.

—* విష్ణుమూర్తి తపస్సు చేయుట *—

చ॥ ఇఁకను దపింపు మాపయిని ♦ నెల్లనొనర్తువుగాక యంచుఁ బా
యక తనయందునున్న నిగ ♦ మావళి నిశ్వసితంబొనర్చి పు
త్త్రికునకొసంగి యంబికయుఁ ♦ దాను దిరోహితులైరి విష్ణుఁడా
ర్యకు శివమూర్తికిన్ బ్రణతు ♦ లల్లనఁ జేసి తపించె ధీరుఁడై. 204

ఆ॥ పదియు రెండు వేల ♦ వత్సరములు దపం, బరుదుగా నొనర్చి ♦ యబ్జనయనుఁ
డఖిలసిద్ధికరుని ♦ హరునిఁ గనన్ లేక, పొగులుచుండ నొక్క ♦ మ్రోత పొలిచె.

చ॥ "మరలఁ దపింపు మోపికను ♦ మానకు చాలదు నీతపంబు వే
గిరపడఁబోకు శంకరుఁ డ ♦ కిల్బిషుఁ డిష్టఫలప్రదాత ని
బ్బరమును జెంది చేకొను మ ♦ వశ్యము సర్వవిధార్థసిద్ధులన్
హరి!" యన నాలకించి యతఁ ♦ డానుడి యంబరవాణిగా నెదన్. 206

చ॥ తలఁచి కడున్ బ్రపత్తిమెయిఁ ♦ దద్దయుఁ బెద్దయుఁ గాలమట్లు ని
శ్చలమగు తాపసవ్రతము ♦ సల్పుచు శంభుదయన్ సుఖాత్మమై
యలరు ప్రబోధమొక్కఁ డుద ♦ యంబయి తోఁచిన నచ్యుతుండు పె
ల్లలరి మహేశతత్త్వవిభ ♦ వాయతసిద్ధికి నబ్రమొందు చున్. 207

గీ॥ చిరతపంబునఁ గడునల ♦ సినతనువున
నుండి జలధార లెంతయు ♦ దండిగాను
వెలువడుచు నుండ నాతఁడా ♦ సలిలమందుఁ
బవ్వళించి నిదురఁ జెందె ♦ బహుయుగములు. 208

క॥ నీరమునఁ దడవు కాలము, చేరివసించుటను జేసి ♦ చెన్నెసలారెన్
నారాయణుఁడను పేరున, నీరేజాక్షుండు కడిఁది ♦ నీటొప్పభువిన్. 209

గీ॥ నలిననయనుఁడా బ్రహ్మమన్ ♦ నారమందుఁ
బెద్దకాలంబు పవళించి ♦ నిద్దురొందె
నంత శంకరు నిచ్చచే ♦ నబ్జమొకఁడు
పొలిచె విష్ణుని పొక్కిటఁ ♦ బొంకముగను. 210

వ. మఱియు నారాజీవంబు.

ఉ॥ అంతములేని యోజనము ♦ లొనిడి వట్టులెమిాఱు నవ్వెడ
ల్పంతములేని నాళముల ♦ హద్వ్యగనొంది దినేంద్రకోటిభా

స్వాంతము కర్ణికారసుమ ♦ భాసురమున్ సుభగంబునై కడున్
వింతగఁ దత్త్వయుక్తమయి ♦ విశ్వజనీనముగాఁ దనర్చెడున్. 211

వ. అందు.

క॥ ఆలో వెలువడె నిరువది, నాలుగు తత్త్వములు ప్రణవ ♦ నాయకునిచ్చన్
మేలగువాని క్రమముఁ బరి, శీలనగా వింపు మిపుడు ♦ చెప్పెద మౌనీ ! 212

సీ॥ ప్రకృతినుంచి మహత్తు ♦ పరిఢవిల్లెను దానఁ, ద్రిగుణాఢ్యయగు నహం ♦ కృతి జనించె
నా యహంకృతిచేత ♦ నైదు తన్మాత్రలు, పరఁగె నవ్వానిచేఁ ♦ బంచభూత
ములు వానిచేతను ♦ బుట్టె నింద్రియములు, పది జ్ఞానకర్మసం ♦ పాదకములు.
సాత్త్వికాహంకార ♦ జనితమై మనమది, పొలిచె వీనిని జెంది ♦ పొంకముగను.

గీ॥ విష్ణువంతనె యెంతయు ♦ విస్మయంబుఁ, జెంది వీక్షించుచుండె నా ♦ నందమునను
పద్మమది దివ్యసౌరభ ♦ ప్రకరములను, నింపుచుండెను దశదిశా ♦ నివహమందు.

—* బ్రహ్మదేవుని జననము *—

ఉ॥ అందు శివుండు దక్షిణని ♦ జాంగమునుండి స్వకీయమాయచే
స్పందితుఁ గా నొనర్చె నను ♦ జక్కఁగ వెల్వడఁ జేసె నంత నేన్
బొందుగ నాల్గుమోముల వి ♦ భూతి దలిర్పఁగ శోణమూర్తినై
యెందును దల్లిదండ్రుల మ ♦ తెవ్వరినిన్ గనకాత్మఁ గుందుచున్. 214

ఉ॥ ఎవ్వఁడ నేను? పద్మతల ♦ మెందుల కొందితి నేడనుండి యి
ప్డివ్వనజంబుఁ బోవిడిచి ♦ యెచ్చటి కేగఁగఁ జెల్లునాకుఁ ? ద
ల్లెవ్వతయో? గురుం డెవఁడొ? ♦ యిష్టులు లేరొకొ? యంచు నెంచుచున్
నెవ్వగఁ జెంది కుందితి ము ♦ నీ ! శివమాయ నెఱుంగ కెద్దియున్. 215

ఆ॥ అంతఁ గొంతకాల ♦ మాలోచన యొనర్చి, తనకు వాసమైన ♦ తమ్మిపూవుఁ
దేఱి చూచి యపుడు ♦ దీనియాధారమే, నాకుఁ గర్తయనుచు ♦ సమ్మకమున.

చ॥ బిరబిర పద్మమున్ విడిచి ♦ బిట్టగు పూన్కిని నాళనాళమున్
వరుసగఁ జేరిపోవ నొక ♦ వర్ష శతంబు గతించె నంతకున్
సరసిజమున్న చోటుఁ గనఁ ♦ జాలక వేసరి యంత వెన్కకున్
మరలి రయంబునన్ నళిన ♦ మార్గముఁ జేకొని ప్రాకితిన్ బయిన్. 217

—* బ్రహ్మదేవుఁడు తపస్సొనరించుట *—

ఉ॥ ప్రాకుచునుంటిఁ గాని శత ♦ వత్సరకాలము పూర్వమున్న నా
ఱేకపుగద్దెఁ గన్గొనఁగ ♦ లేక భ్రమించుచు డిల్లపోయితిన్

జోకగనప్పు శంకరుని ♦ చోదనతోఁ 'దప' యంచు నొక్కఁడా
వాకు వినన్ బడెన్ బిదప ♦ వాసిగనట్లు తపించితిన్ గదన్. 218

గీ॥ తండ్రినిన్ గనుకూరిమిఁ ♦ దవిలి యేను
బదియు రెండేండ్లు సేయ న ♦ ప్పరమతపము
కన్పడియె నొక్కపురుషుండు ♦ గడిఁది పేర్మి
పద్మనేత్రంబులొప్పెడు ♦ బలియుఁ డపుడు. 219

ఉ॥ బంగరుపట్టుపుట్టముల ♦ బాగుగఁగట్టినవాఁడు చేతులన్
హంగుగ శంఖచక్రగద ♦ లబ్జమునొందినవాఁడు నీలమే
ఘాంగుఁడు కోటిమన్మథుల ♦ నందమునన్నిరసించువాఁడు నా
కుంగల సందియంబులను ♦ గుందును దీర్పగఁ జాలువాఁడటన్. 220

వ. అంత,

చ॥ కనుఁగొని యేను నీశ్వరుని ♦ గాటపుమాయఁగలంగి గర్వినై
వనరుహనేత్రునిన్ గని యె ♦ వండవు సెప్పుమటంచు నొక్కఁదె
బ్బను నురమందుఁ గొట్టుటయు ♦ బల్లిదుఁడాతఁడు వేగనంత ని
ద్రను విడి కూరుచుండి నను ♦ దాఁగని యిట్లనె సంతసంబునన్. 221

## —* బ్రహ్మవిష్ణుల వివాదము *—

ఉ॥ మంచిగవచ్చినాఁడవు కు ♦ మార ! శుభంబె ? భయంబువీడు ప్రే
మించి యొసంగువాఁడ నిఁక ♦ మేలగు సర్వవిధార్థ సిద్ధులన్
గొంచక యడ్గుమన్న విని ♦ గొప్పగు రాజసబుద్ధితోడఁ బ
ల్మించిన యల్కఁజెంది యద ♦ లించి హసించి యిట్లువాచించితిన్. 222

ఉ॥ ఓయికుమార ! యంచు నను ♦ నుల్కక పల్కుచునుంటివిట్లు నా
నాయనవోలె నీకుఁదగు ♦ నా యగునా పరు వబ్జసంభవున్
డాయఁగరమ్ము చూచెద ది ♦ టంబది యెంతో ? సరోజనేత్ర ! నే
నీయలవున్ జలంబు నిట ♦ నిల్పెద మల్పెద బాలిశోక్తులన్. 223

చ॥ అన వనజాతనేత్రుఁడు ప్రి ♦ యంబున నిట్లనె నీవు నాదునం
దనుఁడవు నాదునాభినళి ♦ నంబున నిన్ గనినాఁడ నింకనున్
వినయపు వృత్తమున్ గఱపి ♦ వేదచయంబు నొసంగవచ్చితిన్
నను గుఱితింప కిట్లు వృజి ♦ నంబులు పల్కుట నాయమానొకో. 224

క॥ అనవుడు వేదంబుల నా, కనుగ్రహాముసేయనిట్టు ♦ లరుదెంచితివా
నను నజు స్వాయంభువును గ, ర్తను జగములకెల్లననుచుఁ♦దామాడు శ్రుతుల్.

క॥ నేనే ప్రకృతినియంతను, నేనే సర్వప్రపంచ ♦ నిర్మాత నిఁకన్
నేనే విశ్వాత్ముండను, నేనే నిత్యుండ విన్ము ♦ నీరజనేత్రా! 226

క॥ అనుడు విని యాతఁడును గిను, కనుగొని నామాయనిట్లు ♦ గానకకాలుల్
నను వదరెదవది యిపుడే, కనఁబడు, వినుమైన మరలఁ ♦ గతపటినుడువుల్.

మ॥ పరతత్త్వంబగువాఁడ విష్ణుఁడఁ బర ♦ బ్రహ్మంబ సర్వేశుఁడన్
బరమజ్యోతిని విశ్వకారణుఁడ స ♦ ర్వవ్యాపి చిద్రూపుఁడన్
బురుషుండన్ బరమాత్మ నవ్యయుఁడ వి ♦ స్ఫూర్జత్ప్రధానంబు ధీ
నరుదొప్పన్ సృజియించినాఁడ త్రిగుణా ♦ హంకార తన్మాత్రలన్. 228

ఆ॥ వానినుండి భూత ♦ పంచకంబును నింద్రి, యములఁ బొడమజేసి ♦ నాఁడ నిట్టి
నన్నెఱుంగకిట్లు ♦ నర్థవాక్యంబుల, నాడెదేల పలుమ ♦ యబ్జగర్భ! 229

క॥ ఇపుడేని శరణమొందుము, విపరీతోక్తులనుమాని ♦ వేగ నిఁకను నే
నెపుడును రక్షించెద నిన్, గృపమెయి దుఃఖములనుండి ♦ గీడ్వడనియటుల్.

గీ॥ అనినఁ గడునల్గి యేనప్డు ♦ హరిని గవిసి, యుద్ధమొనరించితిని గడు ♦ నుద్ధతమతి
జరిగెఁ బెక్కేండ్లవఱకట్లు ♦ సంగరంబు, హరికి నాకును బ్రళయనీ♦రాకరమున.

## —* లింగోత్పత్తి *—

గీ॥ అంతలో నొక శివలింగ ♦ మనుపమంబు
ఆదిమధ్యాంతరహిత మ ♦ వ్యక్తమూర్తి
పెరుఁగుటయుఁ దఱుఁగుటలేని ♦ పేర్మినమరి
పోరుచున్నట్టి మామధ్యఁ ♦ బొలిచెఁబెలుచ. 232

వ. మఱియు నాలింగంబు

క॥ కాలానలశతనిభమై, జ్వాలామాలాసహస్ర ♦ చటులంబై మా
యాలమును మమ్ముఁ దెగడెడు, లీలగఁగన్పడుడు మదిఁ దె♦లిసికొని మేమున్.

వ. ఈలింగంబెచ్చటనుండి యెట్లిచ్చటఁ జేరెనోయని విచారించుచున్నంత నన్నుఁ
గాంచి విష్ణుండిట్లనియె. 234

చ॥ ఇరువురమిట్లు సంగరము ♦ నెంతయుఁ బూన్కి నొనర్చుచుండ ని
త్తఱిఁబొడసూపె నింకనొక ♦ దారుణవస్తువు నీవు దీనిడా

శిరమును గాంచిరమ్మని పరి ♦ శీలనఁ జేసెద నేను బాదముల్
సరగున దీనినారయుట ♦ చక్కని యోజ పయోజసంభవా! 235

ఉ॥ నావుడు వాయువేగము గ ♦ నంబగు దెల్లనివర్ణముం గడుం
జేవగలట్టి ఱెక్కలును ♦ జెందిన యందపు రాజహంసనై
నే వినువీధి కేగి యా న ♦ నిందితలింగశిరంబుఁ గాంచఁగా
శ్రీవిలసిల్లు నాహరియుఁ ♦ జెచ్చెర లింగపదంబులారయున్. 236

క॥ శతయోజనాయుతంబు ర, జతవర్ణము మేరుశైల ♦ సమవిస్తృతమున్
సితతీక్ష్ణదశనమును నై, యతిశయనద మొప్పఁ గ్రోడ ♦ మై వేగమునన్. 237

ఆ॥ పుడమిఁ ద్రవ్వుకొనుచుఁ ♦ బోయె నధోభాగ, మునను శేషకమఠ ♦ ములను దాటి
పెద్దకాలమరిగి ♦ తద్దయు నలసి పా, దములఁ గనక మరల ♦ ధాత్రిఁ జేరె. 238

వ. అట్లు నారాయణుండు శ్వేతవరాహరూపంబుఁ జెందిన యనేహంబు మొదలు చేసి యిక్కల్పంబు శ్వేతవరాహకల్పం బనంబడియె నంత.

క॥ నేనును జిరకాలము విను, పైనెగురుచుఁ బోయిపోయి ♦ బడలి యడలి య
డ్డేనియు నెగయఁగ లేక ధ, రానిలయముఁ జేరితిని శి ♦ రంబుఁ గనకయే. 240

గీ॥ అంత నిరువురమన్యోన్య ♦ మరసికొని య, శక్యమగుటయు శంభుతే ♦ జంబుఁ గాఁగ
నెఱిఁగి ధ్యానమొనర్చి మ ♦ హేశుఁ దనదు, రూపమును జూపఁగోరితి ♦ మోపి భక్తి.

## —* శబ్దబ్రహ్మోత్పత్తి *—

మ॥ ఒకనాదంబు వినంగనయ్యె నపుడో ♦ మోమంచు నుచ్చైస్స్వనం
బు కడుం దీర్ఘము స్పష్టమై యట మొదల్ ♦ పొల్పొప్పె నాద్యస్వరం
బికనా పైన నుకారమాపయిని నొ ♦ ప్పింపౌ మకారంబునున్
బ్రకటంబౌ తుదినాదమోమనుచు వి ♦ భ్రాజద్గతిన్ మీఱుచున్. 242

గీ॥ ఆద్యవర్ణం బకారమ ♦ ర్కబింబ, నిభము దక్షిణమున నగ్ని ♦ నిభముగాను
కార ముత్తరమునను మ ♦ కారమిందు, మండలప్రఖ్యమై మధ్య ♦ నిందుకొనియె.

క॥ శుద్ధస్ఫటికాకారం, బిద్ధము పరమాత్మ మమల ♦ మీడ్యప్రభమున్
సిద్ధానందము ధృఢ మప, విద్ధపరిచ్ఛేదమగుచు ♦ వెలసె నటుపయిన్. 244

వ. వెఱఁగుపడి యద్దాని నారయుచుండ నంత రాజీవాక్షుండు శబ్దబ్రహ్మాత్మ నుండును బరబ్రహ్మంబును బరమేశ్వరుండు నగు మహాదేవునిఁగాఁ గుఱితించె నంత నాశబ్దంబునందు.

క॥ బీజము యోనియు బీజిగ, రాజిల్లెడు నాత్రివర్ణ ♦ రాజములందున్
బీజమునలువ యకారము, భ్రాజిలునలయోని హరి యు ♦ వర్ణము వినుఁడీ !

క॥ వెలసెడు బీజి మకారం, బిలరుద్రుఁడుగాఁగ వీర ♦ లిటు క్రమముమెయిన్
విలసిలుదు రఖిలసర్గం, బలరఁగ మోహము నను్గ ♦ హంబు సలుపు చున్.

వ. ఈ ముప్పురకస్పైనఁ బ్రిధానపురుషేశ్వరుండగు మహేశ్వరుండు నాదా
త్మకమై యలరారు నతండే యాత్రివిధంబులగు బీజబీజయోనులనుగ నాత్మను
విభజించి వెలయించె. అట్టిమహేశ్వరుండే యాలింగఁబు.

గీ॥ అమ్మహాలింగమున బీజ ♦ మగు నకార
మాయుకారాత్మమగు యోని ♦ యందుఁ జేర్పఁ
బడి పొదలి కాంచనాండమై ♦ కరముచిరము
నీరమందుండె నెంతయు ♦ నీటుమీఱి. 249

గీ॥ వేయియేఁడుల కద్దాని ♦ విశ్వభర్త
నీటినుండి వెలువఱచి ♦ సూటి నొక్క
ఘాతమున రెండు సేయ నో ♦ కండుపైక
పాలమగుడు మఱొండయ్యె ♦ వసుమతిగను. 250

క॥ ఆయండమున విరించనుఁ, డాయతభుజుఁ డుద్భవిల్లె ♦ నతఁడె జగములన్
జేయును సర్గేశుండయి, యాయదె యోమనెడినాద ♦ మెఱుఁగుఁడు మదులన్.

గీ॥ అని యజుర్వేదము వచింప ♦ నల్లె నిజమ
టంచు ఋక్కులు సామంలు ♦ లనియెనిట్లు
తెలిసి దేవేశుఁడగు మహా ♦ దేవుగుఱిచి
యేము ధ్యానము నొనరింప ♦ నీశ్వరుండు. 252

—* అక్షరమూర్తి ప్రకటనము *—

గీ॥ అక్షరాత్మకమగు రూప ♦ మప్పుడు చెంది
నగుచు మాయెట్టయెదురుగా ♦ నగుపడుడు ము
దమ్మిసుమడింప మేము ని ♦ ద్దఱముఁగాంచి
నార మామూర్తి నెందుఁ గా ♦ నఁగఁదరంబె. 253

సీ॥ అల అకారము మూర్ధ ♦ మాకారములలాట, మక్షులు కుడియెడ్మ ♦ లలఇ, ఈ, లు
విలసిల్లు కుడియెడ్మ ♦ వీనులై ఉద్వాయి, ఋద్వాయమే కపో ♦ లద్వయంబు
వలపల దాపల ♦ వనరు నాసాపుటం, బులు ఌద్వయంబయి ♦ పొలుపుమీఱె
ఏకార మూర్ధ్వోష్ఠ ♦ మైకార మధరోష్ఠ, మో,ఔ,లు రదరాజి ♦ యొప్పెనటులె

గీ॥ ఆ యనుస్వారము విసర్గ ♦ మల్లతాలు, యుగళి దక్షిణవామబా ♦ హులు కవర్గ
మునుజవర్గంబటులెపాద ♦ ములు టవర్గ, మును దవర్గంబుగాఁగడు ♦ మురుపుమీఱె.

గీ॥ ఉదరము పవర్ణమై పక్క ♦ లొప్పె కుడియు
నెడమలు ఫవర్ణము బవర్ణ ♦ మింపుమీఱ
స్కంధ మలరొందెను భవర్ణ ♦ కలితమై మ
వర్ణమయ్యెను హృదయంబు ♦ వాసియమర. 255

క॥ యరలవశషసా లేడును, వరుసదనర సప్తధాతు ♦ వర్గంబయ్యెన్
వఱలె హకారము నాభిగ, నరుదగు ఘ్రాణము క్షకార ♦ మైయొప్పెఁగడున్.

గీ॥ ఇట్లు వర్ణాత్మకంబౌ మ ♦ హేశతనువు
నేను హరియును గని వేడ్క ♦ నివ్వటిల్లఁ
దిరుగ నంతకుఁబయిఁ జూచి ♦ తిమి వరేణ్య
మంత్రిమయమైన యీశ్వరు ♦ మహితమూర్తి. 257

వ. అందు నోంకారసంభవంబును గలాపంచకసంయుతంబును శుద్ధస్ఫటికాకారం బును, అష్టత్రింశదక్షరంబును, మేఘాకారంబును, సర్వధర్మార్థసాధకంబును, గాయత్రీప్రభవంబును, వశ్యకారకంబును, జతుర్వింశతివర్ణాఢ్యంబును, జతు ష్కళమును, బంచశతమును, గలాష్టకసమన్వితంబును, నత్యంతాభిచారికంబును ద్రింశచ్ఛుభాక్షరంబును, యజుర్వేదసమాయుక్తంబును, బంచవింశచ్ఛుభాక్ష రంబును, కలాష్టక సమన్వితంబును, సుశ్వేతంబును, శాంతికంబును, త్రయో దశకలాయుక్తంబును, లోహితంబును, నుత్పత్తివృద్ధి సంహార కారణంబును నేకాధికషష్టిపరిమితాక్షరంబును నవు మంత్రంబులం బరికించితిమి. అట్లు మృత్యుంజయ మంత్రంబును, పంచాక్షర మంత్రింబును, జింతామణీ మంత్రం బును, దక్షిణామూర్తి మంత్రంబును, తత్త్వమసియను మహావాక్య మంత్రి మును, గన్పట్టుడు భగవానుండగు నారాయణుం డేనును జపించితి మంత నీశానుం డును ద్రియారూపుండును, బురుషుండును, బురాతనుండును, నఘోరహృద యుండును, సుందరుండును, లలితపాదుండును, విశ్వాతోక్షికరుండును, బ్రహ్మాధి పతియును, సర్గస్థితిప్రళయకారణుండును, వరదుండు నీశ్వరుండునగు మహా దేవునింగాంచి యిష్టవచనంబులతో సన్నుతులఁ బొనర్చితిమి. 258

## —శక్తి విశిష్టేశ్వర సాక్షాత్కారము *—

కఁ శివుఁడంత శక్తియుతుఁడై, త్రివిలోచనుఁడై విభూతి ♦ దివ్యన్ముఖుడై
వివిధాభరణతనుండై, యవిరళకృప దరిసెనంబు ♦ నపుడొసఁగె వడిన్. 259

గీ॥ అంత మేమెంతో సంతసం ♦ బపుడు చెంది, మరల నద్దేవదేవునిఁ ♦ గరముభక్తి
నుతిఁబొనర్చితిమంత నే♦యతులకరుణఁ, బ్రౌఢమైతగు నిగమస ♦ ర్వస్వమిడిమె.

గీ॥ దాన విజ్ఞానగరిమ నెం♦తయును జెంది, నారమచ్యుతుఁడపుడా యు♦దారమూర్తిఁ
గాంచి కేల్గవజోడించి ♦ వంచితనువు, మించి వేడుకనిట్లు ల ♦ ర్థించి యడిగె.

ఉ॥ నీమదికెట్లు సంతసము ♦ నెక్కొనఁజేయఁగఁ జాలువారమో
రేమిట నీవు మెచ్చెదో మ ♦ హేశ్వర! నీదగు నర్చయెట్టిదో
మేమొనరింపఁగాఁదగిన ♦ మేలిమి కృత్యమదేమొ యుత్తటిన్
బ్రేముడిమీఱఁదెల్పి మముఁ ♦ బ్రీతులఁజేసి యనుగ్రహింపవే. 262

చ॥ అనియడుగన్ మహేశ్వరుఁడు ♦ హర్షముతోడ నిటుల్వచించె భ
క్తినిఁగొని మీరలిప్పగిదిఁ ♦ దేఁకువతో నుతి సల్పినందు కే
నును బరితోషమొందితి న ♦ నుత్తములార! శివుండ నేను మీ
మనమున జంకుఁగొంకు నను ♦ మానము మాని వినుండు నానుడిన్. 263

—* శివుఁడు బ్రహ్మవిష్ణులకు లింగమును బూజించుఁడని చెప్పుట *—

క॥ లింగంబిది పూజింపుఁడు, లింగంబే నాదుమూర్తి ♦ లీలమెయినిటన్
రంగుసెడి జగములన్నియు, భంగంబును జెందుకతనఁ ♦ బదమది యొదవెన్.

క॥ కూఁటిమి నాలింగంబును, మీఱినయనురాగమొప్ప ♦ మీరలుగొలువుం
డారసి మీయిష్టంబులఁ, దీరుతు సందియము లేదు ♦ దివ్యప్రజ్ఞుల్! 265

క॥ మీకెపుడిడుమలఁ బెన్వగ, సేకూరిన మామకీన ♦ శివలింగము న
స్తోకమతి నర్చ సేయుఁడు, వీఁకటి నశియించు సర్వ ♦ విధములగు వెతల్. 266

క॥ పార్థివలింగము సల్పి సు, ఖార్థులగుచుఁ బూజసేయు ♦ నభిమతముగ స
ర్వార్థముల నొసఁగువాఁడఁ గృ, తార్థులగుదు రెందు జనము ♦ లరయుండట్టుల్.

చ॥ తెవిరివినుండు మీరలు మ ♦ దీయతనూజులు వామగాత్రిమం
దవిరళతేజ! గంటి నిను ♦ నబ్జజు దక్షిణమూర్తిఁ గాంచితిఁ
భువనములన్ రచించు విధి ♦ పుష్కరలోచన! వానిఁబ్రోవు నే
ర్పవునటు లేనునున్ బయిని ♦ నారయుచుండెద మిమ్ము నిచ్చలున్. 268

క॥ అని లింగపూజన క్రమ, మును మాకెఱిఁగించినంత ♦ మురిసితి మేమున్
వనజేక్షణుండు శంకరుఁ, గని మరలన్ గోరెనిట్లు ♦ ఘనమగు వేడ్కన్. 269

ఉ॥ దేవ! వరంబు మాకిడ మ ♦ దిన్ గృపఁబూనితివేని మేమునున్
బావనమైన నీకృపకుఁ ♦ బాత్రులమేని యనుగ్రహించి మా

కేవగనైనఁగాని చలి ♦ యింపని నీపదభక్తి నిమ్మఁకన్
నీవును మాకుఁదోడుగ జ ♦ నించి యొనర్పుము సాయమన్నిటన్. 270

వ. అని యర్థించిన మహాదేవుండిట్లనియె.

ఉ॥ ఇచ్చితి నాదుభక్తిఁగడు ♦ హెచ్చుగ మీకు సురేశులార! పై
పెచ్చిఁక మీకు నూఁతగ భు ♦ విన్ ననుఁబుట్టు మటంచుఁగోరి నా
రిచ్చ మెయిన్ జగంబులను ♦ నేన రచింతును బెంతుఁ ద్రుంతు నే
నెచ్చట నెట్టి వైకృతుల ♦ నెప్పుడుఁ జెందనివాఁడఁ జూడుఁడీ. 271

గీ॥ సచ్చిదానందరూపుఁడ ♦ సత్యమూర్తి, నగు పరబ్రహ్మమేను మూ ♦ డగువిధముల
బ్రహ్మ విష్ణు హరాఖ్యలఁ ♦ బరఁగి సృష్టి, రక్షణాంతము లొనరింతు ♦ నట్టులేక.

ఉ॥ ఒక్కటిగాఁగనుండిన మ ♦ హోజ్జ్వల తేజము మూఁడుమూర్తులై
చక్కఁగనంబడున్ భిద య ♦ సత్యము బంగరు వొక్కటయ్యునున్
జెక్కులు సొమ్ములై తనరి ♦ భేదములేక యొసంగు వృత్తి దా
నొక్కటి పెక్కురూపముల ♦ నొందియుఁ జెందదు వస్తుభేదమున్. 273

—* శివుఁడు బ్రహ్మముఖంబున రుద్రుఁడనై పుట్టెదనని చెప్పుట *—

క॥ మీయాప్సితంబు నిత్తుఁ, ద్రోయంగాఁజాల నీకను ♦ దోయజగర్భా!
నీయలికంబునఁ బొడమెదఁ, జేయుము నామకరణంబుఁ ♦ జెలగెడు వేడ్కన్.

క॥ రుద్రుఁడను పేరు చేకొని, భద్రాత్మకమూర్తినగుచుఁ ♦ బరగుదు నాయీ
చిద్రూపమునకు నతని ల, సద్రూపంబునకు లేద ♦ జా! భేదమెటన్. 275

గీ॥ మీరలిరువు రటుల్ నాయ ♦ మేయతేజ
మైననున్ మాయకగ్గమై ♦ యమరియుందు
రతఁడు ప్రకృతికి లోఁగక ♦ యలరు నాదు
పూర్ణమగు నవతారమై ♦ పొలుచుకతన. 276

ఉ॥ కావున నాకు రుద్రునకుఁ ♦ గల్పనసేయకుఁ డెందు భేదపున్
భావము లాతనిన్ గొలిచి ♦ భద్రములొందుఁ డతండు నేన నే
నా వృషకేతుఁడౌ ననలమప్పలఁ ♦ జెందినఁ గూడఁదాక నీ
దావిధి నేనునున్ గుణస ♦ మాశ్రయమొందిన నొంద బంధమున్. 277

నీవు రజోగుణంబున జ ♦ నింపఁగఁ జేయు విధాత! లోకముల్
ఉ॥ పావని నాదుశక్తి నిను ♦ భారతివై భజియించు నెప్డు రా

జీవదళాక్ష! సత్త్వగుణ ♦ సేవధివై భువనంబులేలు నిన్
శ్రీవనితాస్వరూపమునఁ ♦ జెందును మామకశక్తి యట్టులే. 278

గీ॥ ఇఁకను రుద్రుఁడు తామసం ♦ బెనసి సర్వ
లోకములఁ నంతమొందించు ♦ వీఁక మెఱసి
ఆతనిన్ జేరు నాశక్తి ♦ యతులమూర్తి
కాళికయనాఁగఁ బేర్మిఁ బ్రఖ్యాతయగుచు. 279

క॥ అంతస్సత్త్వుఁడు రుద్రుం, డెంతయుఁదమమొనయు వెలికి ♦ నీవును నటులే
నంతస్తమస్కుఁడవగుదు, వింతగ సత్త్వగుణుఁడవయి ♦ వెలసెదు వెలికిన్.

గీ॥ అజుఁడు బహిరంతరంగము ♦ లందు రజము, నే
ధరించునుగాని న ♦ న్నిష్టగౌరి
తొలిభవంబునఁ దపసొంది ♦ కొలిచినట్టి
కతనఁ దత్ఫలమునఁ బుట్టుఁ ♦ గాంతు ననఘ! 281

ఉ॥ సాయమొనర్తు మీకిఁకను ♦ సర్వవిధార్థములందు మీకునున్
బాయక నన్నుఁ గొల్చుఁడు శు ♦ భంబగు నంబుజనేత్ర! నీకు నా
కేయెడ భేదభావమది ♦ యెప్పుడు గల్గదు నేను నీవ నీ
వేయయి గానుపింతునిఁక ♦ నేనును రుద్రుఁడనై జగంబునన్. 282

చ॥ నలువకు మించినట్టి యల ♦ నాకవిరోధుల గీటడంపు ని
చ్చలు వివిధావతారములఁ ♦ జక్కఁగ నొంది జగంబులేలు నీ
యలవికి మించినట్టి దను ♦ జాగ్రణులన్ సమయింతు నేను నన్
దలఁపుము సంకటంబుల ని ♦ తాంతము గాచెద రుద్రమూర్తినై. 283

క॥ నీకును నాకును భేదము, లేకున్నను నెవ్వఁడేన్ జ ♦ లింపక మదిలో
లేకియయి భేదమెంచిన, చీఁకటి నరకంబునూతఁ ♦ జేర్పడెడు హరీ! 284

ఆ॥ నన్నుఁ బూజచేసి ♦ నిన్ను నిందించిన, నిన్నుఁ బూజచేసి ♦ నన్ను దూఱ
సందియంబులేక ♦ శమనుని శిక్షకుఁ, బాత్రమగుదురంతు ♦ పంతులేక.

క॥ మఱియుఁ ద్రిమూర్తులయెడ నే, మొఱకైనను జెడుతలంపుఁ ♦ బూనినయెడ వాఁ
డరమరలేకయె చెడు న, చ్చెరువిందుల లేదెఱుంగు ♦ శ్రీహరి! యెపుడున్.

—* బ్రహ్మ విష్ణ్వాదుల కాయుర్నిరూపణము *—

గీ॥ ఇఁకను మీకును నిర్జర ♦ ప్రకరమునకుఁ
బంచజనులకు నాయుర్వ్య ♦ వస్థ వినుఁడు
కృతయుగము త్రేత ద్వాపరాం ♦ కితము గలియు
గంబునానొప్పు నాల్గుయు ♦ గంబు లిలను. 287

గీ॥ ఆ చతుర్యుగ సాహస్రి ♦ మైన నజున,
కగునహం బట్లె రాతిరి ♦ యగును ముప్ప
దిట్టి దినముల కొక నెల ♦ యెసఁగు నివియుఁ
బదియు రెండైన నొక యేఁడు ♦ పరిధవిల్లు. 288

క॥ అట్టి శతవత్సరంబులు, బిట్టుగ నాయువగు విధికి ♦ విధి యేఁడొకఁడౌ
నెట్టన నీకొకవాసర, మట్టిదినంబుల శతాబ్ద ♦ మాయువు నీకౌ. 289

ఆ॥ జలజనయన ! నీదు ♦ సంవత్సరం బొకం, డగును రుద్రునకు న ♦ హం బొకండు
అట్టి వాసరముల ♦ హాయనశతమైన, దు(దుఁడపుడు నరుని ♦ రూపు దాల్చు.

వ. మఱియువినుండు త్రిమూర్తులకు నఖిలదేవ గంధర్వ దనుజ మనుజాది దేహు లకుఁ బ్రతిదినం బుచ్ఛ్వాసనిశ్వాసంబు లిరువదియొక్క వేయి యాఱునూఱులు ప్రవర్తించుచుండు నట్టి ప్రవర్తిల్లినదినంబుల మానంబుతో నగు సంవత్సర శతంబులు వారికాయుర్దాయమగు నిఁక నుచ్ఛ్వాసనిశ్వాసంబు లాఱైన నొక్క పలంబగు నట్టివి యఱువదియైన నొక్కఘటియగు నాఘటికాషష్టియైన నొక పవలును రాతిరియునగును. సామాన్యజనుల కీయుచ్ఛ్వాస నిశ్వా సంబుల తెఱంగెఱింగి లెక్కపెట్టుట గడుదుర్లభంబు. యోగులగువారల కయ్యది సులభంబిఁక మీరడిగినవెల్లఁ దెలిపి మీయభీష్టవరంబుల నిచ్చితి నీవిదపఁ జెచ్చెరబ్రహ్మలలాటంబున నీలలోహితరుద్రుఁడనై పొడసూపుదు మీరనవరతంబు లింగపూజనం బొనరింపుచు నా విధించినయట్లు సర్గాదుల రచించుచుండుఁడని మహేశ్వరుం డంతర్ధానంబు నొందెనంత నవ్వార లతి భక్తితో లింగంబు నర్చించిరది మొదలు లింగపూజనంబు ప్రసిద్ధంబై సర్వజన సేవితంబై యొప్పె నని పద్మసంభవుఁడు నారదునకుఁ జెప్పెననుడు నంత నూతునకు మునులిట్లనిరి. 291

గీ॥ లింగపూజాక్రమంబున ♦ లికనయనుఁడు, జలజనేత్రునకును విరిం ♦ చనున కలరి
చెప్పెనంచాడితి రదియే♦చొప్పు మేమె, లింగఁజాలము చెప్పుమ♦నంగనతఁడు.

క॥ మురిసి యటులే వచించెద, వరమతి లిఁక వినుఁడు శివుఁడు ♦ వైకుంఠునకున్
సరసిజభవునకు నుడివిన, తెఱఁగు నిజాత్మజులకజుఁడు ♦ దెలిపె ముదమునన్.

ఆ॥ ఆసనత్కుమారు ♦ డస్మద్గురున కుప, మన్యునకును జెప్పె ♦ మాన్యమూర్తి
నాసతీర్థులకును ♦ నాకును మాగురుం, డాదరమునఁ దెలిపె ♦ వ్యాసమౌని. 294

గీ॥ అతులచారిత్రుఁ డుపమన్యుఁ♦డట్టికృష్ణు, నకు వచించెను లింగార్చ♦నాక్రమంబు
మీకు నటులేను దెల్పెద♦మీరలెఱిఁగి, చేయుఁడు మహేశలింగార్చ♦సిద్ధులౌనరు.

క॥ నారదముని యడుగుడు న, న్నీరజగర్భుండు చెప్పె ♦ నేరిమి మీఱన్
గూరిమిఁ గుమార! శివపూ, జారీతి వచింపదరమె ♦ శతసమలకునున్. 296

వ. ఐనను సంక్షేపంబుగాఁ జెప్పెదను వినుము.

క॥ ధర బ్రహ్మక్షత్రియ వి, ట్చరణోద్భవు లాంధ్రుమగలు ♦ శర్వసమర్చన్
నిరతులయి చేయఁజెల్లును, దరమారసి వారివారి ♦ ధర్మానుస్మృతిన్. 297

శా॥ ఆయుష్మంతులు వంశకర్తలును నీ ♦ డ్యప్రజ్ఞులౌ పుత్రులన్
జాయన్ బుణ్యగుణోత్తమన్ రమణి వి ♦ జ్ఞానాఢ్యయౌ విద్య నా
త్మాయత్తంబగు మేటి భాగ్యమును దీ ♦ ర్ఘాయుస్సు న్నారోగ్యమున్
శ్రీయొప్పొందు మహేశపూజన మిదున్ ♦ సిద్ధంబు పుత్రోత్తమా! 298

ఆ॥ శివుని పూజనెపుడు ♦ సేయని చెనఁటికి, నాల్గువిధములౌ న ♦ నర్థములు ఘ
టిల్లు దెవులు లేమి ♦ డియు రాజశిక్షయు, వడిసిపోని ఋణము ♦ కొడుక! వినుమ.

## —* శివపూజావిధానము *—

క॥ ప్రొద్దు పొడుచుటకు మున్నే, నిద్దురవిడి శివుని హరిని ♦ నిజదేశికునిన్
హృద్దేశంబునఁ బేర్కొని, యద్దివిమ తీర్థరాజి ♦ నాత్మఁ దలఁచియున్. 300

వ. అంత

గీ॥ దక్షిణాశకరిగి మలో ♦ త్సర్జనం బా
నరిచి మైదు తడవలు భూ ♦ సురుఁడు మృత్తుఁ
బడసి పాయువుఁ గడుగఁగా ♦ వలయు గుహ్య
మొక్క పరిశుద్ధిసేయఁగ ♦ నొప్పు నిలను. 301

సీ॥ క్షత్రియుఁడు నాల్గుమా ర్లూరు ♦ జాతుఁడును ద్వి
వారము జఘన్యజుఁడును ద్రి ♦ వార మాఁడు
వారు శూద్రునివలె మట్టిఁ ♦ బడసి పాయు
వును గడుగవలయును గుహ్యా ♦ మును నొకపరి. 302

క॥ ఎడమచెయి పదియుమాఱులు, కుడిచేతిని నేడుమార్లు ♦ కుడియెడమల నే
ర్పడు కరచరణముల నటుల్, గడుగవలయు నొక్కమాఱు ♦ కల్మషమడియన్.

వ. అటుపిమ్మట దంతధావనమునకై ద్వాదశాంగుళ ప్రమాణంబుగా దంతకాష్ఠంబుఁ గొని తద్ధావనంబు సేయవలయును. క్షత్రియ విట్ఛూద్రులు క్రమంబుగ నంత నొక్కొక్క యంగుళ పరిమాణంబు తగ్గించి దంతయష్టిన్ గొని దంతధావనంబు సేయవలయు నిది ప్రతిపత్ షష్ఠీనవమీ పర్వంబులందును, రవివారంబులందును శ్రాద్ధదినములు మున్నగు నిషిద్ధదినములందును జేయఁగిట్టదు. అట్టి యనర్హ దినంబులందు దంతధావనార్థంబు పదిరెండుతడవలం జలులతో గండూషంబు సేయనగు—అనంతరంబు తీర్థాదులందు సమంత్రకంబుగ స్నానమాడవలయు నటుపిమ్మట నాచమనముచేసి తడివస్త్రంబుల విడిచి ధౌతపటంబుల ధరించి యేకాంత సుస్థలంబునం గూర్చుండి సంధ్యావిధి ననుష్ఠించి మనంబు సుస్థిరంబొనర్చి పూజాగృహంబుఁ జేరి స్వాసనంబులఁ గూర్చుండి న్యాసాదికంబులొనర్చి క్రమంబుగఁ బూజావిధి నారంభము సేయవలయును. 304

తే-గీ॥ అష్టదళపద్మము రచించి ♦ యందు ముందు
భద్రకరివక్త్రుఁ గొలిచి దా ♦ వారికులను
దిక్పతులఁ బూజజేసి యెం ♦ తేనిఁ బీఠ
పూజనమునేని యట లింగ ♦ మూర్తి నునిచి. 305

స్త్రంబులన్ గడ్గి, కొనియుఁ ప్రాణాయామ ♦ మును నొనర్చి
హు శుద్ధస్ఫటి, కాకారు శంకరు ♦ నాత్మఁగొలిచి
రియించి యఘమును, దహియించి తనుశుద్ధి ♦ నవరఁజేసి
లిఁ గరన్యాస, మట్లె యంగన్యాస ♦ మమరసల్పి
♦ బరగనాచ
బు ♦ నొనరనిల్పి

వానిపై దర్భలనుజేర్చి ♦ వరుసవారి
తోడ నభ్యుక్షణముచేసి ♦ తోయముంచి. 306

గీ॥ షట్పాది- ప్రణవమును స్మరియించుచుఁ ♦ బాద్యపాత్రి
యందు శీరంబుఁ జందనం ♦ బమరఁజేర్చి
జాతి కంకోల కర్పూర ♦ జాతచూర్ణ
ములను వటమూలజతమాల ♦ భూజజముల
రజము నర్ఘ్యాచమనపుఁ బా ♦ త్రిల ఘటించి
యన్నిటను జందనద్రవ్య ♦ మమరఁజేసి. 307

క॥ శ్రీ నీలగళుని సన్నిధి, లో నందీశ్వరుని నిల్పి ♦ లోలుపమతి సు
ధ్యానావాహనములచే, స్నానసుగంధాది పూజ ♦ నముఁ జేయవలెన్. 308

వ. అనంతరం బందు శివునకుఁ బూర్వదిశయందు నణిమను, దక్షిణంబున లఘి మను, పశ్చిమంబున మహిమను, ఉత్తరంబందు గరిమను, నూర్ధ్వంబున బ్రాప్తిని, నాగ్నేయంబునఁ బ్రాకామ్యంబును, నిరుతిదిశను నీశత్వంబును, వాయవ్యంబున వశిత్వంబును, నీశాన్యంబందు సర్వజ్ఞత్వంబును, కర్ణికయందు సోముని, సోమునికిఁ గ్రిందుగ సూర్యుని, సూర్యాధఃప్రదేశంబునఁ బావకునిఁ బావకునికిఁ గ్రిందుగ ధర్మాదులను, సోమునికి వెనుక గుణత్రయంబును, జతుర్దిక్కులందు నవ్యక్తాదులను, గ్రమంబునఁ గల్పన సేయవలయును. మఱియుఁ బరమేశ్వరునకు సద్యోజాత మంత్రంబున నావాహనంబుచేసి వామ దేవమంత్రంబున సింహాసనోపవేశనంబును, దత్పురుషమంత్రంబున సాన్నిధ్యం బును నఘోరమంత్రంబున నిరోధంబును, నీశానమంత్రంబునఁ బాద్యాచమనా ర్ఘ్యంబుల నొసంగి పూజఁ గావించవలయును. ప్రత్యుపచారంబునందుఁ బ్రణ వాదిగ నమోంతముగ నర్చించవలయును. పరమశివుని సుగంధ చందనోద కంబులఁ బంచామృతంబులఁ బుష్పోదకంబుల ఫలరసంబులఁ బ్రణవముచే నభి మంత్రించి యభిషేకముచేసి శ్వేతవస్త్రంబునం దడియొత్తి, భస్మలేపనం బొనర్చి వేగిరంబుగఁ జందనం బర్పింప వలయును. అటుమీఁద సుందరంబులు నక్షతంబులగు శ్వేతతండులంబులను గుశాపామార్గ పాటలీ కర్పూరంబులను, జాది, సంపెంగ, తెల్లగన్నేరు, మల్లెపూవులును, దుమ్మిపూవుల, జమ్మి పూవులఁ గలువలఁ గ్రొత్తక్రొత్త రకంబులగు ప్రత్యగ్రసుందర సుగంధ పుష్పంబులను, గోమలబిల్వదళంబుల నర్చింపవలయును. మఱియు నభిషేకం

బందు జలధార సమంత్రకంబుగనే యర్పించవలయును. ఆ మంత్రంబులను గూడ నుడివెదను వినుండు. రుద్రంబును, నీలరుద్రంబును జమకంబును, శ్రీసూక్తంబును, రాత్రిసూక్తంబును, హోతారంబు, అధర్వశిరస్సు, అథర్వ * శిఖయు, శాంతియు, వరుణంబును, సామంబును, పుష్పసూక్తంబును, పురుష సూక్తంబును మృత్యుంజయమంత్రంబును, పంచాక్షరంబు మున్నగునవి వీనిఁ బఠింపుచు సహస్రజలధారలతోఁగాని ఏకోత్తరశతధారలతోఁగాని, యభిషేకము చేయవలయును. అనంతరము మరల విభూతిచందనాక్షత కుసుమ బిల్వంబుల లింగమున కర్పించవలయును. పిమ్మట ప్రణవోచ్చార ణంబున ముఖవాసన లొసంగి ధూపదీప నైవేద్య తాంబూల నీరాజనంబుల సమర్పించి నానావిధధ్యానమంత్రపఠనంబుతో మంత్రపుష్పంబిడి నమస్కరించి పునరర్ఘ్యంబిచ్చి సుందరసుమంబులం బాదంబులందుజల్లి నిలిచి దోయిలి వట్టి యిట్లు శంకరుని బ్రార్థించవలయును. 309

క॥ ఎఱిఁగియు నెఱుఁగకయో నిన్, పరమేశ్వర! కొలిచినాఁడ ♦ భాస్వరకృప నీ
వరసి సఫలం బొనర్పుము, కరుణాకర ! భక్తలోక ♦ కల్పవలాశీ ! 310

గీ॥ ఇట్లు విజ్ఞాపనయొనర్చి ♦ యీశుమౌళి, విపుల నర్పణ చేసి భూ ♦ సురుల చేత
స్వస్తిమంత్రంబులను లెస్సఁ ♦ జదువఁ జేసి, మార్జనము చేసి శివుని న♦మస్కరించి.

క॥ శివ ! నీదు భక్తి నొసఁగుము, శివ ! నీదు ప్రపత్తి నిడు స ♦ సిగ నేజనినే
శివ ! నీదు భక్తి నొసఁగుము, శివ ! నీదు ప్రపత్తినిమ్ము ♦ చేమోడ్పులివే. 312

గీ॥ ఇట్లు శంకరుఁ బ్రార్థించి ♦ యెంతయేని, భక్తితో గళనాదంబుఁ బట్టి మ్రొక్కి
హరుని పరిచారగణముల♦ కెఱిఁగి యర్చ, ననుసమాప్తి యొనర్పఁద♦గును ముదమున

గీ॥ ఇట్లు శివభక్తుఁడై యెవఁ♦డీశ్వరార్చ, నముఁ బొనర్చునో యవ్వాని♦కమరునఖిల
సిద్ధులును సకలాభీష్ట♦సిద్ధులును న, తండు వక్తలలోన ను♦త్తమతఁడనరు. 314

క॥ రోగంబును వగపును వ్రా, ద్వేగంబును గలుషములను ♦ విసమును బుణమున్
బోగొట్టు శివసమర్చన, బాగుగఁ గళ్యాణమిచ్చి ♦ పాలించునిలన్. 315

ఆ॥ ఇట్లు చెప్పినాఁడ ♦ నీశ్వరార్చన విధ, మింక నేదివినఁగ ♦ నెంచినాఁడ
వడుగుమన్న నాతఁ♦డలరి యిట్లనె దేవ!, మఱియు జెప్పు శివస♦మర్చఁగుఱిచి.

వ. అనిన వనజోద్భవుండిట్లనియె.

---

* ఈ వచనంబందు స్పష్టార్థము కొన్ని పదంబులందు సంధి చేయలేదు.

చ॥ వినుము కుమార! యొక్కప్పుడు ♦ వేడుకతో సురలన్ మునీంద్రులన్
గని యిటులంటి శాశ్వతసు ♦ ఖంబును నెవ్వరు గోరువారలో
ఘనతర సిద్ధులన్ వలచు ♦ కాముకులెవ్వరో వారనెల్ల నన్
వెనుకొనిరండనాన్ గదలి ♦ వేగిరమట్టులె వచ్చిరందఱున్. 317

ఉ॥ అంతనె వారలేను గల ♦ శాబ్ధినిఁ జేరఁగఁబోయి యందు దై
త్యాంతకు నాదిదేవు వన ♦ జాక్షుని డాసి జోహారుచేయ న
ల్లంతనె యమ్మహాత్ముఁడు ర ♦ యంబునఁగన్గొని మీరలందఱున్
వింతగఁ జేరినా రిటకు ♦ వేగవచింపుఁడు కారణంబనన్. 318

ఉ॥ ఏమువచించినారము ర ♦ మేశ్వర! మాకెఱుఁగంగఁ జెప్పుమా
పేర్మిముడి నెవ్వనిన్ గొలువఁ ♦ బెంపటి దుఃఖము లెల్లడుల్లునా
నా మధువైరి యిట్లనియె ♦ నక్కట యంబుజగర్భ! యేను నీ
వీమునులున్ సురల్ వినమె ♦ యింతకుమున్ను వచింతునైనన్. 319

—* బ్రహ్మకు విష్ణుమూర్తి శివలింగపూజ సర్వార్థకారియనుట *—

చ॥ కనుగొనలేదె నీ వఖిల ♦ కారణకారణు నిద్ధమూర్తిఁబా
వనకరుణాధురంధరుని ♦ భర్గుని భక్తజనావనోద్యమున్
ఘనతరదుఃఖనాశకుని ♦ గంజభవా! శివలింగపూజనం
బున కురు వెందులేదదియె ♦ పోకడచున్ దుర్గిటి సర్వశోకముల్. 520

వ॥ ఇఁకను.

ఉ॥ దారను బుత్రులన్ ధనము ♦ దార్ఢ్యము నాయువు రాజ్యలక్ష్మి వి
స్తారసుఖంబులన్ యశము ♦ స్వర్గము మోక్షముఁ గోరువారలేన్
గూరిమి లింగపూజనముఁ ♦ గోరి యొనర్పఁగఁ జెల్లు నట్టులె
వ్వారలు సేయకున్న నిఁక ♦ వానినిఁ గానఁగలేరు రూఢిగన్. 321

క॥ శివభక్తిఁ గొనినవారలు, శివలింగము నెప్డు పూజ ♦ చేసెడువారల్
శివునిన్ దలంచువారలు, భవదుఃఖంబులను దాలఁ ♦ బాయుదురెందున్. 322

ఆ॥ విష్ణు విట్లు సెప్ప ♦ విని వేల్పులెల్లరు, పొంగి శంభులింగ ♦ పూజనఁబు
సేయఁగడఁగి వేగ ♦ శ్రీనాథునడిగిరి, లింగములను గడఁది ♦ లిప్పమెఱయ.

క॥ హరి యంత విశ్వకర్మను, సరగునఁ బిలిపించి శిల్పి! ♦ సత్వరముగ శాం
కరలింగములను నొనరిచి, సురలందఱ కొసఁగుమనిన ♦ సులువుగనతఁడున్.

—* హరిబ్రహ్మాదులు శివలింగములను ధరించి పూజించుట *—

వ. అర్హాతనెఱింగి శివలింగంబుల నిర్మించి దివ్యవరులకిచ్చుడు నాదరంబున నవ్వానిని శివేచ్ఛతోఁ బరిగ్రహించి యుత్తమాంగంబులం దిట్లు ధరించి పూజించిరి. 325

గీ॥ ఇంద్రనీలమయంబు మ ♦ హేశలింగ, మర్థిధరియించి పూజించె ♦ నబ్జనయనుఁ
డట్టులె హిరణ్యలింగంబు♦నర్థిఁదాల్చి, పూజఁగావించె నలరి స ♦ రోజభవుఁడు

సీ॥ పటికంబులింగంబుఁ ♦ బద్మాలయగ్రహించి, కొలిచె నిండారెడు ♦ కుతుకమొదవ
బ్రహ్మాణియును రత్న ♦ భాస్వరలింగంబుఁ బడసి యర్చించె వి ♦ స్ఫారభక్తి
పద్మరాగమయంబ ♦ భవలింగమును గొని, పూజ గావించెన ♦ ముచినిహంత
దండధరుండు ని ♦ తాంతపీతమణీర, చిత లింగమొంది య ♦ ర్చించె నిష్ఠ

తే॥ శ్యామలపులింగమర్చించె♦నంబువిభుడు, వజ్రలింగంబుఁగొలిచెఁ బ్ర♦భాకరుండు
కైరవామోదకరుఁడు ము♦క్తామణిమయ, లింగమునుజెంది నైష్ఠిక♦లీల గొలిచె.

క॥ వసువులు విశ్వేదేవులు, కుసిమెయి రౌప్యమయమార ♦ కూటమయములా
పసినెలదాలుపులింగము, ల సమర్చన చేసిరొంది ♦ లలితాంగములన్. 328

క॥ పవడపులింగము భోగి, ప్రవరులు తామ్రకృతలింగ ♦ రాజము నాది
త్యవరులు దస్రులిఁకఁ బా, ర్థివలింగముఁజెంది కొల్చి ♦ రి మునిలలామా!

గీ॥ అర్చనాపద్ధతిని దివ్యు♦లందఱికిని, దెలిపె విష్ణుం డమరులేను ♦ దేఁకువెసఁగ
జలజనయనుని సెలవొంది♦సత్వరముగ, నాత్మధామములొందితి♦మందఱమును.

వ. ఇఁక

క॥ పుట్టుకలందును మనుజుని, పుట్టుక శ్రేష్ఠమవు నందుఁ ♦ బూతకులమునన్
బుట్టుట యెక్కుడు పుట్టిన, యట్టిఁడు నిజజాతికర్మ ♦ మారయఁగవలెన్. 331

క॥ జ్ఞానం బొదవెడుదనుక న, నూనంబుగ జాతికర్మ ♦ మొనరింపవలెన్
జ్ఞానము మోక్షము నిడు నను, మానము లేదించుకేని ♦ మానిప్రవరా! 332

గీ॥ కర్మయజ్ఞ సహస్రంబు♦కన్న దాప, సవ్రతం బది మేలగు ♦ సరణి మించుఁ
దాపసవ్రతమునకన్న, ధ్యానయజ్ఞ♦ముత్తమంబగు నది జ్ఞాన ♦ మొదవఁజేయు.

## —* హరిబ్రహ్మాదులు శివలింగములను ధరించి పూజించుట *—

వ. అర్హతనెఱింగి శివలింగంబుల నిర్మించి దివ్యవరులకిచ్చుచు నాదరంబున నవ్వానిని శివేచ్ఛతోఁ బరిగ్రహించి యుత్తమాంగంబులం దిట్లు ధరించి పూజించిరి. 325

గీ॥ ఇంద్రనీలమయంబు మ ♦ హేశలింగ, మర్థిధరియించి పూజించె ♦ నబ్జనయనుఁ
డట్టులె హిరణ్యలింగంబు♦నర్థిఁదాల్చి, పూజఁగావించె నలరి స ♦ రోజభవుఁడు

సీ॥ పటికంబులింగంబుఁ ♦ బద్మాలయగ్రహించి, కొలిచెనిండారెడు ♦ కుతుక మొదవ
బ్రహ్మాణియును రత్న ♦ భాస్వరలింగంబుఁ బడసి యర్చించె వి ♦ స్ఫారభక్తి
పద్మరాగమయంబ ♦ భవలింగమును గొని, పూజ గావించెన ♦ మృచినిహంత
దండధరుండు ని ♦ తాంతపీతమణీర, చిత లింగమొంది య ♦ ర్చించె నిష్ఠ

తే॥ శ్యామలపులింగమర్చించె♦నంబువిభుఁడు, వజ్రలింగంబుఁగొలిచెఁ బ్ర♦భాకరుండు
కైరవామోదకరుఁడు ము♦క్తామణిమయ, లింగమునుజెంది నైష్ఠిక♦లీల గొలిచె.

క॥ వసువులు విశ్వేదేవులు, కుసిమెయి రౌప్యమయమార ♦ కూటమయముతో
వసినెలదాలుపులింగము, ల సమర్చనచేసిరొంది ♦ లలితాంగములన్. 328

క॥ పవడపులింగము భోగి, ప్రవరులు తామ్రకృతలింగ ♦ రాజము నాది
త్యవరులు దసులింగ బా, ర్థివలింగముఁజెంది కొల్చి ♦ రి మునిలలామా!

గీ॥ అర్చనాపద్ధతిని దివ్యు♦లందఱికిని, దెలిపె విష్ణుం డమరులేను ♦ దేఁకువెసఁగ
జలజనయనుని నెలవొంది♦సత్వరముగ, నాత్మధామములొందితి♦మందఱమును.

వ. ఇఁక

క॥ పుట్టుకలందును మనుజుని, పుట్టుక శ్రేష్ఠమవు నందుఁ ♦ బూతకులమునన్
బుట్టుట యెక్కుడు పుట్టిన, యట్టిఁడు నిజజాతికర్మ ♦ మారయఁగవలెన్. 331

క॥ జ్ఞానం బొదవెడుదనుక న, నూనంబుగ జాతికర్మ ♦ మొనరింపవలెన్
జ్ఞానము మోక్షము నిడు నను, మానము లేదించు కేని ♦ మానిప్రవరా! 332

గీ॥ కర్మయజ్ఞ సహస్రంబు♦కన్న దాప, సవ్రితం బది మేలగు ♦ సరణి మింముఁ
దాపసవ్రితమునకన్న, ధ్యానయజ్ఞ♦ముత్తమంబగు నది జ్ఞాన ♦ మొదవఁజేయు.

గీ॥ జ్ఞాన విజ్ఞానములనెల్ల ♦ సంతరించుఁ
జలనమొందని భక్తిత ♦ ద్విలసనమున
కారయఁగ సద్గురుఁడు మూల ♦ మట్టి గురున
కగును మూలంబు సత్సంగ ♦ మవనిలోన. 342

గీ॥ సాధుసాంగత్యమున నబ్బు ♦ సద్గురుండు, నతనిచే మంత్ర మద్దాన ♦ నమరుభక్తి
దాన జ్ఞానంబు సిద్ధించు♦జ్ఞానమదియుఁ, గూర్చు విజ్ఞాన మది భిదఁ ♦ గూలఁజేయు.

క॥ భేదము సుఁగిన దుఃఖం, బేది యతండే మహేశుఁ ♦ డెల్లవిధములం
దీదృశుఁ డపురూపంబగు, నేదేవత లేనివాని ♦ నెన్నుదురు భువిన్. 344

గీ॥ మృచ్ఛిలామయ దేవుల♦మేయ నీర, మయముతో తీర్థములు జ్ఞాన♦మయుని఼బోల
వవ్వి తడవుగ శుద్ధిసే♦యంగనోపు, దరిసెనమున నె సాధులం♦తియు ఘటింత్రు.

వ. కావున నట్లు జ్ఞానసిద్ధికై దేవతార్చనం బావశ్యకంబు, అందుఁగూడ శివలింగ
పూజనం బత్యంతావశ్యకంబు. 346

గీ॥ అఖిలలోకైకమూలమౌ ♦ హరునిఁ గొలువ
సర్వదేవులఁ గొలిచిన ♦ సరణి యమరు
జలము మూలమునం జేర్ప ♦ శాఖ లెల్ల
నలరు నవి వాడ మూలమే ♦ మట్లు చెడదు. 347

వ. అనుడు నారదుండు మహాత్మా! నారాయణుఁడు సురలకందఱి కెట్లు శివపూజా
విధి నెఱింగించెనో యద్ది వక్కాణింపుమన్న శతానందుం డిట్లనియె. 348

—* విష్ణుమూర్తి దేవతలకుఁ జెప్పిన శివలింగపూజావిధానము *—

క॥ అరుణోదయమునకును మును, ధరామరుఁడు నిదురలేచి ♦ తద్దయు భక్తిన్
శిరసున నంజలిఁజేరిచి, పరమేశ్వరు నిత్తెఱఁగునఁ ♦ బ్రార్థించవలెఁ. 349

క॥ శివ! ధర్మంబే నెఱిఁగియుఁ, బ్రవృత్తి గొనకుంటి నందుఁ ♦ బ్రజ్ఞనువిడి నే
శివ! యట్లధర్మ మెఱిఁగియు, నివృత్తిఁగననైతి నెట్లొ ♦ నేరుపు హితవుఁ.

వ. అని యర్థించి గురుపాదుకల సంస్మరించి కాల్యావసరంబులఁ దీర్చికొని యవ
కాశంబునుబట్టి నదియందుఁ గాని గృహమందుఁ గాని నియతంబుగ స్నానం
బొనర్పవలెను. 351

గీ॥ రవిదినంబున గ్రహణ సం ♦ క్రాంతులందు
శ్రాద్ధదినమందును నుపవా ♦ సదినమందు
సకల తీర్థంబులందు నా ♦ శౌచమందు
స్నాన మది వేడినీళ్ళతో ♦ సల్ప జనదు. 352

వ. మఱియుఁ దైలాభ్యంగనంబుఁగూడ నిట్లే వారంబులు సూచి యొనర్పఁదగును. ప్రతినిత్యంబు నభ్యంగనము సేయువారలకెప్పుడును దోసంబులేదు. అందు నావ నూనెతోఁ దలంటుకొనువారల కొక్క గ్రహణంబునఁ దక్కఁ దక్కిన సమయంబులందు నిషేధంబు లేదు. మజ్జనానంతరము దేవ ఋషి పితృతర్పణంబొనరించి ధౌతవస్త్రంబుఁ గట్టి శుచిప్రదేశంబున మృగచర్మంబునఁగాని దర్భాసనాదులందుఁ గాని గూర్చుండి భస్మత్రిపుండ్రంబుల ధరించి రుద్రాక్షధారణం బొనర్చి నిత్యకర్మంబులను జపతపోదానంబులను సల్పి పూజాద్రవ్యంబులనెల్ల సాన్నిధ్యమునందుఁ జేర్చుకొని గురువందనంబుచేసి సంకల్పపూర్వకంబుగఁ బరివారదేవతాయుక్తంబుగ శివునిఁ బూజించవలెను. 353

గీ॥ ముందుగా గణనాథునిఁ ♦ బూజచేసి, కొమరుసామిని దౌవారి ♦ కులను గొల్చి
కుంకుమసుగంధచందన ♦ కుసుమధూప, దీపనైవేద్యముల, నుమన్ ♦ దీర్చికొల్చి.

వ. అనంతరంబున నాచమనప్రాణాయామంబుల సల్పి యఖండదీపారాధనం బొనర్చి పద్మాసనంబునఁ గాని భద్రోత్తానపర్యంకాసనంబులందుఁ గాని సుఖంబుగఁ గూర్చుండి యనన్యమానసుండై బాణలింగంబును గాని సువర్ణ రజతలింగంబును గాని పార్థివలింగంబును గాని మూలమంత్రోచ్చారణంబుతోఁ బంచముద్రలఁ జూపించి యావాహన స్థాపన సన్నిధాపన సన్నిరోధనావకుంఠనంబుల నొనర్చి. 355

సీ॥ కప్పురంబునకన్నఁ ♦ గడు తెల్లనగువాని, నెలరేక తలపైన ♦ నెగడువాని
జడలచొళ్ళెము నెంతొ ♦ చక్కఁదాల్చినవాని, వెలిబూది నుదురున ♦ వెలయువాని
నేన్గుచర్మంబు బి ♦ ట్టైలమిఁ గట్టినవానిఁ, బులితోలు బుజములఁ ♦ బొలుచువాని
పెనుపాపపేరులఁ ♦ బేర్మినొందినవాని, నందిపెక్కెమున మి ♦ న్నందువాని

గీ॥ వెండికొండను గాపురం ♦ బుండువాని, గట్టురాచూలిఁ గట్టుకొ ♦ న్నట్టివాని
నజగవంబను పెద్దవి ♦ ల్లమరువాని, నెల్లజగముల కొడయఁడై ♦ యేలువాని.

క॥ దాసజనంబును గడును,ల్లాసంబున మనుచు వాని ♦ లలితకృపాశ్రీ
భాసురుని బరమశివునిన్, వాసిమెయిన్ బూజసేయ ♦ వలయును మౌనీ! 357

వ. ఆసన పాద్యార్ఘ్యాచమనంబులొసంగి సుగంధచందనోదకధారల షడంగము
లతో శతరుద్రీయ చమకానువాకంబులతో నేకాదశవారము లభిషేకముచేసి
శుద్ధ వస్త్రంబులతోఁ దడి యొత్తవలయును. అటుపిమ్మట నాచమనంబొసంగి
వస్త్రంబుల నర్పింపవలయు నామీఁద తిలలు, యవలు, గోధుమలు, పెసలు,
మినుములు, శివునికి మంత్రంబులతో నర్పించి యటుపైఁ బద్మంబులు, శంఖ
పుష్పంబులు, ధుత్తూరంబులు, దుమ్మిపూవులు, మందారకుసుమంబులు, బిల్వ
దళంబులు దులసీపత్రంబు లర్పింపవలయును. అన్నిటియందు బిల్వదళంబు
లుత్తమోత్తమంబులు. వీని యర్పణంబున సర్వసిద్ధులు సేకూరు ననంతరము
సుగంధచూర్ణముల నత్తరువుల నర్పించి గుగ్గుల్వగరు ధూపంబులు దీపంబులు
నొసంగి యిట్లర్థించుచు బునరర్ఘ్యం బీవలయును. 358

క॥ ఇమ్ము మహేశ్వర! రూపము, నిమ్ము గరీయమగుభోగ ♦ మిందుకిరీటా!
ఇమ్ము శివ! కీరితిని నా. కిమ్ము హరా! ముక్తి నర్ఘ్య ♦ మిదిగొను గొలుతున్.

వ. తరువాత ననేకవిధంబులగు మధురభక్ష్యంబులతో దివ్యాన్నంబు నైవేద్యంబు
చేసి యాచమనంబు సేయించి సుగంధ తాంబూలంబుల నర్పించి పంచవర్తి
జ్వాలలతోఁ బాదంబులందు నాలుగు మాఱులు పొక్కిట రెండుమాఱు లొక్క
తడవ మొగంబందు నేడుమాఱులు సర్వాంగములందు మొత్తము పదునాలుగు
మాఱులు దీపకళికలతో నారతులొసంగి యటుపైఁ గర్పూరహారతి నిచ్చి
గురూక్త మూలమంత్రంబు జపించి వేదస్తవంబులతో మంత్రపుష్పంబు సమ
ర్పించి ప్రదక్షిణ నమస్కారంబు లొనర్చి మఱియు నిట్లు విజ్ఞప్తి యొనర్పవలెను.

క॥ భువిఁ బదము జాఱినంతనె, భువియే యవలంబన మయి ♦ పోసఁగెడు నటులే
భవ! నీయెడనేఁ దప్పిన. శివ! నీవేదిక్కుగాదె ♦ శశిరకరధరా! 361

క॥ పరివారయుతముగా నీ, యిరవున కేగుము మహేశ! ♦ యిత్తఱిఁ గృపతో
మరల సమర్చనవేళకుఁ, దఱియుము దాసజనదుఃఖ ♦ దళనప్రవణా! 362

వ. ఇట్లర్థించి తిరిగియుఁ బుష్పాంజలి నర్పించి స్వహృదయంబునందు శివలింగంబును
విసర్జించి తత్తీర్థంబు మూర్ధంబునందుఁ జల్లుకొని గ్రహించునది. ఇట్లు భోగ

మోక్షప్రదంబు శివసమర్చనప్రకారం బుపదేశించితి నిఁకేమి వినవలఁతు వెఱింగింపుమనుడు మహాత్మా ! పుష్పపత్రార్పనంబునందు శివుం డేయే పుష్ప పత్రంబుల నేయేఫలంబు లొసంగునో యెఱింగింపుమనిన ననుకంపతో నిలింప జ్యేష్ఠుండిట్లనియె. 363

—* ప్రత్యేక పుష్పపత్రార్చనాఫలనిరూపణము *—

గీ॥ పద్మములు బిల్వదళ శత ♦ పత్ర శంఖ, సుమము లొకలక్షచేతఁ బ♦శుపతిలింగ
మర్చనముసేయఁ బాపంబు♦ల స్తమించు, భాగ్యములుపట్టుసందియం♦పడగఁజనదు.

క॥ ఇరువదిపద్మములైనన్, బరఁగును బ్రస్థంబు వేయి ♦ బైల్వదళములే
నరప్రస్థము శతపత్రిము, లరపస్థము వేయియైన ♦ నరయు మునీంద్రా ! 365

వ. పదియాఱుపలంబు లొక్కప్రస్థంబగుఁ బదిటంకంబు లొక్కపలమగు నీ పరిమాణంబెఱింగి యర్చింపవలయును. రాజ్యకాముఁడగు నాఁతఁడీ పద్మాది చతుష్టయంబున నొక్కటనేని పదికోట్ల లెక్కతోఁ బార్థివలింగపూజ విధివిహితంబుగ నొనర్చిన శివానుగ్రహంబున నవ్యాహతంబుగ రాజ్యంబుఁ బడయు మఱియుఁ బ్రాధాన్యకామి తదర్ధంబుచేతను గారాగృహబద్ధుండు లక్షయగు వానిచే రోగగ్రస్తుండు తదర్ధంబునను గన్యాకాముకుఁడు తదీయార్థంబునను విద్యాకాముం డద్దానిలో నర్థంబునను బూజించిన నిష్టంబులఁ బడయుదురు.

సీ॥ కుశలఁ బూజించినఁ♦గూర్చు దీర్ఘాయుస్సు, నున్మత్తసుమపూజ♦యొసఁగు సుతుల
కర మొందు యశము న♦గస్త్యసుమార్చన, నర్కపుష్పార్చ శౌ♦ర్యంబొసంగు
ఇందీవరార్చనఁ♦బిచ్చువిక్రమమును, వైరులఁ గెడపు జ♦పాసుమార్చ
గన్నేరువిరిపూజ ♦ గడఁగి రిపులఁబాపు, బంధూకపూజ రాఁ♦బట్టు నగల

గీ॥ జాతిపుష్పార్చ వాహన♦సంపదనిడు, మల్లియలపూజ యొసఁగు రా♦మయగుసతిని
మొల్లపూవుల యర్చన♦భోగమిచ్చు, నవిసెపూపూజ శంభుస♦ఖ్యంబు గూర్చు.

వ. మఱియును.

గీ॥ రాజికాకుసుమార్చ య♦రాతిహరము, కడఁగి వావిలివిరిపూజ♦కలుషహరము
కొండగోఁగువిరులపూజ♦కోకలొసఁగు, దిరిసెనపుఁబూలపూజ సం♦బరముసేయు.

గీ॥ నువ్వుపువ్వులయర్చన ♦ జవ్వనమిడు, తుమ్మిపువ్వులపూజ మో♦క్షమ్మునిచ్చు
నందివర్ధనసుమపూజ♦యంద మొసఁగు, నలకురంటకకుసుమార్చ♦గలిమిఁగూర్చు.

క॥ సంపెఁగ మొగలివిరులఁ ద్రేపె, మింపఁడు బాలేందుమౌళి ♦ మిగులు విరులలో
నింపగు సొంపగునవి యఱ్పింపఁగఁ జెందెద రమేయ ♦ విపులఫలంబుల్‌. 370

వ. మఱియుఁ బుష్పార్చనయం దర్పితపూర్వంబులును నాఘ్రాతపూర్వంబులును శీర్ణవృంతంబులును నాధారవిరహితంబులును నుడిపోయినట్టివియునగు కుసుమంబు లర్పింపఁగూడదు. 371

గీ॥ లక్షబిల్వార్చనంబు మ ♦ హోక్షరథున, కెవఁడుసేయునో యవ్వాని ♦ కీప్సితంబు
లన్నిగూడిచి ముక్తి సం♦త్యమునిచ్చు, జమ్మిదళములపూజ మోక్షమ్ము సేయు.

## —* ధాన్యపూజాఫల నిరూపణము *—

వ. ఇట్లు పుష్పపత్రార్చనాఫలంబును వేఱువేఱుగ నీ కెఱింగించితి నిఁక ధాన్యార్చనంబులీ రెఱింగించెదను వినుము. తండులారోపణచేత లక్ష్మీవృద్ధి యగును తండులంబులు తొమ్మిది ప్రస్థంబులపై రెండుపలంబులైన నొకలక్ష ప్రమాణంబగు. శివలింగంబును బూజించి సుందరవస్త్రం బొండు లింగంబుపై నునిచి పూర్వోక్తప్రమాణంబుగ లక్షాక్షతతండులంబు లర్పించి యవ్వానిపై నొక్క శ్రీఫలంబుంచి సుగంధపుష్పధూపదీపనైవేద్యంబులొసంగి పన్నిద్దఱు బ్రాహ్మణులకు భోజనంబిడి యవ్వారలకు దక్షిణలిచ్చి యాజ్ఞికునకు శక్తి లోపంబు సేయక దక్షిణలీవలయు నిట్లైన లక్షతండులార్చన యగును. లక్ష తిలార్చనచేత మహాపాపనాశనంబగును. తిలలు పదకొండు పలంబులైన నొక లక్ష యగు నవ్వాని తొలుతటివలెఁ బూజించి యట్లే బ్రాహ్మణులకు భోజన దక్షిణ లర్పింపవలయును. అటులొనర్చిన సమస్తాఘంబులు సమసిపోఁగలవు. లక్ష యవపూజ స్వర్గసౌఖ్యంబునిచ్చు నెన్మిది ప్రస్థంబుల పదిపలంబులు యవలైన నొకలక్షయగు నవ్వానితోఁ బూర్వోక్తవిధిఁ బూజించి బ్రాహ్మణులకు భోజనంబుఁబెట్టి దక్షిణలీవలయును. గోధూమార్చనంబు సంతాన వృద్ధికరము. అర్ధద్రోణంబు గోదుమలు లక్షయగును. పూర్వోక్తవిధిగ నర్చన నొనర్చి బ్రాహ్మణులకు భోజనదక్షిణ లీవలయును. ముద్గార్చన సుఖంబుఁ గూర్చు నేడు ప్రస్థంబులపైఁ బదిపలంబులు పెసలైన లక్షయగును. పూర్వోక్తవిధి నవ్వాని నర్పించి పదియొక్కరు బ్రాహ్మణుల కన్నంబుఁబెట్టి దక్షిణ లొసంగవలయును. ప్రియంగు పూజనంబునఁ ద్రివర్గవృద్ధియగును. కొఱ్ఱలు ప్రస్థంబైన నొకలక్షయగును. వెనుకటివలెఁబూజించి పండ్రెండుగురు బాపలకు సాపాటు గావింపఁజేసి దక్షిణలొసఁగ వలయును. సార్షపార్చన శత్రుహింసిని. ఇరువది ప్రస్థంబులావాలైన నొకలక్షయగు. వెనుకటివలె నర్పించి బ్రాహ్మణుల కన్నదానంబుచేసి దక్షిణలొసఁగ వలయును. మరియు మిరియాలతో

శివలింగంబు నర్చించినఁ బరిపంథిమారణం బొనరు. ఆఢకదళార్చన సర్వసౌఖ్య ఫలంబిచ్చు నిద్ది ధాన్యార్చనామాన ప్రకారం బిఁకఁ జెప్పమానంబులు వినుము. శంఖపుష్పంబు లొకప్రస్థంబైన లక్షయగు. జాదివిరులు మొల్లపూవులు పదియు నొక్కప్రస్థంబైన లక్షయగు. రాజికాకుసుమంబు లర్థప్రస్థంబైన లక్షయగు నిరువది ప్రస్థంబులు మల్లెపూవులు లక్షయగు నందొక్క ప్రస్థంబు దక్కువైన నువ్వుపువ్వులు లక్షయగు నిఁక ముప్పదియెనిమిది ప్రస్థంబులు గన్నేరు విరులైన లక్షయగు వావిలి పూవులట్టులేయగును. కొండగోగువిరులు శిరీష కుసుమంబులు మంకెనపూవులు పదిప్రస్థంబులైన నొక్కొక్కడు లక్షయగు. వీనిఁ దెలిసి లెక్కయెఱింగి పూజింపవలయును. 373

## —* అభిషేకఫల నిరూపణము *—

ఇఁక నభిషేకజలధారాఫలంబుల వివరీకరించెద వినుము, జ్వరప్రలాపశాంతికై పదకొండు మాఱులు శతరుద్రీయ చమకానువాకంబులతోఁ బురుషసూక్తముతో షడంగన్యాసములతో, మహామృత్యుంజయ గాయత్రీ జపములతో శివలింగంబును సభస్మజలధారల నభిషేకింప వలయును. జ్వరప్రలాపంబులు శమించును.

క॥ ఘృతధారల నభిషేకము, సుతవృద్ధినిఁ గోరి సేయ ♦ శుభ్రాంశుధరుం
డతులకరుణాళుఁడై యిడు, సుతులను తేజోమహితుల ♦ శుభగుణయుతులన్.

వ. ఇంకను.

సీ॥ దుగ్ధాభిషేకంబు ♦ దుఃఖంబుఁ బోఁజిమ్ము, చక్కెరఁ జేర్చ వి♦స్తరిలుఁ బ్రజ్ఞ
తైలసేకంబు ని♦ర్మూలించుఁ బగతుర, నత్తరు వర్పింప ♦ నమరుభోగ
మావసూనియసేక♦మరిమర్దనము చేయుఁ, దేనెతో స్నపియింప ♦ నీనుఁగల్మి
ఇక్షురసపుసేక♦మెసఁగించు మోదంబు, గంగాంబుధార మో♦క్షంబు నిచ్చు

గీ॥ నయుతమానంబుగా నిట్టు♦నభవలింగ, మర్థిమై రుద్రపారపా♦రాయణంబు
లమర నభిషేక మొనరించి♦యట్లు రుద్ర, సంఖ్యతో బాఁపలకుజగ్గి♦సల్పవలయు.

వ. ఇట్లు నందిస్కందగణేశోమాసమేతంబుగ శివుని విధిప్రకారంబు సమంత్రంబుగఁ బూజించిన నఖిలభోగంబులు చెంది పుత్రపౌత్రాదులతో నానందంబునొంది యంతంబున మోక్షంబు నొందుదురనుడు నారదుండు మహాత్మా! సంతసంబయ్యె నిఁక సృష్టిఁగూరిచి యటుపై వృత్తాంతంబు నెఱింగింపుమనిన విధి యిట్లనియె. 376

—* బ్రహ్మదేవుఁడు నారదునకు సృష్టినిఁగూర్చి చెప్పుట *—

చ॥ తరుణశశాంకశేఖరుఁడు ♦ దానటు లంతరమొంద నేను న
ప్పరమశివాజ్ఞ లోకములఁ ♦ బన్నుగ సృష్టియొనర్పఁగోరి శం
కరుని మనంబునన్ గొలువఁ ♦ గాండమునం దగుపట్టి నండమొం
డిరువదినాల్గు తత్త్వముల ♦ నింపుగనొందిన యద్ది నాకటన్. 377

గీ॥ అవిరాడూపమునుజూచి ♦ యంతసంది, యంబునేఁజెందిదారుణం♦బైనతపముఁ
బదిరెండేండ్లు గావింపఁ♦బద్మనయనుఁ, డాదటన్ జేరి నాదుదే♦హంబు నిమిరి.

క॥ వరమడుగు సంతసించితి, నరమరయొక్కింత లేక ♦ యబ్జభవా! స
త్వర మిఁక యుండునదిలే, దరయము సర్వంబు నిక్కు ♦ నభవుని కరుణన్. 379

గీ॥ అనిన నేనట్లు శివుఁడు న♦న్నప్పగించె, నీకటు మహాత్మ! క్రొక్కొద♦పేఁకమెఱయు
నీవిరాడ్రూపమగునండ♦మీవుగనుము, జడమగుచుజ్ఞానశూన్యమై♦యడరెనిట్లు.

క॥ దీనన్ జైతన్యంబు న, నూనకృపన్ సంతరింపు ♦ముజ్జ్వలతేజా!
దానన్ సంతసమొందెద, నీ నిరుపమ విభవమునకు ♦ నేస్తంబునకున్. 381

క॥ అని సన్నుతింప విష్ణుం, డనంతరూపంబుఁజెంది ♦ యండమునొందెన్
ఘనతరసహస్రశీర్షము, లును సాహస్రాక్షిపదము♦లును జెలువొందన్. 382

శా॥ అంతన్ జేతనయుక్తమై తనరి యా ♦ యండంబు ప్రస్ఫీతమై
యెంతేనిర్వదినాల్గుపర్వములతో ♦ నింపొందె వైకుంఠమున్
వింతౌ పట్టణ మెల్లలోకముల్పై ♦ విష్ణుండు నిర్మించి య
త్యంతామోదముతోడ నుండె నట లే ♦ దాపీటి కేపాటునున్. 383

ఉ॥ నేనును సత్యమన్ బదము ♦ నెక్కొని యక్కఱకంతునానతిన్
బూని జగంబులన్ సలుపఁ ♦ బూన్కినిజెందుడఁ బాపసృష్టినా
నేను తమోమయంబులయి ♦ యేర్పడె నంతనె స్థానరాఖ్యలన్
బూనినవానిసల్పి యవి ♦ బోధము లేనివటంచు నెంతయున్. 384

మ॥ హరునిన్ ధ్యానముసేయుచుండఁగనె తి♦ర్యక్స్రోతమాసర్గమొం
డిరవొప్పన్ బశుబక్షిముఖ్యగణమై ♦ యేపొందె నద్దాన సం
బరమొక్కింతయుఁ గానకున్నతఱి నూ♦ర్ధ్వస్రోతమా సృష్టి వి
స్తరిలెన్ సాత్త్వికమొప్పిరయ్యెడ సురల్ ♦ ధన్యుల్ సుఖాపాదకుల్. 385

మ॥ అదియున్ జూచి యసాధకంబె యని నే ♦ నాత్మన్ విచారింప న
ప్పదనందే మఱియొండు సర్గమది య♦ర్వాక్స్రోతమారాజసా
స్పదమై యొప్పెను మానిసుల్ పొడమి రా♦పై భూతసర్గంబుకాం
డొదవెన్ సర్గము లిట్టులైదమరె శా♦ర్వోదారసంపత్తిచే. 386

మ॥ మొదటన్‌బుట్టె మహత్తు దాన నదియో♦ప్పన్ సృష్టులం దాద్య మా
పిదపన్ సూక్ష్మము లైదుగాఁబరఁగి మేల్ ♦ పేరొందు తన్మాత్రలన్
విదితంబయ్యె ద్వితీయసృష్టి యిఁక నా ♦ విఖ్యాత వైకారికం
బు దగెన్ మూఁడవసృష్టి ప్రాకృతములై ♦ పొల్పొందు నీసర్గముల్. 387

గీ॥ అంతమీఁదఁట మనమందు♦ననఘులైన, సనకముఖ్యమునులనాత్మ♦సదృశమూర్తు
లై దుగురను సృజించి నే♦నాచరించు, సృష్టి యెడఁజేర్ప నవ్వార♦లిష్టపడక. 388

క॥ పరమశివధ్యానంబున, మరగిన చిత్తములతోఁ గు♦మారులు నన్నున్
గురిగొనకవీడి యెందేఁ బరుగెత్తిరి జ్ఞానదీవి♦భాసితులగుచున్. 389

వ. వీరిసృష్టి తొమ్మిదవదియగు నిఁక నిట్లే నీసృష్టి నవకంబందును

ఉ॥ వీని యవాంతరంబులగు ♦ భేదము లెన్నియొ పెక్కులున్నవ
వ్వానిని లెక్కసేయఁగల ♦ వాఁడెవఁడిందు మునీంద్ర! యప్డు నే
సూనుల యప్పరాఙ్ముఖతఁ ♦ జూచి కడున్ గడుఁ గ్రోధమూర్తినై
దీనతఁజెంది యేడ్వఁగను ♦ దెప్పున రాలిన వశ్రుబిందువుల్. 390

క॥ జలజల కన్నీరట్టుల, నొలుకంగాఁ బుడమినుండి ♦ యుగ్రవిషములౌ
చిలువలు వెలసిన వెంతయుఁ, బలురకములతోడఁ బొడమి ♦ బ్రహ్మణ్యవరా!

—* శ్రీ రుద్రోత్పత్తి *—

ఉ॥ వానినిఁజూచి రోసి కడు ♦ వందురుచున్ హరిబోధతో శివున్
ధ్యానముసేయుచుండుడు ఘృ ♦ ణాకరుఁడై శివుఁ డాత్మనాసపై
మానెసఁగన్ బొమల్ నడుమ ♦ మాన్యపదం బవిముక్తమందు నెం
తేనియుఁ దేఁకువంబొలిచె ♦ దిక్కులు దేజరిలంగఁ జక్కఁగన్. 392

మ॥ కని నే నాశివు నీలలోహితు జగ ♦ త్కల్యాణసంధాయకున్
ఘనతేజఃపటలీవిభాసితదిశా ♦ కాంతున్ శివావల్లభున్
మనమం దక్కజమొంది మ్రొక్కి పరమా ♦ మ్నాయంబులన్ బాడి సృ
ష్టినిఁ గూర్పన్ బతిమాల శర్వుఁడు సృజిం ♦ చెన్ రుద్రసంఘంబులన్. 393

ఉ॥ వారలఁ గాంచి నే భువన ♦ వంద్య! జనుర్మరణామయార్తులన్
గూరనివీరి సల్పితిప ♦ చూడుమి యిట్లు మహాత్మ! యింకఁబై
నారసి జన్మదుఃఖముల ♦ నందెడువారి సృజింపుమన్నన
ద్ధీరుఁడు నానుడుల్విని వి ♦ ధీ! యటులేను సృజింప నిన్నికన్. 394

గీ॥ జన్మదుఃఖనిమగ్నులౌ ♦ జనులనెల్ల, నుద్ధరించెద గురుఁడనై ♦ సిద్ధినొసఁగి
నీవె సృజియింపు దుఃఖంబు♦నెక్కొనెడు ప్ర, జలను నే నొల్ల నీసృష్టి♦జలజగర్భ!

క॥ నాయానతిచే నిన్నీ, మాయ తలుచుచుట్టఁబోదు ♦ మంచిగసృష్టిన్
జేయుచునుండుము నేనిఁక, బోయెద నాయిచ్చననుచుఁ ♦ బొందుగనంతన్.

క॥ అంతర్థిఁజెంది వేగిర, మెంతోవైకుంఠనగరి ♦ కెక్కుడుప్రేమన్
వింతగఁబొలిచెడు పోరులు న, నంతశ్రీలెసఁగసల్పి ♦ యందువసించెన్. 397

ఉ॥ నేనును బంచభూతముల ♦ నేర్పుమెయిన్ సృజియించి యంత నా
నానగసింధుపల్వలవ ♦ న(ప్రముఖంబులనున్ గలాఘటీ
దైనని కాయ మొప్పయుగ ♦ తండములన్ రచియించి యంతతో
నేనియుఁ దన్విఁజెందక మ ♦ హేశ్వరు ధ్యానముచేసి వాసిగన్. 398

—* దే వా ది సృ ష్టి *—

సీ॥ కనులందు నమ్మరీ ♦ చిని హృదయమున భృ, గుని శ్రుతులందు న♦త్రిని శిరసున
నంగిరసునిఁ దోడ ♦ లందు నిన్ జాయయం, దాకర్దమునిఁబ్రాణ ♦ మందుదక్షు
వ్యానంబునన్బుల♦హముని నపానంబు, నన్ గ్రతువును సమా♦నమున నవ
శిష్ఠు సంకల్పము ♦ చేత ధర్మని నుదా, నమునఁ బులస్త్యు మ♦నమున రుచిని

గీ॥ సృష్టిసాధకులనుగ సృ♦జించి వృద్ధిఁ, గోరి శంకరుఁ దలఁప న ♦ గ్గురుకృపాబ్ధి
యర్ధనారీశరూపంబు ♦ నర్థిఁజూపె, నేనునట్టులేయగురూప ♦ మెలమినొందె.

క॥ సగముతనువు యోషగఁ బెఱి, సగముతనువు బురుషుఁడుగను ♦ సౌరొప్పవిధం
బుగ సంతరించికొని చ, క్కఁగ మరల సృజించినాఁడఁ ♦ గౌశల్యమునన్.

గీ॥ ఘనుఁడు స్వాయంభువుం డను ♦ మనువునుర్ద
పస్వినియు యోగినియునైన ♦ పద్మగంధి
యనఘ శతరూపయనునొక్క ♦ యన్నుమిన్న
జనన మొందిరి జెంద ము ♦ త్సవముఁ జెంద. 401

క॥ వారలు పరస్పరము దమి, గూర వివాహంబు నొంది ♦ కూడి నిజకులో
ద్ధారుల నిర్వురుకొమరులఁ, జారుతనుల సుతలఁ గనిరి ♦ జక్కఁగముగురన్.

గీ॥ అగ్రియుండు ప్రియవ్రతుం ♦ డన యవీయుఁ
డల్ల యుత్తానపదుఁడన ♦ నమరి రిఁకను
నొప్పి రాకూతియన దేవ ♦ హూతియనఁ బ్ర
సూతియన నాహ్వాయము లొంది ♦ సుతలు తపసి! 403

గీ॥ రుచికి నాకూతిఁ గర్దమో♦దయుశునకును, దేవహూతిని నర్పించి ♦ ధీరుఁడల్ల
దక్షునకునా ప్రసూతిని♦ధారవోసె, ఘనుఁడుస్వాయంభువుఁడనునా♦మనువుప్రీతి.

శా॥ ఆకూత్యంగనయందు నారుచికి య ♦ జ్ఞాఖ్యుండునున్ దక్షిణా
ఖ్యాకస్త్రీయును బుట్టి రాపురుష స్వా ♦ యంభూతుఁడౌ తాత పు
త్రాకారంబుగ నొందె దక్షిణ వివా ♦ హంబాడె నవ్వాని సు
శ్రీకుల్ పన్నిరువుర్సుతుల్ వొడమి ర ♦ ర్చిష్మంతు లవ్వారికిన్. 405

క॥ ఇఁక దేవహూతి కర్దము, లకుఁ బొడమిరి పుత్రులు కపి ♦ లముఖులును బ్రసూ
తికి దక్షునకుదయించిరి, సుకన్య లిరువదినలువురు ♦ సుందరమూర్తుల్.

వ. అందు.

సీ॥ ధర్ముఁడుగొనెఁ ద్రయో ♦ దశకన్యకల వారి, పేరుల నెఱిఁగింతు ♦ బేర్మివినుము
శ్రద్ధ లక్ష్మియు ధృతి♦శాంతి తుష్టియుఁ బుష్టి, కీర్తి సిద్ధియు బుద్ధి♦క్రియయు మేధ
లజ్జ వసువునా వె♦లయువార లవ్వారి, చెలియండ్రు పదియొక్క ♦ రలఘుమతులు
ఖ్యాతియు సతియు సం♦భూతియు స్మృతియుఁ బ్రీ,తియు నుక్షమయు సన్న♦తియనురూప

గీ॥ ఊర్జ స్వాహా స్వధలు ఖ్యాతి♦నొందె భృగుఁడు, సతిని బెండ్లాడె నా బాల♦చంద్రధరుఁడు
చేకొనె మరీచి సంభూతి ♦స్మృతిని నంగి, రసుఁడు ప్రీతిఁ బులస్త్యుండు♦రహిఁ బడసిరి.

క॥ క్రతువు పులహుండు నత్రి మ, హితతేజుండౌ వశిష్ఠ ♦ ఋషి యగ్నియునున్
బితలును దక్కిన యార్వురఁ, గుతుకమునన్ బెండ్లియాడి ♦ కొనిరి వరుసగన్.

క॥ మఱియును వీరలవలనన్, విరివిగ భువనత్రయంబు ♦ విస్తరిలెఁ జరా
చరమటు గర్మవశంబై, హరునానతి లెక్కలేని ♦ యట్లు గుమారా! 409

వ. ఇఁకను గల్పభేదంబు చొప్పున నొక్కపుడు దక్షున కఱువదిమంది కూఁతులు జనింప వారలలోఁ బదిమందిని ధర్మునకును, నిరువదియేడ్గురను జందురునకును, బదమూఁగురఁ గశ్యపునకును, నల్గురను వైనతేయునకు భృగ్వంగిరః కృశాశ్వులకు నిద్దఱ నిద్దఱనొసంగి వివాహంబొనరించె నవ్వారిచేఁ జరాచరసృష్టి యభివృద్ధిఁ జెంది పొదలె నిలింపులు మును లసురులు మానిసులు వృక్షంబులుం బక్షులుఁ బన్నగంబులు మృగంబులు మున్నగువానితోఁ బాతాళంబు మును కొని బ్రహ్మలోకంబువఱకు శూన్యప్రదేశంబనునది లేక నిండారియుండె.

క॥ పరమేశ్వరి సతియనుపే, రిరవొప్పన్ దక్షసుతగ ♦ నేర్పడి శర్వున్
బరిణయమాడెను భక్తో, ద్ధరణమునకుఁ బొడమఁజేసెఁ ♦ దాశివుఁడాపెన్.

మ॥ సతియున్ శంకరుఁ జెట్టఁబట్టియు జడ ♦ స్వాంతుండు దక్షుండు దు
ర్మతియై యీశ్వరుతోఁ బగన్ గొని యథ ♦ ర్మంబౌ పథంబొందఁ ద
త్క్రతువందే తన మేనుగాల్చికొని యా ♦ త్మస్థానమొందెన్ మరు
ద్వ్రతతుల్ గ్రిమ్మరవేడ నద్రిసుతయై ♦ విశ్వేశునొందెన్ విభున్. 412

వ. మఱియు నప్పరమేశ్వరి కసంఖ్యాతనామధేయంబులు భక్తజనభోగమోక్షకరం బులు గల వైన నందు. 413

గీ॥ కాళి చండిక శ్రీభద్ర ♦ కాళి భద్ర, జయ మృడాని భగవతి వి ♦ జయ జయంతి కామచాముండసర్వమం ♦ గళపరాంబ, దుర్గకామదయని పిలు♦తురు విబుధులు.

గీ॥ పరమశివునాజ్ఞచే సృష్టి ♦ విరచనంబు
చేసితిని నిట్టు లేనును ♦ శ్రీపతియును
రుద్రుఁడును గుణమయులము ♦ రుక్మమూర్తి
శివుఁడొకం డగుణుఁడు గుణ ♦ శ్రేష్ఠుఁ డగిన. 415

క॥ శివలోకమున రమణియుగు, శివతో రమియించుచుండు ♦ శివుఁ డెల్లపుడున్
సువిదితుఁడతఁ డెస్వాతంత్ర్యుఁడ, భవుఁడును బరమాత్మయర యు♦ప్రౌఢమతిసుతా!

గీ॥ శివుని పూర్ణావతారమౌ ♦ శిశిరకిరణ, ధరుఁడు రుద్రుఁడు శివుఁడనఁ♦బరగు నిలను
అతని వాసంబు కైలాస ♦ మద్రియాయె, జాండమెల్లను బాలిసిస♦నవియుదెవుడు.

వ. శివుం డా కైలాస పర్వతంబున రాజరాజగు కుబేరుని పూజలనొందుచు నాతని యందు బద్ధసఖ్యుం డై యుండె ననుడు నారదుండు నాళీకసంభవున కిట్లనియె.

గీ॥ ఎపుడు కైలాసమున కేగె ♦ నిందుధరుఁడు
ఎందుఁ బొసఁగెఁ గుబేరున ♦ కీశమైత్రి
ఏమియొనరించె శివుఁడందు ♦ నెఱుఁగఁ జెపుమ
వినఁగఁ గూరిమి పొడమె నం ♦ విస్మయాత్మ! 419

వ. అని యడిగిన విధాత యిట్లనియె.

—* కుబేరుని పూర్వజన్మ చరిత్రము *—

క॥ కాంపిల్యం బనఁబడు నొక, సంపన్నిలయమగు నగరి ♦ శాఖాభూమిన్
సొంపుగ వసించె భూమిని, లింపుఁడొకఁడు విద్యలన్ బ ♦ లీయుఁడు మిగులన్.

గీ॥ సోమపీథ్యన్వయసుధాబ్ధి ♦ సోమమూర్తి, యజ్ఞ దీక్షితుఁ డుత్తమ ♦ ఖ్యాతకీర్తి
యజ్ఞదత్తాహ్వయుం డఖి♦లాంగవేద, వేది వేదాంతవక్త ధామ్న♦విభునిహితుఁడు.

క॥ ఆతని తనయుఁడు గుణనిధి, చేతోభవరుచిరమూర్తి ♦ చిన్నతనమునన్
బ్రీతిఁ బెరుఁగుచుండెను సం,గాతులతో నాడుకొనుచుఁ ♦ గలయఁదిరుగుచున్.

క॥ గర్భాష్టకమైనంతనె, నిర్భరయశుఁ డల్ల యష్ట ని ♦ ష్ఠామతి నా
త్మార్భకున కుపనయన మా, విర్భూతప్రీతిసల్పె ♦ విత్తములలరన్. 423

చ॥ కరమనురక్తిఁ దల్లి నవ ♦ కంబగు తీయనిరొట్టె లన్నమున్
బెరుఁగును నేయి కూరలును ♦ వెన్నయు మీఁగడ పప్పు లప్పముల్
బిరబిరఁబెట్టి దుస్తులను ♦ బేర్మి నొసంగుచునుండు నిత్యమున్
జిఱుతయు ధూర్తబాలురను ♦ జేరి చరించుచునుండు నెల్లెడన్. 424

చ॥ మఱియును గొన్నినాళ్ళకు కు ♦ మారకుఁడాతఁడు ప్రత్యహంబుఁ జూ
దరులగువారిఁ గూడికొని ♦ తద్దయు బంగరుటుంగరంబులన్
మురుగులు మున్నుగాఁగల వి ♦ భూషణముల్ వ్యయపెట్టుచుండె సం
కరకులజన్ములౌ చెలిమి ♦ కాండ్రసుగూడి మెలంగుచున్ బొరిన్. 425

క॥ వైదికగోష్ఠుల నొల్లం, డాదరమును గనఁడు దేవ ♦ తాలయముల సం
పాదించు నేటినేస్తం, బాదటఁ బాషండనటళ ♦ తావళితోడన్. 426

ఉ॥ స్నానముమాని సంధ్యలకుఁ ♦ జక్కఁగ నీళ్ళొసఁగన్ మొగంబునన్
గానకపోయె బూది మడిఁ ♦ గట్టఁగరోసెను వేదపాఠమున్
మాని గురున్ సతీర్థులను ♦ మానసమందున నిస్మరించె నెం
తేసియు గీతవాద్యముల ♦ నెప్డుఁదవుల్కొని యుండె నింపుమైన్. 427

క॥ చూపులగుఱ్ఱమువలె నతఁ, డేపుమెయిన్ బెరుఁగుచుండ ♦ నీతని తండ్రిన్
శ్రీపతినిభుఁడని యెఱిఁగి మ, హాపరితోషమున మేటి ♦ యగ్రజుఁడొకఁడున్.

క॥ తనయన్ సురూపరేఖా, వినయన్ శ్రీయజ్ఞదత్త ♦ విబుధునసుమతిన్
గొని తత్తనయున కొసఁగెను, ఘనమగు హారణములనిచ్చి ♦ గౌరవ మెసఁగన్.

చ॥ తనయుని చెడ్డచెయ్వులను ♦ దండ్రియెఱుంగఁడు రాచగీమునన్
జని యట ధర్మశాస్త్రములు ♦ సచ్చరితంబులు జెప్పు నెప్డు నం
దను చదువున్ గుఱించి నడ♦తన్ గడుఁగూర్చియు సోమిదమ్మతో
దినదిన మడ్గుచుండును బ♦దిన్ బదిగా నతఁ డార్తచిత్తుఁడై. 430

చ॥ కనపడఁడేమి పుత్రకుఁడు ♦ కన్నుల కెప్పుడటన్న నావె చె
ప్పను బలుమాఱు లా నిగమ ♦ పుంజములన్ మఱి శబ్ద శాస్త్రసూ
త్రనిచయమున్ గడున్ జదివి ♦ తత్సహపాఠులతోడ నిప్పుడే
యనఘచరిత్ర! దేశికుని ♦ యాలయమేగఁగఁబోయె నంచనున్. 431

ఉ॥ స్నానముచేసెనే? విధిగ ♦ సంధ్యనువార్చెనె? భస్మపుండ్రముల్
మానక దాల్చెనే? సుతుఁడు ♦ మడ్గునుగట్టి భుజించెనే? శివ
ధ్యానము చేసెనే? గురుని ♦ యంతికమొంది త్రయిన్ బఠించెనే?
మానిని! యన్నఁ దత్సతి స♦మస్తము నట్లెయొనర్చె నాఁడనున్. 432

సీ॥ గంగాసరిద్వంతినిఁ ♦ గాని స్నానంబు సే, యం డెన్నఁడేని కొ♦డ్కంచుఁ జెప్పఁ
గాలంబు దప్ప కే♦కాని సంధ్యాగోష్ఠి, నొనరింపఁడాత్మజుం♦డని వచించు
నొక్కనాఁడును నాగ♦యొనరింపకే గురు, నొద్దఁ జదువుఁ దన♦యుఁడనిపల్కు
కడు జ్వరంపడినఁ దా♦నుడుగక పూజించు, శివలింగమును మన♦చిఱుతయనును

గీ॥ నేర్పుమెయి నిట్టు లయ్యాజి ♦ నెలఁత విభుని
తోడఁబలుకుచుఁ గొమరుని ♦ దుడుకుసేఁత
లన్నియును గప్పిపుచ్చుచు ♦ నాత్మఁ గుందు
చుండు నెంతయుఁ గొమరుపై ♦ నున్న కరుణ. 433

క॥ సతి పల్కినపల్కులు సూ, నృతములుగానమ్మి కోపి ♦ దేంద్రుఁడు ప్రీతిన్
సతమలరుచుండె గృహకృ, త్యతతిన్ దీరికయొకంత ♦ యలవడకుంటన్. 434

వ. అంతఁ దల్లియు.

గీ॥ ప్రత్యహంబును గొమరు సా ♦ పడఁగఁ జేయు
చున్న సమయంబునందు నా ♦ యన్న! నీదు
తండ్రి కడుకోపనుఁడు నీవు ♦ తగ వెఱుఁగి
మానుమీ చెడ్డపనులిఁక ♦ నేని యిపుడు. 435

క॥ ఇంతదనుక దాఁచితి నే, నుంత యెఱిఁగెనేనిఁ దండ్రి ♦ చూఁడు! నిను ననున్
గొంతుకఁగోయును వలఁకడు, వంతముతో నెవ్వరడ్డ ♦ పడినఁ గుమారా!

గీ॥ బ్రాహ్మణులకెప్డు సద్విద్య♦పరమసాధు, వర్తనము సజ్జనులచెల్మి♦వాసిఁగూర్చు
ధనమునిచ్చును ♦ గీర్తినిఁదనరఁజేయు, నేటికో నీకు రుచియింప ♦ దీహితోక్తి.

సీ॥ వినవొకో "కిముధనై ♦ ర్విద్యానవద్యాయ, ద్ది" యటంచుఁ జెప్పును ♦ ధీజనోక్తి
అరయవా? నీవు "వి♦ద్యావిహీనః పశు" వని పల్కునట్టియా ♦ ర్యజనసూక్తి
తెలియవైతివొకో! మ♦దిన్ బూని "వాగ్భూష, ణంభూషణ" మను గు♦ణజ్ఞులనుడి
ఎఱుఁగవైతో యెపు ♦ డేని "విద్యాఖ్యమం, తర్ధనం" బనునట్టి ♦ తద్జ్ఞవచన

గీ॥ మరసి దుర్జనసంసర్గ ♦ మకట! పాసి, సాధుజనసహవాసంబు ♦ సలుపుమన్న!
వేదవిద్యల నెపుడు సే ♦ వింపుమన్న!, బ్రాహ్మణాచారమును నెడఁ♦బాయకన్న!

క॥ వినుము సుతా! సచ్ఛ్రోత్రియు, లనఘులు దీక్షితులు సోమ ♦ యాజులు నీవం
శనిదానులైన పూర్వులు, కనవలదే వారిదైన ♦ గౌరవము మదిన్. 439

గీ॥ అందఱ నటుంచి కనుము నీ ♦ యాత్మజనకుఁ
డెట్టిఁడో? ప్రతిదినము న ♦ న్నెంతయేని
నిన్నుఁగూర్చి యడుగుచుండు ♦ నిర్మలాత్మఁ
డాయనఘునేని భావింపు ♦ మాత్మయందు. 440

ఉ॥ ఆతఁడు 'ఖ్యాత తేజుఁడు మ ♦ హామహులందు మహామహుండు స
త్ఖ్యాతచరిత్రుఁ డాఢ్యుఁడు వి ♦ భూషితవైదికవంశుఁ డున్నతుం
డై తగునట్టిఁ డన్నిటను ♦ నట్టి గరిష్ఠున కాత్మజుండవై
నీతిఁదొరంగి యివ్విధము ♦ నీవు చరింపఁగ మేలొకో? సుతా! 441

ఉ॥ ఎప్పుడొ గుట్టు బైటఁబడు ♦ నెన్నిదినంబులు దాఁగియుండు మా
యప్పరొ! నీదు తిప్పలిఁక ♦ నావలఁజూతము తల్లియొందుపా
ట్లప్పుడుసూడు కుక్కలకు ♦ నైనను నక్కలకైననుండవా
ముప్పుఁదలంచి భీతిలెద ♦ ముందరనున్నది పండు వాత్మజా! 442

క॥ అరసి సుతా! "పుత్రశ్శ్వ, త్రురపండిత" యనెడు వరబు ♦ ధులవాక్యములన్
గుఱిగొనుమా! నెఱఁగనుమా, యుఱియాడెడు నాదుమదికి ♦ నూరటనిడుమా!

క॥ పదునెనిమిదేండ్లు దాఁటెఁ, గద? నీ కీ పడుచు గడు న ♦ కల్మష యిదియుం
బదియాఱేండ్లది లే దే, కొదవ యిఁకన్ దండ్రి భక్తిఁ ♦ గొలువుము తండ్రీ!

వ. ఇంకను నీకు.

గీ॥ మామ సద్గుణశీలర ♦ మామనోజ్ఞుఁ, డత్త సౌజన్యనిధి వారి ♦ యాత్మజులును
నమలవిద్యాధురీణులై ♦ యాఁటితేటి, రతులులిఁక నీదుమాతులు♦లన్నియెడల.

గీ॥ నేనునుం బతిపదపద్మ ♦ నిరతమతిని, శంకరుఁడుసాక్షి యిట బుుతు♦స్నానమాడి
చూడలే దెటువంటిదు♦ష్టుని మొగంబు,పొడమితి వదెట్లు లిభ్యంగిఁ♦గొడుక!దుడుక!

చ॥ అనుదినమిట్లు పుత్రికున ♦ కాయమ బుద్ధులు చెప్పుచుండినన్
విని మదిఁ జేర్పకాతఁడు వి ♦ వేకవిహీనతఁ జేసి తొంటితె
ర్వునఁజనుచుండె వేఁటయును ♦ రోచెలి జూదము చౌర్య మాసవం
బును బిశునత్వమున్ బదరి ♦ బొంకుట సేకుఱుఁ దొల్గ వెన్నడున్. 447

చ॥ ఎదియెది మధ్యగేహమున ♦ నీక్షణగోచర మానొ వేగఁ దా
నదియది సంగ్రహించుకొని ♦ యర్పణసేయును జూదగాండ్రకిం
పొదవ నొకప్డు కుందనపు ♦ టుంగర మొక్కటి తండ్రిచేతి వ్రే
లిది యెటొ దొంగిలించికొని ♦ యిచ్చె దురోదరమూర్తి కొడ్డుగాన్. 448

వ. అంతనొక్కనాఁటి మధ్యందిన సమయంబునందు దైవవశంబునఁ జేసి దీక్షితుండు రాజవీధియందు.

ఉ॥ జూదరి వ్రేలినున్నతన ♦ సొంపగుకెంపులపైఁడియుంగ్రమున్
మీఁదుగ జూచిచూచి తన ♦ మేలిమి యుంగరమౌటెఱింగి కో
పోదయమూర్తియై కితవ! ♦ యుంగరమిద్దియెటుల్ లభించె బొం
కేదియులేక తెల్పు మల ♦ యించెద భూపతియొద్దఁ గానిచోన్. 450

మ॥ అన నవ్వాఁడును దీక్షితుం గని మహా ♦ త్మా! జూదమందోడి నీ
తనయుం డీయది నాకొసంగె నిది త ♦ థ్యం బీయదే కాదిఁకన్
వినుఁ డాతండు సువర్ణభూషణములన్ ♦ విత్తంబులన్ దెచ్చి మా
కనయం బిచ్చుచునుండు నెత్తములకై ♦ యాటోపముం జూపుచున్. 451

ఆ॥ రౌప్య కాంస్య తామ్ర ♦ రచిత భాజనముల, నారకూటకృత ఘ♦టాళి మేలి
సేలువులను మంచి ♦ చీనాంబరంబులన్, దెచ్చి యమ్ముచుండు ♦ నెత్తములకు.

క॥ నాకొక్కనికే కాదా, పోకిరి యోటువడి సభిక ♦ ముఖ్యులచేతన్
జీకొట్లు కట్లువడి తన, కోకలనున్ బ్రతిదినంబుఁ ♦ గోల్పడుచుండున్. 453

క॥ అనునంత యాజి విభ్రాంతినిఁ గొని లజ్జయునుఁ గినుక ♦ దీఱని వగయున్
బెనఁగొని మనమునలంపఁగఁ, దనయిలు చేరంగఁ బోయి ♦ తాపము గదురన్.

గీ॥ దీక్షితాయని! యిటు రావె ♦ తేఁగదే! మ, దీయమౌ నుంగరము రత్న ♦ దీపితమును
బర్వమందిచ్చె నెద్దానిఁ ♦ బ్రభుఁడు నాకు, నీవు చేకొంటె వెద్దాని ♦ నేర్పుఁ జూపి.

చ॥ అనవిని యాపె వేగమె మ♦హాత్మ! మడిన్ ధరియింపుఁ డన్న కాం
తునుగొని పెక్కరర్థులదె ♦ సావిడినిండి పరుండియున్న వా
రనఘులు మేదినీవిబుధు ♦ లంగుళిభూషణ మేను బెట్టెలో
ననువగు దంతపుం బరణి♦యందుఁ దిరంబుగ నుంచి దాఁచితిన్. 456

క॥ సాపడినంతనె వేగమె, యాపేటికఁ దెఱచి యిత్తు ♦ నధిప! యనుడు నా
నే? పరమసత్యభాషిణి, యో పాతివ్రత్యకుశల! ♦ యోసిపురంధ్రీ! 457

ఉ॥ ఎక్కడఁ బోయె నీతనయుఁ ♦ డెక్కడఁ బోయినఁ బోవుఁ గాక వా
కక్కులు సాత్మతోడ నిఁక ♦ నక్కఱ యొక్కఁడు లేదు సేలువుల్
రొక్కములున్ నగల్ రజత ♦ రుక్మమయంబులు భాజనంబు లీ
వెక్కడ దాఁచితో యిటకు ♦ నిప్పుడు దెమ్మిఁక రమ్ము చూచెదన్. 458

చ॥ కొడుకును భ్రష్టుఁ జేసితివి ♦ కూయుచునుంటివి దబ్బఱల్ గడున్
గడుఁ బరిపూతమౌ యశము ♦ గంగను గల్పితి వర్థమంతయున్
దుడిచి గృహంబు శుద్ధముగ ♦ దుర్మతి! చేసితి వింక మీఁదటన్
గుడుపుము నీదు కర్మఁపని ♦ కోపము తాపము మీఱ యజ్వయున్. 459

గీ॥ స్నానమొనరించి చక్కఁగ ♦ సంధ్యవార్చి
యగ్నిహోత్రాది కృత్యంబు ♦ లాచరించి
యతిథులందఱితోఁ గూడ ♦ నారగించి
యలుక దీరఁగ నొకనాఁటి ♦ యహమునందు. 460

క॥ ఒకశ్రోత్రియుఁడౌ ద్విజుఁక, న్యకనున్ బెండ్లాడి యంత ♦ నక్కన్నియతో
సుకముగ గృహస్థధర్మ, త్పరుఁడై చెలువొందుచుండెఁ ♦ జూపలుమెచ్చన్.

వ. అంత గుణనిధియును.

మ॥ తనవృత్తం బఖిలంబు తండ్రివినుటన్ ♦ దానప్డు యోజించి గే
మునుజేరన్ జనమాని దవ్వైసఁగు భూ ♦ ముల్ చేరఁగాఁబోయి యం
దును నన్నంబును గాన కాఁకటఁ గడున్ ♦ దుఃఖింపుచున్ సొక్కుచున్
దనతల్లిన్ స్మరియింపుచున్ బొగలుచున్ ♦ దాపాతిరేకంబునన్. 462

గీ॥ అరటిపండొల్చి నోటియం♦దారగింపఁ, బెట్టినట్లుగ జనయిత్రి ♦ ప్రియముమీఱ
నహరహంబుఁద్రివారంబు ♦ లన్నమిడెడు, నపుడు చెప్పిన సూక్తుల♦నరయనైతి.

ఉ॥ ఎచ్చటికేగువాఁడ నిక ♦ నేమియొనర్చుదు నుంతవిద్యయేన్
మచ్చుకు నేర్వనైతిని స♦మస్తమునర్థము ధారవోసితిన్
హెచ్చుగ ద్యూతశాల కిపు ♦ డేమి శరణ్యము? వంశమందు నే
మచ్చగఁదోఁచితిన్ దెరవు ♦ మాలితి నిప్పటిమాట యెట్టులో! 464

చ॥ చదువదియున్న నెవ్వఁడును ♦ జౌర్యము సేయఁగ లేఁడు దాని భూ
మిదయితుఁ డొందలేఁడిఁక న ♦ మీరసఖుండును గాల్పలేఁడు నే
మదమున నట్టివిద్యకు న ♦ మస్కృతిఁ జేసితిఁ జిన్ననాఁట ని
య్యదనున దిక్కెవండిచట ♦ నాఁకటమాడుచు నుంటెనక్కటా! 465

గీ॥ తల్లియున్నదె యిందు ని♦త్యం బుషస్సు, లందునేయియుఁ బెరుగును♦నన్నమును బ్రి
యంబు మీఱఁగ నిడియెడు ♦ నట్టితల్లి, తొల్లి చెప్పిన నీతుల ♦ నొల్లనైతి. 466

క॥ అని వనరుచు దీనతనొక, యనోకహంపు చాయనుండి ♦ యరయుచునుండన్
ఘనుఁడగు మాహేశ్వరుఁడొకఁ, డనఘుఁడు పక్వాన్నపాణి ♦ యై వేగమునన్.

గీ॥ తనదువారెల్ల వెనుకొని ♦ తరలిరా శి
వాలయంబున కరిగి యం ♦ దభవలింగ
మర్చనము సేయుచుండె భ ♦ క్త్యతిశయమున
నాఁడు శివరాత్రి యగుట న ♦ నశనుఁడగుచు. 468

క॥ ఆపక్వాన్నసుగంధము, లేపుమెయిన్ నాల్గుదెసల ♦ నెంతయుఁ బ్రాఁకన్
బాఁపండారసి దటిసి ప, సాపడఁగా నెంచె నాప్ర ♦ సాదమును దమిన్. 469

గీ॥ శివునిఁబూజించి వీరు ని ♦ శీథమందు, గునుకుదురు శివనైవేద్య ♦ మనువుమీఱ
నపుడు గొనిపోయి యద్దాని♦నవల నార, గింతునని యెంత యేని గు♦తుంభరమతి.

క॥ శివపూజకులను గనుచును, శివునికిఁ గట్టెదురుగా వ ♦ సించి వెలపలన్
శివపూజఁ జూచుచుండెను, శివమంత్రంబులను వినుచుఁ ♦ జింతాచ్యుతుఁడై.

గీ॥ సముచితార్చన మిబ్భంగి ♦ సలిపి యాట, పాటలను నాగమ స్వస్తి ♦ పాఠములను
జక్కనొనరించి రాతిరి ♦ సగము దాఁట, క్షణము కనుమూసికునికిరి ♦ జనము లెల్ల.

మత్తకోకిల. అంత బ్రాహ్మణుఁ డెంతయేనియు ♦ నార్తుడై శివమందిరా
భ్యంతరంబును జేరి దీవియ ♦ యాఱుచుండుటఁ గాంచి చే
లాంతమించుక చించి వర్తి ర ♦ యంబొనర్చి వెలుంగఁగా
సంతరించి ప్రసాదభాండముఁ ♦ జక్కఁ జేకొని పొంగుచున్. 473

గీ॥ సౌరభములాని యావలఁ ♦ జని యథేచ్ఛ, నారగించుదునని బాఁప ♦ డాసనొంది
దాఁటుచుండఁగఁ గాలివే ♦ ల్దాఁకె నొకని, కాతఁ డంతనె తెలివొంది ♦ యదరుఁగదిరి.

క॥ మ్రుచ్చదె! మ్రుచ్చదె! యనుచును, హెచ్చుగ నతఁ డఱచుచుండ ♦ నెల్లరు గనులన్
విచ్చి తెలివొందిరంతనె, వచ్చి నగరరక్షకప్ర ♦ వరులు గడువడిన్. 475

గీ॥ పాణిఁ బక్వాన్నపాత్రంబుఁ ♦ బట్టువిడక, ప్రాణభీతినిఁ బరుగెత్తు ♦ నగ్రకులునిఁ
గదిసి బాణంబులేసి య ♦ క్కసునఁ జంపి, రకట! తినకుండె నుంత యే ♦ నన్నమతఁడు.

ఉ॥ కాలుని దూతలెంతయును ♦ గాతుక మొప్పఁగ దన్నినీషులై
శూలము లుగ్రపాశములు ♦ సొంపు దలిర్పఁగఁ జేరిరంతనే
కాలహరానుజీవులును ♦ గ్రక్కున నెక్కొని వారి దర్పులన్
దోలఁగ వారలక్కజము ♦ దోఁపఁగ నిట్లనిరందఱింపుమై. 477

మ॥ కులధర్మంబును బాసి పేఁడెపు డస ♦ ద్గోష్ఠిం బ్రవర్తించుచుం
దలినిన్ దండ్రినిఁ గ్రుళ్ళఁజేసె మఱియున్ ♦ స్నానంబు సంధ్యావిధిన్
గలలోనైనఁ దలంపకుండె నెటులీ ♦ కష్టాత్మకుం ముట్టి మీ
రలు శర్వుం దగఁజేర్తు రిందె శివని ♦ ర్మాల్యంబిటన్ మ్రుచ్చిలెన్. 478

క॥ శివనిర్మాల్యము దొంగిలి, యవినీతి భుజింపనెంచు ♦ నతఁడును మఱియున్
శివనిర్మాల్యము దాఁటెడు, నవివేకియు ముట్టఁదగని ♦ యఘులండ్రు బుధుల్. 479

గీ॥ చెప్పఁడెంతేని యిఁక వీఁడు ♦ చేసియున్న, నావగింజంత పుణ్యమే ♦ మైననున్న
వినియెదము సర్వధర్మైక ♦ విదురులీర, లున్నతాత్మకులిం దేమి ♦ యుడుకుమాఁకు.

క॥ అనినంతనె శివకింకరు, లనిరిట్టుల స్థూలమతుల ♦ కందునొకో శ
ర్వుని ధర్మసూక్ష్మములు తగ, వినిచెద మిఁక వాని నిందు ♦ వినుఁడీ మీరల్.

మ॥ శివగర్భాలయమందు దివ్వె మిగులన్ ♦ జిన్నాచుఁ గన్పట్ట న
ష్టవలోకించి పటంబుఁ జించి వడి వ ♦ ర్త్యాకారమున్ గూర్చి తా

దివియన్ వెల్గఁగఁజేసెఁ జూచెను మహా ♦ దేవార్చఁ బన్నుండెఁ బ
ర్వవిశేషంబున నాలకించె శివమం ♦ త్రంబుల్ జడుండైననున్. 482

ఆ॥ కలదె యింతకన్న ♦ ఘనమైన పుణ్యంబు, కాలదూతలార! ♦ కదలుఁడింక
నిపుడె వీనిఁజేర్తు ♦ మేణాంకధరు కొల్వు, సందియంబు లేదు ♦ సత్వరమున. 483

గీ॥ కొంతకాలంబు శివుచెంత ♦ సంతసమున, నుండి కాళింగ నృపతియై ♦ యుద్భవించు
నంతఁదిరుగ మహాభక్తి ♦ నంది శివునిఁ, గొలిచి శంకరు నెయ్యంబుఁ ♦ గూర్మిఁ జెందు.

క॥ అని వారలు వేగమె వా, నిని శివలోకంబుఁ జేర్చి ♦ నీలగళునిచెం
తనునిచి రాతండందు శి, వను శివునిన్ గొలుచుచుండి ♦ వడసె సుఖంబుల్.

వ. యామ్యకింకరులును రయంబున సంయమనీపురంబుఁ జెంది సమవర్తిం జేరి యవ్విధం బంతయు నెఱింగించుటయు నతండును సర్వం బారసి యది యట్టులే యని యవ్వారల కిట్లనియె. 486

సీ॥ భసితత్రిపుండ్రముల్ ♦ ఫాలభాగములందుఁ, జెలువొందుచున్నట్టి ♦ చేవకాండ్రు
రుద్రాక్షపూసల ♦ నుతఁదాల్చి నిష్ఠమైఁ, బరఁగుచున్నట్టి ♦ భవ్యమతులు
పంచాక్షరీజప ♦ పరులై కరంబు సం, బరమొందుచున్న భా ♦ స్వచ్చరిత్రు
లభవమూర్తినిఁ బర ♦ మాహ్లాదమున నిచ్చ, లర్చించుచున్నపు ♦ ణ్యాగ్రగణ్యు

గీ॥ లెప్పుడేనియు నొక్కమా ♦ ఱేని జీవ, నార్థమై కాని మఱియొక ♦ యన్యమైన
హేతువునఁగాని మిషతోడ ♦ నేని శివునిఁ, గొలుచువారెల్ల బూజ్యులు ♦ దెలియుఁడీరు.

## —* గుణనిధి కళింగరాజపుత్రుఁడై పుట్టుట *—

వ. అట్టివారినిఁ జూచి దవ్వులనుండియే జోతలుచేసి తొలంగి రావలయు నిం దేమఱకుండుఁడని స్వగణంబుల కానతియొసంగె నిఁక శివసన్నిధి నున్న యాజ్ఞదత్తియు శివాజ్ఞాప్రకారంబు గళింగాధిపతియగు నరిందముఁడను రాజవర్యునకుఁ దనయుండై జనియించి దముండను పేరం బరగుచుఁ బూర్వపుణ్యవాసనావశంబున బాల్యంబునుండియే శివభక్తిఁ జెంది శివధర్మంబు లొనర్చుచున్ గ్రమంబునఁ బట్టభద్రుండయ్యె నంతమీఁద. 488

క॥ గ్రామాధికారులను నా, భూమీశుఁడు పిల్వనంపి ♦ పురహరువిలస
ద్ధామంబులందు దివియల, నేమంబునఁ బెట్టఁ జేయ ♦ నియమించె నొగిన్. 489

వ. మఱియును.

మ॥ ఎవరేనిన్ బరమేశు కోవెలలయం ♦ దింపొప్ప దీపంవు టు
త్సవమున్ సల్పకయున్న వారి తలలన్ ♦ జండాసి ఖండింతు బం
ధువు లేనిన్ మఱి నెయ్యు రేనియును నిం ♦ దున్ జూడ నప్పాటి నా
దు విధానం బిదియంచుఁ జాటుఁడిఁక మ ♦ ద్భూభాగమం దెల్లెడన్. 490

క॥ అని యేర్పఱచియుఁ దానును, ఘనముగ శివునెదుర దీప ♦ కాండంబుల తె
క్కొనరింపరానియట్టుల, నునుచుచుఁ గడుభక్తిఁ గొలుచు♦చుండెను నిచ్చల్.

గీ॥ ఇట్లు శివుదేవళములలో ♦ నెన్ని యేని, దీపముల నుత్సవంబుగఁ ♦ దీర్పఁజేసి
బహువిధములగు భోగము♦ల్వడసి కొంత, కాలమున కల్ల పార్థివ♦కాయమువిడి.

క॥ అలకాపురి కీశ్వరుఁడై, యల కాలహరునకు మిత్రుఁ♦డై సిరులొందెన్
అలకాపురమందగువాఁ, డలకాలగళాల యాత్ర ♦ యపు సుకృతమునన్. 493

—* గుణనిధి కుబేరుండై శివునకుఁ జెలికాఁడగుట *—

వ. అదియు నానుపూర్విగ నెఱింగింతు వినుము.

గీ॥ పద్మకల్పంబునందు మ ♦ త్స్యాంతజాతుఁ
డౌ పులస్త్యుని కాత్మజుం ♦ డయ్యె విశ్ర
వస్సు, తత్పుత్రుఁడై పుణ్య ♦ వైభవుండు
వైశ్రవణుఁడేలె లంకయన్ ♦ బట్టణమును. 494

చ॥ అతఁడును మేఘవాహన స ♦ మాహ్వయకల్పమునందుఁ గాశికన్
హితమతిఁ జిత్రికాశికను ♦ నింపునఁ జేరి శివప్రతిష్ఠ నం
చితవిభవంబునన్ సలిపి ♦ శ్రీగళలింగమునందుఁ జూడ్కి సం
తతమలరంగఁ గూరిచి ని ♦ తాంతతపంబొనరించె మించుగన్. 495

వ. మఱియు నాతనియందు.

గీ॥ విలసితతపోగ్ని శిఖము వి ♦ వేకదీప, మధికతరభక్తి సుస్నేహ ♦ మనిలరోధ
నిశ్చలంబు శివైక్యమన్ ♦ నిపుణపాత్రఁ, గామముఖవిఘ్నవిహతినిఁ♦గాంచకలరె.

క॥ ఎమ్ములు చర్మమ్మవశి, ష్టమ్మగునట్లొడలు గడుఁగృ ♦ శతఁగొన బహువ
ర్షమ్ములు సలిపెఁ దపోవ్రత, మమ్మహితుఁడు సకలదివ్య ♦ లలరిపొగడఁగాన్.

చ॥ చిరముగఁ జూడ్కి లింగమునఁ ♦ జేర్చి తపించుచు నున్నయట్టి య
బ్బిరుదుఁ దపస్విఁ జూచుతమిఁ ♦ బేరిమి విశ్వవిభుండు గౌరితో
బిరబిరఁ జేరి కోర్కొను మ ♦ భీష్టములిచ్చెద నన్న నాతఁడున్
సరగున నేత్రముల్ దెఱచి ♦ శంకరు సూర్యసహస్రభాస్వరున్. 498

చ॥ కనుగొనఁజాల కార్తివడి ♦ కన్నినఁగన్నులుమూసి యిట్లనెన్
ఘనకరుణానిధాన! ననుఁ ♦ గానఁగవచ్చి వరంబు లిచ్చెదన్
గొనుమనియంటి వింకోర్కఁడు ♦ గోరను గోరెద నీపదాబ్జముల్
దనియుచుఁ గన్గొనన్ వెరవుఁ♦ దార్కొనఁ జేయుము వేగ మ్రొక్కెదన్.

మ॥ అని యర్థింపఁడు వేగ శంకరుఁడు దా ♦ నత్తాపసగ్రామణిం
దురిన కష్టే యనిమేషదృష్టి యుడ సం ♦ తోషించి యాతండు వే

గని కాంచెన్ రమణీమణిఁ ద్రిజగతీ ♦ కళ్యాణసంధాయినిన్
ఘనకారుణ్యనిధిన్ మహేశ్వరిని యో ♦ గశ్రీధురీణాకృతిన్. 500

చ॥ శివునిభుజంబుసోఁకఁగడు ♦ నెన్నగు నెన్నగు మోముతోడఁ జె
ల్వవు సిరినొప్పియున్న జగ ♦ దంబికనున్ గని యీపె యెవ్వతో
శివుని సరాసరిన్నిలిచి ♦ శ్రీ రహిమీఱుచునున్న దెట్టి మే
లవు తపసొంది యుండెనోకో? ♦ యబ్జసుగంధి కరం బిటుల్ సిరిన్.

క॥ ఔరా! యందంపుపసం, బౌరారా! శ్రీలలితమ♦హాభ్యుదయం బ
ఝ్ఝారే! ప్రేమభరమువా, హ్వారే! సౌభాగ్య గరిమ ♦ లరయన్ దరమే. 502

క॥ నా తపసుకన్న నురవుగ, నీ తామరసాక్షి తపసు ♦ నెటు చేసెనొ సం
ప్రీతి నిటు గారవించెను, భూతేశ్వరుఁడని యసూయ ♦ పొదలఁగఁ గనుడున్.

క॥ చెడుమది నిటు నూచిన య, ప్పుడ తత్పరిపాకరూప ♦ మున నాతనిదా
నెడమ కనుగ్రుడ్డు పగిలెను, గుడువక సుడియునొకో యెందుఁ♦గూడని చెయ్వుల్.

వ. అంత.

ఉ॥ ఆరసి యవ్విధంబు నఖి ♦ లాంబుజజాండకరండ నేత్రియా
నా రమణీమతల్లి తన ♦ యాత్మవిభుఁ గని దేవ! యెవ్వఁడీ
క్రూరుఁడు క్రూరదృష్టి ననుఁ ♦ గొంకక చూచెడు వీనిదైన యీ
నేరమి నారయన్ వలయు ♦ నెట్టననన్న మహేశుఁ డాఁదటన్. 505

ఉ॥ సైరణసేయు దేవి! సుతు ♦ చాపలభావము వీఁడు పుత్రకుం
డారయు మెందుఁ బుత్త్రి లన ♦ యంబు ప్రియేతరముల్ప్రవర్తనన్
నేరములంచు నెంచకయె ♦ నిచ్చలు సాఁకుచునుండువారొ నీ
వారహిఁజెంది వీనిని ద ♦ యన్ గని ప్రోవు మనుగ్రహోన్నతిన్. 506

క॥ అనియిటు తనగేహిని కిను, కను నుడిపి తపస్వినిఁ గని ♦ కనికరముగడున్
దనుకఁగ మహేశుఁడిత్తెఱఁ, గున వరముల నొసఁగెఁ దనదు ♦ గొప్పదలిర్పన్.

సీ॥ గుహ్యకులకును జ ♦ క్కులకును గిన్నరు, లకుఁ బుణ్యజనులకే ♦ లికవుగమ్మ
అక్షయతన్దన ♦ రారుచుండెడు నవ, నిధులకు సతతంబు ♦ నేతవగుము
నీవీటియెలతోఁట నిచ్చలు నేనుందు, నెడపక నాచెల్మి ♦ నెపుడుఁబడయు
మరసి ధనంబుల ♦ నఖిలజనంబున, కిచ్చువదాన్యత ♦ హెచ్చు మిగులు

గీ॥ మని వరంబుల నొసఁగి యా ♦ ర్యాపదంబు
లందుఁబడు మీపె నీతల్లి ♦ యాదరించు
నని యటుల సల్పఁజేసి తా ♦ నపుడు ప్రియుఁ
గావు నీసుతునని చెప్పఁ ♦ గడఁగి యుమయు. 508

చ॥ వినుము కుమార ! నీకుఁగడు ♦ విస్తరిలున్ శివభక్తి సామి యి
చ్చినవరముల్ఫలించు నీకుఁ ♦ జెడ్డతనంబున నీవు నాదుచె
ల్వునుగని యారసంపడుటఁ ♦ బూన్కి కుబేరుఁడనన్ సమాహ్వయం
బును ధరియింతువెప్డు శుభ ♦ ము ల్పెనుపొందునుగాక నీకిలన్. 509

వ. అనుచు నయ్యాదిశక్తి యిట్లు వరంబులిచ్చిన నంత ఖండేందుమౌళి దేవితో నంతర్ధానంబు నొందె నంతఁ బరమశివుని రూపాంతరంబైన నీలలోహితరుద్రుండఖండప్రమథదేవభూతగణంబులతో శుభముహూర్తంబున నలకానగర బాహ్యోద్యానం బందలి కలధౌతశైలశిఖరాగ్రహర్మ్యతలంబునఁ బ్రవేశించె ననంతరంబున నఖిలమునివరులును సిద్ధులును, మూర్తిమంతంబులగు నిగమంబులు నాగమంబులును, హరివిరించనులును దారసించి వచ్చి సర్వేశ్వరుని సేవించిరి. కుబేరుం డానందంబున నందఱి కాతిథ్యంబొసంగి యలరె. మహేశ్వరుం డయ్యెడ దివ్యజనుల నందఱ నభీష్టవరదానంబుల సంతుష్టులం జేసిన నవ్వారలందఱు శివాజ్ఞాప్రకారంబుగ స్వస్థానంబుల కరిగి రిట్లు కుబేరుండు శివానుగ్రహంబునకుం బాత్రుండయ్యె నీక నందు భర్గుండు బ్రహ్మచారిగ నుండఁ గొంతకాలంబున కాత్మశక్తి దాక్షాయణిగ జన్మించుటఁజేసి యద్దేవిన్ బెండ్లాడి యాపెతో నందు యోగవిహారంబు లొనర్చెనని శతానందుం డాత్మజునకు బోధించె నీ సృష్టిప్రకార కథనంబు నెవ్వరేనిఁ జదివిన వినిన నవ్వారలు భోగమోక్షంబు లొందెదరని తెల్పిన సూతునకు శౌనకాదులు దాక్షాయణీరుద్రుల పరిణయంబును నవ్వారి లీలలఁ నెఱింగింపుమనుటయు.

మాలినీవృత్తము. నిగమహితచరిత్రా! ♦ నిత్యధర్మానుయాత్రా!
సుగుణమణి నిధానా! ♦ సూరిగణ్యాభిధానా!
అగణితశుభకీర్తీ! ♦ యచ్ఛపుణ్యానువర్తీ!
విగళితభవచర్యా ♦ వీరభద్రేశభార్యా! 511

గద్య.

ఇది శ్రీబుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వర నామధేయప్రణీతంబైన శివపురాణంబునందలి సృష్టిఖండము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## సతీ ఖండము.

### ప్రథమాశ్వాసము.



విశ్వేశ్వరలింగా
ర్చావిలసితసుప్రసాద ♦ జాతోద్భటవం
శ్యా ! వీరభద్రదేశిక
పావనసుయశోభిరామ ♦ భవ్యచరిత్రా !

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునీంద్రుల కిట్లనియె

—* నారదుఁడు బ్రహ్మను సతీదేవి చరిత్రంబుఁ జెప్పుమనుట *—

ఉ॥ నారదుఁ డష్ట సంతసము ♦ నాఁటినచేతముతోడ భారతీ
దారునితో నిటుల్ పలికె ♦ దక్షున కెట్లుజనించె శక్తియ
న్నీరజలోచనన్ దమిని ♦ నెక్కొని రుద్రుఁ డెటుల్వరించె న
ద్ధీరునితోఁ బగన్ గొని వి ♦ ధీ ! మఖమేల యొనర్చె దక్షుఁడున్. 2

గీ॥ అంబ యేటికి మరల దే ♦ హాంతరంబు, నొందవలసెనో యది యర♦విందగర్భ !
సర్వమును నాకెఱింగింపు ♦ సంతసమున, నీకుసరివచ్చుగురు నెందు ♦ నేనెఱుంగ.

క॥ అని యడుగుడు రాజీవజుఁ, డనురాగముదోఁప నిట్టు ♦ లనియెను మౌనీం
ద్రమన కాత్మజ ! యెఱిఁగింతును, మనమలరఁగఁ బరమశివుని ♦ మహితచరిత్రన్. 4

ఉ॥ మున్ను మరీచి ముఖ్యులగు ♦ పుత్రులఁ బుట్టఁగఁ జేయ నంత సం
పన్నమనోజ్ఞరేఖయగు ♦ బాలిక సాయపుసంధ్యనాఁగడున్
జెన్నగుకన్నె యొక్కతె వ ♦ శీకృతతాపసచిత్త వొల్చె నా
యన్నులమిన్నఁ గాంచి ముద ♦ మందఁగఁ జాలని వారలుందురే ? 5

ఉ॥ అమ్మదిరాక్షిఁ బోలినయొ ♦ యారిని నాకమునందు మర్త్యలో
కమ్మున నాగలోకమునఁ ♦ గాని గనుంగొన రెవ్వరెప్డు చో
క్కమ్మగు మేల్మిబంగరపు ♦ కాంతులఁ బంతము మీఱి మీఱు చె
ల్వమ్మగుమేనిసోరు మరి ♦ పంపువిలాసరసప్రసారముల్ 6

—* సంధ్యనుజూచి బ్రహ్మయుఁ దత్పుత్రులును మోహించుట *—

వ. అంత

ఉ॥ దానిని నేను నాసుతులుఁ ♦ దప్పక తెప్పలువాల్చ కెంతయుఁ
బూనికఁ జూచుచున్నతఱిఁ ♦ బుష్పశరుండటఁ దోఁచి మమ్మనెం
తేనియు మోహవాగురలఁ ♦ దీరిచి త్రోయుడుఁ దెర్వమాలి య
మ్మీనవిలోచనన్ గవయ ♦ మేము దలంచుచు నుంటి మార్తమై. 7

చ॥ అదియును మన్మథార్తిఁగొని ♦ యక్కట ! యందఱ మమ్ముఁ జూచుచున్
ముదముదలిర్పఁగాఁ గడిఁది ♦ మోహనహాసవిలాసభావముల్
పొదలఁగఁ జేయుచున్ దనదు ♦ పొంకపుమేని మెఱుంగురంగు లిం
పొదవఁగఁ గానుపింపఁగఁ బ ♦ యోరుహనేత్ర యటన్ మెలంగుచున్. 8

చ॥ సుతయనునట్టి భావమును ♦ జూడక ధర్మవుఁ జూఱఁబుచ్చి నేఁ
గుతుకముమీఱ నక్కలికిఁ ♦ గూడఁగడాయుచు నున్నఁజూచి స
న్నుతమతి ధర్ముఁడన్ నిజ ♦ తనూజుఁడోకండు వశాత్మకుండు నిం
దితమగు నాదు మోహమును ♦ దిప్పఁగ నీశుఁ దలంచె నాత్మలోన్. 9

క॥ హరుఁడంతనె వేగిరమున, దఱిసి నను్ ధర్ముఁ దక్కు ♦ తనుజాతుల
నందఱను్ గని నగి లజ్జను, నెఱిఁగింపుచు నిట్టులనియె ♦ నేవముదోఁపన్. 10

ఉ॥ అద్దిర బ్రహ్మ ! యెట్లు చప ♦ లాత్ముఁడవై కనుఁగాన కెంతయున్
ముద్దుకుమారికన్ గవయు ♦ బుద్ధినొనర్చితివోయి! నీసుతుల్
హద్దుదొలంగి దోసమున ♦ కాత్మసహోదరిఁ గూడ నెంచినా
రెద్దెస నేని యిట్టికత ♦ లెప్డు వినంబడెనే ! జగంబునన్. 11

క॥ తలి కూఁతు రన్న పెండ్లము, జెలియలు నప్పయును నెప్డు ♦ క్షేమార్థులచే
కలుషమతిఁ జూడఁదగదని, యిల వాకొనుచుందు రెందుఁ ♦ గృతమతు లరసే.

ఉ॥ ఎక్కడ కేగె వేదము లిఁ ♦ కెక్కడ దాఁగెను ధర్మశాస్త్రముల్
మక్కువకూఁతుఁ గూడుటది ♦ మంచిదె? కాంచు విరించి ! యున్న వే
చక్కఁగ మళ్ళి సిగ్గుఁగొని ♦ చాలగఁ జింత యొనర్చు చుండఁగా
నుక్కఁడుఁ జెమ్మట ల్వొడమ ♦ నుద్భవ మొందిరి పెక్కు రాత్మజుల్. 13

—* బ్రహ్మ మున్నగువారల కగ్నిష్వాత్తాదులు పుట్టుట *—

వ. అందగ్నిష్వాత్తాదులగువా రఱువదినాల్గువేలును, నెనుబదియాఱువేలు బర్హిషదు
లనువారును బితృగణంబులై యేర్పడిరి. వారందఱును 14

క॥ కాటుకరేక వితమ్మున, నీటుగ రంగొప్ప వికచ ♦ నీరజనేత్రుల్
మేటియతుల్ సంసరణము, దాఁటినవా రధికపుణ్య ♦ తనులు మహాత్ముల్. 15

గీ॥ మత్సుతుండైన దక్షుఘ ♦ ర్మసలిలమున
సద్గుణనిధాన తన్వంగి ♦ చారుదశన
కలదు లేదను నడుమొప్పు ♦ కలికిమిన్న
కుందనపు బొమ్మయన నొక్క ♦ కొమ్మ పొడమె. 16

వ. మఱియు సర్వాంగసుందరి యగు నమ్మగువ

క॥ పున్నమచందురుబోలిన, చిన్నారిమొగమునఁ జెలఁగు ♦ చిఱునగవున మేల్
వెన్నెలలఁ గుమ్మరింపుచు, సన్నుతమై యున్నరతిగ ♦ సాటెరి యసురుల్. 17

వ. మఱియును నాయాత్మజులందు మరీచిప్రముఖులగు నాల్గురుదక్కఁదక్కిన వార
లకు రేతఃపాతంబగుడు నద్దానఁ గ్రతునకు సోమపులును వశిష్ఠునకుఁ గాలీను
లును బులస్త్యున కాజ్యపులును నంగిరసునకు హావిష్మంతులును జన్మించిరి.
ఇప్పురుషులంద అగ్నిష్వాత్తాదులతోఁ గలసి పితృగణంబులై కవ్యభోజనులై
యుండి రివ్వారల జన్మంబునకు సంధ్య హేతువగుట నది పితృమాతయనఁ
బరఁగె ననంతరంబు మహేశ్వరుండు మమ్మునందఱను మన్నించి ధర్మని నను గ్ర
హించి యంతర్ధానంబు నొందె నంత నేనును లజ్జాక్రాంతుండనై యట్టి మోహ
జనకుండగు కాము నుద్దేశించి బిట్టలుకతో. 18

గీ॥ ఓరి మన్మథ! మమ్మిట్లు ♦ ననుచితమైన, మోహవహ్నిఁబడన్ద్రోచి ♦ మొక్కలమున
నుడుకఁజేసితి వమ్మహే ♦ శుఁడు హసించె, నీవు నుఱిఁగెద వాశివు ♦ నేత్రవహ్ని.

క॥ అని శపియించిన మదనుఁడు, విని ఝల్లునఁ జెదరి బెదరి ♦ వేగముగ విరిం
చినిఁ గని యేమిది దేవర!, నను శపియించితి వకార ♦ ణమ్మగ నిట్టుల్. 20

మ॥ ననుఁబుట్టించినయప్డు మజ్జనకుఁడౌ ♦ నారాయణుం డీవునున్
ననుఁ ద్రైలోక్యవిమోహనక్రియను సం ♦ ధానింపుమంచున్ బురా
తనులౌమువ్వురుమూర్తు లీరలు మొదల్ ♦ తథ్యంబు సర్వామరుల్
మునులున్ దైత్యులు మర్త్యులున్ ఫణులు స ♦ మ్మోహార్హు లం చాడరే. 21

క॥ అదియెఱిఁగి నేను నిత్తఱి, నొదవించితి మీకు వికృతి ♦ నున్నతమతి! త
ప్పిదమేమిట నాయది నను, సదమద మొనరింప నిట్లు ♦ శాపంబిడఁగాఁ. 22

క॥ అని యడిగిన దు)హిణుం డి, ట్లనియెను సుతయందు నాకు ♦ ననుజపయిని మ
త్తనయులకును దమిఁ గూర్పఁగఁ, జనునే యనుచితపుఁగృతి వి♦చారము వలదే?

చ॥ గొనకొని యాండ్రికుణ్ మగల ♦ కుణ్ దమి గూరుపఁగా నిరుణ్ నియో
జన మొనరించినామని య ♦ సాధుపదమ్మున మమ్ముఁ దో)యఁగా
ననువాకొ! యైనరుణ్ గినుక ♦ యంతరమొందెను శాప మింతతో
నెనయదు పెద్దకాలమున ♦ నెవ్వడొ యట్లొనరించు నిన్నిఁకణ్. 24

ఉ॥ అట్టులె చెల్లియుణ్ మరల ♦ నాభవుపెండిలి నమ్మహాత్ముచేఁ
బుట్టుక నొందఁగాఁ గలవు ♦ పొమ్మిఁక వందురకంచుఁ జెప్పి నేఁ
జట్టన నంతరంబెనయఁ ♦ జక్కఁగ దక్షుఁడు తత్సుతణ్ రతిణ్
నెట్టన మీనకేతునకు ♦ నేరిమి నిచ్చి యొనర్చెఁ బెండిలిణ్. 25

వ. అంత మన్మథుండును రతిన్‌గొని చని స్వావసథంబును జేరి యందు నిచ్చలును
రూపరేఖాలావణ్యపుణ్యామూర్తి యగు రతితో నలరుచు. 26

సీ॥ కొమ్మకన్బొమ్మల ♦ కుదిరికఁ గన్గొని, విల్లుపై వెగటొంది ♦ విడిచెఁ బెదవి
సుందరిక్రీఁగంటి ♦ చూపుల చొక్కులఁ, గని నిజాస్త్రముల లె♦క్కగొనకుండె
నిండుచందురు మించు♦నెలఁత మొగముఁజూచి, జాబిల్లితోఁ జెల్మి♦సలుపఁదడసె
తమ్మిమొగ్గల మీఱు♦తరుణి చన్గవఁగాంచి, తమ్ములపై ననా ♦ దరముసూపె
గీ॥ బలిసిబిగిమీఱియున్న న♦ భ్భామ చన్నుఁ, గవపయిని వ్రేలుముత్యాల♦కంఠహార
మరసి తననారి నిస్సార♦మనుచురోసె, భువనమోహనుఁడైనయా♦పుష్పశరుఁడు.

వ. రతియును

ఉ॥ చక్కనివారలందుఁ గడుఁ ♦ జక్కనివాఁడగు కమ్మవిల్తొరణ్
జక్కఁగఁ బెండ్లియాడి కడు ♦ సంతసమొప్పఁగఁ దోడినీడ నా
నెక్కుడువేడ్కఁ గన్గొనుచు ♦ నింపులు సొంపులు మీఱఁగాంతునిణ్
మక్కువఁగొల్చుచుండెను ర ♦ మాసతి విష్ణునియట్లు చెల్వమై. 28

క॥ సౌదామనీ వలాహకు, లాదివిషత్పదవి నెట్టు ♦ లలరుదురో యం
దా దక్షజామదను లా, మోదంబున వెలసి రెంతొ ♦ పొగడఁగ జగముల్. 29

గీ॥ ఏనును మదాత్మజులును మ♦ హేశ్వరుండు, నచ్చొటునువిడి చనిసంత♦నద్దియెల్ల
నరసిసాయంపుసంధ్యయి♦ట్లని మనమునఁ, జింతయొనరించె నెంతయుఁ♦జిన్నవోయి.

ఉ॥ అక్కట నేను పుట్టిన య ♦ నంతరకాలమునందె యెక్కుడౌ
చక్కఁదనంపు నాయొడలి ♦ చందముఁగన్గొని తండ్రి యన్నలుణ్
మిక్కుటమైన మోహమున ♦ మీఱుచు మారుని బారికెంతయుణ్
జిక్కి ననున్ దమిన్గవయఁ ♦ జేరఁగ నెంచిరి పాపకర్ములై. 31

ఉ॥ నేనును గామవిద్ధనయి ♦ నిందితబుద్ధిఁ బథంబుఁ దప్పి యొ
ప్పౌనిజహావభావలలి ♦ తాయతదృష్టిఁ దనర్చి చూచితిన్
మానసమందు వారలస ♦ మాగమకేళికి నీయకొంటి నెం
దేనియు నిట్టిచెడ్డతల ♦ పెంచఁదలంతురె యెవ్వరేనియున్. 32

ఉ॥ ఇంతకు వారలన్ నను ర ♦ హిన్ గరఁగించిన యించువింటిజో
దెంతయు దోసకారి యతఁ ♦ డే పఱ శాపమునొందె మేలు నే
నింతటి పాపశీలనయి ♦ యెట్టులనీతనువున్ ధరింతుఁ గా
వింతునికన్ మహాతపము ♦ విచ్చిచనంగ మహాఘపుంజముల్. 33

చ॥ చెడుగునుగాదె యిమ్మెయినిఁ ♦ జెందఁగఁ జూచితిఁ దండ్రి నన్నలన్
విడువఁగనొప్పు దీనిఁ దగ ♦ వేల్చెదఁ జండహుతాశనార్చియం
దొడిసి తపించెదన్ దురిత ♦ మూడి సురుంగ వెలుంగు కీర్తిరాఁ
బడసెదఁ గామమద్ది యిఁక ♦ బాలురకొందని యట్లొనర్చెదన్. 34

క॥ అని వేగఁ జంద్రభాగా, ధునియొప్పెడు చంద్రభాగ ♦ దుర్గమగిరికిన్
జని యట నెలవొంది కడున్, ఘనతప మొనరింప నియతిఁ♦గాంచఁగనుండెన్. 35

వ. అయ్యవసరంబున.

—* బ్రహ్మ సంధ్యయొద్దకు వశిష్ఠునిఁబంపుట *—

ఉ॥ కూతురు తాపసవ్రతముఁ ♦ గోరియొనర్పఁగ నున్ననామె య
చ్చోఁత యెఱింగి యేనును వ ♦ శిష్ఠుని మత్తనుజన్ముఁ జూచి నీ
వీతఱి చంద్రభాగగిరి ♦ నేపునఁ జేరి యటన్ దపింపఁగా
నాతురమైన సంధ్యకుఁ బ్రి ♦ యంబున మాంత్రికదీక్ష నిమ్మిఁకన్. 36

చ॥ ఎఱుఁగదు చిన్నబాల మన ♦ మెంతయుఁ గంతునకోడి దానిపైఁ
గరమనురక్తిఁ జెందుటది ♦ గాంచి జుగుప్సగ నెంచి యిట్టులన్
దిరమగుపూన్కితోఁ దపసు ♦ దీర్పఁగఁబూనెను గాన నీవు స
త్వరమటఁజేరి యాయమకు ♦ భర్గునిమంత్రముఁ జెప్పు సిద్ధిగాన్. 37

క॥ నీవీ వేసముతోడుతఁ, బోవలదు కుమార! మాఱి ♦ పోవలె నది యి
ట్లీ వరిగినఁ దొలివృత్తము, భావంబునఁ దలఁచి వెఱచి ♦ పఱచు దవులకున్. 38

క॥ అని పనిచిన నతఁ డట్టులఁ, జని కనియెను జంద్రభాగ ♦ శైలాగ్రమునం
దొనరిన లోహితతీర్థము, ముని ముంగలఁ దపసొనర్పఁ ♦ బూనిన సంధ్యన్. 39

గీ॥ తీరమొందిన సంధ్యచేఁ ♦ దేజరిల్లె, లోహితహ్రదమంభోజి ♦ నీహితంబు
శరముచుక్కలగుంపుతోఁ ♦ గ్రాలునభము, పొడుచుచందురు చేఁగాంతిఁ ♦ బొదలినట్లు.

గీ॥ గాదకొనుచుఁ జంద్రభాగ య ♦ గ్గొండయపర
భాగమును భేదమొనరించి ♦ వేగ మొప్ప
దక్షిణాంబుధిఁ జేరఁగఁ ♦ దరలుచుండు
దర్శనీయమై యాస్థలి ♦ దనరు ధరను. 41

చ॥ కనుఁగొని సంధ్య కిట్లనియె ♦ కంజదళేక్షణ! యేటికిట్లు ని
ర్జనవన మొంది యుంటివిటఁ ♦ జక్కఁగ నేమియొనర్పఁ బూనితో
జనకుఁ డెవండొ చెప్పు మిఁకఁ ♦ జందురుఁ గుందఁగఁజేయునీమొగం
బున నెదియోవిచారము ద ♦ వుల్కొని యున్నటు గానుపించెడున్. 42

గీ॥ అనిన నమ్మునివరుని మ ♦ హాత్మునిన్ జ్వ, లించునజ్ఞాతవేదుని ♦ లీలఁ గ్రాలు
వాని నొడలు ధరించిన♦బ్రహ్మచర్య, వ్రతమునా నొప్పు వాని న♦ప్పుడఁతి గాంచి.

ఉ॥ ఆదట మ్రొక్కి యిట్లనె మ ♦ హాత్మ! యెఱుంగఁగ లేవె నీవిఁకన్
నాదు మనోరథంబును ఘ ♦ నంబుగ నిందుఁ దపంబు సేయ నా
హ్లాదమునొంది యిగ్గిరివ ♦ రాగ్రముఁజేరితి సంధ్యయందు్రి న
న్నాదిమమూర్తియా నలువ ♦ కాత్మతనూజను జిత్తగింపుమా! 44

క॥ ఎఱుఁగను మంత్రము తంత్రిం, బెఱుఁగను తాపసవిధాన♦ మెఱుఁగ నొకింతే
మఱుఁగుచునుంటిని నందుల, కురుకరుణానిధి! యొసంగు ♦ముపదేశ మిఁకన్. 45

—* వశిష్ఠుఁడు సంధ్యకు మంత్రోపదేశంబు చేయుట *—

క॥ అనినవిని యవ్వశిష్ఠుం, డొనరఁగ నవ్వనితకప్పు ♦ డుపదేశంబి
ట్లొనరించె విధివిధిగఁ బా, వనమగు శివదీక్షనొసఁగి ♦ వాత్సల్యమునన్. 46

క॥ పరమమగు గొప్ప తేజము, పరమంబగు గొప్పతపము ♦ పరముఁడునగునా
పరమారాధ్యుఁడు శంభుడు, దిరముగ మదినుండునట్లు♦దిద్దికొను మెదన్. 47

వ. ఇట్లు మనంబును శివైకతానంబొనర్చి నాయుపదేశించు మంత్రింబున మహేశ్వ
రునిఁ గొలువుము నీకు సకలసిద్ధులొనఁగూడునని “ఓం నమశ్శంకరాయ ఓం”
అనుమంత్రింబు నుపదేశించి మఱియు నిట్లు బోధించెను. 48

గీ॥ మౌనమునఁ దీర్ఘమాడును ♦ మౌనముననె
చేయుము శివార్చనను నెప్డు ♦ చిగురుఁబోఁడి!
పర్ణజలభక్షణమునఁ ద ♦ పంబునిట్లు
సల్పిన నభీష్టసిద్ధియా ♦ సత్యమిద్ది. 49

గీ॥ ఇట్లు నిచ్చలుమదిలో మ♦ హేశునిల్పి, కొలువు సందియమొందక♦ ఫలములొందు
నని వశిష్ఠమహర్షి సం♦ధ్యాలతాంగి, కెఱుకవడఁ జెప్పి యంతర్ధి ♦ నెలమినొందె.

క॥ శివదీక్షనొంది సంధ్యా, కువలయలోచన కరంబు ♦ కూరిమితోడన్
శివమంత్రింబు జపించుచు, నవధానముతోడ సలిపె ♦ నంచితతపమున్. 51

## —* శివుఁడు సంధ్యకు సాక్షాత్కరించుట *—

క॥ పదిరెండువేలయేం డ్లట, ముదమునఁ దపియింప నంత ♦ మూర్ధేందుధరుం
డెదఁ గనికరించి ప్రేమా, స్పదుఁడై పొడసూప నంత ♦ సంధ్య రయమునన్.

ఆ॥ ప్రిభుఁ బ్రిసన్నవదను♦భర్గునిఁగనుఁగొని, భయము భక్తిగదురఁ♦బ్రియముతో ను
తింప వలనుగనక ♦ దీనయై కనులను, మొగిచి నిలువఁజూచి ♦ నగశయనుఁడు.

క॥ దివ్యజ్ఞానంబును నీక, దివ్యవిలోచనములొసఁగఁ ♦ దెలివొంది కడున్
దివ్యోక్తులతో నిట్టుల, దివ్యవరున్ హరునిఁ గడు ను ♦ తించెఁ బ్రణతయై. 54

క॥ స్థూలము సూక్ష్మంబనఁబడు, నేలాటి విధంబుగాక ♦ నెఱుఁగుటకుఁగదుర్
వీలమరక జ్ఞానంబున, నే లభియింపఁబడువాని ♦ నే సేవింతున్. 55

క॥ శాంతము నిర్మలమును న, త్యంతము జ్ఞానైకగమ్యు ♦ మవికారమ్మున్
ధ్వాంతపథేతరలలిత మ, నంతం బాత్మప్రకాశ ♦ మగు శివుఁ గొలుతున్. 56

క॥ ఎవ్వని రూపంబులు నభ, మివ్వసుమతి సలిల మగ్ని ♦ యిప్పవమానుం
డవ్వైవస్వతుఁ డాదిశ, లవ్విశ్వాకారుఁ గొలుతు ♦ నహరహము రహిన్. 57

ఆ॥ ఇలఁ బ్రిధానపురుషు♦లెవ్వానిపనికినై, బయలువెడలి రెంతొ ♦ ప్రోఢిదనర
నట్టి శంకరునకు ♦ నవ్యక్తమూర్తికి, వందనము నొనర్తు ♦ వాసిమీఱ. 58

క॥ కమలజరూపంబున స, ర్గము హరిరూపమునఁ బెంపు ♦ ఖండపరశురూ
పమున లయం బొనరించు ప, రమశివు భజియించెదన్ గ♦రము భక్తిమెయిన్.

క॥ నీవే పరమాత్మవు శివ!, నీవే చిద్విద్యవెందు ♦ నిరుపమభావా!
నీవే బ్రహ్మవు! దేవా!, నీవే సద్వస్తువవు ద ♦ నిందితవిభవా! 60

క॥ ఎవనికిఁ దొలినడిమియునుత్, జివరయుఁ గాన్పింప వెందుఁ ♦ జెలఁగుజగములీ
యవి యెవనివలన వెలువడు, నవాఙ్మనసగమ్యు నామ ♦ హాత్మ్యుఁ గొలిచెదన్.

క॥ కారణములకెల్లను మేల్, కారణమై సర్వలోక ♦ కళ్యాణకరుం
డై రహిమీఱు పరాత్పరు, సారమయున్ బూతపూతు ♦ సన్నుతుఁగొలుతున్.

ఆ॥ నిర్గుణుండవైన ♦ నీగుణవైభవ, మాఁడుదాన నేమి ♦ యరయఁగలను
ఇంద్రిఁడేని మఱి యు♦పేంద్రుఁడేనెవ్వాని, రూపమారయుటకు♦నోపరెపుడు.

క॥ మ్రొక్కెద నీకు మహేశ్వర!, మ్రొక్కెద గీర్వాణవంద్య! మ్రొక్కెద శంభూ!
మ్రొక్కెదఁ దపోమయా! యిఁక, దిక్కై నను బ్రోవుమయ్య ♦ దీనశరణ్యా!

గీ॥ ఇట్లు నుతి చేసినట్టియా ♦ యిందువదన, పలుకులాలించి భక్తవత్సలుఁడు మంచు
చేతఁ జెదరినతమ్మిపూ ♦ రీతినలరు, పొలఁతి నెమ్మోముఁ గన్గొని ♦ పలికె నిట్లు. 65

—* శివుఁడు సంధ్యకు వరంబులిచ్చుట *—

చ॥ మురిసితినమ్మ! నీదుతప ♦ మున్ గని నీవొనరించినట్టి యీ
నిరుపమసంస్తవంబునకు ♦ నేరిమికిన్ గడుసంతసించితిన్
వరముల నిత్తుఁ జేకొను మ ♦ వశ్యము నీదగుకోర్కు లెవ్వియో
వరుసగఁ దెల్పు మన్నియును ♦ వైళమొసంగెదఁ బైదలీ! యిఁకన్. 66

వ. ఇట్లు పలికిన మహేశ్వరుని వచనంబులకు సంతుష్టయై యచ్చేడియ జగ
త్ప్రభునకుఁ బౌనఃపున్యంబుగాఁ బ్రణమిల్లి యిట్లు విన్నవించె. 67

చ॥ వరమును జెందఁగాఁ దగిన ♦ వాసికి నేఁ దగియున్నఁ బూర్వపున్
దురితముఁ బాసి శుద్ధనయి ♦ తోఁచిన నాతపమీవు మెచ్చినన్
వరద! యొసంగు మిప్పుడమిఁ ♦ బ్రాణులు పుట్టినయంత మన్మథా
తురతను గాంచకుండునటు ♦ దొల్తవరంబిది దేవపూజితా! 68

వ. మఱియును

ఉ॥ ఎవ్వని నేను నాథునిగ ♦ నెంచి వరించెదనో త్రిశుద్ధిగా
నవ్వరునందె నామది య ♦ హర్నిశలున్ రమియించుఁగాక తా
నవ్విభుఁడున్ ననున్ గడుఁ బ్రి ♦ యమ్మునఁ జేకొనియుండుఁగాక యొం
డెవ్వఁడు నన్నుఁ గామమతి ♦ నీక్షయొనర్చినఁ గ్లీబుఁడౌ ధరన్. 69

వ. ఇమ్మూఁడు వరంబులు నాకిమ్మనుడు నమ్మహేశ్వరుఁడు తథాస్తని మఱియు
నిట్లనియె. 70

గీ॥ కొమ్మ! యిఁక నేమి మదిని సం ♦ కోచపడకు
పాపమంతయునున్ "బటా ♦ పంచ"లయ్యె
గడిఁది తపసిట్లు చేయుట ♦ గల్గుటన్ మ
దీయమానసరుష యది ♦ దీఱిపోయె. 71

వ. ఇఁకను

గీ॥ పుడమిఁ బుట్టెడు వారికిఁ ♦ బొసఁగుచుండు
బాల్యకౌమారయౌవన ♦ వార్ధకములు
నాల్గుదశ లందునున్ యౌవ ♦ నంబునందు
బొడము కామంబు దృఢమిది ♦ పూవుఁబోఁడి! 72

క॥ లోకోత్తరసతివై కడు, వీఁకన్ దనరెదవు నీదు ♦ విభుఁడును సుతప
శ్లోకుఁడును సుందరుఁడును న, నేకామరకల్పజీవి ♦ నిరుపముఁ డౌనరున్. 73

గీ॥ వేఱొకఁడు నిన్నుఁ గామెచ్చ ♦ వీక్ష చేసె
నేని యప్పుడె పేడియై ♦ యేవమొందు
కోరినట్టి వరంబులఁ ♦ గొఱంత లేక
యిచ్చితిని హెచ్చుమీఱఁ బూ ♦ ర్ణేందువదన! 74

వ. మఱియు నీకు నీ తలం పెఱింగియుండుటంజేసి యిట్లు చెప్పుచున్నాఁడ. నీ విం తకుమున్న దేహంబగ్నియందు హుతంబు సేయ నెంచితివి గావున నందుల కీ గిరిప్రాంతంబునఁ జంద్రభాగతీరంబునందే మేధాతిథియను ఋషి మునులతోఁ గూడి పదిరెండేండ్లు నియతిగల యాగంబొనరించుచున్నాఁడు గావున నీ వచ్చటికేగి నాయనుగ్రహంబున నెవ్వారికంటంబడక యుత్తరజన్మంబుననీకుఁ బతిగాఁదగువాని మనమందుఁదలంచి యగ్నిప్రవేశంబుసేయు మంతమీఁద నా ప్రసాదంబున నమ్మేధాతిథికిఁ గూఁతురవై జన్మించి యందే తపంబు చేసి యభీష్ట వరలాభంబు నొందెదవని పరమేశ్వరుం డంతర్హితుండయ్యె నయ్యువిదయు నట్లు వేగఁజని దనమనంబునఁ దనకు మంత్రోపదేశంబొనర్చి నట్టివాని వసిష్ఠ మునిని నాథునిఁగాఁదలఁచి శివానుగ్రహంబున నెవ్వారికిఁ బొడకట్టక మేధాతిథి యజ్ఞాగ్నియందుఁ బ్రవేశించినంత వేగిరంబున సప్తజిహ్వుండును బురోడాశ మయంబగు నాయంబుజగంధి శరీరంబు దహియించి సూర్యమండలంబుఁ జేర్ప రవియును నద్దేహంబును విభజించి యూర్ధ్వభాగంబును దేవప్రీతికరంబగు నుషస్సంధ్యగాను, శేషభాగంబును బితృప్రీతికరంబగు సాయంసంధ్యగాను వెల యించె నిఁకఁ బరమేశ్వరానుగ్రహంబున నద్దేవిప్రాణంబులు దివ్యదేహంబు నొంది మేధాతిథి యజ్ఞావసానమందు జాతవేదియందు బంగారుతీవియఁబోలి పొడసూపిన నాతండు మురిసి యందుకొని యభిషేకంబుఁ జేసి వస్త్రాదుల నలంక రించి యరుంధతి యని నామకరణంబుఁజేసి సంతసంబునఁ బెంచుచుండె నంత నామెయు నైదవయేడు వచ్చినయంత నె 75

—* అరుంధతీ వశిష్ఠుల వివాహము *—

గీ॥ చంద్రభాగాతటమ్మునఁ ♦ జటులతపముఁ, జేయుటయుఁదల్లిదండ్రులు ♦ చెలువనపుడు
బ్రహ్మసుతుఁడై తపంబుల ♦ వాసిఁబడసి, తనరుశిష్టున కావశి ♦ ష్ఠునకు నొసగి. 76

క॥ పాణిగ్రహణ మొనర్చిరి, యేణాంకకలాధరుం డు ♦ పేంద్రుండును న
వ్వాణీశుఁడు మున్నగు గీ, ర్వాణులు పరిణయమునన్ గ ♦ రంబు మురియఁగన్.

గీ॥ ఆ త్రిమూర్తుల కరధార ♦ నపుడు వెడలె, శిప్రమున్నగు నదులేడు ♦ శివజలములు
సతుల తలమానికం బరుం ♦ ధతి వశిష్ఠు, తోడ నెంతయు నలరె సం ♦ తోసమునను.

క॥ వారిరువుర కుదయించిరి, భూరితపోనిధులు శక్తి ♦ మున్నగుపుత్రుల్
వీరల సచ్చరితము నె, వ్వారలు చదివినను వినినఁ ♦ బడయుదురు సిరుల్. 79

—* శివునకు మోహంబుఁగూర్పుమని బ్రహ్మ మన్మథుని బంపుట *—

చ॥ నలువ యొకానొకప్డు తన ♦ నందనులందఱిఁ జూచిపల్కెన
య్యలికవిలోచనుం డభవుఁ ♦ డక్కట సంధ్యను జూచి యేను మీ
రలు వలపొంది యుత్తలపు ♦ రాపును గాంచుట కీసడించి బి
ట్టలఁతితనంబొనర్చినగె ♦ నాత్మఁగలంచెడు నద్ది పుత్రకుల్. 80

ఉ॥ ఎట్టులనైనఁ గామమది ♦ యేర్పడఁ జేయవలెన్ బినాకి కి
ప్పట్టుల నాతఁడున్ వికృతి ♦ నంది యలందురె నేని యుల్ల మి
క్కట్టును బాయు సంతదను ♦ కన్నను బాయదు గొందలంబిఁకన్
గుట్టుగ నట్లు గూరుచుట ♦ కున్ జతనంబు నొనర్పఁగాఁదగున్. 81

మ॥ అని దక్షాదిములౌ కుమారులకు నా ♦ త్మావస్థ తాఁ జెప్పి యం
తనె నాళీకశరున్ దలంప నతఁడున్ ♦ దారాసహాయంబుగాఁ
దనుఁజేరన్గని ధాత యప్డతనితో ♦ ధానుష్కమూర్ధన్య! నీ
కెనయాధన్వి యొకండునున్ గలఁడొకో ♦ యీరేడులోకంబులన్. 82

ఉ॥ నీవటుసంధ్యపై మరులు ♦ నెక్కొనఁజేయుట నేను నాసుతుల్
భావమునందు దానిపయిఁ ♦ బాళినిఁ జెందిన మాత్రికే శివుం
డేవముఁజెంది యందఱని ♦ సీ! యని చుల్కనచేసి నవ్వె నే
నావిధి బన్నమొంది యెటు ♦ లాత్మభరింతు సహింతు నైచ్యమున్. 83

క॥ మమ్మెట్టుల నీదుపుష్పశ, రమ్ములఁ గారింపఁజేసి ♦ రమణిపయిని ను
ల్లమ్మును దలకొనఁజేసితొ, యమ్మెయి నగ్గిరిశుమదికి ♦ నందింపు తమిన్. 84

క॥ అందనుకఁ గందుపాయదు, కొందలమునఁ గుందు మనము ♦ గోవిందసుతా!
యిందెటులైనను నీవు మ, దిం దేఁకువఁజేసి వెతను ♦ దీర్పుముమాకున్. 85

గీ॥ ఇఁకనుసోదర! "పితృసమో ♦ జ్యేష్ఠ" యనుచు
విబుధులాడెడు పల్కును ♦ విందువెపుడు
నాదుపనుపును బొనరించి ♦ నన్నుఁదేర్చు
టెంతయును నీకు విధియగు ♦ నింతయేల. 86

క॥ అనుడు హరినందనుఁడు విని, తనమనమునఁగొంకియును వి ♦ ధాతృనకపుడి
ట్లనె నొనరించెద నీపను, పునునైన నొకండు విను వి ♦ భూ! పేర్మి మెయిన్.

క॥ నాకస్త్రము చెలువ యదియు, లేకెట్టుల శివునిమదికి ♦ నెసఁగింతుఁదమిన్
జోకగుపొలఁతుక జూపుము, వీఁకన్ జని చేతు విశ్వ ♦ విభునకుఁ బాళిన్. 88

గీ॥ అనిన నళినజుఁ డప్పుడు చిం ♦ తాకులాత్ముఁ
డై కటా ! యెవ్వతెను బంపి ♦ యభవుఁ గరఁగఁ
జేయనగునంచు మదిని యో ♦ జించుచుండ
నంత నిశ్వాసమునఁ జైత్రుఁ ♦ డపుడు పొడమె. 89

క॥ ఆతఁడు సంధ్యార్కనిభుం, డాతతపీనాంసుఁ డంబు ♦ జాక్షుఁడు కామ
ప్రీతికరుఁడు మోహనుడై, చేతస్సంతోషమొదవఁ ♦ జేయుడు నంతన్. 90

క॥ కమ్మనిమలయానిల మది, కమ్మకొనెన్ ప్రాకులెల్లఁ ♦ గడుఁ బూచియు డెం
దమ్మునకు రహిని గూర్పఁగ, బమ్మయుఁ బరికించి యనియెఁ ♦ బంచశరునితో.

ఉ॥ అగ్గికి గాడ్పువోలె విను ♦ మంబుజబాణ ! వసంతుఁడీతఁడుఙ్
నిగ్గగు మిత్రుఁడై తనరి ♦ నీకు సహాయముసేయు నింకఁ దా
నగ్గలికన్ బొనర్పఁగల ♦ దన్నువ తెమ్మెర మాటలేటికిన్
నెగ్గుదు విప్పు వేచనుము ♦ నీలగళాశ్రయదివ్యభూమికిన్. 92

వ. ఇంకను

గీ॥ నిన్ను వెన్నాడియీరతి ♦ నెగడుచుండుఁ, గాన మీదంపతులరహిఁ ♦ గాంచిశివుని
మనసు చెదరిన నొకనాటి ♦ మరఁగఁదలఁచు, నప్పుడేను సృజింతున ♦ ర్హయగుసతిని.

వ. అని యనుప వల్లెయని యరవిందబాణుం డాతని సెలవొంది రతితో వసంతమంద
మారుతులన్ గూడి హరు నన్వేషించుచుఁ జని యందు. 94

గీ॥ పూవుటంపరజోదు శం ♦ భునికిఁగట్టె, దురుగ మల్లెలమొల్లలఁ ♦ గురువకముల
సంపెఁగలనింపుగదురఁబు ♦ ష్పింపఁజేసి, జుమ్ముజుమ్మను తేంట్లగా ♦ నమ్ముఁగూర్చె.

క॥ క్రొమ్మావుల నిమ్మలఁజె, ల్వమ్మగఁ జిగిరింపఁజేసి ♦ లలితదళగ్రా
సమ్ములఁ గోయెలగమి నో, క్కమ్మడిఁ బంచమముఁ బాడఁ ♦ గూరిచె రహిమై

క॥ గెలపండినయనఁటుల జొ, బ్బిలుపానకములఁ దనర్చ ♦ విరివగు నెలమా
వులపండ్ల మెక్కి యుక్కునఁ, జెలఁగి పదరఁజేసె రామ ♦ చిల్కలపిండున్.

గీ॥ పారిజాతపువిరులఁ గ ♦ ల్పవనంబు, లోనఁబొగడలపైఁ దావు ♦ లాని యాని
యల్లనల్లనఁజనుదెంచు ♦ పిల్లగాడ్పు, గములశశిభూషణునియంతి ♦ కమునకనిపె.

క॥ తానును రతియు నతులకే, ళీనిరుపమహావభావ ♦ లీలాయుతులై
పూనికమై శివు గెలువన్, నానావిధ విభ్రమములొ ♦ నర్చుచునుండెన్. 99

సీ॥ ఆవనంబున నున్నట్టి ♦ యఖిలజంతు, జాలమది మారుకొ్రవ్వాడి ♦ కోలలకుఁగ
డున్ బెగడి బీరుపోయి జో♦డులను వెదకె, కూడెనంతయుఁగూర్మలు♦గొనలు సాఁగ

క॥ హాపుఁ డించు కేనియును మదిఁ, గరఁగక స్థిరచిత్తముననె ♦ గరువముదనరన్
హాపుగనుండుటఁగని వెఱ, మరుఁడాత్మబలములతోడ ♦ మరలి దయితతోన్.

—* మన్మథుఁడు శివునకు మోహంబుఁ బుట్టింపలేననుట *—

గీ॥ సత్వరముగా విరించను ♦ సముఖమునకు, నేగి ప్రణమిల్లి యిట్లనె ♦ నాగిరీశుఁ
గరఁగఁజేయుట దేవ! నా♦తరముగాదు, సిగ్గుచేటగుఁ గాదె నా♦చెయిద మందు.

ఉ॥ నీవును నాదుతండ్రియును ♦ నిర్జరనాయకుఁ డాదిగల్గున
ద్దేవులయట్ల కాఁదలఁచి ♦ దీనఁ గడంగితి వమ్మఁ జెందెనా
యేవపుపాట్లు భర్గునెడ ♦ నెట్టులొ గండము దాఁటివచ్చితిన్
బోవిడుమయ్య నన్నిఁకను ♦ బున్నెము సర్వజగత్పితామహా! 103

క॥ నావలల కగ్గమగునొకొ! , దేవాధీశానుఁ డాది ♦ దేవుం డభవుం
డోవనజోద్భవ! గడ్డిది, నీవిప్పని నెగ్గలేవు ♦ నిక్కమరయుమా! 104

క॥ గుండెలు తటతటకొట్టుకొ, నం డీల్వాడి బిక్కమొగము ♦ నన్ నుడువుమరున్
దండిగఁగని యరవిందభ, వుం డున్నరని మదిఁ గడిఁది ♦ పొగలుచు వేగన్.

గీ॥ పంచశరునకు సెలవిచ్చి ♦ కించతోడఁ, బెద్దతడవు విచారించి ♦ విష్ణులోక
మేగి శ్రీధరుపదముల♦కెఱఁగి నిలువ, నలువయాకృతిఁగని మదిఁ♦గలఁగి హరియు.

—* బ్రహ్మ విష్ణుమూర్తియొద్దకేగి శివునకుఁ గామోపాయం బడుగుట *—

ఉ॥ ఉత్తలపాటుమీఱి కడు ♦ నూర్చుచు వచ్చితివేమి ధాత! నీ
కిత్తఱి యేమి లోటాదవె ♦ నేర్పడఁ జెప్పుమటన్న నాతఁడుణ్
దత్తఱమొప్పఁబల్కె నొక ♦ నాఁడల సంధ్యను బుత్రి లే నక
స్మాత్తుగఁ జూచి మోహపడ ♦ శర్వుఁడు డాసి హసించె నెంతయుణ్. 107

ఉ॥ అప్పటినుండి నాహృదయ ♦ మాతని కిట్టులె యొక్కచెల్వపై
దెప్పరమైన మోహమును ♦ దీగలువాఱఁగఁ జేయఁజెల్లునం
చప్పుపువింటిజోదును ర ♦ యమ్మునఁ బంచిన నాతఁ డెంతయుణ్
గొప్పగ యత్నముణ్ సలిపి ♦ కుందుచువచ్చెను లబ్ధిలేకయే. 108

ఉ॥ నాసుతుఁడయ్యు రుద్రుఁడటు ♦ నన్నవమానముసేయఁ జెల్లునే?
వాసియడంగ నెట్టు లల ♦ భర్గుఁడు నాసరిమైనఁగొంచెము

ఛ్ఛ్వాసము చెందవచ్చునను ♦ భావముతోడనె యుంటి నెట్టులీ
గాసితొలంగు రుద్రునకుఁ ♦ గామము గల్గు మహాత్మ! చెప్పవే. 109

—* విష్ణుమూర్తి బ్రహ్మతో శివశక్త్యవతారంబునకై యత్నింపుమనుట *—

చ॥ అన నల చక్రపాణి నలు ♦ వా! యవివేకపథంబుఁ జెందితీ
వనఘుని లోకనాథుని మ ♦ హాత్ముని నాత్మజుఁగాఁగ నెంచి యి
ట్లనిశము గ్రుళ్ళుచుంటివిఁక ♦ నామదిఁ బాయుము నీదు ప్రార్థనన్
దనయుఁడుగా జనించెను స ♦ దాశివమూర్తి జగద్ధితంబుగాన్. 110

ఉ॥ ఎవ్వని నారయంగ మన ♦ మిర్వురమున్ బనిఁబూని పెక్కునా
ళ్ళివ్వసుధన్ వియత్తలము ♦ నెంతయు మీఱుచుఁ బోవుచున్ దుదిన్
గ్రొవ్వాఱ నవ్వుఁబొట్ల కెదఁ ♦ గొంకక వచ్చి నమస్కరించి మా
యివ్వెడఁగుం బనుల్ మది సహింపు మహేశ! యటంచు మ్రొక్కమే.

చ॥ మఱచితివే మహేశ్వరుని ♦ మానసమం దసమానవైభవున్
హరుని ననాదిపూరుషుని ♦ నాత్మవిహారుని స్వప్రకాశునిన్
బరమమునీంద్రవందితుని ♦ భక్తజనావనబద్ధకంకణున్
గరువముసెంది యిట్లురక ♦ కాఱులు ప్రేలఁగఁ జెల్లునే విధీ! 112

ఉ॥ ఎంతటివాఁడవీవు హరుఁ ♦ డెట్టి మహాత్ముఁడు నల్వ! నన్ను ని
న్నింతటివాండ్రఁగా సలిపె ♦ నిద్ధరణిన్ సృజియించి యీశ్వరుం
డెంతయు నీవు బాలిశత ♦ నెద్ది యెఱుంగక మోఱకుండవై
పంతము నొంది యిట్లు ♦ పలుపాటులఁ జెందితి వేమి సెప్పుదున్. 113

ఉ॥ మానుము మానుమీ తెఱఁగు ♦ మంచిదికాదిఁక లోకనాథునిన్
బూని సతీసహాయునిగఁ ♦ బొందుగఁ జూడఁదలంచితేని యెం
తేని దపంబు సేయుమను ♦ మీశ్వరశక్తినిఁ గోరి దక్షునిన్
మానక యాజగన్మయి కు ♦ మారికయై జనియించు వానికిన్. 114

ఉ॥ ఆయమ యోగనిద్ర పర ♦ మాత్మవిహారిణి శంభుశక్తి తా
నాయభవున్ మహేశ్వరుని ♦ నర్ధిమెయిన్ దపమొంది మెచ్చఁగాఁ
జేయును శంభుచిత్తమును ♦ జెమ్మగిలంగ నొనర్చు నెంతయున్
వేయునుడుల్ పనేమి? యిఁక ♦ విశ్వవిభున్ వరియించు రూఢిగన్. 115

చ॥ చనుమిఁక సత్యలోక మనఁ ♦ జక్కనతండును బుండరీకలో
చనునకు జోత చేసి చని ♦ సద్మము చేరి పరాంబయా శివన్
మనమునఁ గొల్చియంత నెకు ♦ మారుని దక్షుని బిల్చి యిట్లనెన్
ఘనతప మొంది శాంకరినిఁ ♦ గాళిని భక్తి భజింపు మీవిఁకన్. 116

గీ॥ భక్తవత్సల పరమాత్మ♦శక్తి వేగ, నిన్నుఁ గరుణించి కూఁతురై ♦ నీకుఁ బొడము
నా పె శంకరుఁ బెండ్లాడి ♦ యఖిలలోక, రక్షణం బొనరించును ♦ రాణమీఱి.

—* దక్షుండు మహేశ్వరినిగూర్చి తపస్సొనరించుట *—

క॥ అని యిట్లుపదేశించి న, శిన గర్భుండనుప నట్లు ♦ లిప్సన్ గొని దు
ర్గమ నఖిలాజాండేశ్వరి, ననువుగఁ గొల్చుచుఁ దపించె ♦ నాతఁడు నిష్ఠన్. 118

గీ॥ పవనజగ్ధియై మూఁడువే ♦ ల్వత్సరంబు
లుగ్రతప మొనరింప ను ♦ దగ్రకరుణ
మెఱయ సాక్షాత్కరించె శం ♦ కరపురంధ్రి
దక్షుఁడును గడుముదమునన్ ♦ దనిసి చూచె. 119

సీ॥ సింగంబునెక్కి వా ♦ సిఁ బొల్చుదాని మే, ఘంబనా కృష్ణగా ♦ త్రంబుదాని
నందమౌ నగుమోము ♦ నలరారుదాని ర, క్తాక్తలోచనయుగం ♦ బమరుదాని
వరదాభయాబ్జాసి ♦ ధరకరంబులదాని, నిడివైన సమ్మెల్లవ్వ ♦ నెఱులదాని
నొక్క పెట్టునఁగాంతు ♦ లొప్పఁ గుప్పెడుదాని, మదికి నానందం బ♦మర్చుదాని

గీ॥ నంబికను బరికించి సా♦ష్టాంగ మెఱఁగి, మ్రొక్కి భయభక్తులమరు మే♦ల్మిక్కిదనర
నిట్లుసంస్తవమొనరించె ♦ నెంతయేని, నమ్రుఁడై దోయిలిని వద♦నమునఁ జేర్చి.

క॥ జగదంబికా! మహేశ్వరి!, జగదీశ్వరి! సత్కృపావి ♦ శాలా! నా కి
మ్మెగ నీ దరిసెన మిచ్చితి, వగణితకల్యాణగుణగ♦ణా! జోతలివే. 121

క॥ కరుణింపుము శివరూపిణి!, కరుణింపుము భక్తవరద! ♦ కరుణింపు ముమా!
కరుణింపుము భగవతి! నను, గరుణింపు మనాదిమూర్తి! ♦ కరుణింపు శివా!

-* పరదేవత దక్షునకు వరంబిచ్చుట *-

గీ॥ ఇట్లుదక్షుఁడుస్తుతియింప ♦ నీశ్వరియుఁద, దీయమానీప్సితంబును ♦ దెలిసియునిటు
లడిగె మెచ్చితి నీతపం ♦ బడుగు నీయ, భీష్టమిచ్చెద నిక్కచ్చి ♦ యెద్దియేని.

వ. అనిన దక్షుం డిట్లనియె.

చ॥ వరమున కేను నర్హమగు ♦ వాఁడనయేని భవాని! యీశ్వరే
శ్వరుఁడు విరించిపుత్రుఁడయి ♦ వాసిగ రుద్రుఁడనాఁగ బేరితోఁ
దిరముగఁ దాపసవ్రతముఁ ♦ దీర్చుచునుండెను; నీవదేల యా
వఱకు భువిన్ జనింప వీక ♦ భర్గుఁడు లాఁతిసతిన్ వరించునే! 124

ఉ॥ పుట్టుము నాకుపుత్రివయి ♦ భూరితపోమయి! తాపమొంది చే
పట్టుము సర్వశంకరుని ♦ బాగుగ నందఱకున్ ముదంబు రాఁ

బట్టుము సర్వనిర్జరుల ♦ బాధ లడంగి సురుంగఁ బాప్రులన్
నెట్టు మపూర్వలీలలను ♦ నేరిమిఁ గూరుపు మంబ యో! యిఁకన్. 125

క॥ అని దక్షుఁడు గోరుడు న, ల్లననగి మనమందు శశిక ♦ లాభూషణునిన్
మననంబుచేసి దక్షుని, కనియెను భువనైకమాత ♦ యమృతము చిందన్. 126

మ॥ అవునట్లే శివుఁడెప్డు లాఁతిమగువన్ ♦ హర్షించి తా నొందఁడా
రవికోటిప్రభు జన్మజన్మమున నే ♦ రంజించి సేవించెదన్
ధవుఁడాతం డిఁక దాసినై దయితనై ♦ దైవాజ్ఞ బద్ధసం
భవపుత్రా! యిఁక మీఁద నీదు సుతనై ♦ ప్రాదుర్భవింతున్ జుమీ. 127

క॥ కావింతుఁగడిఁది తపమును, సేవింతుఁ గిశోరచంద్ర♦శేఖరపదముల్
రావింతు నీకుఁ గీరితి, నీవింతటి తపముసేయ ♦ నెనరుజనించెన్. 128

ఉ॥ ఐనను నొక్కబాసగల ♦ దయ్యది చెప్పెద నాలకింపు! నా
పైన ననాదరంబెపుడు ♦ పాయక నీమదియందుఁ జేరునో
నేనది వేగనారసి జ ♦ నిన్ విరమింపఁగఁ జేయుదాన వే
ఱొనొకజన్మమొందఁగల ♦ నారయుమీ మదియందు రూఢిగన్. 129

క॥ చనుమిఁకఁ దావకవేశ్మం, బునకు భవద్దేవిగర్భ ♦ మునఁ బుట్టెద నం
చని యంతర్ధానము చెం, దెను దక్షుండంతఁ దనదు ♦ ధీమముఁ జేరెన్.

-* దక్షుఁడు వీరిణిన్ బెండ్లాడి మిథునసృష్టి యొనర్చుట *-

వ॥ అంత నతండు

ఉ॥ మానససృష్టి పెంపగుట ♦ మాని యెదో విధమొప్పనుండ న
ద్దానివితంబు దక్షుఁడు వి ♦ ధాతకుఁదెల్ప నతండు మైథునం
బూనియొనర్ప వృద్ధియగు ♦ నుగ్మలి వీరణపుత్రి వీరిణిన్
మానక పెండ్లియాడి యల ♦ మానినితో నొనరింపు సర్గమున్. 131

క॥ అని యుపదేశింప నతం, డును వీరిణిఁ బెండ్లిఁగొని త ♦ నూజులఁ బదివే
లను హర్యశ్వాహ్వయులను, గని తపసానరించి సృష్టిఁ ♦ గావింపుఁడనెన్.

ఉ॥ వారలు దక్షవాక్యపరి ♦ పాలనబద్ధమనస్కులై కడున్
గూరిమి గంగ సంద్రమునఁ ♦ గూడెడుచోటికిఁ జేరి యందు వి
స్తారతపంబు సల్పుచు ని ♦ తాంతము సృష్టినొనర్ప నుండుడున్
నారద! నీవు వారలను ♦ నచ్చికమీఱఁగ జేరికూరిమిన్. 133

క॥ వైరాగ్యము బోధించితి, వారసి యపార మోక్ష ♦ మర్థించి పితన్
జేరక చని రెందేనియు, నా రాజీవజతనూజుఁ ♦ డరసియు నంతన్. 134

క॥ మది వగచి మరల సృష్టిన్, బొదలిచి సబలాశ్వులనెడు ♦ పుత్త్రసహస్రం
బొదవింపఁజేసి వారల, కదియెవిధం బమరఁజెప్పి ♦ యనిపెఁ దపసుకై. 135

సీ॥ చేరివారలు స్వర్ణదీ♦సింధుసంగ, మావనిని నట నారాయ ♦ ణాఖ్యసరసి
యందు జలమాడి తపముసే♦యంగ నపుడు, నీవు వారికి విజ్ఞాన ♦ నియతిఁగఱప,

క॥ వారును దొలివారివలెన్, మీఱి జనకశాసనంబు ♦ మెలఁకువతోడన్
బొదమహంసవ్రతమునఁ, జేరిరి మోక్షైకహర్మ్య ♦ శిఖరాగ్రంబున్. 137

గీ॥ దక్షుఁడునుగొన్ని నాళ్ళకుఁ♦దనయులెల్లఁ, గలహభోజను బోధక♦గ్గమయి ముక్తిఁ
జెందుటారసి పెన్వగఁ ♦ జెందికుంది, పేరుటల్కతో శాపంబుఁ♦బెట్టెమునికి.

ఉ॥ ఓరిదురాత్మ! నాసుతుల ♦ నొక్కనినైనను దక్కకుండఁగా
నేరిమి వారలందఱికి ♦ నేర్పితివౌర! యతీంద్రచర్య న
వ్వారలు ముగ్ధులై యకట! ♦ పాసిరి నన్నిఁకఁ జాపలాత్మతన్
వీఱిఁడివోలె నెప్పుడు భు ♦ విన్ దిరుగాడెదుగాక నీవిటున్. 139

ఆ॥ అణఁగిమణఁగియుండ ♦ కారివేరములేక, చుట్టపక్కమనెడు ♦ చూపులేక
క్రిందుమీఁదుఁగనక ♦ మ్రింగించితివి సంతుఁ, బోరునీకుఁదీర్చు ♦ పొట్టమంట.

ఆ॥ ఇల ఋణత్రయంబు ♦ నెవ్వఁడు దీర్పక, శైశవంబునందె ♦ సన్న్యసించు
నట్టివానికెప్డు డమరవి ♦ హాపరంబు, లాత్మపదమునొంద ♦ కార్తిఁజెందు.

ఆ॥ ఎట్టులున్న నీకు ♦ నేమిర! పిలిచియుఁ, దలఁచి యెఱుఁగ నిన్నుఁ ♦ గలహకారి!
కొడుకులేని నిన్నుఁ ♦ గోరిరా? యెఱుకకై, యుడుము కేటికోరి?♦యూరివార్త.

గీ॥ అనుచు నిను ముని శపియించి ♦ యంతనాడు
తనయుఁ డాంధ్రను సృష్టింపఁ ♦ దలచి పెక్కు
కన్యకల వీరిణీదేవి ♦ గర్భమందుఁ
బుట్టఁగాఁజేసి కశ్యప ♦ ముఖులకిచ్చి. 143

వ. అనంతరంబు

చ॥ మును శివ కూఁతురై తనకుఁ ♦ బుట్టెడునట్లు వరంబొసంగెఁ గా
వునఁ జతురాననాత్మజుఁడు ♦ పుణ్యతపోమయి నామహేశ్వరిన్
మనమునఁ దల్ప నాపెయు స ♦ మగ్రకళల్ దనరంగ దక్షు నె
మ్మనమునఁ జేరె నాతఁడును ♦ మానిని వీరిణిఁ జేర్చెఁ దేజమున్. 144

ఉ॥ వీరిణియున్ బరాంబిక య ♦ భీక్ష్ణత రాజముఁ దాల్చి రాజిలెన్
శ్రీరమణాదినిర్జరులు ♦ చిన్మయి దక్షవధూదరంబునన్
జేరుట యంతనారసి భ ♦ జించిరి ధ్యానశతమ్ములొప్ప న
వ్వారిజగర్భుఁ డంత మదిఁ ♦ బంతువునొందుచునుండె దండిగన్. 145

క॥ మది వగచి మరల సృష్టిన్, బొదలిచి సబలాశ్వులనెడు ♦ పుత్త్రసహస్రం
బొడమింపఁజేసి వారల, కదియెవిధం బమరఁజెప్పి ♦ యనిపెఁ దపసుకై. 135

గీ॥ చేరివారలు స్వర్ణదీ♦సింధుసంగ, మావనిని నట నారాయ ♦ ణాఖ్యసరసి
యందు జలమాడి తపముసే♦యంగ నపుడు, నీవు వారికి విజ్ఞాన ♦ నియతిఁ గఱప.

క॥ వారును దొలివారివలెన్, మీఱి జనకశాసనంబు ♦ మెలఁకువతోడన్
బారమహంసవ్రతమునఁ, జేరిరి మోక్షైకహర్మ్య♦ శిఖరాగ్రంబున్. 137

గీ॥ దక్షుఁడునుగొన్నినాళ్ళకుఁ♦దనయులెల్లఁ, గలహభోజను బోధక♦గ్గమయి ముక్తిఁ
జెందుటారసి పెన్వగఁ ♦ జెందికుంది, పేరుటల్కతో శాపంబుఁ♦బెట్టెమునికి.

ఉ॥ ఓరిదురాత్మ! నాసుతుల ♦ నొక్కనినైనను దక్కకుండఁగా
నేరిమి వారలందఱికి ♦ నేర్పితివౌర! యతీంద్రచర్య న
వ్వారలు ముగ్ధులై యకట! ♦ పాసిరి నన్నిఁకఁ బాపలాత్మతన్
వీఱిఁడివోలె నెప్పుడు భ ♦ విన్ దిరుగాడెదుగాక నీవిటున్. 139

ఆ॥ అణఁగిమణఁగియుండ ♦ కారివేరములేక, చుట్టపక్కమనెడు ♦ చూపులేక
క్రిందుమీఁదుఁగనక ♦ మ్రిందించితివి సంతుఁ, బోరునీకుఁదీర్చు ♦ పొట్టమంట.

ఆ॥ ఇల ఋణత్రయంబు ♦ నెవ్వఁడు దీర్పక, శైశవంబునందె ♦ సన్న్యసించు
నట్టివానికెప్పు డమరవి ♦ హపరంబు, లాత్మపదమునొంద ♦ కార్తిఁజెందు.

ఆ॥ ఎట్టులున్న నీకు ♦ నేమిర! పిలిచియుఁ, దలఁచి యెఱుఁగ నిన్నుఁ ♦ గలహకారి!
కొడుకులేని నిన్నుఁ ♦ గోరిరా? యెఱుకకై, యుడుము కేటికోరి?♦యూరివార్త.

గీ॥ అనుచు నిను ముని శపియించి ♦ యంతనాడు
తనయుఁ డాంధ్రను సృష్టింపఁ ♦ దలచి పెక్కు
కన్యకల వీరిణీదేవి ♦ గర్భమందుఁ
బుట్టఁగాఁజేసి కశ్యప ♦ ముఖులకిచ్చి. 143

వ. అనంతరంబు

చ॥ మును శివ కూఁతురై తనకుఁ ♦ బుట్టెడునట్లు వరంబొసంగెఁ గా
వునఁ జతురాననాత్మజుఁడు ♦ పుణ్యతపోమయి నామహేశ్వరిన్
మనమునఁ దల్ప నాపెయు స ♦ మగ్రకళల్ దనరంగ దక్షు నె
మ్మనమునఁ జేరె నాతఁడును ♦ మానిని వీరిణిఁ జేర్చెఁ దేజమున్. 144

ఉ॥ వీరిణియున్ బరాంబిక య ♦ భీష్టతరాజముఁ దాల్చి రాజిలెన్
శ్రీరమణాదినిర్జరులు ♦ చిన్మయి దక్షవధూదరంబునన్
జేరుట యంతనారసి భ ♦ జించిరి ధ్యానశతమ్ములొప్ప న
వ్వారిజగర్భజుండు మదిఁ ♦ బంధువునొందుచునుండె దండిగన్. 145

ఉ॥ కుంచెయు రంగులున్ బలుకఁ ♦ గూరిమినొంది మహేశ్వరాకృతిన్
మంచిగ దిద్దివ్రాసి యన ♦ మానముదంబెసలారఁ బూజగా
వించి శివానుకంప కెద ♦ వీక్షణసేయుచు వింతవింతగాఁ
బంచమసుస్వరం బమరఁ ♦ బాడె విపంచిక మీటుచున్ లలిన్. 157

-* సతీదేవి నందావ్రతంబు సేయుట *-

వ. అంతనయ్యంబిక బాల్యంబుఁ బోవిడిచి శివపాణిగ్రహణంబుఁ గోరి నందావ్రతంబు సేయంగడంగి యాత్మజనకానుమతితో నాశ్వయుజప్రతిపత్తునందు నభవుని సలవణంబులగు గుడోదనంబులఁ బూజించి కార్తికచతుర్దశియందు శివునిఁ బాయసాపూపంబులనర్చించి మార్గశీర్ష బహుళాష్టమియందు హరుని సతిల యవోదనంబుల నర్చించి పౌషశుద్ధ సప్తమియం దుపస్నున * కృసరాన్నంబున మహేశ్వరుఁగొల్చి రేయి జాగరణంబొనర్చి మాఘపూర్ణిమయందు నదీతీరంబున శంకరపూజనం బొనర్చె. ఫాల్గునబహుళ చతుర్దశియందు రేయి నాలుగుజాముల శైలూషంబులఁ బూజించి జాగరణంబొనర్చె. చైత్రశుద్ధ చతుర్దశియందు రేఁ బగలు శివునిఁ బలాశదమనంబులను బూజించె. వైశాఖశుద్ధ తృతీయ రుద్రుని సతిలయవోదనంబుల నర్చించె. జ్యేష్ఠపూర్ణిమారాత్రియం దుత్తరేణి పుష్పంబులచే వస్త్రంబులచే శర్వునిఁబూజించి యాషాఢశుద్ధ చతుర్దశియం దుత్తరేణివిరులచేఁ గృష్ణవస్త్రంబులతో రుద్రునిఁబూజించె. శ్రావణ శుద్ధాష్టమీ చతుర్దశులందు దర్భలచే యజ్ఞోపవీత వస్త్రంబులతో భర్గునిఁబూజించి భాద్ర కృష్ణత్రయోదశియందు నానావిధ పుష్పఫలములచే శంకరునిఁబూజించి జలాహారమై దర్శాంతంబుగ శివార్చనం బొనర్చుచు వత్సరంబిట్లు నందావ్రతంబు నిష్ప్రత్యూహంబుగ నొనర్చుచుండుడు. 158

ఉ॥ తామరసాక్షుఁ డప్పగిది ♦ దక్షతనూజ వ్రతంబుఁ జేయుచున్
సోమకలాధరున్ దనమ ♦ నోవిభుఁగాఁగ వరించి యుండుటన్
దా ముదమొప్ప నారసి హి ♦ తమ్ముగ శంకరుపాలి కేగి యా
సోమనిభాస్య దక్షసుత ♦ చొప్పఖిలంబు వచించెఁ బ్రేముడిన్. 159

శా॥ నీకై జన్నియఁగట్టె నంట ! సురరా ♦ జ్ఞీకోటు లాదివ్యనా
రీకాళిన్ సతిఁ బోటికై యెదురఁగా ♦ లేరంట ! నందావ్రతం
బాకన్యామణి నిన్నుఁ గూరిచియె తా ♦ నవ్యాజభావంబునన్
లోకుల్ మెచ్చ నొనర్చుచుండెనఁట ! యా ♦ లోలాక్షి నీక్షింపుమా ! 160

* టిప్పణి : కృసరాన్నము - పులగము.

క॥ బాలసుమీ! హిమకరశిశు, ఫాలసుమీ! యోగలబ్ధ ♦ పరమార్థద్యో
పాలసుమీ! రచితజగ, న్మాలసుమీ! నీయఱుతకు ♦ మణిమాలసుమీ! 161

చ॥ చనుమిఁక దక్షకన్యకని ♦ శాంతముఁజేరి వరంబొసంగి వే
గనె కరపీడనం బమరఁ ♦ గా గ్రహియింపు మహాత్మ! భర్తరం
జనమునె యెల్ల ప్రొద్దులను ♦ సల్పుటకే యిటురూపు నొందినా
వనఘచరిత్ర! యాపె భవ ♦ దర్చనయం దభియుక్త భక్తయా. 162

గీ॥ అని హరివచింప విని శివుం♦డాదరమున, నప్పటికిమున్నె తద్వ్రతం♦బాత్మనెఱిఁగి
యున్నకతమునహరినన్ని♦యురుతరకరు,ణాఢ్యుఁడై సతియున్న హ♦ర్మ్యమునకరిగె.

క॥ సతియును నిట్టుల నందా, వ్రతము ననుష్ఠించి శివుని ♦ వదలక పూజో
న్నతి నష్టమిఁ బస్తుంగొని, యతినిషన్ నవమియందు ♦ నర్చనచేసెన్. 163

—* సతీదేవికి శివుఁడు ప్రత్యక్షమగుట *—

క॥ పూజావసానముననే, యాజగదీశ్వరుఁడు మంగ ♦ ళాకారుండై
యా జైవాతృకముఖి కపు, డోజన్ దరిసెనము నొసఁగె ♦ నూర్జితకరుణన్. 164

ఉ॥ అందము లైన తనర్చు నిఖి ♦ లావయవమ్ములవానిఁ జందురున్
గిందురు మారుఁ గీరు నొక ♦ క్రేవకుమీటెడు సొరువాని నొ
ప్పొందగు సుందరీమణుల ♦ పొందిక చూడ్కుల లాగి మూఁగఁజే
యందగువాని శంకరుని ♦ నాయరవిందజపౌత్రి గన్గొనెన్. 165

చ॥ కని నునుసిగ్గునన్ జరణ ♦ కంజములన్ నుదురుంచి మ్రొక్కి వే
గనె భయభక్తు లెంతయును ♦ గ్రమ్మికొనన్ వెడగాఁగ నిల్చినన్
గనుఁగొని చంద్రశేఖరుఁడు ♦ కల్కిరో! మెచ్చితి నీవ్రతంబు ని
త్తును వరమడ్గు నీమదికిఁ ♦ దోఁచినయట్లు రుచించినట్టులన్. 166

గీ॥ తెలిసియుండియుఁ దెలియన♦ట్టుల విభుండు, దనదుపల్కు వినన్గోరి♦తన్నునడుగ
మురిసి సిగ్గున మ్రాన్పడి ♦ తెఱవయున్న, చంద మెంతయుఁగని మది♦సంతసించి.

క॥ మరల వరమడుగుమంచును, దరుణేందుధరుండు సతినిఁ ♦ దడయక యడుగన్
గిరిరాజయాన సిగ్గును, మరలిచియనె దేవ! యిమ్ము ♦ మరలనివరమున్. 168

చ॥ అనియడుగన్ శివుండు మది ♦ నారసి యిట్లనె నాదు భార్యవై
యొనరుము సుందరీ! యనుడు ♦ నుక్తినిఁ దావిని దక్షపుత్రి నె
మ్మనమున గోరినట్టులె య ♦ మర్చిన శంకరు ప్రక్కనిల్చి యా
వననిజహావభావముల ♦ వాసిదనర్పఁగఁ జేయనెంతయున్. 169

గీ॥ తరుణశృంగారమూర్తులై ♦ తనరియున్న
వారి నిరువురఁ జూడ న ♦ భంబునందుఁ
జెలఁగు చిత్రాశశులజతన్ ♦ వెలుఁగుచుండి
రమణ మొనగూర్చు మదికి నా ♦ యందుబాటు. 170

సీ॥ స్ఫటికమణిమయమూర్తియౌ ♦ శంభుదండ, స్నిగ్ధభిన్నాంజనద్యుతి♦శివ దలిర్ప
నిండుచందురు వెనుగొని♦నీటుమీఱి, యున్న ఘనలేఖవోలె నం♦దొప్పియుండె.

—* శివుఁడు సతీదేవికి వరంబిచ్చుట *—

ఆ॥ అంత దక్షపుత్రి ♦ యంజలి జోడించి, యనియె దేవదేవ!♦జనకునడిగి
నన్ వివాహవిధిని ♦ నర్పఁజేకొనుమన, నింపుమీఱ వరదుఁ♦డీయకొనియె.

వ. మఱియు

క॥ అనియె నొకబాసచేసెద, విను సతి! నావచనమంద ♦ విశ్వాసము నీ
మనమున నెప్పుడే నొదవిన, మనసిద్ధుఁ బాపనోపు ♦ మానకయదియున్. 173

క॥ ఇటులాడి కాలుసాఁగక, యెటులో పయనంబుఁ జేసి ♦ యేగెను శివుఁడం
తట దాక్షాయణి పితలను, జటులగతిన్ దఱిసి చెప్పె ♦ శంకరువరమున్. 174

వ. అనంతరంబున శివుండు సరస్వతీసహాయంబుగఁ జతుర్ముఖున్ దలఁచుడు నతం
డట్లు విచ్చేయ సతీవ్రతంబు తెఱంగు నాపెకభీష్టవరదానంబు నొసంగుటయు
దెలిపి తద్వివాహార్థంబు దక్షునుద్బోధింపఁ బంచిన నాతండలరిచని వధూసమే
తుండగు దక్షునిన్ జేరి యిట్లనియె. 175

చ॥ కొమరితనిమ్ము రుద్రునకుఁ ♦ గోమలి చేసిన సద్వ్రతంబు న
ర్సము సమకూర మెచ్చియె వ ♦ రంబొసఁగెన్ సతిఁగాఁగొనన్ శివుం
డమరె మనంబులందు ముద ♦ మగ్గలమై సిరిమీర సర్వయ
త్నములను సల్పివేగిరము ♦ దక్ష! యొనర్పు వివాహ మీవిఁకన్. 176

క॥ అనియుపదేశించిన నతఁ, డును నోమనిపల్కె దుహిణుఁ ♦ డును శుభలగ్నం
బును నేరుపఱచి శంకరుఁ, గొనితేరన్ మరలఁ గదలె ♦ గోధ్వజుకడకున్. 177

గీ॥ చని మహేశ్వరునకు మ్రొక్కి ♦ సత్వరముగఁ
దరలి రమ్మనెఁ బెండ్లికై ♦ తనయనిచ్చు
వాఁడుతనయుండు దక్షుఁ డ ♦ నాదిపురుష!
వేగ నీజనములతోడ ♦ వెడలు మటకు. 178

క॥ అని చెప్పుట కథవుఁడు ముద, మునుజేకొని నారదు ముని ♦ ముఖ్యుఁ దలఁపవే
గనె నతఁడు చేరవచ్చినఁ, జనవలెఁ బెండ్లాడ దక్షు ♦ సదనంబునకున్. 179

ఉ॥ నీవు మరీచి మున్నగుము ♦ విప్రవరోత్తములన్ సదారులన్
శ్రీవిభునిన్ రమన్ నిఖిల ♦ సిద్ధసురాసురదివ్యవర్గమున్
నావచనంబుగాఁ బిలిచి ♦ నాదుగణంబులతోడఁ బెండ్లికిన్
రావలెనన్న నాతఁడు గ ♦ రంబు ప్రమోదముఁజెంది యట్టులన్. 180

ఆ॥ ప్రభునినుడుగుకన్న ♦ పై పెచ్చుగానెల్ల, వారిఁబిలువ నెల్ల ♦ వారు వచ్చి
పెండ్లిపనులనెల్లఁ ♦ బేర్మిమైనొనరించి, పయనమెఱుకసేయ ♦ భర్గుఁడపుడు. 181

క॥ అలరుననడ్వాహముపై, లలితగతిన్ గూరుచుండి ♦ లక్షల్ కోట్లా
బలములు ముందును వెనుకను, జెలఁగఁగ దక్షునిపురంబుఁ ♦ జేరెరయమునన్.

—* సతీశివవివాహము *—

ఉ॥ దక్షుఁడుచేరవచ్చి ప్రమ ♦ దంబున నందఱ గారవించి వి
శ్వాక్షున కమ్మహేశ్వరున ♦ కర్థిమెయిన్ వరపూజఁ జేసి తా
నక్షయభాగ్యయుక్తమగు ♦ నాత్మగృహంబును జేర్చి యందుఁ బ
ద్మాక్షిని నాత్మపుత్రికను ♦ నార్యనుదెచ్చి కరంబుప్రీతితోన్. 183

గీ॥ గ్రహబలాన్వితశుభలగ్న ♦ కాలమరసి
విధివిధానముగా విశ్వ♦విభున కొసఁగి
హరుసమును జెందె బాలేందు ♦ ధరుఁడు దక్ష
పుత్రి పాణిగ్రహణమొంది ♦ మురిసె మిగుల. 184

గీ॥ అట్లు పరిణయమాడిన ♦ యాదిదంప
తులను గని వేల్పులెల్లరు ♦ నలరి యలరు
వృష్టిఁగూర్చిరి యచ్చర ♦ వెలఁదు లాడి
పాడిరి సువాద్యములు మ్రోసెఁ ♦ బలురకముల. 185

వ. అంత శివానుమతితో విరించి యజ్ఞశాలకడకు నూత్నదంపతులఁగొని చని యగ్నిప్రతిష్ఠం బొనరించి విధిప్రకారంబు హోమంబు నెఱవేర్చి ప్రదక్షిణంబు నొనర్పఁజేయుచున్నంతఁ బరమశివమాయచే దక్షకన్యాచరణాబ్జంబు నిరీక్షించి పంచశరపీడితుండై చూడ్కి మరల్పలేకున్నంతఁ దత్రిత్యాలెల్ల రక్కజపడఁగాంచి మించుటల్కతోఁ బంచాస్యుండు విరించనుఁబొడువఁజూడుడు నెల్లరు హాహాకారంబులుచేసి యబ్జసంభవుమహాపరాధంబును మన్నింపుమని శివుని బ్రసన్నున్ బొనర్చి రపుడు ద్రుహిణునకు రేతఃపాతంబై యందుఁ బుష్కలావర్తకద్రోణసంవర్తకము లనెడుమేఘంబు లుత్పన్నంబులై శివాజ్ఞతో వినువీధిఁ జేరియుండె నంతఁ జతుర్ముఖుండు వినీతుండై పరమేశ్వరాంఘ్రులన్ బడి క్షమను వేడఁ బరమేశ్వరుండు గరుణించి ప్రసన్నుండయ్యె నంత నళినజుం

డవ శేషంబును దీర్చుకునంత సతీశివులే కాసనంబునఁ గూరుచుండి రపుడు విష్ణ్వాది సకలసురలును దివ్యప్రమథభూతగణంబు లవ్వారికిఁ బ్రణమిల్లి యానందించి రంత నమ్మునివాఁడు దక్షునకుఁ బయనం బెఱింగించి మహేశ్వరుండు సతితో దేవగణంబులుగొల్వఁ గైలాసంబుఁ బ్రవేశించి యందఱకు సముచిత గౌరవంబు లొనర్చి యాహూతుల నందఱ వారియాలయంబులకనిపి నందీశ్వరుని హజారంబు వాకిటనునిచి సతీదేవితో నభ్యంతరగృహంబుఁ బ్రవేశించె నీసతీమహేశ్వర వివాహచరితంబు నెవ్వారాకర్ణించినఁ జదివిన నవ్వారి కైహికాముష్మిక ఫలంబు లొదవునని సూతుండు శౌనకాదులకుఁ జెప్పినయంత నవ్వారవ్వలికథ నెఱిఁగింపు మనుటయు సూతుండిట్లనియె. 186

## —* సతీశివవిహారములు *—

క॥ పరమేశ్వరుండు సతితో, నురుమోదంబమర సురత ♦ మొందెను బలువ
త్సరములు నిముసములట్లుల, బరిశీలన సేయరాని ♦ పగిదిగ నమరన్. 187

మ॥ వనపుష్పంబుల హారముల్ నిజవధూ♦వక్షంబునన్ వైచు భా
మిని యుద్గంబును జూచికొన్నపుడు బే ♦ ర్మిన్ డాసి తాన్మఱ విలో
కన సేయున్ రవలొప్పు కమ్మలను వే ♦ గన్ దీయు వేవేయు నే
మినుడిన్ జెప్పినమన్ జెవిన్ దరిసియే ♦ మేలొందఁజెప్పున్ రహిన్. 188

గీ॥ సతి యితరవస్తువులఁజూచు♦చందమరసి, వెనుదెసనుడాసియాశ్లేష♦మునుబొనర్చు
చకితమైవ్యాకులమున వె♦నుకకుఁజూడ, నలఁతినవ్వునగిముద్దాడు♦నామెమోము.

గీ॥ పసిఁడి తామర మొగ్గల ♦ పగిది మెఱయు, భామచనుదోయిఁ గస్తూరి♦పంకమలఁది
తేటిబ్రాలిన చెలువంపు ♦ తీరొనర్చి, చూడుమిది సుందరి! యని♦చూపిమురియు.

క॥ కలికిచనుదోయిఁ గ్రాలెడు, చెలువపు ముత్యాలదండఁ ♦ జేకొని ప్రీతిన్
గలయఁగ గనినట్టులఁగని, యలరుచు నచ్చట నెచేర్చు ♦ నంత నెమరలన్. 191

గీ॥ కడఁగి కెంపులవంకీలు ♦ కడియములను
మేల్మిమొలనూలు విడదీసి ♦ మెచ్చుగులుకఁ
దానె యమరించుఁ బలుమాఱు ♦ తమినిఁ బలుర
కముల విరులను దెచ్చి చూ ♦ ళ్కము నమర్చు. 192

గీ॥ ఇవ్విధిఁజెల్వతోఁగూడి♦యీశ్వరుండు, రాతిరియుఁబవలనురాగ♦రంజితుఁడయి
ఇంతినెడఁబాయకెంతయు♦సంతసమున, నున్నఁగాముఁడుగొలుచుచు♦నుండెవారి.

వ. కొన్నివందల సంవత్సరంబులమీఁద.

క॥ హరుఁడంత శీతశైలము, స్మరియించి బిరాననటకు ♦ సతితోఁ జని యం
దురమైన శిఖరతలమున, నిరవొప్పఁగ నుండె నెంత ♦ యేనిఁ బ్రియమునన్.

క॥ అందలిమ్రాఁకులు తీవియ, లందముగఁ జిగిర్చిపూచె ♦ నలదీర్ఘికలన్
బొందామరలన్ గలువల, బొందుగ వికసింపఁజేసెఁ ♦ బుష్పశరాజ్ఞన్. 195

క॥ గంధపుమ్రాఁకులపై నర, విందమ్ములపయినిఁ గుంద ♦ బృందమ్ములపైఁ
జిందుమరందము లొందుచు, మందసమీరములు శివుల ♦ మదులలరించెన్.

సీ॥ సంజకెంజాయల ♦ జానగుచందురుఁ, బురణించుపాలాశ ♦ పుష్పతతులు
కందర్పకేతు ల ♦ నందగు నాగకే, సరమహీజాతప్ర ♦ సవవితతులు
అలపవమానున ♦ కామోదమిడిమేల్మి, భాసిలుచున్న ల ♦ వంగలతిక
లమ్మరుబలముల ♦ కమరబోనంబిచ్చి, యలరెడు నెలమావు ♦ లందమైన
గీ॥ కొలఁకులందలి యుదకముల్ ♦ గలఁక లేక
వికచకమలోత్కరంబుల ♦ వెలసి జోతు
లను వెలుంగఁగఁజేయుచు ♦ మునుల మనము
లను దలంపఁగఁజేయుచుం ♦ డెను విరివిగ. 197

క॥ చందురుఁడు నాల్గుజాలఁ బ, సందుగ వెన్నెలలునించి ♦ సంబర మొదవన్
విందొనరింప విభావరు, లుం దద్దయు నొడికమగు చె ♦ లువుసూపెసిరిన్. 198

ఉ॥ అట్టిసుఖాఢ్యమైన సమ ♦ యమ్మున శంకరుఁ డాత్మదార నా
గట్టుపయిన్ నికుంజముల ♦ గాంగతటంబుల నేటిలంకలన్
నెట్టన మీఱి భోగముల ♦ నెక్కొని యక్కననొందుచుండెఁ దా
నిట్టులమైన బాళి విభుఁ ♦ డెట్టుల నట్టుల నొప్పె నాపెయున్. 199

గీ॥ సతిముఖేందుసుధాపాన ♦ సమ్మదమున, రమణియాననసౌరభ ♦ గ్రహణమునను
చెలువయందంపుఁ బేర్మికి ♦ లలితశీల, మునకు శివమదకరి గట్టుఁ ♦ బొందెసతము.

క॥ పలుకులఁ జూపుల మేల్చె, య్యుల హాస్యాలాపములను ♦ నుడురాజధరుం
డలరించుచు దాక్షాయణి, కెలన నెడన్ బాయకుండుఁ ♦ గేళీరతుఁడై. 201

—* ప్రావృట్కాల వర్ణనము *—

వ. ఇట్లు మహేశ్వరుండు గొంతకాలం బోషధిప్రస్థంబునందు సతీదేవితో విహారంబు లొనర్చుచున్నంతఁ బర్జన్యకాలాగమంబగుడు నొక్కనాఁ డమ్మహాదేవి విభున కిట్లనియె. 202

శా॥ ప్రాణేశా! కనుగొంటివే యడరునీ ♦ ప్రావృడ్గతిన్ మేఘని
స్స్వానంబుల్ భయదంబులై తనరె రం ♦ గత్తుంగశృంగాళిఁ బ్ర
స్వానాటోపముతోఁ జెలంగెను మహా ♦ వర్షాంబుధారల్ జగ
త్ప్రాణంబుల్ చెలరేఁగె బిట్టెసఁగె ని ♦ ర్ఘాతప్రపాతంబులున్. 203

చ॥ రవి గనుపట్టఁడయ్యె దిన ♦ రాజి విభావరులందు యామినీ
ధవుఁ డగుపట్టఁడయ్యె నిఁక ♦ దారలుగీరలు లెక్కయేమిటన్
బవలును రాత్రి యొక్కసరి ♦ భాసిలుచున్నది గర్జదభ్రముల్
రవములతోడ మిన్నుదఁబడు ♦ లాగు చరించెడు మారుతాహతిన్. 204

గీ॥ గాడ్పుతోఁగూడి పెద్దవృ♦క్షంబులెగిరి, నృత్తమొనరించుచున్నట్లు♦నెగడెఁ జదల
భీరువుల చిత్తములకు బల్ ♦ భీతిసేయు, చున్నవిట్టులనరయు సం ♦ పన్నతేజ !

గీ॥ చాతకపతత్రులును శిఖుల్ ♦జలదములకు, నెదురువోవుచునున్న న♦య్యెడరునందుఁ
గరకవృష్టిచే నవ్వానిఁ ♦ గానుపట్ట, నట్లు సల్పెడు నవ్వాలా♦హాకము లేచి. 206

గీ॥ ఇట్టిసమయంబునారసి ♦ యెంతయేని, పూన్కిఁగాకములు జకోర♦ములును నీడ
ములను సలుపుకొనుచు స్వస్థ ♦ ముగ వసించె, నీవు దలఁపవదేలొకో♦నిలువగీము.

క॥ కనుఁగొను పలురంగులతోఁ, దనరెడు మేఘములతోడఁ ♦ దత్త్వజ్ఞా ! యీ
ఘనమగుహిమవన్నగ మిట, నొనరెడు తెక్కలు గలట్టి ♦ యుదధియనఁగడున్.

ఉ॥ కావున దేవరా ! మనము ♦ గ్రచ్ఛఱ యిమ్మలఁ బాసి యెండుచో
టేవిధినైనఁ జేరుదము ♦ హెచ్చుగ నుల్కు జనించె నాకనన్
దా విని లోకనాయకుఁడు ♦ దద్దహసించి యిటుల్ వచించెఁ గాం
తా ! వెఱపొంద నేటికి హి ♦ తంబగు వాసమొనర్తుఁజక్కఁగన్. 209

ఉ॥ మేఘము లీనగంబునకు ♦ మేఖలదాఁటక క్రిందనుండు నభ్రౌ
ఘము లింక రావ్యగిరి ♦ యంఘ్రులయందె వసించు నానుప
ర్వాఘనివాసమైన కన ♦ కాద్రిని నట్టులెయుండు వీనిలో
నోఘనవేణి! నీకెచట ♦ నుండఁబ్రియంబొ వచింపు కుంపుగన్. 210

వ. అందీ హిమగిరి నారయుము.

సీ॥ సిద్ధాంగనలు నాగ ♦ సీమంతినులు నెప్డు, వదలక నీకు సే ♦ వలుపొనర్తు
రద్రిరాజపురంధ్రి ♦ యమ్మేనకయు నీనుఁ, బ్రేమించి పూజగా ♦ వించుభక్తి
బంగారుపద్మముల్ ♦ భాసిలుమానస, సరసి మదికిఁగూర్చు ♦ సంబరంబు
పులు లెలుంగులు సింగ ♦ ములు దపోమహిమల, నోదుగుచునందంద ♦ నోసరిల్లు

గీ॥ దివిజగంగావధూటి బల్ ♦ తేజమెసఁగఁ, దీరుతీరులనృత్తముల్ ♦ దీర్చుచుండు
బచ్చికలయాస్తరణములిం♦పెచ్చఁజేయుఁ, బాయనెంతు వెకాంత! ప్రా♦లేయధరము.

చ॥ ఎడపక యెల్లకాల మొక ♦ టేవిధిఁ బూఁచి ఫలించుచుండు ని
య్యెడ నిఖిలద్రుమంబులును ♦ నెల్లపు డబ్జకువాలజాలమున్
బొడమఁగఁజేయు దీర్ఘికలు ♦ మోహనమంజులగానమాధురిన్
దడయక కూర్చుచుండు సత ♦ తమ్ముఁ బికప్రముఖమ్ము లిమ్ముగన్. 212

చ॥ ఇఁకను హిరణ్యశైలమున ♦ నింద్రుఁడు మున్నుగునట్టిలోకనా
యకు లమరావతీప్రముఖ ♦ హర్షకరోత్తమరాజధానులన్
రకముగసల్పి యందులఁ ది ♦ రంబుగఁ గాపురమున్నవార లా
త్మకు ముదమైనఁ జెప్పు దయి ♦ తా! యట కేగుదమా? ప్రియంబుగన్. 213

ఉ॥ అందు మహేంద్రురాణి నిను ♦ నాదటఁ గాంచి ప్రియంబుసేయుఁ బ
ల్విందులు సేతు రెంతయును ♦ వేల్పులచేడియ లచ్చరల్ గడున్
బొందుగ సేవఁ జేయుదు ర ♦ పూర్వవినోదములన్ బొనర్చు వా
రిందుముఖీ! వచింపుమిఁక ♦ నేగఁగ నెంచినఁ గాంచనాద్రికిన్. 214

వ. అట్లుకాదేని.

ఆ॥ మనదు వెండికొండ ♦ కనఘాత్మ! చేరఁగఁ, దలఁచె దేనిఁ జెప్పు ♦ దరులు సాను
వులును గాంగకూల ♦ ములును జెల్వగు నెందు, నెందు బ్రహ్మపుత్రి ♦ సందడించు.

ఆ॥ అనుడు దేవదేవి ♦ యభవ! యీహిమగిరి, యూర్ధ్వశిఖరమందు ♦ నుందమనుచు
వేగముగ శివుండు ♦ వెలఁదిని సందిట, నొంది యూర్ధ్వశిఖర ♦ మొందె నపుడు.

క॥ అందు వనంబులుఁ గొలఁకులు, మందసమీరములు సిద్ధ ♦ మహిళామణులున్
గందువఁ గూర్చిరి మనముల, నిందుకళాధరునకును మ ♦ హేశ్వరి కెలమిన్.

గీ॥ కేరి విద్యాధరీకోటి ♦ కిన్నరీత, తియును నప్సరశ్శ్రేణి యెం ♦ తేని మీఱి
వేణువీణామృదంగని ♦ క్వాణగతుల, నృత్తముల సల్పుచుండిరి ♦ చిత్తసుఖము.

గీ॥ ఇట్లు నీహారగిరిఁ బర ♦ మేశ్వరుండు, రమణితోఁ బదివేల్వత్స ♦ రంబు లిష్ట
భోగములనొంది యానంద ♦ మునఁ జెలంగె, రాతిరియుఁ బవలనెడు నే ♦ ర్పాటు లేక.

ఉ॥ ఒక్కొకనాఁడు పద్మముఖి ♦ నొద్దికఁ జేకొని కాంచనాద్రికిన్
జక్కఁగఁ జేరి యందు మణి ♦ సానువులన్ విహరించి వచ్చు వే
ఱొక్కపుడీ యిలాతలమ ♦ హోన్నతదివ్యవనీతలంబులన్
మక్కువతోఁ జరించుచును ♦ మానినితో మరలున్ హిమాద్రికిన్. 220

వ. ఇట్లు దాక్షాయణీశివులు వైహారికసుఖపారవశ్యంబున నలరుఁడు నన్యోన్యసంగతి ననురాగభూజంబు నత్యంతాభివృద్ధిఁ దనర్చినంత భవాని దాంపత్యసుఖముల నెంతేనిఁ దనిసి సంతుష్టయై యొక్కనాఁ డేకాంతంబున శంకరునకు మ్రొక్కి భక్తితో దోయిలొగ్గి ప్రహ్వీభూతయై యిట్లు ప్రార్థించి యడిగె. 221

—* శివుఁడు సతీదేవికి జ్ఞానమార్గంబు నుపదేశించుట *—

చ॥ పరమకృపాళు! నీవలన ♦ బాగుగ భోగసుఖంబులొంది యం
దరుసము నొందితిన్ మరల ♦ నాత్మ యిఁకన్ జనుఁ డెట్లు దుఃఖ ని

స్త్రరణము సెందు జీవులెటు ♦ సంసరణమ్మును బాసి నిత్యమౌ
పరమపదంబుఁ గాంతురు కృ ♦ పన్ సెలవిమ్ము మహాత్మ! యాతఁడున్ 222

క॥ అనిలోకోద్ధరణార్థము, వినయమ్మున నాదిశక్తి ♦ విభునడుగఁగఁ బ్రీ
తినిఁగొని శంకరుఁడిట్టుల, ననియెను దాక్షాయణీ! ప్రి ♦ యంబుగవినుమా!

మ॥ పరతత్త్వంబిది దేనినారసినచో ♦ బంధంబులన్ బాసి మో
క్షరమన్ జెందును దేహియల్లదియె వి ♦ జ్ఞానస్వరూపంబిఁకన్
బరుఁడున్ జానన కారయన్ దగును స ♦ ర్వంబిద్దిబ్రహ్మంబుగాఁ
బరమార్థైకమనంబునన్ దెలియుమీ ♦ బాటన్ సరోజాననా! 224

క॥ అదిదుర్లభ మత్యంతం, బది యెఱిఁగినవాఁడు చూడ ♦ నరుదగు జగతిన్
ముదితా! భక్తియనంబడు, బదిలంబగు వస్తువొకఁడు ♦ భాసిలెడు నిలన్. 225

చ॥ పొలుపుగ భుక్తిముక్తిఫల ♦ భోగములొందఁగఁ జేయు భక్తి యి
మ్ముల నది తల్లియై బరఁగుఁ ♦ బుణ్యవతీ! భువి నెల్లవారికిన్
సులభము దాని యార్జనము ♦ చోద్యము జ్ఞానముకన్న భిన్నమై
యలరును గాని భక్తి దయి ♦ వాఱనిచోఁ గనలేరు జ్ఞానమున్. 226

సీ॥ భక్త్యధీనుఁడనై యేను ♦ బరమనీచ, జనులకేనియుఁ బాపిష్ఠ ♦ జనులకేనిఁ
గైవసంబయి వారి య♦గారములను, జేరి కొలుచుచునుందును♦ మేరమీఱి.

వ. అభక్తి సగుణ నిర్గుణ భేదంబుల ద్వివిధంబై యలరు నందు మొదటిది వైధి యనియు స్వాభావికి యనియు ద్వివిధంబయ్యె నా రెండును నైష్ఠికి, యనైష్ఠికి యన భేదంబుల నొప్పి ప్రత్యేకంబు ద్వివిధంబులయ్యె నందు నైష్ఠికి మరల యాఱువిధంబులయ్యె; అనైష్ఠికి యేకరూపయే; ఈయవి విహితావిహిత భేదంబులతో మఱియు ననేకవిధంబులయ్యె, వాని స్వరూపంబు మఱొకమాఱు దెల్పెద నిపుడు ప్రసిద్ధంబులగు నారెండు భక్తులకుఁ దొమ్మిది యంగంబులను బుధులు లెక్కపెట్టి రవ్వానిని వానిస్వరూపంబును దేటపఱతు వినుమని యిట్లనియె. 228

గీ॥ శ్రవణమును గీర్తనంబును ♦ స్మరణసేవ
నములునన్ దాస్యమును నర్చ ♦ నయును వంద
నమును సఖ్యంబు స్వాత్మార్ప ♦ ణమును ననెడు
నవవిధాంగము లొంది త ♦ నర్చుభక్తి. 229

వ. ఇటను వీనిస్వరూపంబు దెలియఁజేయుదు నారయుము.

సీ॥ నాదులీలాకథ ♦ లాదట వినుచు హ, ర్షము నొందుటయె శ్రవ ♦ ణమనఁబడును
హృదయాంబరమున నా ♦ హృద్యలీలలను దా, ర్కొనిపాడుటద్దికీ ♦ ర్తనమనఁబడు

ననుజగన్మయునిగా ♦ నమ్మినిర్భయమతి, స్మరియించుచుండుటే ♦ స్మరణమగును
అరుణోదయాదిగ ♦ నహముఁ రేయియు వేడ్క, చెన్నొందఁ గొలుచుటే ♦ సేవనంబు

గీ॥ హృదయపీయూషరసమది ♦ యుబికి పాఱఁ
బ్రియముఁ జెందుటే దాస్యమ్ము ♦ బేరుఁగాంచు
రహియమర షోడశోపచా ♦ రములు దనర
నన్నుఁ బూజించుటయె యర్చ ♦ నంబు రమణి! 230

క॥ మనువును జపించుచును మది, ననువుగ ధ్యానము సలుపుచు ♦ నష్టాంగము లు
ర్వినిఁ జేర్చి మ్రొక్కుటే వం, దనమని చెప్పుదురు పరమ ♦ తత్త్వజ్ఞమునుల్.

గీ॥ కడఁగి కష్టసుఖములలె ♦ క్కఁగొనకెపుడు, నమ్మి కొలుచుటె సఖ్యము ♦ నాఁగఁ జెలఁగుఁ
దనువు నెంతయుఁ బేర్మి మైఁ ♦ దనకుఁ గాక, నాకు విడుచుటె యాత్మార్ప ♦ ణంబు చెలువ!

వ. ఈయవి తొమ్మిదియు భక్త్యంగంబులై భుక్తిముక్తిప్రదంబులై నా కతి
ప్రియంబులై యలరారుచుండు నింకను బిల్వాశ్రయాదికంబులగు నుపాంగంబు
లును బెక్కులుగల వవ్వాని నీవ యూరయఁ గలవిట్లు సాంగోపాంగమగు భక్తి
తెఱంగునీ కెఱింగించితి. 233

గీ॥ ఇద్ది వైరాగ్యమాతృక ♦ యిద్ది ముక్తి, దాత్రి స్వర్గఫలోత్పత్తి ♦ దాయిని యగు
నీకుఁ బోటియొనర్చు బల్ ♦ నీటు మెఱయఁ, నామదిఁ గరంచు పెక్కేల ♦ నలినవదన!

గీ॥ భక్తిజ్ఞానంబు విరతినాఁ ♦ బరఁగు త్రిపుటి, యందు జ్ఞానవైరాగ్యము ♦ లమరుటరిది
భక్తినొందుట సులువగు ♦ భక్తి యొదవ, సర్వమీడేరు నాదువ ♦ శ్యతఁ బొనర్చు.

వ. మఱియు భక్తివశ్యుండనై యేను.

శా. పాపాత్ముండగు పక్షికంతునకు బల్ ♦ భాగ్యంబులర్పించితిన్
బాపన్ వేపఁగఁ జూచి దండధరునిన్ ♦ బ్రాణంబులన్ బాపితిన్
సాపాటున్ బొనరించితిన్ గరళమున్ ♦ జంకింతయున్ జెందకే
యీ పాట్లన్నియు భక్తినిన్ వలచియే ♦ యిందీవరబింబాలికా! 236

ఉ॥ కావున దేవి! నే మిగులఁ ♦ గాంక్ష యొనర్చెద భక్తియోగమున్
శ్రీవిలసిల్ల భక్తులను ♦ జేరెద నెల్లపుడన్న దేవియున్
భావమునందు భక్తియె ఘ ♦ నంబని మెచ్చి ప్రమోదమొందె నిం
కేవియొ ధర్మమర్మము ల ♦ నేకములడ్గినఁ జెప్పె నీశుఁడున్. 237

వ. అహరహం బిట్లు లోకహితార్థినియై యమ్మహేశ్వరి మహేశ్వరుని నానాశాస్త్ర
సంకేతవిషయంబులను వర్ణాశ్రమాచారనిబంధనంబులను స్త్రీపురుషధర్మం
బులను జ్యోతిశ్శకున సాముద్రిక వైద్యేతిహాసక్రమంబుల నడిగి సదుత్తరంబు

లొందిి యానంద మొందుచుండె ననుడు సూతునకు శౌనకాదు లవ్వలి కథ
నెఱింగింపుమనుటయు సూతుం డిట్లనియె. 238

—* ప్రయాగలో దేవమునులు యజ్ఞము నొనర్చుట *—

చ॥ అతులమునీంద్రులెల్లరు ప్ర ♦ యాగను జేరి మహామఖంబొకం
డతనువిభూతిసల్పుచు మ ♦ హామహులందఱుఁ గోరి పిల్వఁగాఁ
గుతుకముతోడ నందు నొనఁ ♦ గూడిరి సర్వసుపర్వులున్ బుషుల్
క్రతు నది పెద్దకాలము వి ♦ రాజిలె నెల్లరుమెచ్చ నచ్చటన్. 239

సీ॥ అందు బ్రాహ్మీసమేతుఁడై ♦ యబ్జభవుఁడు
భృగువు భగుఁడును బూష ము ♦ న్నగు గరిష్ఠు
లుండిరి మహేశుఁడును వచ్చి ♦ యుండె నంత
దక్షుఁ డొకనాఁడు విచ్చేసె ♦ దర్పమెసఁగ. 240

క॥ వచ్చిన దక్షునిఁ గనుఁగొని, యచ్చటివారెల్ల లేచి ♦ యాహ్లాదముతో
హెచ్చుగ గనకాసనమిడి, మెచ్చునటుల్ మ్రొక్కి కొలువ ♦ మేలుగ నతఁడున్

ఆ॥ వారి గారవించి ♦ వారిజసంభవుఁ, జేరి మ్రొక్కి గద్దెఁ ♦ జేరి కూరు
చుండి శివునిఁగని య ♦ తండు దన్నున్ జేరి, మ్రొక్క లేదటంచు ♦ నుక్కు మిగిలి,

క॥ మునులను వేల్పులఁ గనుఁగొని, యనియె భవుండితఁడు మామ ♦ కాత్మజఁ గొని నా
కనువుగ శిష్యుండైనను, నొనరింపఁడు గౌరవంబు ♦ నొక్కింతేనిన్. 243

ఆ॥ అశుచి లుప్తకర్ముఁ ♦ డతిభిన్నసేతువు, మాని యీతఁడిట్టి ♦ వానికే న
నష్టుఁడైనవాని ♦ కమ్నాయవిద్యను, బలె నొసంగినాఁడఁ ♦ బట్టి నట్లు. 244

సీ॥ ఘోరంబులగు ప్రేత ♦ వారంబులనుగూడి, సంచరించుచునుండు ♦ సంతసమున
నిలువాకిలియునని ♦ యెంచక నిచ్చలు, కాపురంబుండును ♦ గాటియందు
నున్మత్తునిన్ బోలి ♦ యొడలెఱుంగక యెప్డు, నగ్నుఁడై హసియించు ♦ నానఁ దక్కి
తామసజనులకుఁ ♦ దావిభుండై కడు, కూరిమితో నేలు ♦ కొనును వారి

గీ॥ పేరె శివుఁడని యశివుడై ♦ వెలయు నిట్టి
నష్టశౌచున కెఱుఁగక ♦ నలినసూతి
చోదనన్ జేసి యెద్దియుఁ ♦ జూడకట్టు
సాధ్వియగు కూఁతు నొసఁగితిఁ ♦ జదురుఁ దప్పి. 245

—* దక్షుఁడు శివుని శపించుట *—

క॥ అనియిట్లు పలికి వేగమె, కనుఁగవ యందగ్ను లొదవఁ ♦ గనుఁగొని యభవున్
ఘనకినుకతోడ నుదకం, బును ముట్టి శపించె నిట్లు ♦ భూతేశ్వరునిన్. 246

క॥ ఇతఁడిఁకను సర్వయజ్ఞ, ప్రతతుల భాగంబులేక ♦ వందురును బహి
ష్కృతుఁడగు సురలకు మునులకు, నతీతుఁడగు నితని కేటి ♦ కాహవ్యంబుల్.

గీ॥ ధాత మున్నగువారు వ ♦ ల్దనుచు నుడువు, చున్న నిట్టులఁ గొంకక ♦ యుద్ధతమతి
యై శపించిన దక్షున ♦ కలిగి నంది, కేశుఁ డిట్లని ప్రతిశాప ♦ మిచ్చె వేగ.

—* నందికేశ్వరుఁడు దక్షునకుఁ బ్రతిశాపం బిచ్చుట *—

ఉ॥ ఓరి! దురాత్మ! దక్ష! విను ♦ మోరి! మహేశ్వరు యజ్ఞకోటికిన్
దూరముసేయ నీతరమె ? ♦ దుర్మతి! శర్మమ దక్కె నీవిటుల్
గారులు ప్రేల నేమియగుఁ ♦ గాపురుషాగ్రణి ! బస్తమాళివై
తీరెదుగాక వేగ నికఁ ♦ దీఁపురమెల్ల నడంగుఁ గావుతన్. 249

చ॥ ఎవనిఁ దలంచినంత సక ♦ లేజ్యలు పూర్ణతనొంది మించు నిం
కెవని నుతించినన్ జనుల ♦ కెల్ల నమంగళముల్ దొలంగి మే
లవు; నెవనిన్ భజింతురి గమ ♦ లాక్షుఁడు నీ గురుఁడైన ధాత యా
యవికృతు నాదిదేవు నక ♦ టా శపియించితె! యజ్ఞబాహ్యుఁగా. 250

క॥ అని తన్ను శపించిన నం, దినిఁగని దక్షుండు మిగులఁ ♦ దీండ్రిపుటలుకన్
గొని యిట్టుల మరల శపిం, చెను ముందున్ వెనుకఁ గనక ♦ చేవదలిర్పన్.

ఉ॥ మీరలు రుద్రభక్తులయి ♦ మీఱి యిటుల్ చెలరేగుచున్న వా
రిరిఁక వేదబాహ్యులయి ♦ యెల్లరు వేదపథంబు వైదికా
చారముఁ బాసి బూదిని భృ ♦ శమ్ముగఁబూసి చరింతురుగాక బృం
దారకులున్ మునుల్ దగుప ♦ థమ్మునఁ జేరకయుందురి గావుతన్. 252

వ. అని దక్షుండు శపించినయంత భృగ్వాదు లలరుచున్నన్ గాంచి నందికేశుండు మరల నవ్వారికిట్లు ప్రతిశాపంబిచ్చె.

—* నందికేశ్వరుఁడు భృగ్వాదిమునులకు శాపం బిచ్చుట *—

గీ॥ ఎవరుశివునకువిముఖులై ♦ యేవమనక, యిట్టితుచ్ఛోక్తులకుముదం ♦ బెనయువారొ
యట్టివారలు వేదత ♦ త్త్వార్థమునకు, బాహ్యులగుదురుగాక యె ♦ ప్పట్లనేని.

క॥ మఱియును గామాత్మకులై, దరిద్రులై యాచకులయి ♦ ధర్మచ్యుతులై
వెఱవక యభక్ష్యములఁదిను, దురు శూద్రులయాజకులగు ♦ దురు నగజగముల్.

వ. అని శాపం బిచ్చినంత శివుండుడిపి దక్షశాపంబున కావంత యలుగక నందికేశున కిట్లనియె,

ఆ॥ తగునె బ్రహ్మకులుల ♦ దండింప శాపోక్తి, నేమియయ్యె శాప ♦ మీఁగి కిపుడుఁ
బరులకోసరముగ ♦ బావిదూఁకుట మేలె?, తెలియున నెడివాఁడె ♦ తెలియలేఁడు,

వ. అని యిట్లు నందికేశుని కందుఁబాపి సత్వరంబుగఁ బరిజనంబులతోఁ బరమేశ్వరుండు కైలాసంబున కేగెనంత దక్షుండు కుపితుండై భృగ్వాదులను దోడ్కొని కనఖలక్షేత్రంబుఁ జేరి యందు శివవిహీనంబుగ వాజపేయమఖం బొనరించి యట్టులే బృహస్పతిసవనంబుఁ జేయనెంచి సకలామరులను బరమమునుల నందఱఁ బిలిచి యజ్ఞారంభంబు సేయుడు— 258

-* దక్షయజ్ఞము *-

ఆ॥ కదలివచ్చె నటకు ♦ కంజనేత్రుఁ డజుండు, దేవనాథుఁడాది ♦ దిక్పతులును
వారిగేహినులును ♦ వసుగణంబును ద్వాద, శార్కులును గ్రహంబు ♦ లలరి వేగ.

వ. మఱియు నీకను విశ్వేదేవతలును మరుత్తులును బితృగణంబు లప్సరోజనంబులు గంధర్వ సిద్ధ విద్యాధర కిన్నర యక్షోరగ పతంగ ముఖ్యులును గశ్యపాగస్త్య వామదేవాత్రి భృగుభగమరీచి నారద పరాశర గర్గ భార్గవాది పరమమునీంద్రులరుదెంచి రవ్వారి కందఱకు దక్షుఁ డర్హసత్కారంబు లొనరించి విశ్వకర్మవిరచితామలగేహంబులు సమర్పించి యందుంచిన వారందఱట్లుండుడు సవనంబునందు భృగ్వాదులు ఋత్విజులుగను బుండరీకాక్షుం డధిష్ఠాతగను బ్రహ్మజుండు త్రయీవిధిదర్శకుఁడుగాను సర్వదిక్పాలురు సాయుధులై రక్షకభటులుగను ద్వారపాలకులుగను నియమింపఁబడి రింకను యజ్ఞంబు సురూపంబై యజ్ఞశాలకుఁ జేరియుండె నగ్నియు నిజరూపంబున హవిర్గ్రహణంబునకు సిద్ధంబై యుండె నిట్లెనుబదియెనిమిదివేలు ఋత్విగ్గణంబులును, నలువదినాలుగువేలు ధాతృగణంబులును నట్లే యధ్వర్యుహోతృగణంబులును దీక్షితులై యుండి రంత నియుక్తమానుండగు దక్షుండు దారతోఁ రచితకౌతుకమంగళాచారుండై దీక్షితుండై యజ్ఞశాలకుఁ జేరియుండె నంద ఆత్మకార్యపరతంత్రులై యుండిరా సభయందుఁ గపాలి యనర్హుఁడనియు నాతనిఁ జేకుట సతియు ననర్హయనియుఁ బిలువని కతమ్మున సతీమహేశ్వరులు దక్కఁ దక్కిన నిఖిలామర దివ్యముని జనంబులు, బ్రహ్మర్షులు, రాజర్షులు, మున్నగువారెల్ల సదారంబుగ సపరివారంబుగ విచ్చేయుటఁ జేసి సభ యెంతయు సందడి మిగిలియుండుట నందు శైవాగ్రగణ్యుండగు దధీచి, మహేశ్వరీ మహేశ్వరుల పొలకువఁ గాంచక యులికిపడి దక్షునకిట్లనియె. 260

ఉ॥ అందఱుఁ జేరినారిచటి ♦ కయ్యలు నమ్మలు రాకయుండిరా
యిందుకళాధరుండు శివ ♦ యేలొకొ పిల్వఁగ లేదొ వారి నిం

దిండఱుచేరియున్న సభ ♦ యెంతయు దేవుఁడు లేని జాతర
ట్లుండగియుండె నీకిదియు ♦ లోపముగాఁ గనుపట్టదే? మదిన్. 261

ఆ॥ ఎవనిచేత శుభము♦లేర్పడ్డుఁబాయక, భక్తజనుల నొందు పరమశివుఁడ
తండు చేరకుండెఁ♦దగుకతంబెద్దియో, సవము నెగ్గఁగలదె? ♦ శివుఁడులేక.

ఆ॥ వినుము మంగళములు ♦ విఘ్నముల్ రాకాసు, లెవనిఁదవ్వులఁజూచి♦యవియు వేగ
నట్టి పరమశివుని ♦ నభవుని నెడచేసి, తేల? దక్ష! యెఱిఁగి ♦ యెఱిఁగియిట్లు.

వ. ఇప్పటికేనియు

చ॥ పనుపు విధాత నేనియును ♦ బద్మదళాక్షుని నేని వేగఁగూఁ
తును పరమేశ్వరున్ వడిగఁ ♦ దోడ్కొనిరమ్మని దక్ష! యట్లులై
నను భవదీయ యజ్ఞము జ ♦ నస్తుతమై సిరిఁబొల్చు సిద్ధినిన్
గొను నిఁక నీవు శ్రైష్ఠ్యమును ♦ గొందువు ♦ సర్వసుపర్వులందునున్ 294

వ. అనిన విని యహఙ్కారదూషితుండగు దక్షుండు గినిసి మునికిట్లనియె.

చ॥ ముని! వినుమా! కపాలి గడు ♦ భూతగణంబులఁ బ్రేతవర్గమున్
బెనఁగొని యస్థిసంచయము ♦ పేరిమిఁ జేకొని కాడులందు నె
ప్డును దిరుగాడుచుండు నిఁకఁ ♦ బుత్త్రియు నాతని చెట్టఁబట్టుటన్
మనమున వీరనర్హులని ♦ మానితి యాగమునందుఁ బిల్వఁగా. 265

చ॥ అనవిని యెల్లరున్ వినియు ♦ నద్దము సెప్పక యున్నఁజూచి య
మ్మునికులచంద్రుఁ డేవమును ♦ బొంది మఖంబిది బన్నమొందు నిం
దునఁ దగువారలెల్లరును ♦ దుఃఖముఁ జెందుదు రివ్విభుండునున్
ఘనమగు నాపదన్ బొరయుఁ ♦ గాక! యటంచు శపించి వెళ్లిమిడిన్. 266

గీ॥ తనదు శిష్యులతోఁగూడఁ ♦ దగ్గలె మఖముఁ
బాసి యాతనితోఁబాటు ♦ వామదేవ
మునియు ఘటసంభవుఁడు గౌత ♦ ముఁడు శిలాదుఁ
డత్రియును జనిరెంతయు ♦ నాగ్రహించి. 267

చ॥ చనిన మునీంద్రులన్ గనియు ♦ సంతసమున్ గొని దక్షుఁడిట్లు ప
ల్కెను ముదమయ్యె వీరితుల ♦ లేచి ప్రయాణముసేయుటిందు శ
ర్వుని మతమొందినట్టి శఠ ♦ బుద్ధు లనిద్ధులు చేరరాదిఁకన్
మునులు! సుపర్వవల్లభులు! ♦ పూర్తియొనర్తుఁడు నాదుజన్నమున్. 268

వ. అనుడునంత భావ్యనర్థవశంబునఁ గేశవుండును బుత్త్రస్నేహంబునఁ బద్మజుండును బ్రహ్మాండాధిపతియగుటన్ జేసి బుగులున నెల్ల దివ్యర్షి జనంబులును మిన్నకుండి

జన్నంబున కారంభముచేసి యొనర్చుచుండి రంత రాజతాద్రియందు సవితా నంబగు ధారాగృహంబున సఖులతో సంతసంబుననున్న మహేశ్వరి యాకసంబున విమానంబులతో దక్షాధ్వరంబున కరుగుచున్న వేల్పులఁగాంచి సఖియగు విజయుం బంచి తన్ముఖంబున సర్వం బెఱింగి మనంబునం దిట్లాందోళనం బొనర్చె.

-* సతీదేవి దక్షయజ్ఞమునకుఁ బోవుటకు శివుని సెలవడుగుట *-

చ॥ జనకుఁడు మేటిజన్నమును ♦ సల్పెడునంట! మదంబయేని న
య్యనఘుఁడు నేని నన్ బిలువ ♦ రక్కట! యక్కత మేమొ యెట్టులై
నను నట కేగకుండిన మ ♦ నంబు దిరంబగునే? మదాత్మనా
థుని నెఱిఁగించి యాజ్ఞఁగొని ♦ తొందరగా నట కేగఁగావలెన్. 270

క॥ అనికొని యిట్లు శివుండుం, డిన యాస్థానమును జేరి ♦ నిలిచి ప్రణతయా
టను ననఘుఁడుగని సతితో, ననె నేటికివచ్చి తిందు ♦ నరవిందముఖీ! 271

చ॥ హరుఁడిటు పృచ్ఛసేయసతి ♦ యంజలిచేసి వచించె జీవితే
శ్వర! విను నాదు తండ్రి యొక ♦ జన్నము సేయుచునుండెనంట! ని
ర్జరులు మునుల్ ఘనుల్ నిఖిల ♦ చారణసిద్ధపతంగనాగకి
న్నరు లరుదెంచినార లఁట! ♦ నామది యూరెడు నందుఁ బోవఁగా. 272

ఆ॥ పిలువఁడాయె నేమి ♦ తలఁచెనో? నాతండ్రి, మఱచెనొక్కొ! మనల ♦ మానసమున
నగునె? మఱచుటెందు ♦ నల్లునిఁగూఁతును, గతమదేమొయింత ♦ గాదెయరయ.

సీ॥ రహి "ననాహూతోధ్వ ♦ రంగచ్ఛ" యనుసూరి, సూక్తికి మదిలోనఁ ♦ జోటొసంగి
అఱువ దేడులుదాఁట ♦ నస్తాబిస్తనుచొప్పు, ముదిమి దక్షుని తెఱం ♦ గెదమరల్చి
పాయక నినుగొల్చు ♦ పడఁతిని భక్తనౌ, నాహుర్మిఁదీర్ప మ ♦ నంబుఁబూని
ఆఁడది పుట్టింటి ♦ కాసజెందుననాఁ బ్ర, జలు పల్కునుడి మదిఁ ♦ జాలఁదడవి

గీ॥ పయన మొనరింపు దేవేశ! ♦ రయము మీఱ
నన్నుఁ దోడ్కొని ప్రమథ జ ♦ నంబుతోడ
రాఁదలఁపవేని ననుబంపు ♦ మాదరమునఁ
బోయివచ్చెద నీపాద ♦ ములకు మ్రొక్కి. 274

క॥ చని యందుల కేటికె మన, లను బిల్వఁగ మానెనో త ♦ లంపెఱిఁగెద వే
గనె మఱలివచ్చెదను నా, కనుజ్ఞయిడిపంపు చూతు ♦ నాయుత్సవమున్. 275

క॥ అని సర్వేశ్వరి యడిగిన, విని శివుఁడా దక్షసవన ♦ వృత్తంబెల్లన్
మనమందెఱింగి యనె నీ, జనకుఁడు నన్ జిన్నసేయ ♦ జన్నముఁబూనెన్. 276

ఉ॥ కూళయతండు నాపయినిఁ ♦ గ్రోధమునొంది దురుక్తులాడి యీ
వేళకు జన్నమంచునొక ♦ పేరిడి నన్ వెలివెట్టి సర్వదు
ర్హేళిగ నందఁబోవ మృతి ♦ కన్నను నెక్కుడు దుఃఖమౌఁ జుమీ
యాళిరో ! మానుమీ పయన ♦ మాత్మహితంబుగ నెంచి యిత్తఱిన్. 277

క॥ ఇటు లనినను జనుటకు లం, పటమై యున్నట్టి తనదు ♦ పణఁతిన్ గని మీఁ
దట రానున్న యనర్థము, పటుమతి నెఱిఁగియును నటకుఁ ♦ బంపఁగనిచ్చెన్

-* సతీదేవి దక్షయజ్ఞమునకుఁ బోవుట *-

గీ॥ వృషముపై నెక్కి యఱువది ♦ వేల గణము
గొలువ దేవేరి ! యటకేగు ♦ గొంకకనుడుఁ
గడుముదం బొంది కై సేసి ♦ వడిగ నెద్దు
నెక్కి వెడలె మహాదేవి ♦ యింపుమీఱి 279

క॥ ఒకచెలియ గోడువంకను, నొకచెలి విరికందుకంబు ♦ నొకచెలి పద్మం
బొకచెలి మణిదర్పణమును, నొకచెలి తాంబూలపేటి ♦ నొంది చని రొగిన్.

వ. మఱియును

క. కొందఱు మణిపాదుకలను, గొందఱు ఛత్రంబు నీఁకను ♦ గొందఱు సురటీల్
కొందఱు చామరముల మఱి. కొందఱు వేత్రములఁ బట్టి ♦ కొని చనిరి తగన్.

వ. కదలి యంతంత నొదవెడు దుశ్శకునంబులకు మదిన్ గొంకుచు సతీదేవి యతి
త్వరితంబునఁ గనఖలక్షేత్రంబుఁ జెంది యందు దక్షయజ్ఞ ప్రాకారంబుగవను
ముందఱ వృషంబుడిగ్గి మణిపాదుకలఁ బదంబుల మెట్టి బలంబుల నెల్ల నందయునిచి
కతిపయపరివారంబుతో యజ్ఞశాలం దఱియుడు నంత వీరిణి యాత్మజాతన్నని
యాదరంబున నెదుర్కొని పీఠంబు నొసంగుటయు నక్కచెల్లెండ్రును నట్లే
యాదరంబుఁ జూపుటయుఁ దండ్రియగు దక్షుండుమాత్రము దన్నుఁగాంచియు
ననాదరంబున మిన్నకుండుటయు వేల్పులెల్లరును దక్షానుమతితోఁ దన్నుఁ
జూచియుఁజూడనట్లు స్వవిహితహవిర్భాగములందుకొనుచుండుటయు, నాత్మవిభుం
డగు మహాదేవున కందుహవిర్భాగంబు శూన్యంబుఁ జేయుటయుఁ గాంచి తల్లి
యొసంగిన పీఠంబుఁదాఁకక మహాదేవి రుష్టయై క్రోధాగ్నిఁ గాల్చునదియుఁ
బోలె దక్షునీక్షించి యిట్లనియె. 282

మ॥ జనకా ! యేల మహేశ్వరున్ బిలువవే ♦ చందంబు జన్నంబొన
ర్పను బూనికన్ దొరకొంటి వీజగము లే ♦ భద్రాత్ముచే శుద్ధిఁగాం
చునొ యయ్యాదిమదేవు నన్యులవలెన్ ♦ జూడన్ వివేకంబె య
ఘునుఁడిచ్చోటికి రాకయున్నఁ జెడు యా ♦ గంబిద్ది నేఁజెప్పెదన్. 283

క॥ యజ్ఞవిదగ్రేసరుఁడున్, యజ్ఞాంగుఁడు యజ్ఞతనుఁడు ♦ యజ్ఞకరుఁడునున్
యజ్ఞేశ్వరుఁడగు నీశ్వరు, యజ్ఞమునకుఁబిలువకున్న ♦ యజ్ఞంబగునే? 284

ఉ॥ ఈహరి నీ పితామహుని ♦ నీ పురుహూతుని నీ మునీంద్రులన్
మోహముతోడఁ బిల్చి యల ♦ భూతపతిన్ విడనాడితీవు వీ
రాహరుచేత నే పదవు ♦ లంది యిటుల్ దొరలైరి యద్ది నీ
వూహ నెఱుంగ కిప్పగిది ♦ నుత్పథమొందితి వజ్ఞ శేముషీ! 285

వ. ఇట్టులడిగి నిలింపులఁ జూచి యిట్లనియె.

చ॥ చనునె హరీ! సరోజభవ! ♦ శక్ర! హుతాశనముఖ్యులార! స
న్మునికులవర్యులార! శశి ♦ భూషణుఁ డబ్జభవాండ భాండపా
వనుఁ డతులుండు రానియెడ ♦ వాసిగ మీరలుచేరి హవ్యముల్
గొనుచు వసించినా రిటులఁ ♦ గొంకును జంకును మాని యాత్మలన్. 286

ఉ॥ ఓయి రమేశ! నిన్ను నిటు ♦ లుద్భవమొందగఁజేసి మేటి యా
మ్నాయములిచ్చి దైత్యజన ♦ మారణసాధనమైన చక్రమున్
శ్రీయలరంగ నిచ్చియు న ♦ శేషజగత్సముదాయనాథుఁగాఁ
జేయఁగ లేదె? విస్మృతినిఁ ♦ జెందఁగ మందమనీష! యొప్పునే. 287

చ॥ నలినజ! నిన్నుఁబుట్టఁగ నొ ♦ నర్చి శ్రుతిప్రకరంబొసంగి యీ
విలసిత లోకరాజి నొద ♦ వింపఁగఁ జేసెను సృష్టిచాతురిన్
బలమునొసంగి సర్వసుర ♦ వందితుఁ జేసె దయాళు నాశివున్
దలఁపఁగఁజెల్లదే యిటుల ♦ దర్పము సర్పమువోలెఁ జెందెదే? 288

గీ॥ చెలఁగి నీ యైదవశిరంబుఁ ♦ జిదిమివైచి
మదముఁబోకడఁ బెట్టిన ♦ మానసమున
నదియు నేనియు దలఁపవే ♦ మచ్చరియము
పంకజోద్భవ! యిమ్మాడ్కి ♦ బాటఁదొలఁగి. 289

ఆ॥ అమరనాథ! యేల ♦ యతిగర్వితుండవై, నిక్కి దడిచిపడకు ♦ నీదుహస్త
మశనితోడ స్తంభ ♦ మందించు టెఱుఁగవే, మరలఁగుడుతు వార్తి ♦ బిరబిరనిట.

క॥ అనియెదు కూఁతును గని పెను, కినుకన్ గొని యిట్టులనె నొ ♦ గిన్ దక్షుఁడు మా
నిని! నిన్నెవ్వరు పిలిచిరి, పెనుపే! యిటు పిలువనట్టి ♦ పేరంటము రాన్ 291

ఉ॥ పొమ్మిక నూరకుండు మటుఁ ♦ బోవక యుండిన నీదు నాథు జ
న్మమ్మున కేను బిల్వ సుగు ♦ ణమ్మొకఁడేనియు లేదు ప్రేతభూ
తమ్ములతోడ నేస్తము స ♦ తమ్మొనరించుచు నొల్కియందు ని
త్యమ్ముగనుండుఁ గశ్మలుఁడు ♦ దైవతగోష్ఠికిఁ బాఁపితిన్ జుమీ! 292

గీ॥ అరయ కిదియెల్ల నా విరూ ♦ పాక్షునకును
నిర్గ్నసంగితి విధిఁబట్టి ♦ నేర్పుమాలి
అరసి యిఁక నల్క విడుము దా ♦ యమును గొనుము
నీవుమాత్రము దాక్షాయ ♦ ణీ! రయమున. 293

—* సతీదేవి దక్షునిఁ దెగడుట *—

వ. అనిన విని మహేశ్వరి దురాత్ముఁడగు నాత్మజనకుని ప్రలాపంబుల కత్యంతంబు గనలి మనంబున నీశ్వరోక్తిం దలఁచి యం దవిశ్వాసం బొనర్చిన తనదు ననుచితంబును వరప్రదాన సమయంబునందు శంకరుఁడు దనకుఁజేసిన సమయంబును నారసి పశ్చాత్తాపంబుఁజెంది మనంబునం దిట్లాందోళనం బొనర్చె 294

ఉ॥ ఎట్టులఁ బోవుదాన నిఁక ♦ నే విభునొద్దకుఁ జిక్కువచ్చె న
న్నెట్టుల నేలుఁ గాలహరుఁ ♦ డింతలి వృత్త మెఱుంగఁగోర నే
నెట్టుల నీ దురాత్ము తెఱఁ ♦ గేర్పడఁజెప్పుదు ముప్పుమూఁడె ని
క్కట్టునఁ గూలితిన్ విభుఁడు ♦ గాదన మానఁగ లేకపోయితిన్. 295

వ. అని తండ్రి నుద్దేశించి

గీ॥ జనక! శంకరు నిందచే♦సినయఘంబుఁ, గుడుతువిఁక సందియము లేదు♦గొప్పదుఃఖ మొందుదువు పరమందును♦నొందఁగలవు, ఘోరమగునారకాగ్ని సం♦కోచపడక.

గీ॥ అఖిలదేహులకెవుడుప్రి♦యాత్ముఁడైన,యభవునకునధికులునుబ్రి♦యాప్రియులును లేరు; నిర్వైరు శర్వుఁడె ♦ లియకయిట్లు, నీవ యెడచేసి తెవ్వారు ♦ నేరరిట్లు.

చ॥ పరుల గుణంబులన్ జడులు ♦ పల్కుచునుంద్రు దోసంగులంచు నే
ర్పరులు గుణంబులన్ బడసి ♦ పాటియెనర్పరు దోషబృందముల్
బరము లిఁకెన్ను దోసములఁ ♦ బ్రౌఢిగుణంబులుగా నొనర్తు రి
ప్పరుసున నీ వనార్యమతి ♦ భర్గునియం దఘమెంచినా విటుల్. 298

గీ॥ ఉత్తమజనాంఘ్రిరజమున ♦ నూడ్పఁబడిన
తెలివిగల కుణపాత్మవా ♦ దులు జగమున
నుత్తముల నీసుమైదూఱు ♦ చుందు రెందు
నదియె మంగళమై తన ♦ రారు మాకు 299

క॥ శివయను నక్కరములు రెం, డవియించును దలఁచువారి ♦ యఘపుంజములన్
శివునిఁ బవిత్రయశస్కుని, శివేతరుఁడ వీవు దెగడఁ ♦ జిత్రంబగునే? 300

ఆ॥ ఎవని పాదపద్మ ♦ మేవేళ బ్రహ్మర,సాసవార్థు లర్థి ♦ డాసి హృన్మి
ళిందముల నికామ ♦ మొందుదురో తృప్తి, యట్టి విశ్వగురున ♦ కలిగితీవు.

చ॥ విను మజముఖ్యులై యలరు ♦ వేలుపులెల్లరు నొల్కి మిట్టలోఁ
బునకలు బూదినిన్ గొనియు ♦ భూతగణంబులతోఁ జరించు శ
ర్వుని పదపాంసులేశమును ♦ బూని ధరింతురు మౌళులందు నీ
వనినయటుల్ దలంప రశి ♦ వాత్మునిఁగాఁగ శివున్ శివేతరా! 302

ఆ॥ విను ప్రవృత్తమని ని ♦ వృత్తమనియుఁ గర్మ, మఖిలవేదవితతి ♦ నన్యగతి వి
భాగమొందియుండె ♦ రాగవైరాగ్యల, క్షణములొప్పమీఱఁ ♦ గ్రమము మెఱయ.

ఆ॥ ఒక్క కర్తయందు ♦ యుగపదాచరణంబు, కర్మయుగమునకు ని ♦ కామవైర
మెట్టికర్మమేని ♦ యొనఁగదు బ్రహ్మమం, దెఱుఁగు హృదయమందు ♦ నివ్విధంబు.

ఉ॥ ఆయణిమాదులౌ పదవు ♦ లస్ఫుటకారణముల్ మహాత్మహృ
ద్దేయము లస్మదీయములు ♦ కిల్బిషి! నీకొనగూడ వెందు నిన్
డాయును యజ్ఞగేహములఁ ♦ దద్విహితోదనతృష్ణులై కడున్
బాయక ధూమవర్త్మలగు ♦ వారలు మెచ్చు పదంబు లారయన్, 305

ఉ॥ ఎవ్వఁడు శంకరున్ దెగడు ♦ నెవ్వఁడు తత్పరివాదవాదమున్
గ్రొవ్వివినున్ సమానముగఁ ♦ గూలుదురిద్దఱు నారకాంధునన్
జివ్వున శర్వదూషకుని ♦ జిహ్వనుగోయఁగఁజెల్లుఁ జాలఁడేన్
నెవ్వగఁ జావఁజెల్లు నటు ♦ నీల్గనిచో నెడఁబాయఁగాఁదగున్. 306

ఉ॥ కావుననే త్వదీయమును ♦ గశ్మలమై తగు నాదు దేహమున్
బోవిడుదానఁ జాలునికఁ ♦ బుణ్యుని నిందయొనర్చినట్టి నీ
యేవపు చెడ్డచుట్టఱికి ♦ మింకునుగావుత బ్రాహ్మణబ్రువా!
తావకమూర్తిజాతతను ♦ దాహముఁజేసి సుఖింతు నాపయిన్. 307

క॥ నను దాక్షాయణి యనినా, మనోవిభుఁడు పిలువ నాడు ♦ మనమిఁక నొచ్చున్
జనములు మెచ్చఁగ నీతను, వును గుణపమునట్టుఁ బాసి ♦ పొందెద శుభముల్,

—* సతీదేవి దేవతలను శపించుట *—

క॥ సురలు మునులీను వినుఁడీఁక, యరయక యనుచితపుఁగర్మ ♦ మామోదమునన్
జరుపుచునుంటిరి జడులై, హరుదండమునొంది దుఃఖ ♦ మందుదురు వెసన్.

ఆ॥ ఇట్లు పల్కి కినిసి ♦ యీశ్వరి యుత్తరా, భిముఖి యొప్పనట్లు ♦ పృథ్విఁ గూరు
చుండి మౌనమొంది ♦ యుదక మాచమనంబు, చేసి కనులు మూసి ♦ శివునిఁదలఁచి.

క॥ దేవాదిదేవుఁడగు శివ, దేవునియంకతలమందుఁ ♦ దేజరిలునొడల్
గావలుఁడగుదక్షునివగ, కీవిధిఁ బాయంగ నెంచి ♦ యెంతయుఁ బూన్కిన్.

సీ॥ ప్రాణము నపానమును నొక ♦ పగిది నాభి
నుంచి వెడలించి హృదయమం ♦ దుంచి బుద్ధి.

తో నచటినుండి కంఠంబు ♦ త్రోవబొమల
మధ్యమునఁ జేర్చి యంత శాం ♦ భవి రయమున. 312

## —* సతీదేవి యోగాగ్నిచే దగ్ధమగుట *—

గీ॥ ఒడలియందు మరుద్వీతి♦హోత్రధార, ణముఁదనరఁజేసి శివపదా♦బ్జములుదక్క-
నన్యమెద్దియుఁగనకుండెనపుడు యోగ, వహ్నులుజ్వలించిదహియించె♦వడిగనొడలు.

క॥ ఆకసమునఁ బుడమిపయిన్, జోకగనున్నట్టి రద్ది ♦ చూచికడున్ హా
హాకారంబులు సెలఁగఁగ, శోకంబునుజెంది దక్షుఁ ♦ జూచి యని రిటుల్. 314

సీ॥ తివిరియొక్కకలకే♦తెల్లవాఱునెదక్ష!, మఱియఁబోకుమని కొం ♦ దఱు నొడివిరి
ఇల్లల్కినంతట ♦ నే పండుగౌనొకో, కనఁబోదువని కొంద ♦ ఱనిరి మీఱి
ముందఱ నున్నది ♦ ముదుసళ్ళపండుగ, యయ్యతోనందఱ ♦ కనిరి కొంద
ఱిది కట్టికుడుపు నీ ♦ వెందేగఁదప్పదు, కూఁతుగోడనియును ♦ గొందఱనిరి

గీ॥ జగములీ సూర్యచంద్ర న ♦ క్షత్ర రాసు, లెంతవఱ కిద్ధకాంతుల ♦ నేపుమీఱు
నంతవఱ కీవు పుత్రికా ♦ హంతకుండ, వనుచు దుష్కీర్తినొందెద♦వనిరి వనరి.

క॥ ఆ శివురాణిన్ వెనుకొని, యాశాలను జేరినట్టి ♦ యభవానుచరుల్
శ్రీశివ సురుఁగుడు గని హా, హా శాంకరి! యనుచు దుఃఖ ♦ మంది రయమ్మునన్.

ఆ॥ పరశు శూల ఖడ్గ ♦ ధరులౌచు బిరబిర, దక్షుఁ జదుపవచ్చు ♦ తత్త్వమరసి
యజ్ఞహంతృ మార♦ణార్థమై దక్షిణా, గ్నిని భృగుండు హవన♦మును బొనర్చె.

వ. దానఁ జేసి

క॥ భూరితరబలులు ఋభు లను, వారు పొడమి యుల్ముకములఁ ♦ బట్టి యురగ కే
యూరుని పారిషదులతోఁ, బోరి పఱవఁ జేసినంతఁ ♦ బొంకము మీఱన్. 318

## -* ఆకాశవాణి దక్షుని శపించుట *-

వ. అంత నయ్యవసరంబున నభోవాణి పెద్దయెలుంగుతో నచ్చటివారెల్ల రాల
కించి యచ్చెరువొంది యదరుఁజెంద నిట్లు వక్కాణించె, 319

ఉ॥ ఓరి మదాంధ! దక్ష! విను ♦ ముగ్రునితోడ విరోధమొంది యి
ట్లాఱడి యాగమున్ గడఁగి ♦ తాత్మజ నంతముఁజేసి తేవపుం
ధీరతనొంది యింకను ద ♦ ధీచి హితోక్తి ననాదరించితౌ
రౌర! యఘుంబుపై నఘము ♦ నార్జనఁ జేసితి విట్లు దుర్మతీ! 320

సీ॥ ఏ సతీదేవి బా ♦ లేందుశేఖర పత్ని, యఖిలలోక సముచ్చ ♦ యంబు లేలు
ఏ సతీదేవి బ్ర♦హ్మేంద్రచంద్రార్క ప్ర, ముఖ నిర్జర శ్రేణి ♦ పూజలొందు

ఏ సతీదేవి యో♦గీంద్ర మనోరాజి, బ్రహ్మవిద్యాకృతిఁ ♦ బరిఢవిల్లు
ఏ సతీదేవి భ♦క్తేష్టంబు లారసి, భోగమోక్షంబులఁ ♦ బూన్కి నొసఁగు

గీ॥ ఏ సతీదేవి కల్పాంత♦మీఁక చేసి, సర్వసంహార మొనరించుఁ ♦ జటులశక్తి
ఆ సతీదేవి నిత్యక ♦ ల్యాణమూర్తి, నా జగన్మాత నెడఁజేసి ♦ తౌర ద్రోహి!

గీ॥ దీని ఫలమంత యిపుడె సం♦దియము లేక, కుడుతు వీక నీ సభాస్తార♦కోటితోడ
నీదు మస్తంబు దెగిపడు♦నేలమీఁద, సవనమిది భంగమున్ జెందు♦సత్వరముగ.

వ. మఱియును.

క॥ నిను జేరిన యీ దిప్పుల, కనుచిత కర్మలకు శాస్తి ♦ యగు మెండుగ వె
న్కను ముందుఁగనక పీ రీ, యనువున విందులను మెక్కి ♦ రరుసంబు మెయిన్.

వ. అని యిట్లు వచించి యూరకుండెఁడు

ఉ॥ అంత సురల్ మునుల్ మనము ♦ లందు విషాదమునర్థ భయంబున
త్యంతము నొంది ముందఱ మ ♦ హాపద డాయుచునున్న యట్లుగా
నెంతయు నిశ్చయించి వన ♦ జేక్షణు సన్నిధిఁ జేరి దేవ! క
ల్పాంతమువోలెఁ దోఁచెడు ద ♦ యామతిఁ బ్రోవఁగడంగు మిందఱన్. 324

క॥ అని యర్థించిన దక్షుం, డును జక్రాయుధున కెఱఁగి ♦ నుతిఁ జేసి యనెన్
వనజాక్ష! నీదు సాయము, నని జన్మము సేయఁగడఁగి ♦ నాఁడ మనుపుమీ.

వ. అని యభ్యర్థించె నంతమీఁద.

మత్తకోకిల. పాఱినట్టి గణంబులెల్లఁ గ ♦ పర్దిఁ జేరఁగఁబోయి యా
ఘోరమంతయుఁ దెల్పి రంతనె ♦ కోవిదోత్తముఁడైన య
న్నారదర్షియు శర్వుఁ జేరి ప్ర ♦ ణామముల్ పొనరించి యా
తీరునంతయుఁ బూసగ్రుచ్చిన ♦ తీరుఁ దెల్పెను రోజుచున్. 326

-* శ్రీ వీరభద్ర జననము *-

చ॥ విని పరమాగ్రహంబుఁ గొని ♦ విశ్వగురుండు కఠోరఘోరగ
ర్జన మొనరించి యొక్కజడఁ ♦ జక్కఁ దెగన్గొని పర్వతాగ్రమే
దినిపయిఁ గొట్టినంతనె యు ♦ దీర్ణతరప్రళయాభ్రఘోషముల్
దనర ధగద్ధగచ్ఛవులు ♦ డాల్కొని వెల్గొనరింప నెల్లెడన్. 327

మ॥ ప్రళయార్కద్యుతియెల్ల విశ్వముపయిన్ ♦ వ్యాపింప దివ్యాయుధో
జ్జ్వలముల్ హస్తసహస్రముల్ వెలయ దీ ♦ వ్యద్విక్రమాంచత్కళా
లలితాకారుఁడు వీరభద్రుడు మహో ♦ ల్లాసంబునన్ బుట్టె న
క్కాలన్ బొల్చెను భద్రకాళి యటులే ♦ కీర్తింప వైమానికుల్. 328

క॥ వారలతోడనె పొడమెను, భూరితర కృపాణపాణి ♦ భూతవితతులున్
ఘోరజ్వరములు తనువుల, తో రాజిల్లుచును దోడు ♦ తోడ రయమునన్.

ఆ॥ పొడమి యిట్లు వీర ♦ మూర్ధన్యుఁ డీశ్వరుఁ, జేరి సాఁగి మ్రొక్కి ♦ శిరసువంచి
ఏమిసేయవలయు ♦ నెఱిఁగింపు మిఁక నాకు, సకలభువననికర ♦ చక్రవర్తి!

సీ॥ ఇంకఁగఁ జేతునా? ♦ యీ సప్తసాగర, సలిలంబు లన్నియు ♦ జలధితూణ!
పిండియొనర్తునా? ♦ పేర్మి నీకులపర్వ, తముల మొత్తమ్ముల ♦ ధర్మనిరత!
ముక్కలు చేతునా? ♦ దిక్కరీంద్రంబుల, యక్కుంభతలముల ♦ ననఘచరిత!
కసవొనరింతునా? ♦ కమలజాండములెల్లఁ, గదిసి చేపట్టి గం ♦ గాజటాల!

గీ॥ చిదిమివైతునె? భాస్కర ♦ శీతకరుల, గరుడ గంధర్వ యక్షరా♦క్షస నిలింప
సిద్ధమునిచారణోరగ ♦ శ్రేణిఁబట్టి, హింస యొనరింతునా? బల్జి♦ఘూంస మెఱయ.

గీ॥ నీకరుణ నన్ను మించిన ♦ లోకశూరుఁ, డెందులేఁడిది నిక్కువం♦బిందుభూష!
ఎద్ది సెప్పిన నొనరింతు ♦ నిపుడె వేగ, సెలవొసఁగి పంపుమా దృతిఁ♦జేసి జనక!

వ. అనిన మహేశ్వరుం డిట్లనియె.

క॥ సవనములో దక్షుఁ జదువు, మవినీతుని నీవు మామ ♦ కాంశపరిభవ్రం
డవు నీచేఁ దెగుదుఁ డిఁకన్, దివిజులు మునిజులును నేని ♦ దీవ్యచ్ఛక్తిన్. 333

క॥ అని నుడువఁగఁ బరితోషముఁ, గొని సాఁగిలి మ్రొక్కి సెలవుఁ♦గొని కాళికతో
ననుచర వర్గంబులతో, ఘనభూతప్రతితితోడఁ ♦ గదలె రయమునన్. 334

-* శివుని సెలవుచే వీరభద్రుండు దక్షయజ్ఞంబున కరుగుట *-

వ. అంత నవ్వీరుం డయుతసింహంబులు పూన్చిన దివ్యస్యందనంబుపై నెక్కి సింహ శార్దూల గజ తురంగ బలీవర్దంబుల నెక్కి సాయుధులై వచ్చు మూఁడుకోట్లు రుద్రగణంబులతో వెడలుడు భేరీనాదంబులు శంఖనిస్వనంబులు పటహఝల్లరీ కాహళమృదంగఘంటా వేణువీణాడమరుఘటధ్వానంబు లొనరింపుచు పారిషద బృందంబు లనేకంబులు ముందు నడచిరి. ఇఁక గణపాలురగు శంకుకర్ణుండును, అమోఘుండును, కోకిలుండును, కాష్టాంగుష్టుండును, సుమంతకుండును, కాక పాదోదరుండును, సంతానకుండును, మహాబలుండును, మధుపింగుండును, పూర్ణ భద్రుండును, జతుర్వక్త్రుండును, విరూపాక్షుండును, సంవర్తకుండును, లకులీశుం డును, లోకాంతకుండును, దైత్యాంతకుండును, అశనియు, బాలకుండును, గపా లీశుండును, సందారకుండును, కుండవిష్టంభకులును, సన్నాదుండు, పిప్పిలుండును, జంద్రతాపనుఁడు, మహావేశుఁడును, కాలకాలకమహాకాలురును, అగ్నికృత్తును, అగ్నిముఖుఁడును, ఆదిత్యమూర్ధుఁడును, వికృతుఁడును, విశాఖుఁడును, సర్వాంక కుఁడును, జ్వాలావేశుఁడును, బర్వతకుండును, క్షేత్రపాలకుండగు భైరవుండును,

సుకేశీవల్లభుండగు నందీశుండును, సర్వసేనానియగు జండీశుండును, మహాగణేశ్వరుండగు మణిమంతుండును ననేకకోటిప్రమథభూతవీరసైన్యంబులతో ననుగమించిరి. ఇక భద్రకాళియు, విభుని పిఱుంద సింగంబెక్కి సాయుధయై సాయుధలగు మహాకాళీ, గౌరీ, కాత్యాయనీ, చాముండా, ముండమర్దినీ, భద్రా, వైష్ణవీ, ఈశానీ, నారసింహీనామక నవదుర్గలతో శాకినీ, ఢాకినీ, కూశ్మాండీ, పర్వటీ, చటికాజ్వర,బలంబులతోఁ జతుష్షష్టియోగినీచక్రంబుతో, నాసురీ, యక్షిణీ, మోహినీ బలంబులతో ననుగమించెనంత శివాజ్ఞం జేసి యవ్వారిపైఁ గల్పవృక్షపుష్పవర్షంబును సుగంధపవమానప్రచారం బమరి శుభశకునంబులేపొందె నంతఁ గనఖలంబందలిదక్షాధ్వరశాలయందు దుర్నిమిత్తంబులు పెక్కు లుత్పన్నంబులగుచునుండె.

సీ॥ భానుమండలముపైఁ ♦ బరివేషములు చుట్టె, తారాగణంబులెం ♦ తయును దుల్లె
కదఁగి వెన్నంటను ♦ ల్కావృష్టిచెలరేఁగె, శోణితవృష్టులె ♦ చ్చోటనుమిత్తె
గొప్ప సర్పంబులు ♦ గూలి కూయుచునుండె, వృశ్చికవర్షముల్ ♦ విస్తరిల్లె
ఖరవాతముల్ మెండు ♦ గా నేచివీచె ధ, వళవృశ్చికంబులు ♦ పొలచెఁబుడమి.

గీ॥ దక్షువామాక్షియును వామ♦పక్షములును, బెక్కుతడవలదిరె మఱి♦యుక్కుమిగిలి
గృధ్రములు దక్షుతల ముట్టి♦కెరలుచుండె, శలభములు నిండె నధ్వర♦శాలనెందు.

వ. అంత.

చ॥ తనరెఁబరాగ ముత్తరప ♦ థమ్మునఁనుండి యఖండభఁగి నిం
గిని బుడమిన్ నిరంతరము ♦ గీల్కొని జీఁకటిఁ బర్వజేయుచున్
వినఁబడె వీరహుంకృతు ల ♦ విస్ఫుటభైరవరావఘోరణుల్
మునులు సదస్యులున్ విని గు ♦ ముల్గొని కంపితచిత్తులై రటన్. 337

-* ఉత్పాతంబులకు వీరిణి మున్నగువారు భయపడుట *-

వ. అందువీరిణి మొదలగు దేవీజనంబులెల్ల రాఘోరంబులన్నియుఁ గ్రమంబుగఁ గాంచి వగచుచుఁ దమలో దక్షునిఁగూర్చి యిట్లు దలంచిరి.

ఉ॥ కూఁతును గోలుపోయెఁ బయిఁ ♦ గూలఁగ వచ్చె విపత్తు మోఱకుం
డీతఁడు కాలకాలుని మ ♦ హేశ్వరుఁ జుల్కనఁజేసి జన్నమున్
నీతివొరంగి యిట్లు లతి ♦ నిందితభంగిఁ గడంగె నెక్కడో
పాతకమిద్ది మిన్నకయ ♦ పాయునె డాయునుగాక దోడుతోన్. 339

క॥ ఇట్లు లనుకొనుచున్నంత ♦ నేగుదెంచి, రకట వికటాట్టహాసంబు ♦ లత్యుదగ్ర
భీమనాధ్వానములు మిఱఁ♦బ్రమథులవీర, భూతవర్యులు దళములు♦ముట్టికొనఁగ.

చ॥ పొడఁగని వేల్పులున్ మునులు ♦ పొంకము దప్పి కడున్ భయంబునన్
వడఁకుచు నల్గడ ల్గనుచు ♦ వాయిడి కూయుచుఁ దత్తరిల్లుచున్
వడిఁ బఱగెత్తి పోవుచును ♦ వచ్చుచుఁ జచ్చితిమంచు నొచ్చుచున్
పడుచును లేచుచున్ మిగుల ♦ బాలిశులై విలపించి రెంతయున్. 341

వ. అయ్యవసరంబున

గీ॥ దర్పమంతయుఁ గోల్పోయి ♦ దక్షుఁడును ద
దీయ ముఖ్యానుచరులును ♦ దోయజాక్షుఁ
జేరి యభయంబు గోరుడు ♦ శ్రీదయితుఁడు
వీరభద్రుని రాక భా ♦ వించి మదిని. 342

ఉ॥ తానును జంకునొంది యల ♦ దక్షునితో న నె యాజి ! నీవు దు
ర్మానముఁ జెంది యుగ్రు నస ♦ మాను మహామహు నిందఁ జేసి యీ
కానని జన్మ మొందితివి ♦ కల్మషమున్ వడిఁ గట్టికొంటి వి
ష్ణేను గడంగినన్ విడువ ♦ దీవినిపాతము సర్వభంగులన్. 343

శా. నేనున్ ధాతయు నీతిమాలి యిటులన్ ♦ నీయాగమున్ జేరి యెం
తేనిన్ భంగముఁ జెందనుంటి మదియ ♦ ల్లేయా నిఁకన్ దివ్యులున్
మానుల్ లెక్కకు వచ్చువారె దఱిసెన్ ♦ మాద్యద్భట శ్రేణితోఁ
దానై రుద్రుఁడు వీరభద్రుఁ డెటులన్ ♦ దప్పింతు నీభంగముల్. 344

-* ఇంద్రాదులు వీరభద్రునితో యుద్ధము చేయుట *-

గీ॥ అంతలోన నె యజ్ఞశా ♦ లాంతరాళ
మునకుఁ జేరిన యవ్వీర ♦ జనులఁ జూచి
యింద్రుఁడును నగ్ని యముఁడు నై ♦ రృతుఁడు వరుణ
గంధవాహు లెదుర్కొని ♦ కడఁగిరాజి. 345

క॥ చండీశుం డశని విశా, ఖుండును దైత్యాంతకుండు ♦ గోకిలుఁడు నమో
ఘుండు ననువారు వారల, దండిగ నెదిరించి తాఁకి ♦ దర్పంబెసఁగన్. 346

క॥ వారువముల నరదంబుల, సారెకు మర్దించి వారి ♦ చటులాయుధ వి
స్తారంబుల దూరంబునఁ, జూరున్ బొనరించి మెయులఁ ♦ జొనిపిరి శరముల్.

మ॥ మఱియున్ బైఁబడి చంపఁగాఁ దలఁచి య ♦ మ్మాహేశ్వరగ్రామణుల్
దఱియన్ వచ్చుటఁ జూచి వేగముగ న ♦ ద్దంభోళిభృన్ముఖ్యులం
దటు భీతిన్ గొని పాఱిరంత మునులున్ ♦ దామోదరున్ జేర న
క్కఱివేల్పావహమొందఁగాఁ దలఁచి చ ♦ క్కన్ నిల్చెఁ జక్రంబుతోన్.

ఉ॥ శంభుసుతుండు చూచి మధు ♦ శాసన! యుద్ధమొనర్ప వచ్చితే
కుంభిని నిన్నుఁబోల్పఁదగు ♦ కోవిదుఁ డొక్కఁడు గానవచ్చునే?
శంభునిఁ గొల్చి తద్దయును ♦ సారభుజాబలం మొంది యుక్కునన్
శుంభదరీంద్రసంఘముల ♦ స్రుక్కఁగఁ జేయవె పెక్కుమార్లిలన్. 349

ఉ॥ ఎక్కడనుండి చక్రము ర ♦ మేశ్వర! చెందితి వింత విస్మయం
బెక్కడనుండి దాపరిలె ♦ నింతయుఁ గన్గొనఁగూడదే మదిన్
జక్కఁగనిల్వు నీదయిన ♦ శక్తిని జూచెద నంతయున్ గదున్
బెక్కులు వాకులేల యిఁక ♦ వీఁకఁదొడంగు మణంగు బింకముల్. 350

గీ॥ కనవె? దాక్షాయణీపాత ♦ మనఘమూర్తి!
వినవె? మునివర్యుఁడగు దధీ ♦ చుని హితోక్తి
కడఁగిచేరితె యజ్ఞభా ♦ గమును జెంద
గిట్టదే? నీకు శివునకే ♦ క్రేవనేని. 351

మ॥ అనినన్ దానవవైరి యంత విని దా ♦ నాటోపమున్ జెంద కి
ట్లనె రుద్రాత్మజ! భద్రమూర్తి! విను నా ♦ యాంతర్యము న్నేను శ
ర్వునెడన్ ద్వేషినిగాను భక్తుడనె నే ♦ ర్పున్ దక్షు యిట్టి మఖం
బును జేరన్ జనుదెంచుటే యఘముగాఁ ♦ బోల్చున్ విధిప్రేరణన్. 352

ఉ॥ ఈతఁడు నాకు భక్తుఁడయి ♦ హెచ్చుగ వేడుటఁ జేసి యాసవం
బీ తెఱఁగొందియుంటిని మ ♦ హేశ్వరుఁ బిల్వమి నారయంగ లే
దీతని కిందు బాసట వ ♦ హింపక యుండిన నాడికొందురున్
జేతము తీరుఁ దెల్పితిని ♦ చేయుము జేవమొసంగఁగా ననిన్. 353

సీ॥ అవలఁగానున్నదగు విజ ♦ యంబునీక, యగును సందియమేమిలే ♦ దయిననన్నుఁ
గడిచి దక్షునిఁ జేరు ని ♦ క్కచ్చియిద్ది, దైవదూషకులకు మేలు ♦ దారసిలునె.

-* విష్ణు వీరభద్రుల యుద్ధము *-

చ॥ అనుటయు వీరభద్రుఁడు ప్రి ♦ యంబెడఁజెందియు నట్లె యానుగా
కని దనుజాంతకున్ గదసి ♦ యక్కజమొందఁగఁ బెక్కుకైదువుల్
దనువునఁ గ్రుచ్చి యున్నతవ ♦ దం బొనరించె రయంబుమీఱ న
వ్వనజవిలోచనుండు శర ♦ వర్షము వీరునిపైఁ దనర్చుచున్. 355

సీ॥ పాంచజన్యంబు నూఁదిన ♦ పాటినట్టి, వాసవుఁడు మున్నుగాఁ గల ♦ వారు మరలి
వీరబలములతోఁ బోర ♦ వెడలి రంత, వీరభద్రుఁడు చండీశ ♦ భైరవులును. 359

సీ॥ వీరవర్యుల గణపాల ♦ ధీరవరుల, యోగినీచక్రమునుగూడి ♦ రేఁగి సురల
నెల్లఁబసివట్టి మర్దించు ♦ టెఱిఁగియురగ, శయనుఁడవ్వారిపై సుద ♦ ర్శనము నేసె.

చ॥ అదిగని యొక్కవీరుఁడు ర ♦ యంబున లాగి గ్రసించుచుండ న
ప్పదనునఁ దోయజేక్షణుఁడు ♦ పర్వునవచ్చి గణేంద్రు వక్త్రమున్
వదలిచి చక్రముం గొని జ ♦ వంబున నాత్మరథంబుఁ జేరె న
య్యదిగని వేల్పులెల్లరును ♦ నాసల బాసిరి సంగరమ్ముపై. 358

ఉ॥ అంత మహాత్ముఁడైన హరి ♦ యక్కజమై తగు యోగవిద్యచే
నంతములేని విష్ణుల మ ♦ హాత్ముల శంఖసుదర్శనాంకులన్
వింతగ సంతరింపఁ గని ♦ వీరుఁడు రుద్రమయంబు నస్త్రమున్
బొంతనచేసి కాల్చె నల ♦ భూరిసుదర్శనపాణు లందఱన్. 359

క॥ ఆ తరువాయినె వెన్నునిఁ, జేతి త్రిశూలంబుతోడఁ ♦ జేవఁ బొడువఁగా
నాతఁడు గడునొచ్చి పడిన్, భూతలమునఁ బడియె సురలు ♦ మునులున్
[బొగలన్. 360*

ఆ॥ కొంతవడికి లేచి ♦ క్రోధరక్తేక్షణుఁ, డగుచు గూఢపాచ్ఛ ♦ యానుఁ డార్చి
వీరభద్రుపైన ♦ విసరివేయఁగఁ జక్ర, మీక్షసేయఁగని మ ♦ హేశసుతుఁడు.

---

* శివపురాణే సతీ ఖండే సప్తత్రింశ దధ్యాయే — శ్లో॥ అథ విష్ణుర్మహా తేజాః । చక్రముద్యమ్య మూర్ఛితః...యుయుధే భగవాంస్తేన । వీరభద్రేణ మాధవః ॥ తయోస్సమభవద్యుద్ధం । సుఘోరం రోమహర్షణం । మహావీరాధిపత్యోస్తు । నానాస్త్ర ధరయోర్మునే ॥ విష్ణోర్యోగ బలాత్తస్య । దేహాదేవ సుదారుణాః । శంఖ చక్ర గదాహస్తాః । అసంఖ్యాతాశ్చ జజ్ఞిరే ॥ తేచాపియుయుధుస్తేన । వీరభద్రేణ భాషతా । విష్ణువద్బలవంతోహి । నానాయుధ ధరాగణాః ॥ తాన్ సర్వానపి వీరోసౌ । నారాయణ సమప్రభాన్ । భస్మీ చకార శూలేన । జ్ఞాత్వాన్స్మృత్వా । శివం ప్రభుం ॥ తతశ్చోరసితం విష్ణుం । లీలయైవరణాజిరే । జఘాన వీరభద్రోహి । త్రిశూలేన మహాబలీ ॥ తేన ఘాతేన సహసా । విహతః పురుషోత్తమః । పపాతచతథాభూమౌ । విసంజ్ఞోభూన్మునేహరిః ॥ క్రోధరక్తేక్షణశ్శ్రీమాన్ ॥ తత ఉత్థాయ సప్రభుః । ప్రహర్తుం చక్రముద్యమ్య । అతిష్ఠన్ పురుషర్షభః ॥ తస్యచక్రం మహారౌద్రం । కాలాదిత్యసమప్రభం ॥ వ్యష్టంభయ దదీనాత్మా ॥ వీరభద్రశ్శివాత్మజః ॥ మునే శంభోః ప్రభావాత్తు । మాయేశస్య మహాప్రభోః । నచచాల హరేశ్చక్రం । కరస్థం స్తంభితం ధ్రువం ॥ అథ విష్ణుర్గణేశేన । వీరభద్రేణ భాషతా । అతిష్ఠత్ స్తంభితస్తేన । శృంగవా నివనిశ్చలః ॥ తతోవిష్ణుస్తంభితోహి । వీరభద్రేణ నారద । యజ్ఞోపమంత్రిణ వశాత్ । స్తంభనిర్ముక్తిమాయయా ॥ శార్ఙ్గం జగ్రాహ సక్రుద్ధః । స్వధనుస్సశరం మునే । త్రిభిశ్చ ధర్షితో బాణైః । తేన శార్ఙ్గం ధనుర్హరేః ॥ వీరభద్రేణ తత్రావ । త్రిధాభూత్ తత్ క్షణాన్మునే । అథ విష్ణుర్మహావాణ్యా । బోధితస్తం మహాగణం ॥ అసహ్యవర్చసంజ్ఞాత్వా । అంతర్ధాతుం మనోదధే । విష్ణౌ మయిగతే చైవ । దేవాశ్చ మునిభిస్సహ । విసర్జితా గణైస్సర్వే । ఏతే యజ్ఞోప జీవినః ॥

చ॥ శివునిఁ దలంచి చక్రిమును ♦ శ్రీపుభుజంబును స్తంభ మొందున
ట్లవిహతతేజుఁ డా భుజగ ♦ హారకుమారుఁ డొనర్పనప్డు కే
శవుఁడును మంత్రవేదులగు ♦ సన్మునివర్యుల మంత్రశక్తి బా
హువును గదల్పఁ జక్రము స ♦ ముద్గతిఁ జెందకయుండె స్తబ్ధమై. 362

వ. అంత నద్దానిన్‌గాంచి యచ్యుతుండు

గీ॥ తివిరి సశరంబు శార్ఙ్గంబుఁ♦ద్రిప్పివీర, భద్రుపై వేయ నాతండు ♦ వడిఁ ద్రిశూల
ధారఁ దుత్తునియలుచేసె♦దానినంత, దవులఁగని నల్వ హరిచాటు♦దటిసి యనియె

క॥ కానున్నది యగు నిట నే, మేనియు నొనరింప లబ్ధి ♦ యెసఁగదు వీరల్
గానని తెఱఁగున వీండ్లకుఁ, బోనగునని హెచ్చరింపఁ ♦ బురుషోత్తముఁడున్,

వ. సమయోచితంబుగ విధివచనంబుతీ రనుష్ఠింప నెంచి సమరావనిన్ దొలంగి సూక్ష్మరూపంబు నొంది నిజధామంబుఁ జెందెఁ బద్మజుం డట్టులె యొనర్చె వద్ది యారసియు వీరభద్రుండు శివానుమతితో నుపేక్షించె నంత. 365

## —* వీరభద్రుఁడు యజ్ఞ శిరచ్ఛేదనంబు చేయుట *—

గీ॥ యజ్ఞమును భీతినొంది మృ♦గాకృతిన్ వ, హించి యాకసమునఁబరుఁ♦గెత్తుటరసి
వాఁడినారసమున శిరః ♦ పాతమొనరఁ, జేసె శ్రీవీరభద్రుండు ♦ వాసిమెఱయ

క॥ మునియగు నంగిరసుఁ గృశా, శ్వుని ధర్మ నరిష్టనేమి ♦ సువిదితు దత్తుఁ
ఘనుఁడగు కశ్యపునిఁ బదం, బున శిరములు మెట్టి కడిమి♦పొలుపెడలించెన్.

గీ॥ మఱియుఁ గొందఱు మునులను ♦ మట్టగించి
రిఁకను స్వాహాదులావేల్పు ♦ టిగురుఁబోండ్లు
బుగులుకొనునట్లుగాఁ గొంద ♦ ఱెగిచి నగిరి
వఱచు సురలను గొందఱు ♦ పట్టుకొనిరి, 368

క॥ కొందఱు ప్రాగ్వంశంబును, కొందరు పత్నీభవనముఁ ♦ గొదగొనికడిమిన్
గొందఱు సదస్యశాలను, గొందఱు నాగ్నీధ్రశాలఁ ♦ గూల్చిరి వేగన్. 369

ఉ॥ కొందఱు కుండమేఖలలఁ ♦ గూల్చిరి కొందఱు యజ్ఞ పాత్రలన్
జిందఱ వందతూనటులు ♦ చేసిరి కొందఱు వహ్నులార్పిరిం
కం దురుసైన కొందఱు వ ♦ గన్ గొని కుండములందు మూత్రమే
పొందుచుఁ జేసి రిట్టు లెదు ♦ రొక్కఁడు లేకయె మించుపూన్కిమై. 370

వ, అంతవీరభద్రుండును, మణిమంతుండును, నతదియుఁ, జండీశ్వరుండును యజమాన భృగు భగపూషలన్ బట్టికొని తిగిచి పదంబులచేఁ గంఠంబులను మెట్టి.

—* భృగ్వాదిమునుల శిక్ష - వీరభద్రుఁడు దక్షునిఁ జంపుట *—

సీ॥ భృగునిమీసల నూడఁ♦బెఱికె మణిమంతుఁ, డెవఁడు సభన్ మీస♦లెత్తి త్రిప్పె
భగుని కన్గవ నంది♦పట్టి కోసె శపించు, దక్షునెవ్వఁడు కంటఁ ♦ దానలర్చె
పూషుపండ్లను డుల్చెఁ♦బూన్కి చండీశ్వరుఁ, డెవఁడీశుఁ దిట్టుట ♦ కెగసి నవ్వె
దక్షునిశిర మసి♦ధార వీరప్రభుం, డంత మొందించియు ♦ నంత దాని

గీ॥ శస్త్రములఁ ద్రెంపలేక వి ♦ స్మయముఁ జెంది
సంజ్ఞపన యోగబలిమి మ ♦ స్తమును ద్రెంచి
దక్షిణాగ్నిని వేసి ద ♦ గ్ధంబొనర్చె
ప్రమథవీరులు సాధువా ♦ దములొనర్ప. 372

ఆ॥ పుష్పవృష్టి గురిసెఁ ♦ బురవారు తనయుపై, వీరవితతిపైన ♦ వెల్లివిరిసి
జయజయధ్వనులు ప్ర ♦ శస్తిమీఱఁగ నంతఁ, జనిరి రజతగిరికి ♦ శర్వుఁ జేర.

వ. సులభసంప్రాప్తవిజయులై మహామోదంబుతోఁ బరమేశ్వరునిఁ జేరి మ్రొక్కి విజయంబుఁ దెల్పినఁ బరమశివుండుఁ బరితోషంబుఁ జెంది వీరభద్రున్ గారవించి గణాధ్యక్షు నొనర్చె నంత యజ్ఞం బట్లు భగ్నంబై ఛిన్నభిన్నాంగులైన ఋత్విక్సురమునిగణంబులన్ జూచి తక్కటివారంద అజునిఁదోడ్కొని వైకుంఠ పురంబునకరిగి యురగశయను దరిసించి మ్రొక్కి యవ్విధంబెల్లఁ దెలిపి యనుగ్రహించి దేవమునిరక్షణం బొనర్పుమని వేఁడుడు బుండరీకలోచనుం డిట్లనియె. 374

క॥ తేజోమయుఁడగు పురుషుని, పై జనుఁ డపరాధియగుచు ♦ బ్రదుకునె యెందున్
యోజింపఁదగదె యిట్టుల, నే జడుఁ జేనియును గడిఁది ♦ యింగితమెసఁగన్.

మ॥ మనమెల్లన్ బరమేశ్వరున్ మఖవిభున్ ♦ మాన్యున్ వెలింజేసి ద
క్షునియాగంబునఁ జూఱగొంటిమి హవి ♦ స్తోమంబు లిద్దైన నా
ఘుననిన్ గారుణికాగ్రగణ్యుని జగ ♦ త్కల్యాణమూర్తిన్ రయం
బున నంఘ్రుల్గొని "క్షమ్యతా" మని కడున్ ♦ బొల్పొప్పఁ వేడన్ దగున్. 376

క॥ ఎవఁడలిగినఁ జెడు జగ మా, శివుని సతీవిధురు వేగఁ ♦ జేరి క్షమింపన్
స్తవములొనరించి శ్రద్ధయ, సవనము రక్షింపవలయు ♦ సముచితమిదియా. 377

ఉ॥ ఈమును లీసురల్ నలువ ♦ యీవును నేనును బాకశాసనుం
డే మహనీయువీర్యబల ♦ మిట్టిది తత్త్వమిఁకట్టి దంచు సుం
తేమి యెఱుంగఁజాలము మ ♦ హేశ్వరుఁడట్టిఁడు వేఱ్రతోవతో
నేమెయి మెచ్చు నవ్వెరవు ♦ నెవ్వఁడు సేయు స్వతంత్రుపైనటుల్. 378

గీ॥ అనియిటులు చెప్పి వైకుంఠు♦డఖిలసురల, మునులఁగొని నల్వతో వేగఁ♦బురహరేష్ట
వాసమై పొల్చునట్టి కై♦లాసశైల, రాజమునకేగి భయభక్తు♦లోజమెఱయ.

గీ॥ జన్మయోగతపోమంత్ర ♦ సమ్యగోష, ధులను సిద్ధులౌ వారల♦కలవియైన ప
రులకుఁబోరాక దివ్యాప్స ♦ రోజనముల, సకలగంధర్వ వితతుల ♦ సంగతమయి.

—* కైలాసగిరి వర్ణనము *—

క॥ నానాధాతువిచిత్రిత, నానామణిమయశిరోఘ ♦ నంబయి యింపై
నానామృగతతియుతమై, నానాపాదపలతాభి ♦ నందిత మగుచున్. 381

సీ॥ ఇష్టఫలములీగి ♦ కెందు సిద్ధులఁబిల్చు, గల్పద్రుమములు శా ♦ ఖాకరముల
కిన్నరయువతులు ♦ కేరి గానంబుసే, యుదురెందుఁ ద్రిపుర ♦ జయోగ్రగాథ
సందడించెను సతీ ♦ స్నానపుణ్యతరోద, మై నంద యెచ్చోట ♦ నద్భుతగతిఁ
గవ్రింపుటనఁటుల ♦ కంచెలతో నెందు, నళినీపులినము లా ♦ నందమొసఁగు

గీ॥ ఘనమయూరంబు లెందుఁ గే ♦ కల నిగుడ్చు
మూర్ఛనలొనర్చు మత్తాళి ♦ పుంజమెందు
పికములు కుహూధ్వనులనెందుఁ ♦ బెచ్చు సేయు
నెన్న లెచ్చోట గిరియాన ♦ మెలమిఁజూపు. 382

వ. అట్టి శ్రీకైలాసపర్వతంబునందు.

సీ॥ ఎలమావులును నిమ్మ ♦ లీత చిట్టీతలు, పారిజాతములు మం ♦ దారతరులు
పొన్నలునున్ సుర ♦ పొన్నలుఁ బొగడలు, గన్నేర్లు సంపఁగుల్ ♦ గాంచనములు
రేఁగులునుగ్ గంగ ♦ రేఁగులునుగ్ గొండ, గోఁగులుఁ బనసలుఁ ♦ గొడిసెగములు
దబ్బలునున్ నార ♦ దబ్బలున్ నారిక, డములునగాసలుగ్ ♦ గ్రముకములును

గీ॥ వెలగలిప్ప లుసిరికలు ♦ వేపతరులు, మేడినేరేడుమద్దిమా ♦ రేడుగములు
తాళ్ళుచించలుచీఁకటి♦తరులుమఱ్ఱి, మాకులునురావిమాకులు♦జోకమెఱయ.

గీ॥ తియ్యమామిడి రసదాడి♦తేనెయరఁటి, తీయదానిమ్మ గజనిమ్మ♦తెగలు మఱితు
రంజి నారింజగములు హే♦రాళమైన, వెదురుకోనలును బలాశ ♦ వృక్షరాజి.

గీ॥ పుష్పితాశోకములు మల్లె♦పొదలు జాది, తోఁపులును బండిగురివింద♦తోఁపు లేపు
మీఱు బంగారుతామర♦మ్మేల్మిరంగు, రంగులొప్పెడు కలువలు♦గల సరసులు.

క॥ ఏలకితీఁగెలు తాంబూ, లీలతలు లవంగలతలు ♦ లేఁబోకలునుగ్
మేలిమిజాతులు పలు త, క్కోలకముల వరుసలెంతొ ♦ తోసంబిడెడుగ్. 386

క॥ పలురకముల ద్రాక్షల పం, దిళు లెలతయు వింతఁగొలుపు ♦ తీయనఁదగు పం
డులగుత్తులఁ దనియుచు రా, చిలుకలు విందొంది పాడ ♦ శివమంత్రంబున్.

సీ॥ ఇభములు సింహశ♦రభముల్ పులుల్ గదు, పులు నొక్కయెడ నేస్త♦మున వసించు
అడవిపోతుల యొరి♦పిడి నొప్ప హరిచంద, నముల గాడ్పు లలరించు ♦ నమరులమది
రక్తకంఠఖగస్వ♦రముల మేళముఁ జెందు, షట్పదమండలీ ♦ స్వరసరణులు
కలహంసకులపతుల్ ♦ కడఁగి చెప్పును శత, రుద్రీయ పాఠముల్ ♦ రుచ్యముగను

గీ॥ పచ్చలే మెట్లుగఁ దనర్చు♦పద్మసరసు, లింపు మెయిఁ బుణ్యకాంతల♦కిచ్చు ముదము
హాంకమగు పెండిబంగరు ♦ పుష్పకములు, మేలిరతనాల గద్దెల ♦ మేలుమీఱు.

ఉ॥ కోతులు కొండముచ్చులును ♦ క్రోడములున్ బులులున్ సివంగులున్
వాతమృగంబు లెల్గులును ♦ బస్తము లాలును నెద్దులున్ మనుం
బోతులు సింగముల్ శరభ♦ముల్ హరిణంబులు పాఁడిగేదెలున్
బోతులు గోడిగల్ హరులు ♦ బొంకపు నాభిమృగంబు లొప్పెడున్. 389

సీ॥ రుచుల "విశ్వాధికో♦రుద్రో మహర్షి"య, నుచుఁ బాడు కలహంస♦నిచయములును
దూషి "సర్వో హ్యేష♦రుద్ర" యం చొగిగాన, మొనరించు ధార్తరా♦ష్ట్రనివహములు
ఎలమి "నీశావాస్య♦మిద" మని బోధించు, రాజహంస మనీషి ♦ రాజచయము
లలి "శివ ఏవ కే♦వల" యనుమనువును, జపియించు మల్లికా ♦ క్షసముదాయ

గీ॥ ములును గుండలిశక్తియ ♦ మ్మలక లరసి, యూసహస్రారచక్రంబు♦నధిగమించి
అక్షరంబైన పరమశి♦వార్చి నొంది, యలరు చక్రాంగసంఘంబు♦లమరియుండె.

సీ॥ అచటియాలున్ బాల♦నహరహంబర్థిమై, శివలింగమున కభి♦షేక మొసఁగు
అచటి పుష్పలతాళి♦యభవలింగముపయి, సుమముల రాల్చు ని♦త్యమును బ్రీతి
అచటిమాలూరంబు ♦ లర్పించు దళముల, నంతకాంతకునకు ♦ ననుదినంబు
అచటిఫలద్రుమ ♦ లనవరతము పండ్ల, నైవేద్య మొసఁగు బ♦న్నగధరునకు

గీ॥ అచటికోలంబనికురంబు♦లవిరతంబు, మధువుఁ బానీయమిడు నబ్జ♦మండనునకు
అచటి జంతువు లెల్లఁ బ్ర♦త్యహమునిష్ఠ, ధ్యానయజ్ఞంబు సేయున♦ధ్వరపతికయి.

వ. ఇఁక నాకలధౌతశైలమధ్యప్రదేశంబందు,

గీ॥ యోజనశతంబు పొడవు పా♦దోనముగను, విరివి దైవాఱ శాఖల♦ వెలసి కొండ
నెల్లఁ దఱుఁగని నీడ. శో♦భిల్లఁదగి ము, ముక్షుశరణం బయినవట♦భూజమందు.

సీ॥ అలుకను బాసిన ♦ యంతకుఁ బోలి సు, ఖాసీనుఁడై యున్న ♦ యట్టివాని
శాంతాత్ములై తగు ♦ సనకాది సిద్ధుల, చే సేవలను జెంది ♦ చెలఁగువాని
జక్కులకును నల ♦ రక్కసులకు దొర, యా కుబేరుని పూజ ♦ లందువాని
విద్యాతపోయోగ ♦ విభుఁడై తదీయాధ్వ, మొంది విరాజిల్లు♦చున్నవాని

గీ॥ తపసులకు నిష్టమగు జటా♦దండ భస్మ, చర్మముల నెలరేకను♦సాంధ్యగగన
రుచి నలరు గాత్రిమెలమిఁ దా♦లిచినవాని, విశ్వమంగళములను న♦ర్పించువాని.

—* విష్ణ్వాదులు శివుని దరిసించి ధ్యానంబొనర్చుట *—

సీ॥ దర్భమయంబయి ♦ తనరిన బృసియందు, నుపవిష్టుఁడై సిరి♦నున్నవాని
సజ్జనుల్వినఁగ శా♦శ్వతపు బ్రహ్మంబు నా, రదునకుఁ జెప్పుచుఁ ♦ బొదలువాని
కుడితొడన్ జేరిచి ♦ యెడమకాలిని నెడ్మ, మోకాలిపయిఁ జెయిఁ ♦బూనువాని
రాణింపఁ దర్కము ♦ ద్రినుజెంది యొకచేత, నొకచేత జపమాల♦నొందువాని

గీ॥ బ్రహ్మనిర్వాణ సుఖమున ♦ బరఁగువాని, యోగపట్టంబుఁ గట్టి చె♦న్నొందువాని
మునులకెల్లరకాద్యుఁడై ♦పొలుచువానిఁ, బరమశివు నచ్యుతాదులొ♦సురలుగనిరి.

గీ॥ నంది సెలవొంది డగ్గఱి ♦ వందనము లొ, నర్చి శిరసుల నంజలుల్ ♦చేర్చి నిలిచి
రభవుఁ డరవిందనయనున♦కజునకును బ్రి, ణతులొనర్చి యొసఁగెనాస♦నములనంత.

వ. నారాయణుం డిట్లనియె.

గీ॥ ఎఱుఁగుదుము నిన్ను విశ్వేశ ♦ నీ జగతికి, యోని బీజములై యొప్పు♦చున్న శక్తి
శివులకును గారణంబయి ♦ చెన్నుమీఱు, నా నిరంతర బ్రహ్మంబ ♦ వయ్య నీవు.

గీ॥ సరవి స్వాంశములగు శివ ♦ శక్తులందు, నూర్ణపదమట్లు గ్రీడింపు♦చుండి జగము
బొడమఁగాఁ జేసి పోషించి ♦ యడఁతువీవు, నిర్వికారచిదానంద♦నిత్యరూప!

ఉ॥ నీవె త్రియీసురక్షణము ♦ నెట్టనఁ జేయఁగ నర్థ్వరంబు ముక్
బావన! పుట్టచేసితివి ♦ బల్లిదమై తగు సూత్రిమేర్పడన్
శ్రీ విలసిల్లు ధర్మమయ ♦ సేతువులన్ బొనరించినావు భూ
దేవులు వాని నైష్ఠిక మ♦తిన్ బొనరింత్రు వ్రితంబు నొందుచున్,

క॥ మంగళ! మంగళ కర్మల, కుం గావించెదవు స్వర్గ ♦ కూటము ముక్తిన్
బొంగఱి నిడెదవు పెఱల క,మంగళులకు నరక మెంచు ♦ మాఱదదియెకేఁ.

వ. అయినను

మ॥ బ్రితుకన్ జేయుము దక్షు నిష్ట భగనే ♦ త్రంబుల్ బ్రసాదింపు మా
ద్యుతి మీసంబులొసంగు మీభృగునకున్ ♦ దెప్పింపు దంతంబు లు
న్నతకారుణ్యమయాత్మ! పూష కిఁక జ ♦ న్నంబందు నీచేత శి
ఊతులా దివ్యులు బుత్విజుల్ సుఖతను ♦ శ్రీలొందఁ బాలింపుమా. 400

క॥ సమయించితి వలయజ్ఞశి, రము మరల సముద్ధరింపు ♦ క్రతు వెవ్వనిచే
నమరు ఫలసిద్ధి వానికిఁ గుముఖులు భాగంబునీక ♦ కూలిరి యట్టుల్. 401

క॥ ఇది గొనుము పూర్ణభాగం, బిది క్రితుశేషంబు రుద్రి! ♦ యిది నీయదియౌ
ముదమున నీభాగంబునఁ, బొదలఁగ నొనరింపు సవన ♦ పూర్తి మహేశా!

వ. అంత విరించి యిట్లనియె.

చ॥ చెఱు మదినొంది ఖేదగతిఁ ♦ జేడ్పడి కర్మమునందె నిచ్చలున్
సుడివడువారు లాఁతుల య ♦ శోధనముల్గని కుందువారు నా
చెఱుగులు మర్మముల్ దునియఁ ♦ జేయఁగఁ గూయుదు రన్యులట్ వడిన్
వడి నిఁకఁ జంపరట్టి విధి ♦ వంచితులన్ మిముబోటి సత్తముల్, 403

వ. ఇంద్రుండిట్లనియె,

క॥ వందనము నీలకంఠున, కిందుధరున కాద్యునకు మ ♦ హీయసునకు నా
నందైకహేతువునకు న, మందకృపామయతనునకు ♦ మహితాత్మునకున్.

క॥ ధాతలకెల్లర కీవె వి, ధాతవు త్రిగుణాత్ముఁడవు సు ♦ ధాకరమకుటా!
నేతలకెల్లర కీవే, నేతవు పాలింపుమిఁకను ♦ నీదు జనములన్. 405

వ. దివ్యమునిజనంబు లిట్లనిరి.

సీ॥ ఉచితరూపునకు స ♦ ద్యోజాతమూర్తికి, గదికి శూలికి ధన్వి ♦ కిదియె ప్రణతి
వామదేవునకును ♦ వామనేత్రునకును, వామమూర్తికి నిదే ♦ వందనంబు
ఘోరఘోరునకు న ♦ ఘోరమూర్తికిఁ బరే, శునకు వికటునకు ♦ జోత యిదియె
పురుషార్థదునకుఁ ద ♦ త్పురుషమూర్తికనాది, పురుషున కిదియె చే ♦ మోడ్పు సేఁత

గీ॥ ఇనున కీశానమూర్తికి ♦ నీశ్వరునకు, బ్రహ్మరూపునకును బర ♦ బ్రహ్మ కిష్ట
తనునకుఁ ద్రియాతనునకుసుం ♦ దరతనునకు, భక్తిఁ గావింతుమిదె యభి ♦ వాదనంబు,

వ. అంత నిలింపులఁ గాంచి బాలేందుశేఖరుం డిట్లనియె

ఉ॥ మోహముఁ జెందినట్టి యల ♦ ముగ్ధులదోసము నేఁ దలంపఁ బా
పోహనుజెంది తుల్క్రిన దు ♦ రుద్ధతమూర్ఖుల శిక్షఁ జేసితిన్
మోహితబుద్ధి దక్షుఁ డటు ♦ పూనిన జన్నము బన్నమొందె ని
ట్లో హరి! యో విరించి! వినుఁ ♦ డొప్పుగ సర్వము నిర్వహిల్లఁగన్. 407

గీ॥ అధ్వరికిబస్తమస్తకం ♦ బమరుమిత్రి, చక్షువునఁ జూచు భగుఁడు పూ ♦ ష యజమాన
దంతములచేత నమలుచుఁ ♦ దానుఁబిష్ట, భుక్కగు భృగుండ జశ్మశ్రు ♦ వులను జెందు.

—* శివానుగ్రహమున దక్షుఁడు జీవించుట *—

వ. మఱియు ఋత్విక్కు లశ్వినీదేవతల బాహువులచేతను, బూషహస్తంబులచేతను బాహుహస్తంబులఁ బడసి జీవింతు రట్లానత్వుండన్న నయ్యాదిమదేవుని నుడుల కఖిలర్షి జనంబు లలరి సాధువాదంబుల ధన్యవాదంబులనొనర్చి మ్రొక్కిరంతఁ బుండరీకాక్షుండును విరించియుఁ బరమశివుని సవనంబునకు భక్తిమెయి నామంత్రణంబు సేయుడు, మహాదేవుండు వార్షించి నందీశ్వరాదులతో నందుఁ జని యట్లొనరింపఁ జేయుడు నవ్వారెల్ల హరుసంబుఁ జెంద దక్షుండు నిద్రమేల్కొని

నట్లు లేచి కూర్చుండి ప్రబోధంబుఁ జెంది ముందఱనున్న శివున్ జూచినయంతనె శరత్కాలంబు నందలి హ్రదంబుఁబోలి యకల్మషచిత్తుండై పూర్వవైరంబు మఱచి శివ స్తవంబుఁ జేయఁబూనియు మృతిఁజెందిన కూఁతుఁదలఁచి దుఃఖంబున బాష్పపూరితనయనుండై యెద్దియుఁ బలుకఁజాలకున్న నెట్లొ హృదయంబు బిగ్గవట్టి యిట్లు మహేశ్వరుఁ బ్రస్తుతించె. 409

ఉ॥ వెక్కలు తిట్టినట్టి నను ♦ బిట్టుగ దండము చేసి తద్దిదా
నెక్కుడనుగ్రహంబుగనె ♦ యేర్పడె నా యెడ వెన్నుఁడీవు పెం
పెక్కఁగ బ్రహ్మబంధువుల ♦ నేనియు నన్నవసేయఁబూన రా
చక్కి మహేశ! యెట్లు వ్రత ♦ చర్యలఁ బాయుదు పీవు పేర్మిమై. 410

ఉ॥ వేదము రక్షసేయుటకు ♦ వెన్కనె భూరి తపోవ్రతేద్ధవి
ద్యాదులఁ జెన్నమీఱ భవ ♦ దాస్యమునన్ సృజియించి విప్రులన్
గాదిలిప్రేమ నావులను ♦ గట్టనుఁ జేకొని కాచు గొల్లఁడ
ట్లేఁదుచునుందు వెల్లపుడు ♦ నెంతయు బాములఁ బాపి యీశ్వరా! 411

చ॥ నిను బరమాత్మ నారయక ♦ నే నటు లెగ్గులు పల్కినన్ మనం
బుననవి లెక్కసేయకయె ♦ పుణ్యవిగర్హణజాతపాతకం
బునఁ బెనుగోతఁగూలు నను ♦ భూరికృపన్ బ్రతికించి తిట్టులన్
నిను గొనియాడఁ జాలుదునె ♦ నీదగు పుణ్యమె నిన్ను మెచ్చెదున్. 412

గీ॥ వరదునకు విశ్వపతి కార్త ♦ బాంధవునకు, జ్ఞాననిధి కీశ్వరునకు స ♦ నాతనునకు
సర్వదేవాధిపతికిఁ బ్రా ♦ శాంతమతికి, సర్వకారణునకు నమ♦స్కార మిదియె.

—* శివుఁడు దక్షునకు హితంబుఁ జెప్పుట *—

గీ॥ అనియిటుల వేడి మ్రొక్కిన ♦ యట్టిదక్షుఁ
గని యనుగ్రహ మొంది యి ♦ ట్లనియె దక్ష!
విను ప్రసన్నుఁడ నైతి నే ♦ వేళ నేని
భక్తులకు లోఁగువాఁడ నేన్ ♦ బ్రభుఁడనైన. 414

వ. నన్నుఁ బూజించుభక్తు లార్తుఁడు జిజ్ఞాసు వర్థార్థియు జ్ఞానియు ననువారలై నాల్గు విధంబులుగ నన్నర్చింతు రుత్తరోత్తరు లుత్తము లందఱియందు జ్ఞాని నాకు ప్రియతరుం డతఁడు నారూపుగఁ దెలియుము. నేను జ్ఞానగమ్యుండను గాని తదితరంబులకు సాధ్యుండనుగాను. 415

గీ॥ వేదములచేత నీక్రతు ♦ వితతిచేత, దానములచేతఁ దపసుచే ♦ దక్ష! నన్నుఁ
బడయఁజాలరు కర్మఠ♦త్పరులుపుడమి, భక్తిచే జ్ఞానమునఁ బట్టు♦పడుదు నెపుడు.

వ. నీవు భక్తిజ్ఞానంబులం బాసి కేవల కర్మతత్పరుండవై యిట్లు బన్నంబు నొందితి వింక మీఁద జ్ఞానమార్గంబు నాశ్రయింపుము, మఱియు వేఱొండు రహస్యంబు గల దది యెఱిఁగింతు వినుము. 417

క॥ నేనును బ్రహ్మయు వెన్నుఁడు, పూనిజగంబులకు హేతు ♦ భూతులమైనన్
నే నీశ్వరుఁడను సాక్షిని, నేను స్వయంభాసకుఁడను ♦ నిత్యుఁడ వినుమా.

గీ॥ ఆత్మమాయను గుణమయి ♦ నందిజగముఁ
బాడమఁ జేయుచు సాఁకుచుఁ ♦ బొలియఁజేయు
చును గ్రియోచితనామంబు ♦ లొనరఁదాల్చు
చుండు నీక నిందు సందియం ♦ బొదవ దెపుడు. 419

గీ॥ అట్టి పరమాత్మనయిన నా♦యందు బ్రహ్మ, విష్ణులను భూతకోటినిఁ♦బిచ్చవాండ్రు
జెలఁగి వేఱుగఁజూతురు♦శిరసు మొకము, మున్నయినవాని వేఱుగ♦నెన్నఁడెవఁడు.

క॥ సకలాత్ములమై నిచ్చలు, నొకరూపగు మా ముగురను ♦ నొండు తెఱఁగు నెం
చక సేవించునతండే, యకలంకంబైన శాంతి ♦ నందికొను భువిన్. 421

వ. ఇఁక నట్లుగాక

గీ॥ వెన్ను నిందించినను గొల్చు ♦ చున్నవాఁడు
నన్నుదూషించిహరిఁ గొల్చు ♦ చున్నవాఁడు
వీరలిర్వురు జముపీట ♦ వేఁగుచుందు
రంబుజహితుండు జందుఁ డు♦న్నంతదనుక. 422

వ. మఱియును.

క॥ కమలజు భక్తిఁదొరంగిన, గమలాపతి భక్తి యెపుడుఁ ♦ గలుగదు వినుమా
కమలేశుభక్తి లేకయె, యమరదు నాయందు భక్తి ♦ యబ్జజతనయా! 423

వ. కావున నీవిఁక భేదబుద్ధిఁ బాసి జ్ఞానివై యుపాసింపు మిఁక యోగంబుఁ బూర్తి యొనరింపుమన్న దక్షుం డలరి శివు నఖిలేశ్వరుండని తలంచి సకుటుంబముగా నర్చించి యజ్ఞంబు మరల ననుసంధానించి వేల్పులకెల్లరకు భాగంబు లొసంగి పూర్ణభాగంబు మహేశ్వరునకిచ్చి తదనుగ్రహంబుఁబడసి యజ్ఞంబు సమాప్తం బొనరించె నంతఁ బరమేశ్వరుండు కైలాసంబునకరిగె. బ్రహ్మవిష్ణులును నఖిల సురమునీంద్రులు సంతసంబునఁ బరమేశ్వరయశశ్చరితంబు గానంబుసేయుచు నిజనివాసంబుల కరిగిరి. మహేశ్వరుం డిట్లు నిజస్థానంబుఁ జేరియు సతీదేవిన్ దలఁచి పలుమాఱు సతీచరితంబులు గణంబుల కెఱిఁగించుచుఁ బరమాత్మ యయ్యును బ్రాపంచికభంగి నభినయించుచు నిర్వికారుండై యుండె. పరమేశ్వరి యగుదాక్షాయణి యిట్లు పూర్వకళేబరంబుఁ బాసి దేవప్రార్థితయై దేవకార్యంబు

కొఱకు మఱల హిమవద్గిరీంద్రపత్ని యగు మేనకీయందు జన్మించి తపంబొంది మహేశ్వరున్ జేపట్టె నీ సతీ చరిత్రంబు నెవ్వారేనిఁ జదివిన వినిన నవ్వారు సకలసంపదలన్ బొదలుదు రనిన సూతునకు శౌనకాదులు మహాత్మా! దక్ష యజ్ఞంబం దిట్లు పుండరీకాక్షుండు శివు నరయక వచ్చి యవమతిన్ జెందుట కేమికతం బెఱుంగఁ జెప్పుమనుడు సూతుం డిట్లనియె. 424

## —* క్షుప దధీచుల కలహ వృత్తాంతము *—

గీ॥ చ్యవనపుత్రుండు భృగువంశ ♦ సంభవుఁడు ద
ధీచియనుఋషి శపియింప ♦ నా చతుర్భు
జుఁడు పరాకొంది యట్లు ద ♦ క్షుని మఖమునఁ
జేరి చిన్నతనంబొందెఁ ♦ జేవమాలి. 425

క॥ అన నేటికి శపియించెను, ముని పురుషోత్తముని సకల♦భూతశరణ్యున్
మునివర! యెఱిఁగింపుమనా, ననఘుఁడు నుడువంగఁదొడఁగె ♦ నవ్వారికిటుల్.

క॥ క్షుపుఁడను వైష్ణవుఁడగునొక, నృపునకును దధీచిమునికి ♦ నేస్తంబురువా
విపులేశుం డొకపరి మా, నిపతినిఁగని యిట్లుతా న ♦ నియె మత్తమతిన్.

చ॥ ఎనిమిది దిక్కులోలి మెయి ♦ నేలెడు వేల్పులమాత్రలొంది మే
దినిపయిఁబొల్చు భూపతి మ ♦ దిన్ దలపోయఁ గవర్ణపంక్తిలో
ఘనతను మించు నల్లతఁడె ♦ గౌరవభాజనుఁడన్న నంత న
మ్ముని విని వేదపుంబథముఁ ♦ బూనని యన్నుడికల్గి యిట్లనెన్. 428

క॥ జనవినుత "బ్రాహ్మణో గురు", రను వచనముఁదలఁపు మదిని♦నఖిలమునకు బా
పనుఁడే గరీయుఁడును బూ, జనభాజనుఁ డెద్ది వేద♦సమ్మత మనుడున్.

చ॥ నరవరుఁడాలకించి యటు ♦ నచ్చికసేయక శ్రీమదంబునన్
బొరసిన బుద్ధి నిట్లనియె ♦ భూవిభుఁడే కడుమేటి యాతఁడే
యురవగు దైవతంబిఁకను ♦ నుర్వరఁజెందిన విష్ణువాతఁడే
ధర నిఁక నగ్రపూజ్యుఁడగుఁ ♦ దాపస! నీపస మానిపొమ్మికన్. 430

గీ॥ అనిన విని ముని క్రుద్ధుఁడై ♦ యాత్మగౌర
వం బరసి నెడ్మపిడికిట ♦ వసుమతీశు
నెత్తిపైమొత్తె నతఁడు గి ♦ న్కత్తివజ్ర
మేసి మునివరుఁ జీల్చెను ♦ దోసమనక. 431

క॥ ముని వజ్రహతినిఁ దా ను, ర్వినిఁ బడి కులపతిని శుక్రు♦ వినయమ్మున వేఁ
డిన వతఁడు చేరవచ్చి ము, నిని సంజీవిని కలన్ మ♦నిచె నంతఁ గృపన్.

వ. వాత్సల్యంబుతోడ దధీచికి మృతసంజీవినీ విద్య నుపదేశించి, కుమారా! మృత్యుంజయుఁడగు నీశ్వరుని భజించుచు నీ మహామృత్యుంజయ మంత్రంబు నుపాసింపుము. దీన నీకు మృత్యుభయంబు దొలఁగి శ్రేయంబు చేకూరునని యి ట్లమ్మంత్రం బుపదేశించె. 433

—* మహామృత్యుంజయ మంత్రము *—

ధ్యానం –

శ్లో॥ హస్తాంభోజ యుగస్థ కుంభయుగలా । దుద్ధృత్యతోయం శిర
స్సించంతం కరయోర్యుగేన దధతం । స్వాంకే సకుంభౌ కరౌ
అక్షస్రజ్మృగహస్త మంబుజగతం । మూర్ధస్థ చంద్రస్రవ
త్పీయూషార్ద్ర తనుం భజే సగిరిజం । త్ర్యక్షంచ మృత్యుంజయం.

మనుః–

శ్లో॥ త్ర్యంబకం యజామహే । త్రైలోక్యపితరం ప్రభుం । త్రిమండలస్య పితరం
త్రిగుణస్య మహేశ్వరం । త్రితత్త్వస్య త్రివహ్నేశ్చ । త్రిధాభూతస్య సర్వతః ।
త్రిదివస్య త్రిబాహోశ్చ । త్రిధా భూతస్య సర్వతః । త్రిదేవస్య మహాదేవ ।
స్సుగంధిః పుష్టి వర్ధనః । సర్వభూతేషు సర్వత్ర । త్రిగుణేషు కృతౌ యథా ।
ఇంద్రియేషు తథాన్యేషు । దేవేషు చ గణేషు చ । పుష్పే సుగంధవత్సూర ।
స్సుగంధి రమరేశ్వరః । పుష్టిశ్చ ప్రకృతేర్యస్మా । త్పురుషాద్వైద్విజోత్తమ ।
మహదాదివిశేషాంత । వికల్పస్యాపి సువ్రత । విష్ణోః పితామహస్యాపి ।
మునీనాంచ మహామునే । ఇంద్రియశ్చ చ దేవానాం । తస్మాద్వైపుష్టి
వర్ధనః । తందేవ మమృతం రుద్రం । కర్మణా తపసాపివా । స్వాధ్యాయేనచ
యోగేన । ధ్యానేన చ భజంత్యముం । సత్యమేషాం ప్రపన్నానాం । మృత్యు
పాశాద్భవః స్వయం । బంధమోక్షకరో యస్మా । దుర్వారుక మివ ప్రభుః ।
మృతసంజీవనీమంత్రో । మమ సర్వోత్తమ స్స్మృతః॥

వ. ఈయదియె సర్వోత్తమంబగు మృతసంజీవనీ మహామంత్రం బీశ్వరుని బూజింపుచు నిద్దాని జపించుము. మఱియు నీయది జపంబుల నభిషేకంబునను హోమంబునను నిమ్మూడింటఁగూడ ఫలంబొసంగు. శివసన్నిధిఁజేరి యీమంత్రంబుజపించిన వానికి మృత్యుభయంబులేదు. ఇఁకనిమ్మంత్రంబునను న్యాసాదుల నొనర్చి జపించుచు శివునిఁబూజించిన మఱియు విశేషఫలంబు జెందనగునని యిట్లు సక్రమం బుపదేశించి శుక్రుండు స్వస్థానంబునకరిగినంత దధీచి శివుని సంస్మరించి తపంబునకై వనంబున కరిగి యందు మహేశ్వరులఁ బూజించుచు నమ్మహామృత్యుంజయమంత్రంబు నేకనిష్ఠతోఁ బెక్కుదినంబులు జపించినంత భక్తవత్సలుండైన శంకరుఁడు మునిఁ దారసించి వరంబడుగు మిచ్చెదననుచు దధీచిముని గరంబుమురిసి యిట్లు ప్రస్తుతించె.

సీ॥ కాలాయ ఘనతపో ♦ జాలాయ కంధరా, నీలాయ నిత్యాయ ♦ నిరతధర్మ
శీలాయ కరుణాల ♦ వాలాయ బ్రహ్మాండ, పాలాయ శర్వాయ ♦ పాలితముని
బాలాయ ధృతహరి ♦ చ్చేలాయ తరుణేందు, ఫాలాయ భర్గాయ ♦ ప్రౌఢతరజ
టాలాయ గళతల ♦ వ్యాలాయ దోర్ఘను, శూలాయ శుద్ధాయ ♦ స్థూలసూక్ష్మ
గీ॥ కారణశరీరధారిణే ♦ కర్బురతను, ధారిణే రవిబింబవి ♦ హారిణే కృ
పాళవేఽఖిలజనతాప ♦ భంజనాళ, వే నమోస్తు నమోస్తుతే ♦ తేనమోస్తు.

సీ॥ కాలకాలాయ శ్రీ ♦ కాలరాణ్ముఖగణ, పాలాయ ఋషిలోలు ♦ పాయ దివ్య
గంగాతరంగిణీ ♦ రంగాయమానజ, టామండలాయ కు ♦ ఠారశూల
బాణబాణాసన ♦ పట్టిస శక్తిగ, దాదండ చర్మాసి ♦ ధరకరాయ
కాకోదరాధిప ♦ గ్రైవేయభూషిత, కంధరాయానంద ♦ బంధురాయ
గీ॥ పరమశక్తిహృదయభర్మ ♦ పద్మకోశ, రంజనాహస్కరాయ వి ♦ రాజితేందు
శకలభాస్వరకోటీర ♦ చారుతరళి, రస్థలాయ నమోస్తు ప ♦ రాత్పరాయ.

వ. అని యిట్లు సన్నుతించి.

—* శివుఁడు దధీచిమునికి వరమునిచ్చుట *—

గీ॥ దేవ! నాకిఁకవజ్రాస్థి♦దివ్యతనువు, మఱియునమృతత్వము నదీన♦మతియు ననుడు
శంకరుం డట్లయగునని ♦ సంయమికి వ,రంబొసఁగి వేగ నిజనివా ♦ సంబుఁ జేరె.

చ॥ మునియు వరంబుఁ జెంది క్షుపు ♦ భూభుజుఁ జేరి పదంబుచే శిరం
బును వడి మోఁదె నాతఁడును ♦ భూరిత రాగ్రహ మొంది వజ్రమున్
ముని యురమందు వేయ నది ♦ మున్పటి యట్టులఁ గాక పూరిగాఁ
గనుపడ తేఁడు సూచి మది ♦ గాటపునక్కజ మొందియంత నే. 438

ఉ॥ కానకుఁ బోయి శ్రీపతినిఁ ♦ గంజదళాక్షుని భక్తవత్సలున్
బూనికతోడ నెంచి తప♦ముగ్ర బొనరింపఁగ దేవనాథుఁ డా
మానవనాథుఁ జేరి బహు ♦ మానమొసంగ నభీష్టమడ్గఁగా
నానృపుఁ డర్సమొంది కమ♦లాక్షున కర్మిలి మ్రొక్కి యిట్లనెఁ. 436

గీ॥ బాఁపడొక్కఁడు నను దలఁ ♦ బగులఁదన్నె
వజ్రమేసితి వితయయ్యె ♦ వరద! యతఁడు
శివునిఁ బూజించి వాంఛిత ♦ సిద్ధిఁ లొందె
వానిపేరు దధీచి య ♦ వ్వానిఁ గనుము. 440

వ. మఱియుఁ దనకును దధీచికి జరిగిన వాదంబు తెఱంగునంతయుఁ దెలిపినఁ బురు
షోత్తముఁ దన్విధంబెల్ల నారసి దధీచియెడ ననుచితంబు లేకున్నను క్షుపునికై

తా నద్దధీచినిఁ జెనకక తప్పమియును, దధీచిచేఁ దన కనర్థంబు రానుండుటయు
నెఱింగియును భక్తవాత్సల్యంబుఁ దోఁసివేయఁజాలక దధీచితోఁ బోర నెంచి
క్షుపున కిట్లనియె. 441

గీ॥ బ్రాహ్మణు లజయ్యు లందును ♦ బాశుపతులు
కడిఁది మగ లట్టివారితోఁ ♦ దొడరనగునె?
సాహసిక్యంబు జలము దో ♦ సంబు మీఱి
పోరితముఁ దెచ్చికొంటివి ♦ భూమిజాని! 442

వ. ఇఁక శాంభవుల వైభవం బెఱుంగవేని వినుము.

సీ॥ అశ్రాంతపారమే ♦ శార్చాపరానంద, భరితాంతరంగులు ♦ పాశుపతులు
ఆణవాదిమలత్రి ♦ యధ్వంసకారణ, పరమదీక్షాచణుల్ ♦ పాశుపతులు
తాపత్రయాగ్నిదం ♦ దహ్యమానశరీర, బాధానివర్తకుల్ ♦ పాశుపతులు
పూర్వకర్మఫలాను ♦ భోగనానాగర్భ, వాసదూరీకరుల్ ♦ పాశుపతులు
గీ॥ సర్వవేదాంతసిద్ధాంత ♦ సారవిహిత, పథవిరాజితగమనులు ♦ పాశుపతులు
ప్రోథమధ్యాహ్నవిస్ఫుర ♦ ద్భానుబింబ, భాసమానప్రకాశులు ♦ పాశుపతులు.

వ. ఇఁక నిన్నుగుఱించి యిమ్మునితోఁ బోరెద నవలఁ గానున్నదియగును.

క॥ అని వేగ దధీచి మునీం, ద్రుని డగ్గఱి బవరము డుగఁ♦దోయజనేత్రున్
గని ముని యనియెను కేశవ!, నిను నెఱుఁగుదు భక్తకార్య ♦ నిష్ణాతునిగాన్.

గీ॥ ఐన వినుము మహేశ్వరా♦ర్చానిరతుల, కెందు నలఁదురు టబ్బమి♦ యెంచువాఁడ
అట్లుగా కది యొదవుచో ♦ నరసి పల్కు, కలను చేసెద నీతోడఁ♦గంజనయన!

—* విష్ణు దధీచుల యుద్ధము *—

క॥ లేదలమట బెదరేమియు, లేదెందుఁ బరాజయంబు ♦ లేనే లేదో
శ్రీదయిత! యనుడు గుపితుం, డై దానవహంత చక్రి♦మారసి కనఁగా. 446

గీ॥ అదియుఁ జలనంబుమాలిన ♦ నమ్మునీంద్రుఁ
డరసి నగి యిట్టులనె హరి! ♦ మైశ మీ సు
దర్శనము నను దెగటార్పఁ ♦ దఱియ దన్య
సాధనములనుగొని వేయు ♦ చలము మీఱి. 447

క॥ అని యుల్లసమాడిన య, మ్మునిపయి నందకము గదను ♦ భూర్యస్త్రములన్
వనజాక్షుఁ డేసె సంక్రో, దనముఖులును దఱిసి మునిని ♦ నానాస్త్రములన్.

గీ॥ పాదవమునియల్గియొకకుశ♦ముష్టిఁదెచ్చి, శివుని స్మరియించివిడిచినఁ♦జెలఁగియద్ది
ఘనమగుత్రిశూలమై వారి♦కఠినసాధ, నముల నస్త్రంబులను వేగ♦సమయఁజేసి.

వ. సకలనిలింపులతో జనార్దనుని మర్దింప నేతెంచుచుండుటఁ గాంచి.

గీ॥ అతులమాయాన్వితుండగు ♦ నచ్యుతుండు, తన్నుఁబోలిన చక్రగ♦దాధరులను
నయుతమూర్తులవెడలింప♦నదరివారు, తాపసునిపైకి దుముకఁగఁ♦దలఁకకతఁడు.

క॥ వారందఱి శూలమునన్, జూరున్బొనరించి యార్వఁ♦జూచి హరియుఁ దా
మీఱిన కినుకఁ ఘోరా, కారుండై విశ్వరూప ♦ గరిమఁ జూపెఁ. 451

క॥ పదునెనిమిది లోకంబులు, నదీనదోదధులతోడ ♦ నగములతోడఁ
బొదలెను భగవత్తనువున, నది గని ముని శివునిఁ దలఁచి ♦ యచ్చెరు వొప్పఁ.

గీ॥ హరికి నిట్లనె నిదియేమి ♦ యచ్చెరియము
కనుము నేఁ జూపెదనటంచు ♦ గరిమ మెఱయ
చ్యావనియుఁ దనయందు బ్ర ♦ హ్మాండమెల్లఁ
జూప విస్మయమొందిరి ♦ సురలు హరియు. 453

క॥ అంత మెగాక జనార్దను, నెంతయు దహియించుచున్న ♦ ఋషిఁగని హరి బ
ల్వంతముతోఁ దలపడఁగని, చింతిలి పరమేష్ఠి యటకుఁ ♦ జేరి రయమునన్*

చ॥ వలదు మహాత్మ! భక్తజన♦వత్సల! పద్మదళాక్ష! మానిపై
నలుకను మాను మీతఁ డలి ♦ కాతునిభక్తుఁడు ప్రోడ యెంతయున్
గలుషము లేదు వీనియెడఁ ♦ గర్కశభావము డింపు ఱేనికిఁ
జెలిమిఘటింపు! మౌనియెడఁ ♦ జెల్లదు వేఱువిధంబు రూఢిగాన్. 455

వ. అనిచెప్పుట యాలకించి క్షుపుండు పశ్చాత్తప్తుండై తనకోసరంబిట్లు రమా
కాంతుండాఱడినొందుటకెంతేని వందురి యథార్థంబెఱింగి వచ్చి దధిచి యంఘ్రు
లందుఁ బడి యిట్లు ప్రార్థించె. 459

—* క్షుపుఁడు దధీచినర్థించి యుద్ధంబునుడుపుట *—

శా॥ మన్నింపన్ గదవయ్య! నాయఘములన్ ♦ మౌనీంద్రచూడామణీ!
మన్నింపన్ గదవయ్య! నాచెడుపనిఁ ♦ మాహేశ్వరగ్రామణీ!
మన్నింపఁ గదవయ్య! నామదము నా ♦ మ్నాయైకవిద్వన్మణీ!
మన్నింపన్ గదవయ్య! వేగనను స♦స్మన్మిత్రచింతామణీ! 457

వ. అనియిట్లు దీనుండై యనుగ్రహం బర్థించుచున్న క్షుపునకభయంబిచ్చి తన
మదిని శివుని సంస్మరించి రమేశ్వరునితో నితర దేవతలన్ గాంచి యాగ్ర
హంబుతో. 458

* వతిఖండే అష్టత్రింశాధ్యాయే—శ్లో॥ దదాహ విష్ణుం దేవేశం దధీచి శ్శైవసత్తమః

గీ. తివిరి మధువైరి! నీవును ♦ దివిజులెల్ల
రుద్రకోపాగ్నిఁ బొగలుదు ♦ రు ద్రుతమందె
యని శపించి క్షువునిఁ జూచి ♦ యధిప! నృపుఁడు
పూజ్యుఁడే యైన బ్రాహ్మణుల్ ♦ పూజ్యతములు. 954

వ. అనిచెప్పి మునీంద్రుం డాత్మాశ్రమమున కేగె నంత విష్ణుఁడు చలంబు మాని సురలతో స్వలోకంబునకరిగె. క్షువుండును మనఃకాలుష్యంబును బాసి నిజ గృహంబునకరిగె నీసమరంబు పశ్చిమోత్తరంబందలి స్థానేశ్వరంబను నెడ జరుగుటఁ జేసి యద్ది పుణ్యస్థలంబయ్యె జనులిద్దానిసేవించిన శివానుగ్రహంబు నొందుదు రిక్కతన విష్ణ్వాది సురలు మోహితులై దక్షాధ్వరంబున కేగి యట్లు భంగం బొంది రీ క్షువదధీచివాద చరిత్రంబు సంక్షేపంబుగ మీకెఱింగించితి నిద్దానిఁ జదివిన వినిన జనుల కపమృత్యుపీడాపరిహారంబగు. రణంబునందెవ్వరేని దీనిఁ జదివిన మృత్యుభయంబుఁ దక్కి విజయంబుఁగాంతురని సూతుండు శౌనకాదిమునులకుఁ జెప్పుటయు. 060

క. మంత్రారాధ్యసుతా! శివ, మంత్రజపాత్యంతకుశల ♦ మానసహంసా!
యంత్రితసత్కార్యా! దు, స్తంత్రజనవ్యూహవిముఖ! ♦ ధార్మికసుముఖా!

గద్య.

ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వర నామధేయప్రణీతంబైన శివపురాణంబందలి సతీఖండంబు సర్వంబును సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## పార్వతీ ఖండము.

### ప్రథమాశ్వాసము.



మదుమాశంకరపద
తామరసామోదభక్త ♦ తల్లజసుకథా
ప్రేమమతీ! లక్ష్మ్యంబా!
మామకజననీ! మనీషి ♦ మాన్య చరిత్రా!.

వ. అవధరింపుము. శౌనకాదిమునులు సూతునిఁ గాంచి,

—* సూతుని శౌనకాదులు పార్వతీజన్మచరిత్రంబు జెప్పుమనుట *—

మ॥ మును దక్షాధ్వరమందు మేన్విడిన యం ♦ భోజాక్షి దాక్షాయణీ
వనితారత్నము దివ్యవర్యుల యద ♦ భ్రపార్థనన్ జేసి పా
వనుఁడౌ పర్వతరాజమౌళికిని భా ♦ స్వచ్ఛీల మేనాబ్జలో
చనకుఁ బుట్టి హరుఁ వరించెనని ప్ర ♦ స్తావించి తీవెంతయుఁ. 2

గీ॥ అరసి యేపుణ్యమున జగ ♦ దంబ నను(గు, సుతనుగాఁగొని రది)దం ♦ పతులు గిరిజ
యేమితపమొనరించి తాఁ ♦ గామహరుని, రాణియయ్యె వచింపు పు ♦ రాణసూరి!

వ. అని యిట్లు పార్వతీపరమేశ్వరకల్యాణకథాసుధారసపిపాసువులై యడిగిన మునులకు సూతుండలరి యిట్లనియె.

మ॥ మును రాజీవభవుండు నారదున కా ♦ మోదంబుతో నిచ్చరి
త్రను బుత్రాదృతిఁ జెప్పె నమ్ముని నితాం ♦ తస్నేహభావంబునన్
ఘనుఁడౌ వ్యాసమహర్షికిన్ దెలిపె నా ♦ కారుణ్యవారాశి నా
కనురాగంబునఁ దెల్పె మీకిపుడు నే ♦ నద్దాని బోధించెదన్. 4

చ॥ గుహునకు వందనంబిడుదు ♦ గోపతివాహను శీతశైలజన్
దిరముగ నాత్మలోఁ గొలుతు ♦ దివ్యతపోనిధులార! మీరిఁకన్
బరమశివున్ మహేశ్వరిని ♦ భావమునన్ గుదురొప్పనిల్పి భా
సురతరధారణన్ గనుఁడు ♦ శోకనిధానకథాసుధాంజలుల్. 6

—* కథా ప్రారంభము - హిమవద్గిరి వర్ణనము *—

ఉ॥ ఉత్తరదిక్కునందుఁ జెలు ♦ వొందు హిమాలయనామధేయదీ
వ్యత్తరపర్వతేంద్రము మ ♦ హామణిరత్ననిధాన మెల్ల సం
పత్తులకెల్ల ప్రాగపర ♦ వార్ధులఁ దాఁకుచుఁ బృథ్విఁగొల్చు లో
కోత్తరమానదండమన ♦ నుజ్జ్వలకాంతుల నొప్పు గొప్పగన్. 7

సీ॥ అభ్రగంగాతరం ♦ గాళి నుయ్యేలలూఁగు, రాజహంసవతంస ♦ రాజి యెందు
హేమతామరసమా♦లామండనము సేయుఁ, గమనీయగంధర్వ ♦ గణము లెందు
బహుమహాసవనయూ♦పస్తంభముల లెక్క, సేయు విద్యాధర ♦ శ్రేణి యెందు
నిజబాణనిర్భిన్న ♦ గజకుంభముల ముత్తి, యము లేయు భిల్ల చ♦యంబు లెందు
గీ॥ జగములన్నియు సల్పిన♦ చంద్రమౌళి, యడుగుదృఢభక్తి వైభవం♦బమరఁగొల్చి
యష్టసిద్ధులఁగొని సుప♦ర్వాళి మరియు, నెందు నట్టిశుభాఢ్యంబు♦హిమనగంబు.

క॥ ఘనసారాద్రి యనన్ జం, దనశైలేంద్రంబనంగ ♦ నవనీతనగం
బన రాజతపర్వతమనఁ, జను వలిగుబ్బలి లసద్వి ♦ శదవిద్యుతులన్. 9

తే॥ స్ఫాటికశిలోచ్చయంబనఁ ♦ బరఁగుఁగాని, నీరసముగాదు శర్కరా ♦ ధారుణీధ
రంబనఁగఁ జెల్లుఁగానియ♦రయఁబిపీలి,కామ్యాతముగాదుహిమవన్న♦గముజగమున.

గీ॥ హరివిలసితమై వైకుంఠ ♦ పురమనంగ
పద్మజాతాఢ్యమై బ్రహ్మ ♦ పదమనంగ
వజ్రికూటంబయి మహేంద్ర ♦ వాసమనఁగ
మీఱి చెలువొందెఁ బుడమిఁ దు♦షార ధరము.

మ॥ కడుధావళ్యము నొప్పు మూర్తిరమచే ♦ గంగాధునీధారలన్
వెడలన్ జిమ్ముశిరమ్ముచే మునిజనా ♦ భీష్టాశ్రయత్వమ్ముచే
నడఁగన్ బోని యనన్యసంచిత మహా ♦ ష్టైశ్వర్యసంపత్తిచేఁ
బుడమిన్ శంకరమూర్తిఁబోలు హిమవ ♦ ద్భూభృద్వరం బారయన్. 12

శా॥ నానాదివ్యసుగంధపుష్పలతలున్ ♦ నానాఫలోర్వీజముల్
నానారత్నమయంపు గోనలును గం ♦ ధర్వామరస్కంధముల్
మౌనీంద్రాశ్రమముల్ సరిత్తతులు భి ♦ ల్లస్త్రీకనద్వేణు వీ
ణానాదంబులు చెన్నుమీఱు గిరికాం ♦ తారంబులం దెల్లెడన్. 13

శా॥ సోమార్థప్రతిమాలికల్ లసదళి ♦ స్తోమాతి నీలాలకల్
కామోద్దామకలాపసంగసుమహా ♦ కౌశల్య లుద్బద్ధగుం
జామంజర్యుపనీతహారలతికల్ ♦ చాపల్య చార్వత్ములుల్
వ్యామగ్రాహ్యకుచల్ చరింతురు గిరిన్ ♦ వ్యాధాధినాథాంగనల్.

గీ॥ అమరఁ గేదారదేవుని ♦ యండఁ జేరఁ, గిన్నరతఁ గింపురుషత భం♦గింతునంచుఁ
గిన్నరులుఁ గింపురుషు లల్ల♦గిరినిఁ జేరి, నరులు పూరుషులై యల♦రిరి యయారె!

వ. మఱియు నప్పర్వతరాజంబు.

గీ॥ పసిఁడి మొదలగు లోహాల ♦ పంటచేను
మేటి యోషధులకు నెల్ల ♦ మేల్మి పొలము
ఏనుఁగులు సింగములు వసి ♦ యించు కోన
యగుచుఁ దగు మంచుఁగొండ పు ♦ ణ్యములకండ. 16

క॥ కేదారము మోక్షౌషధి, కేదారము బదరవన మొ ♦ గిన్ శంకరు దా
మోదముఁ గైవసముగఁ గొని, శ్రీఁ దనరుచు జగములందుఁ ♦ జెలువునఁ దనరెన్.

క॥ ఒకచో గంగానది యిఁక, నొకచో యమునాధునియు మ ♦ ఱొకచో నాగం
డకినిర్ఝరిణియునున్ వేఱొకచో నా బ్రహ్మపుత్రి ♦ యుదయించె నటన్. 18

గీ॥ అలకనందాస్రవంతికా ♦ భ్యర్ణమందు, నలరు రుద్రాక్షతరువనం ♦ బుల నఖండ
బిల్వమూలాశ్రయంబుఁగా ♦ వించి తపము, సిద్ధిఁ గాంతురు మునులం ద♦చిరమునంద.

క॥ స్థావర జంగమ రూపము, లీవిశ్వోత్తరమహాద్రి ♦ కెసఁగును తొంటన్
స్థావరమిది వేఱొకఁ డిల, దేవాత్ముఁడు రుచిర గౌర ♦ దేహుండలరున్. 20

గీ॥ దర్శనీయుఁడు పుణ్యాత♦త్పరుఁడు మంచి, వారలకు నెల్లఁ బ్రియమైన ♦ వాఁడు కేశ
వాంశుఁ డుద్దామ తేజస్వి♦యవికృతుండు, రాణఁ దనరొందుఁ బర్వత♦రాజరాజు.

ఉ॥ ఆ నగరాజవర్యుఁడు శు ♦ భాభ్యుదయంబును ధర్మవృద్ధి నెం
తేనియు దేవతాపితృహి ♦ తేచ్ఛయు నెంచి వివాహమాడఁగాఁ
బూనుడు దేవతాగ్రణులు ♦ పొందుగ నాత్మహితప్రయోజనా
ధీనమనస్కులౌచుఁ బితృ ♦ దేవులపాలికిఁ జేరి కూరిమిన్. 22

ఉ॥ ఖ్యాకును నాకవాసులకు ♦ మేదినికంతకు సౌఖ్యసంపదల్
చేకుఱఁ జేయఁగాఁ గడఁగి ♦ చెచ్చెర వచ్చితి మిందు నిత్యల
క్ష్మీకలితన్ భవత్సుతను ♦ మేనకకన్యను శైలరాజను
శ్లోకున కిచ్చి ధర్మవిధి ♦ చొప్పునఁ బెండ్లి యొనర్పుఁ డిత్తఱిన్. 23

గీ॥ దాన సకలంబు ఫలియించుఁ♦గాన మీరు, సంశయింపకుఁ డిబ్బంగి ♦ సత్వరముగఁ
బెండ్లిఁ గూర్పుఁడు సురలకుఁ♦ బ్రియముసేయు, వారలేనియు భూరివి♦చారులార !

క॥ అనియిటు పలుకఁగ వారలు, విని తమకూఁతులకు సంభ♦వించినశాపం
బును దెలిసియు సురవర్యుల, యనుశాసన మారసియుఁ ద♦థాస్తనిరి తగన్.

—* మేనకాహిమవద్వివాహము *—

శా॥ అంతన్ వేగమె శైలరాజవరు నా♦హ్వానించి దేవద్విజం
బెంతో సంతసమొంది యుత్సవములె♦న్నే భంగులన్ బన్న న
త్యంతామోదముతోడ నప్పితలు గ♦న్యాదానమున్ జేసి శ్రీ
మంతంపుంబనఁ బెండ్లి చేసిరి మునుల్♦ మన్నించి దీవింపఁగన్. 26

క॥ హరియును బరమేష్ఠియునున్, హరిహయుఁడును లోనుగల్గు♦నమరు లుమాశం
కరు మదిలోఁ దలఁచుచు న, ప్పరిణయమునఁ జెందిరపుడు♦ పరమ ప్రీతిన్.

గీ॥ దేవతలుమానులును బిత్రు♦దేవతలను, జాలఁగొనియాడి గిరిరాజు♦ చనవుమెచ్చి
చనిరి తమగేములకు హిమా♦చలుఁడు సంత,సమున నిలుఁజేరె మేనకా♦సతినిఁగూడి.

క॥ అనిపలికిన సూతినిఁ గనుఁ, గొని మేనకజన్మకథను♦ గొనకొని యమ్మా
నిని తోఁబుట్టుల చరితం, బును శాపవిధానమును జె♦ప్పుమనిరి మౌనుల్.

—* మేనక మున్నగువారికి సనకాదులశాపము *—

శా॥ సూతుండిట్లనెఁ బద్మజాత్మజుఁడు ద♦క్షుండన్ మునీంద్రుండు వి
ఖ్యాతుం డాతని కూఁతులర్వదుగు ర♦క్కంజాస్యలన్ గశ్యపా
ఖ్యాతుండాదిగ నొప్పువారి కిడి క♦ల్యాణంబు చేసెన్ స్వధన్
జేతోమోదముతోడ నందుఁ బితరుల్♦ చేపట్టి రప్పట్టునన్. 30

గీ॥ వారలకునాస్వధనుబుట్టి♦ వన్నెఁగాంచి, రాత్మజాతలు మూఁగురా♦యతివలందు
మేన తొలిచూలు రెండవ♦చాన ధన్య, చివరకాన్పు కలావతి♦చిగురుఁబోణి.

క॥ ఈముప్పుర యాహ్వాయములు, శ్రీమంగళదాయకములు♦ చింతాహరముల్
ప్రేమమునఁ దలఁచువారికిఁ, గామితములనిడు నవిఘ్న♦ కరములు ధరణిన్. 32

గీ॥ ఆట్టిముప్పురు కన్యక♦ లమలమతులు, ఘనతరజ్ఞాననిధులు యో♦గినులు లోక
మాతలనఁజెల్లు వారుఁ సం♦ప్రీతినెల్ల, లోకముల సంచరింతురు♦వీఁకమెఱయ.

శా॥ శ్వేతద్వీప మొకప్పుడీ ముగురు ల♦క్ష్మీనాథు దర్శింపఁగాఁ
బ్రీతిన్ జేరి రథాంగహస్తునకుఁ బే♦ర్మిన్ మ్రొక్కి మేల్ ఫక్కులన్
జేతోమోదముగా నుతించి తగువా♦సిన్ బొల్చు పీఠంబులన్
జాతామోదమునన్ వసించిరి సరో♦జాతాక్షుకన్నన్నలన్. 34

గీ॥ బ్రహ్మమానసపుత్రులు♦ బ్రహ్మవేత్త, లఖిలలోకార్చితులు సన♦కాదిఋషులు
నలువు రపుడటకేతెంచి♦ నలిననేత్రు, నాదరంబునఁ గాంచి సా♦ష్టాంగపడిరి.

క॥ వారినిగని యటనుండిన, వారెల్లరు గద్దియలను ♦ వదలినిలిచి నై
వారములు చేసి మ్రొక్కిరి, సారెకు భయభక్తు లాత్మ ♦ సంబాళింపన్. 36

క॥ హరియును మునితల్లజులను, బరమామోదమునఁ గాంచి ♦ బహుమణిగణభా
స్వరపీఠము లెక్కుండన, నరుదుగ నాసీను లైరి ♦ యమ్మౌనివరుల్. 37

గీ॥ అప్పుడటనున్న మేన ధ♦న్యయుఁగలావ,తియును దైవవిమోహిత♦లయిఋషులను
గాంచి గద్దియలందుండి♦కదలకుండి, రకట! చెడుకాలమునఁదెల్వి♦యమరదెపుడు.

క॥ ఎదురుకొనక లేవక తమ, పదముల కెఱఁగక యొకింతఁ ♦ బలుకక తగు న
మ్మనవళులఁగాంచి సంయము, లెదఁ గినుకఁ గొనిరి జ్ఞాను♦లే యైనఁ గడున్.

వ. అంత వారలలో సనత్కుమారుం డా చపలాక్షుల నీక్షించి యిట్లు శాపంబిచ్చె.

చ॥ గరువముఁజెంది మీరు పితృ ♦ కన్యక లైనను మౌనులన్ మమున్
బరిభవమొప్పఁ గాంచి యిటు ♦ పల్కక లేవక మ్రొక్కకుంటి రి
క్కరణి సురాంగనోచితము ♦ గాదిఁక నాకముఁబాసి మీరు మా
నుష ధరకేగి మానిసుల ♦ కున్ సతులౌదురుగాక యుగ్మలుల్! 41

గీ॥ ఎవ్వ రజ్ఞానమోహిత♦హృదయులగుచు, ననుచితము లాచరింతురో♦యట్టివారు
గుడుతురకార్యఫలములఁ♦బుడమిలోన, దప్ప దెప్పుడ దేలాటి♦తదజ్ఞులకును.

చ॥ అని శపియింపఁగా విని భ ♦ యమ్మున నప్పితృకన్య లెంతయున్
మనములఁ బొక్కుచున్ దురభి ♦ మానముఁ బాసి మునీశ్వరాంఘ్రులం
దునఁ దలలుంచి మ్రొక్కి విన ♦ తుల్ బొనరించి మహాత్ములార! పా
వనమతులార! మాదయిన ♦ పాపముఁబాపి యనుగ్రహింపరే! 43

క॥ "దాసులతప్పులు దండముతో సరి"యని యరసి యవులఁ♦ద్రోయక మము వి
శ్వాసమున శాపమోక్షము, చేసి కటాక్షింపుఁడీ య ♦ చింత్యప్రజ్ఞుల్! 44

క॥ ఇదియుఁ బ్రమాదవశంబున, నొదవిన తప్పిదము గాని ♦ యుత్తముల మిమున్
మదమునఁ జుల్కన చేసిన, యదిగా దిఁక నరసి ప్రోవుఁ♦డచ్ఛచరిత్రుల్! 45

గీ॥ అనియిటుల పెక్కుభంగుల♦నంజలుల్ ఘ,టించి ప్రార్థించునబలలఁ♦గాంచి యాచి
తాదరమునక్షమించి స♦దయంబుగాఁబ్రి,యంబుగ సనత్కుమారుఁడి♦ట్లనియెమరల.

## —* సనత్కుమారుఁడు మేనకాదుల ననుగ్రహించుట *—

ఉ॥ సంతసమయ్యె మానసము ♦ చక్కవడెన్ పితృకన్యలార! మీ
రెంతయు దైన్యమొంది యిటు ♦ లెంతో ప్రియంబుగ మమ్ము వేడుటన్
జింతదొలంగు డింక ధృతిఁ♦జెందుఁడు పొందుఁడు శ్రేయ మెవ్వరేన్
వంత పొసంగినప్డు కద ♦ వందురి ముందటి బాగెఱుంగుటల్. 47

వ. మీకొసంగిన శాపంబుఁగూడ శ్రేయంబై యొసంగు నద్దానిఁ దేటపఱచెద వినుండు మీ మువ్వురలో. 48

మ॥ హిమశైలేంద్రుఁడు మేనకన్ జనకరా ♦ జేంద్రుండు ధన్యన్ వణి
క్సుమనుండౌ వృషభానుఁ డంతిమను మె♦చ్చుల్ మీఱఁ బెండ్లాడ మీ
కుమయున్ సీతయు రాధయున్ గ్రమముగా ♦ నుత్పన్నలై శర్వ న
ర్యమవంశ్యుండగు రాముఁ గృష్ణుని వివా♦హంబాడువా రిమ్మహిన్. 49

వ. కృత త్రేతా ద్వాపర యుగంబులందుఁ గ్రమమ్మున మీరు మూఁగురును గూఁతులవలన మిగుల కీర్తిఁ జెంది వారి యనుగ్రహంబునఁ గైలాస వైకుంఠ గోలోకంబులకుఁ జనువారింక మీకు లగ్గయ్యెడుమని దీవించి కేశవుని యనుజ్ఞన్ గొని యమ్మును లంతర్ధానంబునొందిరి. పితృకన్యలును దెప్పరిల్లి విష్ణుదేవుని వీడ్కొని తమ నెలవులకున్ బోయిరనిన సూతునకు శౌనకాదులిట్లనిరి. 50

గీ॥ మేనకాజన్మచరిత మ♦మ్మేలఁత పెండ్లి,యును దెలిసికొంటి మద్రిరా♦జోత్తమునకు
యఖిలజగదంబకూఁతురై ♦ యవతరించు,టయును నీశ్వరుఁ బెండ్లాడు♦టయును జెపుము.

ఉ॥ నావుడు సూతుఁడిట్లనె మ ♦ నఃప్రియమొప్ప నగాధిరాజు మే
నావనితన్ గ్రహించి సద ♦ నంబున కేగి మనోజభోగసౌ
ఖ్యావళిఁ దేలుచున్ గడిఁది ♦ హాయనముల్ గడపెన్ నభస్స్రవం
తీవిపులోర్మిశీతలను ♦ దేశవిశాలవనీతలంబులన్. 52

—* విష్ణ్వాదిదేవతలు హిమవంతునివద్దకు వచ్చుట *—

గీ॥ అంతఁ గొన్ని దినంబుల♦కచ్యుతప్ర, ముఖనిఖిలలేఖు లేకమై♦భూధరేంద్రు
పాలికరుదేరఁ గాంచి♦పరమభక్తి, వందనముచేసి పీఠముల్ ♦వరుసనొసఁగి.

గీ॥ అర్ఘ్యపాద్యంబులను జంద ♦ నాక్షతాబ్జ
ములనుబూజించి కల్పక ♦ ఫలములిచ్చి
మృదుమధురవాగ్విలాసంబు ♦ మెఱయ వినయ
వినతుఁడై యిట్లుపల్కెఁ బ్ర ♦ థ్వీధరుండు. 54

ఉ॥ నేఁడు ఫలంబుఁజెందె జని ♦ నేఁడు ఫలంబును జెందె నర్చయున్
నేఁడు ఫలంబుఁజెందె సిరి ♦ నేఁడు ఫలంబును జెందె జ్ఞానమున్
నేఁడు ఫలంబుఁ జెందిరి మ ♦ నీషులు మెచ్చఁబితాళ్ళు గుంపుగాఁ
గూడి మహాత్ములీర లిట ♦ కున్ జనుదెంచుటచేత బ్రీతిగన్. 55

క॥ ధన్యుఁడనైతిని రాష్ట్రము, ధన్యంబయ్యెను గొలంబు ♦ ధన్యంబయ్యెన్
ధన్యతఁజెందెఁ గుటుంబము, ధన్యతఁజెందెను గ్రియావి ♦ ధానంబెల్లన్. 56

క॥ తమసేవకుఁడై తగు నీ, హిమభూధరుచేత నిప్పు ♦ డేపనియేన్ జి
త్తమునందుఁ దలఁతురేనియుఁ, బ్రమోదమిగురొత్తఁజెపుఁడు♦పావనచరణుల్!

క॥ అని పల్కిన హిమవంతుని౯ గని వనజాక్షాదు లాత్మ ♦ కార్యమునకు సి
ద్ధిని నిశ్చయించి వేగమె, యనురాగముతోడ నిట్టు ♦ లనిరాతనితో౯. 58

గీ॥ వినుముగిరిరాజ! మేము నీ♦వేశ్మమునకుఁ, గడుముదమ్మున వచ్చిన♦కారణమును
దెలియఁజెప్పెద మదినీకు♦దివిజరాజి, కఖిలలోకంబులకుఁ కుశ ♦ లావహంబు.

ఉ॥ ఆదిమశక్తి సర్వజగ ♦ దంబిక మున్నుల దక్షుకూఁతురై
యాదిమదేవుఁడౌ శివున ♦ కాలయి యాలరిదక్షుఁ డీశునం
దాదరబుద్ధి మాని దుర ♦ హంకృతి నధ్వరమూన నేవపు౯
వేదనఁ జెంది దేహమును ♦ వీడుట నందఱెఱుంగు జాడయే. 60

ఉ॥ ఆ జగదంబ యాసమధి ♦ కాతతసత్కరుణావలంబ దా
నా జగదీశుఁబాసి యటు ♦ లాత్మపదంబును జెంద నీశ్వరుం
డోజముఁ దక్కి భూవలయ ♦ మొంటిగఁ గ్రిమ్మరి విస్ఫురత్తపో
యోజన సేయుచుండె నిపు ♦ డొక్కట యోగులు చుట్టి కొల్వఁగ౯. 61

గీ॥ అమ్మహాదేవి గ్రిమ్మఱి ♦ నవతరించి, యామహాదేవుఁ బెండ్లాడి ♦ నపుడు మరల
నందఱికి లెస్సలయ్యెడు ♦ నంతదనుక, సుఖము సమకూర దెందు వి♦శుద్ధకీర్తి!

ఉ॥ కావున నీవు నీ సతియు ♦ గాటపుభక్తి వహించి యమ్మహా
దేవి గుఱించి తీవ్రతర ♦ దివ్యతపం బొనరింపుఁ డింపుమై
పావనులైన మీకు గుణ ♦ వల్లభ యాజగదంబ కూఁతురై
నీవనితోదరంబున జ ♦ నించును బెంచును మేటి శ్రేయముల్. 63

క॥ ఇది విధివిహితం బిత్తఱి, నదనెఱిఁగి భవద్గృహమున ♦ కరుదెంచితి మ
భ్యుదయవిధానముఁ దెల్పఁగ, నిదియదియని యనక సేయుఁ ♦ డిఁకమాపనుపు౯.

వ. అని చెప్పిన నప్పర్వతసార్వభౌముఁ డందులకు వల్లెయనినంత సుపర్వాగ్రణులు
లాతనికి౯ దత్సతియగు మేనకకు౯ దపశ్చర్యాప్రకారం బుపదేశించి వారలఁ
దపంబందు నియోగించి యిట్లు జగదీశ్వరీపునరవతరణంబునకుఁ బునాదువేసి
యటనుండి వెడలి మార్గమధ్యంబున నొక్క పుణ్యారణ్య ప్రదేశంబందు మహే
శ్వరి౯ గూర్చి నమస్కరించి యిట్లు ధ్యానంబొనర్చిరి. 65

—* విష్ణ్వాదులు పరదేవతనుగూర్చి ధ్యానము సేయుట *—

మ॥ జగదంబా! యుమ! శంభులోకనిలయా! ♦ శర్వప్రియా! దుర్గ! యి
మ్మొగ నీయడ్గుల మ్రొక్కి కొల్చెదము వి♦ స్ఫూర్జత్ప్రితాపాయతా!
త్రిగుణాతీత! గుణాంచితా! శ్రుతినుతా! ♦ శ్రీశక్తి! యవ్యక్తమూ
ర్తి! గభస్తిస్ఫురితాకృతీ! ఋజుగతీ! ♦ దివ్యచ్చరిత్రోన్నతీ! 66

సీ॥ కమలజాండములందుఁ ♦ గల జగజ్జీవుల, నుండి యంతకుఁద్రుప్తి ♦ నొసఁగుదాని
భాస్కరమండల ♦ వర్తినియగుచుఁ బ్ర, పంచప్రకాశమ్ముఁ ♦ బెంచుదాని
నిద్రయన్ జేరితో ♦ నిఖలభూతములకు, మాయాపటంబు న♦మర్చుదాని
సంసారజాతవి ♦ స్తారదుఃఖాబ్ధిని, స్తారతరణినాఁగఁ ♦ దనరుదాని

గీ॥ యమముమున్నగు సర్వయో♦గములపాల, నమునఁజాల వలంతియై♦యమరుదాని
వింధ్యగిరివాసనిరతయై♦ వెలయుదానిఁ, బరమశివురాణిఁగొల్తు మ♦హాభక్తి.

ఉ॥ నీవె సమస్తవేదగత ♦ నిశ్చితతత్త్వమ వంబరో! యిఁకన్
నీవె సమస్తదేవగణ ♦ నిత్యనియామక వమ్మరో! యిఁకన్
నీవె సమస్తలోకముల ♦ నేటుగ సాఁకెదు జాణ వంబికా!
నీవె సమస్తదుర్గతుల ♦ నెట్టనఁగొట్టెదు దిట్ట వీశ్వరీ! 68

క॥ పుష్టివి నీవే సురలకుఁ, దుష్టివి నీవే మునీంద్ర ♦ ధూర్వహులకుఁజి
త్తేష్టగమ వీవె పుణ్యుల, కష్టమశనివీవె దుర్గ ♦ నావళికెల్లన్. 69

గీ॥ వేదములకెల్లఁ దల్లివై♦విశ్వమెల్ల, వెలయుగాయత్రి వీవె సా♦విత్రి వీవె
ఆ సరస్వతి వీవె స ♦ ర్వాగమార్థ, సారవస్తువ వగు దీవె ♦ సత్యమీవె. 70

—* విష్ణ్వాదులకుఁ బరదేవత సాక్షాత్కరించుట *—

గీ॥ అని యిటుల్ వినుతింపుచు ♦ నంబికను గ, నంగ వాంఛించు దేవాధి♦నాథవరుల
కట్టెదుర నగ్గలంబైన ♦ కరుణ గదుర. నమ్మహాదేవి యపుడు ప్ర♦త్యక్షమయ్యె.

క॥ రత్నమయంబగు రథమున, నూత్నపు మృదులాస్తరణమ ♦ నొజ్జస్థలి స్త్రీ
రత్నమగు రాజభూషణు, పత్ని సురోత్తముల యత్న ♦ ఫలమై యొప్పెన్.

గీ॥ కోటిసూర్యాధికంబైన ♦ గురుతరప్ర, కాశతేజః ప్రకరమునఁ♦గరముదృష్టి
దుర్గమంబయి రంజిల్లు ♦ దుర్గ ననుప, మాన దివ్యమ్మహామాయఁ♦గాన లేక.

వ. పదంపడి దివిజనాయకు లమ్మహాదేవికి వినతులై నుతిశతంబు లర్పించి దర్శనం
బపేక్షించియుండ. 74

సీ॥ చాపబాణాంకుశ♦చటులపాశారవిం, దములొప్పు నాల్గు హ♦స్తములతోడ
బాలేందురేఖావి ♦ భాసితంబగుచు నం, దంబుఁజెందిన కిరీ ♦ టంబుతోడ
పద్మరాగచ్ఛాయఁ ♦ బరిఢవించిన మనో, జ్ఞములైన మాల్యాంబ♦రములతోడ
మందహాసపు కీవి♦మానుజించెడు దయా, స్పదములై తగు కటా♦క్షములతోడ

గీ॥ భవ్యకాశ్మీరగంధలే ♦ పములతోడ, ముంగురులుమూఁగు కస్తూరి♦బొట్టుతోడ
భువనములకెల్ల భ్రమసేయు♦మూర్తితోడ, శంకరార్ధాంగలక్ష్మిసా♦క్షాత్కరించె.

వ॥ అంత నిలింపు లత్యంతసంతోషితస్వాంతులై సాష్టాంగవందనంబు లాచరించి
యంబిక నిట్లు వినుతించిరి. 76

మ॥ శివ ! కల్యాణి ! భవాని! యీశ్వరి ! జగ ♦ త్సేవ్యా ! సమస్తార్తిహృ
ద్వ్యవసాయా! నిగమంబు వాఙ్మనసనం ♦ పత్తిన్ భవచ్ఛక్తి సం
స్తవముం జేయఁగఁ దక్కి కాదదిమెదో ♦ శక్యంబుగాదంచు మిం
చు వెఱఁగాంచి వచించెఁ దల్లి ! యిఁకమా ♦ సూక్తుల్ యథోక్తంబులే. 77

క॥ వినను నీభక్తులకే, మేనిభయంబింతలేక ♦ యెట్లోభవదీ
యానూనమహిమ నెన్న భ, వానీ ! దయ నొత్తువమ్మ ! ♦ పరమప్రీతిన్.

ఉ॥ దక్షుని కూఁతురై మును సు ♦ ధాకర శేఖరుఁ బెండ్లియాడి బ
ల్కక్షు మహేశ్వరుం దెగడు ♦ కశ్మలు దక్షుని రోసి యాత్మదే
హాక్షయమున్ బొనర్చి యిటు ♦ లాత్మపదంబును జెందితీవు ఫా
లాక్షుఁడు నీవియోగమున ♦ నార్తివహించి కృశించె నెంతయుం. 79

గీ॥ తల్లి ! లోఁగటి యవతార ♦ దశను దేవ, కార్యసిద్ధి నొనర్పక ♦ కడపి తీవు
మునులు వేల్పులు మేమెల్ల ♦ వనటఁగుంది, శరణుఁ జెందితిమమ్మ! నీ ♦ చరణములను.

చ॥ మరల ధరన్ జనింపు శశి ♦ మండనుఁ బెండిలియాడి యాకృపా
కరుని మనం బలర్ప వద ♦ కంజములన్ భజియించు మమ్ము వి
స్తరకరుణాతిరేకమున ♦ సౌఖ్యములొందఁగఁజేయు విస్మయా
కరమగులీలఁ గూర్పుము జ ♦ గంబులు మెచ్చ మహేశ్వరప్రియా ! 81

గీ॥ అనుడు జగదేకమాతృక ♦ యాలకించి, హేతువెంచి మదిన్ హృద ♦ యేశునీశు
భక్తితోడ స్మరించి దే ♦ వ్వరపుఁ గరుణ, నచ్యుతాదులఁగాంచియి ♦ ట్లనుచుఁబలికె.

—*పరదేవత దేవతలకు వరములిచ్చుట *—

ఉ॥ ఓ హరి ! యో చతుర్ముఖుఁడ ! ♦ యో పురుహూత ! వినుండు యుష్మదీ
యేహ నెఱింగితిం వరము ♦ నిచ్చెద మెచ్చెద మీ విపత్తులన్
మోహము నేనచేసితిని ♦ మూర్ఖుఁడు దక్షుని కట్లు నాఁడు సం
దేహములేక యిభ్భువి జ ♦ నించెద మించెద శంభు రాణినై. 83

గీ॥ కలవు హేతువులిఁకఁ గొన్ని ♦ కనికరమునఁ, జెప్పెదవినుండు మున్నల ♦ శీతశైల
భర్త యాతనిసతి మేన ♦ పరమసాధ్వి, నన్ను సేవించి రధికప్రి ♦ పన్నులగుచు.

ఆ॥ ఇపుడుఁగూడ వార ♦ లెంతో భక్తినిఁజెంది, నన్ను సుతనుగా మ ♦ నసునఁ గోరి
తపసుఁ బూనిరింకఁ ♦ దథ్యంబుగా వారి, గర్భమందుఁ బుట్టుఁ ♦ గాంచుదాన.

వ. మఱియును.

ఉ॥ అక్కట ! నా మనోదయితుఁ ♦ డా శివుఁడెంతయు నావియుక్తిచే
వెక్కసమైన దుఃఖమున ♦ వేమఱుఁ బొక్కుచు నుక్కుచున్ గడుం

జిక్కి దిగంబరుండయి య ♦ శేషధరన్ దిరుగాడుచుండె నా
కక్కరుణాకరున్ దలఁప ♦ నార్తియగున్ హృదయంబు నీరగున్. 86

సీ॥ ధరియించు నాతండు ♦ తాపంబణఁప ఘోర, దర్వీకరముఁ బుష్ప ♦ దామమట్లు
చరియించు నాతండు ♦ సంతసంబొప్ప శ్మ, శానమ్మునందు ను ♦ ద్యానమట్లు
కొలువుండు నాతండు ♦ కుతుకంబుతోడఁ గు, ధరకూటముల సౌధ♦తలములట్లు
నలఁదు నాతండు శాం ♦ త్యర్థంబుగా నల్ల, కాటిభస్మంబు శ్రీ ♦ గంధమట్లు
గీ॥ ఏమనుచుఁ జెప్పుదాన నా♦యీవియోగ, దుఃఖభరమునఁ బొగలు రు♦ద్రునిచరిత్ర
మక్కటా! మిక్కుటంబగు♦నక్కటికము, సేయదే యేరికేని యో♦జింపుఁడీరు.

ఉ॥ నాదుశవంబు మూఁపున ఘ ♦ నవ్యథ మోయుచుఁ గొన్నినాళ్ళటుల్
రోదనముం బొనర్చు పతి ♦ రుద్రునిఁ గాంచి రమాకళత్ర ! నీ
వాదరమొప్పఁ జక్రమున ♦ నాశవగాత్రముఁ ద్రుంచి వైచి యా
వేఁదుఱు మాన్పలేదె సర ♦ విన్ సురలెల్లరు సంతసింపఁగన్. 88

చ॥ "అరయక తండ్రి నాకటు ల ♦ నాదరమున్ బొనరింపఁ గుంది ని
ర్భరమగు రోసమొంది సతి ♦ ప్రాణముఁ బాసె నటుల్ పతివ్రతా
భరణమనాఁగ నింపెసఁగు ♦ భార్యను బాసి యెటుల్ భరింతు దు
ర్భరమగు దుఃఖమంచు" నిలు ♦ వాసె గణంబులఁ బాసె భర్త దాన్. 89

గీ॥ ధీరుఁడయ్యును మాయకు♦మారుఁడయ్యె, నేవికారంబులేనిమ ♦ హేశుఁడయ్యెఁ
బూర్ణుఁడై యెప్పునయ్యాది♦పురుషుఁడయ్యెఁ, గాముకునిఁ బోలి పొగలె జ♦గంబునందు.

క॥ కాకున్న నిట్టి మోహపుఁ, జీకాకువడంగ నట్టి ♦ శివునకదేలా ?
లౌకికుఁడు వోలెఁ దిరిగె న, లౌకికుఁడై ప్రకృతికెపుడ ♦ లక్ష్యంబైనన్. 91

గీ॥ నావియోగంబు మొదలు నా♦నావిధోప, భోగములతో నుడిగెఁ గామ♦భోగమతఁడు
నేన యవతారమెత్తినఁ♦గాని మరలఁ, బెండ్లియాడఁడు వేఱొక్క♦వెలఁది నెందు.

ఉ॥ కావున నింక సత్వరము ♦ గా నవతారమొనర్తు శైలప
త్నీవిమలోదరంబున జ ♦ నింతు నఘాపహులైన తాపసుల్
భావములందుఁ బొంగఁగ న ♦ పారతపం బొనరించి యమ్మహా
దేవుని రాణి నౌదుఁ గడుఁ ♦ దేఁకువ సాఁకుదు నాకవాసులన్. 93

ఉ॥ పొండిఁక మీగృహంబులకు ♦ భూతపతిన్ శివుఁ గొల్వుఁడా దయా
మండనుఁ డెల్ల దుఃఖముల ♦ మాన్పి సుఖంబిడు నా సుమేరుకో
దండుని పత్ని నౌటఁ గద ♦ తద్దయు ధన్యతఁ జెంది యేను బ్ర
హ్మాండమునందు వంద్యనయి ♦ యందఱఁ గాచుట దేవనాయకుల్ ! 94

గీ॥ అనియిటులఁబల్కి జగదంబ ♦ యాదితేయ, నాయకులుచూచుచుండఁగ ♦ నత్తటిల్ల
తవలెనిజధామమొదఁ ద్రి ♦ దశవతంసు,లంబఁగొనియాడి తమయిండ్ల ♦ కరిగిరెలమి.

గీ॥ మునులు సూతునితో నిట్టు ♦ లనిరి దేవ, దేవి నిజధామమొందఁగా ♦ దివ్యవరులు
తమగృహంబులకేగభూ ♦ ధరుఁడు మేన, యెట్లుతపసొనరించిరో ♦ యెఱుఁగఁ జెపుము.

## —* మేనకాహిమవత్తపోవర్ణనము *—

క॥ అనవుడు సూతుండిట్లనె, మునులార ! వినుండు దేవ ♦ ముఖ్యులటులు బో
ధనమొనరించి చనన్ శ్రీ, తనగేంద్రుఁడు మేనయును ని ♦ తాంత ప్రేమన్. 97

చ॥ పరఁగఁ దపంబొనర్చి రన ♦ వద్యమహోద్యమకామధామవి
స్ఫురదసమానమానసవి ♦ భూషితభక్తినియుక్తులై మహే
శ్వరసహితంబుగా నుమను ♦ చైత్రసిత ప్రతిపత్తుదొడ్తగా
నిరువదియేడువారము ల ♦ హీనవిధానముగా భజింపుచున్. 98

గీ॥ పర్వతేంద్రునిరాణి సం ♦ బరముతోడ, నిరుపమానసుసంతాన ♦ నిరత యగుచు
గాంగసైకతమున మహా ♦ గౌరివిగ్ర, హమును బొనరించి పూజించు ♦ నహరహంబు.

గీ॥ తదియనాఁడష్టమిని నితాం ♦ తప్రపత్తి,తోడఁ బస్తుండి యమ్మఱు ♦ నాఁడు మోద
కాన్నముల గౌరిఁబూజించి ♦ యవనిసురల, సాపడఁగఁజేసిదానముల్ ♦ చాలఁజేయు.

క॥ కొన్నిదినంబులు ఫలములు, గొన్నిదినంబులును వన్య ♦ కుసుమరసంబున్
గొన్నిదినంబులు జలమును, గొన్నిదినంబులును గాలిఁ ♦ గ్రోలి తపించెన్. 101

## —* మేనకకుఁ బరదేవత ప్రత్యక్షమగుట *—

గీ॥ సప్తవింశతివారముల్ ♦ జరుపనిట్లు, కడఁగి జగదేకమాత మే ♦ ల్కరుణనొసఁగు
సంతసంబున మేనకా ♦ కాంత యెదుర, నిలిచి ప్రత్యక్షమయ్యెఁగో ♦ ర్కులనుదీర్చ.

క॥ మెచ్చితి సాధ్వీ! నీ భా, స్వచ్చరితతపోవ్రతంబు ♦ వరమడుగు మింకన్
హెచ్చుగ నెట్టిదియే నే, నిచ్చెదఁ దడఁబాటులేక ♦ హిమశైలసతీ ! 103

గీ॥ అంబ వాల్లభ్యమలర ని,ట్లనుడు మేన,యంబఁగని మ్రొక్కి విజ్ఞాన ♦ మలమికొనఁగ
నంజలిఁబొనర్చిమధురోక్తు ♦ లమరనిట్లు, ధ్యానమొనరించెఁదత్పదా ♦ ధీనయగుచు.

గీ॥ ఏమహామాయ తనయందు ♦ నీజగంబుఁ, బొడమఁజేసి ధరించు వి ♦ స్ఫూర్తిగరిమ
నమ్మహాదేవి నాచండి ♦ కాంబ నిపుడు, డెందమునఁగొల్చియొనరింతు ♦ వందనములు.

సీ॥ ఎల్లలోకములకు ♦ హేతువై తగుదాని, యోగనిద్రయనంగ ♦ నొప్పుదాని
భక్తులవలవంతఁ ♦ బాఱఁదోలెడుదాని, మంచిదాసుల మురి ♦ పించుదాని

తల్లులకెల్లను ♦ దల్లివై తగుదాని, నానందమున నెప్పు ♦ డలరుదాని
నిర్జరీరత్నమై ♦ నీటుమీఱెడుదానిఁ, దమ్మిపూదండలఁ ♦ దాల్చుదాని

గీ॥ సర్వకార్యార్థములను నొ ♦ సంగుదానిఁ, బ్రాణులకు నెల్ల బుద్ధివై ♦ పరఁగుదాని
యతులకెల్లర కెఱుకవై ♦ యమరుదాని, సిద్ధయగుదానిఁ గొలుతుఁ ద్రి ♦ శుద్ధిగాను.

చ॥ అనలునియందు నుగ్రకల ♦ వై హరిదశ్వునియందు దాహక
ధ్ఘనకలవై శశాంకునెడఁ ♦ గాటపుసంతస మిచ్చు కాంతివై
దనుజనిహంతయందు విత ♦ తంబగు మాయవునై సుధాంశుమం
డనునెడఁ జిన్మయాకృతిఁ గ ♦ నంబడు దీవె గదమ్మ శాంకరీ! 107

గీ॥ ఊర్ధ్వరేతస్కులై కడు ♦ నొప్పు ఋషుల, కందఱకు బ్రహ్మవిద్యవై ♦ యలరె దీవు
జగమునందలి సంసారి ♦ జనమునకును, గోర్కెవై యొప్పుచుందువు ♦ కూర్మి మీఱ.

క॥ కష్టంబేమియుఁ గాంచక. సృష్టిస్థితినాశములను ♦ జేకూర్చుటకై
స్రష్టను హరిహరులను మహి, తేష్టమతిఁ గూర్చినట్టి ♦ యేలిక వీవే. 109

గీ॥ తల్లి! నాబోటులేడ యు ♦ ద్దామమైన, నీప్రభావంబు నెలమి వ ♦ ర్ణించు టేడ
శరణుఁ జేసెదనమ్మ! ప్ర ♦ సన్న వగుము, యిష్టవరములనిమ్ము మ ♦ హేశపత్ని!

క॥ ఇట్లు నుతించి భజించిన, గట్లేలికసానిఁ గాంచి ♦ కాళీసతి దా
నిట్టట్లనఁ జెల్లనిదయ, యట్లేర్పడఁ గౌఁగిలించి ♦ యాపటఁ బలికెన్. 111

ఉ॥ కొండలఱేనిరాణి! యను ♦ గుంజెలి వమ్మరో! నాకు నీవు నే
నిండగు గారవమ్మెసఁగ ♦ నీదగుకోర్కు లొసంగవచ్చితిన్
దండిగఁ గోరు మొండనక ♦ తప్పక యిచ్చెద నాకు నీకరా
కుండెడి దంచు నొక్కటియు ♦ నుండదు ముజ్జగమందు నెందునన్. 112

గీ॥ అమృతధారలఁ జిందు దు ♦ గ్గాంబపలుకు, సంబరంబున విని గిరి ♦ సార్వభౌమ
పత్ని దోయిలియొగ్గియు ♦ ప్పొగిదిఁ బలికెఁ, దల్లి! నే వర మొందఁగాఁ ♦ దగిన యెడల.

మ॥ శతపుత్రుల్ నుతిపాత్రులిష్టు తోలుతన్ ♦ వైత్రుల్ చిరంజీవులున్
మతిమంతుల్ జనియింపఁగావలె నికన్ ♦ మన్నించి నీవింపుమై
సుతవై నాకు జనింపఁగావలె సుర ♦ స్తోమంబు కార్యంబు నా
దృతిఁ గూర్పన్ వలె వామదేవసతివై ♦ తీర్పన్ వలెన్ లీలలన్. 114

—* పరదేవత మేనకకుఁ గోరిన వరంబులిచ్చుట *—

గీ॥ అనుడు మేనావరంబుల ♦ నాలకించి, మందహాస మొనర్చి బా ♦ లేందుమౌళి
కాళి యిట్లనె మేనకా ♦ కాంత! నీవు, గనెదు నూర్గురుకొడుకుల ♦ గరిమ మెఱయ.

ఉ॥ అందును నుత్తమోత్తముఁ డ ♦ హర్పతితేజుఁ డొకండు ముఖ్యుఁడై
ముందుగఁ బుట్టు నేనును న ♦ మోఘతరాదరమొప్ప నుద్భవం
బందెద నీదు గర్భమున ♦ నాత్మజనై యనిమేషకార్యమ
ర్థిం దగఁజేతు నీశ్వరు వ ♦ రింతు నిఁకం జను కంజలోచనా! 116

వ. అని యిట్లు వరంబిచ్చి యమ్మహాదేవి యంతర్ధానంబుఁ జెంద నమ్మేనక యద్దిశాభాగంబునకుఁ బ్రణామమ్ము లొనర్చి యత్యంత సమ్మోదమ్మునన్ దపఃక్లేశమ్ముఁ బోఁజిమ్మి జయశబ్దమ్ము లొక్కుమ్మడిఁ గావింపుచు నాత్మేశ్వరుఁ జేరనరిగి వరసిద్ధిఁ దెలిపిన గిరీశ్వరుండును సంతుష్టుండై యక్కోమలాంగిఁ బెక్కుభంగులఁ గొనియాడి యక్కునఁ జేర్చి గారవించె. 117

## —* మేనకకు నూర్గురు కొడుకులు పుట్టుట *—

గీ॥ అంత గిరిరాజదంపతు ♦ లతులరతుల, సౌఖ్యమొందఁగ మేనకా ♦ సాధ్వి చూలుఁ
దాల్చి మేలైనవేళలోఁ ♦ దనయుఁగనియె, ఘనుని మైనాకనాము న ♦ గణ్యబలుని.

క॥ పదఁపడి వరమహిమంబున, నుదయించిరి సుతులు వారి ♦ కుదితార్కనిభుల్
ముదమునఁ బుత్రోత్సవమా, యదనున నొనరించె భూధ ♦ రాధీశ్వరుఁడున్.

క॥ గిరివరుఁ డొసఁగెను దానము, లురవుగ బ్రాహ్మణగణమున ♦ కొడ్లకును ధనం
బరుదొప్పనిచ్చె గౌరీ, పరమేశ్వరచరణకమల ♦ భక్తి నిగిడ్చెన్. 120

చ॥ హిమగిరి మేనయున్ జగద ♦ ధీశ్వరి పుట్టువుఁగోరి యాత్మచి
త్తమునఁ దలంప నాపెయును ♦ దానిడినట్టి వరంబు నప్డు స
త్యము నొనరింపఁగాఁ గడఁగి ♦ దైవతకార్యభరంబు నెంచి పూ
ర్ణమయిన యంశతో హిమధ ♦ రాధరుచిత్తము నొందెఁ బొందుగన్. 121

క॥ ఆగట్టులఱేఁ డత్తఱిఁ, దా గౌరితేజ మెలమిఁ ♦ దాల్చి మెఱయుచున్
బాగైయమరు ముహూర్తపు, భాగంబున నద్రిచేర్చె ♦ భార్యతనువునన్. 122

గీ॥ తనదు పెనిమిటియెడనుండి ♦ తన్నుఁ జేరి, నట్టి జగదంబ తేజంబు ♦ నంది మేన
గర్భమున్ దాల్చి నిర్భర ♦ కాంతిపుంజ, రంజితాకార యగుచుఁ గ ♦ రంబు మెఱసె.

గీ॥ ఆరగింపున నరుచి మెం ♦ డయ్యె నొక్కి, లింత లేర్పడె నిదురయ ♦ లంత హెచ్చె
నగలు మూలలకుఁబడియె నె ♦ మ్మొగము లోధ్ర, కుసుమసమమయ్యె గట్టురా ♦ కొమ్మకపుడు.

గీ॥ మట్టితావులఁజిమ్మున ♦ మ్మగువ మోము, కమ్మనలఁజాలఁగొనుచు నే ♦ కాంతమందుఁ
దనివిఁ గొనలేకయున్న ను ♦ దారహర్ష, భరముఁ జెందె మహీధర ♦ ప్రవరుఁడపుడు.

క॥ దోహదముఁ దీర్పఁ దలకొని, యాహిమవతుండు మేన, ♦ కాత్మస్పృహ నెం
తో హరువొప్ప నెఱింగి మ, హాహర్ష మెసంగఁ గూర్చె ♦ నపు డద్దానిన్. 126

గీ॥ దేవతలపాలి కల్పల♦తికనుబోలు, నంబికను గర్భమునఁదాల్చి ♦ యమరు సతిని
రత్నఖనిగర్భమైన యు♦ర్వరనుబోలెఁ, గాంచి మురిసెగిరీశ్వరా♦గ్రణియు నంత.

గీ॥ అభ్రితంబగు నాకస ♦ మట్లు ప్రసవ, సమయమొందినసతికి ర ♦ క్షకులనున్ జి
కిత్సకుల నేర్పఱచి గర్భ♦గేహమందు, నునిచి యంబను దలఁచుచు♦నుండెనతడు.

ఉ॥ మేనకగర్భమందుఁ దమ ♦ మేలునకై పుడమిన్ జనింపఁగాఁ
బూనిన యంబికన్ మిగులఁ ♦ బొంగఁగఁజేయ సువర్ణనాయకుల్
మౌనులు దారసిల్లి యస ♦ మానవచస్స్వనముల్ సెలంగఁగా
ధ్యానముచేసి రాగమని ♦ దానవిధానపథానురోధులై. 129

ఆ॥ జయము జయము దుర్గ! ♦ జయము మహేశ్వరి!
జయము జయము విజ్ఞ! ♦ జయము కాళి!
జయము సత్యనిష్ఠ! ♦ జయము సత్యవ్రత!
జయము సత్యరూప! జయము శక్తి! 130

శా॥ తల్లీ! నీవలనన్ గదా జగము లా ♦ తంకంబు లేకింతయే
నుల్లాసంబును జెంది పెంపెసఁగు నీ ♦ వాక్కింత దవ్వొందినన్
ముల్లోకంబులు దెల్విఁదప్పి చెడు మే ♦ మున్ మేటి నీసత్కృపా
వెల్లద్భాగ్యమునన్ సురక్షితులమై ♦ పేర్గాంటి మంబా! యిటుల్. 131

క॥ పుడమి జనియించి యిఁకమా, యిడుములఁ గడ తేర్పుమమ్మ!♦యెంతయుఁబేర్మిన్
కడు నేమగడగఁ గొని ని, న్నెడపక పూజించువారి♦మెడఁగల కరుణన్. 132

గీ॥ మేనకాగర్భమందుఁ బే♦ర్మిన్ దనర్చు, నఖిలలోకాంబ నిటుఁగొని♦యాడి వార
లెల్లఁ దమతమ నెలవుల♦కేగిరంత, మేనకకునిండె నెలలుదొ♦మ్మిదియు నపుడు.

వ. పదియవమాసంబున నొక్క శుభసమయంబున.

—* శ్రీ పరదేవతావతార ఘట్టము *—

సీ॥ ఆకసంబు ప్రసన్న♦మయ్యెను సౌమ్య న, క్షత్రమాలాగ్రహ♦కలితమగుచు
గాడ్పు సుఖస్పర్శ ♦ గలిగివీచెను మేలి, కమ్మపుష్పాదులను ♦ గ్రమ్ముకొనుచు
సలిలంబు దనరెఁగా♦సారసరోధునీ, వితతిన్ బ్రఫుల్లార ♦ విందమగుచు
వసుధయొప్పెను జన ♦ పదపట్టణారణ్య, ముల నెన్నఁదగు పండు♦గులనుగనుచు
గీ॥ అగ్నిహవ్యంబునొందె స♦వ్యార్చియగుచుఁ, జందురుఁడుపండువెన్నెలఁ♦జల్లెఁబెల్లు
పుష్పవర్షంబుగురిసె వి♦స్ఫూర్తిదిశలు, మెఱసె సజ్జనులెంతయు♦మురిసిరెలమి.

క॥ పాడిరి గంధర్వులు దివి, నాడిరి రంభోర్వశీము ♦ ఖాప్సరస లొగిన్
వీడిరి యలజడి వేల్పులు, వాడిరి బెగ్గడిలి వనటఁ ♦ బాపచరిత్రుల్. 135

గీ॥ పరఁగ శ్రీచైత్ర శుద్ధ న♦వమినిశీథ, మందు మృగశీర్షనక్షత్ర ♦ మందు క్షీర
సాగరమునుండి యిందిర ♦ చొప్ప మేన, కాతరుణి గర్భమందు శ్రీ♦కాళిపొడమె.

క॥ శివ యవతారము సేయఁగ, శివుఁ డానందించె నింగిఁ ♦ జెలఁగుచు భేరీ
రవ మొనరించిరి వేల్పులు, రవమున్ బొనరించె మేఘ♦రాజియనువుగాన్.

ఆ॥ పుష్పవృష్టి యలరెఁ ♦ బొలుపుగాఁ గమ్మనల్, గుప్పెగాడ్పు శీత♦కుధరనగరి
నుండువారికెల్ల ♦ నూడె నుమ్మలకమ్ము, సాటిలేనిసంత ♦ సంబెసఁగె. 138

—* విష్ణ్వాదిదేవతలు పరదేవను డజీసి స్తుతించుట *—

క॥ అనిమిషులు గడిఁదిహర్షం, బున నట కరుదెంచి నిఖిల♦భువనాంబను గ
న్గొని యిట్లు నుతిఁబొనర్చిరి, కనదసమానాభిరామ♦ఘనతరఫణితిన్. 139

ఉ॥ అంబరో! దేవకార్యమును ♦ నర్థిఘటింపఁ దలంపు చేసి జ
న్మంబును నొందినట్టి నిను ♦ నమ్మి భజించెదమమ్మ! యిట్లు పూ
ర్ణంబు నొనర్చితీవు గిరి ♦ రాణ్మిథునోరుమనోరథంబు సి
ద్ధిం బొనరింపు వేగ మిఁక ♦ దివ్యులకార్య మవార్యమౌ కృపన్. 140

ఆ॥ విష్ణుముఖ్యదేవ ♦ విభులిట్లు జగదంబి, కనునుతించిమ్రొక్కి ♦ కడుముదమునఁ
దమదుధామములకుఁ ♦ దరలిరి జగదీశ్వ, రీదయన్ బొగడుచు ♦ నాదరమున.

క॥ నీలోత్పలదళకాంతులఁ, బోలినతనుకాంతి మిగులఁ ♦ బొంగిపొరలు నా
కాళిక దివ్యాకారము, శైలేశ్వరి గాంచి మించు ♦ సంతసమెసఁగన్. 142

చ॥ ఓపరమేశ్వరీ! త్రిభువ♦నోన్నత పూతచరిత్ర! సత్కృపా
ద్వీపవతీ! సతీ! సకల♦దేవనుతా! శివధర్మపత్ని! నీ
వీ వగిదిన్ గృపన్ సలుపు ♦ టెంతయు సంతసమమ్మ! యైన నీ
రూపముమార్చి నాసుతగ ♦ రూపము మైకొనుమమ్మ శాంకరీ! 143

క॥ ఇటు లాడిన మేనకనుడి, నిటలాక్షునిరాణి విని వి♦నిద్రప్రేమన్
గుటిలత యొకింతలేకయె, యిటు పల్కెసుధారసంపు ♦ టిమిడిక యమరన్. 144

ఉ॥ మేనక! మున్ను నీతపసు ♦ మెచ్చి వరంబటులిచ్చి యిప్పుడ
ద్దాని ఘటించితిన్ గుఱుతు ♦ దట్టుటకై యిటు నా స్వరూపమున్
బూనితి నింక దీనివిడి ♦ పుత్రికయాకృతిఁ జెందుదాన సం
తానముదంబు నొందుఁ డగ ♦ తల్లజమౌళియుఁ బుణ్య వీవునున్. 145

గీ॥ దేవతలకార్యభర మిఁకఁ♦దీర్చుదానఁ, బరఁగఁదరుణేందుధరుఁ జెట్ట♦పట్టుదాన
దుర్మతులయాసలడుగంటఁ♦దునుముదానఁ, బెనుచుదాన శుభంబులఁ♦బేర్మిమీకు.

క॥ నాయందు దుహితృభావము, సేయుఁడు నను బెంచి పెండ్లి ♦ సేయుఁడు ప్రేమన్
రాయుఁడు పాపచయంబుల, వేయుఁడు నిర్వాణసౌఖ్య♦విజయధ్వజముల్. 147

వ. ఇట్లు చెప్పి యప్పరదేవత తదక్షణంబున నాత్మమాయావిశేషంబున బాలికా కృతిన్ దనరి రోదనంబుచేసిన మేనకయును దత్సంగతాళీజనంబులును ననన్య సామాన్యంబగు నబ్బాలికా తేజంబున కక్కజంబొంది కడున్గడు సంతసంబొంది రాసమయంబున. 148

గీ॥ పుట్టిటిపానుపునందు వి♦స్ఫురితగతులఁ, బరఁగు బాలతనుప్రభా♦పటలి నర్ధ
రాత్రిమున వెల్గుదీపముల్♦రహినిఁదక్కి, చిత్రగతదీపములఁబోలి♦చెలఁగెనపుడు.

—* హిమవంతుఁడు పుత్రీ జననోత్సవము సేయుట *—

క॥ పుత్రీజననోదంతము, నాత్రముగా వచ్చి చెప్పి ♦ నట్టిజనుల కే
మాత్రము గొంకక శ్వేత, చ్ఛత్రము వెలిగానొసఁగె న♦చలుఁడఖిలంబుల్. 150

గీ॥ హితులగు మహీసురులఁబురో♦హితులఁగూడి, శైలపతిపుట్టింటికిఁ♦జని కుమారిఁ
గనిమోఁ గాంతుల గృహమెల్లఁ♦గప్పుదాని, నల్లకలువలడాలు వె♦న్నాడుదాని.

చ॥ కని ఘనమైనసంతసము ♦ గ్రమ్ముకొనంగ నగేంద్రుఁ డాత్మజా
జననమహోత్సవం బెసఁగ ♦ సల్పె ననల్పములైనవాద్యని
స్వనములు వారసుందరుల ♦ చాతురి మీఱెడు నాటపాటలుల్
గొనబుఁదనర్ప బ్రాహ్మణుల♦కుల్దగు దానములిచ్చి హెచ్చుగన్. 152

—* నా మ క ర ణ ము *—

గీ॥ జాతకర్మంబులొనరించి♦ శైలరాజు, మునులతో మంచిసుముహూర్త♦మునఁదనయకు
నామకరణంబు చేసి నా♦నాధనములఁ, బంచిపెట్టెను యాచక♦ప్రతతి కపుడు.

గీ॥ కాళీ! కామేశ్వరీ! శివ!♦కామసుంద, రీ! లలిత! ఆర్య! చండిక! ♦ బాల! యనుచుఁ
బేరులనుబెట్టి మెంతయుఁ♦బ్రియము మెఱయ, బిలిచి రాబాలికనునింపు♦పెంపుగదుర.

క॥ పర్వతపతియా హిమవ, త్పర్వతమున కెలమి నిడు న ♦ పత్యంబగుటన్
బార్వతి యనుపేరును నీ, యుర్విన్ గైసేసె నాపె♦యుచితవిధముగాన్. 155

*గీ॥ అఖిల జగదంబయై సము♦దారకరుణ,జగములన్ గాచుచుండుటఁ♦జక్కనుమయ
టంచుఁబేరునుదాల్చియా♦యవనియందుఁ, బరఁగెనెల్లరమదులకు♦మురుపునిడుచు.

క॥ నానావిధ గానంబు ల, నూనగతిన్ గాయకాగ్ర ♦ ణులు సల్పిరి సు
శ్రీనిధి గిరిపతి వారికిఁ, గానక కానక చయంబుఁ♦ గానుకలొసఁగెన్. 157

* అవతీత్యుమా – రక్షించునట్టిది—అవ రక్షణే

గీ॥ అంతహిమవంతుఁ డెంతయు ♦ సంతసంబె, సంగ నుత్సవమిబ్బంగి ♦ సంతరించి
కూఁతుఁబలుమఱుఁగాంచుచుఁ♦జేతమందుఁ,బొంగెఁబెల్లిదముగబహు♦పుత్రుఁడైన.

చ॥ వలిమలకూఁతు రెంతయును ♦ వార్షిక కాలమునాఁటి గంగ య
ట్టుల శరదిందుచంద్రికయ ♦ టుల్ కమనీయతరాంగియై దినం
బుల వరుసన్ గడున్ బొదలెఁ ♦ బొందుగ బంధుజనంబులెల్ల న
చ్చెలువముఁగాంచి యచ్చెరువుఁ ♦ జెంది ముదంబును జెందిరింపునన్. 159

క॥ పలుపురు నందనులొప్పగఁ, గలవారైనను గుమారి♦కనుఁగను చు హిమా
చలుఁడున్ దత్పత్నియు ని, మ్ములఁదృప్తిన్ జెందరైరి ♦ మురియుచు నెపుడున్.

చ॥ కలిమిఁగ మాత్రికులెల్ల నన ♦ కారునెడన్ జిగిరించి పూచి తా
వుల విలసిల్లుచున్నను ద ♦ వుల్కొనుఁ జూతసుమంబునందుఁ దేఁ
టులు కులశైలవల్లభు డ ♦ టుల్ గొడుకుల్ గడు నెక్కుడున్న ని
చ్చలు సుతనే కనుంగొనుచు ♦ సంతసమొంది చెలంగు నెంతయున్. 161

సీ॥ సంస్కారవంతమౌ ♦ చక్కనివాక్కునఁ, దేజంబునొందిన ♦ ధీరుపోల్కి
మహనీయతరకాంతి ♦ మండితంబగు శిఖ, భాస్వరంబైన దీ ♦ పంబు పగిది
విమలోదకంబున♦వెలయు గంగాఝరిఁ, గమనీయమైన యా ♦ కసముమాడ్కి
సరసకపీంద్రివి ♦ స్ఫురితమై తగుగోష్ఠి, జానొందినట్టి రా ♦ జన్యుఁ డట్లు

గీ॥ అఖిలజగముల కంబిక ♦ యైన యార్య
చేత నీక సర్వపర్వత ♦ శేఖరుండు
పూతుఁడును భూషితుండయి ♦ పొలుపుమీఱి
పుడమియందెల్లఁ గీర్తివి ♦ స్ఫూర్తిఁబడసె. 162

శ్రీ పార్వతీ బాల్యక్రీడాభివర్ణనము *—

గీ॥ ప్రబలసింహంబులను గొంతుఁ ♦ బట్టి లాగి
తెచ్చి మెక్కి వనంబెల్లఁ ♦ దిరుగుఁగాళ్లి
గున్నయేనుగుఁ గొనివచ్చి ♦ కోమరుఁ డనుచు
నెత్తికొని ముద్దిడును బ్రియం ♦ బెసఁక మెసఁగ. 163

వ. మఱియు నప్పర్వతరాజకుమారి బాల్యక్రీడావినోదంబులఁ దవిలి తోడిపడుచులను
గూడికొని చదలేటి యిసుకతిన్నెలందుఁ జేరి 164

సీ॥ జననినే నీకనాదు ♦ సంతాన మీరని, పండ్లొగిరంబులు ♦ పంచిపెట్టు
జగములేలెడు దొర ♦ సానినే నీరలు, ప్రజలంచుఁ బరువొప్పఁ ♦ బనులుసెప్పు
కామధేనువు నేను♦గడమసురభులీర, టంచుఁ గోర్కులను యో ♦ జించి తీర్చు
కల్పవల్లిని నేను ♦ స్వల్పలతలు మీర, లని నిజౌన్నత్యంబు ♦ నమరఁజూపు

గీ॥ గురుగులమరించుబ్రహ్మాండ♦గోళములని,బొమ్మలనుగూర్చుహరిపద్మ♦భవులనుచును
బంతులాడును రవిహిమ ♦ భానులనుచు, శైలరాజకుమారి శై ♦ శవముగూరి.

ఉ॥ శారదవేళ హంసములు ♦ జాహ్నవిఁజేరెడునట్లు రేయి వి
స్తారరుచుల్ మహౌషధులఁ ♦ జక్కఁగఁ జెందెడుమాడ్కి నద్రిజ
జేరెఁ దమంతఁబూర్వజని ♦ సిద్ధములై తగువిద్యలెల్ల నం
భోరుహనేత్రి దా గురుల ♦ పొంతఁ బఠింపుచునుండ వింతగాన్. 166

ఉ॥ కూరిమిమీఱఁ బార్వతిని ♦ గొల్చుచుఁ గృష్ణమృగీవ్రజంబుఁ గ
స్తూరిని రాల్చుఁ బూవులను ♦ దోయపుపండ్ల వనాధిదేవతల్
భూరిముదంబుతో నొసఁగి ♦ ముద్దులుసేయుదు రర్థిమైనలం
కారమొనర్తు రాయురగ ♦ కాంతలు దివ్యమణీచయంబులన్. 167

సీ॥ తమకన్గవకు నుర ♦ వుమకనుంగవయంచుఁ, గొలువఁజేరెడు ♦ మృగీకులములరి
తమనడుమకన్న సూ ♦ క్ష్మము శివనడుమంచు, సేవించిమోయు సిం♦హీవిసరము
తమనడలోడె భూ ♦ ధరకన్యనడకని, చేరుఁ బదముల హం♦సీచయంబు
తమకాలిమము పోల్పఁ ♦ దగదు కాళీవేణి, కని బర్హిణులు నృ♦త్తమునభజించు
గీ॥ శారికాకోకిలావళుల్ ♦ శైలజోక్తి, మాధురీ సాధురీతికి ♦ మానమింకి
కఱచుటకుఁజేరి తగు నుడి♦కారమొందుఁ, గన్పడదుసాటిశివకు జ♦గాననొకటి.

సీ॥ శివయని పిలువఁగాఁ ♦ జెలువ పల్కునుగాని, యన్యాహ్వయంబుల♦ కలఁతిసేయు
ఇందుశేఖరము బి ♦ ట్టైలమిఁదాల్చునుగాని, తలఁదాల్పదెన్నండు ♦ తక్కునగల
కంఠీరవర్షభ ♦ గజములనెక్కును, గాని యశ్వాది నె ♦ క్కన్దలఁపదు
భర్మారవిందసం ♦ భవపరాగవిభూతు, లలఁదు గాని యలంద ♦ దన్యలేప

గీ॥ ములను నిచ్చలు సామగీ ♦ తుల నెగాయ
నముసలుపుఁగాని యితరగీ ♦ తములఁ గనదు
శరధనుశ్శూలచంద్రహా ♦ సములఁబట్టుఁ
గాని యల్పాయుధములఁ దాఁ ♦ గందలఁపదు.

సీ॥ బాల విపంచికా ♦ వాదనంబొనరించుఁ, బరమేష్ఠిరాణి సం ♦ బరముఁజెంద
కాళి గాత్రమున రా♦గముల నాలాపించు, నిందిరహృదయంబు ♦ డిందు వడఁగ
లలిత నర్తనకౌశ ♦ లంబుఁజూపించు న, వ్విద్యాధరాంగనల్ ♦ వెఱఁగుఁజెంద
శివ చిత్రము లిఖించుఁ ♦ జెలువుగా వలరాజు, రాణి ధైర్యంబు గ♦రంబు సడల
గీ॥ అనుపమానమనోజ్ఞకా♦వ్యంబులల్లు, నల్లగురుకావ్యదేవులు ♦ డిల్ల వడఁగఁ
బరమకల్యాణి గిరివరే ♦ శ్వరకుమారి, లీలలేమని లెక్కింపఁ ♦ బోలునెలమి.

—* నారదాగమనము *—

ఉ॥ నారదమౌని యొక్కసుది ♦ నంబునఁ గొండలఱేని వీటికిన్
భూరితరప్రమోదమునఁ ♦ బోయి గిరీంద్రునిఁ దారసించినన్
ధీరుఁడతండు మౌనిఁగని ♦ దిగ్గనలేచి నమస్కరించి పై
వాఱెడు వేడ్కఁ బీఠమిడి ♦ పాద్యము నర్ఘ్యమునిచ్చి మెచ్చుగన్. 171

గీ॥ తనదుకూఁతునురప్పించి♦వినయమెసఁగ, మునిపదంబులకెఱఁగించి ♦ ముఖ్యకార్య
మిదియనితలంచి వినతుఁడై♦యింపుగదుర, నంజలిరచించియిట్లని♦యడిగెఁబ్రీతి.

ఉ॥ ఓ మహనీయదివ్యకరు ♦ ణోదధి ! యో పరమేష్ఠిపుత్రక
గ్రామణి ! మత్సుతాకరముఁ ♦ గాంచి గుణాగుణముల్ గ్రహించి యీ
కోమలగాత్రి యెవ్వని క ♦ గున్ దొరసాని మఱెట్టి సౌఖ్యముల్
దా మహిఁజెందునో చెప్పుఁడు ♦ తథ్యము మీవచనంబు ధారుణిన్, 173

గీ॥ ఇట్టులడిగిన గిరిపతి ♦ యిచ్చనెఱఁగి, దేవముని కాళిహస్తంబుఁ దేఱిచూచి
అఖిలశుభలక్షణంబుల ♦ నరసి మురిసి, యిట్లుపల్కెను భూమిధ ♦ రేంద్రుతోడ.

శా. శైలేంద్రా ! విను శారదేందుకలనా ♦ సారొంది వర్ధిల్లు నీ
బాలారత్నము నీదుకూఁతు రఖిల ♦ భ్రాజిష్ణురేఖాఢ్య గో
త్రాలంకారముసేయు మీకుఁ బతి కు ♦ ద్యత్సౌఖ్యమున్ గూర్చు వా
ణీలక్ష్ముల్ పొగడంగ నొప్పు సిరి రా ♦ ణింపంగ సొంపుంగనున్. 175

వ. వెండియు నజ్జడదారి యెలనగవుతో వాగ్విలాసంబు మెఱయ గిరివరునకిట్లనియె.

గీ॥ అద్రిరాజన్య ! నీకూఁతు ♦ హస్తమందు, రేఖలెల్ల సులక్షణ ♦ రేఖలైన
నొక్కరేఖ విలక్షణం ♦ బున్నకతన, దానిఫలమెఱిఁగింతు నం ♦ తయునువినుము.

గీ॥ యోగి, నగ్నుండు, కడిఁదివైరాగి,గుణము, లేనివాఁడును దలితండ్రి♦లేనివాఁడు
అశివవేషధరుం డొకఁ ♦ డనభిమాని, నీదుకూఁతును బెండ్లాడు♦నిజమువినుము.

మత్తకోకిల. కాళి నారదమౌని పల్కులఁ ♦ గ్రాలుభావమెఱింగి య
క్కాలకాలుఁడె యాత్మనాథుఁడు ♦ గాఁగలండని యెంచి లోఁ
జాలసంతసమొంది చిత్తము ♦ శంకరాంఘ్రులఁ జేర్చి తా
నాలకింపుచునుండె వారిప్రి ♦ యోతురోక్తుల నెంతయున్. 179

క॥ నారదమునిపల్కుల విని, భూరివ్యసనమునఁ గుంది ♦ భూధరుఁడును మే
నారమణి యెట్టకేలకు, సైరణఁగొని యిట్టులనిరి ♦ చనవున మునితోన్. 180

చ॥ అలమటఁ జెందె డెందము మ ♦ హాత్మ ! భవద్వచనం బమోఘ మీ
యలజడి కెట్టులోర్తు మక ♦ టా ! పలునోములు నోఁచి కన్న యీ

లలితకుమారికిన్ బతి వి ♦ లక్షణుఁ డేర్పడ మాదు జీవితం
బులు చెడు దీని మార్పఁగల ♦ పొంకము గల్గినఁ దెల్పుఁడీ దయన్. 181

—* గిరిరాజుతో నారదుఁడు పార్వతి శివపత్నియగుననుట *—

ఉ॥ నావుడు నారదుం డనె మ ♦ నః ప్రియమొప్ప నగాధిరాజ ! మీ
రీవిధి కించనొందఁదగు ♦ నే? విధి వ్రైదము దిద్దఁబోలునే ?
భావమునందు నేనొక యు ♦ పాయము నారసి చెప్పెదన్ వినుం
డీ వగపెల్లఁ బాసి సుఖ ♦ మే సమకూరెడు భంగిగా నిఁకన్. 182

గీ॥ వినుఁడు శివునందు నేనన్న ♦ విధము లెల్లఁ, జెల్లుగావున నతని కీ ♦ చెలువనిచ్చి
పెండ్లిఁగావింపుఁ డట్లైనఁ ♦ బేర్మియలరు, నెల్లదోషంబు లొక్కట ♦ నింకిపోవు.

గీ॥ ప్రభులయెడ దోస మొక్కింత ♦ వంతనిడదు, లాఁతియందదియే దుఃఖ ♦ హేతువగును
స్వర్ణదీపావకార్కుల ♦ చందమిందు, నరయు మెచ్చోట నేని య ♦ హార్యతిలక!

క॥ కావున నీప్రియసుత యగు, నీశివ నాశివునకొసఁగి ♦ యింపుగఁ బెండ్లిన్
గావింపుము కులమలరఁగ, నీవెత యంతయును దొలఁగు ♦ నెగడు సుఖంబుల్.

చ॥ శివుఁ డఖిలేశ్వరేశ్వరుఁడు ♦ శిష్టజనావనబద్ధకంకణుం
డవికృతుఁ డప్రమేయుఁ డఖి ♦ లామరపూజితపాదపద్ముఁ డు
ద్భవనిధనంబులన్ గనని ♦ బల్లిమఁ డిద్ధతపోధనాగ్రిమై
భవుఁడు సమర్థుఁ డెందు నిఁకఁ ♦ బర్వతరాజవరేణ్య! యారయన్. 185

వ. ఇవ్విధంబునఁ జెప్పి యమ్మునిప్రవరుండు వెండియు నిండువేడుకన్ గొండల దొరతో నిశ్చితంబుగ నిట్లనియె.

చ॥ కులగిరిరాజ! నీయనుఁగు ♦ కూఁతురు రాజ్ఞిగ రాజమౌళినే
వలచి వివాహమాడు నిది ♦ వాస్తవమెంతయు వీరలొండొరుల్
బలితపుఁ బ్రేమబంధమునఁ ♦ బాయని తీయని చెల్మికల్మిసొం
పెలయఁగ సర్వసౌఖ్యముల ♦ నెప్డు రహింతురు గాంతు రెన్నికన్. 187

మ॥ మఱియున్ నీదుకుమారి సాధ్వియు నిలిం ♦ పగ్రామణీభామినీ
శ్వరియై యీశ్వరుఁ బ్రీతుఁ జేయుచుఁ దప ♦ శ్చర్యన్ హిరణ్యాభయై
ధర గౌరీప్రథఁ జెందుఁ గాపుణిక చే ♦ తస్స్ఫూర్తి రాణింప ని
ర్జరకార్యంబు ఫలింపఁజేయు సుర లా ♦ శాసించి భాసించఁగన్. 188

గీ॥ దేవదేవునిఁ జేపట్టి ♦ దేవ్యయైన, హరివిరించిప్రముఖులచే ♦ నర్చలొంది
అఖిలభువనంబులకుఁ దాన ♦ యధికయగుచుఁ, బరఁగు నీపుత్రి నీహార ♦ పర్వతేంద్ర !

గీ॥ పరమవైరాగ్యభావవి ♦ స్ఫారహృదయుఁ, డైనరుద్రునిఁ జెందియు ♦ నార్యతనదు
మేలిగొనములకలిమి న ♦ మేయతపము, బలిమి శంకరదేహార్ధ ♦ భాగమొందు.

—* నారదాగమనము *—

ఉ॥ నారదమౌని యొక్కసుది ♦ నంబునఁ గొండలఱేని వీటికిన్
భూరితరప్రమోదమునఁ ♦ బోయి గిరీంద్రునిఁ దారసించినన్
ధీరుఁడతండు మౌనిఁగని ♦ దిగ్గనలేచి నమస్కరించి పై
వాఱెడు వేడ్కఁ బీఠమిడి ♦ పాద్యము నర్ఘ్యమునిచ్చి మెచ్చుగన్. 171

గీ॥ తనదుకూఁతునరప్పించి♦వినయమెసఁగ, మునిపదంబులకెఱఁగించి ♦ ముఖ్యకార్య
మిదియనితలంచి వినతుఁడై♦యింపుగదుర, నంజలిరచించియిట్లని♦యడిగెఁబ్రీతి.

ఉ॥ ఓ మహనీయదివ్యకరు ♦ ణోదధి! యో పరమేష్ఠిపుత్రక
గ్రామణి! మత్సుతాకరముఁ ♦ గాంచి గుణాగుణముల్ గ్రహించి యీ
కోమలగాత్రి యెవ్వని క ♦ గున్ దొరసాని మఱెట్టి సౌఖ్యముల్
దా మహిఁజెందునో చెపుఁడు ♦ తథ్యము మీవచనంబు ధారుణిన్, 173

గీ॥ ఇట్టులడిగిన గిరిపతి ♦ యిచ్చనెఱిఁగి, దేవముని కాళిహస్తంబుఁ దేఱిచూచి
అఖిలశుభలక్షణంబుల ♦ నరసి మురిసి, యిట్లుపల్కెను భూమిధ ♦ రేంద్రుతోడ.

శా. శైలేంద్రా! విను శారదేందుకలనా ♦ సారొంది వర్ధిల్లు నీ
బాలారత్నము నీదుకూఁతు రఖిల ♦ భ్రాజిష్ణురేఖాఢ్య గో
త్రాలంకారముసేయు మీకుఁ బతి కు ♦ ద్యత్సౌఖ్యమున్ గూర్చు వా
ణీలక్ష్మల్ పొగడంగ నొప్పు సిరి రా ♦ ణింపంగ సొంపుంగనున్. 175

వ. మెండియు నజ్జడదారి యెలనగవుతో వాగ్విలాసంబుమెఱయ గిరివరునకిట్లనియె.

గీ॥ అద్రిరాజన్య! నీకూఁతు ♦ హస్తమందు, రేఖలెల్ల సులక్షణ ♦ రేఖలైన
నొక్కరేఖ విలక్షణం ♦ బున్నకతన, దానిఫలమెఱిఁగింతు నం ♦ తయునువినుము.

గీ॥ యోగి, నగ్నుండు, కడేఁద్రిబై♦రాగి,గుణము, లేనివాఁడును దలితండ్రి♦లేనివాఁడు
అశివవేషధరుం డొకఁ ♦ డనభిమాని, నీదుకూఁతును బెండ్లాడు♦నిజమువినుము.

మత్తకోకిల. కాళి నారదమౌని పల్కులఁ ♦ గ్రాలుభావమెఱింగి య
క్కాలకాలుఁడె యాత్మనాథుఁడు ♦ గాఁగలండని యెంచి లోఁ
జాలసంతసమొంది చిత్తము ♦ శంకరాంఘ్రులఁ జేర్చి తా
నాలకింపుచునుండె వారిప్రి ♦ యోతురోక్తుల నెంతయున్. 179

క॥ నారదమునిపల్కుల విని, భూరివ్యసనమునఁ గుంది ♦ భూధరుఁడును మే
నారమణి యెట్టకేలకు, సైరణఁగొని యిట్టులనిరి ♦ చనవున మునితోన్. 180

చ॥ అలమటఁ జెందె డెందము మ ♦ హాత్మ! భవద్వచనం బమోఘ మీ
యలజడి కెట్టులోర్తుమక ♦ టా! పలునోములు నోఁచి కన్న యీ

గీ॥ అని ప్రియంబుగ వారల ♦ యంతరంగ, ములను సంతోష భరమునఁ ♦ బొంగఁజేసి
అమరమౌని యథేచ్ఛగ ♦ నరుగుటయును, వారలంత గృహంబులో ♦ పలికిఁ జనిరి.

గీ॥ కొంత కాలంబుచనినంతఁ ♦ గుధరవరుని, రాణి మేనక తనమనో ♦ రమణు సన్ని
ధానమునకేగి వేగఁ బా ♦ దములకెఱఁగి, యిట్టులడిగెఁ బ్రియోక్తుల ♦ నింపు గదుర.

—* హిమవంతునితో మేనక పార్వతికిఁ బెండ్లిసేయు మనుట *—

ఉ॥ నారదుఁడట్లు మీయెదుట ♦ నాఁడు వచించిన జాడయేమొ? నే
నారయ లేకయుంటిని య ♦ థార్థము స్త్రీజనచాపలంబునన్
గూరిమిపుత్రి కిప్పు డను ♦ కూలముగా వరుఁ గూర్చి పెండ్లి వి
స్తారతరప్రమోదమున ♦ సల్పుఁడు మల్పుఁడు నాథ! నావ్యథన్. 203

క॥ ధనమును బ్రాయము చక్కఁ, దనమును విద్యావివేక ♦ దాక్ష్యంబులు పా
వనమైనవంగడము గ, ల్గిన వరునకుఁ గన్నె నిడవ ♦ లెన్ సుత యలరన్ 204

ఉ॥ సుందరరూపమున్నను వ ♦ చోగరిమంబది సున్న యద్దియు
న్నం దగు భాగ్య మబ్బదు ఘ ♦ నంబది గల్గిన నీడుజోడునన్
బొందికఁ గాంచ వచ్చియును ♦ బొల్పెసలారినఁ బావనాన్వయం
బందికఁ జెంద దొక్కయెడ ♦ నన్నియుఁ గూడుటలభ్యమేరికిన్. 205

వ. ఐనను

క॥ ఏలాఁటివానికైనను, బాలిక నొసఁగం దలంప ♦ వచ్చునె? తమక
న్యాలావణ్యగుణంబులఁ, బోలిక వరయంగవలదె ♦ పురుషవరేణ్యా! 206

చ॥ అలరుల సెజ్జయందు లలి ♦ తాంగిక దాఁ బవళించి నిద్ర నొ
త్తిలి పొరలంగఁ గెంపడరి ♦ దేహము గందెడుఁ గుందకోరకం
బుల నెపుడేని నెచ్చెలుల ♦ పోటికినైన చిదుపంగఁ గల్కి ప్రే
ళులఁ గఱగట్టు నెత్తురిల ♦ లోఁ గనినామొకో యిట్టికన్నెలన్. 207

గీ॥ అనుచుఁ గన్నీరు దొఱుఁగ న ♦ గాధిరాజ, రమణి నాథుని పదముల ♦ వ్రాలియున్న
నన్నగోత్తముఁ డత్తన్వి ♦ నాదరమునఁ, గౌగిటన్ జేర్చియిట్లనె ♦ గౌరవమున.

చ॥ వినుమిఁక దేవి! దేవముని ♦ విజ్ఞశిరోమణి చెప్పినట్టి పా
వనవచనంబు బొంకగునె? ♦ వద్దిఁక వేఱుతలంపు లింపుమైఁ
దనయకు శంభుఁ గూరిచి యు ♦ దారతపం బొనరింపు మంచు బో
ధను బొనరించి పంపు నియ ♦ తంబుగ దాన శుభంబు సేకుఱున్. 209

క॥ అగుణములన్నియు శివునెడ, సుగుణములై పరఁగు వినుము ♦ సుందరి! యిఁకనా
యగణితతపోనిధానుం, డగజను బెండ్లాడుఁ దపము ♦ నర్మిలి సేయన్. 210

—* నారదాగమనము *—

ఉ॥ నారదమౌని యొక్కసుది ♦ నంబునఁ గొండలఱేని వీటికిన్
భూరితరప్రమోదమునఁ ♦ బోయి గిరీంద్రునిఁ దారసించినన్
ధీరుఁడతండు మౌనిఁగని ♦ దిగ్గనలేచి నమస్కరించి వై
వాఱెడు వేడ్కఁ బీఠమిడి ♦ పాద్యము నర్ఘ్యమునిచ్చి మెచ్చుగన్. 171

గీ॥ తనదుకూఁతునురప్పించి♦వినయమెసఁగ, మునిపదంబులకెఱఁగించి ♦ ముఖ్యకార్య
మిదియనితలంచి వినతుఁడై♦యింపుగదుర, నంజలిరచించియిట్లని♦యడిగెఁబ్రీతి.

ఉ॥ ఓ మహనీయదివ్యకరు ♦ ణోదధి ! యో పరమేష్ఠిపుత్రక
గ్రామణి ! మత్సుతాకరముఁ ♦ గాంచి గుణాగుణముల్ గ్రహించి యీ
కోమలగాత్రి యెవ్వని క ♦ గున్ దొరసాని మఱెట్టి సౌఖ్యముల్
దా మహిఁ జెందునో చెపుఁడు ♦ తథ్యము మీవచనంబు ధారుణిన్. 173

గీ॥ ఇట్టులడిగిన గిరిపతి ♦ యిచ్చనెఱిఁగి, దేవముని కాళిహస్తంబుఁ దేఱిచూచి
అఖిలశుభలక్షణంబుల ♦ నరసి మురిసి, యిట్లుపల్కెను భూమిధ ♦ రేంద్రుతోడ.

శా. శైలేంద్రా ! విను శారదేందుకలనా ♦ సారొంది వర్ధిల్లు నీ
బాలారత్నము నీదుకూఁతు రఖిల ♦ భ్రాజిష్ణురేఖాఢ్య గో
త్రాలంకారముసేయు మీకుఁ బతి కు ♦ ద్యత్సౌఖ్యమున్ గూర్చు వా
ణీలక్ష్ముల్ పొగడంగ నొప్పు సిరి రా ♦ ణింపంగ సొంపుంగనున్. 175

వ. వెండియు నజ్జడదారి యెలనగవుతో వాగ్విలాసంబు మెఱయ గిరివరునకిట్లనియె.

గీ॥ అద్రిరాజన్య ! నీకూఁతు ♦ హస్తమందు, రేఖలెల్ల సులక్షణ ♦ రేఖలైన
నొక్కరేఖ విలక్షణం ♦ బున్నకతన, దానిఫలమెఱిఁగింతు నం ♦ తయునువినుము.

గీ॥ యోగి, నగ్నుండు, కడఁదిబై♦రాగి, గుణము, లేనివాఁడును దలితండ్రి♦లేనివాఁడు
అశివవేషధరుం డొకఁ ♦ డనభిమాని, నీదుకూఁతును బెండ్లాడు♦నిజమువినుము.

మత్తకోకిల. కాళి నారదమౌని పల్కులఁ ♦ గ్రాలుభావమెఱింగి య
క్కాలకాలుఁడె యాత్మనాథుఁడు ♦ గాఁగలండని యెంచి లోఁ
జాలసంతసమొంది చిత్తము ♦ శంకరాంఘ్రులఁ జేర్చి తా
నాలకింపుచునుండె వారిప్రి ♦ యోతురోక్తుల నెంతయున్. 179

క॥ నారదమునిపల్కుల విని, భూరివ్యసనమునఁ గుంది ♦ భూధరుఁడును మే
నారమణి యెట్టకేలకు, సైరణఁగొని యిట్టులనిరి ♦ చనవున మునితోన్. 180

చ॥ అలమటఁ జెందె డెందము మ ♦ హాత్మ! భవద్వచనం బమోఘ మీ
యలజడి కెట్టులోర్తు మక ♦ టా ! పలునోములు నోఁచి కన్న యీ

క॥ అని యిట్లు శైలకులపతి, తన గేహినితోడఁ జెప్పి ♦ తా స్వప్నఫలం
బును గనుపూనిక నుండెను, మనమున శివచింతనంబు ♦ మల్లడిగొనఁగన్.

మత్తకోకిల:- సూతుఁ డిట్లు వచింపఁగా విని ♦ చోద్యమంది మునీశ్వరుల్
సూతు సద్గుణపూతు నాదృతిఁ ♦ జూచి యిట్లని రింపుమై
భూతభర్త శివుండు రాజత ♦ భూధరంబున నిష్ఠ తాఁ
జేతమం దిరవొంది యెయ్యది ♦ సేయుచుండెనొ చెప్పఁడీ. 220

క॥ అని మునులన సూతుం డిట్లనె వినుఁ డనఘాత్ములార !♦ యభవుఁడు దాఁ బ
త్నినిఁ బాసిన యదిమొదలుగ, ఘనతర తాపానలమునఁ ♦ గాఁగి వెగడునన్.

చ॥ తిరిగి ధరిత్రినెల్లెడ న ♦ దేవరుసన్ మరులొంది జీవితే
శ్వరిని మనంబునన్ మఱవఁ ♦ జాలక తద్గుణజాలవైభవం
బరుదుగఁ గింకరోత్తముల ♦ యాత్మలు దల్లడమొందఁ జెప్పుచున్
దిరుగ నిజాద్రిఁ జేరె మది ♦ ధీరతఁ జేకొని మెట్ట కేలకున్. 222

వ. అంతఁ మీఁద

చ॥ త్రిగుణములన్ దొలంగి వికృ ♦ తిన్ గొననట్టి నిజస్వరూప మి
మ్ముగఁ గనుచున్ జిరం బిటుల ♦ భూరితరాతులితప్రమోదపూ
రగతమనస్కుఁడై కడు వి ♦ రాజిలె నన్మని రాజులెల్లఁ జ
క్కఁగ నికయోగమర్మములఁ ♦ గర్మఠులై తనయొద్ద నేర్వఁగన్. 223

—* శివుని లలాటఘర్మజలమునుండి కుజుఁడుపుట్టుట *—

ఆ॥ అట్లు చాలకాల ♦ మరిగిన వెంబడిఁ, జిత్రి మొక్కనాఁడు ♦ శివునినొసటి
ఘర్మవారికణము♦గ్రక్కునఁ బుడమి పైఁ, జింద బాలుఁ డగుచుఁ♦ జెలువుమిగిలె.

సీ॥ ఆజానులంబిబా ♦ హాచతుష్కమువానిఁ, బద్మరాగారుణ ♦ ప్రభలవాని
నందంబుఁ జిందు మే♦లగు మోముగలవాని, రాణించు వెడఁదయు ♦ రంబువానిఁ
గమనీయమైనయా ♦ కారంబు గలవానిఁ, బరులకసాధ్యుఁడై ♦ పరఁగువాని
దివ్యతేజంబులఁ ♦ దెలివిమించెడువాని, గంభీరదృష్టులఁ ♦ గాంచువాని

గీ॥ జననమును జెందియున్నత♦స్వనమెసంగ, రోదనము సేయువాని న♦త్యాదరమున
నెత్తికొనివచ్చియపుడు మ♦హేశునెదుట, నిలిచియుండెను దా ధర♦ణీవధూటి.

గీ॥ సుతునిఁ గని తెచ్చి నిలిచిన ♦ సుందరీల, లామ క్షమఁ బరికించి కై♦లాసభర్త
మందహాసంబుచింద నా♦నందసాంద్ర, వచనములనిట్లు పలికె న♦వ్వసుధతోడ.

చ॥ ధరణివధూటి! నీవు గడు ♦ ధన్యవు నాదు శ్రమాంబుజన్ముఁడై
యురుదుగ నీయెడన్ బొడమి♦నట్టి తనూజుని వీనిఁ బెంపు మా

వరమున నీకుమారుఁడు త్రి♦తాపవిహీనుఁడు సద్గుణాకరుం
డురుసుఖదాత నీకగు మ♦దుక్తి గ్రహించి గ్రహింపు మర్భకున్. 227

ఉ॥ భూమియు నట్లకాక యని ♦ పుత్రునిఁ దోడ్కొని పోయి పెంపఁగా
భౌముఁడటంచుఁ బేరుగొని ♦ బాలుఁడు వృద్ధినిఁ జెంది కాశికా
ధామముఁ జేరి యందు హిమ ♦ ధామశిరోమణిఁ గూర్చి నిష్ఠను
ద్దామతపంబుఁ జేసి మహి ♦ తంబగు శంభు ననుగ్రహంబునన్. 228

క॥ గ్రహములలో నొకబలవ, ద్గ్రహమై భార్గవుని పదము ♦ కన్నను మీఁదన్
బహుతరవిభవాస్పదమై, రహిమీఱెడు మండలమున ♦ రాజయ్యెఁదగన్. 289

—* శివుఁడు హిమాద్రికి వచ్చి తపంబు సేయుట *—

గీ॥ జగదధీశ్వరుఁ డంతట ♦ శైలరాజ, పుత్రియై జగదీశ్వరి ♦ పుట్టుటయును
నెనిమిదేండ్లవయస్సువ♦హించుటయును, నాత్మయందు నెఱింగియా♦హ్లాదమొందె.

వ. అంతఁ గొంతకాలంబు చనుడు.

శా॥ గంగాభంగతరంగరంగదురుశృం ♦ గవ్రాతశీతాచలో
త్తుంగాధిత్యకయందు డెంద మలరన్ ♦ దుర్దాంతభంగిన్ దపం
బుం గావింపఁగడంగి భృంగిరిటుఁడున్ ♦ మున్నౌ గణేంద్రాళితో
డం గాలాంతకమూర్తి చేరె గిరిరా ♦ ట్ప్రస్థంబు నాస్థోన్నతిన్. 231

ఆ॥ బ్రహ్మపురమునుండి ♦ పరమపావనియైన, గంగ యవతరించెఁ♦గడఁగి యెచట
నటవసించి తపసు ♦ నారంభ మొనరించె, మానులలరఁ జంద్ర ♦ మౌళియపుడు.

మ॥ నిరపాయంబయి నిర్వికారమును నై♦నిత్యంబు నై యాశ్రయాం
తరశూన్యంబయి జోతిరూపమయి య ♦ ద్వైతంబు నై సంవిదా
కరమై సర్వజగన్మయంబునయి మే ♦ ల్గన్పట్టు స్వాత్మంబునం
దు రహిన్ ధారణఁ జెందియుండె గణనా ♦ థుల్ గొంద ఱట్లుండఁగన్. 233

ఉ॥ నందియు భృంగి మున్నగు గ ♦ ణప్రవరుల్ మఱిగొందఱందుఁ బా
లేందుకిరీటుఁ జిత్తవిహి ♦ తేష్టసపర్యలఁ గొల్చుచుండి రిం
కం దమమొప్ప మౌనవిధి ♦ గాంచి వసించిరి కొంద ఱింకనుం
గొందఱు ద్వారదేశమునఁ ♦ గోలలఁ దాల్చివసించి రిమ్ముగన్. 234

—* హిమవంతుఁడు శివుని సందర్శించుట *—

గీ॥ హిమగిరీశ్వరుఁ డంత స♦ర్వేశ్వరుండు, ప్రమథనాథులతోడఁ ద♦పంబుఁ జేయ
నోషధిప్రస్థభూమిఁ దా♦నొందెననుచు, విని పరిజనంబుతో వచ్చి ♦ వేగిరముగ.

సీ॥ విరియఁబూసినమల్లె♦విరుల మొత్తమ్ములు, చందమొప్పెడు మేని ♦ చాయవాని
గంధపుంబొడికన్నఁ ♦ గరము ధావళ్యంపు, పసమీఱు భసితలే ♦ పంబువాని

నలదేఁటిదాఁటులఁ జెలువుఁగలంచు నై, ల్యముమీఱు నఱుతచాయగలవానిఁ
గెందమ్మిమొగ్గలయందంపుపెంపు నై, రింపని యడుగుల సొంపువాని

గీ॥ నమరు నఱమోఁడ్పుకనుదోయి నలరువానిఁ, బ్రౌఢనాసాగ్రదృష్టియై పరఁగువాని
నొనరఁబద్మాసనమునఁగూర్చున్నవాని, నఖిలలోకేశ్వరునిఁగాంచి హర్షమునను.

ఉ॥ సాఁగిలి మ్రొక్కి గంధసుమ సారముఁ బాద్యము నర్ఘ్యమిచ్చి ని
ష్ఠాగరిమన్ మనోజ్ఞహరి చందనపుష్పఫలార్చనంబులన్
వేగనొనర్చి యచ్చపుగు వేడ్క భయంబును భక్తియున్ మదిన్
లోఁగఁగఁజేయ నమ్రతను లోఁగొని యంజలిఁబూని యిట్లనెన్. 237

క॥ దేవాదిదేవ! శంకర!, నీవెకదా ? సకలభువన నికరమునకు ర
క్షావహుఁడ వారయ మహా, దేవ! కపర్ది! గరిష్ఠ దీవ్యత్కీర్తీ! 238

సీ॥ నిర్గుణుండైనను నిత్యంబు భక్తుల, సాఁకఁగ సగుణుఁడౌ చతురుఁ డెవఁడు
సర్వలోకనివాస చతురుఁడైనను వెండి, కొండయందుండు నా థుండెవఁడు
దేవరాజికినెల్ల దేవుండుతానయ్యు, యోగిరూపొప్పుబైఁ రాగియెవఁడు
ఏకాంక్షలెఱుఁగని యీశ్వరుండైన భ, క్తప్రీతిఁగాంక్షించు ధన్యుఁడెవండు

గీ॥ త్రిగుణములకును నాప్రకృతికిని నీశుఁ, డై విరాజిల్లునప్పర మాత్మ యెవఁడు
హరివిరించులయాడిగ మందునెవ్వఁ, డట్టినీకు నమస్కార మాదిమూర్తి!

క॥ వాగీశరమేశులక, వ్వాగీశరమేశ్వరత్వ వైభవగరిమన్
బాగొప్ప నిడిన దాతవు, యోగీశ్వర ! నీవకాదె యురుతరకరుణన్. 240

ఉ॥ నీదుచరిత్ర మెన్న రజనీకరశేఖర ! శక్యమౌనె దా
మోదరకాంచనోదరము ఖోత్తమనిర్జరపాళికెల్ల నా
మోద మెసంగ భక్తజన పుంగవకోటికిఁ జెల్లునద్ది నీ
వాదరబుద్ధి వారల ర యంబునఁజేరుట లోకనాయకా! 241

ఉ॥ భాగ్యముగాదె నీవిటుఁ గృపానిధి ! యీప్రమథాళితోడ వై
రాగ్యమతిన్ దపోవ్రతభరంబు వహింపఁగఁ జేరుటెల్ల నన్
యోగ్యునిఁ జేసి తిష్టకుల మున్నతిఁగాంచె వరించెనల్లసౌ
భాగ్యరమామనోజ్ఞపరి భాసితచారుకటాక్షమాలికల్. 242

చ॥ ఇఁకను మహేశ ! సేవకున కెద్దియు నేని పనిన్ఘటించి తా
వకపరిచారకవ్రజము వంక నరున్గొని యాదరింపు మే
నకలుషచిత్తవృత్తి ముద మంది యొనర్చెద నీదుసేవ మా
మకహితపుత్రబాంధవస మాజముతోడ దయామయాత్మకా ! 243

గీ॥ ఇట్లు గిరిరాజు పలికిన ♦ నీశ్వరుండు, విని కనులువిప్పి పర్వత ♦ విభుని వాని
గణమునుఁ గూడఁ దాఁ బొడఁ♦గాంచియపుడు, మందహాసంబెసంగని♦య్మాడ్కిఁ బలికె

చ॥ వినుము ధరాధరేశ్వర ! ప ♦ విత్రునిగా నిను నెంచి నీదు పా
వనశిఖరప్రదేశమున ♦ బాఢతపం బొనరింప వచ్చితిన్
మునులకు నిర్జరేంద్రులక ♦ మోఘతపస్వుల కిష్టభూమియై
యొనరు మరున్నదీసురుచి ♦ రోదకపూతము నీతటం బిలన్. 245

ఉ॥ చేయుదు నిందుఁ నేఁ దపము ♦ శీతమహీధర ! కొన్నినాళ్ళు నీ
వీ మెడ కన్యలన్ దిరుగ ♦ నీకుము నాదుతపోంతరాయముల్
సేయఁగనీకు మీయదిమె ♦ సేవయగున్ బరమోత్తమంబుగాఁ
జేయుము తత్ప్రయత్నమిఁకఁ ♦ జేరుము నీదు గృహంబు నింబుగన్. 246

గీ॥ ఇట్లు జగదీశ్వరుండు గి♦రీశ్వరునకుఁ, జెప్ప విని గట్లఱేఁడప్పు ♦ డొప్పమీఱు
చనవుతోడుత నిట్లనె ♦ సంతసం బె, సంగ దేవాధినాథుని ♦ సముఖమందు.

క॥ ఏమని చెప్పుదు మీతోఁ, బ్రేముడి నాప్రస్థమునకు♦విచ్చేసి మహా
త్మా ! మధురోక్తుల నిట్లనఁ, గా ముదమగ్గలముగాఁగఁ ♦ గడలుకొనె మదిన్.

ఉ॥ వెగ్గలమైన నిష్టఁగొని ♦ వేలుపు లుగ్రతపంబుఁ జేసి ని
న్నగ్గలికన్ గనన్ గడఁగ ♦ నందకయుందువు వారికట్లు నా
నిగ్గుభాగధేయమున ♦ నీవ యిటుల్ గరుణామయుండవై
దగ్గఱఁ జేరినాఁడ విటు ♦ తాపములింకె మహాత్మ ! నాకిఁకన్. 429

శా॥ నాకన్నన్ ఘనుఁడొక్కఁడీ జగములో ♦ నన్ లేఁడు లెక్కింపఁగా
నాకీడైన నరుండునున్ గలుగఁడె ♦ న్నన్ నాదు ప్రస్థంబునన్
లోకాధీశ్వర ! నీవుచేరి తపసున్ ♦ యోజించుటన్ జేసి య
న్నాకాధీశునికన్న మిన్ననిఁకనా♦మ్నాయాదిపంచాననా ! 425

చ॥ పరఁగఁ దపంబుఁ జేయుము సు ♦ పర్వశిరోమణి ! యంతరాయముల్
దొరయునె నీతపంబునకుఁ ♦ దొరపుఁగూరిమి పేర్మి నీదు నా
కరు గిరిరాజవర్యుఁ డొడి ♦ కమ్మగ సేవయొనర్చు నింక సు
స్థిరమతితో స్వతంత్రతను ♦ జేకొని కైకొను నాదుసేవలన్. 251

క॥ అని వినయమ్మున యమదమ, నునితో నగరాజు ప్రియపు ♦ నుడికారము చొ
ప్పునఁ బలికి తనదు గేహం, బున కేగి వచించె సర్వ ♦ మును దన ప్రియకున్.

చ॥ అనుచరవర్గమున్ బిలిచి ♦ యాతఁడ నెన్ వినుఁడింక మీఁద స్వ
ర్ధుని దిగునట్టిచోటి కెవ ♦ రున్ జనఁగూడదు పోయిరేని శి
క్షను బొనరింతు వారలను ♦ ఘాతుకరీతి నిజంబు నాదు శా
సనమిదియంచుఁ బ్రస్థమునఁ ♦ జాటుఁడు నెల్ల రెఱుంగునట్లుగాన్. 253

వ. అని యిట్లు ప్రత్యాదేశంబె జెంగించి పనిచిన నవ్వారలు.

క॥ గంగావతరణమున కే, గంగాదగ దెవరుఁ గొంత ♦ కాలంబిటు లా
గంగావలె తేఁడేపడఁ, గంగా శిక్షించు నాజ్ఞఁ ♦ గడచినవారిన్. 254

## -* హిమవంతుఁడు పార్వతీ పరిచర్యలఁ గొనుచుండుమని శివు నర్థించుట *-

ఆ॥ ఇట్లు సాఁటుటయును ♦ హిమవంతుఁ డెంతయు, సంతసమున నీశు ♦ సన్నిధాన
మునకుఁబోయె దివ్య♦పుష్పఫలంబులఁ, గొనియుఁదనదుసుతను♦గొనియు మఱియు

క॥ చని ధ్యానతత్పరుండగు, ననఘుని లోకాధినాథు ♦ నాదటఁగని వం
దనమొప్పఁజేసి పూల్ఫలం, బ్లను నొసఁగి సుతనునిలిపి యొ♦డయనికెదురుగాన్.

ఉ॥ ఓ కరుణాపయోనిధి ! మ ♦ హోన్నత పూతచరిత్ర ! నీదు సే
వాకుతుకమ్ముతో నిటకు ♦ వచ్చె మదాత్మజ దీనిసేవలన్
జేకొనుమయ్య! ప్రత్యహము ♦ సేవయొనర్చు సఖీసమేతయై
తేఁకువతోడ నాయెడ వి ♦ ధించిన మేటియనుగ్రహంబునన్. 257

## —* శివుఁడు పార్వతీదేవినిఁ జూచుట *—

వ. అని యభ్యర్థించిన యప్పుడే మహేశ్వరుండు తనంతఁ బ్రణిధానంబునుండి మాన
సంబును దింపికొనినంత. 258

చ॥ కరమున హేమపద్మము మొ♦గంబున గేదఁగిపూరజంబు ముం
గురులయెడన్ మనోజ్ఞ నవ ♦ కుందవితానపు తీర్పు చేర్పు భా
స్వరదురమందు సొంపమరు ♦ చంపకమాలఁ గచంబులన్ జపన్
మురువుగఁ దాల్చినట్టిగిరి ♦ పుత్రి ధరాధరు ప్రామోలఁగన్పడెన్. 259

సీ॥ కనివిని యెఱుఁగని ♦ ఘనతరసౌందర్య, ధుర్యయం చాత్మజుఁ ♦ దోఁచుదాని
దక్షకన్యకకన్నఁ ♦ దద్దయుఁ జక్కంద, నముగల్గి శ్రీపుల ♦ నమరుదాని
ఘనయోగులకునైనఁ ♦ గందర్పవికృతి న, ల్పంజాలినట్టి రూ♦పంబుదానిఁ
గాననంబంతఁ బ్ర ♦ కాశింపఁజేయు ది, వ్యంబైన కాంతిపుం ♦ జంబుదాని

గీ॥ నభినవంబైన యౌవనం ♦ బమరుదాని
నమరు కస్తూరికాఘుమ ♦ ఘుమలదాని
నఖిలలోకంబులకు మూల♦మైనదానిఁ
బర్వతేంద్రకుమారియై ♦ పరఁగుదాని. 260

సీ॥ కలువతేకుల మించఁ ♦ గల కనుంగవదానిఁ, జంద్రమండలనిభా ♦ స్యంబుదాని
గండుతుమ్మెదలట్టి ♦ కటికురుల్ గలదానిఁ, గంబునిభంబైన ♦ గళముదానిఁ

దమ్మితూఁడులఁబోల్పఁ ♦ దగు బుజంబులదాని, రమ్యమైతగువళి♦త్రియముదానిఁ
గమలకుట్మలపీన ♦ ఘనకుచంబులదానిఁ, గడుసన్నమైనన ♦ న్నడుముదాని

గీ॥ మెట్టదామరలన్ బోలి ♦ మేల్మిఁగోమ, లంబు మీఱిన పాదయు ♦ గంబుదాని
ధ్యానులకు మోహనాస్త్రమై ♦ తనరుదాని, నమరరమణీశిరోమణి ♦ యైనదాని.

ఉ॥ చూచి తదంగసౌష్ఠవపు ♦ సొంపులు నింపు జనింప నంతతో
లోచనముల్ మొగిడ్చి యవి ♦ లోలము నుత్తమమైనయాత్మయం
దే చరియించుచున్న సక ♦ లేశ్వరుఁగాంచి గిరీశ్వరుండు సం
కోచముతోఁ దగుల్కొనిన ♦ కుందున జోతయొనర్చి యిట్లనెన్. 262

ఉ॥ దేవ! మహానుభావ! శివ! ♦ దివ్యకృపాకర! శర్వ! శంకరా!
నీవె చరాచరంబులకు ♦ నిత్యముహర్షము నిచ్చుదాత వీ
నీ విభవంబెఱుంగుటకు ♦ నేరక వేదచయంబు శాస్త్రమం
తో వెరపొప్పఁ జెప్ప వలఁ ♦ తుల్ పరులెవ్వరికన్ మహేశ్వరా! 263

క॥ ఐనను బరమేశ్వర! యీ, దీనుని హిమవంతుఁ గనులు ♦ దెఱచి ఘనదయన్
బూని భవదీయదాసునిఁ, గా నేర్పడఁజూడుమా జ♦గన్నుతచరితా! 264

చ॥ అనుదినమున్ మహేశ్వర! మ ♦ దాత్మజతోఁ జనుదెంచి నీదు ద
ర్శన మొనరించి పోయెదఁ బ్రి ♦ సన్నమతిన్ సెలవిమ్మటన్న న
య్యనఘుని పల్కులన్ విని ర ♦ యమ్మునఁ గన్నులు విప్పి చూచి యి
ట్లనె జగదీశ్వరుం డపుడు ♦ ధ్యాన మొకించుక మాని మానుగన్. 265

క॥ నాయొద్దకు నీవొక్కఁడ, వే యనుదిన మేగుదెంచు ♦ మీ! నీ తనయన్
నీయింట నునిచి రమ్మటు, సేయనిచో నన్నుఁ గనుట ♦ చేకుఱదు సుమీ!

గీ॥ అని వినిశ్చితముగఁ బల్క ♦ నమ్మహేశు, నకు గిరీశ్వరుఁడిట్లనె ♦ నాథ! యేమి
కారణంబున నిందురాఁ♦గాదు నాదు, తనయ కది నీదు సేవకుఁ♦దగదొ యేమొ!

క॥ అని యడిగిన హిమవంతున, కనియెను లోకాధినాథుఁ ♦ డాహ్లాదముతో
డను లోకాచారంబులు, గనఁజేయుచు నితరయతుల ♦ గతులఁదెలుపుచున్.

శా॥ మాయారూపిణులంచుఁ జేడియల నా ♦ మ్నాయంబు బోధించు వి
న్నా! యందున్ యువతుల్ విశేషమిఁకఁ దా ♦ మవ్వారిలో సుందరుల్
బాయన్ జేయుదు రెందుఁ జిత్తనియతిన్ ♦ బాటించు మోహోద్ధతిన్
డాయన్ జేయుదు రందుచేఁ దపము వి ♦ ఘ్నంబౌను సత్యంబుగా. 269

క॥ చిత్తరుల యందచందము, లెత్తించును మదనవికృతి ♦ నెట్టితపస్వి
చ్చిత్తములకేని దృఢముగ, నిత్తఱి నిత్తెరగునుడుగు ♦ మిఁకనగరాజా! 270

ఉ॥ అందును నీదుపుత్త్రి రుచి♦రాంగి నవీనవయోవిలాస పూ
ర్ణేందునిభోజ్జ్వలానన క ♦ రీంద్రవరేణ్యసమానయాన నే
నిందుఁ దపోవ్రతుండను ని ♦ రీహుఁడ యోగికులుండ నాకు నీ
నందనతోడ నేమిపని ♦ నాగకులేంద్ర! తలంచి చూడుమా! 271

ఉ॥ నీవును దాపసేంద్రుల న ♦ నేకుల నేలెడుఱేఁడ వాగమాం
తావగతప్రబోధుఁడవు ♦ న్యాయ్యమెఱుంగనివాఁడవొక్కొ యీ
భావముమాను మీపగిదిఁ ♦ బల్కకుమింక నగాధిరాజ! యో
షావళియేడ? యోగుల స ♦ మక్షములేడ? యెడందఁ గాంచుమా! 272

గీ॥ అనుచు నిష్ఠురముగ నిష్పృ♦హంబుగాఁగఁ, బలికి విరమించియున్న న♦ప్పరమపురుషుఁ
గాంచి భయకంపితుండయి ♦ గట్లఱేఁడు, మిన్నకుండె వికాసంబు ♦ తెన్నుదక్కి.

క॥ హరుని వచనంబు విని గిరి, వరుచకితాకృతినిఁ జూచి ♦ పార్వతి దా శం
కరునకు నమస్కరించి మ, ధురఘనయుతుల నిట్టులనెఁ జ ♦ తురతరమతితోన్.

గీ॥ దేవ! నాతండ్రి కిత్తఱి ♦ నీవు చెప్పి, నట్టి యంశంబునకు సరియైన యుత్త
రంబు నేఁజెప్పెదానఁ గ ♦ రంబుగనిక, రంబమర నాలకింపు హ♦ర్షంబుతోడ.

—* పార్వతీ పరమేశ్వరుల సాంఖ్యవేదాంతపథవివాదము *—

ఉ॥ తాపసశక్తితోఁ దగిలి ♦ దండితపం బొనరించుచుంటి వీ
తాపసశక్తితోడనె యు ♦ దారతపంబున నిచ్చగల్గె నీ
తాపసశక్తియే ప్రకృతి ♦ దా నఖిలంబు రచించుఁ బెంచు నా
టోపమణంగఁ ద్రుంచెడున ♦ టుల్ గనుమేదో య దీవెవండవో. 276

ఆ॥ ప్రకృతియొకటిఁ బాసి ♦ పశుపతి! లింగరూ, పమున నొప్పనీవు ♦ వసుధవంద్యుఁ
డవును బూజనీయుఁ♦డవును ధ్యానార్హుండ, వగుదువయ్యయెట్టు♦లరసిచెపుమ!

వ. అనినంత.

క॥ పర్వతరాజసుతోక్తుల, సర్వస్వం బరసి తనదు ♦ శాసనమును దా
నిర్వాహం బొనరించుచు, శర్వుండిటు పల్కె సుప్ర ♦ సన్నాత్ముండై. 278

చ॥ పరమతపంబునన్ బ్రకృతిఁ ♦ బట్టి యడంచెద శుద్ధమూర్తినై
పరఁగెద నేను సత్యముగఁ ♦ బ్రాజ్ఞులకీ ప్రకృతిప్రియంబు నె
ప్పరుసునఁ జెల్ల దేవికృతి ♦ పాల్పడకెందును లోకవృత్తముల్
బొరయక యుండఁ జెల్లు నిది ♦ పొచ్చెముగాదు మహీధరాత్మజా! 276

క॥ అనవేగనె నగికన్నియ, యనియెను గాళికయు శశిక♦లాభరణునితో
ఘనతరచరితా! నీనుడి, యను బ్రకృతివశంబుగాక ♦ యొండొకఁడగునే.

క॥ అందఱకుం దమ న్బ్రకృ, తిందాఁటినవాఁడవైతి ♦ తెలుపు మఖిలముఁ
సందియములేక బద్ధమ, గుం దాన్ గాదనంగఁ ♦ గూడునె యనఘా! 281

సీ॥ వచన మాదానగమనముల్ ♦ వదలుటయును
సుఖము నొందుట వినుటయుఁ ♦ జూచుటయును
స్పర్శ మాఘ్రాణమును రస ♦ జ్ఞతయుఁ బ్రకృతి
కృతము లివిగాదనుట యెట్లు ♦ వితథవచన! 282

గీ॥ ప్రకృతిదాటినవాఁడవే ♦ భవ్యచరిత!, తపమదేటికి నీకిందుఁ ♦ దత్త్వమెఱిఁగి
నట్టివానికిఁ దపమున ♦ నవసరంబు, లేదు వాగ్వాదమున నేమి ♦ లేదు లబ్ధి.

వ. ప్రత్యక్షసిద్ధియం దనుమాన ప్రమాణంబు నెవ్వ రంగీకరింతురు ? నీ వప్రాకృ
తుండ వగుట యెట్లు? లోకమందు దేహు లెంతవఱ కింద్రియజన్యజ్ఞానానుభ
వంబు గలిగియుందు రంతదనుక ప్రాకృతులౌట స్పష్టంబు. 284

ఉ॥ మాటలు వేయునేల వినుమా ♦ యనుమానము మాని సర్వముం
దేటయొనర్చెదన్ బ్రకృతి ♦ నేన్ బురుషుండవు నీవు సుంతయున్
బూటక మేదిటన్ సగుణ ♦ మూర్తివి నాదయ నాదు వీవు నా
కూటమిఁ బాసి సుంతయున ♦ గూర్పఁగలాడవె నిర్గుణుండవై. 285

ఆ॥ నన్నుఁ జేరికాదె ♦ నాథ! నీవెల్ల క, ర్మములఁ జేయుటరయ ♦ మహిని నెపుడు
అట్లుగాక ప్రకృతి ♦ కవ్వల నీవున్న, భయముఁ బాసి నా స ♦ పర్యఁ గొనుము.

ఆ॥ ఇట్లు సాంఖ్యసరణి ♦ హిమగిరికన్యదాఁ, జెప్పినట్టినుడుల ♦ నొప్పమెఱయ
విని శివుండు పలికె ♦ వేదాంతమతమార్గ, గామియగుచు నిటులఁ ♦ గాళితోడ.

—* శివుఁడు పార్వతీ పరిచర్యలఁ గొనుట కంగీకరించుట *—

మ॥ గిరిజా! నీవిటు సాంఖ్యవాదినివి కాం ♦ క్షింపన్ నిషేధింప ని
ష్ఠురమా నట్టులె చేయు ప్రత్యహము ని ♦ చ్చో నాకు శుశ్రూష నేఁ
బరమేశానుఁడనేని మాయకు దురా ♦ పస్థానభూతుండనే
దరమే? నన్నుఁ జలింపఁజేయుటకుఁ గాం ♦ తాలోకచూడామణీ! 288

గీ॥ ఇట్లు గాళికిఁ జెప్పి శై ♦ లేంద్రుతోడఁ, బలికె భక్తానురంజన ♦ పరుఁడు హరుఁడు
నీదుప్రస్థంబునన్ దపో ♦ నిష్ఠనుండె, దను స్వరూపంబు నానంద ♦ ఘనముఁగనుచు.

క॥ సెలవొసఁగు నాకుఁ దపసిట, సలుపుటకై తావకాను ♦ శాసనమును ని
మ్మలఁగనక తపముసేయఁగ, నలవియె యిట నేరికేని ♦ నగరాజవరా!

వ. అనిన విని హిమవంతుఁ డత్యంతవిధేయుండై ప్రణమిల్లి శివునకిట్లనియె. 291

గీ॥ దేవదైతేయమానుషా ♦ ధిష్ఠితంబు, లీ జగంబులకెల్లను ♦ నీవె యీశ్వ
రుండవై యుండ దేవ! య ♦ ల్పుండనైన, నేనెటుల నేమి సెప్పుదు ♦ నిందుఁగడఁగి.

క॥ అనవిని హిమవంతునితో, ననుకంప దనర్పఁగా మహాదేవుం డి
ట్లనియె గిరిరాజ! వేశ్మం, బున కేగుండన్న మురిసి పోయిరి వారల్. 293

—* పార్వతి చెలులతోఁ బ్రతిదినము శివునకుఁ బరిచర్య సేయుట *—

చ॥ ప్రతిదినముఁ గిరీశ్వరుఁడు పార్వతిఁ దోడ్కొనిపోయి శంకరున్
గుతుకముతోడఁ గొల్చి చను గోత్రవరేణ్యుఁడు రాకయున్న నం
చితమతితో సఖీద్వయము చేరికఁ దా శివుఁ జేరి భూమిభృ
త్సుత పరిచర్య సేయుఁ బ్రమథుల్ శివునానతి నాఁపరాపెనుఁ. 294

ఉ॥ పర్వతరాజసూత్రి యెడ భర్గుఁడు గౌరవభావముంచి య
ప్పార్వతితోడ నిట్టులనె బాలిక! నీవిఁక నీసఖిద్వయిఁ
హార్వఁగఁ దోడుగాఁ గొనిమ దంతికభూమికి వచ్చిభక్తిమేల్
పర్వఁగ సేవఁజేసి చను ప్రత్యహముఁ వెఱపొంద కింతయుఁ. 295

ఆ॥ ఇట్లు చెప్పి శివుఁడు హిమగిరికన్యకా, సేవ నిర్వికార చిత్తుఁడగుచుఁ
జేకొనుచు వసించెఁ జిత్రమా విఘ్నంబు, తెరవుఁ జెందియట్టి తెరవుఁ జొరఁడు

క॥ కొండలదొర డెందంబున, నిండగు మోదంబునొంది నిలయంబునఁ దా
నుండెఁ బ్రియంబున జగదీ, శుండట స్వాత్మమును గనుచు శోభిలెమిగులఁ.

ఉ॥ కాళి సఖీద్వయిఁ జతగఁ గైకొని నిత్యము చంద్రశేఖరుఁ
వేళకుఁ జేరి తత్పదవనేజము లభ్రధునీజలంబులన్
క్షాళనచేసి యఘ్నునర సంబును గ్రోలు విశుద్ధవిస్ఫుర
చ్చేలముతోఁ దడిన్ దుడుచుఁ జెన్నుగఁ బూజలొనర్చు సద్విధిఁ. 298

సీ॥ కస్తూరిచూర్ణ సంకలిత చందనలేప, మేకాని పూయదే యితర లేప
మేకవింశతి దళా స్తోక బిల్వార్చయే, కాక యర్పింపదే కడమపత్రి
ప్రత్యగ్రసౌవర్ణ పద్మార్చనమెకాని, సలుపదేలాతి పుష్పముల పూజ
పరిపక్వ కల్పద్రుమ ఫలని వేదనమె సే, యునుగాని యిడదు చుల్కనఫలముల
గీ॥ సమధికధ్యానవిజ్ఞానసంప్రయుక్త, హితతరప్రార్థనాపూర్వనుతులెకాక
పలుకదొక్కింత నేలాటి భాషణముల, శిఖరిరాజకుమారి యాచితినిమిాఁతి.

ఆ॥ మరల మరల మ్రొక్కి మానుగ నిత్యమి, బ్భంగి ధీరుఁడైన తపంబుసేయు
శంకరుని భజించి శైలేంద్రకన్యక, మగుడఁ జేరుఁ దండ్రి మందిరంబు. 300

వ. ఇట్లు చిరకాలంబు గడచినంత శివసన్నిధానంబందు శివునిఁ జేరి.

సీ॥ ఒకనాఁడు కాళిక సకియలతో గాన, మొనరించెఁ గామవర్ధనముగాఁగ
ఒకనాఁడు కుశసమిద్వికచసుమంబుల, స్వయముగాఁ దెచ్చి యర్పణముచేసె
ఒకనాఁడు పుష్పమాలికల నాశ్రమమెల్లఁ, బొంకంబుగాఁ దానలంకరించె
ఒకనాఁడు శివునిఁదానొంటిమై తెప్పవే, యకే చూచి కడువిస్మయంబుఁ జెందె

గీ॥ అంతశివుఁడును నొంటిమై ♦ నప్పుడు తనదు, మ్రోలనున్నట్టి యాజగ ♦ న్మోహనాంగిఁ
గనియు భ్రాతతనువున నొ ♦ ప్పినదటంచు, దారగా గ్రహియింపఁగఁ ♦ దలఁపకుండె.

వ. మఱలఁ గొన్నినాళ్ళ కమ్మహాదేవుండు.

సీ॥ సంయుతేంద్రియుఁడై తన ♦ చరణసేవ, నంబె మదిఁబూనియున్న య ♦ న్నగకులేంద్ర
పుత్రినారసి కడుకృపా ♦ పూర్ణమతిఁ ద, లంచె నెమ్మనమందు నీ ♦ లాగుగాను.

క॥ ఎపుడు గరువంబుఁ బోవిడి, తపముల్ సలుపంగఁదొడఁగు ♦ తన్వీమణి దా
నపు డేనును దడయక లో, లుపమతిఁ బెండ్లాడువాఁడ ♦ లోలాక్షినిటన్. 304

ఉ॥ ఇప్పగిదిన్ దలంచి జగ ♦ దీశ్వరుఁడంతనె ధ్యానయోగ మ
ల్లెప్పటియట్లు బొంది మది ♦ నెట్టివిచారము నొంద కెంతయున్
దప్పక సేవఁజేయు వసు ♦ ధాధరరాజవరేణ్యకన్య దా
నెప్పుడు చూచుచుండియు న ♦ దేమొకొ చూడనియట్లులుండెడున్. 305

క॥ గిరిజ యనుదినము శివునకుఁ, బరివస్యలొనర్చుచుండి ♦ బాగుగ నతిభా
స్వరమైన శివునిరూపం, బుజువుగఁజూచుచు మనమున ♦ నువ్విళులూరున్.

వ. అంతఁ గొంతకాలం బిట్లు చనినంతఁ దారకాసురబాధితులై యమరలు పరమేష్ఠి యనుమతంబునఁ బార్వతీపరమేశ్వర సమ్మేళనంబునకై పచ్చవిలుతుం బుత్తెంచ నతండు పరమేశ్వరుకంటిమంటన్ గరంగుటన్ గాంచి పార్వతి గర్వంబు దొఱంగి ఘోరంబగు తపం బొనరించినంత శివుండు సంతుష్టుండై వివాహం బాడె ననిన విని సూతునకు శౌనకాదు లిట్లనిరి.

గీ॥ తారకాసురుఁ డెవ్వఁడు ♦ దారబలము, వానికెట్లులభించె? సు ♦ పర్వులెట్టు
లంతకాంతకు మీఁదికి ♦ నలరువిల్తుఁ, బంపి రెట్టుల నాతండు ♦ పయనమయ్యె.

క॥ ఎఱిఁగింపుము చక్కఁగ నిఁక, నఱమఱ యొక్కింతలేక ♦ యనఘాత్మక! మా
యుఱవగు దగ యడఁగఁగఁ గ్రి, చ్చఱ ఘనమకరందమధుర ♦ చారుతరగవిన్.

వ. అనుటయు

శా॥ శ్రీరాజద్వరవర్ణినీసముదయ ♦ శ్రేణీప్రకర్షాఢ్య! వి
స్తారౌదార్యదయారసాబ్ధిహృదయా! ♦ శైలేంద్రజాశంకరా
ర్చారాజన్మధురాశయా! పతిహిత ♦ ప్రారంభసంరంభ! కా
శీరామేశ్వరముఖ్యతీర్థగమన ♦ శ్రీభోగభాగ్యోదయా! 310

గద్య.

ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వర నామధేయప్రణీతంబైన
శివపురాణంబందలి పార్వతీఖండంబునఁ
బ్రథమాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## పార్వతీఖండము.

### ద్వితీయాశ్వాసము.



మల్లికాంబికాతను
జా! మృదుమధురప్రసంగ ♦ షట్కాలశివా
ర్చామోదమానసాబ్జ! స
భామాన్యా! యనఘ! వీర ♦ భద్రారాధ్యా!

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునీంద్రుల కిట్లనియె. 2

—* సూతుఁడు శౌనకాదులకుఁ దారకాసురోదంతంబుఁ జెప్పుట *—

ఉ॥ సారసగర్భపౌత్రుఁ డధి ♦ శక్తి మరీచికుమారుఁ డాస్వయం
భూరుచి కశ్యపుండు పద ♦ మూఁగుర దక్షునియాత్మజాతలన్
బేరిమిఁ బెండ్లియాడ నటఁ ♦ బెద్దదియైన దితీభయాన కా
భూరిబలుల్ హిరణ్యకశి ♦ పుండు హిరణ్యవిలోచనుండునున్. 3

ఆ॥ తనయులై జనించి ♦ ధాత్రియందెల్లెడ, దుఃఖకరులుగాఁగఁ ♦ దొడరనపుడు
హరి నృసింహసూక ♦ రాకారముల వారిఁ, బట్టిచంపె విబుధ♦పంక్తు లలర. 4

చ॥ దితియును ఘోరదుఃఖమున ♦ దీనతఁజెంది నిజాత్మనాథు నం
చితమతిఁ గొల్చి చూలుఁగొన ♦ జిష్ణుఁడెఱింగి తదీయగర్భము
ద్ధతిఁ గులిశప్రయోగమున ♦ నంతనె వ్రయ్యలు చేసినన్ మహో
న్నతమగు కాశ్యపాంశ మది ♦ నాశముగాక తనర్చె నెంతయున్.

గీ॥ నిదురఁబోవుచున్నయ♦న్నెలఁతకొక్క, నాఁడు దైవికయోగంబు♦నన్ మరుత్తు
లనెడు పేరునఁ బెక్కురు♦తనయు లుద్భ, వించి నాకముఁజేరి సే ♦ వించిరింద్రు.

క॥ అం దింద్రునియనుమతితో, డం దిరముగ వారలుండు ♦ టనుజూచి కడుఁ
వందురి దితిసుందరి దిరు, గం దనవిభుఁజేరిచెప్పి ♦ కలవిధమెల్లన్. 7

గీ॥ మరలగర్భంబుఁగోరియ ♦ మ్మగువమగని, వేడఁగా నతఁడిట్లనె ♦ వెలది! వినుము
పదియు వేలేండ్లు రాజీవ ♦ భవునిఁగూర్చి, పావనాత్మకవై చేయు♦పరమతపము.

క॥ ఆరీతి సల్పఁగా సుతుఁ, డోరమణీ! నీకుఁ బొడము ♦ నుజ్జ్వలగాత్రుం
డారూఢవిక్రముఁడు జగ, దారాధ్యచరిత్రుఁ డొకరుఁ ♦ డపుడు హితముగాన్.

—* వజ్రాంగుని యుత్పత్తి *—

ఆ॥ ఇట్లు కశ్యపి పంప ♦ నిందీవరాక్షి దా, నత్తెఱంగు తపము ♦ నాచరించి
వచ్చివిభునిఁగొల్చి ♦ వరుస వేఁకటిదాల్చి,సుతునిఁగనియె నొకని♦సురుచిరాంగు.

క॥ ఆతఁడు వజ్రాంగుండని, ఖ్యాతిఁగొనె నాహ్వాయంబు ♦ సార్థకతదగన్
జేతోమోదముఁగనె దితి, యాతంకముఁజెంది కుంది ♦ రమరులు పెలుచన్.

వ. ఇట్లు దినదినప్రవర్థమానుండై యతండు నిజజననీశాసనంబునన్ జేసి యొక్కనాఁ
డేకరథమ్ముతో నాకమ్మునకేగి. 12

చ॥ కదిసి మహేంద్రు నాహవము ♦ ఖమ్మునఁబట్టి సురల్ గలంగఁ దో
ర్మదమెడలించి బిట్టలుక ♦ మైకొని బెట్టిదమైనశిక్షఁ బెం
పొదవఁగఁజేసి నిర్జరస ♦ మూహముతోఁ జెరపెట్టి యార్చె న
య్యదనున వాసవవ్యసన ♦ మారసి యాదితి చెందె మోదమున్. 13

గీ॥ దేవతలు చాలదీనులై ♦ తీవ్రదుఃఖ, భరముఁజెందిరి తత్సతుల్ ♦ బహులశోక
సాగరంబున మునిఁగిరా♦చంద మెఱిఁగి, కమలజుఁడు కశ్యపునితోడఁ♦గదలివచ్చి.

క॥ సామోక్తుల వజ్రాంగుని,తో మానసమలరఁ బల్కి ♦ దుర్గ్రహిణుండల సు
త్రాముని దివిషచ్చక్రము, తో మగుడన్ విడువఁజేసెఁ ♦ దోరంపుదయన్.

వ. అంత శివభక్తాగ్రగణ్యుండును బరిశుద్ధాంతరంగుండును నిర్వికారుండును నిత్య
సంతుష్టుండును నగు వజ్రాంగుం డట్లు ధాత యనుమతిన్ బురుహూతాది
సకలాదితేయులన్ విడిచిపుచ్చి యత్తాత కిట్లనియె. 16

మ॥ పరమేష్ఠీ! విను మీ బిడౌజుఁడు మహా ♦ పాపిష్ఠుఁ డెట్లేతనిన్
గరుణన్ గాంచితి వస్మదీయజననీ ♦ గర్భస్థతేజంబుఁ దెం
పరియై వ్రయ్యలుచేసె స్వార్థపరుఁడై ♦ మాతల్లియుల్లంబు వం
దురఁజేసెన్ బలుమార్లు నద్ది గుడిపెన్ ♦ దుఃఖంబు నిక్కంబిటుల్. 17

మ॥ తనరాజ్యంబును నేలుఁగాక యిపుడీ ♦ తండింక లోకేశ! మ
జ్జననీశాసనమొంది యివ్విధము శి ♦ క్షన్ జేసితిన్ నీవు నా
జనకుండున్ జనుదెంచి యివ్విధము యా ♦ చ్నన్ సల్పఁ గాదందు నే
ధనలోభంబునఁ జేయలే దిటులఁ ద ♦ ధ్యం బిద్ది భావింపుమా! 18

ఉ॥ ఒల్లను దారహారముల ♦ నొల్లను రత్నవిభూషణంబు లే
నొల్లను వాహనప్రకర ♦ మొల్లను రాజ్యము భోగవైభవం
బొల్లను దేవ! తత్త్వమది ♦ యొక్కటి గోరెదఁ జెప్పుమయ్య! తా
నెల్ల సమస్తదుఃఖముల ♦ నేపునఁబాపి సుఖం బొసంగునో. 19

చ॥ అదివిని పద్మజుండు హృద ♦ యంబున నూరటఁజెంది సత్త్వసం
పదరహిఁ జెందె నీతఁడిఁక ♦ భామిని వీనికి నే సృజింతు నం
చెదను దలంచి యట్లై సృజి ♦ యించి వరాంగి యనాఁగ నుగ్మలిన్
ముదముననిచ్చి యద్దితిజ ♦ ముఖ్యుని పెండిలిచేసె వాసిగన్. 20

వ. అనంతరం బక్కాంచనగర్భుండును గశ్యపుండును దమనివాసంబుల కరిగి రిట వజ్రాంగుఁడును దామసభావంబు లేక సాత్త్వికాంతఃకరణుండై యెల్లరతో నిర్వైరంబుగ సుఖంబుండె. వరాంగి వల్లభునితోడఁ గూడియుండియు సాత్త్విక భావంబు నొందక సకామయై వివిధోపచారంబులఁ బెనిమిటి నారాధించుచుండె.

గీ॥ అంతవజ్రాంగుఁ డెంతయుఁ ♦ గాంత సేయు, సేవలన్ గడుప్రీతుఁడై ♦ చెలువఁగాంచి
పలికె నాతోడఁ దెల్పు శం ♦ పాలతాంగి!, నీ మనోరథ మీడేర్తు ♦ నిక్కముగను.

మ॥ అనినన్ వేగ వరాంగి దాని విని మహా ♦ హ్లాదంబుతో మ్రొక్కి యి
ట్లనె దేవా! కరుణించెదేనిఁ దనయున్ ♦ బ్రాంచద్బలున్ బాకశా
సనదుఃఖప్రదు లోకజిత్వరుఁ బ్రశ ♦ స్తశ్రీయు నాకుక్షిలో
జనియింపన్ బొనరింపు మట్లయిన నే ♦ సంతోషమున్ జెందెదన్. 23

క॥ అనియడుగఁ బ్రియావాక్యం, బునువిని యక్కజముఁ జెంది ♦ పురుషశ్రేష్ఠుం
డును జ్ఞానియునగు నతఁ డి, ట్లనికొనియెన్ మానసంబు ♦ నం దాకులుఁడై.

ఉ॥ కోరుము నీదువాంఛితము ♦ కోమలి! నే నొడఁగూర్తు నంచుఁ ద
వ్వారయ కేనుబల్కితి వ ♦ రాంగి సురావళితో విరోధమున్
గోరివచించె నట్టులౌనఁ ♦ గూర్చిన లోకములార్తిఁ జెందు నే
నేరక తెచ్చుకొంటి నవి ♦ నీతుఁడనై యిటుఁ బాపహేతువున్. 25

ఉ॥ కాదని యిష్టు మీఱుటది ♦ కర్జమె దోసముగాదె యెక్కుడన్
బోదు నెటుల్ పొనర్తు నెటుఁ ♦ బోయిన ధర్మవిరుద్ధమార్గ మిం
దేది హితేతరంబు హిత ♦ మెయ్యది యంచు విచారసాగరం
బీదుచుఁ గొన్నినాళ్ళిటుల ♦ నే కడపెన్ గడు భీతచిత్తుఁడై. 26

గీ॥ అంతఁ బరమేశ్వరేచ్ఛ చే ♦ నతఁడుదార, హితము నే చేయఁదలఁచి భూ ♦ యిష్ఠతపము
నజునిఁగోరి యొనర్ప న ♦ య్యలఘుఁ డెదుర, నిలిచి నీ యీప్సితం బెద్ది ♦ తెలుపుమనిన.

శా॥ ఆవజ్రాంగుఁడు పద్మజున్‌గని మహా ♦ హర్షంబునన్ మ్రొక్కినా
నా వేదోక్తుల సన్నుతుల్ సలిపి వా ♦ జ్నాథా! మదీయాంగనా
భావారాధుని బుత్త్రి నిమ్ము త్రిజగ ♦ త్ప్రఖ్యాతవిక్రాంతుఁ దే
జోవిద్యోతితదిగ్వితాను సుతప ♦ స్తోమాభిరామాత్మకున్. 28

గీ॥ ఇట్లుగోరిన వినివర ♦ మేష్టి యట్టు, లగునుగాకని పలికి ని ♦ జాత్మమందుఁ
దలఁకుఁగొని శివునెంతయుఁ♦దలఁచి కొలిచి, చనియె వేగంబుగానిజ♦సదనమునకు.

—* తారకాసురుఁడు పుట్టుట *—

ఉత్సాహవృత్తము॥ అంతఁ దా వరాంగి గర్భ ♦ మంది సంతసమున భా
స్వంత మైన తేజమొంది♦చాలకాలమేగ రా
త్ర్యంతమందు నర్కుఁబోలె ♦ నతిశుభంపు వేళ నా
కాంతఁ గనెఁ ద్రిలోకశూరుఁ ♦ గాఁ గుమారు నుజ్జ్వలున్, 30

వ. అయ్యవసరంబున.

సీ॥ వసుమతి వణఁకె బ♦ర్వతవనంబులతోడ, దిశలందు జ్వాల లెం ♦ తేనిఁదనరె
తోయదవ్రకరంబు ♦ పూయవర్షము నించె, నుప్పెనల్ చెలరేఁగె♦నుదధులందు
సుడిగాడ్పు రేఁగియె♦క్కుడురజంబులఁగుప్పె.గొప్పమానులు పెల్లు♦గూలెఁబుడమి
పరివేషములు ప్రభా ♦ కరచంద్రములఁజుట్టె, నిర్ఘాతపాతముల్ ♦ నెగడెమిగుల

గీ॥ శునకముల్ దలలెత్తిరో ♦ దనముచేసె, గుడ్లగూబలు నక్కలు ♦ గూసెఁబసులు
కారణం బించుకేని లే♦కయె రయమున, వదలె మూత్రపురీషముల్♦బెదరి బెదరి.

క॥ ఇటుల మహోత్పాతము లు, త్కటముగ నపుడుప్పతిల్లఁ ♦ గని మూఢజనుల్
వటుతరవిప్లవ మేదో, ఘటిల్లెనని మనసులందుఁ ♦ గాంచిరి కలఁతన్, 32

గీ॥ అపుడు కశ్యపసహితుఁడై ♦ యబ్జభవుఁడు
వచ్చి తారకుఁ డనుచునా ♦ హ్వాయ మొనర్చె
బాలునకు; బాలుఁడట మీఁద ♦ వరుసతోడఁ
గొండవలె దృఢకాయుఁడై ♦ గొప్పఁజెందె. 33

వ. అంతఁ గొంతకాలంబు చనినంత.

గీ॥ తారకాసురుఁడపుడు శా♦త్రవజయంబుఁ, బడయఁదపసానరింపగాఁ ♦ గడఁగితల్లి
సెలవుఁగొనిమధువనభూమిఁ♦జేరిభూరిఁ,తపముఁజేయగఁదొడఁగెధా♦తనుగుతించి,

—* తారకాసురతపోవర్ణనము *—

సీ॥ ఒకయంఘ్రినిలిచి బా♦హువులెత్తికెత్తిది, నేంద్రుఁగన్గొనుచునా♦తేండ్లుగడపి
పూనిపాదాంగుష్ట ♦ మున నేనిలిచి యట్లె,యినునిఁగన్గొనుచు నూ♦తేండ్లుగడపి

ఒకచేతనే నేల♦నొంది తాఁ దలక్రిందు, తెగసి దర్పమున నూ♦ ఱేండ్లుగడపి
ద్రుమశాఖఁ బాదద్వ♦యమున నాలంబన, మెసఁగఁగావించి నూ♦ఱేండ్లుగడపి
గీ॥ ఇల ననలమధ్యమందు నూ♦ఱేండ్లుగడపి, యెలమి జలమధ్యమందు నూ♦ఱేండ్లుగడపి
యనువుగా ధృఢచిత్తుఁడై♦యనిలభక్ష, ణంబు సేయుచు నతఁడుత♦పంబు సలిపె.

ఉ॥ ఉగ్రతపంబు నిట్లు నియ♦ మోద్ధతిఁ జేయఁగ నష్ట వానిశీ
ర్షాగ్రమునుండి యగ్నులు ర♦యంబున వెల్వడి చుట్టి మేదురో
దగ్రతరార్చులన్ భువన♦దాహముచేయఁగ డంగఁగా నిలిం
పాగ్రణులెల్లఁ జేరిరి భ♦యాతురులై పరమేష్ఠిలోకమున్. 36

చ॥ చని విధిఁగాంచి మ్రొక్కి కడు♦ సంస్తుతులన్ బొనరించి దైత్యవ
ర్యుని ఘనతాపసవ్రతమ♦ హోన్నతిఁ దెల్పి తదీయతాపవే
దన భువనంబు లన్నియును♦ దగ్ధము కాఁగలవంచుఁ జెప్పి గొ
బ్బునఁ గరుణించి ప్రోవుమని♦ ప్రోవుగఁ బల్కిరి యుల్కునన్ సురల్. 37

గీ॥ అనిన విని పద్మసంభవుం♦డాదరమున, దైవతారి యుదంతమం♦తయును మంత
నమునఁ జింతించి వేలుపు♦గములఁ బంచి, యసుర యున్నెడకరుదెంచి♦యనియెనిట్లు.

—* బ్రహ్మదేవుఁడు తారకాసురునకు వరంబు లిచ్చుట *—

ఉ॥ తారక! నీతపోవ్రత ము♦దారతరం బది మెచ్చి నీకిటుల్
కోరిక లీయ వచ్చితిని ♦ కోరఁగ రానివటంచు లేవు నీ
వారసి తెల్పు మీప్సితము♦ లన్ని యొసంగెద నన్న ధాతతో
భూరిముదంబునన్ దనుజ ♦ పుంగవుఁడప్పుడు మ్రొక్కి యిట్లనెన్. 39

తరల॥ సకలలోకవిధాత! నీవు ప్ర♦సన్నభావముఁ జెంద వే
ఱొకటి దక్కవయుండునే వర ♦ మొంద నేఁ దగియున్న చో
సకలనిర్జరరాజిఁ గెల్వఁగ ♦ శక్తినిమ్ము పురారి క
ర్భకుఁడు గల్గినఁ జంపుఁగాక దు♦రంబునం దురుశక్తిచే. 40

వ. అనుగ్రహించి నాకీ రెండువరంబు లిమ్మని యడిగినఁ బితామహుండు తథా
స్తని యొసంగి నిజధామంబున కరిగె. తారకుండును నాండ్యంభవిష్ణుండై నిజ
పట్టణంబగు శోణితపురంబుఁ బ్రవేశించి దైత్యగురుండగు భార్గవునియనుమతితో
సుముహూర్తంబునందుఁ ద్రిలోకరాజ్యపట్టాభిషేకంబుఁ జెందె. 41

—* తారక దిగ్విజయము *—

శా॥ అంతన్ దానవభర్త సర్వవిజయం ♦ బాసించి నాకంబు వి
క్రాంతిన్ జేరి పురందరున్ గడిఁది సం♦గ్రామంబునన్ గెల్చి దు

ద్రాంతస్ఫూర్తి సమస్తనిర్జరుల శౌ ♦ ర్యం బూడ్చి నిర్జించి ని
శ్చింతన్ వారలచే నుపాయనములన్ ♦ జెందెన్ మహోత్సాహియై. 42

సీ॥ ఐరావతంబిచ్చె ♦ హరిహయుం డడలున, నవనిధు లొసఁగెఁ గి♦న్నరులఱేఁడు
వరుణుండు దివ్యాశ్వ ♦ వర్గంబు లిచ్చెను, నుచ్చైశ్శ్రవంబుఁ బ్రొ ♦ ద్దిచ్చెఁదలఁకి.
కామధేనువు నార్ష♦ గణము సమర్పించెఁ, దొగలవిందమృతమి♦మ్ముగ నొసంగె
వసుమతి యొసఁగె సు ♦ వర్ణసస్యంబుల, రత్నంబులిచ్చె సం ♦ ద్రములరాజు

గీ॥ ఇప్పగిది నెల్ల రలుకున ♦ నిచ్చునట్టి, వస్తువాహనములఁగొని ♦ వైభవమున
సకలలోకము లేలెఁ గా ♦ శలము మెఱయఁ, దారకుండు సురశ్రీవి ♦ దారకుండు.

మ॥ ఒకనాఁ డచ్యుతుఁ గెల్వఁగాఁదలఁచి పే ♦ రుత్సాహ మొప్పంగ సై
నికవర్గంబులతో వడిన్ జని ఘనా ♦ నీకంబునన్ దీవ్రసా
యకజాలంబులఁ గేశవున్ బొదువఁ బ ♦ ద్మాక్షుండు రుష్టాత్ముఁడై
ప్రకటోదగ్రకఠోరధారమగు చ ♦ క్రం బేసి యార్చెన్ గడున్. 44

క॥ చక్రం బట్లేసిన ని, ర్వక్రంబుగ నేగి దాన ♦ వప్రభునటుతన్
విక్రమముదక్కి సుమహో, రక్రియఁ జెలువొందె దైత్య♦రాజి యలరఁగాన్.

గీ॥ అంతశ్రీకాంతుఁ డక్కజ♦మంది వైరి, జయముమది నెంచితత్కాల♦సముచితముగఁ
దారకునకు విధేయుఁడై♦తగుల మెసఁగఁ, బలికి నిజపురి కనిపె ను♦పాయమునను.

## —* దేవతా పీడనము *—

గీ॥ తారకాసురుఁ డపుడు శా♦త్రవజయంబుఁ, బూర్తిగా నొంది వేల్పుల♦నార్తిపెట్టి
యెల్లజగములఁ దనయాజ్ఞ♦చెల్లునట్లు,చేసి భోగంబులను బెల్లు ♦ చెందుచుండె.

వ. అంత దేవతలందఱు పరాజితులై తారకాసురుని దాస్యంబుఁ జెంది యెల్ల వేళల వ్వానిఁ గొలుచుచుండిరి. 48

సీ॥ మారుతుం డిల్లిల్లు ♦ మార్జనం బొనరించుఁ, గలయంపిఁజల్లును ♦ గాండభర్త
వైశ్వానరుండు మేల్ ♦ వంటకం బొనరించు, రక్షకభటుఁడై ప♦రంగు జముఁడు
అశ్వినేయులు గొల్తు ♦ రమరిక వెజ్జులై, బొక్కసంబులఁ బెంచు ♦ జక్కులదొర
తుంబురుం డొనరించుఁ ♦ దోరంపుగానంబు, నాట్య మచ్చరలు పొ ♦ నర్తురరసి

గీ॥ అనుదినం బినుఁ డర్ధమా ♦ నట్టులెండ, గాయు రేఱేఁడు నట్టులే ♦ కర్జమెఱిఁగి
వెన్నెలలునించు నిందుఁ డిందు♦విధముఁ దెలిసి, వానగురిపించు దైతేయ♦వరునకదరి.

## —* దేవతలు బ్రహ్మదేవునకు దమయార్తిన్ జెప్పికొనుట *—

సుగంధి॥ చాలఁగాలమిట్లుఁ సేవ ♦ సల్పి వేల్పు లెల్లరున్
జాలినొంది డీలుఁజెంది ♦ సత్యలోక మేగి యం

దోలగంబునందుఁ గాంచ ♦ నోదరున్ బ్రపన్నులై
చాలభక్తిఁ జేరి మ్రొక్కి ♦ సంస్తుతించి రెంతయున్. 50

చ॥ నలినభవుండు వారల మ ♦ నస్థితి నారసి గారవంపు పెం
పలరఁగ నిట్లు బల్కె హృద ♦ యంబుల నెవ్వగఁ జెందియున్న య
ట్టుల మదిదోఁచెఁ దాఁచక యి♦టుల్ చెపుఁడయ్య నిలింపులార! మీ
యలుకుఁ బొలంగఁ జేయు విత ♦ మారసెదన్ జడి యెల్లభంగులన్. 51

గీ॥ అనిన దేవతలనిరి మ ♦ హాత్మ! నీకు, గోచరం బెట్లుగాదొకో ♦ గురుతరవ్య
థావిపన్నులమగు మాయు♦దంతమంత, యకట! తారకహేతుకం♦బై యలంప.

ఉ॥ తారకుఁడట్లు నీకడ ను ♦ దారవరంబులఁ జెంది వీరల
క్ష్మీరమణీయవైభవవి ♦ శేషవిజృంభితదివ్యశక్తి బృం
దారకబృందమున్ గెలిచి ♦ నాకము మున్నగుచోట్లనెల్ల ది
వ్యారుల ధీరులన్ నిలిపి ♦ యార్తులఁ జేయుచునుండె మమ్మిటుల్. 53

ఉ॥ ఏమనిచెప్పువారమిఁక ♦ నేవములే కలవాఁడు సేయు నా
బాములు పద్మసంభవ! సు ♦ పర్వులమెల్లర మెగ్గువాలి మా
దీమసమెల్లఁ గోలుపడి ♦ దేబెలమై కడుఁ దుచ్ఛపుం బనుల్
మే మొనరింపుచుంటిమి య♦మిత్రుని కుల్కున రాతిరింబవల్. 54

చ॥ కటకట యెట్టులోర్తు మొడి ♦ కమ్మున సేవ లొనర్చుచున్న న
క్కుటిలుఁ డిఁకెద్దియేని యొక ♦ కూడనికార్యము సెప్పి గొప్ప సి
గ్గట నొడఁగూర్చు నెందయిన ♦ నందకపోవుదమన్న గుండెలే
దెటులనొనర్తు మెందుఁజరి ♦ యింతయు చెప్పుము లోకనాయకా! 55

ఉ॥ ముప్పదిమూఁడుకోట్లు సుర ♦ పుంగవులర్వదికోటు లచ్చరల్
గొప్పమునీశ్వరుల్ నరులు ♦ ఘోరఫణాధరశేఖరుల్ నెటెన్
తప్పక తారకాసురుని ♦ దాస్యముసేయుచు భీతచిత్తులై
యెప్పటికప్పుడే గడుప ♦ నెంతురు కాలము కంజసంభవా! 56

ఉ॥ లేవు ధరిత్రి జన్నములు ♦ లేవు వ్రతంబులునున్ దపంబులున్
లేవు నవగ్రహార్చనలు ♦ లేవు యథోచితదానధర్మముల్
లేవు సుఖప్రసంగములు ♦ లేవు శుభక్రియ లెందునేనియున్
లేవిటుఁ గావలుండగు ని♦లింపవిరోధి కతమ్మునన్ విభూ! 57

ఉ॥ ఇందఱ మిట్లు సర్వభువ ♦ నేశ్వర! తారకపాపకార్యులన్
డిందికడున్ బొకారుచును ♦ నీదరిఁ జేరితి మిప్పు డీవుపే

క్షుం దలపెట్టి చంపెదవొ ♦ క్రన్నన జాలిఁదలంచి మన్పెదో
వందనముల్ ప్రభూ! సురల ♦ వైళము గట్టులఁజేర్పు మెట్టులేఁ. 59

గీ॥ సకలరాక్షసలోకశి♦క్షాచణంబు, నిఖిలసురమునిసజ్జన ♦ నికరరక్ష
ణంబునై యొప్పువిష్ణుచ ♦ క్రంబు తార, కాసురునికంఠమునఁ బుష్ప♦హారమయ్యె.

క॥ ఆ పాపాత్ముని మంత్రులు, పాపతములు క్రౌంచముఖులు ♦ పటుబాహుబలా
టోపమునఁ గూర్చునాపద, లోపఁగ వశమౌనె కాంచ♦నోదర! మాకున్. 60

క॥ మించిన దయామతిన్ బో, షించిన నీవే దురంత ♦ చింతాజలధిన్
ముంచిన నీవే దిక్కని, కొంచక వచ్చితిమి నెనరుఁ♦గూర్పుము తండ్రీ! 61

గీ॥ సన్నిపాతమహావ్యాధి ♦ సంప్రకోప, మందు మందులు వమ్మగు ♦ మాడ్కి నస్మ
దీయయత్నంబులెల్ల దై♦తేయవిభుని, యందు వితలయ్యె నకట! యే♦మందుమనఘ.

ఉ॥ కన్నుల బొమ్మముల్ దొరఁగఁ♦గా నమరోత్తములెల్ల నిట్టులా
పన్నతఁ బొక్కుచున్ దమ వి♦పన్నతఁ దెల్ప ననల్పదుఃఖసం
పన్నమనంబుతో నజుఁడు ♦ వారల గోడుపడాలకించి యా
పన్నతకంధరుండయి వి♦చారముచూపి యొకింత సేపటుల్. 63

గీ॥ వేల్పులనుజూచి మీరిట్లు♦వెఱవఁదగునె, కాలమొకరీతిగానుండఁ♦గలదె యెందుఁ
గడఁగిచీఁకటి గొన్నాళ్ళు♦గానుపింప, వెన్నెలవెలుంగు వెనువెంట♦వేగిరముగ.

ఉ॥ నేన యొసంగినాఁడ రజ♦నీచరనాథున కవ్వరంబు న
ద్దానవుఁడేచి మీకిటులఁ ♦ దాపముసేయుటఁ జూడఁగా గడున్
మానసమెంతొ నొచ్చె నిది ♦ మంచిదె? సాధులఘోష పాటిగా
వానికిఁ జేటుదెచ్చు నిఁక ♦ వందురఁ జెందకుఁడిం దకల్మషుల్! 65

ఉ॥ వాని తపంబు లోకముల ♦ వారణరీతి దహించుచుండఁగా
నేనటులీయకొంటిఁ బర♦మేశ్వరుఁ డాత్మజుఁ గాంచెనేని య
ద్దానవు నుగ్రయుద్ధమునఁ ♦ దాఁకి వధించు నతండు గాక య
వ్వాని జయింపలేరొరులు ♦ వారిజలోచనుఁడేని శర్వుఁడేన్. 66

—* బ్రహ్మదేవుఁడు కుమారజన్మార్థమై యుపాయంబు జెప్పుట *—

గీ॥ మున్ను దక్షాధ్వరంబున ♦ మూర్తిఁబాసి, నట్టిజగదంబ దా నిపు♦డద్రిరాజ
దారగర్భంబునన్ బుట్టి♦తనరె శివుఁడు, తపముసేయఁగ హిమగిరీం♦ద్రమును జేరె.

చ॥ శివునకు సేవఁజేయుటకు ♦ శీతగిరీశ్వరుఁ డాత్మపుత్రియా
శివను విధించె నాపెయును ♦ సేవయొనర్చుచునుండె నిత్యమా

భవునకుఁ బర్వతాత్మజను ♦ బన్నుగఁ గూర్చినచోఁ గుమారుఁడు
ధ్రువమగు దాన మీ వెతలు ♦ వాయు సుఖం బొనఁగూడు రూఢిగన్. 68

ఆ॥ ఇదియె చక్కనైన♦హితమార్గ మొండిఁక, లేదు వేఱు తెరువు♦లేఖులార!
కడఁగి మీరలట్టి కార్యంబుఁ గూర్పఁగాఁ, బూని రేని మీకుఁ ♦ బొసఁగు శుభము.

గీ॥ తారకున కేను మేలట్లు ♦ దనరఁ జేసి, యిపుడు నేఁ గీడు సలుపుట ♦ హితముగాదు
విసపు మ్రాఁకైన నుర్విఁ బెంచి♦విఱుగఁ గొట్టఁ, దగదు మూర్ఖున కేని యు♦దారులార!

ఉ॥ ఇంకను నేను దారకున ♦ కెంతయు మంచి తెఱంగుఁ జెప్పి యీ
వంకర లెల్లమాని త్రిది ♦ వంబు సుపర్వులకిచ్చి భూమిపై
హంకృతిలేకయుండుమని ♦ యారసి బుద్ధులు సెప్పివచ్చెదన్
బొంకము మీఱ మీరిఁకను ♦ బోయి యొనర్పుఁడు తత్ప్రయత్నమున్. 71

చ॥ అని యిటు వేల్పులన్ బనిచి ♦ యాతఁడు తారకుపాలి కేగి మ
న్ననలను వానిచేఁ బడసి ♦ నాకము లేఖులకిచ్చి సంతసం
బొనరఁగ శోణితాఖ్యపురి ♦ నుండి జగంబుల నేలు మట్టులే
వనయము నీకు శ్రేయమగు ♦ నాయమరోత్కర మొందు నూఱటన్. 72

క॥ స్వారాజ్యంబేలుట నీ, కోరిన యది గాదు నీవు ♦ గోరిన వరమున్
మీఱక యిచ్చితి జుబ్బన, జాఱఁగ నిఁకఁ దనివిఁ గొను మ ♦ సురవర! దీనిన్.

గీ॥ ఇట్లొడంబడఁ జెప్పి తా ♦ నేగె నజుఁడు, స్వర్గమా యసురేంద్రుఁడ♦ప్పటికి విడిచి
శోణితపురంబుఁ జేరి య♦చ్చోటనుండి, సర్వలోకంబు లేలె ని ♦ ష్కంటకముగ.

—* ఇంద్రుఁడు మన్మథుని రప్పించుట *—

మ॥ సుర లొక్కించుకఁ దెప్పరిల్లి సురరా ♦ జున్ జేరగాఁ బోయి యా
దర మొప్పన్ బరమేష్ఠి సెప్పిన యుదం ♦ తంబంతయున్ జెప్పి ముం
దటి కార్యంబునకై త్వరన్ సలుప సు ♦ త్రాముండు వాచస్పతి
త్వరితాదేశమునన్ దలంచె మదిఁ గం ♦ దర్పున్ గడున్ బ్రీతితోన్. 75

చ॥ తలఁచినతోడఁ బచ్చవిలు♦దంట గరంబు ముదంబుతో మధున్
బిలిచి రథంబు నాయితముఁ ♦ బెట్టఁగఁ బంచి రతీభయానతో
చిలుకలు గోరువంకలును ♦ సింహనదంబు లొనర్ప వైభవం
బలరఁగఁ దేరినెక్కి త్రిద♦శాలయభూమికి వచ్చి హెచ్చుగన్. 76

క॥ ధార్మికనిలయంబైన సు, ధర్మన్ దగఁ జేరి దేవ ♦ తలతోఁ ద్రిజగ
చ్ఛర్మంబు నరయు నింద్రుని, నిర్మలమతిఁ జేరి మొక్కి ♦ నిలిచి యిటులనెన్.

గీ॥ ఏల నన్దలంచితివి మ♦హేంద్ర! యేమి, పనిపొసంగెను నాతోడఁ ♦ బలుకు నీదు
సెలవుశిరమునఁదాల్చి నేఁ♦జేయువాఁడ, నీదుకార్యంబుఁదడయక♦నిక్కముగను.

—* ఇంద్రుఁడు మన్మథునకు దేవకార్యంబుఁ దెలుపుట *—

మ॥ అనఁ గందర్పునివాక్యముల్ విని మహా ♦ హ్లాదం బెదర్ జెంది య
ఘునుఁ బ్రీతిన్ గని నిర్జరేంద్రుఁడనియెన్ ♦ గ్రాహధ్వజా ! మేలుమే
లనిశం బాప్తులకార్యమీవు నిజకా ♦ ర్యంబట్లు భావింతు వెం
దును నీయట్టి సఖుండుగల్గునె? దిశా ♦ స్తోమంబు గాలించినన్. 79

గీ॥ పుష్పసాయక ! నీవు దం♦భోళియును మ, దీయ జయసాధకంబు లెం♦తేనియశని
కుంఠితంబగు నపుడష్ట ♦ కొదవ లేక, నీ వమోఘతేజస్వివై ♦ నెగడె దెపుడు.

ఉ॥ అక్కతనన్ రమాసుత ! మ ♦ దాత్మసఖుండవు నీవు మాకిటుల్
వెక్కసమైన దుఃఖ మది ♦ వేపుచునున్నది నీసహాయమున్
గ్రక్కునజెంది యిక్కడిఁది ♦ కాఁటియఁబాయవలెన్ గడంగి నీ
వెక్కువ మక్కువన్ గొని సు ♦ హృద్వ్యసనంబు హరింపఁగావలెన్. 81

శా॥ నీకన్నన్ బరుఁ డొక్కఁడిప్పనిని దా ♦ నిర్వాహమున్ జేయఁగా
లేకుంటన్ భవదీయ విక్రమముఁ జె ♦ ల్మిన్ గోరి రావించితిన్
మా కీయాపదయందు నేడుగడవై ♦ మన్పంగ నీభారమో
శ్రీకాంతాననపద్మభాస్కర ! మహా ♦ శృంగారవీరాగ్రణీ! 82

శా॥ ఆపత్కాలమునందు నెచ్చెలిని ఘో ♦ రాజిన్ భటశ్రేష్ఠు రో
గాపన్నుండగునప్డు పెండ్లమును న ♦ త్యంతోరుదుర్భిక్షమం
దో పేర్గొన్న వదాన్యశేఖరుని స ♦ త్యోక్తిన్ మహాసంకటా
టోపంబందుఁ బరీక్ష సేయఁదగు న ♦ ట్టుల్ దల్తు రార్యోత్తముల్. 83

గీ॥ ఇప్పు డనివార్యమైయమ్మ ♦ నేఁచుచున్న, యీమహాపదయందుఁ బ ♦ రీక్ష నీకుఁ
గాఁగలదు కాఁగలదు చెలి♦కాఁడ! జయము, సందియము లేదు సౌందర్య♦శౌర్యధుర్య!

గీ॥ అనిన నింద్రుని వచనంబు ♦ లాలకించి, పంచబాణుఁడు ప్రేమాను♦బంధపూర్వ
కముగ మొగమున లేనగ ♦ వమరనిట్టు, లనియె నత్తఱిఁ బృధ్వీధ♦రారితోడ.

ఉ॥ ఏల యిటుల్ వచించెద వ ♦ హీనపరాక్రమ ! దీనికుత్తరం
బేల ? యొనర్చుకార్య మది ♦ యే దెలుపున్ విశదంబుగాఁగ డం
బాలముగొట్టి కార్యమునఁ ♦ బ్రౌఢియొకింతయుఁగల్గకున్నన
ప్పాలను మెచ్చునే ? జగము ♦ పల్మఱు మాటలఁ గేల నీకడన్. 86

క॥ విన నొకించుక విను నా, చేనగుకార్యంబు నీకుఁ ♦ జెప్పెదఁ బురుహూ
తా! నీపద మాక్రమణముఁ, బూన నెవం డుగ్రతపముఁ ♦ బూనెనొ వానిన్. 87

క॥ క్షణమాత్రంబున మహి లే, క్షణశృంఖలఁ గట్టివేసి ♦ గాసియొనర్తున్
రణరంగరిపువిదారణ, చణమగు కులిశంబ దేల ♦ స్వల్పంబునకై. 88

చ॥ సురగరుడోరగ ప్రథిత ♦ శూరుల నేనియు సిద్ధసాధ్యకి
న్నరనరయక్షరాక్షసక ♦ నర్ఘ్యనశౌర్యుల నేని శారదే
శ్వరకమలేశ్వరేశ్వరుల ♦ సైతము నాకవిలాసినీమదో
ద్ధురకుచశైలదుర్గముల ♦ దూఱఁగ జేసెద వాసిఁగాంచెదన్. 89

క॥ సామాన్యుల లెక్కింపఁగ, నేమి ఘనతయిఁక జగత్త్రయీనాయక! యు
ద్దామమతి నాకుఁ జెప్పుము, నీమనమం దెవ్వఁ డడలు ♦ నెక్కొనఁ జేసెన్. 90

వ. అనిన నూనశరునకు సునాసీరుం డిట్లనియె.

చ॥ సరవిగఁ జెప్పెదన్ గుసుమ ♦ సాయక! విన్మిఁకఁ దారకాసురుం
డురుతప మొంది బ్రహ్మవర ♦ మొందె నిలింపులకెం దజేయుఁడై
గిరిశకుమారుతోడ ననిఁ ♦ గీడ్పడునట్లుగ; వానితోడ నా
హరియును నేనునున్ దివిజు ♦ లందఱ మోడితి మేమి సెప్పుదున్. 91

ఆ॥ ఇట్లుగెలిచి మమ్ము ♦ నేవంపుపనులందుఁ, బాదుకొల్పియట్టి ♦ పనులుగొనుచు
నస్మదీయవైభ ♦ వాతిశయంబెల్లఁ, గొల్లగొట్టి మిగుల ♦ నుల్లసిల్లె. 92

ఉ॥ అంతియెకాదు నిర్జరుల ♦ కాతఁ డనేకవిధంబులన్ గడున్
వంతలఁ గూర్చుచుండు గరు ♦ వంబున వాఁడొనరించు చెట్ట లిం
తింతలటంచు నాత్మగణి ♦ యింపఁ దరంబె రతీశ! యిట్టి మా
చింతలనెల్లఁ బాపఁగల ♦ చేవగలట్టి వలంతివీవెకా! 93

ఉ॥ శంకరుఁ డిప్డు హైమగిరి ♦ సానువునందు నుదారమాతపం
బంకిలిలేక చేసెడు హి ♦ మాచలకన్యక శర్వుసేవకై
పొంకముమీఱ సన్నిధికిఁ ♦ బోయి యుపాసనచేయు నిచ్చ లా
టంకములేక నీవిఁక న ♦ టన్ జని వారలఁగూర్పు నేర్పునన్. 94

క॥ శక్తిశివుల కట్టుల సం, యుక్తిన్ బొసఁగించితేని ♦ యురువిక్రమ సు
వ్యక్తబలుండు కుమారుఁడు, శక్తిధరుం డుద్భవిల్లి ♦ చంపు నసురునిన్. 95

ఉ॥ కావున నెల్లదివ్యులకుఁ ♦ గంటకుఁడై చరియించు తారకున్
జేవయడంచి చంపుటకుఁ ♦ జిత్తమునందుఁ దలంచి చెల్మిమై
నీ విపు డాడినట్టి నుడి ♦ నే స్మరియించి యొనర్పు మిప్పనిన్
నీ విశదోరుకీర్తు లవ ♦ నిన్ జెలువొందఁగ నెల్లకాలమున్. 96

చ॥ అనిన లతాంతచాపుఁడు భ ♦ యంపడి సుంతయుఁదోఁచఁ కాత్మలో
వనరుచు నిట్టువల్కెఁసుర ♦ వల్లభ ! యంతకహంత యేడ ? యీ
వనరుహబాణుఁడేడ ? యని ♦ వార్యతపం బది యేడ ? యందు మో
హనకల యేడ ? సర్వము మ ♦ హావిపరీతవిధాన మారయన్. 97

క॥ మాటల వెంబడిఁ బల్కితి, నీటున నిటలాక్షునేని ♦ నే గెల్చెదనం
చోటుఁ బాటుఁ గాంచక, చేటుఁ గొని తెచ్చుకొంటి ♦ సిద్ధం బరయన్. 98

ఉ॥ వాడిన రాలిపోవు సుమ ♦ వర్గము కాండచయంబు పుష్పనా
నేడకొపాటు పుల్గు లోక ♦ యేవవు వారువముల్ స్వరూప మే
జాడనులేని తెమ్మెరలు ♦ చచ్చువజీరులు దోడు కుందు రే
తేఁ డబలల్ బలంబులు స ♦ రే యిఁక రుద్రునితోడఁ బోరుటల్. 99

గీ॥ కానవాపయిఁగరుణించి ♦ మానియీమ
హాద్యమమునిప్పుడేఱోక్క ♦ యూహ నెంచ
గాఁదగును నీకు దేవేంద్ర! ♦ కష్టమిద్ది
కొండ నెత్తితలన్ దాల్చు ♦ కొనఁదరంబె ? 001

క॥ అనిపల్కిన మరునకుఁ దా, ననిమిషనాథుండు మిత్ర ♦ మా! యిట్లనఁగా
నను వే? శివునకు వెఱవఁగ, ననుచిత మేమున్న దిందు ♦ నరయుము మదిలోన్.

ఆ॥ పెక్కుకల్లలాడి ♦ యొక్కయిల్లును నిల్పఁ, జెల్లునండ్రు జనులు ♦ చెల్మికాఁడ!
పర్వతేంద్రసుతను ♦ బశుపతికిన్ గూర్ప, మంచిపనియె గానఁ ♦ గించపడకు.

గీ॥ నీవుసకలజనప్రమో♦హావహుఁడవు, హరుఁడుసకలజనప్రమో♦దావహుండు
సములుమీరిరువురిటవార♦స్వల్పమాత్ర, మరసిసల్పుజగచ్ఛర్మ ♦ మసబాణ!

క॥ పదునాల్గు భువనములకీ, యదను మహావ్యసనజనక ♦ మై యున్నది దు
ర్మదుఁడగు ననురకతమ్మునఁ, బడపడి నీవలన మేలుఁ♦బడయఁగవలయున్. 104

గీ॥వినుము పల్వురుగడగండ్ల♦వేఁగుచున్న,యపుడుదాసాహ్యమొనరింప♦నర్హుఁడయ్యు
నట్లొనర్పక యుండిన ♦ నఘముఁజెందు, సాయమొనరించినన్ జెందు♦సంపదలను.

క॥ చేసెదనని వాగ్దానముఁ, జేసితి తొలుదొల్త నిపుడు ♦ సేయకయున్నన్
వాసి చెలంగునె? నీకున్, దోసము గాదొక్కొ వారుఁ ♦ ద్రోయఁగ నాడన్.

క॥ నిన్నొక్కనిఁ బంపగ మే, ము న్నెఱిగఁ దలంతుమే య ♦ మోఘవచన! నీ
వెన్నంటి వచ్చెదము నీ, కున్నత జయమొదవునట్లు♦లొప్పఁబలుకుచున్. 107

గీ॥ అనినవిని తాను మున్నాడి♦నట్టినుడిని, దలఁచి దైవేచ్ఛతో నిజా♦త్మమును దిటము
చేసి యిందునితో నట్లు♦సేయువాఁడ, ననిసెలవుఁజెంది హిమగిరి♦కరిగెమరుఁడు.

ఉ॥ ఎచ్చట మిన్నువాఁక దిగి ♦ యేవు మెయిన్ బ్రవహించు మించుగా
నెచ్చట బిల్వవృక్షముల ♦ యింపగు గుంపులు సొంపుమీఱుఁ దా
వచ్చటఁజేసి ఘోరతప ♦ మందు విరాజిలు శర్వుఁ జేరఁగా
వచ్చె రతిన్ వసంతుఁ బరి ♦ వారమునుం గొని మారుఁడ త్తరిన్. 109

## —* వసంతోదయ వర్ణనము *—

ఉ॥ అంత వసంతసంగతవ ♦ నాంతరభూమి నితాంతసౌరభ
భ్రాంతమిళిందబృందసుమ ♦ రాజివిరాజితమై దిగంతవి
శ్రాంతతరస్ఫురన్నదవి ♦ కర్షితఘూర్ణితమానిమానసో
దంతశకుంతపూర్ణమయి ♦ తద్దయు భాసిలె దృష్టికాంతమై. 110

ఉ॥ కన్నులపండువై మదికి ♦ గాటపు హర్షము నిచ్చు చందురుం
డెన్నికమీఱఁ గాయు కడు ♦ నింపగు వెన్నెలపేరిమీఱి య
త్యున్నతిఁ గొమ్మలన్ మగల ♦ నొక్కటఁ దార్చుచు నొప్పుమీఱెఁ దా
నన్నువగాడ్పు వారల ప్ర♦యాసలఁ బాఁపుచు నుండె నెంతయున్. 111

గీ॥ అట్టితఱి వనవాటిక♦యందు మోళ్ళు, గాఢఁ జిగిరించి పూచి తేఁ♦కువ యొసంగఁ
జేతనములకె కాక య♦చేతనముల, రక్తిముంచెడు మన్మథ♦శక్తిఁ దెలిపె. 112

ఉ॥ ఇవ్విధి నెల్లజంతువుల ♦ కెంతయు సంతసమున్ బొనర్చుచున్
బువ్విలుకానిచేఁతలకుఁ ♦ బూన్కి యొసంగుచునున్న యామనిన్
జివ్వనఁ జూచి యీశ్వరుఁడు ♦ చిత్రము! కాలముగానికాలమం
దివ్విధ మెట్టులయ్యె నని ♦ హెచ్చుగ నచ్చెరువొందె నాత్మలోన్. 113

చ॥ మనసున సుంతయున్ వికృతి ♦ మల్లడినొందక ధీరచిత్తుఁడై
మునుపటియట్లు గాఢతప♦మున్ బొనరింపుచు నున్న యీశ్వరున్
గని మదనుండు సారసహ♦కారశరంబును వింటఁ గూర్చి ప్ర
క్కన నిలుచుండెఁ దోడగుచుఁ ♦ గాంతయు నెంతయు నింపుఁ గూర్పఁగన్. 114

శా॥ శృంగారంబును హావభావములతో ♦ నెంతే రహిన్ మన్మథా
జ్ఞం గాటంబగుపూన్కిఁ దద్విపినదే♦శం బింపుమైఁ జేరఁ దా
నం గంధర్వులు మీఱి కామినుల డెం♦దంబూరఁ గందర్పకే
ళిం గావింపఁ గడంగిరెంతయును బా♦ళిన్ భోగనిష్ణాతులై. 115

గీ॥ రతివసంతులతో వల♦రాజు తనదు, బలగములనెల్లఁ దోడ్కొని♦ బాణహస్తుఁ
డై విజృంభింపఁగా నెవ్వఁ♦డతనుతాప, మునకుఁ బొల్పడకుండు ని♦ష్పాడమియందు,

మ॥ తన విక్రాంతి యిటుల్ దనర్చినను రం♦ధ్రం బించుకేన్ భూతనా
థునియం దేర్పడకున్నఁ జూచి కుసుమా♦స్త్రుం డాత్మలోనన్ భయం
బును జెందెన్ దరమే లలాటతటవి♦స్ఫూర్జద్బృహద్భానులో
చను దివ్యత్సుతపోగభీరు హరు నొం♦చం గోరి యుంకించఁగన్. 117

—* పార్వతి పరిచర్యకై శివునియొద్దకు వచ్చుట *—

ఉ॥ అంత నగాధిరాజసుత ♦ యాత్మసఖిద్వయితోడ నీశ్వరా
భ్యంతికభూమిఁ జేరి శివు ♦ నర్చనసేయఁగ వేచియుండెఁ గా
లాంతకుఁ డాక్షణంబున నె ♦ ధ్యానముమాని లతాంతసాయకుం
డంతటిరంధ్రమారసి ప్ర ♦ హర్షణబాణము నొంది పొందికన్. 118

గీ॥ తనదు యత్నంబునకు దృఢా ♦ ధారమైన, కాళికాగమనంబును ♦ గాంచి మించి
యించువిలులాఁగి మదిసంత ♦ సించునటులఁ, బురహరుని మీఁద వేసెను ♦ బుష్పశరము.

ఉ॥ పార్వతియున్ మహేశ్వరునిఁ ♦ బన్నుగఁ జేరి నమస్కరించి మేల్
పర్వెడు వేడ్కమైఁ గొలిచి ♦ ప్రక్కనె నిల్చి సముల్లసద్వయో
గర్వవిలాసదీప్తిఁ జను ♦ గట్టుల నొక్కట నిక్కఁ జేయుచున్
శర్వు నెగాదిగన్ గనియె ♦ శంకరుఁడంతఁ నొకింతఁ బ్రీతిమై. 120

క॥ ఈకాళిక చక్కందన, మేకోమలికేనిఁ గల్గ ♦ దిది నిక్కంబా
నీకాంత బళిర లావ, ణ్యాకరమో మరుని మోహ ♦ నాస్త్రమొ యరయన్, 121

ఉ॥ తమ్మియొ? ముద్దుమోము? కుచ ♦ దమ్ములజంటయొ? కన్నుదోయియో ?
యమ్మరువిండ్లొ? కన్బొమలొ? ♦ యభ్రము లో? కురులొక్కొ ? పక్వబిం
బమ్మొకొ? మోవియో? తిలసు ♦ మంబొకొ? నాసికయొక్కొ? మేటిచా
క్కమ్మగు రత్నవేదికయొ? ♦ కల్కిపిఱుందొ? నభంబొ? కౌనొకో ? 122

మ॥ స్వరమో? కోయిల యెల్గొ ? లేనగవొకో ? చాంద్రాతపంబో ? రసో
ద్ధురమా వీక్షణమాలయో? స్మరశర ♦ స్తోమప్రకారంబొ? సం
చరణంబో ? యసకృద్ధగద్ధగలు మిం ♦ చన్ మించుక్రొమ్మించుసొం
పొ ? రహిన్ గూర్చెడునిద్ది తాపసులకేన్ ♦ బూవిల్తుచేవేటులన్. 123

సీ॥ ఇక్కల్కి నెమ్మేని ♦ చక్కదనంబెన్నఁ, గారాదు పెక్కేండ్లు ♦ కష్టపడిన
ఇచ్చెల్వఁ గట్టిన ♦ యీవల్వ లెంతయు, సింగారమొంది వా ♦ సిన్ జెలంగు
ఈభామ కైసేయ ♦ నింపగు నీపుష్ప, దామంబులొసఁగు నెం ♦ తో ముదంబు
ఈలలితాంగిఁ దా నే ♦ తపస్సును జేసి, కనినాఁడొ ధన్యుఁడీ ♦ గట్టుఱేడు

గీ॥ అందమంతయు నీ సుంద ♦ రాంగి యగుచు, నవని జన్మించెఁ గాఁబోలు ♦ నద్దిరయ్య
ఇది యనన్యసమాకార ♦ యిదియె ధన్య, ఇదియె సర్వాంగసుందరి ♦ యిదియె రమణి.

చ॥ అని యిటు లద్రిజాసురుచి ♦ రాంగకదివ్యమనోజ్ఞరేఖలన్
మనమునఁ బెక్కుతీరులఁ జ ♦ మత్కృతిగాఁ దలపోసి యక్కజం
బునఁ గను దేవదేవుఁ గని ♦ భూధరరాజవరేణ్యకన్య ల
జ్జనుగొని దవ్వులన్ జని ని ♦ జస్ఫురదంగములన్ మొగుడ్చుచున్. 125

గీ॥ మాటిమాటికి శివునిపై ♦ మధురహాస, భాసురేక్షణకువలయ♦పంక్తిఁగుఱియు
కాళిశృంగారచేష్టాపరి ♦ కరములను, గాంచి శివుఁడాత్మనిట్లుద♦ర్కించెనర్చె.

చ॥ కలికనిఁ జూచినంతనె సు ♦ ఖమ్మధికమ్ముగఁ గల్గుచుండె నీ
చెలి బలితంపుకౌఁగిలియె ♦ చేకుఱె నేనియు దానఁగల్గు వె
గ్గలమగు సౌఖ్యపుం బదవిఁ ♦ గాంచుట యెట్టి తపఃఫలంబొ యీ
చెలువను బెండ్లియాడఁగల ♦ చెల్వుఁడికెంతటి భాగ్యశాలియో ? 127

చ॥ పలుమఱు జిత్తమం దిటుల ♦ భావన చేసి మహేశుఁ డంత లో
పల మదిఁ ద్రిప్పి బోధనము ♦ బాగుగఁ జెంది విరాగియై తగన్
లలితను గారవించి భవ ♦ నంబున కేగ విధించి యాత్మఁదాఁ
గలుషతఁ జెందినందులకు ♦ గాటముగా మదినొచ్చి క్రొచ్చుఅన్. 128

చ॥ సకలజగత్ప్రభుండనయి ♦ సర్వ మెఱింగి యుసీ ! రతీశసా
యకవికృతిన్ గిరీంద్రతన ♦ యన్ గని మోహము నేన చెందితిన్
సుకరమె యింక నన్యులకు ♦ సుందరులౌ జవరాండ్రఁ గాంచి వే
ఱొక తెఱఁ గొందకుండఁగ ని ♦ జోన్నతచిత్తముఁ గాపుసేయఁగన్. 129

ఉ॥ కూడని తెర్వునన్ బడితిఁ ♦ గోమలిపై నటు లాసఁజేసితిన్
గూడె నిటుల్ దపంబునకు ♦ గొప్పగ విఘ్నము లన్యభామినిన్
బాడిసెడన్ గువర్ణనలఁ ♦ బాడితి నోడితి ధర్మ మార్గపుం
జాడను వీడితిన్ జడుని ♦ చందమునన్ దృటిలోన నక్కటా ! 130

గీ॥ అనుచు సర్వాత్ముఁ డీశ్వరుఁ ♦ డంత వికృతి
నంతఁ బోఁజిమ్మి కారణం ♦ బరయుచుండెఁ
బ్రకృతి కవ్వల వెలిఁగెడు ♦ పరమశివుఁడు
పడునె మోహంబునందు వి ♦ భ్రాంతుఁడగుచు. 131

## —* శివుండు ఫాలనేత్రాగ్నిచే మన్మథుని దహించుట *—

మ॥ మరుఁడంతన్ శివుదాపలన్ నిలిచి ప ♦ ద్మం బిక్షుచాపంబునం
దిరవొప్పన్ దగిలించి మోహనశరం ♦ బేసెన్ మహేశానుపై
హరుఁడెల్లన్ గలయంగఁజూచి తనపై ♦ నాటోప మొప్పన్ శరో
త్కరముల్ గుప్పుచునున్న మూఢహృదయున్ ♦ గాముల్ గనెన్ గర్వితున్.

పంచచామరము. కడింది నారసంబు లేపు ♦ గాఁగ లాఁగి ధాకతో
వడిన్ వడిన్ మహేశుపై న♦భంగభంగిఁ గుప్పినన్
బెడంద సుంత లేక వీక ♦ భీముఁడున్న నంతనే
యడల్ గొనెన్ మరుండు తేజ ♦ మంతఁ గోలుపోవుచున్. 133

క॥ జగమునఁ బేరొందిన నా, నిగరపు మార్గణము లిందు ♦ నీలగళునిపై
బిగిసెడి మోఘములయ్యెను, దగ దెంతటివారికేని ♦ దర్పము శివుపై. 134

వ. అని యిట్లు ప్రియాసంబు నిరర్థకంబగుటఁ జూచి రతికాంతుఁ డెందు చింతాక్రాం
తుండై యొఱకంబునఁ బడి నడయాడుచు. 135

చ॥ తలఁకి నిలింపబృందమును ♦ దత్క్షణమందుఁ దలంపఁగా నతం
డలఘులు వారలందఱును ♦ నచ్చటి కప్పుడ వచ్చి యీశ్వరుల్
విలయకృశానుభానుపరి ♦ వేష్టితభీకరనేత్రుఁ జూచి భీ
తిలి లవమేనియున్ బలుకఁ ♦ దేఁకువలేక నతోత్తమాంగులై. 136

క॥ కదలక మెదలక వారలు, మదిలో నిటలాక్షుఁ గూర్చి ♦ మానుగ నుతుల్
బెదరుచు సల్పుచు నుండిరి, యదనెఱుఁగని కార్య మెప్పు ♦ డలమటగాదే! 137

చ॥ తెలతెలఁబోయెఁ జందురుఁడు ♦ తెంపఱి మాటునఁ డాగె వేడివే
ల్పులపవనుండు నిల్చెఁ దన ♦ యక్షులఁ గప్పికొనెన్ మహేంద్రుఁడా
జలనిధి ఘూష వెట్టెను గృ ♦ శానుఁడు దీమఱి యాఱుచుండెది
క్కులుగనరాక యుండె శివ ♦ ఘోరదృగగ్ని మహోగ్రదీప్తికిన్.

మ॥ పరితస్సర్పదనల్పపావకశిఖా ♦ భస్మీకృతాకారు న
మ్మరుఁ దగ్ధదేహిని సూచి మూర్ఛిలె ♦ సురల్ మౌనుల్ గభీరార్తిదు
ర్భరతన్ బిట్టుఘటించె బన్నమని యా ♦ పన్నాత్ములై యేడ్చిరా
గిరిరాజాత్మజ వెల్లనై చెలులతో ♦ గేహంబుఁ జేరన్ జనెన్. 139

—* రతీవిలాపము *—

ఉ॥ కాంతునిపాటుఁ గాంచి రతి ♦ కాంతయుఁ బ్రాణమువోయినట్టులై
సుంతయుఁ దెల్విలేక పడి ♦ చూపులు తెల్లురు దల్లడిల్లఁగా
నంత నొకింత తెల్విఁ గొని ♦ హా దనుజారికుమార! వేగ నా
చెంతకుఁ జేరరావె! యనిఁ ♦ జేడ్పడితే? యని యేడ్చె ఘొల్లునన్. 140

సీ. అభవుని గెలువ నీ ♦ కలవిగాదని యంటి, హరుఁ డసామాన్యశౌ ♦ ర్యాఢ్యుఁ డంటి
పరుల కార్యములకుఁ ♦ బాల్పడవలదంటిఁ, బరులు చంపుటకుఁ దో ♦ డ్పడుదురంటి
రుద్రునిమ్రోల నీ ♦ రూపు రూపఱునంటి, మనుపఁగఁ జాల ర ♦ మర్త్యులంటి
ఒక్కతెనైనేను ♦ దిక్కుమాలెద నంటి, రా రక్కుఱలకు నె ♦ వ్వారలంటి
గీ॥ వేగిరము వలదంటి వి ♦ వేకమొందు, మంటి తరమెంచుమంటి నా ♦ యాఁడుకూయిఁ
బాటిగొనుమంటి పయనంబు ♦ వలవదంటిఁ, బట్టుదల విడుమంటి నా ♦ భాగ్యమంటి.

చ॥ హరునకు నీకు హస్తిమశ ♦ కాంతర మౌజుమి వారయంటి నా
పురహరుతోడ నీవెపుడు ♦ పోరఁగ లేవనియంటి మానుమీ

హరితనయా! హారంబుఁ బ్రిల ♦ యాగ్నిని దూఁకఁగఁబోకుమంటి నీ
గరువము చెల్లదంటి నిది ♦ కర్జముగాదనియంటి మాటికిన్. 142

చ॥ నిగనిగ తళ్కులొల్కునెర ♦ నీటుమిటారపు దేటలొప్పు నీ
నగుమొగ మామహేంద్రిసద ♦ నంబుననే సగమోడి వాడె శ్రీ
దిగఁ బడెనాడు కూయిని మ ♦ దిన్ దలపోయక పోతివిట్లు ము
ప్పగుట నెఱుంగ కుగ్రుని దృ ♦ గగ్నులకున్ శలభంబ వైతివే! 143

ఉ॥ అక్కట లచ్చికుట్టి! నిను ♦ నాఁడిఁ బెట్టి నిలింపు లింపుమై
యిక్కరకంతుకంటిసెగ ♦ కింధనమున్ బొనరించి తా మిఁకన్
జక్కఁగ నిండ్లకేగి తమ ♦ సారసగంధులతోడ సౌఖ్యముల్
మక్కువమీఱ నొందఁగా ♦ మందమతిన్ జెడినాఁడ వీ విటుల్. 144

క॥ దిగుదిగుమ నెదరు పదుగురు, దిగరొక్కరు దనకుఁదోడు♦దీమగ నేటన్
నగుదురు మునుంగు నెడలన్, దగునే పెఱవారినుడులఁ ♦ దలఁచి యొనర్పన్.

సీ॥ ప్రియు నెడఁబాసిన ♦ ప్రేయసి కిఁక వేఱు, గతియున్నదే యీజ ♦ గంబునందు
నినుబాసి ప్రాణముల్ ♦ నిలుపఁగా నేటికి, గడఁగి యేమిఁక వేడ్కఁ ♦ గాంతునాథ
పదుగురలో నెల్లఁ ♦ బలుచనైపోయితి, రాణివాసంబు వా ♦ రాశిఁ గలసె
వేల్పులమదు లెంతో ♦ వేడ్కఁజెందెనుగదా, బరవసంబున నేను ♦ భంగపడితి

ఆ॥ దైవ మిట్లు చేసె ♦ తలరి నా కిప్పాట, నేమిసేతు నింక ♦ నెందుఁజొత్తు
కనికరంబుఁద్రోసి ♦ కాంతను బాసితే, పలుకవేల యిఁకను ♦ ప్రాణనాథ!

వ. మహేశ్వరున్ జూచి

చ॥ అకట మహేశ! నీకుఁ దగు ♦ నాలును గూర్పఁగ నా మనోవిభుం
డకుటిలబుద్ధితో సుమచ ♦ యంబును గుప్పినయంత నీవిటుల్
వికటకృశానునేత్రపరి ♦ వృద్ధకరాళతరార్చిఁ గాల్పఁ దా
వకహృదయంబునం దుచిత ♦ భంగినిఁ గన్పడెఁగా పశుప్రభూ! 147

ఆ॥ మిమ్ము నాలుమగల ♦ మెలఁకువతోఁగూర్ప, వేడ్కసేయ నాదు♦విభుఁడు నీవు
మమ్ము నాలుమగల ♦ మఱి వేఱుచేసితే, దయను బాసి కఠిన ♦ తరచరిత్ర!

వ. వేల్పులఁబరికించి.

మ॥ తగునే నిర్జరులార! నాపతిఁ గృతాం ♦ తధ్వంసిపైఁ బంపి యి
మ్ముగఁ దచ్చండతరేక్షణానలశిఖా ♦ పుంజమ్మునం దాహుతిన్
దగ నర్పించి వియోగసాగరమునన్ ♦ నన్ ద్రోచి మీరల్ ముదం
బున నాకంబును జేరి సౌఖ్యముల పెం ♦ పున్ జెందఁగా దుర్మతిన్. 149

చ॥ అని యిటు లార్తిమై రతి మ ♦ హావ్యసనంబున బెగ్గడిల్లి నే
లను బడి పొర్లుచున్ వడిఁ ద ♦ లన్ గరయుగ్మము వాడ మోఁదుచున్
గొనబుసెడన్ గురుల్ చెదరఁ ♦ గూలుచు నిల్చుచు నేడ్చుచున్న న
వ్వనచరు లాలతాంగిఁ గని ♦ వందురి రాత్మములందుఁ బెల్లుగన్ 150

## —* దేవతలు మన్మథుని బ్రతికింపుటకై శివునిఁ బ్రార్థించుట *—

గీ॥ అంత నింద్రుండు మున్నగు ♦ నమరవర్యు, లసమశరురాణిదరిఁ జేరి♦యాదరమున
నూఱడించి హితోక్తుల ♦ నొనర నిట్లు, వలికి రాత్మములందు న ♦ భవుఁదలంచి.
చ॥ వగపును డింపు మూరడిలు ♦ వారిజబాణునిరాణి! పాయు మీ
యగడు లవంబు భస్మము ని ♦ జాంశుకమందు గ్రహించి యుంపు రూ
ఢిగ నిఁక నీమనోహరు వ ♦ డిన్ బ్రతికించు శివుండు నీవు నీ
మగనినిఁ గ్రిమ్మఱన్ గొనెదు ♦ మానిని! మాని నిరంతరవ్యథన్. 152
ఉ॥ అమ్మరో! విన్మ దేహులకు ♦ నారయ దుఃఖముగాని సౌఖ్యమే
నిమ్మహి నేవిధమ్మునను ♦ నేరు ఘటింపఁగ లేరు వారి క
ర్మమ్మునఁ గల్గుచుండు నవి ♦ మాఱునె వేఱొకతీరుగాఁ గరం
బుమ్మలికమ్ముతో సురల ♦ నూరక దూఱఁగ నేల బేల వై. 153
చ॥ అని యిటు పుష్పబాణుసతి ♦ యన్ విహితోక్తుల నూఱడించి శ
ర్వునిఁ దగఁ దారసించి నెన ♦ రున్ గొనునట్లు నుతించి పల్కి రా
యనిమిషు లోమహేశ! శర♦ణాగతవత్సల! మన్మథుండు చే
సినపని స్వార్థమానె? నిజ ♦ చిత్తమునన్ దగ వారయన్ వలెన్. 154
చ॥ ఖలుఁడగు తారకాసురుని ♦ కట్టిఁడిచెయ్వుల కోర్వలేక తే
ఖులు పొనరింపఁజేసి రిటు ♦ కోపము మాని మహేశ! యీసతీ
తిలకము నీరతిన్ దగు గ ♦ తిన్ గృపఁగాంచి యనుగ్రహింపు నీ
యలుకకు నెవ్వరడ్డము మ ♦ హాత్మ! క్షమింపు క్షమింపుమీ మమున్. 155
మ॥ కినుకన్ జెంది సమస్తలోకముల నీ ♦ గీర్వాణబృందంబుతో
డను సంహారము చేసెదేనియును దం ♦ టా లేదు నీ వాక్కనిన్
వనవిల్కానినె చంపినాఁడ విది య ♦ న్యాయంబు కారుణ్యనీ
రనిధీ! వే బ్రదికింపుమీ స్మరు సుప ♦ ర్వస్తోము ముప్పొంగఁగన్. 156
గీ॥ నీవు మారునిఁగాల్ప నీ ♦ నెలఁత యలఁతఁ, గీడ్పడియె వేల్పులెల్లరు♦ చేడ్పడిరి జ
గంబులెల్లనుజెందె భ♦యంబు దేవ!, కడఁగి యీరతిదుఃఖంబుఁ♦గడపు మిఁకను.
చ॥ వలగొని దేవత ల్మిగుల ♦ వందురుచున్ బ్రదికింపు మిష్ట పూ
వులవిలుకాని నం చిటుల ♦ భోరునఁ బ్రార్థనసేయ శంకరుం
డలుకను బాసి వేల్పుగమి ♦ నారతినిన్ గని జాలిమై నిటుల్
వలికె సుధారసప్రసర ♦ బంధురభావవిభాసురోక్తులన్. 158

## —* శివుఁడు మన్మధుని మఱొకప్పుడు బ్రతుకింతునని వరమిచ్చుట *—

చ॥ వినుఁడు నిలింపులార! పృథి ♦ విన్ మధుకైటభవైరి ద్వాపరం
బున వసుదేవసూనుఁడయి ♦ పుట్టుఁ దదంగనయైన రుక్మిణీ

వనజదళాక్షిగర్భమున ♦ వారిజసాయకుఁ డాత్మజన్ముఁడై
జననము నొందు నాతనిని ♦ శంబరుఁ డంబుధి వైచెఁ జెచ్చెరన్. 159

గీ॥ అప్పుడు రతి శంబరునిపుర♦మందుఁ జేరి, మెలఁగి మీనోదరంబున♦మెఱయు బాలు
నెత్తికొనిపోయి పెంపఁ బెం♦పెక్కె యతఁడు, శంబరునిఁ జంపి యారతి♦సతినిఁ గొనును.

శా॥ హృద్యుండై నిరవద్యుఁడై సకలలో ♦ కైకస్ఫురన్మూర్తియై
ప్రోద్యద్విక్రమనిర్జితప్రబలశ ♦ త్రుండై జగన్మోహనై
శద్యస్వస్వుఁడునై సమృద్ధసకలై ♦ శ్వర్యుండునై ధీరుఁడై
ప్రద్యుమ్నుండనుపేర భాసిలు జగ ♦ త్ప్రఖ్యాతచారిత్రుఁడై. 161

గీ॥ పగతుఁ బరిమార్చి తద్ధన ♦ ప్రకరములను, దెచ్చి వచ్చిన తనయు ర♦తిద్వితీయుఁ
గని మనంబుల రుక్మిణీ ♦ కమలనేత్రు, లలరుచుండుదు రెంతయు ♦ నమరులార!

గీ॥ అనిన విని దివ్యులెల్లరుఁ♦దనివిఁ గొనక, దేవ! యిప్పుడె బ్రతికింపు♦ తిరుగ మారు
జాలమెంతయు నోర్వఁగాఁ ♦ జాలమేము, ఏలుమేలుమనన్ బల్కె♦నీలగళుఁడు.

చ॥ రతిని లతాంతసాయకుఁడు ♦ రాతురులం దలరించున ట్లనా
రత మశరీరుఁడై పుడమి ♦ రామలఁ బూరుషులన్ గరంచి సం
గతిని ఘటించున ట్లుచిర ♦ కాలములో వలరాచజోదు నే
బ్రతుకఁగఁ జేతు సైపుఁడు సు ♦ రల్! రతి! సువ్రత! యంతవట్టిటుల్. 164

వ. అనినంత రతియును

క॥ నట్టేటఁ బుట్టిమునిఁగిన, యట్టయ్యెను నాదుచంద ♦ మమరులచేతన్
బెట్టిదమగు నీ కరుణన్, బట్టి నిలుపుదాన నేను ♦ ప్రాణము లభవా! 165

—* శివుఁడు గణములతోఁ గైలాసమున కేగుట *—

ఆ॥ అనుడు హరుఁ డదృశ్యుఁ♦డయ్యె గణంబుతోఁ, గొంతఁ దెప్పరిల్లి ♦ కంతురాణి
వేల్పుగమియుఁ దమదు♦ వేశ్మంబులకుఁ బోయి, రాత్మలందుఁ గాల♦హరునిఁ దలఁచి.

వ. అంత

క॥ హరుఁ గాల్చి వట్టి యనలం, బురువై లోకములఁ గాల్ప ♦ నుంకించఁగ ని
ర్జరులపుడు వెఱచి ధాతన్, దఱిసి యటుల్ దెలుపఁగా న♦తండు గడువడిన్. 167

గీ॥ హిమగిరికివచ్చి యద్దాని♦ నిమ్మతోడఁ, గొలఁదిగా నొక్కయెడఁ జేర్చి♦సలిలరాశి
కడకుఁ గొనిపోవ నంతన♦క్కడలి యజునిఁ, గాంచి పూజింపననియెని♦క్కరణినజుఁడు

క॥ హరుఁ డగ్గికంట విరివిల్, బిరుదున్ గాల్చిన యగ్గి ♦ పెరిఁగి జగముల్
హరియింపఁ జాలియుండఁగ, నరసి యిటకుఁ దెచ్చితిని ద♦యన్ గను మీవున్.

గీ॥ దీని నీలోన నుంపు మెం♦తేని సలిల, మశనముగఁ గ్రోలుచుండుఁ గ♦ల్పాంతకాల
మన సముద్రించునన్ బడ♦బాకృతిని బ్రోవ, దలెడు నాయగ్గిఁ దనలోనఁ♦దాల్చెనపుడు.

క॥ నలువయు సంతోసమునఁ గ, డలిని౯ దీవించి చనె ని♦టను నిఁక బడబా
నలమును మున్నీటి జలం, బులఁ బీల్చుచునుండె భువన ♦ ములు సుఖమొందెన్.

క॥ అని సూతుఁడు సెప్పిన విని, మును లనురాగమున ననిరి ♦ భూధరవరనం
దన చెలులతోడ సదనం, బునకు౯ జని రేమొనర్చె ♦ బుధనుత! చెపుమా.

## —* పార్వతి భీతిల్లి చెలులతో నిలుఁజేరుట *—

వ. అనిన సూతుం డిట్లనియె.

చ॥ మరుని దహించి దండధర ♦ మర్దనుఁ డంత హిమాద్రిఁ బాసి స
త్వరముగ రాజతాచలప ♦ దమ్ము గణమ్ములతోడఁ జేరె భూ
ధరసుతయున్ గను౯ దలఁకి ♦ తద్దయుఁ దల్లడపాటుమీఱ వే
గిరము పురమ్ముత్రోవ నరి ♦ గె౯ జెలు లిర్వురు దోడరా వడిన్. 173

సీ॥ పర్వతేశ్వరుఁ డపుడు శాం♦భవ దృగగ్ని, శబ్ద మాలించి చాలవి♦స్మయముఁజెంది
కూఁతును దలంచి భీతుఁడై♦కుందుచున్ ర,యంబుగాఁ జేరవచ్చె భ♦టాళితోడ.

ఆ॥ శివునిఁబాసి మిగులఁ ♦జింతతో వనరుచు, వచ్చుచున్న హైమ♦వతినిఁజూచి
కనులనీరుఁ దుడిచి ♦ గారాబ మమర నె, త్తికొని చనియెఁ దనదు♦దిమమునకు.

చ॥ అంత హిమాద్రిపుత్రి విక ♦ లాత్మికయై నిలయంబుఁ జేరి శు
ద్ధాంతమునందుఁ దల్లిఁగని ♦ తా నపు డుద్భవమొందినట్లుగా
స్వాంతమున౯ దలంచియును ♦ శర్వునిఁ బాయుట కాత్మఁరోసి వి
భ్రాంతినొనర్చు స్వస్ఫురిత ♦ భాసురరూపముఁ దూఱె నెంతయు౯. 176

ఉ॥ అక్కట! దేవదేవుఁ డిటు ♦ లాసమెయి౯ బరిచర్యసేయు న
న్నక్కటికవ్ దలంపక మ ♦ హావిరహాంబుధిఁ ద్రోచిపోయె నే
నెక్కడి కేఁగుదాన నిఁక ♦ నేగతి నీశ్వరుఁ జేరుదాన నే
దిక్కిఁక నాకు నీ రుచిర ♦ దేహము దాహముసేయనే? యిల౯. 177

చ॥ అని యిటు లార్తిఁ జేకొని మ ♦ హావ్యసనంబునఁ జిక్కుచు౯ సఖీ
జనములతోడఁ బల్కక ని♦శల్ నిదురింపక స్నానపానముల్
గొనక దురంతతాపమునఁ ♦ గొందలమొందుచు నున్న యాత్మనం
దనఁ గని కుందిరెంతయు మ♦నంబున మేనకయున్ గిరీంద్రుఁడున్. 178

మ॥ తలిదండ్రుల్ సయిదోడులు౯ జెలులు చే ♦ తఃప్రీతిఁ బోధించినన్
దలఁపా శంకరునందుఁ జేర్చి మిగులన్ ♦ దైన్యంబుతో నశ్రుధా
రల నొక్కుమ్మడి రాల్చుచున్ గడపె గో ♦ త్రగ్రామణీపుత్రి య
గ్గలికన్ బెగ్గిలి కొన్ని ఘస్రముల నా ♦ కల్పంబు లక్లింతయున్. 179

ఉ॥ ఇంద్రుని పంపునన్ మునివ ♦ రేంద్రుఁడు నారదుఁ డంత శైలరా
జేంద్రుని చెంత కేగ నతఁ ♦ డెంతయు సంతసమొప్పఁ గొల్చి యా
చంద్రకిరీటు నాత్మసుత ♦ చక్కఁగఁ గొల్చుటయున్ శివుండు ని
స్తంద్రమతిన్ బ్రసూనశరు ♦ దాహముచేసిన యక్కథాంశమున్. 180

ఆ॥ చెప్పి యతఁడు చాలఁ ♦ జిన్నవోయినమోము, తోడనున్నయట్టి ♦ జాడఁజూచి
శివునిఁగొలువు నీదు ♦ చింత లెల్లనుబాయు, నని మునీంద్రుఁ డంత♦నగజఁజేరి.

—* నారదుఁడు పార్వతిని శివునకై తపంబు జేయుమనుట *—

క॥ లోకోపకారమునకై, యాకాళికతోడఁ బలికె ♦ నమ్మా వినుమా!
శ్రీకంఠుఁడు రాజసులకుఁ, జేకూరఁడు తపసుఁజేసి ♦ చెందఁగవలయున్. 182

ఉ॥ శర్వుఁడు భక్తవత్సలుఁడు ♦ సన్మునిపూజ్యుఁ డపేతరాగుఁ డా
సర్వజగత్పతిన్ గుఱిచి ♦ సల్పు తపంబిఁక విస్ఫురద్వయో
గర్వముతోడనున్న నిను ♦ గాంచి యిటు ల్విడి మారుఁగాల్చి వే
దార్వుఁడుచెందె నాత్మపద ♦ మంబ! రయం బరయంబరంగుమా! 183

చ॥ తపసొనరించితేని నిను ♦ దర్పకవైరి వరించు నిక్కమా
తప సొనరింపకున్న నిను ♦ దామదిలోనఁ దలంపఁడెప్పుడున్
గపటములేక చెప్పితిని ♦ కాళిక! వేఱొకనిన్ వరించి నీ
వెపుడును జెట్టఁబట్ట విది ♦ యెల్లయెఱింగి కడంగు మిప్పనిన్. 184

గీ॥ అనినఁ దా విని సర్వలో♦కైకజనని, కొంచె ముచ్ఛ్వాసమొంది హా♦ర్దించితపము
సేయఁగా డెందమం దపే♦క్షించి తపసి, తోడ నిట్టులఁబల్కె సం♦తోసమెసఁగ.

ఉ॥ నారద! నీదు బోధనము ♦ నన్ మనమందలి కుం దడంగె వి
స్తారతరప్రబోధ మది ♦ దారసిలెన్ శివునందుభక్తి చే
కూరె దృఢంబుగా నిఁకను ♦ గొంకును జంకునులేక యంచితో
దారమతిన్ బొనర్తు నియ ♦ తంబుగ నుగ్రతపంబుఁ జెచ్చెరన్. 186

మ॥ కలలో నీశుఁడు మున్ను నాకు నెఱుఁగం♦గాఁ జెప్పిపోయెన్ మహా
జ్జ్వలపంచాక్షరశైవమంత్ర మిఁక నా ♦ చక్కిన్ ఘనశ్లోక! నీ
పలుకున్ వే తలఁదాల్చి చేసెద సుదీ ♦ ర్ఘంబౌ తపం బీశ్వరున్
జలితాంతఃకరణున్ బొనర్చెద వడిన్ ♦ సాధించెదన్ దత్కృపన్. 187

గీ॥ అనిన నారదమౌని యిట్లనియె మరలఁ, దల్లి! నీకల శివుఁడట్లు ♦ దాన వచ్చి
చెప్పిపోయినమంత్రంబు ♦ సిద్ధినొసఁగు, ననఁగ సందియమున్న దే♦యరసిచూడు.

వ. మఱియు నఖిలమంత్రాధిరాజంబగు నప్పంచాక్షరీమంత్రంబు తెఱం గెఱింగించెద
నాకర్ణింపుము. 189

## —* పంచాక్షరీమంత్రి వైభవము *—

సీ॥ బాలేందుమౌళి రూ ♦ పము( జూపు దర్పణం, బరయఁగా శైవపం♦చాక్షరంబు
బ్రహ్మహత్యాదిక ♦ పాపాటవీదావ, మరయఁగా శైవపం ♦ చాక్షరంబు
కైవల్యపుం జెలి ♦ కలదీవియకు నౌక, యరయఁగా శైవపం ♦ చాక్షరంబు
ఎల్లకోర్కులను రం♦జిల్లఁదీర్చెడు కల్ప, మరయఁగా శైవపం♦చాక్షరంబు

గీ॥ అమరగేయంబు శైవపం♦చాక్షరంబు, ఆగమధనంబు శైవపం♦చాక్షరంబు
అఖిలసుఖదము శైవపం ♦ చాక్షరంబు, హర్షనిలయంబు శైవపం ♦ చాక్షరంబు.

ఉ॥ కావునఁ దల్లి! యీమనువుఁ ♦ గైకొని నిష్ఠమెయిన్ శివార్థమై
నీవు తపంబు సేయు మిఁక ♦ నీలగళుండు తనంత వెగ్గలం
బా వలపొంది వచ్చి నిను ♦ నర్మిలిఁ బెండిలియాడు నిక్కమీ
నావచనంబు సేయు మని ♦ నారదుఁ డంత యథేచ్ఛమైఁ జనెన్. 191

## —* పార్వతి మేనకా హిమవంతుల సెలవొంది తపంబున కేగుట *—

చ॥ అరసి గిరీంద్రపుత్రిక మ ♦ హాముని వాక్యము లాలకించి స
త్వరము తపంబు సల్పుటకుఁ ♦ దా మది నిర్ణయమున్ బొనర్చి యే
ద్రైఅ సఖురాండ్రతో జనకు ♦ ధీమమఁ జేరి నమస్కరించి శం
కరుఁ బడయన్ దపించెద నిఁ ♦ కన్ సెలవిమ్మని కోర నాతఁడున్. 192

చ॥ హరుఁడు తపంబుఁదక్క నిఁక ♦ నన్యగతిన్ సమకూరఁ డన్న చో
ప్పరసినవాఁడు గావున హి ♦ మాచలుఁ డాత్మకులంబు నున్నతిన్
నిరుపమమైన కూఁతు శివ ♦ నిష్ఠయు నెంచి తపంబె పీనికిన్
సరి యని ధీరచిత్తమునఁ ♦ జక్కఁగ నిట్లనియెన్ గుమారితోన్. 193

క॥ అమ్మరో! నాకిష్టమె మీ, యమ్మ నిటులె తారసించి ♦ యడిగి సెలవుఁగై
కొమ్ము సఖురాండ్రఁగొని వే, గమ్ము తపముసలిపిరమ్ము ♦ కాచు శివుఁడు నిన్.

సీ॥ అనినయంతనె మ్రొక్కి పె ♦ ల్లలరి యార్య, తల్లికడకేగి వేగపా♦దములకెఱఁగి
తపముసేయఁగ నడవికిఁ ♦ దరలుదాన, సెలవొసఁగుమన్న నమ్మేన♦దలఁకి మదిని.

క॥ అపురూపపు సుమముగ నూ, త్నపుశశిరేకగ బహిష్కృ ♦ తపాత్రిణముగా
నెపుడు నిను గనులఁ గను మ, మ్మిపుడిట నెడఁబాసి వనికి ♦ నేగఁగఁజనునే!

చ॥ వలదు కుమారి! నీ యొడలు ♦ వానకు నెండకు నోర్వదమ్మ! యి
ట్లలంత వడంగ నేటికి? భ ♦ యాస్పదమెందుఁ దపంబు గీములన్
బలుపురు వేలుపుల్ గలరు ♦ బాగుగ వారలలోన నొక్కనిన్
జెలువునిగా గ్రహింపు మిఁకఁ ♦ జేకుఱు నీకురుమైన సౌఖ్యముల్. 197

చ॥ విను మటుగాకయున్నయెడ ♦ వేశ్మమునందు వసించియే తపం
బనువుగఁ జేయుమమ్మ! మము ♦ నక్కట పోకఁగఁ జేయ కీ హఠం
బున విడుమమ్మ! యీశ్వరుని ♦ మున్ను భజించి గడించినట్టి పెం
పును మది నెంచుమమ్మ! దలఁ ♦ పుర్ మలుపన్ జనునమ్మ కోమలీ!

ఆ॥ ఎందు వింటిమొక్కొ ♦ యిగురుఁబోఁడులు పతిన్, గూర్చి తపము సేయ ♦ ఘోరవిపిన
భూమిఁ జేరఁ జనుట ♦ బుద్ధి నారయుమిఁకఁ, బర్వతేంద్రపుత్రి! ♦ భవ్యగాత్రి!

సీ॥ ఇందిరాదేవి గో ♦ విందుని బెండ్లాడి, యొందదే యతులితా ♦ నంద సుఖము
లల్ల సంజ్ఞాదేవి ♦ యరవిందబాంధవు, వరియించి చెందదే ♦ వాంఛితముల
పౌలోమి త్రిభువన ♦ పతి నింద్రుఁ జేపట్టి, యసమాన భోగభా ♦ గ్యములఁ గనదె
సోదరీమణులతో ♦ శుభాంశుఁ జెందిరా, ణింపదే రోహిణి ♦ పెంపుమీఱి

గీ॥ ఆ వరారోహలెల్ల సు ♦ శ్రీవిలాస, మెసఁగ నాత్మావసథముల ♦ నే వసించి
పరిణయంబుల నాడరే ♦ బహువిధోరు, హర్షములనొందరైరే? ల ♦ తాంగి! యరయు.

క॥ అని మేనక యనభిమతం, బును జూపిన నరసి యపుడు ♦ భూభృత్సుత యె
ద్దిని బలుకక కడువగపుల్, గొని వనరుచునున్న నంతఁ ♦ గుధరతరుణి చుల్,

చ॥ కనులఁ దొరంగు బాష్పములు ♦ కంచుకముల్ దడుపంగఁ గుందు కూఁ
తును బరికించి యక్కటిక ♦ తోఁ జెలులన్ గొని యత్తపోవ్రతం
బును బొనరించి రమ్మట న ♦ భోమణియున్ శశియున్ దిగీశులున్
మనుతురుగాత నిన్నెపుడు ♦ మంగళమొందునుగాత నీకిఁకన్, 291

క॥ అని తన యంగీకారం, బును మేన యొసంగఁ గాళి ♦ మ్రొక్కి చెలులతోఁ
దనమందిరమునకున్ జనె, నని చెప్పినఁ బిదపఁ జెప్ప ♦ మనిరి మునీంద్రుల్. 202

శా॥ గిరిరాజేంద్రసుతాసుధాకరధరాం ♦ ఘ్రిస్ఫారపూజోల్లస
చ్ఛరభాంబాహృదయాంబుజాతకలహం ♦ సగ్రామణీ! భావవి
స్ఫురదత్యుత్తమకావ్యసంకలన వి ♦ స్ఫూర్జత్తరాత్మా! రసో
ద్ధురసూక్తిప్రకరేష్టగోష్ఠికుశలా! ♦ దూరాజదూరాధ్వగా! 203

గద్య.

ఇది శ్రీ. బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వర నామధేయ ప్రణీతంబైన
శివపురాణంబందలి పార్వతీఖండంబున
ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీశివపురాణము

## పా ర్వ తీ ఖం డ ము.

### తృ తీ యా శ్వా స ము.



లింగమాంబికాపు
త్రీ! లాలితసుగుణరత్న ♦ రింఛోళీ ! సా
ధ్వీలభ్యపుణ్యాచారి
త్రా! లలితాంబార్చనాప ♦ రా! లక్ష్మ్యాంబా!

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

—* పార్వతీ తపోవర్ణనము *—

గీ॥ పార్వతి దుకూలములఁ బాసి♦వల్కలమును, గట్టి మౌంజిని మువ్వురిఁ♦గట్టె మొలను
అట్టె ముత్యాలహారంబు♦నవులఁద్రోచి, జింకచర్మం బఱుతఁ గట్టి ♦ చెందె జడల.

క॥ జయవిజయలఁదోడ్కొని కడుఁ, బ్రియమెసఁగఁ దుషారభూమి♦భృత్తనయ తగన్
వియదాపగ దిగుచోటికి, రయమునఁ జనియెన్ దపోభి♦రాగంబమరన్. 3

చ॥ చని యట శైలరాజసుత ♦ శర్వుఁడు మున్ను తపించినట్టి చో
టును బరికించి యచ్చట మృ♦డుం డగుపట్టమి కెంతొ వంతఁ జే
కొని నను బాసితే యభవ! ♦ కోపముఁ జెందితివే యటంచు నే
డ్చెను కలకంఠకోమలప♦చేళిమసుస్వర వైభవంబునన్. 4

శా॥ చాలన్ సేపటు లేడ్చి యంత మనమున్ ♦ స్తంభింపగాఁ జేసి యా
బాలారత్నము శృంగతీర్థమను ది ♦ వ్యప్రస్థమున్ జేరి యో
గాలంబం బొనరించి నిష్ఠురతపం ♦ బారంభమున్ జేసె ది
వ్యాళుల్ సంతస మొంది రాత్మహితకా ♦ ర్యాసక్తచిత్తంబునన్. 5

ఉ॥ చారుఫలద్రుబీజములఁ ♦ బాలఁగనాటెను శైలకన్య వి
స్తారతరానురాగమునఁ ♦ దాపససిద్ధి పరీక్షకై యటన్
గూరిమిచెల్మికత్తె లను ♦ కూలముగా విమలాంబుసేకముల్
గూరిచి పెంచుచుండి రల ♦ కొమ్మవయిన్ గలచెల్మి మొక్కలన్. 6

వ. అంత

గీ॥ భూమి శుద్ధినొనర్చి య ♦ భూధరేంద్ర, కన్య వేదిని విరచించి ♦ కౌతుకం బె
సంగఁ దపసొనరింపఁ గ♦డంగె మేటి, తాపసేంద్రులు వెఱఁగొంది♦తలలు వంప.

సీ॥ తలరి పంచాగ్ని మ♦ధ్యమున వసించి గ్రీ, ష్మమునఁగావించె ను♦చ్చండతపము
వర్షంబులం దనా ♦ వరణప్రదేశంబు, లందు నిల్చి యొనర్చె ♦ నమితతపముఁ
జలికాలమునఁ గుత్తు ♦ కలబంటి నీటిలో, నుండి కావించె మ ♦ హోగ్రతపము
సమకాలమునఁ గర్క ♦ శ శిలాప్రదేశంబు, లందు నిల్చియొనర్చె♦నధికతపము

గీ॥ కొలఁదిఫలభోజనంబున♦ ఘోరతపము, నెలమిఁబర్ణాశనమున భూ♦యిష్ఠ తపము
నవల నిరశనయై నిష్ఠ♦నతుల తపముఁ, దవిలి చేసెను హిమధరా♦ధరకుమారి.

మ॥ శివమంత్రంబు జపంబు సేయుచుఁ గడున్ ♦ జిత్తంబు శర్వాంఘ్రిలం
దవధానం బొనరింపఁజేయుచు మహా ♦ హ్లాదంబు రెట్టింప రేఁ
బవ లేకాకృతిఁ బెక్కుహాయనముల్ ♦ భాస్వత్తపంబుల్ బొన
ర్చె వనంబందు హరిద్వితానమును రో ♦ చిష్మచ్ఛశుల్ సాక్షిగాన్. 9

—* పార్వతి ఋషులచే నపర్ణయని ఖ్యాతి నొందుట *—

చ॥ మునిజను లెల్లఁ బార్వతి స ♦ మున్నతదీక్ష వహించి పర్ణమై
నను భుజియింప కెంతయు ఘ ♦ నంబుగఁ జేయు తపంబుఁ గాంచి నె
మ్మనములఁ బేరుటక్కజ మ ♦ మర్చిన వేడ్క నపర్ణ యంచుఁ గీ
ర్తన మొనరించి రాహ్వయము ♦ రాణఁదలిర్పఁగ ముజ్జగంబులన్. 10

వ. ఇంకను

చ॥ కడుకఠినాంగకంబులఁ బ్ర ♦ కామతపం బొనరించి మించు న
క్కడిఁదిఋషుల్ గిరీశ్వరుని ♦ కన్య యొనర్చు తపంబుఁ జూచి లో
నడలి బహూకరించి కన ♦ మైతిమియిట్టి తపంబు నెందు నె
వ్వాడు నని ధన్యవాదములఁ ♦ బొల్పుగ సల్పి రనల్పవైఖరిన్. 11

గీ॥ ఇట్లు చిరకాలమేగుడు♦హిమనగేంద్ర, తనయయొక్కనాఁడీశ్వరుఁ ♦ దలఁచిమదినొ
కింతజింతించి దేవ! యి♦ట్లెల నీదు, దాసి నరయంగ మదిలోనఁ♦దలఁప విపుడు.

గీ॥ నిట్లు జాతివిరోధంబు ♦ లెల్లఁ బాసి, జంతుసంతతి గడిఁది వి ♦ శ్వాస మొంది
విస్మయముదోఁప నచ్చోట ♦ వెలసె నొలసి, పర్వతేశ్వరపుత్రి త ♦ పంబుబలిమి.

ఉ॥ ఎల్ల కుజంబులున్ ఋతువు ♦ లెల్లఁ దనర్చెడు వైభవంబు సం
ధిల్ల నవప్రవాళముల ♦ దివ్యపరీమళపుష్పరాసులన్
గొల్లగఁ బండి మాధురినిఁ ♦ గుప్పెడు భూరిఫలంబులన్ విరా
జిల్లె నగాధిరాజసుత ♦ సేయు తపంబు ఫలంబుఁ దెల్పుచున్. 19

—* మేనకా హిమవంతులు సపుత్రముగా వచ్చి పార్వతినిఁ జూచి పోవుట *—

గీ॥ అంతహిమవంతుఁడొక్కనాఁ ♦ డాత్మయందు, గూఁతునుదలంచి చాలగాఁ ♦ గుందితనదు
సతిని సుతులను గొని వన ♦ స్థలముఁ జేరి, పార్వతినిఁ జూచి తల్లడ ♦ పాటుఁ జెంది.

చ॥ అలమటమాను మింక హరుఁ ♦ డక్కట యక్కటికంబుఁ జెంది నీ
తలఁపు ఫలింపఁజేయునే? వృ ♦ థా యిటు లెన్నిదినంబు లిందుఁ ది
ప్పలుబడుచుందు వీతపసుఁ ♦ బాసి గృహంబునుజేరు పుష్పకో
మలమగు నీదు దేహము కు ♦ మారి! సహింపదు మేటి తాపమున్. 21

ఉ॥ కామునిఁ గాల్చినట్టి కడు ♦ కట్టఁడి వేలుపు పట్టి! నిన్నెటుల్
ప్రేముడిఁజెంది మెచ్చు నతి ♦ భీషణమూర్తి విరాగితల్లజుం
డా మహనీయచర్యుఁ డిట ♦ కాగమనంబొనరింపఁ డమ్మరో!
నీమది నిశ్చయింపు మిది ♦ నిక్కము సందియ మిందు లేదిఁకన్. 22

గీ॥ గగనమండలిచందురుఁ ♦ గాంచి మెచ్చి, చేతనొడియంగవచ్చునే ♦ చిగురుఁబోణి
నిర్వికారతఁ బరఁగు న ♦ న్నీలకంఠు, నెట్లు రంజింపఁజాలెద ♦ విందుఁదలరి. 23

చ॥ గిరిపతి యిట్లనా నతని ♦ గేహినియున్ సుతు లట్లె పల్కి ర
ప్పరుసున వారివాక్యములఁ ♦ బార్వతి దా విని యల్లనవ్వి యా
దరమున నిట్లు వల్కెఁ దలి ♦ దండ్రులతోడను నన్నగార్లతోఁ
దిరముగ నాత్మవైభవము ♦ దీటుకొనంగ వినంగ నెచ్చెలుల్. 24

మ॥ మును నీ వాడిన మాటలన్ మఱచితే ♦ భూభృద్వరా! యిప్పుడై
నను నాపూన్కి నెఱుంగుఁ డిందుధరు నా ♦ నందింపఁజేతున్ దపం
బున నత్యుత్తమభక్తియోగమున మీ ♦ ర్పొండిండ్ల కిప్పాట నే
ఘనసిద్ధిన్ గొనివత్తు మిమ్ముఁదరియం ♦ గాఁగొంత కాలంబులోన్. 25

చ॥ మరుని హరించినట్టి యస ♦ మానుని యోగికులావతంసు నీ
శ్వరు మురిపింతు నగ్గలికఁ ♦ జాలఁగఁ జేకొని యిందు వేగ నా
హరుఁ డరుదేరునట్లుగ మ ♦ హాతపమున్ బొనరింతు మానుఁడీ
విచికితనంబు సత్యముగఁ ♦ జేర్మి గడింతు శివప్రసాదమున్. 26

మ॥ అన నంతన్ గుణవంతమై యలరునా ♦ ర్యాసూక్తి కా గోత్రమం
డనుఁ డాత్మంబునఁ బొంగి వేగ సతితో ♦ డన్ బుత్రివర్గంబుతోఁ
జనియాత్మావసథంబుఁ జేరె నిట నం ♦ చద్భక్తి నప్పార్వతీ
వనజాతేక్షణ యంతకాంతకుఁ దపః ♦ ప్రౌఢిన్ దనర్చెన్ గడున్. 27

—* విష్ణ్వాదులు శివసన్నిధి కరుగుట *—

ఉ॥ అంతఁ దపోగ్నికీలలు మ ♦ హాద్భుతభంగిఁ జెలంగి నింగిపై
కెంతయుఁ బ్రాఁకి నల్గడల ♦ హెచ్చుగఁ గ్రమ్మి జగత్సమూహ మ
త్యంతము గాల్చుచుండ విబు ♦ ధాధిపముఖ్యులు చూచి భీతిమైఁ
జింతిలి పద్మసంభవునిఁ ♦ జేరి వచించిరి తద్విధానమున్. 28

గీ॥ ఆతఁడును విని మనమందు ♦ నక్కజంబుఁ, జెంది వారలతో హరిన్ ♦ జేరనరిగి
యవ్విధం బెల్లఁ దెల్పఁగా ♦ నచ్యుతుండు, లోకరక్షణ మొనరింప ♦ వీఁకఁదోడరి.

చ॥ అరసితిఁ గాళికాతపసు ♦ నారసితిన్ భువనార్తి పాత మి
త్తఱిఁ బరమేశుఁ జేరి విహి ♦ తమ్ముగఁ గాళితపఃప్రకార మా
హరునకుఁ దెల్పి శీతకుధ ♦ రాత్మజ నాలుగఁ గొన్మటంచు వే
గిరముగ నవ్వరం బుమ కొ ♦ గిన్ దయసేయుమటంచు వేఁడుఁడీ! 30

గీ॥ అపుడు జగములకెల్ల మే ♦ లగును గాన, సత్వరంబుగ నీశ్వర ♦ సన్నిధాన
మునకుఁ బోవలెనన దేవ ♦ పుంగవులు గ, డిందియడలొంది యిట్లని ♦ రందు హరికి.

గీ॥ మన్మథునిఁగాల్చి హిమవత్కు ♦ మారిఁ బాసి, ప్రలయకాలాంతకాకృతిఁ ♦ బరఁగి శీత
శైలముననుండి కైలాస ♦ సద్మమొంది, నట్టిరుద్రునిఁ జేరఁబో ♦ నలవి యెట్లు?

వ. అనిన సుపర్వగ్రామణులకు రమానాథుం డిట్లనియె.

చ॥ చలమున గెల్వఁగాఁ జనిన ♦ శంబరవైరినిఁ గాల్చి చంపెఁ బే
రలుక మహేశుఁ డిద్ధ శర ♦ ణార్థులమై చని యిత్తెఱంగు ను
త్తలమునఁ దెల్పి వేడిన ము ♦ దమ్మున శంకరుఁ డద్రికన్యకన్
వలచి వివాహమాడు నిది ♦ వాస్తవమారయుఁ డెల్లభంగులన్, 33

క॥ కీలెఱుఁగక చేసినపని, వాలాయము విఘ్నమొందు వ ♦ మ్మగు నెందున్
కీలెఱిఁగి చేయుపనియది, వైళంబు ఫలించు మదికిఁ ♦ బరితోషమిడున్. 34

ఉ॥ ఏనునుగూడ వచ్చెద మ ♦ హేశ్వరుఁ జేరఁగఁ బోద మిప్పుడే
దా నలసర్వదేవపరి ♦ తాపవిభంజనుఁ డుల్లసత్కృపా
ధీనమనస్కుఁ డీశ్వరుఁడు ♦ దేటికనుంగొని యందఱన్ గృపన్
బూని యనుగ్రహించు శుభ ♦ మున్ బొనరించు సుపర్వశేఖరుల్! 35

గీ॥ నిట్లు జాతివిరోధంబు ♦ లెల్లఁ బాసి, జంతుసంతతి గడిఁది వి ♦ శ్వాస మొంది
విస్మయముదోఁప నచ్చోట ♦ వెలసె నొలసి, పర్వతేశ్వరపుత్రి త ♦ పంబుబలిమి.

ఉ॥ ఎల్ల కుజంబులున్ ఋతువు ♦ లెల్లఁ దనర్చెడు వైభవంబు సం
ధిల్ల నవప్రవాళముల ♦ దివ్యపరీమళపుష్పరాసులన్
గొల్లగఁ బండి మాధురినిఁ ♦ గుప్పెడు భూరిఫలంబులన్ విరా
జిల్లె నగాధిరాజసుత ♦ సేయు తపంబు ఫలంబుఁ దెల్పుచున్. 19

—* మేనకా హిమవంతులు సపుత్త్రముగా వచ్చి పార్వతినిఁ జూచి పోవుట *—

గీ॥ అంతహిమవంతుఁడొక్కనాఁ ♦ డాత్మయందు, గూఁతునుదలంచిచాలగాఁ ♦ గుందితనదు
సతిని సుతులను గొని వన ♦ స్థలముఁ జేరి, పార్వతినిఁ జూచి తల్లడ ♦ పాటుఁ జెంది.

చ॥ అలమటమాను మింక హరుఁ ♦ డక్కట యక్కటికంబుఁ జెంది నీ
తలఁపు ఫలింపఁజేయునె? పృ ♦ థా యిటు లెన్నిదినంబు లిందుఁ ది
ప్పలుబడుచుందు వీతపసుఁ ♦ బాసి గృహంబును జేరు పుష్పకో
మలమగు నీదు దేహము కు ♦ మారి! సహింపదు మేటి తాపమున్. 21

ఉ॥ కామునిఁ గాల్చినట్టి కడు ♦ కట్టడి వేలుపు పట్టి! నిన్నెటుల్
ప్రేముడిఁజెంది మెచ్చు నతి ♦ భీషణమూర్తి విరాగితల్లజుం
డా మహనీయచర్యుఁ డిట ♦ కాగమనంబొనరింపఁ డమ్మరో!
నీమది నిశ్చయింపు మిది ♦ నిక్కము సందియ మిందు లేదికన్. 22

గీ॥ గగనమండలిచందురుఁ ♦ గాంచి మెచ్చి, చేతనొడియంగవచ్చునే ♦ చిగురుఁబోణి
నిర్వికారతఁ బరఁగు న ♦ న్నీలకంఠు, నెట్లు రంజింపఁజాలెద ♦ విందుఁదలరి. 23

చ॥ గిరిపతి యిట్లనా నతని ♦ గేహినియున్ సుతు లట్లె పల్క ర
ప్పరుసున వారివాక్యములఁ ♦ బార్వతి దా విని యల్లనవ్వి యా
దరమున నిట్లు వల్కెఁ దలి ♦ దండ్రులతోడను నన్నగార్లతోఁ
దిరముగ నాత్మవైభవము ♦ దీటుకొనంగ వినంగ నెచ్చెలుల్. 24

మ॥ మును నీ వాడిన మాటలన్ మఱచితే ♦ భూభృద్వరా! యిప్పుడై
నను నాపూన్కి నెఱుంగుఁ డిందుధరు నా ♦ నందింపఁజేతున్ దపం
బున నత్యుత్తమభక్తియోగమున మీ ♦ ర్పొండిండ్ల కిప్పాట నే
ఘనసిద్ధిన్ గొనివత్తు మిమ్ముఁదరియం ♦ గాఁగొంతకాలంబులోన్. 25

చ॥ మరుని హరించినట్టి యస ♦ మానుని యోగికులావతంసు నీ
శ్వరు మురిపింతు నగ్గలికఁ ♦ జాలఁగఁ జేకొని యిందు వేగ నా
హరుఁ డరుదేరునట్లుగ మ ♦ హాతపమున్ బొనరింతు మానుఁడీ
పిఱికితనంబు సత్యముగఁ ♦ బేర్మి గడింతు శివప్రసాదమున్. 26

మ॥ అన నంతన్ గుణవంతమై యలరునా ♦ ర్యాసూక్తికా గోత్రమం
డనుఁ డాత్మాంబునఁ బొంగి వేగ సతితో ♦ డన్ బుత్రివర్గంబుతోఁ
జనియాత్మావసథంబుఁ జేరె నిట నం ♦ చద్భక్తి నప్పార్వతీ
వనజాతేక్షణ యంతకంతకుఁ దపః ♦ ప్రౌఢిన్ దనర్చెన్ గడున్. 27

—* విష్ణ్వాదులు శివసన్నిధి కరుగుట *—

ఉ॥ అంతఁ దపోగ్నికీలలు మ ♦ హోద్భుతభంగిఁ జెలంగి నింగిపై
కెంతయుఁ బ్రాఁకి నల్గడల ♦ హెచ్చుగఁ గ్రమ్మి జగత్సమూహ మ
త్యంతము గాల్చుచుండ విబు ♦ ధాధిపముఖ్యులు చూచి భీతిమైఁ
జింతిలి పద్మసంభవునిఁ ♦ జేరి వచించిరి తద్విధానముల్. 28

గీ॥ ఆతఁడును విని మనమందు ♦ నక్కజంబుఁ, జెంది వారలతో హరిన్ ♦ జేరనరిగి
యవ్విధంబెల్లఁ దెల్పఁగా ♦ నచ్యుతుండు, లోకరక్షణ మొనరింప ♦ వీఁకఁ దొడరి.

చ॥ అరసితిఁ గాల్చికాతపసు ♦ నారసితిన్ భువనార్తిపాత మి
త్తఱిఁ బరమేశుఁ జేరి విహి ♦ తమ్ముగఁ గాళితపఃప్రకార మా
హరునకుఁ దెల్పి శీతకుధ ♦ రాత్మజ నాలుగఁ గొన్మటంచు వే
గిరముగ నవ్వరం బుమ కొ ♦ గిన్ దయసేయుమటంచు వేఁడుఁడీ! 30

గీ॥ అపుడు జగములకెల్ల మే ♦ లగును గాన, సత్వరంబుగ నీశ్వర ♦ సన్నిధాన
మునకుఁ బోవలెనన దేవ ♦ పుంగవులు గ, డిందియడలొంది యిట్లని ♦ రందు హరికి.

గీ॥ మన్మథునిఁ గాల్చి హిమవత్కు ♦ మారిఁ బాసి, ప్రలయకాలాంతకాకృతిఁ ♦ బరఁగి శీత
శైలముననుండి కైలాస ♦ సద్మ మొంది, నట్టిరుద్రునిఁ జేరఁబో ♦ నలవి యెట్లు?

వ. అనిన సుపర్వాగ్రామణులకు రమానాథుం డిట్లనియె.

చ॥ చలమున గెల్వఁగాఁ జనిన ♦ శంబరవైరినిఁ గాల్చి చంపెఁ బే
రలుక మహేశుఁ డిప్డు శర ♦ ణార్థులమై చని యిత్తెఱంగు ను
త్తలమునఁ దెల్పి వేడిన ము ♦ దమ్మున శంకరుఁ డద్రికన్యకన్
వలచి వివాహమాడు నిది ♦ వాస్తవమారయుఁ డెల్లభంగులన్, 33

క॥ కీలెఱుఁగక చేసినపని, వాలాయము విఘ్నమొందు వ ♦ మ్మాగు నెందున్
కీలెఱిఁగి చేయుపనియది, వైళంబు ఫలించు మదికిఁ ♦ బరితోషమిడున్. 34

ఉ॥ ఏనునుగూడ వచ్చెద మ ♦ హేశ్వరుఁ జేరఁగఁ బోద మిప్పుడే
దా నలసర్వదేవపరి ♦ తాపవిభంజనుఁ డుల్లసత్కృపా
ధీనమనస్కుఁ డీశ్వరుఁడు ♦ దేఁటికనుం గొని యందఱన్ గృపన్
బూని యనుగ్రహించు శుభ ♦ మున్ బొనరించు సుపర్వశేఖరుల్! 35

చ॥ అని పయనంబుచేయ సుర ♦ లందఱు నా హరిఁగూడి శైలనం
దన తపియించుచోటికి మొ ♦ దల్జని తద్విలసత్తపంబుఁ గ
న్గొని యసమాన తేజములఁ ♦ గుప్పుచు వెల్గు జగచ్ఛరణ్యు నా
ర్యను వినుతించి మ్రొక్కిరి స ♦ మంచితభక్తి వినమ్రగాత్రులై. 36

గీ॥ కదలి యటనుండి రజతన ♦ గంబుఁ జేరి, ముందుగా నందిఁ గాంచి ♦ వందనంబు
చేసి యాందోళనం బెల్లఁ ♦ జెప్పి శివుని, దరిసెనముఁ గోరి వేఁడఁగాఁ ♦ దడయకతఁడు.

క॥ మృడుఁ జేరఁబోయి జేజే, లడరుచు నట కేగుదెంచి ♦ నట్టి తెఱఁగుఁ దా
నుడివి దరిసెనము వారల, కిడుమని ప్రార్థించె సభవుఁ ♦ డీయకొనెనటుల్. 38

వ. అంత శైలాది జేజేలఁ దోడ్కొని చని భద్రవటచ్ఛాయానిషణ్ణుండగు జగ
దీశ్వరుఁ గాన్పించిన నవ్వారలు. 39

సీ॥ మగరాల నిగనిగల్ ♦ నగఁజాలు డాలుచా, లఁగనీను మేని సో ♦ యగమువానిఁ
గొమరారు నాణిము ♦ త్యములపే రమరికఁ, జే నక్షమాలగాఁ ♦ జెలఁగువానిఁ
బఱినూర్ల పడగల ♦ పాపరా జురమందు, మేల్మి జందెంబుగా ♦ మెఱయువానిఁ
గడు ముదిసినయట్టి ♦ జడదారిగమికి రా, ణించు తత్త్వం బెఱిం ♦ గించువాని
గీ॥ నలరు నెలపూన జడలలో ♦ వెలయువాని, నెల్ల జగముల దొరతనం ♦ బెసఁగువాని
అమృతకలశంబు కెంగేల ♦ నమరువాని, మూడుకన్నులసామిని ♦ మురిపమునను.

ఉ॥ కాంచి నమస్కరించి యొడి ♦ కమ్మగు భక్తి నుతించిరిట్లు ల
భ్యాంచిత తేజ! సర్వభువ ♦ నావనదక్ష! విపక్షభీమ! భ
వ్యాంచదనుగ్రహాస్పద! మ ♦ హాకరుణాకర! శర్వ! శంకరా!
కొంచక వేల్పులన్ మనుపు ♦ కుత్సితభీషణ! భోగిభూషణా! 41

ఉ॥ నీవె కదా జగంబులకు ♦ నిర్జరసంతతి కాటపట్టు నీ
చేవయె గాదె యాపదలఁ ♦ జేట్పడనీయక మమ్ము నిచ్చలున్
బ్రోవఁగఁజాలియున్నయది ♦ రూఢిగ వేడుచునున్నవార మో
దేవర! యీతఱిన్ మరలఁ ♦ దేఁకువఁ జేకొనిసాఁకు మమ్మిఁకన్.

క॥ కులపతివనియును శ్రుతివా, క్కులపతివనియును నితాంత ♦ కోవిద! సుశ్లో
కులపతివనియును గరుణాం, కులపతివనియును మది నెఱుఁ ♦ గుదుము గుదురుగాన్.

క॥ అని యిటులు దీనులై కడు, వనరుచునున్నట్టి దేవ ♦ వల్లభుల మొఱన్
విని వారలఁ గనుఁగొని యి, ట్లనియెను దేవాదిదేవుఁ ♦ డాదరబుద్ధిన్. 44

ఉ॥ ఏల సుపర్వవర్యు లిటు ♦ లెంతయుఁ జింత యెసంగఁగా విచా
రాలసులై కనన్ బడుదు ♦ రర్థి మెయిన్ ననుఁ జేరరాఁ గతం
బోలి వచింపుఁడన్నఁ బురు ♦ షోత్తముఁ డాదటఁ బొంగి పల్కె నా
బాలశశాంకమౌళికి వి ♦ భాసితవిష్టపపాళి కిట్టులన్. 45

—* విష్ణ్వాదులు శివునిఁ బార్వతినిఁ బెండ్లాడుమనుట *—

ఉ॥ దేవ! మహానుభావ! గణు ♦ తింపఁగ శక్యముగానియట్టి లీ
దేవత లేను బద్మజుఁడు ♦ దీండ్రిముగా నల దారకాఖ్యుఁడౌ
నేవపు రక్కసుండు ఘటి ♦ యించు దురంతనిరంతరార్తియం
దీవిధి మ్రగ్గుచుంటి మిఁక ♦ నేలుము జాలిఁదలంచి యాత్మలో. 46

వ. మఱియును.

చ॥ మగనిగ నిన్నుఁగోరి యల ♦ మానిని శైలకుమారి యోర్వఁగాఁ
దగని తపంబుసేయఁగ ని ♦ తాంతతపోజనితాగ్ను లేచి యీ
జగములఁ గాల్పఁగాదొడఁగె ♦ శంకర! యింక దయామతిన్ వధూ
టిగ నగరాజకన్యను త ♦ డిన్ వరియించి జగంబు లేలుమా! 47

శా॥ నీతేజమ్మునఁ బుట్టినట్టి సుతుఁ డెం ♦ తే శక్తిసంపన్నుఁడై
దైతేయాగ్రిగుఁ దారకున్ జదిపి మా ♦ తాపంబులన్ బాఁపు దే
వా! తథ్యం బిఁక శైలరాజతనయన్ ♦ హర్షించి పెండ్లాడు మా
శీతాద్రీశ్వరుఁ డాత్మపుత్రినిడి వా ♦ సిన్ బెండ్లిసేయున్ విభూ! 48

ఉ॥ దీనిన తెల్పఁగాఁగడఁగి ♦ దేవరపాలికి వచ్చినార మీ
దీనుల నీదు సేవకులఁ ♦ దేఱికనుంగొని యార్తిఁబాఁపఁగా
మానసమందుఁ బూను మిఁక ♦ మంచియొనర్పుము మాకుఁ జెచ్చెరన్
మానితదివ్యవైభవ ♦ మంచిత! సర్వజగన్నియామకా! 49

—* శివుఁడు విష్ణ్వాదులకుఁ గామనిరసనంబుఁ జెప్పుట *—

క॥ అనిన విని లోకనాథుం, డనియెను సురవరులతోడ ♦ నారయుఁడీరల్
మనముల నిఁక నేఁ బెండ్లా, డిన బంధమునందుఁ జిక్కు ♦ టెకదా మరలన్. 50

ఉ॥ ఏనిఁక లోకసుందరి గి ♦ రీంద్రకుమారినిఁ బెండ్లియాడినన్
దా నల పార్వతీరమణి ♦ దాహమునొందిన మారుఁ గ్రమ్మఱన్
బ్రాణము లొందఁజేయును ప్రభు ♦ వంబుగఁ బంచశరుండు మించి యీ
ధ్యానము యోగమున్ జెఱచుఁ ♦ దాపసవృత్తి నడంచు రూఢిగన్. 51

మ॥ మునులున్ దాపసులున్ యతీశ్వరులు న ♦ మ్మోదంబుతో ముక్తికాం
తను డాయన్ జని మేటిభోగముల నా ♦ నందింపఁగా నక్రకే
తను భస్మీకృతుఁ జేసితిన్ మరలఁ గం ♦ దర్పుండు పుట్టొందంగాఁ
జనునే యాతఁడు మున్నొనర్చిన పనుల్ ♦ సైరింపఁగాఁ బోలు నే. 52

సీ॥ కూఁతును గాంచి త♦గుల్కొనఁగా మేలి, వలపు గల్గింపఁడే ♦ వనజజునకు
తోఁబుట్టువును దమి♦తోఁగూడి క్రీడింప, నాత్మసల్పఁడె మరి ♦ చ్యాదులకును
అన్నభార్యను బట్టి ♦ కన్నుఁగానక రతు, ల్దేలంగఁజేయఁడే ♦ దేవగురుని
కాముఁ డీలాటి య♦ కార్యంబు లొనరింపఁ, జెలఁగి చంపితి సుర♦క్షేమమునకుఁ

గీ॥ గానమీరెల్ల రిప్పుడ ♦ క్కామ ముడిగి, ధ్యాననిశ్చలచిత్తులై ♦ తపముసేయుఁ
డక్షరంబైన పరమాత్మ♦మందు సతము, క్రీడ సేయుఁడు బంధమ్ము♦లూడిపోవ

క॥ కామమునఁబొడముఁ గ్రోధం, బీమహి నద్దాన మోహ♦మెసఁగును దానన్
దీమసమతి తపము సెడున్, గామము నక్కతనఁ బాయుఁ♦గాఁదగు మీరల్.

ఆ॥ నన్నుఁబోలి మీరు ♦ పన్నుగానిట్లు త, పంబుసేయుఁ డింకఁ ♦ బాశములను
బాయఁదలఁపుఁడీ సు♦పర్వశిరోమణు, లార! వికృతిఁబాసి ♦ భూరిమతిని. 55

గీ॥ అనిన విని వనజేక్షణుం♦డాత్మమందు, వనరి యిట్లనిపల్కె నో♦వరద! యిపుడు.
కడిఁది యుమ్మలికమ్మునఁ♦గ్రాఁగుచున్న,మాకుఁదప సెట్టులలవడు♦జోక మెఱయ

ఉ॥ ఒకయెడనుండి పార్వతి మ♦హోగ్రతపం బొనరించుచున్ జగ
న్నికరముఁ గాల్చుచుండెను వి♦నిద్రతరాగ్రహుఁ డల్ల తారకుం
డొకకడనుండి నిర్జరుల ♦ నూర్జితసత్త్వుల నార్తిపెట్టుచున్
దికమక సేయుచుండె గణు♦తింపుము తెంపుము మాదుఖేదమున్. 57

ఉ॥ ఇప్పటికేని నీమదికి ♦ నిందఱి కొందలపాటు పాటిగా
నొప్పిగఁదోఁచ కిప్పగిది ♦ నూల్కొనియుండినఁ జత్తు మిప్పు డే
తిప్పలులేక నిక్కముగ ♦ దీనశరణ్య! యగణ్య! పుణ్య! యీ
ముప్పడగించి లోకములఁ ♦ బ్రోవఁగఁబూను మనూనమా కృపన్. 58

చ॥ అలయుట మాని మేటితప♦మంది నిరామయమైన యాత్మమున్
దెలిసి సుఖింపుమంటి విటుఁ ♦ దేవకు దేవ! జగద్వితానమున్
బలుమఱు పుట్టఁజేయుఁడని ♦ పాలనసేయుఁడటంచు లోఁగడన్
సలిపితి వాజ్ఞ రెండెటులఁ ♦ జక్కఁబడున్ మదిలోఁ దలంపుమా! 59

ఆ॥ ఇపుడు పొంగిపొరలు ♦నీమహావిపదబ్ధి, నింకఁజేసితేని ♦ యెలమి కలిమి
నీనియోగ మెందుఁ♦బూనిక చూపిన, నందె సంచరింతు ♦ మనఘ! మేము, 60

చ॥ తపసొనరించుచున్న యల♦తన్విని శైలకుమారి నింపుమై
నిపుడు వివాహమాడ మది♦నెంచి హిమాద్రికి నేగి భక్తలో
లుపమతి నవ్వరం బుమకు ♦ లోకశరణ్య! యొసంగుమయ్య! నీ
దు పనియెకాదె సర్వజన ♦ దుఃఖముఁ బాపుట లోకశంకరా! 61

చ॥ అని యిటు వేల్పులెల్లరు మ♦హావ్యసనంబున నొక్క పెట్టుగా
వనరుచునున్న వారిఁ గని ♦ వైళమె శంకరుఁ డాదరంబునన్
గని యిటు వల్కె మానుఁడు వ♦గన్ బొగలన్ వెరవొన్నొకో యిటుల్
వనరకుఁడింక ధైర్యము న ♦ వశ్యము చెందుఁడు దేవనాయకుల్! 62

వ. పుండరీకాక్షు నుపలక్షించి

చ॥ తిరుగ వివాహమాడు మని ♦ తేపకుఁ జెప్పుచునుంటి వీవు తా
మరసదళాక్ష ! యద్ది కను♦మా వ్యసనంబుల కాస్పదంబు బం
ధురభవకారణం బిఁక స♦తుల్ గడుమాయపునాతు లందుఁ జే
రరు ఘనయోగిపుంగవులు ♦ రమ్యతపోధను లైన సన్మునుల్. 63

—* శివుఁడు స్త్రీసంగము బ్రహ్మజ్ఞానబాధక మనుట *—

సీ॥ అపవిత్రములలోన ♦ నగ్రిమంబగు చోటు, బొంకులకెల్లను ♦ బుట్టినిల్లు
కపటవర్తనములఁ♦గనఁజేయు నెఱజాణ, చెడుగోతఁ బడఁద్రోయు♦ చెడ్డఘోటి
అనువుగా భ్రమసేయు ♦ నైంద్రజాలికవిద్య, నమ్మి యేలినచోటి♦నాగుఁబాము
సాహసంబులకెల్ల ♦ జంకనట్టి వలంతి, పాయంగ నీయని ♦ పరమధనము

గీ॥ ఒనరఁగాఁ గట్టుత్రాడులం ♦ దుక్కుగొలుసు
క్షణికసంతోష మొసఁగు క్రొ♦క్కారుతీఁగ
స్త్రీయనఁగ దానితోఁబొత్తుఁ ♦ జెందవలదు
బ్రహ్మనిష్ఠుల కెందేనిఁ ♦ బద్మనయన ! 64

గీ॥ సంగములయందుఁ గామినీ♦సంగ మెక్కు, డెందునరయంగ శ్రీపతి!♦యితరసంగ
ములను విడవచ్చు స్త్రీసంగ♦మును విడంగఁ, జాల రెవ్వారలీ జగ♦జ్జాలమందు.

క॥ కావున నిత్యసుఖం బది, గావలసినవార లీ జ ♦ గంబందు నెలన్
బూవుంబోఁడుల జాడకుఁ, బోవలవదు దానఁ జెట్ట ♦ వొడము రమేశా ! 66

గీ॥ అనిన వనజాక్షుఁ డెంతయు♦ నాత్మయందుఁ, దలఁకి ముసిముసినవ్వుల♦తళుకు లెసఁగ
నఖిలలోకేశ్వరునకిట్టు♦లనియె మృదుల, మధురవాక్చాతురీగతుల్ ♦మలసికొనఁగ.

సీ॥ అఖిలతాపంబుల ♦ హరియించు నౌషధం, బార్తికంధిని దాఁటు♦నట్టి నౌక
చిత్తంబు రంజిల్లఁ ♦ జేయఁజాలిన విద్య, సకలసౌఖ్యములకు ♦ జన్మభూమి
ప్రతిదినంబును గ్రొత్తఁ♦బరగుచక్కనివిందు, కొమరారుకాలమున♦కమరతరువు
అన్నపానంబుల ♦ నందఁజేసెడు దైవ, మతిథిజనంబుల ♦ నరయుతల్లి

గీ॥ దేవయజ్ఞంబునందు నెం♦తేనితోడు, కష్టసుఖములయందుఁ బాల్♦గాంచుజోడు
ఆత్మసతియగుఁగావున ♦నందఱకును, బెండ్లియాడంగఁదగుఁగాదె ♦ పేర్మియలర.

ఉ॥ ఏదెటులైన మాయఁ దరి ♦ యించిన నీకిఁకఁ గొంకదేల మా
కై దయతోడఁ జేకొనుము ♦ కాళిని లోకశరణ్య! వీఁకమై
మేదురవిక్రమున్ సుతు న♦మేయబలాస్పదుఁ బుట్టఁజేసి నా
నాదివిజార్తికారకు వి ♦ నాశముసేయుము తారకాసురున్. 69

ఉ॥ లోఁగడ నెన్నిమారు లిటు ♦ లోకసుఖంబునకై కడంగి నీ
వాగము మాన్పి భూరిదయ ♦ నందఱినిన్ బ్రతికించితయ్య తం
డ్రీ! గరళంబు పెల్లడరి ♦ డీకొని లోకములన్ దహింపఁగా
వేగముతోడఁ జేయెడిసి ♦ విశ్వపతీ! కబళించి కావవే. 70

ఉ॥ ఎక్కడనేని భక్తులకు ♦ నెప్పుడుగాని విపత్తి దోఁచఁగా
నక్కటికన్ దలంచి యపు ♦ డప్పుడె యట్టిది మాన్పి కాతు వా
చక్కపు డాత్మలోఁగొని వి ♦ చారణసేయుము మాదు బాములన్
మిక్కిలి గండుమీఱె మము ♦ బ్రమింగెడు రక్కసు నుక్కడంపుమా! 71

—* శివుఁడు పార్వతినిఁ బెండ్లాడుట కొడంబడుట *—

గీ॥ అనిన విని దా మహేశ్వరుం ♦ డాత్మయందు
జాలిఁగొని యిట్టులనెఁ జాలు ♦ శాంతిఁగొనుఁడు
దేవతాకార్యమునకయి ♦ తిరుగ దారఁ
జేకొనెదఁ గాంచెదఁ గుమారు ♦ లోకవీరు. 72

చ॥ చనుఁడిఁక మీగృహంబులకుఁ ♦ జక్కఁగ నేనిఁక శైలరాజనం
దన యొనరించునట్టి నియు ♦ తంపుఁ దపంబువిధం బెఱింగి చే
కొనఁగఁ గడంగెదన్ గుసుమ♦కోమల యక్కట మిక్కుటంపు వే
దనబడుచుండె నాకొఱకుఁ ♦ దద్దయుభక్తిపరీతచిత్తయై. 73

గీ॥ అని సెలవొసంగ దేవత ♦లంత మ్రొక్కి, సంతసంబొంది తమతమ♦సదనములకుఁ
జనిరి శంకరుఁడంతఁ దా♦సప్తఋషులఁ, దలఁప విచ్చేసి మ్రొక్కివా♦ర్పలికెరిట్లు.

ఉ॥ పున్నెములన్నిపండె మముఁ ♦ బూన్కిమదిన్ దలఁపంగ నిట్టులా
పన్నులమైతి మానతి నొ ♦ సంగు మేదేనిఁ గృపాంతరంగ! నీ
సన్ననొనర్తు మేపనియుఁ ♦ జక్కఁగ నీయెడ నీదు దాస్యమున్
గొన్న సిరిన్ నుతించుటకుఁ ♦ గోటిభవంబులకైన శక్యమే. 75

ఆ॥ అనిన లోకనాథుఁ♦డాదరంబున వారిఁ, గాంచి యిట్టులనె వి ♦ కాసమొప్ప
సప్తఋషులు మీరు ♦ సర్వవిజ్ఞానాఢ్యు, లాత్మహితులు సతత ♦ మరయనాకు.

—* శివుఁడు సప్తర్షులను పార్వతీ తపఃపరీక్షకై యనుపుట *—

శా॥ నీహారాచలపుత్రి నన్నుఁ బతిఁగా ♦ నిండారు ప్రేమంబుతో
నూహన్ జేసి మహోగ్రమైన తప మెం ♦ తో నియతోఁ జేయఁగా

దాహంబొందఁ దొడంగె లోకములు త♦త్తాపానలజ్వాలలన్
“త్రాహి త్రాహి” యటంచుఁ జేరిరి సురల్ ♦ రక్షార్థులై నన్నిఁకన్. 77

వ. కావున

శా॥ గౌరీశృంగమునన్ దపించు నగరా ♦ ట్కన్యన్ దగన్ జేరి మీ
రా రాజాననతోడ నన్ గుఱించి మి ♦ థ్యానిందలన్ సల్పి చే
తోరీతిస్ఫుటతన్ గనుంగొనుఁడు చా ♦ తుర్యంబు రాణింపఁగా
నేరంబంచుఁ దలంపఁబోకుఁ డెద సం ♦ దేహింపకుం డింతయున్. 78

క॥ నావను విది సేయుండన, నాపద్మజనిభులు వల్లె ♦ యని సంతోష
శ్రీపరవశులై హిమగిరి, కా పార్వతియొద్దకేగి ♦ రతివేగమునన్. 79

మ॥ చని యందుగ్రతపంబు చేయు నగరా ♦ జన్యాత్మజన్మన్ లస
ద్ఘన తేజోమయవిగ్రహన్ సకలలో ♦ కక్షేమసంధాయినిన్
గని దూరంబుననుండియే మది నమ ♦ స్కారంబు లర్పించి వే
గనె చేరన్ జని పల్కి రివ్విధ మలీ ♦ కచ్ఛన్నసూక్తంబులన్. 80

మ॥ సుకుమారీ! తపమేటికమ్మ! నిను ని ♦ చ్చోనిట్లు నేమించిరే
వికటాత్ముల్ పగఁబూని జాదిలతికన్ ♦ వేండ్రింపుగ్రీష్మాతపో
గ్నికిఁ ద్రోయించిన యట్లుగా నకట కు ♦ త్కీలాధిరాట్పుత్రి! యే
మికొఱంతన్ గొని పూనితీవు సెపుమా ♦ మేముల్ వినన్ గూడినన్. 81

క॥ అని పలికిన మునులకు రయ, మున వందన మిడుచుఁ గాళి ♦ మోదంబున ని
ట్లనియెను మునికులతిలకులు !, వినుఁడీ! నుడివెదను నాదు ♦ వేఁదుఱువిధమున్,

గీ॥ అపహసింపకుఁ డిందు న ♦ న్ననఘులార !, నీటిలో మేటిగోడను ♦ నిలుప నెంచి
నట్లు దుర్లభమగుకార్య ♦ మర్థిఁ గోరి, యుంటి నారదమౌని వ ♦ రోక్తినొంది.

క॥ శివుఁ బరమేశ్వరు లోకో, ద్భవకారణు సర్వదుఃఖ ♦ భంజనుఁ బతిగాఁ
గ వరించి వేడ్కమైఁ దప, మవుఁ గాదన కిట్లుపూన్కి ♦ నందితి ననఘుల్! 84

గీ॥ అరయ నాధారశూన్యమౌ ♦ నాకసంబు, నందు తెక్కలులేని నా ♦ డెందమనెడు
పుల్గెగురుచుండె నద్దాని ♦ భూరిదయను, నరసి ప్రోచునుగాతఁ జం♦ద్రార్ధమౌళి.

క॥ అన మును లన్యోన్యంబౌ, ననములు గనుఁగొనుచు బిట్టు ♦ నగి కాళికతో
ననిరి వనజాతలోచన!, చనునే నారదుని నుడిని ♦ సంభావింపన్. 86

గీ॥ నారదుండు కూటవాది య ♦ న్యాయపరుఁడు
ఘాతుకాత్మకుఁ డత్యంత ♦ కపటమూర్తి
కను పయోముఖవిషకుంభ ♦ మనఘచరిత !
కడఁగి విను మేము సెప్పుదు మ ♦ క్కఱటివిధము. 87

ఉ॥ ధాతకుమారుఁడైన యల ♦ దక్షునుతుల్ పదివేలమంది వి
ఖ్యాతచరిత్రు లాత్మజన ♦ కాజ్ఞఁ దపం బొనరింపుచుండఁగా
నీతఁడు వారిఁజేరి నెన ♦ రించుక లేక విరాగిభావమున్
జేతమునందుఁ జేర్చిచనెఁ ♦ జెచ్చెరఁ బాసిరి వారు దక్షునిన్.
చ॥ తనయులు రాకమానుటను ♦ దక్షుఁడెఱింగి ఘనంబుగా మదిన్
వనరి యనంతరంబ పది ♦ వందల పుత్రులఁ గాంచి వారలన్
ఘనమగు తాపసవ్రతముఁ ♦ గాంచఁగఁ బంపఁగ నప్డు వారికిన్
మునుపటి యట్లు నారదుఁడు ♦ ముక్తిపథం బుపదేశ మిచ్చుచున్. 89
గీ॥ వార లంతట మోక్షంబుఁ ♦ బడసి తండ్రిఁ, జేరకుండిన దక్షుఁడా ♦ తీరుఁదెలిసి
కరము దుఃఖించి నారదు♦కపట మెఱింగి, చెచ్చెరశపించె నాతని♦చేవయడఁగ.
వ. ఇంకను
ఉ॥ పూనికతో హిరణ్యకశి ♦ పుం డను దైత్యుని పూవుఁబోఁడికిన్
మానుగ దానవాంతకుని ♦ మంత్రము జెప్పి కుమారు వైష్ణవున్
గా నొనరించి తండ్రికిని ♦ గాదిలి పట్టికి మేటివైరమున్
బూనిచి చంపఁజేసె దితి ♦ పుత్రుని శత్రునిచేత నిద్దరన్. 91
గీ॥ ఎట్టివారల కేనియుఁ ♦ బట్టుఁబట్టి, యుఱక పోరాట మొదవించి♦యురులఁబెట్టు
వలఁతి యాతండరయుమట్టి♦వానిజాడఁ,దలఁపఁగూడదు శ్రేయంబుఁ♦దలఁచువారు.
గీ॥ ఇదియె నారదచరిత మో♦యిగురుబోఁడి! లాఁతిబిడ్డల నూరక ♦ నూతఁద్రోయ
ఘనుఁడతఁడుగాన నిన్నిట్లు♦కానఁజేర్చి, యిడుములన్ గుదుచుచుండెనస♦హింపలేక.
క॥ తలిదండ్రు లెట్లు నిన్నీ, కలహాశను నుడినిఁబట్టి ♦ కానకు బంపన్
గలిగిరి తల్లీ! వారి మ, దులు వజ్రము లనఁగ మాకుఁ ♦ దోచు నరయఁగా.
ఉ॥ ఇంతకు నీవు గూర్మి వరి ♦ యించిన కంతువిరోధి వర్తనం
బింత నెఱింగియుంటిమి హి ♦ మాద్రిజ! చెప్పెద మించుమించు నా
కింత మనంబునందుఁ గిను ♦ కించుక కొంచక యాలకింపు మ
త్యంత మతం డమోఘుయుఁడు ♦ దాఁటినవాఁడు భవప్రపంచమున్.
వ. మఱియును
ఉ॥ ఓ కమనీయగాత్రి! విను ♦ మోవికచాంబుజనేత్రి! శర్వునిన్
బ్రాకటరాజతాచలవి ♦ భాస్వరుఁడంచును రాజమాళియం
చేకమతిన్ వరించితి వి♦హీ కుధరాటవికుండతండు దో
షాకరమాళి నీమది న ♦ యమ్మనయమ్మన నూహసేయుమా! 96
గీ॥ కనుమహాకాలమూర్తి గం♦గాధరుండు, పశుపతి దిగంబరుండు ♦ కపాలి శూలి
అక్కటా! భిక్షుకుఁడువిరూ♦పాక్షుఁడుగ్రుఁ,డరయ వేయవ్విధంబుక♦ల్యాణమూర్తి!
క॥ సర్వజ్ఞుండని యరుదుగ, శర్వుని నీవెంతువేమొ ♦ స్వాంతములోనన్
బర్వతరాజకుమారీ!, యుర్వీస్పందనుఁడు స్థాణుఁ ♦ డొప్పఁగ వినుమా! 98

ఉ॥ మున్నుల దక్షకన్యక స ♦ మున్నతవాంఛఁ బినాకహస్తునిన్
బన్నుగఁ బెండ్లియాడి కడు ♦ బాములఁ జెంది మహాధ్వరంబునన్
బన్నము నొంది యోగమునఁ ♦ బ్రాణముఁ బాసెఁ గుమారి! యెట్టిసం
పన్నతఁ గాంచి యిట్లురక ♦ పాల్పడితీవు శివున్ వరింపఁగన్. 99

గీ॥ ఉండుటకు నిల్లులేదు ప ♦ రుండ మంచ, మేనిలేదు వసావడ ♦ నేమిలేదు
కట్టుటకు లేదు కాటనే ♦ కాపురంబు, బిచ్చమే జీవనంబు చాం ♦ పేయగాత్రి

గీ॥ కాన నీవింకఁ దపముని♦మాను తల్లి!, తల్లిదండ్రులకడ కేగు ♦ తప్పకుండ
మంచిసంబంధమారసి ♦ మగనిఁగూర్తు, మమ్మ! నీమదియుమ్మలి♦కమ్మువాయ.

వ. సుందరతరుణబృందారకులు హేమాహేమీలు పలువురుగలరు వారలం దొకని
గరిష్ఠుని 102

ఉ॥ ఇప్పుడె సెప్పువారము ర ♦ మేశ్వరుఁడౌ పురుషోత్తముండు నీ
కొప్పిదమైనభర్త యసి♦తోత్పలమూర్తి యభీష్టకేళులన్
గొప్పసమర్థుఁ డెందు నను ♦ కూలుఁడు గావున నట్టివాని నీ
వొప్పుగఁ బెండ్లియాడు సుఖ ♦ మొందెదు పొందెదు వైభవమ్ములన్. 103

సీ॥ కల్యాణగుణనిధి ♦ కమలదళాక్షుండు, నిర్గుణుం డారయ ♦ నీలగళుఁడు
కామనిర్మాణైక ♦ కారణం బాహరి, కామనిర్వాపణ ♦ కరుఁడు హరుఁడు
కౌస్తుభగ్రైవేయ ♦ కలితవక్షుఁడు చక్రి, యురగేంద్రహార కం♦ధరుఁడు శూలి
అసమానవైభవా♦యతనం బుపేంద్రుండు, భైక్షాశనుఁడు కృత్తి♦వసనమూర్తి

గీ॥ ఇట్లు విపరీతరీతుల ♦ నెక్కుడైన, తారతమ్యముతోడుతఁ ♦ దనరుచున్న
హరిహరులతీరుఁ దెలిసి నీ♦వాత్మయందు, నెమ్మి నాలోచనము సేయు♦మమ్మ! సుంత.

క॥ కావున హఠమున్ విడి నీ, వీవిధమున కొప్పు నెడల ♦ నిపుడే మేమా
శ్రీవిష్ణువు నిటఁ దెచ్చి మ, హావైభవమొప్పఁ బెండ్లి ♦ నమరింతు ముమా!

—* పార్వతి సప్తర్షులకు శివమహిమంబుఁ జెప్పుట *—

వ. అనుడు.

ఉ॥ పక్కున నవ్వి యవ్వికచ ♦ పంకజలోచన మౌనివర్యులన్
జక్కఁగఁ జూచుచున్ మిగుల ♦ జాదుర జాదుర మొప్ప నిట్లనెన్
నిక్కము లే తపస్వికుల ♦ నీరధిచంద్రములార! మీ నుడుల్
మిక్కిలి సారవంతములె ♦ మెప్పు ఘటిల్లఁగఁ జేయు నేరికిన్. 106

ఆ॥ చాలఁ గఠినుఁడైన ♦ శైలరాజేంద్రుని, కాన్పునగుటఁ జాలఁ ♦ గఠినతమము
నామనంబు దిరుగు♦నా యెన్నిఁజెప్పిన, మౌనులార! గుణని ♦ ధానులార! 107

చ॥ వనలను నే హాతం బమర ♦ వంద్యుఁడు నారదమౌని సెప్పిన
ట్టిది మెవిధంబుగాఁ దవము ♦ శివిమెయిఁ బొనరించెదఁ గుణా
స్పదుఁడని కేళిలోలుఁడని ♦ పన్నుగఁ గేశవుఁగూర్చి చెప్పినా
రదిమది కంద దెవ్వాడును ♦ నా హరుఁబాసి వరింప నన్యులఁ. 108

ఆ॥ ఆహరియుఁగూడఁగృష్ణ దే♦హంబువాఁడు,కడిదినిద్రాప్రమాదముల్ ♦గలుగువాఁడు
అరయఁ బదివేసములతోడఁ♦బరగువాఁడు,వలదువరియింపగోవిందు♦వంద్యులార!

క॥ శివుఁగుఱిచి నిర్గుణుండని, యవినయుఁడని పేద యని మ ♦ హాత్ములు మీరల్
గవిసి వచించితి రిట్టుల, శివతత్త్వముఁ దెలియఁగా వి♦శేషము జగతిన్. 110

క॥ మఱచితిరో తొలిచదువుల, వెఱచితిరో నెవరికేని ♦ వెకలులకిలలోఁ
గఱచితిరో పెఱత్రోవల, నఱచితిరో నాదు మనము ♦ నారయఁగ నిటుల్. 111

క॥ ఈశ్వరుఁడని సకలామ్నా, యేశ్వరుఁడని హరివిరించ♦నేంద్రాదిది నిలిం
పేశ్వరుఁడని కల్పాంతా, నశ్వరుఁడని శివుని శ్రుతు ల♦నఁ వినరొక్కో ! 112

మ॥ త్రిగుణాతీతుఁడు నిర్వికారుఁడు జగ ♦ ద్దేతుండు భక్తావనా
ర్థగృహీతాకృతి వేదవేద్యుఁ డమర ♦ ధ్యానార్హచారిత్రుఁ డ
జ్ఞగతపోద్ధతభావదుర్లభుఁడు వి ♦ జ్ఞానాస్పదుం డీశ్వరుం
డగు మీ చెప్పిన యట్లుకాదు వినుఁడీ! ♦ యాక్షేపముల్ మానుఁడీ ! 113

*సీ॥ పద్మాక్షుఁడొకసాక్షి♦పద్మగర్భుఁడుసాక్షి, స్వర్గపాలకుఁడు వా ♦ సవుఁడుసాక్షి
వైరించమస్తక ♦ హారబృందము సాక్షి, యభినుతిసేయువే♦దములుసాక్షి
మునిఁజంపవచ్చి కూ♦లినకృతాంతుఁడు సాక్షి, సనకాదిముక్తవ్ర♦జంబుసాక్షి
ఎదిరించి సమసిన ♦ యిక్షుధన్వుఁడుసాక్షి, రుజనుబాసిన చందు♦రుండుసాక్షి

గీ॥ కలశజాదిమహర్షి ప్ర♦కరముసాక్షి, పఱచి తలఁగోల్పడిన యజ్ఞ♦పశువుసాక్షి
బస్తముఖుఁడైన దక్షుండు♦ప్రౌఢసాక్షి, శివుఁడె సర్వాధికుఁడని యో♦జింపుఁడీరు.

గీ॥ సకలజగదీశ్వరుండయ్యు♦జగతిఁ దనదు, పెంపుఁ జూపింపఁ దలఁపఁడు♦ వెగ్గలంపు
భవ్యవైరాగ్యభావంబుఁ♦బాదుకొలుపుఁ,బరమశివునారయుండిట్లు♦బ్రహ్మబుధులు!

సీ॥ విమలాత్మవిజ్ఞాన ♦ విహృతినొందెడు ఘనుం, డరయు నే యన్యవి♦హారములను
నిర్వికారానంద ♦ నిరతుఁడౌ ధన్యుండు, విషయవికారంపు ♦ వెఱ్ఱిఁగొనునె

* శ్లో॥ ధ్యేయత్వేతవసాక్షిణో మునిగణాః మోక్షప్రదానేశుకః
వంద్యత్వే నిగమాస్స్వభక్త వినత క్లాంతౌ కృతాంతాదయః
నిత్యత్వేచ పితామహస్యచ శిరస్స్రిక్ బృందమాద్యంతయో
శ్శూన్యత్వేచవరాహహంస వపుషా పద్మాక్ష పద్మాసనా ॥

ముక్తికాంతాభోగ ♦ భోగమొందెడు పుణ్యుఁ, డన్యకాంతాభోగ♦మాసపడునె
స్వప్రికాశైకద♦ర్శనచణుండగు యోగి, యితరాలిశయముల ♦ కింపు గొనునె
గీ॥ భక్తిరక్షణమున కెట్టి ♦ పాట్లుగాని, పడఁగ రూపంబుఁదొరకొన్న♦పరమపురుషుఁ
డన్యుఁడట్టులఁ దుచ్ఛసౌ♦ఖ్యంబులొందఁ, దలఁచునే యారయుండీరు♦తద్జ్ఞులార!

ఉ॥ ఏనును భోగమాత్రిమున ♦ కే యిటు లిచ్చయొనర్చి యార్జిత
శ్రీనిధియైన యీశ్వరునిఁ ♦ జేకొనఁగోరను సర్వదైవతే
శానున శామహేశునకు ♦ జాయఁగనౌటకె వాంఛసేతు న
ద్దానన సర్వమున్ దొరయుఁ ♦ దాపసవంశపయోధిచంద్రముల్! 117

గీ॥ యోగివరుఁడీశ్వరుం డేను ♦ యోగినినిఁద, పస్వినాథుఁడు శివుఁడు తా♦పసినినేను
అల్లహరుఁడు మహాకాలుఁ♦డనఘులార!, కాళినగుదేను జోడుగాఁ♦గలను దనకు.

వ. ఇంకను వినుండు.

సీ॥ శీతాంశుధరు నెంచు ♦ చిత్తంబు చిత్తంబు, భవు సమర్చనసేయు ♦ పాణిపాణి
ప్రమథనాథునిఁ జేరు♦పదములు పదములు, శివుని సన్నుతిసేయు ♦ జిహ్వజిహ్వ
విశ్వేశుకథ విను ♦ వీనులు వీనులు, కాలకాలునిఁ జూచు ♦ కనులు కనులు
పరమేశుఁ గొల్చెడు ♦ భాగ్యంబు భాగ్యంబు, దర్పకారికినొంచు ♦ తనువుతనువు
గీ॥ పురహరునిఁ గొల్వఁబూనిన♦బుద్ధిబుద్ధి, శ్రీశసాయకునకు మ్రొక్కు♦శిరముశిరము
శంకరునిభక్తిఁబడసిన ♦ చదువుచదువు, నాగభూషణుసేవించు♦నరుఁడునరుఁడు.

ఉ॥ ఉల్లము శంకరాంఘ్రినళి ♦ యుగ్మసమాశ్రయయుక్తియందొడల్
హల్లకబంధుభూషణు స♦మర్చనమందు నుడిన్ మహేశ్వర
ప్రోల్లలితాహ్వయమ్ముల జ♦పోద్యమమందుఁ దిరంబుచేసి రం
జిల్లుదు రెవ్వరట్టి సుర♦సేవ్యులు భవ్యులు శాంభవ్య లీభువిన్. 120

వ. పక్షాంతరమందు

సీ॥ పరమశివార్చనా♦పదవి నొందఁగలేని, యిక్కగా దది పాప♦డొక్కగాని
ఖండేందుధరభక్తిఁ ♦ గనకయున్నట్టి య, న్నరుఁడు గాఁ డాతండు♦వఱఁడుగాని
శ్రీకంఠమూర్తికిఁ ♦ జెలఁగి మ్రొక్కఁగలేని, శిరముగా దది పాప♦భరముగాని
భోగిభూషణుపూజఁ ♦ బూని సేయఁగలేని, కేలుగా దది చెడ్డ♦తేలుగాని!
గీ॥ శంకరుని మదిఁజెందఁగాఁ ♦ జాలనట్టి, తెలివిగా దది కడు చెడ్డ ♦ తెవులుగాని
అమ్మహేశ్వరు కొలువుకై ♦ యమరనట్టి, కలిమిగా దది పేరడుస♦బలిమిగాని.

వ. మఱియునిఁక నన్యథాప్రబోధన వైదగ్ధ్యం బిందు వైముఖ్య వైరస్యంబుల నుత్పా
దించుఁగాక కార్యకారియగునే? 122

సీ॥ రత్నాకరునిఁదక్క ♦ రహి నొక్కనదమును, జేరునే జాహ్నవి♦సిద్ధమునులు !
యజ్ఞకీటినిఁదక్క ♦ యడవి సూకరమును, వసుమతి చెందునే ♦ వంద్యమూర్తు
లాభాస్కరునిఁదక్క ♦ యల్ల ఖద్యోతంబుఁ, గని వికసించునే ♦ కమలవల్లి
అల ఘనాఘనుఁదక్క ♦ నలఁతి యావిరి తెప్ప, కేసి సౌదామని♦యేగునే ము

గీ॥ నీంద్రులీశ్వరుఁదక్క నే♦నింక నొకనిఁ, జెట్టఁబట్టఁ దలంతునే ♦ చెనఁటివగుచు
నరసితిరె నాదు హృదయంపు♦టాను నివ్వ, డేని వినుడింకఁ జెపుదు న♦ట్టింత లేక.

## —* పార్వతి సప్తర్షులకుఁ దన నిర్ణయంబును జెప్పుట *—

చ॥ అరుణగభస్తిబింబ మప ♦ రాచలమం దుదయించినన్ గడున్
దిరమగు మేరుభూధరము ♦ తేలికమై చలనంబు నొందినన్
స్ఫురదనలంబు శైత్యమును ♦ జోద్యముగా వహియించినన్ శిలన్
సరసిజ ముద్భవిల్లినను ♦ శర్వునిఁదక్క వరింప లాఁతులన్. 124

ఉ॥ శర్వుఁడు నా తపంబునకు ♦ సంతసమొందక యుండెనేని నే
నుర్విని లాఁతిపూరుషుల ♦ నొప్పి వరింతునె యమ్మహేశ్వరుఁ
సర్వజగత్పతిఁ మరల ♦ జన్మమునొందియు నేనిఁ జెందఁగా
నోర్వఁగరాని యగ్గిఁబడి ♦ యొడ్డుగ నీయును రూడఁజేసెదన్. 125

గీ॥ అనిన మునులు జయధ్వనుల్ ♦హర్షభరమె, సంగనొనరించి పార్వతీ♦చరణనళిన
ములకు మదిలోన జోతల♦సలిపి శివునిఁ, జేరఁజని యవ్విధంబెల్లఁ ♦జెప్పి చనిరి.

## —* శివుఁడు పార్వతినిఁ బరీక్షించుటకై యతియై చేరుట *—

చ॥ మునికులచంద్రు లిట్లు హిమ♦భూధర రాజసుతా మనఃపరీ
క్షను బొనరించి తెల్పిన ప్ర♦కార మెఱింగి మహేశుఁ డప్పు డిం
కను బరిశోధనేచ్ఛఁగొని ♦ క్రచ్ఛల వృద్ధతపస్విరూపముఁ
గొని యొక యాఁతకఱ్ఱ గొడు♦గున్ ధరియించి చనెన్ హిమాద్రికిఁ. 127

గీ॥ పర్వతేంద్రకుమారి త♦పంబుసేయు, తావునకుఁజని చెలులతోఁ♦దనరు దాని
వేదియం దనవద్యమై ♦ వెలయు దాని, భర్మలతఁబోలి యలరు న♦పర్ణఁగాంచి.

గీ॥ తారసించిన నమ వృద్ధ♦తాపసాళి, తిఁ దనరువిప్రుఁ గాంచి త♦దీయదివ్య
తేజమున కాత్మలో మెచ్చి♦దివ్యసలిల, పుష్పఫలముల నర్పించి♦పూజచేసి. 129

వ. స్వాగతంబాడి వినయవినమితయై యిట్లనియె.

ఉ॥ ఎవ్వరు మీర లిచ్చటికి ♦ నెందుల కేగుచు నేగుదెంచినా
రివ్వనమెల్లఁ దేజముల ♦ నెంతయు వెల్గఁగఁ జేయుచుంటి రా

మువ్వురు వేల్పులం దొకరొ ♦ మోదముతో నెఱిఁగించి మాకుఁ గన్
నివ్వటిలంగఁ జేయుఁడు వి ♦ నిశ్చితవైభవ మీశ్వరోపమా ! 130

చ॥ అనిన నగేంద్రనందనకు ♦ నాతఁడ నెన్ లలితాంగి ! స్వేచ్ఛ నెం
దును దిరుగాడుచుండెదను ♦ దోయజగర్భుని వంశ్యుఁడన్ దపం
బనవరతంబు సేతు నన ♦ యంబు జగంబున కెంతయున్ హితం
బును బొనరింతు నిక్కమిది ♦ పొందుగ విన్ము సరోరుహాననా !

ఉ॥ ఎవ్వతెవీవు? రోహిణివొ ? ♦ యిందిరవో ? పరమేష్ఠి రాణివో ?
యవ్వనజాక్షుపత్నివొ ? సు ♦ రాధిపు నాతివో ? వేదమాతవో ?
యివ్వనభూమియం దిటుల ♦ నేటికి తీవ్రతపోవ్రతంబు నీ
వివ్విధి సల్పుచుంటి వసి ♦ తేక్షణ ! నా కెఱిఁగింపు మింపుగన్. 132

ఉ॥ ఎవ్వనిపుత్రి ? వెద్దికుల ? ♦ మెయ్యది యాహ్వయ ? మబ్జగంధి ! నీ
వెవ్వని పువ్వుఁబోఁడి ? విటు ♦ లెంచఁగరాని తపం బిదేల ? లే
జవ్వనమం దిలన్ మగని ♦ జాడఁ దొలంగి యొనర్చె దిట్లు ని
న్నవ్విభుఁ డెట్లు వాసెను ? ద ♦ యాగుణహీనుఁడు హీనుఁ డన్నిటన్. 133

చ॥ సకలముఁ దెల్పు సత్యముగ ♦ సాధ్వి ! యనన్ నగరాజరాజక
న్యక చిఱునవ్వు నెమ్మొగము ♦ నన్ దళుకొత్తఁగ నిట్లుపల్కె మా
నికులవతంస ! విన్మిఁకను ♦ నీవు వచించినవారిలోన నే
నొక తెనుగాను బర్వతవ ♦ రోత్తమపుత్రిని కాళియంద్రు నన్. 134

మ॥ తొలిజన్మంబున దక్షపుత్రినయి రు ♦ ద్రున్ బేర్మిఁ బెండ్లాడి పే
రలుకన్ దక్షుఁడు నామనోవిభుని న ♦ త్యంతంబు దూషింప ని
ట్టలమానీసున-నాశరీరమును గా ♦ టంబైన యోగాగ్నిచేఁ
బొలియన్ జేసి నిలింపరక్షకొఱకీ ♦ పుట్టున్ దగన్ గాంచితిన్.

చ॥ శివుఁడు హిమాద్రిపైఁ దపము ♦ సేయుచునుండఁగఁ దారసించి నే
నవిరళభక్తిఁ గొల్వ హరుఁ ♦ డంత సుమాస్త్రుని రూపు మాపి నన్
జివుకఁగఁ జేసి రౌప్యగిరిఁ ♦ జేరఁగఁ బోయెఁ దపంబుచేసి యా
భవుని వివాహమాడుటకుఁ ♦ బాల్పడి యిట్లు దపించెదన్ విభూ ! 137

గీ॥ నాతపం బమ్మహేశ్వరు ♦ చేతమునకు, నేఁటివఱ కెక్కకుండెన ♦ గ్నిప్రవేశ
మేను జేయంగఁ బూని మి ♦ మ్మిపుడు కాంచి, యర్చనము సేయనాఁగితి ♦ ననఘచరిత!

క॥ ఏజన్మంబున నన్నిఁక, నా జగదీశ్వరుఁడు గొనునొ ♦ యక్కతమున నే
నీజన్మంబును బాసెదఁ, బోఁజను మీరిందునుండి ♦ పురుషశ్రేష్ఠా! 140

గీ॥ అనిపలికి తాపసుఁడు వల ♦ దనుచు వార, ణంబు సేయుచునున్న న ♦ న్నళినవదన
వేగమున నగ్ని దూఁకఁగ ♦ వీతిహోత్రుఁ, డపుడు చందనశీతలుం ♦ డయ్యెఁ దలఁకి,

ఉ॥ కాళిక యంతఁ జేయునది ♦ గానక యూరకవచ్చుచుండఁగా
వైళ మళీకమౌని గరు ♦ వంబున నిట్లనిపల్కె నగ్గి నిన్
గాళి! దహింపదయ్యె నెటు ♦ గాంక్షితమున్ సమకూరదయ్యె వా
క్కేళిఁ దొలంగి తెల్పుము స ♦ ఖీ! యిఁక నీదు మనోరథంబులన్. 142

వ. వెండియు.ను

చ॥ కలికి! తపంబుచేసి యిఁకఁ ♦ గాంచెదు వైభవ మెద్ది? నీకిలన్
వెలితి గనంగరాదు కడు ♦ వేఁదుఱుఁజెంది మృణాళకోమలో
జ్జ్వలమగు నీ శరీరమును ♦ జండతపోర్చిఁ గృశింపఁజేసి యి
ట్లలఁచుట చిల్లపెంకుఁగొని ♦ యక్కట! బంగరుఁ బొఱవైచుటే! 143

—* జయ యతికిఁ బార్వతీ తపఃకారణముఁ జెప్పుట *—

చ॥ అనిన గిరీంద్రకన్యక ని ♦ జాళులకున్ గనుసన్నఁజేయఁ జ
య్యన జయ దారసించి విన ♦ యంబున నిట్లనిపల్కె విస్మ స
న్మనికులచంద్ర! యీ రమణి ♦ భూధరరాజకుమారి కాళి శ
ర్వునిఁ బతిగా వరించి కడుఁ ♦ బూన్కిఁ దపించుచున్నదిట్టులన్. 144

క॥ నారదముని పనుపున నీ, సారసదళమృదులగాత్రి ♦ చటులతపం బి
ట్లారంభించి యొనర్చెడు, సారెకుఁ దాపసవతంస ♦ సంఘము లలరన్. 145

గీ॥ కరము చిరకాలమయ్యె నీ♦కలికి తపము,సేయమొదలిడి నేఁటికి♦శివ్రుఁడు మెచ్చఁ
డాయె నీతన్వి యితరాది♦తేయవరుల, లోన నొక్కనిఁబెండ్లాడఁ ♦ బూనదాయె.

ఉ॥ మీరు మహాతపోనిధు ల ♦ మేయదయాకరు లిద్ధమూర్తు లీ
చారుశరీరగాత్రి నల ♦ శంకరుఁ డెద్దియు శంక లేక వి
స్తారతరానురాగమునఁ ♦ దప్పక చేకొని పెండ్లియాడునే?
కూరిమిమీఱఁ జెప్పఁ డెదఁ ♦ గుందడఁగంగఁ దగంగ వేడుకల్. 147

సీ॥ హంసతూలపుతల్ప♦మందె నిద్రించునా, ర్య పరుండుఁ గఱ్ఱకైన ♦ రాల రేల
అమలకాంచనదుకూ ♦ లములఁ గట్టెడు బాల, నారచీరల బిగి ♦ మీఱఁ గట్టు
మృగనాభిపంకస ♦ మ్మిళిత చందనగంధ, మలఁదు లలిత పూయు ♦ నమరబూది
కల్పవృక్షఫలాళిఁ ♦ గాంచించి తిను శివ, గాడ్పును మెసవు నా ♦ కటికి నోర్చి

గీ॥ ఏమి నుడువుదు తుహినగి♦రీంద్రపుత్త్రి, బాలచంద్రధరున్ గోరి ♦ ప్రబలతాప
భరముఁజెందుచు నిట్లుండె♦బరమపురుష!, శివునిచిత్తంబదేటికో ♦ చెమ్మగిలదు.

క॥ ఈ రమణి తపముసేయుట, కారంభముసేయువేళ ♦ నా యా మొక్కల్
కూరిమివేసె నిపుడు వి, స్తారఫలప్రసవరమలఁ ♦ దనరెడు నవియున్. 149

గీ॥ ఇంక నేమివిన్నగోరు ♦ దెఱుకసేయు, మనినఁ గృతకయతీశ్వరుం ♦ డల్లనవ్వి
పార్వతినిఁజూచియిట్లని♦పల్కె నీదు, చెలియపల్కులునిజములే♦చెలువ! చెప్పుమ.

మ॥ అనన ప్పార్వతి యిట్లు పల్కె మునివ ♦ ర్యా! నాసఖీభాషితం
బు నిజం బెక్కుడు ప్రేమబంధమున నె ♦ ష్ఠన్ వాఙ్మనఃకాయవ
ర్తన మాశంకరు గొల్వనందె సమకూ ♦ ర్చన్ జేసి యిట్టి తపో
ధనసంపత్తిఁ గొనన్ దలంచితి శివున్ ♦ దప్పౌనొ యొప్పౌనొకో. 151

క॥ అనిన విని వెక్కసంపడి, ముని యిట్లని పల్కెఁ దెలిసె ♦ మొదల నిదేమో
ఘనకాంక్షిత మని యడిగితిఁ, జనఁదగు నే నిందునుండఁ ♦ జన దిఁక మీఁదన్.

ఆ॥ ఇట్టు పలికి చనఁగ ♦ నెంచిన మునినాథుఁ, గాంచి యపుడు కాళి ♦ కరముభక్తి
తోడ నిట్టులనియెఁ ♦ దొందర యేటికి, నిలిచి చెపుము దేవ! ♦ నీవు హితవు.

—* యతి పార్వతికి శివుని నిరసనం బుపన్యసించుట *—

వ. అనిన జటిలుం డిట్లనియె.

ఉ॥ నన్నిటనిల్పి నీవు శ్రవ ♦ ణం బొనరింపఁ దలంపు చేసినన్
బన్నుగఁ దెల్పువాఁడ నిఁకఁ ♦ బథ్యము తథ్యము నైనమార్గ మా
పన్నగభూషు పైసిఁకను ♦ బాగుగ నంత నెఱింగియుంటి నీ
వెన్నిక మీఱ నాజటిలు ♦ నెట్లు వరించితివో కృశోదరీ! 154

సీ॥ గజమేని యొక ఘోట ♦ కమ్మేని యున్నదే, గిటకపాఱినముది ♦ గిత్తగాక
శిష్యులేనియును భు ♦ జిష్యులేన్ గలరె ద, య్యాలకూటువల నె ♦ య్యములుగాక
కౌశేయమేని రా ♦ ఙ్కవమేని యున్నదే, యేన్గురక్కసిచర్మ ♦ మేవగాక
ఘనసార మేనిఁ ♦ జందనసారమేని యు, న్నదియె బూది విలేప ♦ నంబుగాక.

గీ॥ ఓగిరంబేనిఁ గలదె నీ ♦ వూహసేయు, చటులకాకోదరోరువి ♦ షంబుగాక
ఏమి భోగంబులున్నవో ♦ యెఱుఁగలేవె, రుద్రునందుఁ ద్రిలోకైక ♦ రుచిరగాత్రి!

ఉ॥ పూర్వమునందు దక్షుని సు ♦ పుత్రియు నీవలె మోసపోయి తా
శర్వుని జెట్టఁబట్టి పతి ♦ చందము గిట్టని తండ్రిచేత బి
ట్టోర్వఁగరాని చిన్నతన ♦ మొంది మహాధ్వరభూరివేదికన్
బర్వఁబాసెఁ బ్రాణములఁ ♦ బార్వతి! వింటివిగాదె యిక్కతన్. 156

క॥ స్త్రీరత్న మీవు సుగుణో, దారుఁడు మీతండ్రి పర్వ ♦ తప్రభుఁ డిలలో
భూరితరైశ్వర్యఘనుం, డో రమణీమణిరో! తగునె? ♦ యుగ్రు వరింపన్. 157

సీ॥ వజ్రంబు నటు పాఱ ♦ వైచి పాషాణశ, కలముఁ జేకొని మూటఁ ♦ గట్టినట్లు
చందనాంబువుఁ బాఱఁ ♦ జల్లి పెల్లడుసును, బొలుపుగా నొడలెల్లఁ ♦ బూయుపోల్కి
బంగారుజలతరీ ♦ పట్టుపుట్టము గెంటి, తోలు గట్టుటకయి ♦ తొడరుమాడ్కి
కమలమిత్రుని నెట్టి ♦ ఖద్యోతకాంతులఁ, గాంచి యానందింప ♦ నెంచు కరణి

గీ॥ మణినిధానంబెడసి లోహ♦మయరజంబుఁ, జెందియానంద మొందెడు♦చందమునను
లోకపాలకులగు వల్ల ♦ పాకశాస, నాదులను బాసి కామసం♦హారు వలచుట.
సీ॥ కస్తూరికారజః ♦ కలితచందనగంధ, మేడ? చితాభస్మ ♦ మేడ? బాల !
రమణీయవల్లకీ ♦ విమలరాగగ్రామ, మేడ? శంఖధ్వాన ♦ మేడ ? రామ !
లలితకాంచనమృదు♦లదుకూలసంచయం, బేడ? గజాజినం ♦ బేడ ? కాంత !
రంగన్మనోజ్ఞ మృ ♦ దంగసంగతనాద, మేడ ? డమరుఘోష ♦ మేడ ? రమణి!
గీ॥ వజ్రవైడూర్య భూషణా♦వళులవేడ?, ఘనకరాళభుజంగసం♦ఘంబులేడ ?
తామరసనేత్ర! నీవేడ ? ♦ దహననేత్రుఁ, డేడ? యోజింపుమంతరం♦బింగితమున,
క॥ ఏడ సువర్ణసహాయం, బేడ పిశాచానుసరణ ♦ మిందునిభాస్యా !
ఏడజయభేరినిస్వన ?, మేడ గళధ్వని ? యథార్థ ♦ మెఱుఁగుము సుభ్రూ !
చ॥ తరుణిరో ! యొక్కమాట విను ♦ దాఁచక చెప్పెదనింకఁ గామసం
హరునికడన్ ధనంబుగల ♦ దన్న యెడన్ బదిమందిలో దిగం
బరుఁడయి యుండుటెట్టు లోక ♦ వాసగృహం బది యుండెనేనియున్
దిరముగఁ గాటినే తనకు ♦ దీమముసేయుట యెట్లు కోమలీ ! 161
గీ॥ మఱియువినుమొక్కమాటరా♦మాలలామ!, వరగుణగణంబులందెల్ల♦వామదేవు
నందునొకటేనియున్నదా♦యదియెఱింగి,కడఁగుమీ శివుఁబెండ్లాడఁ♦గడిఁదివేడ్క.
గీ॥ లేదు వంగసవుంబన ♦ లేదు విద్య, లేదు సిరియును సారేమి ♦ లేదు చూడు
లేదు తెలివియుఁదేటయు ♦ లేదునెందు, లేదు కొంపయుఁగోడి శూ♦లికికలికిరో!
ఉ॥ ఇంకను నీయెడన్ శివున ♦ కిచ్ఛయె లేకకదా రతీశుమే
నింకఁగఁజేసి నిన్నెడసి ♦ యేగెను వేటొకచోటి కిప్పు డా
వెంకితనంపు వేలుపును ♦ బెండిలియాడినఁ గూడ మేటియౌ
తంకమెగాక సౌఖ్య మెటు ♦ తారసిలున్ హరిరాజమధ్యమా ! 165
ఉ॥ కావున మంచిమాట విను ♦ కాళిక ! రుద్రుని మాని యన్యునిన్
శ్రీవిలసిల్లఁగా మగనిఁ ♦ జేసికొనన్ దలఁపున్ బొనర్పు మీ
నా వచనం బమోఘమని ♦ నచ్చికసేయుము లేకయున్నచో
నీ వెటు లిచ్ఛగించె దటు ♦ లే పశుభర్తను గట్టుకొమ్మిఁకన్. 166
గీ॥ అనిన గిరికన్యకమనంబు♦నందుఁగినుక, నొంది శివదూషణము సేయు♦చున్న విప్రుఁ
జరజురగఁజూచిపల్కెమ♦చ్చరముతోడ,వచ్చెనితఁడెవ్వఁడోయిందు♦వంచకుండు,

—* పార్వతి శివాక్షేపములకు సమాధానంబులు సెప్పుట *—

ఉ॥ మోసముతోడ నాదుతప ♦ మున్ జెఱుపన్ జనుదెంచినట్టి నీ
వేసము దెల్లమాయె నిఁక ♦ వెంగలిపల్కులు పల్కఁబోకు నీ
వాసకలేశ్వరున్ దెలియు ♦ నంతటివాడవె ? విన్ము చెప్పెదన్
వాసిగ శైవతత్త్వము నె ♦ బాసని విజ్ఞులు మెచ్చునట్లుగన్. 168

గీ॥ నిర్గుణంబగు బ్రహ్మంబు ♦ నియత మిట్లు, కారణాంతరమున గుణ ♦ కలన మొందె
నట్టి పరమాత్మ కెట్టుల ♦ నుట్టిపడును, జాతిగరిమం బిఁకను సువి ♦ చారదూర !

సీ॥ నిశ్వాసమున మొదల్ ♦ నిగమముల్ ♦ పుట్టించి, హరినిఁబుట్టించియ ♦ వ్యాపియొసంగె
సృష్టిశక్తినొసంగి ♦ సృజనాధికారంబుఁ, గమలజన్మునకిచ్చెఁ ♦ గరుణ యెసఁగ
స్వర్గరాజ్యముతోడ ♦ సర్వలోకాధిప, త్యము నిచ్చె నాపురం ♦ దరున కెలమి
నవనిధానములు కి ♦ న్నరనాథున కొసంగి, భక్తజనాగ్రియ ♦ పట్ట మిచ్చె

గీ॥ ఇట్టిశివునకు విద్యయు ♦ హృద్యతరవి, వేకమును బ్రాభవంబును ♦ విభవబుద్ధి
లేదనుచుఁ జెప్ప నీదగు ♦ వాదమునకు, మొఱకులారసి మెత్తురే ♦ పుడమిలోన. 170

సీ॥ ఎవ్వనివాకిట ♦ నెలమిఁ గాపురముండు, సిద్ధ్యష్టకంబు వా ♦ సిక్ జెలంగి
ఎవని శిరోంఘ్రుల ♦ నీక్షింపలేరైరి, పద్మజన్ముండు న ♦ ప్పద్మనయనుఁ
డెవ్వనిపూజనం ♦ బింపుమై నొనరింప, సర్వార్థసిద్ధులు ♦ సంతరించు
నెవ్వని నొల్లని ♦ హీనుండు సప్తజ, న్మదరిద్రతక్ జెందు ♦ మదము డింద

గీ॥ నెవనిగాత్రంబునందు ర ♦ హించు పేర్మిత, భూతిలేశంబు గీర్వాణ ♦ ముఖ్యులెపుడు
తలలఁదాల్పఁగ నాసింత్రు ♦ దండినిష్ఠ, నట్టి పరమేశుఁ దెలియ నీ ♦ కలవియగునె.

గీ॥ నీ వనినయట్లొకప్పుడు ♦ నీలగళుఁడు, దానమంగళచేష్టుఁడై ♦ తనరియున్న
దఖిలి తననామధేయంబుఁ ♦ దలఁచువారి, కెల్ల సౌఖ్యంబులను నిచ్చు ♦ హెచ్చుగాను

గీ॥ ఐన నొకమాట వినుము శ ♦ తాత్మ! శివుఁడు
లేమితో భోగముల నొంద ♦ లేకయుండె
నా ? యటులఁగాక వైరాగ్య ♦ మాత్మనొంది
భోగముల మానెనా ? తలం ♦ పుము మనమున.

ఆ॥ ఇల్లు వెండికొండ ♦ విల్లు బంగరుకొండ, రతనములకు నిధి శ ♦ రధియెఱుంగు
సిరికితేఁడు మేల్మి సిరులకంతకుతేఁడు, కొలుతురెవని వానిఁ ♦ దెలియలేవు. 174

సీ॥ గంగామహానదీ ♦ కాండంబు మెచ్చునే, జలదారి యడుసొందు ♦ సైరిభంబు
అమలమాణిక్యచ ♦ యముల హర్షించునే, నత్తగుల్లల నోట ♦ నములుకొంగ
కమలమరందసా ♦ రమున కాసించునే, బురదనుగ్రోలు ద ♦ ర్దుర మదెందు
అచ్ఛముక్తాఫల ♦ హారంబు వడయునే, జొన్నకంకుల కేగు ♦ చున్నకాకి

గీ॥ అఖిలదేవాధినాథుఁడై ♦ నిఖిలవేద, సన్నుతుండగు శివునిభా ♦ స్వరచరిత్ర
మరసిమెచ్చఁగఁజాలదే ♦ యజ్ఞహృదయ!, పొమ్ము నీతోడ నాకిఁకఁ ♦ బోరు వలదు.

ఉ॥ భూతసహాయుఁ డంటివిఁకఁ ♦ బొల్పుగ విన్ము మహేంద్రముఖ్యులా
భూతశరణ్యుఁ గొల్వఁ జన ♦ భూతము లేపున వేల్పుపెద్దలక్

గీ॥ మణినిధానంబెడసి లోహ♦మయరజంబుఁ, జెందియానంద మొందెడు♦చందమునను
లోకపాలకులగు నల్ల ♦ పాకశాస, నాదులను బాసి కామసం♦హారు వలచుట.
సీ॥ కస్తూరికారజః ♦ కలితచందనగంధ, మేడ? చితాభస్మ ♦ మేడ? బాల!
రమణీయవల్లకీ ♦ విమలరాగగ్రామ, మేడ? శంఖధ్వాన ♦ మేడ ? రామ!
లలితకాంచనమృదు♦లదుకూలసంచయం, బేడ? గజాజినం ♦ బేడ ? కాంత!
రంగన్మనోజ్ఞ మృ ♦ దంగసంగతనాద, మేడ ? డమరుఘోష ♦ మేడ ? రమణి!
గీ॥ వజ్రవైడూర్య భూషణా♦వళుల వేడ?, ఘనకరాళభుజంగసం♦ఘంబు లేడ ?
తామరసనేత్ర! నీవేడ ? ♦ దహననేత్రుఁ, డేడ? యోజింపుమంతరం♦బింగితమున,
క॥ ఏడ సువర్ణసహాయం, బేడ పిశాచానుసరణ ♦ మిందునిభాస్యా!
ఏడజయభేరినిస్వన ?, మేడ గళధ్వని ? యథార్థ ♦ మెఱుఁగుము సుభ్రూ!
చ॥ తరుణిరో! యొక్కమాట విను ♦ దాఁచక చెప్పెదనింకఁ గామసం
హరునికడన్ ధనంబుగల ♦ దన్న యెడన్ బదిమందిలో దిగం
బరుఁడయి యుండునెట్టు లోక ♦ వాసగృహం బది యుండెనేనియున్
దిరముగఁ గాటినే తనకు ♦ దీమము సేయుట యెట్లు కోమలీ! 161
గీ॥ మఱియువిను యొక్కమాట రా♦మాలలామ!, వరగుణగణంబులందెల్ల ♦ వామదేవు
నందునొకటేనియున్న దా♦యది యెఱింగి, కడఁగుమీ శివుఁబెండ్లాడఁ♦గడఁది వేడ్క.
గీ॥ లేదు వంగసపుంబస ♦ లేదు విద్దె, లేదు సిరియును సౌరేమి ♦ లేదు చూడు
లేదు తెలివియుఁదేటయు ♦ లేదు నెందు, లేదు కొంపయుఁగోడి శూ♦లికికలికిరో!
ఉ॥ ఇంకను నీయెడన్ శివున ♦ కిచ్చయె లేకకదా రతీశుమే
నింకఁగఁజేసి నిన్నెడసి ♦ యేగెను వేఱొకచోటి కిప్పుడా
పెంకెతనంపు వేలుపును ♦ బెండిలియాడినఁ గూడ మేటియా
తంకమొగాక సౌఖ్య మెటు ♦ తారసిలున్ హరిరాజమధ్యమా! 165
ఉ॥ కావున మంచిమాట విను ♦ కాళిక! రుద్రుని మాని యన్యునిన్
శ్రీవిలసిల్లఁగా మగనిఁ ♦ జేసికొనన్ దలఁపున్ బొనర్పు మీ
నా వచనం బమోఘమని ♦ నచ్చికసేయుము లేకయున్నచో
నీ వెటు లిచ్చగించెదటు ♦ లే పశుభర్తను గట్టుకొమ్మిఁకన్. 166
సీ॥ అనిన గిరికన్యకమనంబు♦నందుఁగినుక, నొంది శివదూషణము సేయు♦చున్న విప్రుఁ
జరజరగఁజూచి పల్కె మ♦చ్చరముతోడ, వచ్చెనితఁడెవ్వఁడో యిందు♦వంచకుండు.

—* పార్వతి శివాక్షేపములకు సమాధానంబులు సెప్పుట *—

ఉ॥ మోసముతోడ నాదుతప ♦ మున్ జెఱుపన్ జనుదెంచినట్టి నీ
వేసము దెల్లమాయె నిఁక ♦ వెంగలివల్కులు పల్కఁబోకు నీ
వాసకలేశ్వరున్ దెలియ ♦ నంతటివాడవె ? విన్ము చెప్పెదన్
వాసిగ శైవతత్త్వము సె ♦ బాసని విజ్ఞులు మెచ్చునట్లుగన్. 168

గీ॥ నిర్గుణంబగు బ్రహ్మంబు ♦ నియత మిట్లు, కారణాంతరమున గుణ ♦ కలన మొందె
నట్టి పరమాత్మ కెట్టుల ♦ నుట్టిపడును, జాతిగరిమం బికను సువి ♦ చారదూర !

సీ॥ నిశ్వాసమున మొదల్ ♦ నిగమముల్ ♦ పుట్టించి, హరినిఁబుట్టించియ ♦ య్యవియొసంగె
సృష్టిశక్తినొసంగి ♦ సృజనాధికారంబుఁ, గమలజన్మునకిచ్చెఁ ♦ గరుణ యెసఁగ
స్వర్గరాజ్యముతోడ ♦ సర్వలోకాధిప, త్యము నిచ్చె నాపురం ♦ దరున కెలమి
నవనిధానములు కి ♦ న్నరనాథున కొసంగి, భక్తజనాగ్రియ ♦ పట్ట మిచ్చె

గీ॥ ఇట్టిశివునకు విద్యయు ♦ హృద్యతరవి, వేకమును బ్రాభవంబును ♦ విభవబుద్ధి
లేదనుచుఁ జెప్ప నీదగు ♦ వాదమునకు, మొఱకులారసి మెత్తురే ♦ పుడమిలోన. 170

సీ॥ ఎవ్వనివాకిట ♦ నెలమిఁ గాపురముండు, సిద్ధ్యష్టకంబు వా ♦ సిక్ జెలంగి
ఎవని శిరోంఘ్రుల ♦ నీక్షింపలేరైరి, పద్మజన్ముండు న ♦ ప్పద్మనయనుఁ
డెవ్వనిపూజనం ♦ బింపుమై నొనరింప, సర్వార్థసిద్ధులు ♦ సంతరించు
నెవ్వని నొల్లని ♦ హీనుండు సప్తజ, న్మదరిద్రితక్ జెందు ♦ మదము డింద

గీ॥ నెవనిగాత్రంబునందు ర ♦ హించు పేరిత, భూతిలేశంబు గీర్వాణ ♦ ముఖ్యులెపుడు
తలలఁదాల్పఁగ నాసింత్రు ♦ దండినిష్ఠ, నట్టి పరమేశుఁ దెలియ నీ ♦ కలవియగునె.

గీ॥ నీ వనినయట్లొకప్పుడు ♦ నీలగళుఁడు, దానమంగళచేష్టుఁడై ♦ తనరియున్న
దఖిలి తననామధేయంబుఁ ♦ దలఁచువారి, కెల్ల సౌఖ్యంబులను నిచ్చు ♦ హెచ్చుగాను

గీ॥ ఐన నొకమాట వినుము శ ♦ తాత్మ! శివుఁడు
లేమితో భోగముల నొంద ♦ లేకయుండె
నా ? యటులఁగాక వైరాగ్య ♦ మాత్మనొంది
భోగముల మానెనా ? తలం ♦ పుము మనమున.

ఆ॥ ఇల్లు వెండికొండ ♦ విల్లు బంగరుకొండ, రతనములకు నిధి శ ♦ రధి యెఱుంగు
సిరికిఱేఁడు మేల్మి సిరులకంతకుఱేఁడు, కొలుతు రెవని వానిఁ ♦ దెలియలేవు. 174

సీ॥ గంగామహానదీ ♦ కాండంబు మెచ్చునే, జలదారి యడుసొందు ♦ సైరిభంబు
అమలమాణిక్యచ ♦ యముల హర్షించునే, నత్తగుల్లల నోట ♦ నములుకొంగ
కమలమరందసా ♦ రమున కాసించునే, బురదనుగ్రోలు ద ♦ ర్దుర మదెందు
అచ్ఛముక్తాఫల ♦ హారంబు వడయునే, జొన్నకంకుల కేగు ♦ చున్న కాకి

గీ॥ అఖిలదేవాధినాథుఁడై ♦ నిఖిలవేద, సన్నుతుండగు శివునిభా ♦ స్వరచరిత్ర
మరసి మెచ్చఁగఁజాలదే ♦ యజ్ఞహృదయ!, పొమ్ము నీతోడ నాకిఁకఁ ♦ బోరు వలదు.

ఉ॥ భూతసహాయుఁ డంటివికఁ ♦ బొల్పుగవిన్ము మహేంద్రముఖ్యులా
భూతశరణ్యుఁగొల్వఁ జన ♦ భూతము లేపున వేల్పుపెద్దలక్

నీతమెఱుఁగఁగా గదల ♦ నెత్తుల మొత్తుచునుండునప్డు నీ
వాతగువారిదా గరువ ♦ మారసి యెట్లు గణించెదో కదే. 176

క॥ శివనిందను బొనరించిన, యవివేకిన్ జదుపవలయు ♦ నటుదప్పినఁ ద
వ్కావలాడి తిట్టవలె రెం, డివిగాని యెడన్ దొలంగి ♦ యేగఁగవలయున్. 177

ఉ॥ కావున నీవు బాఁపఁడవు ♦ గాన నవధ్యుఁడ విందునుండి పో
మ్మా వెటకేనిఁ గుత్సితమ ♦ తీ! యన నాతఁ డిఁకెద్దియో యనన్
బోవఁగ వేగ నంతఁగని ♦ పోవఁడితండు వితండి చూడు మా
దేవుని దూఱఁబూనెడు న ♦ దే జయ! పోదము వేఱుచోటికిన్. 178

గీ॥ అని రయంబున లేచి హి ♦ మాద్రిపుత్రి, చెలులతో వేఱుచోటికిఁ ♦ జేరఁ దలఁచి
యొక్కయడుగిడఁగా సస్మి♦తోజ్జ్వలాస్యుఁడగుచు శంకరు డాహార్య♦మంతఁ బాసి

—* శివుఁడు సాక్షాత్కరించి పార్వతినిఁ గైలాసంబునకు రమ్మనుట *—

శా॥ బాలేందుస్ఫురితోత్తమాంగరుచితో ♦ భస్మాంగరాగంబుతో
నీలగ్రీవముతో దయామృతఝరీ♦నిష్యందదృక్స్ఫూర్తితో
లీలాలంకృతకోటిపుష్పశరలా ♦ లిత్యోల్లసన్మూర్తితోఁ
బ్రాలేయాచలకన్య కట్టెదుట శం♦భుఁ డ్రాగసంరంభుఁడై. 180

క॥ ప్రత్యక్షమొంది కాళిక, నత్యనురాగమున డాసి ♦ యనియెఁ బ్రియా! నీ
సత్యప్రణయమునకు స, వ్రత్యయతపమునకు ముదము ♦ వడితిన్ గడిఁదిన్. 181

ఉ॥ ఘోరతపోధనార్ఘ్యమునఁ ♦ గోమలి! నన్ గొని తీవు సేవకున్
గూరిమి పేరిమిన్ గొలుతుఁ ♦ గోరినయట్టుల నేఁటినుండి నిన్
సారెకుఁ బెక్కుచిక్కుల ఘ ♦ నంబుగ నొక్కి పరీక్ష చేసితిన్
దీరని చెల్మికల్మి గను♦తింపకు నాయపచారవైఖరుల్. 182

ఉ॥ ఇందుముఖీ! త్రివన్ గొనెద ♦ వేటికి నేటికిఁ దీరె నీశ్రమం
బొందికతోడ నన్నెనసి ♦ యుండవె మున్ను నిరంతరం బిఁకా
చందము డెందమందుఁగొని ♦ సందియమున్ దిగనాడి పేర్మిమై
నిందుననుండి రౌప్యగిరి ♦ కేగఁగ రమ్మిపుడే రయమ్మునన్. 183

క॥ ఏలే యలినీలాలక! ఏలే బాలేందునిటల! ♦ హృద్యతరకలా!
ఏలే యిటుపరుగెత్తుట, ఏలేమల కిట్టిప్రేమ ♦ లెఱుఁగ జగమునన్. 184

క॥ రమ్మా! నావెంబడి భా, రమ్మా ననుఁబ్రోచు టతిభ♦రమ్మా నా నే
రమ్మాతతకరుణాఢ్యా, రమ్మారయ నీదు మనము ♦ రాజీవముఖీ! 185

క॥ సైరింపుము నానేరమి, వారింపుము ఘోరవిరహ♦భారజ్వరమున్
గారింపుము బిడియమును వి, చారింపుము దేవి! పూర్వ♦సౌహార్ద్రములన్. 186

వ. అనినంతఁ బర్వతరాజకుమారియు.

సీ॥ తేఱిచూడఁగరాని ♦ దివ్యతేజమువాని, వలవులనించు రూ♦పంబువాని
ఘనఘనాఘనతుల్య ♦ కంఠనాదమువాని, దలఁపఁజాలనిశక్తిఁ♦దనరువానిఁ
గారుణ్యరసమునఁ ♦ గ్రాలుభావమువాని, నిష్కళంకాత్ముఁడై ♦ నెగడువాని
తనతపఃఫలమయి ♦ తరలివచ్చినవాని, బ్రేమోక్తి నలఁత మా♦న్పించువాని

గీ॥ నఖిలజగదీశ్వరుని మనో♦హరునిఁజూచి, యతులమోహానతనువున♦కాత్మమురిసి
తాపమెల్లనుద్రోచి జో♦తలనొనర్చి, యనియె మందాక్షమందాక్ష♦రాళినిట్లు.

—* పార్వతి శివునితోఁ దలిదండ్రుల నడిగి తన్ను బెండ్లాడు మనుట *—

చ॥ సకల మెఱింగియుంటి సుర♦సత్తమ! దక్షుని జన్నమం దటుల్
వికలతనొంది గాత్రమును ♦ వీడియు దేవత లొక్కతీరు తా
రకపరిభూతులై నను గ ♦ రంబుభజింప నిలింపరక్షకై
యకలుషుఁడైన శైలపతి ♦ యాత్మజనై జనియించితిన్ విభూ! 188

వ. కావున

ఉ॥ నాజనకుణ్ హిమాచలుని ♦ నాజనయిత్రిని మేనకాసతిణ్
యోజనతోడఁ జేరి కడు ♦ యుక్తిగ భిక్షగ నన్ను గోరి వి
భ్రాజితవైభవోత్సవవి♦భాసితలీల వివాహమాడి నణ్
రాజతశైలభూస్థలికి ♦ రాజశిరోమణి! చేర్పు మోర్పునణ్.

శా॥ కన్యాదానముచేసి తత్ఫల మిలణ్ ♦ గాంచున్ గిరీంద్రుండు లో
కన్యాయంబిది గాన నాదు మనవిణ్ ♦ గాఢానుకంపాత్మతో
నన్యంబెంచక యాదరింపుము మదీ♦యంబా తపంబ ద్దనా
మాన్యఖ్యాతి వహించిమించుఁ బుడమిన్ ♦ మారావలేపాపహా! 190

ఉ॥ మున్నల దక్షునింట నను ♦ మోదముతోడ వివాహమాడుచోఁ
బన్నుగ శాస్త్రపద్ధతికి ♦ బద్ధతనొందక పోయితీవు నణ్
గన్నఘనుండు దక్షుఁడును ♦ గల్పవిధాననవగ్రహార్చనం
బు న్నెఱవేర్పకుండె వగఁ ♦ బొందితిఁ జెందితి దేహనాశముణ్. 191

క॥ కావున నిపుడు వివాహ, శ్రీవిధివిహితముగఁ బెండ్లి ♦ చేసికొనుము నణ్
దేవతలకార్యసిద్ధిని, భావించి మనంబునందుఁ ♦ బావనచరితా! 192

చ॥ అనుడు మహేశుఁ డల్లనగి ♦ యార్యకు నిట్లనియెణ్ ప్రియంబునణ్
వినుము వినీలవేణి! పృథి ♦ వీధర శేఖరుఁ జేరి నిన్ను భి
క్షను వరియించి యాచనను ♦ సల్పిన నాతఁ డనల్పకోపుఁడై
మనమున నీసునూని యవ ♦ మానము సేయఁగఁబూను మానినీ! 193

క॥ ఎంత ఘనుండైనను దా, నెంతటి నెఱవాదియైన ♦ నెంతటి చతురుం
డెంతదొరయైన నింతిరో!, నుంతయొకని "దేహి" యనినం ♦ జులకనం జెందుర్.

చ॥ ఇఁకను వివాహరీతి గణి ♦ యించి పరిగ్రహ మొందుమంటి వా
సకలము నీమనోరథవు ♦ చక్కఁగ నేయుఁగుంగాక ధాత్రిపై
యొకటియు నిత్యమై యొసఁగి ♦ యుండునె నశ్యము దృశ్యమెల్ల నూ
రక యనుమాన మొందుదురు ♦ రాజముఖీ! జగమం దకోవిదుల్. 195

వ. వెండియు నిఁక వినుము. నిర్గుణుండును, స్వతంత్రుండును, స్వప్రభాభాసితుండును, నద్వితీయుండును నగు పరబ్రహ్మంబు సర్వకర్త్రియగు ప్రకృతితోఁ గూడి సగుణుండును, నస్వతంత్రుండును, నన్యతేజోభాసితుండును, ననేకరూపుండును నగుచు జగంబున నలరారు. అట్టి ప్రకృతివగు మహామాయవు నీవ! మాయామయంబగు సర్వజగంబు నాత్మనగు నేను గృపామతిఁ ధరియింతు. ఇఁక గ్రహంబులును, దారాకాగణంబులు మున్నగునవి యెవ్వి? ప్రకృతిపురుషులమగు మన యిర్వురచే లోకకల్యాణంబుకొఱకు గుణకార్యభేదంబున నివియన్ని యుత్పాదింపఁబడియె. భక్తరక్షణార్థంబుగదా మన మిరువుర మిట్లు సగుణభావంబు నొందుట. నిర్గుణవయ్యును సర్వవ్యాపారపారీణత్వంబున సగుణవును సూక్ష్మంబైన మూలప్రకృతివయ్యును సత్త్వరజస్తమోమయివియైన మాయవు నీవు. ఇఁక నిర్వికారుండను నిరీహుండనైనను భక్తేచ్ఛాసంపాదిత విగ్రహుండనగు నన్ను సర్వభూతంబుల కాత్మగా నెఱుంగుమనినఁ బార్వతి ప్రణమిల్లి శివున కిట్లనియె.

గీ॥ ప్రకృతినే నాత్మనీవు స ♦ ర్వస్వతంత్రు, లమునునిర్గుణులమును నై ♦ యమరుమనము
భక్తవశ్యులమై గుణ ♦ భావమిట్లు పడసితిమి సత్యమీయది ♦ పరమపురుష!

చ॥ ప్రకృతికి భిన్నమై పరఁగు ♦ వానినిఁగాఁ బరమాత్మగా జగ
న్నికరముఁ బుట్టఁజేయఁదగు ♦ నిత్యపదార్థముగాఁగ నెందునేఁ
వికృతివిహీనుఁగాఁ ద్రిగుణ ♦ వేష్టన మొందని వానిఁ గాఁగ లో
కకృతినిఁ గోరి యాకృతినిఁ ♦ గాంచినవానిగ నిన్నెఱుంగుదుర్. 198

ఉ॥ వినను దేవ! నా మనవి ♦ నారసి తప్పఘటింప కర్మిలిఁ
బూని హిమాచలుఁ సకల ♦ భూధరరాజవరేణ్యుఁ జేరి యిం
పౌనటు లర్థిఁగోరు నను ♦ నద్భుతలీలనొనర్పు కీర్తి నెం
తేనిఁ దనర్పు భూప్రజలు ♦ హెచ్చుగఁ బాడి తరింప నీకతన్. 199

గీ॥ జన్మజన్మమునందును ♦ సతిని నీకు, భక్తను మహాత్మ! వేగ ని ♦ బ్బరవుకృపను
నేను గోరినయట్టుల ♦ నే కడంగి, తీర్పు నా వాంఛితంబును ♦ నేర్పు మెఱయ.

—* శివుం డంగీకరించి కైలాసంబున కేగుట *—

గీ॥ ఇట్లు గిరిపుత్రి యడుగ మ♦హేశ్వరుండు, కాళిహృదయాళుసూక్తుల ♦ గారవించి
కరుణ నట్లె యొనర్చెదఁ♦గాంత! యని త, దీయ విరహార్తుఁడై చేరెఁ♦దిరుగ నెలవు.

క॥ అచ్చటి ప్రమథులకెల్లను, హెచ్చుగ శివుఁ డిచ్చరిత్ర ♦ మెఱిఁగింపఁగ వా
రెచ్చుగ సంతసమొంది మ, హోచ్చతరోత్సవము లవ్వి ♦ డొనరించి రటన్.

—* పార్వతి దీక్షాంతముచేసి తల్లిదండ్రులయొద్దకుఁ బోవుట *—

ఉ॥ అంత మహేశకాంత శ్రమ ♦ మంతయుఁ బాసి హృదంతరంబునన్
సంతసమొంది యగ్నులకుఁ ♦ జక్కఁగఁ బూజలొనర్చి తాను ము
న్నెంతయు వేడ్కనాటిన మ ♦ హీరుహరాజినిఁ బ్రేమఁజూచి దీ
క్షాంతమొనర్చి యాళులు జ ♦ యావిజయల్ మురియంగఁ బొంగుచున్. 203

చ॥ నగరికిఁ జేరఁబోవ గిరి ♦ నాథుఁ డెఱింగి కరంబుపొంగి య
త్యగణితవైభవంబున ని♦జాంగనతోఁ దనయాళితోఁ బ్రథన్
దగు నల పౌరబాంధవవి ♦ తానముతో ద్విజరాజితోఁ బ్రియ
మ్మగ శుభవస్తువుల్ గొని ప్ర ♦ మోదముతో నెదురేగె నత్తఱిన్. 204

క॥ ఏనుఁగులును గుఱ్ఱంబులు, జానగు పల్లకులునున్ ర ♦ చనలన్ సొగసా
మేనాలును నానావిధ, గానంబులు సెలఁగ జనులు ♦ గదలి రెదురుగాన్. 105

క॥ ఆలోపలఁ బట్టణమును, గాళి సమీపించి తనను ♦ గాంచ నెదురుగాఁ
జాలఁ బరుగిడుచుఁ జేరెడు, శైలేంద్రున కతనిసతికి ♦ సాఁగిలి మ్రొక్కెన్.

ఉ॥ వారలు దీవెనల్ సలిపి ♦ వక్షమునందుఁ గుమారిఁ జేర్చి వి
స్తారతరాశ్రుధారఁ గను ♦ దమ్ములరాల్చి కుమారి! వచ్చితే!
శ్రీరహిమీఱుభాగ్యమును ♦ జెందితి మీదినమందు నేఁడె నిన్
గూరిమిఁ గన్నవారలము ♦ గోటి యిఁకేటికి గోత్రవర్ధనీ! 207

చ॥ అని పలుమాఱు కూఁతు వద ♦ నాబ్జము నంటుచు మేరలేని యు
బ్బునుగొని రన్నలున్ ముదముఁ ♦ బొందిరి వారి పురంధ్రులున్ గులాం
గనలును గాఁగిటన్ బడసి ♦ గారవమున్ బొనరించి రెల్లవా
రును గొనియాడిపాడి రమ ♦ రుల్ గురిపించిరి పుష్పవర్షమున్. 208

ఉ॥ భర్మవినిర్మితంబయిన ♦ భాసురరత్నరథంబునందు స
త్కర్మరతైన బ్రాహ్మణులు ♦ కాళిక నెక్కఁగఁజేసి వాద్యముల్
బేర్మిఁ జెలంగఁగా నగర ♦ వీథులఁ బౌరవధూశిరోమణుల్
నిర్మలమౌక్తికాక్షత ల♦నేకముఁ జల్లఁగఁజేర్చి రిక్కకున్. 209

ఉ॥ వందులు పాటగాండ్రు గరు ♦ వంబెసఁగన్ దమ విద్యఁజూపి యా
నందముఁగూర్చి రగ్రికుల ♦ నాయకవర్యులు సామగీతులన్
బొందుగ స్వస్తివాదముల ♦ భోరున సల్పిరి వారికెల్లఁ దా
వందలు వేలొసంగె హిమ ♦ వంతుఁడు రత్నములన్ గ్రమంబుగాన్. 211

ఆ॥ ఎల్లవారి కప్పు ♦ డీరీతి గౌరవం, బెలమిఁజేసి గిరివ ♦ రేశ్వరుండు
సంతసముననున్న ♦ జరిగెఁ గొన్నిదినంబు, లంత నొక్కనాఁ డ ♦ హంబునందు.

గీ॥ మేనకాకాంత సంతస ♦ మూని తనయ, తోడ నందఱుకోడండ్ర♦తోడఁజెలుల
తోడ దాసీసమూహమ్ము♦తోడఁగొలువుఁ,దీర్చికూర్చున్న సమయంబు♦తీరునెఱిఁగి.

—* శివుఁడు భిక్షుకవేషంబుతో మేనాసన్నిధిని నర్తనము సేయుట *—

చ॥ శివుఁడొక భిక్షుకాకృతినిఁ ♦ జేకొని వామకరంబునందు భై
రవరవసాధకంబగు ద ♦ రంబును నింబుగ సవ్యహస్తమం
దవితథనాదమౌ డమరు ♦ వంది ఘనంబుగ మ్రోగఁజేయుచున్
వివిధగతిప్రభేదముల ♦ వింతగ నర్తనమున్ బొనర్చుచున్. 213

ఉ॥ మేనకయున్నయున్నతపు ♦ మేడకుఁ జేరఁగఁబోయి శంఖని
స్వాన మనూనమౌడమరు ♦ వాదనమున్ బొనరించె నాగర
స్త్రీనివహంబుఁ బూరుషులుఁ ♦ జిన్నలు పెద్దలు చేరినిండ వి
ద్యానిపుణత్వమేర్పడఁగఁ ♦ దాండవమున్ బొనరించె మించుగన్. 214

క॥ ఆ గరిమమీఱు నృత్తము, బాగుగఁ గని గిరివరేంద్రు ♦ భామినియును నా
నాగరజనంబులును గడు, నూఁగిరి తన్మయతఁజెంది ♦ యుల్లాసమునన్. 215

ఉ॥ ఆ నటనంబుఁ జూచి తుహి ♦ నాచలపుత్రిక మూర్ఛనొంది మెం
తేని మనంబునన్ నటు మ ♦ హేశ్వరుగా గురుతింప నంత న
బ్జానన కాతఁ డిందుధరుఁ ♦ డై బహుమన్మథసుందరాంగుఁడై
మానితనాగరాజకుల ♦ మండనుఁడై గనుపట్టె నర్తకిన్. 216

చ॥ ఉమ యమితానురాగమున ♦ నోయుడురాజకిరీట ! నన్ను వే
గముగ భవత్సధర్మిణిని ♦ గా సలుపన్ వరమిమ్మనాగ న
ర్తము దనరార శంకరుఁడు ♦ సత్వర మవ్వర మార్యకిచ్చి వి
భ్రమరమణీయతాండవ ము ♦ పార్జితలీల నొనర్చెఁ గ్రమ్మఱన్. 217

ఉ॥ మేనక యంత నర్తకు న♦మేయపు నృత్యముఁజూచి మెచ్చి స
న్మానము సేయఁగాఁగడఁగి ♦ మానకుబంగరుపళ్ళెరంబులోఁ
జానగుముత్యముల్ రవలు ♦ చాలగ్రహించి యొసంగఁ బోవఁగాఁ
దా నవి యొల్లకే మరలఁ ♦ దాండవమాడుచు నుండె వేడుకన్. 218

వ. అంత మేనక యక్కృతకనటునియొల్లఁబాటుఁగాంచి మెప్పుసేయువేడుక నీ వేమి
వాంఛింతు విచ్చెదననుటయు నతం డిట్లనియె. 219

—* మేనకతోఁ గృతకనటుఁడు దనకుఁ బార్వతి నిమ్మనుట *—

క॥ ఒల్లను ముత్యములను నే, నొల్లను గెంపులను రవల ♦ నొల్లను బంగా
రొల్లను గిరిరాజ్ఞీ! యీ, ఫుల్లసరోజాక్షి నీదు ♦ పుత్త్రిక నిమ్మా! 220

క॥ నావుడు నగమూర్ధన్యుని, దేవేరి ప్రభూతరోష ♦ దీప్తేక్షణయై
సీ! వెడఁగ! భిక్షుకుఁడ! యో, రీ! వదరకు మిపుడు పెండ్లి ♦ యేయగు నిచటన్.

క॥ నీవన్నెకు నీ వాసికి, నీ వాలకమునకు మేటి ♦ నీ నీటుకు నీ
పూవుంబోఁడియుఁ గావలె, నా? వింతగు నీదు తలఁపు ♦ నట! శఠహృదయా!

ఆ॥ తివిరి నక్కఱేఁడ ? ♦ దేవలోకంబేడ? , బడుగునటుఁడవేడ ? ♦ బాలయేడ?
ఎంత యంతరంబొ ♦ యెఱుఁగకపోతివి, కనుల వెఱ్ఱి నీకుఁ ♦ గలుగుకతన. 223

ఉ॥ పొమ్మిటనుండి వేగముగఁ ♦ బోవక యున్నను నిన్ను బంట్లు బె
త్తమ్ములతోడ బాదుదురు ♦ తద్దయుఁ గీడొనరింతురన్న లే
శమ్ము వెఱన్ నటించుచును ♦ జక్కఁగ నృత్తము సేయుచుండఁగా
నమ్మనుజూచి యార్య నను ♦ నాతని కిమ్మనియెన్ బ్రియమ్మునన్. 224

వ. అంత మేనక యార్యవచనంబుల కలుకన్ జెంది మందలింప నాలోకసుందరి
యుడుగక మాటికి నట్లే యర్థించుచుండ నమ్మంగళాంగిన్ బెదరించి గట్టురాణి
యిట్లనియె. 225

గీ॥ వలదు తెలియక యూరక ♦ వదరఁబోకు, కన్పడినయట్టి నట్టువ ♦ కానిఁ దగిలి
పోవఁ జూచెదవా? మంచి ♦ బుద్ధివోడ మె, మంతరంబేమి చేసెనో ♦ మాయకాఁడు.

వ. అనునంత

క॥ ఆలోపల హిమవంతుం, డాలోఁగిలి కరుగుదేర ♦ నప్పాటన్ మే
నాలలితాంగి నగేంద్రున, కాలాగంతయును జెప్ప ♦ నాతం డలుకన్. 227

—* మేనకా హిమవంతులు నటుని శిక్షింపఁబూనుట *—

చ॥ భటులిఁక వీని నావలకుఁ ♦ బంపుఁడనన్ గుమిగూడి వారలా
నటు నదలింప వారికిఁ గ ♦ నద్ఘనతేజుఁ డతండు చిక్కకే
యటునిటుఁ ద్రిప్పుచున్ నిజమ ♦ హాద్భుతలీలల విష్ణురూపుఁడై
కటకకిరీటకుండలని ♦ కామచకాసదమేయమూర్తియై. 228

వ॥ కనఁబడ నాహిమాచలుఁడు ♦ కౌతుకమొప్పఁగఁ గాంచుచుండ న
ర్చనమునఁ దాను శ్రీపతికి ♦ రాణఁదలిర్ప సమర్పణంబు చే
సిన సుమరాజి యష్ఘసుని ♦ శీర్షమునం దగుపట్టఁ జూచి విం
తనుగొని భక్తిభావమును ♦ దాల్చినయంత నె యంత నాతఁడున్. 229

క॥ ఏ దేశ మెటు నివాసము, భూదేవకులావతంస! ♦ పొందుగ నిట మా
కాదేశింపుము నిను గన, శ్రీదయితుం గాంచినట్లు ♦ చిత్తంబలరెన్. 6

మ॥ అన నంతన్ హిమవంతుఁ గాంచి యతఁ డ ♦ త్యంతంబు సంతుష్టుఁడై
యనియెన్ బర్వతరాజ! వైష్ణవుఁడ బ్ర♦హ్మశ్రీకుఁడన్ యోగభా
జనుఁడన్ లోకహితం బొనర్చుటకునై ♦ సర్వప్రదేశంబులం
దును సంచార మొనర్చుచుందుఁ గనుఁగొం ♦ దున్ భూతభవ్యంబులన్. 7

ఉ॥ కూరిమితోడుతన్ గమల ♦ కోమలగాత్రిని నీదుపుత్త్రి నా
నీరజవైరిజూటునకు ♦ నీవిడి పెండ్లి యొనర్తువంచు నే
నారసి నీదు యత్నము ర ♦ యమ్మున మాన్పఁగడంగి వచ్చితిన్
మారవిరోధిదక్క యొక ♦ మంచివరుం డెవఁడేనిఁ జిక్కఁడే? 8

చ॥ నగలను జూచి మెచ్చితో? క ♦ నందగు నందముఁ జూచి మెచ్చితో?
నిగరపుమేటి యన్వయపు ♦ నీటును గన్గొని మెచ్చితో? ప్రియం
బగు నవయౌవనోజ్జ్వలత ♦ నారసి మెచ్చితివో? భువిన్ బ్రజల్
నగ నగరాజరాజ! ప్రియ♦నందన నెట్లు త్రిశూలి కిచ్చెదో? 9

మ॥ కులశీలంబులు లేనివాఁడు ధనమే ♦ కొంతేనియున్ లేనివాఁ
డిలునున్ వాకిలి లేనివాఁడు చదువా ♦ క్కింతేనియున్ రానివాఁ
డలసుం డందముమాలినట్టేఁడు భుజం ♦ గాకల్పుఁ డెంతేనిఁ గ
శ్మలకర్ముండు దిగంబరుండు తగునే ♦ శైలేంద్ర! యీ బాలకున్. 10

మ॥ మతిమంతుండవు వైష్ణవాన్వయశిరో ♦ మాణిక్యభూతుండ వీ
క్షితిభృత్సంతతి కెల్ల శాసకుఁడ వీ ♦ చిన్నారిపొన్నారి మే
నితనూజాతను నా కపాలికిడఁగా ♦ నీకెట్లు వేడ్కయ్యె నీ
మతి యిక్కార్యమునం దవార్యముగఁ దా ♦ ర్మాఱమ్యె భూభృద్వరా! 11

చ॥ నీ వరుసంబునొందినను ♦ నీదగు చుట్టము లెట్టులొప్పి రీ
నీ వధు వీ గుణాయతన ♦ నీతివిచక్షణ మేన యెట్లు దా
నీవిధ మొప్పి మోసవడె? ♦ నీవిఁక వీరికిఁ జెప్పకుండినన్
బావన! యిప్పుడేని నిజ ♦ బంధుల కాలికిఁ జెప్పిచూడుమా! 12

గీ॥ కాలికనుమాత్రిమఱుగకు ♦ కాళిచాల, రుద్రునందుఁ బ్రేమోహంబు ♦ రూఢిఁజెంది
యున్నయది రోగి కేవమా ♦ ఋచితమౌష, ధంబు దీయఁగనగు నప ♦ థ్యాంబుభువిని.

క॥ పరువు ప్రతిష్ఠలు గల యొక, హరువగు మను వెందునేని ♦ యరసి తిరుగ నీ
యిరవునకు వచ్చి తెలిపెద, మరియాదగలట్టి యెడ స ♦ మర్పింపు సుతన్. 14

క॥ అని కుహనాద్విజుఁ డట భో, జన మొనరిచి చనియె నాత్మ ♦ సద్మమునకు నం
తన మేనక హిమవంతున, కనియెను వందురుచు ఘనత ♦ రాశ్రునయనయై. 15

—* వైష్ణవ బోధచే మేనక శివునకుఁ బార్వతి నీయననుట *—

మ॥ వినవయ్యోఁగద నాథ! నేఁడు ఘనుఁడా ♦ విప్రేంద్రుచే రుద్రువ
ర్తనమంతన్ మనమంత పొక్కా నిఁక నో ♦ ర్వఁగ నా సుతఁ బాలనే
తుని కీఁ జాల ధ్రువంబు నీవు వినవేన్ ♦ దుఃఖంబుతో నర్ణవం
బునఁ దూఁకఁగ గలదానఁ గానఁబడియెఁ ♦ బోదుఁ జుమీ యొందునేఁ. 16

గీ॥ కూఁతు కుత్తుక కురిఁబోసి ♦ కూపమందుఁ, గూలుదాన దవాగ్నిలోఁ ♦ గాలుదాన
చచ్చుదాన నిజం బిందు ♦ సందియంబు, లేదు ముమ్మాటి కనృతంబు ♦ లేదు లేదు

క॥ అని క్రమ్ముచున్న దుఃఖ, మ్మున మేనక యపుడు కోప ♦ మును జెంది రయ
మ్మునఁ గోపాలయమునకుఁ, జని పుడమిఁ బరుండె కడిఁది ♦ సంతాపమునన్.

—* శివుఁడు సప్తర్షుల నరుంధతితో నోషధిప్రస్థమున కనుపుట *—

శా॥ ఈలో రౌప్యగిరిన్ మహేశ్వరుఁడు దా ♦ రేచ్ఛాలసచ్చిత్తుఁడై
దా లో సప్తమహర్షులన్ దలఁప స ♦ ద్యస్కాల మవ్వార్మహా
కాలున్ జూడ నరుంధతీసహితులై ♦ కైలాసమున్ జేరి య
క్కాలారిన్ గని మ్రొక్కి యిట్లు నుతులన్ ♦ గావించి రంచన్మతిన్. 19

మ॥ శివ! సర్వామరమౌళి! తోషితసుర ♦ ర్షీ! యస్మదీయంపు భా
గ్యవిశేషంబును గూర్చి చెప్పెదము ప్రా ♦ గ్జన్మంబునన్ సత్తపో
ద్రవిణం బార్జన చేసినారము త్రియిన్ ♦ దథ్యంబుగా నేర్చినా
ము విధిన్ దీర్థములాడినాము సవనం ♦ బుల్ సల్పినా మన్నియున్. 20

గీ॥ వాఙ్మనఃకాయకృతపుణ్య ♦ వైభవంబు, గల దది యశేషమును గూడి ♦ కాలదమన!
నీవు మమ్ముఁ దలంచుట ♦ నివ్వటిల్లె, లేక కల్గునె యిట్లతి ♦ లోకలక్ష్మి. 21

ఉ॥ ఏ నరుఁ డేని గాని నిను ♦ హృన్నలినంబున భక్తివశ్యుఁడై
దాను స్మరించినన్ సకల ♦ తాపము లింకఁగఁ జేసి వాసిగా
నీ నిరవద్యమౌ కృపను ♦ నెక్కొను నందు దయాసముద్ర! నీ
వే నెఱితోడ మమ్ము స్మరి ♦ యించుట యెంతటి భాగ్యమో కదే! 22

సీ॥ జనుషాంధుఁ డచ్చలో ♦ చనము లొందినయట్లు, గీతి బధిరుఁ డాల ♦ కించినట్లు
కుంటివాఁ డొక పెద్ద ♦ కొండ నెక్కినయట్లు, నిరుపేద పెన్నిధిఁ ♦ గనినట్లు
మూఁగ యొక్కఁడు గావ్య ♦ మును బఠించినయట్లు, ఘనరోగి సౌఖ్యంబుఁ ♦ గాంచినట్లు
వామనుఁ డొక వృక్ష ♦ ఫలముఁ గోసినయట్లు, గొడ్రాలు కానుపుఁ ♦ గొనినయట్లు

గీ॥ ఇపుడు నీచేతఁ దలపొంది ♦ యీశ! నీదు, దర్శనం బేము సెందుట ♦ దలఁపరాని
కలిమిఁ జెందితి మెంతో య ♦ కలుషచరిత!, గారవంబొంది నా మెనఁ ♦ గాంచనట్లు.

క॥ తలఁపున దరిసెనమున మా, తలపుల నీడేర్చి తిఁకను ♦ దయతో నీ దా
సుల కొక పని చెప్పి ముదం, బలరించెదె పెచ్చుగా హి ♦ మాంశుకిరీటా! 24

చ॥ అనవుడు మౌనులన్ గని ప్రి ♦ యంబున నిట్లనియెన్ మునుల్ జగం
బునఁ గడుఁబూజ్యులందునను ♦ బూజ్యతముల్ మఱి మీర లిప్పు డేన్
బనివడి మిమ్మిటుల్ దలఁచి ♦ నాఁడ జగత్పరిరక్షణార్థమై
యనువుగ మీర లట్టిపని ♦ నారసి కూర్తురుగాక ప్రీతిమై. 25

ఉ॥ తారకదైత్యుచేత విబు ♦ ధప్రకరంబు జగత్త్రయంబు వి
స్తారతరార్తిఁజెందుడు సు ♦ దర్శనభృన్ముఖలేఖులేకమై
కూరిమితో హిమాచలుని ♦ కూఁతును నాతిగఁ గొన్మటంచు నన్
గోరుట కట్లొడంబడితిఁ ♦ గొంకక వారి తలంకుఁ దీర్పఁగాన్. 26

ఉ॥ భూజలపావకానిలన ♦ భోరవిశీతమయూఖహోతృ వి
భ్రాజితమూర్తులొందుటయుఁ ♦ బాయక యే నుపకారబుద్ధితో
నే జితచిత్తులార! వల ♦ పేమియు లేదటు లిష్ట భూమిభృ
ద్రాజకుమారిఁ గాళికను ♦ దారనుగా వరియింపఁబూనితిన్. 27

వ. ఇఁకను.

శా॥ ప్రాలేయాచలకన్య నాకొఱకద ♦ భ్రంబౌ తపంబొంద నే
నాలావణ్యనిధాన కిచ్చితి వరం ♦ బాత్మేప్సితాకార మా
శైలాధీశునిఁ దత్పురంధ్రినిఁ దనూ ♦ జాదాన మిమ్మంటి నా
లీలన్ జక్క నెఱింగి యిచ్చుటకుఁ జె ♦ ల్మిన్ గాంచి రవ్వారలున్. 28

ఉ॥ అంతన నేను వారి హృద ♦ యంబులకున్ భ్రమఁగూర్చు పొంటె బ
ల్వింతగ నొక్క వైష్ణవుని ♦ వేసముతోడుత వారి డాసి రా
ద్ధాంతమెసంగ నన్గుఱిచి ♦ తద్దయు నిందనొనర్ప నంత వా
రెంతయుఁ జింతనొంది సుత ♦ నిచ్చుట కిచ్చఁ దొలంగి నారొగిన్. 29

గీ॥ అక్కతనమీరలిపుడుహి ♦ మాలయమున,కరిగి నగరాజునకుఁదదీ ♦ యాంగనకును
నచ్చునట్లుగఁ జెప్పి క ♦ న్యక నొసంగ, నీయకొలిపి ఫలాదికం ♦ బిచ్చి రండు. 30

ఉ॥ మేనక కీ యరుంధతి స ♦ మేళపుత్రోవ మృదూక్తిచాతురిన్
మానసమున్ గఱంచి యను ♦ మానముఁ బాయఁగఁ జేయఁగావలెన్
ధీనిధు లీరు భూధరసు ♦ ధీమణికిన్ దగునట్లు చెప్పి యె
ట్లైనియుఁ గార్యమున్ శ్రమ వ ♦ హించి పొసంగఁగఁ జేయఁగావలెన్. 31

క॥ మీ వచనంబు జగంబున, కా వేదవచస్సువోలె ♦ నధికవిధివిధం
బేవాఁడు దాఁటనేరఁడు, పావనతేజోవిభూతి ♦ భాస్వరులార! 32

క॥ మీదే కార్యం బీయది, మీదే భారం బిదెల్ల ♦ మెప్పదలిర్పన్
మీదే ఘటనాచాతురి, మీదే జగమంతఁ గనుఁ డ♦మేయచరిత్రుల్ !

తే॥ అనిన విని మునివరులు లో ♦ కాధినాథు, చేతఁ బడసిన గౌరవ ♦ శ్రీసమృద్ధి
కతులితానందపారవ ♦ శ్యమును జెంది, భక్తితోడుత నిట్లని ♦ పల్కి రపుడు.

శా॥ మేమే ధన్యుల మీజగత్త్రయమునన్ మే ♦ మే మహాభాగ్యల
క్ష్మీమాంగల్యవిరాజమానులము మే ♦ మే పద్మమిత్రేందుసు
త్రామాగ్నిప్రముఖార్హణార్హులము త ♦ థ్యం బీశ ! మేమే తపః
ప్రాముఖ్యంబును గొన్నవారలము నీ ♦ వాల్లభ్యభాగ్యంబునన్. 35

గీ॥ లోకసుఖజనకంబయి ♦ జోక మీఱు, నీమహాకార్యమునకయి ♦ మెలమికలిమిఁ
బంపుచుంటివి మమ్మిందుఁ♦బరమపురుష!, ఇంతకన్నను భాగ్య మిఁ♦కెద్దిగలదు.

క॥ జగములకుఁదండ్రి వీ వా, యగరాజకుమారి తల్లి ♦ యల నెలవలె వృ
ద్ధిగొని కడునెగడు యుక్తం, బగు నీసంబంధ మవని ♦ నమృతాంశుధరా! 37

వ. అని ఋషు లీశ్వరునకు మ్రొక్కి యాకాశమార్గంబున వెడలి యతిత్వరితంబున
హిమగిరిఁ జేరి యందలి పట్టణంబు భాగ్యంబులకు విస్మయంబొందుచుఁ బరస్పరం
బిట్లు చెప్పికొనిరి. 38

—* ఓషధిప్రస్థపుర వర్ణనము *—

సీ॥ చంద్రకాంత స్తంభ ♦ సంభృతోద్దామచా, మీకరానేకహ ♦ ర్మ్యాకులంబు
ఘనతరస్వచ్ఛము ♦ క్తాఫలగుచ్ఛతో, రణమహామణిమయాం ♦ గణగణంబు
బహుదివ్యపాదపా ♦ వాసభాసురవనీ, రమణీయరాజీవి ♦ రాజితంబు
వరచతుర్ద్వారసుం ♦ దరతరాభ్రంకష, వప్రావరణ పరి♦భ్రాజితంబు

గీ॥ శుకపికక్రౌంచకలహంస ♦ నికరమధుర, గానబంధుర వికసిత ♦ కమలకైర
వోత్కరమరందగంధసా ♦ రోజ్జ్వలాంబు, పూరకాసార మద్రిరా♦ట్పురవరంబు.

క॥ అలకాపురంబు విభవం, బల కాలారిపురి శోభ ♦ నమరావతి సొం
పల కాద్రవేయపురమై, చెలువగు భోగవతి కలిమిఁ ♦ జెందు నిది సిరిన్. 40

ఉ॥ భూధరరాజపట్టణపు ♦ పోడిమిఁ గన్గొని మెచ్చివచ్చి వి
ద్యాధరరాజపుత్త్రిలును ♦ దైవతరాజకుమారు లచ్చరల్
సాధుజనుల్ మునుల్ సకల♦చారణవైణికపంక్తి తేంద్రు లే
బాధలు లేకయుండరి సె ♦ బాసనుచున్ రహి నెల్లకాలమున్. 41

క॥ హిమవన్నగరపు సొంపుల, యమరిక యెఱుఁగకయె మున్ను ♦ నమరావతిపై
భ్రమపడి పోదురు మనుజులు, కొమరగు నీనగరు గనినఁ ♦ గోరరు దానిన్.

గీ॥ అనుచు దివినుండి తనదెస ♦ కరుగుదెంచు, సప్తఋషుల నరుంధతీ ♦ సాధ్వి నద్రి
రాజు గన్గొని మిగుల హ♦ర్షంబునొంది, యర్ఘ్యవస్తువులెల్ల నా♦యత్తపఱుప.

గీ॥ మునులు బహుమానపూర్వక♦ముగ నగేంద్రుఁ, డొసఁగినట్టిసపర్యల♦నొందిపీఠ
ముల నధిష్ఠించి శైలరా♦ట్పుంగవునకు, మంగళాశాసనములఁ జేసి♦మఱ బలికిరి,

మ॥ హిమశైలేశ్వరుఁ డాఋషీశ్వరులతో ♦ నింపొప్ప నిచ్చొప్పఁ బ
ల్కె మహామానివతంసులార! దమరీ ♦ లీలన్ మదీయంపుగే
హము నామోదముతోడఁ జేర సఫలం ♦ బయ్యెన్ మదాత్మంబు భా
గ్యముఁగంటిన్ జగమందుఁ బూజ్యపదవిన్ ♦ గైసేసితిన్ వాసిగాన్. 45

గీ॥ పృథ్వి "నభ్యాగతస్స్వయం♦విష్ణు"రనెడు, నుడికిసార్థకముగ మిమ్ముఁ♦బడసినాఁడ
ఘనులకేపని నాయందుఁ♦గలుగకున్న, నేడియేన్ జెప్పి యీదీను♦నేలికొనుఁడు.

## —* సప్తర్షులు పార్వతిని శివున కిమ్మని హిమవంతు నడుగుట *—

వ॥ అనిన మును లిట్లనిరి.

ఉ॥ సర్వజగన్నిదానుఁ డల ♦ శంకరుఁ డాదిమపూరుషుం డిఁకా
సర్వజగచ్ఛ్రయాంబిక తు ♦ షారగిరీంద్ర! భవత్కుమారి యీ
సర్వ మెఱింగి వేగముగ ♦ శర్వున కీ యుమ నిచ్చి పెండిలిన్
నిర్వాహణంబుసేయు మిఁక ♦ నీదగుపుట్టుక సార్థకంబగున్. 47

క॥ లోకగురుండగు శివునకుఁ, బ్రాకటముగఁ గన్నె నిడినఁ ♦ బ్రాలేయధరా!
నీకన్న నధికు లెవ్వరు, వీఁకన్ సర్వగురుపదవి ♦ వెలయుదు విలలో. 48

చ॥ అనుడు గిరీంద్రుఁ డాఋషుల ♦ కంజలిచేసి నమస్కరించి యి
ట్లనియె మహాత్ములార! వినుఁ ♦ డాగ్రహమింతయులేక మున్ను మీ
రనినవిధంబుగా శివున ♦ కార్య నొసంగఁగఁ బూనియుంటి ని
న్న నొకఁడు వైష్ణవుం డలపి ♦ నాకినిఁగూర్చి వచించె నెగ్గులన్. 49

గీ॥ వెగటుగా నతఁ డని చన♦నగడుఁ జెంది,వగ శివామాత తన కూఁతు♦వామదేవు
నకునొసంగననుచుఁగోప♦వికలయగుచు,హరముతోనున్న దేవ రేఖ♦యనినవినదు.

ఉ॥ నిక్కముఁ జెప్పవాఁడ నిఁక ♦ నేనును జ్ఞానవిహీనశేముషిన్
జక్కలతేనిసామియయి ♦ సన్నుతిఁగొన్నను భిక్షుకుండటం
చక్కఱకంఠమూర్తికి మ ♦ దాత్మజ నీఁదలఁపున్ ద్యజించితిన్
బెక్కులిఁకేలయంచు సర ♦ విన్ హరమోహితుఁ డాతఁ డాడఁగన్. 51

చ॥ మననముల నమ్మునుల్ శివుని ♦ మాయకు మెచ్చి యరుంధతిన్ గిరీం
ద్రునిసతిఁ దేర్పఁబంపఁగ న ♦ రుంధతియున్ జని శోకమూర్ఛి తా

త్మను శయనస్థితన్ గుధర♦తల్లజదారను జేరి వేగ ని
ట్లనె మధురోక్తిచాతురి ప్రి ♦ యంబు హితంబును గుంబడింపఁగన్. 52

ఉ॥ మేనక ! సాధ్వి ! లెమ్మిఁకను ♦ మీదగు నిమ్మునకే నరుంధతిన్
మౌనివరుల్ గృపాలు లస ♦ మానులు వచ్చిరనా నరుంధతీ
మానినిసుస్వరోక్తిని స ♦ మంచితవైఖరి నాలకించి య
మ్మేనక దా నరుంధతికి ♦ మేలుగ మ్రొక్కి యనెన్ బ్రియం బిటుల్. 53

ఉ॥ అక్కజ మెంతపుణ్యము మ ♦ హాత్మ ! వశిష్ఠపురంధ్రి ! పేర్మి నీ
విక్కడి కేగుదెంచుట మ ♦ హిన్ జరితార్థతఁగంటిఁ దల్లి ! నే
నిక్క మపత్యయుక్తముగ ♦ నీదగు దాసిని శ్రీసమాన ! యిం
కెక్కుడు ప్రేమతో నుడువు ♦ మేపనియేని మనఃప్రియంబుగన్. 54

గీ॥ అనియరుంధతిఁదోడ్కొని♦యాగిరీంద్రు, రాణివాసము ఋషులాత్మ♦రమణుఁడున్న
యెడకుఁజనుదెంచె నమ్మునుల్♦హితముతోడ,హిమగిరీంద్రునకిట్లని♦రింపుమెఱయ.

ఉ॥ ఓ గిరిరాజవర్య ! సుగు ♦ ణోజ్జ్వల! మా పలు కాలకింపు నీ
బాగును గోరి చెప్పెదము ♦ భర్గుఁడు యోగివరుండు దారసం
యోగముఁ గోరఁడా హరి దు ♦ రుద్ధరతారకపీడితామరో
ద్వేగముఁ బాపఁగోరి శివుఁ ♦ బెండిలియాడుమటంచు వేడుటన్. 56

గీ॥ లోకరక్షణఁ గోరియు ♦ నీకుమారి, కకు నొసంగిన వరమును ♦ గాంచియును శి
వుండు పెండ్లాడఁగోరె వే♦ఱొండుగాదు,భూధరేంద్ర!యసామాన్య♦పుణ్యసాంద్ర!

వ. కావున నీక జాగుమాని నీతనూజాత నాజగదీశ్వరున కిచ్చి ధన్యుండవు గమ్మనిన నమ్మునీంద్రులకు హిమవంతుం డిట్లనియె. 58

—* వైష్ణవబోధచే హిమవంతుడు శివునకుఁ గన్య నీయననుట *—

మ॥ ప్రభుసామగ్రి యొకింత లేదు పుడమిన్ ♦ బ్రాముఖ్యమున్ గొన్న మేల్
విభవంబేదియు లేదు భోగమనినన్ ♦ వేరంబె యాత్మీయబం
ధు భటశ్రేణి వినంగ రాదు యతినా ♦ ఘుండెందు నిర్లిప్తుఁడా
యభవుం డాతని కెట్లు నాతనయ నీ ♦ నాసింతు మౌనీశ్వరుల్ ! 59

చ॥ భయమునఁగాని యేన్ గృపణ ♦ భావముచేతనుగాని యాతత
స్మయమునఁగాని యంచిత వి ♦ చారణ మానియుఁగాని చిన్నిక
న్నియ కనురూపమారయక ♦ నెట్టన నెవ్వనికే నొసఁగినన్
రయమున నాతఁ డొందునిఁక ♦ రౌరవమంచు వచించు శాస్త్రముల్ 60

వ. కావున

క॥ కందర్పారికిఁ గన్నియ, నుం దానముసేయఁబూన♦నుజ్జఁడి ! ఋషిసం
క్రందనులు! వీరల తెఱఁగని, చందము లే దరసి చెప్పఁడు ♦ చదురెదియేన్నిఁ. 61

—✽ వశిష్ఠుఁడు హిమవంతునకు హితము చెప్పుట ✽—

క॥ అనుడు వశిష్ఠుం డిట్లనె, విను శైలేశ్వర! మదుక్తి ♦ విధమును నీకెం
దును హితకరమును సత్యం, బును ధర్మాబాధకంబు ♦ మోదకరంబున్. 62

వ. శైలేంద్రా! వినుము. లౌకిక వైదికకార్యంబులందు వచనంబు త్రివిధంబై పరంగునని శాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. అందసత్యంబును దాత్కాలికసుందరం బును నుత్తరకాలాహితంబును నగు వాక్యంబును మిటారంబొప్ప నమిత్రుండు సెప్పునయ్యది ముప్పుఁగూర్చు. తొలుతఁ జేదుగఁ గన్పడినను బదంపడి మేలం దఁజేయు వచనంబు సాకతంబున హితబంధుజనుం డుపదేశించు. ఇకను వినుట తోడనె యమృతపేయంబుగ నుండునదియును సార్వకాలికసుఖసంపాదకంబును సత్యసారంబును నగు నుడి సర్వోత్తమంబై యెసఁగుఁ గావున నద్దానిని నిర్విశంకముగ నారయుము.

చ॥ వెలుపలి సంపదల్ గనఁడు ♦ విశ్వగురుం డల వామదేవుఁ డు
జ్జ్వలతరతత్త్వయోగఘన ♦ సాగరభూరివిహారధీరుఁడై
యలరుచునుండు నాతనికి ♦ నర్మిలిఁగూర్చునె బాహ్యవైభవం
బులు పదివేలకోట్లయిన ♦ భూధరరాజకులైకభూషణా! 64

చ॥ ఇఁక నొక తేని కేనియుఁ ద ♦ నేమ్యన కేనియుఁ బ్రీతితోడఁ గ
న్యక నొసఁగన్ వరుం డొక ఘ ♦ నంబగుముప్పునఁ గూలినంతఁ గ
న్యకజనకుండు ఘాతుకుఁ డ ♦ నన్ దగియుండు శివుండు నిత్యసౌ
ఖ్యకలితుఁ డాఢ్యుఁ డాశ్రితసు ♦ ఖావహుఁ డారయు ధారుణీధరా! 65

మ॥ ధవదుండెవ్వని కింకరుం డల మరు ♦ త్వంతుం డనంతుండు కాం
చనగర్భుండును జక్రహస్తుఁడు ప్రశ ♦ స్తంబైన నెవ్వాని చూ
పునె యాదర్శముచేసి లోకహిత మె ♦ ప్డున్ జేయు వా రమ్మహా
త్ముని మృత్యుంజయు నెంచితీ వసదుగా ♦ మూఢానుభావంబునన్. 66

ఉ॥ ఎవ్వఁడు రాత్రిలేక పవ ♦ లేదియు లేక యసత్తు సత్తు దా
మెవ్వియు లేక చీఁకటి ర ♦ హించుచునుండఁ జరించు నిత్యుఁడై
యెవ్వనిఁ గొల్చుఁ దానల త్ర ♦ యీతనుఁ డెవ్వఁడొసంగు బోధనం
బవ్విభుఁగా నెఱుంగు మది ♦ నాదిమదేవు శివున్ ధరాధరా! 67

మ॥ ప్రతిజన్మంబున నీశుపత్ని యగు నీ ♦ బాలావతంసంబు పా
ర్వతి యేతజ్జనియందు నట్లెయగు న ♦ ప్పాటిన్ విచారించి నీ

దు తనూజఁగ గిరిరాజ! శంకరుని కెం • తో వేడ్కనిమ్మీవు నీ
మతి యట్లొప్పకయున్న నీ శివ శివుగ • మన్నించి చేరుఁగాజుమీ! 68

క॥ కన్యాదాన ఫలం బిఁక, నన్యగతిఁ గోలుపోక • మఖిలాచలమూ
ర్ధన్యా! మా పలుకు లసా, మాన్యములని యెంచి చేయు•మా! మాపనువుగ.

వ, ఇఁకను.

క॥ అనరణ్యుం డను భూపతి, తనయన్ వరియించినట్టి • తాపసునకుఁ గ
న్య నొసఁగి రాజ్యం బన్వయ, మును దన్నుఁగ గాచికొనియె•మున్నుగిరీంద్రా!

వ. కావున నట్లే జగదీశ్వరునకు లాంఛనదలంపక కూఁతునిచ్చి వివాహంబు చేసి కులంబుఁ
గాచికొని కృతార్థుఁడవు గమ్మనిన నమ్మునివరునకు గట్టులఱేఁ డిట్లనియె. 71

క॥ అనరణ్యుం డన నెవఁడా, యనఘుఁడు దనకూఁతు నెవని • కర్థినొసఁగెనో
మునికులతిలకా! నాకది, విన వేడుక వొడమె వేగ • వినుపింపు మిఁకఁగ. 72

## —• అనరణ్య చరిత్రము •—

వ. అనిన వశిష్ఠుం డిట్లనియె.

గీ॥ ఇంద్రసావర్ణి యనఁ బ్రథ•నెసఁగు మనువు, వంశమందుజనించి పే•ర్వాసిఁగాంచి
నట్టిఁడనరణ్యుఁడనెడు మూ•ర్ధాభిషిక్తుఁ, డీశభక్తుండుగలఁడొకఁ•డీడ్యగుణుఁడు.

ఉ॥ ఇభ్యుఁడు సత్యవర్తనుఁ డ • హీనయశఃపరిభాసమాన సౌ
రభ్యపరంపరాభర ని • రంతరదిఙ్నికరాంతరుండు సౌ
లభ్యముగా శతాధ్వరము • లన్ భృగువంశ్యుఁ బురోధఁజేసి వా
ల్లభ్యమునఁగ బొనర్చె నుతు • లన్ బొనరింపఁగఁ దోడిపార్థివుల్. 74

ఉ॥ ఆ నరపాలమౌళికి గు • ణాన్విత లేవురు భార్య లుండి ర
మ్మానినులందు నూర్గురు కు • మారు లొకర్తుకకూఁతురుఁగ బ్రియం
బౌనటు లుద్భవించిరి ధ • రాధిపుఁ డందఱికన్నఁ గూఁతు న
న్యూనతరానురాగవిభ•వోన్నతిఁ జూచుచునుండు నిచ్చలున్. 75

వ. పద్మ యనుపేరం బరంగు నబ్బాలారత్నంబు శైశవంబుదఱలి యౌవనంబంకురింప.

క॥ సర్వాంగసుందరియు నై, సర్వకలాసముదయ ప్ర • సాధిత యగుచున్
సర్వగుణాస్పద యగుచుఁగ, సర్వజగన్మోహిని యన • జగమున వెలసెన్. 77

గీ॥ అంత నవయౌవనంబున•నలరు నలరుఁ, బోణిఁ దన తనయనుగని•భూపచంద్రుఁ
డెల్లదిశలకుఁ బత్రిక • లింపు మీఱఁ,బనిచె ననురూపవరునిఁ గూ•ర్పన్ దలంచి.

—* పద్మను పిప్పలాదుం డను వృద్ధఋషి మోహించుట *—

మ॥ ఒకనాఁ డా లలితాంగి పద్మ కమనీ ♦ యోద్యన్మహాపద్మషం
డకలాపోజ్జ్వలపుష్పభద్రనదిలో ♦ నర్థి స్నానముఁ జేయువే
డుకతోడన్ బరిచారికాశతముదో ♦ డ్తోవచ్చి తా మజ్జనం
బకలంకాత్మ నొనర్చుచున్నఁ బరమే ♦ ష్ట్యాత్మానుసారంబుగన్. 179

ఉ॥ అండజకేతనాహమిక ♦ కన్నవఁగూర్చిన నా దధీచి పు
త్రుండు మహాతపోనిచయ ♦ దుర్ధరతీవ్రమరీచి పిప్పలా
దుం డను మానితల్లజుఁడు ♦ తోయజగర్భనిభుండు మేటి వృ
ద్ధుం డవగాహనార్థ మటఁ ♦ దోఁచి కనుంగొనె రాచకన్నియన్. 80

ఉ॥ చందురు రేకఁబోలి కడు ♦ జానగు లేనగు మోముతీరుఁ గు
ల్కుం దగి నిక్కి చక్కనగు ♦ గుబ్బచనుంగవ మేల్మెఱుంగు చె
ల్వుం దళుకొందు పెందొడల ♦ పొందికయందము చంద మక్కజం
బుం దమకంబుఁగూర్ప విరి♦బోణినిఁ జూచి మునీంద్రుఁ డార్తుఁడై. 81

వ॥ దాసీప్రముఖులన్ గాంచి యిట్లనియె.

ఉ॥ ఈ రమణీమణీజనకుఁ ♦ డెవ్వఁడు వంగడమెద్ది దీనికిన్
బేరగు నక్షరంబు లెవి ♦ పెండిలియయ్యెనో లేదా యాత్మనె
వ్వారల నేఁ వరించినదొ ♦ వాస్తవమొప్పఁగఁ జెప్పుఁడన్న న
వ్వారలు భీరులై నిజము ♦ పల్కిరి కల్కి తెఱంగు సర్వమున్. 82

క॥ కన్నియ యగుటను నమ్ముని, మిన్నంది నృపాలుఁజేరి ♦ మెప్పొదలిర్పన్
గన్నియ నిమ్మనె నట్టీ, మన్నన్ మిమ్మెల్ల భస్మ♦మొనరింతుననున్. 83

ఉ॥ ఆనుడి విన్నతోడ నక♦టా యని మూర్ఛనుజెంది కుంది య
మ్మానవనాథుఁ డార్తిమెయి ♦ మ్రాన్పడియుండ జనంబులెల్లఁగా
లానలతేజు నమ్మునికు♦లాగ్రణిఁ గన్గొని యుల్కుఁజెంది దీ
నాననులై సభాంగణము ♦ నందు వసించిరి యెట్టకేలకున్. 84

చ॥ ముదిసినయట్టి యిట్టిముని ♦ ముఖ్యున కాత్మజ ధారపోయఁగా
హృదయము దల్లడిల్లు నిఁక ♦ నీయకయుండిన వృద్ధు క్రుద్ధుఁడై
గొదగొని చంపు నిందఱను ♦ ఘోరకృతాంతునికై వడిన్ వడిన్
బొదవిన యిట్టిచిక్కుడిపి ♦ ప్రోచెడువా రెవరుందు రీయెడన్. 85

క॥ అని జనపతి పలవించుడు, జనములు విలపించి రతని ♦ సతులున్ విని మూ
ర్ఛనుగొని వగచిరి దుఃఖం, బున మిగులన్ బొగలి రతని ♦ పుత్త్రికలెల్లన్.

ఉ॥ ఆసమయంబునం దొక మ♦హామహుఁడౌ ఋషివర్యుఁ డా నృపున్
డాసి యిటుల్ వచించెను దృ♦ఢంబుగఁ గన్య పరార్థమేకదా
వాసిగ నేఁడొ రేపొ యొక ♦ వత్సరకాలమునాఁడొ యేనికేన్
నీ సుత నిచ్చివేయు టది ♦ నిక్కము కావున విన్ము నా నుడిన్. 87

చ॥ పురుషవరేణ్యుఁ డుత్తమత♦పోనిధి మానికులాగ్రగణ్యుఁ డీ
యరుదతరతేజుఁ డీతనికి ♦ నుర్విపతీ! సుత నిచ్చి పెండ్లి వే
గిరముగఁ జేయు మట్లయినఁ ♦ గీర్తియుఁ దేజము శ్రీయు నాయువున్
దొరకొను మీకు నెల్లరకు ♦ దొడ్డతనం బిదియెంచు మాత్మలోన్. 88

—* అనరణ్యుఁడు పిప్పలాదమునికిఁ గూఁతు నిచ్చి పెండ్లి సేయుట *—

గీ॥ అనినజననాథుఁడాత్మజ♦నరసియాపె, యిష్టమున్ గాంచితగఁబురో♦హితులహితుల
బందుగులఁగూర్చి పెండ్లిసం♦భారమెల్ల, నాయితము చేసియొక నాఁటి♦యహమునందు

క॥ ఆదరము లేకయే క,న్యాదానము చేసి పెండ్లి ♦ యమరించి వడిన్
గాదిలిసుత నల్లునితో, భూదయితుం డనిపె నపుడు ♦ మునిపల్లియకున్. 90

ఉ॥ తానును నగ్రపుత్రు వసు♦ధాపతిఁ జేసి కొమారు లందఱిన్,
సేనల నేలువారలను ♦ జేసి మహీశుఁడు దుఃఖితాత్ముఁడై
కానకు నేగి యచ్చోటనె ♦ కాపురముండి తపంబు సేయుచున్
సూనశరాంతకున్ గడుఁ ద్రి♦శుద్ధిగఁ గొల్చుచునుండె నిచ్చలున్. 91

గీ॥ పద్మఁబద్మోపమను దన ♦ భార్యగాఁగఁ, బడసి తనయాశ్రమముఁ జేరి♦పరమమౌని
యనతిలంపటుఁడగుచు ని♦త్యంబు విహిత, ధర్మమొనరింపుచుండెను♦ త్తమపుసరణి.

చ॥ జనకుఁ డరణ్యమేగుడు వి♦శాంపతియై తగు కీర్తిమంతుఁడన్
ఘనభుజుఁ డష్ట తండ్రికయి ♦ క్రాఁగి యలందురి యంత భూప్రజన్
దనయుల యట్ల కాచుచు ని♦తాంతము ధర్మపుఁ దప్పకుండ మే
దినిఁ బరిపాలనంబు సుమ♦తిన్ బొనరించుచునుండె నిండుగన్. 93

గీ॥ ఇదియె యనరణ్యచరితము ♦ హిమనగేంద్ర!, పట్టిఁబట్టి యతండు తా♦పసునకిచ్చి
కాచికొనె నన్వవాయము♦క్కరణి నీవు, శివునకీ శివనొసఁగి ర♦క్షింపుకొలము.

గీ॥ అనుడు చలిమలఱేఁ డిట్టు ♦ లనియె మౌని, వర్య! పద్మాశుభాంగి దాఁ♦బలితశీర్షుఁ
బిప్పలాదునిఁ బెండ్లాడి ♦ పేర్మి నెట్లు, కాపురము చేసెనో యెఱుఁ♦గంగఁ దెలుపు.

వ. అనుడు వశిష్ఠుండు వినుమని యిట్లనియె.

క॥ అనరణ్యకన్యయును బతి, ననయంబుఁ ద్రిశుద్ధితోడ ♦ నబ్జాలయ వె
న్నునిబోలె చాల భక్తిన్, గొని సేవలఁ జేయుచుండెఁ ♦ గూరిమి పేర్మిన్. 96

—* ధర్ముడు పద్మాదేవినిఁ బరీక్షించుట *—

మ॥ అరవిందానన తీర్థమాడ నొకనాఁ ♦ డభ్రాపగన్ జేరఁబో
వ రహిన్ ధర్ముఁడు రాజరూపుఁడయి భా ♦ స్వన్మన్మథాకారుఁడై
వరమాలంకృతిగాత్రుఁడై నవవయః ♦ ప్రాగల్భ్యరోచిష్ణుఁడై
వరరత్నోరుశతాంగయుక్తుఁడయి య ♦ బ్బామన్ బరీక్షింపఁగన్. 97

వ. తారసించి యిట్లనియె,

ఉ॥ సుందరి ! యిందిరాసదృశి ♦ సోమునియందపు రాణి రోహిణిన్
విందగు శ్వేతజవ్వనపు ♦ వింతలఁ బంతము లాడుచున్న నీ
యందము చందముల్ గెలిచి ♦ యాఱడిఁ గేరడమాడి మీఱు నిం
దిందిర వేణి! యేలుమిఁక ♦ దీనుని నీ పరిచారకున్ దమిన్. 98

చ॥ కడుముదుసలి కై రుజన్ బడలి ♦ కాటికిఁ గాళ్ళను జాచియున్న న
వ్వెడఁగుమునిన్ దగన్ గొలువ ♦ వేడుక లేమిటనబ్బు నీకు నేఁ
బుడమిదొరన్ రతిప్రియుఁడ ♦ భోగసమర్థుఁడ నర్థినైతి నీ
కెడపక నాకు రాణివయి ♦ యెల్లసుఖంబులఁ గొమ్ము కోమలీ ! 69

మ॥ తను వత్యంతము భంగురం బలఁతి యీ ♦ తారుణ్య మద్దానిలో
ఘనపుణ్యోదయ మిట్టి చక్కఁదన మీ ♦ కాంతారభాగంబులో
వను బ్రేమించి మనోజభోగముల నా ♦ నందోన్నతుల్ మీఱఁగాఁ
దనివిన్ జెంది భవజ్జనిన్ గడిమిమై ♦ ధన్యంబుగాఁ జేయుమా ! 100

మ॥ సొగసుల్ గుల్కెడు కల్కి లెక్కడుగ నా ♦ శుద్ధాంతమందుండి రా
మగువల్ నీ చరణంబు లొత్తుచు నినున్ ♦ మన్నింతు రేప్రొద్దు లి
మ్ముగ నీ యిష్టమువచ్చిన ట్లనిశమున్ ♦ భోగింపుమీ యింపుమైఁ
దగ దీ మౌనినిఁబాసి నన్నెనయుమీ ! ♦ తన్వీశిరోరత్నమా ! 101

క॥ అని మీఱుచున్నతమకం, బున నరదము డిగ్గి వేగఁ ♦ బూఁబోణినిఁ జే
కొన డాయుచున్న దవ్వులఁ, జని యదలిచి యిట్టులనియె ♦ సాధ్వి కినుకతో.

—* పద్మాదేవి కోపించి ధర్మునకు శాపం బిచ్చుట *—

శా॥ దూరంబేగుము దూరమేగుము శఠా ! ♦ దుష్టాత్మ ! రాజాధమా !
చీఱన్ జేసెద నిన్ను ముక్కలుగ నా ♦ శీలాసిచే నన్యకాం
తారక్తుండవు పాపసక్తుఁడవు నా ♦ నాథున్ జగద్వంద్యు తే
జోరింఛోళినిధాను నాడెదవె లో ♦ చ్చుల్ పిప్పలాదున్ ఘనున్. 103

ఆ॥ ఎంత వేత్తలైన ♦ నెంత యుత్తములైన, నెంత ధీరులైన ♦ నెంత శూరు
లైన నెంత వలతు ♦ లైనఁ బరస్త్రీలఁ, జెఱుపఁదలఁచువారు ♦ సెడుదు రెందు,

సుగంధి. ఓరి ! నాదు శాపహేతి ♦ నుక్కడంగి యిష్ట నీ
వే రహిన్ దొలంగి వేషు ♦ యింతు విద్ది నిక్కమా
సారసాప్తుఁ డెంతయేని ♦ శైత్యభావ మొందినన్
వారిజారి వేడిమైన ♦ బాసదప్ప దిద్దిపో. 105

—* ధర్ముఁడు పద్మాదేవి యనుగ్రహంబుఁ గోరుట *—

క॥ అని శాపంబిడ ధర్ముఁడు, విని మనమునఁ గించనొంది ♦ వే తనరూపున్
గొని నిలిచి సంయమీంద్రుని, వనజేక్షణ కిట్టులనియె ♦ వణఁకుచు నంతన్.

ఉ॥ తల్లి ! యనుగ్రహింపఁదగు ♦ ధర్ముఁడ నేను నృపుండఁగాను నీ
యుల్లము నారయంగ నిటు ♦ లుద్యమమూని యెఱింగి మెచ్చితిన్
దల్లులఁబోలె నెందు పర ♦ దారలఁ గన్గొనువాఁడ నేఁడటుల్
జెల్లని చెయ్వుఁబూని యిటు ♦ శిక్షను జెందితి నవ్వరీతిగాన్. 107

ఆ॥ చెడ్డతెరువులోనఁ ♦ జేరి నడచువారి, కెల్ల శాస్తి నొసఁగు ♦ నీశ్వరుండు
మంచిమార్గమందు ♦ సంచరించుచునున్న, వారి కతఁడె యిడఁడె ♦ వైభవముల.

సీ॥ కలిమిలేములను సౌ ♦ ఖ్యముల దుఃఖంబుల, జనమున కెవ్వఁడో ♦ సంగు నెందుఁ
జెలిమియుఁ బగయును ♦ జేకూర్చి శత్రుమి, త్రులఁజేయ నెవఁడు పే ♦ శలుఁడు పుడమి
నీటఁజల్లనను వ ♦ హ్నిన్ వేడిమిన్ బాల, మాధుర్యమెవఁడు నే ♦ మమునఁ గూర్చు
మహదాదికపదార్థ ♦ మండలి హేతువౌ, ప్రకృతి యెవ్వనికి లోఁ ♦ బడి తనర్చు

గీ॥ సర్గరక్షాలయంబుల ♦ సలుపు నెవఁడు, ముగురుమూర్తుల కెవ్వఁడు ♦ మూలమరయ
నట్టిపరమాత్మ శివునకు ♦ నర్థితోడ, వందనమొనర్తు దురితంబు ♦ డిందువడఁగ.

గీ॥ అని మనంబందు ఘనతరం ♦ బైన లజ్జ, యును భయంబును బెనఁగొన ♦ నూరకున్న
ధర్మదేవునిఁ గాంచి యా ♦ తాపసేంద్రు, రాణి యిట్లనె మనమందు ♦ నవ్వొంది.

ఉ॥ నన్ను బరీక్షసేయఁగ మ ♦ నంబున నెంచి మహాత్మ ! నీ విటుల్
చిన్నతనంబు వైఖరినిఁ ♦ జెందుటచేత నెఱుంగలేక నే
బన్నములాడి శాపమును ♦ బల్కితి స్త్రీజనచాపలంబునన్
బున్నెపువేల్పు నీ వగడుఁ ♦ బొందితిఁ జెందితి ధర్మలోపమున్. 111

క॥ నా శాపము వాలివోదా, వేశముతో నంటి నకట ♦ వృషభస్వామీ !
నీశుద్ధతఁ దెలియుదు నా, దేశింతు వ్యవస్థ నిపుడు ♦ దెలియుము దానిన్.

గీ॥ చందురుం డెట్లు క్షయరుజన్ ♦ జెందిపాయు, నట్లె నీవీ తెవులు సెంది ♦ యవలఁ బాయు
మెడపకొక భంగి క్షయమొందె ♦ దేని నీదు, క్షయము సర్గంబునకు నగు ♦ క్షయము నిజము.

గీ॥ కృతయుగమునఁ జతుష్పదా♦కృతినిఁ దనరి, త్రేతఁ జరణత్రయంబున♦ఖ్యాతినొంది
ద్వాపరంబున రెండు ప♦దములఁ గలియు,గమున నొక పాదమున నుండఁ♦గలవు నీవు.

క॥ ఇది విధిచోదితమై యి, ట్లొదవెను బెనువంత దీన ♦ నోరువుఁగొను పో
యెద నేఁ బతిసేవింపఁగ, సదయ! సెలవు నిమ్మనాఁగ ♦ సాధ్వి కతఁడనెన్.

—✱ ధర్ముఁడు పద్మాదేవికి వరంబు లిచ్చుట ✱—

ఉ॥ అమ్మ! శుభంబు లొందుము ర ♦ యమ్మున నీదు విభుండు దివ్యరూ
పమ్మును నూత్నయౌవనము ♦ భాగ్యమునున్ రతిభోగశూరతన్
గమ్మనివల్కుమాధురి న ♦ ఖండతరాయువుఁ గాంచి మేటిసౌ
ఖ్యమ్ములఁ దన్పు నిన్నుఁ జిర ♦ కాలము లాలనముం బొనర్చుచున్. 116

సీ॥ అలమృకండుకుమారు ♦ వలెఁ జిరంజీవియై, ధనదుని వలె మహా♦ధనికుఁ డగుచు
అమరనాథుని పోల్కి ♦ నైశ్వర్యవంతుఁడై, గోవిందుఁ డట్టుల ♦ శైవుఁ డగుచు
కపిలమహాముని ♦ కరణి సిద్ధుండయి, చంద్రునిచాడ్పు హ ♦ ర్షకరుఁ డగుచు
అంగీరసునిభంగి ♦ నతిమతిమంతుఁడై, పరమేష్ఠి పగిదిఁ ద ♦ త్వజ్ఞుఁ డగుచు
గీ॥ నీదు ప్రాణేశ్వరుండిట్లు♦ నెగడు సిరుల, నీవు నిచ్చలు యువతివై ♦ నిరుపమాన
భోగసామ్రాజ్యములనొంది♦పుత్రదశక, మెలమిఁ గనెదు పతివ్రతా♦తిలకమ! యిఁక

చ॥ ఇటుల వరంబు లిచ్చుడు ము ♦ నీంద్రపురంధ్రి కరంబు ప్రీతయై
పటుతరభక్తిభావము వి ♦ భాసిల ధర్మునికిన్ ప్రదక్షిణం
బట నొనరించి మ్రొక్కి తన ♦ యాశ్రమభూమికిఁ బోయె నంత వి
స్ఫుటముగ నాపెఁ గూర్చి బలు ♦ చోటుల నెన్నుచుఁ బోయె ధర్ముఁడున్.

గీ॥ ధర్ముఁ డొసగిన వరమునఁ ♦ దరుణి యైన, విభునితో భోగసుఖముల♦ వెగ్గలముగఁ
దనిసి పదుగురు తనయులఁ♦ గనిముదమునఁ, దనరెఁ బద్మామహాదేవి♦ ధాత్రియందు.

ఉ॥ కావున శైలరాజ! యిఁకఁ ♦ గాళిక నీశున కిమ్ము వంతమున్
బోవిడు మేడురోజులకుఁ ♦ బూర్ణకలానిధి పుత్త్రియుక్తుఁడై
శ్రీవిలసిల్ల రోహిణినిఁ ♦ జెంది వసింపఁగఁ బంచమంబునన్
జీవుఁడు గ్రాల లగ్నపతి ♦ చెల్వుగ లగ్నమునన్ వసింపఁగన్. 120

గీ॥ విను శుభగ్రహదృష్టమై ♦ వెలసి పావ, దృష్టిఁ గన దీముహూర్తంబు♦ దీన మార్గ
మాసమున సోమవారంబు♦ మాపునన్ శి, వను శివునకిచ్చి సల్పువి ♦ వాహ మరసి.

—✱ హిమవంతుఁ డాలోచించి పార్వతిని శివున కిచ్చెదననుట ✱—

వ. అని వశిష్ఠుం డిట్లుపదేశించి మనంబునందు శివుఁ దలంపుచు మిన్నకున్నంత మేనకాకాంతుం డమ్మహాత్ముని వచనంబున కక్కజంబునొంది మైనాకముఖ్య

లగు కుమారకులను సుమేరుప్రముఖులగు నిఖలపర్వతరాజబంధువులను గాంచి యిట్లనియె. 122

ఉ॥ వీఁక వశిష్ఠువాక్యముల ♦ వింటిరికాదె హితంబుగాఁగ మై
నాక ! మహేంద్రభూధర ! క ♦ నద్ఘన వైభవమందరాద్రి ! చా
మీకరగోత్ర ! వింధ్యగిరి! మీ ♦ రలు కార్యమెఱింగి పేర్మిమై
నాకు వచింపుఁ డిప్పుడు మ ♦ నఃప్రియమొంది యొనర్తు నేనటుల్. 123

చ॥ అనవుడుఁ బర్వతేంద్రు లిటు ♦ లాదటఁబల్కిరి దేవకార్య మిం
పొనరఁగఁ గూర్పనే యిటుల ♦ నుద్భవమొందెను గాళి, యందు శ
ర్వునికయి తాఁ దపోవ్రత మ ♦ పూర్వముగా నొనరించి శంకరుణ్
బెనిమిటిఁగా వరంబుఁగొనెఁ ♦ బేరిమి నిద్ది విమర్శనార్హ మే ? 124

క॥ సందియమొందక యిఁక బా, లేందుధరున కిమ్ము వేడ్క ♦ లిగురొత్తఁగ నీ
నందన నని గిరివరు లా, నందంబుగఁ జెప్పిరపుడు ♦ నగరాజునకున్. 125

చ॥ విని హిమవంతుఁ డెంతయును ♦ వేడుకఁజెందె హిమాద్రిజాతయున్
ఘనముగ మానసంబున వి ♦ కాసమునొందె మహర్షు లాత్మలోఁ
గొనిరి ముదంబు మేనకకుఁ ♦ గొందలమాఱ నరుంధతీమన
స్విని ప్రియవాక్చమత్కృతులఁ ♦ జేతముఁ బ్రీతముఁజేసె నెంతయున్. 126

చ॥ మునుల కరుంధతీసతికిఁ ♦ బొందుగ నాథునితోడ మృష్టభో
జనములఁబెట్టి తాఁగుడిచె ♦ శైలకలత్రము శైలనాథుఁ డా
యనఘులకున్ విడెంబులిడి ♦ యంజలిచేసి మహాత్ములార! నా
తనువు మనం బపత్యమును ♦ ధాత్రియు బుద్ధియుఁ జంద్రమౌళివే. 127

క॥ అని తనతనయను నాదర, మున నగల నలంకరించి ♦ భూధరుఁడు వశి
ష్ఠునికడనుంచి యనెన్ శ, ర్వునిసొమ్మిది నిశ్చితంబు ♦ మునివరులారా ! 128

—∗ ఋషులు పార్వతికిఁ బ్రిధానంబుచేసి శివునికడ కేగుట ∗—

వ. అనిన మును లిట్లనిరి.

గీ॥ శంకరుఁడు భిక్షుకుఁడు; దాత ♦ శైలరాజు; , భిక్ష పార్వతి;యిఁకనొండు ♦ పేర్మిగలదె?
ధన్యుఁడవు శైలరాజమూ ♦ ర్ధన్య! నీదు, భాగధేయంబుఁ బేర్కొన ♦ వలనుగాదు.

చ॥ ఎలనము మీఱ నిట్లని ము ♦ నీంద్రులు పార్వతిఁ జేతనంటి పెం
పలరఁగ దీవనల్ సలిపి ♦ రమ్మరొ ! శంకరుఁ బెండ్లియాడు ని
చ్చలు సుఖదాత్రివై తనరు ♦ శర్వున కెప్పు వలక్షపక్షమం
దలి నెలరేకవోలె నిఁకఁ ♦ దన్వి! భవద్గుణరాజి రాజిలున్. 130

క॥ ఆశాసించి యిటుల్ మా, నీశానులు పుష్పఫలము ♦ లిడి రార్యకు శై
లేశునకు వక్కలాకులు, ప్రాశస్త్యముగాఁగ నిడిరి ♦ బరవసమెసఁగన్. 131

గీ॥ అగకులేందు్రిందు మంగళా ♦ యనము గదురఁ
బసపు గుంకుమునున్గొని ♦ పరగఁ దనదు
మీసము లలంకరించెఁ జే ♦ ర్మిన్ ఋషులు వి
వాహ శుభలగ్న మవ్వడే ♦ ర్పఱచి రంత. 132

వ. పరస్పరంబు సంతుష్టులై శుభప్రసంగంబు లాచరించి యున్నంత సప్తఋషులరుంధతీ సహితులై మేనకానగరాజుల వీడ్కొని నిమేషమాత్రంబునఁ గైలాస ద్వారంబుఁజేరి నంది యనుమతినంది మహేశ్వరాస్థానంబుఁజేరి సాష్టాంగంబొరగి మ్రొక్కి యిట్లు వక్కాణించిరి. 133

శా॥ దేవాధీశ ! మహేశ ! భవ్యకరుణా ♦ దివ్యత్సముద్రా ! భవ
త్సేవాసక్తులమైన మానుడుల నెం ♦ తేఁబ్రీతి నాలింపు మే
నావామాతుకిఁ బర్వతేంద్రునకు నా ♦ నాభంగులన్ బోధలన్
గావింపన్ దెలివొంది నీ కుమనిడం ♦ గాఁ జెప్పి రొప్పొందుచున్. 134

గీ॥ నాల్గహమ్ముల కిఁకను ల ♦ గ్నంబు దేవ!
సురలతో నీవు హిమగిరి ♦ కరిగియుండుఁ
బార్వతినిఁ బెండ్లియాడు మ ♦ భంగమోద
మెసఁగఁగఁ గుమారలబ్ధికై ♦ యిచ్చమెఱయ. 135

వ. అనిన విని మహేశ్వరుండు సంతుష్టాంతరంగుండై మునివర్యుల కిట్లనియె. 136

ఆ॥ పెండ్లియనఁగ నేమొ ♦ పేరంటమన నేమొ, నాకుఁ బరిచయంబు ♦ లేకపోయె
నిందుఁ గడఁగి చెప్పఁ ♦ డీ యేమివలయునో, నిగమవాదులార! ♦ నేర్మిపేర్మి.

వ. అనుడు విని మునులు శివుని లౌకికవచనంబుల కలరి నవ్వుచు నిట్లనిరి. 138

క॥ కమలామాధవులను వా, గ్రమణీధాతల శచీపు ♦ రందరుల విభూ !
సుమనోగణముల సన్ముని, సముదయముల నచ్చరలను ♦ సరఁగ బిలువుమీ.

క॥ వారెల్లవచ్చి సత్వము, నేరుపుతో సిద్ధపఱచి ♦ నెయ్యమెసంగన్
గూరుతురు పెండ్లి లోకా, ధార! యిఁకన్ బోయివచ్చె ♦ దము సెలవిమ్మా.

—* హిమవంతుఁడు శివునకుఁ గల్యాణపత్రికఁ బంపుట *—

వ. అని సెలవొంది ఋషు లారంజోతితో నిజధామంబుల కరిగి రంత నట హిమవంతుఁడు పుత్త్రమిత్రబంధు సపరివారసామంతయుతుండై గర్గుండను స్వపురోహితుని తోడ లగ్నపత్రికను లిఖింపఁజేసి మహేశ్వరునకుఁ బుత్తెంచినఁ బరమేశ్వరుఁ

దతిప్రీతుండై యద్దానిఁ బుచ్చికొని తెచ్చినవారలకు దుకూలాంబరమణిమయాభరణంబుల యథోచితంబుగ నిచ్చి యనిపిన నవ్వారు సంతుష్టులై మరల హిమవంతుఁ జేరి మహేశార్పితబహుమానంబులఁ గాన్పింపుడు హిమవంతుఁ డత్యంతసంతోషితస్వాంతుండై పరిజనంబులకు వివాహసామగ్రిన్ గూర్ప నాదేశించిన నవ్వారలు. 141

—* హిమవత్పరిజనులు పెండ్లిసామగ్రినిఁ గూర్చుట *—

సీ॥ బియ్యంబుగోదుమల్ ♦ పెసలు కందులుమినుమ్ము, లలచందలును సెన ♦ గలునుగొండ
లంతేసి కూరిచి ♦ యందుఁ బెసల్ మొద, ల్గలవాని పప్పులు ♦ గాఁగ విసిరి
యెల్ల ధాన్యపుఁబిండ్లు ♦ నెసఁగించి నువ్వులా, వాలు మెంతులు మిరి ♦ యాలుజీల
కఱ్ఱ యిమ్ములు నుప్పు ♦ కప్పురపుంగట్లు, చింతపండు గుడంబు ♦ చెఱువులగమి

గీ॥ తేనెచక్కెర హైయంగ ♦ వీనములయు, నేఱులును నాల పాల్ పెర్గు ♦ నేర్లునూనె
బావులును నేతినూతులు ♦ పసపుగుట్ట, లటుకు లింగువ సొంటియిం ♦ డ్లమరఁగూర్చి.

గీ॥ మఱియుఁ గజ్జూరపండ్లు గో ♦ బ్బెరయుఁ దమల
పాకుఁదోటలు పోకల ♦ మ్రాకులును ల
వంగములు జాజికాయ ల ♦ వ్వానిపత్తి
రియును నేలకికాయల్ వే ♦ లయు నిరవులు. 143

గీ॥ గసగసాల్ ధనియాల్ కల ♦ కండ ద్రాక్ష, పండ్లునుఁ జీడిమామిడి ♦ పప్పు చార
పప్పు కుంకుమపూవు జ ♦ వాది పునుఁగు, కుంకుమును జందురముగల ♦ కొట్లబారు.

గీ॥ అగరు బుక్కాగులాలును ♦ నత్తరువును, గోరజము కస్తురియును బ ♦ న్నీరుఁ బచ్చ
కప్పురంబు గచోరముల్ ♦ కమ్మధూప, పుంబొడులు పున్గుపత్తులు ♦ పొలుచుగదులు

ఉ॥ బంగరుపళ్ళెరంబులును ♦ బంగరు తామరపాకులున్ మఱిన్
బంగరరంటియాకులును ♦ బంగరుగిన్నెలు పైఁడిదొన్నెలుఁ
బంగరుపంచపాత్రములు ♦ బంగరుచెంబులు పైఁడిబిందెలున్
బంగరు వీటిపేటులును ♦ బంగరుటుద్ధరణుల్ సమృద్ధిగాఁ. 146

గీ॥ పైఁడిపన్నీరుబుడ్లును ♦ పైఁడిచంద, నంబు గిండ్లును బైఁడిక ♦ ప్రంబు గిండ్లు
పైఁడియత్తరుబరణులు ♦ పైఁడియగరు, వత్తులమరించుపాత్రము ♦ ల్వారుసమీఱ.

చ॥ వలిపపుఁబట్టుపుట్టములు ♦ వన్నెల వన్నెల మించు పావడల్
జిలిబిలిజాళువా సరిగ ♦ చీరలు బంగరుపట్టురైకలున్
జెలువపుఁ బట్టుదోవతులుఁ ♦ జిత్రవిచిత్రపుఁ బైఁడికండువాల్
జలతరుపట్టుసేలువులు ♦ సొరగురాజ్యవచేలము ల్గదున్. 148

మ॥ మణిహారంబులు వజ్రపుంగడియముల్ ♦ మాణిక్యతాటంకముల్
గణనీయామలతారహారములు ము ♦ క్తారత్నకేయూరముల్
క్వణదుద్యన్మణినూపురంబులును భా ♦ స్వద్రత్నకాంచుల్ శిరో
మణులున్ గాంచనయజ్ఞసూత్రములు శుం ♦ భత్పద్మరాగోర్మికల్. 149

క॥ నవధాన్యంబులు లాజలు, నవరత్నంబులును దర్భ ♦ నవతంతులునున్
నవపంచపల్లవంబులు, నవకల్పసుమములు దగు గో ♦ నబుఁ బుట్టికలున్.

చ॥ అరిసెలు చక్కిలంబులును ♦ నప్పడముల్ వడియంబు లింపుమీ
ర్గరిజెలు లడ్డువంబులును ♦ గమ్మనిరొట్టెలపూపముల్ చవుల్
హొరయు జిలేబులున్ మణుగు ♦ పూవులు సేవెలు నాసవంబులున్
బరిపరియూరుఁగాయలును ♦ బానకముల్ పలుతీరు లొప్పఁగాన్. 151

వ. మఱియు ననేకప్రకారంబులైన వస్తుప్రకరంబుల నాయితంబుచేసి యమరిక మెఱయనుంచి రంత గోత్రపురంధ్రు లొక్కశుభముహూర్తంబున బారసువాసినీజనంబులున్ గూడికొని పార్వతికి మంగళాలంకారంబుఁ జేయందొడంగి తా మమూల్యదివ్యాంబరహరిద్రాచందనకుసుమాభరణాలంకృతలై

—* సువాసినులు పార్వతినిఁ బెండ్లికూఁతును జేయుట *—

గీ॥ మంగళస్నాన మాజగ ♦ న్మంగళాంగి, కనువుగాఁగూర్చి తడియొత్తి ♦ యందమైన
జలతరీజిల్గుఁబట్టువ ♦ ల్వలను గట్టి, నుదుటఁ గల్యాణతిలకంబు ♦ గుదురుపఱిచి.

గీ॥ పునుఁగునెత్తావికలపంబుఁ ♦ బూసి యఱుతఁ, గైశ్యమున హరిచందన ♦ కల్పపుష్ప
దామములఁగూర్చి మణిమయో ♦ దారభూషణములఁ గైసేసిరుత్సవం ♦ బమరనపుడు.

క॥ గిరిరాజేంద్రుఁడు కౌతుక, మరుదొప్పఁగ బంధుమిత్రు ♦ లందఱినిఁ దగన్
వరుసగఁ బిలువఁగ నంతనె, బిరబిర వార్వచ్చి రపుడు ♦ పెంపుదలిర్పన్. 155

క॥ ఘనవిభవ మొప్పఁ గాంతా, జనములతోఁ బుత్త్రమిత్ర ♦ జనములతో వా
హనములతోఁ బరిచారక, జనములతో వచ్చి రపుడు ♦ శైలకులజనుల్. 156

ఉ॥ శ్రీచెలువొందురత్నములు ♦ చెన్నెసలారెడు నాణిముత్యముల్
పూఁచిన పైఁడితామరల ♦ పూర్వమణుల్ పవడంబుతీవెలున్
రోచనమున్ మృగీమదము ♦ రుక్మముఁ గానుకలఁ దెచ్చి రప్డు కాం
చాచలకాంచనాచలగ ♦ జాచలవింధ్యమహాచలేశ్వరుల్. 157

మ॥ మఱియున్ మందరచందనాయతనరా ♦ మత్క్ష్మాధరంబుల్ రహిన్
గరవీరాద్రియు దర్దురాద్రియును శ్రీ ♦ కాలంజరాహార్యముల్
బిరుదొప్పారెడు పారియాత్రగిరి యా ♦ వృద్ధాచలంబున్ రమా
కరమా వేంకటశైలరాజమును వే ♦ డ్కన్ వచ్చె నత్యున్నతిన్. 158

గీ॥ ఇట్టి త్రికూటామ్రికూటమ • హేమాద్రికూట, గంధమాదనమాల్యవ • ద్గ్రావవరులు
బ్రహ్మపుత్రి సరస్వతీ • బాహుదా శ, రావతీ సింధు శోణభ • ద్రాది నదులును.

క॥ గంగయు యమునయు నర్మద,యుం గోదావరియుఁ గృష్ణ•యును భీమయు నున్
బొంగెసఁగఁ దుంగభద్రియు,నుం గావేరియును సరయు•నున్ బ్రియమొప్పన్.

వ. ఇట్ల నేకంబులగు గిరి నదీనదంబు లుమామహేశ్వరుల యుద్వాహంబని మహో
త్సాహంబున ననేక రత్నోపాయనంబులఁ గొని నిజానుచరసముదయంబులతోడ
నోషధిప్రస్థంబునకు విచ్చేయ నప్పుడప్పురంబు బహుజనాకీర్ణంబును రమణీయ
కేతుధ్వజవిరాజితానేకశృంగాటకప్రకరకాయమాన పరిభ్రాజితంబును జతురం
గబలవిలసద్రజోవితానాచ్ఛాదితార్కమండలంబును నై పరంగె నంత హిమవం
తుం డరుదెంచినట్టి బంధుమిత్రసామంతాభ్యాగతజనంబున కెల్ల నెదురేగి యు
చితరీతి సన్మానించి కాంచనసౌధంబుల నివసింపఁజేసి వివిధోపచారంబులఁ బరి
తోషంబు సేయుచు స్వపురోహితుండగు గర్గునియనుమతిన్ గల్యాణమంటప
నిర్మాణంబునకై విశ్వకర్మను బిలిచి సెలవొసగ నతండు. 161

—* కల్యాణమంటప నిర్మాణము *—

క॥ పదివేల యోజనంబులు, చదరము గల్గినసమస్థ • లమునందుఁ బసం
దొదవఁగ వివాహమందిర, మొదవించెను గనకమణిగ•ణోల్లసితమునన్.

వ. అందు

శా॥ ప్రాకారంబులు ద్వారముల్ గుసుమితా•రామంబు లచ్ఛాంబునా
ళీకోద్భాసితటాకరాజములు కే•ళీకుంజపుంజంబులున్
కేకిస్థానములున్ విచిత్రగృహముల్ • క్రీడాద్రిసంభారముల్
పాకాగారము లారగింపుఁజవికెల్ • భాండారగేహంబులున్ 163

శా॥ నానావర్ణకుశేశయప్రకరకాం • తక్రౌంచకాదంబని
స్స్వానానూనసరోవరంబులును దీ • వ్యద్భర్మహర్మ్యంబులున్
గానాగారము లైందవాశ్మమయరం•గచ్ఛంద్రశాలల్ గడున్
జానౌపచ్చల తిన్నెలున్ ఘనమణి• స్తంభాంగణంబుల్ రహిన్ 164

మ॥ జలయంత్రంబులు నీళ్ళనాడుగదు లా • స్థానంబు లంతఃపురం
బులుఁ బూజాయతనంబులున్ మణిమయా • భోగప్రపాశాలలు
జ్జ్వలరత్నాతతశాతకుంభమయమం • చప్రాంచితాగారముల్
లలితార్కాయితరత్నదీపవితతుల్ • రంగత్తటిజ్జ్యోతులున్. 165

క॥ బంగారు మేల్మి మేనా,లుం గనకపుటందలంబు•లున్ బలుతీర్లన్
రంగారు రవల తేరులుఁ, బొంగగు ముత్యాలసరుల • పుష్పకవితతుల్. 166

గీ॥ వాపికాభాససుస్థల ♦ భాగములును, సుస్థలాభాసవాపికా♦స్తోమములును
చరతతిన్ బురుడించు న♦చరచయం బ, చరములన్ గ్రేణిచేసెడు♦చరవితతులు

వ. మఱియును.

ఉ॥ కల్పితపర్వతంబులును ♦ గల్పితనిర్ఘరిణీవతంసముల్
కల్పితసింహముల్ మఱియుఁ ♦ గల్పితమత్తకరీంద్రయూథముల్
కల్పితగోకులంబులును ♦ గల్పితసాదితురంగసంఘముల్
కల్పితహంసపంక్తులును ♦ గల్పితవీరభటు ల్దలిర్పఁగాన్. 168

శా॥ క్షీరోదంబున జాతమాత్ర యగు ల♦క్ష్మీదేవి కైరావతం
బారాజీవసరంబు నిచ్చుపగిదిన్ ♦ హైరణ్యలక్ష్మిన్ మహా
శ్రీరంజిల్లఁగ స్వర్ణపద్మసరహ ♦ స్త్రిశ్రేష్ఠమున్ దద్గృహ
ద్వారంబందున నిల్పె శిల్పరచనా ♦ దాక్ష్యంబు పేరొందఁగాన్. 169

క॥ మఱియొక్క ద్వారసీమను, నరుదుగ రాజతపునంది ♦ నమరిచి నెఱిగా
నిఱుగెలఁకుల సితచామర, ధరముల రాజతగజములఁ ♦ దనరఁగ నిలిపెన్.

ఉ॥ ఇమ్ముగ లోకపాలకుల ♦ నెల్లర మౌనుల నెల్లరన్ స్వగే
హమ్ములతోడ నాత్మదయి ♦ తాత్మజవాహనసైనికాప్తబృం
దమ్ములతోడ నొక్కయెడ ♦ దారుమయంబులఁ జేసి నిల్పె మో
హమ్మునుజెంది ప్రేక్షకు ల ♦ హా! యని మాటికి మెచ్చునట్లుగాన్. 171

చ॥ ఒకయెడ హేమపద్మమున ♦ నొప్పుగ ధాతను బల్కుకల్కి హం
సకులవతంసమున్ నిగమ ♦ సంచయమున్ సనకాదియోగిరా
ణ్నికరము నారదాదికము♦నిప్రకరంబును సిద్ధసంఘమున్
రకముగసల్పి నిల్పెను గ ♦ రంబు ప్రమోదమునొంద నాగరుల్. 172

చ॥ చిలువలతేని సెజ్జపయి ♦ శ్రీసతి పాదము లొత్తుచుండఁగా
నలువయు నాభిపుష్కరము ♦ నన్ శ్రుతిగానము సేయుచుండఁగాఁ
బులుఁగులఱేఁడు ఱెక్కగవఁ ♦ బొందుగ వీవన వేయుచుండఁగా
నల హరినిన్ రచించి కడు ♦ నందముగా నమరించె నొక్కెడన్. 173

ఉ॥ శ్రీ వెలయంగ వాసవుఁ డ ♦ శేషమరున్నివహంబుఁ గొల్వనై
రావణగంధసింధురము ♦ రాణదలిర్పఁగ నెక్కి యప్సర
స్త్రీవితతేష్ట నృత్తములఁ ♦ జెల్వుగఁ గాంచెడునట్లు నొక్క శో
భావహమౌ స్థలంబున బ ♦ ళా! యనఁ గూరిచియుంచె నేర్పునన్, 174

ఆ॥ ఇట్లు దివ్యరాజి ♦ నెల్లను గడుఁ జిత్ర, ముగ రచించి వేగ ♦ ముగ వివాహ
మునకువచ్చు వేలు ♦ పులకును మునులకుఁ, దక్కువారికెల్లఁ ♦ దగినయట్లు.

గీ॥ వేఱువేఱుగ మంచిని ♦ వేశనములఁ
పూర్వఁదలకొని వారికి వై ♦ కుంఠపురముఁ
గమలభవునకు సత్యలో ♦ కంబు హరిహ
యునకు నాకంబు నిర్మించి ♦ యుంచెనచట. 176

ఉ॥ తక్కిన లోకపాలురకుఁ ♦ దాపసవర్యులకెల్ల వారివా
రిక్కలవంటి సద్మముల ♦ హెచ్చుగ నేర్పడఁజేసి వానిలో
నొక్కటి దక్కులేదనఁగ ♦ నుండెడునట్లు సమస్తవస్తువుల్
జక్కఁగఁగూర్చి చేర్చెహిమ♦శైలవతంసుఁడు బాగుబాగనన్. 177

ఉ॥ పుష్పితవృక్షముల్ ఫలిత ♦ భూజములున్ నవరత్నవేదికల్
పౌష్పరసాభిషేకహిమ ♦ భానుశిలాంగణమండలంబు వా
స్తోష్పతివాటికావిభవ ♦ దూషకనిష్కుటకోటియున్ రహిన్
గీష్పతిముఖ్యకోవిదు లొ ♦ గిన్ బాగడంగఁ బొనర్చిమించుగన్. 178

ఆ॥ కడుబెడంగు గదురఁ ♦ గాంచన నవరత్న, రాజి యలరఁగాఁ గ♦ర గ్రహణపు
వేది నిఁకను యజ్ఞ♦వేదినిఁ బొనరించె, బాలచంద్రధరుఁడు ♦ బాగనంగ. 179

ఆ॥ దేవశిల్పి యిట్లు ♦ తీర్చినమంటపం, బెలమిఁగాంచి హిమన ♦ గేంద్రుఁడపుడు
చాలసంతసించి ♦ సరగున నగరుఁగ్రై, సేయ నాగరులకు ♦ సెలవొసంగె. 180

వ. అంత వారును

## —* పౌరు లోషధీప్రస్థంబును సింగారించుట *—

సీ॥ చెలువగురంగులఁ ♦ జిత్రించి రెల్లెడ, మేడలబారుపై ♦ మెచ్చుగులుక
ముత్యాలగవనులు ♦ మురువొప్పఁగూర్చిరి, రాజమార్గములందు ♦ రాణదనర
చిత్రధ్వజపతాక ♦ శృంగారమాలికల్, గట్టిరి రకరకాల్ ♦ గాంతియలర
వైద్యుతదీపముల్ ♦ వరుసగామణిదీప, ములఁ బలుతీరుల ♦ నలరఁదీర్చి
రగరుపన్నీటితో రథ్య ♦ లలికిమేలి, కప్పురపుముగ్గులిడిరి చొ ♦ క్కమగు కప్పు
రపుటరటిమ్రాకు లామ్రప♦ర్ణములు గడుశు, భాయనమ్మగఁ గట్టిరి♦యన్నిదిశల

గీ॥ అంతఁగలధౌతభూధరా ♦ భ్యంతికమున, శివుఁడు కల్యాణపత్రికఁ ♦ జేతఁదాల్చి
చదివికొని సంతసంబొంది♦సరగ నార, దమునినాత్మమునందుఁ దా♦దలఁచనతఁడు.

చ॥ పరువునవచ్చి యత్తపసి ♦ భర్గుని పాదపయోజయుగ్మమం
దెఱఁగి నుతింపుచున్నలువ ♦ నీశ్వరుఁ డాతనిఁగాంచి సన్మునీ
శ్వర ! విను మద్రిరాజసుత ♦ చాలఁ దపస్సొనరించి నన్నుఁ దాఁ
బరిణయమాడుమం చడిగె ♦ భక్తికిమెచ్చి వరంబొసంగితిన్. 182

గీ॥ సప్తఋషులు తుషారాద్రి ♦ చంద్రుకడకుఁ
బోయి సుముహూర్తనిశ్చయం ♦ బును బొనర్చి
రిటను నాల్గవరోజున ♦ నే వివాహ
లగ్నమందులకై నిర్ద ♦ లంచుటయ్యె. 184

క॥ అనినవిని నారదుం డ, త్యనురాగముతోడ నిట్టు ♦ లనె నభవునితో
ననఘచరిత ! భక్తులకెం, దును ననుకూలుండవగుట ♦ నున్ బ్రియమయ్యెన్.

గీ॥ ఇఁకను దాసుఁడనైన నా ♦ కెద్దియేని, దగినపని చెప్పి చేయింపఁ♦దగు మహేశ!
యనినఁబరమేశ్వరుండిట్టు♦లనియె దివ్య,ముని! వినుము చెప్పెదనుపని♦ఘనత మెఱయ.

—* శివుఁడు నారదునిచే దివ్యజనంబులనెల్లఁ బిలిపించుట *—

ఉ॥ దేవతలన్ మునీంద్రులను ♦ దివ్యులనెల్లఁ గళత్రపుత్రమి
త్రావళితోడఁ బెండ్లికి ర ♦ యమ్మన రండని పిల్వఁగావలెన్
నావచనం బిదంచును జ ♦ నంబులకెల్ల వచింపఁగావలెన్
నీవిటు పిల్చివచ్చి కడు ♦ నేర్పునఁ గార్యముఁ దీర్పఁగావలెన్. 187

గీ॥ ఎవ్వరేనియు నా పెండ్లి ♦ కేగుదెంచ
రేని నాత్మీయవర్గంబు ♦ లోన వారి
నెఱిఁగి వెలిసేయుఁడనఁగ ము ♦ నీంద్రుఁ డలరి
మ్రొక్కి సెలవొంది పోయె న ♦ భోముఖమున. 188

వ. నారదుం డతిత్వరితంబున మహతీద్వితీయుండై కల్యాణిరాగంబు నాలాపించి గానంబుసేయుచు వైకుంఠాదిసకలలోకంబులకేగి దివ్యమునిజనంబుల కెల్లరకు శివకల్యాణం బెఱిఁగించి పిలిచివచ్చి యీశ్వరుఁ జేరికొనియె నయ్యవసరంబున

సీ॥ వైకుంఠముననుండి ♦ వనజనేత్రుఁడు సిరి, తో నలంకృతుఁడయి ♦ తోడరివచ్చె
సత్యలోకమునుండి ♦ చతురాననుఁడు పల్కు, కల్కితోఁ గైసేసి ♦ కదలివచ్చె
అమరాలయమునుండి♦హరిహయుం డర్ధాంగి, తో జయంతాదుల♦తోడవచ్చె
పావకాదికదిశా ♦ పాలకులునునిజ, పత్నీజనంబుతో ♦ వచ్చిరెలమి

గీ॥ వరుసగా భాస్కరాదిన♦వగ్రహములు, సప్తమాతృక లలవశి ♦ ష్ఠప్రముఖఋ
షులుమునులుదివ్యసిద్ధసా♦ధ్యులునునచ్చ, రలునువచ్చిరిగడుసంబ♦రంబు మెఱయ.

—* దేవపురంధ్రులు శివుని పెండ్లికొడుకుఁ జేయుట *—

వ. ఇట్లనేకదివ్య యక్షగంధర్వ విద్యాధరోరగాదులు వచ్చి పరమేశ్వరునకు మ్రొక్కి నిలిచిరంత మహేశ్వరుఁడును వచ్చినవారలనెల్ల యథాయోగ్యంబుగ గారవించుడు వారెల్లఁ బొంగిపొరలి మహోత్సాహంబునఁ గార్యభారంబు



వహించిరపుడు కైలాసంబు మహాద్భుతోత్సవంబై యొసంగె నందొక్క సుముహూర్తంబందు సప్తమాతృక లీశ్వరునకు మంగళాభిషేకంబుఁ గావించి హరిద్రచందనాక్షతపుష్పంబుల నలంకారంబుఁగావించిరి. 191

ఆ॥ విష్ణు వీశ్వరునకు ♦ విన్నపంబొనరించె, దేవ ! చిత్తగించి ♦ యీ వివాహ
మర్థి గృహ్యవిధిగ ♦ నాచరింపుము నిన్నె, యనుసరించి యెల్ల♦రాచరింత్రు.

ఆ॥ అనిన దేవదేవుఁ ♦ డంగీకరింపుడు, బ్రహ్మదేవుఁడపుడు ♦ ప్రోత్సిదనర
మంటపప్రతిష్ఠ ♦ మఱియు నాందీముఖం, బులునుసల్పె దివ్య ♦ మునులఁగూడి.

ఉ॥ గౌతముఁడుర్వశిష్ఠుఁడును ♦ గశ్యపుఁ డత్రిశిలాద కర్దముల్
పీత్రివిభుండునుర్ భృగు మ ♦ రీచి దధీచులు పైలుఁ డుత్తమ
ఖ్యాతికరుం డగస్త్యుఁడును ♦ గణ్యుఁడు మున్నగు మౌనివల్లభుల్
ధాత సమీపమందు నవ ♦ ధానముతో వసియించి మించుగన్. 194

క॥ దక్షత మెఱయంగ శుభా, పేక్షన్ వేదోక్తనియమ ♦ విహితసరణితో
దీక్షాబంధము లోకా, ధ్యక్షునకుఁ గట్టి రెలమి ♦ దైవాఱంగన్. 195

క॥ మిహిరపురోగామి నవ, గ్రహమండల పూజనమును ♦ గ్రచ్ఛఱ విఘ్నా
పహముగ నొనర్పఁజేసిరి, బహువిజ్ఞత కల్మి బల్మి ♦ పరువంబలరన్. 196

క॥ వేదత్రయసూక్తంబుల, నాదరమునఁ జదివి మంగ♦ళాశాసనముల్
బోధిగ నొనర్చి పెండ్లికిఁ, బోదమికని విన్నవింప ♦ భువనేశ్వరుఁడున్.

—* శివుఁడు ప్రమథ దేవబలంబులతో వివాహమున కరుగుట *—

శా॥ నానావాద్యములెల్ల మ్రోయఁగ మహా♦నందంబుతో నప్సర
స్త్రీనృత్తంబులు గానముల్ సెలఁగ స్వ♦స్తిధ్యానముల్ సన్మునీ
శానుల్ సల్పఁగ మంచి మూఁగుతమునన్ ♦ జక్రాయుధాద్యుల్ జయ
ధ్యానంబుల్ పొనరింపఁగా గిరి బహి ♦ ష్ఠానంబుఁ జేరెన్ సిరిన్. 198

వ. అంత నందికేశ్వరుండు శివానుమతిఁ జెంది కొందఱ గణపాలురఁ గైలాసంబు నంద యునిచి తక్కుంగల ప్రమథ భూతగణంబులనెల్లఁ బరమేశ్వరునితో హిమవన్నగంబున కుత్సవపురస్సరంబుగాఁ గదలుండని యానతి నొసంగిన నవ్వార లమితోత్సాహంబున నలంకృతులై తమబలంబులనెల్ల మున్నిడుకొని వేఱు వేఱుగ నిట్లు ప్రస్థానంబుఁ జేసిరి. 199

సీ॥ కోటిబలంబుఁ దో ♦ డ్కొని శంకుకర్ణుండు, నాలుగుకోట్ల సే ♦ నల విశాఖుఁ
డైదుకోటుల సైన్య ♦ మమరఁగపాలాఖ్యు, డారుకోట్లొప్ప సం ♦ దారకుండు
ఎనిమిదికోట్ల వా ♦ హినితోడ దుందుభుఁ, డట్లె యావేశనుఁ♦డట్లె వికృతుఁ
డట్లె విష్టంభకుం ♦ డట్టులే చంద్రతా, పనుఁడింక మేటియౌ ♦ పారిజాతుఁ

వహించిరపుడు కైలాసంబు మహాద్భుతోత్సవంబై యెసంగ నందొక్క
సుముహూర్తంబందు సప్తమాతృక లీశ్వరునకు మంగళాభిషేకంబుఁ గావించి
హరిద్రచందనాక్షతపుష్పంబుల నలంకారంబుఁగావించిరి. 191

ఆ॥ విష్ణు వీశ్వరునకు ♦ విన్నపంబొనరించె, దేవ! చిత్తగించి ♦ యీ వివాహ
మర్థి గృహ్యవిధిగ ♦ నాచరింపుము నిన్నె, యనుసరించి యెల్ల♦రాచరింత్రు.

ఆ॥ అనిన దేవదేవుఁ ♦ డంగీకరింపుడు, బ్రహ్మదేవుఁడపుడు ♦ ప్రౌఢిదనర
మంటపప్రతిష్ఠ ♦ మఱియు నాందీముఖం, బులునుసల్పె దివ్య ♦ మునులఁగూడి.

ఉ॥ గౌతముఁడున్ వశిష్ఠుఁడును ♦ గశ్యపుఁ డత్రిశిలాద కర్దముల్
ప్రీతివిభుండునున్ భృగు మ ♦ రీచి దధీచులు పైలుఁ డుత్తమ
ఖ్యాతికరుం డగస్త్యుఁడును ♦ గణ్యుఁడు మున్నగు మౌనివల్లభుల్
ధాత సమీపమందు నవ ♦ ధానముతో వసియించి మించుగన్. 194

క॥ దక్షత మెఱయంగ శుభా, పేక్షన్ వేదోక్తనియమ ♦ విహితసరణితో
దీక్షాబంధము లోకా, ధ్యక్షునకున్ గట్టి రెలమి ♦ దైవాఱంగన్. 195

క॥ మిహిరపురోగామి నవ, గ్రహమండల పూజనమును ♦ గ్రచ్చఱ విఘ్నా
పహముగ నొనర్పఁజేసిరి, బహువిజ్ఞత కల్మి బల్మి ♦ పరువంబలరన్. 196

క॥ వేదత్రయసూక్తంబుల, నాదరమునఁ జదివి మంగ♦ళాశాసనమున్
బోధిగ నొనర్చి పెండ్లికిఁ, బోదమిఁకని విన్నవింప ♦ భువనేశ్వరుఁడున్.

—* శివుఁడు ప్రమథ దేవబలంబులతో వివాహమున కరుగుట *—

శా॥ నానావాద్యములెల్ల మ్రోయఁగ మహా♦నందంబుతో నప్సర
స్త్రీనృత్తంబులు గానముల్ సెలఁగ స్వా♦స్తిధ్యానముల్ సన్మునీ
శానుల్ సల్పఁగ మంచి మూహుతమునన్ ♦జక్రాయుధాద్యుల్ జయ
ధ్వానంబుల్ పొనరింపఁగా గిరి బహి ♦ ర్స్థానంబుఁ జేరెన్ సిరిన్. 198

వ. అంత నందికేశ్వరుండు శివానుమతిన్ జెంది కొందఱ గణపాలురఁ గైలాసంబు
నంద యునిచి తక్కుంగల ప్రమథ భూతగణంబులనెల్లఁ బరమేశ్వరునితో హిమ
వన్నగంబున కుత్సవపురస్సరంబుగాఁ గదలుండని యానతి నొసంగిన నవ్వార
లమితోత్సాహంబున నలంకృతులై తమబలంబులనెల్ల మున్నిడుకొని వేఱు
వేఱుగ నిట్లు ప్రస్థానంబుఁ జేసిరి. 199

సీ॥ కోటిబలంబుఁ దో ♦ డ్కొని శంకుకర్ణుండు, నాలుగుకోట్ల సే ♦ నల విశాఖుఁ
డైదుకోటుల సైన్య ♦ మమరఁగపాలాఖ్యు, డారుకోట్లొప్ప సం ♦ దారకుండు
ఎనిమిదికోట్ల వా ♦ హినితోడ దుందుభుఁ, డట్లై యావేశనుఁ♦డట్లై వికృతుఁ
డట్లై విష్టంభకుం ♦ డట్టులే చంద్రతా, పనుఁడింక మేటియా ♦ పారిజాతుఁ

గీ॥ డెలమిఁదొమ్మిదికోట్లవా♦ హనులతోడఁ, గేకరాక్షుండుపదికోట్ల♦మూఁకతోడఁ
గుండపర్వతకులు పది ♦ రెండుకోట్ల, బలగములతోడ నడిచిరి♦చలువమలకు,

గీ॥ అగ్నిముఖుఁడొక్కకోటితో♦నర్కమూర్ధుఁ,డొక్కకోటిఘనావహుం♦డొక్కకోటి
నాచతుర్వక్త్రుఁ డేడుకో♦ట్లలమహాబ, లుండు దొమ్మిదికోటుల ♦ దండులుండ.

కం॥ కరణుం డిరువదికోటులు, నఱువదికోట్లొప్పఁగాక ♦ యాదోదరుఁడుఁ
హరువగు సైన్యంబలరఁగ, నరుదుగ నడచిరి హిమాల♦యంబునకు వడిన్.

వ. మఱియు సర్వాంతకుండును సంతానకుఁడును ననుగణవర్యు లిరువు రొకరొక రఱువదేసికోట్ల బలంబులతోడను గాష్ఠాంగుష్ఠుండును విరూపాక్షుండును సుకేశుండును, వృషభుండును, దాళకేతుండును, షడాస్యుండును, జంచ్వాస్యుండును, సంవర్తకుండును, చైత్రుండును లకులీశుండును లోకాంతకుండును, దైత్యాంతకుండును, భృంగిరిటుండును, నశనియు భానుకుండును నొక్కరొక రఱువది నాలుగుకోట్ల బలఁగంబులతోడను మధుపింగుండును, గోకిలుండును, నీలుండును, బూర్ణభద్రుండును నను వీరపురుషులు ప్రత్యేకంబు తొంబదికోట్ల దండుతోడను సన్నాహుండును, గుముదుండును, నమోఘుండును, గోకిలస్వనుండును, గందుకుండును, గుండలుండును, సుమంత్రుండును, మహాకేశుండును గాలుండును, గాలకుండును, మహాకాలుండుము, నగ్నికుండును, ననుగణనాథులు వేఱువేఱుగా నూఱుకోట్ల యనీకినులతోడ నుత్సవంబొప్ప మహేశ్వరవివాహార్థంబై కదలి నడిచిరి. ఇఁక భూతకోటీశతంబులతోడను బ్రమథకోటిసహస్రంబులతోడను జతుష్షష్టికోటి రోమజాతకదంబములతోడను శ్రీవీరభద్రుండును క్షేత్రపాలుండగు భైరవుండును మహేశ్వరప్రతినిధి యగు నందికేశ్వరుండును నిఖిలసేనాని యగు చండీశ్వరుండును బ్రమోదంబుతో వారువంబులెక్కి దత్తావధానులై ముందఱ నడిచిరందు.

ఉ॥ అందఱు చంద్రఖండధరు ♦ లందఱు నీలగళంబుగల్గువా
రందఱు భూతిపుండ్రధరు ♦ లందఱు నందిపతాకలొప్పువా
రందఱు నక్షహారధరు ♦ లందఱు రత్నవిభూషలొప్పువా
రందఱునుం ద్రిశూలధరు ♦ లద్భుతరూపులు శర్వసన్నిభుల్. 204

కం॥ కొందఱు పృథివీచారులు, గొందఱు పాతాళచరులు ♦ గొందఱు ఖచరుల్
గొందఱు నాకచరులు మఱి, కొందఱు వివిధప్రదేశ ♦ కుశలులు సిద్ధుల్. 205

వ. ఇట్లసంఖ్యాతరుద్రచయంబు జయసంవాదంబులతో ననేకడమరుకశంఖఘంటాభేరీ దుందుభిపటహనిస్సాణ వేణువీణా మృదంగాది వాద్యశ్రేణులతోఁ బరమేశ్వర కల్యాణంబునకై ప్రయాణంబు సేయుడు వారలతోడ. 206

సీ॥ తప్తకాంచననిర్మి♦తంబైన పూర్ణకుం, భంబొప్పు నుత్తమాం ♦ గంబుతోడ
పరజనంబులకెల్ల ♦ భయము బిట్టొసఁగుభు, నంబైన పేరితాస ♦ నంబుతోడ
సర్వాంగములయందుఁ ♦ జాలఁగ వెలిపించు, సర్వాభరణముల ♦ సొరుతోడ
వికటనృత్తములతో ♦ వింత వేడుక సేయు, తత్పరిచారికా ♦ తతులతోడ

గీ॥ మఱియు చుండిన విశ్రుతంపు ♦ మొకముతోడఁ
దామరసములఁబోలు నే ♦ త్రములతోడ
శాకినీఢాకినీభూత ♦ సమితి గొలువ
భవుని చెలియలా చండిక ♦ బయలుదేఱె. 207

క॥ సుమనస్సముదయ మఖిల, ప్రమథగణం బగ్రమందు ♦ రవళి దనర్పన్
దమ తమ వాహనములతో, సుమాళమమరంగ వెడలె ♦ సొంపెసలారన్.

వ. అందు.

మ॥ దివిమత్సంఘము గొల్వఁ దార్క్ష్యునిపయిన్ ♦ దేజంబుమీఱఁగన్ రమా
ధవుఁ డారోహణ చేసి చామరము లు ♦ ద్యచ్ఛత్రమున్ శారద
ప్రిపరుల్ వేడుకతోడ సేయఁ బరివా ♦ రంబెల్ల నల్దిక్కు లు
త్సవమొప్పన్ దనుడాసి రాఁ దరలెఁ జే ♦ తం బెంతో ప్రీతిన్ గొనన్. 209

చ॥ నలువయు నంచమావిపయి ♦ నందమెసంగఁగ నెక్కి దివ్యమౌ
నులు సనకాదినందనులు ♦ నున్ దనువుల్ ధరియించినట్టి ప్రాఁ
బలుకులు శాస్త్రముల్ చెలఁగి ♦ బాగుగఁ దన్ గొలువన్ గరంబు పెం
పలర మహేశసేవనభ ♦ రాలసుఁడై గదలెన్ రయంబునన్. 210

క॥ వాసవుఁ డైరావతమున్, వాసి యలర నెక్కి యాత్మ ♦ వర్గముతోడన్
భాసురగతి వెడలెను దన, తో సకలామరులు చెలువు ♦ తోరాణింపన్. 211

వ. అనంతరము సర్వఋషులును నాదిత్యాదినవగ్రహంబులును దేవమునియగు నారదుండును వైణికశిరోమణియగు తుంబురుండును, గాయకులగు హాహాహూహూలును, నాశ్వినేయద్వయంబును, విశ్వావస్వాదిగంధర్వవర్యులును, కిన్నరులును, కింపురుషులును, జారణులును, విద్యాధరులును యక్షులును, రాక్షసులును వాసుకిప్రముఖులగు భోగిరాజవతంసులును, భూతభేతాళనాథులును, బ్రాహ్మ్యాది సప్తమాతృకలును, అదితి దేవహూతి మొదలగు దేవమాతృకలును, దితి మొదలగు రక్షోమాతలును, సురసాదికలగు నాగమాతలును, శతరూపయు, గాయత్రియు, సావిత్రియు, సరస్వతియు, సంజ్ఞయుఁ జాయయు నిందిరయుఁ జందురుమందయాన లిరువదేడుగురును జాలోమి మున్నగు దేవపత్నులును నారంజోతి మున్నగు మునిపత్నులును, రుద్రపత్నులును, దేవకన్యకలు, నాగకన్యకలు, మునికన్యకలు యువతికన్యకలు, ఘృతాచి మున్నగు నచ్చరమచ్చెకంటులెల్లరును దివ్యాంబర

గంధమాల్యాభరణంబులఁ దొడి కట్టి పూసి కైసేసి ధమ్మిల్లసముల్లసితప్రఫుల్లహార
చందనకుసుమదామ సౌరభంబులయుఁ గస్తూరీక్షోద మేదుర మలయజగంధసార
చర్చాపరిమళంబులయు ఘనసారవీటీచర్వణామోదంబులయుఁ బరంపర లనేక
యోజనప్రదేశంబులాక్రమించిమించి గుబాళింపఁ బుష్పకంబులెక్కి కదలిరంత.

గీ॥ వేదములచేత బహుముని ♦ వితతిచేత, ధర్మదేవత యని యెద్ది ♦ తనరు నద్ది
అతులశుద్ధస్ఫటికనిభం ♦ బైనితాంత, సుందరంబగు గోరాజ ♦ చూడమపుడు.

గీ॥ చేరి నిలిచిన ద్విజరాజ ♦ శేఖరుండు, భూరిమోదముతో నెక్కి ♦ పుణ్యసతుల
హారతులనొంది దివ్యగ ♦ ణాళిగొలువఁ, బెండ్లికై మంచుఁగొండకుఁ ♦ బేర్మిఁదరలె.

కం॥ చని హిమవద్గిరి డగ్గఱి, వనజాక్షుం డంత శివుని ♦ పనుపున సుమనో
జనముల నారసి నారద, మునివరు నంపెను దుషార ♦ భూధరుకడకున్, 215

కం॥ ఆతఁడు చలిమలకేంతయుఁ, బ్రీతిఁ జని దేవశిల్పి ♦ విరచితమును వి
ద్యోతితబహుతరచిత్ర, వ్రాతముఁ గల్యాణమంట ♦ పముఁ గాంచియటన్.

గీ॥ మంటపంబెల్లఁగని యంద ♦ మర్చినట్టి, కృత్రిమనిలింపమూర్తులఁ ♦ గృత్రిమర్షి
వరులఁ గృత్రిమమూర్తియై ♦ వఱలుతన్నుఁ, బోల్చిపరికించి బమ్మెర ♦ పోయియపుడు.

—* నారదుఁడు వివాహమంటపమును జూచి భ్రమించుట *—

వ. మఱియు నవరత్నఖచితానేకశాతకుంభకుంభ స్తంభసంభృతంబును, గమనీయానేక మౌక్తిక స్తబక జాంబూనదాంచలాంచిత విచిత్ర పట్టజాలికార్థ తిరస్కరిణీపురస్కృత దివ్య వితానప్రతాన బహుద్వారపరిశోభితంబును, గాలాగరుగంధసార ఘనసారకస్తూరికాసమధికధూప లేపనిరవధికపరిమళపరంపరాసురభిళ ప్రదేశంబును, సురుచిరనూత్నరత్నాలంకృతభర్మపాంచాలికాబాలికాజాలవిశాల పార్శ్వవిరాజితంబును, స్వస్తికరాస్తోకసమస్తప్రశస్తవస్తువిస్తార పరిపూర్ణ కోష్ఠాగార సంవేష్టితంబును, భోగవతీపురంబువోలె బహుఫణిహారమణిదీపమాలికాడోలికా చక్రవాల విభ్రాజితంబును, నాదిత్యమండలంబువోలె ధగద్ధగితాంచచ్ఛాయావిరాజమానత్రయీమూర్తి సాన్నిధ్యసంశోభితంబును, వైకుంఠ నిలయంబువోలె పురుషోత్తమలక్ష్మీసమధిష్ఠితంబైనను విషధరేశ్వరానధిష్ఠితంబును, సత్యలోకమువోలెఁ జతురాస్యవాణీపరిష్కృతాస్థానీసంశోభితంబైనను, ననధిగతదివ్యజ్యేష్ఠాశ్రయంబును, త్రిదివంబువోలె ఘనధిషణాచివ్యాంచద్దండధరపాశభృన్మహాబలబృహద్భానుపుణ్యజనేశ్వరపరీవృత సహస్రాక్ష పరిపాలితంబైనను, దూరీకృతగోత్రభేదనావాసంబును, రాజరాజాగారంబువోలె బహుమణిగణద్రవిణరమణీయదివ్యనిధినిధాన భాండాగారమండితంబైనను, నపాకృతకిన్నరకింపురుషబృందంబును బహుయోజనాయామవిశాలంబును నద్భుతం

బును నపూర్వంబును నగు పాణిగ్రహణమంటపంబును దదీయాంతరాళద్యోత మానంబగు నగ్నిప్రతిష్ఠావేదికను గనుంగొని యదృష్టపూర్వంబగు నమ్మణిమంట పంబుశిల్పకలాకౌశలంబున కెక్కుడగు నక్కజంబొంది యొక్కింతసేపు విభ్రాకు పడి వచ్చినకార్యంబు మఱచి విన్నఁదనంబునఁ దెన్నుఁదప్పి చెదరి బెదరి యదరి పదరి తిరిగితిరిగి యరిగిసురిఁగి యొఱఁగి వలంకులఁదొలఁగి మలఁగి కలంగి యలంగి తూలిసోలి యలసిసొలసి వేసరియోసరిలి రోసిడాసి యెట్టకేలకు గట్టియుద్దిఁ జేసి తెప్పరిల్లి యప్పుడప్పర్వతరాజవర్యుఁ జేరఁబోయి బెదరుచు నాతని కిట్లనియె.

ఉ॥ పర్వతరాజవర్య! విను ♦ భర్గుఁడు పార్వతిఁ బెండ్లియాడఁగా
సర్వసుపర్వవర్యులను ♦ సన్మునులన్ గణసిద్ధసాధ్యగం
ధర్వుల నెల్లఁ దోడ్కొని ము ♦ దంబున నీకుధరంబు డగ్గఱెన్
హర్వగ నీవిధానము ర ♦ యంబునఁ దెల్పు మకృత్రిమంబుగన్. 219

వ. అనిన హిమవంతుం డిట్లనియె.

ఉ॥ నారద! శిల్పికల్పితక♦నన్మణిమంటపదర్శనంబునన్
ధీరత యెల్లఁ గోలువడి ♦ తీవర మొందెదవేల యిందు ర
మ్మా! రుచిరాన్నపానముల ♦ మేలుగనొంది యనుగ్రహించి నా
కూరిమిపుత్రులన్ గొనియు ♦ గోపతివాహను జేరి చెచ్చెరన్. 220

క॥ కొని తెమ్ము నాదుపురమున, కని హిమవంతుండు మౌని ♦ కభ్యర్హితభో
జనమిడి మైనాకాదులఁ, దనతనయులఁ బంపె మౌని♦తల్లజు వెంటన్. 221

—✱ నారదుఁడు హిమవత్పుత్రులతో శివునియొద్దకు వచ్చుట ✱—

గీ॥ అంత నట మాధవుఁడు మొద ♦ లైన సురలు
దేవమునిరాక దడయుటఁ ♦ దెలిసి చిత్త
మందుఁ దత్తర మొందుచు ♦ న్నంత నతఁడు
శైలపుత్రులతో వచ్చి ♦ సంభ్రమమున. 222

క॥ శివునకు జోహారుచేసి ని, లువఁ గేశవముఖనిలింపు ♦ లు ముని తెఱఁగు శై
లవరు కుమారులనున్ గని, లవముదలఁకి యనిరి మునిల♦లామునితోడన్. 322

ఉ॥ ఏమి మునీంద్ర! నీవిటుల ♦ నెంతయు విభ్రమ మొందినట్లుగా
మామదులందుఁదోఁచె గిరి ♦ మందనుఁ డెవ్విధినుండెఁ దత్పుత
గ్రామము లేలవచ్చి రిటుఁ ♦ గాళిక నీశునకీఁదలంచెనో
నేమముమాని వేఱు మది ♦ నిన్ గొనియుండెనొ తెల్పు మన్నియున్. 224

సీ॥ అనినవిని మౌని త్వష్టృమా♦యావిమోహి, తాత్ముఁడై విధివిష్ణుల♦నమరవిభుని
నేకతమ్మునఁ జేర్చి తా ♦ నిట్టులనియె, బెదరుఁజెందిన వడుపున ♦ బిరుదుదక్కి.

చ॥ వినుఁడు విధాత! మాధవ! త్రి ♦ విష్టపనాయక! త్వష్ట మేటికు
ట్రిను దలపెట్టి శీతకుధ♦రమ్మునఁ గట్టె వివాహమందిరం
బును నది యెల్లవారలకు ♦ మోహముపుట్టఁగఁ జేయు నట్టిదా
నిని మునుముందు నేను గని ♦ నివ్వెఱఁజెందితి నేమి సెప్పుదున్. 226

వ. మహేంద్రునిఁ బరికించి మఱియు నిట్లనియె.

క॥ నగభేది! నీవు త్వష్టకు, వగనిడితివి తొల్లి యతఁడు ♦ వదలక యిపుడా
పగఁదీర్పఁ దొడఁగి యివ్విధ, ముగ నొనరించినట్లు లెంచఁ♦బోలుదృఢముగాన్.

వ. మఱియు నమ్మంటపంబందు.

క॥ కృత్రిమహిరణ్యగర్భునిఁ, గృత్రిమనాళీకనయను ♦ గృత్రిమశక్రున్
గృత్రిమనిర్జరవర్యులఁ, గృత్రిమనారదుని నిలిపె ♦ గీర్వాణపతీ! 228

వ. వానిఁ గనుగొని నే మిగుల బమ్మెరవోయి నివ్వెఱ జెందితి ననుడు మహేంద్రుఁ
డదరిపడి యుబ్బెరవోయి తబ్బిబ్బై యబ్బిసరుహనయనున కిట్లనియె. 229

ఉ॥ నిక్కము త్వష్ట నన్ గడపు ♦ నీరజలోచన! యీ వివాహమం
దెక్కరణిన్ మనంగఁదర ♦ మెందుల కేగుదు నేమిసేతు నిం
కెక్కడిప్రాణముల్ హిమగి ♦ రీంద్రుఁడుగూడ నరాతివర్గమం
దొక్కఁడు తెక్కలన్ మును ర ♦ యోద్ధతిఁద్రుంపనె యెల్లగట్లకున్. 231

క॥ అని కలహాశనుకతమున, వనరుచుఁ గడునడలుచున్న ♦ వాసవుఁగని య
వ్వనరుహనేత్రుండెలనగ, వొవరఁగ నిట్లనియె జడుపు ♦ నుడుపుచు వేగన్.

చ॥ వెఱవకు దేవరాజ! ధృతి ♦ వీసరపోవఁగ నెవ్వఁడేని నిన్
బొరిగొనునంచు నెంచకు ప్ర♦భుం డఖిలేశ్వరుఁ డిందు నేరికే
కొఱఁత పొసంగ నీయఁ డిఁకఁ ♦ గుందక ముందటి కార్యమెంచు మీ
చిఱుతతలం పెవండయినఁ ♦ జెందిన వాఁడవమానమొందెడున్. 232

క॥ అని నారదమౌనియునున్, జనార్దనుఁడు దివిజరాజు ♦ చాలవఱకు ని
ట్లనుమానముతో గుజగుజ, లను సల్పుడు నరసి శశిల♦లాముం డనియెన్.

ఉ॥ చాలఁగ యోజనన్ గొని వి ♦ చారము సల్పుచునుంటిరేమి దం
భోళిధరా! హరీ! యిఁకను ♦ బొల్పుగఁ దెల్పుఁడు నారదర్షి! నీ
కేల విలంబమయ్యెఁ గుధ♦రేశ్వరుఁ డింతకు నాకు రూఢిగాన్
బాలిక నీఁగి కొప్పికొనె ♦ నా? యది గాదని త్రోసిపుచ్చెనా? 234

క॥ కొంకక నుడువుము లవమా, తంకముఁగొన కచటి కార్య♦దశ యెట్టిదియో?
పొంకముగ నీవుగనిన క, ళంకేమియొ తెలుపు మునిల♦లామా! వేగన్.

క॥ అనవుడు నారదుఁ డిట్లని, యెను వినయము మెఱయ జగద ♦ ధీశ్వర ! యేత
ప్పును లేదు గట్లదొర యెడ, ననురాగముతోడ నీకు ♦ నర్పించు సుతన్.

గీ॥ విఘ్నభయ మేమి లేదు మీ ♦ పెండ్లికిపుడు, మిమ్ముఁ దోడ్కొనిపోవఁ బ్రే ♦ మించి మంచు
కొండదొర పంపెఁ దన మేల్మి ♦ కొడుకులను మ, హేశ! వీరలి దే వచ్చి ♦ రెలమిఁ గనుమ.

క॥ ఇఁక సురలకు భ్రమ సేయఁగ, నొకమతకముఁ బన్ని మేల ♦ మొప్పగ శమనాం
తక! యొకమంటప మమరిచె, రకమగు వద్దానిఁ గాంచి ♦ భ్రమసి తడసితిన్. 238

చ॥ అనిన మహేశుఁ డుల్లమున ♦ హర్షమునొంది యుపేంద్రముఖ్యులన్
గని యిటుపల్కె భూధరుఁడు ♦ కన్యక నిచ్చుట కిష్టమొందఁ ద
క్కినయవి గూర్చి నేను బరి ♦ కింపను మాయలతోడుతన్ బ్రయో
జనమది లేదు నాకిఁకను ♦ సత్వరగత్వరభంగి నెంచుఁడీ. 239

క॥ అనుకూలంబుగఁ గార్యం, బనువుపడఁగ వేఱుదలఁపు ♦ టది నీతియె చె
ప్పని యనిమేషులతోఁ దా, ననె మారవిరోధి మన్మ ♦ థాధీనుండై. 240

గీ॥ అనుఁడు విష్ణ్వాది దేవత ♦ లభవు సెలవుఁ, గొని ముదంబంది వేగిరం ♦ బునఁ బ్రయాణ
మొనరఁగాఁ జేసి హిమవన్న ♦ గోపకంఠ, తలముఁ జేరిరి దివ్యవా ♦ ద్యములు మ్రోయ.

—* హిమవంతుఁడు శివు నెదుర్కొనుట *—

మ॥ పరమేశానుఁడు సర్వదేవగణముల్ ♦ భాసిల్ల నాత్మోపకం
ధరమున్ జేరుట నాలకించి హిమవ ♦ ద్రాజన్యుఁ డప్పాట సో
దరులన్ బుత్రుల బ్రాహ్మణోత్తములఁ దో ♦ త్తన్ వారిడాయంగఁ బం
పి రహిన్ దానును జేరఁబోయి కనియెన్ ♦ బెంపొప్ప విశ్వేశ్వరున్. 242

గీ॥ దేవమునిగణబృందమున్ ♦ దేఱి చూచి, యాత్మమున ధన్యతను గంటి ♦ ననుచు నలరె
దైవతాగ్రణులును ధరా ♦ ధరబలంబుఁ, జూచి మది నుల్లసిల్లిరి ♦ చోద్యమలర.

క॥ డంబొప్పఁగఁ బూర్వపరా, శాంబుధులేకమగు లేవ ♦ నమరగణబలం
బుం బర్వతబలమును రెం, డుం బిరుదమరన్ గలిసెఁ గ ♦ డున్ సొంపలరన్.

ఆ॥ ఒకరి నొకరు గాంచి ♦ యురుతరానందంబు, పొంగిపొరలఁ దనివిఁ ♦ బొందిర పుడు
శైలరాజవరుఁడు ♦ శర్వునిఁ జేరి న, మస్కరించె హితస ♦ మన్వితముగ. 245

సీ॥ దశదిక్కులకుఁ గాంతి ♦ దళ్కొత్తఁగాఁ జేయు, దివ్యపత్రీకదీ ♦ ధితులతోడ
కలధౌతనగ మిందుఁ ♦ గదలివచ్చిన దనన్, జను బలీవర్దయా ♦ నంబుతోడ
చూడ్కులు వెరగొంద ♦ సొగసైన సన్నని, సౌవర్ణ పట్టువ ♦ స్త్రములతోడ
నెల్లజగంబుల ♦ కెసకమిప్పించు భా, స్వత్తరార్ధేందు భూ ♦ షణముతోడ

సీ॥ మేటిరతనాల సొమ్ముల ♦ మిసిమితోడ
నమరసుతలేయుసితచామ ♦ రములతోడ
ముఱుపు చిఱునవ్వుఁ దొరయు నె ♦ మ్మొగముతోడ
నమరుసర్వేశ్వరునిఁ గని ♦ రందఱపుడు. 246

గీ॥ ప్రభుని దాపల వలపల ♦ప్రక్కలందు, నాత్మబలములతోడ నా♦రాయణుండు
పద్మసంభవుఁడును గను ♦ పట్టవారి, కంజలియొనర్చి మ్రొక్కిహి♦మాచలుండు

క॥ వెనుకను ముందఱ నల్లే, మొనకొనియున్నట్టి దేవ ♦ మునిగణవరులన్
గని యుబ్బి మ్రొక్కులిడి వం, దనపూర్వక మిటుల శివునిఁ ♦ దాఁ బ్రార్థించెన్.

మ॥ సకలాజాండము లేలునట్టి దొర వీ ♦ సర్వామరశ్రేణితో
నొకఁడౌ కొండలకాఁపుపేటి కిటులన్ ♦ గొప్పొప్ప విచ్చేసి వా
నికుమారిన్ దయఁ బెండ్లియాడఁ దలఁపన్ ♦ విశ్వైకచిత్రంబు తా
వక కారుణ్యమయాత్మ మారయ వశం♦బా సర్వలోకేశ్వరా ! 249

క॥ నిండారునట్టి దయతో, దండిగ మము నేలికొనఁగఁ ♦ దలకొంటివి మా
కొండనఁగ నేల ! యొకటే, దండంబిదె దప్పులెల్ల ♦ దప్పులఁద్రోయన్. 250

గీ॥ అని యిటుల భక్తితోడ దైన్యముగఁ బ్రార్థనమునొనర్చి శివాజ్ఞనం♦దనులనంద
యునిచి హిమవన్నగాధిపుఁ♦డొక్కరుండు, నగరికేతెంచిముందఱ♦నయమునీట

—* శివునిఁ జూడఁగోరి మేనక నారదునిఁ బిలుపించికొనుట *—

గీ॥ స్నానదానంబులను సల్పి ♦ సత్వరముగ, శివునెదుర్కొనివరపూజ♦సేయుపొంటె
మేనకకుఁ దెల్ప నన్నాతి ♦ మిన్నయపుడు, నారదునిఁ బిల్వనంపె ఘ♦నత దలిర్ప

వ. అంత నారదుండు శివానుమతిన్ జెంది మేనకాంతఃపురంబునకున్ జనుదు నమ్మేనక
యమ్మునివరునకు మ్రొక్కి యిట్లనియె. 253

గీ॥ ఈశ్వరుని దివ్యరూపంబు ♦ నీక్షసేయఁ, గడఁగియున్నట్టిదానను♦ఘనమునీంద్ర!
ఎంతయుజ్జ్వలరూపమో♦యిగురుఁబోఁడి, కాళి తపమొంది యద్దాని♦గారవించె.

క॥ అని యజ్ఞానంబున శివుఁ, గనఁగోరి గిరీంద్రదేవి ♦ గ్రక్కున మునితో
డను జంద్రశాల్పైకిన్, జని యటఁ గూర్చుండెఁగడఁది♦సంబరమొప్పన్. 255

వ. శివుఁడును మేనకాభిప్రాయం బెఱింగి యమ్మదవతి యహంకారంబునకుఁ గినిసి
యాపె కజ్ఞానం బినుమడింపఁజేసి హరి విరించుల కిట్లనియె. 256

క॥ మీ మీ సేనలు గొలువఁగ, నేమముతో నొక్కరొకరు ♦ నేర్పున గిరిసు
త్రామునిపురమున కరుగుం, డామీఁదను నేను వత్తు ♦ నభిమతమొప్పన్. 257

ఆ॥ అనిన హరివిరించు ♦ లభవు నభిప్రాయ, మెఱిఁగి సైన్యమెల్ల ♦ నొఱవుమీఱ
వేఱువేఱదీర్చి ♦ వేగంబె సురలతో, సాగుఁడంచు నంత ♦ సన్న సేయ. 258

—* మేనకకు నారదుఁడు దివ్యులనెల్ల నెఱిఁగించుట *—

క॥ ముందుగ గంధర్వులు సొగ, సుందన మలరార విలువ ♦ సొమ్ములు దుస్తుల్
పొందుగఁ దాల్చి వెడలిరి ప, సందుగ నచ్చరలు వమదు ♦ జతతో నడువన్.

క॥ వారువము లెక్కి పరిపరి, తీరులవాద్యముల మ్రోఁత ♦ దిశ లలముకొనం
గా రహిఁగూర్పుచు జెండాల్, చే రంజిలవచ్చి రెంతో ♦ సింగారముగాన్. 260

గీ॥ వారికందఱకొడయఁడై ♦ వైభవముగ, వచ్చు విశ్వావసునిఁ గాంచి ♦ పర్వతేంద్ర
రాణి సంబరమున ముని♦రాజుతోడ, యితఁడెకద శంకరుఁడు వచి♦యింపుమనుడు.

క॥ శంకరునిఁ గూర్చి పాడెడు, కింకరు లిఁక వీరు వినుము ♦ గిరిరాజసతీ!
శంకరుఁ డేతన్మాత్రుఁడె, సంకటహరుఁ డెందు సర్వ ♦ శాసకుఁ డబలా! 262

క॥ అనిన విని మేన గ్రమ్మఱఁ, గనుచుండఁగ యక్షు లేపు ♦ గడలుకొనఁగఁ ద
జ్జనపతియైన మణిగ్రీ, వుని గని హిమవత్పురంధ్రి ♦ పొంగి యిటులనెన్.

క॥ ఇతఁడేనా శివుఁడనఁ గాఁ, డితఁడని నారదుఁడు నుడువ ♦ నింతట ననలుం
డతులితవాహినితోఁ రాఁ, గుతుకముతో నడిగె నితఁడో ♦ కో! శివుఁడనుచున్.

క॥ కాఁడని మునియన నాలో, వేడుకతో ధర్మరాజు ♦ విచ్చేయుడు నా
జాడఁగని మేనయనె ముని, చూడు మితండేమొ శివుఁడు ♦ శూలధరుఁడిటన్.

క॥ నావుడు కాఁడన నైరృతుఁ, డావెంట బలంబుతోడ ♦ నరుదేరఁగ నా
పూవుంబోడి యడిగె నితఁ, డా? వచియింపుమని యాతఁ ♦ డనె కాఁడనుచున్.

మత్తకోకిల. అంతలో వరుణుండు రత్నమ ♦ యంపుభూషలు గ్రాలఁగా
సంతసం బిగురొత్తరాఁ గని ♦ శైలపత్నియు మెచ్చుతో
మంతనంబున నీతఁడైనఁ గు ♦ మారి ధన్యమె యంచుఁ బ
ల్వింతదోఁపఁగ మౌనితో ననె ♦ విశ్వభర్త యితండెకా! 267

తరల. అనుఁడు కాఁడన నంతలోన మ ♦ హాబలుండు బలంబులన్
గొని హుటాహుటి రాఁ గనుంగొని ♦ కూర్మితో గిరికాంత దాఁ
గనుము మౌని యతండె శంభుఁడొ ♦ గాఁడనంగ లతాంగియున్
ఘనుఁడిఁకెట్టిఁడొ నాదు పుత్రికిఁ ♦ గాంతుఁడంచెవ నెంచుచున్. 268

క॥ జక్కులదొర కొమరునితో, నక్కజమగు సేనతోడ ♦ నరుదేరఁగఁ బె
న్మక్కువ నలకూబరునిన్, గ్రక్కునఁగని మురిసి యితఁడె ♦ గద శివుఁడనినన్.

ఉ॥ కాఁడని మౌనిచెప్ప సుర ♦ కాండముతోడ మహేంద్రుఁ డ త్తఱిన్
బోఁడిమిదోఁపఁగా నడువ ♦ భూధరరాట్సతి గాంచి పొంగుచున్
వీఁడెగదా శివుండనుడు ♦ వృత్రహరుం డితఁడంచు నారదుం
డాడ నిఁకెవ్వఁడో శివుఁడ ♦ టంచు మదిన్ దలపోసె మేనయున్. 270

పంచచామరము: ఇటుల్ తలంచుచుండ నోష ♦ ధీశుఁడెంతొ నీటుగా
దటాలునన్ బలంబుతోడఁ ♦ దారసింప గట్టురా
మిటారి సంబరం బెసంగ ♦ మిన్నుముట్టి యంతనే
జటాలుఁగాంచి యావలంతి ♦ శర్వుఁడేమొ కన్మనెన్. 271

ఆ॥ చందురుండితండు ♦ శర్వుండుగాఁడని, పల్కెఁ దపసి యంత ♦ భాస్కరుండు
కనులఁగప్పివేయు♦ఖరమరీచిసహస్ర, మడరి వెలుఁగ రా భ♦యంబునొంది. 272

ఆ॥ ఇతఁడె యితఁడెచూడు♦మీశ్వరుండన మేన, మౌని శివుఁడుగాఁడు♦భానుఁడనుచు
బ్రహ్మఋషులు మునులు♦పరిధవంబుగఁగొల్వ, నాహిరణ్యగర్భుఁ♦డరుగుదెంచె.

వ. కనుంగొని మేనకయును దాపసనాయకునితో.

వనమయూరవృత్తము: దేవముని! చూడుమిఁకఁ ♦ దేటియిటునింపౌ
పావనకలామయుని ♦ బ్రహ్మమునిగేయున్
బూవిలుతుఁగెల్చిన వి ♦ భుండొకొయనన్ రా
జీవభవుఁ డీతఁడని ♦ చెప్పె మునియంతన్. 274

సీ॥ కోటికందర్పుల♦కొమరారు సౌరుఁద్రో, యంగఁజాలు మేల్మిసో ♦ యగముతోడ
శంఖచక్రగదాది ♦ సాధనంబులనొంది, తనరారునాల్గు హ ♦ స్తములతోడ
కట్టిన మేల్మి బం ♦ గారుపుట్టంబుల, దట్టంబులౌతళ ♦ త్తళలతోడ
నురమందు రవికాంతి♦నొప్పారుచున్నది, వ్యంబైన యలకౌస్తు♦భంబుతోడ
గీ॥ డంబుమీఱిన మణిమకు ♦ టంబుతోడఁ, గడుమనోహరమైన ము♦ఖంబుతోడ
దయను వెదజల్లు వనజనే♦త్రములతోడ, విష్ణుదేవుఁడు విచ్చేసె ♦ వేల్పులలర.

క॥ కనుఁగొని మేనక పెనుముద, మున నఱలే దితఁడె శివుఁడు ♦ మునినాయక! క
న్మనుఁడు నతఁ డితఁడు కేశవుఁ, డనఘుఁడు శివుఁ డింతకన్న ♦ నధికుండు చెలీ!

ఉ॥ ఆతనికన్న మిన్నొకఁ ♦ డైనను లేఁడిఁక నాతఁడే జగ
ద్వాత్రితము లేలువాఁ డఖిల♦పాలకపాలకుఁ డిద్ధవైభవుం
డాతత దేవతాసముద ♦ యార్తిహరుండు హరుండు ధాత్రిలో
నాతనిఁజెప్ప గిప్పుఁదర ♦ మౌనొకొ! నల్వకునేని మానినీ! 277

గీ॥ అనినవలిమలదొరసాని♦యాత్మయందుఁ, దనదుసుతఁగూర్చి యేకొఱం♦తయును లేని
మంచిశ్రీమంతురాలని♦యెంచితనకు, సవతు లేదని తలఁచె ము♦జ్జగములందు. 278

వ. వెండియు నంతరంగంబున.

ఉ॥ ధన్యుఁడికన్ గిరీశ్వరుఁడు ♦ ధన్యను నేను నిజాన్వయంబునన్
ధన్యతరంబు వైభవము ♦ ధన్యతమంబిఁక నిట్లనన్యసా
మాన్యవిభూతులన్ దగు న ♦ మర్త్యులు భృత్యతఁగొల్చు రాజమూ
ర్ధన్యుఁడు నాదు పుత్రికను ♦ దారనుగాఁ గొనుటన్ జగంబునన్. 279

గీ॥ వేడ్కతో మేన యిట్లు భా ♦ వింపుచుండ, సర్వజగదేకనాథుండు♦సత్వరముగ
నగసతీగర్వనిర్వాప♦ణప్రమేయుఁ, డగుచు వెలువడె నిజగణం♦బలరికొలువ.

—* నారదుఁడు మేనకకు శివునిఁ జూపుట *—

క॥ పొడగాంచి మానియనె న, ల్లడుగో! గోరాజకేతుఁ ♦ డబ్జకిరీటుం
డడఁకువతోఁ బలుసిలుగుల, వడె నెవ్వనిఁ గోరి కాళి ♦ పర్వతదేవి! 281

వ. అనునంతలో నమ్మహాదేవగణంబులనేక విధాకారములతోడ వెలువడిరందుఁ గొందఱురూపధరంబులగు వాత్యసమూహంబులననొప్పి రిఁకను గొందఱు పతాకామర్మరధ్వానులును మరికొందఱువక్రతుండులును గొందఱునక్రతుండులును గొందఱుచక్రతుండులును గొందఱుశక్రతుండులును గొందఱు సురూపులును గొందఱుబహురూపులును గొందఱుకరాళులును గొందఱరాళులును గొందఱు రోమశులును గొందఱుహరికేశులును గొందఱుముద్గరహస్తులును గొందఱుధనుశ్శరహస్తులును గొందఱుపరశుహస్తులును గొందఱసిహస్తులును గొందఱుశక్తిహస్తులును గొందఱుగదాహస్తులును గొందఱుముసలహస్తులును గొందఱుహలహస్తులును గొందఱుశూలహస్తులును గొందఱుభిండివాలహస్తులును గొందఱు చక్రహస్తులును గొందఱుక్రకచహస్తులును గొందఱువేత్రహస్తులును గొందఱు లవిత్రహస్తులును గొందఱువిరుద్ధవాహనులును గొందఱనిరుద్ధవాహనులునుఁ గొందఱుశంఖవాదులును గొందఱుగోముఖవాదులును గొందఱుఘంటావాదులును గొందఱు డమరువాదులును గొందఱువీణావాదులును గొందఱు వేణువాదులును గొందఱు భేరీవాదులును గొందఱుఝల్లరీవాదులును కొందఱుఢక్కావాదులును కొందఱు హుడక్కావాదులును గొందఱుమృదంగవాదులును గొందఱుపటవాదులును గొందఱుకాహళవాదులును గొందఱుముఖవాదులును గొందఱుఛత్రధరులును గొందఱుచామరధరులును గొందఱుయాష్టికులును గొందఱునైష్ఠికులును గొందఱుసుముఖులును గొందఱుచతుర్ముఖులును కొందఱు బహుముఖులును గొందఱు గజముఖులును గొందఱజముఖులును గొందఱు ఋక్షముఖులును గొందఱుహర్యక్షముఖులును గొందఱు శార్దూలముఖులును గొందఱుసృగాలముఖులును గొందఱువృషభముఖులును గొందఱు శరభ

ముఖులును గొందఱు తురంగముఖులును గొందఱు కురంగముఖులును గొందఱు సుకరులును గొందఱు చతుష్కరులును గొందఱు బహుకరులును గొందఱు సునేత్రులును గొందఱు త్రినేత్రులును గొందఱుబహునేత్రులును గొందఱు శూర్పకర్ణులును గొందఱులంబకర్ణులును గొందఱు బహుకర్ణులును గొందఱు ద్విపాదులును గొందఱు బహుపాదులును గొందఱు వ్యాఘ్రపాదులును గొంద ఱంజనవర్ణులును గొందఱుకాంచనవర్ణులును గొందఱుధూమ్రవర్ణులును గొందఱు శ్వేతవర్ణులును గొందఱు పీతవర్ణులును గొందఱు లోహితవర్ణులును గొందఱు నీలలోహితవర్ణులును గొందఱు నానావర్ణధరులును గొందఱు నానావేషధరులును గొందఱు జ్వలదగ్నిప్రతీకాశతేజులును గొందఱు గ్రీష్మార్కనికాశతేజులును గొందఱు రాకేందుసంకాశతేజులును నయిన యసంఖ్యాతమహావీరు లద్భుతభయావహంబుగఁ గదలిరా నారద మునీంద్రుండంగులితో నవ్వారి వేఱువేఱుగఁ జూపుచు మేనక కిట్లనియె.

గీ॥ చూడుప్రమథగణంబులఁ ♦ జూడుభూత, సైన్యములఁజూడుమిఁకవీర ♦ సైన్యములను
జూడుమర్ధేందుభూషిత ♦ చూడుపేర్మి, సర్వపర్వతమూర్ధన్య ♦ సాధ్వి! యిపుడు.

—* మేనక శివునిఁజూచి భయపడి యాక్రోశించుట *—

శా॥ చూచెన్ మేనకయంత భీకరగణ ♦ స్తోమంబుతో భూతపై
శాచవ్యూహముతోడ వచ్చునభవున్ ♦ శార్దూలచర్మాంబరున్
రోచిష్కేశరాజరాంశునయనున్ ♦ శూలాయుధున్ గోరథున్
రోచిర్లిప్తఁ గపాలహస్తు సుకప ♦ ర్దున్ భస్మదిగ్ధాంగకున్. 284

ఉ॥ చూచినయంతనే వణఁకు ♦ చొప్పడ గాడ్పునఁ గూలినట్టి యిం
పౌ చివురాకు తీవవలె ♦ నద్రివరాంగన నేల మూర్ఛిలన్
జూచి చెలుల్ గడున్ దగిన ♦ చొప్పున సేవల నొప్ప సల్పుడున్
లేచి గిరీంద్రపత్ని యిటు ♦ లే విలపింపఁదొడంగె రోజుచున్. 285

ఉ॥ ఎక్కడిరుద్రుఁ డీతఁ డిటు ♦ లెంతయుఁ జూడ్కికి వ్రేఁగొనర్చె నిం
కెక్కడి దిక్కు నాతనయ ♦ కెక్కడ దాపరమయ్యె నీతఁ డిం
కెక్కడి యాస పుత్రిక యిఁ ♦ కెక్కడ యెక్కడిపెండ్లి యంచుఁ దా
వెక్కసమైన దుఃఖమున ♦ వేఁగుచు వీఱిఁడియై యలందురెన్. 286

క॥ కోపంబునుఁ దాపం బా, టోపంబును గదురఁగాఁ గ ♦ డున్ గటువొప్పన్
బాపంబని వెనుదీయక, తాపసవరుఁ దిట్టఁదొడఁగెఁ ♦ దగవుఁ దొలఁగుచున్.

—* మేనక నారదుని నిందించుట *—

క॥ ఓరీ! యుక్కివపుంజడ, దారీ! నీ వెంత కేని ♦ దగుదువు బళిరే!
వేరంబునూనుకొని నా, గారాబుకుమారిఁ జంపఁ ♦ గడఁగితివిటులన్. 288

ఆ॥ చిన్ననాఁడె నీవు ♦ శివున కీ శివ నిడుం, డంచుఁ జెప్పి తప్పఁ♦ దప్పగింతఁ
బెట్టివచ్చెఁ గూఁతు ♦ గట్టులదొర తోడ, నే జనించె బెడఁద ♦ యెంతయేని.

కం॥ మరల సుత కీవు రుద్రుని, మరలుకొనన్ జేయఁజాలు ♦ మంతరమిడి దు
శ్చరతపము సేయఁ బంపితి, వరరే! యీలాటిఫలము నమరించుటకై. 290

గీ॥ డాఁగి రిపు డెందుఁ దెల్లగ♦డ్డాల మేలి, యయ్యవారలు పెఱుకుదు♦నార్తిదఱుగ
వారి గడ్డంబులను; నెట ♦ జాటిపోయె. మాయలాడి ముసలిసాని ♦ మాటలాడి,

వ. అని కుమారిన్ జేరఁబిలిచి కటకటంబడి విలపించి యిట్లనియె. 292

చ॥ అకట కుమారి! నాకడుపు ♦ నాఱడిపెట్టితి వద్రివంశమున్
వికలతనొందఁ జేసితివి ♦ విశ్వవిమోహకమైన నీదు పు
ట్టుకయును నందచందము లెటో వనధిన్ బడఁద్రోసి తోసి తా
వక మవివేక మెంతటి య♦వస్థను దాకొనఁ జేసె మాకిటుల్. 293

సీ॥ రాజహంసమును బా♦ఱఁగఁదోలి వాయసం,బును గేలఁదాల్పఁగాఁ♦బూనుమాడ్కి
దంతావళము బాఱఁ♦దఱిమివైచి నికృష్ట, జంబుకంబును జేరఁ♦జనెడుచాడ్పు
తండులాన్నముఁ బాసి♦తవిటిరొట్టెనుగాల్చి, మెండుగా వేడ్కతో♦మెసవుపోల్కి
హైయంగవీనంబు♦నవలబోఁజల్లి కా, నుగునూనెఁ ద్రావఁగ♦ గడఁగువిధమున

గీ॥ బ్రహ్మవిద్యనువిడనాడి♦పామరోక్త, కుత్సితపుగాథలను వినఁ♦గోరుమాడ్కి
దేవవరులనుదిగనాడి♦తేఁకువెడలి, రుద్రుఁ బెండ్లాడఁబూనుట ♦ రుచిరగాత్రి!

ఉ॥ నిందితమయ్యె నీమనము ♦ నిందితమయ్యెను నీచరిత్రమున్
నిందితుఁడయ్యె నారదుఁడు ♦ నిందితులైరి భవత్సఖీమణుల్.
నిందితనైతి నే నకట ♦ నిందితుఁడయ్యె గిరీశ్వరుండునున్
నిందితమయ్యె సర్వమును ♦ నీరజలోచన! నీకతంబునన్. 295

వ. ఇట్లు ముమ్మరమ్మగు వ్యసనమ్మునఁ బరిపరివిధంబులఁ దలబోయుచు మిడుకుచుఁ బుడమిన్ బడి మూర్ఛిల్లుచు లేచుచుఁ బ్రబల వ్యాకులయై యమ్మేనక హాహాకారంబు లెసఁగ నేడ్చుచున్నంత వివాహార్థంబై యిరుగెలంకులవచ్చిన నిఖిల శైలసురమునిగణంబులును జేరవచ్చి యోదార్చుచుండ నారదుండు సాంత్వనంబున నిట్లనియె.

చ॥ అలజడిమాను శర్వుని య♦థార్థపురూపముఁ జూడవైతి వు
జ్జ్వలతరమద్ది మాయల నె♦సంగ ధరించిన రూపమిద్ది యిం
దులకయి యల్కఁ బాసి పరి♦తోషమునన్ శశిమౌళి కీ శివన్
దలఁపు లెసంగఁగా నిడి ద్రు♦తమ్ముగఁ బెండ్లియొనర్పు మమ్మరో! 297

## —* బ్రహ్మేంద్రాదిదేవతలు మేనకకు సమాధానముఁ జెప్పుట *—

క॥ అనిన విని మేన మునిఁగ,న్గొని దవ్వులకేగు మిఁకను ♦ గుటిల! యనుడుఁ జ
య్యన సంక్రందనముఖు లి,ట్లని రద్రీశ్వరుని సతికి ♦ నతివినయమునన్. 298

గీ॥ మేన! విను మాదునుడిని నె♦మ్మిన్ శివుండు, పరమసుఖదాత నీకూఁతు♦భవ్యతపసు
మెచ్చి దరిసెనమిచ్చి యి ♦ ట్లిచ్చెవరము, లేకపడయఁగవచ్చునే ♦ లోకనాథు,

గీ॥ అనుడువిని మేన చాలఁగ ♦ నక్కటికము, దోపమిడుకుచు ననియె నే♦దొడ్డయైన
నుగ్రతనుఁడగు రుద్రున♦కొసఁగనాత్మ, జాతను జనుండుమీ కేమి♦సమ్మెయిచట.

క॥ అన సప్తర్షులు డగ్గఱి, యనిరిట్లు గిరీంద్రపత్ని! ♦ యనువుగఁగార్యం
బనుకూల పఱుపవచ్చితి, మనఁదగునే యిట్టులరయ ♦ కనుచిత వాక్కుల్.

గీ॥ అర్థియై జగదీశ్వరుం ♦ డరుగుదెంచె, నీదుగేహంబునకు మేన ! ♦ యాదరమున
నాత్మజనొసంగి పాణిగ్ర♦హణముసలిపి, పంపుమొండనకిపుడువై ♦భవముదనర.

క॥ అనినన్ మేనకయనె మీ, మనసొప్పఁగటారిచేఁ గు ♦ మారిఁదునుముదా
ననుగాని శివునకొసఁగను, చనుఁడీక దవ్వులకు నాదు ♦ సముఖము విడుఁడీ!

## —* హిమవంతుఁడు మేనకకు సమాధానము సెప్పుట *—

మ॥ అనినంతన్ గిరినాథుఁ డాత్మసతి డా ♦ యన్ వచ్చి యోదార్చి యి
ట్లనియెన్ బేలవిదేల యెట్టిఘను లా ♦ త్మాగారమున్ జేరిరో
కన కవ్వాగల నెగ్గులాడఁ దగునే ♦ కల్యాణి! సర్వేశ్వరుం
డనఘుం డాతనిరూప మారయఁగ శ ♦ క్యంబే ప్రపంచంబునన్. 304

క॥ నానావిధరూపంబులఁ, బూని జనులమోసగించు ♦ ముగ్ధేందుధరుం
డానీతి నీవెఱుంగక, మానిని! యిటువంతనొంది ♦ మఱుఁగుటమేలే ?

ఉ॥ మాను హఠంబు శోకమును♦మానుము లెమ్ము రయమ్మునన్ బ్రియం
బూని వివాహమున్ సలుపు ♦ మున్నతియొప్పఁగ మున్ను నీవునున్
నేనును గూఁతు నీశునకు ♦ నిక్కముగా నొసఁగంగఁజెప్పమే
ప్రాణసతీ! మదిన్ దలఁపు♦పావనసత్యవచఃప్రసారమున్. 306

వ. అనిన విని మేనక కినుకమానక హిమాచలున కిట్లనియె.

ఉ॥ నావచనంబు విన్మిఁకను ♦ నాథ! గళంబునఁ దాడ్రుఁగట్టి యే
బావినినైన వేయుమిఁకఁ ♦ బార్వతి నంతియెగాని శూలికిన్
గావలెనంచు నీయఁజుమి! ♦ గంగనుగాని సముద్రమందుఁగా
నీ విడు మట్లొనర్చి మన ♦ మిందు సుఖమ్ముగనుంద మిమ్మునన్, 307

ఆ॥ అట్లుగాక తక్క ♦ యనుఁగుకూతును నీవు, రుద్రునకు నొసంగ ♦ రూఢిగాను,
కాయ మేను పాయఁ ♦ గాఁగలదానను, దెలియుమాత్మయందుఁ ♦ దెల్లముగను.

వ. అని యిట్లడ్డంకులు నుడువుచు నత్త్రాకలఁ జీకాకుపడి దురపిల్లుచున్న తల్లి౯ గాంచి యల్లనఁ బార్వతి యిట్లనియె. 309

ఉ॥ తల్లి! యిదేల నీదుమది ♦ తద్దయు మాఱెను దల్లక్రిందుగా
నెల్లెడ ధర్మమర్మము ల ♦ నేక మెఱింగినదాన వీవిటుల్
పొల్లుగ ధర్మము౯ విడువఁ ♦ బోలునె ? శంకరుఁ డప్రమేయుఁ డీ
యెల్లసురాళి నేలెడు మ ♦ హేశ్వరుఁ డల్పుఁడటంచు నెంచితే ? 310

వ. ఇఁక నందగాఁడు గాడందువేని వినుము.

గీ॥ లీలచేఁ బలు తెఱఁగుల ♦ బాలచంద్ర, ధరుఁడు గనుపట్టు నీవిటు ♦ తత్తరంబుఁ
జెందవలదిఁక వేగ న౯ ♦ శివునకిచ్చి, పెండ్లిచేసి యిల౯ బేరు ♦ పెంపుఁగొనుము.

క॥ అటు సేయక తక్కిన నే, నిటలాక్షునిఁ దక్క నన్యు ♦ ని౯ జేపట్టన్
స్ఫుటమిది త్రికరణపూర్వం, బిటు చెప్పితి లాఁతియొక్కఁ ♦ డెంచకు తల్లీ! 312

వ. ఇట్టుగాక యెట్టకేల కీవు దిట్టతనంబున రట్టడికోర్చి బెట్టిదంపుపట్టుతో నన్నుఁ బెరవానికిఁ గట్టఁబూనిన నది యెట్టుకడముట్టు నారయుము. 313

క॥ పంచాననధనమగు నన్, గొంచక యొండెవఁడు పెండ్లిఁ ♦ గొనఁగలఁ డంబా!
పంచాననధనము నిలన్, వంచకమతి యొక్కనక్క ♦ వడయునె యెందు౯. 314

వ. అనినవిని మేనక మిగుల విచారంబునొంది.

గీ॥ కన్నకడుపోట నెక్కుడు ♦ కక్కురితిని, గాసిపడియిట్టు లలమటఁ ♦ గాంచుటయ్యెఁ
గాకయొక్కరి కాన్పైన ♦ లోకులట్టు, లేనునున్ మిన్నకుండ నే ♦ యెల్లఁగనుచు.

ఉ॥ వేఁదుఱుగొన్న బాలయిది ♦ వేడ్క వరించెఁ గపాలి నెట్టులో
కాదను ధీరు లెవ్వరును ♦ గన్పడ రెందును నేమిసేతు నం
దేదయిన౯ గుణంబొకటి ♦ యేనియు లేదిఁక సాటివారిలో
నాదువిభుండు నేను గడు ♦ నవ్వులపాలగువార మక్కటా! 316

ఆ॥ మిగుల బుగులుసేయఁ ♦ దగునొడలిబ్బంగిఁ, గరముచూడ్కి కధిక ♦ భరముఁ గూర్ప
వెలయు నీత్రిశూలి ♦ కిల నేబెడఁగుఁ జూచి, యిగురుఁ బోణిఁ బట్టి ♦ యీవలయును.

ఆ॥ మేన యిట్లు మేర ♦ మీఱి దుఃఖంబుతో, నగడుఁ జెంది పొగుల ♦ నబ్జభవుఁడు
చేరవచ్చి యిట్లు ♦ చెప్పె మేనా! విను, మేను శంభుతత్త్వ ♦ మెఱుకపఱుతు.

ఉ॥ సర్వజగన్నిదానుఁడయి ♦ సర్వజగత్పరిపోషకుండునై
సర్వజగన్నిహంతయయి ♦ సర్వజగత్పరిపాలకుండునై

సర్వజగన్మయుండునయి ♦ సర్వనియామకుఁడై తనర్చు నా
శర్వునిరూప మారయఁగఁ ♦ జాలెదవా ? యిటు జాలినొందఁగన్. 319

క॥ మది నిట్లు దెలిసి శివునకు, ముదమున శివ నిమ్ము రోస ♦ మున్ విడుమిఁకఁ బెం
పొదవఁగ ననియన విని నగ, పొదలఁగ నగరాజవరుని ♦ బోటి యిటులనెన్.

ఉ॥ ఏటికి ధాత ! యిట్లు తగ ♦ వెంచక చెప్పెదు దీనిరూప మా
యేటికి ధారవోయుటకు ♦ నెంచితి వట్టులగాక దీనినే
యేటికిఁ ద్రోయరాదె ? విను ♦ మేనిఁక రుద్రున కీను బుత్రికన్
గోటు లిటుల్వచించినను ♦ గోవిదు లెంతకునైన దంట లే. 321

గీ॥ అనుడు సనకాదిసిద్ధు లి♦ట్లనిరి మేన!, పట్టుదల విడు శంభుండు ♦ పరమకృపను
నీదు కూఁతును మెచ్చి మ♦న్నించి యిట్లు, పెండ్లియాడంగవచ్చె భా♦వింపుమదిని.

గీ॥ అనినవిని మేన వనరుచు♦ననియెనిట్లు, నుగ్రునకు నాదుకూఁతు నే♦నొసఁగ నెపుడు
మాగొడవ యేటి కిఁక మీకు ♦ మానిపొండు, సిద్ధులార! త్రిలోకప్ర♦సిద్ధులార!

ఆ॥ అనినయంతఁ బద్మ♦జాదినిలింపులు, మునులు చకితులగుచు ♦ మూర్ఖురాలి
యుల్ల మెట్లు చక్క ♦ నొందింపనగునని, కలఁకఁ జెంది వెఱఁగుఁ ♦ గాంచి రంత.

—* విష్ణుమూర్తి మేనకను మరల శివునిఁ జూడుమనుట *—

ఉ॥ మాటలపొం దెఱింగిన ర ♦ మాపతి యంత నెఱింగి వచ్చి య
ప్పాటలగంధి కిట్లుగరు ♦ వంబుగఁ జెప్పెఁ బురంధ్రిరత్నమా !
బూటకమాడ నే నిఁకను ♦ బొల్పుగ విన్ము మదుక్తిఁ గన్మ నీ
పాటికులాంగనల్ గలరె ♦ పాత్రివమందును భాగ్యమందునన్. 325

చ॥ ఒకనుడి యాలకింపుము గు ♦ ణోజ్జ్వల! మానులుగాని పద్మజా
దికసురవర్గమేనియు మ ♦ దిన్ బగఁదాల్చి యిటుల్ వచించిరో
యకుటిలమైన ప్రేమమున ♦ నారసి చెప్పిరొ యొప్పఁగాంచుమీ
సకలమెఱింగినట్టి గుణ ♦ శాలిని పీ వగరాజగేహినీ ! 327

ఉ॥ ఏనను సుంతవిన్ము శివుఁ ♦ డద్భుతలీల ననేకరూపముల్
బూనిచరించుచుండు నొక ♦ పోవడిఁ బోయెడువాఁడు గాఁడిఁకన్
మానిని! యెట్లుసూచి యను ♦ మానము నొందితివో మహేశ్వరున్
మానుగఁజూడుమీ మరల ♦ మానసమందుఁ బ్రమోదమేర్పడున్. 328

ఉ॥ ఇత్తఱి నీదుచిత్తమున ♦ కెంతయు నచ్చిన నిమ్ము పుత్త్రికన్
హా త్తకయుండెనేనియును ♦ నడ్డమెనీకిఁక మానివేయుమీ
యుత్తమమైన మార్గమిది ♦ యూరక యేటికి వాదులాడ భా
స్వత్తరదివ్యదీధితివి ♦ భాసితమూర్తి శివుండు చూడుమా! 329

*గీ॥ వామదేవుఁడుగాఁడమ్మ♦ వామదేవుఁ, డతఁడురుద్రుఁడుగాఁడమ్మ♦ యతఁడురుద్రుఁ
డాతఁ డభవుఁడుగాఁడిఁక ♦ నతఁడభవుఁడు, దెగడకారయు నగరాజ♦ దేవి! మదిని.

వ. మఱియు నొక్కమాటవినుము.

గీ॥ నిర్గుణుండయిభాసిల్లు ♦ నిత్యపురుషుఁ, డిట్లు లోకహితమునకై ♦ యెలమి నవత
రించె నీతఁడెకాఁడె పు ♦ ట్టించెజగము, లెల్లవేదంబులను నెల్ల♦ నెఱుఁగు మబల!

ఉ॥ ఈతనిచేతనే పొడమె ♦ నీశ్వరశక్తి కృపాళువీ జగ
న్మాత యజుండు నేనిఁక న ♦ మర్త్యులు మర్త్యులు సర్వభూతముల్
ఖ్యాతిగ నీతఁడే భువన ♦ కాండములన్నియు నేలుతేఁడు నీ
వాతురతన్ దొలంగి నిజ ♦ మారసి భద్రములొందు మమ్మరో! 331

ఆ॥ పద్మనయనుఁ డిట్లు ♦ పలుకంగ హృదయంగ, మంబులైన నుడుల♦మదియొకింత
బెదరుమాని మేన ♦ పేర్మిమై హరికనె, మరలఁజూతుశివుని ♦ మారహరుని. 332

కం॥ ఈమాత్రైనను శివుఁ డభి, రామాకృతిఁ దనరెనేని ♦ రామనొసఁగి వేఁ
బ్రేమమునఁ బెండ్లిచేసెద, నేమాత్రము బొంకులేద ♦ హీనచరిత్రా! 333

ఆ॥ అట్లుగాకయున్న ♦నచ్యుత! మీరెల్లఁ, గోటియత్నములను ♦ గూర్చినను మ
దీయతనయ నీయ ♦ దిటమిది నామాట, వినుఁడు దీసికన్న ♦ వేఱు లేదు. 334

కం॥ అనుడు వనజాక్షముఖులగు, ననిమిషవరు లనుమతించి ♦ యభవునిచేరన్
జని రన సూతునిఁ గని మును, లని రవ్వలికథను జెప్పు ♦ మనుచున్ బ్రీతిఁ.

శా॥ నానాశైవపురాణవృత్తనిచితా ♦ నందోల్లసన్మానసా!
సూనాస్త్రాంతకలింగపూజనలస ♦ చ్ఛుభ్రాత్మనాగాంబికా
ధీనాంతఃకరణా! దిగంతవిలస ♦ ద్దివ్యద్యశోమండనా!
దానాగ్రేసరదన్నదానకుశలా! ♦ ధైర్యాతిహేమాచలా! 336

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వర నామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి పార్వతీఖండంబునఁ
జతుర్థాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



* టిప్పణి— వక్రుడగు దేవుడుకాఁడు - సుందరుఁడగు దేవుఁడు - ఏడ్పించువాఁడుగాదు —
రోగమును బాపువాఁడు - సంసారము లేనివాఁడుగాదు - పాపములేనివాఁడు.



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## పార్వతీ ఖండము

### పంచమాశ్వాసము.



మత్త్రిపురాంతక భూ
సామీప్యవిరాజమాన ♦ శైవపురభవా!
క్ష్మామరశశికోటీశసు
తా! మామకజనని! లక్ష్మ ♦ మాంబా! సుమతీ! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

ఉ॥ శ్రీవిభుఁ డంత శంకరునిఁ ♦ జేరి ప్రణామముచేసి మేనకా
దేవివిధంబుఁ జెప్పి యిఁక ♦ దేవహితంబునకై మహాత్మ! నీ
పావనజాక్షి మెచ్చునటు ♦ లారసి చక్కఁదనంపు రూపమున్
శ్రీ వెలయన్ ధరించి యుమఁ ♦ జేకొని పెండిలియాడు మర్మిలిన్. 2

—* విష్ణు ప్రార్థనచే శివుఁడు దివ్యసుందరరూపంబు నొందుట *—

గీ॥ అనుచు హరి యిట్లు లర్థింప ♦ నబ్జచూడుఁ, డమరకార్యచికీర్షతో ♦ నతిమనోజ్ఞ
మైన యుజ్జ్వలరూపంబు ♦ నంది చూడ్కి, కెలమికలిమిఁ బొసంగఁగ ♦ నెసకమెసఁగె.

వ. అంత నమ్మహాదేవుని దివ్యరూపంబుఁ జూచి పుండరీకాక్షుండు పరవశుండై శిరః
కంపంబు చేసి మెచ్చి యమితానందంబున నారదుఁ జూచి మేనక నిటకు దోడ్తెమ్ము
నుడు నతండు మేనకన్ జేరఁబోయి యిట్లనియె.

గీ॥ రమ్ము మేన! విశాలాక్షి! ♦ రాజచూడుఁ, జూడు కరుణామయాత్ముఁడై ♦ సురుచిరంపు
రూపుఁ గైకొనియున్నవాఁ ♦ డేపుమీఱు, నీ యవిద్యాతమం బది ♦ పాయునిపుడు.

## —* మేనక శివునిఁజూచి యానందించుట *—

వ॥ అనిన విని మేనక యత్యంతకుతూహలస్వాంతయై సంతసంబునఁ బరిచారికా
శతంబుతోడ వచ్చి దవుదవ్వులనుండియే మహేశ్వరునిఁ జూడఁదొడంగుడు. 6

సీ॥ కోటిమన్మథలీలఁ ♦ గొనఁబాలు చక్కఁద, నంబు మేలొందు రూ♦పంబువాఁడు
కోటిసూర్యులకాంతిఁ ♦ గోజుఁతఁబెట్టించు ద, ట్టంబైన కాంతిమం♦డలమువాఁడు
కోటిచంద్రమసుల ♦ కోమలకళల ర, మ్యాంబైన నగుమేమొ ♦ గంబువాఁడు
కోటీంద్రవిభవంబుఁ ♦ గుదువపెట్టుకొను ది, వ్యంబైన మణిమండ♦నంబువాఁడు

గీ॥ చారుకస్తూరికాగరు ♦ చందనాను, లేపనసుగంధబంధురా♦టోప మెసఁగు
వాఁడురుచిరతరామూల్య♦వస్త్రయుగ్మ,కలితుఁడగువాఁడుశంభుండు♦గాంచఁబడియె

ఉ॥ పూఁచినచంపకప్రసవ ♦ మున్ నిరసించెడి మేనిచాయవాఁ
డేచిన తేంట్లనిగ్గుల జ ♦ యించు కచప్రచయంబువాఁడు కాం
తాచతురేక్షణంబులకుఁ ♦ దావలమై యలరారువాఁ డప
ర్ణాచిరసంభృతోత్తమధ ♦ నంబగువాఁ డగుపట్టె మేనకన్. 8

సీ॥ గంగాయమున లింపు♦గదసి యిర్వంకలఁ, జామరంబులసేవ ♦ సల్పుచుండ
సూర్యచంద్రులు గడు ♦ సుందరంబగుసిత, చ్ఛత్రంబు వేడ్కతో ♦ సంతరింప
సిద్ధవ్రష్టశంబు వా♦సిన్ బాంగి ముందఱ, జెలువుగ నృత్తంబుఁ♦జేయుచుండ
శశాంజ కేశవుల్ ♦ సంతసం బిగురొత్త, జయనినాదంబుల ♦ సందడింప

గీ॥ పరఁగ విశ్వావసుండు న♦చ్చరలుఁ బ్రోల, బాగుగామృదుగీతులఁ ♦ బాడుచుండ
మునుబు వెనుకొనియామ్నాయ♦ములనుజదువ,నలరుశంకరుఁగాంచెశై♦తాద్రిపత్ని.

క॥ నందియుఁ బుత్తడిబెత్తము, నంది పసందొప్పఁ బ్రోల ♦ నలరుచు నిలువన్
గందువఁబ్రమథు లమర బా, లేందుధరునిఁజూచె మేన ♦ యింపలమికొనన్.

గీ॥ కాంచి మేనక దా విస్మ♦యించి కడుఁబ్ర, మించి హర్షించి మదినిభా♦వించెనిట్లు
ధన్యనాపుత్రి నేనును♦ధన్యనిఁకను, ధన్యుఁడు గిరీంద్రుడెంతయుఁ♦దథ్యముగను.

గీ॥ జాతె నేటఁ బునుకలపేరు ♦ గారుతోలు, చేతిపుత్రయు నెదపయిఁ♦జెలగుచిలువ
ముదుకగడ్డంబెటులమాటె♦మోసవడితి, నొక్కొయక్కజమియదియొక్కయెడను.

క॥ అని మును శివదూషణ చే, సినదానికి నొచ్చుకొనుచు ♦ శివునకుఁ దా జో
తను జేసి వినయమునఁదన, యనుచితమును సైఁపుమనుచు ♦ నంజలి చేసెన్.

గీ॥ శివునెదుర్కొనివరపూజ♦సేయుపొంచె, తనదువిభునాజ్ఞనాత్మీయ♦ధామమునకు
మేనచనుడు శివుం డురు♦స్నానవాద్య,ములుసెలఁగ నగరాడ్గేహ♦మునకుఁదరలె.

—* నాగరస్త్రీలు శివునిఁ జూచుట *—

క॥ మేళంబుల మ్రోఁతలు విని, కాళికకగు మగనిఁజూడఁ ♦ గా నాగరలా
నాళీకనేత్ర లెంతయు, వైళంబుగఁ బనులు వదలి ♦ వచ్చిరి తోడ్తోన్. 15

చ॥ చెలువ యొకర్తు మజ్జనము ♦ సేయుచుఁ గుంతలబృందమందుఁ దా
పుల విలసిల్లు చూర్ణమును ♦ బొందుగఁ జేర్చినవేళ మేళముల్
సెలఁగుచు మ్రోయ శంకరుఁడు ♦ చేరఁగవచ్చె నటంచు మేల్ కుతూ
హలమున జాలమార్గమున ♦ నబ్జకిరీటునిఁ గాంచె వేడుకన్. 16

ఉ॥ రామయొకర్తు పాపని సు ♦ రమ్మునఁ జేరిచి స్తన్యమిచ్చుచున్
సోమకలావతంసునిఁ గ ♦ నుంగొనఁ గుఱ్ఱని డించి చంద్రశా
లామహిఁ జేరి విభ్రమవి ♦ లాసవిశేషములొప్పఁ గన్గొనెన్
గోమలకాంతిమండనుని ♦ గోపతిశేఖరకేతనున్ దమిన్. 17

ఆ॥ పడఁతియొకతె గేస్తు ♦ పజ్జఁ జామరమును, జేతఁ దాల్చి తనదు ♦ చెలియతోడ
వీచుచుండి శివుఁడు ♦ విచ్చేసె ననఁగనే, యట్టె వచ్చిచూచె ♦ నధిపుఁ బాసి.

మ॥ పులినశ్రోణి యొకర్తు జిల్గువలువన్ ♦ బొంకమ్ముగాఁ గట్టుచున్
గులశైలేంద్రసుతామనోవిభునిఁ గ ♦ న్గొనెంచి యాత్రంబునన్
వలచే నీవిని వామపాణి రశనన్ ♦ వాటంబుగాఁ బట్టి య
గ్గలికన్ జాలమునుండి కన్గొనియె న ♦ క్కందర్పదర్పాపహున్. 19

ఉ॥ కామినియోర్తు సాపడఁగఁ ♦ గాంతుఁడు లోఁగిటఁ గూరుచుండఁగాఁ
గామవిభంజనప్రమథ ♦ కాహళతూర్యము లాలకించి స్వ
స్వామికి మ్రొక్కి యాజ్ఞఁ గొని ♦ చావడి బల్వడిఁ జేరిచూచెఁ గాం
తామధురాంగసుందరు సు ♦ ధాధరశేఖరుఁ గోర్కులూరఁగన్. 20

చ॥ కలికి యొకర్తు కన్నులకుఁ ♦ గాటుక దిద్దికొనంగఁ బూని యి
మ్ముల నొకకంటఁ గజ్జలముఁ ♦ బొందికఁ గూర్చి శివుండు వచ్చెనం
చలుకుడు నాలకించి యొక ♦ హస్తమునందు శలాకఁ దాల్చి వె
గ్గలపుఁ దమిన్ గవాక్షమునఁ ♦ గామమదాపహుఁ గాంచె జెచ్చెరన్. 21

క॥ పెదవికి లాక్షను గూరుచు, నదనున నొక యందకత్తె ♦ యగు జవరాల
య్యదె శివుఁడువచ్చెనని విని, ముదమున మొగసాలఁ జేరి ♦ మురిసెఁ గనిహరున్.

ఉ॥ సుందరియోర్తి పాదముల ♦ సొంపెసలార నలక్తకంబు చే
తం దళుకొందు రంజనముఁ ♦ దా రచియించుచు వాద్యనిస్వనం
బుం దమకంబుతో విని ప్ర ♦ మోదముతోఁ గిటికీనిఁ జేరి చూ
చెం దరుణేందుశేఖరునిఁ ♦ జెన్నుగఁ జన్నులు పుల్కరింపఁగన్.

గీ॥ ఒక్కకప్పురపుఁగ్రగంధి ♦ యొడయఁడించు; విల్తుకేళికిఁ బైకొను ♦ వేళ శివుని
మేళములఁ బ్రోఁతవీ తెంచ♦ మెలఁతమగని, ద్రోసికొనివచ్చి వేడ్కనిం♦దుధరుఁగనియె.

సీ॥ స్తనమండలమునఁ జం ♦ దనమలందుచు నీశుఁ, జేరికన్గొనెనొక్క ♦ చిగురుబోఁడి
వేనలిఁ గేదంగి ♦ విరులఁగూర్పుచు శివు, డాసి కన్గొనెనొక్క ♦ భాసురాంగి
మొగమునఁ గస్తూరి ♦ బొట్టుదిద్దుచు శర్వుఁ, గదిసికనియె నొక్క ♦ కలువకంటి
పుక్కిటఁ గప్పురం ♦ బున్ విడెంబేయుచు, హరుఁ జేరికనె నొక్క ♦ యన్నుమిన్న

గీ॥ కొప్పుదీర్చుకొనుచు నొక్క ♦ గుబ్బలాఁడి, తివిరి బాలేందుశేఖరుఁ♦ దేఱిచూచె
పుష్పరజమును మేనిండఁ♦బూసికొనుచు, వచ్చి శంకరుఁగనెనొక్క♦వాలుఁగంటి. 25

సీ॥ వీణెమీటుచు నొక్క ♦ వెలఁది వాతాయనం, బుననుండి కాంచె శం♦భుని ముదమున
చిత్రంబు వ్రాయుచు♦ సింగారి యొకతె ముం, గిలిఁ జేరి చూచెఁ గో♦ర్కులమహేశు
బంతులాడుచు మేడ♦ పయినుండి కాంచెగు, బ్బెత యొూర్తి శివుఁ దళు♦ బెళ్కులెసఁగఁ
గవనమల్లుచుఁ జేత ♦ గంటంబుఁ దాల్చియు, ప్పరమెక్కి శివుఁ జూచెఁ♦ భామ యోర్తు

గీ॥ ఇట్లు పనులెల్ల మాని తా♦మిగురుఁబోణు, లెల్ల ఘంటాపథంబందు♦ హిమగిరీంద్ర
పుత్రికాహృదయేశ్వరుఁ♦ బొంగిపొరలి, కాంచి రెంతయు విస్మయా♦క్రాంతలగుచు.

వ. మఱియొక ముందఱివీధిలో

సీ॥ తననవ్వుఁ బోలు నం♦దపుమేల్మిమగరాల, శివునిపైఁ గురిసెను ♦ జెలువయొకతె
తనమోవిఁ బోలునె ♦ ఱ్ఱనమించు కెంపుల, హరుపదంబులఁ గుప్పె♦ నతివయొకతె
తన మేనిచాయఁ బో♦లిన కుందనపుఁబూల, భవుమీన రాల్చెను ♦ భామయొకతె
తనకురులనుదీటు ♦ కొనునీలముల నలి, గళుమెడఁ జేర్చె సిం ♦ గారి యోర్తు

గీ॥ తనదుచూపుల బోలు ని♦ద్దంపుటాణి, ముత్యముల నొక్కమదిరాక్షి♦ ముగ్ధచంద్ర
ధరుకిరీటంబుపైఁ జల్లెఁ♦ దలిరుఁబోఁడు, లెల్ల మేడల నిట్లు రంజిల్లిరపుడు. 27

వ. వేఱొక్కపేటయందు.

క॥ శివమూర్తిని హృదయంబుల; నవధానముతోడఁ దాల్చి ♦ యబ్జాతముఖుల్
వివిధవచోరచనల నిటు, భవుఁ గూర్చి ప్రశంసనములఁ ♦ బరపిరి వేడ్కన్. 28

## —* నాగరస్త్రీలు శివునిఁ బ్రశంసించుట *—

సీ॥ ఈ ధన్యుఁడే కదా ♦ యీ జగంబులకెల్ల, నాదికారణమైన ♦ యనఘమూర్తి
ఈ మాన్యుఁడే కదా ♦ యీ హరిబ్రహ్మాది, నైలింప చక్రంబు ♦ నేలు ఱేఁడు
ఈ చతురుఁడె కదా♦ యీ ప్రపంచములకుఁ, బంచకృత్యముల యో♦జించు దంట
ఈ కుశలుఁడె గదా ♦ యిమ్ముగా షడ్గుణై, శ్వర్య సమృద్ధితోఁ ♦ బరఁగు మేటి

గీ॥ ఈ సరసుఁడే కదా మన ♦ హిమనగేంద్ర, బాలికాచేతమును బరి♦పరివిధములఁ
జాలఁగాఁ బరిశీలించి♦ మేలివరము, నొసఁగి పెండ్లాడవచ్చిన ♦ యూర్జితుండు. 29

వ. వెండియుం గొందఱు మెఱుంగుబోణులు మిద్దియలం గాచికొని తమకురంగటం గదలిపోవుచున్న సారంగభృచ్చూడామణిం గనుంగొని పొంగుచు నిట్లనిరి. 30

సీ॥ హాలాహలముఁ ద్రావి యఖిలలోకంబులఁ, గాచిన ఘనదయాకరుఁ డితండె
త్రిపురదైత్యులఁగాల్చి త్రిభువనంబులనెల్లఁ, బ్రోచిన మగసిరిప్రోడయితఁడె
దక్షాధ్వరంబు విధ్వంసంబొనర్చి జే,జేల శిక్షించిన జెట్టి యితఁడె
కమలజవిష్ణుల కలనెడఁజేసి లిం,గాకారుఁడైన మహాత్ముఁ డితఁడె

గీ॥ చెలిమియలరఁగ నామఱ్ఱిచెట్టుక్రింద, సనకముఖసంయములకు సత్పురపదార్థ
బోధనంబొనరించిన బోద్ధ యితఁడె, విశ్వములనెల్లఁ బోషించు విభుఁడితండె.

ఉ॥ ఎంతతపంబుఁజేసిరొ గిరీంద్రుఁడు మేనకయుఁ గుమారికిఁ
కంతునిగెల్చినట్టి దొర కాంతుఁడుగా నొనఁగూడు కల్మికి
భ్యంతికమందు నున్న మన మందఱ మెమ్మెయి నోఁచినామొ! య
త్యంతము గన్నులొందె సుఖ మందెను జన్మము ధన్యతాగతిన్. 32

క॥ వారే సిరిగలవారలు, వారే చెలువుగలవారు వారే వలఁతుల్
వారే చదువరులిట నే, వారలు శంకరునిఁ గనులఁబడయఁగలిగిరో. 33

వ. ఇంకను గొందఱు మచ్చెకంటులిచ్చమెఱయ మెచ్చుచు నిచ్చొప్పున హెచ్చుగ నుచ్చరించిరి. 34

చ॥ కువలయనేత్రికీ యుమకుఁ గోరినయట్టుల రాజశేఖరున్
సువిహితభంగి వల్లభునిఁ జొప్పడఁజేసిన దైవ మెంతయున్
స్తవమున కర్హమయ్యె నిటు దప్పి మఱొక్క తెఱంగుచేసినన్
కవకవ దిట్టరొక్కొ! కల కాలము భూప్రజలెల్ల గొల్లునన్. 35

క॥ ఇందిర హరిన్ బడసి వా, క్సుందరి పరమేష్ఠిఁబడసి సొంపొందిరెటుల్
కందర్పజయునిఁ జేకొని, యొందు నటులె చిరసుఖంబు లుమ క్షమలోనన్.

గీ॥ అనుచు నాగరకామిను లతిముదమునఁ, జాలఁగై వారములుసల్పి శర్వుపైని
ముత్తియంబుల రవలఁ గెం పులను బుష్ప, ములను సేసలనున్ జల్లి మురిసిరంత.

క॥ భూరితరమై భవంబున, నూరేగుచు జగదధీశుఁ డురువిభవాలం
కారంబగు గిరిరాజా, గారద్వారంబుఁ దఱియఁ గాఁ జనుదేఱన్. 38

—* హిమవంతుఁడు వరపూజచేసి పెండ్లివారిని విడిదిలోఁ బ్రవేశపెట్టుట *—

మ॥ పరివారంబులతో సుమేరుముఖవి భ్రాజద్గిరీంద్రాళితో
పురవాస్యగ్రజనుప్రకాండతతితోఁ బుత్రప్రధానాళితో
సరవిన్ శర్వున కర్ఘ్యమిచ్చి వరపూజన్ జేయఁగావచ్చె నా
గిరిరాజేంద్రుఁడు ద్వారభూమికి వడిన్ గీర్వాణు లుప్పొంగఁగాన్. 39

క॥ మేనక సువాసినీతతి, తో నిఖిలేశ్వరున కెలమి ♦ తో గుమ్మమునన్
దా నీరాజనమిడ న, న్యానామోదమునవచ్చి ♦ యుత్సాహమునన్. 40

సీ॥ మరలఁ జూచెను శివుఁ డస ♦ మానతరుణ, దివ్యకోమలమోహన♦దేహుఁ దుహిన
భానుశకలావతంసవి ♦ భ్రాజమానుఁ, గాంతసంతానసుమదామ ♦ కలితవక్షు.

క॥ కనుఁగొని చూడ్కి మరల్పఁగఁ, దనవలనన్ గాకయున్నఁ ♦ దన్వీమణి చి
త్రనిచితమూర్తివలెన్ దగి, యొనరిచె నెట్టులొ నివాళి ♦ యుత్సుకమతియై.

క॥ మును గాళిక దనతోఁ జెప్పిన విధమునకన్న మిగులఁ ♦ బ్రియమగు చక్కం
దనమునఁ దనరెను శివుఁడని, మనమలరఁగ నిమ్ముఁ జేరె ♦ మానినియంతన్.

గీ॥ తోడవచ్చిన యువతులు♦తుహినకిరణ, మౌళిఁగని సంతసించి యి♦మ్మాడ్కిఁ బలికి
రహహ! గిరిపుత్రి భాగ్యమే♦మనఁగవచ్చు, నెంతయందంపుఁ బతిలభి♦యించెఁ దనకు.

క॥ ఎంతైనను గంటిమె చక్కందనమును నీడుజోడు ♦ గరగరికయు హె
చ్చుందగు కల్మియు నిటులన్, బొందికగలవరు నటంచు ♦ బోరుకొనిరొగిన్. 45

వ. అయ్యవసరంబున.

తరల. గిరివరేంద్రుఁడు ద్వారభూమి నొ ♦ గిన్ బురోహితయుక్తుఁడై
స్థిరమతిన్ వరపూజ సల్పెను ♦ శీతరశ్మికిరీటి క
వ్వరుసవాద్యములెల్ల మ్రోయఁగ ♦ వారితోడ గిరీంద్రమం
దిరముఁ జేరె మహేశుఁడ త్తతి ♦ దివ్యసంఘము గొల్వఁగాన్. 46

కవిరాజవిరాజితము.
అందును నూత్నవినిర్మితమై తగి ♦ నట్టి వివాహపుమందిరమం
దిందుధరుండు గణావళితోడ ము♦నీ త్తతితో నమరావళితోఁ
బొందుగ నర్హవిధిన్ దగు తావునఁ ♦ బూజితుఁడై నివసించె లలిన్
విందులుసేయుచుఁ గొల్చ నికామప♦విత్రచరిత్రుఁడగేంద్రుఁడటన్

## —* పార్వతి కులాంబాపూజార్థమై వెడలుట *—

ఉ॥ ఆసమయంబునందుఁ దుహి ♦ నాచలకన్య నిజాన్వయాంబికా
వాసముఁ జేరి కొల్చుటకు ♦ వాద్యము లొక్కట మ్రోఁగఁగాఁ జెలుల్
దాసజనంబులున్ దనదు ♦ తల్లియు విప్రసువాసినీమణుల్
వాసిగఁ జేరి రాఁ బసిఁడి ♦ పల్లకినెక్కి చనెన్ ముదంబునన్. 48

గీ॥ అంబికాపూజనమునకై ♦యరుగుదెంచు, నట్టి జగదంబికనుగాంచి♦యఖిలమునులు
ననిమిషులు విస్మితాస్యులై ♦హర్షభరము, నను విలోకనములఁ ద్రిప్ప♦ననువుపడక.

సీ॥ అల్లనేరెడుపండ్ల ♦ యంద మమ్మఁగఁ జాలు, జిగిగ్రాలు మైనిగ ♦ నిగలదాని
చిఱునవ్వుదోలకాడు ♦ సిందూరతిలకర, మ్యంబైన ముద్దుమొ ♦ గంబుదాని

మందారసుమము ల ♦ మర్చి కూర్చిన లలి, తంబైన కబరీభ ♦ రంబుదాని
వాణిముత్యంబుల ♦ హారముల్ రత్నహా, రంబులు దనరు వ ♦ క్షంబుదాని

గీ॥ చారుతరరత్నకంకణ ♦ సంకలితక, రద్వయం బొప్పుదాని వ ♦ జ్రములకమ్మ
లొప్పువీనుదోయిఁదళ్కుల ♦ నొసఁగుదాని, శివునకగుసురతాణి జే ♦ జేలుగనిరి.

క॥ కనుఁగొని మదిలోఁ దత్పద, వనజములకు మ్రొక్కులొసఁగి ♦ వారనిభక్తిన్
బెనఁగొనుముదమునఁబొదలుచు, మనములఁదాపంబులెల్ల ♦ మానిరి కడఁకన్.

క॥ జగదీశ్వరుండు నత్తఱి, జగదంబను వికసితాక్షి ♦ సారసముల ని
మ్ముగఁగని విరహజ్వరమున్, దిగనాడెను నాటుకొన్న ♦ దిగులెల్లఁ జనన్.

గీ॥ అంతఁ గాళి కులాంబొస ♦ మర్చనంబు, కరము పేరిమిసల్పి సిం ♦ గారమమర
వైభవం బేపుమీఱఁగ ♦ వచ్చె మరల, గిరివరేశ్వరు మంగళ ♦ గేహమునకు.

క॥ హిమవంతుని ప్రార్థనమునఁ, గమలాక్షముఖామరాగ్రి ♦ గణ్యులు వేగన్
గొమరగు వివాహమంటప, మమితోత్సాహమునఁజేరి ♦ యందు రయమునన్.

—* దేవతలు మహేశదత్తభూషణంబులఁ బార్వతి నలంకరించుట *—

గీ॥ వేదమార్గానుసరణిఁ బృ ♦ థ్వీధరాత్మ, జాతను మహేశదత్తవి ♦ స్తారభూష
ణావళిన్ గయిసేసి ర ♦ జ్జాలయాది, కమలగంధులు నీరాజ ♦ నములనిడిరి. 55

వ, ఆసమయంబున,

క॥ శైలేంద్రుఁడు బ్రాఁపలకున్, జాలఁగ దానంబులిచ్చి ♦ సన్మానించెన్
మేలుగఁ బేదలకును ద్రవ్యాళిన్ గడుఁ బంచిపెట్టె ♦ నామోదమునన్. 56

గీ॥ అంతటఁ బురోధసుఁడు జ్యోతి ♦ షాగమప్ర, వీణుఁడును నగు గర్గుండు ♦ వేగ శైల
పతినిఁగనిపల్కె నధిప! సాం ♦ ప్రతమువడిగ, శివునిఁదోడ్తెమ్ము పెండ్లికై ♦ సిద్ధముగను.

వ. అనినవిని యంత హిమవంతుండు సుముహూర్తంబు ప్రత్యాసన్నంబగు టారసి
సంతోషితస్వాంతుండై మేర్వాదిగిరివరులను కుమారుల నగ్రజన్ములతో శివుని
దోడ్తేరఁ బనుపుడు వార లనేకవాద్యపురస్సరంబుగ శివసముఖమునకుఁ జేరఁబో
వుడు నందలి ప్రమథదేవమునిగణంబు లానందంబుతో వారి నెదుర్కొని గౌర
వింపుడు నవ్వారలు శంకరునకుమ్రొక్కి కన్యాదానోచితసమయం బాసన్నంబయ్యె
వేవేగ విచ్చేయుండని యర్థింపఁ బరమేశానుండును హర్షించి. 58

గీ॥ మంగళద్రవ్యములతోడ ♦ మజ్జనంబు, సలిపి శుద్ధదుకూలముల్ ♦ చక్కఁగట్టి
తిలకమునుదిద్దివృషమెక్కి ♦ దేవమునిగ, ణములుగొలువఁగ దివ్యవా ♦ ద్యములు సెలఁగ.

—* శివుఁడు కల్యాణమంటపమునకు వచ్చుట *—

క॥ శ్వేతచ్ఛత్రము మణివి, ద్యోతితపాదుకలు విలస ♦ దురుచామరముల్
ప్రీతి సురవరులు పూనఁగ, గీతుల గంధర్వులలరి ♦ కీర్తనసేయన్. 60

క॥ రంభాప్రముఖాప్సరసలు, శుంభద్గతి నృత్తగరిమఁ ♦ జొక్కింపఁగ నా
జంభారియుఁ బరమేష్ఠియు, నంభోజాక్షుండు నగ్ర ♦ మందు నిలువఁగాన్. 61

గీ॥ అదితి మొదలగు బృందార ♦ కాంబ లెలమిఁ
బువ్వులన్ జల్లుచుండ శం ♦ భుండు పరిణ
యంపు మంటపమున్ జేర ♦ నరుగ నగవ
రులు వృషమునుండి దింపి శ ♦ ర్వునిఁ బ్రియమున. 62

క॥ కొనిచని మణిమయపీఠం, బును నెక్కఁగఁజేసి మ్రొక్కి ♦ పొంగుచు నీరా
జనమొసఁగి తోడవచ్చిన, ఘను లందఱి కందుఁ బసిఁడి ♦ గద్దె లిడి రొగిన్. 63

క॥ హిమవంతుఁడు వేడుకతో, సమితామోదమున డాసి ♦ యభవునకుఁ బ్రణా
మముచేసి దేవమునులకుఁ, గ్రమముగ వందనముచేసె ♦ గౌరవ మొసఁగన్.

వ. ఇఁక మేనక తనూజాతకు.

సీ॥ బంగారుసరిగంచు ♦ పట్టుపుట్టముఁగట్టి, రవణించు హారంబట్టు ♦ రైకఁదొడగి
వలిపంపు జాళువా ♦ వల్లెవాటొనరించి, మేలి మేల్మిముసుంగు ♦ గీలుకొలిపి
పసపులత్తుక రేఖ ♦ పదముల పైఁబూసి, పునుగు గంధమును మే ♦ నుననలంది
కనుఁగవఁ గప్రంబు ♦ కజ్జలంబును దిద్ది, కైశ్యంబునన్ సంపె♦గలను దురిమి

గీ॥ నుదుటఁగల్యాణతిలకంబుఁ ♦ గుదురు పఱచి
అఖిలలోకైకరాజ్ఞియా ♦ నార్యనొకప
సిండిపుట్టికయందుఁగూ ♦ ర్చుండఁజేసి
యవనికాంతర్ధి యందుంచెఁ ♦ బ్రియము మెలయ. 65

గీ॥ కృత్యవిదుఁడౌ పురోధస ♦ త్కృతియొసంగ
నపుడు పుణ్యాహమును ♦ బాడి యగకులేంద్ర
తల్లజునిచేతఁ గన్యకా ♦ దానమునకుఁ
జెలఁగి సంకల్పమొనరింపఁ ♦ జేయ నతఁడు. 66

వ. పురోహితోక్తప్రకారంబున.

క॥ రక్షాబంధనము జగ, ద్రక్షకునకుఁ గట్టి యెలమి ♦ రాణింపంగాఁ
జక్షుశ్శ్రుత్యుపవీతికి, వక్షంబున యజ్ఞసరము ♦ వైచి రయమునన్. 67

గీ॥ హేమకలశోదకంబును ♦ బ్రేమమీఱ, మేనకాదేవి వంచ నీ♦శానచరణ
కమలయుగమునుగడిగిత♦త్కాండధార, శిరసునన్ జల్లుకొనిచాల♦మురిసె భక్తి.

క॥ వాచస్పతియును నాగ, ర్గాచార్యుండును ముహూర్త ♦ మరయుచు ఘటికా
సూచకయంత్రముఁ జక్కఁగఁ, జూచుచుఁ బ్రణవంబు నుడువు♦చునునుండిరొగిన్.

మ॥ గిరిరాజప్త పురోహితానుమతిఁ బ ♦ ల్కెన్ శంకరున్ జేరి ని
ర్జరనాథాగ్రణి! తండ్రితాతలను గో ♦ త్రింబున్ దగన్ జెప్పనౌన్
దరహాసం బొనరించియున్న యభవున్ ♦ దాఁగాంచి యంచన్మతిన్
వరమౌనీంద్రుఁడు నారదర్షి యిటులన్ ♦ వాక్రుచ్చె మెచ్చొప్పఁగన్. 70

—* నారదుఁడు హిమవంతునకు శివుని యనాదిత్వంబుఁ జెప్పుట *—

ఉ॥ ఆదికి నాదియై యలరు ♦ నట్టిఁ డెవండు? గిరీంద్ర! పంచభూ
తాది యెవండు? మాయ కిల ♦ నాశ్రయ మెవ్వఁడు? బ్రహ్మ విష్ణు సం
పాదకుఁ డెవ్వఁ? డట్టి శివు ♦ భావమునందు నెఱుంగ లేక గో
త్రాదులఁ దెల్పుమం చిటుల ♦ నాడుట పాడియె? చూడు మాత్మలోన్. 71

క॥ ఆకృతిని, వికృతి, నెట్టిగు, ణాక్రాంతిని నొందనట్టి ♦ యాదిమదేవుం
డీకరణి ధర్మరక్షకు, నై కారుణ్యమున సగుణుఁ♦డయ్యెను గనుమా! 72

ఉ॥ నీదుసుతాతపోనియత ♦ నిష్ఠకు లోఁబడి మెచ్చి వచ్చె ని
ట్లీ దురితాపహుండు ధర ♦ నెవ్వనికేనియు నిట్టి భాగ్యసం
పాదనమబ్బునే? యిఁక న♦మర్త్యులలోన మునీంద్రులందు నేన్
బాడుగ నీశ్వరున్ దెలియు ♦ పండితుఁ డెవ్వఁడొ యెంచిచూడుమా! 73

వ. అనినంత,

సీ॥ నారదోక్తి నిజంబు ♦ నమ్మ మనియె హరి, తగవిది యంచు వి♦ధాత చెప్పె
ఉచితంబనుచు నన్న ♦ ముచిసూదనుఁడువల్కె, బాగిదియనియె స♦ప్తరసనుండు
సందేహమేమని ♦ జముఁడు వక్కాణించె, కర్జమిద్దియని ర ♦ క్కసుఁడువల్కె
పాయుసందియమని ♦ పాశియు వాక్రుచ్చె, భవ్యంబిదని మహా ♦ బలుఁడునుడివె

గీ॥ దైవమందిట్లుకొఱగామిఁ♦దలపఁజెల్లు, నొక్కఁడియనెజక్కు లేలిక♦యుక్కు మెఱయ
భాస్కరుండును కువలయ♦పతియు జాగు, సేయనేటికి నిఁకనని ♦ చెప్పిరపుడు.

వ. మఱియు వశిష్ఠాదిమును లిట్లనిరి.

ఉ॥ ఎవ్వనిచేత నీజగము ♦ లెల్ల విచిత్రముగాఁ దనర్చెఁదా
నెవ్వఁడు బోధరూపుఁడయి ♦ యెప్పుడు నొప్పలరున్ స్వతంత్రుఁడై
యెవ్వఁడు సర్వవంద్యుఁడయి ♦ యేలుజగంబులనెల్ల లీలగా
నవ్విభునిన్ గుఱించియిటు ♦ లారయఁజెల్లునె శైలతల్లజా! 75

వ. అని చెప్పినంత హిమవంతుం డవ్వారలబోధనంబున నపగతసంశయుండయ్యును
చిత్తంబున నొక్కింత, 76

క॥ గోత్రపతియయ్యు నీతఁ డ, గోత్రిన కెట్లిచ్చుఁ గూతుఁ ♦ గూడునె? యనియే
మాత్రము గొంకక యే విగ, తత్రిపు లందురని సుంతఁ ♦ దాయోజించెన్.

వ. అపుడు సుమేరుప్రముఖనిఖిలోర్వీధరరాజవర్యులాతని తలంపెఱింగి యిట్లు నొక్కి
చెప్పిరి.

క॥ అనుమానమెల్ల విడి యా, ర్యను బరమేశ్వరునకొసఁగి ♦ యధికతరశ్రీ
యును శ్రేయముఁ గీర్తియును, గొనుమా! నగరాజరాజ! ♦ గొణఁగకొకింతన్

గీ॥ ఇరువదెఱుంగులవారి ట్లు♦ హితవు మెఱయ, నొక్కి చెప్పినఁ దుహినవం♦తుండు గలఁక
నంతఁ బోఁ జిమ్మి పాణిగ్ర♦హణముఁ గూర్పఁ, గాఁబురోధస్సహాయుఁడై♦ గడఁగి యపుడు.

—* శ్రీ పార్వతీ పరమేశ్వర కల్యాణము *—

క॥ ఈకన్నను బరమేశ్వర!, నీకిచ్చెద భార్యగాఁగ ♦ నీవు గొనుము లో
కైకేశ! త్రివర్గమునం, దీకన్నె నతిక్రమింప ♦ కెపుడును దయతోన్. 79

గీ॥ అని శివాకరమును శివ♦హస్తమందు. నద్రిపతియుంచి తీర్థకా ♦ మార్థియయ్యె
శంకరుం డద్రిజాపాణి♦సారసంబు, స్వకరమునఁ దాఁ గ్రహించెఁ బ్ర♦సన్నుఁడగుచు.

గీ॥ ఆర్యను గ్రహించి 'దేవస్య' ♦ యనెడు మంత్ర, మును శివుఁడు లౌకికాచార♦ముగను జదివి
పల్కె 'నాతిచరామి' యన్ ♦ బలుకుఁ బ్రకృతి, పురుషులగు తమకొండుతీ♦ర్పొసఁగు నట్లు.

క॥ జీరకగుడంబులగక, న్యారాజకలాపు లిరువు ♦ రన్యోన్యముగా
భూరిప్రీతిన్ శిరసులఁ, జేరిచి యానందభరముఁ ♦ జెందిరి వేడ్కన్. 82

క॥ జవనికను దీసివేసిరి, శివుఁ డవలోకించె శివను ♦ శివుని నటులనే
శివయును నవలోకించెను, నవిరళభావోపలబ్ధ ♦ హర్షోన్నతులన్. 83

క॥ రంగారు మేల్మిబంగరు, మంగళసూత్రంబు రాజ ♦ మండనుఁడు జగ
న్మంగళయగు శివగళమునఁ, బొంగుచుఁ గట్టెను సమస్త ♦ భువనహితేచ్ఛన్.

ఉ॥ ఎల్లసురల్ మునుల్ ప్రమథు ♦ లెల్ల శిలోచ్చయనాథు లెల్లరున్
జల్లనికొండవీటఁ గల ♦ సర్వజనంబును మేటి వేడ్క రా
జిల్లఁగఁ బెల్లు సంతసముఁ ♦ జెంది జయధ్వనులన్ బొనర్చుచున్
ప్రోల్లసదిష్టవైభవస ♦ ముల్లసితాత్మకులైరి భూరిగాన్. 85

శా॥ శైలాధీశవతంసుఁ డల్లునకు ని ♦ చ్చెన్ హెచ్చుఁ బచ్చల్ రవల్
నీలాల్ కెంపులు పుష్యరాగములునున్ ♦ నిద్దంపుముత్యంబులున్

మేలౌ నేవళముల్ గడించిదినకిప్పీ ♦ మీఱ జాళువాభాండముల్
చాలొప్పన్ హరణంబొసంగె సుమన ♦ స్సంఘంబు లగ్గింపఁగాన్. 86

వ. మఱియును.

ఉ॥ లక్షగజంబులన్ మఱి ద్వి ♦ లక్షమహాజవసైంధవంబు లేన్
లక్షలపాడియావులను ♦ లక్షమదోద్ధతిమీఱు పెద్దులన్
లక్షబిటారిచేడెలను ♦ లక్షపసిండిరథంబు లింపుగా
నాక్షణమం దొసంగె నచ ♦ లాధిపతల్లజుఁ డబ్జమాళికిన్. 87

గీ॥ ఆణిముత్యాలరాసుల ♦ నందియొసఁగ, నపుడుమాశివు లంచితా ♦ హ్లాదమెసఁగఁ
గాఁ దలంబ్రాల నొకరికొ ♦ కరు శిరసులఁ, జల్లుకొని పొంగిరెంతయు ♦ సంతసమున.

శా॥ భేరీనాదములున్ మృదంగపటహా ♦ భీష్మధ్వనుల్. దివ్యవా
ద్యారావంబు లనేకముల్ సెలఁగె రం ♦ భాద్యప్సరస్సుందరీ
వారాంచత్తర నృత్తముల్ దనరె దీ ♦ వ్యచ్చారుగంధర్వశృం
గారానుత్తమగానముల్ పొలిచె రం ♦ గద్భంగిగా నత్తఱిన్. 89

క॥ గిరిపత్నులు మునిపత్నులు, సురపత్నులు సర్వలోక ♦ సుందరులకుశ్రీ
గిరిజా శివుల కొసంగిరి, సురుచిరనీరాజనముల ♦ శోభనమొనరన్. 90

—* శివుఁడు పార్వతితో స్థాలీపాక హోమంబు సేయుట *—

వ. అంత హిరణ్యగర్భుండును వశిష్ఠాదిమునీంద్రులును, పార్వతీపరమేశ్వరుల యజ్ఞ
శాలయొద్దకుఁ దోడ్కొనిచని యేకపీఠిన్ గూర్చుండఁజేసి వేదిన్ దర్భాస్తరణం
బొనర్చి దర్వ్యాజ్యస్థాలీ ప్రోక్షణ పూర్ణపాత్రేధ్మస్రువంబులఁగూర్చి యగ్నిప్రతి
ష్ఠన్ బొనరింపఁజేసి యందాయాదిమదంపతులచేఁ బ్రధానహోమంబును బ్రవేశ
హోమంబును స్థాలీపాకంబును మున్నగువాని ఋగ్యజుస్సామ సూక్తంబుల విధి
ప్రకారంబున నొనరింపఁజేసి లోకాచారప్రకారం బగ్నిప్రదక్షిణంబుసేయ
నియోగించిన నార్యామహేశ్వరు లద్దాని నెఱవేర్చుచుండ నత్తఱి శివమాయా
విశేషంబున. 91

గీ॥ మెట్టదామరవిరిదండ ♦ మెఱయుచున్న, కుందకోరక మట్టుల ♦ నందమైన
లోకసుందరిపదనఖం ♦ బాకులాత్ముఁ,డై విరించి విలోకించె ♦ నబ్రమొంది. 92

ఉ॥ చూచినయంతనే తనివి ♦ చొప్పడకున్న నదేవిధంబుగాఁ
జూచుచునున్న నాక్షణము ♦ శుక్రము మోక్షముచెంద నెద్దియున్

డోఁచక యార్తుఁడై కనెడు ♦ తోయజగర్భుని రుద్రుఁ డుగ్రుఁడై
చూచి కరస్థశూలమునఁ ♦ జూరొనరింపఁదలంప నమ్మెయిన్. 93

క॥ హాహాకారంబు ముని, వ్యూహము సర్వత్రిదశస ♦ మూహమును గిరి
వ్యూహం బొనర్చె వినతుం, డై హరి ప్రార్థించె నిట్టు ♦ లంతకదమనున్. 94

క॥ దేవాదిదేవ! శివ! పర, దేవా! పరమేశ! శర్వ! ♦ దీననిచయర
క్షావశహృదయ! జగన్మయ!, కావుము సర్వభువనేశ! ♦ కావుము నలువన్.

క॥ నీవే సర్వాత్మవు శివ!, నీవే సర్వరచయితవు ♦ నిరుపమవిభవా!
నీవే సర్వేశ్వరుఁడవు, నీవే యిటు దలఁపవలదు ♦ నిగ్రహ మభవా! 96

క॥ నీ వాద్యంతము లింకను, నీ వంతర్బాహ్యములును ♦ లీలాకారా!
నీవే వికృతులు నీ కిలఁ, గేవలచిద్బ్రహ్మ మీవు ♦ గీర్వాణవిభూ! 97

ఆ॥ ముక్తికాము లైన ♦ మునులు సంగముఁ బాసి, నీదుపదము లెంతొ ♦ నిష్ఠ మెఱయ
శరణమని యుపాస్తి ♦ సల్పుచునుందురు, నిర్వికల్ప భాగ్య ♦ నిపుణమూర్తి ! 98

సీ॥ వరద! కన్పడునదియుఁగ ♦ న్పడకయున్న, యదియు నద్వయమయి యల ♦ రారు నీవె
శుద్ధమైనట్టిదియును వ ♦ స్తువులనొప్పు, నదియు నగు పైఁడి యొక్కండె ♦ యగును గాదె.

సీ॥ భువనసృజనావనాలంబ ♦ భూరికృతుల, యందు ముఖ్యనిదానమ ♦ వగుచు నెపుడు
నాథ! తదపేక్షఁబొదలుచు ♦ న్నావుగాని, యరయ ననపేక్షుఁడవు పర ♦ మాత్మ! నీవు.

సీ॥ ఆదివయ్యును నరయ న ♦ నాదివే స, గుణుఁడవయ్యును గనఁగ ని ♦ ర్గుణుఁడ వెందుఁ
బ్రకృతి కవ్వల వెలయు నా ♦ పరమపురుషుఁ, డవు పరాత్పరుఁడవు జగ ♦ ద్ధవుఁడ వనఘ!

క॥ నీదరిసెనమున గిరిక, న్యాదారా ! ధన్యజనుల ♦ మైతిమి కడిమిన్
నీదృఢభక్తజనమునకు, మోదం బిడువాఁడ వజునిఁ ♦ బ్రోవుము దీనున్. 102

వ. అనినంత వశిష్ఠాదిమును లిట్లని ప్రార్థించిరి.

ఉ॥ నీదు రజోగుణాంశమున ♦ నీరజసంభవుఁ డుద్భవిల్లెఁ దా
నీదగు సాత్త్వికాంశమున ♦ నీరజనేత్రుఁడు పుట్టె దిట్టయై
నీదు తమోగుణాంశను జ ♦ నించెను గాలమహోగ్రరుద్రుఁడున్
నీదు తురీయతత్త్వ మిఁక ♦ నిర్మల మక్షర మద్వయంబగున్. 103

ఆ॥ వ్యక్తముగ మహత్తు ♦ పంచభూతములు త, న్మాత్ర లింద్రియములు ♦ మనమహంకృ
తియును బ్రకృతిగలసి ♦ క్రీడించు నీయందు, విశ్వమూర్తి! వేద ♦ వినుతకీర్తి!

ఉ॥ అంబుధు లేడు వల్వలు ద ♦ శాశలు భూరిభుజంబు లంతరి
క్షంబు పొక్కిలా మిహిర ♦ చంద్రహుతాశనులున్ గనుల్ సమీ
రంబగు నాస నాకము శి ♦ రస్సు కృపీటధరంబులో కురుల్
భంబులునున్ గ్రహంబులు కృ ♦ పానిధి ! నీకు సుమంబు లింబుగన్. 105

క॥ నీకెటుల నుతుల మోదము, చేకూరఁగఁ జేయఁగలము ♦ శివ ! పరమేశా !
వాకుల కేనియు మది కేన్, బ్రాకటముగ నందకెందు ♦ భాసిలుదు వజా !

గీ॥ అనఘ! కడు బాలిశుండ నైన ♦ యబ్జగర్భుఁ, గనికరంబున మన్నించి ♦ కావు మెదరుఁ
బాపు నీకెదు రే యెందుఁ ♦ బరమపురుష! భక్తవాత్సల్యమాత్మని ♦ ప్పాటవిడక.

వ. ఇంద్రాదిలోకపాలు రిట్లు వినుతించిరి.

గీ॥ కోటిసౌదామనీప్రభా ♦ కుశల మష్ట, కోణము సుశోభనంబయి ♦ రాణఁదనరు
రూపము ధరించి లోకమం ♦ దేపుమీఱ, వెలయు నీకు నమస్కార ♦ ములివె దేవ.

క॥ పంచాస్యున కభవునకును, బంచాశత్కోటిమూర్తి ♦ భాస్వరునకు ది
వ్యాంచితవిద్యుజ్జ్వాలా, చంచద్రూపునకు నిత్య ♦ సత్యునకు నుతుల్. 109

క॥ విద్యాతత్త్వమయునకు న, విద్యాభంజనున కఖిల ♦ విభునకు భీష్మ
ప్రద్యోతితాగ్నివర్ణున, కాద్యునకును శంభునకు జో ♦ హారు లివె శివా!

క॥ రుద్రునకు భక్తసముదయ, భద్రప్రదునకు నవాచ్య ♦ వైభవునకు ని
ర్నిద్రప్రబోధునకుఁ దుహి, నాద్రిసుతాహృదయపుష్క ♦ రార్కునకు నుతుల్.

వ. దేవా! అనుగ్రహింపు మనుగ్రహింపు మనుటయు.

శా॥ నాళీకాక్షునిఁ దొట్టి నిర్జరులు నా ♦ నాదివ్యమౌనీంద్రులున్
నాళీకోద్భవుఁ గావుమం చితుల దీ ♦ నత్వంబుతో వేఁడఁగాఁ
గాళీనాథుఁడు గిన్కఁబోవిడి కడున్ ♦ గారుణ్యముం జెంద న
వ్వేళన్ గాంచి విరించి మొక్కి నుతిఁ గా ♦ వించెన్ విధేయాత్ముఁడై.

క॥ కరుణాసాగర! శంకర!, వరదాభయహస్త! దేవ ♦ వంద్యపదాబ్జా!
కరుణించి ప్రోవుమీ నను, దురితము సైరించి వేగ ♦ దుహినాంశుధరా!

క॥ నీలీలేచ్ఛఁ జరాచర, జాలం బీ భువన మలరు ♦ శంకర! త్రాటన్
మేలుగఁ బసరంబులక్రియఁ, జాల నెఱింగితి మహాత్మ! క్షమియింపు మిఁకన్.

గీ॥ అనికృతాంజలియై మ్రొక్కి ♦ యజుఁడునిలువ, శర్వుఁడభయవరంబిచ్చె ♦ సర్వమునులు
సురలు గిరివరులందఱు ♦ కరమునంబ, రమునఁ బొగడిరి తోడరిస ♦ ర్వజ్ఞునపుడు.

గీ॥ అంత ధాతృవిమర్దితం ♦ బైనవీర్య, మపుడు కణికాసహస్రమై ♦ యమర వాని
చే జనించిరి పెక్కండ్రు ♦ చెలువుమీఱ, వాలఖిల్యమునుల్ పర ♦ వంపుఘృణులు.

వ. అవ్వారిఁ గాంచి నారదుండు శివానుమతి నిట్లనియె,

క॥ చనుఁడీరు గంధమాదన, మునకందుఁ దపంబుచేసి ♦ మునిముఖ్యులరై
యొనరుండిది విధి యన నం, తనె చనిరచ్చటికి వారు ♦ త్వరితగతులతోన్.

మత్తకోకిల. తోయజోద్భవుఁడంత మౌనుల ♦ తోడ శర్వవివాహ మ
త్యాయతంబగు భక్తిఁ బూర్తిఁగ ♦ నాచరింపఁగఁజేసి యా

రేయియం ధ్రువేక్షణంబునె ♦ ఱిఁక బొనర్పఁగఁ జేసి బల్
మ్రోయఁజేసెను స్వస్తిపాఠము ♦ మోద మింపెసలారఁగాన్ 118

కం॥ పొందుగ మునులముదల నా, నందముతో శంకరుండు ♦ నగజశిరసునన్
సిందూరమిడియె దానన్, జెందెను దేజంబు మిగుల ♦ శివ మురుపొప్పన్.

గీ॥ అంతనొక పీఠిఁబేర్మిమై ♦ నధివసించి, యున్న శివులనుగని సుర ♦ లుబ్బిరెంతొ
పరిణయమహోత్సవంబిట్లు ♦ జరుగ నెలమి, బ్రహ్మ కెడఁబూర్ణపాత్రంబు ♦ భర్గుఁడపుడు

కం॥ గోదానము యాజ్ఞికునకు, సాదరమతి శంభుఁడొసఁగి ♦ సకలాంచచ్ఛ్రే
యోదాయకంబులైన మ, హాదానములొసఁగె నగ్ర ♦ జాగ్రణులకొగిన్. 121

కం॥ వరుసగ వేర్వేఱుగ భా, స్వరరత్నంబులను రాంక ♦ వపుసాలువులన్
దరుణేందుమౌళి విప్రుల, కిరవుగ సంభావనలను ♦ నిచ్చె బిఱబిఱన్. 122

గీ॥ అపుడు వేలుపులునుమును ♦ లన్యులును మ, హాప్రమోదంబునొందిజ ♦ యధ్వనులనొ
నర్చి రచ్చరగములు గం ♦ ధర్వజనము, లలితనర్తనగానముల్ ♦ సలిపిరెలమి.

వ॥ మఱియు భేరీమృదంగవేణువీణానిస్సాణకాహళ ఝల్లరీతూర్యవాద్యఘోషంబులు
మ్రోసె మహోత్సవంబయ్యె నయ్యెడ హిమవంతుండు డాసి మహేశ్వరునకు
మ్రొక్కి హరివిరించనాదులకు వినతుండై భోజనసమయంబెఱింగించి యందఱ
నామంత్రణంబుచేసిన నవ్వారందఱంగీకరించి సమధికాయామవైశాల్యంబును సుప్ర
భాక్తముక్తాఫలానేకాచ్ఛగుచ్ఛాంతరాళసంయోజితానుపమ శేఫాలికా కుందమం
దారవకుళచంపకాశోకసుమమంజరీపుంజరంజితవితానప్రతానవిభ్రాజితంబును క్షీర
సాగరంబుబోలె నుత్పాదితమహాలక్ష్మీవైభవంబును మహేంద్రభవనంబువోలె
నమృతరసోపపాదితానేకవిధాహారసంపన్నంబును మేఘద్వారంబువోలె ప్రద్యోది
తద్యుమణివిద్యుజ్జ్యోతిర్విభాసితంబును గ్రహమండలప్రదేశంబువలె సమధిగత
కావ్యవాచస్పతిరాజహంససౌమ్యకుజమందమరుద్విలసితంబును మహారమణీయం
బునగు భోజనాయతనంబుఁ బ్రవేశింపుటయునందు. 124

— * వరవర్గ భోజనములు * —

కం॥ కనదురురత్నాంచితకాం, చనపీఠములందు వారిఁ ♦ జక్కఁగఁ గూర్చుం
డ నివేదించిన వారలు, ఘనమగు సంతోసమొప్పఁ ♦ గా నచటఁ దగన్.

ఆ॥ ప్రమథవర్య లొక్క ♦ బంతి భూతచయంబు, లొక్కబంతి గణము ♦ లొక్కబంతి
వీరభద్రముఖ్య ♦ ధీరులు నొకబంతిఁ, గూరుచుండి రెలమిఁ ♦ గొనలుసాఁగ.

కం॥ నారాయణుండు బ్రహ్మయు, నారదుఁడున్ గశ్యపుఁడు స ♦ నకముఖ్యులు బృం
దారకగురుఁడు వశిష్ఠము, ఖోరుతపోనిధులు మౌను ♦ లొకబంతిమెడన్. 127

గీ॥ వరుస నింద్రప్రముఖలోక ♦ పాలురును న, వగ్రహంబులు నొకబంతి♦వాసుకిప్ర
ముఖనిఖిలపన్నగేశ్వర♦ముఖ్యు లొక్క, బంతి గంధర్వవరు లొక్క♦బంతిగాను.

వ. మఱియు వసువులు విశ్వేదేవత లాశ్వినేయులు మున్నగువా రొక్కబంతిగను మరుత్తులొక్కబంతిగను గిన్నరకింపురుషచారణవిద్యాధరాప్సరోయక్షరక్షస్సిద్ధ గరుడగణంబులు వేఱువేఱుబంతులుగను గూర్చుండి రాసమయంబున. 129

క॥ బంగారుపళ్ళెరంబులు, బంగరుచెంబులును బంచ ♦ పాత్రలు మఱియున్
బంగరుటుద్ధరణులునున్, బంగరుగిండ్లమరచి రటం ♦ బర్వతభృత్యుల్. 130

క॥ సురభిళధూపద్రవ్యము, లురువుగం దగు పాత్రలందు ♦ నునిచి సుగంధ
స్ఫురణం బెసంగించిరి నగ, పరిచారకవర్యు లచట ♦ భూసురగతులన్. 131

గీ॥ చామరంబులు సురటీలు♦జారుతరము, గాంగ విమ్యద్వ్యశములంజ♦క్కంగనమర్చి
యుంచి రీరీతి సిరుల ను ♦ దంచితమయి, లీలనొప్పారు భోజన ♦ శాలయందు.

క॥ పలురకముల పక్వాన్నము, లలరెడురాజనపుటన్న ♦ మరుదగుశాకం
బులు సూపంబులు నప్పడ, ములు వడియము లాలనేయి ♦ పులుసులు చేరుల్.

క॥ జిడ్డుపెరు గూరుంగాయలు, నడ్డంకి యొకింతలేక ♦ యరయుచు బంగా
రొడ్డాణంబులు మెఱయంగ, వడ్డించిరి యువతు లపుడు ♦ వాసిగందోడ్తోన్.

క॥ మేనకయునుమఱిం బరమే, శానుని లక్ష్మీప్రముఖ ♦ సాధ్వీమణు లా
ర్యానలినేక్షణతో శ, ర్వానిలయముం జేర్చి రప్పు ♦ డానందమునన్. 5 1 3

క॥ పరమామోదముతోడ మ, ధురహాస్యాలాపచయుచ♦తురిమ దనర్పన్
సిరిమీఱ భోజనము చే, సిరి సర్వజనంబు లపుడు ♦ శివునిం దలంచుచున్. 136

గీ॥ పిదప నాచమనముచేసి♦పేర్మితోడం, బచ్చకప్రింపు తావుల ♦ హెచ్చుమీఱు
తమ్ములముంగొనివిశ్రమా♦ర్థమ్మునంద,ఱోగింజనిరివారు వారుము♦న్నున్న యెడకు.

వ. అంత,

సీ॥ మణిదీపశతము ల♦మర్చికూర్చినచోట, ముత్యాలమాలికల్ ♦ పొలుచుచోట
రత్నదర్పణపంక్తి♦రాణమీరినచోట, దాక్షిణీంగెలగెలల్ ♦ తనరుచోట
నానాసుగంధవి♦తానంబు గలచోటం, బుష్పితాశోకముల్ ♦ పొదలుచోట
మరకతమణికుట్టి♦మంబులు గలచోటం, గప్పురంపుటనంటు ♦ లొప్పుచోట

గీ॥ పంచభక్ష్యాన్నపాత్ర లే♦ర్పడినచోట, మేల్మికస్తూరివిడెములు ♦ మెఱయుచోట
రత్నపర్యంకమాత్మంగ♦రంచుచోట, ననుపమైశ్వర్యధుర్యమై ♦ యలరుచోట.

క॥ తరుణేందుధరుండు భూభృ, ద్వరకన్యకతోడ నందు ♦ వైభవముగ భా
స్వరరత్నపీఠతలమున, వారువుగం గూర్చుండియుండ ♦ నాసమయమునన్. 139

చ॥ సురుచిరనూత్నయౌవనము ♦ శోభిలువాని మనోజ్ఞహాససుం
దరమగు మోమువానిఁ బ్రమ ♦ దాజనమోహనుఁడైనవాని భా
స్వరలలితాంబరంబులను ♦ సొరుగఁగట్టినవాని దివ్యమే
దురమణిభూషలన్ బెడఁగు♦దోఁపఁగఁ దాల్చినవాని నీశ్వరున్. 140

ఆ॥ కాంచి శైలరాజ♦కాంతలు గడుఁ బ్రశం, సించి సంతసించి ♦ శివులకవుడు
గ్రింధిమోచనంబుఁ ♦ గావించి నవదంప, తులను జూచుచుండి ♦ రెలమికలిమి.

వ. అయ్యవసరంబున.

ఉ॥ చేరఁగవచ్చిరచ్చటికి ♦ శ్రీసతి వాక్సతి సూర్యపత్ని బృం
దారకరాజపత్ని వదు ♦ ణాని యరుంధతి స్వాహ రోహిణీ
నీరజగంధియున్ దులసి ♦ నిర్జరమాత యహల్య గంగయున్
మారుతదేవి ధాత్రి రతి ♦ మానినియున్ శతరూపయున్ రహిన్. 142

గీ॥ పరఁగ సావిత్రి కుంభసం♦భవునిరాణి, వాస మనసూయబహుదివ్య♦భామలును ఫ
ణీంద్రకన్యకలును సన్మ♦నీంద్రకన్య, కలును జేరిరి లెక్కింపఁ♦గానియట్లు. 143

వ. పసిండిగద్దియలం దెల్లరుఁగూర్చుండినపిమ్మట వారలలో సరస్వతి పరమేశ్వరున్
దిలకించి పరితోషంబుతో నిట్లనియె. 144

—* దివ్యస్త్రీల పరిహాసోక్తులు *—

వ॥ దారకెను జీవితేశ్వరి వి ♦ ధుప్రతిమబగు నీప్రియాస్య మ
బ్బురముగఁగాంచి సేగివిడి ♦ భూధరజాపరిరంభపూర్వకో
ద్ధురసుఖలీలఁ బ్రొద్దులను ♦ ద్రోయుము సంతత మీపెతో నిఁకన్
విరహముగల్గ దెన్నఁడును ♦ విశ్వజనీనముగా మహేశ్వరా ! 145

వ. అంత మందహాసంబుతో నిందిర యిట్లనియె.

క॥ బిడెమున్ బోవిడి శివ ! యీ, పడుచున్ గౌఁగిటను బడసి ♦ పాలింపుమిఁకన్
బిడియంబేడది యేపెను, విడిన్ బ్రాణములు దవుల ♦ వెడలునో వేగన్.

వ. సావిత్రి యిట్లనియె.

గీ॥ ప్రియకు మధురాన్నములు దిని ♦ పించియంత
నీవును భుజించి వే మంచి ♦ నీట నాచ
మించి కస్తూరి వీడ్యమ♦ద్పించికొనుము
నీతపఃఫల మీపూప ♦ లేతపడుచు. 147

వ. అదితి యిట్లనియె.

క॥ ఉమ యారగించినంత మొ, గముఁ గడుగుటకొఱకు వేగఁ ♦ గాముకవర! నీ
రము నిమ్ము దంపతుల ప్రే, మ మసాధారణము గనఁగ ♦ మహి దుర్లభమా.

వ॥ ఆవెంట జాహ్నవి యిట్లనియె.

గీ॥ మేల్మిబంగారుతళుకుల ♦ మించి మెఱయు, శైలజాకుంతలములఁ బ్రి ♦ సాధనంబు
సేయుమీశ్వర! భర్తలు ♦ సేయుసదుప, చార మొనరించుఁ గామినీ ♦ జాతి కెలమి.

వ. చెలికారంబుతోడఁ బౌలోమి యిట్లనియె.

క॥ సతిగాత్రము మూఁపుననిడి, యతులితశోకమునఁ బుడమి ♦ యంతఁ దిరుగుచున్
వెతవడిన నీకెటుల సి, బ్బితి గల్గును గల్కి నేలు ♦ పేర్మి మహేశా! 150

వ. గరువంబుమీఱ గంధవహరాజ్ఞి యిట్లనియె.

గీ॥ కోమలేందుకిరీట! యీ ♦ కోమరుపడుచు, వక్షమునమృగనాభి సం ♦ పన్నమైన
పచ్చిగందంబలంది బల్ ♦ హెచ్చుమీఱు, కౌతుకంబలరన్ బరి ♦ గ్రహ మొనర్పు.

వ. ఆపిమ్మట లోపాముద్రి యిట్లనియె.

గీ॥ అలుకఁబోండ్లకు శయ్యా గృ ♦ హంబు లందు
భోజనావాసములయందుఁ ♦ బూజ్యపదము
గలుగుట వచింతు నీపసి ♦ కల్కి వడుచు
నకువిడెంబిడి రమియింపు ♦ నాగభూష ! 152

వ. ప్రీతిమై యరుంధతి యిట్లనియె.

క॥ నీ కొసఁగఁ దల్లియొప్పని, యీ కన్నను నేనుగాదె ♦ యిప్పించితి నీ
వాశతనఁ దోయవున్నడి, జేకూరఁగఁజెప్పి ♦ రతులఁ జెందుము దేవా! 153

వ. అనుకంపతో ననసూయ యిట్లనియె.

మంజుభాషిణీవృత్తము॥ మనసారనిన్ గొనిన ♦ మంజుభాషిణిన్
వనజాతనేత్ర హిమ ♦ వద్గిరింద్రజన్
నెనరొంది చెందుమిఁక ♦ నిత్యయావనా!
యెనగారు మీద్వయికి ♦ నెవ్వరేనియున్. 154

వ. అనంతరం బహల్య యిట్లనియె.

ఆ॥ విను పురాణపురుష! ♦ వృద్ధ వేసముఁ బాసి, నిత్యతరుణుఁడవయి ♦ నెగడుమిటులె
కూఁతుకొఱకుమిగుల ♦ గోఁణగుచుండెడు మేన, నిన్ను గాంచి మదిని ♦ నెమ్మిఁ గాంచు.

వ. పిదపఁదులసి యిట్లనియె.

ఆ॥ మున్నునుమను గొనక ♦ పువ్వుటమ్ములబంటుఁ, గాల్చినట్టినీవు♦గడఁగి యెటుల
నావశిష్ఠముఖుల ♦ సారుంధతీకులఁ, బంపితయ్య! చెపుమ ♦ భార్యకొఱకు. 156

వ. హర్షముతో స్వాహాదేవి యిట్లనియె.

క॥ స్థిరమతి మాసల్లాపము, ల రహిన్ వినుమిపుడు కడువి ♦ లాసం బెసఁగన్
బరిణయముల నువిదలకున్, బరఁగెడుఁ గడు గరువతనము ♦ బాలశశిధరా!

వ. ముసిముసినగుతో రోహిణి యిట్లనియె.

గీ॥ కామశాస్త్రవిశారద!♦కాళిశామ, మిఁకను దీర్పుము తడవింత ♦ యేనిలేక
కాముకుఁడవీవు కామినీ♦కామసాగ, రమును బారంబునొందింపు♦రహియెసంగ.

వ. మురిపంబుమీఱ వసుంధర యిట్లనియె.

సుగంధివృత్తము. కామపీడితాంగనాని ♦ కామభావమెంతయున్
నేమ మొప్పఁగా నెఱుంగు ♦ నేర్పుకాఁడ వీవిఁకన్
మేము చెప్పనేల చాల ♦ మేరమీఱి యిట్టులన్
సామి! నీవు జాణవెందుఁ ♦ జక్కనన్ని జాడలన్. 159

వ. తర్వాత శతరూప యిట్లనియె.

క॥ స్త్రీ కేమిట సంతోసము, చేకూరునొ యదియెఱింగి ♦ సేవింపు శివా!
ఆఁకట డస్సినవారికిఁ, జేకుఱ వన్నము వినాగ ♦ క్షితిఁబెఱసుకముల్. 160

వ. చనవుమెఱయ ఛాయ యిట్లనియె.

ఉత్సాహవృత్తము॥ జాలమేల యమ్మలార! ♦ షడ్రిసాన్నవర్గతాం
బూలములను బూవు సెజ్జఁ ♦ బొందుపఱచినార మీ
బాలచంద్రమౌళికిందు ♦ బాల నప్పగించి గే
హాలకున్ బదుండు పదర ♦ కాగడంబు మానుమన్. 161

వ. వాసియమర వరుణాని భవానికిట్లనియె.

సుగంధివృత్తము॥ నాతి! యీ సుగంధి చంద ♦ నంబు వేగ్రహించిబల్
ప్రీతిఁబూయు నీదు నాథు ♦ పేరురంబు పైరహిన్
జేతమున్ గరంచునీకు ♦ శేశయంబు హారమున్
భూతనాథు కంఠమందుఁ ♦ బూన్పుమమ్మ! నెచ్చెలీ! 162

వ. ఇట్లునుడివి పరమేశ్వరున కిట్లనియె.

ఆ॥ వేగిరింపఁబోకు ♦ వేగింపఁబోకుమా, ముద్దరాలి నెంతొ ♦ బుజ్జగించి
నేర్పుమీఱఁ దేర్చి ♦ నెయ్యంబుఁదియ్యంబుఁ, జెందనొందు మిందుఁ♦జేడెవిందు.

వ. అనినంతఁ బరమయోగీంద్రవందితుం డగు పరమేశ్వరుండు దివ్యనారీశిరోమణుల వచనంబుల కిసుమంతయేనిఁ జలింపక నిర్వికారుండై యాదివ్యయావతమండలి కిట్లనియె.

గీ॥ నాయెదుర నిట్టినుడుల న♦సంగఁదగునె?, కొమరునందెట్లుచాపల్య♦గుణముదనరు నిఖిలలోకైకకల్యాణ ♦ నిలయలార! తల్లులార! పురంధ్రీమ♦తల్లులార! 165

క॥ అనుడు శివవచనముల విని, మనముల లజ్జించి దివ్య♦మహిలామణు లె ద్దినిఁ బలుక కూరకుండిరి, యనువుగఁ జిత్రగతపుత్రి ♦ కాకృతు లమరన్.

వ. ఆసమయంబున. 166

గీ॥ మధురభక్ష్యాన్నములను ను ♦ మాసహాయుఁ
డై మహేశుండు భుజియించి ♦ యాచమనము
చేసి మణిపీఠమున సుఖా ♦ సీనుఁ డగుచుఁ
గుతుకమున వీడియము వేసి ♦ కొనుచునుండ. 167

వ. తక్కిన దివ్యవనితలందఱారగించి వీడియంబులు వేయుచున్న సమయంబుఁగాంచి యనుకూలసమయంబగుట నెఱింగి రతికాంత శంకరున్ డగ్గఱి మ్రొక్కి యిట్లు ప్రార్థించె.

—* రతీదేవి మగని బ్రతికింపుమని శంకరుని వేఁడికొనుట *—

చ॥ గిరిజను బెండ్లియాడి యిటుఁ ♦ గేళివిహారముతోడనుంటి వ
ప్పురుసున మిమ్ముఁ గూర్చుటకె ♦ పాల్పడి నాదయితుండు నిర్జరో
త్కరముల పంపునన్ దఱియఁ ♦ గా నటు మల్పితివేల? తండ్రి! వే
గిరముగ నామనోహరు నా ♦ గిన్ బ్రతికించి సుఖంబుఁ గూర్పుమా! 169

ఉ॥ నీదు వివాహమం దిచట ♦ నెక్కొనినట్టి జనంబు సర్వమున్
మోదముతోడ నొప్పెదు న ♦ మోఘవచోఘన! నేనొకర్తనే
ఖేదముతోడ నుంటినిఁకఁ ♦ గేరడమున్ విడి నాఁటి నీనుడిన్
బాదుగ నాత్మలోఁదలఁచి ♦ భర్తృమతిన్ నను జేయుమీశ్వరా! 170

క॥ నీవొకఁడుగాక జగములలో వేఱొక్కండు గలఁడె ♦ లోకేశ్వర! యీ
నా వెతఁ దీర్పసమర్థుఁడు, భావించి యనుగ్రహంబుఁ ♦ బరపుము దేవా! 171

క॥ సకలజనోత్సవదము తా, వకముద్వాహంబు దీన♦వత్సల! దీనన్
బ్రకటముగ నాకుఁగూడఁ గ, నికరంబున సుకముఁగూర్పు ♦ నిరుపమవిభవా!

క॥ పరమేశ్వరుఁడవు సచరా, చరభువనములెల్లఁ బ్రోచు ♦ సామివి ఘనదు
ష్కరకార్యకర్తవిట నా, కిరవుగఁ బతిదానమొసఁగు ♦ మీశ! రయమునన్.

క॥ నిగ్రహముఁ బ్రతిఘటింప న, నుగ్రహమర్థింప నిడుము ♦ నుండవిఁకను నే
వగ్రహము లేకనను దే, వాగ్రియ! యనుగ్రహించి ♦ యర్పింపుపతిన్. 174

గీ॥ పతివియోగనిదాఘాగ్ని ♦ బడలిక్రాగి, ప్రాణమాత్రావశిష్టయై ♦ పరగుచున్న
రతిలతకు జీవనంబిచ్చి ♦ బ్రతుకఁజేయ, శక్తుఁ డమృతపయోద మీ ♦ శంకరుండె.

ఆ॥ అనుచు నాథ! నాథ! ♦ యనిదురసిల్లుచుఁ, జెఱగుముడినివిప్పి ♦ చెలువ కామ
భస్మ మీశ్వరునకుఁ ♦ బదిలంబుగానిచ్చి, వెక్కి వెక్కి యేడ్చె ♦ విభునిఁగోరి.

క॥ ఇందిరమున్నగు దేవీ, బృందం బపు డెంతయేని ♦ బెట్టిదమగునా
ర్తిం దవిలియేడ్చి శివునకు, వందనమిడి యిట్టులనిరి ♦ వారనికరుణన్. 177

క॥ బ్రతికింపు మరుని శంకర!, వితతదయానిధి! ప్రపన్న ♦ బృందావన! నీ
వతికారుణ్యమయుండవు, రతిసతిఘోరార్తిఁ బాపు ♦ రాజకలాపా! 178

—* శివుఁడు మన్మథుని బ్రతికించుట *—

క॥ ఏకగ్రీవముగా నిట్లు, శ్రీకాంతాదిములు యాచ్న ♦ సేయుడు రతిబల్
వ్యాకులతఁ దీర్ప శంకరుఁ, డాకాంక్షించెన్ మరున్ సు ♦ ధాయతదృష్టిన్.

గీ॥ పూర్వమునకన్న నెక్కుడ ♦ పూర్వమైన
రూపలావణ్యములతోడ ♦ నేపుదనరి
పొడమి కాముఁడు శివునకు ♦ మ్రొక్కి "మాంక్షు
మస్వశంకర! ఘనదయా ♦ మండన!" యనె. 180

మ॥ శరచాపంబులఁ దాల్చి దివ్యతనురా ♦ జత్కాంతులింపొందఁగా
స్మరుఁ డారీతిని జేరరా రతిసతీ ♦ మాలామహారత్న మీ
శ్వరపాదంబుల వ్రాలి మేలినుతులన్ ♦ సల్పెన్ గడున్ బేర్మి నా
దరమొప్పన్ రతినిన్ మరున్ గని జగ ♦ త్కారుం డుదారాత్ముఁడై. 181

ఉ॥ రాతురులందు నెప్డు రతి ♦ రాజ! భవత్సతి కిద్ధమూర్తివై
ప్రీతియొనర్చుచుండు మశ ♦ రీరుఁడవై పతులన్ బణంతులన్
జాతురితోఁ బరస్పరము ♦ సంగతమొందఁగ జేయుచుండు మీ
రాతిరియందు నందఱకు ♦ రాణ దలిర్పఁగఁ గానుపట్టుమీ! 182

వ. ఇఁకను

క॥ మీనుతుల కెంతొ సంతస, మూని ప్రసన్నుండనైతి ♦ నోసఁగెద వరముల్
మీనధ్వజ! యెఱిఁగింపుము, నీ నిర్మలవాంఛితముల ♦ నెయ్యంబలరన్. 183

ఆ॥ అనుడుఁ బుష్పబాణుఁ ♦ డనియెను దేవ! నా, యెడఁ బ్రసన్నభావ ♦ మెంచితేని
నాథ! వరము మదప ♦ రాధక్షమ యొకండొ,కందు నీదు భక్తి ♦ గరిమనిడుట.

వ. అనిన శివుం డామోదంబునఁ దథాస్తని మన్మథున కిట్లనియె.

ఉ॥ కామ! ప్రసన్నుఁడన్ వినుమిఁ ♦కన్ వెఱపున్ విడనాడు మచ్యుతున్
ప్రేమముతోడఁజేరి కను ♦ వెల్పల నుండుము పొమ్మటన్న నా
తామరసాక్షనందనుఁ డు♦దార మతిన్ శివు భక్తి మ్రొక్కి యా
ధామమునుండి వెల్పలికిఁ ♦ దత్క్షణమే చనుదెంచి ప్రీతిమై. 185

క॥ సరసిజనాభుని చేరువ, కరిగి తదంఘ్రులకు మ్రొక్కి ♦ యాత్మోదంతం
బరుదొప్పఁజెప్ప నతఁడును, సురలెల్లరు మురిసి శివుని ♦ స్తుతియించిరటన్.

గీ॥ రతియుఁమన్మథుఁడునుదన♦రాజబంధు, వులునుదనయింటిజనముతో♦భూధరేంద్రుఁ
డారగించెను బరిజను ♦ లపుడు సాప, డిరి విడెంబులనొంది రం♦దఱు ముదమున.

—* లోకరక్షార్థమై శివుఁడు పార్వతీదేవిన్ గూడుట *—

గీ॥ అంత నిందిర మున్నగు ♦ నమరపత్న్, లేదొ నెపమాడి పడకింటి ♦ కెడగనేగి
రద్రితనయను గవుఁగిలి♦యందుజెంది, కామసుఖములఁ దన్పె శం♦కరుఁడురహిని.

—* ప్రభాతవర్ణనము *—

క॥ చిరకాలమునుండి కడున్, విరహముతో వేగుచున్న ♦ విశ్వగురుడు బం
ధురకామగతులఁ బెనఁగ న, చిరమునఁ దెలవాఱెఁ బ్రహర ♦ శీలన మెడగాన్.

క॥ ఉర్విళ్ళూరుచుఁ బతికై, నెవ్వగఁబాపికొని సుఖము ♦ నెక్కొనుతఱి లేఁ
బువ్వుంబోండ్లకు వెగటుగఁ, జివ్వునఁ దేలనయ్యె దెసలు ♦ చెలువలరారన్.

క॥ బిగువైన మగలకౌఁగిళు, లఁ గడున్ సొలపొందియున్న ♦ లలనలు నెట్లో
వగతో వదలిచికొని యి, మ్ముగఁ బడకగదులను బాసి ♦ పోయిరి వేగన్.

గీ॥ కోకదంపతులకు స్వస్తిఁ ♦ గు స్తరించి, ఘూకరాజి ఘనధ్వాంత ♦ గుహలకనిపి
జగమునకు బోధభిక్షంబు ♦ సంతరించి, లోకబాంధవుఁడరుదెంచె♦వీక మెఱయ.

చ॥ అరుణమరీచి యంత నుద ♦ యాచలపీఠము నెక్కి సర్వత
స్స్ఫురదసమానమంజుకర ♦ పుంజములన్ వెలయించి యూర్ధ్వని
స్సరదమలాంశుజాలముల ♦ శైలవరోన్నతశృంగపల్వలాం
తరనళినాళిఁగూడఁ బ్రమ ♦ దమ్మునఁ బూయఁగఁజేసె వాసిగన్. 193

చ॥ మునులును సిద్ధులున్ సురలు ♦ మున్నగు దివ్యవరేణ్యు లవ్వియ
ద్ధుని నవగాహముల్ సలిపి ♦ తోయజమిత్రుని కర్ఘ్యమిచ్చువా
రును జపయజ్ఞముల్ గడఁ ది ♦ రోహితదృష్టి యెసంగ సల్పువా
రును నిగమానువాకముల ♦ రూఢిఁ బఠించెడువారలై రొగిన్. 194

గీ॥ కర్మఠాగ్రసరుల్ ద్విజా ♦ గ్రణులు వేగ, హవ్యముల జాతవేదున♦కమరనొసఁగి
హోమ మొనరించి రంతనా♦ధూమపుంజ, మాజ్యగంధంబులనుజిమ్మె♦నవని నెల్ల

క॥ ఈలో మహేశ్వరుఁడు వైఁ, తాళికసంస్తుతుల నొంది ♦ తానును శయ్యా
శాలనువిడి కాల్యాచా, రాళిఁగడపి చనియె నిర్జ♦రాంతికమునకున్. 196

—* శివుఁడు దేవతలకు దర్శనంబిచ్చుట *—

వ. అంతనచ్చట మహేశ్వరదర్శనం బపేక్షించి మహాభక్తితో ధ్యానంబు సేయు చున్న జనార్దనప్రముఖులు దారసించిన మహేశ్వరునిఁగాంచి పౌనఃపున్యంబుగఁ బ్రణామంబులుచేసి యిట్లు వినుతించిరి.

క॥ జయ విశ్వేశ్వర! శంకర!, జయ నిఖిలాధార! శర్వ! ♦ జయ సర్వేశా !
జయరుద్ర! మహాదేవా!, జయకాళీపతి! మహేశ! ♦ జయపశుపతీశా ! 188

క॥ జయనిష్కామా! నిర్గుణ!, జయలీలానిఖిలనిలయ! ♦ జయసర్వగతా !
జయకారణాతిగామీ !, జయభక్తేప్సిత వితరణ ♦ చణకరుణాఢ్యా ! 199

క॥ జయ వాఙ్మనసవిదూరా !, జయ వాత్సల్యనిధి! నిత్య♦సత్యచరిత్రా !
జయ దీనబాంధవ! శివా!, జయ వికృతివిహీన ! దేవ ! ♦ జయ సర్వాత్మా !

క॥ అని వినుతింపుచు మ్రొక్కఁన, యనిమేషాధిపుల శర్వుఁ ♦ డంచితకరుణన్
గని యిష్టగోష్ఠి సంతస,మున సంభాషించుచుండ ♦ భూధరుఁ డంతన్. 201

ఆ॥ చేరి జగ్ధివేళఁ ♦ జెచ్చెర నెఱిఁగించి, పిలుచునంత వారు ♦ ప్రియముమీఱ
నరిగి శివునితోడ ♦ నభ్యవహారంబుఁ, జెంది వీడెములను ♦ జెందిరంత. 202

మ॥ పరమేశానునితోడ మౌను లమరుల్ ♦ ప్రాలేయశైలేంద్రభా
స్వరసంయోజితనూత్నమంటపమహా ♦ చ్ఛశ్రీప్రకారంబులన్
బరమాశ్చర్యమెసంగఁ గన్గొని మహా♦నందంబునన్ బొంగి య
గ్గిరిరాజేంద్రుని దివ్యసూక్తితతులన్ ♦ గీర్తించి రెంతేనియున్. 203

—* సాయంకాల వర్ణనము *—

ఉ॥ అంత దినాంతమై యలర ♦ నర్యమదేవుఁ డపూర్వదిక్సతిన్
సంతసమొప్పఁ జేర నది ♦ జానుగ మానికపుంనివాళి న
త్యంతముదంబుతో నిడిన ♦ నారతనంబుల దీప్తితీరనా
వింతగ సాంధ్యరాగరుచి ♦ విశ్వవిమోహనమౌచు భాసిలెన్. 204

గీ॥ గగనమనుమల్లెపొదలోన ♦ గరిమ మెఱయ, విరియఁబూసినపుష్పప్రకరమనంగ
దారకాబృంద మెంతేని ♦ ధాళధళ్య, మెసఁగఁ దనరారె దశదిశ♦లెసక మెసఁగ.

గీ॥ తనదుప్రభునివివాహము♦దనువుగా స, మస్తజనమరుదెంచిసం♦బరముఁగాంచు
చుండిరిశ వారికందఱు♦కుబ్బుఁగూర్పఁ,గా మురువుమీఱఁజందుర♦మామయమరె.

గీ॥ కరగిపోసినబంగారు ♦ కరుడనంగ, గగనగంగాభవస్వర్ణ ♦ కమలమనఁగ
ప్రాచిఁ బొడమినగుమ్మడి ♦ పండనంగఁ, బూర్ణచంద్రుండు మెఱసెన ♦ భోముఖమున.

సీ॥ స్మరునాజ్ఞ భామినీ ♦ సమితిపై జాబిల్లి, చల్లిన వశ్యభ ♦ స్మంబనంగ
కాలపూరుషుఁడు రం♦గచ్చంద్రయంత్రంబు*, నుండి జార్చిన వరి ♦ పిండియనఁగ
చారునిశాంగనా♦జఘనస్థలిఁ వారి, జారి కట్టినచల్వ♦చీరయనఁగ
దర్పకాగతివేళ♦ధరణిఁ జంద్రుఁడు గూర్చి, నట్టిముత్యాలమేల్ ♦ కట్టనంగ

గీ॥ సమయభక్తుండు పార్థివ ♦శర్వలింగ, మును శశిహిరణ్యకలశంబుఁ ♦ బూని దుగ్ధ
మబ్ధినభిషేకమొనరించె♦నననఁగ మిగుల, వెన్నెలదనర్చె జగమెల్ల ♦ వెల్లివిరియ.

గీ॥ శైలమహిళామణుల్ శివఁ ♦ జక్కఁగాన, లంకరించి శివునితో వి♦లాసమెసఁగ
వాసమందిరమును జేర్ప ♦ వామదేవుఁ, డార్యఁ జేకొని వేడుక ♦ లనుభవించె.

ఆ॥ అంత రజని దఱుఁగ ♦ నాకసం బెఱ్ఱనై, యందగించె దీప్తి ♦ కాంశువితతి
వెల్లనయ్యె వేఁడి ♦ వేలుపుఁ బొడసూపి, మింటికెగసెఁ దమము ♦ తంటవాసె.

వ. మంగళవాద్యఘోషపురస్సరంబుగ నాలోవైతాళికప్రార్థితుండై మహేశ్వరుండు వాసాగారంబుఁ బాసి ప్రాభాతికక్రియలఁ దీర్చుకొని జనావాసంబుఁ జేర నంతకు మున్న సుస్నాతులై ప్రాతర్విధులఁ దీర్చుకొని కైలాసగమనకాంక్షులై పరమేశ్వరాగమనంబుఁ బ్రతీక్షించుచున్న యధోక్షజాదిదేవాధ్యక్షులు మహేశ్వరునకు మ్రొక్కి ప్రయాణంబపేక్షింపుడు మహేశ్వరుం డంగీకరించినంతఁ గులాచలేశ్వరుండు దారసించి యిట్లభ్యర్థించె. 211

ఆ॥ పేదవారలనక ♦ ప్రియముతోఁ గొన్నిది, నములు దేవమునిగ ♦ ణములతోడ
నాదుమందిరమున ♦ నామనంబానంద, మొందనుండి చనుట ♦ యొప్పు దేవ!

వ. ఇట్లు ప్రార్థించిన మీఁదట స్వల్పదినంబులుమాత్ర ముండి పరమేశ్వరుండు సకలగీర్వాణమునిచోదితుండై యొక్కనాఁడు జిగమిషన్ బూని సప్తర్షులను హిమవంతుని పాలికిం బంచినంత. 213

క॥ వారలు గిరివరునకుఁ ద, ద్దారకు శివయాత్రఁ దెలుప ♦ దైన్యంబున న
వ్వారలు దుస్సహచింతా, భారంబున నవుడు మూర్ఛఁ ♦ బడిరి బడలుచున్.

ఆ॥ కొంతవడికిఁ దుహిన♦కుధరుండు దెలివొంది, తనదు సతినిఁ దేర్చెఁ ♦ దాగిరీంద్ర
పత్నివేగ శివుని ♦ పాదంబులకు మ్రొక్కి, యిట్లువిన్నవించె ♦ హితవు మెఱయ.

కవిరాజవిరాజితము॥ పరమకృపానిధి! ♦ పాలనసేయుము ♦ పార్వతి నెంతొ కృ♦పామతివై
యరయుచు దోషస♦హస్రములందును♦నాదటనోరుపు♦నందు తగన్

* టిప్పణి:-యంత్రము - పిండిమొదలైనవి విసరెడు శిలాయంత్రము - తిరుగలి.

బరఁగ భవంబు భ ♦ వంబున నీపద♦భక్తినిఁ గాంచిన♦బాల విభూ !
నిరతము స్వప్నమున ♦ నెక్కొనినన్ శివ! ♦ నీశుభనామము♦నేమరఁగున్.

సుగంధి. మేనయిట్లు చాలజాలి ♦ మీఱఁబల్కి కూఁతు నీ
శాను కప్పగించి కుందె ♦ జాలసేపు దీనయై
తా నగేంద్రుఁడాపెకష్టు ♦ తాల్మిఁగూర్చి యంతయా
త్రానుకూలపుం బ్రయత్న ♦ మాచరించె ధీరుఁడై . 217

గీ॥ ప్రమథభూతగణములు సు♦పర్వవరులు, మునులుమున్నగువారలు♦మోదమొప్ప
స్వగణములతోడఁ బయనంబు♦సల్పి యచటి, యుపవనముఁ జేరి శివులకై ♦యుండిరందు.

ఉ॥ అల్లునియింటి కాత్మసుత ♦ నంపఁగఁ జిత్తము గట్టిచేసి ప్రో
ద్యల్లలితాంబరంబుల న ♦ నర్ఘ్యపుసొమ్ములఁ గూఁతు నద్రిరా
ట్ఫుల్లసరోరుహాక్షిఁ గడుఁ♦బొందికయొప్ప నలంకరించి భా
సిల్లఁగ నుత్సవంబొనరఁ ♦ జేసెను బంధుసతీచయంబుతో. 219

— * విప్రసువాసిని పార్వతికిఁ బతివ్రతాధర్మంబు లెఱింగించుట * —

గీ॥ అంతనొక పౌరవిప్రోత్త♦మాంగనామ, తల్లి మేనాత్మ మెఱిఁగి భూ♦ధరకుమారిఁ
జేరి సాధ్వీవ్రతంబిట్లు ♦ చెప్పఁదొడఁగె, మంజుతరసూక్తిమాధురీ♦రంజితముగ.

ఉ॥ తల్లి! పతివ్రతావ్రతవి ♦ ధానముఁ దెల్పెదనాలకింపు రం
జిల్లెడు నీవ్రతంబె శ్రుతి ♦ శీర్షములందును ధర్మసూక్తులం
దెల్లెడ నుత్తమంబనియు ♦ విఖ్యాతమంబని పేరుచెందె ము
న్నెల్లకులాంగనాజనము ♦ లీవ్రతమే యొనరించి రిమ్ముగన్. 221

*మ॥ అల సావిత్రి యరుంధతీసతియు లో♦పాముద్ర శాండిల్యయున్
జలజావాసయు సంజ్ఞ భారతి సతీ ♦ స్వాహానుసూయా శచీ
నలినాస్యల్ శతరూప మున్నగులస ♦ న్నారీవతంసల్ హిమా
చలుఁ జేపట్టిన మేన యీవ్రతము ని ♦ చ్చల్ సల్పువా రమ్మరో! 222

క॥ వారందఱు పతివ్రత, మారాధనచేసి మిగుల ♦ నవనీస్థలిపైఁ
బేరును బెంపును గాంచిరి, శ్రీరంజిల సకలలోక ♦ సేవ్యచరితలై. 223

చ॥ ఒకసతి భానుమండలికి ♦ నుచ్చతరస్థలినుండె భర్తతో
నొకసతి దాఁద్రిమూర్తులను ♦ నుయ్యెల బాలురఁ జేసియూపె నిం
కొకసతి వింధ్యగర్వహర ♦ నుగ్రుని జీవితరాజ్ఞి యయ్యె వే
ఱొకసతి మిత్తిగెల్చె మఱి ♦ యొక్కతె భానుని నాగె నంబికా! 224

* టిప్పణి:- ముదం రాతీతి ముద్రా-రా ఆదానే సానభవతీత్యముద్రా- విరహే పతి శుశ్రూషా లోపే-అముద్రా-అసంతుష్టా-లోపాముద్రా - ముద్రయుసఁగా సంతోషముగలది - భర్త్రృ విరహకాలమందుఁ బతిశుశ్రూష లేమిచేత సంతసము లేనిదిగనుక లోపాముద్ర.

(అకారప్రశ్లేషచే విశ్రమము)

సీ॥ విభుఁడారగించిన ♦ పిదపఁ దత్పరిశిష్ట, మర్థిభోజనము సే ♦ యంగవలయు
మగఁడు నిద్రించిన ♦ మఱియంత నిద్రించి, మునుముందుఁ దాన మేల్ ♦ కొనఁగవలయు
పెనిమిటి గొట్టుచోఁ ♦ బెనఁగక 'విభు! దయ, సేయుమా' యనుచు యా ♦ చింపవలయు
పతి దన్నుఁ బిలిచినఁ ♦ బనులన్ని వదలి సాం, జలిబంధముగఁ జేరఁ ♦ జనఁగవలయు
గీ॥ భర్త సెప్పినపనిని సం ♦ బరముతోడ, సాక్షణమునందె పూని సే ♦ యంగవలయుఁ
దొడరి పూజోపకరణవ ♦ స్తువుల నెల్లఁ, జెప్పఁబడకయె తాన యోజింపవలయు.
ఉ॥ మండనముల్ బొసర్పకయె ♦ మానిని భర్తను జూడఁగూడ దా
మండన మొందఁ గూడదు కు ♦ మారిరో! దండ విభుండు లేనిచో
దండిగ భర్త దిట్టినను ♦ దా మది రోసము నొందఁ గూడదో
యండజయాన! వాకిటఁ గు ♦ లాంగన నిల్వఁగఁగూడ దెన్నఁడున్. 226
మ॥ పరగేహంబుల కేగరాదు తమత ♦ త్త్వంబెచు కే నొడ్ల కె
వ్వరికిఁ దెల్పఁగరాదు నాథువిడి ది ♦ వ్యక్షేత్రతీర్థానుసం
చరణంబున్ బొనరింపఁగూడ దుపవా ♦ సంబుల్ వ్రతంబుల్ నిజే
శ్వరనిర్దేశము లేక సేయఁదగ దో ♦ చంద్రార్థబింబాలికా! 227
క॥ తీర్థార్థినియేన్ బతిపద, తీర్థంబును గ్రోలవలయుఁ ♦ దెఱవ సకలస
త్తీర్థంబులందె వెలయు య, థార్థంబిద్దాన సంది ♦ యము లేదంబా! 228
క॥ ఇవిరి సభాస్థలులకు ను, త్సవములకున్ మగడు లేక ♦ చనఁదగ దెపుడే
నవసరము లేక సుంతయు, ద్రవిణంబును వెచ్చపెట్టఁ ♦ దగదు కుమారీ! 229
గీ॥ తెంపుతో దేవపితృతి ♦ థిజనములకు, బంధుపరిచారభిక్షుగో ♦ వ్రాతమునకు
భోజ్యములను విభాగించి ♦ పూవుఁబోఁడి, దానుబో సేయవలయు నిత్య ♦ మును వినుము.
చ॥ పెనిమిటి పేదవైనఁ గడుఁ ♦ బెల్లుగ వ్యాధితుఁడైన వృద్ధుఁడై
నను గడుఁ గ్రుద్ధుఁడై యొనరి ♦ నన్ నెఱితుంటరియైన నజ్జులో
చన విడువంగఁ బోలదిఁక ♦ సర్వవిధంబుల భర్త శ్రేయమే
యనుదిన మర్థిఁ గోరుచుఁ బ్రియ ♦ త్నము సేయుట యొప్పు మానినీ! 231
గీ॥ హాయిగాఁ గూరుచుండి యే ♦ దో యభీష్ట, కేళిమైనున్న విభునిఁ దా ♦ వేళఁ గనక
లేశపుం బని కోసమై ♦ లేవదీయ, వలవ దెప్పట్ల సతికిఁ బ ♦ ర్వతకుమారి! 232
గీ॥ చెఱఁగు మాసిన మూణ్ణాళ్ళు ♦ చెలువ మగని
సముఖమున కేగి చూడఁగఁ ♦ జనదు తనదు
పలుకు పతి వీనులకు వినఁ ♦ బడఁగఁ బలుకఁ
జనదు ముగ్ధేందుశేఖర ♦ సాధ్వి! వినుము. 233
క॥ నాలుగవ రోజున నుషః, కాలంబున జలకమాడి ♦ గ్రక్కున మగనిన్
బాలించి కనుట యెంతయు, మే లటుగాకున్నఁ గమల ♦ మిత్రుఁ గనఁదగున్.
సీ॥ పరగ సిందూరంబు ♦ పసుపు కుంకుమును శ్రీ, చందనం బగరు క ♦ జ్జలము లాక్ష
తమ్మలంబును గమ్మ ♦ తావిపూల్ దువ్వెన, యద్దంబు గంకణా ♦ లందియలును

మాంగల్యతంతువు♦మట్టె లొడ్డాణంబు, ముంగర తాటంక ♦ ములును రత్న
ములపేరులును ముత్య♦ముల పేరులును జడ,కుప్పెలు సవరముల్ ♦ కొప్పునగలు
గీ॥ రైకలును మేలిముసుఁగులు♦రాజముఖికి,నిత్యసేవ్యంబులై యొప్పు ♦ నెలఁత మగని
యాయురభివృద్ధికై వీని♦హర్ష మెసఁగ, సతము దాల్పఁగ వలయుఁబ♦ర్వతకుమారి!
ఉ॥ చాకెతతోడ నెప్పుడును ♦ స్వైరిణితోడ నుదక్యతో విభున్
బైకొని పోరు సేయు చెడు ♦ భామినితో విధవావధూటితో
జోకగ సర్వమున్ దొరఁగి ♦ జోగిగఁ గ్రుమ్మరు నాతితోడుతన్
జేకొనరాదు విన్మిఁకను ♦ జెల్మి కులాంగన లీశ్వరప్రియా! 236
గీ॥ ఒంటిగా నెందునిలుచుండు ♦ టొప్పదెపుడు,నగ్నమై తీర్థమాడఁజ♦నదు వెలఁదికిఁ
గడపఁ దిరుగలి రోలు రో♦కలిని సాన, రాతి నసిపీఁటఁ గూర్చుండ♦రాదు సతికి.
ఉ॥ అచ్చికబుచ్చికొప్పమగఁ ♦ డక్కునఁ జేరిచి వేడ్కసేయఁగా
నచ్చట ముచ్చటల్ గనుచు ♦ హాయిమెయిన్ రహించుచుండినన్
హెచ్చుగ నిక్కఁజెంది విభు ♦ నెల్లిదమాడఁగఁ గూడ దెంతయున్
నచ్చునటుల్ మెలంగవలె ♦ నాథుని నెమ్మది కెల్లప్రొద్దులన్. 238
గీ॥ భోగసమయంబునన్ దక్క ♦ పొలఁతి కెపుడు
ప్రౌఢిఁజూపింపఁదగ దాత్మ ♦ పురుషు నెదుట
భర్త కెచ్చోట మోదంబు ♦ పరిఢవిల్లు
నందె యనురక్తయై సతి ♦ యమరవలయు. 239
క॥ పెనిమిటి సంతసమునను౦, డినఁ జేడియ సంతసమున ♦ నెగడవలెన్ గుం
దున వందురుచుండినఁదా, నును బరితాపంబునున్ గ♦నుట దగుఁగోమయున్.
క॥ ఆపత్సంపత్తులయం, దోపికతో నొక్కపోల్కి ♦ నుండఁగవలయున్
గాఁపురము పేదమైనను, రాపొందక ధీరయగుచు ♦ రంజిలవలయున్. 241
గీ॥ ఉప్పునేయియుఁదైలాదు ♦ లెప్పుడేని, శూన్యమగుడుఁ బతివ్రతా ♦ సుందరాంగి
మగనితో నవిలేవని ♦ మనసునొచ్చఁ, జేయరా దాడింబడఁ ♦ జేయరాదు.
ఉ॥ ఉన్నతపీఠమెక్కి సతి ♦ యుండఁగ రాదిక దుష్టసన్నిధిన్
బన్నుగ నిల్వరాదు తన ♦ భర్తకుఁ గాతరవృత్తిబోధనం
బెన్నఁడు సేయరాదు కడు ♦ హెచ్చుగఁ బెద్దలయొద్ద భాషణం
బున్నగు సేయరాదు పువుఁ ♦ బోండ్లకు భూధరరాజకన్యకా! 243
క॥ అరవిందభవునికన్నను, సరసీరుహనయనుకన్న ♦ శర్వునికన్నన్
గరమధికుఁడు దనవిభుఁడని, కరివరనిభయాన యెఱుఁగ♦గాఁదగు మదిలో. 244
ఉ॥ దవ్వులనుండి వల్లభుఁడు ♦ ధామముఁ జేరినయంతనే కడున్
జివ్వనఁదోయమార్చిరుచిఁ ♦ జెన్నగు నన్నముఁ గమ్మపీడ్యమున్
బువ్వులఁబోలు పుట్టములఁ ♦ బొందుగనిచ్చి విహారశయ్యపై
జవ్వని చేర్చి యూరువులఁ ♦ జక్కఁగనొత్తవలెన్ మహేశ్వరీ! 245

కll మితముగనొసంగుధనముల, సుతుఁడు మితం బొసఁగుఁదండ్రి ♦ సోదరుఁడటులే
మితముగనొసంగునిఁకఁదన, పతియొక్కఁడొసంగు నమిత ♦ భాగ్యముల నుమా!
గీll విభుఁడె దైవంబు సతులకు♦విభుఁడె గురుఁడు, ధర్మతీర్థవ్రతములెల్ల♦ధవునికొలువె
యనుచు సర్వము విడనాడి♦యలరుఁబోఁడి, విభునినొక్కని భక్తిసే♦వింపవలయు.
సీll పెనిమిటిఁ బాసి యో♦దనము మెక్కినయోష, మేషియైచరియించు♦మేదినిపయి
పరునిన్ మరగి మరు♦వనికిలోనైన య,క్కొమలి ఘూకమౌ♦కోటరమున
భర్తర్ గొట్టిన ♦ బదులు గొట్టిననారి, భూరిబిడాలమై♦పొడముఁబుడమి
పతితో జగడమాడి♦ప్రత్యుక్తినిచ్చిన పొలతుక శ్వానమై ♦ పుట్టుభువిని
గీll పరునిఁగ్రిగంటఁజూచిన♦పణఁతి గిల్ల, కన్నులొంది జనించు జ ♦ గంబునందు
నీవునీవని నాథుని♦నీతిమాలి, దెగడెడుగయాళి మూగయై♦తగజనించు. 248
కll ప్రాణంబు లేనిదేహము, మానుగ నెట్లశుచియగునొ ♦ మగనివిడినయ
జ్ఞానన యటు లశుచిత్వముఁ, బూనుననుచుఁ జెప్పుశాస్త్ర♦ములు శివురాణీ!
కll ఆపెజనయిత్రి ధన్యయు, నాపెగురుఁడు ధన్యుఁ డీధ♦రావాసముపై
నాపెపతి ధన్యుఁడెంతయు, నేపె పతివ్రతయొ పుడమి ♦ నిందునిభాస్యా! 250
కll పితృమాతృవంశజులున్, బతివంశ్యులు సాధ్విపుణ్య ♦ భాగ్యంబున స్వ
ర్గతిఁజెంది మేటిభోగము, లతులితముగనొందఁగలరు ♦ హరువిరిఁబోణీ! 251
గీll శీలభంగం బొనర్చిన♦చేడె మాతృ, పితృకులమ్ములవారిని♦విభునికొలము
వారినిన్ బడద్రోయు న♦వారణంబు, గా నధస్థలమందు శం♦కరవధూటి! 252
గీll ఎచ్చటెచ్చటసాధ్వియా♦నింతియడుగు, లీధరాభాగమునుస్పృశి ♦ యించు నెలమి
నచ్చటచ్చటఁబావనం♦బై సమస్త, దోషహరణక్షమంబయి ♦ తోఁచుఁబుడమి.
చll పరమపవిత్రుఁడైన యల ♦ భాస్కరుఁ డాయమృతాంశుఁ డామరు
ద్వరుఁడగు గంధవాహుఁడు న ♦ వశ్యముగాఁ దమ శుద్ధిఁగోరి యి
ద్ధరను బతివ్రతాతనువుఁ ♦ దాము స్పృశింతురు నిక్కమింక న
ట్లురువుగ నాసచేయు శుచి ♦ యర్ సలిలంబులు సాధ్వితాఁకుకై. 254
కll ప్రతిగేహమందు లలితా, కృతు లింతులు చాలఁగల రొ ♦ గిర్ వినుము పతి
వ్రతయగు నాలు మహేశ్వరు, నతులితకారుణ్యసిద్ధి ♦ నమరున్ ధరణిన్. 255
కll గంగావగాహమును జే, యంగా దేహంబు పూత ♦ మగు నెట్టుల న
ట్టుంగారె సాధ్విఁగన్గొని, నం గల్మషమవియుఁబావ ♦ నమగు నఖిలమున్. 256
కll పతిదేవత యుమ! యాపెకుఁ, బతియగువాఁ డీశ్వరుండు ♦ పన్నుగనీదం
పతులను గొల్చుమనీషి ని, రతమిష్టములొంది పుడమి ♦ రాజిల్లుఁగడున్. 257
గీll నిగమముపతివ్రతానారి♦యగునుబ్రణవ, మీశ్వరుఁడుక్షమ సాధ్వియా♦నిగురుబోఁడి
తపముపశుపతిసత్క్రియ♦ధరన పాంసు,ల యవిదఫలంబు శివుఁడుక♦ల్యాణమూర్తి
వ, ఇవ్విధంబున నావిప్రాంగన పతివ్రతాధర్మంబులును దన్మాహాత్మ్యంబులు నుపదే

శించి వెండియుఁ దద్భేదంబుల నెఱింగింపఁ గడంగి యిట్లనియె. ఆర్యా! వినుము పతివ్రతలుత్తమ మధ్యమకనిష్ఠాధమ భేదంబుల నాల్గు విధంబులఁ బరంగుదు రందు.

ఆ॥ పతినిఁ దక్క నెపుడు ♦ పరపురుషునిఁ గల, నేనిఁ దలఁప కన్య ♦ నీక్షణంబు
చేయనట్టి సాధ్వి ♦ చెన్నుగా నుత్తమ, యనఁగఁ జెల్లు నవని ♦ హరుమిటారి!

క॥ సుతు వలెఁ దోఁబుట్టుల వలెఁ, బితవలెఁ బెఱవారిఁ గనుచుఁ ♦ బెనిమిటియందు
ప్రీతిమయమగు భక్తి నెఱపెడు, సతి మధ్యమ యనఁగఁ జెల్లు ♦ శైలవరసుతా!

క॥ వ్యభిచారము కులభామిని, కభిరూపము గాదటంచు ♦ నాత్మ నెఱిఁగి తా
విభుని భజింపుచు నుండిన, యిభయాన కనిష్ఠ మనుచు ♦ నేర్పడుఁ బుడమిన్.

క॥ పెనిమిటిభయంబునను గుల, జనుల భయంబునను బరుని ♦ సాంగత్యము స
ల్పని వధు వధమాధమయని, యనుదురు ప్రజలెల్ల ధాత్రి ♦ నగరాజసుతా!

వ. ఇట్లనేక ధర్మసూక్ష్మంబు లెఱింగించి.

గీ॥ ఇత్తెఱంగునఁ బతిభక్తి ♦ నెఱిఁగినడువు, మమ్మరో! సర్వవేదప్రి♦యంబుగాఁగ
నఖిలజగదంబ వీవతఁ ♦ డభవుఁ డీఁకను, నినుదలఁచి సాధ్వు లౌదురు♦ నెలఁత లిలను.

వ. నేను లోకాచారప్రకారం బింతవట్టు నీకెఱింగించితి నని యూరకున్నంతఁ బార్వతి పరమామోదంబునొందె. మేనకయు సమయోచితం బారసి ధైర్యంబు చేసి ప్రియాణసన్నాహంబుఁ గావించి పార్వతి నాలింగనంబు నొనర్చి కన్నీరు నించె. పార్వతియుఁ దల్లిఁ గాంచి కృపావచనంబు లుచ్చరింపుచుఁ బెల్లుగ నలందురెఁ గుసుమకోమలయగు పార్వతి రోదనంబుఁ గాంచి బాంధవస్త్రీలును నాగరకాంతలును దేవపత్నులు మున్నగువారలెల్ల సుచింతాదంతురాననలైరి. సర్వజగత్ప్రభుండగు మహేశ్వరుఁడు నవ్వారి దుఃఖభరంబుఁ జూచి తానును గంటఁ దడిఁ బెట్టె.

గీ॥ ఇట్టిసమయంబునందుఁ దు♦హినగిరీంద్రుఁ, డాత్మజులతోడ నరుదెంచి♦యార్యఁ గాంచి
వెక్కసంబగు దుఃఖంబు ♦ వెలయనాపె, దనదువక్షమువఁ జేర్చి♦కొని రయమున.

ఉ॥ తల్లిరో! యెట్లువోయెదవు ♦ తల్లినిఁ దండ్రిని నన్నదమ్ములన్
బెల్లుగ బంధువర్గమును ♦ వేశ్మమునున్ విడనాడి యిప్పుడి
మ్మెల్లరు నిన్నుఁ బాయఁగల ♦ రెట్లు కనుంగొను చిన్నవోయె నీ
యిల్లును బట్టణం బిపుడె ♦ యేనెటు సైతు వచింపు మమ్మరో! 267

గీ॥ అనుచుఁ గన్నీరు దొరఁగ మ♦హావ్యసనము, తోడ వందురుచున్నట్టి♦ తుహినభూమి
ధరున కధ్యాత్మతత్త్వంబుఁ ♦ దద్జ్ఞుఁ డగుపు, రోధ బోధించె నాత్మని♦రూఢిదనర

ఉ॥ పార్వతి తల్లిదండ్రులకుఁ ♦ బన్నుగఁ బెద్దలకెల్ల వారికిన్
గర్వములేక మ్రొక్కికడుఁ ♦ గన్నుల నీరొలుకంగఁ జింతిలన్
సర్వపురంధ్రు లద్రివరు ♦ సాధ్వియుఁ బుత్త్రిలుఁ దద్వధూమణుల్
పర్వతశేఖరుండును గృ ♦ పన్ విలపించిరి కించ తోఁ గడున్. 269

ఆ॥ విప్రులంత మరల ♦ విజ్ఞానబోధంబు, చేసి లగ్నవేళఁ ♦ జెప్పనపుడు
ధైర్యమొంది తుహిన ♦ ధరుఁడు రప్పించెఁ బ, ల్లకినిఁ గాలిమెక్కు♦టకయి వేగ.

—* శివుఁడు పార్వతీదేవిఁ దోడ్కొని కైలాసంబున కేగుట *—

ఆ॥ పుణ్యకాంత లుమకు ♦ భూరిగా దీవెన, లిచ్చి యందలంబు ♦ నెక్కఁజేసి
రార్య మరల గురుల ♦ కందఱికిని మ్రొక్కి, పయనమున్ బొనర్చె ♦ భర్త వెంట.
క॥ రాజోపచారముల గిరి, రాజు సుతకుఁ దనరఁజేసి ♦ రాణదలిర్పన్
బూజార్హములగు వస్తువు, లోజంగూరిచి యొసంగి ♦ యుద్యత్ప్రేమన్.
గీ॥ తాను మేనయుఁ గొడుకులుఁ ♦ దత్పతులును, నందొఱువిహారవనివఱ ♦ కరుగుదెంచి
వీడుకొల్పిరి బహువిధ ♦ విభవ మెసఁగ, శివుఁడు చేరెను రజతాద్రి ♦ శిఖరమునకు.
క॥ అందలి గణవరు లమితా, నందముతో నెదురువచ్చి ♦ యధికోత్సవ మొ
ప్పం దుహినగిరిసుతాశివు, లం దగఁ జేర్చిరి మనోజ్ఞ ♦ లలితభవనమున్. 274
వ. అత్తఱి మహేశ్వరుం డార్యాచిత్తంబునందలిగురుజనవియోగజన్యంబగు కుందుఁ
బాఁపంగడంగి; 275
గీ॥ పార్వతినిఁ జూచి యిట్లనెఁ ♦ బ్రాణదయిత!, చూచితే వెండిగట్టు ల ♦ క్ష్ములకుఁ బట్టు
తలఁపువచ్చెనె యిచ్చోటు ♦ తలఁపువచ్చె, నే మనవిహారగోష్ఠి ప ♦ ర్వేందువదన!
క॥ హెచ్చగు పచ్చలతిన్నెలు, నచ్చపు వజ్రింపుకోన ♦ లవె పద్మముఖీ!
మెచ్చులు గులుకుచు నడలన్, గ్రిచ్చఱ నిటువచ్చెఁ జూడు ♦ కలహంసంబుల్.

వనయూరవృత్తము:- నూతనఘనాఘనవి ♦ నోదకరవేణీ!
ప్రీతిని నుజూచియదె ♦ పెంపెసఁగ నృత్తం
బాతతగతిన్ సలుపు ♦ నావనమయూర
వ్రాతమునుజూడుము మ ♦ రాళవరయానా! 278

క॥ నెత్తావులఁ బుత్తెంచుచుఁ, బొత్తుఁ దెలుపు పారిజాత ♦ భూజములవియే
గుత్తులు గుత్తులు పండ్లివె, యెత్తుమనుచుఁ జూపుఁగాంచు ♦ మెలకల్పతరుల్.
ప్రహర్షవృత్తములు } ఈవనముఁ గనుమ రామా! జీవన మతిథికి భామా!
పావనము సుమునిరామా, సేవనముల గుణధామా! 280
సుందరమిదివి రిబోణీ! కందరము కమలపాణీ!
మందిరమిదె యలివేణీ! మందరమతులము రాణీ! 281
గీ॥ ఈన మేరుద్రుమసమూహ ♦ మెలమిఁ జేరి, తొండములు సాచి యూచి వే ♦ దండచయము
పుష్పవృష్టిని గూర్చెఁ జ ♦ మ్మూరునయన!, తావకాగమనమున సం ♦ తసముఁ జెంది.
గీ॥ కర్ణికారములివె వర ♦ వర్ణినీతి
లకమ! తిలకింపుము సువర్ణ ♦ మకుటధరము
లనఁగఁ జెలువొందు హరిచంద ♦ నని వహంబు
లవియె కను మీప్సితార్థద ♦ మావహములు. 283
క॥ చమరీసముదయ మలరఁగ; భ్రమరీరవమల్లదే యు ♦ పశ్రుతిగాఁగన్
సమరీతి నాలపించెద, రమరీబింబోష్ఠులిందు ♦ హాయిగ వీణన్. 284

క॥ పొందమ్ములఁ జెంగలువల, నందములై కీరశారి ♦ కావళి రవళిన్
విందులకుఁ బిలుచుఁ గొలఁకులు, విందువె కలకంఠకంఠి! ♦ వేడుక మీఱన్. 285

క॥ రంగుల రంగుల తామర, లుం గలువలు రాజహంస ♦ లుం జక్రములున్
రంగుల రంగుల చిలుకలు, పొంగిపడెదు నందుఁ జూడు ♦ పుష్కరిణు లుమా!

సీ॥ పరిణతసహకార ♦ ఫలరాజిఁ దొరలుపా, నకముల కాల్వల ♦ నడకలవియె
కీరచంచూభిన్న ♦ భూరిపచేళిమ, దాడిమఫలరస ♦ ధారలివియె
కమనీయ రసదాళి ♦ కదళీఫలావళి, పచ్చితేనియల ప♦ల్వలము లవియె
పరిపక్వగోస్తనీ ♦ ఫలవిస్తరస్తోమ, సారకుల్యాయాన ♦ సరణులివియె

గీ॥ పక్వజంబూఫలవ్రాత ♦ పాతవిస్తృత ; మధురరసపూర్ణ వేశంత♦మండలులవె
ద్విజవిదారిత బింబవి♦స్తీర్ణఫలర, సాశయములివె పక్వబిం♦బాధరోష్ఠి!

చ॥ చకితమృగాక్షి! యీశిఖర ♦ సానువులందుఁ గురంగశేఖర
ప్రకరము లాత్మనాభివివ ♦ రంబులఁ గస్తురి రాల్చుచున్న వా
రకమగు నాదుమారమున ♦ రాజిలుమారుతపోతసన్నివే
శకముల నారయంగఁ దగుఁ ♦ జందనగంధసుగంధి! యీదటన్. 288

క॥ అని నొడివిన విని శంభున, కనిశంబును దయితమైన ♦ యఖిలేశ్వరి యి
ట్లనె దేవ! మఱతునే నూ, తన మేదిట నేను గ్రొత్త ♦ దానినె నీకున్. 289

క॥ ఐనను లోకాచారముఁ, బూని నడువవలయుఁ గానఁ ♦ బుణ్యచరిత! నీ
వా నియతిఁ దలఁచి కడుదయ, తో నడువుము కార్యమెల్లఁ ♦ దుష్టియెసంగన్.

—* శివుఁడు దేవత లందఱికిఁ గట్నము లిచ్చి పంపుట *—

వ. అనిన మహేశ్వరుండు సుధాధారాస్వాదంబగు ప్రాణప్రియావచనంబున కమందా
నందంబునొంది యిట్లనియె. దేవీ! 291

క॥ భూషణములు శ్రుతులకుఁ బరి, పోషణములు దృఢవికాస ♦ బోధాగతికా
శ్లేషణములు సుఖసిద్ధికిఁ, దోషణములు మదికి నీ మృ♦దులభాషణముల్, 292

క॥ చందనములు తనువుకు హరి, చందనములు లిప్స కుసువి♦చారరుజకుఁ బ్రి
స్యందనము లాత్మమునకా, నందనములు దేవి! నీక♦నద్వచనంబుల్. 293

వ. అనుచున్నంత గణపాలురు నానావిధమధురభోజ్యపదార్థంబుల నాయితంబుచేసి
వడ్డింపుడు నందఱు ప్రియంబంది భుజియించి విడెంబులనుఁగొని మహేశ్వరునకు
నమస్కరించిరి. పరమేశ్వరుండును యథాయోగ్యంబుగ నందఱకుఁ గానకదుకూ
లాంబరమణిమయభూషణంబుల నుపాయనంబులిచ్చి లోకాచారంబు ననుస
రించి హరివిరించులకును వశిష్ఠాది బ్రహ్మర్షులకును వందనంబుచేసె. బ్రహ్మర్షు

లును పితామహాచ్యుతులును లౌకికమర్యాద ననుసరించి పార్వతీపరమేశ్వరుల కాశీర్వచనంబు లొసంగిరి. వివాహంబున కరుదెంచిన వారందఱును హరివిరించ నాములతోఁ బరమేశ్వరానుజ్ఞఁగొని తమతమ నివాసంబుల కరిగిరి. మహేశ్వరుండును గణపాలుర మందిరద్వారంబందు నియమించి తాను మహామాయ యగు పార్వతితో విహారమందిరంబుఁజేరి సుఖంబుండె. ఇట్లఖిలకల్యాణకారణంబును శోకఘ్నంబును నాయురనవర్ధనంబును ప్రమోదకరంబును సకలజగజ్జేగీయమానంబును నగు పరమేశ్వరకల్యాణంబు మీకామోదంబునఁ జెప్పఁబడియెనని సూతుండు శౌనకాది మునీంద్రుల కిట్లనియె.

—* ఫ ల శ్రు తి *—

క॥ ఈ సుచరిత్రం బద్భుత, మై సర్వారిష్టశమన ♦ మై యాయుష్యం
బై సర్వకామదంబై, భాసిల్లు యశస్యమగుచుఁ ♦ బాఠకుల కిలన్. 295

సీ॥ ఎడఁబాటులేక పెల్లడరుచుండెడిదీర్ఘ, రోగియామనుజుఁ డా ♦ రోగ్యమొందు
శోడుసేకుఱక సం ♦ క్షోభంబుతోనున్న పురుషుండు పెండ్లాడుఁ ♦ బుణ్యసతిని
సంతానమేలేక ♦ చాలఁగృశించు దం, పతుల కిష్టంబుగా ♦ సుతుఁడుపొడముఁ
గుమువఁగూతును గట్టఁ ♦ గోకయు లేని శు, ష్కదరిద్రుఁ డతులభా ♦ గ్యంబుఁజెందు

గీ॥ ప్రబలదుఃఖాకులుండగు ♦ వాఁడు దుఃఖ, శాంతినిఁగాను నపమృత్యు ♦ చకితుఁడైన
వాఁ డకాలపుమృత్యువు ♦ వాతఁబడక, మను నెవండీకృతినిఁ జది ♦ వినను వినను.

క॥ వినుపించు నెవఁడు నిత్యము, జనములకీ శివవివాహ ♦ చరితము శుచియై
విను నిత్య మెవఁడు శుచియై, చనఁగల రవ్వారు తుదకు ♦ శర్వునిపదమున్.

వ. అనిచెప్పినంత శౌనకాది మహామును లవ్వలికథను జెప్పుమనుటయు 298

మ॥ చరగుర్వీశ్వరపూజనాభిరత భా ♦ స్వద్దివ్యచేతోంబుజా!
హరనీహార పటీరహార శరద ♦ భ్రాదభ్ర కీర్తిప్రభా!
నిరతాన్నోదక దానతోషితజనా! ♦ నిత్యప్రియాలాపనా!
యురుగానోచితవర్తనా! హరితగో ♦ త్రోద్భూత! భాస్వద్గుణా! 299

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి పార్వతీ ఖండంబునఁ
బంచమాశ్వాసము సంపూర్ణము.

(శ్రీ) (శ్రీ) (శ్రీ) (శ్రీ) (శ్రీ)



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## కు మా ర ఖం డ ము.

### ప్ర థ మా శ్వా స ము.



నిగమాగమసముదిత
మానితధర్మాచరణస ♦ మాహితహృదయా!
నానాశిష్యాఘతమో
భానూ! శివమూర్తి! వీర ♦ భద్రారాధ్యా!

వ. అక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె.

గీ॥ గిరిజఁ దోడ్కొని కైలాస ♦ గిరికి శర్వుఁ, డరుగుదెంచి సుఖంబుగ ♦ నచట నేమొ
నర్చె నాకెఱిఁగింపుము ♦ నలినసూతి!, యనుచు నారదుఁ డడుగ ని ♦ ట్లనియె నజుఁడు,

క॥ నారద! చెప్పెదవిను చె, న్నార దయావిభవుఁడైన ♦ యభవుని చరితన్
దారకదనుజవధార్థము, దారకు నసమానశక్తి ♦ ధరుఁ గనుటయునున్. 3

క॥ సురలెల్లరుఁ దమనగళుల, కరుగుడుఁ జంద్రార్థమౌళి ♦ యమరుల బాధల్
పరిహారము సేయఁగ మది, నరసి కృపావివశుఁడగుచు ♦ నంత రయమునన్. 4

చ॥ అనుపమదివ్యరత్నముల ♦ కాస్పదమై యలరారుచోటఁ జం
దనరససేకభాస్వదవ ♦ దాతమణీమయమైనచోట నూ
తనవికచప్రసూనదళ ♦ తల్పవిభాసితమైనచోటఁ బా
వనతరుమంజరీప్రకర ♦ బాలసమీరము లొప్పుచోటునన్. 5

క॥ భోగసుఖదోపకరణ, శ్రీగరిమ నెసంగుచోటఁ ♦ జేతోజక్రీ
డాగతుల కర్హతరమై, రాగిలుచోటన్ మనోహ ♦ రంబగు చోటన్. 6

క॥ గిరిరాజరాజతనయను, బరమేశ్వరుఁ డతనుభోగ ♦ పారీణుండై
సురతక్రీడలఁ దేల్చెను, సరవిగ నొకవేయిదివ్య ♦ సంవత్సరముల్. 7

క॥ శివదేహస్పర్శంబున, శివుఁడు పరిమోహంబుఁ జెందుఁ ♦ జిరకాలం బా
శివదేహస్పర్శంబున, శివయుఁ బరిమోహంబుఁ జెందు ♦ జిరకాలంబున్. 8

ఆ॥ చాలఁగాల మిట్లు ♦ జరుగఁగా నద్రిజా, శంకరులకు నొక్క ♦ క్షణమువోలె
నరిగెనంత దివ్య♦వరులు మేరువుఁజేరి, గోడఁగఁబోడఁగిరపుడు ♦ గోడవయడర.

చ॥ చలనమొకించుకేఁ గనక ♦ స్వాత్మమునందు రమించు నీశ్వరుం
డిల మనకార్యసిద్ధికయి ♦ యే గిరికన్యను బెండ్లియాడి వె
గ్గలముగ నాపెతో సతము ♦ కామసుఖంబులఁ జెందుచుండె వే
ల్పుల కడగండ్లఁబాప నొక ♦ పుత్రకుఁ గాంచకపోయె నింతకున్. 10

క॥ అనియిటుల శైలకన్యా, మనసిజహరసంగతుల న ♦ మరకులతిలకుల్
వినుచుఁ దడవాట కెంతయు, వనరుచు గుమిఁగూడి యొక్క ♦ వాసరమందున్.

—* దేవతలు విష్ణుమూర్తికిఁ దమకష్టంబులఁ జెప్పికొనుట *—

గీ॥ అజునిఁదోడ్కొని నారాయ ♦ ణాంతికమును, జేరివందనమొనరించి ♦ భూరిదుఃఖ
భరముచేఁగడుఁబొగులుచుఁ♦ బరగనిట్లు, చెప్పికొని రార్తమూర్త్యులై♦శ్రీవిభునకు.

క॥ హరి! వేయిదివ్యసంవ, త్సరములనుండియును శివుఁడు ♦ శైలతనయతో
సురతక్రీడలఁ బెనఁగెడు, విరమింపఁడు మాన్పఁడకట ♦ వేల్పులవెతలన్, 13

ఆ॥ పుండరీకనయన! ♦ పోలునే నీవును, దయను దప్పి మమ్ముఁ ♦ దలఁపకుంట
రమ్ము పోదమిపుడు♦రాజతగిరి కుపా, యమ్మునరయు శివుద♦యన్ బడయఁగ.

వ. అనిన నిలింపులకు వైకుంఠుండిట్లనియె.

చ॥ అలమట మానుఁడింకఁ గరు ♦ ణాత్మకు శర్వు భజింపుఁ డిప్పుడా
యలఘుననుగ్రహంబున ర ♦ యంబుగ భద్రముగల్గు నీశ్వరున్
గొలిచెడు వారికెందు సమ ♦ కూరు శుభంబులు వాయు దుర్గతుల్
పొలియుదు రాయతానలని ♦ భుల్ రిపువీరు లుదగ్రకోపనుల్. 51

గీ॥ తీవరముసేయఁదగ దిష్ట ♦ దివ్యులార! , కాలపరిపాకమొందిన ♦ కార్యమెందు
సిద్ధిఁగాంచుఁ దదన్యంబు♦ చెడును దీని, నెఱిఁగి యోరిమిఁగావింపుఁ♦డిద్ధమతులు!

వ. వెండియును.

గీ॥ శంకరుండట్లు సంభోగ♦సక్తుఁడగుచు, ననవరతము రతంబుల ♦ నలర నెవఁడు
భంగమొనరింపఁజాలెడు♦ప్రభుఁడె పూర్ణ, వర్షసాహస్రమున రతి♦వదలునిజము.

క॥ శక్తిశివుల సంయోగము, యుక్తం బది సకలవిష్ట ♦ పోత్కరసుఖముల్
వ్యక్తముగఁగూర్చు నిది సు, వ్యక్తము పరికించి పాయుఁ ♦ డాత్మవ్యథలన్.

వ. మఱియును.

క॥ స్త్రీపురుషసురతభంగపుఁ, బాపంబున కెవ్వఁడేని ♦ బాల్పడు భువినా
కాపురుషుఁ డొందు నిరయము, స్త్రీపుత్త్రులఁ గోలుపోవు ♦ సిద్ధంబు సురల్!

క॥ మున్నల దూర్వాసుం డను, సన్నుతుఁడు ఋషీశ్వరుండు ♦ శక్రుని రంభా
పన్నగవేణీరతిసం, పన్నుని విడఁదీసి కుడిచెఁ ♦ బ్రతిఫలము వెసన్. 20

గీ॥ భార్యగడ తేఱి వేల్పు లోక♦పడఁతిఁ బెండ్లి, యాడి యొక వేయిదివ్య హా♦యనములకువి
యోగజనితజ్వరముఁ బాసి♦యారటఁ గొనెఁ, బలువు రిబ్భంగిగాఁ బ్రీతి♦ఫలముఁ గనిరి

క॥ సకలముని సేకసాధ్యం, బకలంకముగాఁగ సృష్టి ♦ కాధారం బీ
యొకటియొకద! యిద్దానికి, వికలతఁ గూర్పంగఁ దగునె ♦ విబుధప్రవరుల్! 22

వ. కావున త్వరపడక మీమీనివాసంబుల కరుగుఁడు. సంపూర్ణవర్షసహస్రంబందుఁ గైలాసంబున కేగి యమ్మహాదేవుని వీర్యంబుఁ బుడమిపయిం బడఁజేయుఁడేపుడు స్కందుఁడనఁ గుమారుండు పొడము దాన మన కభీష్టసిద్ధియగునని జనార్దనుం డుపదేశించి యంతఃపురంబున కరిగె. బ్రహ్మాదులెల్లఁ దమనివాసంబుల కేగి రంతఁ గొన్నినాళ్ళకు శక్తిశక్తిమంతుల సంతతవిహారంబునకు సశేషగజకచ్ఛపంబగు ధరాతలంబు పీడితంబై జగత్ప్రాణంబగు సమీరణంబు స్తంభింపుచుఁ ద్రిలోక జనంబు భయాక్రాంతంబై పితామహుల్ జేర నతండు నారాయణుల్ బురస్క రించికొని దేవతలతోఁ గైలాసంబుఁ జేరుడు నంతఁ గమలాకాంతుండు శివద్వారం బుననున్న గణపాలురకు మ్రొక్కి యిట్లనియె. 23

క॥ శంకరకింకరులారా!, సంకటహరులార! శర్వ ♦ సాన్నిధ్యం బా
తంకమున వనరు మాకిట, శంకింపక కూర్పుఁడయ్య! ♦ సత్వరము కృపన్. 24

వ. అనిన గణాధీశ్వరు లిట్లనిరి.

క॥ హరి! వినుము సర్వలోకే, శ్వరుఁడు హరుం డిందు మమ్ము ♦ స్థాపించి మహే
శ్వరితో రిరంస నంతః, పురమున నివసించె నిపుడు ♦ పోరా దటకున్. 25

వ. అనిన విని చేయునది లేక చింతాగ్రస్తుండై నారాయణుండు శివగణంబులకు విన తుండై మ్రొక్కి యొక్కించుక సెలవొంది దేవతలతోడఁ బ్రతీహారంబదుం డియే యార్తవాక్కులతోఁ దారస్వరంబున నిట్లఖిలలోకేశ్వరు నుద్దేశించి మొఱ వెట్టుకొనియె. 26

—*విష్ణ్వాదులు కైలాసంబున మణిభవనద్వారమందుండి మొఱపెట్టుకొనుట *—

గీ॥ ఏల వందారుకల్పక ! ♦ యిప్పటికిని, మాదు వెతలనుదీర్పఁగ ♦ మఱచియుంటి
వసురపీడితబృందార ♦ కాళికీవె, శరణ మేజాగు సేయక ♦ సాఁకుమింకను. 27

క॥ సురసిద్ధసాధ్యమనుజా, సురయక్షపతంగదంద ♦ శూకనికర భా
సురగీతపుణ్యచరితా!, సురచితసకలాబ్జజాండ! ♦ చూడుమిఁకదయన్. 28

వ. ఇట్లు బహుప్రకారంబుల వినుతిపూర్వకంబుగ దేవతలందఱొక్కయెలుంగున మొఱపెట్టుకొనుటయు నెక్కుడు కోలాహలధ్వనియగు టాలించి భక్తవత్సలుం డగు పరమేశ్వరుండెఱింగి సంభోగవిరతిన్ జేయనెంచి పార్వతీభయంబున సంకోచించియు నెట్టకేలకు సురతంబుమాని గృహద్వారంబుఁ దఱియన్ జొచ్చి బృందారకులకు దర్శనంబొసంగి యిట్లనియె. 29

—* శివుఁడు దేవతలమొఱవిని యోగముచే వీర్యంబు జార్చుట *—

గీ॥ ఏమివచ్చితి రిచటికు ♦ పేంద్ర! పద్మ, సూతి! నైలింపగణముతో ♦ సుఖమె మీరు
చిన్నవోయిన మొగములు ♦ చెన్నుదఱిగి, కానిపించుచున్నవ ♦ క్కతము సెప్పుఁడు.

వ॥ అనిన గోవిందప్రముఖులగు బృందారకులందఱిందుధరపాదారవిందంబుల కానందంబుతో వందనంబు లొనర్చినయంత. 31

గీ॥ దూయమాన మనంబుతోఁ ♦ దోయజాక్షుఁ, డిట్టులనియె మహేశ! నీ ♦ కెఱుఁగరాని
వృత్తమున్నదె సకల హృ ♦ ద్వేశ్మవాసి, వగుచు మమ్మడుగంగ నీ ♦ కవసరంబె?

చ॥ కొమరునిఁ గాంచకుంటి విటు ♦ ఘోరపురక్కసుబారిఁ జిక్కి పా
రము గనరాని దుఃఖమున ♦ రాపిడిఁజెందుచు నుంటి మింక శీ
ఘ్రముగఁ గుమారుఁగాంచు మమ ♦ రప్రియమున్ బొనరింపు దుర్మదో
ద్యముని వధింపు తారకునిఁ ♦ దత్పరివారము లోకరక్షకై. 33

చ॥ అనినహరుండు చిత్తమున ♦ నక్కటికంబును జెంది యిట్లనెన్
వినుము ముకుంద! మామకపు ♦ వీర్యము మస్తకమందె యున్నదై
నను గ్రహియించు వారలఁగ ♦ నన్దగు నిప్పుడె యోగశక్తి మో
చన మొనరింతునంచపుడు ♦ జార్చెను శుక్రము స్వర్ణవర్ణమున్. 34

చ॥ అనలుఁడు నిర్జరానుమతి ♦ నా శివవీర్యమునున్ గపోతమై
యొనరఁగ మ్రింగె నంత నమ ♦ రోత్తములందఱుఁ గొంతకొంత భా
దన మొనరించి రష్టవసు ♦ ధాధరపుత్రి విభుం డటన్ విలం
బన మొనరించు టారసి జ ♦ వంబునవచ్చి కనెన్ సురావళిన్. 35

వ॥ కాంచి యంత జగదంబ వారొనర్చిన యకార్యంబు నెఱింగి కుపితయై యిట్లనియె.

## —* పార్వతీదేవి దేవతలను శపించుట *—

ఉ॥ ఓరి దురాత్ములార! వినుఁ ♦ డోయమరాధములార! మీరిటుల్
నారమణున్ హరుఁ గొలిచి ♦ నాదు విహారము వమ్ముచేసినా
రోరిమిఁదక్కి స్వార్థపర ♦ తోన్నతి నన్నుడికింపఁజేసి యే
తీరున శ్రేయమొందెదరు ♦ దీర్ఘతరార్తిమునుంగకే ధరన్. 37

క॥ నను వంధ్యనుజేసిన యఘ, మున నిప్పటినుండి మీదు ♦ పొలతులు చూలున్
గొనకుందురుగావుతఁ గడు, వనరుదు రెంతయును బుడమి ♦ వంధ్యాత్వమునన్.

గీ॥ ఇట్లు నిర్జరులను శపి ♦ యించి పావ, కునిఁ గనుంగొని యత్యంత ♦ కుపితయగుచు
శాపమిడెనోరి! శివవీర్య ♦ జగ్ధి! సర్వ, జగ్ధివగుము హుతాశ! నిచ్చలు హుతాశ!

చ॥ అనియిటు శైలకన్యక హు ♦ తాశనుతో సకలామరవ్రజం
బును శపియించి నాథుఁ గొని ♦ పోయెఁ దదీయవిహారమందిరం
బున కటమీఁద శంకరునిఁ ♦ బొందికఁగొల్చి గణేశుఁడున్ గుమా
రునిఁగని తాపమున్ విడె మ ♦ రుద్గణ మెల్లరు బాగు బాగనన్. 40

గీ॥ అక్కథను సర్వమును వేఱొ ♦ కప్డు చెప్ప, వాఁడ నిపుడు వినుం డిఁక ♦ బాహులేయ
జన్మచరితంబు దైతేయ ♦ సంహృతియును, దేవతలకెల్ల దుఃఖంబు ♦ తీఱుటయును.

ఉ॥ వేలుపు లంత నీశ్వరుని ♦ వీర్యము మ్రింగుటచేతఁ జాలఁగాఁ
గాలుచు నిల్వఁజాలక జ ♦ గద్గురు శంకరుఁగూర్చి యెక్కడో
జాలిదనర్పఁ బ్రార్థనము ♦ సల్పఁగ స్వల్పితకల్పశాఖి య
క్కాలహరుండు వాకిటికిఁ ♦ గ్రచ్చఱవచ్చి కనెన్ నిలింపులన్. 42

వ. అంత దేవత లీశ్వరుఁ గాంచి యాతురులై మ్రొక్కి యిట్లనిరి.

ఉ॥ దేవ! మహానుభావ! భవ ♦ దీయ మహోజ్జ్వల వీర్యమున్ మహో
శావశచిత్తతన్ మెసవఁ ♦ జాలదహించుచునుండె నద్ది మా
కీవిధమున్ భరింపఁ దర ♦ మెట్లు కరంబు భరంబు తండ్రి! నీ
వీ వగఁ బాపి యెట్లయిన ♦ నేలుము బాలశశాంకశేఖరా! 43

క॥ లేకున్నఁ జత్తుమిత్తఱి, లోకేశ్వర! నీవుగాక ♦ లోకంబున నీ
నాకనివాసులయలజడిఁ; బోకడఁచు ఘనుండొకండు ♦ పొసఁగునె యెందున్. 44

ఆ॥ అని దహింపఁబడుచు ♦ నార్తిచేఁ దహతహ, పడుచునున్న నా సు ♦ పర్వవరులఁ
గాంచి వేగనపుడు ♦ కారుణ్యమెద నెంచి, భక్తవత్సలుండు ♦ పలికె నిటుల. 45

క॥ ఓహరి! యోచతురానన!, యోహరిహయ! యోయమరచ ♦ యోత్తములారా!
మోహమునఁదినిన వీర్యము, బాహిరముగఁగ్రక్కుఁడవని ♦ బాముదొలంగున్.

చ॥ అనుచు నిలింపు లంత వడి ♦ నా శివవీర్యముఁ గ్రక్క నద్ది కాం
చనమయి యంబరం బెగసె ♦ సర్వసుపర్వులు బాముఁ బాసి శ
ర్వుని వినుతించి గేములకుఁ ♦ బోయిరి పావకుఁ డొక్కఁ డప్డు శం
భుని యనుకంపఁ జేకొనక ♦ భూరితరార్తి వహించి భీతిమై. 47

ఆ॥ శివునిఁ జేరఁబోయి ♦ చేమోడ్పు రచియించి, నేరమికిని సైచు ♦ నిష్ఠఁ జూపి
దాహమార్పు దేవ! ♦ దాసుఁడఁగానొకో, కరుణఁ బఱపుఁ మెగ్గుఁ ♦ గడపుమిఁకను.

—* అగ్నిదేవుని క్షోభం బారసి శివుఁ డుపాయము సెప్పుట *—

వ. అని యిట్లు దీనుండై యర్థించిన యగ్నిన్ గని కనికరంబుతో మహేశ్వరుండు
యోజించి యిట్లనె. 49

క॥ అనుచితగతి నా రేత, స్సను మెక్కితివట్లు వెనుకఁ ♦ జూడక యగ్ని !
ఘనతరదాహం బిపుడి, ట్లొనఁగూడిన దైనఁ దలఁకు ♦ నుడిగి వినుమిఁకన్. 50
వ. ఎలనగవుతో.
క॥ కొలఁది దినంబులలో ను, జ్వలతర మీ వీర్య మొక్క ♦ చక్రిస్తనిని
ర్మలగర్భ మొందు నాతఁడు, మలమటచను నీదుదాహ ♦ మాఱు హుతాశా ! 51

ఉ॥ నావుడు మ్రొక్కి యాత్మసద ♦ నంబునకున్ జని యీశ్వరోక్తులన్
భావమునందు నిల్పికొని ♦ భామ యదెవ్వతో నాదు ప్రాణర
క్షావహమూర్తి యంచు మదిఁ ♦ జాలఁదమిన్ దలపోయుచుండఁగా
దైవనియుక్తి సప్తముని ♦ తల్లజులొక్క యహంబునందొగిన్. 52

ఉ॥ చేడెలతోడ స్వర్ధునికిఁ ♦ జేరి ప్రియంబున నందు మజ్జనం
బాడి సమస్త దివ్యులకు ♦ హవ్యము లీగికి సప్తజిహ్వునిన్
బోడిగఁ జేర్చి యాహుతులఁ ♦ బొందుగఁ దన్ముఖమం దొసంగఁగాఁ
దోడనె యగ్ని వేల్పులకుఁ ♦ దుష్టిగ వాని నొసంగెనయ్యెడన్. 63

—* అగ్ని సప్తర్షులభార్యలఁ జూచి మోహించుట *—

ఉ॥ ఆసమయంబునందు రుచి ♦ రాంగవయస్సువిలాసహాసశో
భాసముదీప్తలాముల ♦ భార్యలు మౌనుల కేవలన్ సము
ల్లాసవిభాసితాకృతి మె ♦ లంగ ననంగశరాతతార్తివి
త్రాసితచిత్తుఁడై వడి స ♦ దాగతిమిత్రుఁడు బాళిమీఱఁగన్. 54

ఉ॥ ఎందును నేనిఁ గాంచితినె ♦ యిట్టి యపూర్వవిలాసవిస్ఫుర
త్సుందరకామినీమణులఁ ♦ జూచిన నేమిఁక భాగ్యమట్టివ
ర్యేందునిభాస్యలన్ గలిసి ♦ యింపు జనింప రమింపకున్న నా
డెందము కుందడంగునె ఘ ♦ టిల్లునె మోద మభంగభంగిగాన్. 55

ఉ॥ అన్ననవిల్తువిభ్రమము ♦ లాకృతులన్ ధరియించి యిట్టు లా
సన్నములయ్యెనో యనఁగఁ ♦ జక్కని సన్నని కౌను లందమౌ
నున్నత పీవర స్తనము ♦ లుద్ధతచారునితంబబింబముల్
కన్నులఁదన్పు ముద్దులమొ ♦ గంబులు గల్గినవార లీ సతుల్. 56

ఉ॥ ఏనిఁక వీరి కౌఁగిళుల ♦ నెవ్విధిఁ జేకొనువాఁడ నెట్టు లీ
మానిను లాత్మనాథుల స ♦ మర్థులఁ బాసి ననున్ వరింతు రె
ద్దాన మదీయమహా నతను ♦ తాపము పాయు నిఁకేమొనర్తు నా
మానస మెక్కు డార్తిమెయి ♦ మగ్గుచునున్నది యొక్కతీరుగన్. 57

గీ॥ అనుచునక్కాంతలనుస్పశి♦ఖాగ్రములను, డాయఁగానెంచు మునులదృ♦ఢప్రదీప్త
తేజములఁ గాంచి చకితుఁడౌ♦దీనదశను, జెంది యేమి యొనర్పఁగఁ♦జేవదక్కి.

క॥ మునివరుల హోమకృత్యం, బనువుగ నెఱవేఱ నగ్ని ♦ యర్ధాలి విడి పా
వనమైనయొక్క వనతల, మున ముమ్మరమగు విరాళిఁ ♦ బొగులుచు వేగన్.

వ. అందు జలంబుల మునింగి ప్రాణంబులఁ బాపికొన సమకట్టుడు నంతఁ బరమ పతి
వ్రతయును దత్పత్నియు నగు స్వాహాదేవి విభునియాశయం బెఱింగి తన యోగ
బలంబున సప్తర్షులలో నొక్కఁడగు యంగిరసుని కళత్రంబురూపంబుఁ జెంది
వచ్చి పావకున కిట్లనియె. 60

-* స్వాహాదేవి యార్గురు మునిభార్యలరూపంబున నగ్నిదేవునితోఁ గ్రీడించుట *

క॥ మునితల్లజుఁడగు నంగిర, సునిదారను మున్న నిన్నుఁ ♦ జూచినది మొదల్
కొని యేను నాదు చెలులును, ఘనతరమగు మన్మథాగ్నిఁ ♦ గ్రాఁగితిమి విభూ!

చ॥ చెలువుఁడ! నీవయిన్ దగిలె ♦ చిత్తము నాకును నా వయస్యలౌ
చెలువల కట్లు నీమదియుఁ ♦ జెన్నుగ మాయెడ బాళిఁగాంచుటన్
దెలిసి భవత్సదేశమును ♦ దెంపునఁ జేరినదాన మించుపో
కలవెరవేకఁబోకడఁచి ♦ కామసుఖంబులఁ దన్పు నన్నిఁకన్. 62

గీ॥ నన్నతనుసౌఖ్యములఁ దేల్చి♦నాదు చెలుల, నట్లుదన్పుము భవదధీ♦నాత్మలగుచు
వారలున్నారిచట హవ్య♦వాహ! నీవిఁ, కన్యమెంచినఁ బ్రాణంబు♦లాసపడము.

వ. అనినంత.

క॥ కడుఁబేద పెన్నిధానముఁ, బడసినయటు లామెఁగాంచి ♦ పావకుఁడు మదిన్
గడుమురిసి కామకలలన్, దొడరి సుఖించెను గరంబు ♦ తుష్టి యొసంగన్. 64

వ. అనంతరంబందు స్వాహాదేవి తక్కిన యేవుర రూపంబులతో నగ్నిభట్టారకునిఁ
గలిసి సుఖించి యవల నరుంధతీరూపం బలవడకున్న మిన్నకుండె. వీతిహో

త్రుండును దనయందున్న మహేశ్వరవీర్యంబంతయు మునిపత్నులరూపంబున
నున్న స్వాహాదేవియందుంచి దాహంబుఁబాసె. స్వాహాదేవియును భర్తృవిము
క్తంబును నతిదుస్సహంబునునగు పారమేశ్వరవీర్యంబు నిజగర్భంబందు ధరింపఁ
దక్కి శ్వేతాద్రి శిఖరంబున జార్చి వేదనఁబాసె. శ్వేతాద్రియు నవ్వేఁడిమి
కోడి మరుత్సాహాయ్యంబున నద్దాని వియన్నదినిన్ బడఁద్రోచె. 65

కం. గంగయు దుర్భరమైన భు, జంగవిభూషణుమహాగ్రి ♦ సమధిక తేజ
స్సంగమున కోర్వఁజాలక, తరంగంబుల దానిఁ గాశ ♦ వనిఁ బడఁజిమ్మెన్. 66

వ. అందమ్మహాతేజంబు పెద్దకాలంబునకుఁ బరిపాకంబగుడు.

## —★ శ్రీ కుమారస్వామి జననము ★—

కం. శ్రీమార్గశీర్ష సితష, ష్ఠీమానితసమయమందు ♦ శివతనయుఁడు తే
జోమండితసర్వాశా, స్తోముఁడు జన్మించె సకల ♦ సురలుప్పొంగన్. 67

కం. చారుమణిమౌళులొప్పెడు, నారుమొగంబులును నాయు ♦ ధాఢ్యములగు రెం
డారుకరంబులు రవిశత, భారంజితగాత్రిమమరి ♦ బాలుండలరెన్. 68

శా. శ్రీమంతుండయి సుందరుండయి జగ ♦ చ్ఛ్రేయోవహుండై సుర
స్తోమాపద్వినివర్తనక్షముఁడునై ♦ శూరావతంసుండునై
భీమాత్యుత్తమవిక్రమాస్పదుఁడునై ♦ విస్ఫూర్జితాశావ్రజుం
డై మృత్యుంజయనందనుం డలరెన్దై ♦ త్యాత్మంబు లల్లాడఁగన్, 69

కం. దివినుండి పుష్పవర్షము, లవిరళగతిఁ గురిసి రమను ♦ లత్యద్భుతమై
భవమొప్పఁగ సంగీతో, త్సవముల గంధర్వవరులు ♦ సల్పిరి వేడ్కన్. 70

వ. అంత.

చ. జనులు మునీంద్రగేహినులు ♦ సప్తరసజ్ఞ వరించి వచ్చి యి
వ్వని సురతంబులొంది యొక ♦ పావనిఁ గాంచిరనన్ మునీశ్వరుల్
మనములఁ గించనొంది యవ ♦ మానమతిన్ దమపత్నులన్ రయం
బున విడనాడి రాసతులు ♦ పొక్కఁగ భూరివిషాద వేదనన్. 71

గీ. ఆత్మనాథులచేఁ బరి ♦ త్యక్తలైన, మునిసతులఁ గాంచి యగ్నిభా ♦ మిని వనరుచు
మునులకడ కేగి నేన మీ ♦ బోఁట్లబోటి, బోఁటినై యలరితి నావి ♦ భుసముఖమున.

వ. కావున.

కం. అకలుషచరిత్రలగు నా, త్మకళత్రంబులను బాయఁ ♦ దగునే మీరల్
సుకృతాత్ములార! వేఁగఁ గి, నుకమాని కొనుండు గేహి ♦ నుల జనమలరన్. 73

క॥ అని బ్రతిమాలిన విని తమ, మనముల నిక్కంబెఱిఁగియు ♦ మానివరులు భూ
జనుల దురుక్తుల కాత్మం, బున రోసి గ్రహింపరైరి ♦ పోలఁతుల మరలన్. 74

—* షట్కృత్తికలు కుమారునకు స్తన్యంబు లిచ్చుట *—

వ. అంత నా యతివలు.

గీ॥ గాంగతీరంబునన్ శర♦కాండమందుఁ
బొడమిన కుమారుఁ గాంచఁగఁ ♦ బుణ్యసతుల
చనుమొనలు పాలుచేపుడుఁ ♦ జక్కనపుడు
బాలునకుఁ బాల్గుడుపఁ బ్రేమ ♦ భరితలగుచు. 75

గీ॥ అందఱొక వేళయందె స్త♦న్యంబొసంగ, రాఁ గుమారకుఁ డాఱువ♦క్త్రములతోడ
నాఱుగురుకృత్తికలమదుల్ ♦హరుస మొంద, వారిపాలిండ్లఁ ద్రావెను♦క్షీరములను

వ. అపుడు జగన్మంగళవిగ్రహుం డగు నక్కుమారుఁగాంచి యువ్వార లిట్లనిరి.

ఉ॥ అన్న! కుమార! మేము కుల ♦ టాకృతి నగ్గికి నిన్నుఁగంటిమం
చు న్నెఱిమీఱి దుర్జనులు ♦ చూడక నాడిన నిందకై విభుల్
బన్నములాడి మమ్మిటులఁ ♦ బాసిరి మాకిఁక దిక్కు నీవె మ
మ్మెన్నికమీఱఁ దల్లులుగ ♦ నెంచి కృపామతిఁబ్రోవు మిమ్మగన్. 78

ఆ॥ అనుడు శంభుసూనుఁ ♦ డనియెను వారల, కనఘు లీరుతల్లు ♦ లాత్మజుండ
మానుఁడింక వెతలఁ ♦ బూనుఁడు సంబరం, బంబలార! గుణక ♦ దంబలార! 79

వ. అని వగనుడిపి వారలనోదార్చి తనచెంతనుంచికొని కరంబు గారవించుచుండె.

ఉ॥ అత్తఱిఁ బద్మజుం డతిశ ♦ యమ్మగు హర్షముతోడ వచ్చి యా
చిత్తజవైరిపుత్రునకుఁ ♦ జెల్వొదలిర్పఁగ జాతకర్మమున్
హత్తినవేడ్కమై సలిపె ♦ నగ్నియు బాలునిఁ దారసించి దీ
వ్యత్తరశక్తి శక్తినిడె ♦ హర్షభరంబున మిన్నుముట్టుచున్. 81

వ. అంత హిరణ్యగర్భుం డాబాలకున కివ్విధంబుగా నామకరణం బొనర్చె. 82

సీ॥ సురలకై ముక్కంటి♦శుక్రంబుస్కందమై,యవతరించుటస్కందుఁ♦డనఁగఁబరఁగు
నగ్నిగర్భంబునం ♦ దమరి జన్మించుట, నగ్నిభవుం డను ♦ నాఖ్యనమరు
గంగామహానదీ ♦ గర్భజాతుండౌట, గాంగేయుఁడ నెడు వి ♦ ఖ్యాతిఁజెందు
శరవణస్థలమున ♦ జననంబునొందుట, శరజన్ముఁడనియెడు ♦ సంజ్ఞఁగాంచు

గీ॥ కృత్తికలపాల్గొనుటఁగార్తి ♦ కేయనామ, మొందువారలుపలువురై ♦యొప్పుకతన
బాహులేయుండనుచుఁగడుఁ♦బ్రథ నెసంగుఁ,బార్వతీనందనుఁడుజగ♦త్పావనుండు.

వ: మఱియును

సీ॥ దేవసైన్యంబునకు నెల్లఁ ♦ దేజ మెసఁగ, నాయకుండయి దేవసే ♦ నాని యగుచు
నాత్మకీయచమూరక్ష ♦ణాఢ్యుఁడై గు, హుండనుచు నొప్పు మేరుకో ♦దండసుతుఁడు

వ. వెండియు

క॥ ధారుణిఁ గుజనులఁ గూల్చి కు, మారుండను నామధేయ ♦ మండితుఁడౌ వి
స్తారముగ నెమలిపై సం, చారము సేయుచు విశాఖ ♦ సంజ్ఞం బడయున్. 85

వ. ఇఁకను గ్రౌంచాచలంబు భేదించి క్రౌంచదారణుం డనియును మహాసేనతో నొప్పి మహాసేనుండనియును దారకాసురుఁ బరిమార్చి తారకజేత యనియును నిర్విఘ్నంబుగ ననేకాహ్వయంబుల నలంకరించునని వాగీశుండు నిజనివాసంబున కరుగుడు నంత బాలుండు దినదినప్రవర్ధమానుండై. 86

మ॥ ఒకనాఁ డాయలికాక్షునందనుఁడు లీ ♦ లోల్లాసకేళీవశా
త్మకుఁడై శ్వేతనగంబుఁ జేరి యటఁ బో్రి ♦ ద్యన్మత్తమాతంగయూ
థకరంబుల్ పెనవేయుచున్ బటుమృగేం ♦ ద్రవ్యాఘ్రాదివ్యత్సటా
వ్రికరంబుల్ గొని స్కంధమెక్కి నిబిడ ♦ ప్రోథోద్ధతిన్ దిర్గుచున్. 87

ఉ॥ మున్ను పురత్రియంబును స ♦ మున్నతవైఖరి గాల్చి దానఁ జే
రెన్నికమీఱు చాపమట ♦ నీశ్వరుఁ డుంచుటఁజూచి యొక్కచో
నున్న తదున్నతంపువిలు ♦ నుద్దవిడిన్ గొని యెక్కువెట్టి తా
నున్నతమౌ తదద్రిమకు ♦ టోజ్జ్వలశృంగముఁ దుంచె బెళ్ళునన్. 88

వ. అంతఁబోక.

## —* క్రౌంచగిరి భేదనము *—

క॥ క్రౌంచమహీధ్రము నొక్కయు, దంచత్తరతీవ్రదుర్ధ ♦ రాశుగమున భే
దించి మహోత్సాహైక, ప్రాంచన్నద మమరనార్చెఁ ♦ బ్రిలయాభ్రగతిన్.

క॥ దిక్కుంభికుంభనిచయం, బుక్కఱి భేదిల్లె నుదథు ♦ లొక్కటఁగలఁగెన్
గ్రిక్కున రిక్కలు డుల్లిన, తక్కుంభిని వడఁకెఁ జకిత ♦ యగుచు రయమునన్.

వ. అంత.

సీ॥ క్రౌంచగిరిగహ్వరమునవ ♦సించిమించు, ఘోరరాక్షసకోటు లు♦దారనినద
ముప్పతిల్లఁగ బాలుపైఁ♦గుప్పతెప్ప, లుగ శరంబులఁగురిసి యా♦ర్వఁగ నతండు.

క॥ ధీరుఁడై వజ్రనిష్ఠుర, నారాచకూ్రరధార ♦ నక్తంచరవి
స్తారనికరములఁ జెచ్చెర, మారణము పొనర్చె ధరణి♦మండల మదు్రవన్.

ఉ॥ అంత నిలింపులెంతయు భ ♦ యంబు రయంబును జెంది కుంది భా
స్వంతులకోటులన్ బటుని ♦ జద్యుతి మీఱఁగఁ జాలువానిఁ గా

లాంతకసూను నెమ్మనము ♦ లందు నెఱుంగఁగలేక వే మరు
త్వంతునిఁ జేరఁబోయి యిటు ♦ వల్కిరి యుల్కుచు నేకకంఠులై. 93

చ॥ వినుమమరాధినాథ! యొక ♦ విక్రమధుర్యుఁడు బాలుఁ డీ జగం
బున జనియించి యంతనె య ♦ పూర్వఘనప్రథమానశౌర్యవ
ర్ధనుఁడయి సర్వసత్త్వముల ♦ దర్ప మణంపుచు నార్చుచున్న వాఁ
డనికిఁ దొడంగి వానిఁ బరి ♦ మార్పుము తేర్పుము భూజనంబులన్. 94

గీ॥ క్రౌంచగిరిఁ బాయకుండు ర♦క్షఃకులంబు, నెల్లఁబొల్లానరించె బం♦హిష్ఠమైన
యన్నగంబును భేదించె♦నంతకన్న, మున్న శ్వేతాద్రిశిఖరంబుఁ♦బుడమిఁ గూల్చె.

క॥ ఇఁక సురలచేవఁ గనఁగ న, చకితుండై వచ్చు నిటకు ♦ సరగున మున్నీ
వె కడంగి భంగపఱుపుము, ప్రకటితభుజశౌర్య మది వి♦భాసిలఁగ విభూ! 96

—* కుమారస్వామి మహేంద్రుని జయించి ప్రాణదానంబు సేయుట *—

క॥ అన విని యాతండును గిం, దునుమీఁదును గనక కడిఁది ♦ దోర్మదమునఁ బా
పనిదారసించి యశనిన్, గొని యురమున వేసెఁ జండ♦కోపనుఁ డగుచున్. 97

చ॥ అశని శివాత్మజన్మహృద ♦ యంబును దాఁకిన యంత మొక్కవో
యె శివకుమారు వక్షమున ♦ నీద్ధ్యబలుండు విశాఖుఁడన్ రిపు
ప్రశమనుఁ డుద్భవించె నిరు ♦ పక్కలయందును శాఖనైగమా
ఖ్య శుచిరుచుల్ జనించి విపు ♦ లాగ్రహవిగ్రహులై రయంబునన్. 98

క॥ వారు ముగురు గుహుఁడును బృం, దారకనాథుని వధింపఁ ♦ దలఁపడ నతఁడున్
ధీరతఁ గోల్పడి యడలి కు, మారున్ శరణం బడిగె స ♦ మంచితఫణితిన్. 99

ఆ॥ అంత శంభుపుత్రుఁ ♦ డతిదయామతి హరి, హాయుని తప్పిదంబు ♦ నవలఁద్రోచి
ప్రాణదానమొసఁగి ♦ పరమహర్షంబున, నరిగె గాంగతీర ♦ మతిరయమున.

చ॥ అచటఁ గుమారురాకకయి ♦ యాత్రము నొందుచునున్న కృత్తికా
విచికిలగంధు లాగుహుని ♦ వేగని సంతసమొంది ధారలొ
ల్కుచుఁ గడుచేఁపుదుగ్ధములఁ ♦ గూరిమితోఁ గడుపారనిచ్చి మె
చ్చుచుఁ దనివార ముద్దుఁగొను ♦ చున్ ముదమొందుచు నుండి రెంతయున్.

గీ॥ ఇవ్విధము గొన్ని ఘస్రంబు ♦ లేగనంత, సర్వజగదేకరాజ్ఞి తు ♦ షారశైల
రాజనందన యొకనాఁడు♦ రాజమౌళి, తోడఁ గొలువున్న వేళ సం♦తోసమొదవ.

చ॥ కరములు మోడ్చి స్మేరముఖ♦కంజముతో విభుఁగాంచి పల్కె దు
ష్కరమహిళాజవంజవవి♦కారనిరాకరణాఢ్యులైన భా

స్వరతరదివ్యయోగులకు ♦ స్సైతము దుర్లభమూర్తివైన యీ
శ్వరు నిను భర్తగాఁగొని య ♦ పారమహోన్నతిఁ గంటి నీ కృపన్. 103

చ॥ అతులతపస్సమాధినియ ♦ తాత్ముఁడవై మరునిన్ దహించి యీ
తతనిజభోగభంగుల ను♦దాత్తత నొప్పెడు నీవు నాదుసం
గతి రతులొందుచున్ బ్రబల♦కాముకరీతిఁ జెలంగుచుండ దు
ర్మతు లమరాధముల్ రతిని♦మాన్పిరి స్వార్థపరాయణాత్ములై 104

గీ॥ లోకకల్యాణకారణం♦బై కరంబు, మెఱయు నీతేజ మది నా యు♦దరమునందుఁ
జెందకభువిఁ బడెమె నేమి♦ చేసిరో సు,రలు మహాత్మ!యమోఘవీ♦ర్యంబునపుడు.

గీ॥ మోఘమైయెందుడిందదు♦పుత్త్రుఁడునయ, మందియుండుమఱెందేని♦ననఘచరిత!
అరయుతర్జించి భర్జించి♦యమరవరుల, నాదుపుత్త్రుకుఁదెప్పింపు♦నాథ! యిటకు.

—* శివుఁడు దేవతలను గుమారుజాడలడుగుట *—

ఉ॥ నావుడు శంకరుం డమర♦నాథుల మానులఁ బిల్వఁజేసి తా
నీవిధమొప్పఁగా నడిగె ♦ నెల్లరునుం వినుఁ డేను నాఁ డప
త్యావహమైన తేజమును ♦ నాదటఁజేసితి యుష్మదర్థమై
మీవశమయ్యె నయ్యదటు ♦ మీఁదటిమాట నెఱుంగఁ జెప్పఁడీ! 107

క॥ ఎటఁబోడమె నాదునందనుఁ, డెటఁబెరుఁగుచునుండెఁ దేజ ♦ మేమయ్యెను మీ
రిటు లెఱిఁగింపక దాఁచినఁ, గుటిలత యడఁగంగ శిక్షఁ ♦ గూర్చెద నిపుడే. 108

గీ॥ అని కినుకదోఁప దృఢముగా♦నడుగ దివ్యు,లడలియొండొరులంతంత♦నరసికొనుచు
నొడయనిఁ గాంచియొక్కొక♦రుక్కుదక్కి,తడఁబడుచునిట్లుపల్కిరి♦తథ్యముగను.

వ. అందు విష్ణుండిట్లనియె.

క॥ గురునిందసేయునట్టిఁడు, గురుదారరతంబు సల్పు ♦ కుత్సితుఁడు మృషా
కరవచనుఁడు నీశుక్రము, నిరవుగ నాచ్ఛాదపఱచు ♦ నీశ్వర! వినుమా! 110

వ. ఇంద్రాది లోకపాలకులిట్లనిరి,

గీ॥ ప్రబలపాపం బొనర్చిన♦పాతకునిచె, లిమిఁగొని నిరంతరమును బు♦డమిఁజరించు
వాని దారుణపాపంబుఁ♦బడయునీదు, శుక్రమునుదాఁచినట్టిఁడు♦శూలపాణి! 111

వ. తక్కుంగల సుపర్వులిట్లనిరి.

గీ॥ పట్టుదలతోడ నెవ్వఁడు ♦ ప్రతినఁజేసి, పూర్తియొనరింపఁజాలక ♦ పోవునట్టి
వాని పాపఫలంబుఁదా♦నూను నీదు, వీర్యమును మాటుచేసిన ♦ వెడఁగుపుడమి.

వ. దేవపత్న్ను లిట్లనిరి.

ఉ॥ ఎవ్వతె యాత్మభర్తను య ♦ థేచ్ఛగ దూషణమ్ముఁ బొనర్చుఁ దా
నెవ్వతె యన్యునిన్ వలచి ♦ యిక్షుశరాసనకేళిఁ గూడు నిం
కెవ్వతె సంతు పెన్మిటియు ♦ నెవ్వరులేకయె యేకమై మనున్
జవ్వనియద్ది తావకల♦సత్తరతేజము దాఁచె నీశ్వరా! 113

వ. బ్రహ్మపుత్త్రులగు వసిష్ఠాదు లిట్లనిరి.

గీ॥ జగతి నీతేజ మెవ్వఁ డా ♦ చ్ఛాదనంబు, చేసె నవ్వాఁడు రూఢిగా ♦ శివ! భవత్స
మర్హణం బొనరింప న♦నర్హుఁడగు న, నర్హుఁడగు నీదు భక్తజ♦నార్హణమున.

—* అగ్నిప్రముఖులు శివునకుఁ గుమారుని జాడలు చెప్పుట *—

వ. అగ్ని యిట్లనియె.

మ॥ పరమేశా! భవదీయవీర్యమును దీ♦వ్యద్భామినీభాస్వరో
దరమం దుంచి రయంబునన్ హృదయసం♦తాపంబుఁ బోనాడితిన్
భరమౌ నీదురితంబు వైఁచుటకు నీ ♦ పాదాంబుజాతంబులన్
గరమర్థిన్ భజియించువాఁడఁ గనుమీ ♦ కారుణ్యభావంబునన్. 115

వ. స్వాహాదేవి యిట్లనియె.

ఆ॥ భర్తృనిహితమైన ♦ భాస్వరద్గర్భంబు, నేన తాల్చి యోర్వ♦నేర కద్రు
నాద్రిశిఖరతలము ♦ నందు విడిచితిని, నంతమీఁద నెఱుఁగ ♦ నభవ! నేను.

వ. శ్వేతాద్రి సమీపించి యిట్లనియె.

ఉ॥ పావకదేవి జార్చిన వి♦భాస్వరమౌ భవదీయవీర్యమున్
దేవర! తాల్పఁజాలక స♦దేశమునన్ బ్రవహించు స్వర్ణదిన్
నే వగతో మహాబలుని ♦ నిండగు సాయముతోడఁ జిమ్మితిన్
గావుము నన్ దయామతి! న♦కార్య మొనర్చినవాని బాలిశున్. 117

వ. వాయుదేవుండిట్లనియె.

క॥ శైలవరుప్రార్థనంబున, జాలిన్ గొని తావకాతి♦శయవీర్యము గం
గాలహరిఁ జిమ్మితిని నే, నాలరినై నన్నుసయిపు ♦ మయ్యా! మహాత్మా!

వ. స్వర్ణదియిట్లనియె.

ఆ॥ దేవ! తావకీన ♦ దేదీప్యమానాతి, దుర్ధరోరువీర్య ♦ దుర్భరోగ్ర
వేదనన్ దపించి ♦ వీచుల శరవణం, బందుఁదోఁచితిని ద ♦ యాళు! కనుమ!

గీ॥ శరవణంబందుఁ జేరిన♦చటులతేజ, మునఁగుమారుండుపొడమె ష♦ణ్ముఖుఁడుద్వాద
శకరుఁడుద్యత్సహస్రభా ♦ స్వన్మరీచి, మండలుఁడుబాలచంద్రమౌ♦మౌళివినుము.

వ. అనంతరంబ భాస్వంతుం డిట్లనియె.

గీ॥ శరవనిఁ బుట్టియేడ్చుచు♦స్వచరణాంగు, ళినిఁగుడుచుచున్న లోకమో♦హనునినీదు
తనయునిఁ గాంచిచాల సం♦తసముఁ జెంది, యీశ! దివసావసానమౌ♦ ఁటేగితిఁబయి.

వ. ఆ వెంటఁ జందురుం డిట్లనియె.

గీ॥ కృత్తికలువచ్చిశిశుఁగాంచి♦ కేరిముద్దుఁ, గొనుచు స్తన్యంబొసంగిరి♦కుతుక మొప్ప
జేయియందేనునొకపది♦ తెండుఘటికలవఱకుండి కనుంగొంటి♦శివ! యరయుము.

వ. రాత్రి యిట్లనియె.

క॥ తెలవాఱువఱకుఁ గృత్తిక, లలరుచు కసుగందునందు ♦ నధికప్రేమా
కులలై కాచుచునుండిరి, తెలిపితి నేఁ గన్నవిధము ♦ దివిషన్మౌళీ! 123

వ॥ సంధ్య యిట్లనియె.

గీ॥ బదరికాశ్రమభూమికి♦బాలునెత్తి, కొని చని ప్రియంబుతో వారు♦గొమరుఁబోలె
నతులవాత్సల్యమమరఁగా♦నందునీదు, కొమరుఁ బెంచుచునుండిరే♦కొదవలేక.

వ. వాసరం బిట్లనియె.

క॥ అసమానప్రేమమెయిఁ, బిసరుహదళనేత్రి లట్లు ♦ పెంచుచునున్నా
రసమశరహర! భవత్సుతు, నసమానవిభావిరాజి♦తాద్భుతగాత్రున్. 125

వ. విధాత యిట్లనియె.

శా॥ దేవాధీశ్వర! నీదుపుత్రునకుఁ బ్రీ♦తిఁ జాతకర్మంబులన్
నే విధ్యుక్తవిధిఁ బొనర్చి మునిప♦త్నీ స్తన్యపానాంచితుం
డై వర్ధిల్లుటఁ గార్తికేయుఁడను ది♦వ్యాభిఖ్యయున్ దేవసే
నావాల్లభ్యము నొందువాఁడవుట నే ♦ నాన్యాఖ్యయుఁ గూర్చితిన్. 126

వ. ఇఁక నిట్లే కొన్ని యన్వర్థంబులగు నాహ్వయంబులఁ బిలిచితి ననుడు నంత
నారదమునీంద్రుండిట్లనియె. 127

చ॥ వినుము మహేశ! నీసుతుఁడు ♦ విక్రమధుర్యుఁడు శ్వేతపర్వతం
బున నొక తుంగశృంగమును ♦ భూమిపయిఁ బడ నేసెఁ గ్రౌంచభే
దన మొనరించె నందమరు ♦ దానవకోటులఁ జక్కడంచె ను
క్కున నెదురైన వాసవునిఁ ♦ గొంకక కింకరుఁ జేసె వాసిగన్. 128

వ. అదరుచు నింద్రుండిట్లనియె.

ఉ॥ నీసుతుఁ డంచు వేల్పులను ♦ నెట్టనసాఁకెడుదట్టుఁ డంచు నే
వాసియెఱుంగలేక పెఱ♦వారలు సెప్పిన కిల్బిషోక్తులన్
రోసముఁజెంది పోరుటకు ♦ రోజుచుఁబోయి తదాజి నాజగ
ద్భాసురతేజు చేతఁబడి ♦ ప్రాణముదానముఁ గొంటిఁదత్కృపన్. 129

చ॥ అనవిని శైలరాట్తనయ ♦ హర్షముతో నవరత్నరాసులన్
గనకమునున్ ధనంబుల న♦ఖండముగానొసఁగెన్ మహీసురా
గ్రణులకు వాణి యచ్యుతుని ♦ రాణియు రోహిణియున్ బులోమజా
ద్యనిమిషపత్నులున్ దగిన ♦ మన్ననయొసంగిరి విప్రకోటికిన్. 130

వ. అంత జగత్ప్రభుండు తనయునియుదయాభ్యుదయవార్తల కానందించి యాని
మేషంబున నాత్మజునిఁ దోడ్తేర వీరభద్రాద్యాత్మీయులను నందికేశ్వరమహా
కాలాదిగణనాథశ్రేష్ఠుల నింకఁ బ్రమథభూతగణంబుల ననేకకోట్లన్ బుత్తెంచిన
నవ్వారలు వేగంబున బదరీకాననంబుఁజేరి యందలి షట్కృత్తికాశ్రమంబునకుఁ
బరివేషంబొనర్ప నవ్వారలుగాంచి చకితలై గుహున్ జేరి యిట్లనిరి. 131

గీ॥ కొడుక! లెక్కింపరానట్టి♦ఘోరసైన్య,ములుమనకుటీరమునుజుట్టెఁ♦గలయఁగాంచి
తే! మహాభయమిట్టులే♦తెంచెఁగడఁగి, యేమిసేయఁగఁగలవార♦మిందుఁజెపుమ!

వ. అనినంతఁ గార్తికేయుం డవ్వారలకిట్లనియె.

చ॥ వెఱవకుఁ డమ్మలార! రణ♦వీరులు ధీరు లిఁకెందఱేని స
త్వరము దురంబుసేయుటకు ♦ వచ్చిరయేని యుదగ్రజాగ్రదు
ద్ధురభుజదర్ప మేర్పడఁగఁ దూల్చెదఁ బేల్చెద వాహినీతతిన్
గరము దిరంబుఁజెంది కుతు♦కంబున నుండుఁడు మీర లీయెడన్. 133

—* నందికేశ్వరుఁడు కుమారునిఁ గైలాసంబునకుఁ దెచ్చుట *—

వ. ఇట్లుకుమారుండు సెప్పుచున్నంత.

గీ॥ ఇంతలో నందికేశ్వరుం♦డెలమికలిమిఁ, గార్తికేయునిఁగాంచి డ♦గ్గఱి యనుపునఁ
గూరుచుండి కడుంగూర్మి ♦ గూరనిట్లు; పలికెఁబలుకులఁజక్కెర♦లొలుకనపుడు.

గీ॥ అన్న! విను కృత్తికామాత ♦ లాలకింపుఁ డఖిలలోకాధినాథుఁడౌ♦నభవుఁడిటకుఁ
బనిచె మము మిమ్ముఁదోడ్తేరఁ♦బార్వతీకు,మార!పయనంబు సేయు ము♦దారలీల.

వ. నీవు పార్వతేయుండవుగాని కార్తికేయుఁడవు గావు.

క॥ దేవతలకార్యసిద్ధికి, నై విశ్వేశ్వరునివీర్య ♦ మార్యవినాగాఁ
దా వెలువడఁగా నందీ, వావిర్భావంబుఁ జెంది ♦ తయ్యు కుమారా! 136

ఉ॥ కావున నీదు తేజ మది ♦ కప్పఁగ శక్యమె యెవ్వఁడేని నీ
జే వహియించి దాఁచఁగల ♦ చేవఁగనున్ గలహంస యేవమా
బావినిఁ గూల రాజిలునె ♦ పన్నుగఁ గృత్తికలేడ వారి ప
ర్ణావసథంబులందు విమ♦లాత్మక! నీవు వసింపుటేడగున్. 137

క॥ రాజతగిరి నిఖిలామర, రాజతతాస్థానభూమి ♦ రాజకిరీటుం
డోజఁ గొలువున్నవాఁడట, కోజననుత తేజ! కదలు ♦ ముత్సాహమునన్. 138

క॥ గానములకును దేజములకు, ననయము ప్రోపీవు నిన్ను ♦ నరయనివారల్
వనజంబులతో నొక్కెడ, నునికినమరు కప్పలనఁగ ♦ నొప్పున్గాదే! 139

వ. అని చెప్పిన నందికేశ్వరునకుఁ గుమారుం డిట్లనియె.
గీ॥ అన్న! త్రైకాలికజ్ఞాని♦వరయుమీవు, జంతువులు కర్మమునకర్హ♦ జన్మమొందుఁ
గృత్తికలు యోగినులునుబ్ర♦కృతికలలుమ, దీయమాతలుగామది♦దెలియుమికను.

క॥ స్తన్యంబొసంగి పెంచిరి, మాన్యచరిత్రాఢ్య లీయ♦మాయికమూర్త్తుల్
ధన్యమనీషా! యిపుడొక, యన్యులవలె వీరిఁ బాయ ♦ నగునే నాకున్. 141

మ॥ నగరాజేంద్రకుమారి వీరివలెనే ♦ నాతల్లి విశ్వేశుఁ డి
మ్ముగ నాతండ్రి యథార్థమాయిరువురున్ ♦ బూజార్హులే నాకు వే
ఱుగ నీకృత్తికలన్ దొరంగుటయుఁ గూ ♦ ర్చున్ దోస మార్యా! ప్రియం
బుగ నివ్వారినిఁగూడఁ దెత్తునట కి ♦ ప్డు న్నీకటుల్ నచ్చినన్. 142

వ. అనినవిని నందికేశ్వరుం డత్యంతానందంబున నామోదించి నంతఁ గుమారుండు
ప్రయాణోన్ముఖుండయ్యె నయ్యవసరంబునఁ బరమేశ్వరప్రేరితంబై విశ్వకర్మ
నిర్మితంబును గాంచనానేకరత్నసంఘటితంబును శతచక్రంబును బార్షదశ్రేష్ఠ
వేష్టితంబుననగు నొక్కపుష్పకస్యందనంబు సమీపించినఁగని కృత్తికలు స్కంద
యానంబు యోజించి దుఃఖాక్రాంతలై యడలుచు నక్కుమారున కిట్లనిరి. 143

చ॥ మము విడనాడి పోయెదె కు ♦ మార! సమంజసమే? కదున్ బ్రమో
దమున నినున్ దనూజునిగఁ ♦ దద్దయు నమ్మికఁజెంది ప్రేమయు
క్తమతినిఁ బెంపుచేసితిమి ♦ తల్లుల మమ్మిటు లీవు పాయ దై
న్యముఁగొని యెందుఁజేరెదమొ ♦ యాత్మమునన్ దలపోయు మీయెడన్. 144

ఆ॥ అనుచు నక్కుమారు ♦ నాత్మవక్షములందుఁ, జేర్చికొని కరంబు ♦ చింతనొంద
స్కందుఁ డాలకించి ♦ సంతాపమణఁగ న, ధ్యాత్మసూక్తివారి ♦ నంతఁ దేర్చి.

క॥ ప్రమథగణం బలర శతాం, గముఁ దల్లులతోడ నెక్కి ♦ కల్యాణధ్యా
నములు సెలఁగంగ శివనగ, రముఁ జేరఁగ వెడలెఁ గ్రౌంచ♦రంధ్రకరుఁడోగిన్.

ఉ॥ నందియు వేత్రహస్తుఁడయి ♦ నంద మెసంగఁగఁదోడరా మరు
ద్బృందము వీరభూతగణ♦బృంద మమందముదంబుఁ జెందుచున్
ముందఱఁ గొల్వఁగా శివని ♦ ఖుండు ఘనుండగు వీరభద్రుఁడా
నందముతోడ లాలన మొ ♦ నర్ప గుహుండుచనెన్ శివాద్రికిన్. 147

శా॥ భేరీనాద ముదారభంగిఁ జెలఁగెన్ ♦ బ్రేమోద్ధ్వనిన్ దూర్యవి
స్తారంబుల్ విలసిల్లె మేల్మిగతులన్ ♦ దార్యత్రికంబొప్పె గం
ధీరాంచత్తరగుంభసంభరితవా ♦ గ్బృందంబులన్ స్తావక
స్ఫారస్తోత్రరవంబు లింపెసఁగె భా ♦ స్వద్భంగిగా నత్తఱిన్. 148

—* కుమారుఁడు కైలాసముఁజేరి తల్లిదండ్రులను సేవించుట *—

చ॥ కొమరుఁడు వచ్చునంచుఁ గడుఁ ♦ గూరిమితో గిరిరాజకన్య మా
ర్గములను గెంపుఁదాల మగ♦ఱాలను బచ్చల హెచ్చుమీఱు ము
త్యములను బూల బాలుపయి ♦ నల్లనఁ జల్లెడునట్లు ఖేచరో
త్తములను బంపగా నపుడు ♦ దండిగ వారొనరించి రట్టులన్. 149

ఆ॥ హరి విరించి ముఖసు ♦ రాధినాథులు వెండి, కొండఁ జేరినట్టి ♦ కొమరుసామిఁ
గాంచి కరముమురిసి ♦ ఘనతరోత్సాహంబు, మించి వేనమస్క ♦ రించిరంత.

క॥ తరుణేందు మౌళియును బం, ధురహార్దాతిశయభరము♦తోఁ బ్రమథులతో
బిఱబిఱఁ గోటహజారముఁ, దరియంగా వచ్చిచూచెఁ ♦ దనయుని వేడ్కన్.

క॥ శివులను జగత్కుటుంబవి, భవులను గని తేరుడిగ్గి ♦ పర్వతజాసం
భవుఁ డవిరళభక్తిఁ దదం, ఘ్రివనేజంబులకు మ్రొక్కెఁ ♦ గీర్తింప సురల్.

ఉ॥ శంకరుఁ డంతఁ బుత్త్రకునిఁ ♦ జక్కఁగ నక్కున గ్రుచ్చి కౌఁగిటన్
బొంకముతోడఁ జేర్చికొని ♦ మూర్ధసుగంధము లాని పూర్ణిమై
ణాంకునిమీఱు నెమ్మొగము ♦ నందుఁ గడున్ గడు ముద్దులాడి యు
డ్డంకి యొకింతచెందని దృ♦ఢప్రమదోన్నతి నొందె నెంతయున్. 153

ఉ॥ పార్వతి పుత్త్రునెత్తికొని ♦ పర్వున స్తన్యము చేపునంతనే
యూర్వర పాలుఁద్రావెడు ని ♦ జార్భకు నొక్కతె ద్రావఁజేసె గం
ధర్వులు గీతముల్ మునులు♦దారముగా శ్రుతిఘోష సల్పఁగా
సర్వసుపర్వగేహినులు ♦ సన్మణిహారతు లిచ్చి రెచ్చుగన్. 154

గీ॥ అభవుఁడుత్సవమొప్పఁగ ♦ నాత్మసుతుని, భర్మహర్మ్యసభాలయా♦భ్యంతరమును
జేర్చి సింహాసనంబెక్కి♦స్వీయదక్షి, ణాంకమునఁబుత్త్రు వహియించి♦యలరెమిగుల.

క॥ రత్నమయపీఠమున నవ, రత్నమయాభరణరాజి ♦ రాజిలఁ గాంతా
రత్నముతో శివుఁ డాత్మజ, రత్నముతో నలరె దివిజ ♦ రత్నము లలరన్. 156

చ॥ గళముననున్న వాసుకినిఁ ♦ గంఠమునొక్కిన పుత్త్రి సర్పమం
గళ మది పొంగులాగు గనఁ ♦ గా నొనరించి ప్రమోదమొంది శ్రీ
గళుఁడు మఱొక్కదివ్యమణి ♦ కాంచనపీఠమునందు బంధురో
జ్జ్వలతర తేజు నా గుహుని ♦ వైభవమొప్పఁగఁ జేర్చి పేర్మిమై. 157

గీ॥ నలువతోడుత నుపనయ♦నంబుసలుపఁ, జేయనాతండు గుహునకుఁ ♦ జెలఁగియజ్ఞ
సూత్రమును వేదములను గా♦యత్రిఁగుండి, నరివిదారిణివిద్యబ్ర♦హ్మాస్త్రమిచ్చె.

గీ॥ అంత జగదీశ్వరుండు ని♦జాత్మజునకు, శూలముఁబినాకమును బర♦శువును శక్తిఁ
బాశుపతదివ్యశరమును♦బ్రహ్మవిద్య,నొసఁగి యానంద మొందె న♦నుపమముగను;

—* విష్ణ్వాదులు కుమారున కుపాయనంబు లిచ్చుట *—

క॥ నవరత్నకీలితములగు, ప్రవిమలమకుటాంగదములు ♦ వనమాలయు దా
నవమారకమగు చక్రము, శివతనయున కొసఁగెఁ జక్రి ♦ చేతఃప్రీతిన్. 160

చ॥ తపనుఁడిడెన్ మనోజవర ♦ థంబు సుధాంశుఁడిడెన్ సుధాఘటం
బపరిమితార్ఘ్యరత్నముల ♦ నబ్ధి యొసంగె హిమాలయుండిడెన్
విపులమణిప్రకాండముల ♦ విస్ఫురదుత్తమభూషణాళిఁ గాం
డపతి యొసంగె ఘోటకగ♦ణంబు ఘనంబుగ శంభుసూతికిన్. 161

చ గరుడుఁడు వాహనార్థమొక ♦ కాంతతరమ్మగు నెమ్మినిచ్చెన
య్యరుణుఁడిడెన్ ధ్వజార్థమొక ♦ యందముఁ జిందెడు తామ్రచూడమున్
గిరిజ యిడెన్ జిరాయువును ♦ గీర్తివహంబగు వైభవంబు నిం
దిర యిడె భోగభాగ్యముల ♦ దివ్యమనోహరరత్నహారముల్. 162

క॥ శారద యొసఁగెను నిండగు, కూరిమితో విద్యలెల్ల ♦ నొనబుగ సుమన
స్త్రీరత్నము లొసఁగిరి తమ, చే రాజిలు వస్తువులును ♦ శివతనయునకున్.

వ: అంతఁ బురుహూతుండు.

చ॥ అరయక నాఁ డెదుర్కొని ర ♦ ణాంగణమం దటు వజ్రధార శం
కరసుతుఁ గొట్టినట్టి ఘన♦కల్మష మెట్టులఁ బాయు నెట్టులీ
స్మరహరనందనుండు నను ♦ సౌమ్యమతిన్ దయఁజూచు నూరకే
మఱతురె లాఁతివారి యవ♦మానపుఁ జెయ్వుల శూరులెమ్మెయిన్. 164

గీ॥ సామమునమున్న బతిమాలి♦శరణుఁ జెంది,ప్రాణములనిల్పుకొనఁగంటి♦పరఁగనిప్పు
డుత్తమంబగుకానుక ♦ నొసఁగిదయకుఁ బాత్రమౌటకు సమయ మే♦ర్పడియెనాకు.

వ. మణికాంచనముక్తాభరణవస్తువాహనప్రాజ్యసామ్రాజ్యాదు లన్నియు నాకుఁ బర
మేశ్వరానుగృహీతంబులే కాని యన్యంబులుగావు. దాన నవ్వాని నొసంగుట
ప్రమోదావహంబుకానేర దికను; 166

— * ఇంద్రుఁడు దేవసేనను కుమారునకిచ్చి పెండ్లిసేయుట * —

చ॥ కలదుగదా కుమారి త్రిజ ♦ గద్గణనీయమనోజ్ఞమూర్తి పే
శలసుగుణాలవాల సుర ♦ సంస్తుతిభాజన దేవసేన యా
లలితకుమారి నీ శశిల ♦ లామకుమారున కిచ్చినన్ బ్రియం
బలవడఁ బెండ్లియాడు నను ♦ నర్మిలి నేలఁగలండు రూఢిగన్. 167

క॥ అని తలఁచి చని కుమారిని, ఘనరత్నాభరణరాజిఁ ♦ గైసేసి ముదం
బునఁ దోడ్కొనివచ్చె సభాం, గనమున కటనున్నవారు ♦ గాంచి యలరఁగా.

వ. అప్పుడు కుమారుం డక్కన్యయనన్యసామాన్యరూపరేఖావిభ్రమంబులఁ జూచి
హర్షించి యంతరంగంబునం దిట్లాలోచించె. 169

ఉ॥ ఈరమణీలలామను మ ♦ హేంద్రుఁడు దోడ్కొనివచ్చె దీని తీ
రారయఁ గన్యగాఁ గనఁగ ♦ నయ్యె మదర్థమె తెచ్చియుండెనో
మారునిగెల్తు నట్లయిన ♦ మానినచో నిఁకఁ గార్యమెద్ది? యే
తీరుననేని దీని నిఁక ♦ దేవినిఁగాఁగొనఁగాఁ దలంచెదన్. 170

క॥ ఏయవయవంబుఁగాంచినఁ, బాయదు నాడెంద మందె ♦ భాసిల్లుఁదమిన్
డాయన్ జేయఁగఁజాలెడుఁ, గాయజునకుఁ గైవసంబుఁ గావించెననున్. 171

క॥ బింబము వాతెఱ హిమకర, బింబము నెమ్మోము భూరి ♦ విలసితమదరో
లంబము తుఱుము రతీశా, లంబము విరిఁబోణి భ్రూత ♦ లంబం దరయన్. 172

క॥ ఖంబు నడు మతనురథచ, క్రంబు పిఱుం దలరు నా ద ♦ రంబుకుతుక శై
లంబు చనుదోయి సుమ్మృణా, ళంబు బుజంబులు లలన్న ♦ ళంబడుగులగున్.

మ॥ అని యుబ్బంగి సభన్ గుమారుఁ డమరేం ♦ ద్రాత్మోద్భవాసక్తిమై
ఘనమోహోన్నతిఁ గాంచుచున్నతఱి న ♦ క్కన్యామణీపాణి స్కం
దునిహస్తంబునఁజేర్చి నాకొమరితన్ ♦ దుర్గాత్మజా! నీకు భా
ర్యనుగా నిచ్చితి నర్మిలిన్ గొనుమనెన్ ♦ నాకేశ్వరుం డాదటన్. 174

శా॥ స్కందుం డప్పుడు పార్వతీశ్వరుల యా ♦ జ్ఞన్ బెండ్లియాడెన్ మహా
నందం బొప్పఁగ దేవసేనను మరు ♦ న్నాళీకపత్రేక్షణా
బృందాంచత్తరగీయమానను ఘన ♦ శ్రీభాసమానన్ లస
త్సౌందర్యోజ్జ్వలతాసమాన నిభయానన్ ♦ బూర్ణచంద్రాననన్. 175

ఆ॥ పెండ్లియాడి యొక్క ♦ పీఠిఁ గూర్చుండిన, శక్రజాగుహులను ♦ జక్కఁగాంచి
ప్రమథదేవమౌని ♦ రాజి యత్యంతప్ర, మోదమొంది పొదలె ♦ నాదరమున.

క॥ కొమరునకుఁ దగిన గేహిని, రమణీయతరాంగి దేవ ♦ రాజతనయ యి
ట్లమరుటఁ గని యగజాశివు, లమితానందంబుఁ జెంది ♦ రాత్మములందున్.

మ॥ పరమోత్సాహముతో మహేశ్వరుఁడు గీ ♦ ర్వాణావళిన్ గాంచి ని
ర్భరకారుణ్యముతోడ నిట్లనె హరీ! ♦ రాజీవజన్మా! పురం

దర ! దివ్యర్షివరేణ్యులార ! చెప్పుఁడీ ♦ నాకిప్డు మీయిష్టముల్
నెఱవేఱన్ వరమిత్తు నిక్క మిది సం ♦ దేహింపకుం డెంతయున్. 178

క॥ అన విని మునులును ననిమిషు, లును మనముల నలరి యనిరి ♦ లోకావన! పా
వనచరణనలిన ! మా వన, టను దీర్పని దే యదను గ♦డంగుము కరుణన్.

చ॥ కొడుకును బంపి తారకునిఁ ♦ గూల్పఁగఁజేసి జగత్త్రయంబు పే
రడుకును దీర్పు మిప్పుడె ద ♦ యోన్నతి నెప్పటినుండియో యిటుల్
గడపితి మింతకాల మిఁక ♦ స్కందున కాజ్ఞయొసంగి పంపు త్రు
ళ్ళడలఁగఁజేసి దైత్యు సమ ♦ యించు నితం డవలీలగా వెసన్. 180

—* శివుఁడు తారకవధార్థమై కుమారుని దేవతలతోఁ బంపుట *—

గీ॥ అనిన నంత దయామయుం♦డగు శివుండు, దత్క్షణం బప్పగించెను♦దనయునమర
వల్లభుల కందు వారలు♦ పెల్లుమురిసి, గుహునిఁదోడ్కొని కైలాస♦కుధర మెడలి.

చ॥ ఒకయెడఁజేరి త్వష్టను స ♦ మున్నతరీతిఁ దలంప నాతఁ డు
త్సుకుఁడయి తారసిల్ల శివ ♦ సూనునికోసము రమ్యమౌ పురం
బొకఁడు రచింపు మంచు హరి ♦ యొప్పుగఁజెప్పిన నాతఁడంత శి
ల్పకుశలభంగు లేర్పడఁగఁ ♦ బట్టణ మట్టులె కట్టె నేర్పునన్. 182

గీ॥ అందుఁబ్రమథులకునునిర్జ♦రాగ్రణులకు, వేఱువేఱుగ భవనముల్ ♦ వెలయఁగట్టి
మధ్యమందురచించెఁ గు♦మారభవన, మందు సర్వంబు రత్నమ♦యముగఁజేసె.

—* దేవతలు కుమారస్వామికి బ్రహ్మాండాధిపత్యంబుఁ గట్టుట *—

గీ॥ అంత విష్ణువు రత్నసిం ♦ హాసనమున, శివకుమారునిఁగూర్చుండఁ ♦ జేసి సర్వ
తీర్థజలసేక మొనరించి ♦ తిలక మొసఁగి, కమలజాండాధిపత్యంబుఁ ♦ గట్టెనపుడు.

క॥ వరుసగ నత్తఱి హరియును, సరసీరుహసంభవుండు ♦ జంభారియునున్
సురలెల్లరు హరసుతునకుఁ, గరమర్మిలి మ్రొక్కినుతులు ♦ గావించిరొగిన్.

శా॥ ప్రాంచద్భంగి మహోత్సవంబునిటులన్ ♦ బన్నించి సేవించున
య్యంచన్నిర్జరవర్యులన్ గని మహా ♦ హ్లాదైకచిత్తంబుతోఁ
గ్రౌంచారాతి యిటుల్ వచించెఁ గడువే ♦ గన్ దారకున్ మిత్తిక
ల్పించన్ గాఁ గలవాఁడ మీ కభిమత ♦ శ్రీలిచ్చువాఁడన్ సురల్ ! 186

వ. అనిన విని యనిమేషులెల్ల రాత్మంబులం బొంగి యోంకారధ్వనులును జయధ్వను
లొనరించిరనిన సూతునకు శౌనకాదిమును లామీఁదివృత్తాంతంబు సెల
విమ్మనుడు. 187

మ॥ శరభాంబాహృదయాబ్జహేళి! విలస ♦ చ్చంద్రార్థకోటీరప
త్సరసీరుడ్భసలాయమానహృదయా ! ♦ శైవాగ్రజన్మార్చనో
ద్ధురదీక్షావరతంత్ర ! బంధుజనసం ♦ దోహాతిసంతోషకృ
న్నిరతాచ్ఛాశయ! నిత్యసత్యవచనా! ♦ నిర్మూలితాంహశ్చయా! 188



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## కు మా ర ఖం డ ము.

ద్వి తీ యా శ్వా స ము.



వీరభద్రగురురవి
సేవాసంఫుల్లహృత్కు • శేశయ! చిరసం
భావితపశుపతిచరణా!
పావనగుణమణికదంబ • వని! లక్ష్మ్యంబా!

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

ఉ॥ శంభుకుమారుఁ డంత దివిష • ద్వైరులన్ గని సత్కృపాత్తసం
రంభముతోడ నిట్లనియె • రక్కసిరాయనిపాలి కొక్కనిన్
సంభృతనీతిశాస్త్రసువి • చారు విశారదు దూత నంపి యి
ష్కుంభినిఁబాసి పొమ్మనుఁడు • గూఢపదాలయ భూమిఁ జేరఁగాన్. 2

క॥ అటు లరుగక తక్కిన మ, త్పటుతరభుజశక్తి వానిఁ • బరిమార్తు దృఢం
బటు సేయుం డన నమరో, ద్భటులు గడున్ బొంగి శక్తి • ధరున కని రిటుల్. 3

చ॥ వెఱవక తారకాసురని • వేశనభూమికిఁ జేరి వాని కి
త్తెఱఁగు వచింపఁగాఁ దగిన • ధీరులు మాయెడ లేరు మీరలే
యఱమర లేక యొక్కని బ • లాఢ్యుని నర్హునిఁ జూచి పంచి యి
ట్లెఱుఁగఁగఁ జెప్పి రమ్మనుట • యెంతయు శ్రేయము శర్వనందనా! 4

—* శ్రీ కుమారస్వామి వీరబాహునిఁ దారకునియొద్దకు సంధికై పంపుట *—

గీ॥ అనినవిని శంకరాత్మజుం • డపుడు వీర, బాహుఁ డనుతనయనుచర • ప్రముఖు నొకనిఁ
బంపి తగురీతి నసురకు • బ్రతుకు తెర్వుఁ, జెప్పి రమ్మన నాతఁడు • చెలఁగి వేగ. 5

క॥ వైహాయసరథమున మహి, తోహాగతి శోణితపురి ♦ కురువేగమునన్
దా హర్షంబునఁజేరి సు, బాహుండౌ వీరబాహు ♦ భటభాస్కరుఁడున్. 6
సీ॥ బహుపుష్పఫలభార ♦ భాసురాశోకసం, తానపరిముఖదివ్య ♦ తరువనంబు
స్వర్ణారవిందబి♦సగ్రాసమత్తమ, రాళకేళీసరో♦రంజితంబు
రవిహాయజయ*జహు♦రాణపర్వతఘన, గంధసింధురయూథ ♦ బంధురంబు
శమనమనస్సాధ్వ ♦ సప్రదబహువీర, పురుషప్రకాండవి♦భూషితంబు
గీ॥ చంద్రమండలసంచర ♦ చ్చంబరీవి, లోకనవిశేష దేశికా♦లోకనోత్ప
లేక్షణాలంకృతోత్తుంగ♦హేమహర్మ్య,సముదయముఁదత్పురముఁగాంచి♦సంతసమున
క॥ తగుగతిఁ దారకునొద్దో, లగమునఁ గని జని సురారి♦లావున్ జేరన్
దగఁగని బాగనుకొని యు,మ్మగ నాతనితోడఁ బలికెఁ ♦ బొలుపుగ నిటులన్.
చ॥ విను మనుజోత్తమా! భువన ♦ వీరుఁడు శంభుకుమారుఁ డిందు నన్
బనిచెఁ గృపాళుఁడై యతఁడు ♦ నన్నిట నీకు వచింపుమన్న వా
ర్తను వినిపించెదన్ విబుధ ♦ రాజినిఁబట్టి పలార్చి వారివా
హనధనవస్తువర్గముల ♦ నాక్రమణం బొనరించి తేపునన్. 9
క॥ పెక్కేండ్లనుండి వారల, యుక్కడఁచి యధఃకరించి ♦ యురుతరగర్వం
బెక్కియిటు నిక్కుచుంటివి, దక్కదు నీకింకఁ ద్రిదశ♦ధన మించుకయున్.
గీ॥ కట్టుబట్టలతో లేచి ♦ కాద్రివేయ, లోకమున కాత్మజనముతో♦వీఁకదఱిగి
యరుగు మట్లైనఁ బ్రాణంబు♦లాసఁగాంతు, దప్పితపయేని మిత్తికి♦దారవోతు.
క॥ అని నీకు హితవు సెప్పెను, ఘనుఁ డాతం డసురరాజ! ♦ కార్యమెఱిఁగి నీ
వనుకూలముగ రసాతల, మున కరుగుట లెస్సలెస్స ♦ బుద్ధి నరయుమీ! 12
గీ॥ ఎప్పుడును గూడ జేతను♦నేనేయని య, హంకరించుట దగ దిందు♦హానిమూడు
ద్రాటిచెట్టెక్కువానికిఁ♦దలనుదన్ను, వాఁడొకఁడు రాగలం డను♦వాక్కునరయు!

— తారకుఁడు సంధిని నిరసించుట —

ఉ॥ జంకొకయింత లేక తన ♦ సన్నిధిఁ జేరి కటూక్తులాడు నే
ణాంకకిరీటపుత్రకుభ ♦ టాగ్రణిఁ గన్గొని తారకుం డనా
తంకమతిన్ బ్రహాసఘరి ♦ తస్ఫురదాననుఁడై యుపాత్తరో
షాంకితవృత్తి నిట్లనియె ♦ నంబుధరార్భటిఁ గ్రిందుసేయుచున్. 14
శా॥ ఏమేమీ! నను మిత్తి కర్పణము సే ♦ యింపంగ నైశాని యి
ట్లామోదంబున నెంచి నిన్ బనిచెనా? ♦ యాదిత్యరక్షార్థమై
భూమిన్ బోనిడి కట్టుపుట్టములతో ♦ భోగీంద్రలోకంబు నే
నీ మాటల్ విని వేగఁ జేరవలెనా? ♦ నీకింత వాత్సల్యమా? 15

*టిప్పణి, జహురాణము = గుఱ్ఱము.

ఉ॥ ఈశున కేనిఁ దత్సుతున ♦ కేనియు మే మొనరించినట్టి దే
లేశముదోసమున్నదియె ♦ లేఖులకై యిటు లెత్తివచ్చి యా
వేశముతోడఁ జంపెదను ♦ వేపెదనం చదలించినంత నే
దేశముఁబాసిపోవుటకు ♦ దేబెలమంచుఁ దలంచెనే మదిన్. 16

చ॥ సురలకు మాకుఁ గిట్టదెటుఁ ♦ జొప్పడు నెప్పుడు పోరు వారికై
దురమున కీర్గడంగుటది ♦ దూఱగు మానుఁడు మానరేని ని
బ్బిరుదుమగండు తారకుఁడు ♦ భీతిలిపాఱుఁడు నిక్కమింక స
త్వరముగ నేగుదెమ్మనుము ♦ దర్పకవైరితనూజు నాజికిన్. 17

వ. మఱియును

చ॥ వననిధులింకిరన్ నభము ♦ వ్రాలిన భూమితలంబునందు నా
వనజహితుం డరాళగతిఁ ♦ బట్టిచరించిన నెన్నఁడేనిఁ దా
ననలము చల్లనైన నమ ♦ రాంతకుఁ డాఢ్యుఁడు తారకుండు శ
త్రునివెఱపొంది పాఱుటది ♦ దుర్లభమంచుఁ దలంపు రూఢిగాన్, 18

క॥ అని యహమహమికతో దూ, తను గని యిటుచెప్పమనుచుఁ ♦ దారకుఁడంపన్
ఘనభుజుఁడాతఁడు వీనికిఁ, జనునే హితబోధయనుచుఁ ♦ జనియెన్ వడిగాన్.

ఉ॥ తారక దైత్యుఁడున్ దనకు ♦ ధాత యొసంగిన మేల్వరంబునా
కారము నెంచి నిక్కముగఁ ♦ గ్రౌంచవిభేదనుఁ డాత్మ్రపంచ తా
కారణమంచెఱింగియు ని ♦ కామభుజాతతగర్వధూర్వహుం
డై రహిఁబోర నెంచి పృత ♦ నావళి సిద్ధముచేసె నుద్ధతిన్. 20

గీ॥ వీరబాహువు చని తన ♦ విభునిఁజేరి, తారకాసురుముందఱఁ ♦ దా నొడివిన
యట్టి నుడులను వానికి♦నసురవిభుఁడు, గినిసి యాడిన తెఱఁగు వే♦గిరము దెలిపె.

చ॥ శివతనుజన్ముఁ డంత సుర ♦ సేనలకెల్లను నెల్లి వేగ నా
హవమున కెత్తఁగావలయు ♦ నంచు నెఱుంగఁగఁ జాటఁబంచె ది
వ్యవరులు పార్వతేయుని మ ♦ హాభుజవీర్యసమాశ్రయంబునన్
బవరముసేయఁ దారకుని ♦ పట్టణమేగఁగఁబూని రున్నతిన్. 22

-* కుమారస్వామితో దేవతలు తారకాసురునిమీఁదికి యుద్ధంబునకు వెడలుట *-

గీ॥ అంత మఱునాఁటి వేకువ ♦ యందు నదితి, నందనులు శైలనందనా♦నందనుని బు
రస్కరించి వరూథినీ ♦ రాజితోడ, దండయాత్రకు వెడలిరి ♦ తారకుపయి. 23

ఉ॥ అత్తఱి శంకరానుమతి ♦ నంబరభారతి యిట్లువల్కె భా
స్వత్తరవిక్రమున్ గుహుని ♦ వాసిగఁ దోడ్కొనిపొండితండు దు

శ్చిత్తునిఁ దారకుఁ గెడపి ♦ శ్రీల నొసంగఁగలండు మీకు సం
పత్తులఁ జెంది యెల్లపుడు ♦ బాగుగ నుండుదు రింక నిర్జరుల్ ! 24

కం॥ అను నభ్రవాణివచనము, విని సుర లౌత్సుక్యమొంది ♦ వీరధ్వనులన్
బొనరింపుచుఁ బెనుపెనఁకువ, దనుజునిఁ జెనకంగఁ దెగువ ♦ దాల్చిరి వీఁకన్.

కం॥ దండిగ దగఁ దామొందిన, వందురుఁ దీర్పంగఁడంగి ♦ వైభవమున మి
న్నందుచు సేనలతో సుర, బృంద మసురపురముపొంత ♦ విడిసెఁ గడిమిన్మై. 26

కం॥ గుణఘోషంబులతో భీ, షణతరవిలయాంబువాహ ♦ చటులధ్వనులౌ
రణభేరుల నరిమారణ, చణులై మ్రోగించి రపుడు ♦ సమధికలీలన్.

—* తారకుం డసురసైన్యముతో యుద్ధమునకు వచ్చుట *—

చ॥ అదివిని తారకాసురుఁ డ ♦ హంకృతిమీఱి సమస్తసైన్యముల్
పొదలఁగ వజ్రవర్మమును ♦ భూషణముల్ మణిమౌళిఁ దాల్చి యిం
పొదవఁగ హేమపుంఖవిశి ♦ ఖోజ్జ్వలతూణముఁ జంద్రహాసమున్
గదను శరాసనంబుఁ గొని ♦ కాంచనరత్నరథాధిరూఢుఁడై. 28

కం॥ వైణికులు మారజికులును, వైణవికులు పటహాపణవ ♦ వాదిత్రులు ని
స్సాణధరమగధనంది, శ్రేణులు ఘననినదములను ♦ జేయఁగ వేడ్కన్. 29

కం॥ చామరము లిరుగెలంకుల, నామోదముతోడఁ గొని సు ♦ రారులు గొలువం
గా మహితదర్పమున సే, నాముఖమునఁ బొలిచెఁ గడు ♦ ఘనద్యుతి మెఱయన్.

కం॥ గొడుగులు పడగలు నిగుడఁగ, వడివడి వారువము లెక్కి ♦ వరవీరభటుల్
గడిదిమగంటిమి వెలయఁగ, నడిచిరి తారకుని మ్రోల ♦ నయ మెసలారన్. 31

ఉ॥ పర్వతసన్నిభంబులని ♦ భంబుల సింధుతరంగమాలికా
గుర్వనపాయభూరిజన ♦ ఘోటకబృందములన్ గరిష్ఠగం
ధర్వవహంబులై తగుర ♦ థమ్ముల నుద్ధతవీరయోధులన్
దుర్వహభారమొంది కడుఁ ♦ దూలుచునుండె ధరిత్రియత్తఱిన్. 32

ఉ॥ మొగ్గరమొంది నిర్జరు ల ♦ మోఘతరార్భటి నెందుఁ జేరి పో
రగ్గవలెన్ బొనర్పఁగఁ బ్రి ♦ యంపడుచుండిరో యందు వేగఁ బే
రగ్గవలెన్ గ్రుధాయతశి ♦ ఖాకులితాకృతియై మహోద్ధతిన్
డగ్గఱి తారకాసురుఁ డు ♦ దారుఁ డొనర్చెను సింహనాదమున్. 33

కం॥ తోడనె తక్కిన జోదులు, గూడ దిగంతాంతరాళ ♦ కుంభిని యదురన్
గాఢతరగర్జనంబుల, బాఢంబుగసల్పి రపుడు ♦ ప్రౌఢిదలిర్పన్. 34

సీ॥ విబుధు లవ్వాని విని కడు ♦ వేగ ఘనర, ణాభికాంక్షను నేకప♦ద్వయమున నెదురు
చనిరిపురుహూతుఁడద్రిజా♦తనయుఁదనదు, ధవళవారణ మెక్కఁ ప్రా♦ర్థన మొనర్చె.
గీ॥ వివిధరత్నోజ్జ్వలంబును ♦ వితతసర్వ, సమరసాధనమగు విమా♦నము శివాజ్ఞఁ
దఱియ వేల్పులదళవాయి♦దాని నెక్కె, యింద్రు నైరావణగజంబు♦నెక్కుమనియె.

మ॥ గుహునాజ్ఞన్ గొని యింద్రుఁడెక్కె గజమున్ ♦ గోవిందుఁడెక్కెన్ ఖగో
ద్వహుఁ దక్కుంగల వేల్పులెక్కి రెలమిన్ ♦ దత్తన్మహాయానముల్
బహుభేరీమురజాదివాద్యరవముల్ ♦ భాసిల్లె నభ్రస్థలి
విహరద్గుహ్యకరాజి గూర్చె సుమనో ♦ వృష్టిన్ గరిష్ఠంబుగన్. 37

చ॥ హరిహయుఁ డగ్రభాగమున ♦ నాత్మబలంబులతోడఁ జేరె నా
హరియును వీరభద్రుఁడు ప్రి ♦ యంబుగ మధ్య వసించి రింక శం
కరతనయుండు మూలమునఁ ♦ గాపుగ నిల్చెను బ్రక్కలందుఁ జా
మరములు దాల్చి వేల్పులు స ♦ మంజసవైఖరి వీచుచుండఁగన్. 38

వ. అంత,

గీ॥ ఉభయసేనలుపోర నొం ♦ డొంటుదాఁకు
చుండఁగానష్ట సంద్రముల్ ♦ రెండుగలియు
పోల్కినగుపట్టెఁ దద్ధ్వాన ♦ మును సముద్ర
ఘోషమున నొప్పె నెంతయు ♦ గొప్పగాను. 39

క॥ ధీరులు హాస్తికవర్యులు, తౌరంగికులున్ రధికప ♦ దాత్యగ్రణులున్
వీరశ్రీచెలువారఁగఁ, బోరుకు డీకొనిరి సమర ♦ భూమి చలింపన్, 40
క॥ ఘోటకరింఖాగ్రరజః, పాటలితోదగ్రరశ్మి ♦ పథమై యోధేట్
కోటిధ్వనిముఖరితది, క్కూటంబై రణతలంబు ♦ ఘోరంబయ్యెన్. 41

## —* దేవాసురయుద్ధము *—

క॥ కడఁగి బలోన్మత్తులు గడు, బెడిదపుమచ్చరము నిగుడ ♦ భీషణగతులన్
దొడరి పరస్పరము దురం, బడరించిరి యడిదముల మ ♦ హోద్భుతభంగిన్. 42
గీ॥ భూమియంతయుముండముల్ ♦ మొండెములును, దెగిపడినకాలుసేతులు ♦ దెగిపడినర
ధములునుం గూలినట్టి గు♦జ్జములుఁగూలి, నట్టిరేనుంగులగుపట్టె♦గుట్టలట్లు. 43
ఉ॥ కొందఱిబాహువుల్ పడియెఁ ♦ గొందఱి యూరువులున్ దెగెన్ మఱిన్
గొందఱిపొట్టలున్ బగిలెఁ ♦ గొందఱికంధర లూడె నింకనున్
గొందఱు నెత్తుటోర్లొలుకఁ ♦ గూలిరి గొందఱు మ్రింది రంతయున్
గందరగోళమయ్యె క్షణ ♦ కాలములో లయకాలమట్టులన్. 44

కం॥ మెఱసెడు కౌక్షేయకములు, నిరవగు బల్లెంపుగములు ♦ నిటెలు బాకుల్
విఱిజైన ముద్గరంబులు, పొరిగొనుచుండెను వడిన్ జ ♦ మూతతి నెల్లన్. 45

కం॥ ప్రవహించె రక్తవాహిను, లవనిన్ దొరలాడె నుత్త ♦ మాంగంబులునున్
వివిధకబంధములును దా, నవదేవాన్యోన్యకుట్ట ♦ నంబులచేతన్. 46

గీ॥ భూతములునున్ బిశాచముల్ ♦ ప్రేతములును
గాకులును గంకములు నులూ ♦ కములు జంబు
కములు గుంపులుగాఁ గూడి ♦ క్రవ్యభక్ష
ణంబొనర్చుచుఁ గూసెఁ బ ♦ ల్సంబరమున. 47

ఉ॥ తారకుఁ డష్టసూచి కడు ♦ దర్పమునన్ సురలన్ బలార్పఁగాఁ
దారసిలంగఁ గాంచి విబు ♦ ధప్రభుఁడేచి యెదుర్కొనెన్ మహా
దారులఁ దక్కుదైత్యకుల ♦ తల్లజులన్ సురవర్యులాఁగి దో
స్సారవిశేష మేర్పడఁగ ♦ జన్యమునల్పి రనల్పవైఖరిన్. 48

గీ॥ తారకునితోడ శక్రుండు ♦ దంభుతోడ, సప్తజిహ్వుండు జంభుతో ♦ జముఁడు బలుని
తోడ నాశరుఁ డతిబలు ♦ తోడఁ బాశ, పాణియును బెట్టిదంబగు ♦ బరవసముగ,

గీ॥ కరువలి సుహీరుతోడఁ గి ♦ న్నరవిభుండు, శంభదైత్యునితోడ నీ ♦ శానమూర్తి
శుంభుతో సూర్యచంద్రులు ♦ కుంభకుంజ, రాసురులతోడ ననిఁబూని ♦ రక్కసుమెయి.

చ॥ గొదగొని స్పర్ధతో నసుర ♦ కోటియు దివ్యసమూహ మిట్లు దో
ర్మదమొదవన్ బరస్పర మ ♦ మర్షపరాయణులై మహోగ్రమౌ
కదనము సల్పుచుండిరి ని ♦ కామబలాఢ్యులు ధీరులెంతయున్
ముదమొదఁ జెందఁ బంద లిఁక ♦ భూరిభయంబునఁ గుంది పాఱఁగన్. 51

చ॥ కడువడిఁ బోరుచున్న బల ♦ ఘస్మరుఁ గన్గొని తారకుండు గి
న్కడరి కరిన్ నిశాతవిశి ♦ ఖమ్మునఁ దూలఁగ నేసి వాసవున్
బిడుగులఁ బోలి బాణముల ♦ బిట్టుగ వక్షము నాటనేయఁగాఁ
బడలియతండు మూర్ఛపడెఁ ♦ బాష్పములన్ విడువన్ మరుద్వరుల్. 52

చ॥ అనలునిఁ దొట్టి నిర్జరవ ♦ రాగ్రణులున్ జలమేది యుద్ధతిన్
దనుజులతోడఁ బోరితము ♦ దారుణభంగి నొనర్చి యోర్చిత
ద్ఘనతరవిక్రమోన్నతి ని ♦ తాంతము దుస్సహమౌట డస్సి వే
దనఁ గొని యమ్మొనన్ దొలఁగి ♦ ధావనచేసిరి భీతచిత్తులై. 53

—* వీరభద్రుఁడు తారకునితో యుద్ధము చేయుట *—

ఆ॥ వారిఁగని దైత్యవర్యుల ♦ వార్యపటిమ, సింహనాదంబు లొనరించి ♦ చెలఁగనంత
వీరభద్రుఁడు గన్గొని ♦ వేల్పుగముల, వెఱపుఁబోకార్చి గణసేన ♦ వెలయఁజేరె. 54

క॥ ప్రమథగణంబులతోడుత, సమరంబున కాతఁడిట్లు ♦ చను దేరంగా
నమరులు గ్రమ్మఱి యుత్సా, హముమీఱ రణాభికాంక్షు ♦ లై తోడరుటయున్.

చ॥ సురలఁ బిఱుందఁ జేర్చుకొని ♦ శూరవరుండగు వీరభద్రుఁ డు
ద్ధురతరరోషవేగమున ♦ దోర్బలమేర్పడ రాక్షసావళిన్
బోరిఁబోరిఁ జంపుచుఁ దదధి ♦ పుండయి ఘూర్ణిలు తారకాసురున్
బారిగొనంగఁ ద్రిశూలమున ♦ మోఁదె నురమ్మున ఘోరభంగిగాన్. 56

గీ॥ దాన నసురుండు మూర్ఛిలి ♦ తా రథంబు, నందొరగె సుంత కాలంబు ♦ నమరవరులు
సంతసంబొంది యార్వఁగ ♦ వంతఁగొని సు, రారు లొక్కింత సేపు దై ♦ న్యంబుఁ జెంద.

ఆ॥ భయదశూలపాశ ♦ పరశుపట్టిసములు, ఖడ్గముసలగదలు ♦ గరము మెఱయఁ
బ్రమథవీరవరులు ♦ రక్కసు లొండొరుల్, పోరి రనుపమాన ♦ భూరిశక్తి.

ఉ॥ దైత్యవరుండు దెప్పఱిలి ♦ దానవసంఘము పొంగ నాతత
స్తుత్యసపత్నవీరచయ ♦ సూదనమై తగు శక్తి వీరుపై
నత్యురువిక్రమార్భటుల ♦ నార్చుచు వైవ నతండు దానినే
యత్యకరస్థశక్తిఁగొని ♦ యంతనె వ్రయ్యలు చేసి ధీయుఁడై. 59

గీ॥ * ఇపుడె సమయింతు నిద్దైత్యు ♦ హీనచరితు, ననికడంగుడు నారదుం ♦ డతిరయమున
వచ్చి యిట్లని వాక్రుచ్చె ♦ వరద! యుడుగు, మీవు షణ్ముఖుఁడే తీర్చు ♦ నీయసురుని.

వ. అనినంత

క॥ కోపోద్దీపితుఁడై యా, టోపంబున రక్కసుఁ దు ♦ డుపుదుననియుఁ డా
నోపికతోడఁ గడున్ ముని, యౌపాయికమైన వచన ♦ మారసి మరలెన్.

గీ॥ అంత మరలఁ గడంగిన ♦ యమరవర్యు, లొక్కపెట్టు నిశాటుపై ♦ నురవడించి
యంపవెల్లినిఁ బరగింప ♦ నాతఁ డలిగి, ప్రతిహతము చేసి యద్దాని ♦ వాసి మెఱయ.

ఉ॥ అందఱు కన్నిరూపులయి ♦ యాతతశక్తి నిశాచరేశ్వరుం
డందఱి కొక్కమాఱె విల ♦ యంబు ఘటింపఁ గడంగి బాణరా
జిం దవహేతులట్లడరఁ ♦ జేయఁగ నేయఁగ నాయమర్త్యుల
ప్పొందఁగరాని వేదనను ♦ నొంది రలందురి కుందుచున్ గడున్. 63

—* తారక విష్ణుదేవుల యుద్ధము *—

శా॥ వైకుంఠుం డది గాంచి యూర్వ్యక భుజా ♦ వష్టంభమేపార న
న్నాకాధీశ్వరవైరి డగ్గఱి బృహ ♦ న్నారాచధారాతతిన్
జీకాకుల్ బడఁజేసి యార్చిన శునా ♦ సీరారి రూక్షాత్ముఁడై
శ్రీకాంతున్ ద్రిశిఖంబునన్ గదిసి మ ♦ ర్దించెన్ సురల్ వందురన్. 64

* వీరభద్రుఁడు తారకవధకై షణ్ముఖుని బ్రోత్సహించుటకై యట్లు కడంగెను. నారదుఁ డనుమానము చెంది యట్లనెను.

చ॥ సొలయక యంతఁ జక్రి సుర ♦ సూదనుపై గద వైవ నాతఁడ
త్యలఘురయంబునన్ సునిసి ♦ తాశుగవర్గముతోడ దాని వ్రి
య్యలు పొనరించి యార్చి ఘన ♦ మై భయదంబయి యొప్పుశక్తి బి
ట్టలరఁగ విష్ణుపై విసర ♦ నద్ది కఠోరముగాఁగఁ దాఁకఁగన్. 65

—* తారక విష్ణు లొకరిచే నొకరు మూర్ఛితు లౌట *—

ఆ॥ శోణితంబుదొరఁగ ♦ సుడివడిహరి మూర్ఛఁ, గొని సుపర్ణుమీఁదఁ ♦ గూలెగరుడుఁ
డాకసమున కెగసి ♦ యాహవంబున కెడ, గాఁగఁ జేర్చె నంతఁ ♦ గంజనయను.

చ॥ మురరిపుఁ డంత మూర్ఛవిడి ♦ మోహరమొంది కడిందిచేవ ని
ర్జరరిపుఁ జూచి నందక ము ♦ రమ్మున నాటఁగ నేయ నాతఁడ
త్యురుతరతత్ప్రహారమున ♦ నొడ్డుగవ్రాలె రథంబునందు నె
త్తురు వఱదల్ తొరంగఁ గడు ♦ దుఃఖము నొంది తలంక రక్కసుల్. 67

ఉ॥ చెచ్చెర లేచి తారకుఁడు ♦ చిచ్చువితమ్మగ మండుచున్ వడిన్
బచ్చనివల్వవేల్పుపయి ♦ బాణశతంబులఁ గుప్పె నాతఁడున్
హెచ్చగు పౌరుషంబున స ♦ హింపక నింపె సహస్రమమ్ములన్
మెచ్చగు వీర లిర్వుర స ♦ మీకము దర్శనయోగ్యమై తగెన్. 68

గీ॥ ఔజసికవరుఁడైన దై ♦ త్యాధినాథు, విక్రమం బంతకంతకు ♦ విస్తరిల్లె
విష్ణువును వెన్కద్రొక్కక ♦ వెక్కసముగఁ, బోరుచుండెను మగసిరి ♦ పొంక మొప్ప

వ. అంత దినాంతంబగుడు నిరుగెలంకులవార లాయోధనంబు విరమించి నిజనివాసంబుల కరిగిరి.

ఉ॥ * చిత్రమగున్ బ్రదోషమునఁ ♦ జేవమెసంగఁ దమోనిశాటుఁ డీ
ధాత్రి సమస్తదేశముల ♦ దక్కొని యాక్రమణంబు సేయుచున్
జైత్రుఁడు రాజు వాని బహు ♦ సత్త్వకరంబుల గెంటివైచి స్వ
క్షాత్రముఁజూపి చెందినయ ♦ శంబన నిండుగఁ గుప్పెఁ గౌముదిన్. 71

గీ॥ చక్రదుఃఖావహుండైన ♦ సత్సమగ్ర
వసువును హరించినను గురు. ♦ వనితఁ జెంది
నను గువలయేందిర వరియిం ♦ చెను గలాదుఁ
గాముకులు గాంతురే యెందుఁ ♦ గల్మషముల. 72

---

* టిప్పణి- తమోనిశాటుఁడు = రాహుదైత్యుడు; రాజు = చందురుఁడు; వాని = రాహుదైత్యుని గెల్చి గెంటుట చిత్రము - విరోధము - చీకటియను రక్కసుని గెల్చి గెంటుట విరోధ పరిహారము.

క॥ కావలయశ్రీరతితే, జోవినియోగమున స్రుక్కు ♦ చుఁ గలాదుండున్
వేవచ్చు విక్రముఁగని తా వేగఁ గదలిఁ బడియెఁ ♦ దలఁకుచు నంతన్.

క॥ పోరిపోరిఁ దెలవాఱఁగఁ దా, మరసభవుం డరుగుదెంచి ♦ మకరధ్వజసం
హారతనయున కెఱఁగి యిటుల్, పరమప్రశ్రయము మెసంగఁ ♦ బలికెఁ గలఁకన్.

—* బ్రహ్మదేవుఁడు తారకసంహారార్థమై కుమారస్వామినిఁ బ్రార్థించుట *—

శా॥ ఓ వందారుజనావనోద్యమనిబ ♦ ద్ధోద్యన్మహాకంకణా !
ఓ విశ్వోత్తరశౌర్యధైర్యవిభవా! ♦ యో దేవదేవోద్భవా!
నీ వాలంబును బూని దైత్యునికఁ ఖం ♦ డింపంగ భావింపుమా!
దేవాత్మవ్యథదీర్పఁగాఁ గడఁగుమా! ♦ దివ్యత్కృపాంభోనిధీ! 75

శా॥ ఈవిష్ణుం డల జిష్ణుఁడున్ మఱియు వ ♦ హ్నిబ్రధ్నకాలాదులా
దేవారాతిని గెల్వఁజాల రిట సం ♦ దేహం బొకెంతేని లే
దీపీకార్యముఁ దీర్పఁబుట్టితివి సు ♦ మ్మా! లెమ్మికన్ దారకా
భావంబున్ బొసఁగించి మాకుదయసా ♦ భాగ్యంబుఁ జేకూర్పుమా ! 76

గీ॥ అనిన శాంకరి ప్రియమంది ♦ యనికినై య, నీకినికి సెలవీయ న♦స్తోకదీప్తిఁ
ప్రమథవిబుధవరుల్ పటు♦భయదతూర్య, రవములెసఁగఁగ సంగరా♦రంభులైరి.

—* రెండవనాఁటి యుద్ధము *—

మ॥ హయహేషల్ గరిబృంహితంబులును ఘం ♦ టారావముల్ శింజినీ
భయదధ్వానములున్ శతాంగతురగ ♦ స్ఫారోల్లసత్కింకిణీ
చయసుక్రేంకృతులున్ రథాంగజనిత ♦ స్వానంబులున్ యోధసం
చయవీరధ్వనులున్ జెలంగె దశది♦క్చక్రంబు దూటాడఁగన్. 78

గీ॥ అడరి సైన్యంబు లోకశేవ ♦ నవనివణఁక, మొగ్గరముఁబన్ని యార్వవి♦బుధసపత్నుఁ
డాత్మకీయచమూరజం ♦ బంబరంబుఁ, గప్పఁగా నరుదెంచి శం ♦ ఖంబు నొత్తె.

చ॥ గుహుఁడును బూన్కితో దనుజ ♦ కుంజరుఁ దీర్పఁగఁబూని యుల్లస
ద్బహుగణసన్నుతుల్వెలయఁ ♦ బన్నుగ వ్యూహముఖంబుఁ జేరఁగా
మిహిరసహస్రవిద్యుతుల ♦ మీఱిన తేజము వానిఁ బ్రజ్వల
ద్దహనదృగాత్మజాతుఁ గని ♦ తారకుఁ డాత్మఁదలంకి యుల్కునన్. 80

ఉ॥ ఈతనిఁజూడఁగా జగము ♦ లెల్లను నొక్కనిమేషమాత్రలో
నాతతశక్తిఁద్రుంపఁగల ♦ యోజసికుండని తోఁచు నీతఁడే
ధాతవరప్రకారమిటు ♦ దారసిలెన్ నిజమాతతాయియై
యీతఱియుద్ధమందు జయ ♦ మెట్లొనఁగూడు నిలింపరాజితోన్. 81

క॥ పరమేశ్వరుఁ డీతనిఁగని, జరితార్థుండయ్యె నిఁకను ♦ స్వయముగ నితఁడే
పరిమార్చునన్ను దృఢమిది, సురలకుఁ గడుసంతసంబు ♦ చొప్పడునకటా!

చ॥ అని తృటికాలమిట్లు హృద ♦ యంబున నెంచి యనంతరంబె పా
యని మొనలేని విక్రమము ♦ నారసి యీసున నిప్డె యీతనిన్
జెనకెద నేమిలెక్కయని ♦ సింహరవం బొనరించి దివ్యులన్
గని యిటువల్కె గర్జిలుచుఁ ♦ గాటపునేటగు నల్కయొల్కఁగన్. 83

—* తారకుఁడు విష్ణ్వాదుల నుపాలంభించుట *—

చ॥ మగతన మింత లేక సుకు ♦ మారుఁ గుమారునిఁ దోడు తెచ్చి యి
మ్మగ రణ మాచరించుటకుఁ ♦ బూనితి రోరిసురాధముల్! చలం
బుగ నిటువన్నినన్ బ్రతికి ♦ పోవుదురెట్లు మదీయశక్తిచేఁ
దెగుదురు మీరలిందఱును ♦ దెంపుననిల్వఁడు సంగరంబునన్ 84

వ. హరిన్ బరికించి.

ఆ॥ కమలనయన! నీవు ♦ కాంతాకృతివిగాక, పగఱఁ గలనఁ జెనక ♦ బలముగలదె
ఎవరినెదిరినాఁడ ♦ వేనాఁడు యుద్ధంబుఁ, జేసినాఁడవీవు ♦ చెప్పుమిపుడు. 85

చ॥ అల మధుకైటభాసురుల ♦ నంబుధి మార్కొనలేక లేక్కివై
యలఁతితనంబనాక యొక ♦ యర్థివిధంబున దేవురించి య
ట్లాలసి వధించితీవు మఱి ♦ యొక్కపు డొక్క నెలంతవై సురా
రుల కమృతంబు నీయకమె ♦ రూపడగించితి వార! వారలన్. 86

శా॥ ఈసంక్రందనుఁ డొక్కపాటి యతఁడా ♦ హీనాత్ముఁ డన్యాయమా
దోసంబున్ బొనరించె జ్యేష్ఠజననీ ♦ తోషంబు శోషింప ద
చ్ఛీసంతానపు పేశికోశముల వి ♦ చ్ఛేదించె వృత్రాసురున్
మోసంబున్ బొనరించి చంపె నకటా! ♦ మూఢాశయుండై యటుల్. 87

క॥ అనిముప్పిరిగొను కినుకన్, గొని తారకుఁడాదితేయ ♦ కోటిన్ జదిపెన్
గవలేక నాకనాయకుఁ, డనుపమహేతి వజ్రధార ♦ నసురను మోఁదెన్. 88

గీ॥ దానఁ గడుడస్సి తారుండు ♦ ధారనిసద, సుడర నైరావతగజంబు ♦ నవనిఁగూల్చి
శక్తిచే నింద్రువక్షంబు ♦ జర్ఝరితము, సేయ సుర లాస వదలిరి ♦ జిష్ణుపైని.

—* విష్ణువు తారకునితో యుద్ధముచేసి మూర్ఛిల్లుట *—

చ॥ అదిగని చక్రి బిట్టలిగి ♦ యంతనె రాత్రిచరేంద్రుమౌళిపై
వదటునఁ జక్రమున్ విసర ♦ నయ్యది ఘోరనిపాతతన్ దురా
స్పదుఁడగు తారకాసురుని ♦ సంధులు వెల్వడఁజేయ నాతఁ డ
ప్పదమున నే హరిన్ గవిసి ♦ పట్టి యురంబునఁ గొట్టె శక్తిచేన్. 90

గీ॥ శక్తిహతిఁ గమలాక్షుండు ♦ చటులతరని, పీడితుండయి భువిఁబడ ♦ బీరువోయి
యమరసేనలు పాఱఁగ♦నంతఁజూచి, వీరభద్రుండు ఘనరోష ♦ వివశుఁడగుచు.

క॥ కరతలశూలముచేత న, సురవరుబిట్టేయ నతఁడు ♦ శూలహతి ధరన్
వ్రాఁగియు నరకుఁగొనక క్రి, మ్మఱలేచి ప్రచండకోప ♦ మండితుఁడగుచున్.

గీ॥ శక్తిచే వీరభద్రుని ♦ చటులపాత, మొనర నురమునఁ దాడింప ♦ నుక్కుదక్కి
భూతలంబునఁబడిమూర్ఛఁ♦బొందెవీర,భద్రుఁడెంతయుఁ బ్రమథులు♦బాష్పములిడ.

ఉ॥ అంత నిమేషమాత్రమున ♦ నద్భుతవైఖరి లేచి వైరివీ
రాంతకమూర్తి యుజ్జ్వలత ♦ రాయతతేజుఁడు వీరభద్రుఁ డ
త్యంతరయోద్ధతిన్ బరమ ♦ దావహభూరివిభావిభాసితా
శాంతము భాస్కరేందుదహ ♦ నాత్మక ముజ్జ్వలమున్ దిరిశూలమున్. 94

క॥ బిఱబిఱగొని తారకుతల, నఱుకుదునని యుద్ధవిడిఁజ♦నన్ షణ్ముఖుఁడ
త్తఱి రయమున నవ్వీరున్, దఱియంగావచ్చియాఁగి ♦ తా నిట్లనియెన్. 95

చ॥ ఉడుగుము సోదరా! యసుర ♦ నుక్కడఁగించి వధింతు నీవిటుల్
దొడరఁగ నేల వీనికయి! ♦ దొడ్డవు బాలుఁడ నేనచాలు ద్రే
ల్మిడిఁ గనుగొంచునుండుఁ డిక ♦ లేఖులు నీవును వీనిదైనయీ
దుడుకుఁదనంబుఁ దీర్తుఁబరి ♦ తోషముఁగూర్తు సిలింపకోటికిన్. 96

గీ॥ అని కుమారుఁడు దత్క్షణ♦మందు నాత్మ,యికమతిన్ నెమ్మనంబున♦హిమగిరీంద్ర
జామహేశ్వరపదములు♦జక్కఁగొలిచి, తారకాసురవధను దృ♦తమున నెంచి.

క॥ భ్రమపడి యజాండమదురఁగ, నమితపు గర్జనము చేసి ♦ యసురవరివరే
ణ్యముఖమునుజేర్ప నరదము, నమర్ష మొప్పంగఁ జూచి ♦ యసురేశ్వరుఁడున్.

గీ॥ కమలజాండమునంత నొ♦క్కనిముసమునఁ, జాపచుట్టగఁ దఱలింప♦జాలువాని
మందహాసాంకురంబు ల♦మరినవార్వ, తీకుమారుఁ గుమారు*రో♦ధించియనియె.

ఉ॥ బాలుఁడ వీవు దుర్మతులు ♦ బాసటగాఁ గొని తెచ్చిరిట్లు ని
న్నాలముసేయ నీ కలవి ♦ యానొకొ యీ సురలెల్ల నా కనిన్
జాలక యోడి యీడిగము ♦ సల్పుచు నుండిరి యింతవట్టిటుల్
జాలవు నీవు చేరు మిఁక ♦ సత్వర మా రజతాద్రిభూమికిన్. 99

క॥ మీజోలికి మీపోరికి, మీజాడకు నెప్పుడేని ♦ మే మరుదెంచం
గా జతనం బెదఁజేయుము, రాఁజనునే యెత్తి యిట్లు ♦ రాణువతోడన్. 100

వ. వచ్చిననుగూడ నివ్వుడు.

గీ॥ చిఱుతపాపనిఁజంపిన ♦ సిగ్గువాడము, ననెడు జంకొండెగాని లే ♦ దరయువేఱు
తెఱఁగు కొఱమాలిచెడుగులీ♦సురలునిన్ను, నూఁతగాఁదెచ్చిరిచ్చటి♦కువిదలట్లు.

---

* కుత్సితాన్ మారయతీతికుమారః.

చ॥ అనినఁ గుమారుఁ డల్లనగి ♦ యాతని కిట్లనియెన్ బిభీషికల్
పనివడ విప్పుడాలమున ♦ బంటుతనంబున నిల్వ లేక నీ
తనుజగణమ్ముతోడ నిజ♦దారయుతమ్ము రసాతలమ్ముఁగ్రొ
క్కునఁ జని యందయుండు మిఁకఁ ♦ గొందలమొందక యెల్లకాలమున్. 102

క॥ మా తెరువు రాకయున్నను, నీతిఁదొరఁగి సురలకలిమి♦నీవుకొని యిటుల్
కాతరులఁజేసి వారల, ఘాతుక! వేధింపుచుండఁ ♦ గాంచుదు మెట్టుల్. 103

వ. మఱియు.

క॥ నను బాలునిగాఁగఁ దలం,చినఁ బ్రౌఢనుగాఁ దలఁచినఁ ♦ జింతయొనర ది
ష్టనిఁ జూతువు లావంతయు, దినఁబోవుచు రుచులనడుగఁ ♦ దెలిఁగేయెందున్.

—* కుమారతారకుల యుద్ధము *—

గీ॥ అనిన విని దనుజేశ్వరుం♦డాగ్రహమున, నడరి నిశితశరమ్ముల ♦ నంబికాత
నూజుపైఁబరపిన గుహుం ♦ డోజ మెఱయ, వానినన్నిటి నడుమనే♦వమ్ముచేసి.

క॥ పెనుబాములవలెఁ జెలఁగెడు; ఘనసాయకముల నురంబు♦గాఁడఁగ నేయం
గను కినుక తారకాసురుఁ, డనువుగ శతకాండములఁ బ్ర♦హారించె గుహున్.

వ. అంతఁ గుమారుఁ డలఁతినవ్వొలయ.

చ॥ శిరసున ఫాలమందు గళ ♦ సీమ నురంబున బాహులందు ని
ష్ఠురతరతీవ్రబాణములఁ ♦ జొన్పి సిడంబును ద్రుంచి విల్లుఁబో
విఱిచి హయంబులన్ దునిమి ♦ వేసినఁ దారకుఁ డుక్కుఁదక్కి స
త్వరముగ శక్తి నూఁతఁగొని ♦ పార్వతిపుత్త్రినిఁ దాఁకె వీఁకతో. 107

చ॥ హరసుతుఁడున్ రయోన్నతి శ ♦ తాంగముఁ బాసి పదాతియై ద్విష
ద్ధరణకమైన శక్తిఁగొని ♦ దానవనాథు నెదిర్చి యార్చె న
ప్పరుసున నొండొరుల్ చెలఁగి ♦ ప్రౌఢిగ శక్తులఁ బోరుసల్పి రా
దురమును జూడ నెంచి కడుఁ ♦ దోస మెసంగఁగ నాకసంబునన్. 108

—* కుమార తారకుల శక్తియుద్ధమును వైమానికులు చూచుట *—

గీ॥ గరుడగంధర్వసిద్ధకి ♦ న్నరులు సాధ్య, వరులు విద్యాధరాప్సరో ♦ వర్గములును
ఘనతరవిమానముల నెక్కి♦కాంచుచుండి, రెలమిబలతారతమ్యంబు♦లెన్నుకొనుచు

ఉ॥ తారకకార్తికేయు లతి ♦ దర్పమెసంగఁగ శక్తిహస్తులై
సారెకుఁ దీవ్రఘాతముల ♦ సల్పుచు నొండొరు లేకవీరులై
నేరిమి శూరతాగరిమ ♦ నెక్కొన నొంచుచు మించుచున్ గడున్
ఘోరముగాఁగఁ బోరిత మ ♦ కుంఠితరీతి నొనర్చి రెంతయున్. 110

మ॥ తలపై నెన్నొసటన్ హానుద్వయిని స్కం♦ధంబందు బాహుద్వయిన్
గళమందున్ గయిదోయియం దుదరభా ♦ గంబందుఁ బార్శ్వద్వయం
బుల నన్యోన్యవధేషులై పటునదం ♦ బుల్ సేయుచున్ వీఁకతో
బలవద్ఘాతములన్ బొనర్చికొని ర ♦ ప్పాటన్ మృగేంద్రాభులై. 111

క॥ పిఱుఁదివియక యొక రేనియు, బిఱబిఱ నింగి పయికెగసి ♦ బిట్టుగ శక్తి
స్ఫురదురుపాతంబుల నెత్తురువఱదలుఁ బిశితములును ♦ దొరఁగించి రిలన్.

వ. అయ్యవసరంబున ననన్యసామాన్యవిక్రమధుర్యులగు నవ్వీరవర్యులన్ గాంచి వైమానికతల్లజులు సాంశయికులై యిట్లు యోజించిరి. 112

ఉ॥ ఇద్దఱునున్ సమిద్ధబలు ♦ లిద్దఱు యుద్ధపటిష్ఠులైన వా
రిద్దఱు దివ్యశక్తిధరు ♦ లిద్దఱు విక్రమధుర్యులైనవా
రిద్దఱు సింహసంహనను ♦ లిద్దఱు ధీరమనీషు లిప్పుడీ
యిద్దఱిలో నెవం డని జ ♦ యించునొ త్రుంచునొ మార్తు నేపునన్. 113

వ. అని యిట్లు యోజించుచున్నంత నభోభారతి యవ్వారల కిట్లులనియె. 114

ఉ॥ ఖేచరులార ! కాంచుఁడిఁకఁ ♦ గిల్విషవర్తను దారకాసురున్
నీచుఁ గృతాపరాధు నవి ♦ నీతు హరాత్మజుఁ డీకుమారుఁ డీ
ర్చ్యాచుచునుండ శక్తిహతిఁ ♦ జొప్పడఁగించి వధించు నింక సం
కోచము మానుఁ డుల్లములఁ ♦ గుందడఁగున్ భువనత్రయంబునన్. 115

ఆ॥ అనిన దివ్యులెల్ల ♦ రాత్మంబులన్ బొంగి, రంబికాతనూజుఁ ♦ డపుడు శక్తిఁ
దారకాసురేంద్రుఁ ♦ దఱిమి యురంబున, మోఁదె నశనిశతస ♦ మూహనిహతి.

క॥ దానఁగడు బడలి యసురుఁడు, దీనుండై యంతలోనఁ ♦ దేఁకువఁగొని యెం
తేనలుక నాత్మశక్తి న, నూనపరిహరణ మొనర్చె ♦ నుద్దవిడి గుహున్. 116

—* తారకతాడితుండైన కుమారస్వామి మూర్ఛిల్లుట *—

గీ॥ స్కందుఁడద్దాన మూర్ఛిల్లి ♦ క్షణములోన
ఋషిగణస్తూయమానుఁడై ♦ యెఱుకఁ జెంది
గంధసింధురవరముపైఁ ♦ గడఁగునట్టి
కొదమసింగంబనా దైత్యుఁ ♦ గొట్టె శక్తి. 117

క॥ ఇవ్విధి నిరువురువీరులు, చివ్వన్ జెలరేఁగి విజయ ♦ చింతాలసులై
క్రొవ్వునఁ బోరుచునుండిరి, రివ్వెఱపాటొందె ద్రష్టృ ♦ నికరము చదలన్.

క॥ పవమానుఁ డచలుఁడయ్యెను, రవి తేజుఁదొఱంగె నుర్వ ♦ రయు నానాశై
లవనగ్రామంబులతో, డ విచలితంబయ్యె నెదగ ♦ డలు కొనఁగఁగడున్.

గీ॥ అపుడు తుహినగిరీశ్వరుం ♦ డతిరయమునఁ, దనజనంబులతో రణ ♦ స్థలినిఁజేరి
కందు దౌహిత్త్రుఁగని వెఱ♦పొందుచుండ, నరసి షణ్ముఖుఁడతనికి♦ట్లనియె వేగ.

చ॥ అడలకుఁ డద్రిరాజ ! హృద ♦ యంబున నెవ్వగఁజెందఁబోకుఁ డి
ప్పుడ కడతేర్తు నిద్దనుజుఁ ♦ బూజ్యులు మీరలు గాంచఁగా నీఁకఁ
బుడమిజనంబు సంతసము ♦ పొంపిరివోవరహించుఁగాక నా
కడిఁది భుజాబలంబు గల ♦ కాలము కీర్తి వహించుఁ గావుతన్. 121

క॥ అని మనమున గిరిజాశివు, లను భక్తియెసంగఁగాఁ ద ♦ లఁచి మ్రొక్కి విరో
ధినిఁ జంపఁబూని కినుకఁ, గొని ఘనశక్తిన్ నితాంత ♦ కుశలోన్నతిమై.

—* కుమారస్వామి తారకాసురునిఁ జంపుట *—

క॥ భైరవరవ మొనరింపుచు, దారుణతరశక్తిధారఁ♦దారకు మోఁదన్
భూరికులశైల మట్టుల, ధారుణి యదురవంగఁగూలెఁ ♦ దారకుఁడు వడిన్.

చ॥ కడునిశితప్రహారమున ♦ గాత్రము ఖండితమై నిశాటుఁ డ
య్యెడఁ బుడమిన్ బడంగ నిఁక ♦ నేమియుఁజేయకయుండె షణ్ముఖుం
డడరి జనంబులెల్లఁగన ♦ నాదనుజుండు లయంబుఁజెందెఁ గీ
ర్వ్యాడి పలలాశు లెంతయును ♦ బాఱిరి నల్గడఁ గాందిశీకులై. 124

లయగ్రాహి:- కొంద అలుకొంది ధృతిఁ♦జెంది సురబృందముల
నుం దురమునం బెదిరి ♦ మ్రింగిరి కడంకన్
గొంద అదరొంది గుహు ♦ సుందరపదంబులకు
వందనముచేసి శర♦ణొందిరి ప్రవర్తిన్
గొంద తెరఁ గుందుచుఁ బి♦ఱుందఁ గనుఁగొనుచు బలి
మందిరముఁ జొచ్చి యట ♦ నొందిరి నివాసం
బిందుధరనందనుఁడు ♦ పొందుగ నిటుల్ జయము
నొందె ముదమందిరి ము♦కుందముఖలేఖుల్. 125

క॥ అంతఁగని ఖేచరులు గడు, సంతసమున గుహునిజయము♦శ్లాఘింపుచు న
త్యంతము గానముచేసిరి, వింతగఁగురిపించి రలరు ♦ విరులసువృష్టిన్. 126

-* పార్వతీపరమేశ్వరులు రణభూమికివచ్చి కుమారునిఁజూచి యానందించుట *-

ఉ॥ శీతమయూఖశేఖరుఁడు ♦ చెచ్చెరఁ బుత్త్రజయోత్సవోన్నతిన్
జేతమునందుఁ దా నెఱిఁగి ♦ శీతనగేంద్రకుమారితో గణ
వ్రాతముతో రణావనికి ♦ వచ్చి కుమారు నిజాంకమందు సం
ప్రీతియెసంగఁ జేర్చికొని ♦ ప్రీణనమున్ బొనరించె నెంచుగన్. 127

గీ॥ చాలఁబ్రేముడితో హిమ ♦ శైలరాజ
తనయ సుతు ముద్దుచేసి య ♦ క్కునఁ ధరించెఁ
గుహుఁడు తలిదండ్రులడుగుల ♦ కుఱ బ్రియమున
శిరము సోఁకఁగ మ్రొక్కి సం ♦ బరము నొందె. 128

క॥ హిమగిరివరుఁ డత్తఱిఁ దన, కొమరులతో బంధుమిత్ర ♦ కూటముతోడన్
హిమకరకిరీటు నార్యను, గొమరునిఁగని కొనియె వెల్లి ♦ కొల్లగ ముదమున్. 129

క॥ దేవతలందఱు శివుఁ ద,ద్దేవిన్ గొమరునిఁ గనుఱ ను ♦ తించిరి గంధ
ర్వనికర మప్సరోగణ, మావేశముతోడఁ బాడి ♦ యాడిరి ప్రీతిన్. 130

వ. అంత హరిహిరణ్యగర్భాద్యఖిలగీర్వాణశిరోమణులును దేవర్షిప్రవరులు ముని ముఖ్యులు మున్నగువారెల్ల రమితామోదంబున మహోత్సవంబు సంతరించి నానావిధగీతవాదిత్రఘోషసంయుతంబుగ బ్రహ్మఘోషపురస్సరంబుగ నుమా మహేశ్వరులకుఁ గుమారునకు విజయనీరాజనంబులుచేసి వినుతించి యర్చించిరి. పరమేశ్వరుం డవ్వారినందఱి నభినందించి జగదంబికను దోడ్కొని ప్రమథగణంబులతో కైలాసపదంబునకు విజయంచేసె. 131

## —* బాణాసుర ప్రలంబాసుర సంహారము *—

క॥ బాణాసుర పీడితుఁడై, ప్రాణార్తుం డగుచుఁ బొగలి ♦ క్రౌంచాద్రి యని
దారుణపరాక్రము షణ్ముఖుఁ, ద్రాణార్థముచేరి తత్ప ♦ దముల కొఱఁగుచున్. 132

ఉ॥ దేవర! నీదుయుద్ధమునఁ ♦ దేఁకువదక్కి పలాయమానుఁడై
యేవలనందొయుండి యిపు ♦ డివ్విధి బాణదనూజుఁ డుద్ధతిన్
నా వెనువెంటఁజొచ్చి నిధ ♦ నం బొనరింపఁగఁ జూచుచున్నవాఁ
డీ వెడఁగున్ వధించి నను ♦ నేలుము శంభుకుమార! కూరిమిన్. 133

వ. అని దీనుండై యర్థించినంత,

ఆ॥ తారకారి దృప్త ♦ దైత్యఘ్నుఁడును శర,ణాగతావనుండు ♦ నగుట నపుడు
బాణు గుఱిఁచివైచెఁ ♦ బటుతరంబగు స్వీయ,శక్తినదియుఁజని ని ♦ శాటుఁ జదిపి,

క॥ వాని బలగముల నెటకున్, బోనీయక తఱిమిచంపి ♦ పొందికతో నా
ర్యానందనుకర మొందెను, నానాదివిజులు మునులు ఘ ♦ నంబుగఁ బొగడన్. 135

గీ॥ క్రౌంచుఁ బరికించి షణ్ముఖుం ♦ డంచితమగు, కరుణదొరయంగ నిట్లనె ♦ క్ష్మాధరేంద్ర!
నిరవశేషంబుగ నశించె ♦ నీ పగతుఁడు, బెగడుడిగి చేరఁజను సుఖం ♦ బుగ మనికికి.

వ. అనిన నతండు ప్రీతుండై దయాసముద్రుండగు పార్వతేయుని యనుగ్రహంబున కలరి మ్రొక్కి నిజధామంబుఁజేరె నంతలోన.

క॥ కుముదుఁడను నాదిశేషుని, కొమరుండు ప్రలంబదైత్య♦కుంజరుచేఁ బ్రా
ణములు పోలిపోవకుండుట, కమరశుభావహుని గెల్చి♦పాపహు గుహునిన్. 138

గీ॥ చేరి మ్రొక్కి జీవితవిషం♦జెప్పికొనియె, తండ్రి! నీయాజిఁబఱచి పా ♦ తాళబిలముఁ
జేరిన ప్రలంబదైత్యుండు♦తారకాను, చరుఁడు దలఁపడె నన్నుహింస♦సల్ప బూనర్ప.

క॥ దీనజనబాంధవుఁడ వ, న్యూనదయాసింధుఁడవు మ ♦ హోగ్రారాతి
ప్రాణశమనుఁడవు సాంప్రత, మీనను శరణార్తు మనుపు♦మీ కడపి రిపున్. 140

గీ॥ అనినయంతనె హరసూనుఁ♦డాత్మయందు, శివులనుదలంచి సరగున ♦ స్వీయశక్తి
నలప్రలంబాసురునిఁజంప♦నంపనదియు,సబలముగవానిఁదెగటార్చి♦స్కందుఁజేరె.

తరల. కుముదుఁ గన్గొని యంతఁబల్కెను ♦ గోపతిధ్వజపుత్త్రుఁడా
కుమతి దైత్యుఁడు గీటడంగెను ♦ గుందడంగెను నీవు త్రా
సముఁ దొలంగి గృహంబుఁ జేరుము ♦ సర్వరాజకుమార! నాఁ
బ్రమదమొంది యతండు చెందె బి ♦ రాన నాత్మనివాసమున్. 142

## —* కుమారస్వామి శివలింగస్థాపనము సేయుట *—

క॥ రక్షోవిశసనమొనరిన, యాక్షేత్రంబందు నమ్మ ♦ హాసేనుఁడు పా
పక్షయదములై యమరు మ, హోక్షధ్వజలింగములను ♦ నొప్పిన భక్తిన్. 143

గీ॥ స్థాపనము సేయఁగానెంచి♦సర్వదేవ, రాజి గొలువఁగ మంచిమూ♦ర్తంబునందు
శైవలింగచతుష్టయ♦స్థాపనంబు, చేసె నార్త్విజ్యమును మునుల్♦చెందియలర.

వ. ఆలింగచతుష్టయంబందలి లింగత్రయంబునకుఁ గ్రమంబుగఁ బ్రతిజ్ఞేశ్వరుండని యును, కపాలేశ్వరుండనియును, కుమారేశ్వరుండనియును; జయస్తంభోపకంఠ ప్రతిష్ఠితంబగు నాల్గవలింగంబునకు జయస్తంభేశ్వరుండనియును నామధేయంబు లర్పించి యర్చించె. హరిబ్రహ్మాది నిఖిల నిలింపప్రముఖులట్లె యచ్చోట శివలింగంబులఁ బ్రతిష్ఠించి పూజించిరని సూతుండు శౌనకాదిమునుల కిట్లనియె. 145

మత్తకోకిల : తారకక్రథనంబు శైలసు♦తాకుమారజయంబు మీ
ర్గోరినట్లుగఁ దెల్పితిన్ గడుఁ ♦ గూర్మి నెవ్వఁడు దీని వి
స్తారభక్తిఁ బఠించినన్ విన ♦ సంతసం బసదొందఁగా
భూరిభోగములొందు మోక్షముఁ ♦ బొందు నంతమునందునన్. 146

గీ॥ అనిన శౌనకముఖ్యులి ♦ ట్లనిరి సూత!, పరమవిజ్ఞానభాగ్యుండవై ♦ భవవిధాత!
గుహునిలీలల నింకను ♦ గొన్ని సెప్పు, మనినఁ బౌరాణికుం డిట్టు ♦ లనియెఁ బ్రీతి.

క॥ తారకసంహారంబిటుఁ, గూరిచి జయమొందియున్న ♦ గుహునిన్ గని బృం
దారకులందొలు మ్రొక్కి సు, ధారసమధురోక్తులొప్ప ♦ ధ్యానించిరిటుల్. 148

సీ॥ విశ్వమంగళునకు ♦ విశ్వబాంధవునకు, విశ్వభావనునకు ♦ విశ్వగతికి
తారకదైత్యహం ♦ తకునకు బాణాసు, రఘ్నునకును బ్రలం ♦ బఘ్నునకును
కల్యాణమూర్తి క ♦ కల్మషాకారున, కీశ్వరపుత్త్రున ♦ కిద్ధమతికి
దేవరక్షకునకు ♦ దేవరంజకునకు, దేవసేనానికి ♦ దివ్యకీర్తి 149

గీ॥ కఖిలలోకైకపతికి భ♦క్తాభిరతికి, నతులకరుణాసముద్రున ♦ కభయదునకు
వీరమౌళికి భంజిత ♦ విద్విషాళి, కంజలియొనర్చి మ్రొక్కెద ♦ మనవరతము.

ఉ॥ దేవ! విపత్సముద్రమునఁ♦దీఱనితీరున నంగలార్చుచు
మ్మావిటు లుద్ధరించితివిఁ ♦ కేమని నిన్ గొనియాడఁజెల్లు మా
కీవె హితుండ వీశ్వరుఁడ ♦ వీవె గురుండవు నీవె తల్లిదం
డ్రీవె మహాత్మ! జోతలివె ♦ యేలుము దీనజనావనక్షమా! 151

క॥ అని మ్రొక్కి యభినుతించిన, యనిమేషాధిపులకెల్ల ♦ నభినవవరముల్
ఘనకృపనొసంగి శివనం, దనుఁ డమితానంద మపుడొ ♦ నర్చెను బ్రీతిన్. 152

గీ॥ హిమగిరీంద్రుని సర్వగి ♦ రీశ్వరులను, గాంచి శైలంబులెల్లను ♦ గలుషహరము
లై తపస్సంశ్రియంబులై ♦ యలరుఁగాత, దాతయగుఁగాతనాతాత ♦ తాపసులకు.

వ. అనియిట్లండజకి వరంబులొసంగి యున్నంత హరిపురోగములు పార్వతేయునకుఁ గైలాసగమనయత్నంబు నివేదించి యమ్మహాత్ముండంగీకరించినంత మహోత్సవంబుతోడఁ బ్రయాణంబుచేసి.

## —* కుమారస్వామి దేవతలతోఁ గైలాసంబున కేగుట *—

గీ॥ పుష్పకారూఢుఁడైనశం♦భుతనయునకుహరియునుహిరణ్యగర్భుండు♦హర్ష మెసఁగఁ
చామరంబులు వట్టిరి ♦ జంభభేది, పట్టె ధవళాతపత్రంబుఁ ♦ బరమభక్తి. 155

క॥ గంధర్వులు స్వర్వేశ్యా, గంధద్విపయానలెల్లఁ ♦ గౌతుక మెసఁగన్
బంధనముల విడి చేసిరి, బంధురగానములఁ దాండ ♦ వంబుల లలిఁగాన్. 156

చ॥ అమరసమూహ మిట్లు పర ♦ మాదరపూర్వసుఖోపచారముల్
సమధికలీలఁ జేయఁగ వి♦శాఖుఁడు లేఖులతోడ రౌప్యభూ
ధ్రము వడిఁ జేరి తల్లికిని ♦ దండ్రికినిన్ బ్రణమిల్ల నప్పు వా
ర్కొమరునిఁ గ్రుచ్చి యెత్తి యుప♦గూహనముల్ బొనరించి రర్మిలిన్. 157

మ॥ విబుధవ్రాజియు రాజశేఖరునిఁ ద ♦ ద్దేవిన్ వెసన్ గాంచి భ
క్తివశోద్రేకముతోఁ దదంఘ్రులఁ దలల్ ♦ గీలించి సేవించి సం
స్తవముల్ చేసిరి పెక్కుభంగుల లస ♦ త్సాహిత్యసాహిత్యవై
భవభావస్ఫురితార్థకల్పనలు దీ ♦ వ్యద్భంగి శోభిల్లఁగాన్. 158

—* దేవతలు శివుని స్తుతించుట *—

సీ॥ తవిలి చితాభస్మ♦ధారియు శివుఁడునై, తనరు ధన్యునకు వం♦దనము లివియె
రూపయుక్తుఁడు విశ్వ♦రూపుఁ డరూపుఁడై, పరఁగుమాన్యున కభి♦వాదనమిదె
కర్తయు భర్తయు♦హర్తమై జగముల, నలరు విశ్వాత్మున ♦ కంజలులివె
స్థావరజంగమ♦సర్వాత్మమై యేని, కందని ధీరున♦కభినుతు లివె

గీ॥ శూలదండకృపాణహ♦స్తునకు నభయ, హస్తున కభీష్టవరదాన ♦ హస్తునకును
అభ్రిగంగాజటాలున ♦ కగ్ని నేత్రుఁ నకుఁ బొనర్చెదమిపుడు ప్ర♦ణామములివె.

క॥ నిరతము మమురక్షింపుము, పరమేశ్వర! సర్వలోక♦పాలక! శివ! నీ
చరణము లేమఱకుందుము, కరుణాకూపార! సర్వ ♦ కల్యాణకరా! 160

సీ॥ అమరులయందు బ్రి♦హ్మవు రుద్రులందును, నీలలోహితుఁడవు ♦ నీవు దేవ!
ఘనపర్వతములందుఁ♦గనకాద్రి వరయ న, క్షత్రిమండలిలోనఁ ♦ జందురుఁడవు
ఋషులలోన వశిష్ఠ ♦ ఋషివి దిక్పాలుర, యందు వాసవుఁడ వీ♦వనఘమూర్తి!
అఖిలభూతములలో ♦ నాత్మవు సాంఖ్యమ, తమునఁ బూరుషుఁడ వీ♦వమల తేజ

గీ॥ అధవ! నీ రూపకోటిసహ♦స్రములను, రూపకోటిశతంబుల ♦ నోపి పార
మొంద నేర్తుమె? లోకహి ♦ తోద్యమా! మ, హేశ! సర్వేశ! సకలని♦వేశ!యీశ!

—* దేవతలకు శివుఁడు వరంబు లిచ్చుట *—

గీ॥ నమ్రులై యిట్లు నుతియించు♦నాకచరుల, సర్వదేవేశ్వరుఁడుగాంచి♦సంతసమున
నిట్లుపల్కెదయాళుఁడై ♦యింపుగదుర, సజ్జనులకెందు సౌఖ్యంబు ♦ శాశ్వతంబు.

గీ॥ దుష్టులగువారిఁ బొలియింప ♦ శిష్టజనుల, రక్షణముసేయ ధర్మసం ♦ రక్షణంబు
సేయుటకుఁగాదె నేనిట్లు ♦ చెన్నలరుట, దివ్యులార! మహాతపో ♦ భవ్యులార!

క॥ మీకెపుడెప్పుడు బెడఁదలు, చేకూరిన నన్నుఁదలఁపు ♦ సేయుండపుడే
మీకష్టంబులు దీర్చెద, శ్రీకరసౌఖ్యంబు లెసఁగఁ ♦ జేసెదవేగన్. 164

గీ॥ అనిన నాపరమేశుద♦యకును సౌఖ్య
మునకు సంబరమునుజెంది ♦ మ్రొక్కి హరిము
ఖామరులు సెలవొంది త♦ద్ధామములకుఁ
బోయి సుఖముండి రెంతయు♦ హాయియనుర. 165

వ. పార్వతీపరమేశ్వరులు దేవసేనాగుహులతోఁ గైలాసాచలంబందు సుఖంబున
నున్నంత 166

## —* నారదుఁడు కుమారస్వామికి వల్లీ సౌందర్యమును జెప్పుట *—

ఉ॥ నారదుఁ డొక్కనాఁడు శివ ♦ నందనుఁ డిష్టులతో విహారకే
ళీరతుఁడై రహించు నెడ ♦ లీలఁ జేరి సమస్తలోకసం
చారమునందుఁ గాంచిన ప్ర ♦ శస్తతరాద్భుతవస్తువృత్తముల్
గూరిమిఁ జెప్పుచుండెఁ గడు ♦ కోర్కె మెయిన్ వినుచుండె స్కందుఁడున్. 167

ఆ॥ చాలసేపు చెప్పి ♦ జటిలుఁ డంతటఁ జెప్పె, వినుము శంభుతనయ ! ♦ విన్నవింతుఁ
గంటి నొక్కచోటఁ ♦ గన్నులపండువై, మనమునలరఁ జేయు ♦ మంచితొడవు.

క॥ భిల్లపురి నొక్కరుఁడు శో, భిల్లుచుఁ దనరారు సిరులఁ ♦ బృథ్వీస్థలిపై
భిల్లులకెకిమీఁడై స్తం, భిల్లఁగఁ జేయును జగంబు ♦ భీషణదృష్టిన్. 169

చ॥ శివుఁడను మౌనితల్లజుఁడు ♦ శ్రీదయితాంశుఁ డొకండు లోచనో
త్సవనవయౌవనన్ హరిణిఁ ♦ జక్కఁగఁ గాంచి భ్రమించి స్వీయపుం
బ్రవిమల వీర్యమున్ విడువ ♦ బాగుగ నద్ది గ్రహించి బాలికన్
నవనళికోమలన్ గని వ ♦ నంబునఁ బాసి చనెన్ యథేచ్ఛమై. 170

ఉ॥ మౌనియు వీర్యపాతమున ♦ మానసమందుఁ గలంతనొంది యెం
తేనియుఁ జింతసేయుచు నె ♦ ఱేఁజనె భిల్లవతంసుఁ డాస్థలిన్
మానుగఁ జేరి బాలను స ♦ మంచిత బాలశశాంకఫాల న
న్యూనగభస్తిజాలఁ గని ♦ యుత్సుకుఁడై గొనిపోయె నాదృతిన్. 171

గీ॥ ఇట్లు దోడ్కొనిచని తన ♦ యింతికొసఁగఁ, బెంచెగారాబమెసఁగ న ♦ మ్మించుఁబోఁడి
యిపుడు బాల్యదశను వీడె ♦ నించుమించు, గానఁ జెంగింతు వినుమ య ♦ క్కలికి తీరు.

గీ॥ కలికి పరిజనములపాలి ♦ కల్పవల్లి, సకలజనమోహనాతను ♦ చాపవల్లి
ఏసుకృతశక్తిధరునకో ♦ హృదయవల్లి, తన్వియాహ్వాయమరయు సౌం ♦ దర్యవల్లి.

ఆ॥ బాలమొడలిచాయ ♦ వసకోడి యుపరంజి, యప్పుచెంది స్వర్ణ ♦ మయ్యెఁ బుడమిఁ
దగినవారితోడఁ ♦ దగుఁగాక మచ్చరం, బధికులందు నొంద ♦ హానిగాదె. 174

సీ॥ తమ్ములో చివురుమొ ♦ త్తమ్ములో కోకన, దమ్ములో కొమ్మపా ♦ దమ్ములొక్కొ
నిమ్మలో చక్రవా ♦ కమ్ములో భర్మఘ, టమ్ములో కల్కికు ♦ చమ్ములొక్కొ?
అమ్ములో నీలోత్ప ♦ లమ్ములో చలశఫ, రమ్ములో చెల్వనే ♦ త్రమ్ములొక్కొ?
భమ్ములో నవమౌ ♦ క్తికమ్ములో మేలికుం, దమ్ములో నవలార ♦ దమ్ములొక్కొ?

గీ॥ నమ్మకములైననీలర ♦ త్నమ్ములో? ఘనమ్ములో? తుమ్మెదలో? చికు ♦ రమ్ములొక్కొ?
ఆ హిరణ్యోదరునకు శే ♦ షాహికేనిఁ, దరుణిరమణీయతను దెల్పఁ ♦ దరమె ధరణి.

క॥ కమలము కమలము శశిబిం, బము శశిబింబమె యరయస ♦ వతువచ్చునొకో
కమనీయకోమలంబగు, రమణీమణిమోముతో న♦రాతివిఘాతీ! 176

క॥ మంకెన మంకెన యాటల్, జంకెనసి విరిసెవరిష్ఠ ♦ జపయును విరిసెన్
సంకుమదగంధివాతెఱ, బింకపురుచికోడి కా్రించ ♦ భేదన వినుమా! 177

మ॥ తరుణీకైశికకృష్ణసంపదను జెం ♦ దన్ బర్హిభోగీంద్రముల్
చిరకాలం బటవీబిలస్థలులఁ దా ♦ ల్మిన్ దాపమున్ జెందఁ గా
ర్ష్ణ్యరమల్ గాంచెను దందశూక మిఁక నా ♦ ట్యాసక్తమ క్కేకి తాఁ
బొరయన్ జాలక కుండలీంద్రతతులన్ ♦ బొక్కన్ ధరామండలిన్. 178

గీ॥ ఘనమనిరి మేఘమును మొదల్ ♦ కాంతవేణి, కీడుగామికి నఘనమం ♦ చాడిరంత
నట్లుగానఘనాఘనం ♦ బనివెలసెను, ముదిరము దిరంబుగాఁగ న ♦ మోఘతేజ!

గీ॥ *అతను వైభవమున నొప్పు ♦ నాకెనుకుచ, కటితటులఁబోలలేకయ ♦ క్కసుననడుము
తానవంబొందెనందుకు ♦ దర్పిష్టలట్లు, కాదతను వైభవంబునే ♦ కాంచెనదియు.

గీ॥ అధిప! చందనగంధి దే ♦ హంబుసార, భమున కలరి ప్రచండ స ♦ ర్పములు చేరి
పాయకున్నవియే వేళఁ ♦ బణఁతియారు, వేణియనుదంభమునఁగడు ♦ వేడ్కమీఱ.

గీ॥ తావి చైతన్యమలరుకుం ♦ దనపుబొమ్మ, స్థైర్యమవయవములుగల్గు ♦ చపలయెపుడు
కుందునొందక యలరారు ♦ నిందురేఖ, అరయ నఖిలజగన్మోహ ♦ నాంగి రమణి.

సీ॥ చక్రవాకస్తని ♦ సారంగలోచన, భాసురశంకరా ♦ భరణవేణి
ఆభోగకటికి ♦ రణావళికంధర, సింహేంద్రమధ్యమ ♦ శ్రీశ్రుతిపుట
పున్నాగవరయాన ♦ మోహానవీక్షణ, నళినకాంతికపోల ♦ లలితహాస
కమలామనోహరి ♦ గారిమనోహరి, అలసరస్వతిమనో ♦ హరి లతాంగి

గీ॥ అమృతవాహినీవ్యాహార ♦ హంసనాద, కామవర్ధని ఘనరత్న ♦ కాంతి మలయ
మారుతసుగంధి కల్యాణి ♦ ధీరమూర్తి!, షణ్ముఖప్రియయగునిది ♦ చక్కనరయు.

గీ॥ రాజశేఖరతనయ!వి ♦ రాజిలెడును, గరమునీయందు వల్లిశ్రేం ♦ గార గరిమ
నీవచోమృత నిష్యంద ♦ నియతివల్లి, దేవికోమలాధరమందు ♦ దేజరిలెడు.

చ॥ కమలజుఁడొక్కనాఁడు కుతు ♦ కమ్మున సర్వసుదృక్సువృత్తభా
గ్యములను జెప్పుచున్ దొడరి ♦ కాంతతరాంగకవల్లి క్రౌంచభి
ద్రమణియగున్ జుమీ యనియె ♦ రాజకిరీటకుమార! మేటిసా
ఖ్యము మెయిఁ బల్కినాఁడ విను ♦ హర్వ్యగ నీకడ నింతవట్టునన్ 184

చ॥ అని యవియవ్వి కొన్నినుడు ♦ లట్టులె పల్కి మునీశ్వరుండు చ
య్యన నగజాకుమారకుని ♦ యానతిఁ గైకొని పోయె నిందుమం

---

* టిప్పణి:— అదియు — అతను వైభవమునే 1 (మన్మథ వైభవమునే) 2 విస్తార వైభవమునే నవిద్యతే తను (సూక్ష్మం) యస్మాత్తదతను - తస్య వైభవ మతను విగ్రహమున కాంచెను,

డనతనయుండు చిత్తమున ♦ నారదసూక్తుల నావటించి వ
ల్లిని సతిఁగాఁ గొనన్ బురుడు ♦ లేని తమిన్ గొనె నెంతయేనియున్. 185

—* నారదుఁడు భిల్లపురంబున కేగుట *—

క॥ కొన్నిదినంబుల కామునిఁ, సన్నుతుఁడు పుళిందపురముఁ ♦ జక్కనరిగి సం
పన్నిధి యగు భిల్లవరున్, గన్నంత నతండు ప్రమొక్కి ♦ గారవమొప్పన్. 186

గీ॥ తేనియను జారపప్పును ♦ దీయనిపలు, ఫలములను బూవులను దెచ్చి ♦ భక్తితోడ
నిచ్చి సేవించి నిలిచిన ♦ మెఱుకఱేనిఁ, గాంచిహర్షించియనియె ని ♦ క్కారణిమౌని.

ఉ॥ సేమమె నీకు నీసతికిఁ ♦ జెల్వగు నీసుతమైన వల్లి కా
తామరసోద్భవుండు నిను ♦ ధన్యునిఁజేయు తలంపుతోడ నీ
శ్రీమతి నీకు బుత్రికను ♦ జేసెఁ బ్రియంబుగ వ్యాధనాథ! మి
మ్మీమె భవాంబురాశిఁ దరి ♦ యింపఁగఁ జేయును నమ్ము నా నుడిన్. 188

గీ॥ అనినయంత నెఱుకభిల్లుఁ ♦ డాత్మసుతను, దెచ్చిమౌనికి మ్రొక్కించి ♦ యిచ్చమెఱయఁ
బేర్మిఁదనతోడఁగూర్చుండఁ ♦ బెట్టుకొని ము,నీంద్రునకు నిట్టులనియె నెం ♦ తేనిఁబ్రీతి.

క॥ దేవర! నాసుతకు మగం, డేవాఁ డెట్టిండగునొకో ♦ వెఱఁగింపుము పెం
డ్లేవేళ యగునొ మీనుడి, యీ వేదము వగిది సత్య ♦ మందురు గఱువల్.

—* నారదుఁడు వల్లికి కుమారస్వామి భర్తయగు నని చెప్పుట *—

వ. అనిన నారదమునీంద్రుం డిట్లనియె.

చ॥ శివునకు గట్టురాసుతకుఁ ♦ జెల్వగునందనుఁ డాదితేయసై
న్యవిభుఁడు తారకాసురని ♦ హంత ప్రలంబవిఘాతి బాణదై
త్యవధకరుండు క్రౌంచగిరి ♦ దారణుఁ డాఢ్యుఁడు కార్తికేయుఁ డీ
లవల్లిని రాణిగాఁ గొనఁగ ♦ లండు దృఢంబు వనేచరాగ్రణీ! 191

క॥ పూర్వజనినుండె వీరల, కిర్వురకుఁ బరస్పరేచ్ఛ ♦ యెలరినదాఁటన్
శర్వకుమారుండే యీ, పర్వేందుముఖిన్ వరించుఁ ♦ బరమప్రీతిన్. 192

వ. వివాహంబు నచిరకాలంబులోనగునని యమ్ముని యథేచ్ఛన్ జనియెనంత సౌం
దర్యవల్లియు నుల్లంబున నుల్లసిల్లి పరమేశ్వరకుమారలీలల నభినందింపుచుఁ
దత్పాణిగ్రహణంబునకై నిరీక్షించుచుండె నంత నొక్కనాఁడు. 193

క॥ నారదముని చెప్పినటుల్, నీరజముఖి వల్లి రామ ♦ ణీయకతను జే
తోరాజీవంబునఁ గడు, ధారణయొనరించి క్రౌంచ ♦ దారణుఁడు దమిన్.

క॥ సింగారమునకు నిధియఁట!, రంగారు వనేచరాధి ♦ రాట్సుతయఁట! నా
కుం గేహిని యగునని చక్రాంగశతాంగుండు చెప్పె ♦ నఁట దన సుతుతోన్.

క॥ కావున నే నా వల్లిని, దేవిఁ గాఁ గొనక యున్నఁ ♦ దేజగలదొకో ?
యేవిధముగనైనను వల్లీవనజేక్షణను బెండి ♦ లిఁ జేకొనెదన్. 196

— * కుమారస్వామి భిల్లయువకరూపముతో వల్లిఁ జేరవచ్చుట * —

క॥ అని యొక నిషాదరాణ్ణం,దనురూపముఁ జెంది భిల్ల♦తల్లజు పురికిఁ
జని యటఁ బ్రియంగువనిఁ గాఁ,పునొనర్చెడు వల్లిఁగాంచి ♦ భూరిప్రీతిన్. 197
చ॥ స్తుతియనుకొంటి నారదుఁడు ♦ చోద్యముగా వచియించినట్టి యీ
యతులితమోహనాంగివిధ ♦ మాతఁడు సెప్పినదింతచాల దీ
సతిరుచిరాంగకంబులకు ♦ సాటియొకం డిల లేదు నిక్క మీ
క్షితిఁ బరమేష్ఠిసృష్టి కిది ♦ సేయు నపూర్వపు గర్వసంపదన్. 198
ఉ॥ ఇంచుక దవ్వులఁ నిలిచి ♦ యిట్లు మదిఁ దలపోసి యంతనే
మించుపసిండిబొమ్మ యగు ♦ మీనవిలోచన చెంతకేగి మో
హించి యిటుల్ వచించె రమ♦ణీ! నినుగోరి భవత్పురం బిటుల్
కొంచక యేగుదెంచితిని ♦ గోమలి ! ప్రేముడిఁజూపునాపయిన్. 199
సీ॥ మీలపైఁ గ్రొందమ్మి ♦ మాలపై వశీకార, మును జేయఁజూచు నీ♦కనులజంట
చెండ్లపై బంగరు ♦ గిండ్లపై దొరతనం, బొనరింప నిగుడు నీ ♦ స్తనయుగంబు
తేంట్లపైన మ్మొగుల్ ♦ దాట్లపై రాచరి, కముసేయ మీఱు నీ♦కచచయంబు
చివురులపై మేల్మి ♦ పవడాలపై నేలు, బడిసేయనడచు నీ ♦ పదయుగంబు
గీ॥ భువనములగల నందంపు ♦ పూవుబోండ్లఁ, బాలనంబొనర్పఁగాఁ♦జాలియున్న
దాన విం దరవిందని♦భాననా! భ, వజ్జనువునకిదే స్వస్తి ♦ వాచనంబు. 200
ఉ॥ రాజవతంసనందనుఁడ ♦ రాజముఖీ ! నిను భార్యగా వచో
రాజువిధించె నాకు రతి♦రాజు మఱిఁ ద్వరపెట్టుచుండె నీ
రాజదుదారభావము వి♦రాజిలఁగా వరియింపు నన్ హారి
ద్రాజియు నీవెలుంగు దిన♦రాజముఖుల్ గురుతింప నింపుగన్. 201
క॥ కలికీ! వలపులచిలుకల,కొలికీ! వలరాచవాని ♦ గొనబౌ లేఁబూ
ములికీ! చలమూనక నా, పలు కీడేర్పఁ దలంపు ♦ పద్మదళాక్షీ ! 202
క॥ అనుమానింపక మచ్చికఁ, గొనుమా! నా నుడిని మిగుల ♦ గుణవంతముగాఁ
గనుమా! వినుమా! నిను మా, నిని! మాన్యతఁ జేకొనెదను♦నిక్కంబుసుమా!
క॥ లేమావివిరులతూపుల, లేమా! మన మెదిరి గెలువ ♦ లేమా ర్తిఁబడన్
లేమామరునేలఁగ నా, లేమాకుల జొంపములఁ గ♦లియఁగన్గొనుమా ! 204
క॥ అను కృతకభిల్లపతిసుతుఁ, గని దిగ్గునలేచి బ్రమసి ♦ కౌతుకమున ని
ట్లని తన మనమున యోజిం, చెను వల్లి నితాంతవిమల♦శీలముతోడన్. 205
క॥ నారదముని చెప్పిన సోం, పారయ నీ తరుణపురుషు♦సం దొప్పెడు మేల్
కూరిమి నామది కీతని, పై రంజిల్లెడు నితండె ♦ భర్గసుతుఁడొకో ! 206

క॥ ఏమైనను నిటుఁ జెప్పెద, నామీఁదన్ దెలియవచ్చు ♦ నని వల్లియుఁ దా
నామోదంబున ననె ద్రా, క్షామధురిమధరవచఃప్ర♦సాదం బమరన్. 207

గీ॥ కన్నియను వలిదండ్రులు♦గలరు భిల్ల, దంపతులు నాకు నదిగాక♦తరుణరాజ
భూషణకుమారు నాత్మవి♦భునిగఁ గోరి, యర్పణముచేసితిని హృద♦యంబుతనకు:

వ. కావునఁ గరుణించి మన్నింపుఁ డనుటయు.

తరల॥ అనినయంతనె యక్కుమారకుఁ ♦ డాత్మరూపముఁ జూపి మా
నిని! యిఁకన్ వరియింపుమీ నను ♦ నేస్తమొప్పఁగ నీస్థలిన్
వనజబాణునియప్పఁ దీర్చెద ♦ వాస్తవంబుగ నిష్టనా
వనజలోచన! పొంగిమ్రొక్కె న♦వార్యహర్ష వికాసయై. 208

## —*భిల్లుఁడు వల్లిని గృహంబునకుఁ గొనిపోవుట *—

వ. అంత మధ్యాహ్నకాలంబగుట నప్పుళిందేశ్వరుండు నిజకుమారీసందర్శనత్వరాయమాణమానసుండై పరిచారకవ్రజంబులతో నచ్చటికివచ్చుటం గాంచి శక్తిధరు డొక్కసహకారకుజంబై నిలిచియుండ భిల్లుండుచేరి యద్దానినలవోక నవలోకింపక కూఁతునుపలాలించి మధురఫలంబులిచ్చి తోడనబ్బాలికన్ దోడ్కొని నిజనివేశనంబునకుఁబోయె నంత షణ్ముఖుండు. 210

చ॥ తొలుతటిమాఱె కన్నియను ♦ దొందరసేయఁగఁ గూడ దంచు ని
మ్మలఁ జెలిమిన్ బొనర్చి మదిఁ ♦ బొందికఁగూరిచి తన్విఁ జేకొనన్
వలయునటంచు నెంచఁగ న ♦ వాంతర మిట్లొనఁగూడె నెట్టిఁకన్
గలికినిఁ జేకొనన్ గలను ♦ గట్టిఁడిదైవమ! చెట్టఁగూర్చితే ! 211

సీ॥ రంగారుచనుకట్టు ♦ రాణకుబ్బితిఁగాని, చెలినొక్కమా ఱక్కుఁ ♦ జేర్పనైతి
చందురుకావిమో ♦ విందివిరితిఁగాని, కొసరితీయనితేనెఁ ♦ గ్రోలనైతి
శ్రీమించు నగుమోము♦సిరికిఁబొంగితిఁగాని, గోర్కులూరఁగముద్దుఁ♦గొనఁగనైతి
ఘనమైన జఘనంబు♦గరిమ మెచ్చితిఁగాని, తొడఁజేర్చి లాలింపఁ♦దొడరనైతి

గీ॥ ఘుమఘుమంఘుమఘుంఘుమల్ ♦ గుప్పు సురభి
శాంగలతికను గన్గొని ♦ యాసపడితిఁ
గాని రయమున బిగ్గరఁ ♦ గాగిలింప
నైతి ననభిజ్ఞహృదయుఁడ ♦ నైతి నకట !

ఆ॥ కొఱ్ఱచేను నాకుఁ ♦ గొఱ్ఱుచేనయ్యె నిం, దేమిదలఁపఁగలుగు ♦ నేమిలాభ
మనుచు సాంధ్యవేళ♦యగునంతవఱకటఁ, గడపి తత్పురాంతి ♦ కమునుజేరి.

క॥ ఒక పద్మాకరనికటమ, చకితుండై చేరి నిలిచి ♦ సమయదిదృక్షా
త్మకుఁడై యుండుడు జైవా, తృకముఖి వల్లియు నితాంత ♦ దీనతతోడన్. 214

## —✽ సౌందర్యవల్లీ విరహము ✽—

సీ॥ అవధూతమై పృథ్వి ♦ యంతఁ గ్రుమ్మరువేల్పు, జడదారి యేటికి ♦ చ్చటికి వచ్చె!
వచ్చిన నామాట ♦ హెచ్చరించి గుహుండు, పతియగునం చేల ♦ పదిరిపలికె!
పలికినప్పటికి నా ♦ భావ మాయనఘుపై, ననురాగభరమేల ♦ యలముకొనియె!
అనురాగవతినైన ♦ నమ్మహాత్ముఁడు గని, కరమెంచి యిటకేల ♦ కదలివచ్చె!
ఆ॥ వచ్చి తన్నుఁదెలిపి ♦ ముచ్చటించినయంత, జనకుఁడరుఁగుదెంచి ♦ చనవుమీఱ
మందిరంబు నన్నుఁ ♦ జెందింపు టదియేల?, దైవ మేల తప్పఁ ♦ దలచె నిట్లు?
సీ॥ నను శేరఁదమిమీఱ ♦ మననూర నిటుదార, సిలికోర విభునియా ♦ జింపనైతి
తనరూపుఁజూపిచే ♦ కొననోపియున్నయ, న్నవమోహానునికృపఁ ♦ గాంచనైతి
లలితవీక్షాప్రియా ♦ లాపాక్షరములఁజే, తమలర్పఁ బ్రణయంబుఁ ♦ దలఁపనైతి
తేపతేపకునొక్క ♦ తీరుమీఱెదుమారు, నేలుదమన్నప ♦ ల్కులుఁగనైతి
గీ॥ మృగమదంబుజవాదిఁగే ♦ దఁగివిసులను, దేనెసహకారఫలములం ♦ దెచ్చియిచ్చి
వరపుడంబొనరింపఁగఁ ♦ బరఁగనైతిఁ, బ్రదపకులోనైతి శ్రీకిట్లు ♦ దవులఁబడితి.
క॥ తండిరియిలుఁజేర్పఁగ రా, నుండెదనిటఁ గొంతతడవిఁ ♦ కుగ్రాతపము
ద్దండసమయమిది రానని, యుండక వచ్చితిని విధికి ♦ నోడితినిట్టుల్. 217
ఆ॥ అలుకఁజెందెనొక్కొ! ♦ యాడిపోసెనొకో! మ, నసున విసిగెనొక్కొ! ♦ నమ్మకంబు
బాసెనొక్కొ! మరలఁ ♦ బయనమై హరుగిరి, కేగెనొక్కొ! కాంతుఁ ♦ డేమిసేతుఁ.
వ. అట్లు నిజావాసంబుఁ జేరఁబోవక యనుగ్రహించి యుండే యుండునెడల. 219
సీ॥ దిగనాడిచనెనంచు ♦ బెగడొందియున్నా, కాంతుని జేరఁగాఁ ♦ గలుదునొక్కొ
సత్కారమొక్కింత ♦ సల్పలేదనువాదు, దొలఁగనావిభుఁజేరి ♦ కొలతునొక్కొ
నవరత్నహారంబు ♦ నాథునరుతనేసి, మొనలేనిహారుసంబుఁ ♦ గొనెదనొక్కొ
వల్లభుతోడ జీ ♦ వనకేళి వనకేళి, కోర్కులుదీరఁజే ♦ కొందునొక్కొ
గీ॥ తల్లిదండ్రులుబంధు లు ♦ దారహర్ష, పారవశ్యంబు నొందఁగా ♦ బ్రాణదయితు
పార్వతీశివతనయుని ♦ బడసిపెండ్లి, యాడగాఁగల నొక్కొ శ్రే ♦ యమగునొక్కొ.
ఉ॥ దాయనుబోలెఁ బాసితిగ ♦ దా యను వేఱొకమాట దోఁచలే
దాయను నందె యుండవల ♦ దాయను బూవిలుకాఁడ! నీకు వా
డాయను గన్నె నేచబిరు ♦ దాయను నేరికి నిప్పు జాలిగా
దాయను నాదు భాగ్యముగ ♦ దా యను వేఁగుచు వెక్కసంబునన్. 221
ఉ॥ దైవమ! మేలుసేఁత తగ ♦ దాతగ దాఁకొనఁజేయు నాథు న
న్నీవిటుఁ గుందఁజేయఁదగు ♦ నే తగు నేర మదేమిచెప్పు? మిం
కే వడుపొప్ప వంత నల ♦ యించిన మెంచనె రానివేసటఁ
బోవిడుదానఁ బ్రాణములఁ ♦ బూనికఁబూని కరంబు చెచ్చెరన్. 222

గీ॥ అనుచు నెనలేని విరహార్తి ♦ నాత్మఁ బొగులు
చున్న యన్నులమిన్న మ♦హోహాన్నతంపు
టార్తిఁ గన్గొని నెయ్యంపు ♦ టతివ లపుడు
వగచి రెంతేనిఁ దోఁచక ♦ వనటమీఱి. 223

—* చెలిమికత్తె వల్లిఁ గొనిపోయి కొమరుసామి కప్పగించుట *—

ఆ॥ చతురమతియనాఁ బ్రి♦శస్తివహించిన, పణఁతియొకతె దా ను♦పహ్వారంబు
నరసి వల్లిహృదయ♦మరసి యుత్తలపాటె,తెంగి యిట్టులనియెఁ ♦ బ్రియముమీఱ.

ఉ॥ చక్కెరబొమ్మ! యేల ? యిటు ♦ జాలిమునుంగఁగ నేనపోయియా
చక్కనివాని నిచ్చటికిఁ ♦ జక్కఁగఁ దెచ్చెదఁ గాకయున్నచో
నక్కడి జాడగాంచి నిను ♦ నచ్చొటికే కొనిపోదు నేఁడు నీ
యక్కఱఁదీర్తు నెట్లయిన ♦ నమ్మరొ ! యుమ్మలికమ్ముఁ బాయుమా! 225

క॥ నిను బెండ్లాడఁగ వచ్చిన, ఘనుఁ డప్పుడె చనఁడు దనయ ♦ గారంబున కిం
దు నెకొనిఁ బొంచియుండెడు, వనజేక్షణ ! వాని వెదకి ♦ వచ్చెద వేగన్. 226

గీ॥ అనిపలుకు కల్కియాదర ♦ మరసివల్లి, యొక్క తామరపాకు నం♦దొక్క హృద్య
పద్యములిఖించి బాష్పంబు ♦ పడగనీక, గద్గదస్వరమొప్పని ♦ క్కరణిఁజదివె.

సీ॥ క్షమియింపుమనిన దో ♦ సంబేలచేసితి, వనుటకు బదులేమి ♦ యనఁగవలయు
స్వామివి మామక ♦ సర్వంబునకుననాఁ, బునరుక్తిఁ బలికెదే ♦ యనుటకెటులు
ఆర్తరక్షాశాలి ♦ వారయుమందునా, అరసిరా నెఱిఁగితే ♦ యనిననేమి
సైపఁబాలను జాగు♦చతుర! యందున వట్టి, యదయుగఁదలఁచెదే♦యనుటకెట్లు

గీ॥ ఏమనిననేమితప్పౌనో ♦ యెఱుఁగఁజాల, నన్నియు నెఱుంగుపోఁడిమీ♦వనఘచరిత!
నీదుదయ నాదుభాగ్యంబు ♦ వాదిఁ కేల, తరుణకమనీయరాజమూ♦ర్ధన్యతనయ!

వ. అట్లు చదువసంతసించి లేఖన్ బుచ్చికొని యాప్రాతివేశిని వల్లియుల్లంబు చల్లనగునట్లు పలికి కార్యంబు సమకూర్చెదనని యభయంబొసంగి చని పరిసరస్థలంబుల వెదకి యొక తమ్మికొలనుకెలనఁగూర్చుండియున్న యన్నూతనతరుణసుందరమూర్తిఁ గాంచి లక్షణంబులఁబరికించి గుహుండని నిరూపించి సంతసించి యల్లనల్లనడాయన్ జని ప్రహ్వీభూతయై జోహారుచేసి తన్నుఁదాఁదెలిపికొని వనచరేశ్వరుండు ప్రియంగువనినుండి వల్లిన్ దోడ్కొనిచనినది మొదలు వల్లీదేవి తనకై యుమ్మరమ్మగు నాయల్లకభరమ్ము నొంది మదనుని బెదరింపులకదరి యుదిలకొనుచున్న యుదంతంబంతయుఁ జదువుగ నెఱింగించి యాయదనువల్లిని గాంచు భారము తనయదియని మృదులోక్తి విన్నవించి యాకెపంచిన వలపులేఖనర్పించి నంతఁ జదివికొని యారసి యారసికాగ్రేసరుండు మురిసి వేవేగనాపూపుఁబోఁడిన్ దోడ్తోనిరమ్ము పొమ్మనిన నబ్భిల్లపల్లవాధరి వల్లిన్ జేరి స్కందునివిధంబంతయు నెఱింగించి రహస్యంబుగ నక్కన్నెమిన్నన్ దోడ్కొనివచ్చి యమ్మహాసేను

నకు సమర్పించి యీహారొన్నుతీవ, నీధనంబు దీని పూపపసిదాని నెల్లకాలంబెర్గ
జెంది దయతో నేలుకొమ్మను కొమ్మ చెలికారంబునకును జతురోక్తిమార్దవంబు
నకు నలరి యుమాసుతుం డిట్లనియె. 229

గీ॥ ఇందుముఖ ! యెంతదానవీ♦విట్లుచెప్ప, వలెనె యనభిజ్ఞుఁడనె పలు♦పలుకులేల !
అణిముత్యాలపేరునా♦యఱుత నీదు, చెలియ సత మింక దీనికై ♦ చింతవలదు.

వ. అనినంత శర్వరియగుటయు:

గీ॥ కాలపూరుషుఁడైంద్రదిక్కన్యయఱుత బంగరపుతాళిఁగట్టిన♦పగిదినిండు
చందురుండొప్పె నందందు♦సంతరించి, సట్టినగలరవలనఁదా♦రాళియమరె. 231

## —* కుమారస్వామి వల్లీదేవితోఁ గ్రీడించుట *—

గీ॥ అంతనామాతియిదె వత్తునని పురంబు, జేరె నిర్భీతితోడఁ గు♦మారుఁడపుడు
వల్లి నెదఁజేర్చి కామోత్స♦వమును దొడరె, వికచకైరవగంధముల్♦వెల్లివిసర.

మత్తకోకిల॥ మత్తకోకిల మంజువాదస ♦ మార్భటుల్ శుకశారికా
చిత్తమోహన గానముల్ మధు ♦ సీధుదర్పిత పుష్పవిట్
సత్తమధ్వను లింపుమీఱఁ బ్ర ♦ శస్తవాద్యములై తగన్
మత్తకాశిని వల్లిఁ దేర్చె ను ♦ మాకుమారుఁడు క్రీడలన్. 233

వ. అనంతరంబు ప్రభాతంబగుటయు.

క॥ వల్లిఁగానక యాబిడ, తల్లి గృహంబంత వెతకి ♦ దైన్యముతోఁ ద
ద్వల్లభునితోడఁ జెప్పడు, భిల్లాధ్యక్షుఁడు విపక్ష ♦ భీమఁడు వడిగా. 234

శా॥ ఘోరాకారుల దుర్విచారుల మహా ♦ క్రోధైకసంరంభులన్
నీరంధ్రాభ్రసమానవర్ణుల మదాం ♦ ధీభూతచేతస్కులన్
కైరాతాన్వయముఖ్యులన్ గొని దెసల్ ♦ గాలింపుచున్ వచ్చికాం
తారంబందొకచోటఁ గాంచె లవలీ ♦ నాళీకనేత్రిన్ గుహున్. 235

చ॥ కనిఘనమైన కిన్కఁగొని ♦ కాండములన్విలుఁగూర్చి యోరి ! నా
తనయను మోసగించియిటు ♦ తస్కరణంబొనరించితౌర ! నీ
తనువిదెకూల్తుఁజూడుమని ♦ దారుణభంగిశరమ్ము లేయఁగా
ననుచరులున్ జెలంగి వివి ♦ ధాయుధధారల మోఁదిరాతనిన్. 236

చ॥ వనలెదఁ దాఁకినట్లు వెస ♦ నారసముల్ వివిధాయుధంబులున్
దనువునఁదాఁక షణ్ముఖుఁడు ♦ తన్వికి ధైర్యముఁజెప్పి యాపె నె
మ్మనమును గందకుండ వన ♦ మానమహామహిమాస్పదంబు మో
హనశరమేసి యార్చె శబ ♦ రావళిపైఁ గనుమూసిరందఱున్. 237

మ॥ ఒకయామంబున కాకిరాతకులు ద ♦ ర్పోద్రేకముల్ దక్కియు
త్సుకతన్ జొవిడి నీల్గుచున్ బొరలుచున్ ♦ దూఁగాడుచున్ లేచుచున్

వికలాకారతనున్న వారలకు మే ♦ ల్విజ్ఞాన భావంబుఁ గా
ర్చి కటాక్షించె గుహుండు భిల్లులును సం ♦ ప్రీతాత్ములై యత్తఱిన్. 238

—* భిల్లులు వల్లిఁ గుమారునకిచ్చి పెండ్లిచేసి యంపుట *—

చ॥ గుహునిఁ గ నాత్మలోఁ దెలిసి ♦ కొంకుచుఁ జేరి నమస్కరించి వే
బహుతరరత్నరాజిఁ బరి ♦ బర్హముగా నిడి వల్లి దేవి కేల్
గుహునికరంబునందునిచి ♦ కూరిమిఁ బెండిలిచేసి దేవ ! మా
యహితవిధానమున్ సయిపు ♦ మంచు వచించిరి మ్రొక్కి తీరుగన్. 239

ఆ॥ అంతఁ బార్వతేయుఁ ♦ డవ్వారల ననుగ్రహించి వల్లితోడ ♦ నిమ్ముఁ జేరి
దేవసేనకడకుఁ ♦ దెల్వి మెచ్చ నిమ్మొక్కు, మనుచు వల్లి నంపె ♦ నాప్తప్రీతి.

క॥ చని దేవసేనకెఱిఁగి ద, యనుఁ బ్రోవుము నీవు దాసి ♦ నమ్మ ! యనుడుఁ జ
య్యన సర్వమెఱిఁగి యా పెయు, ననురాగమెసంగ వల్లి ♦ నక్కునఁ జేర్చెన్.

—* పార్వతీశ్వరులు దేవసేనయు వల్లిఁ జూచి యానందించుట *—

గీ॥ షణ్ముఖుండు పురందర ♦ జాతకెలమి, వల్లి దెఱఁగెఱిఁగించి యం ♦ బామహేశ్వ
రులకు వల్లియుఁ దాఁ జోత ♦ సలిపి వారి, యనుమతి వసించెఁ బత్నిద్వ ♦ యంబుతోడ

క॥ ఈ కొమరుసామిచరితముఁ, జోకఁగఁ జదివిన వినినను ♦ జొప్పడు శుభముల్
సేకూరు వైభవంబులు, శ్రీకరవిఖ్యాతి చేరుఁ ♦ జింతలు దీఱున్. 243

వ. అనవుడు సూతునకు మునీంద్రు లిట్లనిరి.

క॥ సంబరమొందితి మిఁక హే, రంబుని చరితంబుఁ జెప్పి ♦ రమ్యోక్తుల డెం
దంబందలి కొఱతను దీ, ర్పంబూనుము సూత ! పరమ ♦ పావనచరితా !

వ. అనుటయు.

ఉ॥ విశ్వజనాభివంద్యపద ♦ వీపరిశోభితమూర్తి ! సిద్ధమ
ల్లేశ్వరలింగపాలితమ ♦ హీతలశోభిత శైవపూర్భవా !
శశ్వదుమాశివాంఘ్రిజల ♦ జభ్రమరాయితచిత్త ! వీరభ
ద్రేశ్వరసాధ్వి ! సద్వినుత ♦ హృద్యచరిత్ర ! పవిత్ర ! లక్ష్మమా ! 245

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి కుమారఖండంబున
ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## కుమార ఖండము.

### తృతీయాశ్వాసము.



పతిపండితవంశా
కూపారసుధాంశుతర్క ♦ కోవిదవరగో
ష్ఠీపత్యంబయబుధభా
వా! పాపాంబానుజాత! ♦ భవ్యచరిత్రా!

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

—♦ పార్వతీదేవి గణపతిని సృష్టించి ద్వారమందుంచుట ♦—

చ॥ ఒకదినమందు హైమవతి ♦ యొద్ద జయావిజయల్ వినోదకే
ళికలితసుప్రసంగముల ♦ లీలగ నిట్లని రక్క! యొక్క పొం
దికనుడి విన్ము ద్వారమున ♦ నెక్కొను కింకరులెల్ల నీదు నా
యకవశవర్తు లొక్కభటుఁ ♦ డైననులేఁ డిట నస్మదీయుఁడై. 2

చ॥ శివునివశంబునన్ గలుగు ♦ చేటకులెల్లరు నస్మదీయులే
శివ! యయినన్ మనంబలరి ♦ చేరదు వారల నీయనుజ్ఞచొ
ప్పవహితవృత్తి ద్వారతల ♦ మందొక దక్షుఁడుండెనేని వై
భవము గదా గదా జెలఁగు ♦ భావమునందుఁ బ్రమోదమేర్పడున్. 3

క॥ కావున నొక్క సమర్థుని, శ్రీవెలయ సృజించి ద్వార♦సీమ నునిచినన్
సేవించునతఁడు జాగర, భావముతో నీదు సెలవు ♦ పరమేశానీ! 4

క॥ అనుడు మనోహరమై నుడి, కనుపడఁగా నలరి యపుడు ♦ కాళిక యటులే
యొనరించెదనని వారల, కనె నంతటఁ గొన్ని యహము ♦ లరిగినమీఁదన్. 5

సీ॥ అఖిలజగదంబ మజ్జనం ♦ బాడుచుండ, ఖండశశిమౌళి నందిని ♦ గదిమి వేగ
లోనికేతేరఁగాఁ జూచి ♦ లోకజనని, లజ్జితాత్మయై లేచి త ♦ లంచె నిట్లు. 6

క॥ చెలులాడినవచనము గదు, ఫలవంతం బట్లుసేత ♦ భావ్యం బౌఁదేఁ
బలవంతుండు మదీయుఁడు, గలఁడేఁ ద్వారమున నిట్టి ♦ కష్టం బెటులౌ. 7

క॥ భాసితబలవిక్రము గుణ, భాసురు నొక్కని సృజించి ♦ వాకిటనుంచన్
నాసెలవు గీటుదాఁటక, దాసుండై యెప్పుడునాదు ♦ ద్వారముఁగాచున్. 8

గీ॥ అనితలఁచి యొక్కనాఁటియ♦హమున జలక, మాడ నుద్వర్తనముచేసి♦నట్టిమకిల
చేత నొకబాలు నిర్మించె ♦ నాతతబలు, సర్వలక్షణసంయుతుఁ♦జారుగాత్రు. 9

చ॥ అమలహిరణ్యవస్త్రముల ♦ నచ్ఛతరోన్నతరత్నభూషలన్
హిమగిరిజాత పుత్త్రకున ♦ కిచ్చి చిరాయువుగమ్మటంచు ను
త్తమముగ దీవెనల్ సలిపి ♦ తల్లిని నేను సుతుండవీవు పే
ర్మమున మదాజ్ఞవర్తిలు కు ♦ మారక! యంచువచింప నాతఁడున్. 10

క॥ జననీపదవనజములకు, ఘనభక్తినమస్కరించి ♦ కడునమ్రుండై
జనుఁడీతఁ డేమిసేయన్, జనుఁజెప్పుము తల్లి! యనిన ♦ శైలజ వేగన్. 11

క॥ నాదు గృహద్వారంబున, సాదరమతినుండు మెప్పు ♦ డవధానముతో
నాదుసెలవొంద కేరిని, నీదృష్టిఁ మీఱనీకు ♦ నిపుణమనీషా! 12

చ॥ అని దృఢమైనయష్టినొకఁ ♦ డాతనికిచ్చి హిమాద్రిజాత నం
దనురుచిరంపు నెమ్మొగము ♦ నన్ దనివారఁగ ముద్దులాడి య
క్కునఁగొని కౌఁగిలించి కడుఁ ♦ గూర్మియొసంగఁగ నిల్చె వాకిటన్
గొనబుగనాతఁ డుండె నవి ♦ కుంఠితవైఖరి యష్టిపాణియై. 13

—✱ గణపతి ద్వారమందు శివునడ్డగించుట ✱—

ఉ॥ అంతఁ ద్రిలోకమాత గృహ ♦ మందు యథేచ్ఛ జలంబులాడుచు
న్నంత శివుండు దారసిలి ♦ యాలయ మేఁగఁగ రా గణేశుఁడా
యంతకహంత నారయక ♦ యడ్డమువచ్చి మహాత్మ! మందిరా
భ్యంతరమందు మజ్జనము ♦ నాడుచునున్నది మాత యీతటిన్. 14

క॥ ఆయమసెలవున్ గొనకయె, డాయఁగఁ బోరాదటను దృ♦ఢంబిదియాటన్
వేయరుగు మరలి వెలుపలి, కీయదనున ననుడు రుద్రుఁ♦డిట్లనిపలికెన్. 15

క॥ ఎవరని మరలించెదవీ, వవినయగతి మూఢబుద్ధి! ♦ యజ్ఞానమునన్
శివుఁడ నని దాఁటుచుండఁగఁ, గవిసి గణేశుండు మోఁదె♦ఘనతరయష్టిన్. 16

వ. అంత

క॥ కినుకఁగొని శివుఁడు మూర్ఖుఁడ!, ననునెఱుఁగక మోఁదితీవు ♦ నాథుఁడ నాయి
మ్మున కేగుచుండ నిటు వల, దని రోధించెద విదేమ ♦ హంకారమునన్. 17

క॥ అని తిరిగిపోవుచుండఁగఁ, గని గణపతి దండధారుఁ ♦ గఠినముగా బాఁ
దిన నొచ్చి శంకరుఁడు ప్రమ, థనికరమునుజూచి పలికె ♦ దర్పోద్ధతుఁడై. 18

—* శివుఁడు ప్రమథులను గణపతిపైకిఁ బంపుట *—

చ॥ ఎవ్వఁడొ వీఁడు మూర్ఖుఁ డొక ♦ యించుక జ్ఞానములేక ద్వారమం
దివ్విధిఁ గ్రొవ్వునన్ నిలిచి ♦ యెంతయు మీఱుచునున్నవాఁడు మీర్
చివ్వున నారయుం డనుచుఁ ♦ జెప్పి శివుండు బహిస్స్థలంబునన్
దవ్వున నిల్పియుండెఁ బ్రమ♦థప్రవరుల్ గడుఁ గ్రోధమూర్తులై. 19

ఉ॥ బాలునిఁ జేరి యిట్లనిరి ♦ బాలక! యెవ్వఁడ? వేల యిట్టు లీ
యాలయభూమిఁ జేరితి? వ ♦ హంకృతి మృత్యువశంబుఁ జెందకే
వైళమ దూరమేగు మన ♦ వారలఁగాంచి హసించి బాలకుం
డేల ప్రలాపముల్? మరలుఁ ♦ డెవ్వఁడనైనను నేమి మీకిఁకన్. 20

క॥ మీరెవ్వ? రేటి కిచటికిఁ, జేరితిరి? చనుం డనంగ ♦ శివకింకరు లెం
తే రహి హాస్యముసేయుచు, ధీరత నిట్లనిరి గణప♦తికి వేగమునన్. 21

చ॥ శివునకు ద్వారపాలురము ♦ చెచ్చెర నిన్నిటనుండి యంపగా
శివుని యనుజ్ఞచే నిటకుఁ ♦ జేరితి మీవిఁక వీఁకఁ బాసి పో
మ్మవితథమైనపల్కిది క♦టా! యిటు ప్రాణముఁ గోలుపోకు శాం
భవులు మదాంధచిత్తులను ♦ బాలనసేయరు విన్మురూఢిగన్. 22

క॥ ఇరవుగ నాథుఁడు నిజమం, దిరమున కరుదేర నీకు ♦ దిండ్రిమదేలా!
మరలుము బిరాన మానిన, సరిపడదిఁకఁ జేటుమూడుఁ ♦ సత్వరమరయన్. 23

వ. అనిన గణేశుండిట్లనియె.

ఉ॥ నాథుఁడుగాని సర్వసుర ♦ నాథుఁడుగాని మహాత్ముఁడౌ జగ
న్నాథుఁడుగాని యీ యుమకు ♦ నాథుఁడుగా నిపుడిమ్ముఁ జేర సం
రోధముసేయువాఁడ నవ ♦ రోధముఁ జేరఁగ వేళగాదు పొం
డో ధిమణాఢ్యులార! చన ♦ కుండిన నిందఱుఁ జత్తురిత్తఱిన్. 24

ఆ॥ చేటు మూఁడుననుట ♦ సిద్ధమెవ్వరికేని, యిపుడు నాకొ మీకొ ♦ యెఱుఁగవచ్చు
ననుచుఁ గదలకున్న ♦ నా ప్రమథేంద్రులఁ, బట్టి కొట్టి గట్టి ♦ దిట్టయగుచు. 25

ఉ॥ అంతట వార లొక్కుమ్మొగి ♦ నాగణనాథునిపైకిరా నతం
డంతములేని విక్రమము ♦ నందుచు నందఱ కన్నిరూపులై
యంతకమూర్తివోలె భయ ♦ దార్భటులన్ బొనరింపుచున్ వడిన్
దంతుల పైఁ జెలంగు సము ♦ దారహరీంద్రమువోలె లీలమై. 26

క॥ కొందఱి మోకాళ్ళను మఱి, కొందఱి పిక్కలను మఱియుఁ♦గొందఱి తొడలన్.
గొందఱి నడుముల నిఁకనున్, గొందఱి మూఁపులను విఱుగఁ♦గొట్టెన్ యష్టిన్

—* శివుఁడు చండీశ్వరాదులను యుద్ధమునకుఁ బంపుట *—

వ. అంతఁ బ్రమథు లాతని విక్రమంబున కోహటించివచ్చి యీశ్వరుని కాయుదం తంబంతయు నెఱింగించిన నమ్మహేశ్వరుండు కుపిద్ధుఁడై యవ్వారల కిట్లనియె.

ఉ॥ క్లీబులువోలె వచ్చితిరి ♦ కీడ్వడి సిబ్బితిలేక యింద ఱి
ట్లాబిరు దెవ్వఁడో యరయ ♦ రైతిరి వాఁ డిట కేలవచ్చెనో
డాబులు కొట్టుచుందురు క ♦ డంకయు లావవిలేక యూరకే
దేబెలు మీరు పొండిఁకను ♦ ధీరత లేదు రవంత యేనియున్. 29

క॥ చండీశ్వరునిన్ బేర్గల, దండిమగలఁ బ్రమథభూత ♦ ధౌరేయుల ను
ద్దండులఁ దోడ్కొనియచటికిఁ, బొండావలికనుపుఁ డిఁకను ♦ బొంగఱవానిన్. 30

వ. అనుడు నందికేశుండు మున్నగువారు చండీశ్వరాదులన్ దోడ్కొని గణపతిన్ దారసించి యిట్లనిరి. 31

క॥ చనెదవ? లేదా? యీయద, నున మిత్తినిఁ జేరెదవు క♦నుంగొను మిఁక నీ
ఘనత యది సాఁగిరాదన, విని యతఁడు మదిన్ దలంచె ♦ వేగపడ కిటుల్. 32

గీ॥ తనసెలవులేక యొరులను ♦ ద్వారభూమి, మీఱనీకుమనియెఁదల్లి ♦ మేరమీఱి
వీర లీరీతి దాడికి ♦ వెడలుచుండి, రకట! కర్తవ్యమెద్దియో ♦ యరయఁజాల.

—* ద్వారమందలి యలుకుడును విజయ పార్వతిదేవికిఁ జెప్పుట *—

వ. అని తలంచుచున్న సమయంబునందు ద్వారదేశంబందలి కోలాహలంబాలించి గిరిజాప్రియసఖియగు విజయ యరుదెంచి యచ్చటి వృత్తాంతంబంతయు నరసి మురిసి మహేశ్వరికడ కేగి యవ్విశేషంబశేషంబుగ నెఱింగించి యిట్లనియె. 34

గీ॥ శంకరుఁడు తద్గణంబులు ♦ శంకలేక, మన గణాధీశుఁ బొదువఁగఁ ♦ దనరి రిట్లు
భవదవసరంబుఁజూడక ♦ పాడిఁదప్పి, హఠముతో వారు చేరు టం♦దనుచితంబు.

క మనగణపతి యొక్కనినై, వను జొరనీయండు శివగ♦ణము లెంతయు రం
తొనరఁగ హుంకృతిసేయుచు, ననికిఁ దొడరుచున్నవార ♦ లరయు మిఁక శివా!

గీ॥ ఎల్లవిధముల గణపతిన్ ♦ డిల్లపఱచి, భవనమొందుదు రిఁక శివ♦ప్రమథవరులు
అదియుమనకెంతయునుజుగు♦ప్సావహంబు, అరసివర్తింపుమిందుఁబ♦ద్మాయతాక్షి

చ॥ శివుఁడును జాపలాత్ముఁడయి ♦ చీటికిమాటికి నిమ్ముఁజేరు నీ
యవసర వేళఁ గన్గొనఁ డ♦హంకృతిఁ జూపుచునుండు నిప్పు డీ
యవినయమేల? బాలకుని ♦ నల్లరిపెట్టుట యేటి కల్పమా
వ్యవధికి నోర్వలేఁడొకో! భ♦వాదృశు లీయది మెత్తురే శివా! 38

చ॥ అనిన గిరీంద్రపుత్త్రి హృద♦యంబునఁ బంతముఁబట్టి భర్తయ
ష్టానరిచినట్టి పట్టుదల ♦ యున్ బ్రమథేంద్రుల దౌమ్మ్మోటువ
ర్తనము నెఱింగి సఖ్యభిమ ♦ తంబును నారసి కాఁగలట్టిదా
నని యనిపెన్ జెలిన్ నిజగ ♦ ణాగ్రణి ♦ చెంగటికిన్ రయంబునన్. 39

ఉ॥ ఆపెయుఁ బోయి యిట్లనియె ♦ నా గణమూర్తికి మేలుచేసి తీ
వీ పురుషుల్ నిన్నుఁ గెనక ♦ నెంతురె యెంతటివారు వీరి యా
టోపము సాఁగివచ్చునె యి ♦ టుల్ జయధుర్యుఁడవైన నీకడన్
రూపతి పోదు రిద్ది యను ♦ రూపము నీకుఁ గుమారచంద్రమా! 40

గీ॥ అనుడు గణపతి యానంద♦మతిశయిల్లఁ, బొంగి తలపాగఁ దీర్చితో♦డంగియనికి
నంకమాస్ఫాలనమొనర్చి ♦ యభవగణముఁ,బిలిచియిట్లనె బీరంబు♦పెంపు వెలయ.

మ॥ గిరిజాసూనుఁడ నేను మీర లహరా♦ట్కేయూర యోధాగ్రణుల్
దరమైనన్ ననుగెల్చి పొం డవలకున్ ♦ దర్పంబు లేకున్న నీ
శ్వరుఁ జేరన్ జనుఁ డిద్ది నిర్ణయము ద్వా♦స్థ శ్రేష్ఠులారా! మహే
శ్వరి దావారికుఁ డీతఁ డీరలు శివా♦జ్ఞాపాలకుల్ బల్లిదుల్: 42

మ॥ పలుజన్యంబుల నారితేఱినఘనుల్ ♦ ప్రౌఢాత్మకుల్ పెక్కు-రీ
రలు నే నొక్కఁడ బాలకుండ సమరా♦రంభానభిజ్ఞుండ నీ
కలహంబందిఁక నాకు లోటాదవినన్ ♦ గా దేరి కఖ్యాతి మీ
వలనన్ బాటిల మీకు శంకరున కం♦బాదేవికిన్ జేఁకుఱున్. 43

క॥ అది తెలిసికొని దిటంబుగఁ, గదనమునకు దిగుఁడు సమర ♦ కౌశలులని పెం
పొదవఁగఁ జెప్పిన లజ్జా, స్పదులై వా రీశుకడకుఁ ♦ జని యని రిట్టుల్. 44

గీ॥ అంబికాపుత్త్రుఁడఁట దేవ!♦యనుపమాన,బలుఁడు బాలుఁడు పెచ్చుగఁ♦బ్రబలియున్న
వాఁడు ఘోరాజి నోర్వఁగ♦వలయుఁగాని, వాని నలఁతుల దీర్పఁగ♦వశముకాదు.

క॥ అని తెగఁజెప్పిన విని శివుఁ, డును మదియోజించి నిజమి♦టులై యన్యముగా
దు నగేంద్రతనయ చేసిన, పని యిది యిపు డేమిసేయ♦వలయునొ యరయన్.

గీ॥ వినయమును జూపినట్లైన♦వెలఁదికీశుఁ,డోడెనని యాడుదురులోకు♦లొక్కవరుస
నాయెడలనిగ్రహముసేయ♦నాతి కగును, యగునుగాక ఫలంబొందు♦నగజ నిజము.

క॥ కానున్నది కాఁగల దిఁక, సేనలతో మీర లెల్లఁ ♦ జేరి యనీకం
బే నడుపుఁ డరయుచుండెదఁ, బై నేనన వార లెల్ల ♦ బలిసినచేరన్ 48

గీ॥ ప్రమథభూతగణములోని♦బల్లిదులగు, జోదులను దోడుకొనియుమా♦సూను వీర
భద్రునిన్ గూడుకొని కడు♦వడిగ రాణి, వాసమున్ గాచు నగ్గణ♦వరునిఁ జేరి.

చ॥ తడవిఁక నేల బాలకు ను♦దారతఁ బట్టుఁడు కొట్టు డిప్డు డీ
తఁడు పొనరించు టేదియొ యు♦దారపదాగ్రణియంచు హెచ్చుగా
దుడుకుఁదనంబు మీఱఁ గడు♦తొందరతోఁ జెలరేఁగి యార్చుచున్
బుడుతనిపై వడిన్ బడిరి ♦ భూరికృపాణగదాపరిహస్తులై. 50

## —* ప్రమథ గణపతుల యుద్ధము *—

చ॥ అతఁడును సింహపోతమటు ♦ లద్భుతరీతిఁ దొడంగి నింగి ను
ద్ధతగతిఁ జేరి ఘోరతర ♦ దండహతిన్ బ్రమథోగ్రసైన్యసం
హతుల నదల్చుచున్ జదిపె ♦ నష్టనవిక్రముఁ డేటిచూడ నేన్
మతిసారదమ్యో నెవ్వరికి ♦ భ్రాన్పడుచుండిరి యొక్కతీరుగన్. 51

వ. మఱియు నగ్గణాధీశ్వరుండు

క॥ కొందఱి పొట్టల మఱియును, గొందఱి చెట్టలను మఱియుఁ ♦ గొందఱి తలలన్
గొందఱి యక్కుల నిఁకనున్, గొందఱి ముక్కులను బగుల ♦ గొట్టెన్ యష్టిన్.

క॥ కొందఱు మడిసిరి మఱియుం, గొందఱు ప్రాణాంత్యదశను ♦ గొనియుండి రిఁకన్
గొందఱు నురుమై సురిఁగిరి, కొందఱు భిన్నాంగులగుచుఁ ♦ గూలిరి పెలుచన్,

ఆ॥ ప్రబలదండధారఁ ♦ బ్రమథభూతగణంబు, నోలి నేలఁ బెట్టి♦కాలఁజమురు
చున్నఁ దెరలిమరలి♦యువ్వెత్తుగా వెఱి, చఱచి యొక్క కేవఁ♦బఱచుచుండ.

క॥ చని షణ్ముఖుండు వారలఁ, గనియొక బాలకున కెదురు♦గా నిబ్బంగిన్
బెనుకూటములోఁ జేరియు, వెనుకొని పాఱెదరె యదరి ♦ వీటేఁడులారా! 55

ఉ॥ చావరె యెల్లకాలమిటు ♦ శాశ్వతమే యొడ లిట్లు పాఱినన్
బోవదె తేజమున్ యశముఁ ♦ బుణ్యము సర్వము భీరులార! మే
ల్గావలదే పదుండిఁకను ♦ గావఁగ వచ్చెద నేను ధీరసం
భావితవృత్తిఁగ్రై కొనుఁడు ♦ భద్రము లొందుఁడు రండు పూన్కిమై. 56

గీ॥ అనుచువారల మరలించి ♦ యద్రిజాకు, మారుఁ డత్తఱి గణనాథుఁ♦దారసించి
విక్రమోన్నతిఁ గన్గొని ♦ వేడ్కఁజెంది, డెందమం దెంత యేని నా♦నంద మొంది.

ఉ॥ ఈతనిఁ జూడఁ దోఁచు మది ♦ కెంతయు మచ్చికఁ గుఱ్ఱిచ్చి కౌఁగిటన్
జాఁతిగఁ జేర్ప సన్నిహిత ♦ బాంధవవర్యులకన్న మిన్నయై
యాతఁడు గానుపించు నిఁక ♦ నెట్టుల నీతనితోడఁ బోరుదున్
జేతము చెమ్మగిల్లె నిఁకఁ ♦ జేసెడిదే మిపు డాతురంబునన్. 58

గీ॥ శోకనదతుల్యమై మేల్మిఁ♦గొమరుమీఱు, వీనిమేనున బాణముల్♦విడుచుటెట్లు
లేకయుండిన నీతఁడ♦లోకశక్తి,నిపుడు నన్నేచు నేమొకో♦యేపుసూపి. 59

క॥ ఇల "శూంత్యాభీరు" వనెదు, పలుకుల్ దలఁపంగ యుద్ధ ♦ పద్ధతియె కదున్
జెలువుగఁదోఁచెదునైనను, బలికెద నిటు లితనితోడఁ♦బ్రాఘిదలిర్పన్. 60

—* కుమారస్వామి గణపతితో సంభాషించుట *—

ఉ॥ ఓ గణనాథవర్య! విను♦మో ఘనవిక్రమధుర్య! యిట్టు లీ
నీ గణసైన్యముల్ జదుప ♦ నేరమియానొకో! చూఁడు వచ్చితిన్
నే గరిమంబు శోభిలఁగ ♦ నీవిఁక నన్నిట డాయు మగ్గిలో
బాగుగ నగ్గి తేజరిలు ♦ వల్మఱు చూపఱు లుగ్గడింపఁగన్. 61

గీ॥ అనినవిని గణనాయకుం ♦ డంబికాత, నూజుఁగన్గొని తత్సూక్తి ♦ కోజ మెచ్చి
దురముచాలించి స్కందును♦దురును గాంచి,యిట్లుతలపోసెజిత్తమం♦దింపుగదుర.

గీ॥ తోడఁబుట్టువవెనాకు♦దోఁచెనీతఁ, డీతనిన్ గనఁ గౌఁగిట ♦ నెనయుపొంకె
యుపతపించుచునున్నది ♦ యుల్లమకట, పోరుమానెదనిఁకవీని ♦ పొందుఁగోరి 63

వ. అనితలఁచి మహాసేను వచనంబులకుఁ బ్రీతుండై యొక్కింతమిన్నకున్న నత్తఱి గణసైనికులు గుమారావలంబనంబున నేచి దండతోమరపరశుకృపాణపాణులై యొక్కవంకఁ గుమారుండదల్చి మరలించుచున్నను, మరలక గణనాథున్ బాదువఁబోవుచున్న నతండు మరల వారల గొంటుదనమ్మునకుఁగిసి యొడ్డారించి యంటరాక యంబరంబునకెగసి ప్రలయమార్తాండుని పగిది దుర్నిరీక్షుండై. 63

చ॥ కసిమెసఁగన్ సుపర్ణుఁ డుర ♦ గమ్ముల బిట్టరఁజేల్చినట్లు వె
క్కసమగు నేత్రజన్ గవిసి ♦ కాలను జేతను దండధారనున్
గసవొావరింపుచుండె గణ ♦ కాండము నయ్యెడ షణ్ముఖుండు సం
తసమెసఁగంగఁగాంచుచు ను ♦ దారతమైఁ బొగడెన్ గణాధిపున్. 65

చ॥ ఎరగలిచిచ్చు పెచ్చడరి ♦ యెంతయుఁ గాననభూజరాజి ను
ద్ధురగతిఁగాల్చు కేవఁ గడు ♦ దోర్బలధుర్యుఁడితండు సేనలన్
దరమిడి కూల్చుచుండె జెడి ♦ దంబగు దండహతిన్ రయంబునన్
గురుతరతేజుఁడీతఁ డవి♦కుంఠితవిక్రముఁ డెల్లభంగులన్. 66

క॥ ఉఱక తరవాయిఁగొని యిం, దఱి నిర్విధి మ్రింగఁ జేయు ♦ దక్షు నితని ని
త్తఱిఁ దఱిసి యెదుర నేనియుఁ, బాఱఁగొను నితఁ డెల్లఁ బ్రమథ♦భూతగణములన్.

—* విష్ణ్వాదిదేవతలు శివసహాయార్థమై యుద్ధమునకు వచ్చుట *—

వ॥ అని శక్తిన్ గొని సమరంబునకుఁ దొడరుచున్నంత నత్తఱి నారదప్రబోధితులై హరిహిరణ్యగర్భాద్యఖిలగీర్వాణశిరోమణు లాత్మసైన్యంబులతో మహేశ్వర సాహాయ్యార్థంబై వచ్చి తదీయాంఘ్రిపద్మంబుల కెఱఁగినిలిచినపరమేశ్వరుండందుఁ బితామహున కిట్లనియె. ౬౮

ఉ॥ ఒక్కఁడు దుండగీఁడు కమ♦లోద్భవ! మద్గృహతోరణంబునం
దుక్కునఁ జేరి యడ్డపడి ♦ యుద్భటభూతగణాధినాథులన్
జక్కడఁగించుచుండె భుజ♦సార మపార మదేమిచెప్పుదున్
గ్రక్కున వానిఁ జేరి యొడి♦ కమ్మునఁ దేర్పఁగఁ బూను మీవికన్. 69

ఆ॥ అనుడు దేవ! యట్ల♦యని పితామహుఁడు ద్వాఃస్థలినిఁ జేరి ప్రమథ♦దమనుఁ జూచి
తఱియఁ బోవుచుండ ♦ దండంబునన్ మోఁది, దాడిఁ బెరికి యీడ్చి♦ధాత్రిఁ ద్రోసె.

క॥ దివిషత్సైన్యంబులునున్, సవసవగాఁ జేరుచున్న ♦ జాడఁగని జయా
సువధూటి యుమకు ద్వార, స్థవిశేషము లెల్లఁ దెలుప ♦ శైలజ యంతన్.

గీ॥ కొమరునకు యుద్ధమొనరింపఁ ♦ ఘోరఖడ్గ
మొకఁడు గద యొండు బంపి య♦త్యుత్కటాగ్ర
హం బినుమడింప శక్తిద్వ♦యంబు సృష్టి
చేసి యంపెను సుతునకు ♦ బాసటగను. 72

వ. అట్టి శక్తిద్వయంబునం దొక్కటి యంజనాద్రిసంకాశయై విశాలంబగు ముఖగహ్వరంబు విప్పి ప్రమథదేవసైన్యంబుల మ్రింగుచుండె మఱియొకటి విద్యుత్పింగాకృతియై బహుహస్తసమన్వితయై భయంకరయై యవ్యాహతరయంబున నాదితేయప్రయుక్తాయుధంబుల నెల్లగ్రహించి వాని మరల దివిజులపైఁ బడవేయుచుండె నంత గణేశ్వరుండుసంతుష్టుండై మాతృప్రేషితంబులగు గదాకౌక్షేయకంబులఁగొని పరమానందంబునఁ బ్రమథామర వాహినుల నాపోశనంబుఁగొనుచుండె నయ్యవసరంబునఁ బ్రమథామరవర్యులెల్ల రాత్మంబులందు. 73

క॥ పోరఁగలే మీతనితో, ధీరుండితఁ డొకఁడె గలఁచి ♦ తీరున్ మమ్మున్
బారావారము నెల్లను, గారింపదె మందరంబొ♦కఁడు పూర్వమునన్. 74

క॥ ఎంతైనఁ బోదమనినన్, సంతగుపడ దితని యెదురఁ ♦ జావే శరణం
బిందనుచు వందురుచు మృతిఁ, జెందిరి గణనాథుని గద♦చే నొక్క మొగిన్.

క॥ అచ్చరలు పుష్పచందన ♦ హస్తలగుచుఁ
జదలనిలిచిరి సంగ్రామ ♦ జయమరయుచు
మునులు గంధర్వులును మహా ♦ మోదమొదవఁ
జూచుచుండిరి కలను బల్ ♦ చోద్యమెసఁగ. 77

వ. ఇట్లు ప్రలయకాలాభీలంబై యున్న నాయుద్ధంబునం దించుకదవ్వులనున్న సైనిక ప్రవరులు గణేశ్వరుని మహాహవప్రకారంబును షణ్ముఖవీరభద్రుల యాదా సైన్యంబునుగాంచి గణనాథాగ్ని కింధనంబులుగాఁజాలక ప్రాణాతురులై హరుఁ జేరి యవ్విధంబంతయుఁదెలుప నత్తఱి నారదర్షి సమీపించి మహాదేవున కిట్లనియె.

గీ॥ దేవ! నీలీలగాదె యీ ♦ తీరు సకల, మఖిలభూతప్రమథగణా ♦ హంకృతిఁ హ
రించుపొంటె రచించితి ♦ వెంచియిట్లు, కావుమిఁకఁ బ్రమథామర ♦ గణమునెల్ల.

—* శివుఁడు విష్ణ్వాదులతో యుద్ధమునకు వచ్చుట *—

వ. అనిచెప్పి చన నంత రుద్రుండమర్షితుండై నారాయణప్రముఖ నిఖిలాసురమూల బలంబును బ్రమథమూలబలంబునుగొని యాలంబునకు నడిచినంత వారందఱా గణపాలుర జుట్టుముట్టి వివిధాయుధపరంపరలఁబొదువ నతండాభీలుండై నిప్పులు రులు కన్నులతో నేరికిఁజూడరాని తేజంబుతో నందఱకు బెగడుఁబుట్టింపుచుఁ గృపాణగదాదండధారలబలంబులనెల్లఁబీనుఁగుపెంటలఁజేసి నారాయణున్ గదిసి.

ఉ॥ ఉరమున నొక్కపెట్ట గద ♦ నుద్ధతివైచిన నాతఁ డల్గి వి
స్ఫురితశరంబులన్ బొదివి ♦ భూరినదంబునఁబేర్చి యార్చినన్
మరల గణేశుఁ డుగ్రుఁడయి ♦ మండుచుఁ జండగదాగ్రధారతో
సరసిజనాభు గుండెఁ బెలు ♦ చన్ బగిలించె సురల్ జలింపఁగన్.

వ. అంత వెన్నుండు విషణ్ణుండై హరుఁజేరి యిట్లనియె.

చ॥ బిరుదుమగందు పోరు గడు ♦ బెట్టిద మీతనితోడ సత్యసం
గరమున గెల్వఁజాల మిది ♦ కార్యముగా దిఁకఁ గుట్ర బన్ని యే
తెఱఁగుననైనఁ జంపవలె ♦ దేవ! యనంగ ననంగవైరి య
చ్చెరువునుజెంది యిట్లనియె ♦ శ్రీపతి కేపుఁదనర్పఁ జేయుచున్. 80

మ॥ విసుమానంబగుఁగాదె యొక్క శిశు వీ ♦ బృందారకశ్రేణి ని
ట్లెసకంబొప్ప నెదిర్చి తూల్చెఁ బ్రమథా ♦ హీనప్రతాపాగ్ని నీ
రసమొప్పన్ బొలియించెఁ దానవకమా ♦ హా గ్రిస్ఫారవీర్యంబు నీ
రసమున్ జేసి కలంచెఁ నేన యిఁకఁ గ ♦ ర్జంబొప్ప నిర్జించెదన్. 81

వ. అనిన విని శార్ఙ్గపాణి లజ్జితుండై

క॥ కైలాటంబునఁ దక్కఁగ, బాలుని గెలువంగఁ దరమె ♦ భర్గ! యనుచు న
న్నాళీకాక్షుఁడు శక్తుల, నోలం బొనరించి మరల ♦ నుద్ధతిఁ గవిసెన్ 84

చ॥ గణపతి యంతఁ గేశవునిఁ ♦ గ్రక్కున ఘోరగదాప్రయుక్తభీ
షణతరపాతమొప్ప భుజ ♦ సంధుల మోదిన వైరివీరమా
రణచణమైన చక్రమున ♦ రాక్షసమర్దనుఁ డగ్గదన్ మహా
రణనమెసంగఁ ద్రుంచె నమ ♦ రప్రకరంబు కరంబు పొంగఁగన్. 85

సీ॥ గణవరుండల్గి యగ్గదా ♦ ఖండములను, దిరుగ విష్ణునిపై వేయ♦గరుడుఁడొడిసి
పెక్కుతునియలఁజేసి పే♦రుక్కు మెఱసె, నర్భకుండంత నాగ్రహ♦నిర్భరుఁడయి.

చ॥ ఎగసి కరస్థయష్టిహతి ♦ నేడ్తెఱఁ బత్రరథేంద్రుమూర్ధమున్
బగిలిచి కైటభాంతకుని ♦ ఫాలము వ్రయ్యలుసేయ నాతఁ డె
చ్చుగ మెయి నొచ్చి నేలఁబడఁ ♦ జూచి పినాకధరుండు శూల మె
త్తగ గణభర్త యష్టిహతి ♦ దాని ధరన్ బడవేసె నుద్ధతిన్. 87

ఉ॥ అంతనె యంతకాంతకుఁ డ ♦ హంకృతిమీఱఁ బినాకమెత్తర
వ్వంతయు వంతలేక యచ ♦ లాధిపనందనకూర్మిపట్టి బ
ల్వింతగ దానిఁగూడఁ బడ ♦ వేసి భువిన్ బరమేశు మోఁదె దు
ర్దాంతతరోరుదండహతి ♦ దాన హరుండు కరంబు రుషుఁడై. 88

—* శివుఁడు త్రిశూలముచే గణపతి తలనఱకుట *—

క॥ అమితోద్ధతిఁ గదిసి త్రిశూ, లముచే గణనాథుశిరము ♦ లాఘవముగ ఛే
దముచేసి యార్చె జయఘో, షముచేసిరి ప్రమథదేవ ♦ సత్తములంతన్. 89

క॥ తప్పెటలు మృదంగంబులు, డప్పులు కాహళములును ఘ ♦ టంబులు ఘంటల్
గొప్పగ వాద్యముచేసిరి, యప్పరమేశ్వరుని రణజ♦ యాశంసముగాన్. 90

గీ॥ శివుఁడు కోపంబుడిగి బాలు ♦ శిరసుఁ జూచి
వగచె నెంతయు దుఃఖైక ♦ వశ్యుఁడగుచు
వీరభద్రుఁడు గుహుఁడును ♦ విష్ణు వజుఁడు
గూడ నాత్మములందు బల్ ♦ కుందిరపుడు. 19

—* నారదుఁడు పార్వతికి గణపతిమరణంబుఁ జెప్పుట *—

గీ॥ నారదుండపు డంబికన్♦జేరి మ్రొక్కి, సర్వ మెఱింగించి యిట్లనె♦జనని! యిపుడు
పట్టువిడువకు మెందేని ♦ నిట్టిఘోర, చరితములఁ గనినామె యి♦జ్జగమునందు.

వ. అని చెప్పి యంతర్ధానంబుఁ జెంద నంత నమ్మహాదేవి. 92

గీ॥ తగునెయిటు దుర్ణయముసేయ ♦ ధవుఁడు ప్రమథ
వరులు సురలును గూడి యి ♦ వ్వరుస నిప్పు
డేమిసేయఁగఁదగు నెట ♦ కేగవలయు
ననుచు మనమున వనరి హి ♦ మాద్రితనయ. 93

మ॥ తగునే సోదరతుల్యుఁడై యలరునా ♦ దామోదరుం డివ్విధిన్
బగతో నాదుకుమారకున్ జదువఁగా ♦ బల్ పన్నికన్ బన్నిమూఁ
కగ జేజేలఁ బురస్కరించికొని దు♦ష్కార్యం బిటుల్ సల్పె టి
మ్మగ నీ పాపఫలంబులన్ గుడువరే ♦ హేంగార కంగారునన్. 94

వ. అని తత్క్షణంబునఁ దలపోఁతఁ బాసి

గీ॥ వేలుపులనెల్ల వేవేగ ♦ వెతకి చంపుఁ, డనుచుఁ బుట్టించె శక్తుల ♦ నాక్షణంబు
నమితసంఖ్యగ నవ్వార ♦ లాయుధములఁ, గొనిచనిరి ద్వారభూమికి♦ఘోరరీతి.

వ, అంత,

క॥ జయ మేలని యగ్గించె వి, జయ లగ్గొనరించితనియె ♦ సకలాళిజనుల్
జయశబ్దము లొనరింపుచు; నయముగఁ గొండాడి రద్రి ♦ నందన ఘనతన్. 96

చ॥ శివుఁ డటఁ దానొనర్చిన య ♦ చేష్టకుఁ జాలఁగఁ, జింతచేసి యు
ద్భవమగుచున్న దుఃఖమును ♦ బాఱగఁదోలి గిరీంద్రకన్యకా
భవనముఁ జేరఁబోవకయె ♦ పన్నుగఁజేరె సభాలయంబు నా
దివిజులు గ్రిమ్మరన్ బయలు ♦ దేఱుచునుండఁగ నొక్కపాటునన్. 97

గీ॥ ఖంజ కాళి కరాళి బ♦గళయు ఛిన్న, మస్తయు విలంబమస్త ధూ♦మవతి సిద్ధ
విద్య మాతంగియును దార♦విద్య కుబ్జ, ఆ మహావిద్య మున్నగు♦నాహ్వాయముల.

గీ॥ వెలయు శక్తులు వేనవేల్ ♦ వింటికెగసి, క్రోధఘూర్ణితమూర్తులై ♦ఘోరరీతి
నగ్నిదరికొనిమండెడు ♦ నట్టులేచి, సకలదిక్కుల నరయుచు ♦ సత్వరమున. 99

చ॥ నలుకుఁడు ద్రుంచుఁ డడ్డపడి ♦ నాకచరాధములందు నొక్కనిన్
బలువఁగనీయకుండుఁ డిటఁ ♦ బట్టిపలార్పుఁడటంచు శక్తులే
డ్తెఱ నలుమూలలన్ గవిసి ♦ తేఁకువ మూఁకలఁ జుట్టుముట్టఁగా
మఱుకువనొంది నాకచర ♦ మండలి యొండెడఁ గాంచ కార్తులై. 100

చ॥ ఒదుగుటకైన లేదు తెరు ♦ వొండెడ వీరలనోటఁ గూలనే
యదనుఘటిల్లె నిట్లు ప్రల ♦ యంబగు కైవడిఁదోఁచె నెట్టులీ
యది గడవంగ నేర్తుమని ♦ యార్తినిఁ గుంది పురందరాదులున్
బెదరుచు నాల్గుమూలలకు ♦ వీఱఁడులై పఱగెత్తిరత్తఱిన్. 101

క॥ ఎచ్చోటకేగి కనుగొనఁ, నచ్చోట నాశక్తులడరి ♦ యాస్యకుహరముల్
విచ్చి సురావళినెల్లను, విచ్చలవిడి మ్రింగుచుండ ♦ వెఱపొందికడున్. 102

క॥ మొఱ్ఱోయనియెడి వారలు, కుఱ్ఱలనిఁకఁ జూడమనుచు ♦ గోణఁగెడు వారల్
దుఱ్ఱునఁ జెదరెడువారలు, మిఱ్ఱుంబల్లంబుఁ గనక ♦ మిడికెడువారల్. 103

సీ॥ బ్రతుకఁగావలెనని ♦ పరుగెత్తి కనక గ, భీలున గంగలోఁ ♦ గూలువారు
కూలినవారలఁ ♦ గూడఁజూడక యట్లె, వారిపైఁబడి యందె ♦ చేరువారు
చీల్పకు మ్రింగకో ♦ శివశక్తియని తమ, లోఁ దామె మ్రొక్కుచు ♦ లోఁగువారు
వచ్చెరా పెనుమిత్తి ♦ చచ్చితిమంచని, వెల్లకిలన్ బడి ♦ డొల్లువారు

గీ॥ బలులనిత్తుము కొలుతుము ♦ పాపలకును, మీదు పేర్లనే పిలుతుమీ ♦ మీద తల్లు
లనుచు శక్తులచేఁజిక్కి ♦ యఱచువారు, నైరి యాక్షణమందు ది ♦ వ్యజనులంత.

—* విష్ణ్వాదులు మునులను పార్వతీదేవియొద్ద కనుపుట *—

చ॥ గొదగొని శక్తులిట్లు లతి కో ♦ పనలై ప్రమథామరావళిన్
గదిసి యుదీర్ణభంగి సుర ♦ గంగనొనర్చుచు నార్చుచున్ గడున్
మదమున వీరనృత్తము ల ♦ మర్చుచుఁ గేరుచు సంహృతిక్రియా
స్పదలయి మీఱుటన్ గని య ♦ జప్రముఖామరవర్యు లేకమై. 105

గీ॥ తలరి యంబిక చేసె నీ ♦ దండనంబు, మనకు నెల్లర కిద్దాని ♦ మాన్పఁదరమె?
ఆ జగన్మాత కెప్పుడీ ♦ యలుకదీయ, నంతవట్టెటు సంక్షోభ ♦ మమరియుండు.

చ॥ అనియుఁ బరాంబఁ జేరుటకు ♦ నాత్మమునం దగు దీములేక తా
ర్మునులను నారదున్ బిలిచి ♦ భూధరరాజసుతాగ్రహంబుఁ దీ
ర్పను బనుపంగ వారలు గ ♦ రంబు భయంబును భక్తి గ్రాల న
జ్జననినిఁ జేరి మ్రొక్కి యిటు ♦ సాంత్వనమొప్పఁగఁ బల్కి రిమ్ముగన్. 107

చ॥ శివ! జగదంబ! చండిక! వి ♦ చిత్రకళామయమూర్తి! దివ్యవై
భవ! శుభకీర్తి! శక్తి! శివ ♦ భామిని! నీవ జగత్ప్రసూతివై
యవనసమర్థవయ్యుఁ బ్రళ ♦ యావహవౌదువు తల్లి! శాంతిఁ గొ
న్మా! వికలమ్మయ్యె సర్వజగ ♦ మ్మున్ బ్రతికింపు! ఘృణాస్వరూపిణీ! 108

గీ॥ ఇట్లు నుతియించి మ్రొక్కిన ♦ యీశురాజ్ఞి
దివ్యమునులను గనియు నె ♦ ద్దియును బలుక
కున్న నంబనుగని జోహా ♦ రొనఁగి మరల
నంజలులఁ జేసి యిట్లని ♦ రపుడు మునులు. 109

క॥ క్షమియింపుము పరమేశ్వరి!, క్షమియింపుము సకలలోక ♦ జననీ! యికఁ నే
రములన్ దావకసంతా, నమెకద! యీ జగ మఖిలము ♦ నన్ శివ యంతన్.

క॥ ఇంచుక కనికరమున మ, న్నించి యిటుల్ మునులతో న ♦ నియె నాదు సుతుం
డంచితముగ జీవితుఁడై, మించిన తేజంబు మెఱయ ♦ మెలగెడు నేఁడిన్. 111

క॥ వానిని మీరెల్లరు స, న్మానముతోఁ గొలుచు నెడల ♦ మాన్పద నీ మీ
దీనత యని నుడువఁగ స, మ్మానులలరి చెప్పిరా య ♦ మరవర్యులకున్. 112

గీ॥ వారలును సంతసించి య ♦ వ్యామదేవు, కడకుఁజని యవ్విధంబెల్ల ♦ నుడివి మ్రొక్కి
దయనుగోరిన నాతఁ డు ♦ దారబుద్ధి, తోడ నిట్లనిపల్కె సం ♦ తోసమొదవ.

గీ॥ చనుఁ డుదగ్దిశఁ గూరిచి ♦ చక్కనందుఁ, దొలుత నేజంతు వగుపడుఁ ♦ దొడరి దాని
శిరసుఁ దెగవేసి యిక్కళే ♦ బరమునందుఁ గూర్పుఁడద్దానఁ గూర్ములు ♦ గొనలుసాగు

క॥ అని సెలవొసఁగఁగ నింద్రా, ద్యనిమేషులు బాలువిగ్ర ♦ హముఁ దెచ్చి రయం
బున నీటఁ గడిగి యర్చన, మును జేసి నితాంతహర్ష ♦ పూర్ణాత్మకులై. 115

ఆ॥ ఉత్తరాశకై మ ♦ హోద్యమంబున నేగఁ, గరటి యేకదంత ♦ కంబొకండు
గానుపట్ట మస్త ♦ కంబు ఛేదించి య, చ్చటికిఁ దెచ్చి కూర్చి ♦ శంభుఁ జూచి.

—* శివుఁడు గణపతిని జీవింపఁజేయుట *—

ఉ॥ దేవ! జగంబులెల్ల భవ ♦ దీయమహౌజముచేతఁ బుట్టి సు
శ్రీవిలసిల్లుగాదె యిటు ♦ చెల్వగు తావకతేజమిందు సం
భావితరీతిఁ జేర్చి యిఁక ♦ బాలుని జీవితుఁ జేయుచున్న భ
ద్రావహమూర్తి తత్తనువు ♦ నం దమృతాంచితదృష్టినించుడున్. 117

గీ॥ అంత నిద్దుర మేల్కాంచి ♦ నట్లు బాలుఁ, డలత యొక్కింత లేక యొ ♦ హాయియలర
జీవితుండయి కూర్చుండెఁ ♦ జెలఁగి దివిజ, వరులు మునులును సంతోష ♦ భరితులైరి.

క॥ గిరిజాదేవికి బాలుని, సరగునఁ జూపింప నాపె ♦ సంతోసమునన్
గరమలరి సురలఁ బ్రమథుల, గరుణాలోకనములొప్పఁ ♦ గాంచెఁ బ్రియమునన్.

చ॥ కడువడి సంతసంబెసఁగఁ ♦ గా సుతు నక్కునఁ జేర్చి మోము ము
ద్దిడి రుచిరాంబరంబులను ♦ నిద్ధమణీమయభూషణంబులన్
బెడఁగుగనిచ్చి దీవెనలఁ ♦ బేర్మి నొసంగెఁ దదాజ్ఞతోడ ము
న్నడరిన శక్తులెల్లరు ద ♦ యాస్పదలౌచుఁ దొలంగి రాయనిన్. 120

మ॥ సురలక్ష్మీశ్వరుఁ దోడి తెచ్చి సుతునిన్ ♦ జూపించి రంతన్ మహే
శ్వరి యానందితచిత్తయై సుతు నిజే ♦ శానాంకమందుంచె నా
పరమేశుండును దచ్ఛిరంబుపయి దీ ♦ వ్యత్ప్రేమబంధంబునన్
గరమున్ జేరిచి ముద్దుబిడ్డఁడని బ ♦ ల్గారాబమేపారఁగన్; 121

—* శివుఁడు గణపతికి బ్రహ్మదేవునితో నుపనయనము సేయించుట *—

గీ॥ ఏఁడు ప్రమథగణేశుఁడై♦వెలయునని త్రి, శూలమునొసంగి బమ్మను♦జూడనతఁడు
శివుని చిత్తమెఱింగి వే♦దవిహితప్ర, కారముగ నుపనయనంబు♦గరిమఁగూర్చె.

వ. నిఖిలామ్నాయచయంబుతో గాయత్రినిచ్చి కుండికయు నక్షమాలయు నొసంగఁ
బరమేశ్వరియు నమూల్యరత్నాభరణంబులతో సశరచాపగదాఖడ్గంబులనొసంగి
గారవించె. దామోదరుండు నామోదంబున నిభ్యసౌరభ్యవిభాసితంబగు వన
మాలయుఁ జక్రంబునొసంగి మన్నించె నంత సకలామరప్రమథవర్గంబెల్ల నగ్గణా
ధీశుఁగాంచి నమస్కరించి యనేకరత్నోపదలర్పించి యర్చించిరంత గణేశుండు
సంతుష్టుండై నిజజనకాంఘ్రిపద్మంబులకుఁ బ్రణమిల్లి హరివిరించనులకును నార
దాదిదివ్యమునులకును వందనంబిడిన వారంద ఆనందితులై వెల్లుగ నాశీర్వదించి
ప్రేమించిరంత శివుండు పుత్రునిజూచి. 123

గీ॥ బాలకుఁడవయ్యు నీవిట్లు ♦ ప్రౌఢవిక్ర, మంబు నెఱపితి శక్తికొ ♦ మరుఁడవౌట
నిఁకఁజిరంజీవివౌచుగ♦ణేశుడవయి, సుఖములొందుము నిచ్చలు♦సుభగమూర్తి!

ఉ॥ నేనును విష్ణు వీనలువ ♦ నెట్టన లోకమునందు సర్వస
న్మానముతోడఁ బూజలను ♦ మానుగఁ గొందుమె యట్లె నీవునుశ్
శ్రీనెఱయంగ సర్వసుర ♦ సిద్ధనిశాచరమానుషోరగా
ళీనియతార్చనంబులను ♦ లీలగనొందు మనిందితోన్నతిశ్. 125

క॥ మాకన్నను దక్కన సుర, లోకంబునకన్న నీవు ♦ లోకమున మొదల్
చేకొనెదుగాక పూజల, శ్రీకరగుణసాంద్ర ! సర్వ ♦ సిద్ధగణేంద్రా ! 126

క॥ విను మఖిలకార్యముల నా, దిని నిను బూజించి జనులు ♦ దృఢతఁ గ్రియాసి
ద్ధినిఁగొనెదరు విఘ్నంబులఁ, గనకుండెద రెపుడు దేవ♦గణపతి ! జగతిశ్. 127

—* శివుఁడు గణపతివ్రతంబుఁ జెప్పుట *—

గీ॥ భాద్రశుద్ధచతుర్థి ను♦ద్భవముఁజెంది, నాఁడవగుట నాదివసంబు ♦ నశ్ ద్వదర్చ
నంబు నేమంబుగాఁగ నొ ♦ నర్తు రెల్ల, వారు వారికి మేలు సే♦కూరఁగలదు.

గీ॥ సింధురాస్యుఁడవౌట చే♦సిందురమునఁ, బూజితుఁడవయిమిక్కిలి ♦ పొంగుఁగాంతు
వట్లెదూర్వాఙ్కురార్చల♦నధికమైన, హర్షమొందెద వార్యాము♦ఖాబ్జహేళి !

క॥ ప్రతివత్సరమున భవదవ, చితి నిత్తిథియందు భక్తిఁ ♦ జేయఁగవలయున్
బ్రతిజనుఁడును జేయనిచో, వెతవడు నవ్వాఁడు విఘ్న ♦ వేధితుఁడగుచున్. 130

ఆ॥ ఈచతుర్థినుండి ♦ యేడాదివఱకిట్లు, నీ సమర్చనంబు ♦ నిత్యమును నొ
నర్చుటిది వ్రతంబు ♦ నగజాకుమారక! , సర్వసిద్ధిదంబు ♦ శర్మకరము. 131

వ. అద్దాని విధానం బెఱింగింతు వినుము.

ఆ॥ భాద్రసితచతుర్థిఁ ♦ బ్రాతరారంభకా, లమున వేగ మజ్జ ♦ నము నొనర్చి
నిత్యకర్మములను ♦ నెఱవేర్చి విజ్ఞులౌ, బ్రాహ్మణులను బిల్వ ♦ వలయు భక్తి.

క॥ మృత్తికతో నేనియు భా, స్వత్తరధాతువుల నేనిఁ ♦ బవడముతో నే
జిత్తాకర్షకముగ గణ, సత్తమ ! నీ విగ్రహంబు ♦ సలుపఁగవలయున్. 133

ఆ॥ మంటపం బమర్చి ♦ మంచిగ నీవిగ్ర, హముఁ బ్రతిష్ఠ చేసి ♦ యర్చనంబు
సల్పవలయు షోడ ♦ శపరికారోపచా, రముల మంత్రపూర్వ♦కముగ విధిగ. 134

సీ॥ మల్లె మొల్లయు బొండు♦మల్లె సంపఁగి జాజి, విరజాది నాగకే ♦ సరము కొండ
గోఁగు మోదుగు రేల♦గోరంట సురపొన్న, పొన్నమంకెన తుమ్మి ♦ పొగడగడిమ
మొగలిమున్నగువాని ♦ పూలఁబొందమ్ములఁ, జెందొవప్రోవుల ♦ శ్రీతులసియు
మాచీపు జమ్మియు♦మ్మాచి విష్ణుక్రాంత, యుమ్మెత్తదానిమ్మ ♦ యుత్తరేణి

గీ॥ రేగు జిల్లేడు వాకుడు ♦ రేల దేవ, దారి వావిలి రావి గ న్నేరు మద్ది
మావిదాసానిగలిజేరు♦మరువము మొద, లగుతరులపత్త్రిఁబూజసే♦యంగవలయు.

వ. మఱియు నీక దూర్వాఙ్కురార్చనంబందు వితస్తిమాత్రపరిమాణంబులుగను త్ర్యంగంబులుగను మూలవర్జితంబులుగ నుండుదూర్వాఙ్కురంబుల నూటయొక్కటిఁగాని బహ్వొంతరంబందు నిరువదియొక్కటిఁగాని యర్పించి పూజింపవలయును.

గీ॥ చెలఁగియిరువదియొకకుడు♦ములనరంటి, పండ్లు టెంకాయలునుజామ♦పండ్లు వెలగ
పండ్లు చెఱకులు నేరేడు ♦ పండ్లు ద్రాక్ష,పండ్లునైవేద్యమిడవలె♦భక్తిమెఱయ.

వ. అనంతరంబందు.

సీ॥ జంబీరరససైంధ ♦ వంబుల మరిచచూ, ర్ణమునవండినపెస ♦ ర్పప్పుతోడ
కొబ్బెరల్లముగసాల్ ♦ కొత్తిమీర్కరివేప, కలయువార్తాకశా♦కంబుతోడ
చణకగోధూమర ♦ జస్తైలమొద్దద, శంబుచేమవ్యంజ ♦ నంబుతోడ
తిలపిష్టగుడజుష్ట ♦ తింత్రిణీరసమృష్ట, పనసఫలాలద ♦ ప్పళముతోడ

గీ॥ చటులసర్షపజీరమా♦షదళరామ, ఠముల నేతిపొగసులదా♦డిమఫలముల
పచ్చడులతోడ గవ్యన ♦ వ్యఘృతదధుల, తోడబంచభక్ష్యాన్నాల♦తోడవరుస.

గీ॥ అమరఁగలమోదనంబుఁదా♦రమునునుచ్చ, రింపుచు మహానివేదనం♦బింపుమైర
చింపవలెనంతబ్రాహ్మణ♦శ్రేణితోడ, నాప్రసాదంబు భుజియింప♦నగు జగమున.

వ॥ ఇట్లొకవత్సరంబు పూజించి వ్రతంబుసల్పి యవ్వల నుద్యాపనంబు సేయవలయు నద్దాని విధం బెఱింగించెద. 140

## —* గణపతివ్రతోద్యాపన విధానము *—

గీ॥ స్థండిలముఁగూర్చియం దష్ట ♦ దళమునందు, నగ్గిని బ్రతిష్ఠచేసి వే♦దాభిహిత వి
ధానముగ హవనముచేసి ♦ ద్వాదశాగ్ర, జన్మలకును సువాసినీ♦జనములకును.

గీ॥ వటుయుగమునకుఁదనివిగ♦భక్ష్యభోజ,నమును దాంబూలదక్షిణల్♦గ్రమముగా నొ
సంగి రే వేగి యమ్మఱు♦సటి యహంబు, నందు నుద్వాసనంబు సే♦యంగవలయు.

వ. అటుపిమ్మట నాకలశంబును సవస్త్రయుగ్మంబైన సౌవర్ణప్రతిమను దక్షిణతో
నాచార్యునకొసంగి యాశీర్వచనంబుఁ బడయవలయు నీయది యుద్యాపనవిధానం
బిత్తెఱం గెవ్వరాచరింతు రట్టివారు ప్రత్యూహ లేశంబేనిఁ గాంచక సర్వసిద్ధులన్
జెంది యఖిలసుఖంబులఁ దనియుదు రిదిసత్యం బెల్లవర్ణంబులవారలుస్త్రీలుపురుషులీ
వ్రతంబాచరించి వాంఛితార్థంబు లొందుదురుఁగాకయని నంతఁ దత్రత్య దేవముని
వరులెల్లరుఁ బ్రత్యయ మొప్పార నమ్మహావ్రతం బీశ్వర సాన్నిధ్యంబున నెరపి
గణనాథు ననేకసువస్తువిస్తారంబుల నర్చించి కృతార్థులగుచు నమ్మహోత్సవం
బెల్ల నీక్షించి యమ్మహాదేవరాజ్ఞి యత్యంతానందంబునఁబొదలె నయ్యవసరం
బున దేవదుందుభిధ్వానంబు లేపు మిగిలిసెలఁగె గంధర్వాప్సరోగీత నృత్తంబులు
బహుభంగుల వెలసెఁ బుష్పవర్షంబులు గురిసె నంత నారాయణప్రముఖాఖిల
గీర్వాణశిరోమణులును మునులును దమ పరిజనములతోఁ బరమేశ్వరానుమతి
స్వస్థానంబుల కరిగిరి మహేశ్వరుండును సంతుష్టయగు మహేశ్వరిన్ గారవించి
లోకరక్షార్థ మఖిలసౌఖ్యంబులఁ జెందుచుండెనని సూతుండు శౌనకాదిమునులన్
గాంచియిట్లనియె. 144

క॥ ఈవిఘ్నేశానజనుః, పావనచరితంబుఁ గూర్మిఁ ♦ బఠియింప వినం
గా వఱలున్ సిద్ధులు నా, నావిభవోన్నతులతో జ ♦ నంబులకు భువిన్. 145

క॥ అనవిని మునివరు లపుడిం, కను శుశ్రూషులయి యని ర ♦ కలుషచరిత ! నీ
కనదమృతరసమయోక్తుల, వినిపింపుము మీఁదికథను ♦ వేడుక నిటులే.

వ. అని యడిగిన సూతుండిట్లనియె.

చ॥ గిరివరకన్యకాశివు లొ♦గిన్ సుతయుగ్మముతోడ సంబరం
బురువుగ నొందుచుం గరము ♦ నున్నతి నుండిరి తారకారిసిం
ధురముఖులుం బరస్పరము ♦ తోసము నివ్వటిలంగఁ బ్రేముడిం
వఱలుచు నుండి రెంతయు సు ♦ పర్వవరుల్ దముఁగాంచి మెచ్చఁగన్. 147

క॥ సర్వగణేశ్వరపట్టము, శర్వుం డార్యయును స్వాత్మ ♦ జన్మలయిన నా
యిర్వురలో నొకనికిఁ గడు, హర్వ్యగఁ గట్టం దలంప ♦ నంత రయమునన్. 148

క॥ శరజన్ముఁడు దనకనియుం, గరివదనుఁడు దనకె యనియు ♦ గాఢస్పర్థా
భరులై తలిదండ్రుల వే, సరఁజేయఁగ నరసి యొక్క ♦ చక్కటివారల్. 149

గీ॥ కొడుకులనుబిల్చి యనిరిట్లు♦గొంకులేక, యెవఁడుమీయిద్దఱందు భూ♦యిష్ఠశక్తి
భూప్రదక్షిణ మొనరించి ♦ మొదటనిటకుఁ, జేరు వానికిఁ బట్టంబు♦ చెందఁగలదు.

క॥ ఇది మేమొనరించిన ప, న్నిదమీయది మీర లెవరు ♦ నెఱవేర్చిన న
య్యది వాని కిడెదమనఁబే, ర్మిదమునఁగదలెను గుహుండు♦పుడమిఁదిరుగఁగాఁ.

వ. అంత నవ్విధంబారసి హేరంబుండు లంబోదరుండౌటకు మిగులఁ జింతించి.

చ॥ అటమటఁజెంది కుంది తన ♦ కయ్యది దుర్లభమంచు నమ్మదో
త్కటముఖుఁ డష్టు సేయునది ♦ గాంచక యొక్క యుపాయమెంచి యా
రటఁగొని తల్లిదండ్రులఁ ద్వ ♦ రన్ దరిసించి కదుఁ బ్రపత్తిలం
పటుఁడయి మ్రొక్కి యిట్లనియె ♦ మంజుతరోక్తుల యుక్తి పెంపునన్. 152

శా॥ తల్లీ! తండ్రి! భవత్పదాబ్జముల ను ♦ ద్యద్భక్తిఁ బూజింప నే
నుల్లంబందుఁ దలంచినాఁడఁ గరుణన్ ♦ యోజించి యద్దాని నా
కుల్లాసం బిడుఁడంచు నాజ్ఞఁగొని ర♦త్నోద్దాత్తపీఠిన్ విరా
జిల్లన్ వారలఁజేర్చి కొల్చి ప్రణతి ♦ స్థేమాభిరామాకృతిన్. 153

గీ॥ వెరవునఁ బ్రదక్షిణంబుల ♦ నిడువదొక్క
మాఱు లొనరించి మ్రొక్కి యి♦మ్మాడ్కిఁ బల్కె
గట్టుఁ డిఁక మీరు నాకు సా♦కతము మెఱయ
సకలగణనాథపట్టంబు ♦ సత్వరముగ. 154

మ॥ అనినన్ వారలు నీవె ముందు సకలా ♦ హార్యాటవీతీర్థవ
త్తనవిస్ఫూర్జితభూస్థలిన్ దిరిగి రాఁ ♦ దథ్యంబుగా నీకె య
ఘనపట్టంబు నొసంగువార మన న ♦ గ్గంధేభవక్త్రుండు పా
వనమౌ నాకృతి సల్పినాఁడ నసకృ♦ద్వారంబు లంబాపితల్ ! 155

ఆ॥ అనిన నిందయుండి ♦ యవని నెట్టులఁజుట్టె, వచ్చినాఁడవనిన ♦ వక్రతుండుఁ
డనియె యుష్మదంఘ్రి♦వనరుహార్చనమును, దమప్రదక్షిణములఁ♦దలఁపుఁడాత్మ.

చ॥ ఇరువదియొక్కమాఱు తమ ♦ కిందుఁబ్రదక్షిణ వందనంబులన్
సరవిగ సల్పి భూభ్రమణ ♦ సత్ఫల మిర్వదియొక్కమాఱు నే
వెరవునఁగొంటి శాస్త్రములు ♦ వేదము లిక్కరణిన్ వచింపఁగా
నరయరె యేటికిం దెలియు ♦ నాలముసేయ జగత్కుటుంబకుల్! 157

గీ॥ తల్లిదండ్రుల సన్నిధి ♦ నుల్లసిలుచు, వేఱుభూముల కేగుట ♦ వెఱ్ఱిగాదె?
వెరవిడి కుమారుఁడిప్పట్లు♦పెరిమెయమరె, నాకు మీకృప నిట్లు సు♦శ్లోకులార!

సీ॥ తల్లిదండ్రుల పదో♦దకముఁ బోలంగలే, దాకాశగంగా మ♦హాజలంబు
మాతాపితలతో స♦మానతఁ గనజాల, రఖిల గీర్వాణచూ♦డాగ్రమణులు

జననీజనకుల పూ♦జనముతో సరిఁబోల, దేదేవపూజనం ♦ బేనిఁ బుడమి
పూర్వపుణ్యము లేక ♦ పొసఁగునే యెవ్వారి, కవ్వారిపూజనం ♦ బడ్డిలేక

గీ॥ తమకు నేఁ జెప్పవాఁడనే ♦ తథ్యమరసి, సరళమతి యుష్మదుక్తిసౌ♦ష్ఠవము నెంచి
సేయుఁ డీక గణమూర్ధాభి♦షిక్తుఁ గాఁగ, జాగుసేయక నను గృపా♦జలధులార!

—* పార్వతీపరమేశ్వరులు గజాననునకు గణేశపట్టంబుఁ గట్టుట *—

వ. అనినంత.

క॥ సూటియగు సామజాస్యుని, మాటలను దదీయబుద్ధి♦మత్కృతిని మదిం
బాటించి పార్వతీశివు, లాటంకము లేక పూని ♦ రట్లొనరింపన్. 160

గీ॥ నగరుఁ గైసేయఁబంచి గ♦ణములఁ బిల్వఁ
బంచి యాక్షణమందు ని♦బ్బరపు పూన్కి
గంధసింధురవదనునిఁ ♦ గరుణతోఁ గ
నత్కనకపీఠి నుంచి గా♦నములు సెలఁగ. 161

వ. దివ్యగంగాకృపీటంబుల నభిషేకించి దుకూలపరిధానోత్తరీయంబులఁ గట్టనిచ్చి నవరత్నఖచితాష్టాపదకిరీటకుండలోర్మికలముక్తాహారంబుల వివిధమణిభూషణంబుల నొసంగి యఖిలగణాధినాథపట్టంబుఁ గట్టి రాసమయంబున సర్వామరులును ప్రమథ భూతగణంబులు హేరంబుఁ దోరంబు మీఱ ననేకవిధంబులఁ బూజించి కొలిచిరంత షడాస్యుండు వేగంబున నిలామండలం బెల్లఁ దిరిగి రోజుచు వచ్చి తల్లిదండ్రుల కెఱిఁగించినఁ గ్రౌంచారి కవ్వార లట జరిగిన వృత్తాంతం బంతయుఁ దెలిపిన నతండు బమ్మెరవోయి యఖిలక్షోణీప్రదక్షిణాయాసక్షోభితుండై నను గొండికమైన బిల్వారిబుద్ధివైశద్యంబున కలరి తితీక్షఁ గొని మిన్నకున్నంతఁ గొన్ని దినంబుల మీఁదట 162

—* విశ్వరూపుఁ డిద్దఱుకూఁతుల గణపతికిచ్చి పెండ్లిసేయుట *—

గీ॥ విశ్వరూపప్రజాపతి ♦ విఘ్ననాయ, కునకుఁ దనసుతల నొసంగఁ ♦ గూర్మితోడ
వచ్చి శివునర్థిఁ గోరుడు ♦ వామదేవుఁ, డనుమతింపఁగ నాతఁ డా♦హ్లాద మొంది.

చ॥ హిమగిరిజాశివానుమతి ♦ నీద్యుఁ డతండు మహోత్సవంబుఁ బె
ల్లమరిచి సిద్ధి బుద్ధి యను ♦ నాత్మజలన్ గణభర్తకిచ్చి యు
క్తముగ వివాహమున్ సలిపెఁ ♦ గాంచనగర్భునిదొట్టిమేటులౌ
నమరులు మౌనులున్ ఋషులు ♦ హర్షమునొంది చెలంగి రంతయున్. 164

చ॥ తళుకు మెఱుంగు చూడ్కులును ♦ దద్దయుముద్దులుగుల్కు నెన్నడల్
బెళుకుహారంగు బంగరపు ♦ బింకపు గుబ్బకవల్ గడుఁగడుఁ
హులికిగఁదోఁచు నెన్నడుము ♦ లొప్పెడు నొప్పులకుప్పలౌసతుల్
బలితపుబాళిఁగొల్వఁ గణ ♦ పాలకుఁ డొందెఁ గడింది సౌఖ్యముల్. 165

—* గణపతి కిద్దఱు భార్యలం దిద్దఱు పుత్త్రులు జన్మించుట *—

గీ॥ కొంతకాలంబు జరుగ నా ♦ కోమలాంగు, లందు సిద్ధికి క్షేమాఖ్యుఁ ♦ డల్లబుద్ధి
కమర లాభాఖ్యుఁ డాత్మజు ♦ లవతరించి, మించి రంచిత వైభవా ♦ మేయులగుచు.

వ. అటమీఁదఁ బార్వతీపరమేశ్వరులు వధూద్వయంబులతోడనొప్పు పుత్త్రిద్వ
యంబుతోడను పౌత్రులతోడను నిరతిశయనిత్యానందంబునఁ బొదలుచుండి
రిచ్చరిత్రం బఖిల పాపఘ్నంబు భోగమోక్షప్రదం బిద్దాని నాదరంబునఁ జదివిన
వినినవారలందు.

—* ఫ ల శ్రు తి *—

సీ॥ విద్యార్థియగువాఁడు ♦ విద్యను జెందు ద్ర, వ్యార్థియైనతఁడు ద్ర♦వ్యంబుఁ జెందుఁ
గన్యార్థియగువాఁడు ♦ గన్యను బెండ్లాడుఁ, బుత్త్రార్థియగువాఁడు ♦ పుత్త్రులఁ గను
భోగార్థియగువాఁడు ♦ భోగములఁ జెందు, మోక్షార్థియగువాఁడు ♦ ముక్తినొందు
రాజ్యార్థియగువాఁడు ♦ రాజ్యమార్జించు య, శోర్థియైనాతఁడు ♦ యశముఁ బడయు
గీ॥ రుగ్ణుఁడైకుందునట్టిఁ డా ♦ రోగ్యమొందు, ఋణభరాక్రాంతుఁడొందును ♦ ఋణవిముక్తి
గొప్ప యిక్కట్టులందు గ ♦ గ్గోలుపడెడు, వాఁడు నిర్వృతిఁ జెందును ♦ వాస్తవంబు.

వ. అనిచెప్పిన సూతునకు శౌనకాదిమునులు మహాత్మా! యింకను బార్వతీశ్వరుల
లీల వేఱొక్కఁ డెఱింగింపుమనుటయు నతం డిట్లనియె. 169

క॥ శుంభద్భుజవిక్రమసం, రంభులు జంభారిముఖసు ♦ రభయంకరులౌ
శుంభనిశుంభాసురులు వి, జృంభించి జగంబులేఁచ ♦ సేగిఁగొని సురల్. 170

గీ॥ ధాతకడ కేగి యవ్వారి ♦ దౌష్ట్యమెల్ల, నుడువ నాతఁడు గనలి య♦నూ్యనమైన
వారివరబల మారసి ♦ వామదేవు, వలని కేతెంచి వారి కా ♦ వర ముఁ దెలిపి.

ఉ॥ వీరల కేను మున్ను పృథి ♦ వీధ్రసుతాప్త! వరం బొసంగితిఁ
బూరుషులేరు వారలను ♦ బొంకమణంపఁగఁ జాలనట్లుగా
సారసగంధి పూరుషులు ♦ సంగతిఁ జెందని జోటి వారలన్
మారణముఁ బొనర్చునటు ♦ మంటయదయ్యె జగత్త్రయంబునన్. 172

చ॥ ఇలఁగల పైదలుల్ సలుపు ♦ చెంతయు దుర్లభ మిట్టికార్య మీ
లలిత భవత్పురంధ్రియె ల ♦ [illegible]

చెలఁగి వధింపఁగావలయుఁ ♦ జెచ్చెర ఘోరనిశాచరద్వయిన్
ఛలమెదిరేఁనిఁ బన్ని తిరిద ♦ శపిరియముర్ బొనరింపు మీశ్వరా! 173

—* శివుఁడు పార్వతీదేవినిఁ గాళియన నామెగినిసి నిష్ఠురోక్తులాడుట *—

గీ॥ అనుచుఁబ్రార్థించినట్టి స్వ ♦ యంభుమూర్తి, కవ్వరంబిచ్చి పంపి ని♦జాత్మమందు
వెరవునరయుచు నొకనాఁటి ♦ వేళఁగాళి,యనిహాసించెనునిందించి♦నట్టు లుమను.

ఉ॥ అనుడివిన్నతోడనె య ♦ గాత్మజ పెల్లవధీరితాత్మయై
మానసమందు బెగ్గిలి య♦మర్షభరేక్షులఁజూచి యిట్లనెన్
గానవె నాఁటనుండి ననుఁ ♦ గాళిగ నీకిటుఁ బ్రీతిలేనిచో
మానక యిన్నినాళ్ళిటుల ♦ మారిన్పడనేల కలాదభూషణా! 175

ఉ॥ కూరిమిలేని నాదురతిఁ ♦ గోరుదువీవెటు లిక్కతాననే
మారునిఁగాల్చిపోయి తను ♦ మానముసేయక నేనె ముగ్ధనై
చేరితిఁ బట్టుఁబట్టి యిటు ♦ చెల్వగు నేచెలియేని దానయై
పూరుషుఁగోరి చేరు నది ♦ పొందు నవజ్ఞ దృఢంబుగా ధరన్. 176

చ॥ మగనికిఁ బ్రీతిలేని యల ♦ మానిని జవ్వనమేనిఁ జెల్వమే
నగు వనిఁగాయువెన్నె లటు ♦ లక్కట! యెట్టిసుఖంబులేనియున్
మగువల కింపొనర్పవిఁక ♦ మంచిగఁ గాంతుఁడు గారవించకే
వెగటుఁగొనంగ నిక్కముగ ♦ వెక్కసమా తను వెంచి చూడఁగన్. 177

గీ॥ కానఁబాసెద వేగనీ ♦ కాలవర్ణ, తనువు వేరొకఁడేనియుఁ ♦ దనువుఁదాల్తుఁ
దాల్పకుండిననేమని ♦ తల్లడిలుచుఁ, బాన్పువిడియవ్వలకునేగి ♦ పద్మగంధి. 178

ఆ॥ వెక్కివెక్కి యేడ్చి ♦ విభునకిట్లను దేవ!, సెలవుచేయు తపముఁ ♦ జేయుదాన
ననుచు గద్గదస్వ ♦ రాంచితయై వేడు, కొనఁగఁజూచి విశ్వ♦గురుఁడు పలికె.

ఉ॥ కెందలిరాకుఁబోఁడి! యిటు ♦ కేళిగ నాడిన నా నుడిన్ మనం
బందుఁ దలంచి యల్గెదవె? ♦ యందము చందమునందు నీకు నే
సుందరి యీడురాఁగలుగుఁ ♦ జూడఁగఁ దప్పిదియేని నాదు వా
క్కందుఁ గనన్ బడన్ సయిపు ♦ మంఘ్రిలవాలి యొనర్తు సేవలన్. 180

ఉ॥ నీయెడ నాకు వేడుక జ ♦ నింపక యున్న నిఁకెందుఁగల్గునో
పాయక యెంచు మాత్మమున ♦ భామరో! వేమఱు చెప్పనేల? యీ
స్థాయదనంతవిష్టపవి ♦ భాసితసంతతి కీవు తల్లివై
శ్రీయలరారుచుందు విఁక ♦ సిద్ధము తండ్రిని నే నెఱుంగుమా! 181

గీ॥ అట్లగుటఁ జేసి నీయందు ♦ ననరతి నాకు, నెట్టులేర్పడు నిఁక మన ♦ యిద్దఱందు
సురతలాలస మరునిచేఁ ♦ జొప్పడినది, కా దతనికన్నమున్న జ ♦ గంబు పొడమె. 182

గీ॥ విను పృథగ్జనరతి కలి ♦ వేణి! పంచ, బాణుఁ గారకుఁగాఁగ నే ♦ ర్పఱచినాఁడ
నటులగాకున్న మన్మథు ♦ న స్తమింపఁ, జేసి నిను బెండ్లియాడుట ♦ సిద్ధమగునె!

క॥ మరుఁడును నను వేల్పులతో, సరిగఁ దలఁచి కలఁచి భస్మ ♦ సాత్కృతుఁడయ్యెన్
గిరిజ! జగత్త్రాణార్థం, బరయుము మన యిర్వురకు వి ♦ హారం బవనిన్. 184

ఉ॥ ఇత్తఱిఁ బల్కఁగూడ నిఁక ♦ నేదియొగాని జగచ్ఛుభార్థమే
హత్తఁగఁ దోఁచు నద్ది భవ ♦ దాత్మవశంబయి పొల్చు నింతలో
చిత్తరి! రిత్తయల్క నిఁకఁ ♦ బెంపొనరింపకు సాకతమ్మునన్
జిత్తమునందు నీచరణ ♦ సేవకుఁగాఁగ నెఱుంగవో ననున్. 185

గీ॥ ఇట్లు పరిపరివిధముల ♦ నీశ్వరుండు, గట్టురాచూలి కాత్మవై ♦ కల్యమణఁపఁ
జాల వాచాలత దనర్ప ♦ సాంత్వనంబు, చేసినను దేఱక నితాంత ♦ చింతతోడ.

గీ॥ వేఁడినిట్టూర్పు విడిచి పూఁ ♦ బోఁడి యనియె
యిచ్చకములాడి నన్నింక ♦ నేచఁబోకు
నీదు చాటూక్తులకు లోఁగి ♦ నేను దెలివి
మాలి వంచింపఁబడితి నీ ♦ లీల నిపుడు. 187

గీ॥ మగనికిన్ బ్రియగాకున్న ♦ మగువప్రాణ, ములను బాయఁగఁదగు నట్లు ♦ పూనకున్నఁ
దెగినదని యెల్లవారలు ♦ నగుదురెందు, నవని యున్నంతకాలంబు ♦ హాలహలగళ!

ఉ॥ ఎంతయు నీకు నాతనువు ♦ హేయముగాఁ గనుపట్టుచున్న ని
ట్టింతటి కోర్చి నన్నిటుల ♦ నెల్లిదమాడెదె కాళియంచు? నే
నింతటి నల్పుదాననగు ♦ టెంతయు దోసము నీది లేదు త
న్వంతయు సేయుదుర్ జదురు ♦ లాడకు నీవిఁక మేటి మచ్చికన్. 189

—* పార్వతీదేవి శివుని సెలవడిగి తపస్సుకుఁ బోవుట *—

గీ॥ స్త్రీలయందిట్లు కార్ష్ణ్యంబు ♦ చెడ్డయనుచు, ఘనులు పలుకుదు రద్దాన గాఢతపము
చేసి పాయుదు నైర్ల్యంబుఁ ♦ జెఁగియిచట, నుండఁగా నోపనడ్డంకి ♦ యుడుగు మార్య!

గీ॥ అనినవిని శంకరుఁడు దర ♦ హాస మమర, నిట్టులనె విరిఁబోఁణి! నీ ♦ కేల తపసు
పాయఁగాఁ జేతుఁ గార్ష్ణ్యమి ♦ ప్పాట నేను, లేక నీవేనిఁ బాయఁగ ♦ లేవె చెపుమ.

వ. అనిన మహాదేవి యిట్లనియె.

ఉ॥ ఒల్లను నీసహాయ మది ♦ యొల్లను నాదు విభూతి నొందఁగా
నుల్లము శాంతినొంద దటు ♦ లుగ్రతపస్సొనరించి కాళిమన్
బొల్లుగ నుజ్జగించెదను ♦ బొచ్చెముజోలిఁ దలంప నీకికన్
జెల్లదు దేవ! వేగ దయ ♦ సేయు మనుజ్ఞ జొహారు చేసెదన్. 192

గీ॥ అనుచుఁ దప మెవ్వరినిఁగూర్చి ♦ యాచరింతు
వబ్జముఖి! యన్న నామె యి♦ట్లనియె మరల
దేవ! నినుగూర్చియే చేతు ♦ దివ్యతపముఁ
గాంచెదన్ గాంచనాకార ♦ గాత్రిమేను. 193

క॥ అనిన మహాదేవుఁడు దే, విని గని చిఱునగవు నగుచు ♦ వేల్పుల కార్యం
బును ఘటన సేయుటకు వల, దని నిర్బంధింపకున్న ♦ నార్య రయమునన్. 194

క॥ క్రందుకొనునట్టివగతోఁ, గంది ప్రదక్షిణము చేసి ♦ కాంతుని విరహా
ర్తిం దవులచేసి హిమనగ, ముం దఱిసి గిరీంద్రమిథున ♦ మును గని ప్రీతిన్. 195

క॥ వందనము చేసి వారల, కుం దన తెఱఁగెఱుక చేసి ♦ కూరిమితో ము
న్నొందుఁ దపం బొనరించెనొ, యందే వాసంబు చేసి ♦ యాదర మొప్పన్. 196

గీ॥ భూషణంబుల విడనాడి ♦ పూవుఁబోఁడి, గగనధునిఁ దానమాడి వ♦ల్కలముఁ గట్టి
నియతసంకల్ప మొనరించి ♦ నిష్ఠ మెఱయ, శైవలింగార్చనంబుఁ ద్రి♦సంధ్యలందు.

క॥ సలుపుచుఁ దప సొనరించెను, ఫలదళజలభక్షణముల ♦ బహుకాలము నె
చ్చెలులలరి కెలన సేవలఁ, గొలువఁగఁ జలిమలయనుంగు ♦ కూఁతురు ప్రీతిన్.

## —* వ్యాఘ్రము పార్వతీదేవియొద్దకు వచ్చియుండుట *—

క॥ ఇటులఁ జిరకాల మరుగుడుఁ, గుటిలాత్మక మొక్క ఘోర ♦ గోహరి యుమ న
చ్చటఁ బొడఁగని యశనేచ్ఛన్, జటులగతిన్ డాయ శైల♦జయు సాజముగాన్.

గీ॥ చెలులతోఁ బాటుఁ గనిదాని ♦ నలుకు లేక
తొంటివ లెనుండ వ్యాఘ్రమా ♦ తుహినకుధర
జాతనూద్భూతరోచుల ♦ స్తబ్ధతను వ
హించి యుండెఁ గరము విస్మ ♦ యించి యందు. 200

వ. అంత.

చ॥ ప్రబలబుభుక్షఁ గోల్పులి ధ♦రాధరపుత్రిని డాసియున్ దదా
త్మబలవిధూతతాపయయి ♦ ధ్వస్తమలత్రయమై పరాంబికన్
నిబిడతరేహఁగొల్చుచు వ♦నేచరఘాతుక సత్వరాజి కెం
దు బిరుదుమీఱు శాస్త్రయయి ♦ దోఁచెను నిచ్చలు గావు సేయుచున్. 201

చ॥ గిరిజయు దానిపైఁ గరుణఁ ♦ గీల్కొనఁజేసి యపత్యబుద్ధి వి
స్తరిలఁగఁ జేసెఁ దత్సఖులు ♦ దారును నెగ్గొదలంపరైరి గో
హరియును నంత నాత్మకుఁ గృ♦తార్థత నెంచి యహర్నిశంబులన్
నిరుపమభక్తి లోకజన♦నిన్ భజియించుచునుండె దండిగన్. 202

గీ॥ దుష్టసత్త్వంబులకుఁగాని ♦ దుర్మతులకుఁ, గాని యత్త్రిత్తిచూచుట♦కేని వలను
గాకయుండెను జగదీశ♦కాంత యెదుటఁ, గడఁగి శార్దూలరాజంబు♦గాపుఁగొనుట.

క॥ అంతఁ బరమేశకాంత ని,రంతర తప మెంతయేని ♦ రాజిల్లెఁ గడు దు
ర్దాంతులగు దైత్యవరుల ని,తాంతశ్రమ డస్సి సురలు ♦ ధాతను వేడన్. 204

-* బ్రహ్మదేవుఁడు పార్వతీదేవియొద్దకు వచ్చి యొక శక్తినిఁ బుట్టింపుమనుట *-

క॥ అతఁడు వెరపున నమర, వ్రాతములోఁ దుహినగిరికి ♦ వచ్చి త్రిజగతీ
మాతను మృడానిఁగని సం,ప్రీతిమెయిన్ మ్రొక్కి నుతులఁ ♦ బెల్లుగ సల్పన్.

చ॥ కని గిరిరాజపుత్త్రి కడు ♦ గారవ మొప్పఁగఁ దమ్మిచూలికిన్
గొనబుగ నర్ఘ్యపాద్యములఁ ♦ గూరిమి స్వాగతమున్ బొనర్పఁగా
వనరుహసంభవుం డలరి ♦ వారనిభక్తి దలిర్ప నంజలిన్
గొని యిటు పల్కె నజ్జగతి ♦ కోమలపేశలమంజులోక్తులన్. 206

ఉ॥ తల్లి! యిదేటి కిట్లడరి ♦ దారుణతాపముఁ జెందుచుంటి వీ
వెల్ల జగంబులేలు పర ♦ మేశ్వరి వొక్కటి నీకుఁదక్కవే
పెల్లుగ మున్ దపించి యల ♦ విశ్వగురున్ విభుఁగాఁగఁగొంటి వీ
వల్లసుధాంశుమౌళివిర ♦ హంబెటుసైఁపఁగనోపి తీయెడన్. 207

గీ॥ అనిన వనజాతలోచన ♦ యనియె నలువ, కాదిసర్గంబునన్ బర♦మాత్మ శివుఁడు
నిన్ను సృజియించుటన్ జేసి♦నీవునాకు, సుతుఁడవై చెలువొందెద♦వతులతేజ!

క॥ మరలఁ బ్రజాసర్గమునం, దిరవుగ నీయలికమున మ♦హేశుఁడు పొడమన్
గురుతఁదగుశ్వశురుఁడవు భూ, ధరునకుఁబితవౌట నాకుఁ ♦ దాతవు ధాతా! 209

వ. కావున రాణివాసంబు ముచ్చటనెట్లు నీయెట్టయెదుర గుట్టునీడి రట్టడికోర్చి
మునుముట్టన్ దెలుపుదునైన నొక్క చక్కటి యాలకింపుము. 210

ఉ॥ నాదుశరీరమిద్ది కడు ♦ నల్పుగనుండుటఁ జేసి దీనిపై
నాదరబుద్ధి మానితిని ♦ నచ్చుపుపైఁడియుఁగూడ నీదరా
లేదనుమేను నూన నొక ♦ లీలఁగ నిట్లు తపించుచుంటి నీ
నీదు సమాగమం బిపుడు ♦ నిక్కము హేతువు తద్విభూతికిన్, 211

గీ॥ అనిన బిసరుహాభవుఁడిట్టులనియెఁ దల్లి!, యింతమాత్రమునకె తపంబిట్లు దుస్స
హముగఁ జేయంగవలయునే♦యైన నీదు, లీల లోకహితార్థమె♦కాదెఁగాదె?

క॥ శుంభనిశుంభాసురులు వి,జృంభితులై సకలసురల ♦ చేవయడంచి యి
ట్టుంభినిఁ గలంచుచుండిరి, గంభీరకృపాంబురాశి! ♦ కడఁ ప్రుమువారిన్. 213

ఆ॥ శక్తి నీవుదక్క♦నక్తంచరేంద్రులఁ, బెఱులు చంపఁజాల ♦ రరయ యంబ!
వరము వారికిడితిఁ ♦ బురుషవధ్యులుగాక, కన్యయువతిచేఁ బో♦కారునట్లు. 214

వ. కావున

ఉ॥ నిర్మలబుద్ధి నీపదవ ♦ నేజములన్ భజియింతు నీజగ
చ్ఛర్మముఁగోరి నీవిఁకను ♦ సత్వర మానలుపొప్పియున్న యీ
చర్మము పేరితోఁ జెఱుత ♦ శక్తిని నీడి మదంబ! దాన నీ
దుర్మతులైన రక్కసులఁ ♦ ద్రుంపఁగఁజేసి జగంబు లేలుమా! 215

—* పార్వతీదేవి కౌశికిన్ బుట్టించి తాను గౌరియగుట *—

క॥ అనియజుఁ డభ్యర్థింపఁ దు, హినగిరిసుత చర్మకోశ ♦ మెలమివిడి రయం
బునఁ గనక కేతకీసుమ, కనదుత్తమగౌరియై ని ♦ కామంబలరెన్. 216

గీ॥ అంబ త్వక్కోశమునఁ దృక్త ♦ మైన శక్తి, కౌశికీనామధేయయై ♦ కాలమేఘ
నిభశుభాకారకన్యయై ♦ నీటుమీఱ, మెఱసెఁ దామరచూలి యా♦లరెఁగరంబు.

సీ॥ శంఖచక్రగదాది ♦ సకలసాధనసంయు, తాష్టమహాభుజ ♦ యైనదాని
ఇంద్రనీలంబుల ♦ నెకసక్కెమాడు ర, మ్యాంగయైన కృష్ణగా ♦ త్రంబుదాని
సూర్యచంద్రాగ్నుల ♦ సొంపుఁగన్పించు దీ, వ్యద్దివ్యనేత్రత్ర ♦ యంబుదాని
నవరత్నఖచితక ♦ నకనిర్మితోజ్జ్వల, త్కలిత చంద్రార్ధశే ♦ ఖరముదాని

గీ॥ మేల్మి బంగరువలువల ♦ మెఱయుదాని, సుందరీతిలకంబయి ♦ చొక్కుదాని
పూరుషస్పర్శనెఱుఁగని ♦ పూవుఁబోణి, నంబయీ దేవకార్యార్థ♦మజునకపుడు.

వ. అంతఁ గాంచనగర్భుండు ప్రీతుండై యమ్మహాదేవిపఱుంగట మెలంగుచున్న
శార్దూలవరంబున్ గాంచి విస్మితుండై యద్దానిపై వెగ్గలంబగు వాత్సల్యంబుఁ
బఱపు నప్పరమేశ్వరి కతండిట్లనియె. 219

ఉ॥ అమ్మ! యిదేల క్రూరమృగ ♦ మం దిటు లక్కటికన్ బొనర్చె దీ
విమ్మహి నాగుఁబాముసకు ♦ నింపునఁ బాలను బోసినట్లు ని
క్కమ్మగు కూరిరసత్వమును ♦ గా దిది యెక్క నిశాటఘాతుకం
డెమ్మెయి దీనిపై నెనరు♦నించ జనించు విపత్పరంపరల్. 220

ఉ॥ ఎన్నియొ గోవులన్ దినియె ♦ నెందఱనో ద్విజులన్ వధించె నిం
కెన్నియొ బన్నముల్ సలిపె ♦ నెందఱికో యిఁక నిట్టి నీచుపైఁ
జన్నె భవత్కృపాసుధను ♦ జల్లఁగఁ దల్లిరో! యివ్విధంబునన్
మున్నొనరించినట్టి యఘ ♦ మున్ గుడిపింపఁగఁ జెల్లు వీనికిన్. 221

వ. ఇంతకు నిసర్గదుష్టుండగు వీనితో నీకుఁ బనియేమనిన నమ్మహేశ్వరి తమ్మిచూలి
కిట్లనియె. 222

ఉ॥ నీవనినట్టు లెట్టి యవి ♦ నీతఁడుగాని యితండు మున్ను వ
న్నీవిపినంబునన్ దఱిసి ♦ యెంతయు భక్తి భజింపుచుండె నే
కావలఁదైన నవ్విధముఁ ♦ గాంచను నేనిట దుష్టసత్త్వవి
ద్రావకుఁడై ననున్ గొలిచె ♦ రాతిరియుం బవ లేకధీకతన్. 223

ఉ॥ కావున వీని నాత్మసుతుఁ ♦ గాఁగని నా నిలయంబునన్ మహా
దేవుని యాజ్ఞతోడ నొక ♦ దివ్యగణాగ్రణిఁ జేసెదన్ సుహృ
ద్భావము చెల్లు నట్లయినఁ ♦ బన్నుగ నింతటికన్న మిన్నలే
దేవిధమేని నాకుఁ బ్రియ ♦ మెంచుము దీనిఁ బయోజసంభవా! 224

ఆ॥ అనిన బ్రహ్మదేవుఁ ♦ డనియెను జనని! నే, నెఱుఁగకిపుడు వీని ♦ యింగితంబు
దొంటివృత్త మిట్లు ♦ దొడరిచెప్పితి నీదు, భక్తిఁ జెందె నేనిఁ ♦ బరపు దయను.

క॥ పుణ్యంబు లేమిసేయును, గణ్యంబగు నీదుభక్తిఁ ♦ గాంచనియెడఁ గా
రుణ్యమతి! తావకాంఘ్రి శ, రణ్యుండగు భక్తుఁ డెందు ♦ రవ్వఁగనఁడిలన్.

సీ॥ నీయధీనముగదా ♦ నిఖిలజంతువులకు, బంధమోక్షముల సం ♦ ప్రాప్తి భువిని
పరమశక్తిని నిన్నుఁ ♦ బాసి యేకర్మంబు, లందు సిద్ధినిఁ జెందు? ♦ నవని జనుఁడు
సర్వభావములందు ♦ స్వయమభవవునునై, నీవె యూఁతవుగదా ♦ నిత్యమూర్తి!
అంబుజాక్షాదిది ♦ వ్యగ్రామమునకు నీ, యాజ్ఞ యైశ్వర్యభా ♦ గ్యావహంబు

గీ॥ కడచి రెందఱో నీయాజ్ఞ ♦ గరుడకేత, నాబ్జభవు లిఁక రాఁగల ♦ రట్టివారు
నిన్నుఁ గొలువక పురుషార్థ ♦ మెన్నఁడేనిఁ, జెందఁ జాలము దృఢమిది ♦ శివునిరాణి!

క॥ శక్తివిహీనుఁడు పుడమి న, శక్తుం డేపనినిఁ జేయఁ ♦ జాలం డరయన్
వ్యక్తమగు నిద్ది యే య, వ్యక్తులకున్ గూడ విష్ట ♦ పత్రియజననీ! 228

క॥ నీ వలిగినయెడ బ్రహ్మను, గావింతువు గసవుగాఁగఁ ♦ గరుణగలిగ నే
నే వెడఁగునైనఁ జేసెదు, శ్రీవిభునిగ నీదు మహిమ ♦ చిత్రం బంబా! 229

గీ॥ అఖిలజగదీశ్వరుఁడుఁ బర ♦ మాత్మయు నగు, శివునకీవిఁకఁ బుట్టుక ♦ చేటు లేని
యాసనాతనశక్తివి ♦ యైనలోక, యాత్రకై యొక్కరూపంబు ♦ నందితిట్లు. 230

వ. అట్లసాధారణమహిమాతిశయంబునకుగాణాచియైన నీవిభూతి ప్రకారంబెవ్వరెఱుం గఁగలరు? దుష్కృతకర్ముండైనను నీశార్దూలంబు నీ యనుగ్రహంబున మహోన్నతసిద్ధిఁ బొందె నిందుఁ బ్రతిబంధకంబు లేదనిన నవ్వనజ సంభవు నను గ్రహించి యంబికాదేవి కౌశికిన్ దేవకార్యంబు సల్పుమనుటయు.

—* కౌశికి శుంభనిశుంభాదులను జంపి వింధ్యగిరియం దుండుట *—

ఉ॥ తల్లికి జోతచేసి ప్రమదంబున నాపెయనుజ్ఞఁ గౌశికీ
వల్లకపాణి రక్కసుల నంతముసేయఁగఁబూని ధాతతోఁ
బెల్లుగ వింధ్యశైలవరపృథ్విని జేర నజుండు పేర్మి సం
ధిల్లఁగ నొక్క సింగమును దేవికి వాహన మిచ్చె మచ్చికన్. 232

క॥ ఆసవములఁ బలములఁ గడు, మీసరపుంజలజముల నమేయాపూపో
ద్భాసితదివ్యాన్నంబుల, వాసిగ నిడి కొల్చి పంప వరద రయమునన్. 233

ఆ॥ తా ననేకశక్తి తండంబుఁ బుట్టించి, వారితోడ సమర వసుధఁ జేరి
దైత్యవరులఁ బిలిచి దర్పంబునన్ బంపె, శరవితతులఁ గామశరనిహతుల.

వ. లోకకంటకులగు నాదైతేయగ్రామణుల మరణంబున కలరి నలినసంభవుండు జేజే లతోఁ గౌశికిన్ బలువిధంబులఁ బూజించి యవ్వింధ్యాచలాధిపత్యంబిచ్చియంద కాపురంబుండ నర్థించి యుంచె. 235

—* శివుఁడు పార్వతీదేవియొద్దకువచ్చి గోపోపశమనంబుచేయుట *—

క॥ అంత శివుం డుమ సుమన, స్సంతతిహితకార్య మెలమిఁ జక్కవఱచి య
త్యంతం బంచత్కాంచన, కాంతాంగికయుగుట యరసి కడువేగమునన్. 236

ఆ॥ డాయవచ్చియనెఁ గడానిబొమ్మరో! మది,గుదురువడెఁ దపంబు గొప్పఁజెందె
రమ్ము! పోదమివుడు రాజతాద్రికివేగ, ననుచు గౌరి బిగ్గ నక్కుఁజేర్చె.

ఉ॥ ఆలలితాంగియున్ విభుని యంఘ్రులకున్ బ్రణమిల్లి యంత నే
యాలముతోడఁ గొంచెమెడ యై ముఖపద్మము వంచినిల్వనా
బాలశశాంకశేఖరుఁడు భామను డాసి కరంబు కౌఁగిటన్
మేలుగఁజేర్చి యెత్తికొని మిక్కిలి ముద్దిడి పల్కె నిట్టులన్. 238

గీ॥ కనుము సర్వాంగసుందరి! కరుణనివుడు, గడచె నాదశ యెద్దాన గాటమైన
యనునయోపాయమదియు నిరర్థకంబు,గా మఱఁగెనల్కఁ బార్వతి సోమముఖిరో!

సీ॥ రమణిరో!స్వేచ్ఛావి రాజితాకృతులమై, పరమభావంబును మఱచుకొట్లు
కలుగ చెప్పుడు చిత్త కాలుష్యహేతువు, లరయు సుందరిరో! తథ్యంబుగాఁగ

పెఱవారికట్లు వి♦ప్రియకారణముమన, కన్యోన్యమొదవఁగా♦నడఁగు జగము
వాగమృతంబెల ♦ నాగ! నీవచ్చమౌ, నర్థామృతంబు నే ♦ నవనియందు

గీ॥ అరయ వాగర్థమయము సు♦మ్మఖిలలోక, మిందు నీ యమృతద్వయం♦బెవ్విధమున
విప్రియుక్తంబగుట కోపు!♦విద్రుమోష్ఠి!, శాస్త్రయుక్తిప్రసిద్ధమి♦జాడఁదెలియ.

క॥ అగ్ని శిరోనిష్ఠుఁడఁ గ్రితు, భుగ్నుత! విను మేను నిక్క♦ముగ సోమశిరో
భాగ్నిలయ వీవు విశ్వం, బగ్నిషోమాత్మకమిది ♦ యరయ మఖిలమున్. 241

క॥ విద్యవు నీవబ్జముఖి!, వేద్యంబగు జ్ఞాన మేను ♦ విశ్వంబం దీ
విద్యావేద్యాత్ములమై, హృద్యగతిఁ వెలయుచుందు ♦ మెడఁబాటులా. 242

చ॥ జగముల నే సృజింపుటయుఁ ♦ జంపుట వేఱొకరీతి చేతఁగా
దు గణుతిసేయు మీవ యిటు ♦ దోఁచఁగ జేసెదు మామకాజ్ఞపై
నిగరపుటాజ్ఞయే బలిమి ♦ నేతకు నిచ్చలు నద్దివాయుచోఁ
దగు నెటు ప్రాభవంబుగను ♦ దామరసాయతలోచనా! యిఁకన్. 243

ఆ॥ ఎందుఁగాని మనకు ♦ నెడఁబాటులే దెప్పు, డట్టి మన వియోగ ♦ మద్భుతంబు
లోకరక్షకొఱకుఁ ♦ జేకొంటి మాకృతు, లస్మదీయలీల ♦ యగునె వృథగ!

క॥ దేవతలకార్య మెదలో, భావించియె కాళి యంటి ♦ భామామణి! ని
న్నావిధము నీవెఱుంగని, దై వెలసెనె యలుగనేల? యందుల కిటులన్. 245

క॥ అది యిటు జగదవనార్థం, బొదవెను నీయందిఁకన్య ♦ మొదవదు ప్రేమా
స్పదమతి! యరయుమనఃప్రియం, వదుఁడగు విభుసూక్తులరసి ♦ వాసిగ నంతన్.

—✱ పార్వతీదేవి యలుకఁ బాసి శివునకుఁ గౌశికీవృత్తాంతంబుఁ జెప్పుట ✱—

గీ॥ సకలశృంగారభావైక ♦ జన్మభూమి, గౌరి తథ్యం బెఱింగి య ♦ ల్కన్ దొలంగి
మందహాసంబు లజ్జయు ♦ మల్లడింపఁ, బలికెఁ గౌశికి నెన్నుచుఁ ♦ బ్రభునకిట్లు.

ఉ॥ దేవర! చూడవైతి వళి ♦ దివ్యతనూజ్జ్వలమైన కౌశికిన్
దేవహితార్థమై సలిపి ♦ తిన్ భువనంబులలోన నెందు నే
నావనితాకృతిన్ గనఁగ ♦ నానొకొ దానవవీరవర్యులన్
గావలులన్ వధించి తగఁ ♦ గాపురమొందెను వింధ్యభూస్థలిన్. 248

వ. అద్దాని రూపసామర్థ్యాతిశయంబు లెల్లఁ దమకుఁ జతురాననుండే యెఱింగింపఁ గలండని యాళీజనంబులకు శార్దూలానయనంబునకై సెలవొసంగ నవ్వారలు వ్యాఘ్రింబుం దెచ్చి యెదురనిల్పన్ గాంచి యమ్మహాదేవి విభునకిట్లనియె. 249

—✱ పార్వతీదేవి శివుని వ్యాఘ్రమును దౌవారికునిగఁ జేయుమనుట ✱—

ఉ॥ నాథ! యుపాయనం బిది క ♦ నన్దగు వ్యాఘ్రము దీనితో సముం
డీధర నాకుభక్తుఁడొక ♦ డేనియు లేఁడు దివానిశంబు లీ

భూధరభూమి నా నిలయ ♦ మున్ దగఁగాచెను ఘోరసత్త్వదు
ర్బాధలు లేకయుండఁ గడు ♦ భక్తి నతండి్రతమై మెలంగుచున్. 250

శా॥ నాయం దెక్కుడుప్రేమ యున్నయెడలన్ ♦ నావేడ్కఁ జెల్లించుచో
నాయంతఃపురమందుఁ గావలిగ న ♦ న్నందీశ్వరాజ్ఞన్ గడుం
బ్రేమోద్వైఖరి దీనినుంపు తోడవుల్ ♦ బేర్మిన్ బొసంగించి దా
సేయవ్రాతములోఁ బ్రియంబుగఁ గృపా ♦ సింధూ! జగద్రక్షకా! 251

గీ॥ మధురమును బ్రణయోదర్క ♦ మంజులంబు, నైన దేవీవచనమును ♦ నాలకించి
బ్రీతి నొందితినని శివుం ♦ డాతతాద, రమున నద్దానిఁ జూడ వే ♦ గమున నదియు.

గీ॥ మేల్మి బంగారు బెత్తంబు ♦ మెఱయునాగుఁ, బాముఁ బోలిన వాలును ♦ భాసురంపుఁ
గనకరత్నవిచిత్రమౌ ♦ కంచుకంబు, గలిగి యొప్పెందె రక్షకా ♦ గ్రణిగ నపుడు.

వ. వానికిఁ బరమేశ్వరుండు సోమనంది యని నామధేయంబొసంగె. పరమేశ్వరియు నపురూపంబుగ నవ్వానిఁ జూచి మేరలేని యానందంబునొందె నా జగత్సుందరి కిట్లు ప్రియంబు చేసితరుణేందుభూషణుం డమూల్యవస్త్రాభరణంబులఁ బ్రత్యగ్రహరిచందనకుసుమదామంబుల దేవి నలంకరించె నయ్యవసరంబున. 254

క॥ మేనాదేవియు శైలే, శానుఁడు తమ కూఁతుతపసు ♦ చక్కఁ బడుటయున్
మానుగ గౌరీతనువున్, దానొందుటఁ దెలిసి యటకు ♦ దఱిసి ప్రియమునన్.

జగద్రక్షార్థమై పార్వతీ పరమేశ్వరులు నిత్యసుఖంబు లొందుచుండుట

వ. కూఁతు నల్లునిఁ గాంచి యంచితామోదంబున దుకూలపరిధానోత్తరీయాదుల ననేకమణిమయాభరణముల నుపాయనంబులిచ్చి యానందించి రంత జగత్కారకులగు పార్వతీపరమేశ్వరు లద్రిదంపతుల వీడ్కొని జయావిజయలతో సోమనందిం దోడ్కొని రాజతాచలంబుఁ జేరి సోమనంది నంతిపురంబునఁ గావలియుంచి ప్రమథజనంబలర మణిభవనంబునఁ బ్రవేశించి లోకరక్షార్థంబై నిచ్చలు సౌఖ్యంబులఁ జెందుచుండిరని సూతుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. 256

క॥ ఈచరితం బెవ్వఁడుగా, నీ చదివిన వినినఁ జెందు ♦ నిరుపమవిభవ
శ్రీచెలువుమీఱు సౌఖ్యము, లాచంద్రార్కంబు యశము ♦ నభవపదంబున్.

మ॥ ఘనదుర్భిక్షమహావ్యథాసమయజా ♦ గ్రద్దాత్ర్యతాతుష్టశై
వనికాయా! సుమనోమనఃప్రియతమా! ♦ భర్తృవ్రతాచారపా
వనలక్ష్మ్యావ్యయగేహినీనయనజీ ♦ వంజీవదైవాత్మకా!
వనజారాతివిభానిభోత్తమయశః ♦ ప్రారజ్జదాశావ్రజా! 258

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి కుమారఖండంబునఁ
దృతీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## యుద్ధ ఖండము.

### ప్రథమాశ్వాసము.



మద్ధవళపురీవ్రిభు
తామేయరమాద్యసుంద♦రాంబావియ్యాం
బామానినీసహోదరి!
హైమవతీశార్చనార♦తా!లక్ష్మ్యంబా!

వ. అవధరింపుము. శౌనకాదిమహామునీంద్రులు సూతునితో నిట్లనిరి. 2

క॥ కొమరులునుఁ గోడండ్రు మనుమ లొప్పఁగ రాజమండ♦నుం డగసుతతోఁ
ప్రమథులు గొలువఁగ నలరుచు, శమ నేమేమి యొనరించె♦జక్కఁగఁ జెపుమా.

గీ॥ త్రిపురములనొక్కశరమునఁ♦దిగిచి యల్ల, నల్లద్రావెడు దొరలను♦బొల్లుచేసె
నని వినెద మెట్లొక్కమ్మున♦నభవుఁ డట్లు, సలిపెనో తెల్పు మాకీవు♦సత్యవచన! 4

వ. అని యడిగిన సూతుం డిట్లనియె.

—* త్రిపురాసుర చరిత్రము *—

ఉ॥ మున్నల తారకాసురుని♦ముమ్మొనవాల్ దొరపట్టి చంప నం
త న్నగులుఁ దొరంగి సుర♦తల్లజు లెప్పటియట్లు శ్రీలతో
నున్నతి మీఱి యుండిరి ద♦నూద్భవకోటి రసాతలంబునన్
బన్న మొసంగనుండె సిరి♦బాసి యలంద్రుచుఁ గొన్నినాళ్ళటుల్. 5

వ. అంత.

గీ॥ తారకాసురసుతులు గొం♦తవడి కెదిగి, పొదలిరవ్వారు ముగ్వురు♦పోటుమగలు
లావు చేవయు వెరవు చ♦లంబుగల్గు, వారు దండ్రిని మరపించు♦వార లెందు. 6

వ. అవ్వారికిఁ దారకాక్షుండు కమలాక్షుండు విద్యున్మాలి యను నామధేయంబులు సుప్రసిద్ధంబులై తనరె నంత నచిరకాలంబున నవ్వారు.

గీ॥ కనకశైలగుహన్ జేరి ♦ కరము తపము, ధాతను గుఱించి యయుతవ ♦ త్సరము లొంద
నలువ దఱిసి వరంబిత్తుఁ ♦ దెలుపుఁడన్న, మ్రొక్కి వారలు దోయిలిఁ ♦ బూని యనిరి.

క॥ దేవా! వరంబు నిడు నెడ, నేవదుపున మాకు మిత్తి ♦ యేర్పడనియటుల్
నీవారసి యిమ్మన నా, దేవజ్యేష్ఠుండు హసించి ♦ దితిజుల కనియెన్. 9

చ॥ కనుపడునట్టి దెద్దియు జ ♦ గంబున శాశ్వతమై యెసంగ దీ
యనువున సర్వలోకములు ♦ నబ్జహితేందులు సర్వలోకశా
సనులును వారికర్మఫల ♦ సంచితభోగము లొంది పంచతన్
గనుదురు మీర లెట్టు లది ♦ గాంచక యుందురు వేఱుఁగోరుఁడీ ! 10

గీ॥ ఎద్దియేనియు దుర్లభం ♦ బెంచి మ్రొక్క, సాఁకు నడ్డిడి మిత్తి పా ♦ సంగనట్లు
వరముఁగోరుండొసంగెద ♦ వరుసననుచు, వారలించుక చింతిలి ♦ బ్రహ్మకనిరి. 11

—* త్రిపురాసురులు బ్రహ్మదేవుని వరంబు లడుగుట *—

చ॥ సరసిజసూతి! నీవు గడు ♦ సంపద లిచ్చిన భాగ్యమిచ్చినన్
దిరమగు నాయువున్నఁగద ♦ దేఁకువ నేఁకటదీర భోగముల్
మురియుచు నొందఁజెల్లు నది ♦ భూరిగ లేనియెడన్ జనుండు సం
బరపడి యేమి బావుకొను ♦ వాఁడో ? యెఱుంగుము నీ మనంబునన్. 12

ఉ॥ ఐనను నీవు కాదనిన ♦ నక్కట యేమి యొనర్తుమిందునీ
మానసవుంబ్రకారమె య ♦ మర్చికొనన్ దగు పైఁడి వెండి యి
న్ము నగరంబులన్ మువుర ♦ కాదటఁ గూరుపు మవ్వి నేలపై
యానక మింటఁ దిర్గుచు వి ♦ హారముసేయుచు నుండఁగావలెన్. 13

గీ॥ ఒక్కొకపురంబునందు మే ♦ మొక్కొకరము, వాసమొనరించెదమిఁక స ♦ ర్వహరుఁడలిగి
తేరుగానట్టి తేర నెం ♦ తేవసించి, విల్లుగానట్టి యొకవింత ♦ విల్లుఁ దిగిచి. 14

క॥ వాలముగాకయె తగునొక, వాలమ్మున ముప్పురములఁ ♦ బడసి యొకయెడన్
గాలిచి చంపవలెన్ మము, మేలుగ నంతవఱ కిమ్ము ♦ మేలియసురులన్. 15

వ. మఱియు మాకు సమృద్ధ తేజోబలవిద్యార్థనైశ్వర్య త్యాగ భోగ యోగంబులను మానింప కిమ్ము సర్వదేవమయుండగు శంకరుండు కింకరులగు మమ్ము సమయింప నేరఁడిఁకఁ బైనఁగానున్న యట్లగుననిన విరించి తథాస్తని విశ్వకర్మయగు మయునిఁ బిలిచి వారియభీష్టానుసారంబుగఁ బురంబులనిర్మించి యొసంగుమన్న నవ్వాఁడట్లు

హైమరాజతాయసపురంబుల సమృద్ధైశ్వర్యశోభితంబులఁ గామగమనంబుల నిర్మించియిచ్చిన నందు జ్యేష్ఠుండు భర్మపురంబును ద్వితీయుండు రాజతంబును గనీయుం డాయసపురంబును గొని యందుఁ బ్రవేశించి యుండిరి మఱియు నాపురంబులు మూఁడును. 16

సీ॥ పద్మరాగమణిసు ♦ ప్రాసాదములచేతఁ, గల్పవనకదంబ ♦ కంబుచేత
తుంగమాతంగతు ♦ రంగరాజులచేత, బహుగోబలీవర్ద ♦ పాళిచేత
అరవిందహల్లకా ♦ యతసరస్సులచేత, వాపీతటాకకూ ♦ పములచేత
సకలపదార్థవి ♦ స్తరహట్టములచేత, గంధర్వసిద్ధ ని ♦ కరముచేత

గీ॥ అతులవిద్యాధురీణాగ్రి ♦ జాళిచేత, సమరవిక్రాంతదైత్యజ ♦ నములచేత
విలసితపతివ్రతాంగనా ♦ వితతిచేతఁ, బ్రీతిగృహస్థశివాలయ ♦ ప్రతతిచేత. 17

కం॥ రమణీయములై ప్రీతిగే, హముల మఖాగ్నులను బాయ ♦ నట్టివియై చె
ల్వమరుచుఁ దిరుగుచునుండును, ద్యుమణిపదవినుండి యహీన ♦ లోకముదనుకన్.

వ-గీ॥ ఇట్టి త్రిపురంబులందు మ ♦ హీయులైన, దైత్యవరు లేపుమిగిలి మా ♦ ర్తాండమండ
లంబుదాఁకొని శేషవే ♦ శ్మంబువఱకు, బురులతో సంచరించుచు ♦ భూతకోటి
కెల్ల హింసయొనర్చుచు ♦ నుల్లసిలుదు, సురుఁగుచుండిరి జనములె ♦ చ్చోటనేని.

ఆ॥ వారిఁ జెనకలేక ♦ వాసవుండును దక్కఁ, వేల్పులెల్ల వెఱచి ♦ విన్నఁదనము
తోడ మూఁకలగుచుఁ ♦ దోయజగర్భుని, సన్నిధానమునకుఁ ♦ జక్కనేగి. 20

కం॥ మ్రొక్కి యిటు విన్నవించిరి, దక్కఁగ లేమింకఁ ద్రిపుర ♦ దానవవీరుల్
నిక్కుచు నెల్లజగంబులఁ, జక్కాడుచు నున్నవారు ♦ సరిలేకెందున్. 21

ఉ॥ ప్రొద్దు కదల్ వడిన్ బుడమి ♦ బోర్లగిలున్ బురముల్ గనంబడన్
హద్దునుదప్పి తారలు హి ♦ మాంశుడు దాగుచు దిర్గుచుందు రే
సుద్దియులేక బిక్కవడి ♦ చూచుచునుండు జముండు మేటియౌ
పద్దశఁగుందుచుంటి మిది ♦ పద్మభవా! కనరాదె నీకిటుల్. 22

చ॥ ఎపుడో దివంబుపైఁబడి సు ♦ రేశులతో నినుమున్ బొనర్తుర
ప్దపుకును దేఱిచూచి కడు ♦ నబ్బుర మొందుచు దిబ్బసేతుమం
చమత్కృతులాడి పోవుదురు ♦ హా యిఁక నేమి యొనర్తుమిత్తఱిన్
దెపదెపలాడు మానుడుల ♦ దీనతదీర్పు మనుగ్రహమ్మునన్. 23

చ॥ అనిన విరించనుండు హృద ♦ యంబున నారసి యవ్విధంబుఁ దా
ననిమిషరాజి కిట్లనియె ♦ నక్కట! యేమియొనర్పఁ జెల్లు వా
రనఘులు శంభుపూజనప ♦ రాయణులిద్ధచరిత్రులట్టివా
రిని గెలువం దరంబగునె ♦ వ్రేటున మార్కొని యెవ్వరేనియున్. 24

గీ॥ వరము వారల కిడితి దే♦ప్పరము గాఁగ, వరబలంబును నాత్మీయ♦బలము శంభు
పూజనఫలంబు నేకమై ♦ పొంక మొప్ప, నరిది వారల గెలువంగ♦నగును మనకు.

ఉ॥ పోవుద మిప్డు శంకరుని ♦ పొంతకు దైత్యులఘాతుకక్రియన్
దేవునిమానసంబునకుఁ ♦ దేటపడన్ వచియింత మాతఁడే
కావఱమొంది మీఱు పల ♦ ఖాదనులన్ దెగటార్పనోపు నీ
మీవగఁ బాపనోపునని ♦ మెచ్చి ప్రయాణము చేసి వారితో. 26

గీ॥ రజతగిరిఁజేరి నందితో♦రంపు సెలవుఁ, గొని మహేశ్వరు దరిసించి♦కుతుక మొప్ప
మ్రొక్కి తలపయిదోయిలిఁ♦బూనియిట్లు, ప్రార్థనయొనర్చె నెంతయుఁ♦బ్రౌఢఫణితి.

మత్తకోకిల: ఈవె యింద్రుఁడ ♦ వీవె చంద్రుఁడ ♦ వీ వుపేంద్రుఁడ వీశ్వరా!
నీవె నల్లవు నీవె చిల్లవు ♦ నీవె ప్రొద్దు వుమేశ్వరా!
ఈవె మిత్రివి నీవె సత్రివిఁ ♦ కీవె ముత్రివి శంకరా!
ఈవె యాకస మీవె యారస ♦ మీవె యగ్గి మహేశ్వరా! 28

చ॥ పొరిఁబురదానవోత్తముల ♦ భూరిభయం బెదఁజెందికుంది నీ
దరి కెటు జేరినాము మముఁ ♦ దప్పక ప్రోవఁగదయ్య! యీవు ద
క్కొరు లిఁక మన్పఁజాల రిది ♦ యోజన చేయుము దివ్యచిత్రమం
దురుకరుణాపయోధి! యిదు ♦ మోడక మా కథయంబు నింబుగన్. 29

క॥ బిక్కమొగ మొంది వేలుఁపు, లొక్కవితం బిట్టు బిట్టు ♦ ను దిలకొనుచు బల్
పొక్కుచు భువిఁబడి నీవే, దిక్కని విన్నపముసేయఁ♦ దేఁకువ మెఱియన్. 30

—* శివుఁడు త్రిపురాసురులు భక్తులైనందున వధింపననుట *—

ఉ॥ క్రొన్నెలపూవుదాల్పుదొర ♦ కోవిదులార! యిటుల్ తలంకఁగాఁ
జన్న! వగన్ దొరంగుఁడు ని ♦ శాచరవీరులు భక్తులెట్లువా
రి న్నశియింపఁజేతు నిఁక ♦ శ్రీపతియొద్దకుఁబోయి చెప్పఁ డా
మిన్న యెదేని మాయఁగొని ♦ మీపరితాపముఁ బాపు రూఢిగాన్. 31

క॥ అనిచెప్పినవార్ నిముసము, న నె వైకుంఠమును జేరి ♦ నళినసయనుఁ దీ
రని భక్తిమ్రొక్కి నుతుల్ న్, గొనబుగఁ బొనరించి తెల్పి ♦ గోడెల్లఁదగన్.

చ॥ తడవొనరింప రాదిఁక సు ♦ దర్శని! యప్పురముల్ గడున్ వడిన్
బడి త్రిదివంబు రూపడఁచుఁ ♦ బ్రత్యహమున్ బెదరించుచున్నవా
రడలున నీదుసన్నిధికి ♦ నందఱ మిట్లరుదెంచినాము మా
యడ రడపంగఁ బూనుము మ ♦ హాత్మ! కృపామయమూర్తి! చెచ్చెరన్.

క॥ అని యర్థించినఁ కమలన, యనుఁ డారసి యవ్విధంబు ♦ నంతయు శివభ
క్తిని నాయసురలకుఁ దదం, గనలకుఁ బతిభక్తిమాన్పఁ ♦ గడఁగిరయమునన్.

సీ॥ అట్లుగాకున్న నవ్వారి ♦ ననిఁ జెనకఁగ, రాదని మెఱింగి మునుల సు♦రలను వేగ
యతన మొనరింతు ననియన్ని♦సరగ నొకని, సృష్టి చేయఁగఁ దలఁప న♦చ్చెరియ మొప్ప.

—* విష్ణుమూర్తి అరిహన్మునిని బుట్టించుట *—

ఉ॥ ముండితమైనయట్టి శిర ♦ మున్ గడుమాసిన యట్టివల్వలున్
దుండమునందుఁ జేల్కయును ♦ దోస్థలిఁ బుంజికయున్ దలిర్పఁగా
దండిగ 'ధర్మ ధర్మ' యని ♦ దా స్మరియించుచు నొక్కఁ డచ్యుతున్
నిండగు భక్తిమైఁ దఱిసి ♦ నెర్కొని మ్రొక్కి యనుజ్ఞ నడ్గుడున్. 36

గీ॥ శేషశయనుఁడు వాని దృ♦ష్టించి చూచి, మెచ్చి తలయూఁచి యిట్లనె♦ మేలు మేలు
బుద్ధిమంతుఁడ! నాయందుఁ♦బాడమితీవు, నేను బనిచిన కార్యంబు♦ నెరపుమిఁకను.

క॥ అరిహన్నామముఁ దాలిచి, హరువొప్పము చోటు నీకు ♦ నమరించెద ముం
దరసి పదియాఱు వేలుగ, నరుదగు నొక మోహశాస్త్ర ♦ మమరింపు వెసన్.

గీ॥ కరమపభ్రంశమయమును ♦ గర్మవాద
మయము మాయామయంబునై ♦ ప్రియము సేయ
వలయు నయ్యది యటుగూర్పు ♦ వలఁతివీవ
నుచుఁ దెలిపెఁ దద్రహస్యంబు ♦ నున్ వెరపుగ. 39

వ. అనిన నతం డట్లు నిర్మించి తెచ్చి చూపించిన హరి యుప్పొంగి సత్వరంబుగ నీవిఁక దైత్యపురత్రయంబుఁ జేరి యవ్వారల మోహపెట్టి శ్రౌతకర్మలఁ బావు మద్దానవారు హతులయ్యెదరిఁక నీకు ముందుగఁ బ్రవేశంబుఁ గూర్పఁగా నారదు నంపి యవ్వారికి నీయందు భక్తిఁ బుట్టింతు నశ్రమంబుగఁ వారికి మోహంబుఁ గూర్పుమని నారదుం దలంచి యమ్మునికిఁ దత్సాకల్యం బెఱింగించి యరిహునకు ముందు దైత్యులఁ జెంది యవ్వాని నందుఁ బ్రవేశపెట్టుమని పంచి యరిహునకు నలువురు శిష్యులం గూర్చి వారికి ఋషి యత్యాకీర్త్యోపాధ్యాయు లను నామంబు లేర్పఱచి వారితోఁ ద్రిపురంబుల కేగుఁడనియుఁ ద్రిపురసంహారంబాదిగఁ గలియుగంబు వఱకు నెందేని మరుస్థలి నొదిగియుండుఁ డనియుఁ గలియుగంబున మీరు యథేచ్ఛతో నన్ని దేశంబులందు విజృంభించి చరింపుఁ డనియును జెప్పి పనిచె నంత నారదుండు ముందుగఁ బుండరీకాక్షుని యుక్తప్రకారంబు వేసంబు మార్చుకొని హిరణ్యాపురంబున కేగి తారకాక్షుం దఱియుఁడు నతండు మునిం గాంచి.

గీ॥ మూతిఁకడ పేల్కయేమి! యీ ♦ ముఱికిపటము
లేమి? యీకుంచె యేటికి?♦ ఋషివరేణ్య!
క్రొత్త వేసంబు వింతగాఁ ♦ గొంటి వేటి
కిటుగఁ జెప్పుము మాకు బొం♦కేమి లేక. 41

వ. అనిన దానవేంద్రునకు నారదమునీంద్రుం డిట్లనియె.

గీ॥ అసురనాథ ! యొకండు మ ♦ హానుభావుఁ
డగుపడియె యాతఁడొసఁగె యీ ♦ యతులదీక్ష
యిదియె నిర్వాణకారణ ♦ మిదియె సకల
భోగసంపన్నిదానంబు ♦ పుడమిలోన. 42

క॥ దీనికి మించిన దెందును, గానఁగఁబడ దరసినాఁడఁ ♦ గౌశల్యమునన్
దీనికిఁ గ్రిందివె యన్నియు, మానితి తొలినాఁటి వెఱ్ఱి ♦ మతములనెల్లన్. 43

వ॥ అనిన నవ్వాడును గాలచోదితుండై యిట్లనియె.

గీ॥ అట్లయిన మేమునుం గొందు♦మట్టిదీక్ష, నాఋషి యెవండొ దెల్పు మే♦మతనియొద్ద
కరుగఁగలమన్న జడదారి♦యనియె నతఁడె, యేడవదినంబిటకువచ్చుఁ♦జూఁడుమధిప!

క॥ ఆయనఘదీక్ష నొందిన, నీయట్టి ఘనుండు నుదువ ♦ నేర్తునొకో ? నీ
వే యాదు వీశుఁడవు నీ, వే యాదువు శ్రీశుఁడవు మ♦హిన్ దైత్యవిభూ ! 45

వ. అనినుడివిచనినంతఁ దారకాక్షుండు నారదోక్తప్రకారంబు దీక్షఁగొనంబూని దేశి
కుని యాగమనంబునకై ప్రతీక్షించుచుండె నంత నరిఘ్నయతియును శిష్యచతు
ష్టయంబుతో హిరణ్యపురోపవనంబుఁజేరి యందు మాయావాదం బుపన్యసింపు
చున్నంతఁ దెలిసికొని తారకాక్షుండు వచ్చి పాదంబులకెఱఁగి యిట్లు ప్రార్థించె.

క॥ నా కిమ్ము దీక్ష యతిపతి! , చేకొనెదను నేను దమదు ♦ శిష్యుఁడ ననుచున్
శ్రీకాంతునియపరాకృతి, యై కరమొప్పిన యతీంద్రుఁ ♦ డసుర కనెనిటుల్.

క॥ నాయాజ్ఞ మీఱనట్టిఁడు, నాయంతేవాసి యగు న♦నన్ దనుజుఁడు దా
సేయుఁడనై సేవించెద, మీయానతి యతివతంస! ♦ మీఱను గనుమా ! 48

—* అరిహన్ముని త్రిపురాసురులకు దీక్షనిచ్చి స్వధర్మములఁ జెప్పుట *—

వ. అనిన నవీనయతి యంగీకరించి దైత్యరాజునకును దత్సోదరులకును విధివిధానం
బుగ దీక్ష నొసంగె నామీఁద దనుజులెల్లరుఁ గ్రమంబుగ దీక్షన్గొనినంత
యతీంద్రుండు శిష్యమండలి కిట్లు స్వధర్మంబు లుపదేశించె. 49

ఆ॥ వినుఁ డనాదియగుచు ♦ వెలయు నీ సంసార, మిద్దికర్తృకర్మ ♦ హీన మరయుఁ
డిద్ది తనకుఁదానె ♦ యేర్పడు నట్టులే, తనకుఁదానె పొలియుఁ ♦ దథ్యమిద్ది.

ఆ॥ బ్రహ్మమొదలు గడ్డి♦పరకవఱకును నా, త్మయె యొకండు వేఱుఁ♦దలఁపఁగనము
హరిహరులు విరించి ♦ యను పేర్లు మనపేరు, లట్లె యిందుభేద ♦ మరయనగునె.

ఆ॥ బమ్మమొదలు దోమ ♦ వఱకును దేహంబు, నురుఁగు నియతమింత♦నూటిగాను
సకలజీవులకును ♦ సమమె యాహారని, ద్రాసురతభయములు ♦ తలఁచిచూడ.

గీ॥ దప్పిగొనిమన మెట్టులు♦దకముఁజేరి, త్రావివడఁబోయుదు మొయట్లె♦తక్కినవియు
దూపఁజెంది వడిఁ వడిఁ♦దోయ మొంది, త్రావినిట్టూర్పు విడుచును♦తథ్యమరయ.

క॥ చెలువలు వేయుగురున్నను, జెలువ నొక త్తెను నొకండు ♦ చెందును నటులే
పలుగుఱ్ఱములున్నను ని, మ్ముల నొకగుఱ్ఱమునె యెక్కు ♦బుడమి నొకరుఁడున్.

సీ॥ మంచమందుఁబరున్న♦మహిఁబరున్నను నిద్ర, యొక్కతీరుగ సౌఖ్య♦మొందఁజేయు
బ్రిహ్మ కేని కొలంది ♦ పాటికీటమున కేన్, జావన్న గడు వెఱ ♦ పావహిల్లు
హింస సేయఁగఁ బోల♦దేజంతువునుగాని, భువి నహింసయె గడు ♦ భూరిధర్మ
మిచ్చట నే స్వర్గ ♦ మిచట నే నరకంబు, సుఖదుఃఖములె వాని ♦ చొప్పులరయఁ

గీ॥ గలవుధర్మములును దాన♦ములునుబుడమి, స్వల్పఫలదములయ్యవి ♦ చర్చసేయ
హింసకుండేగునరకం బ♦హింసకుండు, చనెడుస్వర్గంబిచట లేదు ♦ సందియంబు.

వ. మఱియు వినుఁడు.

గీ॥ సకలనిగమాగమాంతశా♦స్త్రములసార, మరసిచెప్పెద రెండు వా♦క్యములవినుఁడు
లే దహింసను నెందుఁబో♦లినసుకృతము, లేదుహింసను నెందుఁబో♦లినయఘంబు.

వ. ఇఁక నుత్తమదానంబులు కొన్ని గలవు. చెప్పెద వినుము.

క॥ భీరున కభయం బొకట, గారింపఁబడిన జనునకు ♦ గ్రాసము తెవులున్
గూరిన వానికి నౌషధ, మారసి విద్యార్థి కొసఁగుఁ ♦ డభిమతవిద్యన్. 57

వ. అందులకుఁగాను

క॥ ధనమార్జనంబు చేయుఁడు, ధనమేకద మూల మెల్ల♦ధర్మమ్ములకున్
ఘనమగు సౌఖ్యంబులకును, ధనముఁ బడసి పదియురెండు ♦ దనువుఁడు ప్రీతిన్.

గీ॥ ఐదుజ్ఞానేంద్రియంబులు♦నైదుకార్మి, కేంద్రియంబులుమనము బు♦ద్ధిందవ్రియంబుఁ
బదియురెండగునివ్వాని♦ముదముగదురఁ, గొలుచుటహితంబు వేఱగు♦కొలువులుడిగి.

గీ॥ మాత్రికులను గొట్టి జీవాల♦మట్టుపెట్టి, నెత్తురులు గాల్వలొదవఁగ♦నేర్తుమనుచు
నేయి తిలలును నగ్గిలో ♦ వేయుచుంద్రు, జన్నములటంచుఁ గొందఱు♦జంకులేక.

వ. మీరలవ్వాని మానుండిఁకను.

గీ॥ ఎవుడో పడిపోయెడు శరీర♦మెఱిఁగి వేగ, యావియున్నంత కేఁకట♦యతిశయిల్లఁ
బెల్లుగా భోగములఁజెంది ♦ యుల్లసిల్ల, వలయునవ్వాల నేమి గ♦న్పట్టు? గనుఁడు.

గీ॥ తెంపుమై యాచకుల కిల ♦ దేహమేని, యొసఁగికోరికెఁ దీర్పఁగా ♦ నొప్పుయాచ
కులకుఁ దృప్తియొనర్పని ♦ కుజనులిలకుఁ, బరువుసేయుదు రాదుర్మిగిరులకన్న

క॥ ఎంతకు ముదిమి దవీయం, బెంతకు దార్ఢ్యమున నొప్పు ♦ నింద్రియవర్గం
బెంతకు స్వస్థం బీయొడ, లంతకు సౌఖ్యములఁజెందుఁ ♦ డరసి యథేచ్ఛన్. 63

గీ॥ ఆయువడఁగిన పిమ్మట ♦ నకట ! దేహ, మిలను నక్కల కల్లకా♦కులకు భోజ్య
మగు నదియె తింగిభోగింపుఁ♦డర్థులకును, నొసఁగుఁడిష్టంబులెంతయు♦నోర్పుమిగిలి.

వ. ఇఁకను బ్రాహ్మణాదిజాతిచతుష్టయంబు కల్పితంబుగా నెఱుంగఁదగు. 65

గీ॥ సృష్టియొనరించెను విరించి♦శ్రేష్ఠుఁడతని, సంతతి మరీచిముఖులు త♦త్సంతతిన్ బొ
డమినమనయందుజాతిభే♦దముపొసఁగునె?, యురక యేదోవచింత్రుకొం♦దఱదివాలికి.

గీ॥ ఇట్లు బోధింప నవ్వార ♦ లెంతయేని, సంతసంబొంది చెలరేఁగి ♦ శంభుపూజఁ
బాసి వేదోక్తధర్మంబుఁ♦బాసి యర్థ, కామముల నాశ్రయించిరి ♦ కడిఁదివేడ్క.

సీ॥ వావివర్సలఁబాసి♦పసరంబులట్లు రేఁ, బవలు భామలఁగూడి ♦ పరఁగు పురుషు
లెవఁగొంకుమాలి తా♦మెదురిచ్చువిటులతో, సురతకేళులనెందు♦చొక్కువెలఁదు
లిది పవిత్రంబుకా ♦ దది పవిత్రంబంచు, నరయ కన్నియు మెక్కు♦నట్టి బాప
లెక్కుడు పొగరుతో ♦ నెగిరి దోసములేని, పెద్దలపైఁ గాలు♦విసరు మొఱకు

గీ॥ లెట్టిదోసఁగుకువెనుదీయ ♦ కెల్లప్రొద్దు, కాసులనెకూర్చుచుండెడు♦దోసకాండ్రు
దేవుఁడెవఁడనిపదరి నిం♦దించు చెడుగు, లాఱితేఱిరి త్రిపురంబు ♦ లందు నిండి.

క॥ స్త్రీలుం బూరుషు లిట్టులు, పాలింపక పూర్వధర్మ ♦ పదవీచ్యుతులై
రేలు పవల్ ధనకామే, చ్ఛాలోలసులైరి తఱిగె ♦ సత్త్వంబెల్లన్. 69

గీ॥ అంతయునుగని వేల్పులు ♦ సంతసిల్లి, హరివిరించులఁ దోడ్కొని ♦ యుభవుదండ
కరిగి సాష్టాంగమొందియ♦వ్యసురవరుల, తెఱఁగునంతయుఁదెల్పితీ♦వరముమీఱి.

—* సురలు త్రిపురాసుల నిపుడు జంపుమని శివునిఁ గోరుట *—

ఉ॥ జాగొనరింప కీవిఁకను ♦ జాల్మల యవ్వరము ల్దహింపు వే
వేగ జగంబులన్ మనుపు ♦ విశ్వవిభూ! కరుణింపు లెమ్మనన్
బాగుగ దైత్యవృత్తముల ♦ భర్గుఁ డెఱింగి జగద్ధితార్థియై
సాఁగెద నట్లు సేయ రణ ♦ సాధనముల్ సమకూర్పుఁడంచనెన్. 71

వ. అంత దేవత లాయసురులవరంబు లెఱింగియుండుట నరదంబుగానియరదంబును విల్లుగాకయొసంగువిల్లును బాణంబుగాక తగుబాణంబు మున్నగువానిఁగూర్పఁ గడంగి విశ్వంభరను రథంబుగను నద్దానికి సూర్యచంద్రుల ద్వాదశారషోడశారంబులగు చక్రంబులుగను ఉదయాస్తాచలంబులను నొగలుగను మంత్రంబులు ఘటంబులుగను ఋతుషట్కంబు నేములుగను మందరాద్రి చోటుగను నాకసంబు టెక్కెంబుగను స్వర్గమోక్షంబులు ధ్వజంబులుగను షడంగపురాణ మీమాంసా ధర్మశాస్త్రంబులు తేరినగలుగను దిక్కులు పాదంబులుగను ననంతుండుబంధముగను సంద్రంబులేడును రథకంబలంబులుగను గంగాదిసరిన్మతల్లులు స్వర్ణకంకణ కరభూషితులగు చామరగ్రాహిణులుగను లోకాలోకాచలంబుసోపానంబుగను,

విధిని సారథిగను దోలిపల్కులు తేజులుగను బ్రిణవంబును గొరడాగను దర్వీశ రంబులు పగ్గంబులుగను వేల్పులు రశ్మిధారులుగను అకారంబు గొడుగుగను బంగరుకొండ విల్లుగను శేషుండు నారిగను సరస్వతి ఘంటగను నారాయణుండు బాణంబుగను అగ్ని శల్యంబుగను తారలు తురంగభూషణంబులుగను మహర్షులు గుజ్జువురౌతులుగను విషవాయువులు సైనికులుగను సంతరించి సర్వదేవమయుం డగు మహేశ్వరున కొసంగి రథారోహణంబు చేయుమని ప్రార్థించిన శంకరుం డామోదించి రయంబున స్యందనంబెక్క నప్పుడు వేదహయంబులు తుండంబులఁ దెఱచి కనుగ్రుడ్లు మిడికించి పుడమిఁగూలుడు రథంబుచలించి ముందునకుఁ మ్రొగ్గఁ గులపర్వతంబులు చలించె శేషుండు వడఁకె నయ్యాది యంతఁగాంచి విష్ణుం డొక్క మహావృషంబై తేరు పైకెత్తి హయంబులకు బాసటయై నిలిచె నప్పు డమరులెల్లఁ దమకుఁ బశుత్వంబునుఁ బరమేశ్వరునకుఁ బశుపతిత్వంబును గోరి వడసి రంత శివుండు

—* శివుఁడు త్రిపురంబుల దహించి త్రిపురాసురులఁజంపుట *—

క॥ ప్రత్యాలీఢపదుండయి, యత్యాశ్చర్యముగ యోగ ♦ మరసి యొక యెడన్
దైత్యపురత్రియిఁగూరిచి, సత్యేచ్ఛుఁడు లాఁగివేసె ♦ సాయక మొకఁడున్.

చ॥ అశనిసహస్రపాతజని ♦ తాయతభూరికఠోరఘోష మా
దిశలఁదనర్చునేనికల ♦ తీరగు వీనులఁ దూటుబుచ్చఁగా
దశశతభానుదీధితివి ♦ తానవిరాజితమైన బాణ మా
పిశితపుఁదిండ్ల యప్పురుల ♦ బిట్టుగ బూదియొనర్చె నంతతో. 74

గీ॥ తారకాక్షుండు నిజసహో♦దరులతోడ, నార్పరానట్టి యట్టి మ♦హాగ్ని వాతఁ
బడి దహింపఁబడుచువేగఁ ♦ బరమశివుని, శంకరునిఁ♦జూచిమదిని వి♦జ్ఞప్తి చేసె.

క॥ ఎఱిఁగితి శంకర! నిను నే, మురిసితి నీచేత నిట్లు ♦ పొలయుటకుఁ గదన్
గరమరుదగు నిది యేరికిఁ, బరశివ! నీభక్తి నొసఁగు ♦ ప్రతిజన్మమునన్. 76

క॥ అనుచున్ దమ్ములుఁ దానును, మనమందు నవీనమతపు ♦ మార్గము విడి పా
వనచరణ! భక్తశరణా!, పినాకి! యన వారితేజు ♦ భీమున్ జెందెన్. 77

గీ॥ రక్కసులతోడఁద్రిపురంబు ♦ లుక్కుమాలి, కాలిబూడిదయైభువిఁ ♦ గూలెనంత
దేవదుందుభి నాదముల్ ♦ దేజరిల్లె, హరుని పైఁ బుష్పవృష్టి ♦ పెల్లడరి కురిసె.

గీ॥ త్రిపురదాహంబొనర్చియెం♦తేని రౌద్ర,వదనమున నొప్పుచున్న న♦వ్వహ్నినయనుఁ
గాంచి భీతిలి విష్ణు వి ♦ రించిముఖులు, సాఁగిలన్ బడి సన్నుతు ♦ ల్సలిపి రిట్లు.

—* శివుని దేవతలు స్తుతించుట *—

మత్తకోకిల: భక్తవత్సల! దేవదేవ! కృ • పాళు! హర్షనిధాన! చి
చ్ఛక్తిశోభిత! లోకనాయక! • శర్వ! ధార్మికపాలనా
సక్త! మంగళమంగళాత్మక! • శంకరా! యిఁక మాదు దీ
నోక్తులారసి సుప్రసన్నత • నొందుమయ్య! మహామతీ! 80

క॥ అని యిటు లడుగుల వ్రాలిన, యనిమిషులకు నభయమొసఁగి • యఖిలేశ్వరుఁడం
తన వెండికొండ కింపునఁ, జనియెన్ సురలెల్లఁ జనిరి • స్వపదముల కొగిన్. 81

వ. అరిహాండు విష్ణ్వాజ్ఞచేఁ గలియుగంబును బ్రతీక్షించుచు నంతేవాసులలో మరు
స్థలంబులఁ గాలంబుఁ బుచ్చుచుండె. మహర్షులారా! మహేశ్వరుం డిట్లు త్రిపుర
దాహం బొనర్చి త్రిలోకరక్షణం బొనరించినట్టి యీ చరితం బెవ్వరేని చదివిన
వినిన నవ్వారు సకలదుఃఖంబులఁ బాయుదు రనిన సూతునకు మునులు మహాత్మా!
సంతసించితిమిఁక జాలంధరవధోపాఖ్యానంబెఱింగింపుమనుటయు సూతుండిట్లనియె.

—* జలంధరాసుర చరిత్రము *—

చ॥ ఒక దినమందు దేవవిభుఁ • డొజ్జను దోడ్కొని వేడ్క వెండికొం
డకుఁ జని యందు శంభుసద • నమ్మున కేఁగుచునుండ నంత నం
తకహరుఁ డద్ది యారసి ము • దమ్మున వారిఁ బరీక్షచేయఁగా
నొక జటిలాకృతిన్ దనరి • యొప్పుగ నధ్వపుమధ్య నుండుడున్. 83

చ॥ కనుఁగొని దేవరాజు పుర • ఘస్మరుఁ డంచు నెఱుంగ కింత వే
గనె యిటు లడ్డమార్గ మరి • కట్టి వసించితి వేటి కావుతా.
శనయనుండు గిముకడఁ • జక్కఁగ నుండెనొ లేక యెందు నేఁ
జనియెనొ చెప్పునా నతఁడు • జంకక పల్కక యున్న నత్తఱిన్. 84

ఆ॥ మరల నడిగెనట్లు • సురపతి జటిలుని, నతఁడు వినియు వినని • యట్టులుండె
కినుకనొంది మరల • గీర్వాణవిభుఁడడ్గ, నేమి చెప్పకుండె • నీశ్వరుండు. 85

క॥ ముమ్మాఱిట్టులె యడిగిన, నమ్మహితుని లెక్కఁగొనక • యాతని నుడులన్
సమ్మతి నాలింపక తా, నెమ్మిన్ దాంటివలెనున్న • నిర్జరవిభుఁడున్. 86

మ॥ కని దర్పోకరమట్లు రోజుచుఁ దిర • స్కారంబుఁ గావింతువా
నను గాపూరుష! కాంచు మిద్దె యని కి • న్కన్ జంప వజ్రంబు నె
త్తిన నుగ్రుండు మహాగ్రహం బొదవ నా • దేవేంద్రు హస్తంబునం
తనె నిష్పందమొనర్చుడున్ నిటల నే • త్రజ్వాల లొక్కుమ్మడిన్: 87

క॥ తనరి పురందరుఁ గాల్చఁగ, నొనరినఁగని గురుఁ డెఱింగి • యుడురాజధరుం
డని తెలిసి వినతుఁడై యింద్రుని సాఁగిలఁబడ నొనర్చి • రోజుచు ననియెన్, 88

క॥ శరణు మహేశ్వర! శర్వా!, శరణు విరూపాక్ష! రుద్ర! ♦ శంకరమూర్తీ!
శరణు మహాపద్వారణ!, శరణు పినాకీ! కపర్ది! ♦ సర్వవ్యాపీ! 89

శా॥ నీవే విష్ణుఁడ వీవె పద్మజుఁడవు ♦ న్నీ వే మహారుద్రుఁడున్
నీవే సిద్ధులు దివ్యులున్ మునులునున్ ♦ నీవే జగద్గోళముల్
నీవే కర్తవు నీవె భోక్తవు మఱిన్ ♦ నీవేగదా భూతముల్
నీవే నేతవు శత్రునేలు కరుణా♦నీరాకరా! శ్రీకరా! 90

క॥ అడుగులఁబడిన మహేంద్రుని. నడలుచు నుతిసేయుచున్న ♦ నంగిరసుని శ
ర్వుఁడు గని యభయంబిడి తా,నడిగె బృహస్పతిని నిట్టు ♦ లాదర మెసఁగన్. 91

క॥ సురపతిఁ గాల్పఁగ వెడలెను, ఖరలోచనవీతిహోత్ర♦గాఢజ్వాలల్
గరమరయు మెచట వీనిన్, బరిత్యజింపంగఁజెల్లుఁ ♦ బ్రోధమనీషా! 92

క॥ అనుడు గురుఁ డరసి బెగడుచు, ననె దేవాధీశ! యితని ♦ కభయమిడితి గ్రి
న్ననఁ గావు మనలకీలల, వననిధిలో విడిచిపుచ్చి ♦ వైళం బనినన్ 93

క॥ విని రోమని శంకరుఁ డా, యనలజ్వాలలను సంద్ర♦మందు విడిచి యిం
ద్రునిఁ బ్రోచి దేవగురునకు, ననె జీవమ్మైతి విప్ప ♦ డమరేంద్రునకున్. 94

క॥ ఇది మొదలు జీవసంజ్ఞన్, బొదలు బృహస్పతి! యనంగఁ♦బొంగి గురుండున్
ముదమున శివుని నుతించెను, బెదరుడిగి నుతించె గోత్ర ♦ భేదియు నీశున్. 95

గీ॥ ఇట్లు గండము దాఁటి మ♦హేంద్రుఁడపుడు, శివునకభివందనము చేసి♦సెలవుఁజెంది
బ్రతికితినటంచుగురునితోఁ♦బదిలముగను,త్రిదివమునకేగెరయమున♦దీము మెఱయ.

## —* జలంధరుని జననము *—

చ॥ కడలినిఁ జెందినట్టి యల ♦ కాలనిషూదను నేత్రవహ్ని య
ప్పుడయొక బాలుఁడై పొడమి ♦ భోరున నేడ్చుచునుండఁ దద్రవం
బడరి లయాభ్రఘోషమటు ♦ లక్కట! సర్వజగంబులందు బి
ట్టడలు దనర్పఁగా విని సు ♦ రాగ్రణు లబ్జజుఁ జేరి చెప్పరున్. 97

వ. పద్మజుండును నక్కజంబున నంబురాశిన్ జేరి యందు.

గీ॥ చెలఁగిచదలేటితోఁబొత్తుఁ ♦ జెందినట్టి, కడలి యుత్సంగముననొడి♦కంబువిూఱ
గూరుచుండిన యట్టి కు♦మారుఁగాంచి, తారసించినయపుడ కూ♦పారవిభుఁడు.

చ॥ వనజజుఁ గాంచి భక్తిమెయి ♦ వందనముల్ పొనరించి యున్న తా
ననమిడి వేడ్కతోడఁ దను ♦ జన్మునిఁజూపి మహాత్మ! వీఁడు నా
తనుజుఁడు వానిజాతకవి ♦ధమ్ములఁదెల్పి యనుగ్రహింపుమా
యన నదియెల్లనారసి ప్రి♦యంబున నబ్జజుఁ డబ్ధి కిట్లనెన్. 99

ఉ॥ వీఁడు కడున్ సమర్థుఁడయి ♦ విశ్వము మెచ్చఁగ శౌర్యశాలియై
మూఁడు జగంబులన్ గలస ♦ మున్నతశూరుల నోడఁబుచ్చి బల్
పోడిమి మించుచుం బెంచు యశ ♦ మున్ సరియెవ్వరు లేనియట్లుగాఁ
బాడుదు రచ్చరల్ దొడరి ♦ బాగుగ వీనిచరిత్ర మీయెడన్. 100

గీ॥ సర్వలోకాధిపత్యసు ♦ చ్ఛత్రి మొందుఁ
గడుఁ బతివ్రతయై యొడి ♦ కమున నమించు
మచ్చెకంటి ద్వితీయయా ♦ హెచ్చుమీఱు
భోగములఁ జెందుఁ దనివిగ ♦ భువనరాశి. 101

మ॥ అనుచుండన్ బుడుతండు బిట్టగసి బ్ర♦హ్మాగ్రీవమున్ బట్టి నె
ట్టనఁ బీడించెఁ దొలంగలాఁగుటకుఁ గ ♦ ష్టంబయ్యె నాలోన లో
చనయుగ్మంబుననుండి యశ్రులురలెన్ ♦ జక్రాంగవాహుండు పా
పని బీరంబునుఁ జూచి మెచ్చి యనియెన్ ♦ బాథోధి కివ్వైఖరిన్. 102

క॥ జలబిందువులన్ బాపఁడు, జలజల నాకనులనుండి ♦ జాఱఁగఁ జేయన్
గలుగుట జలంధరాహ్వయ, మలరెడు నీతనుజునకు మ ♦ హార్ణవ! భువిలో.

క॥ అనినుడివి సముద్రుని బ్రా, ర్థన శిశునకు జాతకర్మ ♦ నతి నుపనయనం
బును సలిపి యసురరాజ్యావి, భునిగాఁ బట్టంబుఁ గట్టి ♦ పోయెన్ మరలన్. 104

వ. అంతఁ గడలియు.

ఉ॥ కంటికి ఱెప్పవోలె సుతుఁ ♦ గాటపు వేడుకతోడఁ బెంచుచున్
దంటయుఁ దద్జ్ఞుఁడై యలరు ♦ దైత్యగురుండగు భార్గవార్యుచే
వింటను విద్దెలన్ గడిఁది ♦ విజ్ఞునిఁ జేసి కరంబు పొంగి మి
న్నంటెఁ గుమారుఁ డెంతయు న ♦ నన్యపరాక్రమశాలియై తగన్. 105

—* జలంధరుని వివాహము *—

గీ॥ కాలనేమియనా నొక ♦ కడిఁది దైత్య, రాజపుత్రిని బృందయన్ ♦ రమణి నరసి
కొడుకునకుఁ దగు సతిగాఁగఁ ♦ గూర్చి పెండ్లి, చేసె పరివారలెల్ల సె♦బాసనంగ.

క॥ ఆసతి మిక్కిలి రూపసి, శ్రీసతికిన్ బోటి వచ్చు ♦ చెలువ గుణశ్రీ
భాసిత పాతివ్రత్యావి, భాసిత యొడయనికిఁ జేయు ♦ పండువు నిచ్చల్. 107

సీ॥ వారి దాంపత్యమెంతయు ♦ వాసిమీఱె, చూడసొంపయి తనరె న♦సురవరేణ్యు
బాసటన్ గని పాతాళ♦వాసులైన, పొలసుదిండ్లెల్ల విచ్చేసి ♦ రెలమి మరల. 108

గీ॥ అంతనొకనాఁటి మెడ సభా♦భ్యంతరమున, నున్న రాహువును బరికించి♦యుశనునడిగెఁ
గత మిదేమి? మహాత్మ! యి♦క్కరణి నునికి, కనుడు భార్గవుఁడతనికి♦ట్లనియె మరల.

ఉ॥ మున్ను నిలింపు లెల్లరును ♦ బూర్వసుపర్వుల సాయమొంది సం
పన్నతతోడఁ బాల్కడలిఁ ♦ బట్టి మథించి యపూర్వరత్నముల్
చిన్నెలవన్నెలన్ దనరు ♦ చెల్వల నచ్చరలన్ సుధాఘటం
బు న్నెఱిమీఱఁ జాఱఁగొని ♦ మోసముఁ జేసిరి దైత్యకోటికిన్. 110

గీ॥ మొదలఁబొడమినవిసమును♦మూడుకనుల, సామినిన్ ద్రావఁ జేసిరి ♦ సాహసమున
జంకులేక యెయ్యాదార ♦ చటులకాల, కూటమునుద్రావిజగముల♦కుందుమాన్ప.

ఉ॥ మాయలమారియైన యల ♦ మాధవుఁ డొక్క మిటారిచేడియై
యాయెడ కేగుదెంచి దను ♦ జాగ్రిణులన్ నిజహావభావలీ
లాయతదృష్టులన్ గరఁచి ♦ యాసుధఁ జేకొని దివ్యరాజికిన్
బోయుచునుండ వీఁడరిగి ♦ పొత్తుకుఁ జేరుటఁ జూచి యంతనే. 112

ఉ॥ జాబిలి తేలుకొండివలె ♦ సప్తతురంగునకద్ది తెల్పఁగా
నాబిసినీసఖుండు హరి ♦ కల్లన సన్నయొనర్చ నాతఁడున్
వే బిరుదొప్పఁగా మిగుల ♦ వెల్గుసుదర్శనధారతోడఁ దో
డ్తోఁ బడవేసె నా సుధను ♦ దోసిటఁ ద్రావెడు వీని మూర్ధమున్. 113

గీ॥ అమృతయోగమునన్ జేసి♦యకట! వీని, శిరసు మొండెమునున్ గూడ♦జీవయుక్త
మండఁగని నాగుఁబామును ♦ రెండుచేసి, యతికియిరువురఁ జేసి ది♦వ్యపదమిచ్చె

కం॥ ఆ పగతో వీరిరువురు, నే పర్వములందు సూర్య ♦ హిమరశ్ము లెటన్
జేపడిన విడక మ్రింగుదు, రేపడతురు వీని చరిత ♦ మిదియె కుమారా! 115

గీ॥ అనిన విని యాజలంధరుఁ♦డౌదుగఱచి, యౌర! యెంతటియపకార♦మాచరించి
రమరులునువారి యధిపతి♦యైన విష్ణుఁ, డెట్లుసైఁచెద వారి ని♦క్కట్లుగనుచు.

గీ॥ అనినొడివి ఘస్మరుండను♦నసురనొకనిఁ, బిలిచి యవ్విధమంతయు♦వినిచియింద్రు
నొద్దకుంజని నానుడు ♦ లుచితభంగిఁ, జెప్పు మిప్పోల్కి నటుమీఁదఁ♦ జేతమరసి.

—♦ జలంధరుఁ డింద్రుని యొద్దకు దూతను బంపుట ♦—

కం॥ మాతండ్రి నట్లుమోఱక్కులై తఱిచి యనంతవసుచ♦యమ్ములఁ బడయన్
నీతియొకో వానిని నిప్పుడే తెండిఁక నిందుతిరుగ ♦ హితవెఱిఁగి మదిన్. 118

గీ॥ అట్టు లీకుంటిరేని యీ♦యబ్ధిపుత్రుఁ, డుడుగఁ డివ్వానిఁగ్రక్కించు♦నుత్తలమున
బై సిమాలుదురీరలు♦పరు వెఱుంగు,డని నుడివియాఁరయుమువారి♦యాశయముల.

కం॥ తడయక చని రమ్మని య, ప్పుడె వానిని బనుప నతఁడు ♦ పొంగి కదువడిన్
వెడలి యమరావతికిఁ జని, బిడౌజుఁదగఁదారసించి ♦ పేర్మిన్ బలికెన్. 120

చ॥ వినుము సురేశ్వరా! భువన ♦ వీరుఁడు సింధుకుమారుఁడిందు నన్
బనిచినతీరు మీరు మును ♦ పాల్కడలిన్ మథియించి రత్నరా
జిని మదనాగపీతులను ♦ చెన్నగునచ్చరలన్ సుధారసం
బును గొనిపోయియుంటి రవి ♦ పొల్పుగనిండిపు డొక్క పెట్టునన్. 121

ఆ॥ ఇచ్చి రేని సరియె ♦ యీకున్నమిమ్మెల్లఁ, బట్టితిగిచి యెగిచి ♦ మట్టగించి
చేకొనంగఁదలఁచి ♦ చెప్పియుండితి నిట్లు, తెలిసి యెందునేని ♦ దెగువఁగొనుఁడు.

క॥ అని చెప్పియంపె ననుడున్, గనుఁ గవలన్ నిప్పులురలఁ ♦ గనలి మహేంద్రుం
డనుగ్రోధనుఁడై దూతన్, గనియనె వాక్రుప్పమిట్లు ♦ కంధిసుతునితోన్. 123

ఉ॥ కొండలనెల్ల రెక్కలను ♦ గొట్టుచునున్నపుడేను వీఁక నీ
తండిరి గొప్పగట్టుల ని♦తాంతములోఁగొని దాఁచియుంచెఁ దృ
ప్తుండయి యింక నారిపుల ♦ దుష్టనిశాటులఁ గుక్షిలోపలన్
మెండుగ దాఁచె నందులకు ♦ మేకొనియట్లు మథింపుట య్యె మున్. 124

గీ॥ బలిసి నీవిట్లు మీఱితి మా♦పైకిఁ గాలు, ద్రవ్వ లెక్కింతు మే త్రోసి♦రాజనిపుడె
చేసెదముగాక యీలాటి♦చిందులుడిగి, మిడిసిపడకుండుమా! యిఁక♦మీఁద నేని.

క॥ అని యిటులెచెవ్వ చనుమన, ననంతరం బతఁడు వేగ ♦ ననురేంద్రుని కొ
ల్వున కేగుదెంచి యటు చె, ప్పిన నాతఁడు వ్రేటువడిన ♦ పెనుఁబాము వలెన్.

మ॥ విసమున్ గ్రక్కెడునట్లు మేటిబుసలన్ ♦ వేమాఱు గావించుచున్
మసిఁ జేతున్ద్రిదశాలయంబు సురలన్ ♦ మర్దించెదన్ మించెదన్
వెస నానావిధసైన్యముల్ వెలయఁగా ♦ వింపుండు యాత్రోత్సవం
బసురశ్రేష్ఠులకెల్లఁ దెల్పుఁడు రథం ♦ బాయత్తమున్ జేయుఁడీ! 127

వ. అని యాజ్ఞాపించి.

క॥ ఘనుఁడగు శుక్రుని రణమం, త్రినిగా నొనరించి యట్టి ♦ దేశికు శుభశా
సనములఁ జేకొని యాహవ, మునకేగె జలంధరుండు ♦ పుడమి యద్రువఁగాన్.

క॥ చనివేగ నాకలోకం, బును నెక్కొని ముట్టడించి ♦ పొల్పుగ రణభే
రిని మ్రోఁగ జేసె సురలకుఁ బెనుబెగడును నగడుపొడమి ♦ బీరంబెడలన్. 129

చ॥ విని యమరేంద్రుఁడున్ గినుక♦ విస్తరిలంగ దిగీశముఖ్యులా
యనిమిషవర్యులన్గొని యు♦దార భుజాబలమేర్పడన్ వరూ
థినిని నమర్చి యభ్రకరిఁ ♦ దేఁకువ నెక్కి పవిన్ధరించి బి
ట్టనికిఁగడంగి తా వెడలె ♦ నద్భుతమొందఁగ దైత్యసైన్యముల్. 130

క॥ గుహుఁడును వెనుకొని యనిమం, తిరిపై నడచెను సమస్త ♦ దివ్యశ్రేష్ఠుల్
పురిగొను వేడుకతో నడ, చిరి పెనురజ మంబరంబుఁ ♦ జేరఁగ నెగయన్. 131

## —*దేవాసుర యుద్ధము*—

గీ॥ కడఁగియన్యోన్యసైన్యముల్ ♦ గండుమీఱి, యొడిసియుద్ధంబొనర్చిరి ♦ యులుసుదీఱ
ఘనగదాశక్తితోమర ♦ ఖడ్గముసల, హలపరశువుల నెంతయు ♦ నక్కజముగ.

క॥ సంకులసమరం బలర న, శంకితులై యోధవరులు ♦ సాహసమెసఁగన్
బొంకముగ ద్వంద్వయుద్ధము, హుంకారార్భటులు సెలఁగ ♦ నొదవించిరొగిన్.

ఉ॥ అంత జలంధరుండు దివి ♦ జావళి కందఱ కన్నిరూపులై
పంతముతోఁ ద్రిశూలమును ♦ బట్టి సుపర్వులఁ ద్రెళ్ళఁజేయుచున్
దంతులఁ జెండుచున్ హరులఁ ♦ దద్దయుఁజీల్చుచు స్యందనంబులన్
వింతగ నుగ్గుసేయుచును ♦ వీరవినోదము సల్పె నాజిలోన్. 134

గీ॥ యమునిపొట్టఁబగిల్చె న ♦ య్యగ్ని నవయఁ, జేసెఁ బాశిని వడలొందఁ ♦ జేసె నమ్మ
హాబలుని రూపుమాపె బి ♦ డౌజుడాసి, యల్ల యైరావతగజంబు ♦ డిల్లపఱచి.

క॥ వాసవుమస్త్రముఁ బగులఁగ, వేసిన నాతండు నొచ్చి ♦ భిదురముగొని పె
ల్లీసున నసురను మోఁదుడుఁ, దా సరకొనరింప కసుర ♦ తల్లజుఁడంతన్. 136

గీ॥ వాఁడియమ్ముల విలుగూర్చి ♦ వాసవాన, నంబుఁ బగులఁగఁజేసిన ♦ నగవిరోధి
రోసమున నట్టికైదువు ♦ లేసె నసుర, నిరువు రేనుఁగులట్లు పో ♦ రిరి చలమున.

క॥ ఇరువురకున్ బోసటగా, సురలును నసురులును జేరి ♦ శూరతఁ జూపన్
బురుహూతుఁ డసురుల జలం, ధరుఁడు సురలఁ జంపి రధిక ♦ దర్పము మెఱయన్

గీ॥ పొలిసినట్టి నిశాటులఁ ♦ బొదిగిపట్టి, యుశనుఁ డాత్మీయమంత్రప్ర ♦ యుక్తి మరల
బ్రదుకఁజేయుచునుండె గీ ♦ ష్పతియు మృతసురలను బ్రదికించె నోషధీ ♦ కలనమునను

గీ॥ అదియుఁగని రజనీచరుం ♦ డడిగెఁ గావ్యు, నార్య! సంజీవినీవిద్య ♦ యమరినట్టి
తాము దైత్యులబ్రదికింపఁ ♦ దానునట్లె, సురలజీవుండు బ్రతికించు ♦ చొప్పదెట్లు!

క॥ అని యడిగిన ద్రోణగిరిన్, ఘనమగు నోషధులఁ దెచ్చి ♦ క్రతుభుక్కులఁ జే
తనయుతులఁ జేసె ననుడున్, విని యామలఁ దెచ్చి కడలి ♦ వేసి రయమునన్.

చ॥ మరల సుపర్వులందఱను ♦ మారణమున్ బొనరించి యప్పురం
దరుఁ బరిమార్పఁబూనె మృత ♦ తండములన్ బ్రదికింపఁగా మరు
ద్గురుఁ డలశైలమున్ గనక ♦ దుష్టనిశాటకృతం బెఱింగి వే
గిరము మహేంద్రుతో ననియెఁ ♦ గిమ్మనకొండెడ కేగుఁడీ వెసన్. 142

ఆ॥ అనువుదప్పినట్టి ♦ యవసరం బీక్షించి, నేరుపరి యొకింత ♦ సెగులు మాని
చెడ్డకాలమంతఁ ♦ జెల్లించి యటమీఁద, సిరులఁ జేరవలయుఁ ♦ జెలఁగి తిరుగ.

## —* దేవతలు పరాజయంబునొంది పాఱిపోవుట *—

క॥ అనిచెప్పిన ప్రగ్గడనుడి, విని పఱచె మహేంద్రుఁ డతని ♦ వెనుకొనిచని రా
యనలముఖామరులెల్లరు, వనరుచు నాకంబు విడిచి ♦ వైళంబొప్పన్. 144

గీ॥ వారలందఱు వరుసగా♦వలసఁబోవ, టరసి యసురుండు త్రిదివంబు♦నాక్రమించి
స్వప్రతినిధానులకుఁ గై వ♦సంబుచేసి, తన నగరుఁజేరి యేలుచుం♦డెనుజగముల,

చ॥ పురపురఁబొక్కి వేలుపులు ♦ భోరుననేడ్చుచు బద్మలోచనున్
దఱియఁగఁబోయి మ్రొక్కిలిడి ♦ దానవభంజన ! దీనరంజనా !
మరల నొకండు గండఁడయి ♦ మమ్ము దివంబుననుండి పాపె ము
ష్కరుఁ డసురుండు వాని కనిఁ ♦ జాలకపోతిమి దోర్బలంబునన్. 146

సీ॥ కడలిలోపల మధు ♦ కైటభులన్ గిట్టి, యజుని రక్షింపవో ♦ యతులకరుణ
నమృతంబుఁ గ్రివ్యాదు ♦ లపహరింపఁగ వారి, వంచించి యిడవో సు♦పర్వతతికి
నాహిరణ్యాక్షుఁ ద ♦ దగ్రజుఁబరిమార్చి, జగములకొసఁగవో ♦ శాంతిభిక్ష
బలియుడై నట్టి య♦బ్బలిని మోసముచేసి, వేల్పుల కీవో త్రి♦విష్టపంబు

గీ॥ చక్రధర! నీవుచేసిన ♦ సాయములను, మఱతుమే యెన్నినాళ్ళకు♦మానసమున
మరల దయచేసి యీ దుష్టు♦మడియఁజేసి, సాకుమీతూకుదాసుల♦సాకతమున.

క॥ అని యిట్టు లర్థివేడుడు, ననుకంపన్ వనజనయనుఁ♦డారసి యల్లే
యని క్రివ్యాదున్ గడపెద, వనరకుఁ డిఁకమీద మీరు ♦ వాసవముఖ్యుల్!

## —* విష్ణుమూర్తి జలంధరునితోఁ బోరుట *—

గీ॥ అని రయంబునఁ దార్క్ష్యునా ♦ యత్తవఱచి,యసురవర్యునికడకేగి♦యనిఁదొడంగి.
సింగమట్టులఁగడగిఁ వా♦సిందొడంగి, వానితోఁ బోరెనెన్నియో♦వాసరములు.

క॥ కామోదకి మున్నగు ను, ద్దామమహాసాధనముల ♦ దైత్యుని మోఁదన్
భీమబలుఁడైన నాతం, డేమియు నఱసేయ కమ్మ ♦ లేయుచునుండెన్. 150

గీ॥ అంతవేసారి నక్తంచ♦రాంతకుండు, వనధిసూనునిఁ గని యిట్టు♦లనియెనోయి
దైత్యవర్య! ముదంబయ్యెఁ♦దగినవాఁడ, విట్టి శౌర్యంబుతోఁ బెనఁగలే♦దెపుడు నేను.

క॥ నీకోరిన వరమిచ్చెదఁ, జేకొను మెఱిగింపు మిచ్ఛ ♦ సింధుజ ! యనుడున్.
నాకేటికి నీవరములు, వైకుంఠుడ ! యైన నిమ్ము ♦ వర మిప్పగిదిన్. 152

గీ॥ నీదుపురిఁబాసి వేగరబె ♦ నాదుభగిని, తోడ నాయింటనుండు సం♦తోసమొప్ప
నిదియె వరమగు వేఱొకం ♦ డేదియేని, వలికి లేదెందు నాకెప్డు ♦ జలజనయన!

వ. అనినఁ దధా స్తని నారాయణుం డిందిరతో జలంధరావాసంబున కేగి యందే
సుఖంబుండె నంత బృందారకు లాతురులై కైలాసంబున కేగి శైలాదిసెలవుతో
శివునిఁ జేరి కాంచి జలంధరుని వృత్తాంతంబును దమదు పరాజయంబును, త్రిదివం
బాయసురునిపాలుపత్తెంబుననుండుటయును వైకుంఠునిపరాజయంబును, మఱియు
వెన్నుండు లక్ష్మీసహాయుండై జలంధరుని కైవసంబైయుండుటయునవిస్తరంబుగాఁ
దెల్పి యద్దైత్యుని వధించి తమ్ముఁ బాలింపు మనియర్థించుటయును నాలించి
బాలేందుశేఖరుం డచిరకాలంబున నట్లుసేయుదుఁ బొండని వారిం బనిచి నారాయ
ణుం దలంచిన నతండు దఱియుడు నాయసురవృత్తం బడిగిన నతం డిట్లనియె.

ఉ॥ దేవ! జలంధరాసురుఁడు ♦ దేవరఫాలవిలోచనాగ్ని చే
నావనధిన్ జనించి పెను ♦ పై సురలందఱ నోడఁబుచ్చి దు
ర్భావమునన్ దివంబు నిజ ♦ పక్షులకై వసమున్ బొనర్చె నే
నా వెడఁగున్ వధింపఁజని ♦ యక్కట వానికి లోఁగిపోయితిన్. 155

గీ॥ పెక్కుదినములు వానితో ♦ నక్కజముగు, పోరుసల్పితి గెల్వమి. ♦ పొసఁగదయ్యె
చుట్టఱికమూరసి యతండు ♦ వట్టుఁబట్టి, సిరిని నన్నును దనయింటఁ ♦ జేర్చికొనియె.

క॥ అనినన్ శివుండు నగి వె, న్ననిఁ బొమ్మని నారదు నెద ♦ నుదలఁప నతఁ డం
తనె వచ్చి మ్రొక్కె నమ్ముని, కనియెను లోకాధినాథుఁ ♦ డాలోచనతో. 157

క॥ మౌని! జలంధరుఁ డను నొక, దానవుఁ డేపొంది సురలఁ ♦ దఱిమి దివంబున్
దానుగొని తనదువారల, కానాకం బప్పగించె ♦ నతిదుర్మదుఁడై. 158

క॥ వానికడ కీవు చని యే, దేనియు భేదంబుఁ బన్ని ♦ యింకగఁ జేయన్
గానొప్పుజతన మమరుపు, పైనంతయు నేనొనర్తు ♦ బ్రహ్మజ! యనినన్.

వ. తాపసుం డతిత్వరితంబున వల్లకిన్ మోహనరాగంబునఁ గదిపి జగంబుల్లసిల్లన్
జేయుచు జలంధరునిఁ జేరి తత్కృతోపచారంబులఁ బ్రీతుండై నంత నతండు దేవర్షీ!
యెచ్చటనుండి వచ్చితి వెచ్చటికేగెదవు? నాయైశ్వర్యంబుఁ గని మెచ్చితివే?

సీ॥ హంసయుక్తవిమాన ♦ మపహరించితి నిదే, చూడుము రాజీవ ♦ సూనునొడిసి
ఐరావతంబిది ♦ హయరత్నము చ్చైశ్శ్ర, వంబది కను మింద్రుఁ ♦ బాపి కొంటి
పద్మాదినిధు లవ్వి ♦ భాండార మటుఁ జూడు, సంతరించితి శ్రీదు ♦ పంతమణఁచి
బంగారువర్షించు ♦ పాండురచ్ఛత్రంబుఁ, గను మిది కొంటిఁ బా ♦ శిని నదల్చి

గీ॥ కాలదండంబుఁ గయికొంటిఁ ♦ గాలు నోర్చి, కల్పవృక్షంబులను దెచ్చి ♦ నిల్పితి నవె
పెరదునన్ జూడఁడు; మింకను ♦ సిరినిహరిని, యింట నేయుంచి నాఁడ ము ♦ నీంద్ర! కనుము.

గీ॥ ఇంక నివియుఁగాక దక్కువే ♦ దేని నీదు, మదికి ముదమిచ్చునట్టిదా ♦ మంచిరతన
మున్నఁ దెల్పుము వేవేగ ♦ నుద్దవిడిని, దెచ్చికొనియెద నెందున్న ♦ దివ్యమౌని!

వ. అనుటయు నసురేంద్రా! నీవు చెప్పినయంత సేయఁగన్ గలవాఁడవే. నీ యైశ్వర్యంబు బండరంబునకు మెండుగ సంతసించితి నైన వినుము, నేనిపుడు కైలాసంబుననుండి మహేశ్వరుం దరిసించివచ్చితి నతండు మహేశ్వరుం డనుటకుఁ దగిన వాఁడు. 163

గీ॥ కాటిబూదిని నలఁదియుఁ ♦ గాటనున్న, దిసమొలన్ దిర్గుచుండినఁ ♦ దిండిలేక
విసము మెక్కినఁ బాముల ♦ వేసికొనిన, శివనుగొనియమ్మహేశతఁ ♦ జెందె హరుఁడు.

ఉ॥ కావున సర్వమంగళను ♦ గైకొని సర్వసమృద్ధులన్ మహా
దేవపదంబు మున్నయిన ♦ దివ్యపదంబుల నొందె శూలి నీ
వా వెరవొప్పినట్టి యొక ♦ యున్నలమిన్న నదృష్టశాలినిన్
దేవినిగాఁగొనన్ మిగులఁ ♦ దేజమునొందెద వింతకున్ భువిన్. 165

గీ॥ ఇందు నీదేవి బృంద యెం ♦ తేనిసొగసు, దనమునఁ బతివ్రతంబునఁ ♦ దనరు నైన
నల్ల పార్వతియట్టి య ♦ నన్యభాగ్య, గాకయుండుట కొఱఁతమై ♦ గానుపించె. 166

క॥ అనినంతనె శివఁబోలిన, దననేటికి యాపెనేవ్రు ♦ పొంకు గెలిచితె
త్తును జూడు మునివరా! యని, తనసేనకుఁ దెలిపె దాడి ♦ ధవళగిరిపయిన్.

వ. తత్క్షణంబున నవరత్నస్థగితాష్టాపదరథాధిరూఢుండై.

—* జలంధరాసురుఁడు కైలాసగిరిపై దండెత్తుట *—

చ॥ తగినవజీరులన్ గొని యు ♦ దాత్తగతిన్ రజతాద్రి కేగి బి
ట్టుగ రణభేరిఘోషము గ ♦ డున్ గడు సల్పఁగ నాలకించి ప
న్నగపతిహారుఁ డంతయు మ ♦ నంబున నారసి యొక్క వృద్ధుఁడై
యొగి దనుజాధిపున్ దతిని ♦ నుద్ధతుఁ డాతఁడు సూచి క్రుద్ధుఁడై. 168

చ॥ ముదుక! హరుండు లేడె యెటఁ ♦ బోయె నెఱుంగఁగఁ జెప్పు మున్నచోఁ
బదిలముగాఁగ నీవరిగి ♦ పార్వతినిమ్మను జోగికేల సొం
పొదవెడు చెల్వ నాకు సరి ♦ యొప్పును దప్పదు కొందు నెట్టులే
నిది తన మేలుగా నుడువు ♦ మీరసమొందిన నేనె తీర్చెదన్. 169

చ॥ అను దనుజాధమోక్తి విని ♦ యంతకశాసనుఁ డాగ్రహంబునన్
బొనరియు నోయి వీరవర! ♦ పొంకముగల్గినయేని నీ మద
ర్శనమును నెత్తి నెత్తిపయిఁ ♦ జక్కఁగ జేరుపు మట్లమైన నీ
వనలవిలోచనున్ గెలువ ♦ నర్హుఁడవన్న నతండు గిన్కమై. 170

ఉ॥ నానుడి కడ్డువల్కి యిటు ♦ నన్నుఁ బరీక్షయొనర్ప నెంచెదే
కానక నీవు సెప్పుపని ♦ కర్జమెసంగఁగఁ జేయఁ జెల్లునే

నీ నుడు లెల్లమాని యిక ♦ నేరుపు గీరుపుఁ గట్టిపెట్టి చ
న్నీ నుడిసేయవేని యిపు♦డే కడ తేర్చెద నిన్ను నాపుడున్. 171

— * శివుఁడు సుదర్శనంబున జలంధరాసురున్ జంపుట * —

గీ॥ నీటిలోఁ గాలివ్రేలున ♦ నేర్పుమీఱ, వ్రాసిన సుదర్శనంబెత్తి ♦ రక్కసిపయి
వేసిన యతండు రెండయ్యె ♦ వేగనతని, తేజమీశ్వరునొందెను ♦ దీప్తులలర,
క॥ సైనికు లడరిన వీర, శ్రీనిధి యలకువలయేశ ♦ శేఖరుఁడు కడున్
బూనికి నలికాక్షాగ్నుల,చే నశియింపంగఁజేసె ♦ జేజే లలరన్. 173

క॥ కురిసెన్ బ్రసూనవర్షము, మెఱసెన్ దిశలెల్లఁ గాంతి ♦ మేకొని వీఁకన్
బొరసెన్ దుందుభిరవములు, విరిసెన్ రక్కసుల తెగల ♦ వేడుక లెడమై.
ఉ॥ అంతకుమున్నె శ్రీశుఁ డసు♦రాధిపు గేహినియైన బృందచె
ల్వొంతయుఁ గోర్కెలూరఁ గని ♦ యెట్లు లభించుఁ దదీయభోగమన్
జింత మునింగి యట్లసుర ♦ చేడ్పడు టారసి వానిఁబొంది య
త్యంతము నాసఁ జేకొని ర♦యంబున నొండెడ దాఁచి చెచ్చెరన్. 175

గీ॥ వృద్ధుఁడగు నొక్క యతినాథు ♦ వేసమొంది, రెండుక్రోతులఁ జేకొని♦దండిగా శి
వోహ మంచు జలంధరు♦నారనొక యు, వవనమున్ జేరి యుండె న♦ప్పట్ల నంత.
చ॥ తన మగఁ డంతకాంతకుని ♦ దర్పముతోఁ జెనకంగఁబోయెఁ దా
ననువిది కాదు పోకుమని ♦ యన్నను మానకయుండె రాకయుం
డెను గతమేమొకో? యనుచు ♦ డిల్లఁదనంబునఁ గ్రాఁగి పోవుచున్
దనచెలికత్తెయల్ గొలువ ♦ దైత్యునిరాణి వనంబుఁ జేరి తాన్. 177

గీ॥ దేవసంస్మరణముల నెం♦తేని యాల, కించి యద్దెస కేగి వీ♦క్షించి యతికి
సాఁగిలన్బడి విభుని కు♦శలము నడుగ, సామి కపులకు నొక్కింత ♦ సంజ్ఞచేసె.
వ. వానరంబులు వేవేగచని యతిత్వరితంబుగ నాతుండెంబులఁదెచ్చి యచ్చేడియ ముందఱఁబెట్టిన నయ్యరవిందనేత్ర విభునిమృతిమెఱింగి దుఃఖభరమ్మున మూర్ఛితయై కొంతతడవునకుఁ దెలివొంది కన్నీరు మున్నీరుగా విలపించుచు యతీంద్రుని పదంబులఁ బడి నాథునిజీవితం బర్థింప నతండు. 179

ఆ॥ ఈ కళేబరంబు ♦ నింటికిఁగొని చని, కడిగి తడిని నొత్తి ♦ గంధలేప
నము నొనర్చియొకట♦నమరించి యుంచుము, జీవితంబుఁ జెందుఁ ♦ జిగురుఁబోడి!
వ. అన నాపె తత్క్షణంబున నద్దేహంబు సొవిదల్లులతో నిజగృహంబునకుఁ జేర్చి యతివరుండు చెప్పినట్లొనర్చి నిరీక్షించుచున్నంతఁ బుండరీకాక్షుండు క్రోతుల విడిచిపుచ్చి యోగబలంబున జలంధర దేహంబునఁ బ్రవేశించి కనులు దెఱచి కదలిన నమ్ముదిత ముదితయై పెనిమిటియని తలంచి గాఢాలింగనంబొనర్చెనంత విష్ణుండు సంతసంబున నాపెతో నహర్నిశంబులు గ్రీడించుచు సుఖంబులొందు

చున్నంత నొక్కనాఁడు యదృచ్ఛచే వెన్నుం డొంటిగఁబరుండి యున్నతఱి
బృందాదేవి యలంకరించుకొని యందుఁ జేరుడు జలంధర దేహశకలంబులమధ్య
మేచకచ్ఛాయలనొప్పు నప్పాలుంగు రాతుం గాంచి యదరిపడి యేవంబునొంది
విన్నదనంబున ఖిన్నయై మరగుచుఁ బదతాడితభుజంగివోలె మించుటల్కతోఁ
జురచురఁజూచి యిట్లనియె. 181

గీ॥ ఓరి పోకిరి ! తుంటరి !◆మోరితులువ! ,మోరి పరదారగామి! వి◆న్మోరి! మీఱి
చెఱిచితివి నన్నుఁ బరసతిఁ◆జేటుమూఁడు, నని తలంపక కనుకని ◆ ననుచితముగ.

క॥ పతిభావముతో నీసం, గతిఁ జెందితిఁ గాని వేఱుఁ◆గా దెప్పుడు నా
మతి యంటువడదు నీ దు, ర్గతిఁ గను మిఁక నదరిపాటు ◆ గంగన్ గలియున్.

—* విష్ణుమూర్తిని బృందాదేవి శపించుట *—

క॥ నీయాలొక్కని కిట్టుల, నే యనువుగఁ జిక్కఁగలదు ◆ హేయపువాదుల్
సేయుదురు లోకులెంతయు, నీ యుల్లము గడిఁది వగను ◆ నొక్కని పొగలన్.

వ. మఱియుఁ గపులతోఁగూడి యిచ్చెడుపనియొనర్చితివి గావున నీకుఁ గపులే తోడ
య్యెదరని శాపంబిచ్చి పతి దేహఖండంబులఁ జితియందుంచి యానిముసంబున
దానా చిచ్చు నురికి ప్రాణంబులు వదలెనంత దామోదరుండు బృందావిర
హంబు నోర్వక ఱేఁబవలా చితియందుఁబడి యన్యంబుఁ దలఁపకుండుటఁ గాంచి
యిందిరయుఁ దక్కువేల్పులును బరమేశ్వరునిఁ గానన్బోయి యచ్చరితంబుఁ
దెలిపి యనుగ్రహింపుమని యర్థింప నద్దయాకరుండు సర్వజగన్మోహినియును
మూలప్రకృతియును మహామాయయు నగు నంబికను నియోగించిన నాజగజ్జనని
శక్తిమయంబులగు మూఁడుబీజంబుల నొసంగి వీని విష్ణుండున్న బృందాచితిప్రదే
శమందుఁ జల్లుండు మీయిష్టసిద్ధియగు ననుడు వారట్లుసేయ నందు ధాత్రీతులసీ
మాలతీవృక్షంబులు వొడమిన నవ్వాని సౌరభగ్రహణంబున విష్ణుండు మోహపరి
తాపంబుఁ బాసి వైకుంఠంబున కేగి సుఖంబుండె నీవృక్షత్రయంబునందుఁ బూర్వా
పూర్వము గేశవున కెక్కుడానందదాయకంబై యెసంగునట్లుగుటన్ జేసి కార్తిక
మాసంబందీ ధాత్రీ తులసీ పూజనంబు తక్కువేల్పులకన్న విష్ణుదేవున కెక్కుడు
ప్రియం బంత సకలామరు లానందంబున స్వపదంబులఁ జెంది రిది జలంధరవధో
పాఖ్యానంబు దీనిఁ బఠించిన వినినవారలకు సర్వపాపక్షయంబై శ్రేయంబులొందు
నిఁక శంఖచూడవధోపాఖ్యానంబు వినుండని సూతుండిట్లనియె. 185

—* శంఖచూడ చరిత్రము *—

క॥ మునివరుఁడగు కశ్యపునకుఁ, దనుజుండగు విప్రచిత్తి ◆ తనయుఁడు దంభుం
డనువాఁడు గొడుకుఁబడయఁగఁ, బెనుతపసున్ జెందియుండెఁ◆ బెద్దయుఁబ్రొద్దుల్.

గీ॥ కొంతకాలంబునకు వాని ♦ ఘోరతపము, చే శిరసునందు నగ్నులు ♦ చెంగలించి
మంట లేపొందినంత ర♦మాసహాయుఁ, డరసి పొడగానవచ్చె దై♦త్యాధిపతికి.

క॥ వరమడుగుమనుడు హరి యతఁ, డరవిందాక్షునకు మ్రొక్కి ♦ యడిగెను దనయుం
డురువైనబలముగలవాఁ, డరాతిసూదనుఁ డజయ్యుఁ ♦ డమరావళికిన్. 188

క॥ నీయందు భక్తుఁడై కడు, శ్రీయంబులఁ జెందువాఁడు ♦ శ్రీరమణీశా!
గేయగుణాఢ్యుఁడు పొడమఁగఁ, జేయుము కృపఁజేసి సంత ♦ సింతునసంగా.

గీ॥ హరి 'తథాస్తు'ని వరమిచ్చి♦యరిగెనతని,సతికిఁజూలేర్పడియె శుభ♦సమయమందు
కొమరుఁడుజనించె గోలోక♦గోపుఁడౌ సు, దాముఁ డారాధికాశాప♦దానవిధిని.

గీ॥ అల్ల శిశువున కొనరించి ♦ రపుడుజాత, కర్మమును నామకరణంబు ♦ గరిమదనర
శంఖచూడుఁడనుచు మేల్ ప్ర♦శస్తిఁదనరె,నాహ్వాయంబెల్లజగముల♦యందునిండె

క॥ ఆ చిఱుతయు దినదినమున, కేచుచు వర్ధిల్లి కళల ♦ నేపువడసి యెం
తో చనవున జైగీష, వ్యాచార్యునియొద్దఁ బడసె ♦ నభిమత మనువున్. 192

గీ॥ అంతఁ దలిదండ్రుల యనుజ్ఞ♦నంది పుష్క, రంబనెడు తీర్థతల మొందె♦సంబరమున
పెక్కువర్షంబులు తపంబు♦నొక్క తీరు, సల్పె దృఢమై యొసంగు సం♦కల్పమునను.

వ. అంతఁ గొంతకాలంబునకు.

ఆ॥ తమ్మిచూలి దఱిసి♦సమ్మదమ్మున శంఖ, చూడుఁజూచి యనియె♦శూర! వరముఁ
గోరుమిత్తుననుడుఁ ♦ గుతుకంబున నతండు, మ్రొక్కి ప్రస్తుతించి ♦ చక్కననియె.

చ॥ అనిమిషదానవాహిమను ♦ జాధిపు లందఱు నోడఁబుచ్చఁ జా
లిన బలవిక్రమంబులు ద ♦ లిర్పఁగఁ జేయుము సర్వశత్రుసూ
దనునిగ ముజ్జగంబులను ♦ దక్కొని నేలఁగఁజాలువానిఁగా
నను బొనరింపుమీ తగ న ♦ నంతకృపాజలధీ! విధీ! యనన్. 195

వ. అనిన నతండు.

—* శంఖచూడునకు బ్రహ్మ వరంబు లిచ్చుట *—

క॥ కోరిన కోరికలన్నియు, భూరిగ ఫలియించు నీకు ♦ భోగములను వి
స్తారముగ నొందుదువు బల్, గీరితినిన్ జెందఁగల వొ♦గిన్ దనుజసుతా!

వ. మఱియు నొక్కవిశేషంబుఁ జెప్పెద నాలకించి యట్లు సల్పుము.

క॥ బదరీవనమున నొకతుక, సుదతీమణి కన్నె తులసి ♦ సుందరి తప సొ
ప్పదలిర్పఁజేయుచున్నది, ముదమున నీవిప్పు డందుఁ ♦ బోయి కను మికన్.

గీ॥ ఆపడుచు విన్ము ధర్మధ్వ ♦ జాఖ్యు నమరి, నట్టి నృపుతనుజారత్న ♦ మన్నుమిన్న
నిన్నుఁ జూచి వరించును ♦ సన్నుతాంగి, నీకుఁ దగిన మిటారియౌ ♦ నేర్పులాడి.

వ. కావున.

చ॥ చనుమిఁక సత్వరంబటకుఁ ♦ జందనగంధినిఁ జెంది పెండ్లిఁ జే
కొనుము నితాంతభోగములఁ ♦ గోమలితో సుఖియింపు మింపుమైఁ
జెనుపుము ధర్మమార్గ దిశలఁ ♦ బెంపొనరింపుము కీర్తిచంద్రికన్
దనుజులకెల్ల సంతసము ♦ దార్కొనఁజేయు మజేయవిక్రమా! 199

క॥ రత్నము సుమి యక్కాంతా, రత్నము నీవైనఁ బురుష ♦ రత్నంబవు దా
రత్నమునన్ జేకొనుమిఁక, రత్నము రత్నంబు సరస ♦ రాజిలుననరే. 200

గీ॥ అనినొడివిచనియెనుధాత ♦ యపుడుశంఖ, చూడుఁడరుసమ్ముదనరన ♦ చొప్పవ్వరయము
మీఱ బదరీవనంబును ♦ జేరికాంచె, నొక్కచోఁ దపసొనరించు ♦ నక్కలికిని.

— * శంఖచూడుఁడు బ్రహ్మశాసనంబునఁ దులసిన్ జేరుట * —

గీ॥ బమ్మ చెప్పిన నుడికన్నఁ ♦ బలుతెఱఁగుల, నందముల మించుమీఱిన ♦ సుందరాంగిఁ
గాంచి యువ్విళులూరి య ♦ గ్గలిక మించి, తారసించినవాని న ♦ త్తన్వి గాంచి.

క॥ పరికించిన మది గరఁగగ, విరిశరముల మరుఁడు విసరి ♦ వేయఁగ వనలో
మురిసి తలవంచి మ్రొక్కిడి, సరసిజముఖి చేసె నతిథి ♦ సత్కారములన్. 203

వ. దానవేంద్రుండును దులసీసమర్పితకుశాసనంబునం దాసీనుండై తనపైఁ గురంగట మెఱుంగుచూపులందలి చకచకల నాణిముత్యంబులట్లు గుమ్మరింపుచున్న సుందరిన్ గనుంగొని మందహాసంబుతో నిట్లనియె. 204

గీ॥ నీముఖప్రతిబింబమో ♦ భామ! చంద్ర, మండలము లేక చంద్రమో ♦ మండలమున
కీభవన్ముఖమండలం ♦ బే ప్రతికృతి, యొక్కొ! యీసందియము దీరు ♦ టెక్కతనవో.

ఉ॥ ఎవ్వతె వీవు? కల్కి! కుల ♦ మెయ్యది? నీయభిధాన మెద్ది? నీ
వివ్వనమందు నొంటితప ♦ సిట్లొనరించెద వేమిగోరి? లే
జవ్వనమందు నన్నిటను ♦ జక్కఁగ జాలినవానిఁ జెంది య
ప్పువ్వులవింటిదంటబుఱ ♦ మున్ సరిపెట్టుట యొప్పదే చెలీ! 206

చ॥ కనుల మెఱుంగు నెమ్మొగము ♦ కాంతి రదంబుల నిగ్గుజగ్గులున్
చనుఁగవపొంకవుందళుకు ♦ సన్నని నెన్నడుమందపుంబసం
దనువగు మేల్పిఱుందుబిరు ♦ దానవకంబు టొయార మౌర! నేఁ
గనుఁగొనలేదు నిన్ జెనయు ♦ కాంతను నెయ్యెడఁగూడ మానినీ! 207

చ॥ వలచితి నిన్నుఁ జేడియరో! ♦ వాస్తవమీయది నన్నుఁ జెందు మ
గ్గలముగఁ గామకేళుల సు ♦ ఖం బొదవన్ దనియింతు నెందు నీ
తలఁపున కన్యథాత్వము నె ♦ దన్ దలపోయను మేటిప్రేముడిన్
గలియుదమీవనిన్ బికవి ♦ కస్వరమున్స్వరగానశోభినిన్. 208

వ. అనవుడు నమ్మదిరాక్షియు నవ్వాని హేవాకవచఃపరిపాకసౌకుమార్యంబు నారసి. 209

క॥ తియ్యని నెయ్యంబుల నిటు, వియ్యముఁ బొసఁగింపఁ దలఁచు ♦ వీరపురుషుఁడా
నయ్యెడ నేకాంతంబుల, నొయ్యనఁ గనుఁగొనుచు నంత ♦ నువిదయిటులనెన్,

గీ॥ ఏను ధర్మధ్వజుఁడను మ ♦ హీశుసుతను, తులసియనుదానశుభ మెదఁ ♦ దలఁచియిట్లు
తపసుఁ జేయుచు నిందుంటిఁ ♦ దఱలుమీవు, ఒంటి పాటున స్త్రీలఁ దా ♦ పొందఁజనదు.

మ॥ పొలఁతుల్ మాయలమారు లెంతయును న ♦ ప్పూఁబోఁడు లున్నట్టిచో
చెలమిన్ జేరఁగరాదు బ్రహ్మనయినన్ ♦ హేలావిశేషంబులన్
గలఁతన్ బుచ్చి యలంత్రుగి త్తవలె లోఁ ♦ గన్ జేతు రవ్వారి య
త్తలఁపుల్ గ్రూరము లుల్లమున్విసము ని ♦ ర్దాక్షిణ్య లీనాతుకల్. 212

క॥ అన నాతం డెలనగవున, వనజేక్షణ కనియె వినుము ♦ భామిని! యెంద్రై
నను ధీరుఁడై నవానికిఁ, జనుఁ బొలతుల గోష్ఠి నుండఁ ♦ జనవలరంగన్. 213

క॥ స్త్రీలయెడన్ బురుషులయెడ, మేలిమికలవార లువిద ♦ మిన్నా! కల రా
శీలం బెఱుఁగుట కర్జము, లోలాత్మ లెఱుంగ లేరు ♦ లోటుఁదనమునన్. 214

క॥ నిను వెదకుచు వచ్చితి నీ, వనమునఁ గనుగొంటి నేత్రి ♦ పర్వముగనిటన్
ననుబంచె నీకడకు విధి, నిను గాంధర్వమునఁ బడసి ♦ నెగడుమని సతీ! 215

క॥ ననునరయు శంఖచూడుం, డను దానవరాజపుత్త్రి ♦ నధికతరతపో
ధనునిగ నీమది నెంతయుఁ, జనునె విధిన్ దప్పసేయ ♦ సఖ! యిఁక మనకున్.

గీ॥ అనిన నామోదమున వాని ♦ యాననంబుఁ
గాంచి మది సంతసించి యి ♦ క్కరణి ననియె
ధీరుఁడ వటంచుఁ దెలిసితి ♦ నారులందు
ధీరతను గోల్పడినవాఁడు ♦ దేఁబెకాఁడె. 217

క॥ ఎవ్వఁడు స్త్రీవంచితుఁడగు, నవ్వాఁడు మృతుండు వాఁ డ ♦ నర్హుఁడు సభయం
దవ్వాని హవ్యకవ్యము, లవ్వేల్పులు పితలు సెంద ♦ రారయుమెందున్. 218

ఆ॥ స్త్రీపరాజితుండు ♦ సిద్ధమాశౌచి పం, చత్వ మొందువఱకు ♦ సందియంబు
లేదు దీనికన్న ♦ లేదు మిన్నైన యా, శౌచ మొందు నేని ♦ సచ్చరిత్రి! 219

గీ॥ బాపఁడాశౌచమును బాయుఁ ♦ బదిదినముల, కల్లక్షత్రకులుఁడు ద్వాద ♦ శాహములకుఁ
బదియునై దుదినములకు ♦ వైశ్యుఁడొక్క, నెలకు శూద్రుఁడు శుద్ధిఁగొ ♦ నెదరువుడమి.

వ. కావున.

క॥ నిన్నుఁ బరీక్ష యొనర్చితి, నన్నిటఁ దగినట్టివాఁడ ♦ వైతి విటులఁగా
కున్న నెటు దెలియనయ్యెడుఁ, గన్నియలకుఁ బురుషు తెఱఁగుఁ ♦ గనుటొప్పిదమా.

వ. అనుచున్నంతలో నబ్జసంభవుండు దారసించి శంఖచూడున్ గాంచి యిట్లనియె,

చ॥ తడవానరింపఁబోకు మిఁకఁ ♦ దన్వినిఁ జెంది మనోజభోగముల్
పడయుము వేగ నేకతమ ♦ భామలు దక్కిన నాలసింతురే
బెడఁగగు సోయగంబు గల ♦ బిత్తరి యీపడు చీవు నట్టులే
బెడఁగగు సోయగం బమరు ♦ వేడుకకాఁడ విఁ కేల కొంకుటల్. 223

గీ॥ తగిన యన్నంబు సరసమఁ ♦ దగినకూర, సేకుఱుట దుర్లభంబగు ♦ క్షితితలమున
దగినజోడీరలిర్వురిం ♦ పుగదగదె "శు, భస్యశీఘ్ర"మ్మనుడు నచ్చుఁ ♦ బాసి యిఁకను.

వ॥ తులసిన్ జూచి యిట్లనియె.

సీ॥ తులసి! గోలోకముననుండు ♦ లలితమూర్తి, యలసుదాముఁడితఁడు నీవు ♦ నల్లరాధి
కోరు శాపవశమ్మున ♦ నుర్విఁబుట్టి, నారు దంపతులౌదురు ♦ మీరలిందు. 225

ఉ॥ వీఁడు మహాతపస్వి బల ♦ వీర్యములం దసమానుఁ డెంతయుఁ గ్
జూడఁగ నొప్పునందముల ♦ సొంపుల కాస్పదమైనవాఁడు నీ
కీడును జోడునై తనరి ♦ యింపు దలిర్చెడువాఁడు వీనిఁదా
కూడి కనొంది భోగములఁ ♦ గొందువు సందియ మొంద కుగ్మలీ! 226

క॥ రమణివి నీవన్నింటను, రమణుఁడితం డెల్లయెడల ♦ రాజిలు మీయో
గము రమణీయము వీనిగ్, గమనీయతరాంగి! చెందు ♦ గాంధర్వమునన్. 227

గీ॥ కలుములపడంతి వెన్నుకేల్ ♦ గాంచినట్లు, పలుకులవెలంది నాదుచేఁ ♦ బడిసినట్లు
ఛాయ యర్కునిఁ జెందిన ♦ చాయ శంఖ,చూడు నీవొంది సుఖములఁ ♦ జూఱగొనెదు.

—* తులసీ శంఖచూడులు గాంధర్వవిధితోఁ గలియుట *—

క॥ అంత నిటు చెప్పి పద్మజుఁ, డంతర్ధినిఁ జెందె వార ♦ లన్యోన్యము వే
డ్కెంతయుఁ దలిర్ప నవ్వని, గాంతరమునఁ గామసుఖము ♦ లందిరి వెలుచన్.

క॥ అన్యోన్యాలింగనముల, నన్యోన్యాఘ్రాణములను ♦ నతిలాలసతో
నన్యోన్యచుంబనంబుల, నన్యోన్యక్రీడనముల ♦ హాయిఁగొని రొగిన్. 230

చ॥ కొలఁకులఁ గేళికావనులఁ ♦ గ్రొన్నెలమావులకోనలందు మ
ల్లెలపొదలందు మేల్మిలవ ♦ లీగృహభూముల గాంగసైకతం
బుల గిరికాననంబులఁ బ్ర ♦ మోదరసప్రసరాంచితాత్ములై
యలయుచు నిష్టభోగముల ♦ హాళిఁ బెనంగిరి యంగజోద్ధతిన్. 231

ఆ॥ అంతఁగొన్నినాళ్ళ ♦ కాత్మపురంబున, కింతితోడ దాన ♦ వేశ్వరుండు
చేరి తల్లిదండ్రు ♦ లూరటఁగొనఁ దన, రాజ్యమేలె నసుర ♦ రాజిగొలువ.

క॥ కులగురుఁడగు భార్గవునిన్, బిలిపించి యమాత్యపదవిఁ ♦ బ్రియముగ నిడి యి
మ్ములఁ దదనుమతినిఁ బ్రజలకు, సలుపుచునుండెను బ్రియంబుఁ ♦ జక్కఁగనపుడున్.

వ. ఒక్కనాడు దైత్యప్రేరితుండై శుక్రునివలన దేవదానవవైరంబును వేల్పులు తమవారలకుఁ జేసిన యనుచితంబులాలించి కినుకతో దేవతల నిగ్రహింపఁదలఁచి వరూధినితోఁ జని నాకంబు ముట్టడించుడు. 234

గీ॥ ఇంద్రుఁడు సుపర్వబలముల ♦ నెల్ల ననికిఁ, దోడుకొనిపోయి యాశంఖ ♦ చూడుతోడ
బవర మొనరింపఁగా సుర ♦ వరులు దైత్య, విభుని చేనొచ్చి చచ్చియు ♦ వీఁగిరంత.

చ॥ కనుఁగొని యమ్మహేంద్రుఁడు ని ♦ కామభుజాబల మేర్పడన్ రయం
బునఁ గులిశంబునన్ దనుజు ♦ మోఁదుడు వాఁడఱసేయ కెంతయున్
గనలి నిశాతభూరివిశి ♦ ఖమ్ముల నింద్రుని గాత్రభేదనం
బును నొనరించి యార్చె సుర ♦ పుంగవు లాతురులై చలింపగన్. 236

## —* శంఖచూడ మహేంద్రుల యుద్ధము *—

వ. అంత శంఖచూడేంద్రులిరువురును,

క॥ కరియున్ గరియును హరియును, హరియును గిరియును గిరియును ♦ నటులుద్ధతిమైఁ
దఱుఁగని యుద్ధమొనర్చిరి, సుర లసురులు విస్మయమునఁ ♦ జూచుచునిలువన్.

ఉ॥ అంత నిశాచరేంద్రునిభు ♦ జాబల మెంతయు నంతకంతకున్
వింతగఁ బెర్గుచుండుటను ♦ వృత్రవిభేది యెఱింగి యంతలోఁ
బంతముపీడి వీఁడు పరి ♦ పంథివశం బొనరించి సేనతోఁ
జింతిలుచున్ హిరణ్యగిరి ♦ శృంగము చేరువ కేగె నార్తతన్. 238

క॥ సురపతి యరుగుటఁ గని మే, ల్బిరుదొప్పఁగ నసురభర్త ♦ పేర్మి సుధర్మన్
దఱిసి పదునాల్గు జగముల, దొరగా నభిషేకమొందెఁ ♦ దుష్టి యెసంగన్. 239

గీ॥ లోకములఁ బాలనము సేయ ♦ వీఁక మీఱు
దనుజవర్యుల నందందుఁ ♦ దగిన తెఱఁగు
నిలిపె నధికారము లొసంగి ♦ నేర్పుమీఱఁ
దనదు శాసన మంతేనిఁ ♦ దనరు నట్లు. 240

గీ॥ బలపరాక్రమముల యోగ ♦ బలమునను మ, హాత్ముఁడాతఁడు భువనంబు ♦ లందు నేమి
కొఱఁత లేకుండునట్లేలెఁ ♦ గూర్మిమీఱఁ, బదియునాలుగు జగములఁ ♦ బ్రౌఢశక్తి.

క॥ పాడియుఁ బంటయు మెండై, యీడెనయని కలిమిపొ్రవు ♦ లింటింటను న
ట్టాడఁగ నే సెబ్బర వె, న్నాడఁగ లేకుండె దనుజ ♦ నాథుని యాజ్ఞన్. 242

క॥ ఎల్లజనంబులకును దాఁ, దల్లివలెం దండ్రివలెను ♦ దనరి మనుపుచున్
బెల్లెసఁగుచు నాకవేల్పుల, యుల్లములకు దూరమగుచు ♦ నుండెఁ గడిమిమై.

ఉ॥ వేలుపు లంత వందురుచు ♦ వేగ విధిన్ గొని వెన్నుఁడున్నయ
ప్పాలికిఁ జేరి రక్కసుఁడు ♦ భండనమందు జయించి తమ్ములన్
బోలికి శ్రీలకున్ వెలిగఁ ♦ బుచ్చుట యంతయుఁ జెప్పి శత్రు ను
న్మూలనయున్ బొనర్చుటకు ♦ భోరున వేడుకొనంగ శ్రీశుఁడున్. 244

సీ॥ మదినిసర్వంబరసి దివ్య ♦ మండలిక నె, వినుఁడిఁక సుపర్వవరులా తఁ ♦ డను మదీయ
భక్తవర్యుండు గోలోక ♦ వాసి రాధ, శాపమునఁ జేసి యసురయై ♦ జననమొందె.

మ॥ మఱియున్ వాఁడు భుజాబలంబునఁ దపో ♦ మాహాత్మ్యమున్ జేసి యె
వ్వరికిన్ జవ్వనులోఁగఁ డుత్తమబల ♦ ప్రావిణ్యధౌరంధరీ
స్థిరశౌర్యం డలవానిశూలనిహతిన్ ♦ జెల్లించు శర్వుండు వే
ఱరయన్ రాదన వేల్పులంతనె మహే ♦ శాభ్యర్ణయానేచ్ఛులై. 246

క॥ కడువేగ హరుని డగ్గఱి, యడలుచుఁ బాదముల బడి మ ♦ హాత్మా! యొకనం
డఁడుతిండి శంఖచూడుఁడు, గడు నుద్ధతుఁ డిట్లు మమ్ముఁ ♦ గటకటఁబఱచెన్.

క॥ ఏలుము మము నసురను ని, ర్మూలము చేయుము గడంగి ♦ ముగ్ధేందుధరా!
జాలము చేసిన బ్రతుకన్, జాలము దయసేయు మిఁకను ♦ సత్వరము మదిన్.

సీ॥ అనుడు వారల ప్రార్థన ♦ నాలకించి, యారివేరముఁ జెంది యే ♦ ణాంకధరుఁడు
అసురఁ జంపెదనని వరం ♦ బాదితేయ, వరుల కిడి చిత్రరథుఁడను ♦ వానిఁజూచి

— శివుఁడు శంఖచూడునికడకు దూతను బంపుట —

చ॥ ధరపయి శంఖచూడుఁ డను ♦ దానవుఁడున్న పురంబుఁ జొచ్చి యా
సురరిపుతోడ నా నుడిగ ♦ సూటిగ నిట్లను పోటుబంటవై
వెఱవక దివ్యవర్యులను ♦ వీఁగఁగఁ జేసి తదీయమా సిరిన్
బురమునుఁ జూఱఁగొంటి విది ♦ పోలదు వారల కిమ్ము నాకమున్. 250

ఉ॥ నీదు నివాసమా నగరి ♦ నీవు మెలంగుము భూమినేలు మిం
పొ దనుజేంద్ర! యిత్తెఱఁగు ♦ నారయు మట్లొడఁబాటు సేయవేన్
బూదియొనర్తు నిన్నుఁ గ్రతు ♦ భుక్కుల కిత్తు సమస్తసంపదల్
మీఁదట వచ్చు నాపదల ♦ మేలుగ నీమది నిర్ణయింపుమా! 251

క॥ అని నుడివి వాని చిత్తం,బును వేగ నెఱింగిరమ్ము ♦ పొమ్మన నతఁడున్
విని శంఖచూడు నగరున, కనువుగఁ జని వాని కిట్టు ♦ లనియెన్ సభలో. 252

చ॥ హరుఁ డిటు సెప్పియంపె విను ♦ మా! యసురోత్తమ! దివ్యవర్య లం
దఱిఁ గదనంబునన్ గెలిచి ♦ తద్ధనవాహన వస్తువర్గముల్
బురమును రాజ్యమున్ బడసి ♦ పొంగుచునుంటివి చెల్లదింక స
త్వరముగ వారి సర్వమును ♦ వారలకిచ్చి మనంగఁ జూడుమా! 253

గీ॥ అట్లు సేయక దక్కిన ♦ యసుర! నిన్ను, వేగఁ దెగటార్చి యవ్వారి ♦ విభవమెల్ల
వారికిచ్చెద హెచ్చులు ♦ పలవ దుడుగు, మనియె నీయుల్ల మెట్టులో ♦ యరసి చెపుమ.

క॥ అనిపల్కిన దనుజేంద్రుండు, విని లేనగు మొగమునందు ♦ వెలయఁగ గంధ
ర్వునిఁ గనుఁగొని యనియెను నెమ్మనమున నొక్కింతచేవ♦మారక యిట్లుల్.

గీ॥ చనుమ తనజోలి సుంత యే♦జాడ నేని, దలఁపకున్నట్టి నాయెడ♦దాడిఁదలఁప
హాసనకిదినాయమకానొకో!♦యనుచితంబు, గాదొకో!నీవ యోజింపు♦కౌశలమున.

గీ॥ కాక యటు లెత్తివచ్చిన♦గడఁగి బెగడు, వాఁడనే వీఁక నెఱుఁగ రే♦వాసి యసదె
జయపరాజయములు కాల ♦ చక్రమొంది, యొదవుచుండునువానికై♦బెదరఁ కేల.

వ. ఇఁకను.

క॥ ఏదో రీతిగ మాదా,యాదులు దివిషదులు మేము ♦ నన్యోన్యంబున్
వాదొనరింతుము గలియుదు, మేదైనను లేదు పరుల♦కిటఁ బని యొకఁడున్:

గీ॥ చెప్పుమిప్పోల్కి చని దూత!♦శివునితోడ, ననుడు నాతండు వేచని♦యభవుతోడ
నట్లుసెప్పిన "తినుకూడు♦నన్న కణము, దాఁకఁబోకన్న"నుడివోలెఁ♦దగుట నెఱిఁగి.

వ. వేగంబున ప్రమథభూతగణంబులకెల్ల శంఖచూడునిపై దండయాత్ర నెఱింగించి పయనంబుఁ దెల్పిన వారందఱు సంతసంబున మిన్నుముట్టి యట్టహాసంబులు సేయుచు నతిత్వరితంబున వారువంబులనెక్కి సాయుధులై యాయోధనంబు నకై నడచిరి. 260

## — * శివుఁడు శంఖచూడునిపై యుద్ధమునకు వెడలుట * —

సీ॥ భైరవుండును వీర♦భద్రుండు నమ్మహా, సేనుండు గంధగ ♦ జాననుండు
చండీశ్వరుండు బా♦ష్కలుఁడును మణిమంతుఁ, డానంది యశని మ♦హాబలుండు
శంకాలకోకిల ♦ శంకుకర్ణులును సం, తానక పిప్పల ♦ భానుకులును
కపిల కుటీచర ♦ కాలజిహ్వాలు బలీ, భద్ర దుర్జయ కాక♦పాదనీలు

గీ॥ లగ్నికాగ్నిముఖామోఘు ♦ లల్లపూర్ణ, భద్రవికృతవిశాఖ సం♦వర్తకులును
చంద్రతాపన లకులీశ♦సన్నిధులును, తాలకేతు కరాలాక్ష ♦ కాలకులును. 261

వ. మఱియు దీర్ఘదంష్ట్రదుర్గమ కేకరాక్ష విరూపాక్ష వికృతాననకందుకకుండవిష్టంభులును, మధుపింగళావేశన చతుర్వక్త్రకాష్ఠారూఢ లోకాంతక మహాకాల భృంగిరిటులును, ఉగ్రదశనోగ్రకోటరకులోచనవశీభద్రసుభద్రులును నానాయుధధరులై యనేక దివ్యవాహనముల నారోహణంబుచేసి బయలు దేఱిరింకను

గీ॥ శతభుజయు శంఖచక్రాసి ♦ చర్మచాప, బాణ శక్తి గదా శూల♦పరశుముసల
వజ్రముద్గరఖట్వాంగ ♦ పట్టసాది, హస్తయగు భద్రకాళిక♦హరుస మొదవ. 262

గీ॥ రక్తమాల్యాంబరంబుల ♦ రక్తిమీఱఁ, దాల్చి నవ్వుచుఁ బాడుచుఁ ♦ దనదుభక్త
పటలిఁ బ్రోచుచు వికటజి ♦ హ్వన్ బాడుపుగఁ, జాచి త్రిప్పుచుఁ బులి నెక్కి ♦ సాఁగె ననికి.

క॥ హరితో హరిహయుతో సుర, వరులొగి వారువములెక్కి ♦ బహులాయుధముల్
వరుసఁ గొని కదనకేళీ, పరులై నడిచిరి మహేశ ♦ బలము నిడి మదిన్. 265

ఉ॥ శంకరుఁ డష్ట దివ్యకవ ♦ చంబును మై ధరియించి నూత నే
ణాంకకిరీట మొంది వివి ♦ ధాయుధముల్ గొని గోవతీంద్రముఁ
బొంకము మీఱ నెక్కి ముని ♦ ముఖ్యులు భోరుగ స్వస్తిగీతి న
ల్వంకల నిండి చేయఁ బల ♦ భక్షువధింపఁ జనెన్ మహోగ్రతన్. 266

వ. ఇట్లు వెడలి పుడమిఁ జేరి యందు. 267

సీ॥ కపిలముని తపంబు ♦ గాంచినయచ్చోటు, పుష్పభద్రానదీ ♦ పుణ్యకూల
మపరాంబుధికిఁ బూర్వ ♦ మందునొప్పినయది, మలయగిరికిఁ బశ్చి ♦ మంపుఁ జోటు
గంధమాదనగిరి ♦ కటకదక్షిణసీమ, శ్రీశైలమున కుదీ ♦ చీనభూమి
అక్షయవటముచే ♦ నమరి సిద్ధాశ్రమం, బనుపేరఁ బరఁగిన ♦ యట్టికోన

గీ॥ వామమున గోమతి కరంబు ♦ వాసిఁ బరగ
నాశరావతితోఁ గూడి ♦ యపరవార్ధిఁ
జేరఁ జను పుష్పభద్రకుఁ ♦ జేరువఁ దన
బలములను డించి యందుండె ♦ భర్గుఁ డపుడు. 268

వ. అంత శంఖచూడుండు ప్రణిధులచే శివుని దండయాత్రాగమనంబును విని వేగంబున ననేకశతాక్షౌహిణీబలంబుల నలవరించికొని యుద్ధంబునకు సన్నద్ధుండై రేయి శుద్ధాంతంబున నాత్మసతియగు తులసితో మహేశ్వరాహవయాత్రఁ దెలిపి తాఁ బోరునకై పయనంబు సేయుట నెఱింగించిన నాయించుఁబోఁడి వలదనియు స్వారాజ్యం బాదితేయుల కిమ్మనియు నుద్బోధించిన వికవికనవ్వి పొల్లఱుడలికై పగతురపై నెత్తి వచ్చినప్పు డొడఁబాటొంది లోఁగుట శూరధర్మంబు గాదనియుఁ బ్రపంచం బస్థిరంబనియు సుయశంబు శాశ్వతంబనియు నెన్నేండ్లు భోగంబులొందినను దనివిగల్గదనియు నెంతకాలంబు జీవించినను జీవితేచ్ఛ దఱుగదనియుఁ జెప్పి యూరడించి సముచితాలింగనసురతోపభోగంబుల నావేళ దనియఁ జేసి మఱునాఁ డుషఃకాలంబున సౌఖశాయనికోచ్చావచవాక్ప్రబోధంబుల సుప్రోత్థితుఁడై మజ్జనాదికంబులఁ దీర్చి తనయునకు రాజ్యపట్టంబొసంగి తల్లిని భక్తిమెయి గారవింపుమని యప్పగించి కత్తళంబు ధరించి ఖడ్గతూణీరశరచాపాది సాధనంబుల నొంది యష్టాపదరథారూఢుండై మంగళధ్వానములతో వెడలి మహేశ్వరుండు విడిసిన ప్రదేశంబున కనతిదూరంబందు స్కంధావారంబుఁ దీర్చి తా నొక్కరుఁడు మహేశ్వరదర్శనార్థమై సిద్ధాశ్రమంబుఁ జేరి యందక్షయవటచ్ఛాయయందు. 269

—* శంఖచూడుఁడు శివుని దరిసించుట *—

సీ॥ యోగాసనమునఁ గూ♦ర్చుండియుండినవానిఁ, దవిలిముద్రాదృష్టిఁ♦దనరువాని
మందహాసాంకుర ♦ సుందరాస్యమువాని, బ్రహ్మతేజంబుచేఁ ♦ బరఁగువాని
శుద్ధస్ఫటికవర్ణ ♦ శోభితుండగువానిఁ, గేలఁ ద్రిశూలంబు ♦ గ్రాలువాని
శార్దూలచర్మంబుఁ ♦ జక్కఁగట్టినవాని, భక్తుల మిత్రునిఁ ♦ బ్రాపువాని
గీ॥ సర్వసంపత్కరుని శాంతు ♦ సత్యరూపు, విశ్వరూపుని నాద్యుని ♦ విశ్వనాథు
విశ్వసంహారకారుని ♦ విశ్వకరుని, శంకరుని జ్ఞానబీజునిఁ ♦ జక్కఁగాంచి. 270

ఉ॥ దవ్వులనుండి నమ్రుఁడయి ♦ తత్పదయుగ్మముఁ జేరి మ్రొక్కఁగా
నవ్విధుభూషణుండు దను♦జాధిపుఁ గన్గొని దానవేంద్ర! నీ
వివ్విపులన్ సుఖంబెసఁగ ♦ నేలుచునుండుము నాకలోకమి
మ్మవ్విబుధాళి కట్లయిన ♦ నందఱుఁ జెందెద రిష్టసౌఖ్యముల్. 271

ఆ॥ పరులకష్టములను ♦ బాటింపకెంతయుఁ, దనదుసౌఖ్యములనె ♦ తలపరాదు
సంతసంబెసంగ ♦ సకలజనంబులతోఁ, గలసిమెలసి మనుట ♦ కర్జమెపుడు. 272

ఉ॥ నీవును ధేనులోకమున ♦ నెక్కొని మున్ను మహాత్ముఁ గృష్ణునిన్
సేవయొనర్చు గోపుఁడవు ♦ సిద్ధము; రాధికశాప మొంది యి
ట్టివిధి దానవుండవయి ♦ యెంతయు నొప్పితి వట్లుగాన నీ
భావమునందు నీరసను ♦ బాయుము డాయుము మేల్మి మచ్చికన్. 273

గీ॥ అట్లుగాకున్న రణము సే♦యంగఁ గడఁగు
వేఱుతీరుఁ దలంపక ♦ వీరమూర్తి!
సర్వమును నారయఁగఁజాలు ♦ జాణ వీవు
నాయమగు తెరవును జెంది ♦ నడుచు టొప్పు. 274

వ॥ అనిన యనురేంద్రుండు తీవరంబుచెందక మొలకనవ్వొలుక ఫాలవిలోచనునితో
నిట్టులనియె. 275

ఉ॥ దేవర సన్నిధానమునఁ ♦ దెంపునఁ బల్కెదఁ గొన్నిపల్కులన్
భావమునందు వానికయి ♦ పర్వఁగఁ జేయకుఁ డల్కనాయెడన్
దేవత లేము జ్ఞాతులము ♦ ద్రెక్కొనుచుందుము పోరుచుందు మా
దైవవశంబునన్ సిరులఁ ♦ దాకొనుచుందుము మేము వారలో. 276

గీ॥ వారికై తమరెత్తి రా♦వలయు నొక్కొ?
ఇదియె కదు నాయమొక్కొ? మా ♦ యదియె నాయ
మునకు దవ్వొకొ? నీవును ♦ బుండరీక
నయనుఁడును సల్పిన దురముల్ ♦ నాయములొకొ!

సీ॥ మధుకైటభులఁగోడి ♦ మాయతో దేవరిం, చి వధించె నవ్వారి ♦ శ్రీవిభుండు
త్రిపురరాక్షసుల నెం ♦ తేని మోసముచేసి, యలయించిచంపితి ♦ వయ్య నీవు
అమృతంబు సురలనే ♦ యారగింపఁగఁజేసి, రాహు నోర్వకచంపె ♦ శ్రీపతిపగ
తారకముఖ్యులౌ ♦ దైత్యులఁ గొమరుచేఁ, దునుమాడఁజేసితి ♦ వనఘ ! నీవు
గీ॥ మమ్ము జేజేలనొక్క స ♦ మానముగను, జూడకిటు పక్షపాతపుఁ ♦ జూపుఁజూడ
నగునె? సకలేశ్వరులకిది ♦ యర్హమౌనె? , దివ్యచిత్తంబునకుఁజక్కఁ ♦ దెమ్ము దేవ!

వ. మఱియు నేదెట్లులైనను.

ఉ॥ ధీరతఁ బాసి యోటువడి ♦ దీనతనొందఁ దలంప దేవ ! దు
ర్వారము కర్మబంధమని ♦ ప్రాజ్ఞులు పల్కెద రద్ది నమ్మెదన్
దీరుపు మొగ్గరం బదియె ♦ దీర్చెద నోర్చెద మీబలంబులన్
సారెకు దివ్యవర్గములఁ ♦ జక్కడగించెదఁ గాంచెదన్ బ్రథన్.

క॥ అని యిట్లు విన్నపంబును, బొనరిచి చని కట్టెదురుగ ♦ భూరిదనుజసే
నను మొగ్గరంబుఁ గూరిచి, ఘనమగు రణవాద్యరవముఁ ♦ గావించెఁదగన్.

క॥ అది విని దివ్యులు ప్రమథులు, గదనమునకుఁ గదలి వేడ్క ♦ గడలుకొనఁగసొం
పు దలిర్చ వ్యూహమమరిచి, ముదమున సింహధ్వనులను ♦ బొనరించి రొగిన్.

గీ॥ ఇరుదెగలవార లంత నే ♦ హెచ్చుమీఱు, మచ్చరంబునఁ బవరంబు ♦ విచ్చలవిడిఁ
గడఁగి తాఁకిరియొండొరుల్ ♦ ఖడ్గముసల, హలగదాశక్తిహస్తులై ♦ యద్భుతముగ.

సీ॥ ఏనుఁగురాతుల ♦ గ్లెన్నురాతులతోడ, రథికులట్టులు మహా ♦ రథులతోడ
రావుత్తులట్టులే ♦ రావుతుబారుల, తోడ బంటులు బంట్ల ♦ తోడఁ బెనఁగు
చుండిరి మడియుచు ♦ నుండిరి తలలును, గరములుఁ బదములు ♦ స్కంధములును
గూలుచునుండెను ♦ గుట్టలయట్టులు, కరులును హరులును ♦ సురిఁగి పుడమిఁ
గీ॥ గూలుచుండెను నెత్తురుల్ ♦ గొప్పవాఁగు, లగుచుఁ బ్రవహించుచుండెనం ♦ దక్కజముగ
విఱిగి యొరిగిన యరదముల్ ♦ విరివిగాఁగ, నన్ బడుచునుండెఁ బడవల ♦ నాడెముగను.

వ. అంత యోధాగ్రగణ్యులగువారలలో సమరంబునకుఁ దలపడి యన్యోన్యమిట్లు దాఁకిరి.

## —✱ ప్రమథదేవాసుర సమరము ✱—

సీ॥ వృషపర్వుతో గోత్ర ♦ భేదియు నవ్విప్ర, చిత్తితో నుష్ణర ♦ శ్మియును దంభు
తో నచ్యుతుండు కాలు ♦ తోడ దండధరుండు, గోకర్ణుతో నగ్ని ♦ వీఁకమీఱు
కాలకేతునితోడఁ ♦ బౌలస్త్యుఁ డమ్మయు, తో విశ్వకర్మ సం ♦ తోసమొప్ప
నాభయంకరునితో ♦ నలమిత్తి చంచలు, తో గాడ్పు ఘటపృష్ఠు ♦ తోడ బుధుఁడు

గీ॥ ఒరసిరక్తాక్షుతో శనై ♦ శ్చరుఁడు కావ్యు, తో గుకుఁడు రత్నసాలుని ♦ తో జయంతుఁ
డష్టవసువులు వర్చస్వి ♦ యంబుతోడ, నా ధురంధరుతో ధర్ముఁ ♦ డనిఁ బెనఁగిరి.

వ. మఱియు దీప్తిమంతునితో నాశ్వినేయులును, గణాక్షునితోఁ గుజుండును, రాహువుతోఁ జంద్రుండును, ప్రభాకరునితో విశ్వదేవులును, బిపిటునితో మన్మథుండును గోకాముఖమార్జ్ఞఖడ్గధూమ్రసింహవిశ్వప్రతాపపలాశులతో ద్వాదశార్కులును; పదునొక్కండు భయంకరులతోఁ బదునొక్కరుద్రులును, ఉగ్రదండాదులతో మణిమంతుండును మూలరాక్షసబలంబులతోడ నందీశ్వరాదులును యుద్ధంబునకు డీకొని యొనర్చుచుండిరి. 286

క॥ హరుఁడు వటమూలమందుఁ గొ, మరుతోడఁ గాళితో సమరమును గనుచున్
హరువుగనుండె నసుర బం, గరు గద్దియ నెక్కి పోరుఁ ♦ గనుచుండె రహిన్.

ఆ॥ చాలదినములిట్లు ♦ శైవబలంబులు, వేల్పులెల్ల దనుజ ♦ వీరవరుల
తోడ నాజిఁ బెనఁగి ♦ దోర్బలంబున వారి, తోడఁ బీడవడుచుఁ ♦ ద్రుంగుడుపడ.

చ॥ అరసి గుహుండు కాళికయు ♦ నాలముఁ జెంది స్వపక్షకోటికిన్
బిరుదుతనంబు చేకుఱఁగ ♦ బిట్టుగ దైత్యచమూసమూహముల్
బారిగొని జొన్నకోఁతవలెఁ ♦ బొల్పడఁగించుచునున్నఁ గాంచి తీ
వరమున శంఖచూడుఁ డని ♦ వార్యబలుం డటఁ జేరి వారలన్. 289

క॥ పిడుగులఁ బోలిన శరముల, వడివడిఁ గురిపింప వేగ ♦ భర్గాత్మజుఁ డ
ప్పుడు వాని నడము సేయుచుఁ, గడువడి రక్కసుని మోఁదె ♦ ఘనతరశక్తిన్.

క॥ వారిరువురు శక్తులతో, ఘోరంబుగఁ బోరిపోరి ♦ కుంఠితు లగుచున్
వీరాలి దనుజేంద్రుఁ డందుఁ గు, మారున్ మూర్ఛిలఁగఁ జేసె ♦ మహితశరహతిన్.

వ. అంతఁ గాళిక కుమారుఁ దత్క్షణంబున నెత్తికొని పరమేశ్వరుసన్నిధికిన్ గొని పోయినంతనె మహాసేనుండు గన్నులువిప్పి మరలఁ బ్రబుద్ధుండై బలంబుఁ జెంది యిందుశేఖరుసెలవొంది సంగరరంగంబుఁ జెందె నింతలోఁ గాళిక మిగిలి సకలాయుధంబులతో నసురబలంబుల నెల్ల నిర్మూలంబు గావించుచు శోణితంబుఁ ద్రాఁగుచు వీరనృత్తం బొనర్చుచు శంఖచూడునిపై గవిసి గదాదండంబున బిట్టేసిన నతండు వ్రేటుఁబడియు నిల్వరించుకొని కఱకుటమ్ములఁ గాళిం బొదవిన నాయమయు నబ్బాణంబుల నిజశరంబులఁ జూర్ణంబొనర్చి సకలాస్త్రంబుల దానవేంద్రుపైఁ బరఁగింప నవ్వాఁడట్టియస్త్రంబులతో నవ్వాని మరల్చినఁ గినుకతో నామె పాశుపతంబు యోజించుచున్నంత నభోవాణి యెలుగెత్తి వీఁ డద్దానిచే నుఱుఁగఁడనియు మహేశ్వరునిచేఁ ద్రిశూలంబునఁ దెగుననియుఁ జెప్పిన భద్రకాళి యద్దిమాని యితరరక్షస్సులఁ జెండి భక్షించుచు శివునకత్తెఱఁగెఱిఁగించె నంతగీర్వాణసంబో

ధితుండై మహేశ్వరుం డాయోధనంబుఁ జేరుఁడు శంఖచూడుఁడు పరికించి యొద్ధా ణించి.

—* శివుఁడు శంఖచూడుని వధించుట *—

సీ॥ పెనుగదన్ శివునిపై ♦ విసరివేసిన నట్టి, గదచేతఁ బొడిచేసెఁ ♦ గాలహరుఁడు
ఖడ్గంబు శంకరుఁ ♦ గదసి వేయ హరుండు, పరశువుచేఁ జిమ్మె ♦ పలు పొనర్చి
శక్తినిఁ ద్రిప్పి యీ♦శ్వరుపై విసర శూలి, భిండివాలమ్మునఁ ♦ బిండిచేసె
ముసలమ్ము బిట్టేయఁ ♦ బురహరుఁ డద్దానిఁ, జీల్చె ఖడ్గంబుచేఁ ♦ జేవమీఱి
గీ॥ అంతఁ దోఁచక విభ్రాంతుఁ ♦ డగుచు ధనువు
లాఁగి వాఁడిశరమ్ముల ♦ వేగ రుద్రు
తనువుఁ దూర్చిన వాని నెం ♦ తయును సరకుఁ
గొనక కాలాంతకుఁడు గడుఁ ♦ గినుకఁ గదిరి. 293

క॥ జాలమును మాని రిపుజన, మాలాసంహారకరణ ♦ మహితతరంబౌ
శీలమును శూలమునుగొని, మేలుగ నద్దానవేంద్రు ♦ మీఁదన్ వేసెన్. 294
గీ॥ దాన వసురుండు సమసెను♦ బ్రాణ మెగసి, గోపుఁడై వేగఁ జెందెను♦ గోభువనము
విరులవర్షంబు శివునిపైఁ ♦ గురిసె మొరసె, దివ్యదుందుభిరవము లెం♦ తేని మీఱి.

—* విష్ణుమూర్తి శంఖచూడరూపంబునఁ దులసితోఁ గ్రీడించుట *—

వ. అంత హతశేషులగు రక్కసులు పలాయితులై పాతాళంబుఁ జేరిరి. దేవతలు మహేశ్వరునిఁ బ్రస్తుతించి యవ్వాఁడిదిరుగ రాజతాద్రిన్ జేరిచి సెలవొంది స్వస్థానంబులకుఁ జేరి సుఖించి రొక్క పుండరీకనయనుండు శంఖచూడసతియగు తులసి మిగుల యందకత్తెయగుకెఱింగి యాసుందరాంగి నొందన్ గోరి యోగబలమ్మున శంఖచూడ రూపంబుఁ జెంది రథమై నగరుసొచ్చి పౌరులచేఁ గానుకలొందియు వరోధంబుఁ జేరిన సతియగుతులసి సంతసంబున జీవితేశుండని తలంచి యుద్ధజయం బెట్లు పొసఁగెనన్న నతండు పెద్దకాలంబు యుద్ధంబొనర్చి జయంబిరువురకు సమకూరకున్నఁ జతురాస్యుండు దఱిసి నాకంబుఁ బాకారికిచ్చునట్లొడంబఱిచి సంధి పొసగించెననియు నంతమీఁద దానిట్లు వచ్చితిననియును జెప్పిన నా యొప్పులకుప్పు మిన్నంది సంతసంబునఁ గౌఁగిలించుఁడుఁ గేశవు డభీష్టసుఖంబులొందె నంతఁ గొంతకాలం బప్పగిది నప్పాటలాధర హారితో భోగంబులొందుచుఁ గొన్నినాళ్ళకుఁ జేటమాటలఁ జూపుల సురతక్రీడా కౌశలంబుల భేదంబుల వార లారసి లాఁతిపూరుషుఁడని యెఱింగి యోరీ! నీ వెవ్వఁడవు నిజము సెప్పుము తక్కనశపింతునన్న వైకుంఠుఁడు నిజరూపంబుఁ జూప నప్పడఁతి యేవగించి వగచి యసూర్యంపశ్యయగు దన్నట్లు మోసగించి చెరిచిన గరుడకేతనున్ గాంచి యిట్లనియె.

గీ॥ పాపమును బుణ్యమును లేదె ♦ బండ ! నాదు, శీలమంతయు నష్టేటఁ♦జెందనిట్లు దుండగంబొనరించితే ♦ దోసకారి! , మొండిశిలవయియుండుము ♦ గండకంగ.

వ. అని శాపం బొసంగి విభుండు పోలియు కెటఁగి యుక్కరంగలోచన పెద్దయెలుంగున రోదనంబు సేయఁగఁ వారించి నీరజాక్షుం డిట్లనియె. 298

గీ॥ చెలువ! గోలోకమున నన్నుఁ♦గొలుచుచున్న, సతివి, నాయంశజాతుఁడౌ♦శంఖచూడు పడఁతి వైతి విప్పరుసువఁ♦బరగఁ, దిరుగఁ, జేరు గోలోకమున కెట్టి♦చింతఁ బాసి.

## —* తులసీ శంఖచూడులు విష్ణులోకంబుఁ జెందుట *—

వ. అందు రాధతోపాటు నన్ గూడియుండు విఁక నీతనువున గండకియను నది యుత్పన్నయగు నద్దాన నేనును నీశాపపరికారంబు సాలగ్రామశిలలగుదును నవ్వాని వజ్రకీటంబులు దొలిచి చక్రంబుల నిర్మించు మఱియు నీవు వేఱొండు రూపంబునఁ దులసీవృక్షంబవై పొడమి దళముల విరుల నాకామోదంబుఁ గూర్తువు. నీపతియగు శంఖచూడుని యస్థికలంబులన్నియు శంఖంబులై యుద్భవిల్లు నట్టి శంఖోదకంబుతో నన్నభిషేకించుట కరంబు మోదంబిడు తులసీసాలగ్రామశంఖంబు లొక్కెడ సంతరించి పూజించువార లైహికాముష్మికఫలంబు లొందుదురని యంతర్హితుండైనఁ దులసియు నట్లే దేహంబుఁ బరిత్యజించి గోలోకంబుఁ జేరె. ఇఁక నాయమతనువున గండకి యనునదియును దులసీవృక్షంబును జనించిమించె. విష్ణుండును గండకీనదియందు సాలగ్రామ శిలారూపంబులొందె. శంఖచూడుని యస్థులెల్ల మున్నీట శంఖంబులై యొసఁగె నిట్లు శంఖచూడవధోపాఖ్యానంబు సర్వంబెఱింగించితి నిద్ధిశ్రోతలకుఁ బాఠకులకు భోగమోక్షంబులొసఁగు నిఁక బాణాసురగాణాపత్యకథనంబెఱింగింతు వినుండని సూతుండిట్లనియె.

## —*బాణాసుర చరిత్రముషాపరిణయము *—

క॥ ఘనుఁడు బలిసుతుఁడు బాణుం, డనితరబలవిక్రముఁడు సహస్రభుజుఁడు మేదిని శోణపురి వసింపుచు, ననిమిషులను గెలిచి యొడిసె ♦ నాత్రిదివంబుల్. 301

క॥ అందుఁదనవారి దొరలుగఁ, బొందించి వసింపఁజేసి ♦ భూతలమునఁ దాఁ బొందికనుండె నియచ్చరు, లందఱు సవ్వానిఁగొలుతు ♦ రతిజాగరులై. 302

చ॥ ఒకపరి నాతఁ డీశ్వరుని ♦ యొద్దకు జేరి సహస్రపాణులన్
రకముగ వాద్యనిస్వనము ♦ రాజిలఁ దాండవమున్ బొనర్పుడున్
సకలజగన్నియంతయగు ♦ శంకరుఁ డర్మిలిఁ జెంది యోరి! కో
రిక నెఱిఁగింపు మిచ్చెద బిఁతీన వరంబు కరంబు ప్రీతిమై. 303

గీ॥ అనుడునవ్వాఁడు మురిసిమ♦హాత్మ!నన్నుఁ, బాలనముసేయనాకోట♦వాకిటనుభ
వజ్జనంబులతో నుండ♦వలయు నిదియె, వరమనిన శర్వుఁడట్టులే ♦ వత్తుననియె.

—*శివుఁడు బాణాసురునకు వరంబిచ్చి శోణపురికి వచ్చియుండుట *—

క॥ భోళాశంకరుఁ డిట్టుల, శైలం బవ్వేళయందె ♦ వాసియలర సి
ద్ధాళులతోఁ దనయులతో, హాళిఁబ్రమథు లలరఁజేరె ♦ నాసురనగరిన్. 305

గీ॥ సురలుగంధర్వులుమును ల♦చ్చరలునచటఁ, జేరిశంకరుఁగొలుచుచుఁ♦జింతఁదక్క
యుండిరిఁకజగములనేలు♦చుండెబాణ,దైత్యుఁడెదురొండులేక యు♦దగ్రుఁడగుచు.

వ. అంతఁ గొన్నినాళ్ళకు.

ఉ॥ అవ్వరిచెంగటన్ వెలయు♦నట్టి ధునీతటిఁదోట నొక్కనా
డవ్వరవైరి యొప్పుగ వి♦హారము చేయుచునుండె నత్తఱిన్
గప్పె సుగంధమారుతము ♦ కోయిలలున్ మఱి గోరువంకలున్
గొప్పగ గానముల్ సలిపెఁ ♦ గుందము లింపుగఁబూసి భాసిలెన్. 307

గీ॥ మఱియశోకద్రుమంబులు♦మాలతీ ల,తలునుసంపంగిమ్రాకులెం♦తయునువిఱియఁ
బూసిచెన్నొందెఁ గలువలుఁ♦బుండరీక,ములునుబలుతీరులొప్పవి♦స్ఫుటతమీఱె.

క॥ ఆసమయంబుననే బా, ణాసురసుత యుష యనుఁగువ ♦ యస్యలతోసం
తోసంబుగ వనకేళీ, వ్యాసక్తాత్మమున నటకు ♦ వచ్చెప్రియముగన్. 309

వ. చెలులున్దాను నచ్చరమచ్చకంటులతోఁగూడి యుద్యానంబున నుల్లంబురంజిల్లఁ
బలుతెఱంగుల విహరింపుచుఁ బెల్లగునుల్లాసంబున నిట్లన్యోన్యము సల్లాపంబులొన
ర్చుచుండిరి. 310

వృషభగతిరగడ॥ రమణి రమణీయమగు పువ్వువ ♦ రాగ రాగముఁజెందె మంకెన
కమల కమలావళిఁ గలామిషఁ ♦ గావఁగా వనమొందె జంకెన
ఘనమ ఘనమాకందమెక్కెనుఁ ♦ గానకానగువగల నిండఱ
కొనక కొనకరవీరమంజరిఁ ♦ గోరగోరంటలను ముందఱ
నవనవస్ఫుటకుసుమతతి నా ♦ నందమంద నొసఁగెనశోకము
అవునవును కంకేళి సీవద ♦ మందియుండె సుమాభిషేకము
పరిమళ పరిమళాశ్వాస లభ్యవి ♦ భావిభావిని సింధువారము
సుమన సుమనతిసేయు నీనుడి ♦ సొంపుసొంపుల కర్ణికారము
అలికి నలికెదవేల సంపగు ♦ లవేయవే మొగమెత్తిచూడుము
అలరు నలరులఁగురిసె ప్రేంకణ♦మదిగొమదిగొని వేడ్కఁబాడుము

నాకు నాకుటజములఁ జూపిన ♦ నారి నారికడంబులిచ్చెద
పోకపోకలఁ బ్రాకి జాదుల ♦ పొదల పొదలికఁ జూడు వచ్చెద
మొగలి మొగలి వెచిదుపుచదురుగ ♦ మొల్ల మొల్లపు గుంపుఁ గోసిన
బొగడఁ బొగడఁగ నేలనే సుర ♦ పొన్న పొన్నతె యిన్ని పూసిన
తొగలతొగలఁ గనంగ నేలొకొ ♦ తొంగితొంగి యనుంగుసోదరి
అగములగముల నరయ మేలొకొ ♦ యదేయదే మందారమోదరి
కదలికదలినఁ గుప్పఁగుప్పనఁ ♦ గప్పఁగప్పురపుం వలంపులు
పొదమ పొదమల్లియలు వెల్లిగ ♦ బొనలుఁ బొదలు రహిం దలంపులు
చెలువచెలువపు గతుల యందము ♦ చిలుక చిలుకకుఁ బాట నేర్పుము
కలికి కలికి నెవలియి!దే చొ ♦ క్కపు రకపురహి నాటఁదీర్పుము
లేత లేతలకుచము లేటికి ♦ లేమ లేమావులకుఁ దారుము
నాతి! యా తిలకమునుగని పు ♦ న్నాగ నాగము నెక్కఁ జేరుము.

క॥ తరుణ సహకారతరువును, దరుణి యటుల్ మాగధీల ♦ తాతిలకము సుం
దరకుసుమస్తబకయిదే, వరించి పెనఁగొనెఁ గనుండు ♦ వనజాతముఖుల్. 312

వ. ఇట్లాడుకొనుచు నవ్వులనవ్విరుబోణులు జవ్వనంబుసింగారంబులు మెఱయం బువ్వులుగోయుచు మెచ్చి పూఁదేనియల కానుకలఁ దెచ్చి యిచ్చిన చందంబున నందంబుగ వెల్లి విరిసిన మల్లియల పెల్లువిరులయందలి మరందంపు పానకంబు బిందువులఁ జిమ్మి పూదుమారంబులఁ గ్రమ్ముచున్న పవమానమానవక బృందమ్ముల విందులనొందుచుఁ బుప్పొడుల తిప్పలెక్కుచు సొక్కుచు మురిపంపు సంబరంబుల నెక్కొని వినోదంబులు సేయుచు నానందంబు గందళింప విహారవనిం గలయఁదిరుగుచుండుదు. 313

గీ॥ అట్టితఱి దయితాసంగ ♦ మభిలషించి, హరుఁడు నందినిఁ గని రాప్య ♦ ధరముఁ జేరి
మండనముఁ జెంది రమ్మను ♦ మాగిరీంద్రి, జాతని-చ్చోటికనఁ జక్కఁ ♦ జనియతండు.

క॥ వేగఁజని దేవదేవికి, వేగమె కైసేసి శివుఁడు ♦ విచ్చేయుమ నెన్
జాగొనరింప వలవదన, నాగిరిజయుఁ జొళ్ళియంబు ♦ నమరుచుచు వడిన్.

క॥ నీవేగుము వచ్చెదనిఁక, దేవాధీశానుసన్ని ♦ ధికి నంది! యటం
చా విశ్వజనని పల్కిన, నావాఁడటు శివునిదండ ♦ కరిగి వచించెన్.

వ. అంతఁ బువ్వింటివానియలజడి కోర్వక మట్టుమీఱిన దమకంబున నగ్గట్టువిలు దొర నందినిఁ జూచి.

గీ॥ ఓరి! బసవన్న! యిట్లేల ♦ యురక వచ్చి, నాఁడ వచటికిఁ జనియుఁ బూఁ ♦ బోఁడి నిటకుఁ
దోడితెమ్ము మరలఁ బొమ్ము ♦ తొందరింపు, మనుడు రోజుచు నతఁడు రా ♦ ప్యాద్రికేగె.

నాకు నాకుటజములఁజూపిన ♦ నారి నారికడంబులిచ్చెద
పోకపోకలఁ బ్రాకి జాదుల ♦ పొదల పొదలికఁజూడు వచ్చెద
మొగలి మొగలి వెచిదుపుచదురుగ ♦ మొల్ల మొల్ల పుగుంపుఁగోసిన
బొగడఁ బొగడఁగనేలనే సుర ♦ పొన్న పొన్నతె యిన్నిపూసిన
తొగలతొగలఁ గనంగ నేలాకొ ♦ తొంగితొంగి యనుంగుసోదరి
అగములగముల నరయ మేలోకొ ♦ యదేయదే మందారమిాదరి
కదలికదలినఁ గుప్పఁగుప్పనఁ ♦ గప్పఁగప్పరపుం వలంపులు
పొదమ పొదమల్లియలు వెల్లిగ ♦ బొనలుఁబొదలు రహిం దలంపులు
చెలువచెలువపు గతులయందము ♦ చిలుకచిలుకకుఁ బాటనేర్పుము
కలికి కలికినెవలియిదే చొ ♦ క్కపురకపురహి నాటఁదీర్పుము
లేత లేతలకుచములేటికి ♦ లేమ లేమావులకుఁ దారుము
నాతి! యా తిలకమునుగని పు ♦ న్నాగనాగము నెక్కఁజేరుము.

క॥ తరుణ సహకారతరువును, దరుణిమటుల్ మాగధీల ♦ తాతిలకము సుం
దరకుసుమస్తబకయిదే, వరించి పెనఁగొనెఁ గనుండు ♦ వనజాతముఖుల్. 312

వ. ఇట్లాడుకొనుచు నవ్వులనవ్విరుబోణులు జవ్వనంబుసింగారంబులు మెఱయం బువ్వులుగోయుచు మెచ్చి పూఁదేనియల కానుకలఁదెచ్చి యిచ్చిన చందంబున నందంబుగ వెల్లి విరిసిన మల్లియల పెల్లువిరులయందలి మరందంపు పానకంబు బిందువులఁ జిమ్మి పూదుమారంబులఁ గ్రమ్ముచున్న పవమానమానవక బృందమ్ముల విందులనొందుచుఁ బుప్పొడుల తిప్పలెక్కుచు సొక్కుచు మురిపంపు సంబరంబుల నెక్కొని వినోదంబులు సేయుచు నానందంబు గందళింప విహారవనిం గల యఁదిరుగుచుండుడు. 313

గీ॥ అట్టితఱి దయితాసంగ ♦ మభిలషించి,హరుఁడు నందినిఁగని రాప్య ♦ ధరముఁజేరి
మండనముఁ జెంది రమ్మను ♦ మాగిరీంద్రజాతనిఁ-చొప్పటికనఁజక్కఁ ♦ జనియెతండు.

క॥ వేగఁజని దేవదేవికి, వేగమె కైసేసి శివుఁడు ♦ విచ్చేయుమనెన్
జాగొనరింప వలవదన, నాగిరిజయుఁ జొళ్ళియంబు ♦ నమరుచుచు వడిన్.

క॥ నీవేగుము వచ్చెదనిఁక, దేవాధీశానుసన్ని ♦ ధికి నంది! యటం
చా విశ్వజనని పల్కిన, నావాఁడటు శివునిదండ ♦ కరిగి వచించెన్.

వ. అంతఁ బువువింటివానియలజడి కోర్వక మట్టుమిాఱిన దమకంబున నగ్గటువిలుదొర నందినిఁజూచి.

గీ॥ ఓరి! బసవన్న! యిల్లేల ♦ యురకవచ్చి,నాఁడ వచటికిఁ జనియుఁబూఁ ♦ బోడి నిటకుఁ
దోడితెమ్ము మరలఁబొమ్ము ♦ తొందరింపు,మనుడు రోజుచునతఁడు రా ♦ ప్యాద్రికేగె.

గీ॥ తన్నుఁగాయఁగ గోపుర♦తలముఁజేరి, యున్న నిఖిలేశ్వరునిఁగని ♦ యోడకిట్లు
మకురుతనమునడిగె శా♦బకహిమాంశు,మకుట! యొకవిన్నపంబిది♦మదినిఁజేర్పు.
ఉ॥ చేతులు పెక్కొసంగితివి ♦ చేవయు లావును వాసిమీఱు నీ
చేతులకుఁ బరాబరిగఁ♦జెన్నలరించితి వయ్య! యెందు నీ
చేతులతీటఁ దీర్పఁగల ♦ చెల్వగుశూరునిఁ గాంచకుంటి నీ
వే తొలగింపఁగావలయు ♦ నీదురదఁ జగదేకశంకరా! 329
గీ॥ తొడరి పెనఁకువ నాతోడఁ ♦ దునియఁ జేయు
మీభుజంబుల నొకగుట్ట ♦ మెత్తుగాఁ బు
రాంతక! యటుల్ మదిని నిచ్చ ♦ గింతు ననుడుఁ
గడుఁగినుకఁజెంది యిటులనెఁ ♦ గాలహరుఁడు. 330
ఉ॥ ఓరి దురాత్మ! యోతులువ! ♦ యోరికృతఘ్న! పలాదపాంసనా!
నోరెటు వచ్చెరా! యిటు న♦నున్ దురమాడఁగఁ బిల్వ నిష్ఠ నీ
కీరహియెల్ల నే నిడిన ♦ దేకద యైనను నీదుకోర్కె యీ
డేఱును మత్సమానుఁడు ల♦ యింపఁగఁ జేయును నీఁదుబాహులన్. 331
గీ॥ అది యచిరకాలమున నెద్దై♦త్యాధమా! ఘా
సంగు భవదీయ మాయుధ ♦ శాలనుండు
నా మయూరధ్వజం బెపు♦డవనిఁ గూలు
నపుడె చేకూరుఁ బెను విగ్ర♦హంబు నీకు. 332
వ. అని చెప్పిన ముదితుండై చని బాణుండు ప్రత్యహంబు మయూరధ్వజపతనంబు నిరీక్షించుచుండెనంత మహేశ్వరీవచనప్రకారంబు మధుమాసశుద్ధ ద్వాదశియందు.
గీ॥ ఉష యుపాసముచేసి మే♦లొప్పనాఁటి, రేయిఁ దామరసాక్షు న♦ర్చించి యంతఁ
బవ్వళించిన వడు రేయిఁ♦బార్వతీవ, రమునఁ గృష్ణమనుమఁడు దా♦రసిలి రహిని.

## —* ఉష యనిరుద్ధునితో స్వప్నమున భోగమొందుట *—

గీ॥ మేలుకొలిపి దనుజరాజ♦బాలనొడిసి, దృఢపరిష్వంగమునఁదేర్చి ♦ తీయవిల్తు
భోగములనెంతయేని యా♦పూపవయసు, కొమనుదనియించి ద్వారవు♦రమును జేరె.
వ. తెలవాఱినయంత నాబాణాసురదుహిత మేల్కొని పాన్పున విభునిం గానక శుద్ధాంతంబంత వెదకి వేసారి తాఁ జెలువునితోఁ గలయుట కలయనుట కొడంబడక నిక్కంబకా నమ్మి ముమ్మరంబగునుమ్మలికమ్మునఁ బొగులుచు మజ్జనభోజనసుగంధానులేపనవేణీమండనాదికమ్ము లుజ్జగించి హృదయేశార్పితచిత్తయై బెండువడి యలందురుచుండుడు నంత మంతనంబునఁ జిత్రరేఖ దారసించి కతంబడుగ ననుంగు సఖియగుటెఱింగి యగ్గాణవలన తన మనోరథంబీడేఱునని తలంచి బెట్టు సేయక యిట్లు వక్కాణించె. 336

ఉ॥ అక్కరో! చెప్పెదాన విను ♦ మద్దమరాతిరి నాదు సెజ్జలోఁ
జొక్కపులేఁతజవ్వనపు ♦ చూపరి యొక్కఁడుచేరి యెక్కుడౌ
మక్కువ బిగ్గకౌఁగిళుల ♦ మానస మూరఁగఁజేసి ధీరతన్
జక్కెరవిల్తు చైదముల ♦ సంతసపెట్టి చనెన్ యథేచ్ఛమై. 337

ఆ॥ ఎచటివాఁడొ? జాతి ♦ యేదొ? యెట్టులనిట, కేగుదెంచెనో? మ ♦ ఱేడనుండి
మరలయెందుఁజనెనొ?♦మానిని! వాని నేఁ, బడయఁగలనొ? లేదొ?♦ భాగ్యమెట్లొ?

చ॥ చెలియరో! వాని నీవరసి ♦ చెచ్చెర నిచ్చటఁ జేర్పకున్న నీ
చెలి కిఁక నీళ్ళువో యనగు♦ సిద్ధము; మాంత్రికయోగ సిద్ధికిన్
బలుతెఱఁగుల్ దనర్పఁగల ♦ ప్రౌఢికి నీకెవ రీడువత్తురో
యలికులవేణి! నాదుబ్రదు♦ కంతయు నీవశ మెక్కు డేటికిన్. 339

ఆ॥ అనుచు నేలవ్రాలి♦నట్టి యాబాలేందు, నిటలఁ జూచి మిగుల ♦ నేర్పులాఁడి
యైన చిత్రరేఖ♦యభయహస్తముఁజూపి, యనియెఁజెలిమికలిమి♦యలరనిటులు.

ఉ॥ వెంపరలాడ బోకు మిటు ♦ వేదురు చెందకు సుందరాంగి! నీ
సొంపగు చెల్వమెవ్వరికిఁ ♦ జోద్యముగా మదులూరఁజేయ దే
యింపగు వానితో యమరె ♦ నిర్విభవం బల భాగ్యశాలి నై
లింపులదైత్యమానుషబి♦లేశయపుత్త్రుల నేలఁజాలెదన్. 341

చ॥ బెదరెదవేల! నీప్రియుఁడు ♦ విశ్వమునం దెటనున్నఁ బట్టి తె
చ్చెద ముదమున్ బొనర్చెదను ♦ జిత్రపటంబుల వ్రాతుఁ జూడుమా!
త్రిదశుల దైత్యపుత్రుల స ♦ రీసృపమానవరాజసూనులన్
గుదురుగఁ జూచి తెల్పు మికఁ ♦ గోమలి! నీమది నున్న రూపసిన్. 342

వ. అనియిట్లు చిత్తర్వులను వ్రాసి చూప నద్దనుజేంద్రకన్యక పటంబులనెల్లఁ దిల కించి యందుఁ గృష్ణపౌత్రుండగు ననిరుద్ధుపటంబుఁజూచి బెదరి సిగ్గుజెంది మరల ఱెప్పవేయక చూచి మురిసి తలవంచి జాలువాపట్టుకుప్పసంబుపైఁ జలువపయ్యెద మునుంగును జక్కఁజేసికొని చక్కన నక్కొమ్మ కిట్లనియె. 343

చ॥ సకి! యితఁడే యితం డితఁడు ♦ జక్కఁగ నద్దమరేయి నాదు సె
జ్జకుఁ జనుదెంచి మానధన ♦ చౌర్యముఁ జేసిన తెక్కలీఁడు ని
ల్వకచనె నెందొ వేగఁ జెయిఁ ♦ బట్టుమనో యను శంకఁజేసి తా
వకమహనీయమంత్రగతిఁ ♦ బట్టుకరమ్మికఁ నాదు చెంతకున్. 344

వ. మఱియు వీని రూపంబు నారసిన నతినిష్ఠురపీనోన్నతంబులైనట్టి భుజంబుల దైర్ఘ్యంబును సుదృఢ మాంసలోన్నతంబై రమణీయంబైతగునురఃప్రదేశంబు వైశాల్యంబును దివ్యకాంతిసందోహంబుల నొక్కుమ్మడిం గృమ్మరింపుచున్న

నెమ్మొగంబు కామనీయకంబును వికసితారవిందంబుల యందంబును మందలింపఁ జాలిన నయనయుగళంబు వైకాస్యంబును అతిమాత్రలోహితంబులైన పదంబుల మార్దవంబును సౌవర్ణపద్మ సంవర్తికలనందగు కరాంగుళుల సింగారంబును చంపకప్రసవంబుఁబోలిన బంగారు రంగారుతనుచ్ఛాయయును నుత్తమరాజ పుత్త్రిందని యెఱుకసేయుచున్నవి. నాఁడు భవాని యొసంగిన వరంబందునను నిశీథలబ్ధపూరుషుండే విభుం డగునని చెప్పుటచేత కౌలీన శాలీనతాదిగుణంబుల నరయక యమ్మాన్యచరిత్ర యెట్లు వక్కాణించు? మఱియు నీసంఘటనంబుగూడఁ దత్ప్రసాదంబుగఁ దలంతు నైనను వీనికులగోత్రనామముల నెఱుకసేయుమన్న నచ్చెలువమిన్న యలరియిట్లనియె.

ఉ॥ ద్వారక గోపురంబు యదు ♦ ధన్యుఁడు కృష్ణునిపౌత్రుఁ డన్నిటన్
పేరునుఁ బెంపుఁ జేకొనిన ♦ వీరుఁడు శంబరవైరిపుత్త్రుఁడుర్
శూరుఁడు ధీరుఁడున్ మిగుల ♦ సుందరుఁడౌ ననిరుద్ధుఁ డీతనిన్
గూరిచె గౌరి నీదుపయిఁ ♦ గూరిమిఁ బైఁడికి వజ్రమట్టులన్. 346

క॥ అనినఁ గడుమురిసి తాఁ జిన, తనమాదిగ విష్ణుభక్తి ♦ తత్పర యగుటన్
వనజాక్షుని మనుమని ద్వారను జేసెను గాలి యనుచు ♦ రంజిలి వేగన్. 347

చ॥ చనుమిఁక వేగిరంబటకుఁ ♦ జాతురి మాంత్రిక యోగశక్తియున్
బెనఁగొని తేజుమీఱ యదు ♦ వీరునిఁ దెమ్మిటకుం బ్రియమ్మునన్
పెనుపఱి మిత్తి వాతఁబడు ♦ నెచ్చెలినిన్ బ్రదికించికొమ్ము నా
థుని నిటదెచ్చు నంతకిటు ♦ తోయజనేత్రి! తపించుచుండెదన్. 348

గీ॥ అనుడు నిదియెంత పనియని ♦ యర్ధరాత్రి, వఱకున చోటనేయుండి ♦ పరమశివుని
రాణికి మహేశ్వరునకెదఁ ♦ బ్రణుతిసల్పి, పరమగురుమంత్రసిద్ధ యం ♦ బరము నెగసి.

క॥ కదువడి ద్వారకఁజని సిరి, నడరెడు ననిరుద్ధు మేడ ♦ కరిగి యచట నొ
ప్పెడు నిజసతులన్ రతులన్, బడలిచి నిదురించియున్న ♦ ప్రద్యుమ్నసుతున్.

గీ॥ కాంచి శాంబరీమాయను ♦ గ్రమ్మఁజేసి, కామనందనుతోఁ గూడఁ ♦ గనకతల్ప
మెత్తికొని రయమొప్ప వి ♦ యత్తలమును, జేరి వడి శోణనగరినిఁ ♦ జేరి మీఱి.

గీ॥ మట్టుమీఱిన విరహాగ్ని ♦ మఱుఁగుచున్న, బాణనందనశుద్ధాంత ♦ భాగమందు
ధరకుదిగియటఁ బ్రాద్యుమ్ని ♦ తల్పమునిచి, యుషకెఱింగించి తనవాస ♦ మొందె వేగ.

చ॥ ఉషయు సుగంధసారకుసు ♦ మోదకసేకములన్ బొనర్చి య
వ్విషమశరాత్మజున్ నిదుర ♦ వీడఁగఁ జేసినఁ దెల్వినొంది యా
నుషమతనుండు నల్గడలఁ ♦ జూచి నవోకముగా నెఱింగి య
వ్విషజవిలోచనన్ గదిసి ♦ విస్మితుఁడై యిటువల్కె ధీరతన్. 353

చ॥ చెలువ! యెవర్తెవీవు? మణి ♦ చిత్రిత మీ గృహమేలు లక్ష్మివై
యలరుచునుంటి వియ్యెడకు ♦ నక్కజ మే నెటు చేరఁగల్గితిన్

గలనొకొ నిన్నుఁబోల్ కలువ ♦ కంటిని చూచినయట్లు దోఁచు వే
తెలుపుము సర్వమిత్రెఱుఁగు ♦ తేటగ నీదు సుధామయోక్తులన్. 354

ఆ॥ అనుడు లోన మురిసి ♦ యలఁతినగవుతోడ, మదిరనయన మరుకొ ♦ మారుఁజూచి
యనియె నెఱుకలేని ♦ యట్టిమెడకు నెట్లు, చేరినారొ! మిగుల ♦ చిత్రమిద్ది.

చ॥ "కలయెడ నిన్నుఁబోల్ గలువ ♦ కంటిని చూచితి" నంటి రట్టులే
యలఘుతరాజ! నీవనిన ♦ యట్లుగ నొప్పెడు చెల్వ నొక్కనిన్
గలఁ గనినట్లు నాకుఁ బొడఁ ♦ గట్టుచునుండె విచిత్రమొప్ప నీ
కలకిటు కాళ్ళువచ్చి నినుఁ ♦ గ్రచ్చుఱఁ దోడ్కొనివచ్చెనో యిటుల్. 356

గీ॥ అనుడు మేలముచాలు బా ♦ లా! యథార్థ, మెఱిఁగియుండియుఁగైలాట ♦ మేలసేయ
తెలియఁబల్కుము వే యనిం ♦ దితమనీష, లెందునున్ సత్యసారులై ♦ రేపుఁగాంత్రు.

క॥ అన ముసిముసి నగు వెలయఁగ, ననిరుద్ధునితోడ నిట్టు ♦ లనె నాసతియున్
ననుమును రతులన్ దేలిచి, చనునే లాఁతిగఁ దలంప ♦ సౌందర్యనిధీ! 358

గీ॥ అని భవానీవరంబు తీ ♦ రట్లు గత ది, నార్ధరాత్రంబునందు స ♦ మాగమంబు
నాత్మసఖచిత్రరేఖమా ♦ యాబలమునఁ, దన్నిపుడు దెచ్చుటయునునం ♦ తయును దెల్పె.

—* అనిరుద్ధుఁ డుషతోఁ గ్రీడించుట *—

చ॥ హరిజతనూజుఁ డట్టులు ప్రి ♦ యావినివేదితవృత్తుఁడై కడున్
హరుసముఁ జెంది యారమణి ♦ నక్కునఁ జేరిచి భూరిమన్మథో
ద్ధురకళలన్ బెనంగి పరి ♦ తోషముఁ గూరిచె బాణపుత్రియున్
గరము రమించుచుండెఁ బ్రియు ♦ కౌఁగిటఁ జేరి యహర్నిశంబులన్. 360

గీ॥ ఇట్లు వారిర్వురెంతయు ♦ నింపుమీఱ, నంతిపురమున భోగంబు ♦ లందుచుండ
నంతనొకనాఁడు కావలు ♦ లై చరించు, భటులెఱిఁగి బాణుతోడఁ దె ♦ ల్పఁగనతండు

చ॥ కడువడి రోషవేగమునఁ ♦ గన్నుల నిప్పులు రాలుచుండ నె
వ్వఁడు హరియున్న పెన్గవను ♦ బాలిశుఁడై యిటు చేరె వాని ని
ప్పుడ కడతేర్చి రండని ప్ర ♦ భూతబలోత్తమయోధరాజిఁ బం
చుడు వడిఁ జేరి వారు యదు ♦ శూరుని మోదిరి యాయుధంబులన్. 362

ఉ॥ అంత నతండు నొక్కపరి ♦ ఘాయుధమున్ గొని వారి నందఱిన్
బంతముమీఱ బాది పరి ♦ మార్చి జవంబున నార్చె నట్టి వృ
త్తాంతమెఱింగి వేగముగ ♦ నంతకసన్నిభమూర్తి యన్నిలిం
పాంతకుఁ డెక్కుడైన పృత ♦ నాధిపులన్ గని పల్కె నల్కతోన్. 363

చ॥ మనుజులకన్యలన్ గొనుట ♦ మానవభర్తుల కొప్పు నెప్పుడేన్
మనుజుఁడు మానుషాశనకు ♦ మారినిఁ బట్టుట వింటిరే! జలం
బున మును గుండ్లు మున్గ నీక ♦ మున్గక తేలుచునుండు బెండు లీ
యనువునఁ దల్లక్రిందులయి ♦ నట్లుగఁ దోఁచెను నాదు బుద్ధికిన్. 364

ఉ॥ ఒక్కఁడు పెక్కుజోదులను ♦ నుక్కఱఁగొట్టి వధించెనంట ! యీ
మొక్కలుఁ డెవ్వఁడో పొదివి ♦ ముక్కలు సేయుఁడు ఖడ్గధారలన్
జక్కఁగఁ బ్రొందువేగముగ ♦ శౌర్యము మించు సహస్రయోధులన్
నెక్కొని యక్కిశోరుపస ♦ నీఱొనరింపుఁడు బాహుసంపదన్. 365

ఆ॥ అనియు నట్లు సైన్య ♦ మర్పించి పంపుఁడు, వా రుషాగృహంబు ♦ పజ్జనరుగ
దవుల వారిఁ గాంచి ♦ దర్పంబునన్ నింగి, కెగసి పరిఘ వ్రేటు ♦ లేసి చంపె.

చ॥ అది విని యాతుధానవిభుఁ ♦ డాగ్రహమగ్నమదిఁ జెంది మేటి దు
ర్మదమున నావృషాండుని స ♦ మస్తచమూగణనాథుఁ బిల్చి బె
ట్టిదులగు యోధులన్ గొని క ♦ డిందిమగంటిమి యుల్లసిల్లఁగాఁ
గదన మొనర్పఁగాఁ గదలె ♦ ఖడ్గధనుశ్శరపాణియై వడిన్. 367

చ॥ బిఱబిఱ నా యుషాభవన ♦ వీధినిఁ జేరఁగ గృష్ణపౌత్రుఁ డా
సురరిపుఁ జూచి జోదులను ♦ జూరొనరించి ప్రభూతరోషవి
స్ఫురణ దలిర్ప శక్తిఁ గొని ♦ పోతర మొప్పుచునున్న బాణుపై
నుఱుముచు వేయ హా ! యనుచు ♦ నుక్కఱి రక్కసి వ్రాలెఁ దేరిలో. 368

గీ॥ అదరి వృషభాండుఁ డెంతయు ♦ నక్కజముగ
నక్కుమారుని శౌర్యవీ ♦ ర్యంబులకుఁ గ
దన్ మురియుచుండ నబ్బాణుఁ ♦ డున్ దెమలియు
నంత మటుమాయమై చేరి ♦ యంబరమును. 369

—* బాణాసురుఁ డనిరుద్ధుని నాగపాశంబుల బంధించుట *—

మ॥ శరవర్షంబున ముంచి కృష్ణజసుతున్ ♦ జండాహినారాచబం
ధురపాశంబులఁ జుట్టికట్టి పెలుచన్ ♦ దోర్గర్వ మొప్పార న
చ్చెఱుతన్ జంపఁగఁ గత్తినెత్తఁగ వడిన్ ♦ సేనాధిపుం డాఁగి యి
త్తఱి వీనిన్ జెఱసాల నుంపు మటు మీఁ ♦ దన్ జంపవచ్చున్ విభూ! 370

గీ॥ వంటయింటికుందే లయ్యె ♦ బాలిశుఁ డితఁ, డెట్లుతప్పించుకొని పోవు ♦ నింతలోన
బాగుగ విచారమొనరించి ♦ వధయొనర్తు, మెపుడు వేగిరపుంబను ♦ లిడుములిడును.

వ. అనిన నుడుఁగక యున్న నప్పిశితాశనునకుఁ బెద్దయెలుంగున నభోభారతి యిట్లనియె

ఉ॥ ఏటికి బాణదైత్య ! వధి ♦ యింపఁగఁ జూచెదు వీని మాను మా
రాటముదక్కి యీతఁడు గ ♦ రంబు మహేశ్వరభక్తుఁ డీతనిన్
బాటలగంధి నీదు సుత ♦ భర్తనుగా వరియించె నీతఁడే
సాటిగ నీకు నల్లుఁ డిఁకఁ ♦ జంపకు తెంపకు కూఁతుతంతువున్. 371

గీ॥ మఱియు నీవిఁక వీనిఁ జం♦పంగఁదలఁచిన, నిపుడె పెన్నిదుమూఁడు నీ♦కెంచిచూడు
నీధ్వజము గూలునంతకు ♦ నిలుపుదాల్మి, యవల నీమదమంతయు ♦ నవసిపోవు.

వ. అనిచెప్పిన నప్పు డతం డెట్టకునేనిమాని వానినవ్వలఁ దుదముట్టఁజేయనెంచి పంజరంబున నునిచి చనినంత ననిరుద్ధుండుఁదందశూకవిషవిద్ధుండై పరితపించుచునభీష్టమహాదేవియగు దుర్గం దలంచి యిట్లు నుతించె. 375

గీ॥ శివ ! మహేశ్వరదేవి ! రో♦షిణి ! ప్రపన్నదుఃఖనాశిని ! పన్నగ ♦ స్తోమదగ్ధ
తనుఁడనై కట్టఁబడియుంటిఁ♦దల్లి! వేగ, సాఁకుమిఁకదందశూకపా♦శములఁద్రుంచి.

గీ॥ నీపతియు నీవు దక్కన ♦ నితరు లోకరు, గలరె భక్తుల నేల జ ♦ గంబునందు
సర్గరక్షాంతకారిణి !♦చండికా ! య, శోద! లేలెమ్మ! రారమ్మ!♦సాకుఁ బాప.

వ. ఇట్లు ప్రార్థించినయంత నమ్మహాదేవి భక్తపరతంత్రయై మహామాయాస్వరూపంబున నమ్మహారాత్రియందుఁ దఱిసి మణినూపురాలంకృతంబగు వామపాదంబు ఘాతంబునఁ బంజరంబుఁ బగులఁదన్ని యనిరుద్ధు వెడలించి నాగపాశంబులఁ బాపి వేవేగఁ దిరస్కరిణీయోగంబున నుషాంతఃపురంబునందుఁ జేర్చిన నతండు ప్రీతుండై యుషతో సుఖంబుండె నంత ద్వారకాపురంబునం దనిరుద్ధుని దేవేరులు రతీప్రద్యుమ్నులును ననిరుద్ధునిఁ గానక శోకాకులురై శ్రీకృష్ణున కెఱింగించిన నతండును రుక్మిణి మున్నగువారు దుఃఖంబునఁ గ్రాఁగుచుఁ గాలరుల నెల్లయెడల నారసి యనిరుద్ధుజాడ నెఱింగిరండని పనిచి రంత నాలుగు నెలలమీఁద నొక్కనాఁ డబ్బలితనూజుని మయూరధ్వజం బబ్బురంబుగదుర డబ్బాటుగాఁ బుడమి వ్రాలి యుండుటంజూచి యతండు కరకండూతి వాయునని వికవికనవ్వుచు యుద్ధ సన్నద్ధుండై ప్రీతివీరాగమనంబునకై నిరీక్షించుచుండెనంత నవ్వాసరంబున నె నారదుఁడు శ్రీకృష్ణునిఁ దారసించి యనిరుద్ధోదంతంబెఱింగించిన నవ్వాసుదేవుండించుక వగచి సత్వరంబున బలభద్రసాత్యకులను. గదప్రద్యుమ్న సాంబసారణాదులను దోడ్కొని ద్వాదశాక్షౌహిణీబలంబులతో గరుత్మంతు నధిష్ఠించి శోణితపురంబుఁ జేరి నగరంబు ముట్టడించి రణభేరీధ్వనులొనర్చినంత కోటగవను గాచుచున్న బేసికంటిదొర కుమారులందోడ్కొని ప్రమథదనుజానీకినులతోఁగూడి కట్టాయితంబై ప్రథనంబునకేతెంచి నిలువనంత నయ్యిరుతెగలవారికిట్లు సమరంబు పొసంగె,

గీ॥ వాసుదేవ శివులకు శం♦బరదమన గుహులకుఁ గూశ్మాండ కూపక♦ర్ణులకు హాలిక
సాంబ బాణసుతులకు వృ♦షగరుడులకుఁ, దక్కువారల కిట్టులే♦తనరె దురము.

గీ॥ తవిలి బవరంబుఁ జూడ నెం♦తయును వేడ్క, జేసి యాకసమందు జే♦జేలగములు
సిద్ధ గంధర్వ లచ్చరల్ ♦ చెలఁగి పుష్ప, కములనెక్కి కనంగ న♦క్కయ్య మొప్పె.

క॥ కృష్ణుఁడు నడుపఁగ వేజయ, తృష్ణన్ గొని ఘోరకదన ♦ దీక్షావరతన్
వృష్ణివరు లేచి రణకా, శిష్ణులగుచుఁ బ్రమథదనుజ ♦ సేనల ఢీకొన్. 381

చ॥ కనుఁగొని శూలపాణియును ♦ స్కందుఁడు గర్జనమున్ బొసర్పఁగా
వెనుబడియున్న సైనికులు ♦ వీఁకఁ జెలంగి కడంగియార్చి రం
తన మురసూదనుండు పుర♦దానవహంత పయిన్ మహాస్త్రరా
జినిఁ బఱపన్ దదస్త్రములఁ♦చే శమియింపఁగఁ జేసె శర్వుఁడున్. 382

చ॥ హరియును మచ్చరంబున వి♦షాగ్నుల నూరక గ్రుమ్మరించు దు
ర్ధరశరరాజి శంకరునిఁ ♦ దాఁ బొదువన్ వికటాట్టహాసవి
స్ఫురితముఖారవిందుఁడయి ♦ భూధరచాపుఁడుఁ గృష్ణుమేన ని
ష్ఠురశరపంక్తి నాఁటినఁ గ♦డున్ గడునొచ్చి విషణ్ణమూర్తియై. 383

-* శైవజ్వరముచే వైష్ణవజ్వర మోడి శివుని నుతించి యభయ మొందుట *-

క॥ హరి వైష్ణవజ్వరంబును, స్మరియించి పినాకినొంపఁ♦జక్కఁబనుపఁగా
హరుడును శైవజ్వరమున్, సరగఁదలఁచి పంప నవ్వి ♦ సమర మొనర్చెన్.

*గీ॥ శాంభవజ్వర మెగసి వి♦స్తారశౌర్య, సారమేర్పడ శీతల♦జ్వరమనంగఁ
బొలుచు వైష్ణవజ్వరమును♦బొదివిపట్టి, మర్దనముచేయ నుంకింప♦మరుఁబాసి.

గీ॥ ప్రాణభీతినిఁగొని మహా♦శాంతికమును, జేరినుతుల నలర్పఁగా♦శివుఁడు మెచ్చి
యభయవరమిచ్చి యిట్లనె♦నపుడు వైష్ణ, వజ్వరముతోడ వాత్సల్య♦భావమెంచి.

క॥ అడలకు శీతజ్వరమా! , వినుము మజ్జ్వరభయంబు ♦ విశ్వమున నిఁక
వ్వఁడు చదివిన నీవాదం, బడలఁడుసుమి! జ్వరభయమున ♦ నాతండెపుడున్. 387

వ. అని చెప్పిన నంతనయ్యాది సంతసించి శివునకుమ్రొక్కి చనియె నటుమీఁద. 388

గీ॥ గుహుఁడుప్రద్యుమ్ననోడిచెను♦గూపకర్ణుఁ డల్లకూశ్మాండుఁడున్ సీరి♦నాక్రమించి
రాశరాసురపుత్త్రికుం♦డడరిసాంబు, నోడఁబుచ్చెను జయఘోష♦ముప్పతిలఁగ.

---

* శివపురాణే యుద్ధఖండే చతుఃపంచాశోధ్యాయే -

శ్లో॥ మహేశ్వరోథ తంద్రుష్ట్వా। యాంతం స్వంవిసృజజ్జ్వరం। మాహేశ్వరో వైష్ణవశ్చ। యుయుధాతేజ్వరావుభౌ। వైష్ణవోథ సమాక్రింద। న్మాహేశ్వర బలార్దితః। అలబ్ధ్వాభయ మన్యత్ర। తుష్టావ వృషభధ్వజం। అథ ప్రసన్నో భగవాన్। విష్ణుజ్వరనుతో హరః। విష్ణుశీతజ్వరం ప్రాహ। శరణాగత వత్సలః॥ మహేశ్వర ఉవాచ॥ శీతజ్వరప్రసన్నోహం। వ్యేతు తేమజ్జ్వరాద్భయం। యోన స్సంస్మరతిసంవాదం। తస్యనస్యాత్ జ్వరాద్భయం। సనత్కుమారః-ఇత్యుక్తో రుద్రేమానమ్య। గతో నారాయణజ్వరః॥

క॥ నందియు శృంగమ్ములతోఁ, డం దార్క్ష్యునిఁగుఱిచ్చి కడు నె ♦ డవుగఁ బడఁగ జి
మ్మం దండశూకవైరిక, డిండి యసృగ్ధార లొలుక ♦ డీల్పడి వఱచెన్. 390

## —* శ్రీకృష్ణుఁడు శివునిచే నోటువడి నుతించుట *—

*మ॥ యదునాథుం డదియెల్లఁ గన్గొని విరూ ♦ పాక్షున్ మహేష్వాసునిన్
గదనంబందు జయింపలేననుచు న♦ల్కన్ బాసి శ్రీశంకరున్
గదియన్ గాఁజని మ్రొక్కి దోయిలిడి వి ♦ జ్ఞప్తిన్ బొనర్చెన్ మహే
శ! దయాబ్ధీ! శరణాగతార్తిహరణా! ♦ సర్వాత్మ! మృత్యుంజయా! 391

గీ॥ విశ్వసర్గానుపోషణ ♦ విశసనాది, హేతువై బోధరూపుఁడై ♦ యింపెసంగు
శాంతు లింగస్వరూపు నీ♦శ్వరునిఁగొలుతు, నెల్ల వేళల నొకభంగి♦ నెసఁగుదొరను.

గీ॥ కాలము స్వభావమును ద్రవ్య♦కర్మజీవ, ములు నసువులాత్మయేతత్స♦మూహవికృతి
బీజరోహప్రవాహమై♦ వెలయుజగము, నీదు మాయయె కొలుతు ని♦ర్గుణత! నిన్ను.

గీ॥ విత్తనమునుండి మొలకయు♦విత్తు మొలక,నుండి యెట్లు ప్రవాహమ♦ట్లుండిసతత
మెడ తెగక యెంత యేనియు♦ నెసఁగు జగము,నీదుమాయయె కాదొక్కొ♦నిత్యమూర్తి!

గీ॥ వాఙ్మయబ్రహ్మమందుగు♦ప్తముగనున్న, యప్పరబ్రహ్మమీవని♦న్నకలుపాత్మ
లైనవారు చిదాకాశ♦మనుచుఁజూతు, రద్వితీయమహేశ! య♦నాదిపురుష! 395

క॥ నీమాయచేత జనములు, వేమఱు మోహంబుఁ జెంది ♦ విత్తసుతస్త్రీ
కాములయి దురితనీరధి, లో మునుఁగుచుఁ దేలుచుందు ♦ లోకార్తిహరా!

క॥ నీవొసఁగిన యీ జగమునఁ, గావలుఁడై నీదు పాద ♦ కమలములయెడన్
దావేడ్కఁ బూనకుండిన, నావాఁ డాత్మఘ్నుఁడగు మ♦హాదేవ! కదన్. 397

---

* శివపురాణే యుద్ధఖండే చతుః పంచాశోధ్యాయే -

శ్లో॥ అథ విజ్ఞాపయామాస । నతోభూత్వా కృతాంజలిః। శ్రీకృష్ణశ్శంకరంభక్త్యా । పరివన్నో భక్త
వత్సలం । దేవదేవ మహాదేవ । శరణాగతవత్సల । నమామిత్వానంతశక్తిం।సర్వాత్మానం పరే
శ్వరం, . . . . . . . . . . . . .దేవదత్త మిదం లబ్ధ్వా । నృలోక మజితేంద్రియః । యోనాద్రియేత
త్వత్పాదౌ । నశోచ్యోహ్యాత్మ వంచకః । త్వదాజ్ఞయాహం భగవాన్ । బాణదోశ్ఛేత్తుమా
గతః । త్వయైవశప్తో బాణోయం । గర్వితో గర్వహారిణా । నివర్తస్వరణాద్దేవ । త్వచ్ఛాపోన
వృథాభవేత్ । ఆజ్ఞాందేహి ప్రభోమేత్వం । బాణన భుజకృంతనే । ఇత్యాకర్ణ్యవచశ్శమ్భుః ।
శ్రీకృష్ణస్య మహేశ్వరః । ప్రత్యువాచ ప్రసన్నాత్మా । కృష్ణస్తుత్యా మహేశ్వరః॥ మహేశ్వర
ఉవాచ - సత్యముక్తం త్వయాతాత । మయాశప్తోఽధిదైత్యరాట్ । మదాజ్ఞయా భవాన్ప్రాప్తో
బాణదోర్దండకృంతనే । కింకరోమి రమానాథ । భక్త్యాధీన స్సదాహరే । పశ్యతోమేకథం వీర
స్యాద్బాణభుజకృంతనం । అతస్త్వం జృంభణాస్త్రేణ॥ మాంజృంభయమదాజ్ఞయా।తతస్త్వం
కురుకార్యంస్వం । యథేష్టంచ సుఖీభవ ॥

క॥ కిగ్గాడి దైత్యుఁడీతం, డెగ్గనకయె నిన్నుఁ జెనకె ♦ నేతెంచె నటుల్
దిగ్గగు నీశాపబలం, బిగ్గతి నను దోడి తెచ్చె ♦ నీతని నొంపన్. 398

—* శ్రీకృష్ణుఁడు బాణుని జయించుటకై శివుని సెలవొందుట *—

చ॥ సెలవునొసంగు వేగ నిఁక ♦ చెన్నటి రక్కసి నిక్కుఁ బాపి చే
తులు బలివేతుఁ గాకులకుఁ ♦ దోల్తు మిఁకన్ సమరాంగణస్థలిన్
దలఁపుము నీదు శాప మిది ♦ తథ్యవచస్కముఁ గాఁగ నీకృపన్
వెలయఁగఁ జేయు మాపయి న♦వీనసుధాకరఖండమండనా! 399

వ. అనిన శ్రీకృష్ణునకు శివుం డిట్లనియె.

చ॥ నిజ మిది దేవకీతనయ! ♦ నీవిఁక వీని భుజాసహస్రమున్
రజమొనరింపఁ జెల్లు నయి ♦ నన్ గనుచుండియు భక్తపీడ నో
ర్వఁజనునె? చెప్పెదన్ విను ము♦పాయము నాపయి జృంభణాస్త్రమున్
వ్రజపరిపాల! వేయు నిదు♦రన్ గొనెదన్ విజయంబు నీకగున్. 400

ఆ॥ మున్నె యిడితి కాదె♦మురహర! వరము నీ, కప్రమేయ బలము ♦ నాజిలోన
నన్నుఁ దొడరి కదియ♦ నాకన్న మిన్న యౌ, నట్టు లదియునట్లె♦యగును గనుము.

గీ॥ అనుడు వనజాక్షుఁ డెక్కుడు♦హరుస మొంది, జృంభణాస్త్రంబునపుడు యో♦జించి పరవ
భక్తవశ్యుఁడై నిదురించె♦ఫాలనయనుఁ, డా ప్రమథవీరగణములతో♦నాయదనున.

వ. అంత.

క॥ పగతుఱగుండెలు పగులఁగ, మిగుల గుణధ్వని యొనర్చి ♦ మించు నల హరిన్
దగఁ జెనకఁ దలఁచి బాణుం, డొగి మూలబలములఁ గొని స♦ముద్ధతి మెఱయన్.

గీ॥ అల వృషాండుని సూతుఁ గా♦నలవరించి, ఘనగదాశరచాపఖ♦డ్గములఁ దాల్చి
వీర పాణంబుఁ బొనరించి♦మీఱి రక్త, నేత్రుఁడై రథమెక్కి య♦నికిఁ గడంగి.

గీ॥ యుద్ధభూమికిఁ జని యదు♦యోధవరుల, నెల్లఁ గని నిద్రఁ జెందుమ♦హేశుఁ దక్కు
మారులను జూచి కడువడి ♦ శౌరిసేనఁ, జొచ్చి కరులను హరులను♦జారుచేసి.

చ॥ గరుడుని నొక్కవాలమునఁ ♦ గాతరుఁ జేసి వడిన్ హలాయుధున్
బిరుదఱఁ బంచభల్లముల ♦ బిట్టడరించి రతీశు సాత్యకిన్
సరవిగ నిర్వ్యదేసి ఘన ♦ సాయకరాజి వెలార్చి యంత న
మ్మురహరు నూఱుకోలల ♦ సముద్ధతిఁ గప్పి నగన్ నదింపుచున్. 406

గీ॥ మేలిజోదుల మదకరి ♦ జాలములను, గుఱ్ఱపున్ దళముల జొన్న ♦ గోసినట్లు
నఱుక నెత్తురువాఁగులు♦విరివి మీఱె, భయదమైతోఁచె యుద్ధభూ♦భాగమపుడు

వ. అంతఁ గృష్ణుం డక్కజంపడి తెమల్చికొని యుక్కుమీఱి బాణాసురున్ జేరె. 408

చ॥ హరులను జంపి సూతుపయి ♦ నర్వది భల్లములేసి చాపముం
దిఱుగఁగఁజేసి బాణుపయి ♦ వేయిశరంబులనేసి యార్చినన్
సురరిపుఁ డోహటింపకయె ♦ చూపఱు మెచ్చ మఱొండు విల్లొగిన్
గరమునఁబూని శౌరిపయిఁ ♦ గాండశతంబు నిగుడ్చె నార్చుచున్. 409

గీ॥ బాణుశరములఁ బొడిచేసి ♦ వాసుదేవు, డాత్మశంకరుఁదలచి ర♦యమున బాణు
చేతివిలుఁబొల్లుచేసి యా♦శీవిషోప, ముల శరమ్ములఁ గ్రమ్మెఁ♦బొదివె బాణు.

క॥ హరి వేసిన సాయకముల, సరకుఁగొనక దునిమి యసుర ♦ శౌరిన్ గద ను
క్కఱమోఁదిన రణతలమున, హరి వడి వడిలేచి యంత ♦ నాఱని కినుకన్. 411

శా॥ కంసారాతి ప్రచండరోషమునఁ జ♦క్కన్ జక్రమున్బట్టి య
మ్మాంసాహారు రయంబునన్ బొదివి దు♦ర్మాంసోరుతద్బాహులన్
ధ్వంసంబొందఁగఁ జెక్కుఁదున్మి తలఁ ద్రుం♦పన్ బూనఁగా దైవతో
త్తంసుం డాహరుఁ డేగుదెంచి యనియెన్ ♦ దానిట్లు పద్మాక్షుతోన్. 412

—* శ్రీకృష్ణుఁడు బాణునిఁజంపఁ దలపడ శివుఁడు వారించుట *—

ఉ॥ వేయిభుజంబులందు నర ♦ విందవిలోచన! దక్క నాల్గిఁకన్
నా యిడినట్టి శాపవచ ♦ నంబది చెల్లను వీని నాశముం
జేయకు మింక వేమరలఁ ♦ జేయుము చక్ర మవక్రసారమున్
నాయదిగాదె చక్రమిది ♦ నట్టిదె మున్ను దధీచి నేయఁగాన్. 413

చ॥ అన హరునాజ్ఞ దైత్యువిడి ♦ యచ్యుతుఁడంతనెలోల్గె బాణుఁడున్
గనకగిరీంద్రధన్వుఁ బొడ ♦ గాంచి కరంబులు మోడ్చి భక్తపా
లన! నిఖిలేశ్వరేశ్వర! క ♦ లాధరశేఖర! లోకసుందరా!
ననుఁ గరుణించి మన్పితి వ ♦ నాది! కృపామయమూర్తి! శంకరా! 414

సీ॥ నీవె బ్రహ్మంబవు♦నీవె యప్పరమాత్మ, మీవె సర్వవ్యాపి ♦ వీవె విభుఁడ
వీవె విరాట్టవు ♦ నీవె బ్రహ్మాండత, నుండవు సర్వాన్వి ♦ తుండ వీవె
పొక్కిలి వినువెర్వు ♦ మోమగ్గి రేతస్సు, జలము వీనులుదిశల్ ♦ తలదివంబు
పదములు భువి మనం♦బదిచందురుఁడు చూపు, భానుండు కడుపకూ♦పారవిభుఁడు

గీ॥ బుద్ధి విధి కుంతలము లంబు ♦ ముక్కు లెదయు
ధర్ముఁడు త్రినేత్రము ల్గుణ ♦ త్రయము రోమ
రాజి యోషధివితతి స♦ర్వమయమూర్తి
వీవె పురుషుఁడ వమలాత్మ! ♦ యిదియె ప్రణుతి. 415

వ. అనుచు నస్పృగ్ధార లొక్కుమ్మడి గుఱియుచుండ మెల్లనలేచి హరునిముందఱ
నాలీఢప్రత్యాలీఢ పదంబులతో వివిధాకారంబులగు స్థానకంబులతోడను భ్రూక్షేప

సహితంబులగు ముఖవాదసహస్రంబులతోడను శిరఃప్రకంపసహస్రంబులతోడను వివిధాకారంబు లమర నద్భుత సుందర తాండవంబొనర్చిన భక్తవత్సలుండగు పరమేశ్వరుండవ్వాని శైలూష కలాకౌశల్యంబునకు సంతుష్టుండై వరంబడుగుమనిన నలరి బాణుం డిట్లనియె: 417

## —♦ శివుఁడు బాణాసురునకు వరంబు లిచ్చుట ♦—

సీ॥ వసుదేవసూనుండు ♦ వ్రయ్యలొనర్చిన, చేతులగాయంబు ♦ చెల్లుఁగాక
సాతత్యభావంబు ♦ జానుమీఱఁగ నీదు పదభక్తి నిండార ♦ బరఁగుఁగాక
అతిశయంబైన నీ ♦ యతులగాణాపత్య, మొంది నిన్గొలుచుచు ♦ నుండుఁగాక
హరితోడ సర్వాది ♦ వ్యావళితోడుత, నిర్వైరమతి నాకు ♦ నెగడుఁగాక

గీ॥ నాదు తనయకుఁ బొడమిన ♦ నందనుండు, మేలుగా నీపురంబును ♦ నేలుఁగాక
తనమురజమును ననుఁబాసి ♦ తఱలుఁగాక!, నీదుభక్తుల చెలిమి రా ♦ణించుఁగాక!

వ. ఇట్లు గోరినంత శంకరుండు తథాస్తనియొసంగి తనయులతో నంతర్ధానంబునొందె నంత బాణుండు గాయంబులయపాయంబుఁ బాసి సంతుష్టుండై శ్రీకృష్ణునిఁ గామపాల సాత్యకి గద ప్రద్యుమ్నాదులను బహూకరించి స్వభవనంబునకుఁ గొనిపోయి యుషానిరుద్ధుల రప్పించి యనునయించి యందఱకు భోజన తాంబూల చందన సురభిళకుసుమంబు లొసంగి కాంచనాంబరములఁ గట్టనిచ్చి నవరత్నాలంకృత జాంబూనదభూషణంబు లనేకంబు లర్పించి కూఁతున కల్లున కపరిమితానేక హిరణ్యరాసుల నొసంగినంత శ్రీకృష్ణుండు బాణుని గారవించి మనుమనితో మనుమరాలిన్ దోడ్కొని జయభేరులతో ద్వారకాపురంబుఁ జేరి సుఖంబుండె నంత బాణుండును శివప్రసాదంబున రుద్రానుచరాగ్రణి యయ్యె నిట్లు బాణాసురానుగ్రహకథనంబుఁ జెప్పితినిట్లు మహేశ్వరుండు కాశీపురియందు గజాసురుని వధించె నింకను నందే వ్యాఘ్రరూపియగు దుందుభి నిర్హ్రాదుండను దైత్యుఁ బొలియించి వ్యాఘ్రేశ్వర లింగంబై యందుఁ బేరొందె నీశ మహేశ్వరి విదలోత్పలదానవుల సంహరించెనద్దానినిఁ జెప్పెదవినుండని సూతుండు మునుల కిట్లనియె.

## —♦ విదలోత్పల దానవ సంహారము ♦—

క॥ విదలోత్పల నామంబులఁ, బొదలెడు నిరువురు దనుజులు ♦ పురుషుని చేతన్
జదియని యట్టులఁ బద్మజు, కుదురగు వరమొందిమిగిలి ♦ కొంచెలయికదున్.

గీ॥ వేల్పులందఱినోడిచి త ♦ద్విత్తములను, జూఱగొని యందునందును ♦ సొగసుకత్తెలైన పడుచులఁబట్టుచు ♦ నహరహంబు, దిరుగుచుండిరి యెల్లెడ ♦ దీమసమున.

గీ॥ వారిపోతర మార్పఁగ ♦ వనజభవుని, యానతింజేసి నారద ♦ మౌని యొక్క
నాఁడు వారలఁ జేరి య ♦ న్నాకరిపుల, యర్చలను గొని వర్ణించె ♦ నార్య నిట్లు.

ఉ॥ ఏమని చెప్పఁగల్గుదు మ♦హేశ్వరి చక్కఁదనంపు టక్కజం
బామహనీయుఁడౌ శివుఁడె♦యారయఁగాఁ గలవాఁడు నిక్కమా
భూమిధరేంద్రనందనయె♦పూజిత యెల్లజగంబులం దిఁకన్
భామ యెవర్తెయేని యల♦పార్వతిఁబోలఁగలేదు రూఢిగన్. 423

క॥ అనిచెప్పి తఱలెనంతనె, దనుజులువిషమేషుమేటి♦దాడికిలోనై
వనరుచు నెట్టులనేనియుఁ, జని గౌరినిఁ దెత్తుమనుచుఁ♦జటులరయమునన్.

చ॥ గొనకొని పార్వతీశివులు♦గూరిమిఁ గాశినిఁ జేరియుండుటన్
విని యటకేగి పొంచి యట♦విశ్వవిభున్ జగదేకసుందరిన్
గనుఁగొన రోయుచుండ నిఁకఁ♦గౌతుకమొప్ప మహేశ్వరాగ్రమం
దనఘ భవాని కందుకవి♦హారము సేయుచునుండె నంతయున్. 425

క॥ అయ్యెదనునఁ బిశితాశను, లయ్యెడ కరుదెంచిచూచి♦యబ్బురపడి వే
ర్గొయ్యలయి యుమనుఁబట్టఁగ, నొయ్యనఁగొని శాంబరీస♦ముద్ధురమాయన్.

ఆ॥ చదలఁజేరి గౌరి♦సరస కేగఁగఁ జూచు, వారి వరసి మృత్యు♦భంజనుండు
వేగ నుమకుఁ గన్ను♦సైగ చేసిన నంత, యెఱిఁగి యగజ యెంత♦యేని నగుచు.

గీ॥ చక్కహోంబట్టుబంతివి♦సరి పలాద, యుగ్రమునుగొట్టవారలు♦హూయనుచుఁబు
డమినిబడితన్నుకొనుచుఁ బ్రా♦ణములువదలి, రమరులలరులఁగురిసిరి♦యంబపైని

క॥ కందుకమదియును సురముని, బృందంబుల యాచ్ఞనొక్క♦పృథులింగంబై
యందమరఁ గందుకేశుఁ డ, నందగె జ్యేష్ఠేశలింగ♦నైకటభూమిన్. 429

వ. అంత హరివిరించనాది సురవ్రజంబు లమ్మహాలింగంబు నర్చించి శివునిచే నభీష్ట వరములొంది స్వస్థానంబులకరిగె రిఁక నేమివినవలతు రెఱింగింపుఁడనిన మునులు సూతునకు మహాత్మా! శివుని యష్టాశీతిలీలల నెఱింగింపుమనుటయు.

క॥ భోగీంద్రహారవిలస, ద్భోగేశ్వర చరణకమల♦పూజాజాగ్ర
ద్భోగార్యసోదరీ! చి, ద్భోగలసచ్చిత్తతోయ♦భూ! లక్ష్మాంబా! 431

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండనాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి యుద్ధఖండంబునఁ
బ్రథమాశ్వాసము సంపూర్ణము.

(శ్రీ) (శ్రీ) (శ్రీ) (శ్రీ) (శ్రీ)

---

వరా:—ఈయుద్ధఖండమందలి యంధకాసురవధోపాఖ్యానము పునరుక్తి గాకుండుటకై యిచ్చట మాని లింగవైభవఖండమందుఁ జేర్పఁబడినది.



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీశివపురాణము

## లీ లా ఖ ం డ ము.

### ప్ర థ మా శ్వా స ము.



విలసదుద్భటాన్వయ
జీవనరాశీందుబసవ ♦ శివదేశికపౌ
త్త్ర! విద్యానందాత్మక!
భావజరిపురూప! వీర♦భద్రారాధ్యా!

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

—* శివలీలావతార పరిగణన *—

గీ॥ శివుని లీలావతారముల్ ♦ చెప్పఁగలనె, లెక్క లేనట్టులొప్పెడుఁ ♦ జెక్కులవ్వి
నుడివెమునుకొన్ని నందికే♦శుఁడుసనత్కు,మారునకు దెల్పెనాతండు♦మాగురునకు.

క॥ ఒడికమ్మున దేశికుఁ డటు, నుడివెను శిష్యులకు మాకు ♦ నుతగుణగణు లి
య్యెడ మీకుఁజెపుదు నాలిం,పుఁడు లోకహితములు భోగి♦భూషణు లీలల్.

వ. మహేశ్వరుండు మున్నుసర్గకాముండై ధ్యానంబొనర్చు పరమేష్ఠికి సాయంబుఁ
జేయఁగోరి శ్వేతలోహితంబను పందొమ్మిదవ కల్పంబు మొదలుచేసి యిరువది
మూడవ కల్పంబువఱకు శ్వేతలోహితారుణ నీల హేమ ధవళ వర్ణంబులలో
సద్యోజాత వామదేవాఘోర తత్పురుషేశానావతారంబులొందుచు వారొక్క
రొక్కరు పుత్త్రచతుష్టయంబు నొంది విధాతకు విజ్ఞానంబును సర్గశక్తి నొసఁగిరి.
(౫) ఇంకను శివుఁడు శర్వ భవ రుద్రోగ్ర భీమ పశుపతీశాన మహాదేవ రూపం
బులతోఁ గ్రమంబుగ భూమ్యుదకాగ్ని మరుదాకాశ క్షేత్రజ్ఞార్క నిశాకర

పదార్థంబుల నధిష్ఠించి యీయష్టతనువులతో నిండి చరాచర విశ్వమయుండై యొసంగె. (౧౩) అనంతరంబున స్వరచితంబగు సర్గంబు వృద్ధినొందమికి నారసి విధాతృండు మిథునసృష్టిం జేయనెంచియు స్త్రీవర్గంబునందు శక్తుండుగాక మహాదేవుని గూర్చి తపింపుడు నచిరకాలమ్మున నమ్మహేశ్వరుండుస్వాంత ర్లీనంబగు శక్తి నర్ధతనువునఁ బహిర్గతంబుఁ గావించి యర్ధనారీశ్వరుండై యజునకుఁ బొడసూపి శక్తిచే నాతనికి స్త్రీసర్గశక్తి నొసంగించె (౧౪)

ఇఁకను ప్రథమద్వాపరంబందు శివుండు శ్వేతుండనుమునియై శివతోఁగూడి హిమవచ్ఛిఖరంబందలి ఛాగలపర్వతంబందు వసించి శిష్య చతుష్టయంబుతో స్వాయంభువుఁడను వ్యాసునకు స్వాత్మప్రబోధం బొనర్చె-ఇఁకను ద్వితీయద్వాపరంబు మొదలుచేసి యష్టావింశద్ద్వాపరంబులవఱకు శివుఁడు సుతార దమన సుహోత్రి కంక లోకాక్షి జైగీషవ్య దధివాహన ఋషభ యోగి భృగుతుంగ తపో త్రి బలి గౌతమ వేదశిరస్క గోకర్ణ గుహావాసి శిఖండి జటామాల్యట్టహాస దారుక లాంగలి శ్వేతకేతు శూలి ముండిసహిష్ణు సోమశర్మ లకులీశ్వరులనునవతారంబులనొంది యథోచితంబుగఁ గొన్నిట శిష్యచతుష్టయంబుతో మఱిఁగొన్నిటఁబుత్రచతుష్టయంబుతో సత్యభార్గవాంగిర స్సవితృమృత్యు శతక్రతు వసిష్ఠ సారస్వత త్రిధామ త్రివృచ్ఛత తేజో నారాయణ రక్షాఖ్య త్ర్యారుణి దేవ దేవకృతంజయ ఋతుంజయ భారద్వాజ గౌతమ వాచశ్రవ శుష్మాయణ తృణబిందు యక్షి శక్తి పరాశర జాతకర్ణ పారాశర్యాఖ్యులను నామంబులనొప్పు వ్యాసునకు బ్రహ్మవిద్యా ప్రబోధం బొనరించె (౪౨) అంతమీఁదశిలాదముని పుత్రార్థియైతపింప స్వాంశంబున నంది కేశు నవతరింపఁజేసె (౪౩)

ఆమీఁద భైరవుఁడై యవతరించి యసత్యంబాడినవిధాతృని పంచమవదనంబును జిదిమివేసె (౪౪) మఱియు హిరణ్యకశిపుని సంహరించిననృసింహామూర్తి ముఖజ్వాలలచే లోకధ్వంసంబగు టారసి దేవప్రార్థితుండైమహేశ్వరుండు శరభావతారంబొనర్చి నృసింహాతను సంహృతిఁ బొనరించె (౪౫) విశ్వానరుండనుముని కపత్యంబులేకుండుడు నమ్ముని తపించినంత స్వకీయాంశంబున గృహపతియను నామంబున నాతనికాత్మజునిగ నవతరింపఁజేసె (౪౬). 4

క. ఆగృహపతి యధికతపో, యోగంబున శివునికరుణ ♦ నొంది స్థిరాయు
ర్భోగంబుల దిశ్పాల, శ్రీగరిమముఁ జెంది యలరె ♦ సిద్ధమునీంద్రా! 5

వ. ఇఁకను హరిసహాయంబుచే రక్కసుల కందనీయక యమృతపానం బొనర్చినదివ్యులహంకరింపఁగా యక్షేశ్వరావతారంబొంది యవ్వారి గర్వంబు నడిపె (౪౭) వెండియునిఁక మహాకాలుండు తారుండు భువనేశ్వరుండు శ్రీవిద్యేశ్వరుండు భైరవుండు శివుండు ధూమవంతుండు బగలాముఖుండు మాతంగుఁడు కమలుండను

దశావతారంబులొంది మహాకాళి తార భువనేశ్వరి శ్రీవిద్య భైరవి ఛిన్నమస్త ధూమవతి బగలాముఖి మాతంగి కమల యను నామంబుల చేత నవతరించిన శక్తులం జేపట్టి లోకరక్షణం బొనరించె (౧౭)

ఇంకను రక్షోబాధితులగు దేవతల యలజడిన్ గాంచి కశ్యపప్రార్థనచే మహేశ్వరుండు కపాలి పింగలుండు భీముండు విరూపాక్షుండు విలోహితుండు శాస్త జపాదుం డహిర్బుధ్న్యుండు శంభుండు చండుండు భవుండు నను పదునొక్కరై యవతరించి యసురులన్ భంజించి వేల్పులను రక్షించె (౧౮) అత్రి యను మునీశ్వరుండు పుత్త్రకాముండై త్రిమూర్తులం గొల్చిన ముయ్వురయ్యనఘునకుం బుత్త్రులై పొడమునట్లు వరంబిచ్చినకతంబున శివుండు దూర్వాసుండను పేరున నత్రిపుత్త్రుండై యవతరించె (౧౯) ఇంకను దొల్లి శివవీర్యంబు సంగ్రహించిన మహాబలుం డద్దాని నంజలియందు సమర్పింపుడు శివాంశతో హనుమానుం డవతరించి రామకార్యంబునందు సాయంబొనర్చె (౨౦) మహాకాలుండను గణపాలుండు శివాశప్తుండై మహేశ్వరునిచే ననుగ్రహింపంబడి శివశాపప్రకారంబు శివాంశచే భేతాళుండను భూతపతియై యవతరించె (౨౧) తొల్లి పాతాలవాసినులగు స్త్రీలందవిలి విష్ణువు పుత్త్రులం గని యందు వసించి లోకరక్షణంబు మానియుండుడు శివుండు దేవప్రేరితుండై వృషేశ్వరావతారంబున నిగ్రహించి విష్ణువును స్వధర్మనియంత్రితునిగా నొనర్చె (౨౨) దధీచిమునికిం దత్సతియగు సువర్చాగర్భమందు స్వాంశంబునం బిప్పలాదమునియై యవతరించి తపోవైభవంబు నెఱపె (౨౩) మహానంద యను వేశ్యన్ బరీక్షింపంగోరి వైశ్యపత్యావతారంబుం జెంది యామెన్ బరీక్షించి మోక్షంబు నిచ్చె. (౨౪) భద్రాయు వను మహారాజును బరీక్షింపంగోరి మాయాశార్దూలావతారంబు నొంది (౨౫) మాయాద్విజుండై (౨౬) పరీక్షించి శుద్ధుండగు తేనికి వరంబులొసంగె. మఱియు యతినాథుండై (౨౭) ఆహుకుండను భిల్లునిం దత్పత్నినిం బరీక్షించి వారికి దమయంతీ నలులుగాం బునర్జన్మంబు నిచ్చి కళహంసంబై (౨౮) దౌత్యంబునడపి యవ్వారి దంపతుల నొనరించె. మఱియు మార్తాండవంశ్యరాజులలో.

ఆ॥ నభగపుత్త్రుండైన ♦ నాభాగునింబరీక్షం, దానొనర్పం గృష్ణ ♦ దర్శనుం డయి
నృపుని సత్యవచన♦నియతి కెదన్ మెచ్చి, జ్ఞానమును సవనధ♦నములనొసగె. 7

వ. ఒక్కపుడు గురుశక్రులు కైలాసాద్రి కేగుచుండ నవధూతయై (౩౦) మోసపడిన యింద్రునిం జంపంబూనియు గురుప్రార్థనచే నాంగి యింద్రు ననుగ్రహించె. భిక్షువర్యావతారంబున బ్రాహ్మణికి సందేహంబుందీర్చి తత్పుత్త్రునకును రాజపుత్త్రుండగు ధర్మగుప్తునకు బ్రదోషార్చనావ్రతంబు నెఱింగించి తత్సిద్ధిచే నవ్వారికి శ్రేయంబులిచ్చె (౩౧) మునిపుత్రుండగు నుపమన్యుండు క్షీరార్థియై

తపించుచుండుడు మహేంద్రావతారంబొంది యుపమన్యుఁబరీక్షించి యటుపై నిజరూపంబుఁజెంది వరంబులిచ్చె (౮౨)

పార్వతీదేవి తపస్సుఁ జేయుచుండగా బ్రహ్మచారియై వచ్చి యద్దేవినిఁ బరీక్షించె (౮౩) తపస్సిద్ధినొంది పార్వతి తలిదండ్రులయొద్ద కేగినంత నర్తకుండై యోషధిప్రస్థంబుఁజేరి మేనకా హిమవంతులను గన్నె నిమ్మని యర్థించె. (౮౪) అటుపిమ్మట శివునిలీల లెఱుంగి పార్వతి నిచ్చుట కిష్టపడిన మేనకాహిమవంతుల కడకు వైష్ణవద్విజుండై వచ్చి శివాపకర్షణ బోధించి కన్నెనీవలదని నొడివె (౮౫) ధనురాచార్యుండను కీర్తిఁబడసిన ద్రోణుండు పుత్రార్థియై శివుని భజింపఁగా స్వాంశమున నశ్వత్థామ యనువానిఁ బుట్టించె. (౮౬) కౌరవ పాండవ యుద్ధంబు చివరరేయి శస్త్రపాణియై పాండవశిబిరంబుఁజొచ్చు నశ్వత్థామకు భూతాకృతియై వెఱపించి యాపై ననుగ్రహించె. (౮౭) పాశుపతాస్త్రంబుఁగోరి తపించుచున్న నర్జుననిఁ బరీక్షింపఁగోరి కిరాతపతియై యాతనితోఁబోరి మరల ననుగ్రహించి పాశుపతం బిచ్చె (౮౮) ఇట్లు పరమేశ్వరుం డష్టాశీతిలీలారూపంబు లొంది భక్తుల ననుగ్రహించె నిందు కొన్నిటిని సవిస్తరంబుగా నింతకుమున్ను మీకుఁ బురాణాంతరంబులఁ జెప్పియుంటిని గావున నిపుడు విశేషించి కొన్నిలీలలఁ బ్రతిపాదించెద వినుం డని సూతుండు మునుల కిట్లనియె.

## — * నందికేశ్వరావతారలీల * —

శా॥ సాలంకాయనమౌనిపుత్త్రుఁడు మహే ♦ శానప్రియుం డుల్లస
చ్ఛీలుండైన శిలాదుఁ డుత్తమసుత ♦ శ్రీకాంక్ష నాకేశ్వరున్
బౌలోమీశుఁ దపంబునన్ గొలువ న ♦ ప్పాకారి యేతెంచి యి
ట్లేలా ? తీవ్రతపంబొనర్చెద నమౌ ♦ నీంద్రుండు మోదంబునన్. 9

క॥ జేజేలదొరకు మ్రొక్కి త, నూజు నయోనిజు ననిధను ♦ నుతగుణు నడుగన్
యోజించి మునివరునకు బి, డౌజుండనె నా కశక్య ♦ మగు నిట్లొసఁగన్. 10

ఆ॥ నేనెకాదు వనజ ♦ నేత్రుండు నలువయుఁ, గూడ నొసఁగలేరు ♦ కొమరునిట్లు
వారలేను మృతినిఁ ♦ బడసెడువారమే, యెట్టులొసఁగఁజెల్లు ♦ నిట్టివరము. 11

చ॥ హరుఁడొకరుండు దక్కనిక ♦ నన్యులొసంగఁగఁజాల రివ్వరం
బరయ మునీంద్ర! శంకరుఁ డ ♦ నాదిలయుండు పరాత్పరుండు నీ
వరుసముమీఱఁగా నియమ ♦ మారసి యాహరునిన్ భజించినన్
బిరుదతఁడిచ్చు నివ్వరముఁ ♦ బేరిమి నీకు మునీంద్రతల్లజా ! 12

క॥ అనినుడివి యాతఁడరిగెను, మునివర్యుండంత మోద ♦ మున నానిముస
మ్ముననే తపమారంభము, నొనరిచి భజియించుచుండె ♦ నుడురాజధరున్. 13

గీ॥ అన్నపానంబులను బాసి♦యభవునందె, డెందమునుజక్కఁజేర్చి యే♦కొందలంబు
లేకయుండెఁ దడవుకాల♦మేకనియతి, ముని; యతనిపైన వల్మీక♦మును దనర్చె.

గీ॥ వజ్రసూచీముఖంబులై ♦ వనరు కీట
ముల తెగల్ గమ్ముకొని నెత్తు ♦ రులను ద్రావి
మూఁగియుండె నస్ృజ్మాంస ♦ ములును జర్మ
మును లయంబొందె నొక్క యె ♦ ముకలు మిగిలె. 15

మత్తకోకిల॥ అంతఁ దా జగదీశ్వరుం డపు ♦ డాదరంబు ఘరంబునన్
గాంతతోఁ బ్రమథాళితో సుమ ♦ నస్సముచ్చయరాజితో
నెంతయేనిఁ దపోధనాఢ్యమునీంద్ర ♦ బృందముతోడనున్
వింతగాఁ జనుదెంచి యిచ్చెద ♦ వేఁడు మిష్ట వరంబునాన్. 16

చ॥ కడఁగి సమాధిఁజెంది తన ♦ కాయమునందు మనంబులేక నె
ప్పుడు శివపాదపద్మములఁ ♦ బొందుగ ధారణనొందియున్న న
క్కడిఁది మునీశ్వరుండు శిలి ♦ కంతు నుడిన్ వినకున్న నంత శం
భుఁడు తన పాణిపద్మమున ♦ ముట్టె మునీంద్రుని మస్తమర్మిలిన్. 17

ఆ॥ అపుడు గనులుదెఱచి♦యాతాపసాగ్రణి, శివునిచరణములకుఁ ♦ జేరి మ్రొక్కి
వరముఁగోరు మిడెద ♦ బాడబతల్లజ! యని శివుండు వలుక ♦ నంత మునియు;

క॥ పరమశివ ! సుతు నయోనిజు, సురుచిరు నవినాశు నీకు ♦ జోకగువానిన్
బరమకృప నిమ్ము మురిసెద, వర మిదియే సర్వలోక ♦ వంద్యపదాబ్జా! 18

వ. అనిన లోకనాథుం డిట్లనియె.

మత్తకోకిల : ఓ మునీశ్వర ! యట్టులేన్ విను ♦ మున్నతాత్మ ! రయంబునన్
నీ మనోరథసిద్ధిగా నిఁక ♦ నే నయోనిజమూర్తినై
ప్రేమ మొప్ప జనింతు నాశవుఁ ♦ బేరులేక యొసంగు న
ట్లోము నన్నిఁకఁ దండ్రివౌచు మ♦హోచ్చకీర్తు లెలర్పఁగా. 19

గీ॥ అనిమహాదేవుఁడంతర్థి♦నంతఁజెందె, నమ్మునియు నాశ్రమముఁజేరి♦యందుమునుల
కభవవరదాన మెఱిఁగింప ♦ నందఱపుడు, మురిసి రెంతేని నానంద♦భర మెసంగ.

—* నందికేశ్వర జననము *—

గీ॥ కొంతకాలంబెదుసనూచి♦యంతమౌని,జన్న మొక్కఁడొనర్పఁగా♦స్వాంతమందుఁ
దలఁచిమఖశాలనిర్మింపఁ♦దలఁచుటయును, నంత నెశివాంశతో బాలుఁ♦డవతరించె.

క॥ తరుణేందుకిరీటముతో, సురుచిరభస్మానులిప్త ♦ శుభ్రితనువుతో
వరభుజచతుష్టయములో, హరువుగ బాలుఁకుఁడుపొడమె ♦ హారునంశముతోన్.

క॥ విరులుగురిసె శివుపైఁ గి, న్నరులును గంధర్వజనులు ♦ నాడెంబుగఁ బా
డిరి పలుకుచెలువ నలువయు, సిరియు హరియు శివయు శివుఁడు ♦ చేరిరి వేడ్కన్.

గీ॥ మఱియునింద్రుండుమున్నగు ♦ సురలుమునులుఁ, జేరివచ్చిశిశుఁ జూచి ♦ చెలఁగిమునినిఁ
దజ్జనకుఁ గాంచి మిగుల సం♦తసముఁ జెంది, మెచ్చి తమతమ నెలవుల ♦ కిచ్చఁ జనిరి.

ఉ॥ అంత మునీశ్వరుండు సుతు ♦ నక్కునఁ జేర్కొని స్వీయమాశ్రమం
బెంతయు వేడ్కఁ జేర్చ శిశు ♦ వీశ్వరరూపముఁ బాసి బాలుఁడై
వింతగఁ గన్పడెన్ మునియు ♦ వేగఁ గనుంగొని యించు కాత్మలోఁ
జింతిలి జాతకర్మమును ♦ జేసి మునీంద్రుల సమ్మతంబునన్. 25

గీ॥ నంద మొసఁగినవాఁడౌట ♦ నంది యనుచు, నామకరణంబొనర్చి నా♦నావిధార్థ
సంచయము నెమ్మినర్థి♦జనుల కిచ్చి, తనియఁ జేసి ముదంబునఁ ♦ దనరుచుండె.

క॥ ఐదవయేఁ డుపనయనము, నాదట నొనరించి దేశి♦కాగ్రణులకడన్
వేదాధ్యయనారంభము, మోదమున నొనర్పఁ జేయ ♦ మునియతఁ డంతన్.

క॥ సాంగములగు వేదమ్ముల, సంగీతకలన్ సుశాస్త్ర ♦ షట్కము నెంతేఁ
బొంగుచుఁ గడుసులువుగఁ బూ, ర్తిం గావించెను గరంబ♦రిదిఁ జెందగురుల్.

గీ॥ దాఁటెనా యేడులంత స♦ప్తమ సమయది, జరుగుచుండఁగ నొకనాఁడు ♦ పస్సునందు
ఘనులు మిత్రావరుణులు నా♦మునులు వారిఁ, జేరవచ్చినఁ గనుఁగొని ♦ చెలఁగి వేగ.

క॥ బుడుతండును దాను శిలా, దుఁడు నవ్వారలను గొల్చి ♦ తుష్టిగ నన్నం
బిడికుడువఁ జేసి రంతనె, యడరుచు నర్భకునిఁ గాంచి ♦ యనిరిటు వారల్. 30

క॥ ముని! యీపాపఁడు చదువుల, ననువరియేమైన నాయు ♦ వరయఁగ నస్వదె
కనుపడెడు దీననెంతయు, వనరక తెలియంగనొవ్వ ♦ భావములోనన్. 31

వ. అని చెప్పియంత నేవారు యథేచ్ఛంజనిరంత శిలాదముని యాశీవిషవిషప్రాయంబగున
వ్వారివచనంబున స్మృతిఁ బాసికొండొకతడవునకు దెలిసి విషాదంబుఁ జెంది కుమారున్
జూచి ఘోరంబుగ విలపించుచున్నంతనంది నిజజనకున్ బొడఁగాంచి యిట్లనియె.

చ॥ వనరెదవేల తండ్రి! వెలు♦వన్ బనిలే దొకకీడు నాకెటన్
బొనరదు కాలుఁ డేనియును ♦ భూతములెవ్వియు నేని నన్ను డా
యను దగవింకఁ దాల్మిఁ గొను ♦ మల్మటఁ బాయు మసంగ నంత న
మ్మునివిని యిట్టి తేఁకువను ♦ బూనుట యెందలిదండి చేనగున్, 33

క॥ చదువుననుగాని యెక్కుడు, చదురగు తపసుననుగాని ♦ జగమున మిత్తిన్
బొదువఁబడ కెట్టులేనియు, బ్రదికినవా రెవ్వరయ్య ♦ పట్టీ! చెపుమా! 34

వ. అనిన నంది యిట్లనియె.

క॥ చదువుననుగాక యెక్కుడు, చదురగు తపముననుగాక ♦ జనకా! మిత్తిన్
బొదువఁబడకేను రూఢిగ, బ్రదికెద జముగిట్టినట్టి ♦ భర్గుని కరుణన్. 35

చ॥ సెలవు నొసంగు దీవెనను ♦ జేయుము పోయెద శర్వుఁ గొల్వఁగా
నలఘుతపోనిధాన! యన ♦ నమ్ముని సంతసమొంది నిన్ను నె
వ్వలయఁగనీక సాఁకు పర ♦ మాత్మ శివుండిఁక నీవు చెచ్చెరన్
బలితపుఁ దాపసవ్రతముఁ ♦ బన్ని గడింపు చిరాయురున్నతుల్. 36

క॥ అని సెలవొసఁగుడు నందియుఁ, దన తండ్రికిఁ దాతకును ముం♦దమ్మున జోతల్
పొనరించి దివ్యధుని ప్రక్క నున్న విపినంబుఁ జేరి ♦ కడఁగెఁ దపంబున్. 37

గీ॥ రుద్రజపమొనరించుచు♦రూఢిమీఱఁ, బరమకరుణాసముద్రునిఁ ♦ బార్వతీశు
మదినిఁ గుదురుగనిల్పి స♦మర్చనంబు, చేయుచుండ నచిరమందె ♦ శ్రీగళుండు.

—✻ శివుఁడు నందికేశునకుఁ బ్రత్యక్షమగుట ✻—

క॥ ఉమతోడుతఁ బ్రమథగణ, ప్రముఖులతో సకలదివిజ ♦ వర్గముతో మో
దము మీఱఁగ మునిసుతునా, శ్రమమునఁ బొడసూపి బాలుఁ♦జక్కఁగని కృపన్.

క॥ నందిశిరంబునఁ జేయి నా, నందంబున నునిచి వేగ ♦ నాయన! వరమొం
దందగినవాఁడవైతివి, పొందుగ వాంఛితములడుగు ♦ పూరింతునవన్. 40

క॥ శైలాది యంత శివపద, నాళీకంబుల కెఱఁగి ఘ ♦ నశ్రుతిశిఖలన్
జాలఁగ నజరానిధనుని, నీలగ్రీవుని నుతించె ♦ నేరిమిదనరన్. 41

గీ॥ అంత శంకరుఁడెంతేని ♦ యాదరమున, నంది జేకొని కౌఁగిటఁ ♦ జెంది శివను
గణములనుగాంచి యత్యంత♦కౌతుకమున, నందితోనిట్టులనెఁ బ్రేమ♦చింద వడిగ.

ఉ॥ నీకు జరామృతుల్ గలుగ♦నే సుత! యెన్నఁడునేని నీవికన్
నాకినమై తనర్చెద వ♦నశ్వరమూర్తివి భ్రంశితార్తివై
శోకములన్ రుజన్ గనక ♦ శోభిలుచుండెద వెల్లకాలమున్
నాకడనుండుఁ జీవికను ♦ నాయన నాయన నాయనల్ రహిన్. 43

గీ॥ ఇట్లు చెప్పి శిరంబున ♦ నెసఁగు హేమ, కమలహారము శైలాది ♦ గళమునందు
వేసినంతనె యతఁడును♦ వెలసెఁ బంచ, ముఖుఁడు త్రినయనుఁడును దశ♦భుజుఁడునగుచు.

గీ॥ శర్వుఁ డావెంటనే తన ♦ జడల నున్న, హారనిర్మలమగు వారి ♦ నంజలిన్ ఘ
టించి నందిపయిన్ జల్లె♦మించి జలము, లైదునదులయి ప్రవహించె♦నక్కజముగ;

వ. అయ్యవి యైదును త్రిస్రోత, జటోదక, స్వర్ణోదక, జంబూనది, వృషధ్వని, యని
యైదు నామంబులఁ బరఁగుచు నచ్ఛోదకంబులు మహావేగంబులునై జపేశ్వర

సన్నిధానంబునఁ బ్రవహించుచు రాణించె నీపంచనదులఁ గృతాభిషేకుండై జపేశ్వరు వర్ణించి నట్టిఁ డీశ్వరసాయుజ్యంబు నొందు విందు సందియంబు లే దిఁక శంభుఁడు శాంభవిఁ జూచి దేవి! యిబ్బాలకుని గణేంద్రునిగా నభిషేకింప నెంచెద నీవెట్లు దలంచెదవనిన నాజగన్మాత యిట్లనియె.

గీ॥ దేవ! యట్లే యొనర్పు మందికి గణాధి, పత్యపట్టాభిషేక మీ బాలకుండు
నాసుతుండగు నెంతయు వాసిఁ జెందు, నీదయామృతరసవృష్టి నిండి నెగడ.

వ. అనినంత శివుండు గణపాలురఁ గనుఁగొని.

గీ॥ నంది నాపుత్త్రుఁడితఁడు మీయందఱకును, విభుఁడు పూజ్యుఁడు మీరిప్డు వీనిఁ బూని
చేయుఁడభిషేకమెంతయుఁ జెలువుమీఱ, నేఁటినుండియు మిము నేలు నేర్మినితఁడు

—* నందికేశ పట్టాభిషేక వివాహములు *—

వ. అని సెలవిచ్చిన నవ్వారలెల్ల సకలసన్నాహంబు లొనర్చి నందిఁ గారవించి ధర్మపట్టంబుఁ గట్టి యభిషేకించి రనంతరంబునఁ బరమేశ్వరానుమతితో సర్వసుపర్వు లేతెంచి

గీ॥ హరివిరంచనులును హరిహయుఁడు తక్కు, దిక్పతులును రవీందులా దివ్యమూర్తు
లెల్ల నందికి యభిషేకమింపు నదరఁ, జేసి శిరసుల నంజలుల్ చేర్చిరపుడు.

గీ॥ అభవుఁడంత మరుత్తుల యనుఁగుగూఁతు, దీటగు సుకీర్తియను దానిఁ దెచ్చి నంది
కొసఁగఁ జేసి యొనర్పించె నుపయమంబు, సకలమునులును సురలును సంతసింప.

వ. మఱియు నయ్యవసరంబున.

సీ॥ చందురు వెలుఁగుల జానుమీఱు నెఱసిత, చ్ఛత్రంబు బొకండును జామరద్వ
యము వానిఁ బట్టెడు నట్టి సుపర్వ్చ, యమ్మును ధర్మసింహాసనంబు
రవ్వలకెంపుల రాణమీఱిన హేమ, మకుటాదిభూషణనికరములును
దేవి కంఠమునుండి తీసియిచ్చిన నాణె, ముత్యాలదండయు మురువుదవరు

గీ॥ పసిఁడిదండయుఁ బాండుర భద్రగజము, కఁడు బలీవర్ద మల్లసింగంపుటెక్క
మమరు బంగారుతేరు రయమున నంది, కొసఁగె జగదీశ్వరుండు పెంపెసఁగు కరుణ

క॥ నందియుఁ దత్సతియును బా, లేందుధరున శార్వ్యకును దుహిణునకునుం గో
విందున కడుగుల పైఁబడి, వందనములొనర్చిరపుడు వాసిదలిర్పన్. 54

క॥ అత్తఱి శివుండు ప్రేముడి, హత్తగ శైలాదికిట్లు లనియెం గుమారా!
యిత్తన్వి సుకీర్తియు నీ, చిత్తమురంజింపఁ జేయుఁ జెలిమి మెఱయఁగన్. 55

క॥ నీవును నీదు వెలందియుఁ, బావనుఁడు శిలాదమౌని పతి తత్పితయున్
నావాసంబున నుండుఁడు, శ్రీవెలయ సుఖముల మీరుఁ జేకుఱఁ జేతున్. 56

క॥ నాకిష్టుఁడవై మంతిరి, వై కడిఁది బలంబు వెలయ ♦ ననుచరుఁడవునై
లోకములకెల్ల శేతవు, నై కడుపూజ్యుండవగుచు ♦ నలరెదు వత్సా!

గీ॥ నీదు తండ్రియుఁ దాతయు ♦ నాదు గణము, లందుఁ బ్రాముఖ్యముఁ జెందియుందురికను
నే నెచటనుందు నీవందు ♦ నిలువు మీవు, నెటవసించిన నేనందు ♦ నెగడియుందు.

వ. అనినంత మృడానియు వరంబులొసఁగ నెంచి నందికేశున్ జూచి యిట్లనియె. 59

క॥ నేనును వరముల నిచ్చెద, మానసవాంఛలను దెల్పు ♦ మా! పుత్త్ర! యనం
గా నంది నీపదద్వయి, మానక తగు భక్తినొసఁగు ♦ మా! జనని! యనెన్.

వ. అంత నఖిలాండేశ్వరి తథాస్తనియొసంగి భక్తితోఁగూడ నాతనికిఁ దత్సతికిఁ దివ్యభోగభాగ్యంబులను బుత్త్రపౌత్త్రాభివృద్ధి ననుగ్రహించె నంత శివుండు నందికేశుని సాన్వయంబుగ సబాంధవంబుగ నిజస్థానంబుఁ జేర్చుకొని సుఖంబుగ నుంచె. హరివిరించనాది సకలగీర్వాణులు మున్నగువారు సంతసించి శివానుగ్రహంబుం బ్రశంసింపుచు నిజధామంబులకరిగిరి. ఇది నందికేశావతారచరిత్రం బియ్యది మీకెఱింగించితి. 61

క॥ ఈలీల నెవ్వఁడేని య, లోలమతిన్ వినినఁ జదువ ♦ లోకసుఖంబుల్
జాలఁబడసి పరమందున, నీలగ్రీవుని పదంబు ♦ నెక్కొను మానుల్! 62

వ. ఇఁకను శ్రీభైరవలీల నెఱింగించెద వినుండు.

## —* శ్రీ భైరవలీల *—

చ॥ మునులును నిర్జరోత్తములు ♦ మున్నొకమాఱు హిరణ్యశైలమం
దనువుగఁ గొల్వునం దమరు ♦ నబ్జజుఁ గాంచి నమస్కరించి పా
వన! కరుణాభిరామ! నిను ♦ బ్రార్థనచేసెదమయ్య! యీ జగ
మ్మున నిఁక నవ్యయంబయిన ♦ పోంకపుఁ దత్త్వమదేదొ తెల్పుమా! 63

క॥ అని యడిగిన వారలఁ గని, వనజాసనుఁ డపుడు ఖండ ♦ పరశుని మాయన్
బెనఁగొని యప్పరతత్త్వం, బును దెలియక యిట్టులనియె ♦ మోహితబుద్ధిన్. 64

ఉ॥ నేనసుఁడీ జగంబులకు ♦ నిక్కపుఁ గర్తను నీశ్వరుండనున్
నేన సమస్తశక్తులకు ♦ నేర్మిఁ బ్రవర్తకుడన్ నివర్తనం
బేనె యొనర్తుఁ బుట్టుటయు ♦ నీల్గుట యన్నది నేనెఱుంగ నెం
దేని యనశ్వరంబయిన ♦ యీశ్వర తత్త్వము నిద్ధమానసుల్! 65

క॥ ననుభావింపుం డిట్టుల, నన విని సైరింప కండె ♦ యలరిన నారా
యణునంశమైన క్రతుఁ డి, ట్లనియెను గడు నాగ్రహమున ♦ నబ్జజులోడన్. 66

క॥ ఎఱుఁగక పరతత్త్వంబిటు, నెఱిదొరఁగి వచించెదేల ♦ నేన విభుఁడ నం
చఱిముఱిగా వీరలముం, దఱ ననుచితమిద్ది యరయు ♦ తామరసభవా! 67

చ॥ హరిఁబోరి నీజగంబులను ♦ బుట్టఁగఁజేసితి నేనకాదె ? యీ
శ్వరుఁడను యజ్ఞపూరుషుఁడ ♦ సర్వము నేలెడువాఁడ నేనని
బ్బరమగు తత్త్వసారయుము ♦ పన్నుగ నిందజిలోన నిట్లు పె
ద్దరికముఁ బూవఁబోకు మిఁక ♦ తప్పులు పల్కకు నీరజోద్భవా ! 68

క॥ అని యిటు నిద్దఱునుర్వా, దొనరిచి యద్వాని మాని ♦ యొప్పఁగ శ్రుతులన్
గని తమదు తారతమ్యం, బును గూరిచి యడిగిరిట్లు ♦ పూనికతోడన్. 69

క॥ ఎందును బ్రమాణములు మీ, యందుఁగలదు నమ్మకము ర♦యమున నిగమముల్
పొందెఱిఁగి యవ్యయంబగు, కందువ తత్త్వం బదేదొ ♦ కడఁగి చెప్పుఁ డిఁకన్. 70

వ. అని యడిగిన విధివిష్ణుల కవ్వానిలో ముందుగ ఋగ్వేదం బిట్లనియె. 71

క॥ ఎవ్వనిలోపల జగములు, నివ్వటిలున్ సర్వమెవని ♦ నేర్మినడచు నిం
కెవ్వనిఁ బరతత్త్వముగా, నవ్విజ్ఞులు చెప్పుదురొకఁడె ♦ యారుద్రుఁడగున్. 72

వ. యజుర్వేదం బిట్లనియె.

క॥ ఎవఁడెల్ల జన్మముల యో, గవిధానంబునను గొలువఁ ♦ గాఁబడెడు సతం
బెవఁడిడె మాయెడఁ బ్రామా, ణ్యవిభవమతఁడొకఁడె తత్త్వ♦మగు శివుఁడరయన్.

వ. సామవేదం బిట్లనియె.

గీ॥ ఎవనిచేతను దిరిగెడు♦నెల్ల విశ్వ, మెవని యోగులు గొలుతురు♦హృదయమందు
నెవని తేజంబుచే విశ్వ♦మెల్ల వెలుఁగు, నాత్రిలోచనుఁడే యవ్య♦యమగు జ్యోతి.

వ. అథర్వణవేదం బిట్లనియె.

గీ॥ ఎవనిఁజూతురు భక్తితో♦నెల్ల జనము, లాతతానుగ్రహముఁగోరి♦యర్థులగుచు
నెవఁడు భక్తులదుఃఖంబు♦లింకఁజేయు, నతఁడె యవ్యయతత్త్వమౌ♦నభవుఁడరయ.

క॥ ఈలాగున నోలగమున, నాలుగు వేదములు చెప్ప ♦ నాళీకభవుం
డాలక్ష్మీశుఁడు కడుమో, హాలసులై పలికెరిట్టు♦లామినుకులతోన్.

ఉ॥ నిచ్చలు నాతితోఁ గలసి ♦ నేరిమిఁబాసి శ్మశానభూమిలో
మెచ్చుచుఁ గ్రీడసేయు నొక ♦ మేలిమిలేదు దిగంబరుండు పె
న్మచ్చికతోడఁ జల్వలను ♦ మైధరియించి ప్రమోదమొందు నే
హెచ్చును జూచి తత్త్వమని ♦ యీశునిఁజెప్పితి రీరిఁకన్ శ్రుతుల్ ! 77

వ. అనినంత నఖిలవేదశిరోభూషణంబును నిఖిలవేదాగ్రిపాఠ్యమానంబును నగు ప్రణ
వంబు మూర్తిమంతంబై వచ్చి యవ్వారి కిట్లనియె. 78

క॥ శివుఁడాత్మభిన్నమై తగు, నువిదను నెవ్వుడేనిఁ గలియఁ ♦ డొప్పఁగ వినుఁడీ !
శివ యాత్మశక్తి వారి కొ, దవునే భేదం బొకండె ♦ తత్త్వమరయఁగాన్. 79

గీ॥ శివుని నెడఁ బాసియుమ రదు ♦ శివ యటుల నె, శివను నెడఁ బాసి యొనరఁడు ♦ శివుఁ డెపుడును
వారి కన్యోన్యభేద మె♦ప్పట్ల లేదు, చంద్రచంద్రికలకుఁ బోలె ♦ జగము నందు.

వ. మఱియు లీలామూర్తులగు నవ్వారి విహారంబు లోకాభ్యుదయకారణంబై యల రారుననిన మోహతిమిరంబుఁ బాయకయున్న నాహరివిరించుల యగ్రమందు.

ఆ॥ తేజ మొకఁడు పొడమె ♦ దిక్చక్రమెల్లను, నాకసంబుఁ బుడమి ♦ నావరించె
నందుఁ బురుషుఁ డొక్కఁ♦ డావిర్భవించెను, ఫాలలోచనుఁడు త్రి♦శూలధరుఁడు.

చ॥ కమలజుఁ డిందుభూషణుని ♦ గ్రక్కునఁ జూచి మదంబుడంబు పె
ల్లమరఁగ నిట్లుబల్కె విను ♦ మర్భక! నాయలికస్థలంబునన్
గొమరుఁడవై జనించితివి ♦ కూరిమి రుద్రుఁడటంచు మున్న నా
మము బొనరించినాఁడ నను ♦ మంచిగఁ గొల్వు మనుగ్రహించెదన్. 83

గీ॥ అనిగడున్ గరువంబుతో ♦ నడరు నలువ, తీరుఁగని యీశ్వరుం డంత ♦ భూరిరోష
భరితుఁడై భైరవాకృతిఁ ♦ బరఁగుపురుషుఁ, బొడమఁ జేసెను నొకని న♦ద్భుతముగాఁగ.

వ. అంత నతండు.

## —* శ్రీ భైరవ ప్రాదుర్భావము *—

ఉ॥ బంగరురంగులన్ దనరి ♦ భాసిలి మేలి జటాచయంబుతో
నింగిని నేలనున్ దెసల ♦ నిండి లయాభ్రనినాదమట్లు బల్
భంగుల మ్రోయు నాదమరు ♦ భాసురఘోషముతోఁ గృశానుదృ
క్సంగతభీషణార్చుల ప్ర♦కాశముతో నుదయించి వ్రేల్మిడిన్. 85

గీ॥ పరమశివునాజ్ఞఁ జేకొని ♦ పంకజభవు, పంచమశిరంబుఁ గొనగోటఁ ♦ బట్టిచిదిమె
సింధురేంద్రము దా సర♦సీవనంబు, డాసి యరవిందమును లీలఁ ♦ గోసినట్లు.

## —* శ్రీ భైరవుఁడు బ్రహ్మదేవుని పంచమ శిరంబును ద్రుంచుట *—

క॥ దోసం బేయంగంబునఁ, జేసెనొ యద్దానిఁబట్టి ♦ శిక్షించుట యే
వాసియగుఁగాన నవ్విధి, దోసపుఁ బంచమశిరంబుఁ ♦ ద్రుంచెఁ గడువడిన్. 87

గీ॥ అంత యజ్ఞతనుండగు ♦ నజ్జనయనుఁ, డడలి రుద్రానువాకంబు♦లపుడు చదివె
నలువయును వార్తుఁడై కడు ♦ నలఁగి కలఁగి, బెదరి శతరుద్రపాఠంబు ♦ బిట్టొనర్చె.

వ. అపుడు దయామయుండును భక్తవత్సలుండునగు మహాదేవుండు హరివిరించుల భయంబుడిపి యనుగ్రహంబుఁ జూపి భైరవునిఁ జూచి యిట్లనియె. 90

క॥ ఈ యజ్ఞపురుషుఁడగు హరి, యీ యరవిందోద్భవుండు ♦ నెపుడును నీకున్
బాయంగరాని పూజ్యులు, సేయకు వీరి కిఁకఁ గీడుఁ ♦ జేయుము చెలిమిన్.

గీ॥ కాలుఁడట్టుల రాజిలు ♦ కారణమున, కాలరాజను పేరొంది ♦ క్రాలఁగలవు
మఱియు విశ్వముభరియించు♦బిరుదవౌట, భైరవుండను పేరున♦ భాసిలుదువు.

ఉ॥ కాలుని గుండెఝల్లు మనఁగ ♦ గల్గఁగఁజేయుటఁ గాలభైరవా
ఖ్యాలలితుండవౌదువు జ ♦ గమ్మున భక్తజనంబులోని పా
పాలను మ్రింగివేయుటను ♦ బట్టి కడున్ గలుషాదనాఖ్యనుల్
మేలుగ నొందఁగాఁగల వ ♦ మేయచరిత్ర ! పవిత్ర ! సిద్ధికన్. 92

గీ॥ ఇఁకను దుష్టాత్మకులనెల్ల ♦ నెపుడు మర్ద, నంబుచేయుటచే భువ ♦ నంబులందు
గరిమ నామర్దనాఖ్య నొ♦నరఁగఁజెంది, ఖ్యాతిఁగాంతువు లోకక♦ల్యాణమూర్తి!

వ. ఇంకను.

గీ॥ వైభవంబైయలరు నీక ♦ పాలమొంది, బ్రహ్మహత్యాపనోదనా♦ర్థంబు వ్రతము
లోకమున కెఱిఁగింపుచు ♦ నీకభిక్షఁ, గొనుచుఁ గాపాలిక వ్రతం♦బునఁ జరింపు.

వ. అని యిట్లు భైరవున కుపదేశించి యా సమయంబునందు.

సీ॥ కెంజాయవలువలు ♦ కెంపుపూదండలు, కెంపుగందములు బల్ ♦ సొంపుగూర్ప
మిట్టపల్వరుసతో♦మీఱు బెన్నాల్కతో, మొకమెంతో వికృతమై♦బుగులుసేయ
అగ్గిజోతులఁబోలు ♦ నిగ్గుగల్గినయట్టి, కనుగ్రుడ్లు మిగుల న♦క్కజముఁగూర్ప
నిడివైన కత్తిని ♦ నెత్తిపుర్రెనుగేలు, దోయి ధరించి బల్ ♦ దొప్పిదమెసఁగ

గీ॥ దగయడఁగమాటిమాటికిం♦పగురుధిరముఁ, ద్రావుచుఁ భైరవునకును♦దలకుదనరఁ
జేయఁగా గర్జనంబును♦జేయుచున్న, బ్రహ్మహత్యను సృజియించి♦భర్గుఁడపుడు.

ఆ॥ ఓకరాళి! నీవు ♦ నీకాలభైరవు, వెనుకఁ దిరుగుచుండు ♦ వెరవుతోడఁ
గాశినెపుడు చేరఁ ♦ గాలరాజీతఁడు, విడువు మంతవఱకు ♦ వెన్నుఁదగులు.

వ. అనిచెప్పి యంతర్ధానంబుచెందె. హరవిరించు లాత్మపదంబులకరిగి రంత భైరవుండును శివోక్త ప్రకారంబుగఁ గాపాలికవ్రతంబు ననుష్ఠింపుచు సకలభువనంబులఁ గ్రుమ్మఱుచు నఖిలపుణ్యతీర్థంబులఁ గ్రుంకుచునున్నను బ్రహ్మహత్య పాయక వెంటనంటియుండె నట్లొక్కనాఁడు.

## —* భైరవుఁడు వైకుంఠమున కేగుట *—

క॥ వైకుంఠపురికిఁ జనుదుల్, శ్రీకాంతుం డెదురువచ్చి ♦ చేరి చరణనా
ళీకములకు మ్రొక్కిడి ను, శ్లోకముల నుతించి రమను ♦ జూచియిటులనెన్.

మ॥ చెలువా! చూచితె ! దేవదేవుని విభున్ ♦ శీతాంశురేఖాంకురో
జ్జ్వలపింగోరుజటాకలాపమకుటున్ ♦ శశ్వజ్జగన్మండలీ

విలసత్సర్గకలాభిరక్షణలయా ♦ భిప్రేత కేళీపరున్
జ్వలదగ్నిప్రతిమాననున్ ఘనకృపా ♦ శ్లాఘ్యైక చారిత్రునిన్. 99
చ॥ కలికిరో ! ధన్యవైతివిటు ♦ గాలగళుం గని యేను ధన్యుఁడన్
జలజవిలోచనా! యితఁడె ♦ సర్వజగద్రచనాస్పదుండు కా
శలుఁడు విభుండు యోగిహరి ♦ చందన మాత్మ సమస్తభూతకో
టుల కిటువంటి దైవము క ♦ డుం గృపఁ జేకుఱెఁ బున్నె మెంత యో. 100
గీ॥ ఎవనినామముఁ దలఁచిన ♦ నెల్లవారి, కీతనువ్యధలన్నియు ♦ నిగిరిపోవు
అట్టిదేవర తనువొంది ♦ యిట్టుడాసె, రూపమెద్దియు లేకున్న ♦ రూపరివలె.
గీ॥ నళినములఁబోలె నిడుపైన ♦ నాదుకనులు, చెలియరో! యిందు నిందుశ ♦ కలశిరస్కు
హరునిఁగగపండువొందిధ ♦ న్యంబులయ్యె, నహహా! మనదైన భాగ్యమెం ♦ తనఁగవచ్చు.
గీ॥ ఇట్టు లిందిరతోఁ బల్కి ♦ చుట్టువాలు, దొర మహాదేవుఁగనుఁగొని ♦ దోయిలొంది
యడిగెనిది యేమి వేసమో ♦ యభవ! దెల్పు, బిచ్చమేటికిఁ గొనెదిట్లు ♦ ప్రియము మెఱయ.
వ. అనిన భైరవుండు వెన్నునకిట్లనియె.
గీ॥ నలువపంచమమస్తంబు ♦ నఖము చేతఁ, జిదిమివేసితిఁ గావున ♦ శ్రీవిభుండ!
పాపపరిహారమునకిట్లు ♦ వ్రతముఁబూని, తిరుగుచుంటిని సకలది ♦ గ్దేశములను.
వ. అనిన మహేశ్వరుని వచనంబువిని గోవిందుఁడల్లన నగి శిరంబువంచి యిట్లు బలికె
దేవా! ప్రభుండవగునీవెట్లు తలపెట్టిన నట్లొనర్పు మైనను. 105
ఆ॥ నన్నుమాయచేత ♦ నలఁగఁ జేయకు దేవ!, నీదుసెలవుచేత ♦ నేను గల్ప
కల్పమందుఁ బొడమఁ ♦ గాఁ జేయుచుంటిని, బొడ్డుతమ్మి విధిస ♦ ముత్కరముల.
క॥ పొరిఁబొరి మముబోటుల దు, స్తరమగు నీమాయచేతఁ ♦ దద్దయు నొంచన్
హర! యిట్లొనరించెద విది, యెఱిఁగితి నే హృదయమందు ♦ నెసకంబెసఁగన్.
చ॥ విలయదినంబునన్ దొడరి ♦ విశ్వములన్నియుఁ జక్కడంతు వ
వ్వలనున వేల్పులన్ మునుల ♦ బాపలఁబట్టి వధింపకుందువే
బలితపు బ్రహ్మహత్యదవు ♦ పాతక మెందునదూఱు దేవ ! నీ
తలఁపిటుగాక పాపములు ♦ దాకొనునే నిను లోకపావనా ! 108
క॥ కడచిన బ్రహ్మలపునుకలు, బెడఁగుగ నీ కంఠహార ♦ విలసితములివే
కడపితివెట నాదోసము, లుడురాజకలాపరిష్కృ ♦ తోజ్జ్వలమకుటా ! 109
గీ॥ కడఁగి పంచమహాపాత ♦ కములఁ జేసి, యును విభూ! నీదు నామంబు ♦ లను దలంచి
నాశమొనరించు నాపాప ♦ రాశి జనుఁడు, నీకుదోసంబు లెటఁగమ్ము ♦ నీలకంఠ !
క॥ ధన్యుండనైతి నేనును, ధన్యయు నాసిరియు నీదు ♦ దరిసెనమున నా
ధన్యులగు యోగులును నే, మాన్యుని దరిసింపలేక ♦ మఱుగుదు రెదలో. 111
ఆ॥ ఇట్లు పలికి హరుని ♦ యింగిత మారసి, రమకు సన్నసేయఁ ♦ గమలనయనుఁ
డంత లక్ష్మితెచ్చి ♦ యమృతభిక్షాన్నంబు, హరుకరస్థపాత్రి ♦ యందు నిడియె.

వ. అంత మహావిష్ణువు భైరవదేవుని వెనుదగిలియున్న బ్రహ్మహత్యం గాంచి యిట్లనియె.

క॥ ఏటికిఁ బరమేశ్వరుఁ బరి, పాటిగ నిటు వెనుకఁ దగిలి ♦ పరఁగెద వీశ ని
చ్చోటువిడి యెందునేనియు, నీటుగఁ జరియింపుపొమ్ము ♦ నీకిష్టముగన్, 114

వ. అనుడు బ్రహ్మహత్య యిట్లనియె.

క॥ ఇమ్మహచేఁ బరమేశు ము, దమ్మున సేవించుచుంటి ♦ దైత్యాంతక ! నా
కెమ్మెయి హరుదరిసెన మి,ట్లిమ్మెనయుఁ బవిత్రినగుదు ♦ నెంతయు నేనిన్.

వ. అనిచెప్పి యద్దివాయక దేవుని వెన్నాడియే యుండెనంత భగవానుండగు భైరవుండు నారాయణుని ప్రహ్వీభూత భావంబునకుఁ గరంబలరి లక్ష్మీనారాయణుల కభీష్టవరంబులిచ్చి యచ్చోటువదలి యనేక పుణ్యతీర్థంబులను సేవించుచు నొక్కనాఁడు భాగీరథిన్ దాఁటి శ్రీకాశీపురిన్ బ్రవేశించుడు. 116

క॥ కెవ్వననఱచి భయంబున, నవ్వీటఁడి బ్రహ్మహత్య ♦ హా హా యనుచున్
జివ్వనఁ జిలువల దరిఁబడె, నవ్వైధసకర్పరంబు ♦ నవనిన్ బడియెన్.

వ. అంత భైరవుండును మహాహర్షంబున విశ్వేశ్వరుని యనుమతితోఁ గాశీవాసుల కెల్లరక్షకుండై యందుఁగాపురంబుండెఁ గపాలవిమోచనతీర్థంబు దన్నాశ్రయించినవారలకు సకలాఘంబులఁబోఁజిమ్ముచు హరుసమ్మోసంగు నీయుపాఖ్యానంబుఁ జదివిన వినిన సకలాభీష్టంబులు చేకుఱఁగలవనిన మునులు సూతున కిట్లనిరి.

—* శ్రీ శరభావతార లీల *—

క॥ మును గమకప్రముఖులస, త్తనువులయెడ శివుఁడు విష్ణు ♦ దర్ప మణఁచి సాఁ
కినయట్లు వచించితి వ, ఘ్నునచరితం బానుపూర్వి ♦ గాఁ జెపు మనఘా ! 119

గీ॥ అనుడు సూతుఁడు విని వారి♦కనియెఁ దొల్లి, శివుఁడు హరికచ్ఛపాది ప్ర♦సిద్ధభయద
రూపములనిగ్రహించియా♦టోపమణఁచె,నందునృహరివిజయము రు♦చ్యంబువినుఁడు

మ॥ మును మౌనీంద్రుఁడు కశ్యపుండు దితి నే♦ పున్ మీఱు పుత్రద్వయిన్
గనినన్ వార లుదగ్రమూర్తులయి లో♦కగ్రామమున్ వేఁపఁగా
నను మొప్పన్ హరి సూకరాకృతి హిర♦ణ్యాక్షున్ వడిన్ జంపె నం
తన తద్భ్రాత హిరణ్యపూర్వకశిపు♦ద్దండుండు చండాకృతిన్. 121

చ॥ హరిని వధింపనెంచి వన ♦ జాసనుగూరిచి నిష్ఠఁబేర్చి య
త్యురుతరతాపసవ్రతమ ♦ హోన్నతి నెంతయు మెప్పుఁగూర్చి స
త్వర మసమానభూరిబల ♦ వైభవముల్ దగఁజెంది యుల్లస
త్తరభుజవీర్యసంపద ని ♦ తాంతము దిక్కులగెల్చి పెల్చనన్, 122

చ॥ తుది మొద నిష్ఠ విష్ణు నతి ♦ దుర్లభయుద్ధజయిష్ణుఁ గీటడం
తును మునిరాజినిన్ దివిజ ♦ ధూర్వహకోటిని నేటు మీఱి నా
జననికిఁ జిత్తశాంతి నొక ♦ చందమునన్ బొనరింతు నాదు కీ
ర్తిని నలుదిక్కులన్ మిగులఁ ♦ దేజరిలన్ వెలయింతు వ్రేల్మిడిన్. 125

గీ॥ అనుచు వైకుంఠమున కేగి ♦ యబ్జనయను, దఱియఁబోవుడు హరి వాని ♦ దర్పమెఱిఁగి
మఱియొకప్డొ మొఱకుఁ బట్టి ♦ మట్టువెట్టఁ, దలఁచి యగుపట్టకున్న న ♦ ద్దైత్యుఁ డేచి.

గీ॥ భీరువై పాఱిపోయె గో ♦ విందుఁ డెటకొ, యింక నవ్వాని వెదకుట ♦ యేవ మనుచుఁ
జక్కఁ స్వారాజ్యమును గైవ ♦ సంబుఁ జేసి, కొనివసించెను శోణపు ♦ రిని ముదమున.

ఉ॥ మీఁదటఁ గొన్ని నాళ్ళకు న ♦ మేయగుణాఢ్యుఁడు తత్సుతుండు ప్ర
హ్లాదుఁడు విష్ణుభక్తి నన ♦ యంబు ప్రియంబుగఁ జేయ వాని బల్
బాదల పెట్టు నయ్యసుర ♦ పాంసను నంతము సేయ స్తంభమం
దాదట నారసింహతనుఁ ♦ డై వనజాక్షుఁడు దోఁచి యుద్ధతిన్. 126

చ॥ పొగరడఁగన్ హిరణ్యకశి ♦ పున్ వడిఁ బట్టి నిజోరులందుఁ జే
రఁగఁగొని సాంధ్యవేళ నఖ ♦ రప్రతతిన్ హృదయంబు వచ్చి పెన్
బగఁ దెగటార్చె వానిపరి ♦ వారము లొక్కటఁ జుట్టుముట్ట బి
ట్టగు కినుకన్ వధించి భృశ ♦ మార్చె ముఖాగ్నులజ్వాల లొప్పఁగాన్. 127

వ. అంత.

క॥ దుందుభిరవముల ననిమిష, బృందం బొనరించె లోక ♦ భీకరుఁ డగు నా
తుందుడుకు రక్కసుని మృతి, కిం దనిసియుఁ దనయరైరో ♦ గిన్ సురవర్యుల్.

మ॥ అతిలోకంబయి లోకభీనిదు నృహ ♦ ర్యక్షాస్యమున్ గాంచి యా
తతభీతిన్ దవులన్ వసించి రమరుల్ ♦ దాఁ బద్మసంవాస య
ద్భుతమా నాథునిమూర్తిఁ జూచి వెఱచెన్ ♦ భూతార్తి నీక్షించి వా
క్పతిముఖ్యుల్ హరిఁ దేర్పఁబంచిరి వెసన్ ♦ బ్రహ్లాదు భక్తోత్తమున్. 129

క॥ అతఁడును డాసి నృహరికిఁ, బ్రీతిన్ జోతలనుసల్పి ♦ ప్రియసంస్తుతులన్
జేతమున కెక్క సల్పఁగ, శీతలమతిఁ జెంది యా నృ ♦ సింహుం డంతన్. 130

మ॥ తనహస్తంబున భక్తమస్తకమునన్ ♦ దాఁ జేర్చి యాలింగనం
బును సల్పెన్ ముఖపావకార్చులతతుల్ ♦ మున్నున్నయట్లున్నఁ గ
న్గొని సంతోషముఁ జక్కి యుక్కఱ సురల్ ♦ గోడెవ్విధిన్ బాయునం
చొనరన్ శంకరుఁ జేరఁబోయిరి విప ♦ త్త్యుద్రేకవిద్రావణన్. 131

ఆ॥ పరమశివుని యంఘ్రి ♦ సరసీరుహద్వయి, కెఱఁగి లోకసుఖము ♦ నిచ్చగించి
యిట్లు విన్నవించి ♦ రెలమిమై శ్రీమహా, దేవ! దేవదేవ! ♦ దీనపాల! 132

## —* దేవతలు నృసింహమూర్తి శాంతికై శివుని బ్రార్థించుట *—

ఆ॥ పెక్కు తడవ లీవు ♦ వెనుదుఃఖములఁ బాసి, కనికరమున మమ్ముఁ♦గాచితయ్య!
యిపుడు నృహరివక్రికృతి♦కితవునాపాదించి, తొంటియట్ల మనువు♦దురుసునుడిపి.

చ॥ కడలి మథింపఁగా భువన ♦ కాండవినాశనహేతువై కడున్
బొడమినయట్టి క్ష్వేలమునఁ ♦ బొంకమడంగిన మమ్ము నాపదన్
జెడనియటుల్ కృపన్ విసముఁ ♦ జెచ్చెరఁ గంఠమునందుఁ జేర్చి యె
క్కుడుగను సాఁకలేవొకొ య♦కుంఠితశక్తిఁ బ్రపన్నవత్సలా! 134

గీ॥ అనుచు దామోదరోదంత♦మంతమనవి, చేసిశాంతినిఁ గోరు రా♦జీవగర్భ
ముఖ్యులన్ గాంచితద్విధ♦మునకుమనసు, నొచ్చినరహరిగర్వంబుఁ♦బుచ్చఁగడఁగి.

చ॥ తనయుని వీరభద్రుని స♦దన్ దలఁపంగ నతండు దత్క్షణం
బునఁ జనుదెంచి రుద్రునకు ♦ మ్రొక్కి కృతాంజలియై ప్రియంబువన్
వను దలఁపన్ బనేమి భువ♦నప్రభు! వేగనొసంగు మానతిన్
ఘనమగు నీప్రసాదమును ♦ గానఁగఁజేయుమ యీమెడన్ నను౯. 136

## —* శివుఁడు వీరభద్రుని నృసింహ శాంతికై పంపుట *—

క॥ అను వీరభద్రసూక్తుల, విని ప్రేముడి నిట్టులనియె ♦ విశ్వవిభుండీ
యనిమిషుల కకాలంబున, నొనరెను భీ యెంతయేని ♦ యుడుపుము దానిన్.

క॥ నరహర్యనలము మండెడు, దురాపమై దాని నార్చు ♦ దోర్బలమున ముం
దఱ హితమును గఱపు మతం, డరయని చోఁ జూపు మద్భ♦యదభావంబున్.

ఉ॥ కావలుఁడట్టు లీతఁడిటు గానక ♦ క్రిందును మీఁదు మీఱి మో
హావిలచిత్తుఁడై కడిఁది ♦ హుంకృతిఁ జూపుచునున్నవాఁడిఁకన్
దేవతలెల్ల నీ మహిత ♦ తేజముమెచ్చి నుతింపఁగా జగ
చ్ఛ్రీవహ! వీరరాజ! నర♦సింహునిగిట్టి యడంపు హుంకృతిన్. 139

గీ॥ సూక్ష్మమున సూక్ష్మమును నీక ♦ స్థూలతేజ
మునను స్థూలంబు హరియించి ♦ పుత్త్ర! తెమ్ము
నృహరి వక్త్రింబునున్ గృత్తి ♦ నిన్ మదాజ్ఞఁ
గొనుము చనుమన నజ్జేత ♦ కూర్మిమీఱి. 140

చ॥ మురిసి యటుల్ పౌనర్తునని ♦ మ్రొక్కి నిజానుచరోత్కరంబు సం
బరమున నార్వఁగా దనుజ ♦ మర్దనుఁ డున్నెడ కేగుదెంచుచున్
హరి గనియెన్ విపక్షతిమి♦రార్క శతార్కవిభాసమానదు
ర్ధరమహనీయతేజు నతి ♦ దర్పనృసింహసమూహపూజితున్. 141

శా॥ ప్రాద్యద్వీరసహస్రసంయుతు బలో ♦ న్మత్తారివిధ్వంసన
ప్రోద్యద్భైరవగర్జితుఁ జలధర ♦ ప్రోన్నీలగాత్రోజ్జ్వలుఁ
ఖద్యోతేందుహిరణ్యవీర్యనయనుఁ ♦ గ్లాఖండదంష్ట్రాంకురుఁ
సద్యస్కాలజగత్త్రయక్షయకర♦స్ఫారాగ్నిసంకాశునిన్. 142

క॥ పురుహూతధనుఃఖండ, స్ఫురదురుసుభ్రూలతాఢ్యు ♦ శుభ్రశశికలా
పరిశోభితావతంసుఁ, బరికించెను నృహరి యపర♦పరశివమూర్తిన్. 143

మ॥ హరినిన్ డాసి మహేశసూనుఁడు మహా ♦ హ్లాదంబుతో నిట్లనెన్
సరసీజాక్ష! జగంబులన్ మనుప వి ♦ శ్వస్రష్టచే మున్ను నే
ర్పఱుపంగాఁబడినట్లు గాఢకరుణా ♦ పాథోధివై పెక్కుమా
ర్లిరవొప్పంగ విపక్షులన్ గడపి నీ ♦ వీ విశ్వముల్ ప్రోవవే. 144

—* వీరభద్రుఁడు సామోక్తుల నృసింహుని శాంతింపుమనుట *—

సీ॥ అలజలజంబవై ♦ హయశిరస్కునిఁ గూల్చి, పరమేష్ఠి కిడితివి ♦ ప్రాఁబలుకుల
కచ్ఛపమూర్తివై ♦ కవ్వపుగిరి మోచి, యొదవఁ జేసితివి పీ ♦ యూష మబ్ధి
సింగారిపడుచువై ♦ జేజేల కిడితి వా. యమృతంబు రాకాసు ♦ లరిదిఁ జెంద
కిటివై హిరణ్యాక్షుఁ ♦ గెడపి వసుధనురాఁ, బట్టితి వబ్ధిపాల్ ♦ పడఁగనీక

గీ॥ ఇపుడు నరహరిమూర్తివై ♦ యీ హిరణ్య, కశిపుని వధించి సకలలో♦కప్రతతుల
బాలుఁ బ్రహ్లాదు రక్షించి ♦ బాఢకీర్తిఁ, దనరఁ జేసితి వాచంద్ర ♦ తారకముగ.

క॥ శివభక్తుఁడవగు నీకీ, భువి నధికుఁడు లేఁడు లేఁడు ♦ పోలెడువాఁడున్
భువనములకెల్ల నీవె ప్ర, భవుఁడవు ప్రభుఁడవు మహోగ్ర ♦ భావుఁడ వెందున్.

గీ॥ ఎప్పుడెప్పుడీ జగములకు ♦ గొప్పతిప్ప, లుప్పతిల్లునో యరసి నీ♦వప్పుడపుడు
భువి నవతరించి యవ్వానిఁ♦బొలియఁ జేసి, సాఁకుచుందువు ధర్మర ♦ క్షైకచతుర!

ఉ॥ పాతకుఁడౌ దితిప్రసవ ♦ పాంసనుఁ డంతము జెందెఁ దత్సుతుం
డాతురతన్ దొరంగి సుఖ ♦ మందె నిలింపులు చెంది రిష్టముల్
ఖ్యాతిగడించె నీతను విఁ♦కన్ ద్వరగా నుపసంహరింపు ని
ర్భీతిగ నెల్లవారలు పా ♦ రిన్ సుఖయింతు రనంతకాలముల్. 148

క॥ అని యిటుల శాంతముగ నా, డిన వీరుని మృదుపణుతుల ♦ డెందమునం దాఁ
గొనక కఠినోక్తులను రయ, మునఁ బల్కె రదముల బెదరు ♦ పుట్టించు చిటుల్.

క॥ ఎందుండి వచ్చితివో నీ, వందే చరియింపు పొమ్ము ♦ హరితనయా! నా
కిందు హితోక్తుల నుడువకు, డిందఁగఁ జేతును జగముఁ గ♦డింది బలమునన్.

చ॥ జగముల కేను నాయకుఁడ ♦ శాసకుఁడన్ జెఱుతున్ బ్రపంచముల్
మగుడ సృజింతుఁ బెంతు నిఁక ♦ మానుదు నాకొక శాస్త్ర గీస్త్ర వే
ఱుగ నొకఁ డెందు లేఁడు విను ♦ రూఢిగ నాదు ప్రసాదమొంది చ
క్కఁగ సకలమ్ము స్వాస్థ్యమును ♦ గాంచి రహించును నిర్విశంకతన్. 151

క॥ కలిమియుఁ దెలివి విభూతియు, బలమునుగల సర్వవస్తు ♦ వర్గమును మదిన్
దెలియుము మామక తేజో, విలసితమని యెల్లయెడల ♦ విశ్వాతలమునన్. 152

క॥ కర్తను విష్టపకోటికి, భర్తను సకలాబ్జజాండ ♦ పాళికి నింకన్
హర్తను సర్వమున కిటుల్, నేర్తురె లాఁతులు మదీయ ♦ నిపుణత నెఱుఁగన్.

గీ॥ విధులను నిషేధములను వే♦ఱ్వేఱ చూపి, ధరఁబ్రవృత్తి నివృత్తులఁ ♦ దనరఁ జేసి
యీసకలలోకములనెల్ల ♦ నేలుచుందు, నాకుఁ గఱపఁగవచ్చితే ♦ లోకహితము.

ఉ॥ పొక్కిలితమ్మియం దజునిఁ ♦ బుట్టఁగఁ జేసితి నెక్కుడైన యా
చక్కని వేదరాశి నిడి ♦ సర్వజగంబుల సంతరించు నే
ర్పెక్కుడు వేడ్కనిచ్చితి మ ♦ ఱెవ్వఁడు నాకెన ? నే స్వతంత్రుఁడన్
నిక్కమెఱుంగువారు గమ ♦ నింతురు నా యసమానసంపదన్. 155

ఉ॥ కావున సర్వశక్తులకుఁ ♦ గారణమై యలరారు నన్ను నీ
భావమునం దెఱింగి వెడ ♦ పల్కులుమాని నమస్కరించి వే
నీ విపుడేగు మిం దిఁకను ♦ నిల్వకు చేల్వడఁబోకు వీఁకన్
నావుడు వీరభద్రుఁడు మ ♦ నంబున నల్గక పల్కెనిట్టులన్. 156

—* వీరభద్రుఁడు నృసింహునిపైఁ గోపించి భాషించుట *—

చ॥ ఎఱుఁగవె లోకనాయకుని ♦ నెల్లరకున్ హరుఁడైనవాని ని
ట్లఱిముఱి వెఱ్ఱిపల్కులను ♦ నాడుట నీసరివాని కొప్పునే
మఱచితివే మహేశు నస ♦ మానమహామహిమాభిరాము మేల్
తెఱఁగుఁ దలంపు కీడ్వడకు ♦ తెంపరి ! యుద్ధము దంభవాక్యముల్. 157

ఉ॥ నీయవతారముల్ నిలుప ♦ నేరిమిగల్గనె నీకు వీఁకమై
బాయఁగఁ జేయఁడే శివుఁడు ♦ పాయనిదర్పమెసంగు వాని నీ
వాయెడరున్ దలంపవిపు ♦ డాయతదుఃఖము దారసిల్లె నే
సాయమొనర్ప వచ్చితిని ♦ స్వాంతమునందుఁ దలంపు నానుడుల్. 158

చ॥ ప్రకృతివి నీవు పూరుఁషుడు ♦ భర్గుడు నీయెడ వీర్యముంపఁదా
వకమగు నాభిపద్మమున ♦ బ్రహ్మజనించెను లోకసృష్టికా
తుకమున నాతఁడున్ దపసు ♦ ధూర్జటిఁగూర్చి యొనర్పఁ బద్మజా
లికమున నుద్భవించె నిజ ♦ లీలఁదనర్పఁగఁ జంద్రమౌళియున్. 159

ఉ॥ ఆహరుఁ డిప్డు నిన్నుఁ దెగ ♦ టార్పఁగఁ బంచెను లోకరక్షకై
మోహరి! మంచిమాటలకు ♦ నొప్పిన మే లటుగాక యుండినన్
దాహము చేసెదన్ నిను ని♦తాంతరుషాయత వహ్నికీలలన్
మోహమునొంది వాజ్ఞనద♦ముల్ పొనరించిన నొవ్వనే యిటుల్. 160

క॥ నీకూర్మకపాలంబుల, నీకిటిదంష్ట్రలను జేర్మి ♦ నీలగళుఁడు దాఁ
జేకొని ధరించు నిపుడును, శ్రీకాంతా! మఱచెదేల ♦ చింతింపు మెదన్. 161

మ॥ ప్రతిహారంబున నీనృసింహశిరమున్ ♦ ప్రస్ఫారరత్నంబుగాఁ
గుతుకంబొప్పఁగఁ జేర్చి కంఠమున ను♦గ్రుం డింపుమైఁదాల్చె నీ
సుతుఁడౌ బ్రహ్మ శిరంబుఁ ద్రుంచి దురిత ♦ క్షోభంబుఁ బోకార్చె ని
ట్లతిదర్పం బిది యేల నీకు నృహరీ! ♦ యజ్ఞాతతత్త్వాత్మతన్. 162

క॥ ఉపకారము సాధులయెడ, నుపయోగించునెడఁ జక్క ♦ నొప్పఁ గరంబా
యుపకారం బన్యులయెడ, నపకారముగాఁగమాఱు ♦ నరయుము నృహరీ!

క॥ కావిఁకఁ గర్తవు భర్తవు, గావు హరీ! హర్తవెపుడు ♦ గావు దెలియుమీ
యేవలనరయక పల్కితి, వీవు స్వతంత్రుఁడవుగా వి♦కెం దేనియునున్. 164

క॥ కుమ్మరిచక్రమ్మట్టుల, నమ్మన్మథహరుని యిచ్ఛ ♦ నఖిలాకృతులన్
గిమ్మనక యవతరించుదు, విమ్మహి నరకేసరీ! మ♦హేశవశుఁడవై. 165

ఆ॥ దక్షయజ్ఞమందుఁ ♦ దావకోద్ధతిని నేఁ, జూచినాఁడ నీవు ♦ చూడలేదె?
పద్మనయన! యనిని ♦ బాసిపోవఁగ లేదె, యేలయెఱఁగియెఱఁగి♦యిట్లు దొడర.

గీ॥ తామసుఁడవౌట మున్నిట ♦ దందశూక, తల్పమందెప్డు గాఢ ని♦ద్రావశుండ
వగుచునుందువుపరమాత్మ♦నరయవరిని,బర్హాణమునఁ బ్రాపౌనీకుఁ♦బరమశివుఁడు.

ఆ॥ చక్రపాణి! నీవు♦చక్రమెవ్వరిచేతఁ, బడసినావొ! యట్టి ♦ పరమశివుని
మఱచి యిట్టులాడ ♦ మరియాదౌనో! చద్ది, తిన్న రేవు మఱచి ♦ తెగడనగునె!

క॥ మున్ను దధీచిమునీంద్రుఁడు, సన్నుతుఁడు మహేశభక్త♦సత్తముఁ డాజిన్
నిన్నమరులతో గెల్చెను, బన్నము చెందితివి నాఁటి ♦ పస యెఱుఁగ వెదన్.

చ॥ విభుఁ డఖిలేశ్వరేశ్వరుఁడు ♦ విశ్వనిదానుఁడు సర్వశాసకుం
డభవుఁ డనంతవిక్రముఁడు ♦ హంత హిరణ్మయమూర్తి దుస్సహ
ప్రభుఁడు స్వతంత్రుఁ డక్షరుఁడు ♦ భైరవసాళువ దివ్యరూపుఁ డా
విభునివిధం బెదన్ దెలిసి ♦ పంకజలోచన! శాంతిఁ జెందుమా! 170

క॥ లేకున్న మహాభైరవు, ఢాకకు గురియగుదు విపు డి♦ట్లదత్క్రోధా
ఖ్యాకంబగు మృత్యువు నీ, పైకుఱికి హరించు వినుము♦పవి ద్రుమము నటుల్.

## —* శరభావిర్భావము *—

మ॥ అన నంతన్ విని యన్నిశాచరహరుం ♦ డత్యంతరుష్టాత్ముఁడై
ఘనరోషంబున మించి యమ్మునిని వేఁ ♦ కన్ బట్టి గీటార్పఁబూ
న్కని నెన్తాండెనో యన్ని మేషమున నిం ♦ గిన్ గోటితీక్ష్ణాంశుసం
జనితానూనమహాస్రముత్కరము లు ♦ చ్చైర్భంగి శోభిల్లఁగాన్. 172

ఉ॥ కాదది సౌర మగ్నిజము ♦ కాదు సుధాకరమూర్తిజంబునున్
గాదు తటిత్ప్రభూతమును ♦ గాదు మహాభరితాంబరాజమున్
గా దుపమానవర్జితము ♦ గాలహరాజము సర్వతేజముల్
పాదుగ నందడంగి కను ♦ పట్టెఁ గడున్ గడు ఘోరరూపమై. 173

గీ॥ అంత వేలుపు లెంతయు ♦ నక్కజముగఁ జూచుచుండఁగ వ్యక్తమై ♦ తోఁచె బరమ
శివుని సంహారతనువు జే ♦ జేలు జయజ, యధ్వనులు చేసి రెక్కుడు ♦ హర్షమునను.
వ. అంత. 174

*సీ॥ వేలకుమించిన ♦ వెలయు హస్తములందు, వివిధాయుధంబులు ♦ విస్తరిలఁగ
విరివిమీఱిన జటా ♦ విసరమధ్యంబునఁ, దరుణేందు శేఖరం ♦ బుఱవు దనర
కడు బలిష్ఠంబయి ♦ కాలెడు తనువున, ఱెక్కలునున్ జంచు ♦ వుక్కునిగుడ
పదునాఱువన్నెల ♦ బంగారుకన్నను, మిన్నయై యలరారు ♦ వన్నెమెఱయ

---

* శివపురాణే శతరుద్రసంహితాయాం ద్వాదశాధ్యాయే—

సహస్రబాహుర్జటిల । శ్చన్ద్రార్ధ కృతశేఖరః । సమృద్ధోగ్రశరీరేణ । పక్షాభ్యాం చంచునా ద్విజః । అతితీక్ష్ణో మహాదంష్ట్రో । వజ్రతుల్య నఖాయుధః । కంఠే కాలో మహాబాహు । శ్చతుష్పాద్వహ్ని సన్నిభః । యుగాన్తోద్యతజీమూత । భీమగంభీరనిస్వనః । మహాకుపిత కృత్యాగ్ని । ర్వ్యావృత్త నయనత్రయః । స్పష్టదంష్ట్రాధరోష్ఠశ్చ । హుంకార సహితో హరః । ఈదృగ్విధ స్వరూపశ్చ । హ్యగ్ర ఆవిర్బభూవహ హరస్సద్దర్శనాదేవ । వినష్ట బలవిక్రమః । బిభ్రద్ధామ సహస్రాంశో । రథః ఖద్యోత విభ్రమం । అథ విభ్రమ్య పక్షాభ్యాం । నాభిపాదాన్విదారయన్ । పాదాన్బబంధ పుచ్ఛేన । బాహుభ్యాం బాహుమండలం । భిన్దన్నురసి బాహుభ్యాం । న్నిజగ్రాహ హరోహరిం । తతో జుగ్మశ్చ గగన । ద్దేవాన్సహమహర్షిభిః । సహసైవా భయాదీక్షం । సహిశ్యేన ఇవోరగం । ఉత్క్షిప్యోత్క్షిప్య సంగృహ్య । నిపాత్య చనిపత్యచ । ఉడ్డీయోడ్డీయ భగవాన్ । పక్షఘాత విమోహితం । హరింహర స్సంవృషభం । వినేశానన్త ఈశ్వరః । అనుయాన్తం సురాస్సర్వే । నమో వాక్యేన తుష్టువుః । ప్రణేముస్సాదరం ప్రీత్యా । బ్రహ్మాద్యాశ్చ మునీశ్వరాః । నీయమానః పరవశం । దీనవక్త్రః కృతాంజలిః । తుష్టావ పరమేశానం । హరిస్తం లలితాక్షరైః । నామ్నామష్ట శతేనైవ । స్తుత్వాతం మృడమేవచ । పునశ్చ ప్రార్థయామాస । నృసింహశ్శరభేశ్వరం । యదా యదా మమాజ్ఞేయం । మతిస్స్యాద్గర్వదూషితా । తదాతదా పనేతవ్యా । త్వయైవ పరమేశ్వర॥

నందీశ్వర ఉవాచ॥ ఏవం విజ్ఞాపయన్ప్రీత్యా । శంకరం నరకేసరీ । నత్యాశక్తో భవద్విష్ణు । ర్జీవితాంత పరాజితః । తద్వక్త్రం శేషగాత్రాన్తం । కృత్వా సర్వస్వవిగ్రహం । శక్తియుక్తం తదీయాంగం । వీరభద్రో ఉహారత్తదా॥ నందీశ్వర ఉవాచ॥ అథ బ్రహ్మాదయో దేవా । శ్శరభం మావమాస్థితం । తుష్టువుః శంకరం దేవం । సర్వలోకైక శంకరం॥

గీ॥ వజ్రములఁబోలునఖములు♦వాసి నెసఁగ, మిగులఁదీక్ష్ణంపుదంష్ట్రలు♦బుగులుగొలుప
నలుకరయొలికెడు నేత్రత్రయంబు వెలయఁ, గంఠమున మేచకచ్ఛాయ♦గడలుకొనఁగ.

సీ॥ ప్రళయకాలానల♦ప్రతిభటద్యుతులు చూ, డ్కుల కెంతయేని సం♦కోచ మొదవ
కల్పాంతజీమూత ♦గాఢభయదనాద, హుంకారశబ్దంబు ♦ జంకునొసఁగ
స్పష్ట దంష్ట్రాధరో ♦ ష్ఠం బైన వక్త్రంబు, బ్రహ్మాండకబళన ♦ ప్రౌఢిఁ దెలుప
అతినిష్ఠురములైన ♦ యష్టపాదంబులు, హరిదష్ట దేశంబు ♦ లాక్రమింప

గీ॥ బొమలముడితోడ నొప్పు వి♦స్ఫూర్జదుగ్ర, మన్యుభరదీప్తదృష్టుల♦మంటలెగయ
నృహరిదర్పంబు శూన్యమై♦నేలకొదుగ, శరభమూర్తి గనంబడె ♦ సత్వరమున:

క॥ హరి తద్దర్శనముననే, కరమరుదుగ బలము సడలి ♦ గగ్గోల్పడి భా
స్కరఖద్యోతములకువలె, తరమెఱఁగి నిజాస్త్రమయము ♦ తప్పదనుకొనెన్.

మ॥ శరభేశానుఁడు విక్రమించి నిజప♦క్షద్వంద్వఘాతంబునన్
హరినాభ్యంఘ్రులఁ జీల్చి పుచ్ఛమున జం ♦ ఘాంకంబులంగట్టి బం
ధురహస్తావళితోడఁ దద్భుజములన్ ♦ నొప్పించుచున్ బట్టి దు
ర్ధరపౌనర్భవధార వక్షమున వి ♦ స్తారంబుగా వచ్చుచున్. 178

క॥ శ్యేనము పన్నగమునుబలెఁ, దా నరహరి నొడిసి మిన్ను ♦ దఱిసి బహువిధో
డ్డీననిపాతశతంబులఁ బ్రాణాంతదశన్ బొనర్చె ♦ పటుదర్పమునన్. 179

—✱ నృసింహావతార శాంతి ✱—

గీ॥ హరికిసమ్మోహముడిపి శాం♦తాత్మకునిగ, హరుఁడొనర్చెనుబ్రహ్మాది♦సురలుమురిసి
యాదరంబున లలితాక్ష♦రాళి నిట్లు, ధ్యానమొనరించి యలరించి♦రామహేశు.

క॥ హర! సంసారభయంబుల, హరియించుటఁజేసి హరుఁడ ♦ వైతివి మఱియున్
హరినిపుడు నిగ్రహించుట, హరిహరుఁడవటంచుఁ బరఁగె ♦ దయ్యా! మహాత్మా!

వ. మఱియును

సీ॥ అష్టమూర్తులచేత ♦ నఖిలప్రపంచంబు, విభజించి ధరియించి ♦ వెలసినావు
కష్టంబులొంది స్రు♦క్కఁగఁగాంచి మమ్ముఁగ, టాక్షించి ప్రేమించి ♦ యేలినావు
పంచకృత్యముల నే♦ర్పఱచి రచించుచు, సరియొక్కరుఁడు లేక ♦ సాఁకినావు
సచ్చిదానంద ల♦క్షణుఁడవై ఘనుఁడవై, నిర్వికారుండవై ♦ నెగడినావు

గీ॥ సత్యరూప! ప్రభూ! ప్రాజ్ఞ! ♦ సన్నిధాన!, విబుధనాయక! విశ్వేశ! ♦ వేదవేద్య!
దీనబంధూ! దయాసింధు!♦ధృతనవేందు, శరభమూర్తి! నళినజాండ ♦ చక్రవర్తి!

క॥ కమలాక్ష కమలజన్మ, ప్రముఖామరవరుల మునులఁ ♦ బశుపతి! నీవే
క్రమము మెయి సృష్టిచేసితి, వమితతపోదృశ్యభాస్వ ♦ రాయత తేజా! 183

వ. అంత నరహరియును

మ॥ విరిసెన్ మోహమహాంధకారము లస ♦ ద్విజ్ఞానభానూదయం
బనుసంబొప్పఁగఁ జేసిరెన్ శుభము సం ♦ ప్రాప్తించె దేవేశ! ముం
దఱ నెప్డేనియు మోహమిట్లు పొసఁగన్ ♦ దచ్ఛాంతిఁ గావించి సు
స్థిరకారుణ్యము నాపయిన్ బరపుమా ♦ చేమోడ్పుఁ గావించెదన్. 183

చ॥ అన విని శంకరుండు గడు ♦ హర్షమునొంది నృసింహ! నీవు నా
పనుపున దైత్యులన్ జదిపి ♦ పాలనసేతువు లోకరాజి జీ
వననిధియందు జీవనము ♦ వైఖరి నాయెడఁ జెందియుండు విం
కను యశమొందు మక్షయము ♦ గా నరవిందదళాయతేక్షణా! 185

వ, అంత వీరభద్రుండు శివాజ్ఞన్ జేసి హరి యభీష్టపరికారంబు గడంగి. 186

ఆ॥ నట్టులేక వేగ ♦ నరకేసరి శిరంబుఁ, గత్తిఁ బెఱికి నఱికి ♦ కృత్తి నొలిచి
హారునకొసఁగె శ్రీశుఁ ♦ డానరహరి తను, వంతఁ బాసి నీర ♦ జాక్షుఁడయ్యె.

వ. అనంతరంబు శివుఁడు నృసింహకృత్తిధరుండై తదీయరుండమాలాభూషితుండై నిజగణంబులుగొల్వ రాజతాద్రిన్ జేరె, వనజాక్షుండును దక్కిన సురవర్యులెల్లరు జగచ్ఛాంతి కలరి శివుని వినుతింపుచుఁ దమ స్థానంబుల కేగిరి. 188

గీ॥ శారభచరిత్రమీయది ♦ చదువవినిన, భయములను బాపు నపమృత్యు ♦ బాధమాన్పు
వ్యాధులనుగొట్టు శత్రుసం ♦ హతులగిట్టు, సకలసుఖములఁ జేకూర్చి ♦ సాఁకువినుఁడు.

క॥ మఱియును భూకంపాదులఁ, గరవృష్ట్యల్పాతివృష్టి ♦ కష్టంబులయం
దురువాలోల్కాపాతము, లరహిఁ జదివి రేనియును దొ ♦ లఁగు నవ్వి వెసన్.

సీ॥ ఇఁకఁ జతుర్దశి నష్టమి ♦ నీశ్వరోత్స, వముల శివలింగ సంస్థాప ♦ నముల నీమ
హాచరిత మెవ్వఁడేని పా ♦ రాయణంబొ, నర్ప శివసన్నిధానము ♦ నర్దనర్చు.

—* యక్షేశ్వర లీల *—

ఉ॥ మున్ను సుధార్థులై సురలుఁ ♦ బుణ్యజనుల్ గలశార్ణవంబు న
త్యున్నతితో మథింపఁదొలి ♦ నుద్భవమయ్యె మహావిషంబు దా
నన్నిటిఁ బాసి కీడ్పడి పి ♦ నాకధరున్ శివుఁ జేరి మ్రొక్కి యా
పన్నులమైతి మీవిసముఁ ♦ బాపి మమున్ బ్రదికింపు మీశ్వరా! 192

క॥ ఇంచుకనీవిఁక జాగొన, రించినఁ జచ్చెదము చంద్ర ♦ రేఖామకుటా!
కాంచి జగమ్ముల యలమటఁ, గొంచక వేగిరము ప్రోవు ♦ గోపతినాథా! 193

చ॥ అని యరవిందలోచనము ♦ ఖామరులెల్లరు రక్కసుల్ మునుల్
వనరుచుఁ దన్నువేడ నత ♦ వత్సలుఁడా శివుఁ డవ్విసంబుఁ జే
కొని వడిమ్రింగి కంఠమునఁ ♦ గూరిమిమై ధరియించె నంత వే
దనవిడి వారు శంకరు నుఁ ♦ దారుఁ గడున్ గొనియాడిరున్నతిన్. 194

ఆ॥ గరిమ నలుతనిట్లు ♦ కాలకూటముఁదాల్చి, కడఁగి శివుఁడు నీల ♦ కంఠుఁడగుడు
నీలకంఠ! యనుచు ♦ నేర్పునఁ బిలిచిరి, పరమమునులు సురలు ♦ బరమశివుని.

గీ॥ పాలసంద్రంబుమరల జే♦జేలు రక్కసులును జేరి మథింపఁగా ♦ సురభి వెల్ల
యేన్గు శ్రీదేవి యచ్చర ♦ లిగురుఁబోండ్లు, నిక్కువీనులజక్కి జ♦నించెనందు.

క॥ హరి శ్రీదేవిని గొనియెన్, సురపతి గొనె వెల్లయేన్గు ♦ సురభినిగొని రా
దరమున మునులిక జక్కిని, మురియుచు బలిదనుజుఁడొందె ♦ భూరిప్రీతిన్. 197

వ. ఇఁకనచ్చరలు స్వర్గావాసలై.

క॥ బిసరుహనేత్రిలు దృక్కుల, మిసమిసలఁ బిసాళిమేల్మి ♦ మేనుల తళుకుం
బసల దివిజాత్మముల సం, తసపెట్టుచు నుండిరెంతో ♦ తనియఁగ వారల్. 198

గీ॥ అంత నమృతఘటం బుద♦యంబునొందె, శ్రీపతియనుగ్రహమున జే♦జేలు ద్రావి
రసురులెల్లరుఁగనుచుండి♦రందునొక్క, రాహువునుద్రావె దేవవ♦ర్గమునదూఱి.

చ॥ చందురు కన్నుసన్న హరి ♦ చక్రముతోఁ దలఁదుంచె వాని నా
తుందుడుకందు మ్రిందకయె ♦ తుండము మొండెము నిద్దఱైరి యీ
పొంది సుధాకరున్ రవిని ♦ నుక్కుఱఁబట్టి గ్రసించుచుండ్రు ద
క్కందఱు రక్కసుల్ వనరి ♦ యాతురులై కడుఁ గద్దుమంటచే. 201

వ. ఆయుధంబులన్ ధరియించి సురలతో డీకొని పోరితెమ్మొనరింపుడు.

క॥ శ్రీవిభుని సాయముండుట, దైవతనాయకులు సుధను ♦ త్రాగుటచే సు
శ్రీవిక్రమమున దైతే, యావళి నోడింపఁబఱచి ♦ రహింపద మసురుల్. 202

గీ॥ దానవెంతేనిగరువంబుఁ♦బూనిసురలు, మిన్నుచూచుచుఁబెచ్చుగ♦మెలఁగుచున్న
గాంచియుడురాజమౌళియు♦క్కసటుఁదీర్ప, నొక్కనాఁడొక్కయక్షురూ♦పొందివేగ.

ఉత్సాహ: పసిఁడిమలకుఁజేరి యట సు ♦ పర్వవితతి గన్గొనన్
బసమెయి న్నిలింపు లెంతో ♦ ప్రౌఢగర్వ మేర్పడన్
బిసరుహాక్షుతోడఁ గూడి ♦ బింకముల్ గదుర్ జవం
బెసఁగఁగొట్టుచున్న డాసి ♦ యిట్టులనియె యక్షుఁడున్. 204

క॥ ఏమిది పదరెద రింతకు, నేమియొనర్చితిరి సెప్పఁ♦డీ నాకన సు
త్రామముఖు లనిరి యక్షున, కీమాడ్కి నహమికఁ బెద్ద ♦ మెలుఁగేర్పడఁగాన్.

చ॥ కడలి మథించి శ్రీరమను ♦ గల్పకభూజముఁ గామధేనువున్
బెడఁగగు నశ్వరత్నమును ♦ వెల్లనియేనిక మానికంబులన్
కడుఁగృశమైన నెన్నడుము ♦ కల్కిచనుంగవ లొప్పు చెల్వలన్
గుడుచుటకున్ సుధాఘటముఁ ♦ గొంటిమి యీహరి యేము నున్నతిన్. 206

చ॥ పలలము మెక్కుసట్టియల ♦ బాలిశులోర్వక మమ్మెదిర్చినన్
జలమునఁ బట్టిచంపితిమి ♦ చక్కనియుక్కది లేక రక్కసుల్
పొలిసిరి కొందఱింక వెఱ♦వున్ గొని పాఱిరి యారగాలయం
బిలనిఁక మమ్మెదుర్పటకు ♦ నెవ్వరు చాలుదురన్న నాతఁడున్. 207

గీ॥ సరిమె యటులైన నంతకుఁ♦జాలువార, లైన నొకనుడి వినుఁడు మీ♦రధికబలులు
పూన్కిఁ గాంచి కదల్పుఁడీ♦పూరిరెమ్మ, ననుచు నొకతృణముంచెఁ ద♦దగ్రమందు.

—* దేవతలు గడ్డిపరకను గదల్పలేకపోవుట *—

వ. అంత నవ్వారద్దిగాంచి గరువంబున నూర్పునను ముఖపవనంబునను చేతులనాయుధంబుల మహాస్త్రంబులఁ గదల్పలేక యాకులపాటుఁ జెంది వెకలులై తడఁబడి యుక్కుఁ బాసి గ్రుక్కిళ్ళు మ్రింగుచున్నం గాంచి యంబరవాణి పెద్దయెలుంగుతో నిట్టులనియె. 209

ఉ॥ మోసముఁ జెందినారిటులు ♦ ముగ్ధశశాంకధరుండె యక్షుఁడ
వేసముఁ జూచి మోసపడి ♦ వీఁడెఁడులై తిరిఁకన్ దలంపుఁడీ
భాసిలు లోకపుంజములఁ ♦ బాయకసల్పియు సాఁకి మల్పునా
యీసరుఁడంచుఁ జిత్తముల ♦ నెంతయు నేనియు దేవనాయకుల్ ! 210

క॥ అని యుపదేశించిన వా, రనువుగ నపు డరసి వేగ ♦ యక్షేశ్వరపా
వనచరణములకు మ్రొక్కిడి, ఘనముగ నుతియించి రిట్లు♦కరుణాంచితులై.

చ॥ ఎఱుఁగక గోతిలోఁ బడితి ♦ మీశ్వర ! తప్పు సహింపు మిప్పు డం
దఱమదమున్ హరించి విత♦తంబగు నీదు ననుగ్రహంబు సం
బరమును జెందఁజేసితివి ♦ పల్మఱు నీయెదుటన్ బ్రగల్భముల్
బఱపితి మన్ని యోర్వఁదగుఁ ♦ బాలకపాలక ! సర్వశాసకా! 212

గీ॥ సర్వమునకీవె కర్తవు♦సర్వశక్తు, లకుఁ బ్రవర్తకుఁడవు నీవ !♦ ర్తకుఁడ వెందు
అద్వయంబగుపరమాత్మ♦వయ్యా! నీవు, నిన్నుఁ దెలియఁగఁ గలమె? మ♦న్నింపుమింకను.

క॥ అని వినుతించిన శర్వుఁడు, వనజాక్షప్రముఖదివ్య♦వర్గమునకు బో
ధనఁ జేసి వినయపద్ధతిఁ, జనియెన్ గైలాసమునకుఁ ♦ జయ్యన నంతన్. 214

గీ॥ ఎవ్వఁడేనియు నీలీల ♦ నెంతయేని, భక్తిఁ జదివిన నవ్వాఁడు ♦ పాపజాల
మెడసి యిష్టార్థములఁ జెందు♦నింకనుఁ బరమ, శివుని దివ్యప్రసాదంబుఁ♦జేకొనునిల.

వ. ఇట్లు యక్షేశ్వరలీల నెఱింగించితి నింక దుర్వాసోమున్యవతార లీల నుపన్యసింతు వినుండని సూతుండు మునుల కిట్లనియె. 216

—* దుర్వాసోమున్యవతారలీల *—

క॥ అత్రియను నొక్కముని వై, ధాత్రుఁడు బుధమిత్రుఁ డిద్ధ♦తరభాసురచా
రిత్రుఁడు సద్గుణమణిగణ, పాత్రుం డనసూయనాఁగ ♦ బఱఁతి యుఁదాన్.

గీ॥ పుత్రసంతానరతులై త్రి♦మూర్తులను మ, దిన్ భజించుచు నిర్వింధ్య♦తీరమందుఁ
దపసొనర్చిరి నూఱేండ్లు ♦ తాపవేద,నన్ గలంగి జగంబులు♦నలతఁ జెంద. 218

క॥ ఆరసి వారలతపసును, నీరజభవ నీరజాక్ష ♦ నీలగళులువే
తారసిలి వరములిచ్చిరి, వారికిఁగొమరులయి తమరు ♦ ప్రభవించునటుల్.

గీ॥ అజుఁడు జాబిల్లియై దాన♦వాంతకుండు, దత్తుఁడై కృత్తివాసుండు♦తాపసేంద్రుఁ
డైనదూర్వాసుఁడై వారి♦యాత్మజులుగఁ, బొడమిరెంతయునున్నతి♦పొల్పమీఱ.

వ. ఆ మువ్వురయందు దూర్వాసుండు మిగుల తపోధనుండై శిష్యులఁ గూడికొని మేదినిం బుణ్యతీర్థస్థలంబులఁ గ్రుమ్మరుచు నొక్కనాఁడు ద్వారకాపురి కేగి శ్రీకృష్ణుచే సత్కారంబు లొంది తన్మందిరంబునఁ గొన్నినాళ్ళు వసించె. శౌరియును మిగులఁ గోపనుండగు నా తాపసునకు విధేయుండై యాతిథ్యంబు నెఱవేర్చుచుండె. ముని యొక్కనాఁడు పెక్కుసహస్రంబుల వారి యన్నంబుఁ దానొక్కఁడే మెక్కుచుండు. మఱియొక్కపు డత్యల్పముగ భుజించుచుండు. కారణంబు లేక వికవిక నవ్వుచుండు నట్టులేమిన్నక యేడ్చుచుండు నిట్లు శ్రీకృష్ణావసథంబందు మెలంగుచు నొక్కనాఁడు కృష్ణుని శయ్యాస్తరణంబులఁ గాల్చి యలంకృతలైన గట్టువాలుకన్నెల వాతలఁ బెట్టి యలయించి కృష్ణుఁ జేరి పాయసంబుఁ దినియెద వండింపు మనుడు. 221

క॥ శౌరియుఁ బాయసమును గోక్షీరంబున వండఁజేసి ♦ చెలువుగ దానిన్
సారతర భక్ష్యములనున్, భూరితరాన్నోదకముల ♦ మునిపతికొసఁగెన్. 222

వ. అంత నమ్మునీశ్వరుండును.

ఆ॥ వేఁడి పాయసమును ♦ వేగ భుజించి శే, షించినట్టిదాని ♦ క్షిప్రముగను
దనువునంతఁ బూసి♦కొనుము కృష్ణా! యన, నతఁడు నొండుదలఁప ♦ కట్లుచేసె.

వ. మఱియు శ్రీకృష్ణుండు భక్తితో మునిప్రసాద మ్మొక్కపాదంబులందుఁ దక్క తక్కిన శిరోముఖ్యాంగంబులందు లేపనం బొనరించుకొనియె నంత మునియును ప్రత్యగ్రపుష్పలతికన్ బోలియుల్లసిల్లు కృష్ణాగ్రపత్నిని రుక్మిణిన్ జూచి. 224

గీ॥ ఇఁకను మిగిలినపాయస♦మెత్తి తెచ్చి, యాపెయొడలునఁబూసి ర♦యమున నా మెఁ
బట్టియొక తేరికింగట్టి ♦ బరవసమున, నెక్కి యూరేగె యాదవు ♦ లెల్లరుఁ గన.

క॥ మఱియును గృష్ణుఁడు గనఁగాఁ, గొరడాతో నొక్కదెబ్బఁ ♦ గోమలి నేసెన్
బరికించుచుండి హరి త, త్తఱ మొక్కింతేని గొనఁడు ♦ తాలిమిబల్మిన్. 226

క॥ పెఱయాదవు లప్పట్టున, హరియౌదాసీన్యమును శ ♦ తాత్ముఁడగు మునీ
శ్వరు విధముఁగని కినుకలోఁ, గొఱగొఱలాడంగ నుడిపె ♦ గోవిందుఁడొగిన్.

గీ॥ మునియునట్టులెరథ మెక్కి♦పురము నెల్లఁ, బరుగులోఁదిరుచుండఁగఁ♦బథమునందు
నొక్కయెడ రుక్మిణీసతి♦యుక్కుమాలి, వ్రాలి నమ్మునిఁ గశతోడ♦బాదె మరల.

వ. కృష్ణుండు వీక్షించి మనంబునం దెఱియక యవ్వారితో నడచుచుండె నంతఁ దాపసుండు క్రుద్ధుండై యరదంబు డిగ్గి పదాతియై గినియుచు వడివడిఁ దెన్ను మాలి పోవుచుండఁ గృష్ణుం డెదురుపోయి మ్రొక్కి నిలిచి మహాత్మా! యనుగ్రహింపు మనుగ్రహింపుమని వేడుటఁ జూచి తేజస్వియగు నమ్మహాత్ముండు ప్రహర్షితుండై శ్రీకృష్ణున కిట్లనియె.

## —* దూర్వాసుఁడు శ్రీకృష్ణునకు వరము లిచ్చుట *—

చ॥ గెలిచితివయ్య! కోపము నొగిఁ బురుషోత్తమ! సుంతతప్పు నీ
వలన నెఱుంగ సంతసము ♦ వాటిలెఁ గోరుమిఁకన్ వరంబులన్
గలిమిదనర్ప నిచ్చెదను ♦ గ్రచ్చఱ నెట్టివియైనఁ జూడు నా
బలితపు వైభవమ్మెపుడు ♦ పాయక సేయు మహార్ధసిద్ధులన్. 230

ఉ॥ ఓదనమందుఁ బ్రాణులకు ♦ నొప్పెడు నెట్లు జగంబునందు నా
మోదము నీయెడన్ దనరు ♦ భూరిగ నట్లులఁ బుణ్యమౌ యశం
బేదుము నీ త్రిలోకముల ♦ నెల్లను నున్నతిగందు వెంతయే
నాదరపాత్రమౌదువు జ♦నార్దన! సర్వజగద్విభూషణా! 231

ఉ॥ నీనిలయంబునం దిఁకను ♦ నే దహియించిన సర్వవస్తువుల్
మానుగఁ దొంటియట్లమరు ♦ మాధవ! యింకను మత్ప్రసాదమున్
బూనిక నెందునెందునను ♦ బూసితివో యట మిత్తిగల్ల ది
ట్లీ నెఱిఁదప్పి పాదముల ♦ నేలొకొ పూయవు మెచ్చనేనటుల్. 232

క॥ అనినంతఁ గృష్ణుఁడును దన, తనువున్ బరికింప నదియుఁ ♦ దద్దయు తేజో
ఘనమైయుండుటఁగనుగొని, మనమున నక్కజముఁజెందె♦మఱియున్ మఱియున్.

గీ॥ మౌనిరుక్మిణినిన్ జూచి♦మానినీమ, ణిరో! మగువలందుఁగడుఁగీర్తి♦నెగడఁగలవు
జరయు రుజయును నీకెప్డు♦దొరయవమ్మ!, పుణ్యగంధమై దేహంబు♦పొలుచునీకు.

క॥ పదునాఱువేలుమించిన, ముదితలు నీసవతులందు ♦ మురువొప్పెదు వ
మ్మ! దయితుఁడీహరియునుగడు,ముదముననుఁగొనెడునిన్నుఁ♦బూర్ణేందుముఖీ!

క॥ అనియిట్టుల వరములను నిడి, ఘనుఁ డమ్మునినాథుఁడంతఁ ♦ గదలెయథేచ్ఛన్
జనియెను హరియును రుక్మిణి, యును భవనమ్మునకుఁ జనిరి♦యుత్సాహమునన్.

గీ॥ అందుముని దహియించిన♦యఖిలవస్తు, వులును దొల్లింటికన్న సొం♦పుగఁగనుపడ
మమలఁగడు నచ్చెరువుఁజెంది♦మౌనివరుని, శక్తినెంతయుఁబొగడిరి♦సంతసమున.

వ. ఇట్లు దూర్వాసుండు పుడమి ననేకులన్ బరీక్షించి యభీష్టవరంబులిచ్చె. కుంతి భోజునింటఁ గన్నియయై యున్నపు డమ్మహాత్ముం డామె పరిచర్యలకు మెచ్చి

సిద్ధిమంత్రంబొసంగె, మఱియుఁ బాండవధర్మపత్నియగు ద్రోపది కభీష్టవరంబు లిచ్చె. ఇట్లు మహాతపోధనుండును మునికులాగ్రగణ్యుండును నగు దుర్వాసో మునిచరిత్రంబుఁ జెప్పితినిఁక హనుమదవతారలీలఁ గుఱించి యించుక ముచ్చటించెద వినుండని సూతుండు మునులకిట్లనియె. 239

## — హనుమదవతార లీల * —

క॥ తొల్లి శివవీర్యమునుగొని, యల్ల మహాబలుఁడు రమణి ♦ యా నంజనియం
దుల్లంబలరఁగఁ జేర్పఁగఁ, బ్రోల్లసదతిబలుఁడు హనుమఁ ♦ దుద్భవమయ్యెన్.

వ. అంత నతఁడు.

ఉ॥ పుట్టిన కొన్నినాళ్ళకె న ♦ భోమణిఁ జూచి ఫలంబు బుద్ధితో
నెట్టనఁ జేతఁబట్టి తిన ♦ నేర్మిఁ గడంగుచునుండ వేలుపుల్
చట్టనఁ జేరి కాదిది ఫ ♦ లంబు ప్రభాకరుఁడంచుఁ జెప్పి తా
మెట్టులొ వీడఁ జేసిరి ది ♦ నేశుఁ గపీశుని బుజ్జగించుచున్. 241

గీ॥ అతఁడును గొంతకాలంబు ♦ నవలఁ జదువఁ, గోరి భానునికడ కేగి ♦ భూరిమతిని
ఆ నవవ్యాకరణముల ♦ నధ్యయనము, చేసె నెంతయుఁ గోవిదుల్ ♦ వాసిఁబొగడ.

వ. అనంతరము పరమేష్ఠియనుమతి రామకార్యార్థమై సుగ్రీవుని ముఖమ్మున దాశరథిఁ జేరి సాగరలంఘన సీతాసందర్శనాది ఘనకార్యంబులొనర్చి రామునికి బాసటయై వెంబరవిత్తులగు రావణాది రక్షోవీరుల వినాశనంబుఁ జేయించి రామకార్యంబు నెఱపి లోకంబున నసమానయశంబున్ బడసె నిది హనుమదవతారలీల యిఁక పిప్పలాదమున్యవతారలీల నెఱింగింతు వినుండని సూతుండిట్లనియె. 243

## —* పిప్పలాదమున్యవతారలీల * —

క॥ వినుఁడిఁక దధీచముని తనువ, జననాథుని నోడిసి దనుజ ♦ శాసనముఖులా
ననిమేషులను శపించిన, ఘనుఁ డనఘుఁడు శాంభవుండు ♦ కారుణికుండున్.

గీ॥ తత్సతి సువర్చనాఁగ ని ♦ తాంతసుగుణ, రాశి మగనికిఁ జాయ క ♦ రణి మెలఁగుచు
సేవఁ జేయుచు విభుమన ♦ శ్రీ నెఱింగి, సంతసంబునఁ గాలంబు ♦ జరుపుచుండె.

క॥ సురపతి వృత్రాసురుతోఁ, బరిపీడితుఁడై నిలింప ♦ వర్గము దానుం
బరమేష్ఠిఁ జేరఁజని య, త్తెఱఁగెల్ల వచింప విని వి ♦ ధియు నిట్లనియెన్. 245

చ॥ తెలిసె భవన్మనంబిఁక ద ♦ ధీచమహాముని శర్వసత్కృపా
కలితవరంబునన్ బడసె ♦ గాటపువజ్రమయాస్థివర్గమున్
జెలిమిని నమ్మునిప్రవరుఁ ♦ జేరి తదస్థులఁ గోరి యడ్గ నా
బలియుఁడు వానిమీఁకొనఁగు ♦ భద్రము కాఁగలదిట్లు పొందిఁకన్. 246

క॥ అనిపనిచిన వారు దధీ, చి*నివాసముఁ జేరఁబోయి ♦ చింతాయుతులై
యనుపముఁడగు నమ్మునివరుఁ, గనఁగొని యిట్లనిరి భూరి ♦ కౌతుకమొదవన్.

మ॥ ఇతఁడే తీవ్రతపోవ్రతాధిగతవి ♦ శ్వేశానకారుణ్యసం
చితవిస్ఫూర్జితదివ్యవజ్రరచితా ♦ స్థివ్రాతసంశోభితా
యతతేజోమయమూర్తి సర్వసుమనో ♦ హార్థాభిసంధాయకో
న్నతవిశ్రాణనపుణ్యవర్తి యసమా ♦ నంబైకవిస్ఫూర్తియున్. 248

వ. అనుటయు దధీచిముని యవ్వారలనుజూచి యుచితరీతిఁ బూజించి.

గీ॥ ఆర్తిఁ దఱిసిన యవ్వారి ♦ యభిమతమును, దెలిసికొని వేగమునఁ దన ♦ పొలఁతియౌ సు
వర్చనిఁ గనొకయాశ్రమ ♦ పదమునకనిపి, సురలకనె నేమికాంక్షింతు ♦ రెఱుఁగఁ జెప్పుఁడు.

వ. అనియడుగఁగా నర్థశాస్త్రప్రవీణుండగు శక్రుండు స్వార్థపరుండై దధీచికిట్లనియె.

చ॥ మునివర ! శైవభూషణస ♦ ముజ్జ్వల! చారుయశోనిధాన! నీ
ఘనమగు నస్థివర్గమును ♦ కాంక్షయొనర్చెద మిమ్ము వాని నే
ర్పొనరఁగ నాయుధమ్ములను ♦ నొద్దికఁ గూర్చి తదీయధారవృ
త్తిని నిఁక నట్టి నయ్యసుర ♦ తోఁ జనుదెంచిన వారిఁ గూల్చెదన్. 252

గీ॥ దాన జగములకగు శాంతి ♦ మానిచంద్ర !, నీదు కీరితి జగమెల్ల ♦ నిండి యలరు
నెంతదనుకఁ బ్రపంచ మి ♦ ట్లెప్పుఁ గాంచు, నెంతవఱకర్కతారేందు ♦ లెలమిఁ గాంత్రు.

వ. సర్వజ్ఞుఁడవగు నీకు నేము వచింపవలయునే.

—* దధీచిముని ప్రాణములఁ బాసి తనువును దేవతల కిచ్చుట *—

చ॥ అన విని మౌనిచంద్రుఁడు ర ♦ యమ్మున నంతఁ బరోపకారమం
దనురతుఁడై మనమ్మునఁ గృ ♦ పాకరు నీశ్వరుఁ గొల్చి పెల్చనన్
దనువును బాసె నక్షర ము ♦ దారమునై తగు బ్రహ్మధామమున్
గొనియెను విగ్రహంబుపయి ♦ గొప్పగఁ జేకుఱెఁ బుష్పవృష్టియున్. 254

గీ॥ కామధేనువుఁ దెచ్చి దు ♦ గ్ధములఁ దనువుఁ, గడిగి యవ్విశ్వకర్మచే ♦ గాటమైన
యస్థివితతినిఁ జేయించి ♦ యాయుధముల, వెన్నముకఁ జెందె నింద్రుండు ♦ వృత్రుమలుప.

గీ॥ అంతలోన సువర్చ నిజాశ్రమంబుఁ, జేరి పెన్మిటి లేమియుఁ ♦ జిదియలైన
తనువు నెత్తురువఱదలు ♦ ననిమిషులను, గని తదీయవిధంబు నం ♦ తను నెఱింగి.

వ. ఎక్కుడు దుఃఖించి యమ్మహాసాధ్వి కినుకతో ననిమేషులన్ జూచి యిట్లని
శాపమిచ్చె. 257

* పరా:— ఈ దధీచి దధీచ శబ్దము లికారాకారాంతములు రెండును మూలమందుఁ గలవు.

ఉ॥ తేరగవచ్చె వజ్రమయ ♦ దివ్యతరాయుధముల్ నిలింపులీ
తీరుగ నెవ్వరేని మునులం ♦ దెంపునఁ జంపిరె స్వార్థలోభులై
మీరలెఱుంగరే? వెఱపు♦మీఱి యొనర్చితి రిట్లు మీరు మీ
వారలు సౌఖ్యముం బడయఁ ♦ దక్కినవారలు చావ నేమగున్. 258

క॥ పశుకృత్యముఁ జేసితి రిటు, విశయం బొకయింత లేక ♦ వేలుపులారా!
పిశితాశుల ననవలెనా?, పశువులగుదు రింకమీఁద ♦ బాలిశమతితోన్. 259

క॥ అని వేగమ్మున నాసతి, తన పతితోఁ గూడ బ్రహ్మ ♦ ధామముఁ జెందన్
వనకాష్ఠంబులతోడం జితినిఁ బేర్వఁగ గగనభార♦తి యనె నిటు లొగిన్. 260

చ॥ వల దిటు సాహసింపకుము ♦ వారిజలోచన! నీదు గర్భమం
దలఘుతరోజుఁ డమ్మునివ ♦ రాగ్రణి తేజము చేరియున్న దు
జ్జ్వలతనుఁడౌ కుమారుఁ గని ♦ చక్కఁగ నిక్కృతినిం బొనర్పు మ
వ్వల; నెటనేని చూల్గొనిన ♦ వారలు గాలరు భర్తతోఁ జితిన్.

క॥ ఆకసపుఁ బలుకు వినియును, నాకులయై యప్పతివ్ర♦తాభరణము తాఁ
జేకొని యొకశిల నుదరము, జోకఁ బగులఁగొట్టె నందు ♦ శోభితలీలన్. 261

## —* పిప్పలాద జననము *—

గీ॥ తనరుచులవెల్లు పదిదెసల్ ♦ దనరిమిగుల, రుద్రునవతారమైకడు♦రుచిరమూర్తి
ఘనుఁడగుదధీచితేజోభి♦కలితుఁడగుచుఁ, బొడమెనందనుఁడాకెకుఁ♦బొంకముగను.

క॥ నందనుగని తనమది నా, నందము నొందియును దనదు ♦ నాథునివేగన్
జెందఁగఁ గడువడిమైఁ జి, చ్చుం దఱియఁగ రావినీడ ♦ సుతుఁ జేర్చియనెన్.

గీ॥ రావినీడవసింపు చి♦రంబు తండ్రి!, యెల్లవారలకును సుఖం ♦ బీఁ దలంపు
నేను పతిలోకమున కేగు♦దాన నీదు, తండ్రి నే నిన్ దలఁతుము రు♦ద్రస్వరూప!

వ. అని యప్పతిదేవత గొడుకును ముద్దుచేసి రయంబునఁ జిచ్చుఱికి పార్థివ తనువుఁ బాసి దివ్యదేహమై పతితోఁ గూడి మహాకైలాసంబుఁ జేరఁబోయి యందుఁ బరమశివుం గొల్చుచుండె నంత హరిబ్రహ్మాది సురవరులెల్లఁ జేరి రుద్రావతారం డగు దధీచిముని తనయుం గాంచి బహూకరించి పిప్పలాదుండని నామకరణంబు జేసి దేవా! లోకంబులకు సుఖంబొనరింపుమని కోరి దుందుభివాద్యంబులతో గంధర్వగానంబులతో నుత్సవం బొనర్చి యంతర్ధానంబొంది రాపిమ్మట పిప్పలాదుం డశ్వత్థమూలంబుననే వసించి చిరకాలంబు తపంబు చేసి యనరణ్యాసుతం బెండ్లియాడె నాయుదంతకథనంబు మున్నొకమాఱు మీకెఱింగించితి నిక యతినాథలీల నారయుండని సూతుండు మునులకిట్లనియె. 266

## —* యతినాథ లీల - ఆహుకభిల్ల చరిత్రము *—

ఉ॥ ఆహుకుఁడన్ వనేచరకు ♦ లాగ్రణి యొక్కరుఁ డర్బుదాద్రిపై
నాహుక నాగ సువ్రత మ ♦ హాశివభక్తయునైన చానతో
నా హరు శంకరున్ శివుని ♦ నర్మిలిఁ గొల్చుచునుండె నంత గో
వాహుఁడు వారి భక్తినిఁ గ్ర ♦ హామతిఁ గాంచి పరీక్ష సేయఁగాన్. 267

క॥ ఆ మెఱుఁగువానిఁ బోలిన, సోయగమగు మేనిఁ జెంది ♦ సొంపుగ యతియై
డాయఁగ వచ్చెను వేగిర, మా యర్బుదశైలమునకు ♦ హరుసంబలరన్. 268

ఉ॥ అత్తఱి భిల్లుఁడున్ దనకు ♦ నాత్మవధూటికి భోజనార్థమై
యుత్తలమొప్పఁ గైదువుల ♦ నొందు విలున్ గొని దప్పుఁ జేరి యు
వ్వెత్తుగ మత్తజంతువుల ♦ వేటునఁ గూలిచి తెచ్చుచుండఁ బెం
పెత్తినభక్తిఁ దత్సతి మ♦హేశ్వరుఁ గొల్చుచునుండె నిక్కలోన్. 269

ఉ॥ ఆయతినాథుఁ డాస్థలికి ♦ నా మెడఁ జేరి వనేచరాశ్రముం
డాయఁగఁ బోయె భిల్లుఁ డట ♦ డాసి మహాదర మొప్ప నయ్యతిన్
బాయనిభక్తిఁ గొల్చె యతి ♦ వల్లభుఁ డంత నిషాదుతో ననెన్
సాయమువేళ యయ్యె నెటు ♦ సాఁగుదు వేఁగఁగ కొండకానలోన్. 270

ఉ॥ రాతిరి యెట్టులో వనచ ♦ రా! భవదీయపుఁ జక్కిలోన నేఁ
బ్రీతిగనుండి ఱేపటికి ♦ వేగ నెటేఁ జనువాఁడనన్నకై
రాతఁ డిట్లువల్కె యతి ♦ రాణ్మణి! నీనుడి నిక్కవంబె నా
యీతగు గేము స్వల్పతర ♦ మెట్లు వసింపఁగఁ జేతు నిన్నిటన్. 271

చ॥ అన యతి దీనదృష్టిఁ గల ♦ యన్ గని పోవఁగ నెంచ భిల్లి వే
గనె విభుతోడ నిట్లనియె ♦ కర్జముఁ దప్పినఁ దప్పఁ ధర్మ మీ
యనఘునిఁ బంపఁ జూడక గృ ♦ హంబున నుంపు మితండు నీవు గే
మున నెవరుండుఁ డే నిరవు ♦ ముందఱ నిద్దురపోదు వెల్పటన్. 272

గీ॥ ఆయుధమ్ముల నన్నియు ♦ నవలఁ జేర్తు, సుఖముగా మీరలిద్దఱు ♦ జొక్కుఁ డిందు
నతిథి మెచ్చును ధర్మంబు ♦ హానికాదు, గేస్తు తెఱఁగిది కాదేని ♦ గెంటువడును.

ఉ॥ భిల్లి యిటుల్వచింప విని ♦ భిల్లుఁడు చింత యొనర్చె నుల్లమం
దిల్లిది చాలదయ్యె నతి ♦ థీశ్వరు భూరితరాటవీస్థలిన్
బెల్లగు చీకటిన్ విడువఁ ♦ బేరిమి నాయును మాయు ధర్మ మీ
హల్లకపాణి నొక్కరిత ♦ నావల గెంటి పరుండఁ జెల్లునే? 274

క॥ ఈ రెండుతీరులందును, నేరమె గన్పట్టుచుండె ♦ నేనే యవలన్
జేరెద నాయుధవర్గముఁ, జేరిచెద బహిస్థలంబు ♦ చేవ యిదియగున్. 275

గీ॥ వీర లిర్వురు నిదురింత్రు ♦ వేశ్మమందు, కాఁగలట్టిది యగునని ♦ వేగ నాతఁ
డాయుధంబుల చిక్కంబు♦లవలఁ జేర్చి, తానును బరుండె వెలపల♦ధర్మమెంచి.

గీ॥ యతియును నిషాదినియును గే♦హమున నిదురఁ
జెందిరిఁక నైశతమములు ♦ గ్రిందుకొనియె
నంత నర్ధమరేయి సిం♦హములు పులులు
నెఱుకుఁ గని రా నతండును ♦ నేపుసూపి. 277

—* భిల్లుఁడు సింగములతోఁ బోరి చచ్చుట *—

ఉ॥ కైదువులొంది ధీరతఁ బ్ర♦కాశిల ఘాతుకజంతుమండలిన్
మోఁదుచుఁ బోరుచుండెఁ బసి♦పూని గభాలున నవ్వి భిల్లు మీ
మీఁదికివచ్చి వ్రచ్చి పొల ♦ మెక్కి యథేచ్ఛనుబోయె నంత సూ
ర్యోదయవేళ నయ్యతివ♦రోత్తముఁ డీవలఁ జేరి చూడఁగన్. 278

గీ॥ భిల్లుఁ డగుపట్టడయ్యె యం♦దెల్లకడల, శోణితాక్తమానచ్ఛోటఁ♦జూడఁబడియె
వానియస్థులఁ గనుగొని♦దీనుఁడగుచుఁ, గటకటా! యని దుఃఖించెఁ♦గరుణవిరాజి.

గీ॥ అంత భిల్లియు వేగిర ♦ మచటఁ జేరి, భర్తయస్థులఁ బరికించి ♦ ప్రబలశోక
భారపీడితయై కడు ♦ వగచె నచటి, కొండలెల్లఁ బ్రతిధ్వని ♦ గొప్పసేయ.

చ॥ అటు లొకకొంతసేపు హృద♦యంబున నెవ్వగఁ జిక్కి పొక్కి యం
తట వ్యసనంబు మాని మది ♦ ధైర్యముఁ జెంది యతీంద్రవర్యుతో
నిటులనె మామకీనహృద♦యేశ్వరుఁ డేగిన తెన్నుఁ బట్టి లం
పటనయి పోవుదాన మురి♦పంబెసఁగన్ రచియింపుమీ చితిన్. 281

క॥ ప్రారబ్ధకర్మచోదిత, భూరిగహనసత్త్వచయము ♦ భుక్తావశుఁడై
నారమణుఁడు మడిసెను విభుఁ, శేరఁజనెద నిదియె సూటి ♦ చేడెల కెందున్.

క॥ ధన్యుఁ డితఁడు కృతకృత్యుఁడు, మాన్యుని నిను బూజచేసె♦మాపున నిఁక నే
మన్యం బెంచక స్థల మిడె,నా న్యాయవిశేషమట్లు ♦ లరయుదురె యొరుల్.

వ. అనుడు నమ్మస్కరీశ్వరుండు.

గీ॥ ఆటవికుబోటి పలుకుల♦నాలకించి, తగవిదియటంచు మదిలోనఁ♦దలఁచి వేగ
అస్థులను బ్రోగుచేసి శు♦ష్కావనీజ, ములనుబేరిచి చిచ్చు ర♦గులుప నందు.

ఉ॥ ఆశబరీమతల్లి జల♦మాడి విశుద్ధపటంబుఁ గట్టి యా
వేశముతోడ నచ్చితికి ♦ వేగఁ బ్రదక్షిణ మాచరించి హృ
ద్దేశమునందు సర్వజగ♦తీ పరిశాసనకర్తయైన యా
శ్రీశివమూర్తికిన్ నతులు♦చేసి ప్రియంబున నిట్లు వాకొనెన్. 285

క. తెలిసి తెలియని నాచేఁ, తల నను చిత మెంతయేని ♦ దనరెడుఁ గృప నా
కలుషములఁ బాపు మిదె జో, తలు సేసెద దేవదేవ! ♦ దర్పకదమనా! 286

వ. ఇంకను.

సీ. ఎత్తిన వేడ్కమై ♦ మెడపక నీపాద, పద్మచింతనమును ♦ బాయనేని
విభుని దైవముగ భా♦వించి తదాజ్ఞఁజే, కొని మేలినడవడి ♦ మనెదనేని
కల్లనెప్పుడు నాలు♦కను జొరనీక స, త్యంబె పట్టని మదిఁ ♦ దలఁతునేని
అతిథులయందు న♦భ్యాగతులందును, బేర్మి నన్నంబు లర్పింతునేని

గీ. ఇంకను జన్మంబు మరల నా♦కిడెదవేని, దాసజనుల కభీష్టముల్ ♦ దార్తువేని
భిల్లు నాహుకునే గూర్పు♦విభునినాకుఁ, బర్వతేంద్రసుతామనః ♦ పద్మమిత్ర!

వ. మఱియును.

క. జన్మము లెన్నియొసంగిన, నిన్నజవంజాల నట్టి ♦ నేలగు భక్తిన్
మన్మనమునఁ బెనుపుము త్రిజ, గన్మోహన! దివ్యచరిత! ♦ గౌరీకాంతా! 288

క. అని శివునకుఁ దన మానస, మునఁ బూజనొనర్చి వేగఁ♦బువ్వుఁబోడి హుతా
శనుమధ్య కెగసి దుమికెను, ఘనతరసాధ్వీయశంబు ♦ గడలుకొన దిశల్. 289

వ. అంత శివుండా కైతవయతి రూపంబు విడిచి ప్రత్యక్షుండై యప్పతివ్రతారత్నం
బున కిట్లనియె. 290

— * భిల్లసతికి శివుఁడు ప్రసన్నుండై వరంబులిచ్చుట * —

ఉ. ధన్యవు ధన్యవీ వికన ని♦తాంతము నిన్ వరియించినట్టి సౌ
జన్యనిధాన మీశబర ♦ సత్తముఁ డాహుకనామధేయుఁడున్
ధన్యుఁడు సంతసం బొదవెఁ ♦ దద్దయు నీ పరిపూతరీతికిన్
మాన్యచరిత్ర! సందియము ♦ మాని వరంబులఁ గోరు మిచ్చెదన్. 291

వ. అనినంత.

గీ. అతతానందకందమై♦యలరుపరమ, శివునినుడివిని హారుసంబుఁ♦జెంది మ్రొక్కి
యూరకుండె నిషాదిని♦యుపతరకరు, గాళ్ళుఁడై యిట్లుపల్కెఁ జం♦ద్రార్ధమౌళి.

క. ఈజన్మ మిందుఁగడచెవి, రాజితగతి నీకు భిల్ల♦రాయుని కిటులన్
బైజన్మమునసిరులు పై,పైఁ జెన్నెసలారఁగలవు ♦ పల్కెద వినుమా! 292

ఉ. చందురు వంగసంబునఁ బ్ర♦శస్తి వహించిన వీరసేనరా
జేందునికిన్ దనూజుఁడయి ♦ యీ శబరుండు నలుండనాఁగ బు
ట్టొందుఁ జతుస్సముద్రరశ ♦ నోన్నతదివ్యదిలాధినాథసం
క్రందనుఁడై సిరిన్ దవరు ♦ గాఢయశంబును జెందు నెంతయున్. 294

ఉ॥ నీవు విదర్భనేలు నర♦నేతకు భీమునకున్ గుమార్తవై
యావటిలంగఁ బేర్మి దమ♦యంతి యనన్‌బడు పేరితో నన
న్యావహరూపకాంతినుగు ♦ ణాకరవై యమరేంద్రముఖ్యులన్
బోవిడి యన్నలున్ నృపతి ♦ పూజ్యు వరించి సుఖంతు వెంతయున్. 295

ఉ॥ ఏను యతీంద్రరూపమున ♦ నెంతయు మీ పరిచర్య లొందుటన్
మానిని! రాజహంసనయి ♦ మంచిగ నీకును నైషధావనీ
జానికి దౌత్యమున్ సలిపి ♦ చక్కని కూరిమిఁ గూర్చి పెండిలిన్
మానుగఁగూర్తు నిర్వురు స ♦ మంచితభోగము లొందుదుర్భవిన్. 296

క॥ ఒక కొమరుఁడు పుట్టును వా, నికిఁ జంద్రాంగదుఁడనాఁగ ♦ నిరుపమశీలుం
డకలుషుఁడు పొడము నవ్వా, నికి సీమంతిని శివాధ్వ♦నిరత సతి యగున్. 297

వ. వీర లిర్వురచే మీవంగడంబు పావనంబై దేదీప్యమానంబుగ లోకప్రసిద్ధంబగు
టయేకాక యనేకజనంబులకుఁ దారకంబై పుణ్యమార్గదాయకంబై యలరు.

మ॥ అవసానంబున మీర లిర్వురును నా ♦ యాత్యంతికంబైన భ
క్తివిశేషంబునుజెంది యోగము మదిన్ ♦ గీల్కొల్పి యద్దాన ను
ద్భవ నాశంబులులేని మోక్షపదమున్ ♦ ప్రాపింతురనాఁజెప్పి యా
శివుఁ డవ్వారలచోట లింగమయి వా♦సిన్ జెందె మోదంబునన్. 299

క॥ అచలంబగు లింగంబై, నచలముపై వెలసినట్టి ♦ యక్కతమున నం
దచలేశ్వరుఁడను నాహ్వాయ, మచలేంద్రసుతావిభుండు ♦ హరుఁడొందె నటుల్.

గీ॥ భిల్లదంపతు లట్లు బల్ ♦ పేర్మిమైన, నంతరవు జన్మమందు రా♦జాధిరాజ
పదవి దంపతులై శివ♦భక్తి నొంది, ముక్తినొందిరి శ్రీశివ ♦ సూక్తిసరణి. 301

క॥ ఈ చరితంబు పవిత్రం, బై చెలువగు యతియు రాజ ♦ హంసంబునునై
శ్రీచెన్నగు శివులీలల, నేచిన రహి వినినఁ గాంతు ♦ రెల్ల సుఖములన్. 302

క॥ సర్వైహికభోగంబుల, సర్వస్వర్లోకభోగ ♦ సౌఖ్యంబులనున్.
శర్వునిపై భక్తియుఁ గదు, హర్వుగఁ గాంతురు వినిచిన ♦ నన్యులకుఁ దగన్:

వ. ఇఁక శివభక్తాగ్రగణ్యుండును బయఃపారావారసాధకుండును బ్రహ్మఋషియునగు
నుపమన్యుమహామునీంద్రుని చరిత్రంబుఁ దెలుపు సురేశ్వరలీలను జెప్పెద భక్తితో
నాలకింపుఁడని యిట్లనియె. 303

—* సురేశ్వరలీల - ఉపమన్యు చరిత్రము* —

క॥ ఉపమన్యుఁడు మునిమాన్యుఁడు, విపులశివకృపానులబ్ధ ♦, విమలజనిఘనుం
డపగత మోహాటోపుఁ డ; నుపముఁడు శ్రీవ్యాఘ్రపాత్త ♦ నూజుఁడు పుడమిన్.

సీ॥ ధౌమ్యముని పూర్వజుఁడతండు♦తనదు పూర్వజన్మమున సిద్ధుఁడయ్యె నే♦చందమున నా
స్వపదమునుండి జాతియా♦జాడమునికిఁ, గొమరుఁడై పుట్టె దైవయో♦గమునఁ జేసి.

చ॥ శివునియనుగ్రహంబుననె ♦ చిన్నతనంబునఁ బాలపైఁ దమిన్
దవిలి తపంబొనర్చి సత♦తంబు కుమారదశన్ గణేశతన్
శివపరతత్త్వ వక్తృతను ♦ క్షీరసముద్రము సర్వవైదుషిన్
శివకరపాదుకాద్వయినిఁ ♦ జెందె భువిన్ సిరులొందెఁ బొందుగన్. 306

కం॥ అని నొడివిన సూతునినుడి, విని మోదముతోడ మునులు ♦ వేగిరముగ నా
యనఘుం డుపమన్యుచరి, త్రను సర్వముఁ జెప్పుమనుడుఁ♦జక్కఁగ నతఁడున్

సీ॥ వినుఁడతఁ డొకప్డు కడుపసి♦తనమునందుఁ, దల్లితో మేనమామల♦తావుకేగి
కొన్ని ప్రొద్దుల చోటనుండి♦కోరి మరలఁ, దమయిరవుఁ జేరియుండెనం♦త నొకనాఁడు

ఉ॥ త్రావుట కావుపాలొసఁగు ♦ తల్లి! యనంగఁ దదంబ రాగులన్
దా వెసదంచి పిష్టము ను♦దంబునఁ జేర్చి తెచ్చి పాలుగా
నావిడ యిచ్చుచున్ బుడుతఁ ♦ డారసి పాలివి గావు తల్లి! న
న్నీవిటు మోసపుచ్చఁదగు♦నే? యన నాపెయుఁ గుంది యిట్లనెన్. 308

ఉ॥ నిక్కము తండ్రి! నీనుడి; వ♦సిన్ వసియించి యిటున్న వారమా
యెక్కువ యావుపాలు మన ♦ కెట్లు లభించును? మేనమామగా
రిక్కను బ్రోలితీవు కడు ♦ నింపగు నాలపయస్సు లట్టి వీ
చక్కని దుర్లభంబు తను♦జా! ననుఁ బొక్కఁగఁజేయ కీయెడన్. 309

ఉ॥ సేద్యములే దొకింతయును ♦ జేవ్పడియుంటిమి లేమితో నిటుల్
చోద్యముగాదె గవ్య మెటు ♦ చొప్పడు నీకుఁ గుమార! పూర్వమం
దాద్యమహేశ్వరున్ శివుని ♦ నర్చనసేయము ద్రవ్యకాంక్షమై
హృద్యమతిన్ దలంచి యిపు ♦ డీశ్వరుఁగొల్వ లభించు దుగ్ధముల్. 310

ఆ॥ చోళ్ళపిండి నీటఁ ♦ జొప్పించి యిటు పాల, వలె నమర్చి యిడితి ♦ వాస్తవంబె
చవి నెఱింగియుంట♦సరగున నవ్వాని, దోసి యిట్లు హఠముఁ ♦ దొడరఁజనునె?

మ॥ అనినన్ డింభకుఁ డప్డు తల్లిఁగని ధై♦ర్యంబొంది యిమ్మాడ్కిఁ బ
ల్కెను దల్లీ! పొగులంగ మాను మిఁకఁ దా♦ల్మిన్ జెందు డెందంబునన్
మనదారిద్ర్యము వాసె నేటికి మరు♦న్నాథుండు శర్వుండు నీ
వనిన ట్లున్నయెడన్ దగన్ గొలిచి నే♦నార్జింతు దుగ్ధోదధిన్. 312

వ. అనుడు నాపెయు.

మ॥ అనుమానింపకు మించుకేనియుఁ గలం♦డాద్యుండు శర్వుండు కాం
చవగర్భాచ్యుతదేవరాట్ప్రముఖ నా♦నానిర్జరాధీశపా

నవరత్నప్రవిభాసమానమకుట ♦ జ్వాలాంశునీరాజితాం
ఘ్రినఖుం డిందుకలాధరుండు గిరిపు♦త్త్రీవల్లభుం డాత్మజా! 313

వ. ఇఁక నెందనెఁడు సందియంబునొందెదవేని వినుము

క॥ కలఁడు హుతాశన మండలిఁ, గలఁడు గభీరాంబురాశి♦కాండములందున్
గలఁడోషధీచయంబులఁ, గలఁడు శివుండీ యఖిలజ♦గములఁ గుమారా! 314

వ. మఱియును:

క॥ కలఁడు రజతాచలంబునఁ, గలఁడట మందరహిమాద్రి ♦ కందరములనున్
గలఁడల శ్రీపర్వతమునఁ, గలఁడవిముక్తాదిపుణ్య ♦ కటకములందున్. 315

ఉ॥ ఆతనిచేతనే జగము ♦ లన్నియు నిట్లు జనించె మించుగా
నాతనిఁ గొల్చుచుండెద ర ♦ హర్నిశమున్ సురలప్రమత్తులై
యాతని సుప్రసాదమున ♦ నక్షరభాగ్యము లొందుచుందుర
ల్లాతఁడె విన్మఁకన్ మనకు ♦ నందఱకున్ గల దిక్కు పుత్త్రకా! 316

ఉ॥ ఆ హరు నా మహేశ్వరు శు♦భావహుఁ గొల్వుము లాఁతి వేల్పులన్
నీ హృదయంబునన్ దలఁప♦నేరకు చేరకు వారి జాడకుం
దా హిమశైలజావిభుని ♦ నా ప్రమథాధిపతిన్ దయానిధిన్
గోహయు బాలచంద్రధరుఁ ♦ గూరుచు విద్య నొసంగెదన్ సుతా! 317

గీ॥ సప్తకోటి మహామంత్ర ♦ సమితియందు
రాణఁ దనరెడు పంచాక్ష♦రమను వెందు
శివున కిది వాచకంబై ప్ర♦సిద్ధిఁ జెందు
సర్వమంత్రంబు లిటఁ జేరి ♦ శస్తినొందు. 318

గీ॥ సర్వమంత్రంబులందుఁ బ్ర♦శస్తమిద్ది, సర్వరక్షాపరంబయి ♦ జానుమీఱు
నిద్ది రసనాంచలముఁ జేరె♦నేని దుర్లభం బరుదుగానఁ బంచాక్ష♦రంబుఁ గొనుము.

గీ॥ అరయ తజ్జాతమగు నఘో♦రాస్త్రమంత్ర,మును ననుత్తమ వైభవిఁ ♦ దనరు శైవ
జనసమూహమున కిది ర♦క్షావహంబు, వీనిఁగూరిమి సేవింపు ♦ వేఱువలదు. 319

గీ॥ తండ్రి విరజాగ్నిఁ గొనిన ను♦త్తమభసితము, గలదునీకని దాఁచితిఁ♦గలువహారము
మంత్రములతోడ నిత్తుఁ గు♦మార! కొనుము, దీననీకగురక్ష సం♦దియము లేదు.

ధ్రువకోకిల : అని కుమారున కాపె మంత్రము ♦ లట్లు చెప్పియు నా విభూ
తిని నొసంగి శివంబు నీకిడు ♦ దేవుఁ డల్ల శివుండనన్
దనయుఁ డంతఁ గడున్ గడున్ బ్రమ ♦ దంబునొంది మనంబునన్
జననికిన్ బలుమాఱు మ్రొక్కులు ♦ సల్పి యిట్లనె హెచ్చుగాన్. 321

కం॥ సేవించెద శివు నమ్మరో!, భావించెద మదిఁ దదీయ ♦ పదనళినములన్
గావించెద ఘనతపమున్, శ్రీవెంచెద శంభుదత్త ♦ సిద్ధుల కలిమిన్. 322

కం॥ రప్పించెద శివు నిచటికి, మెప్పించెదఁ దన్మనంబు ♦ మేలిమి భక్తిన్
దప్పించెద సకలాధులఁ, దెప్పించెదఁ బాలకడలిఁ ♦ దేఁకువ మెసఁగన్. 323

శా॥ శ్రీలాలిత్యముమీఱఁ దల్లికి సమీ ♦ చీనోక్తు లిబ్భంగిగా
బాలుం డప్డు వచించి తాఁ బయనమున్ ♦ వాంఛింప దన్మాతయున్
వాలాయంబుగ నిన్ను మెచ్చు నగజా ♦ ప్రాణేశ్వరుం డీశ్వరుం
డాలంబున్ బొనరింపఁ డిచ్చుఁ బరమా♦హ్లాదంబునన్ భద్రముల్. 324

చ॥ మఱియుఁ గుమార! యొక్కనుడి ♦ మంచిగ విన్మ శివుండు భక్తిఁదా
నెఱుఁగఁగఁ గోరి సేయును బ♦రీక్ష చరాచరజంతుమండలిన్
నెఱి నొకచేతనాకృతిని ♦ నెక్కొని దాసి భ్రమింపఁజేయు నె
త్తెఱఁగుననేని మార్పడక ♦ తేఁకువ నారయుమా! మహేశ్వరున్. 325

శా॥ దుర్విజ్ఞేయుఁడు చాపలాత్ముల కిలన్ ♦ దుర్దర్శుఁడై యొప్పు నా
శర్వుం డర్భక! తద్విచిత్రగతు లెం ♦ చన్ జాల రెవ్వారలా
సర్వేశానుని దివ్యరూపములఁ బ్రి ♦ స్తావింతు యోజింపుమీ
యుర్విన్ భక్తులఁ బ్రోవఁ బ్రోవుతఱి దా♦యున్ వాని పై దూడుచున్. 326

కం॥ కమలజమధురిపురుద్రుల, విమలాకృతులను మహేంద్ర ♦ విశ్వేదేవ
ద్యుమణివిధుదస్రరూపము, లమరికఁ జేకొను మహేశుఁ♦డరయుము పుత్త్రా!

చ॥ నరులయు దివ్యపుంగవుల ♦ నారుల రూపములన్ బిశాచకి
న్నరనరయక్షరాక్షసగ ♦ ణాధరభిల్లకిరాతమూర్తులన్
హరిశరభేభసైరిభవృ ♦ షాశ్వతరాఽశ్వతరక్షుఋక్షనూ
కరముల వ్యాఘ్రజంబుకవృ ♦ కప్రకరంబులమూర్తు లొందెడున్. 328

గీ॥ మఱి యులూకబలాకోష్ట్ర♦మకరకాక, గృధ్రచక్రాంగ కృకలాస ♦ కీరగరుడ
క్రౌంచమేషాజబర్హిశ్వ♦గాత్రములను, దవిలిచేకొని బాలేందు♦ధరుఁడు డాయు.

కం॥ పాడిమొదవై యొకప్పుడు, దూడయగుచు నొక్కమాఱు ♦ తోరపువేడ్కన్
గోడెయయి లేడియయి మేల్, గోడిగయయి యొక్కమాఱు♦గూడఁగవచ్చున్.

ఉ॥ పాముల ప్రోగులన్ మఱియుఁ ♦ బాములమేల్మికడెంబులన్ మఱిన్
బాములపేరులన్ బడసి ♦ పామునె జందియమున్ బొనర్చి పెన్
బామునఁ గెంజడల్ మిగుల ♦ వాటముగా బిగియించి కట్టి య
క్కోమలచంద్రమండనుఁడు ♦ గుల్కుచువచ్చు నెఱుంగు పుత్త్రికా! 331

క॥ గొడుగును గమండలంబును, నిడివగు గఱ్ఱయును దాల్చి ♦ నీటొప్పు నొక
ప్పుడు గత్తిని గొడ్డలినిన్, బెడిదపురోకలిని గదను ♦ బేర్మి ధరించున్. 332

ఉ॥ ఆడుచునుండు జంత్రముల ♦ హాయిగ మేళనచేసి రాగముల్
పాడుచునుండు వేదములఁ ♦ బల్కుచునుండును నవ్వుచుండు బ
ల్బేడుక సేయుచుండు పవ ♦ ళించియు నుండును నావులించు బి
ట్టేడుచుచుండు వేడబము ♦ లెంచఁగరావు కుమారచంద్రమా! 333

క॥ కడుఁ బసిపాపై యొకపరి, కడుముదుకై యొక్కతఱిఁ జో ♦ కాటపు యువమై
పొడసూపు నొక్కతఱవను, బొడవుగ నొకమాఱు మరలఁ ♦ బొట్టిగఁబొలుచున్.

క॥ జోగిగఁ గ్రిమ్మరు నలుగడ, యోగిగఁ దనరారుచుండు ♦ నొక్కెడఁ జెవిటై
మూఁగగఁ గుంటిగ గ్రుడ్డిగఁ, దాఁగనుపడుచుండు శివుఁడు ♦ తనయా! వినుమా!

ఉ॥ వేలకొలంది బాహువులు ♦ వేలకొలంది పదంబులున్ మఱిన్
వేలకొలందిగాఁ గనులు ♦ వేలకొలందిగ వీనులున్ గడున్
వేలకొలంది నాసికలు ♦ వేలకొలంది తలల్ ధరించి మే
ల్లీలల నొప్పసల్పుచు ల ♦ లిన్ గనవచ్చు శివుండు పుత్త్రికా! 336

ఉ॥ ఏనికమోముతోడ మఱి ♦ యేనికగొంగ మొగంబుతోడ సొం
పై నుతికెక్కి నెక్కుడు ము ♦ ఖావళితోడను నూర్ధ్వకేశుడై
జానుగ గోష్ఠమధ్యమున ♦ జన్నపు స్తంభమునందు నగ్నినిన్
మానక వేదిమధ్యమున ♦ మారహరుం డలరున్ గుమారకా! 337

క॥ తెల్లనివాఁడై యొకపరి, నల్లనివాఁడై యొకప్డు ♦ నానావర్ణ
ప్రోల్లలితుండై యొకమా, ఱల్ల మహాదేవమూర్తి ♦ యగుపట్టు సుతా! 338

ఉ॥ కావున నింతయేని మదిఁ ♦ గశ్మలభావముఁ జెంద కెంతయున్
భావపురస్సరంబుగ శి ♦ వావిభు నీశ్వరు నమ్మికొల్వు మా
దైవతపూజితుండు సము ♦ దారవరంబుల నీకొసంగు సు
శ్రీ విలసిల్ల సిద్ధులను ♦ జేకొని రమ్మిఁక వేగిరమ్ముగాన్. 339

క॥ అని మూర్ధంబునఁ జేయిడి, పనిచెను దనుజాతు నతఁడు ♦ పరువునఁ దుహినా
ద్రినిఁ జేరి యందు గంగా, ధునితటి నిరవొంది పూనె ♦ దుశ్చర తపమున్.

గీ॥ ఎనిమిదిటుకలతోడ నిం ♦ పెనయు నొక్క; దేవళముఁ గట్టి యందుఁ బా ♦ ర్థివ ములింగ
మెలమి నెలకొల్పి శివుఁ బార్వ ♦ తీశు నంది కేశసహితమ్ముగా నావ ♦ హించి మించి.

క॥ బూదిన్ సర్వాంగీణము ♦ గాఁ దడి నిడి పూసికొని ని ♦ కామక్రమము
ర్యాదన్ రుద్రాక్షములను, మైదాలిచి పరమశివుని ♦ మదినమ్మి తగన్. 342

క॥ పంచాక్షరమంత్రమును జ, పించుచు లింగార్చనమును ♦ వేడ్క సలుపుచుఁ
జంచలభావమ్మొందక, పంచాబ్దము లొప్పె విప్ర ♦ బాలుఁడు పేర్మిన్. 343
గీ॥ తపసొనర్చుచునుండఁ గొం♦డఱు మఱచి, శక్తులైనట్టిమాయాపి♦శాచు లపుడు
పావనిన్ భయపెట్టి త♦పంబుఁ జెఱుపఁ, బూన నర్భకుఁ డుడుగక♦పూన్కి మెఱసి.
క॥ వంచితుఁడుగాక యెవ్వఁడును, బంచాక్షరదివ్యమంత్ర ♦ పరతంత్రుండై
మించి యుదంచితశక్తి వ, రించెన్ బైశాచవితతి ♦ కృతవిఘ్నములన్. 345
వ. అంత నవ్వారలు పంచాక్షరీనాదశ్రవణంబున దామసభావంబువీడి యది మొదలా
చిట్టిమునికుపచారంబు లొనర్చుచుండి రంత నతండును. 346
సీ॥ అవనిని వామపా♦దాంగుష్ఠమున మోపి, ఫలమునఁ దపసొందె ♦ వందయేండ్లు
పండును విడి శీర్ణ ♦ పత్రంబునన్ దిని, ప్రోషిఁ దపంబొందె ♦ వందయేండ్లు
పత్రంబునన్ మాని పానీయముల నాని, వరగఁ దపంబొందె♦వందయేండ్లు
వారిఁగ్రోలుటఁ బాసి ♦ వాయుభక్షణఁ జేసి, తపమొందె నేడువం ♦ దలగునేండ్లు
గీ॥ వర్షసాహస్ర మిట్లు త♦పంబుఁ జెంద, మునితపంబునెదన్ మెచ్చి ♦ ముఖ్యభక్తుఁ
డని యెఱింగియుమది మఱి♦నరయఁగోరి, భక్తుఁడంత మహేంద్రరూ♦పంబుఁ దాల్చి

—* శివుఁడింద్రుఁడై వచ్చి యుపమన్యునకు వరమిచ్చెద ననుట *—

గీ॥ అమరగణములతోడను ♦ నప్సరోజ, నములతోడను సిద్ధగం ♦ ధర్వయక్ష
వరులతోడఁ గిరీటంబు♦వజ్రకుండ, లముల ముక్తావళులఁ దాల్చి♦కొమరుమీఱ.
చ॥ అమృతముఁబోలెఁ దెల్లనయి ♦ యదిరివరెన్ ఘనమైకదుఁగదుఁ
స్తిమితములౌ శ్రుతిద్వయము♦దీర్ఘతరారుణనేత్రయుగ్మముఁ
గొమరగుమేలితొండమును ♦ గొప్పమదస్రుతియొప్పి నాల్గు దం
తములుగలట్టి ప్రాగిభము♦దారత నెక్కి మహాత్మవంబునన్. 349
క॥ వెల్లగొడుగు గిరుగడల కో, ల్లెడు చామరయుగంబు ♦ వెలయఁగఁ బువ్వుల్
చల్లఁగ జేజేల్ గడురం, జిల్లుచు నచ్చరలు నెలమి♦చే నటియింపన్. 350
గీ॥ కెలనఁబౌలోమిపేర్మిమై♦యలర నాస, హస్రనయనుఁడు మునిడాసి♦యనియెనీదు
తపమునకు నేఁగరంబు ము♦దంబువడితి, వరములన్ గోరు మిచ్చెద♦వాసిమీఱ.
క॥ అనుడు ముని యాబిడౌజునిఁ, గని యంత నమస్కరించి ♦ గారవమున నో
యనిమిషనాథా! శివభ, క్తిని నిడుమని తొంటివలె నొ♦గిన్ దపియించెన్.
చ॥ కనుఁగొని దేవవల్లభుఁడు ♦ గ్రక్కున మానికుమారుఁ గాంచి నీ
మనసుననున్న గోర్కులను ♦ మాకెఱిఁగింపకయుంటి వోరి! య
మ్మనసిజవైరిఁగూర్చి యస♦మాన తపం బిటు సేయుచుంటి వా
తనివస నేనెఱుంగనిదె? ♦ తల్పుము నిల్పుము నానుడుల్ మదిన్. 353
క॥ అని కొన్ని దూషణోక్తుల, ముని కనుతాపంబుగదురఁ ♦ బురుహూతుఁడు ప
ల్కినవినికినుకనుగొనియతఁ, డనియెను దుశ్చ్యవనుఁగనిమ♦హాగ్రహ మొదవన్.

మ॥ నిను నేఁగోరను గోర వాంఛితములన్ ♦ నిక్కంబు దేవేంద్ర! నీ
యనుకంపన్ మదిలోఁ దలంప నెపు డ♦న్యాదిత్యసంఘంబుచే
తనుగానీ గొనఁగాఁ దలంప వరముల్ ♦ తథ్యంబు సర్వేశ్వరుం
డినచంద్రానలలోచనుం డిడెడు నా ♦ కిష్టార్థసామ్రాజ్యముల్. 355

ఉ॥ ఈ నుడి నిశ్చితంబనుచు ♦ నెంచుము నీ మదిలో నొకించి కీ
శానుని సర్వదివ్యగణ♦శాసను నిందయొనర్చి తీమెడన్
గానక వేదపుంజములఁ ♦ గానక నార్షపథంబుఁ గన్నులన్
గానక శార్వవైభవముఁ ♦ గల్లరి యల్లరి మాని విన్మిఁకన్. 356

క॥ పశుపతినుడి నవుదును నేను శచీపతి పురువునే న♦నోకహమును నేన్
పశుపతిభిన్నోక్తికి నా, వశమగుఁ ద్రైలోక్యలక్ష్మిఁ ♦ బాయుదు నపుడే.

క॥ హరచరణనళినసేవా, నిరతి నమరు పుల్కసునిజ ♦ నిక్ బడయుదు నా
హరుభక్తినిఁగొనని పురందరు జన్మముఁగాని యెపుడు ♦ దాల్పను వినుమా!

క॥ చాలున్ జాలును వేఱగు, నాలాపము లొంద నేల ♦ యన్యకథల నే
వేళను తుణార్థమేనియుఁ, గాలహరుని భజనవిడక ♦ గడపు జనునకున్. 359

క॥ ఒకదిన మర్ధదినము నే, నొకఁడు ముహూర్తంబు నేని ♦ నొకక్షణమేన్న
మ్మికమైనభక్తి యొనరదు, సకలేశునను గ్రహంబు, సమకూరనిచోన్. 360

క॥ కృమినేనియు లేక పతం, గము నేనియు నట్లుకాక ♦ కడు నేవపు శ్వా
నము నేని యగుదు శివునుడి, నమరపాభవమునొల్ల ♦ నన్యుల నుడులన్. 361

ఉ॥ నాకముగాని నీయమర ♦ నాయకపీఠముగాని యల్లనా
ళీకభవాధిపత్యమును ♦ లేక నిరంజనమాపదంబుగా
నీ కరమొప్పుకోర్కుల న♦నేకములన్ విడనాడి పేర్మిమై
శ్రీకరుణాళుఁడౌ శివుని ♦ సేవకవృత్తిని గోరెదన్ జుమీ. 362

క॥ ఎంతవఱ కిందురేఖా, కాంతజటాజూటుఁడద్రి ♦ కన్యాచేతః
కాంతుఁడు మెచ్చఁడో యంతకుఁ, గాంతు జరామరణజన్మ ♦ ఘనదుఃఖములన్.

చ॥ రవిశశిపావకగ్రహావి♦రాజితదీప్తులఁ గప్పు దీప్తినై
భవములమించువాని నిర♦పాయమహామహిమంబువాని నీ
భువనకదంబపారమయి ♦ పొల్చెడు నొక్కని రుద్రు నాద్యు ను
ద్భవనిధనంబులన్ గనని ♦ బల్లిదుఁగొల్వక శాంతి యబ్బునే? 364

సీ॥ ఘనమోహనీహార ♦ గతులడంగునె శివా, ర్కమహారుచి ప్రసా♦రమునఁగాక
ప్రబలనైకవిధాఘ ♦ పారంపరీతమం, బవియునే శశిమౌళి ♦ యండఁగాక
బహుపూర్వభవభవా ♦ పద్వార్ధిఁగడతురే, నగచాపకారుణ్య♦నౌకఁగాక
దుర్భరదారిద్ర్య ♦ దుఃఖాగ్నియారునే, శివకృపారసవృష్టి ♦ సిద్ధిఁగాక

గీ॥ జన్మమృత్యు జరావ్యాధి ♦ సమధికార్తి, జాలనిర్వాపణాఢ్య మో♦క్షప్రశస్త
భాగ్యరమ చెందునే! శివో♦పాస్తిలేక, ఎట్టివానికి నేని మ♦హేంద్ర! యరయు!

సీ॥ అవియె హస్తంబులవి శివు♦నర్చసేయు, నవియె శ్రుతులవి శివకథ♦లాలకించు
అవియె పదములు శివుగుడి♦కరుగు నెవ్వి, యవియె తనువులు శివభక్తి♦వందు నెవ్వి.
క॥ నా దోసంబులచే నిటు, నేదేనియు జనని మరల ♦ నేనెత్తిన నం
దేమిత మహేశుఁ డక్షయు, నైమై దైవాత్తెను కరుణకు ♦ నాదరువగుచున్. 367
వ. అని యిట్లు తన్ను లెక్కసేయక యుక్కుమిగిలి ధిక్కరించుచున్న యమ్మౌని
కుమారుఁ గాంచి కినుకమించి నముచిసూదనుం డిట్లనియె. 368
క॥ చల్లని మెల్లని నానుడు, లుల్లంబునఁ దలఁచి వరము ♦ లొందక యిటుల బల్
త్రుళ్లి నను గడ్డిపరకగఁ, బిల్లఁడ! చూచెదవె నీదు ♦ పెంపెదొ కనెదన్. 369
క॥ ఎవ్వండా రుద్రుఁడు? వర, మెవ్వనిచేఁ గొనఁదలంచి? ♦ తెచ్చుటనుండున్?
దవ్వో? డాపో? డాఁపక, చివ్వనఁ జెప్పుమన్న నతఁడు ♦ చెలఁగుచు ననియెన్.

—* కృతకేంద్రున కుపమన్యుఁడు శివమహిమంబు చెప్పుట *—

ఉ॥ ఎవ్విభు విన్ బదార్థముగ ♦ నెంతురు లేదనుచుందు రట్టిలే
యెవ్వనిఁ గంటిమంచు మతి ♦ నెవ్వడు గన్గొనమంచు నెంతురో
యెవ్వని నొక్కనిన్ భువి న♦నేకునిగాఁగఁ దలంచుచుందురో
యవ్విభుఁ డీశ్వరుం డతఁడె ♦ యభ్యుదయంబు లొసంగు నాకిఁకన్. 371
ఉ॥ ఎవ్వఁడు మోహసంతమస ♦ మెల్లను బాపఁగఁ జేయు జోతియా
నెవ్వని రూపెఱింగి మును ♦ లెవ్వడు దుఃఖము లొందఁబోవ రిం
కెవ్వని జ్ఞానవైభవము ♦ లెంచఁగ రాక యె మించియుండునో
యవ్విభుఁ డవ్యయుండు విబు♦ధాధిప! నాకిడు మేటిభద్రముల్. 372
ఉ॥ ఎవ్వఁడు సర్వభూతముల ♦ నేపున భావనచేసి మించెనో
యెవ్వఁడు సర్వదేశముల ♦ నేకవిధంబుగ నిండియుండెనో
యెవ్వఁడు సర్వసంపదల ♦ నీగికిఁ జాలునొ భక్తకోటికిం
దవ్వనజోదరాదిజన ♦ నావహుఁ డీశ్వరుఁ డిచ్చునిష్టముల్. 373
చ॥ అవని జలంబు లగ్గి యని♦లాంబరముల్ బదియింద్రియంబులున్
మవిహితముల్ దదర్థములు ♦ శుద్ధమనంబును బుద్ధ్యహంకృతుల్
శివునిగఁ దత్త్వవేదులు వ♦చింతురు నిన్నును నన్ను దృశ్య మీ
వివిధచరాచరావళిని ♦ వృత్రహరా! హరుఁగాఁగ నెంచుమా! 374
ఉ॥ యోగులు సాంఖ్యవాదులును ♦ యుక్తిగఁ గొల్తురు లెక్కసేతు రే
యోగివరేణ్యు తేజమును ♦ నొప్పఁగ దిక్కులు కాల మర్క తే
జోగరిమల్ గ్రహంబులును ♦ శోభిలుతారలు రాను లేమహా
భాగుఁడొ యాతఁడే యరయు ♦ పాలకపాలకుఁ డెందు వాసవా! 375
సీ॥ ఊర్ధ్వరేతస్కుఁడై యుండి ♦ యువిద నెవ్వ, డర్ధతనువున ధరియించి ♦ యలరు నెవఁడు
చెఱకువిల్తుం డెవనిచేతఁ ♦ జేటువడియె, నాతఁడేఁ విను విశ్వక♦ల్యాణమూర్తి.

గీ॥ ఎవనియైశ్వర్యమసమాన ♦ మెవఁడుభూత, తతులతోఁ గ్రీడసేయు ని ♦ తాంతమెవని
గణములతులబలైశ్వర్య ♦ ఘనములగుచు, దర్పమునమించురుద్రుఁడా ♦ తండెయరయ
క॥ వసువుల ధరించు నెవ్వఁడు, పసఁదగు నోషధుల కెవఁడు ♦ ప్రభుఁడగు యోగీ
డ్వాసరములు జ్ఞానకల త్రిద, శసమితి కర్మగతి నెవని ♦ సంసేవించున్. 378
గీ॥ వినుము క్షరమక్షరంబు న ♦ విద్యవిద్య, ధర్మమును నధర్మమును గృ ♦ తంబకృతము
నెవనిచే నేర్పడునతండె ♦ యెఱుఁగుసర్వ, కారణముగాఁగ శక్ర! ని ♦ క్కంబుగాఁగ.
గీ॥ తల్లిచేతను విని మది ♦ నెల్ల లాఁతి, వేల్పులను నిచ్చగింపక ♦ వీడినాఁడ
వీరలిచ్చెడు వరముల ♦ వేఁడికొనుట, "కొఱవితోఁ దుతఁదలగోఁకి ♦ కొనుట" గాదె!
క॥ పిడివాద మేల దడ వెదు, వెడలుము ఘోషముఁ దొఱంగి ♦ వృత్రహరా! నీ
వెడఁగుబిభీషికలకు నే, జడియుదునని తలఁప కెపుడు ♦ స్వాంతములోనన్. 381
క॥ హరియును విరించి నీవును, సుర లసురులు సర్వసిద్ధ ♦ చూడామణు లా
హరునేఁ బరమునిగా నెంతురు నితరం బతనికన్న ♦ దొడ్డయుఁ గలఁడే! 382
సీ॥ వేదశిఖారాజి ♦ వెదకి జగత్కార, కునిఁగ శంకరుని జె ♦ ప్పినకతమున
కమలాక్షసాహస్ర ♦ కమలాక్ష పూజఁదాఁ, జెంది చక్రంబు ని ♦ చ్చిన కతమున
దేవసభన్ మహా ♦ దేవశబ్దం బిఁక, శివమూర్తి నేవరిం ♦ చినకతమున
అఖిల జగంబుల ♦ కంబయై చెలువొందు, శివకు విభుండైన ♦ శ్రీకతమున
గీ॥ తివిరి యీశ్వర పదము చెం ♦ దినకతమున, అదియనన్యవిషయమయి ♦ యమరుకతన
అష్టమూర్తియై విలసిల్లి ♦ నట్టికతన, నిందుమౌళియె పరముఁడం ♦ చెఱుఁగవలయు.
వ, మఱియు నమ్మహాదేవుని నిగ్రహానుగ్రహంబుల తీఱెఱింగియుండియు మఱచితి
వేనిఁ జెప్పెద నాకర్ణింపుము. 384
సీ॥ ప్రణవార్థమును వేఱు ♦ పల్కిన విధిఁబట్టి, కొనగోట శిరమును ♦ గోసినాఁడు
తన్నుదూషించి య ♦ ధ్వరముఁగావించు దక్షుని మస్తకంబల్లె ♦ తునిమినాఁడు
లెక్కసేయక తన్ను ♦ నిక్కుచు మునిపుత్త్రుఁ, జంపఁ గడఁగు కాలుఁ ♦ జంపినాఁడు
పయల యట్లుదలంచి ♦ బాణమ్ము లేసిన, యించువిల్కాని ద ♦ హించినాఁడు
గీ॥ క్ష్వేలము గ్రసించి జగముల ♦ నేలినాఁడు, తండునకు శ్వేతమునికిమృ ♦ కండుసూతి
కుసురులనొసంగి ప్రేముడి ♦ నోమినాఁడు, హరునకుసమానుఁ డెందునొ ♦ క్కరుఁడుగలడె!
క॥ లాఁతుల హేతువులను బురు, హూతా! నుడువంగనేల ? యుత్సుకమతి నా
భూతేశ్వరలింగంబును, నాతురులై కొల్తు రరయు ♦ మఖిలసుపర్వుల్. 386
క॥ మఱి యిఁక నొక్కనిలింగము, ధరలో నెవఁడేనిఁ గొలువఁ ♦ దలఁచినటులు నీ
వెఱుఁగుదువె? చెప్పు మెపుడేన్, జిరకాలముక్రింద వినిసఁ ♦ జిత్తంబలరన్. 387
క॥ ఎవ్వని లింగము బ్రహ్మయు, నవ్వనరుహనయనుఁ డీవు ♦ నఖిలసురలు మేల్
నివ్వటిలఁ బూజసేతురొ, యవ్విభుఁ డధికుండుగాఁడె ♦ యరయు మనమునన్.
క॥ లేరు ప్రజలు పద్మాంకులు, లేరెటఁ జక్రాంకజనులు ♦ లేరెట వజ్ర
శ్రీరచితాంకులు జగమున, నారయు లింగాంకులును భ ♦ గాంకలు సర్వుల్. 389

క॥ విను శక్తిచేతఁ బొలఁతులు, కనఁగ భగాంకలు మహేశ♦ఘనతరలింగం
బునఁ బురుషులు లింగాంకులు, ననువుగ గుఱుతొందఁబడుదు♦రరయవె మఘవా!

క॥ ఇప్పగిది శాంకరవ్రజ, మెప్పుడు గనుచుండియును శి♦వేతరు నెవఁడేన్
జెప్పినచోఁ గారణమని, యొప్పుదు రే? యట్టిదుర్జ♦నోక్తుల విజ్ఞుల్. 391

క॥ ఈశ్వరుఁడే పుంలింగం, బీశ్వరి స్త్రీలింగ మెందు ♦ నిరువురచే నీ
విశ్వము వ్యాప్తంబగుచున, నశ్వరముగఁ దేజరిల్లు ♦ నాదిత్యపతీ! 392

ఉ॥ కావున దేవరాజ! యిఁకఁ ♦ గర్జము మానినపల్కుఁ బల్కఁబో
కీవిపు డేగు ముందు మిట ♦ నిష్టము చొప్పున నేను శ్రీమహా
దేవుని గొల్తు నాతఁ డిడు ♦ దివ్యవరంబును లేక శాపమేఁ
జేపురుఁగొట్టినైన యితర ♦ దేవుల వేడను గాంక్షితంబులన్. 393

మ॥ అనుచున్ మానక కిన్క నేదొ నుడి జం♦భారాతి పల్కంగఁబోఁ
గని యమ్మౌనికుమారుఁ డీ కుటిలుఁ డిం♦కన్ బోవఁ డెబ్భంగి నీ
తనిఁ దప్పించుకొనంగఁజాలుదును భ♦క్తక్రీతుఁడౌ శర్వుఁ డిం
కను నాపైనిఁ బ్రసాదముల్ సలుపఁ డీ♦ కష్టంబు నెట్లోఁదెదన్. 394

—* ఉపమన్యుని మెచ్చి శివుఁడు ప్రత్యక్షమగుట *—

క॥ అని యంత నఘోరాస్త్రము, మనమున యోజించుచుండ ♦ మంజుళభేరీ
ధ్వనులును కాహళమురజా, ధ్వనులును విననయ్యె చదలు♦ధవళంబయ్యెన్. 395

వ. వెఱంగుపడి దిక్కులు సూచుచున్నంత నైరావతగజంబుతో నాఖండలుం డదృశ్యుండై యచ్చోట.

సీ॥ హంసరాజ్యేందుకుం♦దారవిందబిసాళి, యవ్యాదు ధవళవ♦ర్ణంబుతోడ
వజ్రసారములు సు♦వర్ణప్రభములు దీ,క్ష్ణంబులై మించు శృం♦గములతోడ
విపులతరస్కంధ ♦ విలసితంబును సురూ, పంబై యలరు నూపు♦రంబుతోడ
రంగారు బంగారు ♦ రామణీయకతఁ జె, న్నారెడు తొడవుల ♦ తీరుతోడ

గీ॥ మహితమధుపింగళాక్షియు♦గ్మంబుతోడ, లీలఁ గ్రాలెడు మేల్ గంగ ♦ డోలుతోడ
నింబుమీఱినకృష్ణపు♦చ్ఛంబుతోడఁ, దనరువృషభేంద్రమును ముని♦తనయుఁడుగనె.

వ. అనంతరంబున.

సీ॥ ఆహిమగిరిఁబోలి♦నట్టి వృషంబెక్కి, యుమతోడ మురియుచు♦నున్నవానిఁ
బున్నమచందురుఁ♦బోలి తాఁ జల్లని, వెన్నెలగురియుచు ♦ వెలయువాని
వేయిసూర్యులఁబోలి ♦ విశ్వంబు లెల్లను, గాంతుల నిండారఁ ♦ గప్పువానిఁ
బ్రళయానలము భంగిఁ ♦ బటుతర తేజంబు, లొక్కుమ్మడిగఁ గుప్పు ♦ చున్నవాని

గీ॥ శివునిఁ బొడఁగాంచి యుద్విగ్న ♦ చిత్తమునను
మరల నిదియేమొ యని యను ♦ మానమొంది

యంతనే సౌమ్యుఁడై విధూ ♦ మాగ్నిపోల్కి-
మెఱయు గౌరీశ్వరునిఁ గాంచె ♦ హరుసమునను. 398

ఉ॥ తెల్లని యంబరంబులును ♦ దెల్లని బూదియుఁ దెల్లగంధముల్
దెల్లని పుష్పహారములు ♦ దెల్లని జందెము దెల్లనౌ నగల్
దెల్లనిదౌ ధ్వజంబు గడుఁ ♦ దెల్లనిదౌ యెడ లష్టబాహువుల్
నల్లని కంఠముల్ త్రినయ♦నంబులు రంజిలు శర్వుఁ గన్గొనెన్. 399

సీ॥ పల్లజడలలోనఁ ♦ బద్మకోరకమట్లు, బాలేందు శకలంబు ♦ పరిఢవిల్ల
త్రేతాగ్నులట్లు దే♦దీప్యమానములైన, మూడునేత్రములు వి♦స్ఫూర్తిఁబొదల
బంగారురంగారు ♦ పద్మహారంబులు, వసుధకెల్లను సౌర♦భంబు నొసఁగ
తకధోంథిమింధిమి♦ధంధణా యనుచు మ, స్తమున గంగమ్మ నృ♦త్తంబుసలుపఁ
గీ॥ దనకు సరిదూఁగు బలమొప్పి ♦ దట్టులైన
యనుచరశ్రేష్ఠులెల్లెడ ♦ ననుసరింప
మూర్తిమంతంబులగు నస్త్ర ♦ ములును గొలువ
నెమరఁ గన్పడె మునికి స♦ర్వేశ్వరుండు. 400

సీ॥ ఇంద్రాయుధముడాలు ♦ నీసడించుపినాక, మనియెడు సప్తశీ♦ర్షాహిధనువు
అఱనిమిసములోన ♦ నఖిలజగములకు, సున్నఁజుట్టించు పా♦శుపతమస్త్ర
మవని నెల్లను రజం♦ బగునట్టు లొనరింపఁ, జాలినయట్టి త్రి♦శూలవరము
సర్వాసురావళీ ♦ సంహారకంబయి, భవ్యకీర్తిఁదనర్చు ♦ పరశురాజ
గీ॥ మితరసాధనములును న ♦ నేకవిధము
లగుచు నష్టాదశభుజంబు ♦ లందు నమర
దిక్కరులతూఁగు మాన్పించు ♦ దివ్యడమరు
కార్భటులుమ్రోఁయఁ గన్పడె ♦ హరుఁడు మునికి. 401

మ॥ కుడిప్రక్కన్ బరమేష్ఠి హంసముపయిన్ ♦ గూర్చుండి సేవింపఁగా
నెడమన్ బన్నగవైరి నెక్కొని హృషీ ♦ కేశుండునున్ గొల్వఁగా
నడుమన్ శ్రీజగదంబ కట్టెదుర ఘుం ♦ టాశక్తులన్ దాల్చి స్కం
దుఁడు నెమ్మిన్ భజియింప దంతిముఖుఁడున్ ♦ దోడ్తోడ రాణింపఁగా. 402

క॥ రెండవ శంకరుఁ డనఁగా, నిండగుసిరిఁ దనరు నంది ♦ నేరుపుమీఱన్
మెండగు త్రిశూలమును గొని; దండిగ నలుగడలఁ గనుచుఁ ♦ దాఁజరియింపన్.

మ॥ అల స్వాయంభువముఖ్యులౌ మనువు లా♦యంభోజజన్మాదులున్
విలసన్మౌనివతంసులౌ భృగుముఖుల్ ♦ వృత్రాసురఘ్నాది ది
వ్యులు భూతప్రమథాళి మాతృకలునున్ ♦ భూతేశ్వరున్ జుట్టి పె
క్కులు స్తోత్రంబు లొనర్చుచుండిరి కడున్ ♦ గోలాహలంబొప్పఁగా. 404

క॥ హరి యగ్రసామబుక్కులఁ, బరమేష్ఠిరథంతరమునఁ♦బాకారి మహో
త్తరశతరుద్రీయంబున, హరునిన్ స్తుతిఁ జేయుచుండి ♦ రవ్యగ్రమతిన్. 405

క॥ పరిక్షిప్తార్కునివలె నిస్తరమధ్య వెలుంగు సాంబ♦శంకరుఁగని సం
బరమొంది మునితనూజుఁడు, ధరఁజాఁగిలఁబడి యొనర్చె♦ స్తవ మిప్పగిదిన్ 406

వసంతతిలకావృత్తము. శ్రీమన్మహేశ! సుర ♦ సేవితపాదపీఠా!
వామాఙ్కశోభిత శి♦వాపరిరబ్ధమూర్తీ!
కామప్రకామతర ♦ గర్వవిభంజనాఢ్యా!
సామోక్తిగీతరత! ♦ సామజచర్మచేలా! 407

## —* ఉపమన్యుఁడు శివుని స్తుతించుట *—

సీ॥ దేవదేవ! మహాను♦భావ! యవిజ్ఞేయ, విగ్రహ! దేవేంద్ర♦వేషధారి!
ఆదిత్యలోచన! ♦ ఆదిత్యవక్త్ర! యా, దిత్యబింబగత యా♦దిత్యవర్ణ!
నారీనరశరీర! ♦ నాగహారగ్రీవ!, సర్వార్తిభంజన! ♦ సాంఖ్యగమ్య!
యోగిపూజిత! యచిం♦త్యోదంతదుర్గమ!, సర్వవర్ణోజ్జ్వల! ♦ సౌమ్యమూర్తి!
గీ॥ కృష్ణపింగళ! సోమ! య♦గ్నిముఖనేత్ర!, చంద్రసాహస్రలోచన! ♦ సౌమ్యవదన!
చారుమణిమయమకుట కే♦యూరధారి!, వందనములొనరించెద ♦ వరద!నీకు.

క॥ లోకోత్పత్తిస్థితివిల, యాకర! కందర్పదర్ప ♦ హర! కాలహరా!
నాకారిపురహరా! నా, ళీకోద్భవశీర్షహర! గొ♦లిచెద మది నిన్నున్. 409

కవిరాజ విరాజితము } పవనరయోన్నతి♦భాసుర! భూరిప్ర ♦ భంజనరూపవి ♦ భాస్వర!చి
ద్భవన! చిదాత్మక! ♦ పాలితవిష్టప!♦భక్తజనార్తివి♦భంగకరా!
భవ! కరుణాకర! ♦ పాలక! యంధక♦భంజక! దుర్భవ♦భంజక!శ్రీ
శివ శివ శంకర! ♦ శ్రీకర!జోతలఁ♦జేసెదఁ బ్రేముడిఁ ♦ జేకొనుమా!

సీ॥ సురలయెడను నీ వ♦జుఁడవు రుద్రుల నీల, లోహితుండవు నీవ ♦ లోలహృదయ!
ఆదిత్యులందుఁ బ♦ద్మాక్షుండ వగు దీవు, వసువులయందుఁ బా♦వకుఁడ వీవు
అలమరుత్తుల వారి♦హాయఁడవు జక్కుల, యందుఁ గుబేరుండ ♦ వయ్య! నీవు
సాంఖ్యమునఁ బురు♦షప్రతీతుండవు, నఖిలభూతములందు ♦ నాత్మ వీవు
గీ॥ గ్రహసముచ్చయమందు భా♦స్కరుఁడవీవు, ఋషివితానమున వశిష్ఠ♦ఋషివినీవు
చుక్కలందును జాబిల్లి ♦ వక్కడలులఁ, బాలకడలివి లోకైక ♦ పాలనీవు!

ఉ॥ కొండలలోన మేరువవు ♦ గొప్పగుయోగుల శంకరుండ వీ
వండజరాజియందు విన ♦ తాత్మజమూర్తివి పాములం దనం
తుండవు గ్రామ్యజంతుతతి ♦ దొడ్డ వృషంబవు వర్ణకోటి వి
ప్రుండవు చాపలందునను ♦ పాల్చెద నీశ్వర! దీక్షితుండవై. 412
క॥ శ్రుతులందు సామవేదమ, వతులయజుర్మంత్రతతుల ♦ హవణించులస
చ్ఛతరుద్రీయంబవు పితృ,తతి వైవస్వతుఁడ వీవు ♦ దాక్షిణ్యనిధీ! 413

క॥ వనమృగముల సింగమ్మవై, యనువగు నాశ్రమములన్ గృ ♦ హస్థాశ్రమివై
ఘనగతులఁ మోక్షమ్మవై, యనిశము రాణించుచుందు ♦ వసదృశతేజా!

మ॥ పరమేష్ఠిన్ నిజదక్షిణాంగమున వి♦శ్వస్రష్టఁబుట్టించి శ్రీ
ధవు వామాంగమునఁ జగస్థితికి సం♦ధానించి యాపై నెదన్
హరణంబుఁ బొనరింప రుద్రునటులే ♦ యావిర్భవింపంగఁ జే
సి రహిన్ జిత్రముఁ జూచుచుందువు జగ♦త్సేవ్యా! కృపాంభోనిధీ ! 415

చ॥ ఎఱుఁగక నీమహేంద్రతను ♦ వెగ్గలుపల్కితి మ్రొక్కుకుంటి నీ
చరణసరోరుహంబులకుఁ ♦ జక్కఁగఁ బాద్యమొసంగ నైతి నా
దరమున మత్కృతంబు దురి♦తంబు నడంపు క్షమింపుమింపునఁ
వరద! కృపాకరా! ప్రణత♦వత్సల! భక్తుఁడ జోతచేసెదఁ. 416

క॥ అని యడుగులపై వ్రాలిన, మునితనయుని గ్రుచ్చియెత్తి ♦ మోదమున శిర
స్సునఁ జేయిడి మృదుమధురవ, చనములతో నిట్టులనియె ♦ సాంత్వనమొప్పఁ.

చ॥ మది ముదమొందినాఁడ నుప ♦ మన్యుమునీశ్వర ! భక్తవర్య ! నీ
కుదురగుభక్తిఁ గన్గొనఁగ ♦ గొప్పగ నిట్లు పరీక్షచేసితిన్
బెదరదు నీదు భక్తి యిఁక ♦ జెందుము సిద్ధులుఁ గోరుకొమ్ము నీ
విదియుదియంచుఁ గొంకక య♦భీష్టవరంబుల నిత్తు వేడుకన్. 418

వ. అనునంత నుపమన్యుండు,

ఉ॥ ఇప్పుడె పుట్టినాఁడ జగ♦దీశ్వర ! జన్మముభాగ్యమొందె నీ
గొప్పసురల్ మునుల్ ఋషులు ♦ గోరి భజించిననైన దర్శనం
బెప్డు దొసంగనట్టి పర♦మేశుఁడ విట్టులు దర్శనంబు నా
కిప్డు దొసంగి యావరము ♦ నిచ్చితి వింతకు నెక్కుడున్నదే. 419

గీ॥ వరమునకు నేనుదగియున్న ♦ వరద! నీదు, భక్తి నిడు మఖిలజ్ఞత్వ♦భాగ్యమిమ్ము
బంధువులతోడ క్షీరాన్న♦భక్షణంబు, నొసఁగుమాయాశ్రమమునసీ♦వుందుమెపుడు.

## —* శివుఁడు ఉపమన్యునకు వరంబు లిచ్చుట *—

వ. అనుటయు మహేశ్వరుండు,

సీ॥ ముదిమి దెవుల్ మృతి♦మున్నగునవి లేక, నిత్యయౌవనముతో ♦ నెగడుచుండు
యశము తేజమునుది♦వ్యజ్ఞానమును జెంది, ఋషులందుఁ బెంపావ♦హిల్లఁదనరు
మాచారమును గుణా♦ఢ్యతయు సర్వజ్ఞత, ప్రియదర్శనత్వంబు♦పెంపు జెందు
మమృతసంయుతము క్షీ♦రాన్నంబుఁ గుడువఁగ, పాలసంద్రంబు నీ♦వజ్జనుండు

సీ॥ బంధువులతోడఁ బుత్రమిఁ గ♦ళత్రంబు మెలఁగి, నన్ను జేరఁగవత్తు వా♦నందమునను
అక్షయంబగు నీవంశ ♦ మలరుదు రిల, బంధుగులు నీకు నాయందు♦భక్తియమరు

క॥ నీయాశ్రమమున లింగము నై యుండెద నెల్లకాల ♦ మామోదమునన్
బాయుదు నిపుడచ్చోటికి, జేయుదు నీకెపుడు మేలు ♦ సేకుఱఁ బుత్రా! 422

క॥ పెంతువు నాభక్తిని గా, వింతువు కృష్ణాదులకు భు♦విన్ మద్దీక్షన్
మింతువు సర్వోన్నతి బో, ధింతువు పాశుపతతత్త్వ ♦ దివ్యద్గరిమన్. 423

గీ॥ అనినుడివి పాదుకద్వయి♦నమ్మునీంద్రు, నకునొసఁగి బుజ్జగించి పి♦నాకధరుఁడు
సూర్యకోటిసమప్రభా♦శోభితుండు, తనదుగణములతోడ నం♦తర్ధిఁజెందె. 424

వ. అంత మునీశ్వరుం డత్యంతసంతుష్టుండై వ్రతసమాప్తి బొనరించి దివ్యతేజస్వియై తత్క్షణంబు తమ యాశ్రమంబుఁ జేరి నిజజననీపాదారవిందంబులకుఁ బునఃపునర్వందనంబు లొనరించి శివప్రసాదం బాద్యంతంబుఁ దెలిపిన నామహాసాధ్వియు నమితానందంబునొంది కుమారు నభినందించె. శివానుగ్రహంబున నవ్వారల కఖండధనధాన్యసమృద్ధియు క్షీరసాగరప్రాప్తియుఁ గలుగ బంధుజాలంబుతో నిత్యంబు క్షీరాన్నభక్షణం బొనరించుచు నీశ్వరుసేవించుచు సుఖంబుండి రీ పావనచరిత్రంబెవ్వరేనిఁ జదివిన వినిన నవ్వారలు మనీషితార్థంబు లొందుదు రిఁకఁ గిరాతేశ్వరలీల నెఱిఁగింతు వినుం డని సూతుండు మునుల కిట్లనియె. 425

—* కిరాతేశ్వరలీల అర్జునాస్త్రప్రాప్తికథ *—

ఉ॥ కౌరవనాథుఁడా శకుని ♦ కైతన మొప్పిన జూదమందు బల్
ధీరులు శూరులై కడిఁది ♦ తేజుల మించిన పాండవేయులన్
నేరిమి గెల్చి వారిసిరి ♦ నెట్టనఁ జేకొనఁ జేసికొన్న య
త్తీరుపుఁబట్టి కానలకు ♦ దీనత నేగిరి పాండునందనుల్. 426

ఉ॥ వారినిఁ జూడఁగా నటకు ♦ వారిజలోచనుఁడైన శౌరి బల్
పేరిముతోడ వచ్చి కని ♦ బిట్టుగ దుఃఖిలుచున్న ద్రోవదిన్
ధీరురెయయ్యెఁ బెన్వఁగలఁ ♦ దేకువమాలిన పాండుపుత్త్రులన్
బేరిమి నూరడించిఁ కడుఁ ♦ బెంపును నింపును గూర్చుచుండుదున్. 427

ఆ॥ ధర్మతనయుఁడనియెఁ♦దామరసాక్ష! యె, ట్లనియిడుములోర్చి♦యీసమయముఁ
దీర్చువార మవలఁ ♦ దెరువేది గురుభీష్మ, కర్ణద్రోణసుతులఁ ♦ గడచుటకును.

క॥ రారాజు దుస్ససేనుఁడు, వారల తమ్ములును సింధు ♦ పతియును గడు దు
ర్వారబలదర్పఘను లిఁక, వీరల నందఱ జయింప ♦ వీలగు నెట్టుల్. 429

చ॥ మఱియును రాజసూయమున ♦ మారుతితోడను గ్రీడితోడనున్
బరిభవ మొందినట్టి జన ♦ పాలురు మత్సర మొంది యుద్ధతిన్

గురుపతిఁజేరి మీఱి మముఁ ♦ గూల్పఁదలంచుచు నున్న వారు దు
ర్భరమగు వీరినందఱ దుఃరంబున నోర్వఁగఁ బద్మలోచనా ! 430

ఉ॥ ఏది యుపాయ మిందు మము ♦ నెట్టుల సాఁకఁదలంతువయ్య ! దా
మోదర ! నీవకాక మఱి ♦ యొక్కఁడు గల్గునె మాకు దిక్కు ? నీ
వాదఁట జిత్తమందుఁ గడు ♦ నారసి మేలగునట్టి మార్గముల్
గాదిలిప్రేమఁ దెల్పు మది ♦ గాటపుపూన్కి నొనర్తు మిత్తఱిన్. 431

క॥ అనిన వనజాక్షుఁ డారసి, యనియెను ధర్మజునితోడ ♦ ననఘచరిత్రా !
మునివరుఁ డుపమన్యునిశా, సనమున నే శివునిఁ గొలిచి ♦ శక్తులు గొంటిన్.

చ॥ అభవుఁడు సంశ్రితార్తిహరుఁ ♦ డద్భుతశౌర్యధురంధరుం డన
ద్విభవహరుండు మీరికను ♦ విశ్వవిమోహనధీరుఁడైన య
వ్విభుని భజించి చేకొనుఁడు ♦ వెగ్గలమొప్పు సమస్తసంపదల్
రభసములేని మార్గ మిది ♦ రాజలలామ ! తలంచి చూడుమా ! 433

గీ॥ పరమశివుని కృపోన్నతిఁబడసి యేను, గడుబిరుదులైన రిపుల నుక్కఱ వధించి
నాఁడఁ గల్యాణములఁజెంది నాఁడసుతుల, వరమతులఁగాంచినాఁడ నృపాలతిలక !

—॥ వ్యాసమహాముని పాండవులయొద్దకు వచ్చుట ॥—

క॥ అనిచెప్పి వనజనేత్రుఁడు, చనియెను ద్వారకకు నంత ♦ నన్మునినాథుం
డనఘుఁడు కృష్ణద్వైపా,యనుఁడు ఘనుం డరుగుదెంచె ♦ నవ్వారిఁ గనన్.

ఉ॥ వచ్చిన మౌనిఁ గన్గొని నృపాలురు చాల ముదంబుఁజెంది మేల్
హెచ్చినభక్తి నర్చనల ♦ నెంతయుఁ జేసి సుయోధనుండు బల్
మచ్చరమొప్పఁగాఁ గడిఁది ♦ మాయపుజూదముఁ బన్ని గెల్చి రా
లచ్చినిఁజెంది కాన కిటుల్ దమ్ముఁబంచుటఁ జెప్పిరార్తులై. 436

క॥ మఱియున్ బాంచాలియుఁ దన, పరిభవమును దుస్ససేను ♦ పశుకృత్యమునన్
గురుపతియవినీతియు దు, ర్భరవేదనఁ జేయు కర్ణుపరుషోక్తులనున్. 437

క॥ ఎఱుఁగంగఁజెప్పి కడు వం, దురుచుండఁగ మౌనివరుఁడు ♦ ద్రోవదిచింతన్
హరియించుచుఁ బాండవులకుఁ, గరమనురాగముననోర్పుఁగఁ బలుచుననియెన్.

ఉ॥ మీరలు చాలఁ గష్టములు ♦ మేకొనిరన్ సుకృతార్థులై హితం
బారసి సత్యముల్ దొరఁగ ♦ రభ్యుదయంబగు మీకు నిట్టులే
ధారుణిలోన సజ్జనులు ♦ దద్దయు బ్రాణవిమోక్షమందునున్
మీఱరు ధర్మపుం దెరువు ♦ మేరను ధీరమనీషులై పొరిన్. 439

క॥ కౌరవులును మీరును నా, కారయఁగా నొక్కభంగి ♦ యైనను ధర్మ
శ్రీరహితేఁ జెందుట మీయెడఁ, గూరిమి కరమలరుచుండు ♦ గుణరత్ననిధుల్ !

వ. అనినంత.

ఆ॥ పాండవాగ్రజుండు ♦ పలికె మహాత్మ ! నీ, విందురా ముదంబుఁ ♦ జెందె మనము
దీఱిపోయె వగలు ♦ తెలివిగా నిఁకమీఁద, సర్వసంపదలు పొ♦సంగఁగలవు. 441

ఉ॥ దేవర! పావనుండు వసు ♦ దేవసుతుండల శౌరి యమ్మహా
దేవు భజించిరన్ రిపులఁ ♦ ద్రెళ్ళఁగఁ జేయునటంచు నెక్కుడౌ
శ్రీవిలసిల్లు సంపదలఁ ♦ జెన్నెసలారఁగ నిచ్చునంచు స
ద్భావముతోడఁ జెప్పె చనె ♦ భర్గుని నెట్లు భజించువారమో ? 442

చ॥ అనిన ఋషీంద్రుఁ డిట్లనియె ♦ నర్జునె సౌఖ్యనిధానమౌ పథం
బనితరతుల్య మా హరు మ♦హాత్మునిఁగూర్చి తపంబొనర్చ నీ
యనుజునిఁ గవ్వడిన్ బనుపు ♦ మాతఁడు ధీరుఁడు కార్యసిద్ధి వే
గనె పొనరించి వచ్చెడు న♦కల్మషచిత్త! యటుల్ పొనర్పుమా! 443

క॥ మీరిటుల సల్పకున్నను, వైరులఁ జెనకంగలేరు ♦ వాస్తవ మిది య
క్కౌరవనాథుఁడు పెక్కురు, శూరులసాయమును జెంది ♦ శోభిలుచుండెన్.

చ॥ అలఁతులఁ బోదురే గురుఁడు ♦ నభ్రధునీతనుజుండు చివ్వలో
నలిగిన వీరి నోర్వఁగల ♦ యాజసికుం డెవఁ డల్లకర్ణుఁడున్
బలియుఁడు ద్రోణజుండు పరి ♦ పంథివిదారణధీరుఁ డట్టివా
రలగెలుపొందువారలె? పు ♦ రద్విషు సాయములేక పాండవుల్ ! 445

చ॥ పరమశివున్ దగన్ గొలువ ♦ భర్గుఁడు పాశుపతాస్త్రరాజ మా
దరమలరారఁగా నొసఁగు ♦ దాన నుదగ్రవిరోధికోటులన్
దురమున లెక్కసేయకయె ♦ త్రుంచఁగఁజాలుదు రట్టులౌట శం
కరుని భజింపఁబూనుఁడిఁకఁ ♦ గర్జము నిర్వహిలున్ కుమారకుల్ ! 446

వ. అర్జునున్ జూచి

చ॥ చనుమిఁక నింద్రకీలమను ♦ శైలము జహ్నుసుతాతటంబునన్
బొనరు నటన్ వసించి తప ♦ మున్ సలుపంగఁ దలంపు శక్రవి
ద్యను జెపుదున్ మొదల్ దొడరి ♦ దైవతనాయకు నాశ్రయింపు మా
ఘనుఁడిఁక నెట్టివిఘ్నములు ♦ గల్గఁగనీక తపంబు సాఁకెడున్. 447

క॥ అని నొడివిన విప్రచ్చుం,డును సమ్మదమొంది నే న♦టులె సేతుఁ దపం
బనఘా ! తపోవిధానం,బును వంత నెఱుంగఁ జేయు♦పొందికమీఱన్.

గీ॥ అనుటయునతండు శక్రవి ♦ ద్యనునొసంగి, పార్థివేశసమర్చనా♦పద్ధతియును
దన్మహామంత్రములఁ దెల్పి♦తఱలెనంత, నర్జునునిఁ జెందెఁ దేజశ్చ♦యంబులపుడు.

వ. అట్లు తేజంబు లొందినమీఁద

ఉ॥ తక్కిన పాండునందనులు ♦ ద్రౌపదియున్ గడు దివ్యదీప్తులన్
నెక్కొని మించు నర్జునుని ♦ నెట్టనఁ గన్గొని యుబ్బి వైరులన్
జక్కడఁగింతు మింకఁ గొనఁ ♦ జాలుదు మేమె జయంబు రూఢిగా
నక్కటికంఠదేవుని మ♦హాకరుణన్ గొని యస్త్రలాభమున్. 450

క॥ అని సంతసించి యవ్విజ, యునిఁ బాయుట కాత్మఁ దలఁకు♦చుండిన నవ్వా
రినిఁ గని కిరీటి యచిరం, బున సిద్ధినిఁ బడసి వత్తు ♦ పొలుపుగ నిటకున్. 451

గీ॥ సెలవొసఁగుఁడన్నఁ బాండవుల్ ♦ చింతఁదక్కి, పోయి వేగనె వరసిద్ధిఁ♦బొందిరమ్మ
నిరియటుల్ కృష్ణ శివమగు♦నీకుఁబథము, శంకరుఁడుశంకరుండగు♦సంతతమ్ము.

—* అర్జునుఁడు తపస్సుకై యింద్రకీలాద్రికిఁ బోవుట *—

వ. అనుటయు నర్జునుం డన్నలగు యుధిష్ఠిర భీముల పదంబులకెఱఁగి కవలఁ గౌఁగి
లించుకొని పాంచాలరాజసుతన్ గారవించి పయనంబొనర్చి యుత్తరాభి
ముఖుండై సుశకునంబులఁ బరికించుచు నింద్రకీలాద్రిఁజేరి యందు గంగాకూలం
బున నమరు నశోకవనిఁ బ్రవేశించి యొక సుస్థలంబు నాశ్రమంబు చేసికొని
గురూక్తప్రకారంబుగ నింద్రియంబుల నిగ్రహించి నియతంబుగ గంగావగాహ
నంబొనర్చి భస్మపుండ్రాంకితతనుండై త్రికాలంబుఁ బార్థివలింగపూజనంబొన
ర్చుచు శక్రవిద్య ననుష్ఠింపుచు మహేశ్వరుఁ గొల్చుచుండె. 453

గీ॥ అంత శక్రుండు విజయుని♦యాత్మమును బ, రీక్ష సేయఁగ బ్రహ్మచా♦రియయి డాయ
నర్జునుఁడు తత్పదమ్ముల♦యందు వ్రాలి, యర్చనముసల్పినంత నా♦యమరవిభుఁడు.

క॥ తప సేటికి నొనరించెదు, విపులమతీ! యనినఁ గ్రీడి♦విప్రోత్తమ! నే
రిపులను జయించి మాదౌ, యపు సిరిఁ గొన నెంచి తపసు♦నర్థినొనర్తున్. 455

క॥ అని తెలిపిన నాతండును, ఘనతప మొనరించి పుడమిఁ♦గాంక్షింతురె? ము
క్తినిఁదక్క యొందు నిట్టుల, వినలే దెపుడేని యనుచు ♦ వికవిక నగుచున్. 456

క॥ కోరుము మోక్షము రాజ్యముఁ, గోరకు వజ్రంబునిచ్చి♦కొందురె కాచం
బారసి యెవ్వండేనియు, ధారుణిలో రాజతిలక! ♦ తలఁపు మిది మదిన్.

గీ॥ అనిన ఫల్గునుఁ డనియె ధ♦రామరేంద్ర!, నీవనిన వచనం బెంత♦నిక్కమైన
పదియునాల్గవయేట నేఁ♦బగఱ గెడపి, రాజ్య మగ్రజున కొసంగఁ♦బ్రతినఁగొంటి.

క॥ అక్కటతన రాజ్యకాంక్షన్, జిక్కితి నన నతఁడిదేటి ♦ చేష్ట యిపుడు నే
నక్కటలువాసి మోక్షము, దక్కగొనుము గానిచో వృ♦థాయగుఁ దపమున్.

సీ॥ అనిన గినుకొంది విజయుండా ♦ యగ్రికులనిఁ
గని యనియెఁ బొమ్ము నీకేటి ♦ కనవసరపు
జోలి యన మానకితఁడు హె♦చ్చుగ వదింపఁ
జాలు మాటాడ కిఁకమీఁద ♦ శాస్త్రియగును. 460

క॥ అనినంత నమ్మహేంద్రుఁడు, తనయుని ధీరమతి కాత్మఁ ♦ దద్దయు ముదమున్
గొని యంతనె నిజరూపం, బనువుగ ధరియింపఁ గాంచి ♦ యర్జునుఁ డంతన్.

క॥ బిడియపడి యమ్మహేంద్రుని, యడుగులఁబడి యెంతయేని ♦ యభినుతి సేయన్
గడు మెచ్చి యనియె నాకే, శుఁడును గుడాకేశుతోడ ♦ సొంపుగ నిట్టుల్.

క॥ వర మడుగు మిచ్చెదను సత్వరము కుమారా! యనుడు స♦తం డంత సురే
శ్వర! శాత్రవవిజయము సే, కుఱఁ జేయుము నాకటన్న ♦ గోత్రారియనున్. 463

ఉ॥ ద్రోణుఁడు జాహ్నవీసుతుఁడు ♦ దోర్బలవిక్రముఁ డల్ల కర్ణుఁడున్
ద్రోణసుతుండు తావకవి♦రోధివశంబున నున్నవా రని
ప్రాణపరాక్రముల్ సమర♦దక్షులు వారల గెల్వ రెట్టి గీ
ర్వాణులు శూలపాణి యగు ♦ భర్గుఁ డొకండు వినాగ ఫల్గునా! 464

ఉ॥ కావున నీ వవశ్య మిఁకఁ ♦ గవ్వడి! నెవ్వడిఁ గాలకాలునిన్
భావమునందు నెక్కొని త♦పం బొనరింపు మతండు సత్కృపా
శ్రీవిభవాంతరంగుఁడు వి♦శిష్టుఁడు సర్వజగంబులందు నా
దేవుఁడు నీకొసంగునిఁక ♦ దివ్యము పాశుపతాస్త్రరాజమున్. 465

గీ॥ దాన నీ కిఁక సుకరంబు♦గా నితాంత, శూరులగు భీష్మముఖ్యుల ♦ బీరమణఁచి
ధార్తరాష్ట్రులఁ గడపి భ♦ద్రముగ రాజ్యలక్ష్మిఁ జేకొందువిందు జా♦లంబు లేదు.

క॥ ఇఁక నామంత్రంబు జపిం, పకుము పినాకిని సతమ్ము ♦ భావములోఁ బా
యక సేవించుచునుండుము, సకలసుఖంబు లొనఁగూడు ♦ శర్వునికరుణన్.

క॥ అని నొడివి యంత సంక్రం, దనుఁడు నిజానుచరులను ద♦నయునకున్ దో
డొనరించియుంచి క్రమ్మఱఁ, జనియెను స్వస్థానమునకు ♦ సమ్మదమొదవన్.

గీ॥ అర్జునుఁడపుడు జనకుని♦యాజ్ఞ తీరు, శంకరునిఁ బదిలము చేసి ♦ స్వాంతమందు
ఏకపాదమ్మునన్నిల్చి♦యేకనిష్ఠ, సలిపెఁ బంచాక్షరీమంత్ర ♦ జపము రహిని. 469

గీ॥ అంతఁ గొన్నాళ్ళు జరిగిన♦యంతమీఁద, శంకరుండు దయన్ జెంది ♦ సవ్యసాచి
నిం దకపరీక్షఁ జేయఁగ ♦ నెంచియొక కి, రాత రాజాకృతిని జెంది♦ రాణ గదుర. 470

—* మూకాసురుఁడు సూకరమై యర్జునునకుఁ గీడు సేయ వచ్చుట *—

గీ॥ పలువురుగిరాతులనుగూడి♦ పాండవేయుఁ, దరియుచుండఁగ నొకమూక♦దైత్యుఁ డప్డు
ధార్తరాష్ట్రుని ప్రేరణఁ♦దటిసి సూక, రాకృతిన్ జెంది యర్జును ♦ నంతికమున.

క॥ కడురోదఁ జేయుచు నిటునటు, బుడిబుడిఁ దిరుగుచుఁ గిరీటిఁ♦బొదువఁగ నుంకిం
చెడు చెడునిశాటుఁ గనుఁగొని, యెడఁదన్ యోజించె నప్పా♦డింద్రజుఁడిట్టుల్,

క॥ వీఁడెవ్వఁడొ రక్కసుఁడిటఁ, బోడిగ నరుదెంచి నన్నుఁ♦బొదువఁగనునటుల్
చూడఁగఁదోఁచెను మిన్నక, రాఁ డరివర్గంబులోని ♦ రక్కసి యితఁడా. 473

క॥ పలువురు రక్కసులను నేఁ, బొలియించితి వీఁడు వారి ♦ పొలఁకువ యగునో
ఖలుఁడగు దుర్యోధనునకుఁ, జెలికాఁడై నన్నుఁబొదువఁ ♦ జేరెనొ యిట్టుల్.

గీ॥ ఎట్టులైనను నీతం డ♦హితుఁడు నిజము, వీనిఁ గనుఁగొనఁ గలఁగెను♦మానసంబు
అలరు మిత్రునిఁజూచిన♦నంతరంగ,మరినిఁగనుఁగొన వ్యాకులం♦బై తనర్చు.

గీ కులము నాచార మెఱిఁగించుఁ ♦ గుడుపు నెఱుఁగఁ
జేయు దేహంబు శ్రుతమును ♦ జెప్పు వచన
మట్లు స్నేహంబు నెఱిఁగించు ♦ నక్షి యెందు
నిందు సందియ మొనర దొ ♦ క్కింతయేని. 476

క॥ ఆకృతిచేతను నడచే, జోకఁదనపు చెయిదిచేతఁ ♦ జూపులచేతన్
వాకులచే ముఖకలచే, లోకులు దెలియుదురు మనము♦లోని విధంబున్. 477

వ. మఱియు లాఁతులఁ జూచునపుడు లోచనం బుజ్జ్వలంబును సరసంబును వక్రంబు
నారక్తకంబునునై నాల్గువిధంబుల నమరు. 478

గీ॥ చెలిమిగలవారిఁ గనఁగ ను ♦ జ్జ్వలమయి తగుఁ
గొమరులన్ జూడ సరసమై ♦ కొమరుమిగులుఁ
గామినులఁ జూచినంత వ ♦ క్రిమగుచుండుఁ
బగరఁగనఁగ నారక్తమై ♦ పరఁగు నక్షి. 479

వ. అట్లు కావున

క॥ వీనిన్ గనుఁగొనినంతనె, నానేంద్రియరాజి గలఁగె ♦ నాకిఁక వీనిన్
బోనీక పట్టిచంపుటె, యా నుచితపుఁదెఱఁగు గురుని ♦ యాజ్ఞయు నిటులే.

వ. అని యిట్లు కృతనిశ్చయుండై

గీ॥ గాండివము లాగి బాణమ్ము ♦ గదియఁ జేయు
చుండ నత్తఱిఁ బురశాస ♦ నుండు వరుని
పైఁ గలట్టికృపన్ మూక ♦ వధ నొనర్పఁ
గడఁగి యొనరించె నొకపాటి ♦ గర్జనంబు. 481

క॥ రోదసుల నిండి యా ధ్వని, భేదిల్లఁగఁజేసె నెంతొ ♦ బిట్టుగ గిరులన్
మోదమ్మున నర్జునుఁ డా, నాదము విని విస్మయము మ♦నమ్మునఁగొనియున్.

గీ॥ ఇట్లు గంభీరమగు నాద♦మీశ్వరుండె, సలిపియుండు మఱొక్కండు♦సలుపలేఁడు
శౌరియును బాదరాయణుం♦డారవిందు, పావకాత్ముని లీలలఁ♦బలుకలేఁడె!

క॥ ఆశివుఁ గొలిచెడివారికి, లేశంబేనియును సెగి♦లే దఘగర్మా
వేశంబున నొకయెడ నా, వేశించిన నడఁగిపోవు ♦ విశ్వేశుకృపన్. 484

వ. మఱియు నవశ్యభోగ్యంబగు ప్రారబ్ధదుఃఖంబులుగూడ భక్తవత్సలుఁడగుపర
మేశ్వరుండు గరుణించి యున్మూలనం బొనర్చు. 485

గీ॥ విసము నమృతంబుఁ జేయును ♦ విసముఁజేయు
నమృతమును నిచ్చతోడ నా ♦ యమృతమూర్తి
సర్పమునకు సముద్ధుఁడై ♦ చంద మెఱిఁగి
కొలిచి సిద్ధులఁ గొందురు ♦ కుశలమతులు. 486

గీ॥ ఇట్టులనుకొనుచుండఁగ ♦ నీశ్వరుండు, దారసిలి యర్జునునిఁగావ ♦ దానవునివ
యిన్ శరంబేసెనంత నే♦యింద్రసుతుఁడు, కయిదువునుజార్చి కపటసూ♦కరముమీఁద.

—* కృతకకిరాతార్జునులు సూకరముపై బాణంబులేసి చంపుట *—

గీ॥ శివునిబాణంబు పృష్ఠంబుఁ♦జెంది నోట, వెలువడి ధరిత్రిఁ జెందెను ♦ శ్వేతవాహ
నునిశరమ్మును వక్త్రంబు♦నుండిపృష్ఠ, మున వెడలిపక్కఁబడియె న♦మ్మూర్ఖుఁడీల్గె.

క॥ సూకరతనువుఁ బోవిడి, రాకాసి నిజాకృతిన్ బ♦రాసుండయ్యెన్
నాకచరుల్ సుమవృష్టిఁ బి, నాకి పయిన్ నరునిపై నొ♦నర్చిరి వేడ్కన్. 489

వ. అంత

క॥ తనయమ్మును గొనిరమ్మని, యనుజీవిని నొకనిఁబంపె ♦ హరుఁ డాతండున్
జనుదెంచె సాయకముఁగొనఁ, దనబాణముఁగొనఁ బిరుందఁ♦దఱిసెవిజయుఁడున్.

గీ॥ అచటఁ బడియున్న బాణంబు ♦ హరునియనుచ
రుండు గొనఁబోవఁగా నర్జు♦నుండు వేగ
వాని బెదరించి కొనియెను ♦ బాణ మప్పు
డాతఁ డిట్లనె నిదియేటి ♦ యాగడంబు. 491

క॥ వినుముశరమ్ము ముని! మా, యొడయని బాణమనుడు విజ♦యుఁడు గడుఁగినుకన్
వెడగ! యిటులేల పల్కెదు, విడిచితి నేఁగాదె నాదు ♦ విశిఖము నిపుడే. 492

వ. రేఖారూపంబును మన్నామాంకితములగు పుచ్ఛంబులను గనుఁగొనరాదే యనిన
గాననచరుం డర్జునున కిట్లనియె. 493

ఉ॥ తాపసవేసమొంది యిటు ♦ దండిగ నుంటివి గాని నిక్కమా
తాపసి వీవుగా విటుల ♦ దబ్బరలాడుదురే? యట్లైనచో
పాపముగాదొకో యొరుల ♦ వస్తువుకై యిటు ప్రాకులాడఁగా
నీ పస యంతయున్ బొరయు ♦ నీ కిదిదక్క దెఱుంగు రూఢిగాన్, 494

ఉ॥ ఒంటిగ నున్నవాఁ డనుచు ♦ నూహయొనర్చితి వీవు నన్ను బల్
దంటలు భిల్లపుంగవు లు♦దారులు పెక్కురతోడ నిందె ని
ష్కంటకుఁ డాఢ్యుఁడౌ విభుఁడు ♦ చక్కఁ గనుంగొనుచున్నవాఁ డదే
యొంటికొనున్ శరంబు నిడు ♦ మూరక వాకొన కిట్టులెంతయున్. 495

ఉ॥ నీకుపకారమున్ సలుప ♦ నేగద మాదొర పూన్కితోడ ని
ట్లాకులుఁడై యిటుల్ దఱిసి ♦ యమ్మునఁ బ్రాణముఁ బుచ్చె వీని నీ
వాకృతమున్ దలంప విటు ♦ లక్కట! యెక్కతమిష్టసిద్ధియా
వాకున బొంకు మేలిడిన ♦ వానికిఁ గీడు దలంపు మాయురే! 496

ఉ॥ అమ్మున కాసనొందితివె? ♦ యట్టులనేని మదీయనాథు నీ
యమ్మిదుమంచు నష్టము మ♦హామహుఁ డాతఁ డొసంగు నిట్టి పె
క్కమ్ములు చాలఁగాఁ దనరు ♦ నాతనిదండ వితండవాదమున్
జిమ్ముము తెమ్ము బాణమును ♦ జెడ్డతనం బొడిగట్ట కిమ్ముగా. 497

వ॥ అనిన వనేచరునిఁ గాంచి సవ్యసాచి మించు నల్కతో మనంబున శివుఁ దలంచి
యవ్వాని కిట్లనియె.

ఉ॥ బొంకులు పల్కుచుంటి విటు ♦ పొల్పుగ నీదగు జాతితీరుగా
నింకను నిన్నుదుర్చుటకు ♦ నేఁ దలపన్ దగునొక్క రాజనై
మంకుకిరాత! నీదుసరి ♦ మానిసియే యొడయం డిఁకేల యీ
పెంకెతనమ్ము లమ్మడుగు ♦ పేర్మి నొసంగెద నిచ్చయున్నచో. 499

గీ॥ అనవుడున్ భిల్లుఁ డిట్లనె ♦ నకట! నీవు, ఋషివిగా విట్లు గోరెదు ♦ రిత్తచావు
నిమ్ము మాయేలుదొరసాయ♦కమ్ము వేగఁ, గానిచోఁ గడుఁ గ్లేశంబుఁ♦ గందు విప్పుడె.

క॥ అనఁ దిరుగఁ బార్థుఁ డనియెను, వనచర! దోర్దమ్ము నీదు ♦ భర్త నతనితో
ననిఁ జేసెద నీతోఁ బెనఁ,గను సింగము చనునె జంబు♦కముతోఁ బోరన్. 501

క॥ చూచెదవుగాని తాపస, వేచని తోర్దమ్ము నీదు ♦ విభుని ననఁ గడున్
జూచుచుఁ జని వేగంబె వ,నేచరుఁడు హరునకుఁ దెల్పె ♦ నేటుగ నంతన్. 502

క॥ విని శంకరుండు సైన్యం,బునుగొని చని క్రీడి కెదురఁ ♦ బొందించి రయం
బున మునుపటి యెఱుకును బం,పెను నర్జును ధైర్యమరయఁ♦ బేరిమి నతఁడున్.

ఉ॥ ఏటికిఁ గోల్పడన్ దలఁతు ♦ వీయటవీస్థలిలోనఁ బ్రాణముల్
మాటికి నీదు సోదరులు ♦ మానిని నీదుకలత్రమున్ గడున్
గాటపుదుఃఖ మొందుచును ♦ గాంక్షయొనర్తురు నీదు రాకకై
వాటము మీఱ శత్రువుల ♦ పాల్పడు రాజ్యము పాఱఁజూడుమా! 504

వ. అనిన విని యర్జునుండును.

గీ॥ నాదు సోదర్యులును మఱి♦ నాదుసతియు, శోక మెంతేనిఁ జెంది నొ♦చ్చుదురుగాక
నాదురాజ్యము శత్రుజ♦నము కెదక్కఁ, గాక నేనోడుదునె మీకుఁ♦ గఱటిమెఱుఁగు.

క॥ రమ్మను మీరాయొడయని నే,రమ్మనుమీ! యిట్టులాడ ♦ రాజులతో ఘో
రమ్మనుమీ! బవరము ఘో,రమ్మనుమీ! యన్నృత మెపుడు♦రహి నారసినన్. 506
ఆ॥ అనిన మరలవాఁడు ♦ హరున కీ వచనముల్, వినిచినంత శివుఁడు♦మనమునందు
మెచ్చి పోరుసేయు ♦ మేకొనినిలిచిన, హరునిఁ గుప్పె విజయుఁ ♦ డంపగముల.
క॥ హరునియనుచరులు సైనిక, వరులు నరునిపైన బాణ♦వర్షముఁబఱుపన్
సరకుగొన కంతయేనియుఁ, గిరీటి మనమందు హరునిఁ ♦ గేల్కొని వేగన్. 508

—* మాయాకిరాతార్జునుల యుద్ధము *—

గీ॥ గణపతులకై దువ్వులను దు♦న్కలనొనర్చి, వాఁడినారసములను స♦వ్యాపరిదూఱ
నేయ నెంతయునొచ్చి సుం♦తెడముఁ జెంది, యుభయులీశార్జునులు చేయు♦చుండిరనిని.
వ. అందు,
ఉ॥ శంకరుఁ డాత్మమందు దయఁ ♦ జాలఁగనొంది కిరీటిపైఁ గడున్
జంకుచు వేయు బాణములు ♦ శక్రసుతుం డిఁక లాగి లాగి బల్
బింకముఁ జూపుచున్ శివుని ♦ బిట్టుగ మోఁదుచునుండె నమ్మెల
న్వొంకమువీఱ వీరి దుర♦మున్ గనుచుండిరి నింగి దేవతల్. 510
గీ॥ అంతఁ గొంతవడికి నస్త్ర♦నాశుగములు, నస్త్రములు నెల్ల ఖిలమయ్యె♦నాత్మకవచ
మునుసురిగెనప్పుకొంకక♦స్ఫనుఁడు మల్ల, యుద్ధమునకుఁదొడంగెస♦న్నద్ధుఁడగుచు.
క॥ హరుఁడును బాండుసుతుండును, గరము పటుగ ముష్టియుద్ధ♦కౌశలురై బల్
బిరుదొప్పఁ బోరుచుండిరి, హరుసమ్మునఁ జూచుచుండి ♦ రమరులు చదలన్.
గీ॥ పట్టువదలక డఁ బార్థుండు♦ భగ్ననొంపఁ, బూని శ్రమఁ జెందుచుండ నా♦భూతనాథుఁ
డించుకేని యలయక హా♦సించుచున్నఁ, గాంచి లజ్జించి యీశ్వరు♦గాఁ దలంచి.

—* అర్జునుఁడు మాయాకిరాతుని శివునిగాఁ దెలిసికొని స్తుతించుట *—

చ॥ తెలిసితినయ్య! నిన్నఖిల♦దేవశరణ్య! వరేణ్య నీశ్వరున్
బలుమఱు గృష్ణుఁడున్ గురుఁడు ♦ బన్నుగఁజెప్పిరి నీ వినోదముల్
దలఁపఁగలేక యిట్లు దురి♦తమ్మొనరించితి సైఁపు మెట్టులేన్
గలుషచరిత్రు నన్ బరమ♦కారుణికాత్మ! మహాత్మ! యాదృతిన్. 514
గీ॥ అనినయంతనె శివుఁడు ప్ర♦హ్లాదరమున, తనదురూపంబుఁజెంద ఫ♦ల్గునుఁడుచూచి
మనమునందక్కజంబొంది♦తనదుచేష్ట, కైపునకు నంతవనరి వే♦గముగ మ్రొక్కె.
క॥ ఎవ్వనిఁ గొలుచుచునుంటినొ, యెవ్వనికృప నివ్వటిలునొ ♦ యీ భువనము లిం
కెవ్వఁడు సర్వేశ్వరుఁడో, యవ్విభు నేఁ దెలియనైతి ♦ నజ్ఞత బలిమిన్. 516
వ. అనికొని పశ్చాత్తాపంబుతో సాష్టాంగపడి శిరంబునం దంజలిఁ జేర్చి నిలిచియున్న యమరేంద్రనందను గనుఁగొని గిల్లి కయ్యంబొనర్చిన తన చైదమునకు మందహాసంబుఁ జేయుచు జగన్నాథుం డిట్లనియె.

చ॥ వగవ కొకింతయేని నృపవల్లభ! నీదగు ధైర్య మారయన్
నిగరపు శోధనం బిటుల నే నొనరించితి నీ ప్రహారముల్
దగఁ గతి నర్చవోలె నెడఁదన్ దలపోసితి నీదు తప్పు సుం
తగుపడ దింకఁ గోరుము రయమ్మున నీదు మనోరథమ్ములన్. 518

వ. మఱియు నాబాణమ్మునుగూడ నేనె మాటుపఱచి యిట్లు దురంబుఁ బొసఁగించితి
ననుటయు నర్జునుండు తిరుగ నమస్కరించి పరమేశ్వరున కిట్లనియె. 519

గీ॥ భక్తవల్లభుఁడవగు నీ భావమునకుఁ, గన్పడునె నాదు ననుచిత కార్య మభవ!
యిఁకను నీదు గృపాళుత్వ మెంతయేని, వర్ణనీయమగున్ గాదె వరద! నాకు.

క॥ చదలున రిక్కలఁ బుడమిన్, బొదలెడు రజములను వృష్టిఁ బొసఁగంబడునా
యుదకకణమ్ముల నీయెడఁ, గుదురగు గుణములను లెక్క గొనశక్యమొకో!

సీ॥ దేవదేవాయ సుధీగమ్యవిభవాయ, తేజస్స్వరూపాయ తే నమోస్తు
కైలాసవాసాయ ఘనపంచవక్త్రాయ, త్రివిలోచనాస్యాయ తే నమోస్తు
డమరుకపాలఖడ్గకరాయ యజగవ, త్రిశిఖాద్యహస్తాయ తే నమోస్తు
కర్పూరపాండురాంగాయ నాగాజిన, దివ్యచ్ఛరీరాయ తే నమోస్తు

గీ॥ త్రిపురదైతేయనాశాయ తేనమోస్తు, మానిజననుతచరితాయ తేనమోస్తు
త్రిపథగాయుక్తమస్తాయ తేనమోస్తు, దృఢకిరాతస్వరూపాయ తేనమోస్తు.

కందగర్భిత మణిగణనికర వృత్తము
సురవరనుతపద! సురుచిరకరుణా
కర! సురగిరిధర! కమలజముఖసం
హరవటుతరకర! హర! హిమకరభా
స్కరదహన నయన! కనకఘనతనూ!

సుగంధివృత్తము. ఖడ్గబంధము.
దేవదేవ! పావనాంఘ్రి! దివ్యభవ్యశ్రీవ్యధీ!
ధీవినీతభక్తిగమ్య! దీనలోకకల్పకా!
*కావిధానభంజనా! ప్రకాండకాండధీషుధీ!
ధీవికారలోలదూర! దివ్యదిందుకైశికా! 524

పద్మవృత్తము. షోడశదళ పద్మబంధము
2 రాజరాజ, రాతి! రాజ
రాజరాతి! రామరామ
రాజరాజ రాతి! రాస
రాజ రాతి! రాద్ధరాష్ట్ర! 525

* టిప్పణి- కస్య బ్రహ్మణః అవిధానస్య। అసత్యోక్తి రూపస్య భంజనః। బ్రహ్మయొక్క అసత్యోక్తి రూపావిధానమును భంజించినట్టివాఁడా!

2 రాజరాజరాతి = ఇంద్రునకును, చంద్రునకును మిత్రుడా! రాజరాజరాతి = కుబేరునకు మిత్రుడా! రామరామరాజరాజరాతి = భార్గవరామునకును రాజరాజగు శ్రీరామునకును మిత్రుడా! రాసరాజరాతి = రాసక్రీడారాజగు శ్రీకృష్ణునకు మిత్రుడా! రాద్ధరాష్ట్ర = రాజశైలమగు హిమగిరికి బాంధవుఁడా!

ఖడ్గబంధము

షోడశదళపద్మబంధము

క॥ ఏదియెది జగమునఁగనఁబడు, నదియది నీ తేజమరయ ♦ నఖిలాత్మక! యొ
ప్పొదవఁగఁ జిద్రూపుడవై, పొదలెదవు త్రిలోకములను ♦ బురుష శ్రేష్ఠా!

క॥ వరమేమిగోరవలె శివ!, యెఱుఁగవె నీ వెల్లవారి ♦ యింగితముల ము
వ్వురులగు నరులమదము నీ, దరిసెనమునఁ బాయు సిరులఁ ♦ దార్పుము దేవా!

—* శివుఁ డర్జునునకుఁ బాశుపతాస్త్ర మిచ్చుట *—

వ. ఇట్లని పార్థుండు భక్తవత్సలుండగు శంకరునియడుగులకుఁ బడి దోయిలొగ్గియున్న
మహేశ్వరుండు సంతసించి స్వకీయంబును దుర్జయంబునగు పాశుపతాస్త్రం బర్జు
నున కిచ్చి యిట్లనియె. 528

క॥ నాయస్త్రంబిది దుర్జయ, మీవెడ నిచ్చితిని నీకు ♦ నింద్రతనయ! దు
ర్జేయుఁడవై యలరెద వీఁక, నీయభియాతినిచయమ్మును ♦ నిర్జించిరహిన్. 529

వ॥ మఱియు నీకిష్టబంధువుండైన కృష్ణుండు నాకంతరంగభక్తుం డాత్మభూతుం డాతని౯ బ్రేరించి నీకు సాయంబుఁ జేయించెద నాయనుగ్రహంబున నీకు విజయంబగు నీక రాజ్యంబు నిష్కంటకంబుగఁ జెంది ధర్మంబేమఱక నడుపుమని చేసాచి సవ్యసాచిశిరంబందుంచి గారవించి యంతర్హితుండయ్యె నర్జునుండును నస్త్రలాభంబు నొంది మురిసి శివుని నుతింపుచు నిజాశ్రమంబుఁ జేరి తనరాకకై ప్రాణంబునట్లు గాంక్షించుచున్న సోదరులకును బాంచాలరాజసుతకును దపోవృత్తాంతం బాద్యంతంబెఱింగించి శివానుగ్రహంబును నస్త్రప్రాప్తియుం దెలిపిన వారలెల్లఁ గిరీటి తపస్సాఫల్యంబునకుఁ గరంబుమురిసి శివునిఁ బెక్కుతీరులఁ గైవారం బొనర్చిరంత దివినుండి పుష్పవృష్టి గురిసె నావెంట శ్రీకృష్ణుండరుదెంచి యర్జునునిఁ గాఢాలింగనం బొనరించి మహేశ్వరానుగ్రహం బెంతయేనియుఁ గొనియాడె నిట్లు కిరాతేశ్వరలీల మీకుపన్యసించితి నిద్దాని వినినఁ జదివినవారలకు సర్వార్థంబులు సేకూరుననుడు.

క॥ మాధుర్యధుర్యసువచో, బోధామృతదాన చతుర ! బుధజనసేవా
సాధితవిజ్ఞానాసి, చ్ఛేదితశిష్యాఘపాశ ! శివభక్తవశా ! 531

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండనాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి లీలాఖండంబునఁ
బ్రథమాశ్వాసము సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## లింగవైభవఖండము

### ప్రథమాశ్వాసము.



యలరంగ నెవ్వఁడుఁ వి♦చిత్రముగా విశ్వకృతిఁ దొరంగి యా
త్మీయపు మాయతోడ జగ♦తీవలయాకృతిఁ దాల్చె భోగమో
క్షాయతనంబు లెవ్వనికి ♦ పార్శ్వకటాక్షములే వెలుం గెదన్
బాయక కాంతిఁ దోఁగు లల♦పర్వతజావిభుఁ గొల్తు శంకరున్.

మ॥ కరుణాశోభితవీక్షణంబు స్మితరం♦గద్వక్త్రపద్మంబు బం
ధురతాపత్రయభంజకంబు హిమరు♦క్కోకాభిరామంబు భా
స్వరసౌఖ్యాకరసచ్చిదాత్మకమునున్ ♦ బ్రాలేయశైలేంద్రజా
పరిరంభోజ్జ్వలమైన యీశతను వా♦పాదించుతన్ సౌఖ్యమున్. 2

క॥ శ్రీకోటీశనగావా, గుహ్యకబరీభూత శర్వపూస్సంభవ ! రా
కాకుముదాప్తజ్యోత్స్నా, శ్రీకరనుయశోభిరామ ! శ్రీలక్ష్మ్యంబా ! 3

వ. అవధరింపుము.

క॥ శౌనకముఖ్యులు పరమే, శానకథాశ్రవణజనిత ♦ సంతోషభర
శ్రీనిధులై యక్కథకున, కానతులై యిత్తెఱంగున ♦ నడిగిరి వరుసన్. 4

క॥ విన్నారము శివలీలలఁ, గన్నార మనన్యలభ్య ♦ కౌతుక మొదఁజే
కొన్నార మభవభాగ్యము, మన్నారము దుఃఖతతులు ♦ మరలుటవలనన్. 5

క॥ హరిచరితశ్రవణంబున, మరగినమాచేత మద్ది♦మానియులరునే
యురుకీర్తి! చెప్పుమిఁక శాంకరలింగంబులను వరుస♦గా లెక్కమరన్. 6

క॥ జ్యోతిర్లింగములను దజ్జాతమహాలింగములను ♦ జక్కఁగఁ దత్సం
భూతియు మా కెఱిఁగింపుము, సూతబుధేంద్రా! నితాంత♦శుభగుణసాంద్రా!

గీ॥ ఇవియునుంగాక పుడమిపై♦నెన్నియేనిఁ, గలవు శివలింగములు వాని♦నెలవులను ద
దీయనామంబులను మాకుఁ♦దేటపడఁగఁ, దెలుపుమయ్య! సుధీగేయ♦దివ్యచర్య!

వ. అనుటయు నక్కథకుండు కరంబుమురిసి యమ్మహామునుల కిట్లనియె. 9

గీ॥ లోకముల మేలుఁగోరి సు♦శ్లోకులార!, మీర లడిగితి రెంతయు ♦ మేల్మిమీఱ
మీపయింగల చెల్మిక♦ల్మిన్ నుడివెద, శంభులింగములవిభూతి♦సంగ్రహించి,

గీ॥ లెక్కలేనట్లుగా శివ♦లింగమూర్తు, లవనిపై దివాఱుచున్నవి ♦ నాకలోక
మందుఁ బాతాళమునఁ బెక్కు♦లట్టివాని, నెల్లఁ దెలియఁగఁ దరముగా♦దెవ్వరికిని.

వ. ఐనను నామెఱింగినయట్లు మీ సాన్నిధ్యంబునఁ జెప్పెద నాకర్ణింపుఁడు. 12

—* సూతుఁడు మునులకు జ్యోతిర్లింగోపలింగంబు లెఱింగింపుట *—

*సీ॥ సిరిమీఱు సౌరాష్ట్ర♦సీమ సోమేశ్వరుం, డల శ్రీగిరిని మల్లి♦కార్జునుండు
ఉజ్జయినీపురి ♦ నున్న మహాకాలుఁ, డోంకారభూమి నొ♦ప్పొందు నీశుఁ
డా మిహికాచలం♦బందుఁ గేదారుండు, సరవి ఢాకిని భీమ♦శంకరుండు
అవిముక్తమందు వి♦శ్వాధినాథుం డల్ల, గౌతమీతటిఁ ద్ర్యంబ♦కప్రభుండు

గీ॥ భవ్యమగు నాచితాభూమి ♦ వైద్యభర్త, దారుకావని నాగేశ ♦ ధీరమూర్తి
సేతువున రామనాథాఖ్య♦శివుఁడు శ్రీశి,వాలయంబున ఘుశ్మేశ్వ♦రాహ్వయుండు.

ఉ॥ ఈ పదిరెండులింగముల ♦ నెవ్వఁడుగాని కడుంబ్రపత్తిమై
నోపికఁ జేరి కొల్చు నతఁ ♦ డొందు శుభంబు లిహంబునందు దు
ష్ప్రాపపు మోక్షలక్ష్మిఁ గొనఁ♦జాలుఁ బరంబునఁ సర్వసిద్ధులన్
జేపెడు నివ్వి భక్తులకు ♦ సిద్ధముగా మునివంశరత్నముల్! 14

గీ॥ లింగములఁ జేరఁబోవఁగా♦లేకయున్నఁ, దవిలి లింగాహ్వయంబులఁ♦దలఁచుచుండి
రేనియు సకృత్తుగాస్మరి♦యించిరేని, యును శివుం డట్టివారల♦కొసఁగుసిరులు.

వ. ఇంక నీ జ్యోతిర్లింగములలోఁ దొమ్మిదిలింగముల కుపలింగంబులు తజ్జాతంబులై
యొసంగు నవ్వాని వినుండు. 16

---

* శివపురాణే కోటిరుద్రసంహితాయాం ప్రథమాధ్యాయే—

శ్లో॥ సౌరాష్ట్రే సోమనాథంచ । శ్రీశైలే మల్లికార్జునం । ఉజ్జయిన్యాం మహాకాల । మోంకారే పర
మేశ్వరం । కేదారం హిమవత్పృష్టే । ఢాకిన్యాం భీమశంకరం । వారణాస్యాంచ విశ్వేశం ।
త్ర్యంబకం గౌతమీతటే । వైద్యనాథం చితాభూమౌ । నాగేశం దారుకావనే । సేతుబంధేచ
రామేశం । ఘుశ్మేశంచ శివాలయే । ద్వాదశైతాని నామాని । ప్రాతరుత్థాయయఃపఠేత్ । సర్వపాప
వినిర్ముక్తః । సర్వసిద్ధిఫలంలభేత్ ॥

వ. సోమేశ్వరలింగంబున కుపలింగం బంతకేశలింగంబు వసుమతీసాగరసంయోగంబున నలరారు, మల్లికార్జునలింగంబున కుపలింగంబు రుద్రేశ్వరలింగంబు, భృగుకక్షమునను సుఖావహం బై యమరు, మహాకాలలింగజాతంబగు నుపలింగంబు దుగ్ధేశలింగంబు, నర్మదాతీరంబునఁ బాపహరం బై ప్రసిద్ధం బై యుండు, ఓంకారజాతంబగు కర్దమేశలింగంబు బిందుసరంబందు సర్వకామఫలప్రదం బై యొప్పుఁ, గేదారేశ్వరజాతంబగు భూతేశలింగంబు యమునాతటంబందు ద్రిష్టలకును బూజకులకును, మహాపాపహరం బై వారువొందు, భీమశంకరసంభూతంబగు భీమేశ్వరలింగంబు సహ్యాచలంబందు మహాబలవర్ధక ఖ్యాతిఁగాంచు, నాగేశ్వరసముద్భూతంబగు భూతేశ్వరలింగంబు మల్లికాసరస్వతీతీరంబున దర్శనమాత్రంబునఁ బాపహరం బై వెలయు. ఘుశ్మేశలింగజాతంబగు వ్యాఘ్రేశ్వరలింగం బిహపరసాధకం బైయుండు నీ లింగనవకంబు దర్శనమాత్రంబున బాపహారంబు లై సకలకామఫలప్రదంబు లై విరాజిల్లు నిక శ్రీకాశీపురంబు 17

—* శ్రీ కాశి *—

సీ॥ విశ్వనాథుండునా ♦ వెలసెనే వీటిలో, నన్నపూర్ణాంబతో ♦ నభవమూర్తి
కానఁగోఁ గమలజ ♦ న్మాని తలఁదున్నిన, భైరవుండే పురిఁ ♦ బాయకుండు
శ్రీపతి కృతపుష్క ♦ రిణి మెచ్చి మణికర్ణి, కను జేసెఁ బార్వతీ ♦ కాంతుఁ డెందు
రంగత్తరంగాభి ♦ రంగమై ప్రవహించు, గరిమ నే నగరి గం ♦ గాస్రవంతి
గీ॥ తమ్మిచూలి దశాశ్వమే ♦ ధమ్ము లెందుఁ, జేసి శివలింగమును బ్రతి ♦ ష్ఠించె నెలమి
దుంఠిగణనాథుఁ డెందగ్ర ♦ కంఠగంధ, కరటిగాపుండు దరమె య ♦ క్కాశిఁ బొగడ.
క॥ మఱియున్ విలసిలు మంత్రే, శ్వరుఁ డుర్వి గేదారనాథ ♦ శర్వుం డట్లే
యరుదగు నాతిలభాండే, శ్వరుఁ డుర్వి బొగడొందుచుండు ♦ జగమలరనటన్.

—* ప్రాచీన దివ్యలింగములు *—

క॥ గంగాకూపారంబుల, సంగమముల సంగమేశ ♦ శంకరుఁ డొప్పున్
రంగొప్ప కౌశికీనది, చెంగట నాగేశ్వరుండు ♦ చెలఁగు సిరులతోన్. 20
గీ॥ భక్తులకు నెల్లసిరుల నె ♦ ప్పాట నొసఁగు, వలఁతిభూతేశ్వరుఁడు ప్ర ♦ వాసిఁ దనరు
దరిసెనమున నె సిద్ధులఁ ♦ దార్చు సిద్ధ, నాథలింగము భువిలో న ♦ నన్యశక్తి. 21
గీ॥ గండకీతీరమునఁ బటు ♦ కపర్దుండు, ఫల్గునీతీరపూరేశ ♦ భర్గమూర్తి
తప్తకాతీరవర్తి యు ♦ దారకీర్తి, యలకుమారేశ్వరుం డఖి ♦ లార్తిహరుఁడు. 22
గీ॥ తీర్థరాజంబునన్ బ్రహ్మ ♦ దేవ విభుఁడు, మాధవేశ్వరియును గూర్చు ♦ మంగళముల
విలసిలున యోధ్యయందఘ ♦ ములను జిమ్మి, యెల్లసుఖముల నొసఁగు నా ♦ గేశ్వరుండు.

గీ॥ సింధుతీర కపాలేశ ♦ శివుఁడు మఱియు, నెల్లదోసంబులడఁచు వ ♦ క్రేశ్వరుండు
ధూతపాపేశ్వరుండు ని ♦ ర్ధూత భవుఁడు, తరమె భీమేశ్వరుని పెంపుఁ ♦ దలఁప నెవుడు

గీ॥ చంద్రకాంతిప్రదుండు శ్రీ ♦ చంద్రకేశ, విభుఁడు సిద్ధేశ్వరుం డిష్ట ♦ విత్తదాత
అల్లబిల్వేశ్వరుఁడు మహా ♦ హర్షకరుఁడు, పురుడు లేకయె చెలువొందు ♦ ముజ్జగముల.

గీ॥ ఇలదధీచిరణోర్వి జ ♦ ప్యేశ్వరుండు, ఉత్తరపురి దూరేశ్వరుం ♦ డురుసుఖదుఁడు
పూర్ణయందొప్పుఁ బూర్ణేశ ♦ భోగిభూషుఁ, డా భరద్వాజవిభుఁ గొని ♦ యాడఁదరమె.

క॥ అంధకుఁ డచ్చో శివు గ, ర్వాంధుండై చెనకి కూలె ♦ నచ్చో దివిష
ద్గంధర్వులు పాడఁ గృపా, సింధుం డా యంధకేశ ♦ శివుఁడు వసించున్. 27

సీ॥ శృంగేశ్వరుండును ♦ సేనేశ్వరుండు గో, పీశ్వరుం డమరు వ ♦ క్త్రేశ్వరుండు
వైద్యనాథేశుండు ♦ వామేశ్వరుండు కా, మేశ్వరుండును విమ ♦ లేశ్వరుండు
వ్యాసేశ్వరుండును ♦ భాండేశ్వరుండు ను, కేశేశ్వరుండు భూ ♦ తేశమూర్తి
శుక్రేశ్వరుండును ♦ సూర్యేశ్వరుండు నా, కేశ్వరుండును సంగ ♦ మేశ్వరుండు

గీ॥ అనఘుఁడు సులోచనేశ్వరుం ♦ డా ప్రసిద్ధుఁ, డైన సిద్ధేశ్వరుం డఖి ♦ లార్థముండు
నందికేశపుంజేశు లా ♦ నందకరులు, అల్ల రామేశకుంభేశు ♦ లార్తిహరులు. 28

వ. వెండియు సోమేశ్వరుండును శూలటంకేశ్వరుండును మాధవేశ్వరుండును లోకేశ
మహాలింగంబును గంగేశుండును వటేశ్వరుండును సర్వపాపహరుండగు వక్త్రేశ్వ
రుండును నందీశ్వరుండును విమలేశ్వరుండును గంటకేశ్వరుండును సర్వలోక
సుఖావహుండగు శరణేశ్వరుండును గర్దమేశుండును అచలేశ్వరుండును ననంతే
శ్వరుండును యోగీశ్వరుండును మున్నగు దివ్యలింగంబులు పూర్వదిగ్జాతంబులిఁక
దక్షిణదిగ్జాతంబులగు దివ్యలింగంబులను జెప్పెద వినుండు. 29

క॥ కాలంజరపర్వతమున, నీలగళేశ్వరుఁడు హరుఁడు ♦ నెగడెడు సిరులన్
లీలాలోకనమాత్రమె కాలుష్యములెల్ల నడఁచి ♦ కాచెడుఁ బ్రజలన్. 30

వ: నర్మదానదీతీరస్థంబు లగు పాషాణంబులన్నియు శివలింగంబులు. వానిలోఁ బ్రధా
నంబులు వినుండు. ఆర్తేశ్వరుండును, బరమేశ్వరుండును, సింహేశ్వరుండును,
శర్వేశ్వరుండును, గుమారేశ్వరుఁడు, పుండరీకేశ్వరుండు, మండపేశ్వరుండు.
తీక్ష్ణేశ్వరుండు, దుంధురేశ్వరుండు, శూలేశ్వరుండు, కుంభేశ్వరుండు, కుబేరేశ్వరుండు,
సోమేశ్వరుండు, మంగళేశ్వరుండు, హనుమత్ప్రతిష్ఠితుండును సర్వకామప్రదులై
యొసంగుదురు. 31

గీ॥ చిత్రకూటాద్రి మత్తహా ♦ స్తిప్రభుండు, ఈశివునితూర్పునందుఁ గో ♦ టీశలింగ
మలరుగోదావరీసరి ♦ దపరదిశను, బశుపతీశ్వరుఁ డొప్పొందు ♦ భద్రమూర్తి.

క॥ గోదావరీతీరం బక్కడ, పాదిశయం దొప్పమీఱు ♦ నత్రీశ్వరుఁ డా
పాదించె శుభము లనసూ, యాదేవికి నత్రిమునికి ♦ నతఁడు యెసఁగన్. 33

క॥ హాళాయు వెలయించు భువనే, శ్వరితో భువనేశ్వరమున♦వరదుఁడు భువనే
శ్వరు డిత నశ్వరవైలళి, ఖరమునఁ గోటీశ్వరుఁడు♦గాచున్ బ్రజలన్. 34

వంశధారాతటంబున ♦ బ్రాంతమునందు, నమరు ముఖలింగమన నొప్పు ♦ నాదిదేవుఁ
డిష్టప్రమాకలకోనయం♦బొప్పమీఱి, బోయలకుఁగూడ నిచ్చెను♦ముక్తిసొత్తు.

క॥ హాటకపొష్ట రాజరాజే, శ్వరితో దగ కుక్కుటేశ ♦ శంకరుఁడు రహిన్
బాలఁగుచుఁ బీఠపురంబునఁ, గరమరుదుగ సిరుల నొసఁగి ♦ కాచున్ బ్రజలన్.

క॥ ఉండున్ రాజమహేంద్రపు, రిం బాకొని గౌతమీవా ♦ రితుర్కాలమునన్
ఖండేందుశేఖరుఁడు మార్కండేయశివుండు జగముఁ ♦ గాచుచుఁ గరుణన్.

క॥ ధవళేశ్వరమునఁ గుంభో, ద్భవమౌనివరప్రతిష్ఠఁ ♦ బరఁగుచు నిచ్చల్
శివుఁ డల్ల యగస్త్యేశుఁడు, వివిధసుఖంబులను భక్త♦వితతి కొసంగున్. 38

క॥ కుక్షిస్థాఖిలభువనుఁడు, రక్షోదక్షఘ్నుఁ డమర ♦ రాజేశ్వరుఁ డా
ద్రాక్షారామంబున నిట, లాక్షుఁడు భీమేశ్వరుండు ♦ పావనిఁచు సిరిన్. 39

క॥ మాణిక్యాంబిక యమర, శ్రేణీసేవితచరణకు♦శేశయ నిర్ని
ద్రాణవరాక్షిమ తద్విభు, రాణి యగుచు మనుచు భక్త ♦ రాజి ననువుగాన్.

సీ॥ ఇఁకను రామేశ్వరుం డగ♦స్త్యేశ్వరుఁడు గ, ణేశ్వరుండును నాభైర♦వేశ్వరుండు
నాకులేశ్వరుఁ డనియెడు ♦ నభవలింగ, ములును భీమేశలింగంబు♦పొంతనమరు.

ఆ॥ తైలమావపిండి♦తనర వండిన పులి, హోర పనసకాయ♦కూర చెఱుకు
రసము నోగిరంబ♦రటిపండ్లనాసపం, డ్లర్పణంబొనర్తు ♦ రలశివునకు. 42

వ. మఱియు బొబ్బట్లు టెంకాయలు చక్రకేళిపండ్లు మున్నగునవి పూజాభోగంబులందు నివేదింతురు. వెండియు నీద్రాక్షారామ భీమలింగంబట్లు కుమారారామంబందుఁ (చామర్లకోట) కుమారప్రతిష్ఠిత కుమారభీమేశ్వర లింగంబును సోమారామంబున (గునిపూడి) సోమప్రతిష్ఠిత సోమలింగంబును, క్షీరారామంబున (పాలకొల్లు) శ్రీరామప్రతిష్ఠిత శ్రీరామలింగంబును, గృష్ణాతీరామరారామంబందు (అమరావతి) అమరేంద్రస్థాపితామరేశ్వరలింగంబును ననెడు లింగచతుష్టయంబుగలదీ లింగపంచకం బుపాసకులకు సర్వార్థసాధకంబు. వెండియుఁ గోటిపిల్లియందు సోమేశ్వరలింగంబును వ్యాఘ్రపురంబున వ్యాఘ్రేశ్వరలింగంబును భక్తుల కిష్టఫలదాయకంబులు. 43

క॥ కుసుమశరారికుమారుం, డసదృశకరుణామయాత్ముఁ ♦ డార్తిహరుఁడు ప
ట్టిసమందు వీరభద్రుఁడు, విసువక భక్తులను గాచు ♦ వేయికనులతో. 44

సీ॥ గౌతమీశైవలిన్యవా♦గ్భాగమందు, వెలయు వేములవాడ క♦ల్యాలకు జాడ
ఇందుఁ దిరముండు రాజరా♦జేశ్వరుండు, రాజరాజేశ్వరిన్ గూడి♦ రాణగదుర. 45

గీ॥ ఈ స్థలికి నాతిదూరమై ♦ యెసకమెసఁగు, చుండుఁ గాళేశ్వరంబను♦♦నూర్జితస్థ
లంబచట సిద్ధులకుఁ దావ♦లంబుగాఁగ, నలరుఁగాళేశ్వరుండు పు♦ణ్యాములపంట.

సీ॥ పరుగిడు నేపేటి♦పడమర విభుజాడ, కృష్ణవేణి సరోజ♦కిసలపాణి
పతియాజ్ఞ నేప్రోలిఁ ♦ బాలించు జగములఁ, గనకదుర్గాదేవి ♦ కాంతమూర్తి
ఇంద్రకీలాచలం ♦ బేపేటిసైనిక, శ్రేణికిఁ గోటమై ♦ చెలువుమీఱు
అంధ్రమేదినికి నా♦యకరత్నమై సిరి, నెసఁగు నేపురవరం ♦ బింపుమీఱి

గీ॥ అట్టి నగరీవతంసమై ♦ యలరు విజయ, వాటికాక్షేత్రమందలి ♦ పర్వతాగ్ర
శృంగమునుజెంది కడిఁది వా♦సిందనర్చు, మల్లికార్జునమూర్తి యా♦మ్నాతకీర్తి

క॥ హేలాపురమందు మహా, కాలుండు జలాపహాఖ్య ♦ క ప్రభుఁ డొప్పున్
లీలాకల్పిత విష్టప, జాలుఁ డగ స్త్ర్యేశుఁ డుండు ♦ జానుగఁ బెడనన్. 48

వ. ఇఁకఁ కృష్ణాసాగరసంగమప్రదేశంబందలి కళ్ళేపల్లియనెడు కర్కోటక
క్షేత్రంబందుఁ గర్కోటక ప్రతిష్ఠితంబగు నాగేశ్వరలింగం బఖిల పాపహారంబు
శుభావహంబు. మఱియు ముక్తేశ్వరపురిఁ గృష్ణాగర్భప్రదేశంబందు బలిచక్ర
వర్తి స్థాపిత బలీశ్వరలింగం బఘహారంబు. 49

క॥ ఈవనిపురిఁ గరుణాంచ, ద్భావుఁ డగ స్త్ర్యేశ్వరుండు ♦ పరఁగును సిరులన్
గావలుల నడఁచి భక్తుల, నేవేళన్ దాటికొండ ♦ యీశ్వరుఁడోమున్. 50

క॥ విమలోదకకృష్ణాధుని, కమరంగా దక్షిణతటి ♦ నమరావతియం
దమరేశ్వరుండు కరుణో, త్తము చాముండీశ్వరికి హృ♦దయవిభుఁ డుండున్. 51

వ. ఈ యమరేశ్వరలింగంబే పూర్వోదాహృతపంచలింగంబులందలి యైదవ
లింగంబు. 52

ఆ॥ కందపెండలంబు♦కదళీశలాటుల, కూర లరిసెలింపు ♦ మీఱనిందుఁ
బ్రీతి యెసఁగుసన్న ♦ బియ్యంపుటన్నంబు, నర్పణంబొనర్తు ♦ రధికభక్తి. 53

వ. మఱియును.

క॥ క్షీరోదనమును వడలును, గేరుచుఁ జిత్రాన్నములు సు ♦ కియ లనువొప్పన్
గూరిచి నైవేద్యమునొనఁ, గూరుతురిమండలి నను ♦ గుంబ్రీతి మెయిన్. 54

గీ॥ ఎల్లమంద యనఁబడు ♦ గొల్లమంద, లోన నొక మేటికొండపై ♦ లోకనాథుఁ
డుండుఁ గోటీశ్వరుండుమ♦హోన్నతుండు, అతనికృప లెక్కసేయంగ♦నలవియగునె.

క॥ కవిజనగీతుఁడు మాధల, హవణించును సాగరేశుఁ ♦ డార్యాయుతుఁడై
ధవళపుర మెపుడు పాయఁడు, ధవళేశ్వర దేవుఁడిద్ధ ♦ దర్పము మెఱయన్. 56

క॥ హాసుఁడల్ల శ్రీకపోతే, శ్వరుఁడా చేజెర్లయందు ♦ సాకుఁ బ్రజనుమా
చెలువుకి నిష్టకామే, శ్వరుడిష్టఫలంబులొసఁగు ♦ శరణార్థులకున్. 57

సీ॥ శ్రీశైలమార్గవనుగాఁ ♦ జెలువుమీఱి, యులరుఁ ద్రిపురాంతకమనుదీ ♦ వ్యన్నగంబు
అఁదుఁ దిరముండు శ్రీత్రిపు ♦ రాంతకుండు, త్రిపురసుందరితోఁగూడి ♦ తేజ మెసఁగ.

గీ॥ శ్రీనగమునకు దక్షిణ ♦ భాగమందు, శ్రీమహానందికేశ్వర ♦ శివుఁడు వెలయు
నార్యతో భోగమోక్ష ఫ ♦ లావహుండు, తీర్థముల నవరూపమై ♦ తేజరిల్లు.

క॥ ఓంకారక్షేత్రంబున, నోంకారేశ్వరుఁడు వెలయు ♦ నుడుగని కరుణన్
సంకటము లడఁచు నిచ్చలుఁ, గింకరులకు నెల్లవెల్ల ♦ కీరితి కిరవై. 60

సీ॥ శ్రీధరమునకుఁ బడమరఁ ♦ గా నలంపు, రిం దనరుఁ దుంగభద్రాన ♦ దీతటమున
జోగులాంబాసహాయుండు ♦ భోగమోక్ష, కరుఁడు బ్రహ్మేశ్వరుఁడు గడు ♦ గరిమ మెసఁగ.

వ. మఱియు నవబ్రహ్మ లిందుఁ బ్రత్యేకంబుగ శివలింగంబులఁ బ్రతిష్ఠించుటజేసి బ్రహ్మేశ్వరలింగంబుతో లింగనవకం బిందు విలసిల్లు నిటఁ గృష్ణానద్యుత్తర ప్రదేశంబందలి వాడపల్లియందు సంగమేశ్వరుఁడనంబడు నగస్త్యేశ్వరుం డుండియెను.

క॥ ఏలేశ్వరుఁడనఁగా శ్రీ, శైలోదక్ద్వారమందు ♦ శంకరుఁడుండున్
బాలంకేశ్వరుఁడనఁగాఁ, బాలంక మెడన్ వసించి ♦ భక్తులఁగాచున్. 63

వ. ఇఁక ముదిగొండ నగరంబందు భద్రకాళీదేవితో వీరభద్రదేవుఁడుండి భక్తజనంబుల నేలుచుండు. 64

గీ॥ నిడుదవెల్లిగఁ బరుగిడు ♦ నిడుదవెల్లి, వాఁగు దరిఁజేరి కీరితి ♦ వాసిమీఱు
నలమహాలింగవిభుఁడు వా ♦ విలిగుబురులు, దేవళము సుట్టి సేవించు ♦ దిటవుమీఱి.

క॥ పెన్నకుఁ దక్షిణమున సొం, పెన్నఁగ నెల్లూరిఁజేరి ♦ యెల్లప్రజకు బా
పున్నలఁతికలఁతలను జూ, పున్నయము హరిహరవిభుఁడు ♦ ముదముదలిర్పన్.

క॥ శ్రీకాళహస్తి విభుఁ డతి, లోకుఁడు సుశ్లోకుఁ డఖిల ♦ లోకార్చితుఁడు
వాకులకున్ జేకూరునె?, జోకఁగ నద్దేవు పెంపు ♦ సొంపు నుతింపన్. 67

గీ॥ వాయులింగమై యచ్చోట ♦ వాసిఁగాంచు, ముక్తిఁజెందిన శ్రీయుఁ బా ♦ ము నుగజంబు
లింగమం దైక్యమొందిన ♦ లీలలు గను, పట్టు దీవె చలించు నె ♦ వ్వట్ల నచట.

గీ॥ అలరు జ్ఞానప్రసూనాంబ ♦ యనఁగ నామ, హేశ్వరుని రాణి భక్తుల ♦ కెల్లసిరుల
సంతరించును బోనరించు ♦ సంబరంబు, నలసువర్ణముఖీఘుని ♦ యచటఁ బరఁగు.

వ. మఱి యందు వెలయు కైలాసగిరియందు హరిహరతీర్థంబు కోటిలింగసన్నిధానంబు మున్నగునవి యనన్యవైభవంబు లిఁకను దిరువత్తూరునందుఁ ద్యాగరాజ పరమేశ్వరుండు త్రిపురసుందరీదేవితో నివసించి భక్తులను బాలించుచుండు. 70

క॥ మైలాపురమందుండుఁగ, పాలేశ్వరుఁడభవుఁ డుమ గ ♦ పాలేశ్వరియున్
మేలుగదవనము మరువముఁ, జాలఁగ నర్పించియర్చ ♦ సల్పుదురిద్ధుల్. 71

క॥ వేదగిరీశ్వరుఁ డొప్పును, సాదరుఁడై గిరిని నాగ ♦ మాంబికతోడన్
పేదలసాదల గరుణన్, శ్రీదయితులఁ జేయు భక్తి ♦ సేవించినచో. 72

గీ॥ భక్తవత్సలనాథుండు ♦ వరఁగుఁద్రిపుర, సుందరీదేవియును దోడ ♦ సందడించు
నందు భక్తులకూడెడు ♦ వందురులు గ, డిండిమేలొందునని బుధు ♦ లందురెపుడు.

క॥ కాంచిధరణీరమణిమణి, కాంచి యచటి వైభవములఁ ♦ గాటపు వేడ్కన్
గాంచి యటఁ గాపురంబుల్, గాంచి మిగుల నలరెను సహ ♦ కారవిభుఁ డోగిన్.

గీ॥ పదియు నెన్మిదిపీఠాల ♦ పట్టభద్రి, లైనశక్తులయందెక్కు ♦ డైన తేజ
లెసఁగు కామాక్షి యప్పుర ♦ మేలు రాణి, యందుఁ దిరముండి ప్రోచు భ ♦ క్తాళి నెపుడు.

గీ॥ హరువుమెయి విష్ణుకంచియం ♦ దలరుఁ బ్రభుని, వ్యాలకుండెల్లజగముల ♦ పాలకుండు
వరదరాజు లసత్కృపా ♦ వార్ధిమూర్తి, క్షీరసాగరకన్యతోఁ ♦ జెలువుమీఱి.

క॥ శ్రీరహిమీఱెడు నా కా, వేరికి దక్కనపు దెసను ♦ వెలసిరి సిరి మా
యూరేశ్వరుఁ డభయాంబిక, గౌరీ మాయూరమందుఁ ♦ గాచుచుఁ బ్రజలన్:

గీ॥ ఆ మహాలింగ మొప్పు మ ♦ ధ్యార్జునమున, శ్రీ బృహత్సుందరీదేవి ♦ చిత్తపుండ
రీకమార్తాండ మాశ్రిత ♦ శ్రీకరంబు, తెలియఁ దరమా నాకో! తదీయ ♦ దివ్యశక్తి.

క॥ చియ్యాళికొండమీఁదను, నెయ్యముఁ దియ్యంబు మెఱయ ♦ నెక్కొని జనులన్
వెయ్యిగను లొప్పఁ గాచెడు, నొయ్యనఁగ నుమామహేశుఁ ♦ డురుతరకరుణన్.

వ. కొండదిగువన్ ద్రిపురసుందరీనాథుండు బ్రహ్మపురీశ్వరుండు దిరముండు. త్రిభువన
క్షేత్రంబందు శరభావతారం బెత్తిన కంపహరేశ్వరుండు ధర్మసుందరీనాథుండుండు
నిఁక విరించిపురమందు మరకతవల్లీదేవితో మార్గబంధ్వీశ్వరుండును, దిరువళం
బున నీవానదీతీరంబందుఁ దనుమధ్యాదేవితో బిల్వేశ్వరుండు గాపురంబుండి సకల
జనంబులఁ గాచుచుందురు. 81

క॥ హృద్యగతినొప్పు నెపు డన, వద్యముగా భవరుజలను ♦ బాపుచుఁ గడిమిన్
వైద్యేశ్వరమందు మహా,వైద్యేశ్వర దేవవిభుఁడు ♦ బాలాంబికతోన్ 82

వ. అందలి తీర్థం బసాధారణంబు.

క॥ తేజోమయ మరుణాద్రిన్. దైజసలింగంబు సకల ♦ దైవతపూజ్యం
బై జానొందును మహిమం, బా జలజజుఁ డేనిఁ జాలఁ ♦ డరసి నుడువఁగా. 83

క॥ ఆ శివుని రాణివాసము, పేశలకరుణాలయం బ ♦ పీతకుచ యనా
శ్రీశివ రాణించును భవ, పాశంబులఁ ద్రుంచు భక్త ♦ పాళికనువుగాన్. 84

క॥ కావేరి కనతిదూరం,బై వెలయుఁ జిదంబరము వి♦యల్లింగ మటన్
సేవితమైతగు ముక్తికిఁ, దావల మామెడ శివుండు ♦ తా నటియించున్: 85

గీ॥ ఆట నటించు మహానటు ♦ ననుసరించుఁ, దోడ శివకామసుందరి ♦ జోడుగాఁగ
వెలనిసిరి కద్ది ముల్లోక♦మందు లేదు, కనకచిద్దివ్యసభ లందుఁ ♦ గానుపించు. 86

క॥ మరకతలింగంబును గొ,ల్తురు మఱువ కహర్నిశంబు♦లును గడుభక్తిన్
హాసువగు నాపరివస్యల, నరుదుగఁ గనుఁగొనిన సఘము♦లడఁగున్ దుర్గిటిలోన్.

గీ॥ కుంభఘోణము కావేరి ♦ కూల మచట
మంగళాంబికతోడఁ జెలంగు నభవ
మూర్తి కుంభేశ్వరుఁడు వీరి ♦ పొత్తు గలిగి
యలరుచుండు బృహద్విభుఁడు నా♦గాహ్వయుఁడును. 88

క॥ మఱి యుంకునందె సోమే,శ్వరుఁడాదిగఁ గల్గునట్టి ♦ శంకరమూర్తుల్
కరమొప్పచుండ్రి ధరణీ, సుర లచ్చోట వేనవేలు ♦ శూరులు త్రియిలోన్

క॥ జంబూవనమందుగ్రిర, జంబూర్జితకరుణఁ బాపు ♦ సలిలమయుండౌ
జంబూకేశానుండు ని, జం బూహాశీత మచటి ♦ చందంబు మునుల్ ! 90

గీ॥ కోరి తపసానరించి యం♦దాఱితేఱి, నట్టి యఖిలాండరాజ్ఞి కే♦ల్పట్టి యందె
వెలసె శంకరుఁ డర్కుండు ♦ కలశజన్మ, రామతీర్థంబులందుఁ గ♦రంబు మెఱయు.

గీ॥ వెలసిచెలువొందు మఱియుఁగా♦వేరిదరిని, విశ్వగురుఁడల్లమాతృభూ♦తేశ్వరుండు
కోర్కులీడేర్చుతల్లి శ్రీ ♦ కుంతలాంబ, అంచితోదార యప్పర♦మాత్మదార. 92

ఆ॥ దేవదేవుమఱఁది ♦ కావేరినడుమశ్రీ, రంగపట్టణమునఁ ♦ బొంగెసంగ
రంగరాజు పావ♦రాసెజ్జపై యోగ, నిద్రఁజెందియుండు ♦ భద్రకరుఁడు 93

గీ॥ పళనియందుఁ గుమారుండు♦పర్వతంబు, పైనిఁజెలువొందు భక్తు ల♦ప్పట్లదరిసి
కొలిచి కొందురుకోర్కులు♦గొనలు సాఁగ,కొంగుబంగరమాకొండ♦కొమరుసామి.

వ. తిరువైయూరునందు ధర్మసంవర్ధనీనాథుండు పంచనాదేశ్వరుండు సకుమారుండై భాసిల్లు. 95

గీ॥ రమ్యపాండ్యావనికినెల్ల ♦ రాజధాని, మధుర యద్దానిఁబాలించు ♦ మధురకీర్తి
నుంద రేశ్వరుఁ డుదుకృపా♦సుందరుండు, వరద మీనాక్షి దేవితో♦వైభవమున.

క॥ వైహాయసనిమ్నగ యం,దే హాయవొందును జనంబు♦లెల్ల మురియఁగా
శ్రీహేమపద్మసరసియు, నాహారు నాయుమను గొల్చు♦నామోదమునన్. 97

గీ॥ కడిమియడవులు మూలలిం♦గమునుదరిసి, చుట్టుఁజేరియు మీనాక్షి ♦ చుట్టుఁజేరి
బలిసి కొలుచుచునుండుఁబు♦ష్ప్రవతతుల, వల్లహారిచందనవనంబు♦నతకరించి. 98

క॥ ఇడ్డెన లూరుంబిండులు, గొడ్డునెయిఁ బెరుగువడలు ♦ గూరలుఁబులుసుల్
లడ్డూల్ పాన్కము లన్నము, వడ్డించి నివేదనములఁ ♦ బన్నింతురిటన్. 99

గీ॥ దధిమధురమట్టిదధికన్న ♦ మధువుమధుర, మామధువుకన్నఁజక్కెర ♦ మధురతరము
అట్టిచక్కెరకన్నను ♦ నమృతసమము, మధురతమమగు మధురేశ ♦ మంజులాఖ్య.

వ. తిరువణందా రనియెడుదివ్యక్షేత్రంబున వరుణజటేశ్వరుండు బృహన్నాయకీ
విభుండు పాలించుచుండు. 101

గీ॥ తనరు వృద్ధాచలంబున ♦ దాక్ష్యమొదవ, వృద్ధగిరినాయకుఁడు మరు ♦ ద్వృద్ధుఁడెలమి
వృద్ధబాలాంబతో నందె ♦ విమలవారి, చారుముక్తామణీధుని ♦ సందడించు. 102

వ. ఉత్తరకోశంబందు మంగళేశ్వరీసంగతుండు మంగళేశ్వరుండు వెలయు. 103

క॥ శ్రీరామేశ్వరభూమిని, నా రామేశానుప్రక్క ♦ హనుమత్ప్రతిష్ఠన్
మీఱిన విశ్వేశుఁడు వేసారక దాసులను సాఁకు ♦ సారెకుఁ గూర్మిన్. 104

క॥ కడయూరు మోక్షలక్ష్మికిఁ, గడయూరు మృకండుసుతునిఁ ♦ గాలునిదాడిన్
గడునడలువానిఁ గాచిన, కడింది వేలుపు హరుండు ♦ గాపుండు నటన్. 105

వ. ఇయ్యవి దక్షిణదిగ్భవలింగంబు లిఁకఁ బ్రతీచి నలరు లింగంబులను వినుండు. 106

క॥ మహిశూరనాఁగఁబరఁగెడు; మహిశూరన్ దరుణచంద్ర ♦ మకుటుండు దయా
మహితుఁడు నంజుండేశుఁడు, రహి చాముండీ భవాని ♦ రాణింతురటన్.

క॥ పంపాసరస్సుకడ నను,కంప విరూపాక్షవిభుఁడు ♦ కాళీసఖుఁడై
సొంపుగ నుండెడు వానర, కంపాగాత్రలు కరంబు ♦ సల్పఁగ సేవల్. 108

క॥ ఉడిపి దురితంబు వెలిపుల, నుడిపి కడున్ దేజరిల్లు ♦ నొప్పుగఁ బుడమిన్
బడమర సంద్రముకడఁ గొమ,రుఁడు సుబ్రహ్మణ్యుఁ డఘహ ♦ రుండుండు నటన్.

క॥ గోకర్ణక్షేత్రంబున, గోకర్ణుండొప్పవీతి ♦ కోమలశశిరే
ఖాకల్పుండు మహాబలుఁ, డాకేకసిసుతుని కీర్తి ♦ యలరఁగఁ దనరున్. 110

క॥ శ్రీవసుదేవసుతుని నెల,వై వార్థి మీఱు ద్వార ♦ యభ్యర్ణమునన్
రైవతకాద్రిపయి మహా, దేవుఁడు గిరికన్యతోడఁ ♦ దేజరిలు సిరిన్. 111

క॥ తగ వెలసియుండుఁ గపిలా, నగరంబునఁ గాలరామ ♦ నాథుండుమతో
నెగడు మహాసిద్ధేశుం, డొగిఁ బడమరకడలి మేలి ♦ యొడ్డున మౌనుల్! 112

గీ॥ ఆ మహామాయనగరి ర ♦ త్నాకరతటిఁ, బరశురామార్చితంబైన ♦ వాలుకేశ
లింగమలరెడుఁ గొండపై ♦ లింగమొండు,కలదుపురినిమహామాయ ♦ గాచుచుండు.

వ. కొండమీఁది లింగంబును బాబుల్ నాథుఁడందురు,

శా॥ బాబుల్‌నాథుఁడు గొండపై వెలయుఁ ద♦త్పార్శ్వంబునన్ గౌరి సు
శ్రీబాఘామృతవర్తి దేజరిలు రో♦చిశ్చారుసౌవర్ణలీ
లాబాలాకలితోరుగోపురసుశా♦లాశిల్పచిత్రంపు మే
లాబారుల్ గడు దర్శనీయము లన♦న్యస్థాన సంభావ్యముల్. 114

గీ॥ పండరీపురమందు శ్రీ♦పాండురంగ, విభుని దివ్యశిరఃపీఠి ♦ వెలసియుండు
శంభులింగంబు కరుణాప్ర♦సాదఘనము, దరిసెనంబిచ్చు హెచ్చుగ♦ధన్యులకిల.

వ. ఇవి ప్రిద్యగ్భవలింగంబు లిఁక నుడిచి నలరు లింగంబులను నారయుఁడు. 116

కం॥ గంగాద్వారం బిద్ది య,నంగ హరిద్వారమని య♦నంగఁ గలుములన్
రంగారెడు మాయాపురి, సింగారంబొప్ప శివుఁడు ♦ శివతో వెలయున్. 117

వ. ఇందలి శివలింగంబును బంచవక్త్రేశ్వరుఁ డందురిక్కడికొకింత విప్రకృష్టోత్తర ప్రదే
శంబునఁ గనఖలక్షేత్రంబందు దక్షేశ్వర లింగంబీక్షణగోచరంబగు. 118

కం॥ తనరు నపరగోకర్ణం, బనఁగ మహావనతలము న♦శాస్యు ప్రతిష్ఠన్
జనుఁ జంద్రఫాలనాథుం, డన వైద్యేశ్వరుఁడనన్ మ♦హాదేవుఁడటన్. 119

గీ॥ మిశ్రిఋషివరతీర్థం బ♦మేయమందు, వెలయు దాధీచ శివలింగ♦మలఘుమహిమ
మొనరుఁజుడి నైమిశారణ్య♦మున ఋషీశ, లింగ మద్దానిఁ జేర న♦డంగు నఘము.

కం॥ హత్యాహరతీర్థంబని, స్తుత్యార్హంబగుచు నొప్పు ♦ సొంపుగ నచటన్
సత్యద్యుతి శివలింగము, సత్యంబుగ వెలసి యొసఁగు ♦ నిరుపమ రములన్. 121

కం॥ దేవప్రయాగతీర్థము, దేవఋషీ సేవితంబు ♦ దివ్యంబచటన్
తివియలర .లలితేశ్వరుఁ, డా వాసము చెంది కాచు ♦ నందఱను గృపన్. 122

గీ॥ వరఁగ నేపాలనగరిలోఁ♦బశుపతీశ్వ, రుండు లోకాధినాయకుం♦డుండు సిరుల
శిరసు దరిసెనమగును వా♦సిగను బూర్వ, కాయమగుపట్టు కే♦దారకాననమున.

వ. మఱియు సాలగ్రామోత్పత్తికారణంబగు గండకీనిర్ఝరిణి నేపాలంబందె ప్రవహించు.

గీ॥ తత్సమీపస్థలంబునఁ ♦ దనరు ముక్తి, నాథలింగంబు మోక్షైక ♦ సాధకంబు
కలవు పెక్కులు పుడమి లిం♦గంబు లిట్లు, నుడువనోపినయట్లెను♦డివినాఁడ.

గీ॥ అమరఁ గాశ్మీరమునకుఁ బ్రా♦గాశ నమర, నాథలింగము సిరులఁ ద♦నర్చు రంగు
మీఱఁగా వంగదేశ స♦మీపమందుఁ, దారకేశ్వరుఁడొప్పొందు♦ధన్యులార!

గీ॥ అనియిట్టులు దివ్యలింగంబు♦లమరు చోట్లు, వనుసఁ దెల్పుఁడుఁ దాపస♦వరులు మరల
నతని కీలింగమూర్తు లె♦ట్లవని వెలసి, పేరుగాంచెనో చెపుమన్నఁ♦బేర్మినంత.

గీ॥ తల్లి! నాపాలికల్పక♦వల్లి! లక్ష్మి!, వీరభద్రగురునిరాణి!♦విమలకీర్తి!
లింగవైభవఖండమున్♦రంగుమీఱు; కృతినిఁ గొను ప్రథమాశ్వాస♦మతులసరణి.

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి లింగవైభవ ఖండంబునఁ
బ్రథమాశ్వాసము సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## లింగవైభవఖండము

### ద్వితీయాశ్వాసము.



యోగిరాట్ప్రసాదస
మాయాతతపోవిభూతి ♦ మహితస్ఫూర్తీ!
కాయజవిపక్షమూర్తీ!
న్యాయానుసరాధ్వవర్తీ! ♦ నందితకీర్తీ!

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

ఆ॥ చిలువఱేనికేని ♦ నలవికా దివ్వాని, తీరుతెల్లవరసి ♦ తేటపఱుప
నామెఱింగినంత ♦ మీయంతికంబునఁ; జెప్పవాఁడ వినుఁడు ♦ చెలిమిమీఱ. 2

—* సౌరాష్ట్రము - సోమనాథలింగము *—

క॥ కలువలదొర దక్షునికూఁ, తుల నిర్వదియేడుగురనుఁ ♦ దోయజదళనే
త్రల నశ్విన్యాదికతాఁ, రలఁ బెండిలియాడెఁ గడిఁది ♦ రక్తిదలిర్పన్. 3

వ: అంతఁ గొన్నినాళ్ళకు

ఉ॥ చక్కనిచుక్కయై యలరు ♦ జాణను రోహిణి నిచ్చ నెక్కుడా
మక్కువ బుజ్జగింపుచు సు♦మాళముమీఱఁగ వేడ్క సేయుచున్
దక్కినయాండ్రనొక్కపు డెదం దలపోయక యున్న నందఱున్
బొక్కుచుఁ దండ్రితో ననిరి ♦ భూరివిషాదభరంబుతో నిటుల్. 4

ఉ। అక్కట తండ్రి! మాదువిభుఁ ♦ డందఱి మమ్మెడఁ జేసిపాసి తా
నొక్కతె రోహిణిన్ దవిలి ♦ యొండుదలంపక యున్నవాఁ డికే
దిక్కగు మాకుఁ దాపమెటు ♦ తీరు సహోదరివైనయద్ది మ
మ్మిక్కరణిన్ వెలార్ప నిది ♦ యెట్లు భరించి తరింతు మీవ్యథన్. 5

శా॥ తానే చక్కదనాలకిక్కయట! యం◆దంబందు నే చేడియల్
గానన్ లేరఁట! యుద్ది యద్దికనియే ◆ కాంతుండు తత్సంగతిన్
మానన్ లేఁడట! దోసమిందుఁ దనదే ◆ మాత్రంబు లేదంట! యెం
దేనిన్ వింటివె పిల్లదంబులిటు తం◆డ్రీ! యెట్టులోర్వన్ దగున్. 6

ఉ॥ అందఱి నేల యిట్లు జల◆జారికి నిచ్చితి వొక్క రోహిణీ
సుందరి నిచ్చినన్ మిగుల ◆ సొంపుగనుండెడి దెక్కడేని మా
కుం దగుభర్త చిక్కకమె ◆ గొడ్డయిపోవునొ పృథ్వి తండ్రి! యీ
వందురు నెట్లు పాయుదుము ◆ వల్లభుకొల్పోటు చెందు మాకికన్. 7

చ॥ అని పెనువంత నాయిరువ◆దేడ్గురు దక్షుని నొక్కపెట్టునన్
గని విలపించుచున్ బలుకఁ ◆ గల్వలఱేని కతంబు మంచిబో
ధన మొనరించెఁ జంద్రుఁడది ◆ దాఁటిమెలంగఁగఁ దొంటికైవడిన్
గినిసి శపించె దక్షుఁ డిఁకఁ ◆ గీడ్వడుమీ క్షయనంచుఁ జెచ్చెరన్. 8

ఉ॥ అంతనె యాతఁ డాక్షయము ◆ నంది దురంతనిరంతరార్తిమై
నెంతయుఁ జిక్కిపొక్కి తెరు◆వెద్దియుఁ గాంచ కలందురన్ మరు
త్వంతుఁడు మున్నుగల్గు సుర◆వర్యులు మౌనివతంసు లాత్మలన్
జింతిలి బమ్మదేవరను ◆ జేరఁగఁబోయి వచించి రంతయున్. 9

ఉ॥ చందురు దుండగంబులను ◆ జక్కనెఱింగినయట్టి నల్వ యీ
చందమె మేలు వీని కన ◆ సర్వసుపర్వులు మౌను లీ క్షయన్
జెందినరాజుతో జగము ◆ చెన్నసలారఁ బ్రకాశమొందునే?
యొందదె హ్రాస మీ కువల◆యోన్నతి? యారయు మన్ననాతఁడున్. 10

చ॥ గురుసతిఁబట్టి కూడి కొడు◆కున్ గనె నాపెనుగూడ స్వీయమం
దిరమునుజేర్చె నత్రియును ◆ నేనును బోయి హితంబుఁజెప్పి య
గ్గురున కొసంగఁ జేసితిమి ◆ కోమలినిన్ మగుడన్ గురుండు మా
యురవగుబోధఁ గైకొనియె ◆ నుత్పలనేత్రిను లజ్జితాత్ముఁడై. 11

గీ॥ ఒజ్జ కల్లొనరించె మ◆హాపకృతిని, గట్టుకొన్నట్టిదారలఁ ◆ గనకయుండె
నొక్కరోహిణితగులంబు◆నొందియుండె, మామ దక్షునినుడి నవ◆మానపఱిచె. 12

ఉ॥ వినను లోకసౌఖ్యమును ◆ నారసి చెప్పెద నాప్రభాసమ
న్యూనతరాఘహారియగు ◆ నొద్దిక వీఁడటఁ జేరి శంకరున్
బూనికఁ గొల్చుచున్ దపసుఁ ◆ బూని వసించినఁ గొన్నినాళ్ళకీ
గ్లానిని మాన్పఁగాఁగలఁడు ◆ కాలహరుండు దృఢంబు పొండిఁకన్. 13

క॥ మృత్యుంజయమంత్రజపం, బత్యంతనియమములోడ ◆ నాఱు నెలలటన్
నిత్యం బొనరించినచో, సత్యంబుగఁ బాయు క్షయరు ◆ జయు సురవర్యుల్!

వ॥ అని పంచిన

ఉ॥ వేలుపులంత సంతసము ♦ వేకొని యందుల కంప జాబిలిన్
జాలఁ బ్రవృత్తితో నతఁడు ♦ శంకరుఁ గొల్చుచు నాఱుమాసముల్
గాలవహారోరుమంత్రమును ♦ గాటపుభక్తి జపించుచుండ మేల్
మేలనుచున్ శివుండటకు ♦ మెచ్చుచు వచ్చి యనెన్ హిమాంశుతోన్. 15

గీ॥ కోరుము వరంబు నావుడు ♦ ఘోరరుజను, బాపుమన శంకరుం డొక ♦ పక్షమందుఁ
బాసి వృద్ధినిఁ గొను మన్య ♦ పక్షమందుఁ, గార్స్యమొందుము పుడమికిఁ ♦ గర్జమల్లె.

క॥ అనిచెప్పినఁ జందురుఁ డ,ట్లనె యనుమతిఁ జెంది యిమ్మ ♦ హాస్థలమున నీ
వనిశము వసింపుమన విని, యనఘుఁడు సోమేశుఁ డనఁగ ♦ హరుడుండె నటన్.

వ. చంద్రుండు ద్రవ్వినతీర్థంబు చంద్రకుండంబనఁబరంగు నఖిలదురితాపహరంబు. అందిప్పగిదిఁ జందురుండు క్షయరోగంబు వ్యవస్థన్ జేసి పాసె. అప్పటినుండి తక్కిన కళత్రంబుల గారవించుచు మెప్పువడయుచుండె నది మొదలుచేసి యాదివ్యజ్యోతిర్లింగంబు గొలిచినవారలకెల్ల సకలాధివ్యాధులఁ బోకడచుచు శ్రేయంబు లొసంగుచుండె నిది సోమేశ్వరలింగోత్పత్తి చరిత్రం బింక మల్లికేశ లింగోత్పత్తిని వినుండని సూతుం డిట్లనియె. 18

## —* శ్రీశైలము - మల్లికార్జున లింగము *—

క॥ ఒకమన్వంతరమందు శి, వకుమారుఁడు కొమరుఁడు గణ ♦ పతి కోడ్పడి పెం
డ్లికిఁ జెందకలిగి సహ్యా, ద్రికటకమును జేరి యొకఁడె ♦ దిరముండె నటన్. 19

చ॥ కొమరుఁ డొకండు సహ్యగిరి ♦ కూటమునందు విరక్తినుండఁగా
నుమయును శంకరుండు దన ♦ యున్ దగఁ జేరి బహూకరించి ప్రే
మము మెయిఁ గ్రిమ్మఁ జక్క దమదు ♦ మందిరశైలముఁ జేరుమన్న న
క్కొమరుఁడు పోక యాచిఱుత ♦ గుబ్బలియందె వసించె నల్కతోన్. 20

చ॥ అది గని శంకరుండును హి ♦ మాచలకన్యయుఁ బుత్త్రిఁ బాసి పో
మదిఁ గన కట్టిగట్టుకు సు ♦ మారుగఁ గొంచెముదూర మున్న య
ట్టిదియగు శ్రీగిరిన్ దఱిసి ♦ ఠీవిగఁ గాపుర మొంది యందుఁ బెం
పొదవఁగఁ జూచివత్తురు త ♦ నూద్భవుఁ బండుగులందు దండిగన్. 21

గీ॥ మల్లెవిరులను బోలిన ♦ వెల్లయమరు, దివ్యలింగంబుగా నందుఁ ♦ దేజరిల్లి
మల్లికార్జునుఁడను పేర ♦ నుల్లసిల్లె, శంకరుఁడు భక్తజనమనః ♦ కింకరుండు. 22

క॥ మల్లులని పేర్గొనినవా, రెల్లర కధినాథుఁడగుచు ♦ నెసఁగిన కతనన్
మల్లేశ్వరుఁడను నామం, బల్లలితేందుధర మూర్తి ♦ యట ధరియించెన్. 23

క॥ మఱి చంద్రవతియనానొక, ధరణీభృత్తనయ మల్లె ♦ దండనొసఁగి యా
హరుఁ బూజించుట మల్లి, శ్వరుఁడని పేరొందెననియుఁ ♦ జాటుదురు ప్రజల్.

గీ॥ శంకరార్ధాంగి భ్రామరీ♦శక్తి శక్తు, లరసి కొలువఁగఁ బీఠమం♦దధివసించి
యుండు నట్టులె లింగంబు♦లుండు వేన, వేలు మల్లీశలింగంబు ♦ విందుమరగి.

ఉ॥ ఇవ్వసుధాధరం బిటుల ♦ నీశ్వరుఁ డీశ్వరి తన్ను జేరుటన్
దవ్వులనుండియే శిఖర ♦ దర్శనమున్ బొనరించినంత నే
క్రొవ్వునఁ బాపపుంజములఁ ♦ గూలిచి మోక్షధనం బొసంగు నెం
దవ్వను లాకొలంతులును ♦ నాస్థలులున్ గలవే జగంబునన్. 26

సీ॥ ముల్లోకములఁజుట్టి ♦ మున్నున్న యెడఁజేసు, నొరుల కదృష్టమై♦యొక్క శాఖ
తన్ను జేరినక్షుధా ♦ తాపతృణ్ణిద్రాదు, లనుబాపు నొక్క ప♦లాశివరము
రుగ్జరాదుఃఖము♦రుద్ధరా పద్యాత, నలను రానీ దొక్క♦లలితవిటపి
దూరదర్శనమును♦దూరశ్రవణమును, బొసఁగించు మఱియొక♦భూజరాజ

గీ॥ మీప్సితార్థంబు లిచ్చిర♦హిన్ బ్రమోద, పారవశ్యంబొసఁగునొక్క♦పరమధరము
ఇభ్యసౌరభ్యమాధురీ♦హృద్యరసవి, భాసురానేక ఫలమొక్క♦పాదపంబు. 27

క॥ పాతాళగంగనాఁ గృ, ష్ణాతటిని యటన్ గభీర♦జలసంభృతమై
పాతాళమంటి తనరుచుఁ, జేతోజాతారి నెపుడు ♦ సేవించు రహిన్. 28

క॥ ఇమ్మల సేవించినవా, రిమ్మహి సంపదలఁబొదలి ♦ హెచ్చుగనిఁక జ
న్మమ్మొందని యక్షయమో, క్షమ్మున్ జెందుదురు నిజము♦సన్మునిచంద్రుల్!

—* ఉజ్జయిని - మహాకాళలింగము *—

ఉ॥ గొజ్జఁగిపూలతేనియలఁ ♦ గ్రోలుచుఁ దేఁటులదాఁటు లింపుమై
యొజ్జలువోలె గీతముల ♦ నోలిఁబఠింపఁగ శిప్రకూలమం
దుజ్జయినీపురంబు గడు ♦ నున్నతిమీఱెడు వైభవంబులో
నిజ్జగమందు నానగరి ♦ కీడగు పట్టణ మొండు లేదెటన్. 30

ఉ॥ రంగుమెయిన్ విహారవన ♦ రాజము లావురి నేపుమీఱుఁగేఁ
దంగులకంచెలన్ విశద ♦ తామరసాచ్ఛకువాలయావళీ
రంగదుదార పల్వలస♦రస్తటులన్ బరిపక్వమాధురీ
సంగతసారపూర ఫల ♦ సంభృతదివ్యతరూత్కరంబులన్. 31

ఉ॥ మానక యందు నుండు నిగ ♦ మప్రియుఁడన్ ద్విజవర్యుఁ డీశ్వరా
ర్చానియతవ్రతుం డఖిల ♦ సద్గుణశోభితుఁడిద్ధకీర్తి య
వ్వానికి నల్వురాత్మజులు ♦ పావనమూర్తులు లోకపూజితుల్
మానశరారిపూజలను ♦ జొక్కుచునుండెడువార లెంతయున్. 32

వ. దేవప్రియుండు ప్రియమేధుండు సుకృతుండు సువ్రతుండునను నాహ్వాయంబులన్ బరంగుచు నన్నలువురు శివపూజాపరాయణులై నిచ్చలుఁ బార్థివశివలింగంబుఁ బూజించుచుండిరంత. 33

చ॥ నలువవరంబు నొంది యొక ♦ నంజుడు మేవరి పోతరించి భూ
తలముననున్న కర్మకుల ♦ ధర్మములెల్ల నడంచి దైవపూ
జలఁ గికురించి సజ్జనుల ♦ సాదులఁబట్టి పలార్చుచుండె న
క్కలుషున కుల్కి ఘాసిలిఁ ♦ గర్మపరుల్ శివకేశవార్చలన్. 34

ఉ॥ నిచ్చలుఁ బార్థివేశ్వరుని ♦ నిష్ఠభజించుచున్నయట్టి యీ
సచ్చరితుల్ పలాశుచెడు ♦ సాహస మారసి యుల్కులేక యే
నచ్చికతో శివార్చనఁ బొ♦నర్చుచునుండఁగ రక్కసుండు పెం
పెచ్చిన మచ్చరంబు వహి ♦ యించి కదుర్ వడిఁజేరి వారలన్. 35

చ॥ పొడిచెద మిమ్ము లింగమును ♦ బూజయొనర్చినఁ బాఱవేయుఁడి
ప్పుడు కడతేర్తు నిందఱను ♦ బూన్కిఁ గనుంగొనుఁడన్న నించుకే
నడలక వారు పార్థివమ ♦ హాశివలింగముఁ బూని తొంటికై
వడి వడిఁగొల్చుచుండ నొరఁ ♦ బాపి కృపాణము జెండ నెత్తఁగన్. 36

చ॥ కదలక బ్రాహ్మణుల్ శివునిఁ ♦ గాంచుచు "ఓంహర" యంచునుండి ర
ప్పదనున లింగమూర్తిపయిఁ ♦ బారములేని బిలంబుదోఁచె న
ప్పదవినె దివ్యలింగము వి♦భామయ మద్భుతదీధితిచ్ఛటల్
బొదలఁగ నుద్భవిల్లి పెను♦బూది యొనర్చెను మేటిరక్కసున్. 37

గీ॥ దూషణుండని పేర్గొన్న♦దుష్టదైత్యు, నట్లు కాల్చివధించిన ♦ యాతతార్తి
హరుని వారునిఁగనుంగొని♦యగ్రజన్ము, లుబ్బికడువడి సాష్టాంగ♦మొరఁగియనిరి.

చ॥ అలుసుగ నెల్లధర్మముల ♦ నడ్డి మముల్ బొలియింపవచ్చు నీ
తులువను జంపి మా వనట ♦ ద్రుంచిన నీదు దయామయాత్మమున్
దెలిసి నుతింపనోపుదుమె! ♦ దేవర! యీవిటుపోవ నెష్టనీ
స్థలమున నున్కిసేయుమన ♦ శంకరుఁ డొప్పి వసించె నందటుల్. 39

వ. అదిమొద లమ్మహాలింగంబు మహాకాలలింగంబనన్ బరంగుచు భక్తజనంబులన్ బాలించుచుండె. మహాదేవియును శివుం డందు వసించుటఁ జేసి తానును దఱిసి వచ్చి యందు మహాకాళియను నాఖ్యన్ జెంది యుండె నంతఁగొంతకాలంబుమీఁద

— * చంద్రసేన మహారాజ చరిత్రము * —

ఉ॥ అప్పురమందు నొక్క శమ ♦ నాంతకభక్తుఁడు చంద్రసేనుఁడన్
గొప్పనృపుండు పూతమతి ♦ కోమలచంద్రకిరీటలింగమున్

దప్పక పూజసేయుచు ను ♦ దంబుననుండ మహేశ్వరాజ్ఞ నా
కృపఁ బాపు మాణిభద్రుఁడను ♦ నాఢ్యుఁడు సిద్ధుఁడు దాసి వాసిగన్. 41

మ॥ ఒక చింతామణి నిచ్చి దీని గళమం ♦ దుత్కంఠమైఁ దాల్చు మీ
వీఁక నీరత్నము సోఁక లోహ మెదియేన్ ♦ హేమంబగున్ దీని చే
రిక నీసీమను వృష్టిదోషములు మా♦రీభూతవిస్ఫోటకా
దికపీడల్ సొర వెష్టు మంగళము లెం♦తే సౌఖ్యముల్ సేకుఱున్. 42

చ॥ అని యిటు చెప్పి సిద్ధుఁడు ని ♦ జానుమతిన్ జనినంత సంతసం
బున నరనాథుఁ డమ్మణిని ♦ బొంకముగా నఱుతన్ ధరించి సూ
ర్యునివలె వెల్గె రాష్ట్ర మది ♦ యొప్పె హిరణ్మయమై ప్రజల్ గడున్
ధనపతులై యొసంగిరి ని ♦ శాంతము కీర్తి మించె ధారుణిన్. 43

క॥ నలుదిక్కుల నరపతులీ, యలుకుదువిని సర్వమరసి ♦ యాసన్ గొని సే
నలు గూర్చికొని యవంతిని, నలువలఁకుల ముట్టడించి ♦ నయ మెసలారన్. 44

ఉ॥ కాలరులన్ దగన్ బనిచి ♦ కట్టడిగా నిటు చెప్పియంపిరా
మేలిమిరత్న మిచ్చి చెలి ♦ మిన్ బొనరింపుము లేదయేని నీ
వాలముఁ జేర రమ్మిఁక ర♦యమ్మున నంచిటు లవ్వసుంధరా
పాలునిఁ జేరి వారు నుడు♦వన్ విని యాతఁడు భీతచిత్తుఁడై. 45

మ॥ ఒకఁడో యిద్దఱొ ముగ్గురో యయిన చో ♦ నుత్సాహమేపార నా
జికిఁ జేరన్ జని నిల్వరించి రిపులన్ ♦ జెండాడుదున్ గాని యీ
సకలోర్వీపతులేకమై యిటుల ను ♦ చ్చండప్రతాపానల
ప్రకటజ్వాలలఁ జుట్టుముట్టఁ దరమే ♦ వారింప నేకాకికిన్. 46

గీ॥ అడిదములు బాకు లీటెలు ♦ నంపగములు
గదలు గుదియలు మొదలుగాఁ ♦ గలుగు నాయు
ధములు దురమొనరింపఁగాఁ ♦ దగినజోదు
లలఁతి నాకడ నెటుచేరఁ ♦ గలను గలను. 47

వ. అట్లుగాక యిమ్మణిని వీరి కొసంగి చెలికారంబుఁ బడయుదమన్నను బ్రయోజ
నంబులేదు. 48

చ॥ ఒకనికె నిచ్చినన్ మఱియు ♦ నొండొరుఁ డాజిఁదొడంగు వీరిలో
నొకఁ డొకఁ డిచ్చు ముందుఁ దన ♦ కొప్పన సేయుమటంచుఁ జెప్పు నే
రికి నొసఁగన్ వశవ్ గడిఁది ♦ రిమ్మపొసంగె నరేంద్రులందు నే
నిఁక నెటు లీ విపజ్జలధి ♦ నీఁది తరించెదువాఁడ నీయెడన్. 49

మ॥ అని చింతింపుచు తేఁడు దా నపుడు సే ♦ యన్ బోలు కార్యంబు న
ట్లును యోజింపఁగఁ బాలకీశ్వరు దయా♦ళున్ నెమ్మదిన్ నమ్మి వే

గని బిల్వాదిసువస్తువుల్ గొని మహా ♦ కాళేశు దివ్యాలయం
బును జేరన్ జని మేటినేమ మొనరన్ ♦ బూజింపుచుండెన్ శివున్. 50

—* గోపబాలక చరిత్రము *—

వ. ఆ సమయంబున నీశ్వరమాయావిశేషంబునం జేసి యన్నగరంబందు 51

ఉ॥ త్రేతయొకర్తు గోపెలకు ♦ వెన్క వసింపుచు నొక్క పాకలో
నాతఁడెఁ బాపఁడేడ్వ నుర ♦ మందు వహించి కుమారు నగ్గుడిన్
బ్రీతిగఁ జేర్చి తాఁ దచట ♦ బిట్టుగ శంకరుఁ గొల్చుచున్న తీ
ర్చేతము మెచ్చఁజూపెఁ దన ♦ చిన్నికుమారున కెంతొ వింతగన్. 52

శా॥ ఐదాఱేడుల బాలుఁ డా శివసప ♦ ర్యన్ భక్తిమై నాత్మలో
నాదర్శంబువలెన్ ధరించి చని యొ♦క్కశ్మంబు నప్పాకయం
దేదో మూలఁ బ్రతిష్ఠచేసి శుచియై ♦ యింపొప్ప నబ్ధారలన్
బూదిన్ బత్త్రిరిఁ దుమ్మిపుష్పములతోఁ ♦ బూజించుచుండెన్ రహిన్. 53

సీ॥ శివుని కైంకర్యమందు వ♦సించి యొడలె, ఱుంగ కానందవార్ధి న♦డంగియున్న
పిన్నపాపని యాకలి♦గొన్న కతము, నరసి కుడువంగ నవ్వాని ♦ యవ్వ పిలిచె.

చ॥ పిలిచిన నాలకింపకయె ♦ పేర్మి శివున్ గనుచున్న బాలకున్
బలుమఱు పిల్చి వేసరి జ ♦ వంబున నయ్యెడ కేగుదెంచి పే
రలుక సుతుండు సల్పెడు శి ♦ వార్చనమంతయుఁ ద్రోచివేసి చా
పలమున నల్లలింగమును ♦ బాఱఁగవైచెను దిబ్బపై వడిన్. 55

ఉ॥ అంతనెయార్తిమై హరహ♦రా యని బాలుఁడు మూర్ఛనొందె న
య్యింతియు నల్కతోడఁ జని ♦ యెచ్చటనో నిదురించె నంతఁ గా
లాంతకుసత్కృపన్ బుడుతఁ ♦ డల్లన గన్నులువిచ్చి చూడఁగా
నెంతయు వింతఁ గన్పడియె ♦ హేమమయంబగు దేవళం బటన్. 56

చ॥ అదిగని లోనికేగ నట ♦ నందపువజ్రమయంపులింగమున్
జదురుగఁ దీర్చికూరిచిన ♦ నందులు శాంకరివిగ్రహంబునున్
గుదురగు గర్భగేహమును ♦ గోధ్వజమున్ మధురాంబుపూరమా
హ్రిదమును పూలతోఁటయును ♦ నబ్రముగాఁ గనుపట్టె వానికిన్. 57

శా॥ అర్చావస్తువులెల్ల హేమమయపా ♦ త్రాళిన్ దనర్చెన్ బ్రదీ
పార్చుల్ శోభిలుచుండె నెల్లెడల దీ ♦ వ్యదరిత్నపాంచాలికల్
వర్చస్సుల్ నిగుడించుచుండె నిఁక న ♦ బ్బాలుండునున్ వింతగా
నర్చిష్మంతునిఁబోలు తేజమును దా ♦ నప్డొంది వేగఁబునన్. 58

చ॥ శివునకు గౌరికిన్ నతులు ♦ చేసి నిజాంబయొనర్చినట్టి బి
ట్టవినయకృత్యముల్ సయిపు ♦ మంచు నుతించి తదంబఁదెచ్చి వై
భవమును జూపఁగోరి తన ♦ పాకకుఁ జేరఁగఁబోవ స్వీయమా
భవనము తేజరిల్లె మణి ♦ బంధురధాళధళీవరీతమై. 59

వ. అంత నతండు మఱియు నక్కజంబుతో నిక్కన్ జేరి యందొక్క పసిండిమంచం బుపై నిఱుగడల దిండ్లమరించియున్న పట్టుపరుపుమీఁద నెట్టనఁ బవళించినిదురించుచున్న వేల్పుంబువుఁబోఁడింబోలి కాంతులవెదజల్లు తల్లిఁగాంచి యచ్చెరువొంది ప్రబోధంబొనరించి కోవెలకుఁదోడ్తెచ్చి యచ్చిత్రంబెఱింగించి చూపింపుడు నవ్వేలంది వెఱఁగొంది తనచిట్టికొమరుని గట్టినిష్ఠను దేవుని యకారుణకరుణాపరీవాహాలహరీసాహిత్యంబును నత్యంతంబెఱింగి మెచ్చి తన యపారాపచారంబును మన్నించుమని యర్థించి తత్పార్శ్వప్రాసాదమందు మహాకాలలింగంబు నర్చించుచున్న చంద్రసేననృపాలుని కావృత్తాంతం బాద్యంతంబుఁదెలిపి యన్నరవరున్ దోడ్తెచ్చి స్వాయంభువంబగు నాలింగంబును దేవళంబు మున్నగువానిన్ జూపింప నతం డాశ్చర్యంబునొంది చిట్టివాని ముద్దుగొని శంకరుఁ బలుమఱు గొనియాడుచున్న నప్పట్టున. 60

గీ॥ ముక్కువచ్చలారని గొల్ల♦బుడుతఁడొకఁడు,భక్తిసేయఁగలింగము♦ద్భవముచెందె
గుడిహిరణ్మయమవ్వాని♦గుడిసెయంత,కనకమయమయ్యెననిపౌర♦జనులుమ్రోయ.

గీ॥ నగరివెల్పట నున్నట్టి ♦ నరబిడౌజు, లెల్లరివ్వార్తవిని తథ్య ♦ మెఱుఁగఁగోరి
చంద్రసేనునికడకాత్మ♦జనులనంపి, యతని యనుమతిఁ బురిఁజేర ♦నాతఁడలరి.

క॥ వారందఱుఁ దగురీతిగ, నారాధనచేసి వల్ల ♦ వార్భకభక్తి
శ్రీరచితంబగు కోవెలఁ, జేరిచి చూపింప వెఱఁగుఁ♦జెందిరి వారల్. 63

—* హనుమంతుఁడు ప్రత్యక్షమై గోపబాలుని బుజ్జగించుట *—

ఉ॥ ఆ సమయంబునందు నభ♦శ్చాలయగోపురభిత్తి చిత్రమై
భాసిలు నంజనీసుతుఁడు ♦ ప్రాణకలన్ గొని వృద్ధిఁజెంది గో
పీసుతు ముద్దుచేసి పృథి♦వీపతులన్ గని పల్కె మేదినీ
శాసకులార! కాంచితిరె! ♦ శంకరభక్తుల శక్తివైఖరిన్. 64

చ॥ కడుఁ బసిపాప వీఁడు శివుఁ ♦ గాటపువేడ్కఁ గొల్చి తత్కృపన్
బడసె నిటుల్ ప్రియంబుగఁ బ్ర♦పంచమునం దికఁ బెద్దయై సిరుల్
బడయుఁ బ్రతిష్ఠఁగాంచు సరి♦వారలచేఁ బొగడొందుఁ బద్మనా
భుఁడు హరి వీని వంశమునఁ ♦ బుట్టుకఁగాంచును గొన్నినాళ్ళకున్. 65

వ. మఱియును

ఉ॥ గొల్లలకెల్ల నాయకుఁడ ♦ గుర్జుడి వీఁడిఁక శ్రీకరుండనా
నుల్లసిలుర్ భవత్క్షితుల ♦ నుండెడు మందలకెల్ల వీని రా
జల్లఁగ రాజుఁజేయుఁడిఁకఁ ♦ జెల్మియొనర్పుఁడు చంద్రసేనుతో
వల్లవబాలులో సతము ♦ భాగ్యములొందుఁడు పొందు వీండ్లనుర్. 66

గీ॥ నరవరులకిట్లుచెప్పి వా ♦ నరవిభుండు, వల్లవీసుతు నక్కునఁ ♦ బడసి వాని
కీశ్వరార్చావిధంబెల్ల ♦ నెఱుఁగఁజెప్పి, చిత్తరువులోనఁజేరె వి ♦ చిత్రమొదవ.

వ. అంత నారాజవర్యులు

చ॥ బ్రిదికితిమింక వాయుసుతు ♦ పాల్పడకింతకు నీతఁ డిందఱిన్
జదివిన నెవ్వరడ్డము నృ ♦ శంసులమై యిటు చంద్రసేనుపైఁ
గదనముచేయ వచ్చితిమి ♦ కాదవునంచు నెఱుంగకిట్లు దు
ర్మదమిఁకఁ బాసి వీరికి న♦మస్కృతిచేసి చనంగ మేలగున్. 68

వ. అని మన్నిలందఱా గొల్లపిల్లవాని నెత్తికొని ముద్దిడి పసిండిరథంబు లేనుంగులు గుఱ్ఱములును బాఁడియావులమందలు చూడియావుల జిందంబు లనడ్వాహంబుల సమూహంబులు నవరత్నఖచితానేక భూషణంబులు నేవళంబులెక్కుడురొక్కంబు సూతాధోరణసాది గోపాలక రక్షాభటవర్గంబులతో నిచ్చి చంద్రసేననృపాలున కెఱఁగి క్షమాపణంబుఁగోరి యాతనిమచ్చికఁజెంది మహాకాలలింగంబునకు శ్రీకర లింగంబునకు నర్చలుచేసి స్వదేశంబులకేగి యచ్చటి ప్రజంబులకెల్ల శ్రీకరుని దొరఁజేసిరి: మహాకాలలింగంబును భక్తిచేసి పూజించిన చంద్రసేనుం డిట్లా పదఁబాసి సుఖమొందె. శ్రీకరగోపుండును హనుమత్ప్రోక్తానుసారంబుగ శివునిఁ బూజించుచుఁ బ్రశస్తిగాంచె నిది మహాకాలలింగమహాత్మ్యం బిఁక నోంకార నాథలింగంబును గూర్చి వినుండని సూతుం డిట్లనియె. 69

## — ఓంకారక్షేత్రము - పారమేశ్వరలింగము —

క॥ నారదమునీంద్రుఁ డొకపరి, గూరిమి గోకర్ణవిభుని ♦ గొలిచి వెడలి సు
శ్రీరంజిలు వింధ్యాద్రికిఁ, జేరఁగ నగరాజు పూజ♦చేసి ప్రియమునన్. 70

చ॥ మునివర! యెల్లలోకములఁ ♦ బూన్కిఁ జరించుచునుందు వీవు నా
కెనయనవచ్చు భూమిధర ♦ మెచ్చట నేనియుఁ గల్గియున్నదే ?
యనితరలభ్యవైభవర♦మాయతభూతుల నొండె దండిమై
నొనరిన మూర్తిసంపదను ♦ నొండె నెఱుంగఁగఁజెప్పు మీయెడన్! 71

చ॥ అని యడుగంగ మౌనివరుఁ ♦ డల్లననవ్వి ధరాధరేంద్ర ! నీ
కెనయగు పర్వతంబు గల♦దే? యొకఁ డిజ్జగమందు నెందునై

నను విను మా హిరణ్యగిరి ♦ జ్ఞప్తికివచ్చె నవగ్రహంబు లా
ఘనగిరికిఁ బ్రదక్షిణము ♦ గా నడచుఁ బలుమాటలేటికిన్. 72

క॥ అది యొకటిదక్క వేఱొక, టెదియున్ నినుఁబోలదన్న ♦ నెంతయు నగతో
నది విని చలికిలఁబడి యతఁ, డెదలో సిగ్గొంది కడిఁది ♦ యీరసమొప్పన్. 73

ఉ॥ మేరునగంబుకన్నఁ గడు ♦ మిన్నగ మిన్నుఁ గడించి పెంపునన్
జేరి రవీందుమార్గముల ♦ చేవ నడంచెదనంచుఁ బార్థివా
కారము లింగముఁ గొలిచి ♦ కాంతమెలంగఁగ భక్తదుఃఖని
స్తారుఁ డుదారుఁ డా హరుఁడు ♦ దాఁ గనవచ్చి వరంబు నడ్గుడుఁ. 74

ఉ॥ పెంపునొసంగు లోకమునఁ ♦ బెద్దగఁ జేయుము దేవ! నన్ననాఁ
గంపితచిత్తుఁడై శివుఁడు ♦ కర్జమెఱింగి నగేంద్రుతోడ నీ
వింపుగఁ గోరినట్లు వర ♦ మిచ్చితి నీవిఁక లోక సౌఖ్యముఁ
దెంపరివై యడంపకు మ♦దించి యొనర్చినఁ బాయు నున్నతుల్. 75

క॥ అని చెప్పఁగ నందలి ముని, జనములు దేవతలుఁ గూడి ♦ శంకరు నందే
యునికి యొనరింపుమని ప్రా, ర్థనసేయ వసించె దండ ♦ ధర దమనుఁ డటన్. 76

క॥ ఒకతను వోంకారేశ్వరుఁ, డొక తను వమలేశుఁడనఁగ ♦ నొప్పలరుచుఁ దా
సకలము గనుఁగొనుచుండును, నకలంకుఁడు శంకరుం డ♦నాదివిభుఁ డొగిఁ. 77

గీ॥ పరఁగ నోంకారవిభుఁడు శం♦కరుఁడు పృథ్వి,లింగమందిట్లుచేర బె♦డంగు రంగు
మీఱు నాస్థలమొప్పె నోం♦కారమనఁగ, నాటి యద్దానికదె వేఱు♦సవతు లేదు.

వ. ఇఁక నీ యోంకారలింగంబు భక్తులకు సర్వాభీష్టప్రదం బిద్దానిఁ బూజించిన జనుండు పునర్జన్మంబు నొందఁ డిది యోంకారేశ్వరలింగోద్భవచరితం బిఁకఁ గేదారలింగోత్పత్తిని వినుండని సూతుం డిట్లనియె. 79

—* హిమగిరి - కేదారలింగము *—

క॥ నరనారాయణు లను ని, ర్వరు హరితేజమున ధర్మ ♦ పుత్త్రకులై శం
కరుఁగొలుచుచుందు రాహిమ, గిరి మునులు త్రిలోకహితము♦గీల్కొనిమదిలోఁ.

ఉ॥ వార లహర్నిశంబులును ♦ పార్థివలింగసమర్చనంబు వి
స్తారముదంబు పెంపెసఁగ ♦ సల్పుదు రయ్యెడు రాజమౌళి య
వ్వారలఁ జేరవచ్చి యన ♦ వద్యవరంబును గోరుఁడన్న న
ద్ధీరు లిటఁ వసింపుమన ♦ దేవర యుండె హిమాటవీస్థలిఁ. 81

గీ॥ తవిలి హిమతిగ్మమైన కే♦దారభూమి, శంకరుం డిట్లు వెలసి ప్ర♦శస్తికెక్క
దేవతలును ఋషీశ్వరుల్ ♦ దివ్యమునులు,కొలిచిదుఃఖంబులను బాపి♦కొందు రెలమి.

శా॥ అంతన్ గొన్నియుగంబులైన పిదపఁ ♦ హార్యశ్వసంకాశులౌ
కుంతీపుత్త్రకు లల్ల లింగమును బల్ ♦ కూర్మిన్ సమీపింప నా
ద్యంతాతీతుఁడు శంభుఁ డొక్క మహిషం ♦ బై పాఱుటఁ గాంచి య
క్కౌంతేయుల్ గడుభక్తిమై నొడిసిలా ♦ గఁ జిక్కెఁ బుచ్ఛంబటఁ. 83

ఉ॥ దున్న యదృశ్యమై చనుడుఁ ♦ దోఁకయొకండిటు లభ్యమైన వా
రున్నతభక్తిమైఁ గొలిచి ♦ యోర్వఁగరాని వగన్ దొలంగి సం
పన్నసుఖంబు లొందిరిఁక ♦ మస్తక మా*నయపాలభూమిలోఁ
బన్నుగఁజేరి నిల్చి సుస ♦ పర్యలఁగాంచుచునుండె మించుగన్. 84

గీ॥ పుచ్ఛభాగము కేదార♦భూమియందు, లింగమై వెల్గె నిచ్చలు ♦ రంగుమీఱు
శీర్షభాగంబు లింగమై ♦ చెన్నుమీఱె, నల్లె నేపాలనగరంబు ♦ నందుసతము.

క॥ ఈ కేదారజ్యోతి, ద్రేకరలింగమును నెవఁడు ♦ సేవించిననే
నీ కేదారంబుపుఁగొనఁ, జేకొనఁడు పునర్భవంబు ♦ సిద్ధమిది మునుల్! 86

వ. ఈ కేదారలింగం బెల్లవారలకు భోగమోక్షప్రదం బిద్దానిస్వరూపం బెఱింగించితి నింక భీమశంకరజ్యోతిర్లింగసంభవంబును వినుండని మునులకు సూతుండిట్లనియె.

—* ఢాకిని - భీమశంకరలింగము *—

శా॥ జానొందున్ సిరి కామరూపమను దే ♦ శంబొండు భూమండలిన్
దానన్ గర్కటినాఁగ రక్కసికిఁ బో ♦ ద్యచ్చండసంరంభుఁడౌ
సూనుం డొక్కఁడు భీముఁడన్ గడిఁది పే ♦ ర్వోభిల్ల రాజిల్లుచున్
నానాదివ్యమునీంద్రసంచయములన్ ♦ బాధించుచుండెన్ బోరిన్. 88

శా॥ వాఁడొక్కప్పుడు దల్లితోననియె న♦వ్వా!, నన్నుఁగన్నట్టి య
వ్వాఁడెవ్వం ? డెచటన్ వసించు? నెపుడే ♦ వాడన్ గనన్ రాఁడు నీ
జాడన్ దల్పుఁ డొకర్తవే మనుదు వీ ♦ చక్కిన్ నిజంబాడుమా !
చూడన్ వేడుకపుట్టె నాదుజనకున్ ♦ సొంపొప్ప నిప్పట్టునన్. 89

చ॥ అని యడుగంగ నద్దియను♦మంత దలంకి యిటుల్ వచించె నం
దన! విను మేను గర్కటుఁడ ♦ నంబడు రక్కసుకూఁతురన్ విరా
ధుని యనుఁగుంబొలంతుకను ♦ దోర్బలధుర్యుఁడు రామచంద్రుఁ డా
తనిని వధింప నన్నిచటఁ ♦ దండిరి సాఁకుచునుండెఁ బేర్మిమై. 90

గీ॥ తల్లి పుష్కసి యనునది ♦ తండిరియును, నొక్కనాఁడాకటన్ గడు♦సుక్కిభక్ష
ణార్థమై సుమహాత్ముఁడౌ♦నాయగస్త్య, శిష్యుఁ బైకొని భస్మావ ♦ శిష్టమైరి.

* టిప్పణి— ఈ నయపాలశబ్దము నేపాలశబ్ద రూపాంతరము. నయం(నీతిం) పాలయతీతి నయపాలః
శివపురాణే కోటిరుద్రసంహితాయాం ఏకాదశాధ్యాయే—

శ్లో॥ నయపాలాఖ్యపుర్యాంతు । వరిసిద్ధాయాం మహీతలే ।
లింగం పశుపతీశాఖ్యం । సర్వకామ ఫలప్రదం ॥

ఉ॥ అప్పటినుండి నేనొకన ♦ హాయము లేక నిరాశ్రయంబుగా
నెప్పుడు దుఃఖితాత్మనయి ♦ యివ్వని నుండఁగఁ గుంభకర్ణుఁడన్
గొప్పనిశాటవర్యుఁ డట ♦ కున్ జనుదెంచి మదోన్నిమిత్తమై
యొప్పఁగ నన్నుఁ జూచి మరు ♦ లొందె మనోజశరాభితప్తుఁడై. 92

ఆ॥ కదిసి రెట్టఁబట్టి ♦ కలియఁబూనిన నే న, నాదరించి తొలఁగ ♦ నతఁడు బల్మిఁ
బట్టువిడక బిఱుతి ♦ నెట్టన భోగించి, చనియె లంక కంత ♦ శంక లేక. 93

గీ॥ రావణునితమ్ముఁ డతఁడు శ్రీ♦రామచంద్రు, చేత నన్నయుఁ దానును♦ జేటు జెంది
రంట! నాలంక కేను చే♦రంగఁబోవ, లేదు నిన్ గన్నదాన నా ♦ లీలఁ బడసి.

వ. ఇది యథార్థవృత్తాంతం బిందు సత్యేతరంబు లేశంబు లేదని యమ్మనుష్యాదిని నుడువఁ గడుఁ గవలి యప్పలాశుండు హ్యారవంబున 95

ఉ॥ అక్కట! పక్కిదాల్దొర మ♦హాబలు మజ్జనకున్ వధించెఁ జే
రెక్కిన పెద్దతండ్రిఁ బాలి ♦ యించె విరాధుని గీటడంచె నా
మక్కువతాత ముత్తవల ♦ మాని యొకం డటు బూదిచేసె నే
నెక్కరణిన్ సహింతు నిది ♦ యెల్ల నెఱింగి మఱుంగుచున్ మదిన్. 96

ఉ॥ నేనల కుంభకర్ణుని క ♦ నిందితపుత్త్రుఁడ నేని శ్రీహరిన్
మానుల దేవతాధముల ♦ మట్టము చేసెదఁ గొట్టెదన్ సిరుల్
ధీనిధి నాదు తల్లికి మ♦దిన్ బగదీఱ ముదంబుఁ గూర్చెదన్
బూనికమైఁ దపించెద న♦పూర్వతరోత్తమశక్తు లేర్పడన్. 97

చ॥ అని తనతల్లి యానఁగొని ♦ యబ్జజుఁ గూర్చి మహాతపంబుఁ జే
ర్చినమతి సల్ప నాతఁడును ♦ జేరి వరం బడుగంగఁ గోరె నా
దనుజుఁ డనన్యసాధ్యమయి ♦ తగ్దయుమీఱు మహాబలం బతం
డును విధిలేక యిచ్చె చనె ♦ నొచ్చుచు మానసమం దొకింతయున్. 98

—* భీమాసురుఁడు శివభక్తుఁడగు సుదక్షిణుని జెఱయందుంచుట *—

చ॥ అసురయు నంత దేవతల ♦ నందఱి గెల్చి సిరుల్ హరించి యు
క్కసఁగఁగ శ్రీహరిన్ వెదకి ♦ యెందును గానఁగలేక వీఁక ని
వ్వసుమతిఁ గామరూపమునఁ ♦ బార్థివముఖ్యు సుదక్షిణాఖ్యు న
క్కసుమెయి నొంచి వానిసిరిఁ ♦ గైకొనియుంచెను బందిగమ్మునన్. 99

ఆ॥ అతనితోడఁ జెఱను ♦ నాతని గృహిణి సు,దక్షిణయునునుండెఁ ♦ దగనిరువురు
పార్థివేశలింగ ♦ భక్తులై నిచ్చలుఁ, బూజ సేయుచుందు ♦ రోజ మెఱయ. 100

చ॥ నిరతము పార్థివార్చనము ♦ నెక్కొని శైవపదక్షిణీజన
స్థిరమతులై మహేశ్వరుని ♦ చేతము మెచ్చఁగఁ గొల్చుచున్న నా

యిరువురు రాజదంపతుల ♦ యీతులఁబాపి సుఖింపఁజేయ శం
కరుఁ డెదనెంచి యుండెఁ జనేఁ ♦ గాలమొకింత యనంతరం బటుల్. 101

వ. అంత

ఉ॥ భీముఁడు లోకభీముఁడయి ♦ బిట్టుగ సర్వసుపర్వవర్యులన్
భూమినిలింపులన్ మునుల ♦ భూరిమదంబున నేచుచున్ మఖ
స్తోమములందు భాగములఁ ♦ జూఱలుగొంచుఁ జరించుచుండె నా
తామసు చేయు బాధలకుఁ ♦ దాళఁగలేక ననేకు లేకమై. 102

ఉ॥ పార్థివలింగపూజనము ♦ భక్తిమెయిన్ బొనరింప నంత స
ర్వార్థకరుండు శర్వుఁడు ర♦యమ్మునఁజేరి యభీష్టమగ్గఁగా
నర్థిమెయిన్ మునిప్రవరు ♦ లయ్యసురన్ హరియింపఁగోరి రిం
ద్వర్థకిరీటుఁ డక్లైయని ♦ యారసి దైత్యునివ్యత్యయంబులన్. 103

గీ॥ తనదు ప్రియభక్తుఁడైన సు♦దక్షిణుండు, కొలుచు పార్థివలింగంబు♦నలఘుశక్తు
లలరఁజేరి ఖలున్ బల♦లాశుఁజంప, సమయమారయుచుండె ని♦శ్శంకుఁడగుచు.

మ॥ పిశితాశుండును గామరూపపతి దే♦వీయుక్తుఁడై పార్థివే
శు శివున్ గొల్చెడి తీరెఱింగి యటకున్ ♦ జొత్తెంచి యవ్వారిలోఁ
బశుభర్తన్ గొలువంగ నేమియగు? న♦ప్పాటిన్ విడుం డిప్డు మ
ద్యశమున్ బాడుచు నన్నుఁ గొల్వుఁడిఁక మి♦మ్మన్నైన మన్నించెదన్. 105

క॥ కాదేనిఁ బొడుతు ననఁగా, భూదయితుఁ డొకింత బుగులుఁ♦బొందక యనిమే
మా దైవంబును గొలిచెద, మేదైనను సరియె సిద్ధ ♦ మెఱుఁగు దురాత్మా!

క॥ హరుఁడు చరాచరభూతే, శ్వరుఁడు దయాకరుఁడు భక్త ♦ పరిపాలకుఁ డా
తురులన్ మముఁ గాపాడెడు, సరకుగొనము నీదు ధాకఁ♦జను మిఁక దవులన్.

గీ॥ అనిసదమజుఁడు బిట్టాగ్ర♦హంబుఁ జెంది
పండ్లు పటపటఁ గొఱుకుచుఁ ♦ బార్థివేంద్రు
పయిఁ గరాళాసి విసరె "మాం♦పాహి" యనుచుఁ
గనులుమూయఁగ తేఁడు శం♦కరుఁడు దోఁచి.

## —* పార్థివలింగమునుంచి శివుఁడు వెడలి భీమాసురునిఁ జంపుట *—

క॥ భక్తులను సాఁకుట మెగడు, యుక్తంబగు వ్రతము నాకు ♦ యోజింపుము నీ
శక్తి నిఁక మట్టుపఱచెద, నక్తంచర! యేను భీమ♦నాథుఁడఁ గనుమా! 109

క॥ అని యసురుని కరవాలముఁ, బినాకము విసిరియొనర్పఁ ♦ బిండిగ నాతం
డును మరలఁ ద్రిశూలము వే,యను దునుకలు చేసె దాని ♦ నభవుం డలుకన్.

వ. అంత దనుజుండు మరల

ఉ. పట్టిస మేసినన్ శివుఁడు • భగ్నముచేసెఁ ద్రిశూలధారచే
నట్టిమొడన్ నిశాచరుని • యానతి రక్కసి మూఁక లుక్కునన్
జుట్టి రణంబుసేయుటకుఁ • జొచ్చిన నారదమౌని డాసి యీ
చెట్టలఁ జెచ్చెరన్ గడపు • చేయకుజాలము దేవ! నాన్ వడిన్. 111

శా. హుంకారం బొనరించెఁ గాలహరుఁ డత్యుగ్రస్వనంబొప్ప నా
తంకంబొంది వడిన్ ధరన్ దిరుగుచున్ • దైత్యుండు గూలెన్ మహా
హంకారంబున మీఱు రక్కసులు హా•హా యంచు బీనుంగులై
కోంకారధ్వనితో నుతుల్ సలిపిరా • యుగ్రున్ శివున్ దేవతల్. 112

వ. అంత గౌరీకాంతుండు సుదక్షిణుని దత్సతిని ననుగ్రహించి కామరూపంబున మగల నవ్వారి నభిషిక్తులఁజేసిన వారును దక్కిన దేవమునిగణంబు లెల్లఁ బరమేశ్వరు నాపార్థివలింగంబందె వసింపఁ బ్రార్థింప భక్తవత్సలుం డియ్యకొని యట్లుండెఁ దదాదిగ నీభీమశంకరలింగంబు రక్షోభూతభేతాళాది భయనివారకంబై భోగమోక్షప్రదంబై భక్తులన్ బాలించుచుండె నీయది భీమశంకరలింగమాహాత్మ్యం బింక నఖిల కల్యాణహేతువును మోక్షలక్ష్మీజీవాతువునగు విశ్వేశ్వరలింగంబుయొక్క చరిత్రంబును వినిచెద నవధరింపుఁడని సూతుండు మునుల కిట్లనియె.

—* శ్రీకాశీ - విశ్వేశ్వరలింగము *—

ఉ. నిర్గుణమై యఖండమయి • నిత్యమునై శివమై యనన్యసం
సర్గమునై ప్రకాశిలెడు • సారతరోత్తమ తేజ మీజగ
త్సర్గముఁ గోరి చెల్వమరె • శక్తి శివాఖ్యల * స్త్రీ, పుమాంసుఁడై
నిర్గతమైన యక్కవమె • నేరమి గారణమయ్యె సృష్టికిన్. 114

క. పురుషుఁడె మహేశ్వరుం డెఁకఁ, దరుణిమె యాశక్తి వినుఁడు • తథ్య మిది చరా
చరభువనంబెల్ల మహేశ్వరరూపం బారయుండు • సచ్చరితు లెదన్. 115

గీ. వారు సర్గాదియందు ని•వ్వారిఁ బ్రకృతి
పురుషులను సృష్టిఁ జేయఁగాఁ • బొడమి వారు
గారణులఁ గానఁగా లేక • కడు నడలుచు
నుండఁగఁ దపించుఁడను సూక్తి • యొక్కఁడు విని. 116

---

* ఇందు స్త్రీ, పుమాంసుఁడై యని వ్యస్తపదము సమానము కాదు.

## —* శివుఁడు కాశీ పంచక్రోశమును సృష్టించుట *—

ఉ॥ ఎచ్చటనుండి సేయఁగల ♦ మెన్నిక మీఱు తపంబు? మాకుఁ జో
టెచ్చటఁ గానరాదు జల♦మే తుది ముట్టక తోఁచుచుండె నా
గ్రిచ్చఱ నైదుక్రోసు లెటు ♦ గన్పడు నేలను సృష్టిచేసి వా
రచ్చెరువొందఁ జూపి శివుఁ ♦ డందు వసించి తపింపుఁడంచనెన్. 117

ఉ॥ తానును లింగరూపమునఁ ♦ దత్పురిఁ జేరి కరంబు ప్రీతి న
ద్దానినిఁ బాయకుండుట స♦తం బవిముక్తసమాహ్వయంబునన్
బూనెఁ బురంబు లింగమునుఁ ♦ బొల్పెసలారెఁ దదాఖ్య శంకరుం
డా నగరిన్ వహించుఁ ద్రిశి♦ఖాగ్రతలంబున నెత్తిసీళులన్. 118

గీ॥ కడు నసత్కర్మముల నెల్లఁ ♦ గౌశలమున, నొడిసి కర్షణగావించి ♦ సుడియఁ జేయఁ
గాశి యను పేరుఁ జెంది వి♦ఖ్యాతమయ్యె, నైదుక్రోసులఁ బరఁగున ♦ య్యభవభూమి.

గీ॥ అంత నప్పురిఁ జేరి వా♦రాస్థమెఱియఁ, జిరము తపసానరింపుడు ♦ సృష్టిఁ గోరి
పుండరీకేక్షణుని తనూ♦ద్భూతఘర్మ, సలిలమొక్కండు వాపియై ♦ యలరుటయును.

## —* చక్రపుష్కరిణి మణికర్ణిక యగుట *—

చ॥ మినుసిగవేల్పు డాసి కడు♦మిక్కిలి యచ్ఛము దీయనైన య
వ్వనరుహనేత్రు సంకలిత♦వాప్యుదకంబును గాంచి మెచ్చు వే
డ్కను దలయూఁచినన్ బడియెఁ ♦ గర్ణమునందలి వజ్రకుండలం
బొనరెను దానఁ దీర్థ మది ♦ యుర్విపయిన్ మణికర్ణికాఖ్యమై. 121

గీ॥ దాన మజ్జనమాడిన ♦ మానవులకుఁ, దెవ్వులు దురితంబు డిందు నెం♦తేని నభవ
పదముఁ జేరెదు బాట గ♦న్పట్టు నట్టి, తీర్థమెడఁ బాయలే రెట్టి ♦ దివ్యమునులు.

మ॥ హరియున్ శంకరమాయచేఁ బ్రకృతితో ♦ నత్యంతనిద్రాళుఁడై
యొరుగన్ దద్విభునాభి పద్మమునఁ దా ♦ నుత్పన్నుఁడై నల్వ శం
కరునాజ్ఞన్ విరమించె నద్భుతగతిన్ ♦ గౌశల్యమొప్పొందఁగా
దిరమౌ నేఁబదికోట్ల యోజనమితిన్ ♦ దీపించు భూలోకమున్. 123

గీ॥ అందు సకలచరాచర♦ప్రాణినిచయ, ములను రచియించెఁ జాతురి♦పొలుపు మీఱఁ
గాశి నఖిలప్రలయములఁ ♦ గాండమందు, మునుఁ గనీఁడు హరుఁడు శూల♦మున ధరించు.

ఉ॥ ఇమ్మగ బ్రహ్మదేవుఁడట ♦ నెంతయు భక్తి మెయిన్ దశాశ్వమే
ధమ్ము లొనర్చి లింగ మభి♦ధానము వెల్గఁ బ్రతిష్ఠచేసి శ
ర్మమ్మును జెందె మాను లమ♦రప్రవరుల్ మనుజుల్ దదీయ మా
ర్గమ్మును బట్టి లింగములఁ ♦ గాశిఁ బ్రతిష్ఠ నొనర్చి రింపుమై. 125

చ॥ పరశివశక్తియున్ దనదు♦భర్త శివుండట విశ్వభర్తనాఁ
బరఁగెడు దివ్యలింగమయి ♦ వాసముచెందుటఁ జూచి తాను సం
బరమున నన్నపూర్ణయను ♦ భాస్వరనామముఁదాల్చి చేరి శం
కరుకెలనన్ వసించె ముని♦కాంత లెఱింగి చెలంగి పొంగఁగాన్. 126

ఉ॥ తాతకుఁదాతలై కపిల♦దారుణరోషమహాగ్నికీలలన్
భూతిగ నేలఁగూలిన య♦పుణ్యుల నావృతి నుద్ధరింపఁగాఁ
బ్రీతి మెయిన్ భగీరథుఁడు ♦ పృథ్వికి గంగను దెచ్చెనంత గం
గాతటినీమతల్లి వడిఁ ♦ గాశినిఁజేరి భజించె శంకరున్. 127

క॥ ఆగంగా స్నానంబున, కేగంగాలేనిమనుజుఁ ♦ డెంతయుఁ దమిలో
నోగంగా గంగాయని, సాగంగాఁబాయఁగలఁడు ♦ సర్వాఘములన్. 128

గీ॥ అజునిపంచమశిరముఁ గో♦యంగఁదన్ను, వెనుకొనిన బ్రహ్మహత్యయు♦విధికపాల
మును దొలఁగిజాఱఁ గాశికా♦పురినిఁజేరి, భైరవుండుండె నాక్షేత్ర♦పాలకుఁడయి.

వ. మఱియు నందా కాలభైరవునితోఁగూడి యష్టభైరవులును డుంఠిప్రముఖులగు నేఁబదియాఱుగురు గణపతులును నవదుర్గలును నేకాదశరుద్రులును ద్వాదశాదిత్యులును గౌరీనవకంబును నిరువదియిద్దరు కేశవులును నవగ్రహంబులును స్వనిర్మితతీర్థోదకంబులతో స్వప్రతిష్ఠితశివలింగంబుల నర్చించుచు ముప్పది మూడు కోట్ల దేవతలును విలసిల్లుచుందు రిందు మృతిఁజెందినవార లిఁక మాతృగర్భంబుఁ జెందక పారమేశ్వరసాయుజ్యంబు నొందుదు రిందు సందియంబులే దీవిశ్వేశ్వరలింగార్చనం బఖిలభోగమోక్షప్రదంబనుట న్యాయోక్తిగ సంభావింపుఁడికను.

శా॥ స్త్రీలున్ బూరుషులున్ నభోధునిమెడన్ ♦ జిత్తంబులుప్పొంగఁగ
ల్లోలాంభస్సులఁ దీర్థమాడి నియతిన్ ♦ లోలాత్ములై తోయమున్
బూలున్ బత్తిరి గంధమక్షతలునున్ ♦ బూదిన్ సమర్పించి ఫే
*డాల్ భోగముచేసి మ్రొక్కుదురు ఘం ♦ టల్ మ్రోగ విశ్వేశ్వరున్. 131

క॥ కాశీక్షేత్రంబును వి,శ్వేశుండును నన్నపూర్ణ ♦ యుభయముఖుఁడా డుం
ఠీశుండు భైరవుం డఘ, పాశంబులఁ ద్రుంతు రొక్క ♦ వరి దలఁచినచోన్. 132

వ. ఇట్లు విశ్వేశ్వరలింగ చరితంబు సందర్భంబు సూత్రప్రాయంబుగ మీకెఱింగించితి నిఁక త్రియంబకేశ్వర జ్యోతిర్లింగస్వరూపంబును వినుండని సూతుండిట్లనియె. 133

—* గౌతమీతటము - త్ర్యంబక లింగము *—

చ॥ మునికులమందు గౌతముఁ డ ♦ మోఘతపోవిభవాఢ్యుఁడై భృశం
బనిశము శంభులింగనియ ♦ తార్చన సల్పుచుఁ బత్నితో వసిం

* ఫేడాలు—క్షీరసార శర్కరా విశిష్టమైన యొక మధురతర లేహ్యవిశేషము శ్రీకాశీప్రాంతము నుండి తెలంగాణావఱకీపదము దేశ్యముగా వాడఁబడుచున్నది.

చెను హరువొప్ప బ్రహ్మగిరి ♦ చేరువ నొక్క వనస్థలంబునం
దనువుగ శిష్యకోటి తన♦యండఁ బఠింపఁగ న్యాయశాస్త్రముల్, 134

గీ॥ అంతఁ గొండొకకాలంబు♦నందుఁ బుడమిఁ, గడు ననావృష్టిపొదల నె♦క్కడలఁగాని
త్రావ నీళులుగ అవయ్యె ♦ గ్రాసమసలె, శూన్యమయ్యెను దెసల నె♦చ్చోటనేని.

క॥ ఆకట మలమలమాడుచుఁ, దేఁకువసెడి యెల్లప్రజలు ♦ దిగులుపడి కడున్
జీకాకుతోడ నలుగడ, లేకాకులు గాకులగుచు ♦ నేగిరి పెలుచన్. 136

ఉ॥ ఆయెడరందు గౌతమమ♦హాఋషి యవ్వరుణుఁ జలేశ్వరున్
బాయనిభక్తిఁ గొల్చెడు న♦పాంపతి యమ్మునికిన్ బ్రసన్నుఁడై
చేయుదు నీకభీష్టమును ♦ జెప్పుమనన్ మునివంశమండనుం
డాయతవృష్టిఁ గోరె నుద♦కాధిపుఁ డందులకొప్ప కిట్లనెన్. 137

వ. మునీంద్రా! పరమేశ్వరునకిష్టంబు లేకయున్న యిక్కాలంబం దేను వృష్టికి సమర్థుండ
గాను, 138

చ॥ ఎవనిభయంబు నెక్కొని స♦మీరుఁడు వీచు మతేని యుల్కచే
రవి యుదయించు నే బిరుదు ♦ త్రాసముఁ జేసి మహేంద్రుఁ డగ్ని మృ
త్యువ్రును బనుల్ పొనర్తు రభ♦యుం డఖిలాబ్జభవాండనాథుఁ డా
శివుఁడు తదీయమా వశముఁ♦జెంది తనర్చు జగంబు సర్వమున్. 139

ఉ॥ కావున నేను వృష్టి కెటు ♦ గర్తను గాఁగల నొక్కగర్తమున్
నీవిఁకఁ ద్రవ్వికొన్మచట ♦ నీరము నించెద జానుదఘ్న మ
చ్చో వివిధౌషధీతతిఁ బ్ర♦సూనఫలద్రుకదంబమున్ ముదం
బావహిలంగఁ గూర్చికొను ♦ మాఱకయుండు జలంబు లెప్పుడున్. 140

—✱ గౌతమమహర్షి వరుణానుగ్రహంబున కుంటను నిర్మించుట ✱—

చ॥ అనుడు మునీంద్రవర్యుఁ డటు ♦ లారసి కుంట నొకండు ద్రవ్వ జీ
వనవిభుఁ డచ్ఛనీరమును ♦ వట్టుటలేకయె జానుదఘ్నమై
తనరెడునట్లు నించెను హి♦తమ్ముగ గౌతముఁ డెల్లధాన్యముల్
వనరెడుచేలు పుష్పఫల ♦ పాదపవాటికలన్ దనర్చెడున్. 141

సీ॥ అవిరళఘనసుగం ♦ ధాఢ్యమరంద ని, ష్యందసుందరసుమ ♦ కుందకుటజ
మందారమాధవీ ♦ మాలతీవకుళచం, పకకరవీరకే ♦ తకులతతులు
పరిపక్వఫలరాజి ♦ భాసురసహకార, దాడిమద్రాక్షాబ ♦ దరులపంక్తి
పనసఖర్జూర శ్రీ♦ఫలజంబుజంబీర, లికుచబీజాపూర ♦ నికరములును

గీ॥ మెండుగాఁబండి చెన్నారి♦మీఱు వ్రీహి, యవతిలాఢకచణకప్రి ♦ యంగుమాష
రాజమాషమసురముద్గ ♦ రాజియావ, నాళగోధూమవితతి ఘ♦నముగఁ దనరె.

సీ॥ దోస వంగ యరంటి ♦ దొండ కాకర పొట్ల, పొర బీర చిక్కుడు♦సిరికె వెలగ
కరివేపయావయు ♦ మరిచమార్ద్రికమును, బెండ గుమ్మడియును ♦ బెండలంబు
కంద చేమయుఁ జిల♦కడము నామ్రాతకా, మ్రములు నారింజ జీ♦రకము చిర్రి
పొన్నగంటియు బొద్ది ♦ పులిచింత తింత్రిణి, గోగు జీవంతియు ♦ రేగు మునగ
గీ॥ ములకమిరపయుఁ జుక్రశా♦కినులుబచ్చ, లియును జెమ్మయునున్ బుడ♦మయునునాగ
వల్లిలతలును గ్రముకల♦వంగతతులు, నారికడము లేలలుఁబలు ♦ తీరులలరె.

—* గౌతమాశ్రమమునకు మునులు వచ్చుట *—

సీ॥ తనతాతతాతకుఁ ♦ దమ్మునికొమరుని, కొడుకంచు నొక్కండు ♦ కూడవచ్చె
తనతండ్రితండ్రి య♦ల్లునిచెల్లెలికి మేటి, మఱఁదియం చొక్కండు ♦ దరలివచ్చె
తనమేనమామ వ♦దినె యల్లునికి బావ, గారని యొక్కండు ♦ గలియవచ్చె
తనతోడి యల్లుని ♦ తండ్రితండ్రికి మేన, యల్లుఁడంచును నొక్కఁ ♦ డరసిడాసె
గీ॥ ఇట్లు చుట్టఱికంబుల♦నెఱుఁగఁజెప్పి, కొనుచు గుంపులుగుంపులై ♦ మునికులజులు
ఆంధ్రిబిడ్డలతో గౌత♦మాశ్రమంబు, వెదకికొనివచ్చి రెంతయు ♦ విందుమీఱ.

వ. అంత గౌతమమహర్షియును

ఉ॥ వచ్చినవారికెల్లఁ గడు ♦ వాసిదలిర్పఁగఁ దాను భార్యయున్
మచ్చికతో నెదుర్కొనుచు ♦ మంచిగ మజ్జనభోజనంబులన్
హెచ్చుగ నిచ్చుచుండె శ్రమ ♦ మేదియులేక భుజించుచున్ గడున్
మెచ్చుచు వందొ అచ్చటనె ♦ మేలుగనుండిరి గాపురంబులన్. 144

ఆ॥ గొప్పవారి చెలిమిఁ గొప్పగూర్చును దాని, గొప్పవాఁ డెఱుంగుఁ♦గొంచెకాఁడె
ఱుంగఁ డెట్టివానిఁ ♦ బొంగి సేవించునో, యట్టి ఫలముఁ జెందు♦నవని నరుఁడు.

క॥ సింగంబుగుహకుఁ జనినే, నింగొను ముత్యములరాసి♦నిన్ జంబుకభూ
మిం గడువేడుకనైనడా, యుంగాఁ బొనుకలును బొక్క ♦ లలవడు పెక్కుల్,

క॥ చందనము చెఱకు శాఖులు, గుందనమును నొరులకెపుడు♦గూర్చును సుఖముల్
బొందిక నిడు స్వార్థము లే, దెందు నటులెకాదె సుజను ♦ లెంతయు భువిలోన్.

గీ॥ పుడమి విజితేంద్రియుఁడు దయా♦లుఁడును మదము
లేనివాఁడును నుపకారి ♦ యీ నలువురు
స్తంభములయట్లు దాల్తురు ♦ సతత మోపి
యీ జగంబును సందియ ♦ మింత లేదు. 148

వ. అంత

మ॥ బహుకాలం బిటులేగ నొక్కదివస ♦ ప్రాహ్ణంబునన్ గౌతమ
ద్రుహిణుం డీశ్వరపూజకై సలిలమున్ ♦ దోడ్తెండనాన్ శిష్యులున్

రహిమీఱన్ గలశంబులన్ గొని సరో ♦ రాజంబుఁ జేరంగఁ బో
నహి వేణుల్ మునిభార్య లప్పుడె జలం ♦ బాడంగ విచ్చేయుడున్. 149

మ॥ కని యద్గౌతమశిష్యు లా మునిసతీ ♦ కాండంబుతో నొక్కవ్రి
క్కను జేరుండు ఘనుండు దేశికుఁడు వే♦గన్ బూజకై తీర్థమున్
గొని తేరన్ మముఁ బంచె నట్టుదకమున్ ♦ గొంపోవలెన్ దల్లుల
న్నను నవ్వార లటుల్ దొలంగక కడున్ ♦ గర్వం బఖర్వంబుగాన్. 150

చ॥ చనుఁడు చనుండు మీర లిఁక ♦ సత్వర మేమిటఁ దీర్థమాడి నీ
ళ్ళను గొనిపోవఁగావలెఁ జ ♦ లంబొనరింపకుఁ డల్పు లీరు మా
ఘనత నెఱుంగ కిట్లు వలు♦కన్ దొరకొంటి రనంగ వార లం
తనె చని యాశ్రమంబునకుఁ ♦ దద్గురురాజ్ఞికిఁ జెప్ప నాపెయున్. 151

చ॥ కడవ నొకండు గైకొని త♦గన్ సరసీస్థలిఁ జేరి నీరమున్
వడిఁ గొని తెచ్చి యిచ్చెఁ దన ♦ భర్తకుఁ దాల్మిని దేవపూజ నా
తఁడు ఘొనరించె నమ్మునుల ♦ దార లహల్య మదంబుతోడ నీ
యెడ మముఁ బల్కరించకయె ♦ యేగెను జల్కనచేసి తానటుల్. 152

ఉ॥ పోవునుగాక యిప్పొగరు ♦ పోఁడిమి యూడఁగఁ జేయకుందుమే?
దేవికి నింత యెల్లిదమె? ♦ దేబెలె మా మగ? లంతయింతలోఁ
బోవిడువారమే? యనుచుఁ ♦ బోయి స్వభర్తల సన్నిధానముం
దావిధమెల్ల మార్చి కడు ♦ నల్క జనింపఁగఁ జెప్పి రేమ్చుచున్. 154

ఉ॥ అంత మునుల్ గడున్ మదుల ♦ నాగ్రహమొంది కడెందినిష్ఠతో
దంతిముఖున్ విధానమునఁ ♦ దద్దయుఁ గొల్వ నతండు వచ్చి మీ
చింతలఁ దీర్తు వాంఛితముఁ ♦ జెప్పుఁడనంగ మునుల్ ముదంబుతోఁ
బంతము మీఱ నివ్వనికిఁ ♦ బాఁపుము గౌతమునన్న నాతఁడున్. 155

మ॥ తగునే? యాకలిదప్పులన్ మఱఁగుచున్ ♦ దారల్ సుతుల్ శిష్యులున్
మిగులన్ బొక్కుచుఁ బ్రాణభీతి నిటులున్ ♦ మీ రేగుదేరన్ దయా
నుగుఁడై గౌతముఁ డెల్లవారి కిచటన్ ♦ బోనంబు లర్పించి మీ
వగపున్ బాపి మనంగఁ జేసె నిపుడా ♦ బ్రహ్మణ్యు నొప్పింతురే? 156

క॥ ఉపకృతి సల్పినవారల, కపకృతి సేయంగఁ దలఁచు ♦ టతినిందిత మ
ట్లపయశమనక యొనర్చిన, నృపశువు నశియించు నెంత ♦ నేర్పరియేనిన్.

ఆ॥ కాన నుడిగి వేఱొ ♦ కండు వరముఁ గోరుఁ, డనిన వారు మాన♦కదియె కోరి
పట్టుఁబట్ట నతఁడు ♦ భవితవ్యమారసి, యట్లసేతు మీరు ♦ నఘము పొడము.

వ. దయాళుండు నాపద్బాంధవుండునగు గౌతము నుడించుకకాల మిక్కట్టులన్ జిక్కి
వందురినను నయ్యనఘున కయ్యది పరిణామసుఖంబై యెసంగఁగలదు సంది 159
యంబు లేదు.

ఆ॥ మంచివాఁడు చెడ్డ♦మానిసి కాఁబోవఁ, డెప్పుడు చెడుగు మంచి ♦ నెంచఁబోడు
కుక్క గోవుగాదు♦గోవు గుక్కయుఁగాదు, జగమునందు బ్రహ్మ♦శాసన మిది.

—* మునులనిర్బంధముచే గణపతి యావై గౌతమునిచేఁ జచ్చుట *—

వ॥ అని గణపతి యంతర్ధినొందె నంత గౌతమమహర్షి యునుఁ దత్పత్నియు నమ్ము
నుల కైతవంబు నెఱుంగక యానందంబున నున్నంత నొక్కనాఁడు గణపతి
మాయావిశేషంబున.

ఉ॥ మిక్కిలిబక్కయా వొకఁడు ♦ మేకొని వ్రీహివనంబు మేయుచున్
దొక్కుచునుండ గౌతముఁడు ♦ దోల్లఁగఁజేయఁగఁ బూరిపోచపై
నొక్కటివేసె దాన మొద ♦ వ్ప్రాణ సమాంతము గూలి యాగ్రైహా!
యెక్కడి దోసమొందితి మ♦హేశ్వర! యంచు మునీంద్రుఁ డేడ్చెడున్. 162

గీ॥ ఉటజమునను న్న తత్పత్ని♦యును దదీయ, శిష్యులును నార్తరుతి విని♦చేరవచ్చి
కారణం బారసి నితాంత♦గాఢశోక, గర్తమునఁ గూలి యేడ్చిరి ♦ యార్తిపడుచు

వ. అంత.

చ॥ కని మునులున్ దదంగనలు ♦ గౌతముఁ జేరి విధంబెఱింగి గో
ఘ్న! నిబిడపాపి! యెంతటి య♦కార్య మొనర్చితి వోరి! నీ మొగం
బును గన దోస ముప్పతిలుఁ ♦ బొమ్మిట కేని వనంబుఁ బాసి నీ
యనుచరపుత్త్రమిత్త్రదయి ♦ తాదులఁ దోడ్కొని వేగ దవ్వులన్. 164

గీ॥ నీవిచటనుండ మేమిందు ♦ నిలువరాదు, దేవఋషిపితృకార్యముల్ ♦ దీర్పరాదు
హవ్యకవ్యంబులను గొన♦రగ్నిపితలు, సాఁగు సకుటుంబ మెట కేనిఁ ♦ జక్కనిపుడు

వ. మఱియును

క॥ దైవతపితృమఖముల నీ, వేవిధమున సల్పఁగూడ ♦ దెఱుఁగు మిదిమొదల్
నీవొనరించిన దురితం, బేవడువున సడలఁబడక ♦ యెక్కుడు భరమా. 166

క॥ అనియెల్లరు దిట్టుచు రా, ళ్ళను విసరుచుఁ దఱుమ మునిల♦లాముం డల్లే
చనియెద మెదలక గనికర, మొనరింపుం డయ్య! యనుచు♦నొయ్యన నవుడే.

—* గౌతమఋషి యాశ్రమమును విడిచి దవ్వేగుట *—

వ. అవ్వారి శాసనప్రకారంబు గళత్రంబును శిష్యజనంబును దోడ్కొని యచ్చోటికి
గ్రోశమాత్రప్రదేశంబం దాశ్రమంబుఁ జేసికొని యందొక్క మాసంబట్లు గడపి
యొక్కనాఁడు మునిజనాశ్రమంబుల కించుకసమీపంబున కేగి యవ్వారినెల్లనతి
ప్రియాసంబున నొక్కెడఁగూర్చి విధేయుండై మహాత్ములారా! నాకుఁ బాటిల్లిన

యీ పాతకంబుబాసి యేనెట్లు పునీతుండనగుదు, ననుగ్రహించి సెలవీయుండని ప్రార్థించిన నవ్వార లిట్లనిరి.

క॥ చేసినదోసము నిష్కృతి, చేసిన నేగాని శాంతిఁ ♦ జెందదు పుడమిన్
వాసిగఁ బ్రాయశ్చిత్తముఁ, జేసికొని యఘంబుఁ బాయు ♦ సిద్ధమిది మునీ!

వ. ఆప్రాయశ్చిత్తంబు తెఱం గెఱింగించెదము వినుము.

క॥ ఇమ్మహి గోహత్యాపా, పమ్మును బొనరించినట్టి ♦ వాఁడను నేనం
చు మ్మేదిని నంతయునున్, ముమ్మాఱు ప్రదక్షిణములఁ ♦ బొనరింపు మొదల్,

వ. అటుమీఁద నొక్కమాసంబు చాంద్రాయణవ్రతం బొనరింపుము. తదనంతరంబున

ఆ॥ నూటయొక్కమాఱు ♦ పాటిగ బ్రహ్మగిరికిఁ బ్రదక్షిణముఁ బొ♦రిన్ సలుపుము
అంతమీఁద మృన్మ♦యములైన లింగంబు, లర్థిఁగూర్చి సేయు ♦ మర్చనంబు.

వ. ఇట్లుచేసినచో నఘంబువాయు నిఁక మఱియొక పద్ధతిని వినుము. 173

చ॥ దినదిన మీశ్వరున్ గొలిచి ♦ దివ్యతపం బొనరించి దేవగం
గను నిటఁదెచ్చి తద్విమల ♦ కాండమునం దఘమర్షణావగా
హనముఁ బొనర్చినన్ దురిత♦మంతయు దుల్లు శుభాప్తిఁగోరి యిం
కను శివలింగకోటులను ♦ గల్పనచేసి భజింపు మాపయిన్. 174

## —* గౌతమునకు శివుఁడు ప్రత్యక్షమగుట *—

వ. ఈరెండు తెఱంగులయందు నీకిష్టం బెట్టు లట్లనుసరింపుము. శక్తుండవైనచో జతనంబుగ నీ వ్రత ద్వైవిధ్యంబు ననుష్ఠింపుమనుటయు నమ్మునిచంద్రుఁ డోం కారధ్వనిచేసి వెడలి మునిగణోక్తంబులనెల్ల నవలీలగ నతిసులభంబుగ నతిత్వరితంబుగ నొనర్చి ప్రత్యహ మహల్యయు శిష్యప్రశిష్యులును దన్ను సేవించుచుఁ బార్థివ లింగసహస్రంబుల నిర్మించి యిచ్చుచుండ నియతమతిఁ బార్థివలింగ పూజనం బొనర్చుచుండె నంతఁ బరమదయాళుండును భక్తజనావనదీక్షాబద్ధ కంకణుండునగు శివుం డావిర్భవించి వరంబడుగుమన మునీంద్రుండు పరమశివుని శాంతసుందరరూపంబుఁ జూచి హర్షించి నమస్కరించి స్తుతుల్ పొనరించి దేవా! నన్ను నిష్పాపున్ బొనరింపుమన్న నలరి బాలేందుమౌళి యిట్లనియె.

ఉ॥ ధన్యుఁడ వీవు మానికుల ♦ తల్లజ! పుణ్యుఁడ వీవు పాఫ్మలా
నన్యులు నిన్ వెలార్చి రిటు ♦ లక్కట! యక్కసుతో; ననన్యసా
మాన్య! త్వదీయదర్శనస ♦ మాగతపుణ్యగతిన్ బవిత్రమై
మాన్యతఁ జెందు నీ జగము ♦ మద్వచనం బెద నమ్ము నెమ్మమై. 176

ఉ॥ వారలె గోఘ్నపాతకులు ♦ వారె కృతఘ్న గురుఘ్న పాంసనుల్
వారలె ధర్మబాహిరులు ♦ వారలె కుత్సిత గర్హ్యకర్మరుల్
వారలె ఘాతుకాగ్రణులు ♦ వారె నృశంసులు వారె జాల్ములె
వ్వారలు నిన్నుఁ బుణ్యు నిటు ♦ వంచనఁజేసి కలంచిరో మదిన్. 177

క॥ వారలసంగతిచే నెవ్వారలు దూషితులుగా ♦ పరఁగెద రిలలో
వారికి నిష్కృతి లేదింక, ధీరతరమనీష ! దీనిఁ ♦ దెలియుము మదిలోన్. 178

వ. ఇది యంతయు నీ యాశ్రమంబున నీచేఁ బోషితులైన మునిజనులు లోభా జనప్రేరితులై యొనర్చిన వృత్తంబుగాని యథార్థంబుగా దీ దివ్యదృష్టిన్ జూడుమని పరమేశ్వరుఁ డవలోకింపఁజేసిన మునివర్యుఁ డవలోకించి విస్మితుండై పరమేశ్వరున్ జూచి. 179

క॥ ఉపకారమె యొనరించిరి, కృపానిధి ! నిజంబు వారు ♦ కించులయిన నీ
కృపకున్ బాత్రమనైతిని, నిపుణుఁడనై వడసికొంటి ♦ నీదరిసెనమున్. 180

వ. అని యానందించి చొక్కియున్నంత వరంబిచ్చెదఁ గోరుకొనుమనుడు. 181

గీ॥ ఓమహాదేవ! నన్నిట్టు ♦ లోమఁదలఁచి, యుంటి వటుగానఁ బ్రేముడి ♦ నొసఁగు దేవ
గంగ నీయెడ లోకోప ♦ కారమగును, నాకునుగడున్ బ్రియంబగుఁ ♦ జోక మెఱయ.

—* శివుఁడు గౌతమునికై గంగను భువి కవతరింపఁజేయుట *—

వ. అనినంత శివుండు దయాళుండై తథాస్తని నిజజటాజూటమండలాంతర్గామినియగు గంగను నియమించి జార్చిన నావెయు స్త్రీరూపంబునఁ బొడసూపినఁ గాంచి గౌతమమునీంద్రుండు. 183

క॥ తల్లిరో ! ధన్యవుఁ బుణ్యవు, ముల్లోకంబులకు శుద్ధిఁ ♦ బొనరించెద వు
త్ఫుల్లాబ్జలోచనా ! నను, జల్లఁగ నిర్మలునిఁ జేయు ♦ శంకరురాణీ ! 184

వ. అని యంజలిచేసిన నగ్గంగాదేవి.

క॥ నీకభిషేకముఁగూరిచి, పేఁకఁజనెద శివునితలకు ♦ వేఁగ నవఁగ బల్
వ్యాకులితుండగు ముని నవ, లోకించి శివుండనియె నిలువుమని గంగన్. 185

వ. గౌతమానుగ్రహార్థం బిందు లోకోపకారంబుగ నీమన్వంతరకాలంబు వసింపుమనుటయు నద్దేవియు నీవును నిఖిలసుపర్వులిందు వసించుదురేని నేనట్లుండెద నన్న శివుం డంగీకరించి గౌతమార్చితపార్థివలింగంబు నధిష్ఠించి త్ర్యంబకేశ్వరుండను నామధేయంబుఁ జెందియుండె నంత దేవత లట దారసిల్లి తల్లీ ! జీవుండు సింహరాశిన్ జెందిన వత్సరంబంతయు నీసాన్నిధ్యంబందు నివసించెదము తక్కిన యేఁడులు దివంబున నుండెదమని యొప్పించి యరిగిరి. అంత గంగయు నదీరూపంబుఁ జెంది యవ్యాహతరయంబున బ్రహ్మగిరిశిఖరాగ్రవిరాజితౌదుంబరవిటపివిటపాశ్లిష్టనికట * పురటలతాంతరాళనిర్గతయై, 186

* టిప్పణి— పురటలతాంతరాళనిర్గతయై = బంగారు తీవెలవంటి తీవెలయొక్క మధ్యప్రదేశము నుండి బయలుదేఱినదియై.
ఇందులకు శ్రీభాగవత పంచమస్కంధ ద్వితీయాధ్యాయమందు - నికటపురటలతారూఢస్థలవిహంగమమిథున -
ఇందులకు శ్రీధరీయ వ్యాఖ్య-
నికటపురటలతాః సన్నికృష్ట స్వర్ణవల్ల్యః-తాస్వారూఢాః స్థలవిహంగమాః మయూరాదయః

శా॥ రేఖామాత్రము దోఁచి యంతనె కదున్ ♦ రెట్టించి దిట్టంబుగా
శాఖామూలములన్ దిగన్ విడిచి యం ♦ చత్తుంగరంగత్తరం
గాఖేలత్కలహంససారసరథాం ♦ గాభంగనిష్యందధా
టీఖాతస్థలియై విచిత్రగతులన్ ♦ శీవిన్ విరాజిల్లుదున్. 187

ఉ॥ గౌతమమౌని తత్సతియు ♦ గంగను మజ్జనమాడిరంత నా
గౌతమశిష్యులందఱును ♦ గాటపుభక్తిని స్నాతులైరటన్
గౌతమియంచు ఖ్యాతిఁగొని ♦ గంగ చెలంగియెసంగఁ గాంచి యా
గౌతమునేఁచినట్టి ముని ♦ కాండము గంగను జేరవచ్చుదున్. 188

చ॥ కని ధుని ఘోరపాతకులు ♦ కశ్మలులెందుఁ గృతఘ్నమూర్తులీ
మునుల యుపఘ్నమేవమిఁక ♦ ముట్టఁగ వచ్చిరి వీరితోఁకు నో
ర్వను గనరాక పోదునని ♦ వైళమణంగి యదృశ్యయయ్యె నం
తనె కని గౌతముం డకట ♦ తల్లిరో! పోయితె పాసి నీసుతున్. 189

చ॥ అని వనరంగ నంతనె ద ♦ యాళువునై మునిపై ననుగ్రహం
బున నటఁ గొంతదూరమటుఁ ♦ బోవిడి క్రమ్మఱఁదోఁచి దివ్యపా
వనవనపూర్ణయై పొదలి ♦ భాసురతన్ బ్రవహించి మించెఁ గ
న్గొనిమది గౌతముం డలరి ♦ కోమలసూక్తులఁ బాడెఁ దద్గతిన్. 190

—* గౌతమ శిష్యులు మునులను సెపించుట *—

వ. అంత గౌతమాంతేవాసిప్రముఖులు.

చ॥ మును లొనరించినట్టి యఘ ♦ మున్ సకలమ్ము నెఱింగి మట్టుమీ
ఱినవడి గౌతమార్యుఁడు మఱిన్ మఱి వారణసేయుచుండినన్
గనలుచు నమ్మునిబ్రువులఁ ♦ గన్గొని యిట్లని శాపమిచ్చిరీ
రును భవదీయవంశ్యులు విరోధులు కాఁగల రీశభక్తికిన్. 191

వ. మఱియును,

గీ॥ యాచకులునుదరిద్రులై ♦ యామ్యదిశను, బాడమియవిభూతిఫాలులై ♦ పౌనరుదురుశ
తాత్ములై నరకంబుల ♦ ననుభవింత్రు, సత్యమిది మా వచనము నిస్సంశయముగ.

వ. అని శపించిన వారందఱుఁ దామొనర్చిన యకార్యంబునకు మనంబుల నిందించుకొనుచు దక్షిణదేశం బరిగిరి. ఇందు గౌతమమహర్షి సదారుండై శిష్యవర్గంబులోఁ ద్రియంబకేశ్వరు నారాధించుచు నిత్యానందంబున నుండె నది మొదలు త్ర్యంబకేశ్వరుఁడు భక్తకల్పద్రుమంబై యఖిలజగజ్జేగీయమానదివ్యజ్యోతిర్లింగంబై యెసంగె. గౌతమిగంగ ప్రవహించుచుఁ దీరస్థ జనంబులకు స్నానపానంబుల ననుగ్రహించి పవిత్రుల నొనర్చుచు రత్నాకరంబు నొందుచుండె నిది త్ర్యంబకలింగచరిత్రం బిక వైద్యనాథేశ్వరచరితంబు వినుండని సూతుండిట్లనియె.

## —* శ్రీ వైద్యనాథలింగము *—

శా॥ లంకానాయకుఁడైన రావణుఁడు కై ♦ లాసాచలాధీశ్వరున్
బంకేజాక్షముఖామరార్చితపదా ♦ బ్జాతున్ శివున్ శంకరున్
బింకంబొప్ప భజింప నెంచి హిమభూ ♦ భృద్వృక్షషండోర్మియం
దోంకారస్మరణంబు సేయుచుఁ దపం ♦ బుత్సాహియై సల్పుచున్. 194

క॥ చిరకాలము దానవునకు, హరుఁ డగుపడకున్న శిరసు ♦ లాఱును మూఁడున్
నఱికి హవనం బొనర్చెను, బరమేశ్వరుఁ డప్పుడును గృ ♦ పఁ గనకున్నన్. 195

శా॥ అంతన్ దక్కిన మస్తకంబు నసితో ♦ నంతంబునొందింప ని
శ్చింతన్ బూన శివుండు దారసిలె వ ♦ చ్చెన్ బూర్వభంగిన్ దలల్
సంతోషంబున శంకరుం డడుగు మి ♦ చ్చన్ గోర్తునా దైత్యుఁ డ
త్యంతంబున్ బలమిచ్చి యేడుగడవై ♦ యస్మత్పురిన్ జేరుమా! 196

క॥ అనికోరిన విని శంకరుఁ, డెనలేనిబలంబు నతని ♦ కిచ్చి చనవుతో
ననుపమలింగం బొకఁ డిడి, యనెఁ గొనిచని దీపి నుంపు ♦ మాత్మనగరిలో.

గీ॥ లింగమం దేను వసియింతు ♦ లీలమెఱయఁ, దెలివితోఁ జేర్పు పురి కని ♦ దేవుఁ డరిగె
నంత లింగంబుఁ జేకొని ♦ యసురవిభుఁడు, వచ్చుచున్ దెరువున దైవ ♦ వశముఁ జేసి.

క॥ మూత్రోత్సర్జనమునకై, యాత్రంబున నొక్క వల్ల ♦ వాంజలి నిడ ద
న్మాత్రభరమోపక చితా, క్షేత్రంబున నాతఁ డుంచె ♦ శివలింగంబున్. 199

వ. అంత రావణుఁడు శుద్ధుండై వచ్చి లింగంబు నెత్తికొనఁబోవ నద్ది సప్తాధోలోకంబులు దాఁటి వాటంబుగఁ బ్రతిష్ఠితంబై కదల్పశక్యంబుగాకుండుటఁ జూచి యందె యర్చించి తన శిరశ్ఛిద్రవ్రణంబులనెల్ల వైద్యునియట్లు సులభంబుగ మాన్పి సుఖంబొసంగినందున వైద్యేశ్వరజ్యోతిర్లింగంబని పిలిచి యాత్మనగరంబున కేగె ననంతరంబు బ్రహ్మవిష్ణ్వాద్యఖిలదివ్యజనంబులును మునిజనంబులును వచ్చి పూజించి యాలింగంబు భవరోగంబులకెల్ల వైద్యంబుచేసి మాన్ప సమర్థంబుగావున వైద్యనాథలింగంబని కొనియాడి రటుమీఁద నొక్కనాఁడు నారదఋషి దేవజనప్రేరితుండై రావణునిచేరువకేగి యాతిథ్యసేవలన్ బడసి యతనికిఁగలిగిన శివప్రసాదంబు తెఱంగును శివలింగప్రతిష్ఠాస్వరూపంబును విని పెదవివిఱిచి శివుఁడు కైతవంబొనర్చి నీకిచ్చినబలంబు కరంబుగరిష్ఠంబయేని నీవిపుడుచని కైలాసాద్రిన్ బెల్లగింపుము దాననంతయుఁ దెల్లంబగు నీరహస్యంబెవరికిం దెలుపకు నే నరయుచుండెదనన్న నతండు నిక్కంబకావగచి వచ్చి కైలాసాద్రిన్ బెకలింపుచుండుడుఁ దత్రత్యులెల్లరు విత్రస్తులై యుండ పరమశివుండు తత్కారణంబడుగఁగాఁ బరమేశ్వరి వాచాటీపరిపాటిఁ బరిహాసించుచు నిట్లనియె. 200

ఉ॥ మేలగు శిష్యుఁడెంతయును ♦ మెచ్చుదనర్చెడు రావణాసురుం
డేలిక మీఁదనే కినిసి ♦ యేత్తెఱఁ దారసిలెన్ బళీ! బళీ!
చాలఁగ సంతసంబొదవె ♦ సాత్త్వికశిష్యునిఁ గూర్చికొన్నవా
రీలలిఁ జెందెఁ దత్ఫల మిఁ ♦ కేమనువారము దేవ! యిత్తఱిన్. 201

క॥ అని సాక్షేపముగ జగజ్జనని నుడువ హరుఁడు వాని ♦ శపియించెఁ గృత
ఘ్నుని నిట్టు లోరి! యచిరంబున నీమద మణఁగుఁగాక ♦ పొమ్మిఁక వేగన్.

వ. అంత నుడిగి రావణుండు భయంపడి యపచారక్షమాపణం బర్థించి లంకాపురం
బున కేగె నాఁటనుండి త్రిలోకంబులవార లీ లింగంబు నర్చించి భోగమోక్షం
బుల నొందుచుండి రిది వైద్యేశ్వర లింగచరితం బిఁక నాగేశ్వరలింగోత్పత్తి
వినుండని సూతుం డిట్లనియె. 203

—* దారుకవనము - నాగేశ్వరలింగము *—

ఉ॥ దారుక నాగరక్కసియుఁ ♦ దత్పతి దారుకుఁ డుగ్రమూర్తి వి
స్తారబలంబుతో నపర ♦ సాగరతీరవనస్థలిన్ బొరిన్
జేరి సమస్తభూప్రజకు ♦ సిల్గులు గూర్చుచునున్న నోర్వఁడన్
ధీరమునిన్ శివవ్రతుని ♦ దివ్యులు మౌనులు చేరి యార్తిమై. 204

చ॥ వలఁతివి నీవు రక్కసుల ♦ పాల్పడనీక జనంబు నేల నీ
వలన భయంబుఁ బాపికొన ♦ వచ్చితి మిందఱమన్న నాతఁడున్
ఖలులగు దానవాధముల ♦ కల్మష మారసి దైత్యులీ ధరా
తలమును బాసి వేఱుకడఁ ♦ దాము చరింతురుగాక వీఁకఱన్. 205

గీ॥ అట్లుచన రేని నశియింతు ♦ రనుచు శాప, మొసఁగఁగ నిశాచరులుగడు ♦ నులికిదుః
ఖాత్ములై మనుగడ యెట్టు ♦ లందు మిఁక, నెచటి కేగఁగవలయునో ♦ యెఱుకపడదు.

క॥ అని వనరుచున్న దారుక, యను నారక్కసి యొయారి ♦ యనె శాంకరి దా
మును నాకిడె నొకఁడు వరంబును దదనుగ్రహమునఁ గడ ♦ పుదము కడలిలోన్.

ఆ॥ కడలికుక్షియందుఁ ♦ గాపురంబుండి యీ, పరిజనులును మనము ♦ ప్రక్కలందుఁ
దిరుగు తరణిజనులఁ ♦ జెఱఁబట్టి వారల, ధనముఁ జూఱఁగొంద ♦ మనవరతము.

చ॥ అని నుడువంగ దారుకుఁడు ♦ హర్షమునొంది నిశాచరావళిన్
గొని చని దుర్గమాంబునిధి ♦ కుక్షిభువిన్ వసియించి చేవ జీ
వననిధిలోఁ జరించు యుడు ♦ పంబులఁ బట్టి ధనంబుఁ గొట్టి య
మ్మనుజుల నార్తి వెట్టుచుఁ గ్ర ♦ మంబుఁ దొరంగి రహించుచుండఁగా. 209

క॥ ఒకకలమున బేహారము, నకు ద్వీపాంతరముఁ బరిజ ♦ నముతోఁ జనఁబో
నొక వైశ్యుని సుప్రియనామకు శివపూజకునిఁ బట్టి ♦ మదమొప్పారన్. 210

ఉ॥ బందిగనుంచి దాసజన ♦ వర్గముతో ధనమున్ హరింపఁగా
బందిని వైశ్యుఁడుండి శివ ♦ భక్తిని మానక పార్థివేశపూ
జం దగసల్పుచుండ దను ♦ జప్రభుఁ డారసి వచ్చి వేగ నీ
చందము మాను మిట్టి పెడ ♦ జాడఁ దలంచినఁ ద్రుంచివేసెదన్. 211

క॥ అని తెగటార్పన్ దన జన, మునకున్ గనుసన్నసేయ ♦ మూఁగఁగ వారల్
గని సాంయాత్రికుఁ డదరియు, మనమున శంకరునినమ్మి ♦ మఱియిటులనియెన్. 212

చ॥ మును త్రిపురాసురుల్ మొనసి ♦ భూరిబలంబున నీత్రిలోక హిం
సను బొనరించుటారసి పవి ♦ శస్త్రకృపాంబునిపానభూతుఁడై
ఘనరణసాధనంబులను ♦ గల్పనచేసి దృగగ్నికీలలన్
దనుజులఁ దత్పురంబులను ♦ దాహముచేసిన సామి యీతఁడే. 213

క॥ రక్షింపుము శంకర ! నను, రక్షింపుము సకలలోక ♦ రక్షాదక్షా !
రక్షింపుము శివ! దుష్టుల, చే క్షయమున్ జెందనీక ♦ సేవకునిఁ గృపన్. 214

క॥ నీవే యెఱుగుదవు శివ!, నీవే యొడయఁడవు ద్రవిణ ♦ నిధివియు నీవే
నీవాఁడను నీదాసుఁడ, నీవిమె యీ ప్రాణములిఁక ♦ నిలుపు మహేశా ! 215

వ. అని యభ్యర్థించిన నాక్షణంబున శివుండు పార్థివలింగంబందుండి జ్యోతిస్స్వరూపంబున నెగసి ప్రసన్నుండై పాశుపతాస్త్రం బవ్వైశ్యునకొసంగి తత్ప్రహారంబున రక్కసులనెల్లఁ బొలియించిమించిన దారుకాప్రార్థితయై మహేశ్వరుని పట్టంపు రాణి విభునిఁ దరిసి. 216

## —* పార్వతీదేవి దారుకను రక్షింపుమని శివుని వేడుట *—

ఉ॥ వేఁకటి నొందియున్నది వి ♦ వేకనిధాన! నిశాటి దీనిపైఁ
జోకడసేయు మాగ్రహముఁ ♦ బూను మనుగ్రహభావమున్ జిరం
బీకె శిశుత్వమందు నను ♦ హెచ్చుగఁ గొల్చి వరంబులొందె నా
శ్రీకలనన్ దదాత్మజులు ♦ సింధుతటిన్ వసియింత్రుగావుతన్. 217

వ. అని యిట్లర్థించిన నఖిలేశ్వరుం డిట్లనియె.

ఉ॥ రాణిరో ! నీమనంబరసి ♦ రక్కసినొక్కతెఁగాతు నిప్పుపూఁ
బోణి ! తదీయనందనులు ♦ పొల్పుగ నిందువసింత్రు నే నని
దారిణత లింగరూపమునఁ ♦ దప్పక యిందు నెయుందు మానవ
త్రాణముగోరి నీవటులె ♦ రాణవలిర్పఁగనుండు మిచ్చటన్. 218

వ. అనినాఁడవి భక్తానుగ్రహార్థం బమ్మహేశ్వరుండు నాగేశ్వరుండను నామధేయంబుతో నందుఁజేరి వసించియుండె. మహేశ్వరియును నాగేశ్వరి యను పేరుతో

నచ్చోటనే వెలసియుండె నదిమొదలా నాగేశ్వరజ్యోతిర్లింగం బఖిలసిద్ధికరంబై
యొప్పె నిది నాగేశ్వరలింగచరితం బిఁక రామేశ్వరలింగస్వరూపంబును వినుండని
సూతుం డిట్లనియె. 220

## —*శ్రీరామేశ్వరలింగము*—

ఉ॥ నీరజలోచనుండు రజ ♦ నీచరులన్ వధియింపఁగోరి యీ
ధారుణి సూర్యవంశమునఁ ♦ దా జననంబును జెంది జానకీ
వారిజపత్రనేత్రిను వి♦వాహముచెంది పితృప్రియార్థమై
ఘోరతరాటవిన్ దఱిసి ♦ కోమలిఁ గోల్పడెఁ బంక్తికంఠుచే. 221

ఉ॥ అంత దురంతచింత హరి ♦ దశ్వకులాగ్రణి వానరేంద్రుతోఁ
బొంతముచేసి మారుతిస ♦ మున్నతవిక్రమదీప్తి మైథిలీ
కాంతవిధం బెఱింగి ప్లవ ♦ గప్రభుసంకలితోరువాహినీ
క్రాంతతటాంతరుండగుచుఁ ♦ గాండనిధిన్ వడిఁజేరి ధీరుఁడై. 222

వ. మంతనంబందు.

ఉ॥ రావణుఁడన్న నల్పుఁడె? య ♦ రాతిగణంబుల నుక్కడంచి నా
నావిధసంపదల్ వొదల ♦ నాయకుఁడై తగు మేఁటి యమ్మహా
దేవునిభక్తిఁజేసి కడుఁ ♦ దేజముఁ జెందిన ధీరవర్యుఁడీ
జీవనరాశి నల్పసర ♦ సిన్ వలె మీఱెఁబ్రోడ యారయన్. 223

క॥ మనమందర మిపుడీ యుద,ధిని దాఁటుటయెట్లు పిదప ♦ దితిజాధిపతిన్
బెనఁకువఁ గూల్చుట యెట్లది, యొనఁగూడు నె శివునికరుణ♦నొందకయున్నన్.

గీ॥ వినుము సౌమిత్రి! యీసింధు♦వేలయందు, శంభులింగార్చనంబు ని♦ష్ఠమెయిసల్పి
తత్ప్రసాదంబుఁబడసి యు♦దారశక్తి,నొడిసిదాఁటుద మంబుధిఁ♦గడవ రిపుని.

క॥ అని స్థిరహృదయుండై చ, య్యనఁబార్థివలింగమొండు ♦ పావనికమై స
ల్పి నితాంతభక్తిఁగొలువుడుఁ, బినాకధరుఁ డంతఁబొల్చి ♦ ప్రేముడిఁబలికెన్.

## —* శివుఁడు రామునకుఁ బ్రత్యక్షమై వరంబు లిచ్చుట *—

శా॥ రామా! దాశరథీ! ముదంబొదవె నీ ♦ రారజ్యమానార్చనన్
బ్రేమన్ గోర్కులఁదెల్పు మిచ్చెదనన్ ♦ బృథ్వీవరోత్తంసుఁ డో
హేమగ్రావశరాస! రావణుని శత్రు♦ల్పింకించి గీటార్పను
ద్దామంబై యలరారు శక్తి నిడుమా ♦ దాక్షిణ్యమేపొందఁగాన్. 226

క॥ మఱియును సేనలతో మే, మఱిముఱి మున్నీరుదాఁట ♦ ననువగుజలనం
బెఱఁగింపు మీస్థలంబున, నెఱిమీఱఁగ నీవు సతము ♦ నిలుపు మహేశా! 227

వ. అని యిట్లు వరంబడిగిన శివుండు రామునకు * రావణనిర్వాపణప్రవీణంబగు సామర్థ్యం బొసంగి సేతుబంధనోపాయం బెఱింగించి రామచంద్రార్చితపార్థివ లింగంబందు జ్యోతీరూపంబునఁ బ్రవేశించి రామేశ్వరలింగం బని పేరొంది రామున కిట్లనియె. 228

ఉ॥ ఎంతటిదాఁక నీకువల ♦ యేశ్వరుఁ డీరవి యీయముద్రజం
బెంతటిదాఁక నీధ్రుమము ♦ లేనదు లీభువి చెల్వమీఱునో
యంతటిదాఁక నే నిచట ♦ హార్దవిసర్గ భవదీయలింగమం
దెంతయుఁ బ్రేమతోడ వసి ♦ యింతు యశంబొనరింతు నీకిలన్. 229

వ. అని సెలవిచ్చినంత సకలదివ్యజనంబులు మునిజనంబులు వచ్చి యా రామేశ్వర లింగంబున కర్చనంబు లొనర్చి యానందించి చని రది మొదలాలింగంబు సుప్రసిద్ధంబై త్రిలోకార్చితంబై వెలసె నంత రామచంద్రుండు.

సీ॥ సేతుబంధన మొనరించి ♦ సింధుదాఁటి, సపరివారము పౌలస్త్యుఁ ♦ జదిపి తత్పురికి విభీషణుఁ బ్రీతి నే ♦ లికనుజేసి, సతినిఁగొని పుష్పకం బెక్కి ♦ సంతసమున.

క॥ పారావారము దాఁటి స, దారుండగు రాఘవుండు ♦ దా నటుఁబూర్వం
బారాధించిన లింగముఁ, జేరి మహాభక్తిఁగొలిచె ♦ సీతయుఁ దానున్. 232

వ. మఱియు నంత సీతాప్రార్థనన్ జేసి రామచంద్రుండు వేఱొకలింగంబుఁ బ్రతిష్ఠింప నెంచి సీతారచితసైకతలింగంబొకండును గించిద్విలంబనంబున నాంజనేయుండు గాశినుండి తెచ్చినలింగంబొకండును బ్రతిష్ఠించిపూజించె. సైకతలింగంబును రామనాథలింగంబనియు హనుమదానీతలింగంబును విశ్వేశ్వరలింగంబనియును జెప్పుదురు. 233

క॥ అలరామనాథసతి రా, జిలుఁబర్వతవర్ధనియన ♦ శ్రీవిరచిత ని
ర్మలగంధమాల్య భూషణ, లలితాలంకృతి మహా ♦ కలాకృతి పేర్మిన్. 234

వ. అ దేవిదయాగరిమం బసామాన్యంబిక.

---

* శివపురాణే కోటిరుద్రసంహితాయాం త్రింశాధ్యాయే—

శ్లో॥ కృతవాన్ రాఘవః పూజాం । శివధర్మపరాయణః । స్తుతించ వివిధాంకృత్వా । ప్రణి పత్య శివం ముదా । జయంచ ప్రార్థయామాస । రావణాజౌత దాత్మనః ।
తతః ప్రసన్న హృదయో । రామభక్త్యా మహేశ్వరః । జయోస్తు తే మహారాజ । ప్రీత్వాచ పునరబ్రవీత్ ।...... పునశ్చ ప్రార్థయామాస। సాంజలి ర్నతమస్తకః ॥ రామః—త్వయా స్థేయ మిహస్వామిన్ । లోకానాం పావనాయచ । పరేషా ముపకారార్థం । యదితుష్టోసి శంకర ॥ సూతః—ఇత్యుక్తస్తు శివస్తత్ర । లింగరూపో భవత్తదా । రామేశ్వరశ్చ నామ్నావై । ప్రసిద్ధో జగతీతలే । రామస్తత్ప్రసాదేన , సింధుముత్తీర్య చాంజసా । రావణాదీన్ నిహత్యాశు । రాక్షసాన్ ప్రావశాం ప్రియాం॥

మ॥ విలసద్గంధకదంబపుష్పసరముల్ ♦ వింద్రైనమాష్యపరిసూ
నలసన్మాలలు పున్గుకుంకుమ పయో ♦ న్నంబుల్ వడల్ పానకం
బులు లడ్డూల్ భృగువాసరోత్సవమునన్ ♦ బొందించి పూజించి ర
య్యలఘుల్ పర్వతవర్ధనిన్ శివను సీ♦తార్కాన్వయాధీశ్వరుల్. 235

క॥ ఈ రామేశ్వరలింగముఁ, జేరి నరుం డెవ్వఁడేని ♦ శ్రీగంగాంభో
ధారల నభిషేకించినఁ, జేరును గైలాసశైల ♦ శిఖరపదంబున్. 236

వ. ఇయ్యది రామేశ్వరలింగచరిత్రం బిఁక ఘుశ్మేశ్వరలింగచరిత్రంబుఁ జెప్పెద
నాకర్ణింపుఁడు. 237

## —* దేవగిరి శివాలయము - ఘుశ్మేశ్వరలింగము *—

క॥ దేవగిరినికటమున భూ, దేవుఁడు బ్రహ్మవిదుఁ డభవ ♦ దీక్షితుఁ డవనిం
బావనుఁడు భరద్వాజకు, లావిర్భూతుఁడు సుధర్ముఁ ♦ డనునొకఁడలరున్. 238

క॥ అతనికి సుదేహయనునొక, చతురమతి కలత్రమలరు ♦ సమ్యగ్గుణశో
భిత గృహకార్యవిశారద, పతిహిత సుచరిత్ర ధర్మ ♦ పారీణ గడున్. 239

ఉ॥ వారలు దేవతాతిథిస ♦ పర్యలఁ బేర్మి నొనర్చుచుండి ర
వ్వారికి సంతుగాక పలు ♦ వత్సరముల్ చనినంతఁ జింతతోఁ
గూరి సుధర్మదేవి మదిఁ♦గుందుచు వైభవ మెంత యుండినన్
సారెకు దూరుచున్ విధిని ♦ సంతస మొందకయుండె నిచ్చలున్. 240

ఉ॥ ధీరుఁడుగానఁ దత్పతి మ♦దిన్ గన కెట్టి విచారమున్ మహో
దారతతో నిటుల్ నుడువు ♦ తన్విరో! వందుర నేల ? యిట్టు లె
వ్వారికి నెవ్వరౌదు రిల ♦ బందుగులెవ్వరు? తల్లిదండ్రు లె
వ్వారలు ? పుత్రులెవ్వ? రిఁక ♦ స్వార్థపరంబు జగంబు సర్వమున్. 241

క॥ కావున వగవక సతతం, బీవు శివునిఁ గొలుచుచుండు ♦ మింపుగ నన భూ
దేవియు మానక స్త్రీస్వా, భావికగతి సుఖముఁదప్పి ♦ వనరుచు నుండెన్. 242

గీ॥ అట్టితఱిఁ బొరుగింటికి ♦ నరిగి యెదియొ, పనికిఁ దత్సతితో మాట ♦ పట్టువలను
జగడమాడఁగ నాబిడ ♦ దెగడి యిటుల, నుడి వెనుసు దేహమన సెంతొ ♦ నొచ్చిపోగుల.

క॥ ఉప్పరము లున్నవనుచున్, గొప్పగు నగ లున్నవనుచు ♦ గొప్పనుచు నీ
వెప్పుడుఁ ద్రుళ్ళకు బంగరు, కుప్పలుగల రోసి! నాకుఁ♦గొడుకులుఁ గూఁతుల్.

ఆ॥ దుడ్డు గలుగనేమె ? ♦ గొడ్డుదానవు నీవు, తినుట కెవ్వరేని ♦ దిక్కు లేరు
బిడ్డలున్న దానఁ ♦ బేర్మి నాకెనయాదె?, తల్లకిందులగుచుఁ ♦ దపసుఁ గొనిన.

క॥ అనినఁ జివుక్కురుమను మదిఁ, గనలుచు నిజగృహముఁ జేరి ♦ కాంతుని కంతన్
బెనువగ వినిచిన నాతఁడు, వినియు విననియట్లు లుండె ♦ విత్తముఁ డౌటన్.

ఆ॥ ఆ సుదేహ యంత ♦ కంతకు సంతాన, కాంక్ష యగ్గలింపఁ ♦ గాంతుఁ గదిసి
కలదె లేదె నాకు♦గర్భవైభవమంచు, గ్రుచ్చిగ్రుచ్చి యడుగఁ♦గొంక కతఁడు.

ఆ॥ రెండువిధుల శివుని ♦ దండ నుంచి మొక్కెదు
గానుము పణతి! యనినఁ ♦ గోమలాంగి
యిష్టసుమము బాసి ♦ యీవలి పుష్పంబుఁ
గొనినఁ జెడవి విఱిచెఁ ♦ గోవిదుండు. 248

ఉ॥ ఆరసి యద్ది యంతఁ బతి ♦ కర్మిలి వేఁడెఁ బెండ్లి సేయఁగాఁ
గోరి మహాత్మ! నాకిఁకను ♦ గూనలు గల్గవు తెల్లమయ్యె మేల్
మీఱఁగ వేఁడు బాలికను ♦ మీరు వివాహము చెందఁ డాపెకున్
మీఱిక పుట్టు నందనుఁడు ♦ మేలగు సంపదకున్ బ్రియంబుగన్. 249

క॥ అన విని యిప్పుడిట్టులనె నీ, వనెదవు వేఁడెద్రిఁ బెండ్లి ♦ యాడిన సవతిన్
గని పోరుసేతు వెంతయు, ననుమానము లేదు పెండ్లి ♦ యాడను మరలన్. 250

వ. అనుటయు

క॥ నా చెలియలు పదిరెండేం, డ్లేచిన యీ యొప్పుబాల ♦ నిప్పింతు దయన్
జూచి వివాహంబాడుము, నా చెలియలి నేను దాన ♦ నాథ! యెట్లైనన్. 251

గీ॥ అని దివారాత్రులెంతయు ♦ నధిపుతోడ, నాడి విమదిఁ గరఁగించి యొ♦ల్లోడిసిత నదు
చెలియలిం దెచ్చి పెండిలి ♦ చేసి దాని, యట్లు సేవించుచుండె న♦య్యనుజ నెపుడు.

క॥ ధర్మవిదుఁడైన యట్టి సు, ధర్ముఁడును సుదేహతోడఁ ♦ దా నిటులనియెన్
నిర్మలమతి! నీ చెలియలి, నర్మిలి నీ వేలుచుండ ♦ నగుఁ బసిదానిన్. 253

ఆ॥ అనుచు ఘుశ్మ యనెడు ♦ నాహ్వాయం బొప్పెడు, చిన్నయాలి నప్ప ♦ చేతఁ బెట్టి
నిత్యవైభవమున ♦ నెగడుచుండె నతండు, ఘుశ్మ యక్క సెలవుఁ ♦ గొనిముదమున.

క॥ దినదినము నూటయొక్కం, డనువుగ మృల్లింగములను ♦ నమరించి శివా
ర్చన విధిమై సలిపి ముగిం, చిన మీఁదను వాని నెల్లఁ ♦ జెఱువునఁ జేర్చున్.

—*ఘుశ్మకుఁ బుత్రుఁడు జన్మించుట *—

క॥ కొన్నేళ్లు జరుగ లింగము, లన్నియు నొక లక్షయయ్యె ♦ నంత శివకృపన్
జెన్నలరు ఘుశ్మ కెంతయుఁ, జిన్నారి సుతుండు పొడమెఁ ♦ జేతం బలరన్. 256

క॥ అందముగాఁ బొడమిన తన, నందను నానందభరము ♦ నఁ గని సుధర్ముం
డెందు ననాసక్తుండై, నం దద్దయు ముదముఁగొనె జ♦నంబు లలరఁగాన్. 257

ఉ॥ ముద్దులు మూటగట్టు తన ♦ పుత్త్రు నిటుల్ గని యాథరామరుం
డొద్దికతోడ నైగమప ♦ ద్ధోచితరీతి నెఱింగి వేదవి
ద్వద్దళమున్ దగన్ బిలిచి ♦ దానమొనర్చెను గోశతంబు నే
వద్దది లేక యిచ్చె మధు♦రాన్నములన్ బ్రజకెల్లవారికిన్. 258

క॥ బందుగులున్ లాఁతులు నిఁక, నందఱు ఘుశ్మన్ గరంబు ♦ హరుసంబున మె
ప్పొందఁగఁ గొనియాడిరి వ్యథఁ, జెందె నొకర్తుక సుదేహ♦ చెనఁటితనమునన్.
వ. అంతఁ గొన్నాళ్ళకు
గీ॥ రూపరేఖాకలాశీల♦రుచిరుఁడగుచు, బాలుఁడేపొంద నొకబాడ ♦ బ్రహ్మముఖుఁడు
కడిఁదిధనికుఁడు దనకూతు♦గారవించి, యిచ్చి పెండిలిచేసె సొం♦పెచ్చ మీఱ.
క॥ వియ్యపువారలు వారల, వియ్యంబులు ఘుశ్మ నెంతొ ♦ వేడుకఁజూడన్
గొయ్యతనంబున నోర్వక, గయ్యాళిసుదేహ మెండు♦గాఁ దపియించెన్. 261
ఆ॥ జ్యేష్ఠ జ్యేష్ఠయగుచుఁ♦జెడుమదినొందఁగా, ఘుశ్మయెఱిఁగి వేగఁ ♦ గొడుకుకోడ
లునుద్వదీయులమ్మ! ♦ మనమం దెఱుంగుము, నాదువారుకారు♦నమ్ము మింకను.
క॥ తల్లిబలెఁ గొడుకు పెనిమిటి, తల్లిబలెన్ గోడ లెదలఁ ♦ దలఁచిరి ప్రియమౌ
నిల్లాలిగఁ దలఁచును విభుఁ, డుల్లమున సుదేహనట్లు ♦ లొప్పఁడు ఘుశ్మన్.
క॥ ఈరీతి వారలుండిన, మీఱి సుదేహావఘూటి ♦ మేలోర్వక వి
స్తారపుఁబాపము లోఁగొని, నేరంబుల వెదకికొనుచు ♦ నిందితమతియై. 264
గీ॥ ఘుశ్మకన్నీరుచేత నా ♦ కుంగలట్టి, హృదయతాపానలము శమి♦యించుఁగాక!
వేఱువిధమైనఁగాదట్లు ♦ నేరమనక, దానిసూను వధింతు నం♦తయును గుదుర.
గీ॥ పైనిఁ గానున్నదగునని ♦ పాపభయము, మాలి చీకఁటిరాతిరి ♦ మందిరమునఁ
బడఁతితో సెజ్జఁగూరుకు♦కొడుకు నొడిసి, పొడిచి చంపెను గత్తితోఁ♦గడిఁదిపగను.
క॥ కసిదీరినదని కుసివడి, వెసఁగొమరుని తుండెములను ♦ వెదకికొని సమీ
పసరస్సున నేసి వడిం, బసరం బైఁజేరె మరల ♦ మందిరభూమిన్. 267
మ॥ తెలవాఱన్ రుధిరార్త శయ్యఁగని యెం ♦ తేభీతి నాత్మేశ్వరున్
గలయంగాంచక కోడలార్తయయి యా ♦ క్రందధ్వనుల్ సేయఁగాఁ
గలుషస్వాంత సుదేహ సేరి యెఱుఁగం ♦ గాలేనియట్టుల్ వ్యథా
కులహోలెన్ విలపించె నెల్లదరఁ బ ♦ ద్దుర్గూడి హా హా యనన్. 268
గీ॥ అపుడు ఘుశ్మయుఁ దాఁ బార్థి♦వార్చనంబు సలుపుచుండెనునాథుండు♦సరసనుండె
గోడుగోడున నేడ్చుచుఁ♦గోడ లవ్వి, ధంబుఁ దెలిపిన ధీరయై ♦ తలఁచె నిట్లు.
క॥ ఎవనిదయన్ గొడు కేర్పడె, నవికలకృపుఁ డతఁడె సాఁకు ♦ నర్భకు భక్తో
త్సవకరుఁడని పేరొందిన, శివుఁడు మహాకాళమూర్తి ♦ సిద్ధం బిందున్. 270
ఆ॥ కాకయట్లు శివుఁడు ♦ గాపాడకున్న చో, నెవ్వ రేమియడ్డ ♦ మీ జగమున
మాలకరి విరులను♦మహిఁగూర్చ నెడసేయు, నట్లెహరుఁడు జగము♦నవఘళించు.
క॥ కావున వగపేలని శివ, దేవునియెడ నమ్మకమున ♦ దీవ్యల్లింగా
ర్చావిధ్యంతంబున సర, సీవనమునఁ గలిపి మరలె ♦ శివలింగములన్. 272
వ. అంత
ఉ॥ వచ్చితి వచ్చితిన్ జనని! ♦ వైళమె యేను భవచ్ఛివార్చనా
సచ్చరితోన్నతిన్ శివప్ర ♦ సాదసమున్నతి మాఱుఁదల్లిచేఁ

జచ్చియుఁ బుట్టితిఁ మరలఁ ♦ జక్కఁగ నన్ గొనిపొమ్ము గీముకున్
జెచ్చెరనంచుఁ బుత్రకుఁడు ♦ చేరఁగవచ్చినఁ జూచి తాల్మినై. 273

క॥ ఎక్కుడు మోదములేకయె, యక్కపయిన్ గినుకఁ గొనక ♦ యాకె గొమరుపైఁ
జక్కఁగఁ జేయిడెఁ గడుమె, చ్చొక్కఁగ ముక్కంటిసామి ♦ యేతెంచిపడిన్.

ఉ॥ మెచ్చితి నీదుపూజనము ♦ మేలగు నీదగు తాల్మికెంతయున్
హెచ్చుగ నిచ్చెదన్ వరము ♦ నీవిఁకఁ గోరుము నీసపత్ని నేఁ
జెచ్చెర ముక్కముక్కలుగఁ ♦ జెండెదనిప్డు త్రిశూలధారనా
గ్రచ్చుఱ ఘుశ్మ దానడిగెఁ ♦ గావుము నాస్వసనంచు నాదృతిన్. 275

వ. అంత శివుండు

క॥ ఏమిటి కోమఁగఁ జూచెద, ఏమెను నీపట్టిఁ బట్టి ♦ హింసించెను పో
రామిఁ దలఁపగఁ జనునే?, పామునకున్ బాలుఁ బోయు ♦ భావ్యంబగునే ?

వ. అనిన ఘుశ్మ యిట్లనియె.

క॥ కీడొనరించినవారికిఁ, గూడ ప్రభూ ! మేలుసేయఁ♦గూడున్ గాదే
ఊడదె నీ దరిసెనమునఁ, గూడనితలఁపది సుదేహ♦కుఁ సుచరిత్రా ! 277

గీ॥ అనిన శివుఁడట్లె వేఱొకం♦డడుగు వరము, నాఁగ నయ్యెలనాగ వే♦వేగ లోక
రక్షణంబును గోరి యా♦రాజమౌళి, నందె వసియింపుమనెదవ♦యాహ్వయమున.

వ. అనిన శివుండు.

క॥ నీవర్థించినయట్టులె, యీ విమలజలాశయమున ♦ నెంతయు నీపే
రావహిలఁ ఘుశ్మేశుఁడ, నా వెలసెద నాలయుం బ♦నఁబడు సరసియున్. 279

క॥ ఇఁక నిట ననుఁగొల్చినవా,రికి నిష్టార్థముల నిడి పా♦రిఁ బ్రోచెద మీ
యకలంకాన్వయ మిది నూ,టికిమించి సుపుత్రి లొప్పి♦కవిగొను నిలన్. 280

ఆ॥ అనుచు లింగరూపుఁ♦డై యుండె శంకరుం, డనఘుఁడగు సుధర్ముఁ♦డాసుదేహ
వచ్చి ఘుశ్మతోడ♦ వరదు మహేశ్వరుఁ, గొలిచి రంద టింపు♦గూరుమదుల.

క॥ శరదాగమమున నీటన్, బొరసిన కాలుష్య మవియు ♦ పోల్కి సుదేహా
తరదురితాశయ మెల్లన్, హరదర్శనమునను విరిసె ♦ హృదయాప్పొందన్. 282

వ. సుదేహాయు జీవితుండైన పుత్రుం గాంచి మురిసి తన చేసిన ద్రోహంబునకు లజ్జించుచుండ విభుఁడును ఘుశ్మయుఁ బాపహారంబులగు ప్రాయశ్చిత్తంబులొన రింపఁ జేసి రంత వంద అన్యోన్యప్రేమలఁ బొదలియుండి రది మొదల లా లింగంబు ఘుశ్మేశ్వరలింగంబనియు సరోవరంబు శివాలయంబనియుఁ బేరొందె నిది ఘుశ్మే

శ్వరలింగ చరిత్రం బిట్లు ద్వాదశజ్యోతిర్లింగ చరిత్రంబులఁ జెప్పితి నిఁకేమి విన
గోరుదురనిన సూతునకు శౌనకాదిమును లిట్లనిరి.

## —* లింగస్వరూపకథనము *—

క॥ లింగస్వరూప మెట్టిదొ?, లింగపదార్థంబెదో? తెలియఁజెప్పుము మా
కుం గరుణ మెఱయఁగా దీ, నిం గూరిచి చెప్పుచుంద్ర ♦ నేక విధములన్. 284

క॥ అని ప్రశ్నింపుడు సూతుం, డనియెను మునులార! మీర ♦ లడిగిన విషయం
బును దెలిపెదువాఁడ జగ, జ్జనముల శ్రేయంబుకొఱకు ♦ సాకల్యముగాన్. 285

క॥ అరయఁగ నాద్యంతములన్, బొరయక శోభిల్లు నద్ది ♦ బోధాస్పదమై
ధరఁ బూర్ణమై యఖండ, స్ఫురణంబై యలరు లింగ ♦ మూర్తి మునీంద్రుల్!

క॥ అనితరసాధారణమై, యనుపమఘనశక్తియుక్త ♦ మై యచలంబై
మునుకొని సకలజగత్సా, ధనమై లింగంబు వెలయుఁ ♦ దాపసవర్యుల్! 287

క॥ ఏకంబై చిన్మయమై, వ్యాకులకున్ మదికి దవుల ♦ వర్తించునదై
శ్రీకరమై శ్రితసేవిత, మై కమ్రపుజోతిరూప♦మై బ్రహ్మంబై. 288

క॥ అమలంబై వేదనిదా, నమునై సర్వార్తిభేద ♦ నమునై శివమై
కమలాక్షకమలజన్మా, ద్యమరాతీతస్వరూప ♦ మై యమరు మునుల్! 289

వ. ఈలింగస్వరూపవిభవంబుఁగూర్చి నేనకా దెవ్వార లెంతకాలంబైనను సమగ్రం
బుగా నుడువలే రేను గుఱుతుకై రవిదీపన్యాయంబుగ నించుక వక్కాణించితి
నిఁక లింగశబ్ద నిర్వచనంబు వినుఁడు. 190

క॥ విరివగు నీసకలచరా, చరభువనము లెందుడిందు ♦ సర్వంబట్లే
మరలనెటఁ బొడము జగముల, కిరవెయ్యది లింగమది ము ♦ నీంద్రవతంసుల్!

వ. ఇఁకఁ బ్రతీకోపాసనయందలి శివలింగంబుఁగూరిచి కొంద ఱొక యైతిహ్యమున్
జెప్పుదు రద్దాని నుడివెద నాలకింపుఁడు. 292

## —* దారుకావనముని చరిత్రము *—

ఉ॥ దారువనంబునాఁగ వను ♦ ధాతలమందుఁ గరంబు శ్రీల నొ
ప్పారుచుమీఱు నచ్చోట మ ♦ హామహు లిద్ధతపోధనాగ్రిణుల్
ధీరులు మౌను లుండురు స ♦ తీసుతశిష్యగణంబు గొల్వ న
వ్వారలఁజూచి తోడిఋషి ♦ వర్యు లడల్గొని యుందు రెంతయున్. 293

మ॥ శివభక్తింగొని నిత్యమమ్మునివరుల్ ♦ సేవించుచుం దిరిశి శి
ష్యవరుల్ పుత్రులుగొల్వ నింధనకుశా ♦ ద్యర్థంబుగా నొక్కనాఁ

డు విహారాటవి కేగి రయ్యెడ శివుం ♦ డున్ వారలన్ మెచ్చి హె
చ్చు వరంబుల్ దయనీఁదలంచి మదులన్ ♦ శోధింపఁగా నింపుమై. 294

మ॥ కడునందంబగు లేఁతపూవనపుటా ♦ కారంబునున్ జెంది యె
క్కుడు వేడ్కొప్ప దిగంబరుండయి మునీ ♦ ట్లోకస్త్రీసన్నిధిన్
బెడఁగొప్పొందఁగ భిక్షమెత్తుకొన రా ♦ నీడించి యవ్వార ల
వ్వెడవిల్తున్ గికురించినట్టిఁడని బ ♦ ల్విభ్రాంతలై చింతతోన్. 295

చ॥ మది గెలువంగ నోడి యల ♦ మారహరున్ వడిఁజేరి విభ్రమా
స్పదమగు తత్తనూజ్జ్వలరస ♦ ప్రసరంబును గన్నుదోయిఁ జే
ర్చ్మద మొదవంగఁ గ్రోలుచు గ ♦ ముగ్ధములై హరు సన్నివేశమున్
వదలఁగలేక పైకొనెను ♦ బాళి మరల్పఁగలేక వేఁకతోన్. 296

—* మునిభార్యలు శివునిఁజూచి మోహించుట *—

క॥ చక్కెరవిల్తునికోలల, కక్కాములు లాత్తిఁగొని భ ♦ యంబు విడిచి మేల్
నిక్కెడు చనుఁగవగుర్చ్చుచు, నక్కల బిగ్గరఁగ నొడిసి ♦ రమ్మారహరున్.

సీ॥ చిగురుఁబోఁడియొకర్తె ♦ చికురబంధముజాఱఁ, గౌఁగిలింపుచుఁబ్రభూ! ♦ కావుమనియె
చెలువయొకర్తుక ♦ శివుచేయి తన ఘన, స్తనమండలిన్ జేర్చి ♦ సాఁకుమనియె
విరిదండకై వడి ♦ యురమందుఁ వ్రాలి యే, లుము దేవ! యని యొక్క ♦ రమణియనియె
పొగరుగుబ్బలను వీఁ ♦ పునఁ గ్రుచ్చి ననుఁబ్రోవు, మనివేడె నొక వి ♦ కచాబ్జగంధి

గీ॥ కదిసి పైకొని ముద్దాడెఁ ♦ గలికియొకతె, పదములొత్తుచు నిలిచెను ♦ భామయొకతె
రమ్మురమ్మని చెయిలాగె ♦ రామయొకతె, నేనునీదాననని చేరెఁ ♦ జానయొకతె.

చ॥ ప్రిదిలినయట్టి కంచెలను ♦ బిగ్గరఁబట్టి మఱొక్క కేలితో
వదలెదునీవిఁబట్టి పపి ♦ వట్టి మదిన్ దగు దీము నెట్టి క్రొ
మ్మదవతి యొక్క భామ యస ♦ మానమనోజ మనోజ్ఞమూర్తి! నీ
కిదియె యుపాయనంబిడితి ♦ నీతను వీవు గ్రహింపు మిష్టమున్. 299

సీ॥ దిక్కునీవే సామి ♦ మ్రొక్కెదానను నను, బాసిపోవకుమంచుఁ ♦ బల్కెనొకతె
సారంబులేని యీ ♦ సంసార మేనొల్ల, నీవె యొక్కడవంచు ♦ నిలిచెనొకతె
యిల్లొల్ల విభునొల్ల ♦ నీధనంబొల్లని, న్నాసించి వచ్చితి ♦ ననియె నొకతె
ఈవె నాప్రాణంబు ♦ లీవె ధనంబు నిన్, విడువలే నంచని ♦ వేడె నొకతె

గీ॥ ఆర్తనేలినఁ బుణ్యమౌ ♦ ననియెనొకతె, కనవె సర్వజ్ఞుఁడవు తావ ♦ మనియె నొకతె
వన్నెడినఁ బాయుదానఁ బ్రా ♦ ణమ ననొకతె, అరసియెటులేనిరక్షింపు ♦ మనియెనొకతె.

వ. మఱియును గొందఱు గరువలవంపుప్రోడ లక్కందర్పజేతన్ గాంచి పరవశలై

గీ॥ చనులఁ గండూతి చేసి భా♦మిని యొకర్తు
చెక్కులను గీటె నొయ్యారి ♦ చెలువ యోర్తు
పయ్యెదన్ జార్చి సరిచేసె ♦ భామ యోర్తు
లలిత దృష్టుల హృదయంబుఁ ♦ దెలిపె నోర్తి. 302

వ. ఇఁకను బెక్కండ్రు చక్కని పడంతులు బిడ్డపాపల నింటఁబడవైచి తగులమున హరున్ దారసించి మూఁగిరి. 303

ఉ॥ ఇందఱు చుట్టుముట్టి సుర♦తేచ్ఛఁ గడున్ గడుఁ దీవరింపుచున్
గందరగోళమున్ సలుప♦గా హరుఁ డెంతయు నిర్వికారుఁడై
యందఱఁ గాంచి యిట్లనియె ♦ నక్కట! మీ మగలుండ లాఁతితోఁ
గందువఁ గూడఁగాఁ దగునె? ♦ కశ్మల మియ్యది చేరుఁ డిండ్లకున్. 304

చ॥ అన విని వారలెంతయును ♦ హా! యిటు ద్రోయఁగఁ జెల్లునే మమున్
ఘనుఁడవు కామతంత్రములఁ ♦ గాంచిన ప్రోడవు కోరి వచ్చి చే
రిన వనబోంట్ల కామితము ♦ రిత్త యొనర్చి తొలంగ నొప్పునే?
నిను నిఁకఁ బాసిపోవుటకు ♦ నేర్తుమె? దోసము గీసమున్ననున్. 305

క॥ అని యిటుఁ దెంపునఁ దనపై, ననురాగభరంబు నిలిపి ♦ నట్టి యువతులన్
గని తత్సర్వేంద్రియముల, కనఘుఁడు దలఁపున నె ఘనత♦రానందమిడెన్. 306

గీ॥ అంత నక్కాంతలెల్ల ని♦తాంతహర్ష, పారవశ్యంబునన్ మీఱి ♦ పడయరాని
సిరికిఁ జెలరేగి యారాజ♦శేఖరునకుఁ, జెలిమి నుపచారముల నిట్లు♦ చేసి రెలమి

క॥ గొడుగున్ బట్టె నొకర్తుక, తడఁబడుచున్ బావలొందెఁ ♦ దన్వి యొకతె బ
ల్విడి వింజామరలొందిరి, బెడఁగొప్పఁగ జతలు జతలు ♦ బింబోష్ఠు లొగిన్.

క॥ అద్దముఁబట్టె నొకతె యొక, నిద్దపుజవరాలు భక్త్య ♦ నిచయకబళముల్
తద్దయు నొసంగుచుండెను, గద్దెను మోచికొని తెచ్చెఁ ♦ గలికి యొకతెయున్.

వ. ఇట్లు మునివనితారత్నంబులెల్ల బరిపరివిధంబులఁ బరమేశ్వరు సేవించుచు మహానందంబున సర్వంబును మఱచి చొక్కియున్న సమయంబున మునివరులు పుత్రచ్ఛాత్రసమన్వితులై బహువిధసమిత్కుశపలాశప్రసూనఫలమూలంబులఁ గొని స్వాశ్రమంబులఁ జేరవచ్చి యందు భిక్షుకునిన్ గళత్రంబుల శీలభంగదుర్వృత్తంబును గాంచి విస్మితులై వీఱిఁడులై విన్నఁబోయి వగచి మహాగ్రహపరవశతన్ భిక్షునిఁ జేరి యిట్లు ధర్షించిరి. 310

ఉ॥ ఎవ్వఁడవీవు గల్మషుఁడ! ♦ యేటికిఁ జేరితి ఫీవనం బిటుల్
క్రొవ్వి దురాత్మకృత్యమున ♦ కున్ వెనుదీయక మావధూటులన్

బన్నీలుకాని సేఁతలకుఁ ♦ బూనిచి శీలము గంగఁగల్పితీ
వివ్వని నిన్నుఁ బూజ్చెద మిఁ ♦ కెవ్వరిఁ దెచ్చిన వచ్చినన్ సురల్. 311

క॥ అనిదూఱిన జడియక య, మ్మునివరులన్ జూచి నగుచు ♦ ముగ్ధేందుకలా
కనదవతంసుం డూరక, యె నిలిచినన్ వారు మిగుల ♦ హెచ్చుగుకినుకన్. 312

శా॥ పాషాణంబులఁ గఱ్ఱలన్ బడితెలన్ ♦ బల్మో ర్గముల్గ్రాఁడి వి
ద్వేషావేశముతోడ బాఁద శివుఁ డెం ♦ తే వానిఁ దప్పింపుచున్
రోషంబున్ గొని భిక్షులింగమును వా ♦ ర్గాలన్ శపింపన్ శివుం
డీష త్తల్గక లింగమున్ బెటికి వా ♦ రిక్షింప వైచెన్ ధరన్. 313

## —* శివలింగము మునులను బాధించుట *—

ఆ॥ మునులు సూచుచుండ ♦ భోగిభూషణుఁ డదృ; శ్యతను జెందె నంత ♦ జటులలింగ
మేచి భయదమగుచు ♦ హెచ్చుగు జ్వాలల, నింగిముట్టి మునుల ♦ నిగిడి చుట్టె.

ఉ॥ వారు భయంబునొంది తిరిది ♦ వంబు మొదల్గలచోట్లకేగ న
వ్వారలవెంటనే యదియుఁ ♦ బాయక యేగి దహింపఁజొచ్చినన్
భూరివిషాదతప్తులయి ♦ పొక్కుచుఁ బద్మజుఁ జేరఁబోయి య
గ్గోరము నెల్లఁ దెల్ప విని ♦ గొబ్బున నాతఁడెఱింగి సర్వమున్. 315

చ॥ వరదుఁడు భక్తలోలుపుఁడు ♦ భర్గుఁడు మిమ్ము ననుగ్రహించుకో
సరము భవద్గృహంబులకుఁ ♦ జక్కఁగవచ్చిన మీరు క్రిందుమీఁ
దరయక తూలనాడి పర ♦ మాత్మున కెగ్గొనరించి యిట్టి దు
ర్భరమగు చెట్టనొందితిరి ♦ రక్షకు లెవ్వ రిఁకన్ మలీమసుల్ ! 316

గీ॥ మిట్టమధ్యాహ్నమం దెట్టి ♦ చెట్టగాని, యిరవుఁ జేరఁగ నాతిథ్య ♦ మీవలయును
నందు సర్వేశ్వరుఁడె యటు ♦ లరుగుదేర, మొరటులై గీము చేసితి ♦ రెఱుకఁదప్పి.

క॥ సిరిరా మోకాలొడ్డిన, తెఱఁగున మీరెంత యేసిఁ ♦ దేఁకువ సెడి వే
గిరపడి యభ్యుదయంబును, గరముఁ జెఱచుకొనిన వారు ♦ కార్పణ్యమునన్.

క॥ అని యీసడింప గోడున, వనరుచు దిక్కెవ్వె యవియె ♦ వహ్నిజ్వాలల్
గను మాహుతియగుదుము నీ, కనుకంప జనింపకున్న ♦ నరవిందభవా ! 319

క॥ అని యగ్గికగ్గమగు న, మ్మునిజనులన్ గాంచి యజుఁడు ♦ భూరితరకృపన్
గొనకొని జతనము నారసి, యనె నిట్టుల జదువు నుడివి ♦ యతివేగమునన్.

మ॥ శివ నర్థింపుఁడు వేగ యీశ్వరి కృపా ♦ శీలాత్మ గుహ్యాకృతిన్
శివలింగంబును దాల్చి ప్రోఁచు నితర ♦ స్త్రీల్జాల రాలింగమున్
శివ గుహ్యాకృతిఁ జెంద నందు నిలుచున్ ♦ జేట్పాటు దప్పున్ వడిన్
భువనంబుల్ సుఖమొందు లాఁతి తెఱఁగేన్ ♦ బోదార్తి యెందేగివన్. 321

వ. అంతదనుక

గీ॥ అష్టదళమేసియొకకుంభ ♦ మచటనునిచి, పంచపల్లవములను దూ♦ర్వాయవాంకు
రములఁ జేరిచి గంగోద ♦ కముల నింపి, వేదసూక్తుల మంత్రించి ♦ వినయ మెసఁగ.

క॥ నతిఁజేసి లింగమునకుఁ, శతరుద్రీయమున నీట ♦ స్నాతమొనర్పన్
హితమతితో లింగం బీ, గతినిఁదొరఁగి శాంతి నించు♦కన్ గాంచు వెసన్.

—* సముచితార్చనచే శివలింగము శాంతిజెందుట *—

వ. అటుమీఁద నేఁజెప్పినయట్లు పరమేశ్వరీ పరమేశ్వరుల సేవించి తత్కృపాను
భావంబున లింగమునకు శాంతిఁగూర్చి యీభంగంబుఁ బాయుఁడనిన మునులు
పరమేష్ఠిన్ బురస్కరించుకొని తదుక్తప్రకారంబున జగన్నిదానులగు మహేశ్వరీ
మహేశ్వరుల నర్చించిన నవ్వార లిర్వురు దయామయులై పొడసూపి రందుఁ
బరమేశ్వరి యోన్యాకృతిన్ శివలింగంబు నాకర్షింప నయ్యది యందుఁజేరి సుప్ర
తిష్ఠితంబై శాంతిఁజెందె నంత మును లా యుమామహేశ్వరాత్మకంబగు
లింగంబున్ బూజించి మ్రొక్కి ప్రాంజలులై యిట్లర్థించిరి.

చ॥ ఎఱుఁగక తప్పుఁజేసినను ♦ నెంతయుఁ గూరిమి పేర్మినిట్టు లా
దరమునఁ బ్రోచు టెంతటి యు♦దారమనంబొ ? ప్రశంసచేయఁగా
దరమొకొ ! మాదృశాజ్ఞులకు ♦ దర్పకశాసక ! దేవదేవ ! నిన్
శరణము నొందినార మప ♦ చారసహస్రములన్ క్షమింపుమా ! 325

క॥ తలిదండ్రులు లోకమునకుఁ, దలిదండ్రులు సర్వదేవ ♦ తాతతి కీరల్
తలిదండ్రులౌట మాకటు, గలుపాత్మల మమ్ము నెమ్మిఁ ♦ గాచితిరి ప్రభుల్ !

గీ॥ అని నుతులుచేయుచున్న మ♦హర్షివరుల, కీశ్వరేశ్వరు లభయంబు♦నిచ్చివేగ
నంత నంతర్థినొందిరి ♦ యఖిలసురలు, చేరి లింగంబు నర్చన ♦ చేసి రపుడు.

ఆ॥ ఆ యుమామహేశ్వ♦రాత్మకంబైన యా, లింగ మద్ది శివుల ♦ లీలమెఱయ
హాటకేశలింగ ♦ మని పేరుచెంది లో, కముల నోముచుండెఁ ♦ గరుణతోడ.

వ. మునులుఁ బరమేష్ఠియు నిజనివాసంబులఁజేరి సుఖంబుండి రీయదియే లింగోత్పత్తి
కారణంబనియు నీలింగరూపంబును నెల్లలోకంబులవా రర్చించుచుండిరనియుఁ
జెప్పెదు రిఁక మఱికొందఱు విజ్ఞమూర్ధన్యు లిట్లు వేఱుతీరు చెప్పెదు రారయుఁడు.

క॥ హరుఁ డాద్యంతంబులఁ దాఁ బొరయక చెలువొందు నల్లె ♦ పొంకపు సిరి సే
కుఱలింగము తుదమొదలుల, దొరయక యున్నందునఁ గొలు♦తురు ప్రతికృతిగాన్.

క॥ తొల్లి విధి విష్ణులకు నని, పెల్లగుచు నఖండదివ్య ♦ పృథులింగంబై
డిల్లఁబడఁ జేసి వారలఁ, జల్లార్చెఁద దాజి శివుఁడు ♦ జగములు మెచ్చన్. 331

వ. ఇట్లు లింగోద్భవంబు మొదలెల్లలోకంబులవా రఖండంబగునట్టి లింగంబు నర్చించు
చుండి రిది లింగస్వరూపచరిత్రం బిఁ కేమడుగుదు రన శౌనకాదులు సూతునికిట్లనిరి.

—* లింగోద్భవచరితము *—

క॥ అవ్వనజాక్షున కజునకుఁ, జివ్వాపోసఁగ శివుఁడు గడిఁది♦సిరి లింగంబై
యవ్వారి పొడవాపిన, యవ్వాసి నెఱుంగఁజెప్పు♦మయ్యా! యఖిలమున్. 333

మ॥ అనుడున్ సూతుఁడు హర్షమొంది మునులా♦రా! చెప్పెదన్ విశ్వభా
వనుఁడౌ శర్వుని మేలిలీల వినుఁడీ ♦ పద్మోద్భవుం డొక్క వే
శను రాయంచను నెక్కి యుక్కున సురల్ ♦ శంసార్థ్యముల్ సేయ లో
కనికాయంబును జూచువేడ్కఁ దరలెన్ ♦ గాంతాసమేతంబుగాన్. 334

చ॥ చనిచని దుర్ధరోచ్ఛ్రితర♦చండకరాదిగరిష్ఠమండలీ
ఘననిలయోర్ధ్వసప్తఋషి♦కౌశలపేశలతాపసస్థలీ
కనదురుగాంగతుంగతరక్రమ♦తరంగసమర్పితాంబుపా
వనవనజాతగంధవహబాలక♦జాలకమండలంబులన్. 335

క॥ చరియించుచు నటనట ని, ర్జరతల్లజులొసఁగునట్టి ♦ సత్కారములన్
బరమోదంబునఁ బడయుచు, గరమానందంబెసంగఁగా ♦ నలరుతఱిన్. 336

ఉ॥ అంతకుమున్న సారసద ♦ళాక్షుఁడు చక్రి రమా సమేతుఁడై
యెంతయువేడ్కఁ బక్షిపయి♦నెక్కి యిటుల్ భువనంబు లన్నియున్
బంతుగఁ జూచిచూచి నిజ ♦ వాసముఁజేరఁగఁ బోవుచుండఁగా
నంతట దైవయోగమున ♦ నంబుజసంభవుఁ గాంచె నొక్కచోన్. 337

—* బ్రహ్మ విష్ణుల కలహము *—

చ॥ కని ముదమొంది పుత్రుకుని ♦ గారవమున్ బొనరంగ డాసి నం
దన! సుఖమే? యటన్నఁ గడు ♦ దర్పముతోడుత సర్వ మట్లు చి
వ్వునఁ గినుకన్ వచించె నిటు ♦ పోటుతనం బిది యేటికోయి? నీ
తను విదె కూల్తునా హరియుఁ ♦ దద్దయు నాగ్రహపూరితాత్ముఁడై.. 338

చ॥ కొమరుఁడవంచు నాకుఁ గడుఁ ♦ గూర్చెదు చుట్టమవంచు మించుకూ
రిమి నినుఁ బల్కరించఁగ మఱిమఱి ♦ మీఱి దురుక్తులాడెదే?
రమ యలుగంగనీ భువన ♦ రాజి గలంగఁగనీ దురాత్మ! మ
స్తము నిదె ద్రుంచివేసెదను ♦ జక్కఁగఁ గన్మది చక్రధారచే. 339

వ. అనిన సురజ్యేష్ఠుం డిట్లనియె.

చ॥ తనుజుఁడ నెట్లు నీ కనుచి ♦ తంబని యెంచక మాటిమాటి కి
ట్లనెదవు కశ్యపాత్మజుఁడ ♦ వర్భక! యేను బితామహుండ నీ
కనిశము పూజనార్హుఁడ స ♦ మస్తము విస్మరణం బొనర్చి డీ
కొన గమకించెదే? యయినఁ ♦ గొంకక నిల్వుము చెల్వు సూచెదన్. 340

క॥ మఱియును సర్గాదిని నే, గఱువతనం బమర వికచ ♦ కమలదళాక్షా!
యఱవుగ సృష్టియొనర్చితి, నెఱుఁగ వె యీభువనజాల♦మెల్ల మనమునన్! 341
క॥ అనుడు హరి యదితిపుత్రుల, వనటను బోనడపఁ దలఁచి ♦ వాస్తవముగ నం
శను నొక్కఁడు గైకొనినం, దనధర్మము నట్లు చెంది ♦ నాఁడ నదితికిన్. 342
వ. ఇంకను
క॥ నను సర్గాదిని బుట్టిం, చినవాఁడవె? దుడుకుఁదనముఁ ♦ జెంది యిటుల వె
క్కనుముందుఁ గనక వాగెదు, వనువౌకో! మన్నాభిపద్మ♦మందుఁ బొడమియున్.
వ. అనిన నతండును
క॥ నేనును నట్లే చెందితి, నీనలినోదరమునందు ♦ నీరజనేత్రా!
కానక పరపరిమాణము, నూనుఁడ నూనుఁడ యటన్నఁ♦జొప్పడునెట్టుల్. 344
క॥ నీకొక్కనికేగాక నృ,లోకమునకు సర్వదివ్య♦లోకమున కహీ
శ్లోకమునకు సర్వమునకు, శ్రీకాంతా! కర్తనేను ♦ సిద్ధము వినుమా! 345
చ॥ అన నపు డేను నేనలఁతి ♦ వల్బుఁడ నిల్వుమునిల్వు తుళ్ళెడం
తును నదియేనొనర్తు నని ♦ దోర్బలగర్వవిఘూర్ణితాస్యుఁడై
యనికిఁ గడంగి యంపఁగమి♦నార్చుచుఁ బేర్చుచుఁ గ్రుమ్మరింపుచున్
వెను గనకే యహర్నిశలు ♦ వేలకువేల్ వెడలించి రబ్దముల్. 346
క॥ వైరించులు వైష్ణవులును, సారెకు బలదర్పవేగ ♦ శౌర్యోన్నతులన్
మీఱుచుఁ బోరుచునుండిరి, భూరితరగదాసికుంత♦పుంజంబులచే. 347
క॥ వారల సమరముఁ గన దై, వాఱెడు వేడుక సుపర్వ ♦ వర్యులు చదలన్
జేరి విమానంబుల న, వ్వారల వారలను గనుచు ♦ వర్తిలి రెలమిన్. 348
ఉ॥ దానవసూదనుం డపుడు ♦ తద్దయుఁ గ్రుద్ధతమీఱి ధాతపైఁ
గానఁగ రానియట్లు శర ♦ కాండముల౯ బరఁగింప నాతఁడున్
మానక విష్ణువక్షమున ♦ నాటఁగ నింపెను మేటిభల్లముల్
మానసమందు వేల్పులస♦మానమహాద్భుత మొంది రోలిమై. 349
మ॥ అంతన్ దైత్యకులాంతకుండును మహా♦శాస్త్రంబు యోజించి దు
ర్దాంతుండై పరమేష్ఠిపై విసర ను♦గ్రస్ఫూర్తిఁ బద్మోద్భవుం
డెంతేనల్క వహించి పాశుపత మ♦స్త్రోశంబు బిట్టేయఁగా
గంతుల్ వేయుచు వేయి తీర్లవియునుం ♦ గాటంబుగాఁ బోరుఁడున్. 350
క॥ పదివేల వివస్వంతుల, నొదవెడు తేజంబు పొదల ♦ నువ్వెత్తుగ న
ప్పదనున నస్త్రద్వయమది, కదనము సేయంగ బెదరుఁ ♦ గాంచి నిలింపుల్. 351
ఉ॥ అక్కట! బ్రహ్మవిష్ణులిటు ♦ లంతముగానని యాజినొంది యి
క్కెక్కువమైన నస్త్రములఁ ♦ నేసిరి వాసివొలంగి లోకముల్
నిక్కము వీని మంటలకు ♦ నెట్టనరూపఱు నిప్డె మేము నీ
యుక్కఱుఁ జత్తుమంచుఁ గడు ♦ నుక్కిఱిబిక్కిరియౌచు నార్తతన్. 352

చ॥ కలఁడుగదా మహేశ్వరుఁడు ♦ కాలహరుండు హరుండు సర్వమా
యలఘునిచేతనే పొడము ♦ నట్టులె పెంపగు నాశమొందుఁ గ
న్నులఁ గనుపట్టకే చను న♦నుగ్రహమొందును సర్వకార్యకౌ
శలుఁడు దయామయుం డతని ♦ సన్నిధికేగి వచింత మీస్థితిన్. 353

—* దేవతలు శివునితో బ్రహ్మ విష్ణువుల పోరు మాన్పుమని యర్థించుట *—

చ॥ అని మది నిశ్చయించుకొని ♦ యానిముసంబున రాజతాద్రికిన్
జని వడి నంది సెల్వుఁగొని ♦ శంకరు నానతశంకరున్ దయా
ఘనుఁ గని జోతచేసి యజ♦కంజదళాక్షుల ఘోరజన్యమున్
జనముల యార్తినిన్ దెలిపి ♦ సత్వరశాంతినిఁ గోర భర్తయున్. 354

ఉ॥ ఇంతకుమున్నె యారయుదు ♦ నీ సమరంబును లోకదుఃఖమున్
జింతిలుచుంటి దీనికయి ♦ చెన్నటులైన యల వార లిర్వు రి
ట్లెంతయు వంతఁగూర్చిరిఁక ♦ నే నడగించెద పేరిగర్వమున్
బొంతమునిూఱ లోకసుఖ♦మున్ బొనరించెద దేవపుంగవుల్ ! 355

వ. అని వక్కాణించి,

సీ॥ డమరుకభేరీప♦టహకాహళమృదంగ, వేణువీణాధ్వనుల్ ♦ వెలసి మ్రోయ
చిత్రధ్వజంబులు ♦ సింగారపుంజామ, రములు వీవనలొంది ♦ ప్రమథులమర
నలుదిక్కులందును ♦ నాల్గుప్రామినుకులు, నొడికార మొప్ప స♦న్నుతులుసేయ
కై దండఁజేకొని ♦ కాదంబవనరాజ్ఞి, జగదంబ దాపల ♦ సందడింప
గీ॥ పలువిధములగు వాహన ♦ ప్రతతులొంది, పొందుగా గణపాలురు♦ముందునడువఁ
బంచమండలయుతమును♦బ్రణవరూప, మైన తేరెక్కి శివుఁడు ప♦యనమొనర్చె.

ఉ॥ కత్తియుఁ గత్తళం బమరి ♦ కన్ ధరియించి శిలాదసూతి బల్
హత్తిన వేడ్కఁ బారిషదు ♦ లన్ గణపాలురఁ జక్కఁజేయుచున్
మిత్తికిమిత్తియా శివుని ♦ మేలిమిసన్నలతోఁ బ్రయాణము
ద్యత్తరభంగిఁగూర్చెఁ దృటి ♦ యందు రణోర్వినిఁ జేరి రందఱున్. 357

వ. తత్కాలంబునందు శివుండు తన జనంబులనెల్ల నించుక దవ్వులనే నిలిపి,

—* తేజోలింగోద్భవము *—

గీ॥ అమ్మహేశాస్త్ర పాశుప♦తాస్త్రజనిత, ఘనతరజ్వాలలను హరి♦కమలభవులఁ
గాంచి వాద్యధ్వనులను జా♦లించి మించి, యగ్నిలింగమై యచ్చట ♦ నవతరించె.
క॥ అగ్నిస్తంభాకృతి ను, ద్విగ్నుల వగనడఁప విష్ణు♦విధుల యహమికన్
భగ్నముసేయఁగ గరుణా, మగ్నమతిన్ లింగమై యు♦మవరె శివుఁ డంతన్. 360

గీ॥ ఆ మహేశాస్త్ర పాశుప ♦ తాస్త్రములు జ
వంబుతో నష్టె యగ్నిలిం♦గంబుఁ జెంది
యందె యంతర్ధిఁ జెందెఁ బ♦ద్మాక్ష పద్మ
భవులు లింగంబు నాకృతి ♦ పాఱఁజూచి. 361

చ॥ తుద మొదలున్ గనన్ బడవు ♦ దొడ్డగ నాకస మంటియుండె ని
య్యది హరియించె నస్త్రముల ♦ నారయఁగాఁదగు నాది మెచ్చటో
యెదియొకో యంత్యభాగమని ♦ యిర్వురు చాల దిదృక్షఁ జేసి య
య్యదనున నే ప్రయాణము ర ♦ యమ్మునఁ జేసిరి వాసిమీఱఁగన్. 362

ఉ॥ అంచ యొకండుగా నమరి ♦ యంతుఁ గనన్ జదలొందుచుం బ్రియ
త్నించెను నల్వ యల్లి కిటి ♦ దేహముఁ జెంది మొదల్ గనున్ గొనన్
గాంచనచేలుఁ డెంతయును ♦ గాశ్యపిఁ ద్రవ్వుచుఁ బోవుచుండె న
ట్లెంచఁగ రాక వత్సరము ♦ లెన్నియొ దాటుచునుండెఁ బర్వునన్. 363

శా॥ పెక్కుల్ వర్షము లిట్లు విష్ణుఁడు ధరన్ ♦ భేదింపుచున్ బోయి తా
నక్కాలాంతకలింగమూర్తి యరుదా ♦ నానున్ గనన్ దక్కి తా
నుక్కున్ గోల్పడి చిక్కి వేమరలి యా ♦ యుద్ధోర్విన్ జేరి స
మ్యక్కౌశల్యమతిన్ వసించె మది వి ♦ శ్వాత్మున్ శివున్ మెచ్చుచున్. 364

క॥ ఎగిరి యెగిరి బమ్మయుఁ దా, నగణితమగు నంబరమున ♦ నరిగి యరిగి యెం
దగుపట్టక లింగాంతము, మిగిలియె యలరుటను గాంచి ♦ మిడుకుచునుండన్.

గీ॥ కేతకీపుష్ప మొక్కండు ♦ ధాతకపుడు, గానుపట్టుకుఁ బరికించి ♦ కరము మురిసి
దళిసిపుష్పశ! యొటనుండి♦తరలితీవ, నుడునదియు లింగమధ్యంబు♦నుండియనియె.

క॥ మొదలెక్కడ ? యన నాతని, కదియనె నేనెఱుఁగ నీవు ♦ నారయలే వీ
వెదకుమదిఁ గట్టిపెట్టుము, పదిలంబుగ నిల్లుఁ జేరు ♦ పద్మజ ! యనినన్. 367

ఉ॥ సాప్తపదీన మంద్రుఁ విను ♦ సఖ్యము నెచ్చెలి వైతి వీవిఁకన్
గోప్తవుగమ్ము రమ్ము ధర ♦ కున్ శివమస్తముగంటి నందు నీ
వాప్తతమీఱ సాక్షివయి ♦ యద్ది నిజంబనిపల్కి నాకు సం
తృప్తియొనర్పుమన్నఁ దలఁ ♦ ద్రిప్పెను దోయఁగ లేక యద్దియున్. 368

—* లింగశిరంబుఁ జూచితినని బ్రహ్మ బొంకుట *—

ఉ॥ అంతఁ బితామహుండును బ్రి ♦ యమ్మునఁ బృథ్విని జేరి మీఱి యం
దంతకుమున్నె యున్న కమ ♦ లాక్షునిఁ గన్గొనిపల్కెఁ గంటి లిం
గాంతము కేతకీసుమము ♦ నారయుఁ డీయదిసాక్షి యన్న నా
వంతయుఁ గొంకకట్టులది ♦ పల్కుటకుల్కి సరోజనాభుఁడున్. 369

ఉ॥ ఓసిరి ధాత! నీవ కడు ♦ నుత్తమమూర్తివి నీక జైష్ఠ్య మే
ర్పాడఁగ లేదు మూలమన ♦ శూలధరుం డట దోఁచి మొక్కుడౌ
వేడుకతోఁ బ్రసాదమును ♦ వెన్నునిపై వెలయించి ధాత య
క్కూడని చెయ్వుపైఁ గినిసి ♦ క్రుద్ధత రౌద్ధమహాజవంబునన్: 370

శా॥ ఫాలీమధ్యంబుననుండి భైరవు మహా ♦ ప్రోచ్చండహుంకారలీ
లామూర్ధ్వద్రవు వెల్వరింప నతఁడు ♦ ల్లాసంబునన్ ఫాలమున్
భూమిన్ సోఁకఁగ మ్రొక్కి యొక్కపని కే ♦ పున్ మీఱ శాసింపు దే
వా! మోదంబునఁ గూర్తు నొక్కనిముసం ♦ బం దిట్టి వేగోన్నతిన్: 371

*సీ॥ అనుడుఁ శివుఁడిట్టులనె వత్స! ♦ యురయువిధిని, జగములకుఁదొలివేల్పును ♦ జంకకితని
వాఁడియసిధారఁ గోలుపు జ ♦ వంబుమీఱ, ననుడు విధికైశ్యమున్ బట్టి ♦ యతఁడు వేగ.

క॥ ఏ శిరమున బొంకాడెనొ, నాశిరసున్ జదిపి తక్కె ♦ న శిరంబులనున్
నాశము సేయఁగఁ గడు నా, వేశముతోఁ గత్తి నెత్తె ♦ విధి యాత్తుండై. 373

చ॥ మదమును బాసి "భోవరద! ♦ మాం కరుణాకర పాహి" యంచుఁ ద
త్పదములవ్రాలె వెన్నుఁడును ♦ భర్గునిఁ జేరి నమస్కరించి పెం
పొదవఁగఁ గావు మింక నజు ♦ నూడఁగఁ జేసితి పాపమస్తమున్
సదయుఁడ! నీవుగా కెవరు ♦ సాఁకఁగలా రిటు లార్తపాలనా! 374

గీ॥ అని నుతించినయంత దే ♦ వాధినాథుఁ, డపుడు భైరవు వారించి ♦ యజునికనియె
గొప్పకోసరమై యిట్లు ♦ తప్పుదారి, త్రొక్కితివిగాన నిప్పుడీ ♦ పొక్కు సూపె.

—* శివుఁడు బ్రహ్మను శపించుట *—

ఉ॥ ఇంతియకాదు నీకు గుడి ♦ యెవ్వరు గట్టరు పూజసేయఁబో
రెంతయుఁ దావకోత్సవము ♦ లెవ్వరునున్ బొనరింప రింక య
జ్ఞాంతములందుఁ గర్మనిచ ♦ యాంతములందును నీకుఁ బూజఁ గా
వింతురు లేకయున్నఁ జెడు ♦ విశ్వమునన్ సకలక్రియాతతుల్: 376

వ. అని యట్లఖిలేశ్వరుండు బ్రహ్మయెడ నిగ్రహానుగ్రహంబులు బఱపి కూటసాక్షి
యగు కేతకిం గాంచి కసరి యిట్లనియె. 377

క॥ కేతకి! యంహోభీక, ఖ్యాతికి వెనుకొనక కల్ల ♦ లాడితి విట్టుల్
పాతకి! నిను నేఁ దాకను, నీతికి దవ్వైతి విట్టి ♦ నీకు వెలియగున్. 378

క॥ అని శపియించినఁ గేతకి, మనమున నారటము నొంది ♦ మన్మథహరుఁ గ
న్గొని దేవర! క్షమియింపుం, డనదపయిన్ గినుక దగునె ♦ యధిపున కెందున్.

---

* శివపురాణే - విద్యేశ్వరసంహితాయా మష్టమాధ్యాయే - శివశి.
శ్లో॥ వత్స సోయంవిధిస్సాక్షాజ్జగతా మాద్యదైవతం। నానమర్హోయుఖడ్గేన। శిక్షణీయ సవాహరం॥

గీ॥ నలువ మోమోటమునఁ జెట్ట ♦ నాడఁ బోడమెఁ, జాపలంబునఁ దవిలి య ♦ సత్యవచన
మాడితిని నేను మన్నించి ♦ యభవ! కరుణఁ, బఱపు శాపంబుఁ ద్రిప్పుము ♦ గరిమదనర,

చ॥ అని యిటు నేలవ్రాలి శర ♦ ణాగతయై ప్రతిమాలు కేతకిన్
గని హరుఁ డిట్లనెన్ దృఢము ♦ గా నిను దాఁకను నేను మత్కుటుం
బినియుఁ దనూజులున్ బ్రమథ ♦ వీరులు దాల్తురు పొమ్మనెన్ ముదం
బునఁగని యంత నయ్యదియుఁ ♦ బోయెను శంకరులీలఁ బాడుచున్. 381

## బ్రహ్మవిష్ణ్వాదులు తేజోలింగంబుఁ బూజించి వరములొందుట

గీ॥ అపుడు హరియు విరించియు ♦ నఖిలదేవ, గణము లర్చనవస్తువ ♦ ర్గంబుఁ గూర్చి
యభవలింగంబుఁ బూజింప ♦ నాదరమున, హరుఁడు వరమిత్తుఁ జెప్పుఁడన్న ♦ నలరివారు

క॥ ఈలీల దేవవల్లభ!, యీలింగాకృతిని నలరు ♦ మిట నిచ్చలునాఁ
బాలింపుమది శివుఁడు తే, జోలింగమునంగ నుందు ♦ సూక్ష్మాకృతినై. 383

వ. అనాద్యంతంబగు నీయాకారంబును మాటుపఱచి సూక్ష్మలింగంబునై యఖిలజనార్చనంబులఁ గొనుచు నెల్లలోకంబులవారికి భోగమోక్షంబులిచ్చుచుందుము. అగ్నిపర్వతసదృశంబైన లింగంబునైతిఁ గావున నీక్షేత్రం బరుణాచలంబనంబడు. మార్గశీర్షార్ద్రానక్షత్రంబున నుద్భవించుటఁ జేసి యిందు మార్గశీర్షార్ద్రయందు నన్ను దరిసించినవారు నాకుఁ గుమారతుల్యులై యొప్పుదు రాదినంబున నన్నుఁ బూజించినవారలు వాగగోచరంబగు ఫలంబు నొందుదురు. మఱియిందలి దానహోమజపంబులు కోటిగుణితంబులై ఫలంబు లొసంగు. మామకీనంబులగు క్షేత్రంబులందెల్ల నిది శ్రేష్ఠతరంబై విరాజిల్లుచు జనంబులకెల్ల స్మరణమాత్రంబున మోక్షసాధకంబై వెలయునని నొడివి పరమశివుం డంతర్ధానంబు నొందెనంత హరివిరించిప్రముఖ నిఖిలసురలును మురియుచు నాలింగము నర్చించి తమ ధామంబులఁ జేరిరీలింగోద్భవచరిత్రం బెవ్వరేనిఁ జదివిన నవ్వారికిఁ బరమేశ్వరుండు సకలశ్రేయంబు లొసంగుననుచు మునులు సూతునకు మహాత్మా! మున్ను శివలింగంబు నర్చించి శ్రేయోబలంబులఁ గొన్నవారెవ్వరో యట్టి వారి వరుసగా వినఁదలఁతు మెఱిఁగింపుమనుటయు సూతుం డవ్వారికిట్లనియె. 384

## శివభక్తానుక్రమణిక

క॥ రమతో హరియును వాణీ, రమణీమణితోడ నజుఁడు ♦ రహిని వశిష్ఠా
దిమునులు సధర్మిణులతోఁ, గమలహితాహితులు మున్ను ♦ గాఁ గలగ్రహముల్.

క॥ కుంభభవుఁ డాత్మసతితో, జంభారిప్రముఖులైన ♦ సర్వదిగీశుల్
కుంభినికి గంగఁ దెచ్చిన, యంభోజజనిభుఁడు గౌత ♦ మార్యుఁడు సతితోన్. 386

సీ॥ దూర్వాసుఁడును నల♦యౌర్వుండు నారద, మౌని బృహస్పతి శక్తి♦ముని పరాశ
రమునియు నల్ల పా♦రాశరి శుకుఁడును, భార్గవుండు దధీచి ♦ గర్గఋషియు
వామదేవుఁడుయాజ్ఞ♦వల్క్యుండు జైమిని,యుపమన్యుఁడును శిలా♦దోగ్రమూర్తి
నంది కేశ్వరుఁడునా♦నందుఁడత్రిమృకండ, మునియు మార్కండేయ♦మునియుగాధి
గీ॥ జుఁడును జమదగ్ని పరశురా ♦ ముఁడును శ్వేత
కేతుఁడును శౌనకాది వి ♦ ఖ్యాతఋషులు
లింగపూజను సల్పి సి♦ద్ధింగనిరి మ
హామహులు వారిఁ దలఁచిన ♦ నఘము దొలఁగు. 387

క॥ మఱి యష్టవసువులును దుం, బురుఁడును గంధర్వసాధ్య ♦ ముఖులెల్లరు గి
న్నరులును జారణులును గిం, పురుషులు శివలింగమూర్తిఁ ♦ బూజించి రొగిన్.

క॥ నరనారాయణఋషులు బ, దరకాననమందుఁ దనరి ♦ దారుణనిష్ఠన్
బరమేశ్వరలింగంబును, నిరతమునన్ గొలుచుదురు ము♦నివరేణ్యుఁ ఖల్ !

గీ॥ శేషవాసుకి తక్షకుల్ ♦ శ్రీపవాహ, నంబయి మెసంగు నల సుప♦ర్ణప్రభుండు
ఘనుఁడు స్వాయంభవుండు నౌ♦మనువునుంబ్రి,యవ్రతుండునునాతని♦యనుజుఁడెలమి

వ. మఱియు నౌత్తానపాది యగు ధ్రువుండును వృషభుండును భరతుండును శివలిం
గంబులఁ బూజించి సిద్ధులంగాంచి రిఁకను. 391

చ॥ మునుకొని యా హిరణ్యకశి ♦ పుండు తదాత్మజుఁడున్ విరోచనుం
డనఘచరిత్రుఁడైన బలి ♦ యాతని పుత్త్రుఁడు బాణదైత్యుఁడున్
ఘనుఁడగు రావణాసురుఁ డ ♦ కల్మషుఁడైన విభీషణుండు నిం
పున శివలింగపూజనముఁ ♦ బూన్కి నొనర్చి రనారతంబునన్. 392

సీ॥ వైవస్వతమను వి ♦ క్ష్వాకు కకుత్స్థ మాం, ధాతలు ముచికుంద ♦ ధరణినాథుఁ
డా హరిశ్చంద్రమ♦హారాజు కల్మాష, పాదుండు సగరభూ ♦ పాలకుండు
అల భగీరథుఁడు ఖ♦ట్వాంగుండును దిలీప, నృపుఁడు రఘుం డజ♦నృపతి దశర
థనృపాలకుండును ♦ దాశరథియు నను, జులును దత్పుత్రులు ♦ సూర్యవంశ

ఆ॥ రాజవర్యులెల్ల ♦ రాజవంశాగ్రణి
యగు పురూరవుండు ♦ నసముఁడైన
నహుషుఁడును యయాతి ♦ నలుఁడుఁ జంద్రాంగదుం
డల్ల పాండునృపతి ♦ యతనిసుతులు. 393

క॥ శ్రీకృష్ణుఁడు ప్రద్యుమ్నుం, డా కృష్ణునిఁ జెనయు సాంబుఁ ♦ డల్ల జనకసు
శ్లోకనృపాలుండు వర, శ్రీకజరాసంధనృపతి ♦ శేఖరుఁడెలమిన్. 394

వ. వీరు వా రననేల ? సుప్రసిద్ధమహాపురుషు లందఱును దత్సతీమణులును.

క॥ శివలింగపూజనంబును, నవధానముతోడఁ జేసి ♦ యా యా సిద్ధుల్
వివిధసుఖంబుల ముక్తివి, భవమును నార్జించి రట్లు ♦ పావనచరితుల్. 396

వ. ఇఁక నేమి వినఁగోరుదు రనిన సూతునకు దయాళూ! తనివిచాలదింకను గొన్ని
లింగవిశేషంబుల నెఱింగింపుమనుటయు సూతుండు మునుల కిట్లనియె. 397

## —* అంధకేశ్వరలింగచరిత్రము *—

ఉ॥ సాగరతీరమందు నొక ♦ చండబిలంబున నంధకుం డనా
త్రేఁగగు రక్కసుం డొకఁడు ♦ వీరుఁడు సర్వసురాళిఁ గొట్టి త
ద్భాగతసర్వసంపదలఁ ♦ బూర్తిగఁ గైకొని యెల్లవారలన్
గ్రాఁగఁగఁజేసి తద్ధనముఁ ♦ గావలుఁడై కొనుచుండె నుద్ధతిన్. 398

క॥ పవలుఁ రాతిరి గర్తము, న వసించుఁ దదీయ హితజ♦నంబులతోడన్
వివిధజను లులుకుదురు దా, నవ్వఁ డేతెంచునొకో యని మ♦నంబుల నెపుడుఁ.

వ. అంతఁ గొంతకాలంబు చనినంత.

ఉ॥ దేవతలంతగూడి కడుఁ ♦ దెంపుమెయిన్ శివుఁ జేరి మ్రొక్కి య
క్కావలుఁడైన యంధకుని ♦ ఘాతుకరీతినిఁ దెల్పి యక్షులన్
జావఁగఁజేసి లోకముల ♦ సాఁకుమనంగ ననంగశాసనుం
డా వగఁ బాపఁగోరి దను♦జాగ్రణి ధామముఁజేరి ధీరతన్. 400

క॥ సురల ననికిఁ బురికొల్పిన, హరునానర వారు దురము♦నం దంధకునిన్
దలిమును దనుజుఁడు గర్తముఁ, దఱియఁగఁజన హరుఁడు వాని♦దర్పంబడఁగన్.

గీ॥ లాఁగిశూలంబెదఁ గ్రుచ్చ♦లావుసెడి ద, నుజుఁడుగూలుటఁగని సుర♦వ్రజము వాని
యంత్యదశ నీదు దరిసెనం♦బమరెఁగాన, వాని ధన్యునొనర్పు కృ♦పానిధి! యన.

వ. దయార్ద్రహృదయుండగుచు మహేశ్వరుం డద్దైత్యుంగాంచి నీవేమి వాంఛింతు
విచ్చెదఁ దెలుపుమనిన నవ్వాఁ డిట్లనియె. 403

క॥ నాపేరట లింగమవై, యీ పారావారతీర ♦ హృద్యస్థలియం
దోపరమేశ్వర! వెలయుము, నీ పరమకృపావిభూతి ♦ నెగసి వెలుఁగఁగాన్.

వ. అనిన శంకరుం డామోదించి వాని దేహము నాగర్తమందుఁ ద్రోచి తా నందు
నంధకేశలింగం బను పేరితో వెలసె నంధకుండును శివసాయుజ్యంబునొందె నిట
నా యంధకేశలింగంబు త్రిభువనపూజ్యంబై సర్వజనక్షేమఙ్కరంబై యెసంగె
నా లింగంబు భక్తితో నాఱునెలలర్చించువారలకు సర్వసిద్ధు లొనగూడు,
వృత్యర్థ మర్చించినవారు దేవలకశ్రేష్ఠులగుదురు. 405

## —* సుదర్శనుని చరిత్రము *—

చ॥ వరఁగ దధీచి నాఁగనొక ♦ బాపఁడు సంతత మంధకేశభా
స్వరతరలింగ మర్చనము ♦ సల్పుచు జీవనవృత్తికై యతం
డరిగె మహాంకు గ్రామమున ♦ కాత్మజు నచ్చోట నుంచి వాఁడునున్
సరవిగ లింగపూజనము ♦ సల్పుచునుండె యథాక్రమంబుగన్. 406

ఉ॥ పేరు సుదర్శనుం డనుచుఁ ♦ బిల్తురువాని, దుకూలనాఁగఁద
న్నారి నికృష్టవంశ్యయగు ♦ నాతొక పెన్మిటి నాత్మవశ్యనిన్
గారవియించె నాతఁడును ♦ గాంతకులోఁగి మెలంగుచుండు న
వ్వారికి నల్వురాత్మజులు ♦ వర్ధిలుచుండిరి యంతమీఁదటన్. 407

వ. కొంతకాలంబునకు సర్వజనసేవ్యంబును మహాపర్వంబును నగు శివరాత్రి యరుదెంచిన. 408

సీ॥ ప్రొద్దుప్రొద్దున లేచి యా♦భూమిసురుఁడు, శివునికో వెలకేగుచోఁ♦జెలువ యద్దు
కూల పెన్మిటి నొడిపి నన్♦గూడి సురత, సౌఖ్యమొనరించిపోవు మ♦చ్చటికి నేని.

క॥ అని వేగ బలాత్కారం, బొనరించిన నాతఁడక్లి ♦ పొందుగ సౌఖ్యం
బొనరించి యంతగుడికిన్, జని యర్చనచేసె శివుని ♦ జనములు సూడన్. 410

వ. అంత శివుండు క్రుద్ధుండై

ఉ॥ ఓరిదురాత్మ! కల్మషమ ♦ దోద్ధత! హేయచరిత్ర! నేఁడిటుల్
నారినిఁగూడి స్నానము నొ ♦ నర్పకయే ననుఁబూజఁ జేతే?
ధీరత మెల్లఁ గోలుపడి ♦ తేజముమాలి జడత్వమొందుమా!
నారియునున్ మదంబఱి మ♦నంబునఁ గుష్ఠునుగాక చెచ్చెరన్. 411

వ. అని శపియించిన నాతఁ డక్లే యున్మత్తుండయ్యెఁ దత్పత్నియును బరితపించుచుండె నంత గ్రామాంతరముననున్న దధీచి యెఱింగి యాతురుండై వచ్చి కొడుకున్ గాంచి కోడలి యవివేకకృత్యంబున కనుతాపంబొంది విషాదంబుతో.

గీ॥ శివుఁడొనర్చిన శిక్షకు ♦ శివవినాఁగఁ, బెఱలు దప్పింప లేరని ♦ ప్రియము మెఱయ
నంబికనుభక్తిఁగొలువఁగ♦నార్యయప్పుడు, వచ్చివరమిత్తుననుచు న♦బ్బాడబుండు.

చ॥ తనయునివృత్తమంతయును ♦ దాఁచకఁ దెల్పి మెఱేని వాని వ్యా
ధినిఁ దొలఁగించి ప్రోవుమనఁ ♦ దేఁకువతో శివురాణి యట్లునే
యను శివసాయ మర్థిఁ బడ♦యన్ వలె శంకరు నిష్ఠఁ గొల్వఁడీ
యనఁగనె వార లీశ్వరుని ♦ నాదరమొప్ప భజింప నాతఁడున్. 415

గీ॥ వేగవచ్చిన శివయు న♦వ్విప్రసూను, దారకునొనర్చి శివుని యు♦త్సంగమందుఁ
జేర్చి ఘృతధార స్నాతునిఁ♦జేసి యొక్క, జన్నిదంబును మెడవైచి♦సత్వరమున.

క॥ శివగాయత్రీమంత్రము, నవిరళకృపఁజెప్పి విభుని ♦ కార్యా ! స్వతనూ
భవు వీనిఁగావుమనుడు న, భవుఁ డామోదమున ననిమె ♦ బాలకుతోడన్. 417

గీ॥ భక్తులిల నాకొసంగిన ♦ వస్తురాజి, నెల్లఁ గొనుచుండు మఘము నీ♦ కేమిగాదు
నాసమర్చనమున భవా♦నీసమర్చ, నమున ముఖ్యుండవగు చునుం♦డుముజగమున.

క॥ ప్రాజాపత్యంబున నీ, భోజనమే సిద్ధిఁగూర్చుఁ ♦ బొసఁగకయున్నన్
రాజిల దావ్రతము సేడున్, యోజింతురుగాక యటుల ♦ నుర్విజనంబుల్. 419

క॥ స్నానము మఱవకు వస్త్రుల, మౌనటులన్ దిలకముంచు ♦ మాస్యతలమునన్
మానకు మింక శివసంధ్య న, నూనమతిన్ నా సమర్చ ♦ నొనరింపు మొగిన్.

వ. ఇట్లయిన నీ యఘమంతయుఁ దొలంగి భద్రింబగునని సర్వేశ్వరుం డనుగ్రహించి నంతఁ బరమేశ్వరియు నానందంబున వాని నంధకేశార్చనంబుననుంచి తత్పుత్రకుల నల్వురువటువుల నాల్గుదిక్కులకు శివార్చనయందు నియుక్తులన్ జేసి వారల కభీష్టవరంబులిచ్చి యంతర్ధానంబునొందిరి. శివానుగ్రహంబున నవ్వారు విస్తరించి రిఁకఁ దపోవ్రతంబుల నెడఁబాసి దేవలకులనఁ బేరుంగాంచిరైన నీశ్వర శాసనంబునఁజేసి వార లీశ్వరపూజయం దగ్రిణులైరి. ఆదియందవ్వారి పూజ గానియప్పు డెవ్వారును బూజింప దగ దట్లు పూజించిరేని యప్పూజ నిరర్థకంబగు. మంచియేనియుఁ జెడ్డయేనియు వటువును బరిత్యజింపరాదిఁక ప్రాజాపత్యవ్రతంబున నీవటుభోజనంబు వ్రతసంపూర్తిన్ బొనరించు నద్దాని వినుం డంధకేశలింగ పరిసరపురంబందు భదుృండను నొక్క నృపుండు. 421

క॥ ప్రాజాపత్యవ్రతమును, నోజన్సలుపంగ శర్వుఁ♦డొక ధ్వజమిడి యీ
భ్రాజద్ధ్వజము నుపస్సుల, రాజేంద్రా! యెత్తు మరల ♦ రాత్రులనొరగున్.

ఆ॥ వ్రతముజరుగకున్న♦ధ్వజమిది యొరగదు, చూడుమనుచుఁ జెప్పి♦శూలపాణి
చనియెఁబార్థివుండు♦సల్పుచుండెనువ్రతం, బహరహంబు నీశ్వ♦ రార్చనమున.

క॥ జేలన్ బాపలు సాపడ, లీలఁ ధ్వజ మొరగునట్టు♦ లే వడుగొక నాఁ
డోలిమొదల్ గుడిచిచనన్, వైళంబుగఁ బుడమినొరగె♦ధ్వజ మబ్రముగాన్.

చ॥ అడిగని రాజవర్యుఁడెద ♦ నబ్బురమొంది మనీషులున్ గడున్
విదులగు బ్రాహ్మణోత్తములఁ ♦ బిల్చియనెన్ భవదీయ జగ్గియాఁ
బిదప ధ్వజంబు వ్రాలు నిది ♦ వింతగనేఁడెటో ముందువ్రాలె మీ
ర్మదిఁ బరికించి చెప్పుఁడన ♦ మంచిగయోజనచేసి వారలున్. 425

క॥ వటుఁడొకఁడు ముందు భోజన, మిటఁ జేసిచనెన్ శివాజ్ఞ ♦ హెచ్చగువాఁడీ
చటులవ్రతమున దానన్, స్ఫుటముగ నాధ్వజము వ్రాలెఁ♦బుణ్యచరిత్రా!

క॥ చండీపుత్రులు వారలు, నిండించుఁదదర్చ పేర్మి♦ నీలగళునకున్
జండీదేవికి ననిరి ప్రభుండలరెఁ బ్రజల్ యశంబు ♦ భోరుకొనఁగన్. 427

వ. ఇట్లంధకేశలింగ చరిత్రంబును వటుకోత్పత్తియు మీకెఱింగించితి నింక నత్రీశలింగ చరిత్రంబును వినుండని సూతుండు మునులకిట్లనియె. 428

—* అత్రీశలింగము *—

ఉ॥ కామదమంచుఁ బేర్వడిన ♦ కాననమొక్కఁడు దక్షిణావనిన్
రామగిరిట్సమీపమున ♦ రాణఁదనర్చుచునుండె నచ్చటన్
దామరసోద్భవోద్భవుఁ డు♦దారతపోనిధి యత్రియుండెఁ ద
ద్భామ పతివ్రతావ్రతని♦ధానము నా ననసూయ తోడుతన్. 429

ఉ॥ ఛాత్రులు పల్వు రెప్పు డుట ♦ జమ్మున వేదములన్ బఠింపుచున్
శ్రోత్రసుఖంబు సేయుచు వి♦శుద్ధమతిన్ దను గొల్చుచుండఁగా
నత్రిమహామునీంద్రుఁడు ని♦జాంగనయౌ ననసూయతోడ నీ
ధాత్రిని నేరెఱుంగని యు♦దాత్తతపం బొనరించుచుండఁగాన్. 430

గీ॥ దైవవశమున నూఱేండ్లు ♦ దారుణంబు
గా ననావృష్టి యగుడు వృ♦క్షంబులెల్ల
నెండె నెచ్చోటఁ దడిలేక ♦ యుండెఁ బుడమి
నెల్లజంతువు లెచటికో ♦ యేగ వగను. 431

గీ॥ నిత్యవృత్తికి లేదయ్యె ♦ నీరమెందు, వేఁడిగాడ్పులు చెలరేఁగి ♦ వీచుచుండె
నెందు హాహారవంబులే♦ మొసఁగుచుండె, నంత ననసూయ మగనితో♦ ననియెనిట్లు

క॥ వినఁజాల నార్తనాదము, గనఁజాలఁ బ్రజాతిదాహ♦కష్టంబుల నిం
కను నే సహింపఁజాల న,నిన శివుని దలంచి యట ము♦నివరుం డంతన్. 433

—* అత్రిముని తపస్సమాధి నొందుట *—

క॥ భీమంబగు దుర్భిక్షము, నామెయిఁబరికించి క్షిప్ర♦మప్పుడె ప్రాణా
యామము చేసి సమాధిన్, నేమమునన్ జెందియుండె♦ నేటగు తపమున్. 434

వ. అంతేవాసు లంద ఱాఁకలిదప్పుల వందురి యెద్దడి నెదురలేక యెందేనిఁ జనిరంత మీఁద. 435

మ॥ అనసూయాసతి జీవితేశ్వరుని న♦త్యంతంబు సేవింపుచున్
గొనబౌ మృన్మయలింగ మొక్కఁడు గడున్ ♦ బొంకంబుగాఁగూర్చి పా
వనమంత్రంబులఁ గొల్చుచుండె నతముల్ ♦ భావోపచారంబులన్
దనుజుల్ గొందఱు తత్తనూజ్జ్వలత కా♦త్మన్ బొక్కి కామార్తులై. 436

ఉ॥ ఆమెను దారసించి చటు ♦ లాగ్నివిధమ్మునఁ జిమ్మ తచ్ఛవి
స్తోమముచేత నోరసిలి ♦ సోలి యడల్గొని పాఱి రప్సు స
ర్వామరబృంద మద్దిగని ♦ హర్షమునొంది తదీయమహా వనిన్
ప్రేముడిఁ జేరి చూచిరి వ♦రేణ్యుల నమ్ముని నమ్మునీట్సతిన్. 437

చ॥ కని మునిసేయు నత్తపసు ♦ కన్న మునీంద్రునిరాణి సేయు పూ
జనము ఘనమ్ముగా నరసి ♦ చాలఁగ వారల సన్నుతించి చ
య్యన దివికేగి రందఱు వి ♦ యద్ధునియున్ హరుఁడున్ మనంబులన్
మునిమిథునేప్సితంబులను ♦ బొందుగఁ గూర్పఁదలంచియుండఁగాన్. 438

క॥ మునియుగతపములు మొదలా, దినమున కేఁబదియునాల్గు ♦ దీరెను సమ లం
తను నేని వృష్టియొనరదు, ముని యుగ్మ మొనర్చుచుండెఁ ♦ బూన్కిఁ దపములన్

ఉ॥ అంతనె యత్రిమౌని తన ♦ ధ్యానము దించి పురంధ్రితోడ న
త్యంతము దప్పి పుట్టెను ర ♦ యమ్మునఁదె మ్మదకమ్మనాన్ మునీ
ట్కాంత కమండలంబుఁగొని ♦ కాన జలంబునుగాన కాత్మలోఁ
జింతిలె నేమిసేతు ? నెటఁ♦జేరుదుఁ? గాంతుని దప్పిఁ దీర్పఁగాన్. 440

—* గంగాదేవి స్త్రీరూపముతో ననసూయకు దర్శనమిచ్చుట *—

ఉ॥ లేదుదకం బొకంట నని ♦ లేమమనం బురియాడుచుండఁ గా
లూదక యందు నంచుఁ గను♦చుండఁగ స్వర్ణది యొక్క నాతియై
యాదృతి నమ్మునీశ్వరుని ♦ యంగన వెన్కొని పల్కె సాధ్వి ! నీ
కేది ప్రియంబు సెప్పు మది ♦ యిచ్చెద వచ్చితి మెచ్చి నిన్నిటుల్.

క॥ నీ సెలవున్ గడుఁగూరిమిఁ, జేసెదఁ జెపుమమ్మ ! యిట్లు ♦ శివసేవనమున్
నీ సామి సేవనంబును, వాసిగ నొనరించినట్టి ♦ పావన వెలమిన్, 442

క॥ అనుడు మునిసతియు వెనుకకుఁ, గని యాపెన్ జూచి పల్కెఁ ♦ గమలనయన! యెం
దుననుండి వచ్చితివి ? నీ, ఘనత నొకింతయును దెల్పఁ♦గాఁదగు ననినన్. 443

ఉ॥ గంగను నేను గోర్కులడు ♦ గన్దగు నన్న మునీంద్రపత్ని సా
ష్టాంగముగాఁగ మ్రొక్కి జల ♦ మడ్గఁగఁ గర్తముఁ జేయు నీరమున్
బొంగుగఁ గూర్తునాఁ దపసి♦బోటి యటుల్ ఘొనరించె గంగ యు
ప్పొంగుచు నింపెఁ దత్క్షణమె ♦ పుణ్యజలంబుల గర్తగర్భమున్. 444

గీ॥ అపుడుజలము గమండల♦మందునింపి, కొనియు నత్రిధునికి మ్రొక్కి ♦ యనియెనిట్లు
తల్లి ! నా పతి వచ్చు నీ♦దండ కిప్పు, డంతవఱ కీవు గృపనిట ♦ నాగవలయు.

క॥ అన వల్లే యన నా పెయుఁ, జని సలిలము మౌనికొసఁగ ♦ సత్వరమున న
య్యనఘుఁ డుదకమునుఁ ద్రావి మ, దిని నలరి జలంబు లెందుఁ♦దెచ్చితి వబలా!

చ॥ ఎపుడెపు డీవొసంగు జల ♦ మిట్టిది కా దమృతోపమానమై
తపనముసేయు నాహృదయ ♦ దారుణపీడ హరించె నిద్ది యీ
విపినమునందు దుర్లభము ♦ వేయినుడుల్ పనియేమి నీవికన్
జెపుమెటనుండి తెచ్చితివొ ♦ చెల్వరో ! యిమ్మధురోదకంబులన్. 447

చ॥ అనియడుగంగ నాపె హృద♦యంబునఁ దర్కముచేసె వాస్తవం
బును దెలుపంగ నాకడిమి ♦ పొల్పును దెల్పిన యట్టులౌను గ
ల్లను నుడువంగ నయ్యది ద♦లంపఁగరాని యఘంబగుం గటా !
యొనరఁగ జీవితేశ్వరున ♦ కొప్పగ నెట్లు వచింతునీయెడన్. 448

క॥ అని యనసూయాసతి నె, మ్మనమున యోజించి తమదు ♦ మహిమమువలనన్
ఘనమగు శివకృపవలనన్, మనవనమునఁ జేరె గాంగ♦మధురోదకముల్. 449

గీ॥ అనిన నత్రియు నేఁగాంతు♦ననుచుమురిసి, రాఁదదీయప్రియయు గర్త♦రాజనికట
మునకు నేతేరఁగనుపట్టెఁ♦బూర్ణసలిల, రుచిరమై చెలువొందు స♦రోవరంబు.

వ. కనుంగొని బిరాన యం దత్రిముని ప్రీతుండై స్నాతుండై నిత్యకర్మంబు లొనర్చి
కొనియె ననసూయయు ననగాహనంబుచేసె నంతఁ బరమేశ్వరుండును స్వర్ధునియు
దర్శనంబిచ్చి యత్రిమునిని ననసూయను బ్రశంసించి వరంబులిచ్చెద మడుగుఁడనిన
ననసూయ గంగ కిట్లనియె. 451

—* అనసూయ గంగ నెల్లప్పుడట వసింప మనుట *—

క॥ తల్లీ ! యీ తాపసవని, నెల్లప్పుడు మఱచిపాయ ♦ కీవుండవలెన్
జల్లఁగ నాయెడఁగల కృప, ఫుల్లాంబుజనయన ! భువన ♦ ములు పొలుపొందన్.

క॥ లోకోపకారమును నగు, వీఁకన్ గరుణాతిశయము ♦ వెల్లివిరియఁగా
నీ కమనీయోదకముల, నీకానన్ సతము నిలిపి ♦ తేని మహాత్మా ! 453

చ॥ మునిసతి యిట్లుగోర నల ♦ ముగ్ధశశాంకధరేష్టపత్ని స్వ
ర్ధుని యిటువల్కె నబ్దము హ ♦ రున్ భజియించిన పుణ్యమిమ్ము నీ
వనినయటుల్ పొనర్చెద మ ♦ హాత్మ ! పతివ్రత ! యీపతివ్రతం
బున కెనరావు యోగములుఁ ♦ బుణ్యములున్ దపముల్ జగంబునన్. 454

క॥ నీబోఁటి పతివ్రతచే, నాబోటులు శుద్ధిఁగాంత్ర♦నా మునిసతి గా
రాబొప్ప నొక్కయేఁటను, దాఁబడయు శివార్చఫలముఁ ♦ దడయక యిచ్చెన్

వ. దేవధునియు ననసూయ గోరినయట్లాపుష్కరిణియందుఁ బుష్కరరూపంబున
సాన్నిధ్యంబు చేసియుండె నంత ననసూయాత్రులు మహేశ్వరు నిట్లుప్రార్థించిరి.

క॥ మందాకిని యెట్టుల మా, యం దాదర మెసఁగ నిందు ♦ నమృతమయంబై
పొందికఁ జేరి వసించెనొ, యిందుధరా ! యట్టులరసి ♦ యీవుండు మిటన్. 457

క॥ అని యడుగ శివుఁ డటులె యని, యనసూయారచితలింగ ♦ మందుఁ బ్రవేశం
బొనరించి జగము లేలెను, జను లత్రీశుఁడని పుడమిఁ ♦ జాటి యలరఁగా. 458

వ. అంత యథాపూర్వంబుగ వనంబంతయు బహుపల్లవపుష్పఫలాఢ్యంబై చెలువొంది యెద్దడిఁ బాసిన వలసఁ బోయిన ఋషులందఱు మరలఁ దఱలివచ్చి శాంతి హోమంబులు నెరపి రపుడు ఘనాఘనంబులు సువృష్టి నాపాదించె మునులందఱానందంబునఁ బొదలి రిది యత్రీశ్వరలింగ చరిత్రం బిఁక నందికేశలింగోదంతంబును వినుండని సూతుండు మునులకిట్లనియె. 459

## —* నందికేశలింగము—బ్రాహ్మణీచరిత్రము *—

క॥ రేవానదికిన్ బడమర, గా వర్తిలుతీరమందు ♦ ఘనతరశోభా
సేవితమగు కర్ణికనా, శ్రీవెలయుపురిన్ ద్విజుఁడు వ♦సించు నొకఁడిలన్. 460

చ॥ అతఁడు తనూజయుగ్మమున ♦ కర్థముఁ బంచి యొసంగి యంగనన్
సుతులకు నప్పగించి శివు ♦ చోటగు కాశికి నేగి యందనా
రతము హరున్ భజించి సుక ♦ రంబుగ నీశ్వరుఁ జెందె నూరిలో
నతనిపురంధ్రి యాత్మజుల ♦ నారయుచుండెను గొంతకాలమున్. 461

గీ॥ అంతఁ గొన్నేఁడులకు బాప♦నమ్మ రుజను, జెంది రోజుచు మృతివేళ♦సిద్ధమైన
నుసురు లుత్క్రమణంబు గా♦కుంటఁ జూచి, యగ్రపుత్రుఁ డుదరిసి యి♦ట్లనియె వేగ.

ఉ॥ అమ్మరో! నీదు చిత్త మిపు ♦ డక్కట! యేదొ కొఱంతఁ జెంది యి
ట్లుమ్మలికమ్ముఁ జెందు మది ♦ నున్న తెఱంగును దెల్పు నీయభీ
ష్టమ్మును దీర్తు సత్యమనఁ ♦ జయ్యన నాపె దదస్థిరాసిఁ దూ
ర్ణమ్ముగ గంగఁ జేర్పుమనె ♦ నందనుఁ డట్లె యొనర్తు నంచనెన్. 463

గీ॥ అంత బ్రాహ్మణి "హరహరా" ♦ యంచు నుసురు
విడిచెఁ గొడుకులునున్ విధి ♦ విహితముగను
శవమును దహించి యస్థిసం ♦ చయన మొనరఁ
జేసి కర్మంబులన్నియుఁ ♦ జేసి రపుడు. 464

గీ॥ మాసికశ్రాద్ధ మొనరించి♦యాసువాదుఁ, డనెడువిప్రాగ్రసుతుఁడును♦దినమునందుఁ
తల్లిఋణమును దీర్పఁగాఁ♦దలఁచి యుచిత, దానధర్మము లొనరించి♦తగినయట్లు.

క॥ తన భార్యాపుత్రులతో, ననుమతిఁ గొని శివుని మనము ♦ నందుఁ దలఁచి యొ
క్కనిఁ గూడఁ దోడుకొని గం, గను గూరిచి తఱలె నస్థి ♦ కాండముతోడన్.

క॥ నడిచి యొక యోజనము భా, నుఁడు గ్రుంకుచునుండ బ్రాహ్మ♦ణుం డొకపల్లెన్
బొడఁగాంచి చేరి యచ్చోట, విడిసి యొకఁడు పాఱు నింటి ♦ వేదికయందున్.

వ. సంధ్యావందనాదికర్మములను సలిపి సేవకునితోడఁ బవళింపుడు నప్పుడం దొకవింత
జరిగె నద్దానిఁ జెప్పెద వినుండు. 468

## —* ధేనువు సాహసకృత్యము *—

ఉ॥ ఆ యెడలన్ వసించెడి ధ ♦ రామరుఁ డొండొకయూరికేగి యా
సాయమునందె వేగ నిజ ♦ సద్మముఁ జేరఁగవచ్చి యావృషా
లామెడఁ బిండఁగోరి తన ♦ యాలినిఁ బిల్చి ఘటంబుఁ దెమ్మనా
నాయెలనాగ యిచ్చుడు ర ♦ యంబునఁ గ్రేపును బాపి లాఁగఁగాన్. 469

చ॥ అదియనుబోక బ్రాహ్మణుని ♦ యంఘ్రినిఁ ద్రొక్కఁగ నొప్పిఁ జెంది య
ప్పదనున నాతఁ డాగ్రహముఁ ♦ బట్టి కశన్‌వడి దానిఁగొట్టైన
మ్మొదవది గాంచి యశ్రుకణ ♦ మోచనమున్ బొనరించె దుగ్ధముల్
చిదికి ద్విజుండు లోనికిఁ జ♦నన్ వృషపోతము మాత కిట్లనెన్. 470

ఉ॥ ఏటికిఁ దల్లి! యశ్రువుల ♦ నెంతయు రాల్చితి వింతవంత నీ
కేటికి దావరించె నన ♦ నింతకు నెక్కుడిఁ కేమి గావలెన్
గాటులు పెందఁగా నొడలు ♦ గాదిలిబిడ్డని బాఁదుచుండ నా
రాటముచెంది కుందదె క ♦ రంబు భరంబుగఁ జిత్త మాత్మజా! 471

వ. అనిన లేఁగ యిట్లనియె.

క॥ తొలిజన్మంబున మదమున, సలిపినదోసంబు లురక ♦ చనునే? వానిన్
సొలయకఁ గుడువఁగ వలదే?, తొలఁగునె దోసంబులెందు ♦ దూఱిన జననీ!

క॥ సుకమును దుఃఖంబును నొం, డొకఁ డొసఁగఁగ లేఁడు కర్మ♦ మొసఁగును స్వీయం
బిఁక వగవ నేల? సర్వము, స్వకృతఫలంబులని యెఱుఁగఁ ♦ జను దేహులకున్.

ఆ॥ అనిన సురభి యిట్టు ♦ లనియెఁ గుమార! నీ, వనినచందమంత ♦ యును నెఱింగి
యున్నదాననైన ♦ నుడుగక మోహావ, శంబుఁ జేసి యిట్లు ♦ జాలివడితి.

ఆ॥ అనుచు మరలఁ గనుల ♦ నశ్రులు వెలిపుచ్చు, తల్లికనియె లేఁగ ♦ తగునె మరల
నెఱిఁగి యెఱిఁగి యిట్టు ♦ లేడ్వఁగా నమ్మరో!, యేమిసేయుదాన ♦ వేడ్చి యిపుడు.

వ. అనిన ధేనువిట్లనియె.

ఉ॥ నావలె నీ ద్విజన్ముఁడు ఘ♦నంబుగ దుఃఖముఁ జెంది యేడ్వఁగా
నావగ పాయు నంతకుఁ బొ ♦ నర్చునిటుల్ పరితాప మిద్ది నే
నేవగనైన వీనినుతు ♦ నెల్లి వధించెద చూఁడువాఁగఁ దా
భావమునందు రోసి వెస ♦ వత్సము ధేనువుతోడ నిట్లనెన్. 476

చ॥ మునుపటి బామిలో దురిత♦మ్మున్ బొనరించి పశుత్వమొంది యీ
వనటను జెందినార మిఁక ♦ బ్రహ్మవధం బొనరించి యిప్డు నూ
తనముగ భూరిపాతకముఁ ♦ దక్కఁగ చేకొనఁగాఁ దలంప నీ
మన మెటులొప్పెనో? యెఱుఁగ ♦ మాతరో! యీతరుణంబు నందిటుల్.

క॥ తా నెవరో? సుతు లెవ్వరో?, నానా బాంధవ సుహృజ్జ♦నంబు లెవరొక్కో?
లోనరయ నెవ్వ రెవరికిన్, గానరు సర్వులును గాంత్రు♦కర్మఫలములన్. 478

గీ॥ కర్మమున జన్మ మొదవు న♦క్కర్మమంత, మైనఁ గాని లభింప దా♦యమృతపదము
అందు దుష్కర్మ మొనరించు♦నట్టివారి, కంతులేక దుర్జన్మము ♦ లమరుచుండు.

చ॥ అన విని యావు తా ననియె ♦ నద్దురితంబును బాపునట్టి చో
టును మదిగుర్తెఱింగియె యి♦టుల్ పొనరింపఁగఁ బూనినాననన్
విని యరకుండె దూడయును ♦ వేదికపైఁ బవళించియున్న బ్రా
హ్మణుఁడు సువాదుఁ డద్ది విని ♦ యక్కజమొందె మదిన్ గడున్ గడున్.

వ. అంత.

చ॥ తెలతెలవాఱఁగా బుడమి ♦ దేవర యగ్గృహనాథుఁ డాత్మజున్
బిలిచి కుమార! పాల్మొదవుఁ ♦ బిండుము నేనొక యూరి కేగఁగా
వలె నని చెప్పి పాంథుఁడగు ♦ బాపనికిన్ దెలవారె యాత్రకై
సలుపు ప్రయాణమన్న విని ♦ చక్కఁగ నాతఁడు వింతఁ జూడఁగాన్. 481

గీ॥ తలఁచి "పోయెద నించుక ♦ డడసి యిపుడె
నొక రించుక నొగిలియు♦న్నాఁ" డనంగఁ
బోయె బ్రాహ్మణుఁ డంతఁ ద♦త్పుత్రకుండు
దూడగొని లాగి పిదుకఁబో ♦ దుగ్ధములను. 482

ఉ॥ గొడ్డు దటాలునన్ వటునిఁ ♦ గొమ్ములతో నుదరంబుఁ గ్రుచ్చి పై
కొడ్డుగ నెత్తి కూల్ప ధర♦కున్ ద్విజబాలుఁడు వాసెఁ బ్రాణముల్
బిడ్డనిపాటుఁ జూచి పృథి♦విన్ బడి కూయిడెఁ దల్లి యెల్లరా
పడ్డను బాఁది బాఁది విడు♦వన్ జనె నయ్యది పేరెమొందుచున్. 483

ఆ॥ బ్రహ్మహత్యచేతఁ ♦ బాండురవర్ణంబు, తొలఁగి నలుపుఁ జెంది♦తోఁచెఁ బసర
మంత యాత్రికుఁడగు♦నాసువ్రతుండును, భృత్యుతోడ దాని♦ వెంటనరిగె. 484

ఉ॥ ఆవది తోకయెత్తికొని ♦ యర్మిలి నర్మదఁ జేరి యందునన్
గేవలఘట్టముల్ విడిచి ♦ కేరుచు డగ్గఱి నందికేశలిం
గావసథోజ్జ్వలత్తటము ♦ నం దవగాహమునొందె బ్రహ్మహ
త్యావిలపంకమున్ దొరఁగి ♦ యంతనె వింతగనొందె శౌక్ల్యమున్. 485

చ॥ కనుఁగొని బ్రాహ్మణుండు మదిఁ ♦ గౌతుకమొంది కడింది భక్తిఁ బా
వనతరతత్తటాంబువుల ♦ వాసిగ మజ్జనమొంది పోవుచుం
టను గని యొక్క దివ్యకుల ♦ నారి ద్విజన్మునితోడ బ్రాహ్మణా!
చనె దెట కీవు? చెప్పు మిఁక ♦ సత్యముదప్పక యన్న నాతఁడున్. 486

వ. తన యుదంతంబు నెఱింగించిన నాదివ్యభామిని నీతల్లియస్థుల నీతీర్థమునం దేయుంపు మద్దాన నీజనని దివ్యదేహంబునొంది శివలోకంబు సేరఁగలదిది వైశాఖ శుద్ధ సప్తమీదినం బీవాసరంబందు భాగీరథి యీతీర్థంబందు సాన్నిధ్యంబుసేయు ననిచెప్పి యంతర్ధానంబుసేయుటయు ధరామరుం డాపెను గంగాదేవిగా నెఱింగి మరలి తనతల్లియస్థులలోఁ జక్కసగం బత్తీర్థంబందువేయ నంతలో నతనితల్లి దివ్యదేహంబునొంది గగనపథంబందుండియే కొడుకును గాంచియిట్లనియె.

చ॥ కొడుక! కృతార్థతం బొరసి ♦ కొంటివి ధన్యుఁడవైతి వేను ని
ప్పుడె సురలోకవాసమును ♦ బొందెద నీ కెడలేక సౌఖ్యముల్
దొడరెడుఁ బాడిపంటలును ♦ దొడ్డగ భాగ్యము సేకుఱున్ గడుం
గడు భవదీయవంశ మిలఁ ♦ గాంచును వృద్ధి నఖండరీతిగాన్. 488

గీ॥ ఇట్లు పలుమఱు దీవించి ♦ యింద్రలోక
మరిగి చిరకాల మట సౌఖ్య♦మంది పిదపఁ
బరమశివకృపఁ జెందె ని♦ర్వాణలక్ష్మి
బాపఁ డదిగాంచి విస్మయం ♦ పడి ముదమున. 489

వ. తక్కిన సగమస్థులనుగూడ నాతీర్థంబందే వేసి సేవకునితోఁ దనపురంబుఁ జేరె ననుడు మునులు మహాత్మా! నందికేశలింగ చరిత్రంబును వైశాఖ శుద్ధసప్తమీ తిథియందు మందాకిని యాతీర్థంబుఁ జేరుటకుఁగల కారణంబును జెప్పుమనుడు సూతుం డిట్లనియె. 490

—* ఋషికాచరిత్రము *—

చ॥ ఋషికయనాఁగ నొప్పెడు మ♦హీసురవర్యకుమారి రూర్తి బల్
సుషమతనూజ్జ్వలాంగి విధి ♦ చోదన బాల్యవితంతువై కడుం
ఋషికులమెల్ల మెచ్చఁగ స♦మిద్ధతపం బొనరించుచుండెఁ గ
ల్మషహృదయుండు మూఢుఁడను ♦ మాంసభుగగ్రణియొక్కఁ డాపెపై. 491

చ॥ వలపునుజెంది పంచశర ♦ భల్లవిదారితచిత్తుఁడై వడిం
జెలువను దారసించి తన ♦ చిత్తముఁదెల్పి బలాత్కరింప స
త్కులజ శివార్చనాపరయుఁ ♦ గోవిదయై యలరారు నాపె య
క్కలుషు ననాదరింప కాసఁ♦గన్నును మిన్నును గాన కాతఁడున్. 493

ఉ॥ పైకొన నుద్యమింప ద్విజ ♦ బాలవితంతువు దిక్కుమాలి య
ప్పోకిరికిన్ హితోక్తులను ♦ బోధనొనర్చియు లబ్ధిలేమికిన్
లోకశరణ్యు శంకరుని ♦ లోనఁదలంచి తదీయనామగా
నైకమనంబుతో నిటుల ♦ నాయను నాయన యంచు భీతిమై. 493

ఉ॥ క్రించుదనమ్ముతోడఁ బరి ♦ కించక వీఁడిటు దుర్మదాంధుఁడై
కొంచక శీలభంగమును ♦ గూర్పఁగడంగి పయింబడంగ నుం
కించుచు నున్నవాఁ డెవరు ♦ గిల్బిషమాఁగుదు రిందు నీవె యూ
హించి దయారసంబెద వహించి ♦ ఖలున్ గడతేర్పు మీశ్వరా! 494

హరిణగతిరగడ. శివ శివ శివ శివ ♦ శివ శివ శంకర!
శివ శివ శివ శివ! ♦ శివమునికింకర!
కవిననుజతపద ♦ కంజసముజ్జ్వల
రవిశశినయన! హి♦రణ్యతనూజ్జ్వల
శ్రీకర! దయ నిటు ♦ చిమ్ముము నాపయి
వీఁక నసురుఁ డెగ ♦ వేయుము ప్రాపయి
తేఁకువఁ గొనుమీ ♦ దివ్యచిత్తమున
నీ కెవ రెదురు త్రి♦నేత్ర! మొత్తమున
నీ పదంబులకు ♦ నెక్కొని మ్రొక్కెద
నాపదఁ బాపిన ♦ నభవా! దక్కెద
వాదమేల? పెఱ ♦ వానికిఁ జిక్కుదు
మీఁదటఁ గనుఁగొన ♦ మిత్తికి డక్కుదు
తలకొనఁజాల న ♦ ధర్మము దేవర!
యలవునఁజేరి కృ ♦ పాకర! ప్రోవర
శంకర శంభో! ♦ శరణుఁ జేసెదను
పంకజారిధర! ♦ పదము డాసెదను
సంకటహార! నిను ♦ సారెకుఁ దలఁచెద
హంకృతివిడి నీ ♦ యడుగులఁ గొలిచెద
పంకిలకర్మము ♦ బాయఁగఁ జేయుము
వంకలఁబోవక ♦ వశ్యముడాయుము
కావఁగరావే ♦ కరుణామూర్తీ!
ప్రోవఁగనీవే ♦ పూరితకీర్తీ!
నానేరమినిఁ గ ♦ నందగ దిత్తఱి

నీనెఱిఁ దప్పిన ♦ నీల్గును బిత్తరి
తల్లివి నీవే ♦ తండ్రివి నీవే
యెల్లలోకముల ♦ కేలిక వీవే
ముల్లోకములకు ♦ మూలం బీవే
చల్లఁగఁ బ్రజలను ♦ సాకెదు వీవే
తోడువునీవే ♦ వారవును నీవే
నీడవునీవే ♦ నెయ్యుఁడ వీవే
నీవే త్రాతవు ♦ నీవే నేతవు
నీవే దాతవు ♦ నీవె విధాతవు
భర్తురాల నీ ♦ పాలఁబడతి నిఁక
శక్తిపతీ! వే ♦ సాఁకుము గొంకక
యొప్పరికించిన ♦ నొప్పనె నీకది
తప్పదు నీకిఁకఁ ♦ దారసింప కిది
రమ్మిఁక రమ్మిఁక ♦ రాజభూషణుఁడ !
నమ్మితి ని న్నా ♦ మ్నాయభాషణుఁడ !
గౌరీకాంతుఁడ ! ♦ కలుషవిదారుఁడ !
శ్రీరమణాదిక ♦ చిత్తవిహారుఁడ ! 495

—* శివుఁడు రక్కసునిఁ జంపి ఋషికకు వరంబు లిచ్చుట *—

గీ॥ ఆర్తితో నిట్లు వేడఁగ ♦ హరుఁడు వేగ, భక్తరక్షణదాక్షిణ్య ♦ భంగులలర
వచ్చియసురనుపీడింప♦భస్మరాశి, యయ్యెఁ బలలాశి దత్క్షణం♦బందెయచట.

వ. అంత శివుండు ఋషికన్గాంచి.

క॥ కోరినవరముల నిచ్చెద, నీరజదళనేత్రి ! సుకృత♦నిశితచరిత్రి !
ధీరమతి ! యడుగుమన నెదఁ, దేఱి ప్రణుతి నిరతమతినిఁ ♦ దెలిప యిట్లులనెన్.

క॥ బ్రిదికించినాఁడ వీశ్వర!, సదయహృదయ ! దేవదేవ ! ♦ శరణావనసం
పదుదార ! దీనబంధూ!, మదమెత్తిన యసురఁ గడపి ♦ మాన్పితి వార్తిన్.

సీ॥ ఆమెఁగా తెరపి మే♦లాయెగా సుఖముపెం, పాయెగా పోయెగా♦దాయువనట
ఊడెఁగా మదము వె♦న్నాడెగా దృశము పో,నాడెగా యసురు దై♦త్యాధముండు
పాసెఁగా బాధ లో♦డాసెగా బోధ వే, మాసెఁగా వెఱపు వి♦శ్వాసమెసఁగ
మించెఁగా కోర్కి దు♦చించెగా భక్తివేవ్రి, మించెగా హృదయము♦దంచితముగ,

గీ॥ నిండెఁగాఁగీర్తి యెల్లెడఁ ♦ బండెఁగా మ, దీయపూజనమిది పార్వ♦తీసహాయ!
పొదలెఁగా బెద రఖల దు♦ర్హృదులకెంతో, సకలలోకైకరక్షణ♦చతుర!యిపుడు.

చ॥ ఇఁకను వరంబు లేటికి మ♦హేశ్వర! యైనను నీదు పాదసే
వకమతి నాకొసంగు మన♦పాయముగాఁగ జగంబులేల ను

త్పుకత వసింపు మిందనుడుఁ ♦ దోడనె యీశ్వరుఁడున్ దయామయా
త్మకుఁడయి లింగరూపమునఁ ♦ దా వసియించె వనస్థలంబునన్. 500
వ. అఖిలజనానందకరంబగుట నాలింగంబు నందికేశలింగంబని పేరొందె నంతగంగా
దేవియును దారసించి యమ్మునిని కిట్లనియె. 501
క॥ అమ్మరో! తావకసుచరిత,మ్మిమ్మునకే నెంతయున్ ము♦దంబువడితి వ
ర్షమ్మున నొకతడవ త్వదీ,యమ్మగు మజ్జనమునొప్పు♦నప్పాలనుందున్. 502
వ. ఈనాఁడు వైశాఖశుక్లసప్తమి యగుట నేటేట నీదినంబందీ తీర్థంబునందుఁబ్రవే
శించి యమ్మునాఁడు చనుదునని యంతర్ధానంబుఁ జెందె నిట్లు నందికేశలింగో
త్పత్తియును నర్మదాతీర్థంబునందు గంగాప్రాప్తియును మీకెఱింగించితి నిఁక
హరీశ్వరలింగచరిత్రంబు నెఱింగింతు వినుండని సూతుండు మునులకిట్లనియె.

## —* హ రీ శ్వ ర లి ం గ ము *—

ఉ॥ సర్వజగంబులేలు నల♦శౌరి నిశాచరమండలిన్ నిజా
ఖర్వపరాక్రమోగ్రత ని♦కామలయం బొనరించుచుండినన్
గర్వముతోడ వారు సుర♦కాండముఁబట్టి పలార్చుచుండఁగా
నోర్వఁగలేక లేఖులు ర♦యోన్నతి వెన్నునిఁజేరి యార్తులై. 504
క॥ తమగోడు విన్నవించి ర,యమునన్ రక్కసులపీఁచ♦మడఁచి జగముల్
మముసాఁకుమనుచు వేఁడుడుఁ, గమలాకాంతుండు వెరవు♦గాంచకకించన్.
ఉ॥ ఎందఱేఁబట్టి చంపిన ర♦ణేద్ధ్యులు రాక్షసవర్య లేచి యీ
చందము వేల్పులన్ గలఁచి ♦ సర్వజగంబుల కార్తిసేయుచున్
ముందుకు వచ్చుచుండిరి య♦మోఘతరంబగు నాయుధంబు లే
కిందఱి నెట్టు లాజి సమ♦యింతు గడింతు జయాతతోన్నతుల్. 506
క॥ అని మదిఁదలపోసి వెసన్, జన్నికైలాసాద్రిఁజేరి ♦ శంకరు నెదలోఁ
గొని పార్థివలింగమునకుఁ, గనకాబ్జసహస్రపూజఁ ♦ గావింప నొగిన్. 507
మ॥ ఒకనాఁ డీశ్వరుమాయఁజేసి హరి దా ♦ నుగ్రార్చయందున్న వే
ళకు నంభోజ మొకండు దక్కువగుడున్ ♦ లక్ష్మీశ్వరుం డీ జగ
న్నికరబంతయు దివ్యదృష్టిఁగని య ♦ న్నీ రేజరాజంబుఁగా
నక యాశ్చర్యభయంబులొంది పెలుచన్ ♦ ధైర్యంబుతో నంతనే. 508

## —*విష్ణుమూర్తి శివలింగమునకు నేత్రంబర్పింప శివుఁడు చక్రమిచ్చుట *—

క॥ సునిశితముగైన గోళ్ళఁ, దన నయనాబ్జంబు వ్రిచ్చి ♦ దండధరహరా
ర్చనసల్పుడు హరుఁడు ముదం,బునవచ్చి యభీష్టమడుగు♦ము హరి! యనంగన్.
మ॥ జలజాక్షుండు శివున్ గనుంగొని కడున్ ♦ సంతోసమున్ జెంది వే
ల్పులదుఃఖంబులు క్రవ్యభుక్కుల యఘుం♦బుల్ దెల్పి యల్పాయుధం

బుల నద్దైత్యులఁ దీర్పరామికిఁ గృపాం♦భోధీ! జగద్రక్షకై
బలవంతంబగు నాయుధంబు నిదుమా! ♦ ప్రార్థింతు నెంతేనియున్. 510
*క॥ అన దేవదేవుఁ డెంతయు, నినకోటిప్రభము శ్వేసద♦హితజనపటలీ
హననచణంబైన సుదర్శనమను దివ్యాయుధము నొ♦సంగి యిటులనెన్.
ఉ॥ ఎందఱి మీఁదవేసిన ర♦మేశ్వర! మీఱి క్షణంబులోన నా
యందఱిఁ ద్రుంచి తావకక♦రాగ్రమునందుఁ బ్రవేశమొందు ము
ప్పొందఁగనీక నీకు ముద ♦ మొందఁగఁజేయు ధరింపు మింక నీ
కుందెడబాయు లోకముల♦కున్ సుఖమున్ బొనరింపు దీనిచే. 512
క॥ మఱియును వరంబు లిచ్చెద, సరసీరుహనయన! యడుగు ♦ జంకక యన నా
హరి మురిసి మ్రొక్కి యడిగెను, బరమేశ్వర! నీదుపాద♦భక్తినిడు మొగిన్.
వ. వెండియు మత్సమర్చితంబగు నీ పార్థివలింగంబందు నిచ్చలు సాన్నిధ్యంబు నెరపుమని యర్థించిన శంకరుఁడు తథాస్తని యట్లొనర్చి యంతర్ధానంబునొందె నంత మాధవుం డలరి చని దుష్టదైత్యసంహారం బొనరించి లోకరక్షణం బొనర్చుచుండె నిది హరీశ్వరలింగచరిత్రం బింక గోకర్ణేశ్వర చరిత్రంబుఁ జెప్పెద నాకర్ణింపుఁడని సూతుండు మునుల కిట్లనియె. 514

—* మహాబలేశ్వరలింగము - గోకర్ణము *—

క॥ గోకర్ణస్థలమహిమము, గోకర్ణేశ్వరమహిమము♦గొనకొని నుడువన్
గోకర్ణగ్రైవేయుఁడు, గాక యొరులు పలఁతు లవనిఁ♦గలరె మునీంద్రుల్!
క॥ శివలింగకోటు లచ్చట, భవభంజకతీర్థకోటి ♦ పాతకకోటిన్
దవుదవ్వుల నవియించును, శివసాక్షాత్కారసిద్ధి ♦ సేకుఱఁజేయున్. 516
వ. అందు
చ॥ కమలజవిష్ణుముఖ్యసుర ♦ కాండహితార్థముగాఁగ రాక్షసో
త్తముఁడగు పంక్తికంఠుని యు♦దాత్తతపఃఫలమై గణేశదోః
కమలయుగప్రతిష్ఠ నొగిఁ ♦ గాంచినయట్టి మహాబలేశలిం
గము సకలాఘపుంజములఁ ♦ గ్రచ్చఱఁ బాయఁగఁజేయు రూఢిగన్. 517
క॥ ఆపాతాళభువనముల, నేపొప్పఁగ నాక్రమించి ♦ యెలపుటచేఁ దా
నోపె మహాబలుఁడను ప్రథ, శాపరమేశానలింగ ♦ మచ్చోట సిరిన్. 518
సీ॥ కృతయుగంబున సితములో♦హితము త్రేత, ద్వాపరంబునఁ బీతమం♦త్యయుగమందు
శ్యామలంబయి రాజిలు ♦ నామహాబ, లేశలింగము వినుఁడు ము♦నీశులార! 519

---

* శివపురాణే కోటిరుద్రసంహితాయాం షట్త్రింశదధ్యాయే —
శ్లో॥ ఏవముక్త్వా దదౌచక్రం। సూర్యాయుత సమప్రభం । సుదర్శనం స్వపాదోత్థం। సర్వశత్రు వినాశనం ॥ విష్ణుశ్చాపి సునంస్కృత్య । జగ్రాహాహ్లాదసున్నఖ స్తదా । నమస్కృత్య మహాదేవ। మిత్థం వచన మబ్రవీత్ ॥

శా॥ శ్రీనాథుండు విరించి వాసవుఁడు వి ♦ శ్వే దేవులున్ దస్రులున్
భానుద్వాదశకంబునున్ వసువులున్ ♦ బంకేరుహారాతి నా
నానక్షత్రములున్ మరుత్తులు విమా ♦ నస్థాయులై నిత్యమ
స్యానప్రీతినిఁ బూర్వగోపురమునన్ ♦ యోజింత్రు ధ్యానంబులన్. 520
గీ॥ అమరి రుద్రగణంబులు ♦ జముఁడు మిత్తి, చిత్రగుప్తుఁడు పితరులు ♦ జిత్రభానుఁ
డట్లు దక్షిణగోపుర ♦ మాశ్రయించి, భజన మొనరించుచుందురు ♦ భక్తిమీఱ.
క॥ వరుణుండు సరిత్పతియును, సరిదగ్రణులల్ల జహ్ను ♦ జాపప్రభృతులు శం
కరు నిచ్చలుఁ గొలుచుచు నుందురు పశ్చిమగోపురమునఁ ♦ దోరపునిష్ఠన్.
గీ॥ వాయుదేవుఁడు ధనపతి ♦ భద్రకాళి, చండికయు మున్నుగల్గుగ్ర ♦ శస్త్రమాతృ
కలు నుదగ్ద్వారమందొప్పి ♦ కడిఁదిభక్తిఁ, గొల్తురు మహాబలేశ్వరుఁ ♦ గూర్మి పేర్మి.
క॥ గరుడులు గంధర్వులు కిన్నరులును గుహ్యకులు చార ♦ ణప్రముఖులు కిం
పురుషులు సిద్ధులు విద్యాధరులు మహాబలునిఁ గొల్చె ♦ దరు సతమర్థిన్. 524
క॥ భేతాళులు ప్రేతంబులు, భూతంబులు భీతిజనక ♦ భూరిబలలస
ద్దైతేయులు శేషప్రము, ఖాతతఫణివరులు గొలుతు ♦ రా హరు నెపుడున్. 525
చ॥ కొలిచినవారి కెల్లరకుఁ ♦ గొంగున బంగర మా మహేశ్వరుం
డలఘుత రేప్సితార్థముల ♦ నారసి యైహికపారమార్థికం
బుల నిడుచుండు నందుఁ దప ♦ ముల్ పొనరింతురు పల్వు రమ్మహా
బలశివలింగమున్ గుఱిచి ♦ పల్కుదు రార్యులు మోక్షదాతఁగాన్. 526
గీ॥ మాఘకృష్ణచతుర్దశీ ♦ మహితపర్వ, మున మహాబలపూజన ♦ మున సమస్త
పాపులెల్లను మోక్షంబుఁ ♦ బడయుదురు దిదృక్షునే తెంతు రఖిలది ♦ గ్దేశజనులు.
క॥ స్త్రీలుం బురుషులు వృద్ధులు, బాలురును వితంతువులును ♦ బణ్యస్త్రీలున్
నాలుగు వర్ణంబులవా, ర్జాలఁగ శివరాత్రి కటకు ♦ సాఁగెద రెలమిన్. 528
గీ॥ వచ్చి దేవేశువీక్షించి ♦ వైభవమునఁ, గొలిచికృతకృత్యతన్ గాంతు ♦ రెలమి కలిమి
నొక్క చండాలి శివలోక ♦ మొందె శర్వ, రాత్రిశివపూజ యొనరించి ♦ రాణగదుర.
వ. అనిన సూతునకు మహాత్మా! చండాలియెట్లు శివపూజనొనర్చి శివలోకంబున కేగెనో, అయ్యితిహాసం బానుపూర్విగ నెఱిఁగింపుమని మునులనుటయు సూతుం డిట్లనియె. 530

## —* సోమినీ చరిత్రము *—

క॥ చండాలి పూర్వమం దొక, దండిద్విజన్మాగ్రణికి సు ♦ తయయి పొడమె నా
తండును సోమిని యని మేల్, నిండారఁగఁ బేరుపెట్టి ♦ నేటుఁగఁ బెంచెన్.
గీ॥ యుక్తవయసొందియున్న న ♦ య్యువిద కన్యఁ, దైన వరుదెచ్చితగ వివా ♦ హంబు నెరపి
విభుని యింటికిఁ బంప న ♦ వ్వెలఁది మగనితోడ నిష్టసుఖంబు లొం ♦ దుచు వసించె.

సీ॥ అంతఁ గొన్నిదినంబుల ♦ కాపె పూర్వ,కర్మవశమునఁ జేసి మ♦గండు రుజను
దనరిమృతిఁ జెందెనాపెవై ♦ధవ్యమొందెఁ, బసుచుఁదనమున నెల్లరుఁ♦బాపమనఁగ.
క॥ కొన్నాళ్ళవఱకు సోమిని, యున్న తెఱఁగు గానరాక ♦ యున్నతమతితో
బున్నెపుఁద్రోవనె మెలఁగెను, మిన్నగ బంధుగులుఁ బెఱలు♦ మెచ్చఁగఁదన్నుఁగ్.
వ. అంతఁ గొన్నిదినంబులకు.
క॥ నిగనిగలాడెడు మేనును, నగులే మొగమును బ్రతిక్ష♦ణము పెరుఁగుపసం
దగుగుబ్బదోయి పిఱుఁదును, దగుసోమినిఁగని మదనకుఁ ♦ దలఁకిరి యువకుల్.
వ. అంతనాపెయు.
సీ॥ చక్కఁదనమొప్పనొడలుపొం♦పెక్కులేఁత, ప్రాయమును జెందిమన్మథ♦భల్లములకు
మదినిఁ గాపాడఁజాలక♦ బెదరి సరసఁ, జేరు యువకులతోఁ బొందు♦ చేసె నంత.
క॥ చాటుగఁ గొన్నాళ్ళిటు విట, కూటముతో సురతగోష్ఠిఁ♦గూడుచుఁదమిమై
బోటి చరింపుచునుండఁగఁ, దేటపడియె నందఱకును ♦ దెఱవ తెఱఁగొగిన్. 537
వ. అంత.
చ॥ కులజనులెల్లఁ గూడుకొని ♦ కూడని తెర్వునఁ జేరి యిట్లు ని
ర్మలమగు నన్వయంబునకు ♦ మచ్చ పొసంగఁగఁ జేసి తోసి! పుం
శ్చలి! మదమెక్కి యుంటివిఁక ♦ మాకును నీకును బొత్తుగాదు నీ
వలసిన చోటికేగుము జ♦పంబుననంచు మహాగ్రహంబునన్. 538
ఆ॥ కొప్పుఁబట్టి యీడ్చి♦కొనిపోయి యూరికి, దవ్వుగాఁగ విపిన♦తలముఁ జేర్చి
యంద విడిచివచ్చి♦రా బ్రహ్మకులజులు, పొలఁతి యచట దెసలఁ♦గలియఁజూడ.
చ॥ ధనికుఁడు శూద్రుఁడొక్కరుఁ డు♦దారుఁడు దత్సమయంబునందు న
వ్వనపదమందునుండి తన♦వాసముఁ జేరఁగఁ బోవుచుండి రో
దనమొనరించుచున్న నల♦ తన్విని బ్రాహ్మణమత్తకాశినిన్
గని మరులొంది తారసిలి ♦ కాంతకు నిట్లని పల్కెఁ నింపుగన్. 540
ఉ॥ ఏవ్వరిదాన? వొంటరిగ ♦ నెంతయు ఘోరవనప్రదేశమం
దెవ్వరు నిన్నుఁ దోసిచని ♦ రిట్టులఁ గట్టఁడి పూన్కితోడ వా
రెవ్వరుగాని యేమిపని ♦ యేడుపుఁబోవిడి వేగిరంబు నీ
వివ్వనిఁ బాసి నామనికి ♦ కిప్పుడు రమ్మిఁక నాకు భార్యవై. 541
గీ॥ అనినవినిసోమినియుఁ జేయు♦నదియు లేక, యనుమతిన్ జూపనాతఁడు♦హరుసమొంది
వేగఁ దోడ్కొనిపోయి య♦వ్వెలఁదినాలుఁ, జేసికొని యిష్టసుఖములఁ♦జెందుచుండెఁ.
క॥ ఆసోమిని యా వృషలుని, చే సుతులను సుతలఁ బడసి♦ చెలఁగి పిశితమున్
వాసిగ మెక్కుచుఁ బలుతీ, ర్లాసవములఁ ద్రావుచుండె ♦ నహముల రేలన్.
వ. ఇట్లు గొంతకాలంబు జరిగినమీఁద నొకనాఁడు
చ॥ పనివడి యొక్కయూరికి స్వ♦వల్లభుఁడేగుడు రేయి సోమినీ
వనిత గడున్ యథేచ్ఛముగ ♦ వారుణిఁ బానముచేసి యామిషా

ర్థినియయి వత్సముల్ గోత్తెలు ♦ ధేనువులుండెడు గోష్ఠమొంది తేఁ
గను దలఁదున్మి ఖడ్గమునఁ ♦ గ్రైవునఁ గానక యద్ది కూయిడన్. 545
గీ॥ చంపి నెలవునకున్ గొని ♦ చని యటన్ బ్ర, దీపకాంతికి లేఁగగాఁ ♦ దెలిసి యులిసి
"శివశివా"యని యించుక ♦ సేపు చింత, చేసి యామీఁద వంటచే ♦ సికొని మెసవె.

—* సోమిని అంధచాండాలియై పుట్టుట *—

గీ॥ అంతఁ జిరకాలమునకుఁ ♦ గార్తయగుచు, సోమినిలయించెఁ గాలుఁడ ♦ భ్యామదురిత
ములకుఁదగినట్లునిరయ బా ♦ ధలనుగుడిపి, కడకుఁబుల్కస యోనిలోఁ ♦ బొడమఁజెసె.
గీ॥ అందు జన్మాంధయై నికృ ♦ ష్టాతికుష్ఠ, మూర్తియై బొగ్గు వన్నియఁ ♦ బొలిచె నద్ది
తల్లిగర్భంబులోనున్న ♦ తఱినిఁ దండ్రి, సమసెఁ బుట్టుకతోడనే ♦ సమసెఁదల్లి,
ఆ॥ ఇరుగుపొరుగువార ♦ లింత యెంగిలిగంజి, కూడు వేయ గతికి ♦ కొనుచు బ్రతికి
నంతఁ గుష్ఠరుజ్మ ♦ హార్త నాయంధను, బెండ్లియాడఁడయ్యెఁ ♦ బేర్మి నెవఁడు. 548
ఉ॥ అకటమాడుచుండి యొక ♦ యష్టినిజేకొని మాలవాడలో
జీకుది యెంగిలన్నమున ♦ జీవనమొందుచుఁ జాలగాల మ
ట్లే కడపెన్ వయస్సుడిగె ♦ నెంతయు వార్ధక మేగుదెంచె జీ
కాకును జెందుచున్ గడువ ♦ గన్ విలపించుచునుండె నార్తయై, 549

—* అంధచాండాలి గోకర్ణమున జచ్చి శివలోకమేగుట *—

గీ॥ అంత శివరాత్రి యేతేర ♦ నద్ది యందు, భక్తి గోకర్ణమునకేగు ♦ వారినరసి
వారితోఁ బయనముచేసి ♦ చేరె నటకు, నశనవసనంబులందలి ♦ యాసఁజేసి. 550
సీ॥ కమికెడన్నముఁ బెట్టి ♦ కావఁగా బూనుఁడు, మ్రొక్కులక్షలకివే ♦ పుణ్యులార!
అడుగుటే యాలస్య ♦ మట్లు దీనులమొఱ, లాలించి సాకుఁ ధ ♦ ర్మాత్ములార!
చేతికడ్డము లేక ♦ చెలఁగి దానము చేసి, పేదసాదల నేలు ♦ పెద్దలార!
ఆకలిగొన్న దీ ♦ నాత్ముల మొకములఁ, గానక ప్రోచెడు ♦ గణ్యులార!
ఆ॥ కనులు రెండు లేని ♦ కడిఁది ముసలిదాన, దిక్కులేని చెడ్డ ♦ తెవులుదాన
నన్నువట్టె సురుఁగు ♦ చున్నవి ప్రాణంబు, లన్న మొసఁగి ప్రోవుఁ ♦ డన్నలార!
మ॥ అని యిబ్బంగిగ నద్ది యాత్రికసమూ ♦ హంబున్న చోట్లందు య
ష్టిని నూతంగొని సోలుచున్ బడుచు గిం ♦ చిత్తేని నెందన్నమున్
గనదయ్యెన్ శివరాత్రి నెల్లరును గో ♦ కర్ణేశు నర్చించి ప
స్తునముంటన్ శివరాత్రిఁ బస్తమరె న ♦ చ్చో నాశ్వపాకాంధకున్. 552
వ. అంత.
గీ॥ అనఘుఁడొక్కఁడు చండాలి ♦ యార్తరవము, వినితనదుహస్తమున నున్న ♦ బిల్వదళము
దానిచే వేయ భోజ్యంబు ♦ గాని దగుట, నది విసరివేయ శివలింగ ♦ మందుఁ బడియె.
క॥ దానన్ శివకైంకర్యము, నూనము శివరాత్రిపూజ ♦ దానికమరె ని
ట్లానిశి గడచుడు నది య, చ్చో నశనముదొరుకదనుచు ♦ శోకముతోడన్.

వ. తిట్టుకొనుచుం దెట్టగిలపడుచు నేడ్చుచు

క॥ తనయూరికిఁ జనలో దె, ర్వున నడుగడుగునకుఁ బడుచు ♦ రొప్పుచు నొకచో
టనుబడి యసువుల విడిచెను, పినాకి గొని తేర దాని ♦ భృత్యులఁ బనిచెన్.

వ. వారును జంద్రభాస్వరంబగు విమానంబుఁ దెచ్చి యచ్చండాలికి దివ్యరూపంబును దివ్యవస్త్రాభరణగంధమాల్యాదులొసంగి సత్వరంబు శివలోకంబుఁ జేర్చిరి. పూర్వభవంబున వితంతుబంధకియై కులంబుఁ బాసి జఘన్యునిఁ జేపట్టి మధుమాంసాహారయై గోహత్యనొనర్చినపుడు ప్రమాదంబున "శివ శివా" యని రెండు తడవలుచ్చరించుటఁ జేసి యాసుకృతంబున నీజన్మంబున గోకర్ణంబుఁ జేరె నిందు శివరాత్రియం దుపవాసజాగరణంబులును శివపూజయు యాదృచ్ఛికంబుగ లభించుటచే శివలోకంబుఁ జేరి తత్పుణ్యఫలం బిప్పటివఱ కనుభవించుచుండె నిదియెల్ల నజ్ఞానకృతంబై యట్లైనంగె నిఁక జ్ఞానంబున మహాబలేశ్వరార్చనం బొనర్చినవారి కెట్టి సిరివట్టునో యారయుండిట్లు మహాబలేశ్వరలింగ మాహాత్మ్యంబు దెల్పితి నింకను నద్భుతంబగు తద్విభూతి నే వక్కాణించెదనని సూతుం డిట్లనియె.

## — * మిత్రసహోపాఖ్యానము * —

క॥ శ్రీకాంతావాసంబగు, సాకేతపురంబు మిత్ర ♦ సహుండను నృపుఁ డి
క్ష్వాకుకులోద్భవుఁ డేలు న, లోకపరాక్రముఁడు శూర ♦ లోకస్తుతుఁడై. 557

క॥ నలునకు దమయంతి యటుల్, వెలసెను మదయంతి నృపతి ♦ వీరుని సతియై
లలితగుణరత్ననిధియై, విలసితధర్మిష్ఠయై వి ♦ వేకవతియునై. 558

గీ॥ ఆన్నృపుండొక్కపరి మృగ♦యార్థమటవిఁ, జేరి విహరించుచుండి దు♦ర్నీలుసాధు
దుఃఖకరు నొక్కరక్కసుఁ♦దొడరి చంపె, నంత నవ్వానిసోదరుం♦డలుకఁ బెంచి.

క॥ మోసంబును బన్ని యనా, యాసంబున నరికి దుఃఖ ♦ మర్పించుట యే
వాసి యని యెఱిఁగి వినతుం, డై సేవకు డేడు సూచి ♦ యాదర మొప్పన్.

గీ తనకు వాని మహానసా♦ధ్యక్షునిగ నొ, నర్చి యవ్వానిఁ గొన్నిది♦నంబు లుండి
తిరిగి తనరాజధాని కే♦తెంచుటయును, బైతృకము దారసించినఁ♦బరమభక్తి.

చ॥ అనఘుని నవ్వసిష్ఠముని ♦ నన్వయదేశికునిన్ నిమంత్రితున్
బొనరిచి శ్రాద్ధమున్ సలుపఁ♦బూన నరామిష మొక్కశాకమం
దనువుగఁగూర్చి వండి మను♦జాదుఁడు వడ్డనచేసి తాఁ దొలం
గెను ముని దాని చొప్పరసి ♦ కిన్కసహింపక తేనికిట్లనెన్. 562

క॥ మనుజాశనుబలె నీవీ, మనుజక్రవ్యంబుఁ దెచ్చి ♦ మాకర్పింపన్
జనునే నీవిటు వేగమె, మనుజాశనుఁడ వగుమింక. ♦ మదము దిగంగన్. 563

చ॥ అని శపియించి యద్ది మను♦జాధిపకృత్యముగాక లాఁతియా
దనుజునికృత్యమం చెఱిఁగి ♦ దారుణశాపము ద్వాదశాబ్దముల్



దనుక సహింపఁజెల్లు నవ♦లన్ మరలన్ నరపాలమూర్తి వౌ
దనె నృపుఁడెల్ల నారసి ♦ జ♦లాంజలిఁబూని గురుఁ శపింపఁగా. 564

చ॥ నిలిచిననంతఁ దదప్రియమణి ♦ నీరజనేత్ర కడుఁ భయంబుతో
వలదు మహాత్మ! నీగురుని ♦ వంచనసేయఁగ నోర్వమంచు నం
ఘ్రులఁబడి వేడ నామెనుడిఁ ♦ గూర్చినప్రేముడి నల్కఁబాసి త
జ్జలముల నాత్మపాదములఁ ♦ జల్లికొనెఁ గడు ధీరచిత్తుఁడై. 565

—* మిత్రసహుఁడు కల్మాషపాదుం డగుట *—

క॥ పదములు కల్మష మొందిన, సదయుఁడు గల్మాషపాద♦సంజ్ఞన్ బడసెఁ
బదపడి గురుశాపంబున, నదరిపడుచు ఘోరదనుజుఁ♦డై పురిఁ బాసెఁ. 566

చ॥ అడవికిఁ జేరఁబోయి గవ♦యంబుల నేన్గుల లొట్టిపిట్టలఁ
గడిఁదివృకంబులన్ బులుల♦ ఖడ్గమృగంబులఁ జెండి మెక్కుచుఁ
గడువడి మ్రాకులెక్కుచు వి♦కారముగాఁ బరుగెత్తుచుఁ వడిన్
మిడిమిడిచూపులఁ గనుచు ♦ మిత్తివలెన్ జరియించుచుండఁగా.

వ. ఒక్కనాఁడు.

క॥ ఒకచో నెలప్రాయపుఁదమి, మకరాంకక్రీడఁబెనఁగు♦ మౌనికులకుమా
రకమిథునముఁ బొడఁగని యం, తకసన్నిభుఁ డాపలాశ♦నప్రముఖుఁడొగిఁ.

గీ॥ మృగకిశోరంబుఁ బులివట్టి♦ మెసవుపోల్కి, సతికవుంగిట నొదిగిన♦సన్మునిసుతు
నొడిసి తినఁబూన నసురకు♦నడలిమౌని, సతియిటులు ప్రార్థననొనర్చె♦సత్వరముగ.

చ॥ వలదు మహాత్మ! నావిభుని ♦ బాల్యవయస్కుని సాధువృత్తునిన్
బాలియఁగఁజేయఁబోకు తినఁ♦బూనునెడఁ ననుఁ జంపి మెక్కు మం
జలి యొనరించెదఁ విడుము ♦ చక్కఁగ నావిభు నన్న నాతఁడుఁ
దలఁకక చంపి మెక్కెఁ చనెఁ ♦ దన్వి గడుఁ విలపింప నార్తయై. 570

ఆ॥ అంత మౌనికాంత♦యప్పలాదునిఁజూచి, నీవు నారిఁజేరి ♦ భావజన్మ
కేళిఁదేలు నెడలఁ♦గాలంబుఁజెందుదు, వనుచు శాపమిచ్చి ♦ యతిరయమున.

గీ॥ మగనియస్థుల నెత్తి య♦మ్మగువ చితినిఁ, గూర్చియగ్నిఁబ్రవేశించెఁ♦గుందుమాని
అంత నసురకు శాపాంత♦మగుడు మగుడ, నాత్మరూపంబు ప్రాపింప♦నరిగెఁ బురికి.

ఉ॥ అందు సమస్తనాగరమ♦హాజను లా నృపచంద్రుఁజూచి యా
నందముఁజెంది యుత్సవ మొ♦నర్చిరి రాజవరుండు బేర్మిమై
నందఱి గారవించె నిశి♦యందు రతిప్రియుఁడై నిజాంగనా
మందిరమొంద నాపె ముని♦మానినిశాపముఁ దెల్పి కుందుచుఁ.

—* మదయంతి భర్తకు మునిసతీశాపంబుఁ దెల్పుట *—

క॥ తా వైధవ్యభయంబున, భూవిభు వారించె నతఁడు ♦ పోగిలి కడువగన్
దా వైరాగ్యముఁజెంది మ, హావిపినస్థలిసిఁజేరి ♦ యందే యుండెఁ. 574

క॥ మునిసుతుఁ జంపిన యందలి, ఘనదురితబ్రహ్మహత్య ♦ గడలికొని నృపున్
జెనకొని వేధింపఁగఁజొ, చ్చిన నృపవరుఁ డెంతయేని ♦ జింతిలె మదిలోన్.

మ॥ పలుతీర్థంబులఁ గ్రుంకె నెంతయును దీ♦వ్యన్మంత్రయోగంబులన్
సలిపెన్ బెక్కువ్రతంబులన్ మఖములన్ ♦ సమ్యగ్విధానంబు శో
భిలఁగూర్చెన్ మునిహత్య యించుకయునున్ ♦ బీర్వోక బాధింపఁగాఁ
దలఁకున్ జెంది యయోధ్యఁ జేరె మరలన్ ♦ ధాత్రీశ్వరుం డార్తుఁడై.

క॥ అందును బాహ్యోద్యానము, నందు వసతిఁజేసియుండ ♦ నచ్చోటికి మౌ
నీందుఁడు గౌతముఁ డతులా, నందుఁడు చనుదెంచె మనుజ♦నాథుఁడు పేర్మిన్.

క॥ కని యర్ఘ్యాది సపర్యను, బొనరిచి నతిచేసియున్న ♦ భూవరుఁగని య
మ్ముని కుశల మడుగుటయు వేఁ, డిని నరపతి నిశ్వసించి ♦ డిల్లవడి కడున్.

సీ॥ తనయవస్థను మౌని కం♦తయును దెలిపి, నిష్కృతినిగోరి వేడ మా♦నికులచంద్రుఁ
డరసి కరుణాంతరంగుఁడై♦యనియెనిట్లు, బ్రహ్మహత్యాభిభూతుఁడౌ♦పార్థివునకు.

శా॥ గోకర్ణంబున కేగు వేగ మచటన్ ♦ గోరాజవాహున్ హరున్
శ్రీకల్యాణకరున్ మహాబలశివున్ సేవింపు మీ బ్రహ్మహ
త్యాకాలుష్యము నాశమొందు సుఖముల్ ♦ దైవాఱు సర్వేశ్వరుం
డేకాకారముతో నటన్ దనరు భూ♦మీశానచూడామణీ! 580

క॥ అన విని సంతుష్టుండై, మునిసెలవున్ గొని ప్రయాణ♦ము సలిపి యటకున్
జని కొల్చి మహాబలుఁ ద, ద్ఘనకృప ద్విజహత్యఁ బాసి ♦ కనియెన్ ముదమున్.

వ. అంత నచ్చటఁ గొంతకాలంబు వసించి మరల సాకేతపురంబుఁ జేరి వశిష్ఠప్రసాదంబున మదయంతియందు వంశకరుండగు నొక్కపుత్రున్ బడసి రాజ్యంబుఁ దద్వశంబుఁ జేసి శివానుగ్రహంబున మోక్షంబున్ జెందె నిట్లు మహాబలేశ్వరలింగమాహాత్మ్యంబుఁ జెప్పితి నింక నేమి వినఁగోరుదు రన మునులు మహాత్మా! శివరాత్రివ్రతవిధానంబును దద్వ్రతోపాసకభక్తచరిత్రంబు నింక నొంటు సెలవీయుమన సూతుం డలరి యిట్లనియె. 581

—* శివవ్రతములు *—

క॥ మును విష్ణునకు మహేశ్వరుఁ, డనురాగముతోడ నీ వ్ర♦తానుక్రమ మం
తను జెప్పె హరియు నారద, మునికి నుడువ నతఁడు లోక♦మున కెఱిఁగించెన్.

వ. నేనును మద్దేశికుని యుపదేశంబు నొందినయట్లు మీకుఁ జెప్పెద వినుఁడు

చ॥ వినుఁడు శివార్చనం బఖిల ♦ వేళలయందును సల్పఁజెల్లునై
నను రజనీముఖంబుల నొ♦నర్చుట యెంతయు శ్రైష్ఠ్యభాజకం
బనియును సోమవారమున ♦ నష్టమి నాశివరాత్రియందు నిం
కను బరమోత్తమం బనియు ♦ గాటముగా వచియింతు సన్మునుల్! 584

క॥ పది శైవవ్రతములు సె, ప్పెదు రుత్తమమునులు భుక్తి ♦ ముక్తిప్రదముల్
ముదమున నవ్వాని నొన, ర్పఁదగుఁ హితకాములైన ♦ వారలు పుడమిన్.

క॥ అష్టమిరాతిరి భోజన, మిష్టంబుగఁ జేయవలయు ♦ నెల్లరునున్ గా
లాష్టమి మానఁగవలె వి, స్పష్టముగా భోజనమును ♦ బావనమూర్తుల్ !

క॥ సితపక్షైకాదశి సువి, హితముగ నన్నంబును భుజి♦యింపఁ దగదికన్
సితపక్షాన్యైకాదశి, హితవుగఁ గుడుచుఁడు భజించి ♦ యీశ్వరు నిశలన్. 587

గీ॥ రహిని శుద్ధత్రయోదశీ♦రాత్రి శివునిఁ; గొలిచి కుడువఁగఁదగు ధర్మ♦గోప్తలార!
అసితపక్షంబునందైన ♦ నభవభక్త, వరులు మానఁగవలె జగ్ధి ♦ భరమనార.

గీ॥ సోమవారంబునందెల్ల ♦ యామినులనె, శివునిఁబూజించి భుజియింపఁ♦జెల్లు నీ వ్ర
తంబులందెందు శైవులఁ♦దనదుశక్తి, కొలది సాపడఁ జేయఁగఁ♦గూడు నెపుడు.

వ. ఐహిక పారమార్థిక శ్రేయంబుఁ గోరువార లీవ్రతంబుల నాచరింపవలయు నట్లు వ్రతంబు లొనర్పనివారలు దస్కరులై జనియింతురింకను ముక్తికి నాలుగు తెరువు లుపదేశింపఁబడియె నవ్వి వినుండు.

క॥ శివపూజ రుద్రజపమును, శివతిథి నుపవాసమును బ్రి♦సిద్ధంబగు నా
యవిముక్తనగరి మరణము, నివి నాలుగు మోక్షధనము ♦ నిచ్చుఁ బ్రజకిలన్.

వ. ఇందు *రుద్రజపంబునుగూర్చి యవధరింపుఁడు. రుద్రజపంబనునది రుద్రాధ్యాయ జపాభిషేక హోమంబులను త్రయంబున కుపలక్షణంబు. అద్దాన రుద్రాధ్యాయ జపంబును రుద్రాధ్యాయాభిషేకంబును రుద్రాధ్యాయహోమంబును నను నిత్తెఱంగున రుద్రాధ్యాయోపాస్తివ్రతంబు త్రైవిధ్యంబుగ నెసంగు. అందుఁబ్రత్యేకం బీవక్ష్యమాణప్రకారంబుగ నైదువిధంబులై యుత్తరోత్తరాధికంబులై యనంత ఫలంబొసంగు నవ్వియారయుఁడు. సకృద్రుద్రాధ్యాయ చమకాధ్యాయంబులఁ జదువుచు నభిషేకంబొనర్చిన నది యావర్తనాభిషేకంబని చెప్పఁబడు నిది గంగాస్నానపుణ్యఫలప్రదంబు మఱియు:

---

* టిప్పణి-రుద్రజపము. రుద్రాధ్యాయజపము రుద్రాధ్యాయ భట్టభాస్కర భాష్యేమేరుతంత్రోక్తం
శ్లో॥ రాదీం ధారాంతతఃకుర్యా । త్ప్రోచ్యతే తద్విధానకం । నమస్తే రుద్రాగ్న్నావిష్ణూ । ఇత్యా
ధ్యాయద్వయేనచ । ఆవర్తనమితిప్రోక్తం । గంగాస్నానఫలప్రదం । ఆవర్తనాభిషేకంతు ।
యః కుర్యాత్ ప్రత్యహం నరః । తస్యైవ దినజం పాపం । దేహజం నాశమాప్నుయాత్ ।
సంధ్యావందనతః క్షీణం । తచ్చేత్ ప్రాగ్జన్మ జంభవేత్ । ఏకః పాఠో నమస్తేస్య । హ్యనువాకః
పరస్యచ । ఏవం భవాయ నమస్తేస్య । అగ్నావిష్ణూత దైకకం । ఇయం రుద్రీసమాఖ్యాతా ।
రౌద్రపాప నికృంతనీ । అనయా ప్రత్యహం యస్తు కుర్యాల్లింగాభిషేచనం । జన్మజన్మకృతం
పాపం । వర్షమధ్యే ప్రణశ్యతి ॥ రుద్రీభిరేకా దశభి । ర్లఘురుద్రః ప్రకీర్తితః । అనేనసిక్తం
యైర్లింగం । తేనపశ్యంతి భాస్కరిం ॥ ఏకాదశభిరేతైస్తు । మహారుద్రః ప్రకీర్తితః । నిర్ధనో
ధనమాప్నోతి । మహాపాతకనాశనః । అనేన విహితోహోమ । స్సోమయాగ ఫలప్రదః ॥
ఏకాదశమహారుద్రై । రతిరుద్రః ప్రకీర్తితః । అతిపాప హరోయస్మాత్ । దృష్టాన్యా నైవ
నిష్కృతిః ॥

క॥ ఆవర్తనాభిషేకం, బేవాఁడేఁ బ్రీత్యహంబు ♦ నెలమి సలుపునో
యావాఁడు వాయుదురితము, లేవియునున్ గాని మఱియు ♦ నెట్టివియేనిన్.

వ. ఇఁక రుద్రాధ్యాయంబొకమాఱును జమకానువాకంబొకటియుఁ జదువుచు నభిషేకించి "భవశర్వరుద్ర పశుపత్యుగ్ర మహద్భీమేశాన శబ్దంబుల చతుర్థ్యేకవచనాంతములతో నమశ్శబ్దాంతములతోడను "భవస్య దేవస్య పత్న్యై నమః" ఇత్యాది నామాష్టకంబులతోడను బూజించి సమాప్తియందిట్లే ప్రత్యేకంబు నామాష్టకంబుతోడఁ దర్పణంబులొసంగి యివ్విధంబుగఁ బదుకొండుమాఱులు రుద్రాధ్యాయంబును జమకానువాకంబు లొక్కొక్కటియుఁ జదువుచు నభిషేకించి పూర్వోక్తప్రకారంబుగఁ బూజనంబొనర్చిన నది రుద్రియనంబడును. ఈరుద్రి రౌద్రములైన మహాపాపంబులఁగూడ నిర్మూలించును. దీనిచే నెవఁడు శివలింగాభిషేకంబొనర్చునో యట్టివాని కెన్నిజన్మంబులపాపంబు లేని పరిహృతంబులగును. ఇఁక నీ రుద్రిసమర్చన లేకాదశంబులైన అనఁగా నూటయిఱువదియొకమాఱు రుద్రాధ్యాయంబును బదునొకండుతడవలు చమకంబునుజదువుచు నభిషేకించి పూజించిన నది లఘురుద్రమనంబడును. ఈ లఘురుద్రంబున శివుని బూజించినవారలు యమునిఁజూడరు. ఇఁక నీలఘురుద్రంబులు పదునొకండైన నది మహారుద్రంబగును. ఆపూజనము సోమయాగఫలప్రదంబు. అట్టి మహారుద్రంబులు పదునొకండైన నది యతిరుద్రనామక మహాసవనంబగును. అట్టిది సర్వపాపహరంబు సర్వాభ్యర్థితం బద్దానితోఁ దుల్యంబైనదిగాని యధికంబైనదిగాని వేఱొండు పూజనవ్రతంబు లేదిందు సందియంబులేదు. ఇఁక నిట్లే రుద్రజపహోమంబులుగూడ నెఱుంగునది.

గీ॥ అష్టమియు సోమవారంబు ♦ నసితపక్ష, మందలి చతుర్దశియు శివ ♦ హర్షకరము
లందు శివరాత్రి యున్నతం ♦ బైయలరుట, నావ్రతంబెల్లరకు ముఖ్య ♦ మై తనర్చు.

## —* శ్రీ శివరాత్రివ్రతవిధానము *—

వ. అందును.

గీ॥ మాఘకృష్ణచతుర్దశి ♦ మాన్యతనుద, నరు మహాశివరాత్రి సం ♦ జ్ఞను ధరించి
అర్ధరాత్రినివ్యాపించు ♦ నదిమెగ్రాహ్య,మితరమగ్రాహ్యమనియెల్ల ♦ రెఱుఁగవలయు.

గీ॥ ఆ మహాశివరాత్రియం ♦ దఖిలజనులు, శివసమర్చావ్రతంబును ♦ జేయవలయు
నద్దిక్రమమొప్పఁజెప్పెద ♦ నవధరింపుఁ, డీరు తత్పరమతులై ము ♦ నీంద్రులార!

చ॥ తెలతెలవాఱ లేచి కడుఁ ♦ దేఁకువతోడుత మజ్జనాదులన్
సలిపి శివాలయంబునకుఁ ♦ జక్కఁగ నేగి శివున్ బరాత్పరున్
జలనములేనియట్టి మది ♦ చందము పొందగఁ గొల్చి యంత జో
తల నిడి విన్నవం బిటులు ♦ దా నొనరింపవలెన్ మునీశ్వరుల్ ! 598

గీ॥ నీలకంఠ ! మహాదేవ ! ♦ నీదువ్రతముఁ, జేయఁబూనితి నీక దయ♦చేసి విఘ్న
భయముఁబోకార్చి కామాది♦వైరిజయము, సేకురఁగఁగొనసాఁగింపు♦శ్రీమహేశ.
ఆ॥ ఇట్లువిన్నవించి♦యిరవున కేతెంచి, యర్చనాపదార్థ ♦ మంత గుడికి
సాయమందుఁ జేర్చి♦స్నానమచ్చోటను, మరలఁ జేసి యంత ♦ మడినిఁగట్టి.
వ. విభూతి రుద్రాక్షలధరించి సాయంసంధ్యావిధుల నిర్వర్తించి.
క॥ తత్తన్మంత్రంబులతోఁ, దత్తద్వస్తువుల నొసఁగఁ♦దగు శివునకు నీ
షత్తేని నమంత్రముగా, నెత్తెఱఁగున నొసఁగఁగూడ ♦ దెఱుఁగుఁడు మదిలోన్.
క॥ శివునకు దక్షిణతలమున, వివిధార్చాద్రవ్యములను ♦ వెలయించి సువా
ద్యవిశేషములును నృత్యము, లవిహతముగఁ దనరుచుండ ♦ నర్చింపవలెన్.
క॥ దినదినముఁ బార్థివార్చన, మును జేసెడు నెడల సాయ♦మున సంధ్యాదుల్
పొనరిచి పార్థివలింగము, నొనరిచి స్థాపించి పూజ ♦ నొనరింపవలెన్. 603
క॥ స్తుతినొనరించి హరుని న, ప్రతిమంబుగ నలరఁ జేయ ♦ వలయును బిదపన్
వ్రతమాహాత్మ్యముఁ దా భ, క్త్యతిశయమునఁ జదువవలయు ♦ నాలింపవలెన్.
గీ॥ నాల్గుయామంబులందును♦నాల్గులింగ,ములను రచియించియాహూతి♦మొదలుగావి
సర్గమంతకుఁగొలిచియు♦త్సవములొప్ప, జాగరము సేయవలయును♦త్సాహమునను
క॥ మఱునాఁడు వేగ స్నానము, జరిపి యభవలింగము నొగి ♦ సలిపికొలిచి సం
బరమొప్ప దోయిలొగ్గుచు,శిరసున నతిచేసి యాచ్న ♦ సేయవలె నిటుల్.
గీ॥ ఓమహాదేవ ! నీయాజ్ఞ♦నొందివ్రతము, చేసియిప్పుడు విరతిని ♦ జేయుచుంటి
నాయథాశక్తి వెలయ నొ♦నర్పఁబడిన, యీవ్రతముచేనలరి వెల♦యింపుకృపను.
గీ॥ ఇట్టులని కుసుమాంజలి ♦ నిచ్చి శివున, కెఱఁగి విధితోడ దానంబు♦లిచ్చివ్రతము
విడిచి శివభక్తులైనట్టి♦విప్రులకు యతులకు నన్నంబులిడి తిన♦వలయుఁదాను.
సీ॥ ప్రథమయామమునందుఁ ♦ బార్థివలింగంబు, నిర్మించి స్థాపించి ♦ నిష్ఠమెఱయఁ
బంచమంత్రంబులఁ ♦ బంచవస్తువుల న, ర్పణఁజేసి జలధార ♦ వదలవలయు
నష్టోత్తరశతంబు ♦ నభవమంత్రంబు జ,పించి లింగంబుపైఁ ♦ బ్రీతిపూర్వ
కముగ ధారాపూర్వ♦కముగ నీరంబును, విడువఁగావలయును ♦ వేత్తలార !
గీ॥ పునుగు మెదపిన చందనం♦బుఁగమలములు, నక్షతములైన బియ్యంబు ♦ నల్లనల్ల
నువులు గన్నేరుఁబూవులు ♦ శివున కిష్ట,నామములచేత నర్చ నొ♦నర్పవలయు.
వ. భవశర్వరుద్రపశుపత్యుగ్రమహద్భీమేశాననామంబులను.శ్రీకారపూర్వంబులుగాఁ
జతుర్థ్యంతంబులుగా నమఃపదాంతముగా నుచ్చరించి శివునిఁ బూజించవలెను. 610
సీ॥ ధూపదీపము లిచ్చి ♦ తొరంపుఁబక్వాన్న, నైవేద్యములను నొ♦నర్పవలయు
బిల్వఫలార్ఘ్యంబుఁ ♦ బేర్మిమై నొసఁగి తాం, బూలంబునర్పించి♦మ్రొక్కవలయు
ధ్యానమాచార్యమం♦త్రజపంబును గడు ని,శ్చలమైన మనసుతో♦సలుపవలయు
నటుగానియెడలఁ బం♦చాక్షరంబులతోడ, శివుని సంతోషింపఁ ♦ జేయవలయు

గీ॥ ధేనుముద్రను జూపించి ♦ తీర్థధారఁ, దర్పణముచేసి యంతక ♦ దమనభక్తు
లైన సేవకుబాపల ♦ కన్న మొసఁగఁ, జిత్తమందు సంకల్పముఁ ♦ జేయవలయు.

క॥ పూజాఫలంబు శివునకు, నోజమెయిన్ ధారవోసి ♦ యుత్సుకమతియై
యాజాము నుత్సవంబుల, తో జానుగఁ గడపవలయుఁ ♦ దోరంపుమతిన్.

ఆ॥ ఇఁక ద్వితీయయామ♦మే తేర సంకల్ప, మును బొనర్పవలయు ♦ ముందుగానె
నాల్గుజాలనర్చ♦నముల కేక సంకల్ప, మును రచించి యర్చఁ♦బూనవలయు.

క॥ పూర్వమువలె ద్రవ్యంబుల, శర్వున కర్పింప వలెను ♦ జలధారలతోఁ
బూర్వమునకన్న ద్విగుణము, సర్వేశ్వరమంత్రజపము ♦ సల్పఁగవలయున్.

క॥ తిలలును యవలును బద్మం, బులు బిల్వదళంబు లొసఁగి ♦ పురహరుఁ గొలువన్
వలెఁ బాయసనైవేద్యం, బలరిచి మాదీఫలంబు ♦ నర్ఘ్య మిడవలెన్. 615

వ. ద్విగుణముగా బ్రాహ్మణభోజనమును సంకల్పించి పూజాఫలంబు శివునకర్పించి యుత్సవంబుల ద్వితీయయామంబు గడపవలయు నంత తృతీయయామంబునందు యథాపూర్వంబుగ నర్పించి. 616

గీ॥ గోధుమలుఁ బుష్పములు నర్క ♦ కుసుమములును
ధూపదీపంబు లొసఁగి బం ♦ ధురసుశాక
మోదనంబును నైవేద్య ♦ మొసఁగి దాడి
మఫలమర్ఘ్యమునిడి ప్రణా ♦ మంబు సలిపి. 617

వ. పూర్వజపంబుకన్న ద్విగుణముగా మంత్రజపంబునొనర్చి ద్విగుణబ్రాహ్మణ భోజనమును సంకల్పించి యామాంత ముత్సవములతోఁ గడపవలయు నిఁక నాల్గవయామంబందుఁ బూర్వంబువలెఁ బూజించి. 618

చ॥ మినుములుఁ గొఱ్ఱలున్ బెసలు ♦ మేలగు తక్కిన సప్తధాన్యముల్.
గొనబగు శంఖపుష్పములుఁ ♦ గోమలబిల్వదళంబు లర్పణం
బొనరిచి నేతిగారెలను ♦ నొప్పగుతియ్యనిభక్ష్యముల్ నివే
దనమొనరించి యంత వివి♦ధంపు ఫలంబుల నర్ఘ్యమీఁదగున్. 619

క॥ లేనియెడల మోచాఫల, మేనియునున్ దెచ్చి యర్ఘ్య ♦ మీఁదగునిఁక మం
త్రానుష్ఠానము ద్విగుణము, గా నెఱవేర్పవలెఁ దొంటి♦కన్న మునీంద్రుల్ !

వ. అట్లే ద్విగుణబ్రాహ్మణాభ్యవహారంబును సంకల్పించి నృత్యగీతవాద్యంబులతో యామంబుఁ గడపవలయును. 621

సీ॥ ప్రత్యూషమైన నా♦ప్లావంబు నొనరించి, శివునిఁ గ్రమముగఁబూ♦జింపవలయు
నానావిధములగు ♦ దానంబులను నర్హ, విప్రులనెంచి య♦ర్పింపవలయు
యామసంఖ్యనెఱింగి♦యతుల కగ్రజులకు, సంతర్పణంబులు ♦ సలుపవలయు
వేదబుక్పఠనంబు ♦ వెలయఁబుష్పాంజలి, నుడురాజమౌళికి ♦ నొసఁగవలయు

ఆ॥ ఛత్రచామరవ్యజన ద♦ర్పణనుసేవ, సల్పి ఘంటనూపి ♦ శంఖమాది
యంత వ్రతఫలంబు ♦ నా శివున కొసంగి, ప్రార్థనంబుసేయ ♦ వలయునిట్లు. 622

గీ॥ ఓ మహాదేవ! నీసేవ ♦ నొసఁగుమా కు, లంబులందెల్ల నిన్నుఁద ♦ లంపనట్టి
కులమునం దెప్డు జన్మంబు ♦ వలదు నీదు, వాఁడ నీయందు నిలిపితిఁ ♦ బ్రాణములను.
క॥ కరుణానిధి! నీయందే, మరగించితి నెప్పుడు నాదు ♦ మనము నటులు నీ
వరసి తగినట్లుగా నే, ర్పఱుపుము జోతలఁ బొనర్తు ♦ బాలేందుధరా! 624
క॥ ఈ యుపవాసవ్రతమున, నేయున్నతఫలము దాని ♦ నీవే కొని య
త్యాయత మోదమునను సుఖ, దాయకుఁడవు గమ్ము నాకు ♦ దాక్షిణ్యనిధీ!
వ. ఇట్లు ప్రార్థించి తిలకాశీస్సుల బ్రాహ్మణులచే నొంది శివుని విసర్జింపవలె నెవ్వనిచే నిట్లు వ్రతంబు సేయఁబడునో యవ్వానికి శివుండు దవ్వుగ నుండఁడు. వాని పుణ్యంబు నెవ్వరును జెప్పలే రవ్వానికి లభింపని శ్రేయంబు లేదు. మోక్ష బీజంబు వాని యఱచేతికి లభించినది. వేయియేల? సర్వవిధభుక్తిముక్తులకును శివుం డవ్వాని కొసంగఁగలఁడు. విష్ణువు మున్నగు వేల్పులెల్ల రావ్రతంబుఁ బ్రీతి మెయి నాచరించిరి. నారదుం డనేకులచే నివ్వడమియం దాచరింపఁజేసె నిఁక నెద్దాని యాచరణంబునఁగాని వ్రతంబు సంపూర్ణము గానేరదో యట్టి యుద్యాపనవిధంబుఁ జెప్పెద వినుండు. 626
సీ॥ పదునాలుగేఁడులు ♦ పరఁగ నీశివరాత్రి, వ్రతముఁ బూన్కి మెయి స ♦ ల్పంగవలయు
నొగి మాఘకృష్ణత్రి ♦ యోదశి నేకభు, క్తముఁ జతుర్దశిఁ బస్తుఁ ♦ గాంచవలయు
శివరాత్రిదినమున ♦ శివునిగుడికిఁ బోయి, స్థిరమతి శివునిఁ బూ ♦ జింపవలయు
పిదప స్వగృహములఁ ♦ బేర్మి గౌరీతిల, కమను మండలముఁ జ ♦ క్కఁగ నమర్చ
గీ॥ వలయుఁ దన్మధ్య లింగతో ♦ భద్రమనెడు. మండలంబు రచించి త ♦ న్మండలమునఁ
బదునొకండు కలశములు ♦ వస్త్రఫలసు, వర్ణసహితంబులను నుంచ ♦ వలయు వినుఁడు
వ. ఆ పదునొకండు కలశంబులలో.
గీ॥ కనకకలశంబు మధ్య నొ ♦ క్కండ మర్చి; పలపరిమితంబు గా కర్ధ ♦ పలపరిమిత
మైనబంగరుతోఁ దుహి ♦ నాద్రిజాశి, వప్రతిమఁ గూర్చియందుఁ జే ♦ ర్పఁగవలయును.
వ. ఆచార్య ఋత్విగ్వరణంబు చేసి వారల సెలవుతో శివపూజనంబు నాల్గుజాము లొనర్చి జాగరణము చేయవలయును. శక్త్యనుసారము ప్రాజాపత్యేష్టినిఁ బొనర్పవలయు ననంతరము బ్రాహ్మణభోజనము చేయించి భక్తితో దానంబు లీయవలయును. ఆచార్యఋత్విగ్దంపతులకు వస్త్రాలంకారభూషణంబు లొసంగవలయు. మఱియు నాచార్యున కుపస్కరములతో సవత్సయగు కపిలధేనువును శివప్రీతిగ నొసంగి బంగారుకలశముతోఁ గూడిన శివప్రతిమను సమర్పించవలయును. అటుమీఁద దోసిలొగ్గి నమ్రుండై ప్రేమతో గద్గదాక్షరము లొప్ప నిట్లు మహేశ్వరునిఁ బ్రార్థించవలయును. 629
గీ॥ దేవదేవ మహాదేవ! ♦ దేవనాథ!, భక్తవత్సల! యీనీదు! ♦ వ్రతము చేతఁ
గరుణఁ బఱుపుము నాయెడ ♦ గాఢభక్తి, నీదు వ్రత మొనరించితి ♦ నిగమవంద్య!

క॥ తెలిసియు తెలియకయో యె, ట్టులొ వ్రతముఁబొనర్చితిని గ♦ఙన్ గృపనాపైఁ
దలఁచి మహాత్మా! వ్రతము! స, ఫలమున్ బొనరింపు రజత♦పర్వతనిలయా! 631

సీ॥ ఇట్లు పరమాత్ముఁడైన మ♦హేశ్వరునకుఁ, బ్రార్థనఁ బొనర్చియంతఁ బు♦ష్పాంజలినిడి
సాఁగిలంబడి జోతను♦సల్పవలయు, నిదియె యుద్యాపనవిధి ము♦నీంద్రులార!

వ. ఇఁకను జ్ఞానంబునఁగాక యదృచ్ఛచే శివరాత్రివ్రతంబు నొక్కించుకసల్పి కృతా
ర్థుండైన వ్యాధుని చరిత్రంబుఁ జెప్పెద నాలకింపుఁడని యిట్లనియె. 633

—* వ్యాధేశ్వరలింగము—వ్యాధచరిత్రము *—

క॥ కలఁ డర్బుదాచలాంతిక, తలవని నొకభిల్లుఁ డధిక♦దర్పోద్ధతుఁ డు
జ్జ్వలబలుఁడు గురుద్రోహుఁడని, యలరెడువాఁ డఖిలజంతు♦హాననపరుఁడిలన్.

సీ॥ తల్లిదండ్రులు పెండ్లము♦పిల్లజెల్ల, లొప్పవాఁ డెట్టి యఘముల♦కొప్పవాఁడు
దొంగతనమందు మేటియై♦ద్రోవలందు, బాటసారులఁగొట్టిద్ర♦వ్యములఁగొనును.

గీ॥ క్రూరుఁడై బాల్యముననుండి కొంకులేక, దోసములె చేయుసుకృతంబు♦ద్రోవఁజనఁడు
గడచెఁ జిరకాలమిట్టులొ♦క్కప్పుడు సేర, వచ్చె శివరాత్రిబహుపుణ్య♦ఫలవిధాత్రి.

చ॥ గతదినమందె కానను మృ♦గంబులు గన్పడకుంట నాఁకటన్
వెతవడి తల్లిదండ్రులును ♦ పెండ్లముఁ బిల్లలు వేగిరింపఁగా
జతనముతోడ విల్లుగొని ♦ సాంద్రితరాటవిఁ జేరి యెల్లెడన్
వెతకిన జంతువేదియు ల♦భింపకయుండెను బోయ కత్తఱిన్. 637

మ॥ రవియస్తంగతుఁడయ్యె నంతనె హరి♦ద్రాజిన్ వెలుంగుల్ దొలం
గె విగాఢంబగు నంధకారము పరం♦గెన్ విశ్వమందెల్ల వ్యా
ధవరుండున్ మదిలోనఁ బల్వగిలి హా ♦ దైవంబ! యెందేని జం
తువెదేన్ గన్పడ దిమ్మకే నెటులఁబో♦దున్ శూన్యహస్తాలతో. 638

ఉ॥ ఆఁకొని సోలుచుండిరి మ♦దర్భకులున్ దలిదండ్రు లాలునున్
జేకొన కెద్దిగాని సమిలు ♦ సేరి యెటుల్ గనుఁగొందు వారి నిం
దే కనుచుందు జంతువు నె♦దేని నటం చొక చెర్వుచేరువం
దాకులుఁడాచు శ్రీఫలన♦గాగ్రము నెక్కి వసించె నయ్యెడన్. 639

ఉ॥ వాఁడును నాఁకటంబడలి ♦ వచ్చునొకో యొక జంతువేని యీ
జాడకు దానిఁ జంపికొని ♦ సద్మముచేరుదునొక్కొ యంచటన్
బోడిమిఁదక్కి వెక్కసపుఁ ♦ బూన్కిగనుంగొనుచుండె నంతలోన్
లేఁడి యొకండు దప్పిఁగొని ♦ నీళులఁగ్రోలఁగ రా నతండునున్. 640

వ. కనుంగొని యద్దానిం జంపఁదలఁచి వేగంబుతో.

—* వ్యాధునకు శివలింగార్చన పొసగుట *—

గీ॥ కార్ముకము నెక్కువెట్ట న♦క్కర్జముననుదునిగి మాలూరదళ మొండ♦ధోధరిత్రి
వెలయుశివలింగమున హిమ♦సలిలసిక్త, మైపడుడు నాద్యయామార్చ♦యయ్యెనద్ది.

క॥ ఆయర్ఘ్యాఫలమున నా, బోయకు సకలాఘములును♦బొలిసె నపుడట
డాయఁగవచ్చిన మృగియును, భీయొనరఁగ వాని నడిగె ♦ బిట్టున నిట్టుల్. 642
ఉ॥ ఏమియొనర్ప నెంచెదవొ ♦ యిప్పుడు సెప్పు కిరాత! యన్న వాఁ
డామృగి కిట్లనెన్ మిగుల ♦ యాకొనియుంటిని నింటిలోన నా
ప్రేముడిబిడ్డ లాలుఁ గడు♦వృద్ధులు నాతలిదండ్రు లాఁకటన్
దీనరియుండి రిప్డు నిను ♦ ద్రెక్కొని చేకొనిపోదు భుక్తికై. 643
క॥ అన లేఁడి యడలి యిపు డే, మొనరించుదు? నెటకుఁబోదు?♦నుక్కలుఁ డీతం
డనికొని యాతని కిట్లనె, వనచర! నేనధికఫలముఁ♦బడయుదు దీనన్. 644
గీ॥ నాదుపొలసున నీకును ♦ నీదుజనము, నకును సుకమైన నేను ధ♦న్యనుగదన్న!
ఒగుల కుపకారులగువారి♦కొప్పుపుణ్య, మెన్నఁదరమౌనె! నూతేండ్ల♦కేనిఁబుడమి
గీ॥ ఐన నొకపల్కు నాదృతి♦నాలకింపు, నాదుబిడ్డలు ఁటెంకి ను♦న్నారు వారి
నాదు చెలియలికేనియు♦నాదువిభున, కేని యర్పించి వచ్చెద♦నిపుడు విడిన.
క॥ కల్లలు నేఁబల్కను విను, భిల్లవరా! సత్యమిద్ది ♦ పృథివియు సంద్రం
బెల్లజలధారలెల్లను, బెల్లుగ సత్యంబుతోడ ♦ వెలయున్ గాదే! 647
ఆ॥ ఇట్లుచెప్పఁ గఱకు♦టెఱుకు నెనరులేక, వినకయున్న హరిణి ♦ విస్మయించి
బెదరి యిట్లు వట్లు♦బెట్టుకొనెఁ గిరాత!, వినుము నానుడుల వి♦వేకమరసి. 648
గీ॥ వేదవిక్రేతమై సాంధ్య♦విధిని సలుప, నట్టిబాపఁడు విభునాజ్ఞ ♦నతకరించి
మెలఁగుపొలఁతియుధర్మంబు♦మీఱునతఁడు, వడయునఘమేనుబడసెద♦బాసఁదప్పి.
క॥ ఇఁకను గృతఘ్నుండును ద్రవ్యం, బకభక్తివిహీనమతియు♦ మైత్రీద్రోహుం
డకరుణుఁడు నొందుదోసము, నకుఁ జిక్కుదు నిటకురాక♦ నక్కన నింటన్.
ఆ॥ ఇట్లు చాలనొట్లు♦నిడి నిల్చియున్న నా, హరిణిఁగాంచి బోయఁ♦ డరిగిరమ్ము
నాఁగ నీరు ద్రావి♦ వేగంబుతో నద్ది, చనియెఁ బేరెమొంది♦ సద్మమునకు.
క॥ భిల్లుఁడు నిద్దురపోకయె, యెల్లెడలన్ గాంచుచుండె ♦ నింతట మృగికిన్
జెల్లెలు వేఱొకమృగి దా, నల్లనఁ దన యప్పజాడ ♦ లరయుచు వచ్చెన్.
ఉ॥ వచ్చిన లేఁడిఁ గన్గొని జ♦వంబున భిల్లుఁడు వింట బాణమున్
గ్రుచ్చుచునుండ బిల్వదళ ♦ గుచ్ఛము హైమజలార్ద్రి మీశుపైఁ
గ్రిచ్చఱ రాల బోయ కది ♦ గ్రాలెను రెండవయామపూజయై
చెచ్చెర వానిఁగాంచి మృగి ♦ చింతిలి యేమియొనర్తు వీవనన్. 653
గీ॥ తొంటివలెవాఁడుసెప్పుడుఁ♦దొంద రేమి, యొంద కిట్లనె మృగి ఫలం♦బొందెనాదు
పుట్టు ధన్యననిత్యమీ♦పొల్లయొడలు, పరులకుపకారకంబైన ♦ భాగ్యమెంతొ.
క॥ ఐనను నా పసికూనలు, నా నెలవునఁ గలరు వారి ♦ నాథుని చేతన్
నేనిడి వచ్చెద నీ సము, ఖానకు విడు మిపుడు వ్యాధ! ♦ కరుణదలిర్పన్. 655
గీ॥ నావుడును వ్యాధుఁడిట్లనె♦నమ్మనమ్మ, నీదు నుడుల వధింతు సం♦దియములేదు
నాఁగ మృగి గడుభీతమై ♦ వేగ పాటు, తోడ నిట్టుల శపథంబు♦లాడఁదొడఁగె.

సీ॥ పరిణయంబాడిన ♦ పడుచును విడనాడి, పెఱనారిఁ జేరిన ♦ బెట్టిదుండు
హరిపూజ సేయుచు ♦ నమ్మహేశ్వరునిందఁ, గావించుచున్నట్టి ♦ కలుషమూర్తి
ఆమ్నాయధర్మంబు♦లవులఁబోఁ జిమ్మి క, ల్పితధర్మముల గార♦వించు మొఱకు
తలిదండ్రులమ్ము తాపా♦ముల శూన్యముగఁ బుచ్చి, తాను మెక్కెడునట్టి♦దారుణాత్ముఁ
గీ॥ డొందు నిరయంబులోఁ బడెద ♦ నిందుబాస, జేసి నేనింటడాగిన ♦ సిద్ధమిద్ది
యనుచు వనచరుఁ డోడఁబడి♦యరిగి రమ్ము, పొమ్మనఁగ నీళులను గ్రోలి♦పోయె నదియు.
క॥ ఎఱుకకు నిద్దుర లేకయె, జరిగెను బ్రహరద్వయంబు ♦ క్షపయందాలో
నెఱుఁగక మృగులవిలంబము, నరయుచుఁ గాసారమునకు ♦ హరిణము సేరెన్.
ఆ॥ మిగుల బలిసియున్న♦మృగమును గన్గొని, కరము పొంగి వేట♦కాఁడు వింటఁ
దొడిగి బాణమేయఁ♦దొడరఁ దోయదళంబు, లీను శరసు పైఁ బ్ర♦వేశమొందె.
క॥ శరరవము విని మృగము వన, చరునకు నిపుడేమి సేయ ♦ సంకల్పమునా
నెఱుకు మునుపటియటులనే, యొఱఁగించెను దనదు హృదయ♦మేర్పడనంతన్.
క॥ మృగమది బిట్టలరి తగన్, మృగయునకనెఁ గృతిని నేను ♦ మిక్కిలి పుష్టిన్
దగియుంటి మూఁడుగడుపా, రగఁ దినితనియుదురు వనచ♦రప్రముఖ! యికన్. 661
ఉ॥ ఎవ్వని చేత నేన్ బరుల ♦ కే మపకారము గల్గకున్నవాఁ
డివ్వసుధన్ వృథాజనితుఁ ♦ డెల్లవిధంబుల నెంచిచూడఁగా
నెవ్వఁడు శక్తియుక్తుఁడయి ♦ యే యుపకారము సల్పకుండునో
యవ్వడవాని శక్తి వితథ♦యా నరకంబును జెంది కుందెడున్. 662
వ. ఐన నిప్పుడు.
గీ॥ ఎఱుక! విను నాదు బిడ్డల ♦ నెల్లవారి, తల్లులకు నప్పగించి యం♦దఱకుఁ జెప్పి
యరుగుదెంచెదనన భిల్లుఁ♦డబ్బురమొంది, పలికె నిట్టుల మృగముతోఁ♦ బరవశముగ.
ఉ॥ ఈవఱకెన్నియో హరిణ♦ లిట్టులె పెక్కులు నీతులాడి న
న్నీ విపినంబునం దునిచి ♦ యేగిన వొక్కటి గానరాదిఁకన్
నీవును నట్లె వచ్చి చన ♦ నేర్పు రచించితి విట్టు లందఱిన్
బోవిడ మాకు జీవనము ♦ పొందగు నెవ్విధి? వంచకాత్మకుల్! 664
గీ॥ అనిన మృగమిట్టులనె వ్యాధ! ♦ యనృతమేమి, లేదు సత్యముచేత నా♦లోకజాండ
మెల్ల శోభిల్లుచున్నది ♦ యిప్పగిదిన, లీకవాదికిఁ బుణ్యంబు ♦ లేదు లేదు.
వ. ఇఁకను నా ప్రతినను వినుము.
సీ॥ సూర్యాస్తమయవేళ♦సురతమొందెడువాఁడు, కూటసాక్ష్యము జెప్పి♦కొనెడువాఁడు
శివరాత్రి నన్నంబుఁ♦బవలు మెక్కెడువాఁడు, సంధ్యవార్చని విప్ర♦జాతివాఁడు
చాలియు నుపకృతి♦సల్పకుండెడువాఁడు, పరులు దాఁచిన సొమ్ముఁ♦బడయువాఁడు
బిల్వదళములఁ బ♦ర్వమునఁ గోసెడువాఁడు, తెలిసి యభోజ్యంబుఁ♦దినెడువాఁడు
గీ॥ తనువునన్ బూది రుద్రాక్ష♦లూనరనట్టి, వాఁడు శివపూజ సేయక♦కూడుఁ గుడుచు
వాఁడునున్ జెందు దురితంబుఁ♦బడయువాఁడ, మరల నీ సన్నిధికి రాక♦మసలియున్న.

క॥ శివపూజచేత దోసము, లవిసి చనుట నానిషాదుఁ ♦ డాశంబరముల్
జవమునఁ జని రమ్యన నది, యవసథముల్ జేరెఁ ద్రావి ♦ యట నుదకముల్.

గీ॥ అందఱును నందుఁ జేరి వా♦రరసికొని ప, రస్పరము సత్యనిష్ఠఁ గి♦రాతుఁ జేర
నిశ్చయించుకొనుడు మగ♦నికి వచించెఁ, బెద్దమృగి యిట్లు ప్రేముడి♦పెంపు మెఱయ

క॥ నినుఁ గోల్పడి సుతులెట్టులు, మనెదరు మనుగడవు గాదె ♦ మాకందఱికిన్
వనఘ! యిటనుండు మేనే, చనెదను ముందేను బాస ♦ సల్పినదానన్. 669

గీ॥ అనిన రెండవమృగి యిట్టు♦లనియె మీర, లుండుఁ డిచ్చోట బాలుర♦నోముకొనుచు
మీకు దాసినిగాదె నేఁ♦బోదు వ్యాధు,కడకు ననుఁ బంపుఁడిప్పాట♦క్రమము మెఱయ.

క॥ అనమృగ మిట్లనె నేనే, చనెదను మీ రిందె యుండి ♦ సాఁకుఁడు సుతులన్
జను మాతృరక్ష బాలుర,కనవరత ప్రేమభరిత♦మై భువిలోనన్. 671

గీ॥ విభుఁడిటులు వల్కు హరిణులు♦విభుఁడు సనిన, విధవలకు జీవితంబెల్ల♦వితయగాదె
యనుచు బిడ్డల నూరార్చి♦యా ముగురును, వ్యాధుకడ కేగి రెంతో స♦త్యంబు పేర్మి

క॥ వారినిగని తచ్ఛిశువులు, వారలకేగతియొ యదియె ♦ ప్రభవిల్లెడు మా
కీరాపేటికి ననివడి, వారలనే తారసించి ♦ వచ్చెఁబిఱుందన్. 673

క॥ మృగములనెల్లఁ గనుంగొని, మృగయుఁడు గడుఁ బొంగి వాని♦మీఁద శరములన్
నిగిడింపగఁ జాపము నె,త్తఁగఁ బడియెను దోయబిల్వ♦దళము శివునిపై. 674

గీ॥ దాన నాల్గవయామార్చ ♦ దనరెనిట్లు, భిల్లునకుఁ గూడె శివరాత్రి♦వృషభకేతు
పూజ యంతనె మృగములు♦బోయఁ జేరి, కొనుమనఘ! బాణములమమ్ముఁ♦గూలనేసి.

వ. అనిన భిల్లుం డక్కజంబొంది నైశంబగు తమంబంత యంతరించి భాస్కరోదయం
బగుచున్నట్లే స్వకీయంబగు నజ్ఞానంబంత యంతరించి విజ్ఞానంబు బొడసూపు
టయుఁ దన యంతరంగంబందిట్లు వితర్కించె. 676

ఉ॥ అక్కట! యీమృగంబులు ప♦రార్థము ప్రాణముల న్త్యజింపఁగా
నిక్కడికేగుదెంచె నిటు♦లెంతయు జ్ఞానములేనివైన నే
నెక్కుడు జ్ఞానమొప్ప జని♦యించిన మానిసినైనఁ దిండికై
కక్కుఱితిన్ వధింతు మృగ♦కాండములన్ బ్రతివాసరంబిటుల్. 677

ఆ॥ ఇప్పుడేని వలదె ♦ యివ్వాని వీక్షించి, తెలివియొంద కిఁకను ♦ దెవులు మాని
తనదు పొట్టకొఱకుఁ ♦ దనవారికొఱకునై, యొరుల ఘాతసేయ ♦ నోర్వనిఁకను.

—* వ్యాధునకు శివుఁడు ప్రత్యక్షమై వరంబు లిచ్చుట *—

క॥ అని నిశ్చయించి మృగముల, కనియెను పొండీరు యుష్మ♦దాశ్రమమునకే
నును జనియెద నానెలవున, కనఁ జంద్రికలాపమూర్తి ♦ యటఁ దోచి యనెన్.

క॥ సకలైశ్వర్యము లిఁకఁ దా,వక నిలయమునందు వెలయు ♦ వనచరతిలకా!
సుకముల నొందుము గడునెడ,పక నీ వంశంబు చెందు ♦ బహుతరవృద్ధిన్. 680

వ. మఱియు నిప్పటినుండి నీవు గుహుండను నాహ్వాయంబు ధరించి సాకేతనగరంబున
కనతిదూరంబున గంగాతీరంబందున్న శృంగిబేరపురంబందుఁ జేరి యందలి నిషా

ములకెల్ల నొడయుండవై యుండు మందు నీయిరవునకుఁ గతిపయవత్సరంబులలో దాశరథియగు శ్రీరాముఁడు పత్నీభ్రాతృయుతుండై యేతెంచి నీకు మిత్రుండగును. నీవును నన్నిఁక నేమఱక కొలుచుచుండుము. నీకు దుర్లభంబగు మోక్షంబు నొసంగెద నన్నంత నతండు విజ్ఞానంబుఁ జెంది శివునకు మ్రొక్కె నంత మృగంబులెల్ల జగదీశ్వరునిఁ గాంచి మించుకూరిమి సాష్టాంగం బెఱఁగి నిలిచిన శంకరుండు వానిఁ గృపాదృష్టిఁ గాంచి శాపావసానంబుఁ గావించి దివ్యదేహంబులిచ్చి తన లోకంబునఁ జేర్చె. భిల్లుఁడును సంతసిల్లి శివోక్తప్రకారం బఖిల సుఖంబులొంది శ్రీరాముని చెలిమిఁ బడసి శివానుగ్రహంబున శివసాయుజ్యంబు నొందె నజ్ఞానంబున నెఱుంగక శివునిఁ బూజించిన బోయ కిట్టి శివసాయుజ్యంబు గలుగ నిఁక జ్ఞానంబున శివార్చన చేసినవార లెట్టి తేజంబు నొందుదురో యారయఁ జాలుదురిట్లు.

చ॥ అనిశము సోమవారముల ♦ నష్టములందును శైవరాత్రులం
దును నిశలన్ మహేశ్వరునిఁ ♦ దోయము మించ భజించినట్టివా
రిని సుర లేనిఁ బోలరు మఱేమఱి వారికి సర్వసంపదల్
పొనరిచి యంత్యకాలమున ♦ మోక్షమొసంగు మహేశ్వరుం డిలన్. 663

వ. అని నొడివినఁ గడు సంతసించి సూతునకు శౌనకాదిమునులు మఱియు నిట్లనిరి.

క॥ మోక్షమన నెట్టిదో యఘ, మోక్షణచణసూక్తికుశల! ♦ మునినుతశీలా!
దక్షతఁ దెల్పుము మాకీక్షణమున ననుడు సూతుఁ ♦ డిట్టులు పలికెన్.

సీ॥ సంసారదుఃఖభంజనియును నతులితా, నందదాయినియునై తనరు ముక్తి
సాలోక్య సారూప్య ♦ సాన్నిధ్యసంజ్ఞల, మూఁడువిధంబులఁ ♦ బొనరియుండు
సాయుజ్యమనెడు న♦సాధారణంబగు, ముక్తి నాల్గవదియై ♦ మురువుమీఱు
పాశుపతవ్రత ♦ ఫలమున నదిగల్గు, నట్టి మోక్షమునకు ♦ హరుఁడె దాత

గీ॥ త్రిగుణములనొప్పు బ్రహ్మాది♦దేవనాథు, లోలి ధర్మార్థకామంబు♦లొసఁగువారు
నిర్వికారియు బ్రహ్మంబు ♦ నిర్గుణుండు, శివుఁడు తురీయుఁడు విజ్ఞాన♦సేవ్యుఁడెందు

వ. మఱియు నవ్యయుండును సాక్షియు నద్వయుండగు నాశివుండు భక్తులకుఁ ద్రివర్గంబుఁ గూడ నిచ్చి పరిపాకసమయంబున ముక్తి నొసంగు నైదవముక్తి కైవల్యసంజ్ఞ నొప్పు నద్దాని లక్షణంబును వినుండు. 677

క॥ ఎద్దానఁ బొడమె లోకము, లెద్దానన్ వృద్ధిఁ జెందు ♦ నెంతయు మఱి యె
వ్వెద్దాన లయము చెందెడు, నెద్దానన్ నిండఁబడెడు ♦ నీజగమెల్లన్.

క॥ అద్దియె శివరూపంబని, యద్దియె కైవల్యవస్తు♦వనియు ననఘులా
పెద్దలు సెప్పుదు రెప్పుడు, నద్ది సకలనిష్కళాత్మ ♦ మై ద్వివిధంబౌ. 689

చ॥ ఎఱుఁగఁగలేదు దాని హరి ♦ యే నజుఁడేని షడాననాదులే
నెఱుఁగరు నారదర్షియును ♦ నించుక వ్యాసుఁడు దక్కుమారకుం
డెఱుఁగడు సర్వదేవతలు ♦ నెల్లరు మౌను లెఱుంగ రింకఁ దాఁ
మెఱుఁగఁగలేవు వేదతతు ♦ లెల్లను శాస్త్రములున్ బురాణముల్

క॥ సత్యము జ్ఞాన మనంతము, వ్యత్యయరహితంబు సచ్చి ♦ దానందంబుఁ
మత్యంతవిషయము పరమా, చిత్యజ్ఞు లెఱుంగవలయు ♦ సిద్ధము దానిఁ. 691

సీ॥ నిరుపాధికంబయి ♦ నిర్గుణంబయి నిరం, జనమయి యవ్యయం ♦ బనఁగఁబరఁగి
శోణంబునుఁగాక ♦ శుద్ధముగాక హ, రిద్వర్ణమునుగాక ♦ కృష్ణవర్ణ
మునుగాక యున్నతం ♦ బునుగాక ఖర్వంబు, గాక పీనంబును ♦ గాక చిక్క
నదిగాక వాకులు ♦ మదియు నిరూపింపఁ, గాఁజాలనట్టి య♦కర్కజపువస్తు 692

గీ॥ వాపరబ్రహ్మ మాకస♦మట్లు నెందు, వ్యాపకము మత్సరవిహీన ♦ మచ్ఛతరము
ద్వంద్వరీతులకెపు డతీ♦తంబు పరమ, శివ సమాఖ్యకమై మేల్మి ♦ జెన్ను మీఱు.

—* భక్తిప్రాబల్య ప్రతిపాదనము *—

క॥ అట్టి పరమాత్మ మొందఁగ, గట్టి శివజ్ఞానమగును ♦ గారణ మదియుఁ
నెట్టన భక్తినొనర్చిన, నుట్టిపడును గాన భక్తి ♦ నొందఁగవలయున్. 694

గీ॥ జ్ఞానమునకన్న శివభక్తి ♦ కరముసుకర, మైనమార్గము గావున ♦ దానశివుని
ముక్తికై భజియింపుఁడు♦మోక్షదాత, భక్త్యధీనుఁడు శర్వుఁడె♦ప్పట్లవిసుఁడు.

ఆ॥ భక్తి జ్ఞానమాత ♦ భుక్తిముక్తిప్రద, సులభ దీనిచేతఁ ♦ బలువురిలను
ముక్తిఁజెంది రిద్ది♦పొలుచు నాఱువిధంబు, లగుచుఁ దెలియఁబరతు♦నరయుఁడీరు.

వ. సగుణయనియు నిర్గుణయనియు వైధియనియు స్వాభావికియనియు నైష్ఠికియనియు ననైష్ఠికియనియు విభజింపఁబడియుండు నందు నైష్ఠికియొక్కం డాఱువిధముల నొప్పు ననైష్ఠికి యొక్కవిధముగా నె యుండు మఱియు నీ భక్తులు విహితాది భేదములతో ననేకభేదంబుల నొప్పు వాని విస్తరించిచెప్పుటకు శక్యంబుగాదు.

సీ॥ భక్తియు జ్ఞానంబు♦పరఁగ వేర్వేరావు, వలదు భేదముసేయ ♦ వానినెపుడు
భక్తిఁజెందకయున్న♦వానికి జ్ఞానంబు, గలుగ నేరదు పరి♦ష్కారమిద్ది
భక్తునకే యెందుఁ♦బరిఢవిల్లును జ్ఞాన, మద్దాన శివభక్తి ♦ నందవలయు
సర్వము భక్తిచే ♦ సమకూరు సిద్ధంబు, సందియం బిట లేదు ♦ సన్మునీంద్రు

ఆ॥ లార! యీప్రకార ♦ మీరడిగినయట్లు, సెప్పినాఁడ దీనిఁ♦జెలఁగివినిన
వారికెల్ల పాప♦వర్గంబునుండి మో, క్షంబు గలుగు సంది♦యంబు లేదు. 698

వ. అని సూతుఁడు శౌనకాదిమహామునులకుఁ జెప్పుటయు.

గీ॥ తండ్రి! యుద్భటవంశము♦క్తాఫలాయ, మాన! జైవాతృకకిరీట♦మహితతేజ!
లింగవైభవఖండమన్♦లీల నెసఁగు, కృతిగొను ద్వితీయమాశ్వాస♦మితవు మెఱయ.

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి లింగవైభవ ఖండంబునఁ
ద్వితీయాశ్వాసము సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## ఉ మా ఖ ం డ ము

### ప్ర థ మా శ్వా స ము.



శైలయాత్రికౌఘ
పాశస్త్యాన్నప్రదాన ♦ భాసురతరము
క్లేశాదిసాదరత్రియ
పేశలకమనీయకీర్తి ♦ విలసిత చరితా!

వ. అవధరింపుము శౌనకాదిమునీంద్రులు సూతుఁ గాంచి.

క॥ తెలిపితివి మున్ను కృష్ణున, కలఘుం డుపమన్యువాని ♦ యభవునిదీక్షన్
జెలువుగ గొసంగెనని కడుఁ, జెలిమిన్ దచ్చరిత మిందుఁ ♦ జెప్పుము సూతా!

వ. అనిన నక్కథకుండు శౌనకాదిమహామునీంద్రుల కిట్లనియె.

—* జాంబవతి పుత్త్రార్థమై శ్రీకృష్ణుని శివునిఁ గూర్చి తపింపు మనుట *—

ఉ॥ మున్నొకనాఁడు జాంబవతి ♦ పుత్త్రజనిఁ మదిఁగోరి నిండువే
డ్కన్నలినాక్షు నిట్లడిగెఁ ♦ గల్మషవర్జితుఁ గాంతవిగ్రహుఁ
సన్నుతశౌర్యు నొక్కసుతు ♦ సామి! భవాదృశుఁ బుట్టజేయు నా
కెన్నిక మీఱు సంతసము ♦ హెచ్చ ననుగ్రహ మట్లొనర్పుమా! 3

శా॥ ముల్లోకంబుల నీకసాధ్యమయి యొ♦ప్పఁ జెంద దొక్కండు నీ
యుల్లంబందుఁ దలంపఁ గ్రొత్తజగముల్ ♦ యోజింపఁగా నేర్తు వు
త్ఫుల్లాంభోరుహనేత్ర! రుక్మిణికి స♦త్పుత్రోదయశ్రీ ముసం
ధిల్లన్ జేయఁగ శంభుమూర్తిని హిమా♦ద్రిం గొల్వ లేదే విభూ! 4

క॥ శివువరమునఁ బ్రద్యుమ్న, ప్రవరులఁ బట్టింపుసతికిఁ ♦ బడసితివి తనూ
భవులను నివు డట్టులె యా, భవునిఁ గొలిచి నాకుఁ బుత్త్ర♦భాగ్యం బిడుమా! 5

మ॥ అన నింతిన్ గని కేశవుండు మదిలో ♦ హర్షించి యెంతేని యి
ట్లనె రాణీ! యటులే యొనర్చెద మదీ♦యంబౌ ప్రయాణంబు నీ
మనమం దారయు మన్న నాసతియు క్షే♦మంబున్ శివంబుల్ గడున్
బొనరన్ జేయుదు రెందు నీకు హరుఁ డం♦భోజోద్భవుండున్ రహిన్. 6

క॥ మఱి యాశలుఁ దత్పతులును, హరిదశ్వుఁడుఁ జందురుండు♦నఖిలమునులు భా
స్వరనదులుఁ గడలి పుడమియు, నిరతము రక్షింత్రుగాక ♦ నిను బద్మాక్షా!

గీ॥ అనుచు స్వస్తినిఁ బలికిన ♦ నాతఁ డపుడె, తల్లిదండ్రులకడ కేగి ♦ చల్లఁగాఁ బ
యన మెఱుఁగఁ జెప్పి యవ్వారి♦యానతిని బలుని సెలవుఁ జెందిసతులకె♦ల్లనువచించె.

—* శ్రీకృష్ణుఁడు తపస్సుకై హిమగిరికి వచ్చుట *—

క॥ వారందఱి కుశలోక్తుల, చే రహిఁ గొని గరుడుఁ దలఁపఁ♦జేరి వడిగ న
వ్వారిజనయనుని హిమనగ, భూరిస్థలిఁ జేర్చి తిరుగఁ ♦ బోయె నతండున్. 9

గీ॥ అంతఁ బద్మాక్షుఁ డచ్చట♦నద్భుతంబు, దివ్యము తపస్విమండల♦భవ్య మమర
మాన్యమును బ్రహ్మలక్ష్మిస♦మావృతంబు, నైనయుపమన్యుమౌనివ♦రాశ్రమంబు

వ. ప్రవేశించి పరమామోదమ్మున.

గీ॥ అచటి పుష్పలతలసొంపు♦నచోటిబహుళ, ఫల లలితశాఖులయు వన♦స్పతులవిభవ
మందలి విరోధిమృగముల♦పొందికయును, నరసి యమ్మునిఁ జేరి సా♦ష్టాంగ మెఱఁగ.

క॥ ఆతండును శ్రీకృష్ణున, కాతిథ్యము నెఱపి కుశల ♦ మరయఁగఁ గృష్ణుం
డాతతముదమున మౌనికిఁ జేతస్స్పృహ నెఱుఁగఁ జేయ ♦ సిద్ధుఁ డతండున్. 12

చ॥ పడసెద వీవు నందనునిఁ ♦ బద్మవిలోచన ! యాత్మతుల్యు నీ
యెడఁ బరమేశ్వరున్ గొలువు ♦ మిద్ధతపంబున వేడ్కమీఱ నా
తఁడు గిరిపుత్రితోఁ గడును♦దారరసప్రసరాంతరంగుఁడై
కడుకొనియున్నవాఁ డిచటఁ ♦ గాంక్షయొనర్చెద వెవ్వనిన్ గనన్. 13

ఉ॥ ఆ జగదీశు నా హరుని ♦ నా పరమేశ్వరుఁ గోరి నీవిటుల్
దేజము మీఱఁగాఁ ♦ దపసుఁ దీర్చుట యెంతయు శ్రేయ మేను మున్
యోజనచేసి యాత్మమున ♦ నొప్పగ నిందె భజించి శంకరున్
రాజతశైలనాయకుని ♦ రాణదలిర్పఁగఁ జూచితిన్ హరీ ! 14

ఆ॥ ప్రమథదేవమౌని ♦ వర్గంబు లలర నా, కిందు దరిసెనంబు ♦ నిచ్చి వరము
లిచ్చిపోయె ఘనకృ♦పేచ్ఛ మహేశ్వరుం, డట్టి పబ్బ మింక నో♦కప్పు డగునె?

క॥ అనఁ గృష్ణుం డుపమన్యున, కనె నిట మునినాథ ! శర్వు ♦ నత్యంతం బ
ర్చన నొనరిచి సిద్ధుల నొం,దినవారలఁ దెల్పు మదికిఁ ♦ దేటపడంగన్. 16

వ. అనిన మునిని యిట్లనియె.

—* హిమగిరిలో శివునిగుఱించి తపించి సిద్ధు లొందిన వారలు *—

క॥ క్రతువలన స్వాయంభువుఁడు త్రి, శతవర్షములిందుఁ బుత్రసంతతికై యు
న్నతతపముఁ జేసి శివుదయ, సుతులను వేయిగురఁ బడసె శుభగుణయుతులన్.

క॥ శాకల్యుండను మునియును, శ్రీకంఠు నవాబ్దశతము సేవించుచు న
స్తోకతపం బొనరించెను, లోకేశుఁడు మెచ్చి యిడె బహువరంబులనన్. 18

క॥ సావర్ణియనెడు నొకముని, యీవని షష్ట్యబ్దశతము లింపుగఁ దపసున్
గావించిన మెచ్చి మహా, దేవుఁ డభీష్టంబు లొసఁగెఁ దేఁకువ మెఱయన్.

క॥ వేదవ్యాసుఁడు ఘనుఁడా, మోదంబున నిచటఁ దపముఁ బూని శివుని బ
ల్గాదిలియనుగ్రహంబున, మేదురయశమును బడసె నమిత్రవిఘాతీ! 20

గీ॥ వాలఖిల్యమునులు నిందు ప్రరిభవంబుఁ, బాపికొనునిచ్చ నిచటఁ దపంబుఁ జేయ
శివుఁడు మెచ్చి సుపర్ణుని జిష్ణు జేత, నీరు పుట్టింతురని వరం బిచ్చె శౌరి! 21

క॥ నారదమౌనియు శంకరు, నారాధనఁ జేసి కొలువ నర్ధేందుధరుం
డా ఋషికి బాధతేజముఁ, గీరితి సంగీతశక్తిఁ గేరుచు నొసఁగెన్. 22

గీ॥ ఇంద్రుఁడును గాశికను నిందు నిందుమౌళి, భక్తి నారాధన మొనర్చి పావ్రిజ్యమైన
యట్టి స్వారాజ్యమును జెంది హరుసమునను, నెసఁగుచుండెను వృష్ణికులేశ! యరయు.

క॥ ఇఁక వసువులలోన హిర, ణ్యాకశిపుఁ డలశివునిఁ గొల్చి మైందవ్రివిభవ ము
త్సుకుఁడై గొని యేలె నకం, టకముగఁ బెక్కేండ్లు నందనందన! వినుమా!

క॥ ఆతనిపుత్రుఁడు మందరు, డాతతశౌర్యుండు హరుని దైనవరమునన్
శ్రీతల్పునిచక్రము బురు, హూతునివజ్రమును గెలిచె హారాహారిన్. 25

గీ॥ మఱియు శతముఖుఁడను దైత్యవరుఁడు వర్ష, శతము నిజమాంసహోమంబు సల్పి శివుని
వరమునన్ యోగశక్తి శాశ్వతపుబలముఁ, జెందెనెంతయు వికచరాజీవనయన!

క॥ నేనును నిట శంకరు న, న్యూనదయాసింధుఁ గొలిచి యొందితి నొప్పౌ
జ్ఞానము దుగ్ధాబ్ధిని నీ, శానుని సాన్నిధ్యమును న సంబోజంబున్. 27

గీ॥ ఇఁకను విష్ణువు శక్తిము నిందుఁ డాద, ధీచి కాణాదుఁడును భృగు తిలకుఁ డల్ల
రాముఁడును శివభక్తి గరంబుఁ జెంది, యొంది రిష్టార్థసిద్ధుల నుదవ్రుగాఁగ.

గీ॥ చూడు మెడపక సర్వర్తు సుమఫలాఢ్య, ములును గంధవహంబులు లలితదళము
లైతనర్చెడు వృక్షులతావళు లివె, శంకరుని సుప్రసాదంబు సరణి శౌరి!

క॥ అన మౌని కనియె నా హరి, విను ముని! ధన్యుండ వీవు వేఱొక్కరు నీ
కెనయౌదురె ? సాన్నిధ్యం, బునఁ బడసితి విట్లు శివుని భువనేశ్వరునిన్. 30

క॥ నాకును నిట్టులె నీ కృప, నా కల్యాణాద్రిచాపు ♦ డా భగవంతుం
డా కైలాసనివాసుం, డా కారుణికుండు కనుల ♦ కగుపట్టునొకో! 31

క॥ అనిన విని మౌని యనియెను, వనజేక్షణ! సందియంబు ♦ వల దీక్ష నచిరం
బున నే యాఱవమాసం, బునఁ జూడఁగఁగలవు శివుని ♦ భూతశరణ్యున్. 32

గీ॥ ఆ శివునిచేత మఱి తదీ ♦ యార్ధమూర్తి
యైన జగదంబచేతఁ బ ♦ దాఱు వరము
లొందఁగల విది నిజము ము ♦ కుంద! సర్వ
కాలవృత్తముల్ గాంతు ము ♦ క్కంటికృపను. 33

క॥ పెక్కుఱకు వరములిచ్చిన. యక్కారుణికాంతరంగుఁ ♦ డనఘుఁడు నీకిం
దెక్కతన సుప్రసాదము, నక్కజముగఁ జేయఁగలండు ♦ నంబుజనేత్రా!

క॥ దేవతలును నిను మెచ్చెద, రీవును బ్రహ్మణ్యుఁడవు వ్ర ♦ తేద్యుండ వహా! రా
జీవవిలోచన! జప్యము, నే వేగఁ జెపుదు శివుఁ గ♦ నెద వద్దానన్. 35

గీ॥ అనినఁ దామరసాక్షుఁడు♦హారుస మొంది, యనియెమౌనీంద్ర! నీదు దివ్యప్రసాద
మునదనుజసూదనునిఁగ్రతు♦భుగ్విభునిఁగ,నియెదనాసఁగుముసద్విద్య♦నీవుదయను.

## —* ఉపమన్యుడు శ్రీకృష్ణునకు శైవదీక్ష నిచ్చుట *—

వ. ఇట్లు మహాదేవాశ్రితకథలతో నేఁడుదినంబులు ముహూర్తంబులట్లు గడిపి యెని మిదవదినంబున నుపమన్యుండు శ్రీకృష్ణుని యథావిధి గంగావగాహనంబుఁ జేయించి దండకమండలకుశమేఖలాచర్మవసనంబు లొసంగి పాశుపతదీక్షనిచ్చి బ్రహ్మవిద్య నుపదేశించె నవంతరంబున నచ్యుతుండు తపమొనర్చి యొకమాసముమాత్రము ఫలాహారంబునఁ గడపి రెండవనెలనుండి సలిలాశనంబే యొనరిందుచు నేకపాదంబున నిలిచి యూర్ధ్వబాహుండై నిస్తంద్రమతిఁదపించుచుండ నైదునెలలుగడచి యాఱవనెల జరుగుచున్నంత నొక్కనాఁడు. 37

గీ॥ ఆకసమునందుసూర్యస♦హస్రతేజ,మగుపడియె నమ్మహామధ్య♦మందుమెఱుపు దీవియంబోలు కిటికిలఁ ♦ దీర్చియుండె, శక్రచాపకృతాంతమా ♦ శైలమొకఁడు

## —* శ్రీకృష్ణునకు పార్వతీపరమేశ్వరులు సాక్షాత్కరించుట *—

క॥ అందుఁదపంబునఁ గాంతుల, సుందరతేజమున నలరు ♦ సుదతీమణితోఁ
జందురుని రేకతో దివి, యందు నినుండట్టులుండె ♦ నభవుండు రహిన్. 39

గీ॥అంతఁగంసాంతకుఁడురోమ♦హర్ష మెసగ,నక్కజమ్ముగఁగనుఁదమ్మ♦లలరఁగనిమె జమిలిపాముల జన్నిదం♦బమరువాని, నఖిలదైవతసంఘార్తి♦హారుని హరుని. 40

సీ॥ గద త్రిశూలం బజ♦గవము వజ్రంబు హ, స్తములందు నెంతేనిఁ ♦దళుకు లీన
నెలబాలుఁడొప్పారు ♦ లలితకిరీటంబు, నిగనిగలందంబు ♦ నీటుచూప
మొలపయిఁ గట్టిన ♦ పులిచర్మమెంతయుఁ, గర్బురదీధితుల్ ♦ గ్రమ్ముకొనఁగ
నురమున నొప్పారు♦చున్న పసిండి త, మ్ములదండ చెలువం♦దలకుఁ దాఁక

గీ॥ సంజప్రొద్దున శారద♦సమయమందు, మేల్మిపరివేషమందున♦మెఱయుచంద్రుఁ
డట్లు విలసిల్లు నఖిలాబ్జ♦జాండవిభుని, శంకరునిఁ గనుఁగొనియెను♦చక్రధరుఁడు.

క॥ ప్రమథగణంబులతోఁ గడుఁ, గొమరొప్పఁగఁ జుట్టఁబడిన ♦ గోధ్వజుఁ డొప్పెన్
రమణీయశరత్పరివే, షమున నలరు ప్రొద్దువలె న♦శక్యుఁడయి కనన్. 42

వ. మఱియు నప్పరమశివుని

క॥ ఏకాదశశతరుద్రులు, శ్రీకరు లుడురాజశకల ♦ శేఖరులు ఘన
శ్లోకులు వరమంత్రంబుల, శ్రీకంఠు నుతించుచుండి ♦ రి కరము వేడ్కన్. 43

క॥ ఆదిత్యులు వసువులు వి, శ్వేదేవులు నాశ్వినులును ♦ సిద్ధులు సాధ్యుల్
మోదంబలరఁగ శర్వు మ, హాదేవు నుతించుచుండి ♦ రందుఁ గడువడిన్. 44

గీ॥ శతమఖుండును విష్ణుండు♦శతధృతియు ని, తరులు గీర్వాణులును రథం♦తరము సామ
మును మహేశ్వరసాన్నిధ్య♦మునఁ బఠించు, చుండిరెంతయు నుల్లాస♦మొప్పమీఱ

వ. మఱియు నింకను యోగీశ్వరులు బ్రహ్మర్షులు దేవర్షులు భూమ్యాకాశములు ఋక్షములు గ్రహములు నెలలు పక్షములు ఋతువులు నహోరాత్రులు సంవత్సరములు క్షణములు ముహూర్తములు యుగములు విద్యలితిహాసములు సనత్కుమారుఁడు మరీచి యంగిరుఁడు నత్రి యగస్త్యుఁడు పులస్త్యుండు పులహుఁడు క్రతువు మనువులు దక్షుఁడు భృగుఁడు వశిష్ఠుఁడు వేదములు జన్నంబులు దక్షిణలు త్రేతాగ్నులు హవిస్సును మూర్తిమంతంబులగు యజ్ఞద్రవ్యంబు లనంతాది నాగరాజులును గంగాది పుణ్యనదులును సాగరంబులును దేవతలును దేవపత్నులును దేవకన్యలును దశదిక్కులును మునిసహస్రంబులు పరమేశ్వరుని నమస్కరించుచుఁ గొలుచుచుండిరింకను గీతవాదిత్రకోవిదులగు గంధర్వులు నచ్చరలు నాటపాట లొనర్చుచుండిరింకను విద్యాధరులు జక్కులు దయ్యములు మున్నగునవి కొండలు ద్రుమాకులు మనోవాక్కర్మంబుల మహాదేవు నుపాసించుచుండె నిట్లు కట్టెదుఱఁ బరమేశానుండు పొడసూపి వాసుదేవునిన్ జగంబును గాంచుచున్నంతఁ గృష్ణుం డతీంద్రియంబగు నమ్మహాదేవుని తేజంబుఁ గన్గొ జాల కుండుటయు నమ్మహేశ్వరుండెఱిఁగి సౌమ్యుండై యతని కిట్లనియె.

క॥ పలుమఱు నీచేతను బూ, జలఁ గొనుచుంటిని హరీ! ప్ర♦శస్తచరిత! యి
మ్ముల నినుబోలెడు విష్ణుఁడు, గలుగఁడు నాకీ జగతి నొ♦కండేనియునున్. 47

## —*శ్రీకృష్ణుఁడు శివుని స్తుతించుట*—

గీ॥ అనిన విని యాతఁడనియె మ♦హానుభావు,నకు నమస్కార మిద్ది య♦నారతంపుఁ
బుణ్యకారణునకు బ్రహ్మ♦మును లనుదురు, నిన్ను బ్రహ్మాధిపతినిగా♦నిగమవేద్య!

గీ॥ భూతమును జిత్రము బహుధా♦జాతమును జ, నిష్యమాణంబు నగునట్టి♦నిఖిలవిశ్వ
మే మహారుద్రుఁడో యట్టి♦యిద్ధశుద్ధ, పూర్ణమూర్తికి వందనం♦బుల రచింతు.

క॥ నారాయణునిగ నరునిగ, ధీరులు సెప్పుదురు నిన్ను ♦ దెలిపితిని విభూ!
సారసభవుడవు నీవే, శ్రీరుద్రుఁడవీవె ♦ తక్కు జేజేలీవే! 50

ఉ॥ నీవలనన్ జగంబులిటు ♦ నెక్కొనె స్థావరజంగమంబులై
యీవిధమొప్పు ప్రాణములు ♦ నింద్రియముల్ మనముల్ బ్రతీకము
ల్పావకుఁడున్ హవిస్సును స♦వంబులు సోముఁడు వేదమంత్రముల్
నీవె మహేశ! దత్తమును ♦ నీవె యధీతము నీవె యారయన్. 51

క॥ నీవే యెల్లర హృదయము, లో వాసముసేయునా య ♦ లోకపురుషుఁడా
దీవే యణిమవు లఘిమవు, నీవే జ్యోతివి మహాత్మ! ♦ నీకివె జోతల్. 52

దండకము. శ్రీమన్మహాదేవ! దేవాదిదేవా! సుదీవ్యత్ప్రభావా! భవాపత్సముద్రాంత
రోద్విగ్న జీవోద్ధరప్రౌఢభావా! భవా! సర్వగీర్వాణ కుర్వాణ కోటీర
కోటీవిటంకోజ్వలద్రత్నరింఛోళి చంచద్ఘృణీజాల నీరాజితాంచత్పదోత్ఫు
ల్లనాళీక! నాళీకజన్మాది తాళీకవాగ్రోషతన్మస్తవిచ్ఛేదనాటీకనవ్యాగ్రి
హస్తాగ్రభాస్వన్నఖాగ్రా! పవిత్రస్ఫురచ్చంద్రరేఖాసముత్పింగరంగజ్జటాబంధ
బందీకృతాకాశగంగా సముత్తుంగభంగాభిషిక్తోత్తమాంగాభిరామా! యుమా
దేవి దివ్యాంగరాగోరుసౌగంధ్యవిక్షేపవక్షస్స్థలా! లాలితక్రౌంచభిత్కుంజ
రేంద్రాననా! పాలితశ్రీశిలాదాత్మభూదోస్తతాఖీల వేత్రాంశుమాలా పరి
క్షిప్త సాన్నిధ్యసంశోభితా! శర్వ! సర్వావనాధానమోదా, వచోభూత
వేదా! భవద్దివ్యమాహాత్మ్య మూహింపశక్తుండనే! తావకీనానవద్యోరు
దేహంబు రూపంబుఁ దేజంబుఁ గారుణ్యభావంబిటుల్ చూపినా వన్యమెం
డెంచకే ధన్యునిన్ జేయవే నిన్ను గన్నారఁగంటిన్ జగంబెన్నఁగొంటిన్
గడున్ హర్షమున్ దర్శమున్ వేగఁ బాలింపుమా పల్కు లాలింపుమా సర్వ
లోకేశ్వరా! శంకరా! శ్రీకరా! తేనమస్తే నమస్తేనమః. 53

గీ॥ ఇట్లు కృష్ణుఁడుపలికిన ♦ నెల్లజగము, లుల్లసిలియశ్లై యనునట్లు ♦ లోకమాలు
సింహనాదంబులొనరించి♦చెలఁగెఁగృష్ణు, శిరమునన్ బుష్పవర్షంబు♦గురిసెమిగుల.

గీ॥ అపుడు భగవానుఁడగుశివుం♦డతిరయమున, దేవియగునుమనున్ శత♦ధృతినిఁజూచి
వలివనేత్రునకనెహరి! ♦ నాదుభక్తి, కరమొనర్చెద వీవు నేఁ ♦ గాంచుచుండు.

—* శ్రీకృష్ణునకుఁ బార్వతీశివులు వరంబుల నిచ్చుట *—

క॥ ఎనిమిదివరముల నడుగుము, వనజేక్షణ! నీయభీష్ట ♦ వాంఛితముల లే
దన కే నొసంగెదను నా, మన మిది ప్రేమించు నిన్ను ♦ మానక యెపుడున్.

క॥ పరమశివుఁ డిట్లు దగ్గఱి, కరుణఁబలికి నట్టినుడుల ♦ కర్థ మెఱిఁగి తా
మరసాక్షుం డౌ కృష్ణుండు, శిరమున మ్రొక్కులిడి పల్కెఁ ♦ జెన్నుగ నిట్టుల్.

చ॥ సుకృతమునందు దార్ఢ్యము య♦శోధనముల్ ఘనమౌబలంబు శ
త్రుకులవిఘాతమున్ శతసు♦తుల్ వరవిక్రమవిస్ఫురత్తనుల్
సకలజనప్రియత్వమును ♦ సారతరోత్తమయోగశక్తి తా
పకమగు సన్నికర్షము శి ♦ వా! యొసగంగఁ దలంతు నర్మిలిన్. 58

*సీ॥ అనిన నట్లగుఁగాక నె ♦ నమ్మహేశుఁ, డమ్మహేశ్వరి జగదంబ ♦ యనియె నిట్లు
ప్రభుఁ డొసంగెను నీదు వ♦రములఁ గృష్ణ!, యిష్టవరముల నేనిత్తు ♦ నట్లుకొనుము.

వ. అనుటయు నతం డంబికను శిరంబున మ్రొక్కి యిట్లు వరంబుల నడిగె. 60

గీ॥ బాపలం దల్కు లేమియుఁ ♦ బరమభోగ
మును సుతశతంబుఁ గులమందు ♦ ముదముఁ దల్లి
దండ్రియొక్కయు సుప్రసా ♦ దములు శమము
దాక్ష్యము నొసంగుమిఁకను నెం ♦ తయు మదంబ! 61

క॥ అనినఁ దథాస్తని త్రిభువన, జనని మఱియు ననియె నమర ♦ సన్నిభ! యెపుడే
నిని నే హుళక్కిఁ బల్కను, గనెదవు భార్యాసహస్ర ♦ కౌశల్యంబున్. 62

గీ॥ మఱియు దారలవాల్లభ్య♦మగుదు మీఱు, బాంధవప్రేమ మక్షయ♦బలము లొనరు
ప్రతిదినం బేడువేలు బా♦పలు భవద్గృహమునఁ గుడుతురు తనువు హృ♦ద్యముగ నమరు

క॥ వరముల నిట్లొసఁగి తగన్, వరదులు శివు లంత దివిజ ♦ వర్గముతోడన్
సరగున నంతర్హితులై, రరుసమ్మును జెంది కృష్ణుఁ ♦ డంత రయమునన్. 64

వ. గురుండగు నుపమన్యునిఁ జేరి మహేశ్వరానుగ్రహం బెఱింగించినంత మురిసి
యమ్మహామహుండు పద్మలోచనున కిట్లనియె. 65

* శివపురాణే ఉమాసంహితాయాం తృతీయాధ్యాయే - శ్రీకృష్ణ వచనం—

శ్లో॥ ఇత్యుక్తా సువరాన్ దేహి । దేవదేవ నమోస్తు తే । సర్వేశ్వరస్త్వమేవాసి । మత్ప్రభుశ్చ విశేషతః॥ సనత్కుమార ఉవాచ - తస్యైతద్వచనం శ్రుత్వా । తమాహ భగవాన్ భవః । సర్వం భవిష్యతీత్యేవం । పునస్స ప్రాహ శూలధృక్ ॥ సాంబో నామ మహావీర్యః పుత్రస్తే భవతా బలీ ...... శ్రీకృష్ణ ఉవాచ - శ్లో॥ ఇత్యాద్యాన్సువరాన్సంతు । ప్రసాదాత్తవ పార్వతి ॥ సనత్కుమార ఉవాచ - తస్య తద్వచనం శ్రుత్వా । దేవీ తం చాహ విస్మితా । ఏవమస్త్వితి భద్రం తే । శాశ్వతీ సర్వకామదా ॥

క॥ లేఁడు శివుఁబోలు వేలుపు, లేఁడు శివుఁ బోలు దాత • లీలాకారా!
లేఁడు శివుఁబోలు సులభుఁడు, లేఁడు శివుఁ బోలు బిరుదు • లెక్కింపంగన్.

వ. అని సంతసించినంతఁ గృష్ణుం డాయనఘుని సెలవొంది స్వపురంబుఁ జేరి జాంబవతియందు సాంబుండను గుమారునిఁ బడసి సుఖంబుండె నిట్లు శ్రీకృష్ణ పుత్రలాభోదంతం బెఱింగించితి నిఁకేమి వినుదురన సూతునకు మునులు మహాత్మా! మున్నెవ్వ రెవ్వరు శివమాయామోహితులై జ్ఞానంబుఁ బాసి చరించిరో యట్టివారి నెఱుంగఁ జెప్పి యవ్వలఁ బాపభేదంబులను బాపభోగ్యంబులగు నరకభేదంబులను నెంతలేసి పాపంబులను గూడ హరింపఁ జాలిన దానధర్మంబులను నెఱింగింపు మనుటయు సూతుం డలరి యిట్లనియె, 67

—* శివమాయా మోహితులు *—

క॥ కమలాక్షుండా విష్ణుఁడు, భ్రిమాత్మికంబైన శివుని • బలువగు మాయన్
దెమలంగ లేక యనేక, ప్రమదల సాంగత్య మొందెఁ • బలుతడవ లిలన్. 68

క॥ నలువయు శివమాయఁ గదుర, నలిగి యలవిగాని యట్టు • నట్టనిరహిఁ జేఁ
గలయఁగఁ బూనెను గూఁతున్, బలుములు లాఁతులను జూచి • బాళిన లదురెన్.

క॥ మీఁదన గ్రిందును గనకయె, కాదన కనుచిత పుసరణిఁ • గావలులగుచున్
గాదిలి చెల్లెలిని వశి, ష్ఠాదులు గవయంగఁ గడఁగి • రభవుని మాయన్. 70

వ. మఱియు నజేయంబగు నాశివమాయను జేసి.

సీ॥ ఇంద్రుఁడు గౌతమ•ఋషిపత్ని నాయహల్యను మోసఁజేసి క్రీ•డనుబొనర్చె
అగ్ని కృత్తికలను • నార్వురవలచి బ, ల్మరులొంది ప్రాణంబుఁ•దొరుఁగఁ దొడఁగె
నమ్మహాబలుఁడును • నంజనిన్ గామించి, క్రీడించి పుట్టించెఁ•గీశవర్యు
మిత్రావరుణులల్లి•మెలఁత నూర్వశిఁ జూచి, గళిత తేజస్కులై•కనిరి సుతులఁ

గీ॥ చందురుఁడు గురువనితతో•సౌరతోరు,భోగములనొంది తనయుని•బుధునిఁ గనియె
శాండిలియనాఁగ నొకకన్నె•సర్పవైరి, వలచి తెక్కలుగాల్పఁగఁ•బడియె వినుఁడు

సీ॥ వాచస్పతి యటంచు • వైభవంబున మించు, జీవుఁ డగ్రజపత్నిఁ • జెందెఁ దమిని
బ్రహ్మనిభుండు ప•రాశరుం డల దాశ,కన్యక తోఁగూడి • కనియె వ్యాసు
ఘనుఁడౌ విభాండక•ముని లేడిఁ గని ముక్త, తేజుఁడై కనియె శు•కుఁ గుమారు
నచ్చరయగు మేన•యనుపొలంతికి లోఁగి, గాధిపుత్రుఁడు గంగఁ•గలిపె దవను

గీ॥ ఇఁక భరద్వాజుఁ డనెడుమా•నీంద్రుఁ డలఘుఁ, డాహరిద్వారమున గంగ•యందుఁ గ్రీడ
లాడెడు ఘృతాచియను దాని•నభిలషించి, స్కన్నవీర్యుఁడై కనియెనా•క్కనిఁ దనూజు

వ. వారు వీరన నేల! లోకంబ దెల్ల వారలు శివమాయామోహితులై కామబాణంబులకు గుఱిగానివారు లేరిది సిద్ధం బిఁకను బాపంబుల తెఱం గెఱింగించెద వినుండు.

## —* పాపభేదములు *—

క॥ మనసున నాలుగునుఁ వాక్కున నాలుగు మూర్తి నాలు♦గును నగు పాపా
లను బొనరించినవారలు, చనుదురు నిరయంబుఁ జేర ♦ సన్మునివర్యుల్ ! 74

వ. అవి యెవ్వియందు రేని వినుండు.

క॥ పరసతినిఁ గవయఁ గోరుట, పరధనముల కాసపడుట ♦ భావము చేతన్
బరుల కపకృతినిఁ గోరుట, యురవుగఁ జెడుపనులఁ దలఁచు♦టెపుడుఁదగ వెదన్.

గీ॥ అప్రియముఁ బల్కుటయుఁ గల్ల ♦ లాడుటయును
గొండెములు సెప్పుటయు సుంతఁ ♦ గొంకులేక
తిట్టుటయు నను నివి నాల్గు ♦ చెట్ట లెపుడు
వాకునెడ దోసములు వీనిఁ ♦ బాయవలయు. 76

క॥ తినఁదగనివి దినుటయుఁ బర,ధనముల దొంగిలుట పరుల ♦ దారలతోఁ గ్రీ
డనుబొనరించుట హింసయు, ననుచితములు దేహమునకు♦నారయవలయున్.

వ. తినఁదగని పదార్థంబుల నిట్లెఱుంగుఁడు.

గీ॥ వినుఁడు రామాంసములును ల♦శున పలాండు, శిగ్రువిడ్వరాహంబులు♦ శేలువును న
భక్ష్యములుగాఁగఁ జెప్పఁగ♦బడుటవాని, వర్జన మొనర్ప వలె ధర్మ♦పరుఁడు పుడమి.

వ. ఇఁకను వరుసగ దోసంబులను వక్కాణించెద వినుఁడు.

క॥ శివునిన్ గురుఁ దలిదండ్రుల, శివభక్తుని మఱియు శైవ♦శిక్షాచార్యున్
శివధర్మంబుల నెపుడే, నవమతి నిందింపఁగూడ♦దఘమగును గదున్. 79

సీ॥ శివలింగమును జూచి♦ చేమోడ్పనట్టిఁడు, శివుగుడిన్ బొలఁతుకఁ ♦ జెందునతఁడు
శివధనంబులను గ్రము♦చ్చిలికొనునాతండు, శివరాత్రిఁ బవలు బో♦ సేయునతఁడు
శివవనిఁ బుష్పరా♦జిని దెచ్చునట్టిఁడు, శివపూజమాని భు♦జించునతఁడు
శివుసరి పెఱవేల్పుఁ♦జింత సేయునతండు, శివునివ్రతంబులఁ ♦ జెఱచునతఁడు

గీ॥ గురునిఁ గొలువక పాఠంబుఁ♦గోరునతఁడు, గురునిపరిచర్య సల్పని ♦ కుత్సితుండు
ఆపదన్ గుందుగురుఁ బాసి♦నట్టియతఁడు, చేరుదురు నిరయంబును♦సిద్ధమిద్ది. 80

సీ॥ అశుచియై వేదాధ్య♦యన మొనర్చునతండు, తల్లిదండ్రుల నెప్డు♦దొల్లనతఁడు
పంచయజ్ఞంబులఁ ♦ బాసి మెక్కునతండు, తను గొప్పగా నెన్ను♦కొనునతండు
చదివిన వేదంబు♦వదలి మఱచినట్టిఁ, డాలను బోయల ♦ కమ్మునతఁడు
దేవభూదేవ వృ♦త్తినిఁ జూఱగొన్నట్టిఁ, డాలమందలు మేయు♦నట్టి పొలము

గీ॥ నాక్రమించిన యట్టిఁడు♦నాల తెరువు, నందు నగ్గిని వేసెడు ♦ నట్టియతఁడు
దీనులగు వారిసొత్తు నెం♦తేనిఁగొనిన, యట్టిఁడును నిరయంబుల♦నందఁగలరు. 81

క॥ చెఱువులుఁదోఁటలు గుంటలొ, నరిచిన వ్రతములను దనదు ♦ నాతిని సుతలన్
మఱి సుతులను వెలకమ్మెడు, నరుఁడొందఁగలండు ఘోర ♦ నారక బాధల్. 82

అ॥ వినుఁ డనాథయైన ♦ వెలఁదిని బాలను, వృద్ధురాలి మిగుల ♦ వెఱచుదాని
సతినిఁ దపనుఁజేయు ♦ చానను వంచన, చేయువారు నరక ♦ సీమ నుంద్రు. 83

క॥ వేదక్రేతలు మఱియ, వ్వేదమునున్ దెగడువారు ♦ వేదవిరోధుల్
వేదముఁ జూచి పఠించెడు, చేదస్తులు నిరయగతికిఁ ♦ జేరుదు రవలన్. 84

—* పంచమహాపాపులు *—

క॥ బాపనిఁ జంపినవాఁడు సు, రాపియు గురుతల్పగుఁడు హి ♦ రణ్యస్తేయుం
డీ పాపులఁ గూడిన పెను, పాపుఁడునుం బంచఘోర ♦ పాపులు పుడమిన్. 85

సీ॥ గోవిప్రకన్యకా ♦ గురుకార్యములకు వి, ఘ్నంబు చేసెడునట్టి ♦ కశ్మలుండు
గురుల దోసములేని ♦ కోమలినిన్ బరి, జనులఁ బాసినయట్టి ♦ పాపశాలి
చలిపందిరుల మేలి ♦ సత్రంబులను సభా, భవనంబులన్ గూల్చు ♦ పంకమూర్తి
బాలవృద్ధులకును ♦ బరిజనులకుఁ బెట్ట, కన్నంబుఁదానె తి ♦ న్నట్టి ఖలుఁడు

గీ॥ విల్లు నమ్ముల కత్తుల ♦ విసము నమ్ము, వాఁడు పశువులకున్ ముకు ♦ ద్రాడు వేయు
వాఁడు శిలలను మేకుల ♦ బాటకడ్డి, సేయువాఁడును నిరయంబుఁ ♦ జెందఁగలరు,

ఉ॥ కల్లలనాడువాఁడు గురు ♦ కాంతను నోడక ధిక్కరించువాఁ
డుల్లమునందు నక్కటిక ♦ మూననివాఁ డభిచారకృత్యముల్
పెల్లుగ సల్పువాఁడు ద్విజుఁ ♦ బిల్చియు సుంతయు నీకపంపువాఁ
డొల్లమి సాధులౌ ద్విజుల ♦ నూరక దూఱెడువారు బాతకుల్. 87

క॥ పరివేత్తయుఁ బరివీతియుఁ, దెఱవలనున్ దార్చునతఁడు ♦ దెంపున విసమున్
బరులఁ దినిపించువాఁడును, నిరతముఁ గామాకులుఁడయి ♦ నెగడెడువాఁడున్.

క॥ కన్నెను జెఱచెడువాఁడును, గన్నియధన మపహరించు ♦ కఱటి రజముతో
నున్నసతిఁ గూడువాఁడును, బన్నుగఁ బర్వముల రతినిఁ ♦ బడసెడు వాఁడున్.

గీ॥ వరుసగానట్టియువిదతో ♦ సురత మొందు, నరుఁడునుంగూటసాక్షియుఁ ♦ బరులసొమ్ము
దాఁచనిడ నపహృతిచేయు ♦ దారుణుండుఁ, బశువులనుబట్టి క్రీడించు ♦ పాపశాలి.

క॥ ఒకబంతియందునున్ వం, టకమున భేదంబుఁ జేయు ♦ టాటోటును దా
నొకవిస్తరివేసుక తలఁ, కక కుడిచెడువాఁడు నరక ♦ గతుఁడౌదు రొగిన్. 91

గీ॥ ఎపుడు దుర్దానములఁగొంచు ♦ సేవపడక, కల్మషాత్ములకడఁ బ్రీతి ♦ గ్రహముసేయు
నట్టి బాపఁడు సరిగొంచు ♦ నవనిఁగావ, లేని భూమీశ్వరుఁడును మ ♦ లీమసులిల.

క॥ కలిమి కడుఁగలిగి పేదలఁ, దలఁపక తగినట్టి యీవిఁ ♦ దక్కినవారల్
బలమైన రుజను గడుశ్లో, షిలు పేదకు మందు లిడని ♦ చెన్నటివైద్యుల్.

క॥ కూలుదురు నరకమునఁ గడుఁ,బేలుదురు భృశార్తులగుచు ♦ బిట్టుగ నగ్నిన్
గాలుదురు తెరువుఁగాంచక, సోలుదురు నితాంత భూరి ♦ శోకాతురులై. 94

—* బ్రహ్మఘ్నసమానులు *—

సీ॥ వప్పిఁజెంది జలంబుఁ ♦ ద్రావఁగావచ్చు గో, జాతికి విఘ్నంబు ♦ సల్పువాఁడు
వేదశాస్త్రముల ♦ వివేక మించుక లేక, కొంచకసభల దూ ♦ షించువాఁడు
కడు నందమున నొప్పు ♦ కన్నకూఁతును దగి, నట్టి భర్తకొసఁగ ♦ నట్టివాఁడు
కడుపంగరమ్మని ♦ గుణశాలియగు బ్రాహ్మ, ణునిఁబిల్చిమరలఁబొ ♦ మ్మనెడువాఁడు

గీ॥ మఱియుగోదైవతంబుల ♦ మాన్యములను, బాడబునివృత్తిహరియించు ♦ వాఁడునంధ
పంగులజడదరిద్రిణంబులఁ ♦ బడయుఁవాఁడు, బ్రహ్మఘాతులుగాఁజెప్ప ♦ బడుదురిలను.

గీ॥ చెలిమిఁజేయుచునహితంబు ♦ చేయునతఁడు,పిలిచియువిహాన్నమునుదిని ♦ పించునతడు
కనుచుహింసనుమాన్పని ♦ ఘాతుకుండు, నరకమునఁ బొక్కుచుందు ర ♦ నారతంబు.

గీ॥ వీరలందఱు నొకవైపు ♦ వినుఁడుమీరు, మేలు చేసిన వారికి ♦ మీఱి కీడు
చేయువాఁడును నట్టులఁ ♦ జేయఁదలఁపు, చేయువాఁడును నొకవైపుఁ ♦ జేరగలరు.

క॥ పరులకలిమికిని సంతుకుఁ, బరుల మహోన్నత్యమునకుఁ ♦ బాయక మదిలో
మఱుఁగుచునుండెడి చెనఁటులు, చిరకాలము నరకబాధఁ ♦ జెందుదురు మునుల్ !

సీ॥ భూదాన మొనరించి ♦ భూమినీయక తామె, యనుభవించుచునున్న ♦ యట్టివారు
గోదాన మొనరించి ♦ గోద్రవ్యమును దామె, యారగింపుచునున్న ♦ యట్టివారు
కన్యకాదాన మ ♦ క్కఱఁజేసి కూఁతును, నల్లున కంపని ♦ యట్టివారు
సత్రంబు లమరించి ♦ చాలఁగ నవ్వాని, యద్దెల కిచ్చుకొ ♦ న్నట్టివారు

గీ॥ జన్నములొనర్తుమనుచు వి ♦ స్తారధనము, నార్జన మొనర్చి యటుసల్ప ♦ నట్టివారు
విత్తముల నప్పఁగొని యెగ ♦ వేయువారు, చేరుదురు నరకాగ్నిని ♦ సిద్ధముగను.

గీ॥ ఆలుమగలును దలి ♦ దండ్రు లాత్మజాతు, లన్నదమ్ములుమిత్రులు ♦ నల్లుగురువు
శిష్యుఁడును వీరలకుఁగల ♦ చెలిమిఁబాపి, కొంకకవిరోధమును ♦ నొడగూర్చువారు.

క॥ పలుదోసంబులు తనయెడఁ, గలిగియు వేరొకరియందుఁ ♦ గలుగకయున్నన్
జలమునఁ బరులను దెగడెడు, పలుగాకులు దెఱపిగొనని ♦ పాపులు పుడమిన్.

గీ॥ పసులమేఁతల పంటకు ♦ ప్పలను బరుల, యిండ్లఁగాల్చెడువారు ద ♦ బ్బియకవస్త్ర
పత్రముల సృష్టిచేసెడు ♦ వారు పరులఁ, జంపువారొందుదురు నర ♦ కంపువసతి.

ఆ॥ అడవి నిరపరాధు♦లై యుండు ప్రాణుల, హత్య సేయువాఁడు ♦ నాలఁగట్టి
పొలముదున్నువాఁడు♦పొంక మొప్పఁగ నెద్దు, నెక్కువాఁడునిరయ♦మేగఁగలరు.
క॥ అతికోపను లతిలోలుపు, లతికాముకు లతిపిశునులు ♦ నతిగర్వులు నిం
దతివచనులు నతిభక్షులుఁ, గుతుకంబఱ యమునిశిక్ష♦కుఁ బాత్రంబుల్.

## —* నరకములు *—

వ. ఇఁకను వారల కందఱ కవశ్యానుభోగ్యంబులగు నారకభేదంబుల నెఱింగించెద వినుండు, నిరయంబు లష్టావింశతిపరిమితంబులుగ విత్తములు లెక్కవెట్టిరి. రౌరవంబు, మహారౌరవంబు, తామిస్రం, బంధతామిస్రంబు, కుంభీపాకంబు, కాలసూత్రం, బసిపత్రవనంబు, సూకరముఖం, బంధకూపంబు, కృమికూపంబు, కృమిభోజనంబు, తప్తవాలుకంబు, వజ్రకంటకంబు, శాల్మలియు వైతరిణియుఁ, బూయోదంబును, విశసనంబును, లాలాభక్షణంబును. సారమేయాదనంబును, నవీచియు, నధశ్శిరంబును, క్షారకర్దమంబును, రక్షోగణంబును, శూలప్రోతంబును, దండశూకంబును, వటారోధంబును, మహాజ్వాలంబును, సూచీముఖంబును నను నవియు మఱియు నీయవి యొక్కొక్కఁ డైదువిధంబులతో నొప్పి నూటనలువది విధంబులై పరఁగు నిందు యామ్యకింకరులు పాపులఁబట్టి పలువిధంబుల బాధించి వేధించుచుందు రిట్టిపాపుల ఘోరదుఃఖంబులఁ బాపఁజాలు దానధర్మంబుల నెఱింగింతు వినుండు. 105

## —* పాపహరంబులగు దానధర్మములు *—

*గీ॥ ధేనుభూ తిలహేమాజ్య♦దివ్యవస్త్ర, ధాన్య గుడ రౌప్యలవణము♦లద్ది జ్ఞులైన
బ్రాహ్మణులకీవలయు నివి♦పదియు మేటి, దానములు సర్వదోషని♦స్తారకములు
గీ॥ మేక గేదెయు గోఱియయు♦మేలిదాసి, యీనుచున్నట్టియావును♦నిలయుఁగన్నె
పసిఁడియేనుఁగుగుఱ్ఱంబు♦బండినాగ, లియు ననడ్వాహమునుగడు♦నయముమీఱ.
క॥ పల్లకియును సెజ్జయునుఁ, బెల్లగు ధాన్య ముపకరణ ♦ బృందముగలదా
నిల్లు పదియాఱు వీనిని, నుల్లసిలుచు నగ్రజనుల♦ కొసఁగఁగవలయున్.
క॥ లలితోపానహ పాదుక, లలరెడు ఛత్రంబునుఁ ధ♦ రామరుల కిడన్
విలసిలు యానంబులు లక్ష్ముల కిరవగు నిరవు గలుగు ♦ శుభచారిత్రీ ! 109
వ. మఱియును.

---

* శ్లో॥ గోభూతిల హిరణ్యాజ్య । వాసోధాన్య గుడానిచ । రౌప్యం లవణమిత్యాహుః । దశ దానాని కోవిదాః.

* శ్లో॥ అజాచ మహిషీ మేషీ దాసీ చోభయతోముఖీ । ధేనుః కన్యా హిరణ్యంచ । గజాశ్వ శకటానిచ । బలీవర్దో హల శ్శయ్యా । శిబికా ధాన్యమేవచ । సర్వవస్తుయుతం గేహం । దానాన్యేతాని షోడశ ॥

కం॥ పీటలు రతనాల్ రజతము, నేటగు పరిజనుఁడును నవ ♦ నీతము ఫలము
ల్గాటపు దధి తాంబూలము, లాటంకముఁ దక్కి యొసఁగ ♦ నగు బాపలకున్.

వ. వెండియు నీకుఁ దులాపురుషదానం బనన్యసాధారణం బవి యివి యననేల ? యిష్టవస్తువు లన్నియు దానార్హంబు లవ్వాని యోజించి సమయానుసారం బర్థులకు నొసంగవలయును. 111

ఉ॥ అన్నముచేతఁ బ్రాణిచయ ♦ మంతయు నాయువుఁ జెందియుండు నా
యన్నము లేనియప్డు విల ♦ యంబును జెందును గాన లోకమం
దన్నమె దైవతంబయి సు♦ఖావహమై కరమొప్పియుండు నా
యన్నము నిచ్చువారిఁబర ♦ మాత్మము మెచ్చు వదాన్యవర్యులన్. 112

వ. కావున

గీ॥ దానములలోన నుత్తమ♦దానమన్న, దాన మిద్దానఁ గులము గో♦త్రంబుఁ గనక
యెల్లవారల కోదనం ♦ బీవలయును, సర్వసౌఖ్యము లిదియిచ్చు♦స్వర్గమిచ్చు.

చ॥ ఉదకము సర్వజంతువుల ♦ కొప్పఁగ ద్రావఁగఁ జెల్లుఁ ద్రొట్లయం
దుదకము పోసియుంచ నది ♦ యొందెడు నాలు వృషంబు లింక నిం
పొదవ ననేక జంతుతతి ♦ యొందు జలంబును నట్టులొట మీ
రిది మదియందెఱింగి సత ♦ మిచ్చ నొనర్పుఁడు నీరదానముల్. 114

వ. ఇంకను.

కం॥ తలిదండ్రులఁ గొలుచుట యొ, జ్జలఁ గొలుచుట నతిథి రిక్త ♦ జనులకు నన్నం
బులనిచ్చుట నడబావులఁ, గొలఁకులఁ జెరువులనుద్రవ్వి♦కూర్ప సుకృతమౌ.

కం॥ చలిపందిరులను నిఁకఁ బూ, వులతోఁటలు ఫలకుజములు ♦ పొల్చెడు తోపు
ల్విలసిలెడు నన్నసత్రము, లలసుచుఁ గూర్పంగ నాక ♦ మాతని కబ్బున్. 116

కం॥ ఇఁకఁ బాఠశాలలును వా, చకమందిరములను బాట ♦ సత్తరువులునున్
రకమగు భజనగృహము లు, త్సుకుఁడై కూర్చిన నభీష్ట ♦ సుఖముల నొందున్.

గీ॥ శర్వ గౌరీషడాస్య గ♦జముఖ వీర,భద్ర భద్రకాళీ కాల ♦ భైరవాయ
తనములనునిందిరావిష్ణు♦ధామములును,దదవతారాయతనములుఁ♦దార్చుముదము.

కం॥ బాలురకుఁ జదువుఁ జెప్పుట, యోలిగ నన్నంబు బట్ట ♦ లొసఁగుటయు గదున్
వీలుగఁ బొత్తము లిచ్చుట, చాలఁగ సుకృతంబొనర్చు ♦ శర్మము లిచ్చున్.

గీ॥ మఱ్ఱి మామిడిమున్నగు♦మ్రాకులను బ, థమ్మునందు వరుసగ సం♦స్థాన మొనరఁ
జేయువాఁడును దపసును♦జేయువాఁడు, బొంకనట్టిడు శ్రేయంబుఁ♦బొందఁగలడు.

వ. ఈ చెప్పినవన్నియుఁ బాపహరంబులై యొప్పు నందు గోభూదానంబు లుత్తమోత్తమంబులు; అందును గోదానమందు. 121

గీ॥ వెండిగిట్టలతోడఁ బ♦సిండికొమ్ము, దోయితోఁ గంచుపాత్రితో ♦ దూడతోడ
బటముతో గ్రాసములతోడఁ♦ బాడిమొదవుఁ, దగినవిప్రునకీవలె ♦ ధనముతోడ.

క॥ అటులిచ్చిన నాధేనువు, కుటిలమతిన్ జేసినట్టి ♦ ఘోరతరాంహః
పటలముల నెల్లఁ గూలిచి, పటుసౌఖ్యములిచ్చు స్వర్గ ♦ పదములనిచ్చున్. 123

గీ॥ ఎన్నిరోమంబు లావుయం♦దెసఁగియుండు, నన్నివత్సరములు నాక♦మందు దాత
చేరియుండును దరియింతు ♦ సిద్ధముగను, సప్తపురుషులవఱకు వం♦శంబునందు.

వ. ఇఁక సర్వధర్మానుష్ఠానయోగ్యంబగు భూమండలంబు తెఱంగెఱుంగవలయు నగుట నుపన్యసించెద నాలకింపుడు భూవలయంబునందు, జంబూ, ప్లక్ష, శాల్మలీ, కుశ, క్రౌంచ, శాక, పుష్కరనామకంబులగు సప్తద్వీపంబులు లవణేక్షుసురా సర్పిర్దధిక్షీరజలార్ణవశోభితంబులై యెసంగు: 125

## —* భూమి సప్తద్వీపములు *—

క॥ భూపద్మమధ్యజంబూ, ద్వీపము యోజనపు లక్ష ♦ వెడలుపు నటులే
యా పొడవును గలిగి కదున్, శ్రీపదమై యొప్పు లవణ ♦ సింధువృతంబై. 126

గీ॥ లలితముగ దీనిమధ్య ని♦లావృతంబు, వర్ష మొప్పెడుఁ దన్మధ్య ♦ వాసిమీఱ
మేరుశైలంబు ధారుణీ ♦ నీరజమునఁ, గర్ణికాకృతిఁ దనరుఁ బొం♦కంబుమీఱ.

వ. ఇక్కనకపర్వతంబు పదియాఱు యోజనంబు లధఃప్రదేశంబునఁ బీఠభూమిగను భూమినుండి యెనుబదినాలుగు యోజనంబులు పొడవుగను నందు బదియాఱు యోజనంబులు శిఖరంబులుగను జెలువొందియుండు నిఁక నిద్దానికి దక్షిణంబున నిషధహేమకూట హిమాచలంబులును నుత్తరంబున నీలశ్వేతశృంగి పర్వతంబులును భాసిల్లియుండు. ఈయవి పదివేల యోజనంబుల పరిమితితో రత్నవంతంబులై యరుణప్రభలు గలిగి యొప్పొందు నిఁక నిలావృతవర్షంబుతోఁ గూడఁ దొమ్మిదియగు భారతాదివర్షంబు లొక్కొక్కటి తొమ్మిదివేల విస్తీర్ణంబులోఁ గులశైలంబులతో నొప్పుచుండు. భారతవర్షము కింపురుషవర్షము హరివర్షము కేతుమాలవర్షము భద్రవర్ష మిలావృతవర్షము రమ్యకవర్షము హిరణ్మయ వర్షము కురువర్ష మనునవి. అందు మేరువునకు దక్షిణంబున భారత కింపురుష హరివర్షంబులును నుత్తరంబున రమ్యక హిరణ్మయ కురువర్షంబులును మధ్యంబున నిలావృతవర్షంబును దూర్పున భద్రాశ్వవర్షంబును బడమట కేతుమాల వర్షంబును బరంగునిఁక నిట్లే యీ మేరువునకుఁ బూర్వాది చతుర్దిశలందు

మందర గంధమాదన విపుల సుపార్శ్వంబులను పర్వతంబులును దచ్ఛిఖరంబు
లందుఁ గదంబజంబూపిప్పలవట వృక్షంబు లొప్పియుండును. 128

క॥ జంబూవృక్షములందు గ, జంబులఁ దుల సేయునట్టి ♦ చక్కనిపండ్లో
జం బృథివిరాలి యవియఁగ, జంబూనది యొదవెఁ దద్ర♦సంబున నచటన్. 129

గీ॥ ఆనదీతీరమున నున్న ♦ యక్షుల జనులు
తోయముగ నానదీ స్వాదు ♦ తోయమును భృ
శముగ దోయిళులన్ ద్రావి ♦ యమృతరసముఁ
గాఁగఁ బాటించి మోదంబుఁ ♦ గాంతురిమిగుల. 130

క॥ అది త్రావినవారలకె, ష్టాదవదు దుర్గంధము జర ♦ యును జెమటయునన్
బ్రిదులవు బిగి నింద్రియములు, మదికుత్సాహంబు లగ్గ♦మఱిమఱి గూర్చున్.

క॥ ఇంపలి మృత్తికతోడన్, గుందన మది యొదవు మగల ♦ కుం గొమ్మలకున్
జెందించుఁగాంతి నగలను, బొందించును హరుసమిడు న♦పూర్వతరముగాన్.

వ. ఇఁక మేరువునకుఁ దూర్పునఁ జైత్రరథంబును దక్షిణంబున గంధమాదనంబును
బడమఱ విభ్రాజంబును నుత్తరంబున నందనవనంబు నను వనంబులును అరు
ణోదంబు మహాభద్రంబు శీతోదంబు మానసంబు నను సరస్సులును బూర్వాదిగ
నొప్పుచుండు మఱియును శీతాంజనంబును గురంగంబును గురరంబును మాల్య
వంతంబునను శైలంబులు మేరువునకు బూర్వకేసరాచలంబులుగను, త్రికూట
శిశిరపతంగరుచకనిషధకపిలగిరులు దక్షిణకేసరాచలంబులుగను సినీవాసము
కుసుంభము, కపిలము నారద్రము నాగము మున్నగు నగంబులు పశ్చిమకేసరాచ
లంబులుగను శంఖచూడ ఋషభహంస కాలంజర పర్వతంబు లుత్తరకేసరా
చలంబులుగను నొప్పుచుండు నిఁక మేరువుమీఁద మధ్యభాగంబందుఁ గనక
మయంబగు బ్రహ్మపురంబు పదునాల్గువేలయోజనంబులపరిమితితోఁ జెలువొందు.

గీ॥ ఈవిధి పురంబునకుఁజుట్టు♦నెంత యేని, యష్టదిక్కులయందేచి ♦ యష్టలోక
పాలకులపట్టణంబులు♦పొల్చిమీఱు, దివ్యజను లందఱుండుదురు ♦ దీప్తినందు.

వ. మఱియు నిద్దానికి విష్ణుపదవినిష్క్రాంతయగు గంగానది సీతయని, యలకనంద
యని చక్షువని, భద్రయని నాల్గుపేరులతోఁ దూర్పునుండి నలుదెసల నానాశైల
వనస్థలులదాఁటి యంబుధిఁ జేరు. 135

గీ॥ మేరుగిరిఁజుట్టుకొనియున్న ♦ ధారుణీధ్ర, దరులయందును నందనో♦ద్యానవనుల
దివ్యజను లప్సరస్సుర♦తీరతముల, సంతతంబు సుఖింతురు ♦ శంకరదక్ష.

క॥ భారతవర్షంబిఁకను దు, షారగిరికి దక్షిణమున ♦ సంద్రమున కుద
గ్ధారుణిమై తెగుఁగ్రదెదివ, భూరిసుఖంబులకునిద్ది ♦ మూలమయితగున్. 137

గీ॥ ద్వీపనవకంబులం దిది ♦ తేజరిల్లు, నవసహస్రపరిమితితో ♦ నగవనుప్రసం
దూర్పునఁ గిరాతులుందు రిం♦దుఁ బడమర, దక్షిణంబున యవనులు♦దగఁ జరింత్రు.

క॥ మఱియుత్తరమునఁ దాపసు, లురువుగ బ్రాహ్మణులు క్షత్రి♦యులు విట్ఛూద్రుల్
పరఁగుదు రిజ్యాఽజితులా, పరిచర్యలఁ గుశలు లగుచుఁ ♦ బ్రాఢిమ దనరన్.

వ. ఇఁక నిం దుపవర్షంబు లింద్రద్యుమ్న కసేరు తామ్రపర్ణ గభస్తిమన్నాగద్వీప సౌమ్య గంధర్వ వారుణ భారత సంజ్ఞల నొప్పుచుండు. ఇది తొమ్మిదవదియగు నిందు మహేంద్రము మలయము సహ్యాము సుదామము ఋక్షపర్వతము వింధ్యము పారియాత్రము నను గులపర్వతంబు లేడును మహేంద్రగిరిజాతంబులగు త్రియామ ఋషికుల్యామున్నగు నదీవతంసములును శుక్తిమత్పర్వత జాతంబులగు ఋషికుల్య కుమారి మొదలగు నదీమతల్లులును మలయపర్వతోద్భవంబులగు కృతమాల తామ్రపర్ణి మున్నగు నదీతిలకంబులును సహ్యాచలోద్భవంబులగు కృష్ణవేణి మున్నగు మహాధునులును ఋక్షపర్వతవినిర్గతంబులగు గోదావరి భీమరథి మున్నగు మహావాహినులును వింధ్యోద్భవంబులగు నర్మదాసురస మున్నగు మహానదులును మంచుఁగొండనుండి ప్రవహించిన గంగ యమున సింధు బ్రహ్మపుత్ర మొదలగుతటినీవతంసములును గలవు. ఇందుఁ గృత త్రేతా ద్వాపర కలియుగంబులావటిల్లుచుండు. ఈభారతవర్షంబునఁ దపంబును దానంబులు నీశ్వర పూజనంబులు నెక్కుడొనర్తు రిది కర్మభూమియని పేరొందినది. భూమండలంబం దెల్ల జంబూద్వీపంబును, నందునను భారతవర్షంబును శ్రేష్ఠంబని కోవిదులు వచింతు రన్యంబులు భోగభూములు. వేయింటికొక్కఁడిందు జన్మించు. స్వర్గాప వర్గాస్పదమార్గంబగు నీభారతవర్షంబునఁ బుట్టుటకు దివ్యులు వాంఛింతురిట్లు దక్షిణవర్షంబులతో నొప్పు లక్షయోజనవిస్తీర్ణంబగు జంబూద్వీపంబు తెఱంగె ఱింగించితి నిఁక దీనికన్న ద్విగుణంబు ప్లక్షద్వీపం బద్దాని కుప్పసంద్రంబుచుట్టు కందకంబైయుండు నందు గోమంతము చంద్రము నారదము దర్దురము సోమకము సుమనశ్శైలము వైభ్రాజంబను పర్వతంబులుండు నిందు దేవగంధర్వులు మానవులు వసింతు రిందలి జనంబులు పదివేలేండ్లు జీవింతు రిందు, అనుతప్త, శిఖి, పాపఘ్ని, త్రిదివ, కృప, అమృత, సుకృత యనెడు నేడునదులు ప్రవహించు చుండు నా నద్యుదకమును సంతోసంబుతో నందఱుఁ ద్రావుదురు. అందు యుగా వస్థ లేదు. ఎల్లప్పుడు త్రేతాయుగంబుఁబోలి యుండును. బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులు స్వధర్మపరులై 140

క॥ శంకరుని సర్వవిష్టప, శంకరు నిఁక సారసాక్షు ♦ సారసభవులన్
సంకటహారులను గొలుచుచు, జంకకయుందురు నితాంత ♦ సంతుష్టులునై.

వ. ఈద్వీపమధ్యమందు జువ్విమ్రాను మధ్యమందుండుటన్ జేసి యిది ప్లక్షద్వీపం బయ్యె నీప్లక్షద్వీపంబు నావరించి యిక్షురసార్ణవంబు చుట్టియుండు నద్దానిపైన

శాల్మలి ద్వీపంబు పూర్వద్వీపంబుకన్న ద్విగుణంబై యొప్పు నిందు శ్వేతము హారితము జీమూతము రోహితము వైకలము మానసము సుప్రభ మనునవి యేడు వర్షంబులుండును. ఇంక పుణ్యోదకంబులు సుశీతలంబులును నగు శుక్ల, రక్త, హిరణ్యా, చంద్రి, శుభ్ర, విమోచన, నివృత్తి, యనునేడు నదులు ప్రవహించుచుండును. ఇందెల్లరు భగవంతుని శంభునిఁ బూజించుచుందురు. ద్వీపంబందు బూరుగ చెట్టు మధ్యయం దుండుట నిద్ది శాల్మలి ద్వీపంబని పేరొందె నిద్దాని సురాసముద్రం బావరించి యుండు నింకఁ గుశద్వీపంబు పూర్వద్వీపంబుకన్న ద్విగుణంబు. అందు రక్కసులు దేవగంధర్వ కింపురుషులు బ్రాహ్మణాది నాల్గు జాతులతో నొప్పు మానిసులుందురు. వీరిందుఁ ద్రిమూర్తులఁ బూజించుదురు కుశేశయము, హరి, ద్యుతివంతము, పుష్పవంతము, మణిద్రుమము, హేమకూటము, మందరం, బనెడు పర్వతంబులుండును. ధూతపాప, శివ పవిత్ర సమ్మతి విద్య, దంభ మహీయను పేరులతో నొప్పు నదులుండును. ఈ కుశద్వీపంబు మధ్య కుశస్తంభ మొప్పియుండు. ఇది నేతిసంద్రముచేత సమావృతంబై యుండు. క్రౌంచద్వీపంబు తద్ద్విగుణంబు. దధిసముద్రసమావృతం బిద్ది క్రౌంచము, వామనము, అంధకారకము, దివాకృతి, మనస్సు, పుండరీకము, దుందుభి యను వర్షంబులతో నొప్పియుండు. గౌరి కుముద్వతి సంధ్యా రాత్రి మనోజవ శాంతి పుండరీక యనునదులు శుభోదకంబులు హిరణ్యావాలుకంబులై యుండు నిందు సువర్ణశోభితంబులగు వర్షశైలంబులందు దేవగణంబులు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులుందురిందు యోగియగు రుద్రుండు పూజింపఁబడును. క్రౌంచంబను పర్వతం బిద్దాని మధ్యనుండుట నిది క్రౌంచ ద్వీపంబనఁబడియె నింక శాకద్వీపము శాకవృక్షాధిష్ఠితంబు పూర్వద్వీపంబుకన్న ద్విగుణంబు. ఇది క్షీరసముద్ర సమావృతంబు. ఇం దుదయగిరి, జలధార, మస్తగిరి, అవికేశము, కేసరి, శతకేసరము, దేవయానంబనెడు పర్వతంబులును, సుకుమారి, కుమారి, నలిని, వేణుక, యిక్షు, రేణుక, గభస్తి యను నదులును జెలువొందు. నాల్గుజాతుల మనుజులుందురు. ఇందు భగవానుండగు సూర్యుండు పూజింపఁబడుచుండు. పాలసముద్రం బవ్వలఁ బుష్కరద్వీపంబుండు పూర్వద్వీపంబుకన్న నిది ద్విగుణంబు. శుద్ధోదకసముద్ర సమావృతంబిందు మధ్యంబున హేమ పుష్కరం బొప్పియుండు నట్లగుటఁ జేసి యద్ది పుష్కరద్వీపం బనంబడు నాకాంచనకుశేశయము బ్రహ్మదేవునికి నివాసంబు ఈద్వీప మధ్యమందు మానసోత్తరంబను పర్వతంబుండు నిది పూర్వాపరంబులనుండు వర్షంబులకు మర్యాదపర్వతంబుగ నుండును. మఱి యు నామానసోత్తర పర్వతంబు చివర సూర్యరథచక్రంబు నిరంతరంబు మేరుప్రదక్షిణంబు సేయుచు నహోరాత్రంబులఁ దనరఁ జేయుచుండు. ఇందు దివ్యులు పద్మాసనుని బూజింపుచు రుగ్జరాదుఃఖ రాగద్వేషాధర్మంబులు లేక పదివేలసంవత్సరంబులు

జీవింతు రిట్లు సప్తద్వీపంబులతోఁ బర్వతంబులతో ధాత్రీమండలంబు పంచాశత్కోటివిస్తీర్ణంబై విరాజిల్లు నిట్లు భూగోళంబు తెఱంగెఱింగించితి నిఁక ఖగోళంబుతీరెఱింగింతు విడుఁడు.

## —* ఖ గో ళ ము *—

క॥ ఇలపైని లక్షయోజన, ములపై రవిమండలంబు ♦ పొలుపెసఁగుచు న
వ్వలను బయి లక్షయోజన, ములమీాదన్ జందురుండు ♦ మురువుగనుండున్.

గీ॥ వెలయునటుపయి నొకపది♦వేలయోజ, నములపై బుక్షములు దీప్త♦లమర నట్టి
తారకామండలముపైనిఁ♦దనరుబుధుఁడు,బుధునకూర్ధ్వంబునందుఁగాఁ♦వ్యుఁడుదనరు.

క॥ ఆకావ్యున కూర్ధ్వంబున, నాకుజుఁడుల్లసిలు నింక ♦ నంతకుమీాదన్
శ్రీకరుఁడైన బృహస్పతి, జోకగఁదనరారు నతుల ♦ శోభలు దనరన్. 145

గీ॥ అందుపైని శనైశ్చరుం♦డమరియుండు, నొనర నాతనిపై లక్ష ♦ యోజనములు
పైని సప్తర్షిమండలి ♦ పరిఢవిల్లు, నందుపై లక్షయోజనా ♦ యామమందు.

క॥ ధ్రువుఁ డుండు నాతనికిఁబై, రవికాంతుల నీసడించు ♦ రమ్యతరమహో
భువనము చెలువొందు నజో, ద్భవులగు సనకాదులందు ♦ భాసిలుదు రొగిన్.

వ. ఆపైని జనలోకంబు వెలయు నందు వైరాజు లుల్లసిల్లుచుందు రద్దానిపైఁ దపోలోకం బలరు నందుఁ దపస్వు లుందు రటుపైఁ గడువవ్వాన బ్రహ్మలోకం బుండు నద్ది భూలోకంబున కెనిమిదికోట్ల యోజనంబులపై నలరు. 148

గీ॥ అందు బ్రహ్మణితోఁ జతు♦రాననుండు, వేదఘోషంబు వెలయఁగ♦వేడ్కనుండు
కుదురుగా నట కెన్మిది♦కోట్లయోజ, నములపైనుండు వైకుంఠ♦నగరభూమి.

క॥ ఉందున నిందిరతో నర, విందాక్షుఁడు పార్షదోరు ♦ బృందంబులతో
డం దనరియుండు నచ్చోట, నుందురు చెలువొంద వైష్ణ♦వోత్తములుగడున్.

వ. అచ్చోటికిఁ బదియాఱుకోట్ల యోజనంబులపైని మహాకైలాసంబుండు. అద్దానిపైని వేఱొండులేదు. 151

గీ॥ ఇందు బాలేందుమౌళి మ♦హేశ్వరుండు, అమ్మహేశ్వరితో సత♦మ్మలరుచుండు
కోట్లకొలదిగఁ బ్రమథులు♦గూర్మిసేవ, లాచరించుచునుందురు♦హారుసమొదవ.

వ. ఇఁక నందు ముక్తిత్రయంబునొందిన మాహేశ్వరులు సంతతం బీశ్వరులసాన్నిధ్యం బందుండి యవ్వారిఁ గొలుచుచుండుదు రద్దానికి సమానస్థలి సమీాపంబున గోలోకంబం దాలఁ బాలించుచు రాధాసనాథుండు కృష్ణుండు వసించి నిచ్చలు గోక్షీరంబులఁదెచ్చి మహేశ్వరుని కర్పించి యర్చించి మహేశ్వరానుగ్రహంబుఁ

బడయుచుండు నిది ఖగోళస్వరూపం బింకను మహీతలంబున కర్వాక్ప్రదేశంబగు పాతాళంబుఁగూర్చి చెప్పెద వినుండు. 153

## —* పాతాళములు *—

క॥ వసుమతి కధఃస్థలంబున, నెసఁగును బాతాళ మట ను♦పేంద్రునియంశం
బసదృశుఁ డురగేంద్రుఁడు తల,ల సుమంబులవలె జగంబు♦లఁ దాల్చు మునుల్!

గీ॥ మణివితతిరంజితాయత♦ఫణిసహస్ర,ముల ననలసంయుత శ్వేత♦భూధ్రమట్లు
శేషుఁ డొప్పుచుండు న♦శేషగుణ,భూషితుండయి పాతాళ♦భూమియందు.

క॥ మఱియుఁ బడిగెలబొదుల, విరిదండలఁ జాలఁ దాల్చి ♦ విష్ణుపదీవి
స్ఫురితరజతాద్రిఁ బోలుచుఁ, గరమలరెడు దండశూక ♦ ఘనుఁ డచ్చోటన్.

గీ॥ పొంకమగు పైఁడిటీవలఁ♦బోలి మెఱయు, నాగకన్యలు గొలువ నా♦నందమునను
బ్రహ్మదేవుని యనుమతిఁ♦బట్టి యెపుడు,భువనముల నెల్లఁ దలలను♦మోయుచుండు.

క॥ కడుభయదమౌ విషాగ్నిన్, గడుకొని బుసకొట్టుచుండుఁ ♦ గద్రూతనయుం
డడరుచుఁ గల్పాంతంబుల, వెడలిచి యన్నిసము భువన ♦ వితతిన్ గాల్చున్.

వ. మఱియు.

గీ॥ మహితఘూర్ణితనేత్రుఁడై ♦మహితుఁడాతఁ, డెప్పుడే నావలించిన♦నీయిలాత
లంబు కాననతీర్థశై♦లములతోడఁ, జలన మొందెడుఁ బ్రజలెంతో♦యులుకుఁజెంద.

వ. ఇఁకనీ పాతాళంబులు పదివేల యోజనంబులవిస్తారంబుతోఁ గ్రిందుగఁ గ్రిందుగ నతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళంబులను పేరులతో నేడు లోకంబులుండు. 160

క॥ ఈయవి రత్నప్రాసా, దాయతములు హేమభూము♦లతిసుఖదంబుల్
పాయక యిందు వసించెద, రాయసురవరేణ్యులు పవ♦నాశనజాతుల్. 161

క॥ రాఁడిటకుఁ దపనుఁడును శశి, రాఁడిటకు గ్రహంబు లుడులు♦రావిఁక నెపుడున్
బోడిమిమీఱఁగ మణులే, జాడను వెలుఁగును దనర్చు ♦ సంబరమొదవన్.

వ. మఱియు నందు

క॥ వనములు పుంస్కోకిలరుతి, ఘనములు కాసారములు వి♦కచపద్మ సుజీ
వనములు శాశ్వతయౌవన, ధనవతు లందంబు మించు ♦ తన్వీశ్రేష్ఠల్. 163

గీ॥ భక్ష్యభోజ్యాన్నపానముల్♦బహువిధములు,జాళువాపట్టువస్త్రముల్ ♦ సౌరభమున
నొప్పు లేపనములు తావి♦పుష్పములును, రవలసొమ్ములు నింటింట♦రాసులొప్పు.

వ. వెండియు వీణావేణుమృదంగసంగీతనాదంబు లెంతేనియు సంతసం బొసంగ స్త్రీ పూరుషులు దానవులు కాదవేయు లచ్చట సుఖంబు లనుభవించుచుందురిట్లతో లోకంబుల స్వరూపంబు నేర్పడగ జెప్పితి నీక నెల్లధర్మంబులందు స్త్రీరక్షణం బవసరంబు. స్త్రీరక్షణం బొనర్చుకొనకున్న నవ్వారు చెడి సంకరంబొనర్చెద రట్లు గావున మున్ముందు వారల మనం బెఱుంగుట కర్జంబగుట నద్దాని దేటపఱతు వినుండు. 165

క॥ నారదుఁ డొక్కపు డచ్చర, యా రామను బంచచూడ ♦ నరుస మ్మొనరగ జేరి యడిగె స్త్రీమానస, చారిత్రంబును నెఱుంగు ♦ చక్కటి నంతన్. 166

—* పంచచూడ స్త్రీస్వభావము నారదమునికిఁ జెప్పుట *—

గీ॥ పంచచూడయుఁ గేల్మోడ్చి ♦ పలికెనిట్లు, మునికి దేవర ! నేనును ♦ బోటినై యె టులవచింపుదుఁబొలఁతుల ♦ తలఁపుపోలుపు, నాయమగునొక్కో!యట్టిచం♦దంబునాకు.

చ॥ అనవుడు మౌని యిట్లనియె ♦ నచ్చరలేమకు నాతిమిన్న ! బొం కును వచియింప దోసమగుఁ ♦ గూడ దటుల్ నిజమైనవృత్తమున్ వినిచిన నేరమెట్లొనరు? ♦ వేగమె చెప్పుము నీముఖంబునన్ వినఁగఁ దలంచినాఁడ నిటు ♦ వెగ్గలమైన కుతూహలంబునన్. 168

క॥ అనుటయు నారదమౌనికి, వినయమ్మున స్త్రీలతెఱఁగు ♦ వినిపింప మన మ్మునఁబూని చారుహాసిని,యనియె నిటుల్ చెపుదువినుమ ♦ హాత్మ!ముదమునన్.

గీ॥ మంచికులమునఁబొడమిన ♦ మానినులును, రూపవతులును నాథుని ♦ ప్రాపుగలుగు వార లుచితంపుమర్యాద ♦ మీఱుదురిదె, స్త్రీలయందలిదోసంబు ♦ శిష్టచరిత! 170

క॥ విను మువిదకన్నలోకం, బునఁ బాపపుఁబ్రాణి లేదు ♦ మునికులతిలకా ! కనఁగ సకలాఘములకున్, వనితయె మూలం బరసిన ♦ వాఁడవు నీవున్. 171

గీ॥ చేడియలుఁ దమ్ము వాంఛించి ♦ సేవఁజేయు, వానిఁ గెలఁకులఁదిరిగెడు ♦ వానిగలసి క్రీడసేయుదు రోడరు ♦ కిల్బిషముల, కించుకేనియు నరయు మౌ ♦ నీంద్ర! మదిని.

చ॥ వెఱపున నేని వంగడపుఁ ♦ బేరిమి గౌరవ మెంచియేని బల్ సిరిఁగనియేని నాథుమది ♦ చేడ్పడునంచనియేని చూనరీ తెఱవలు గాముకాత్మలయి ♦ తెంపున నెవ్వని నేని జారునిన్ మరగి సుఖింతు రిందు నను ♦ మాన మొకించుక లేదు సంయమీ ! 173

క॥ మగనియు బావల మఱఁదుల, బుగులుననున్ బరిజనముల ♦ బుగులున మదికిం దగుపురుషులు సేకూరమి, మగువలు మగనికడనుందు ♦ మరియాదమెయిన్.

క॥ వీరికిఁ జొరరానిది యెం, దారయఁగా నొనర దగ్గి ♦ నైనను నేతేన్ మీఱిచనుచుందు రేపున, జారునిఁజేరంగఁ దావ ♦ సకులవతంసా ! 175

క॥ చూడరు సుందరరూపము, చూడరు శీలమును గులము♦ చూడరు విద్యన్
జూడరు ధనంబునున్ మగ, వాఁడేనియు ననుభవింత్రు ♦ భామలు మౌనీ! 176

గీ॥ అగ్ని దనియదు గట్టెల♦ నర్ణవంబు, నదులఁ దనియదు కాలుఁడ♦సుల దనియఁడు
భూతవితతులనట్టులే♦ పొలఁతులెపుడు, పురుషులన్ గూడి తనియరు♦ మునివరేణ్య!

క॥ ఎంతయుఁ గాచుచునున్నన్, బంతంబున నంధకుబ్జ ♦ వామనతతులన్
సంతనగొని పరపురుషుల, నెంతయుఁ జేరుదురెలుంగు ♦ మిద్ధతపస్వీ! 178

ఆ॥ మగని మొరఁగి యిట్లు♦ మగువలు ప్రీతిమైఁ, గుత్సితులగు పెఱలఁ♦ గూడుచుండ్రు
ఇదిమెదోస మెప్ప♦డిఁ గురుబోఁడులకడఁ, దెలియుమాత్మలోన ♦ దివ్యమౌని!

క॥ సిరులను భోగంబులనున్, బరమాలంకారములను ♦ వాంఛింపరిలన్
సురతంబునట్లు కోమలు, లరయఁగ లోకంబులందు ♦ ననఘచరిత్రా! 180

గీ॥ జముఁడు మిత్తియు బాతాళ♦సద్మమును వి, సంబు సర్పము లసిధార♦ వటులపవన
మగ్నియును బడబాముఖం♦బతివలును నొ, కటమెలంగెడువారు వి♦స్ఫుటముమౌని!

వ. ఇట్లుచెప్పి నమస్కరించినంత నారదుండు నిక్కంబాడితివని యక్కురంగనేత్రను మెచ్చిచనియెనిట్లు స్త్రీస్వభావంబును గుఱించి ముచ్చటించితినిఁక గాలచక్రమున మనుజులకు మృత్యుచిహ్నంబులఁ దెల్పెదువినుండు.

—*కాలజ్ఞానము*—

క॥ దీనిన్ బార్వతి కరుణా, ధీనమతిన్ శర్వు నడుగ ♦ దేవేశ్వరుఁ డ
మ్మానినికిటు లెఱింగించెను, మౌనీంద్రులు చెప్పుదు వినుఁడు ♦ మనములలరఁగాన్,

గీ॥ కత మొకించుక లేకయె ♦ గాత్రమెల్ల, వెల్లనై యమరిననేని ♦ వినుము మనుజుఁ
డాఱునెలలకులోపల ♦ నంతకపురి, కరుగఁగలఁడిది నిక్క మ♦హార్యతనయ!

క॥ మొకము కనులుపీనులు నా, లుకయును స్తంభదశ నొంద ♦ లోకేశ్వరిరో!
యిఁక నాఱునెలలలో నం, తకు గీమున నతిథి యగును ♦ దథ్యంబరయన్. 185

సీ॥ నేయి నూనెలయందు ♦ నీరంబునందు ద, ర్పణమందు మోము గ♦న్పట్టకున్న
అల యరుంధతి నిఁక ♦ నాయుతధ్యాని ధ్రువు, నాకసంబునఁ జూడ ♦ లేకయున్న
గ్రహణంబులేక భా♦స్కరచంద్రులఁ దమంబు, మ్రింగెడువట్లు గ♦నంగఁబడిన
కాకులతోఁ బతం♦గంబులతోడను, సూటిగాఁ దానొందు ♦ చుట్టఁబడిన

గీ॥ నాల్క వాపొంది యెంతయు♦ నైల్య మొంద, దంతపంక్తియుఁ జాలక్లే♦దంబుఁ జెంద
దిశలగుర్తింపలేక భ్రాం♦తినిగొనినను, మనుజుఁ డాఱుమాసములలో♦ మరణమొందు.

సీ॥ ఎడపక యొకనెల ♦ నెడమహస్తంబు కం, పంబును నొకతీరు ♦ వడకెనేని
దవడలున్ గొంతు కెం♦తయును దడిన్ వాలి, మించు వైఖరిని శో♦షించెనేని

తననీడయందు మ♦స్తకము గన్పట్టక, దురుసున మొండెంబు ♦ దోఁచెనేని
కాకమేనియు విహం♦గంబేని యలకపో, తంబేనిఁ దలమెక్కి ♦ తనరెనేని
గీ॥ కారణములేక మాతృక ♦ గణముదన్నుఁ, జేరి పరివేష్టనంబున ♦ మీఱెనేని
అట్టిమనుజన్ముఁడొకనెల♦యందె జముని, ప్రోలికేగఁగలం డిందు ♦ బొంకులేదు.

గీ॥ వట్టపగటను నుల్కాభి ♦ పాతనంబు, నడికిరేయిని నింద్రధ ♦ న్వంబుఁజూచె
నేని వాఁడాఱునెలలలో ♦ నినతనూజ, సన్నిధికిఁజేరు లేదిందు ♦ సందియంబు.

వ. మఱియు నింకను ఛాయాపురుష స్వరూపంబుఁగూర్చి చెప్పెదను వినుము.

—*ఛాయాపురుష దర్శనఫలభేదములు*—

క॥ ఇనునైనను శీతలర, శ్మినైనను వెనుకఁజేసి ♦ సితపటధరుఁడై
మనసున దైవముఁ దలఁచుచుఁ, దనఛాయను జూడవలయు ♦ ధారాధరిరో!

వ. అందు శిరోవిహీనంబైన నాఱుమాసంబులలో మృతిఁజెందు. 191

గీ॥ ధవళమైనను నాఛాయ ♦ ధర్మ మొందుఁ, గృష్ణమైనను నాఛాయ ♦ కిల్బిషంబు
శోణమైనను బందిలోఁ ♦ జొచ్చుఁ బీత, మైనఁ గలహంబువాటిలు ♦ నగకుమారి!

చ॥ మఱి విభుజుంకుగాఁ దనర ♦ మ్రిందుదు రిష్టపుబంధువుల్ మొగం
బొఱఁగిన క్షుద్భయంబు గటి ♦ యుక్ గనుపట్టక యుండెనేనియుక్
నురుఁగును భార్య జంఘలటు ♦ చొప్పడకున్న ధనంబుపోయెడున్
జరణములున్ గనక్బడని ♦ చందమునన్ బరదేశమేగెడుక్. 193

క॥ అనుటయుఁ బార్వతి శర్వున, కనియెను మరణంబుఁదెలియు ♦ నట్టివితముఁ దె
ల్పినయట్టులె సాంప్రితమున, ననఘా! మృతిఁగెల్చుజాడ ♦ నానతి యిమ్మా!

క॥ అనుడున్ శంకరుఁ డగజకు, ననె దేవీ! సర్వజనహి♦తార్థినివై యి
ట్లనువుగ నడిగితి వెంతయు, విను మింక నెఱిఁగింతు యోగ♦విద్యాసరణిక్.

వ. పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులు పంచభూతంబు లేతత్సమాయోగంబె పాంచభౌతికంబగు శరీరంబు. అందాకాశంబు సర్వవ్యాపియై యుండు. సర్వం బాకాశమందు లయించు. 196

క॥ ఎద్దాని వియోగంబున, నొద్దిక భూతంబులెల్ల ♦ నొందెడు స్వపదం
బద్దాని సన్నిపాతము, నెద్దేవుఁడు స్థిరముగాఁగ ♦ నేర్పడఁజెప్పెన్. 197

వ. జ్ఞానులగువారు తపోమంత్రబలంబుల నిది యంతయు నెఱుంగుదురనినఁ బరదేవి మహేశ్వరున కిట్లనియె. 198

గీ॥ దేవ ! మును ఘోరరూపుఁ డా ♦ దివ్యమూర్తి
కడుఁ గరాళుండు కాలుండు ♦ గర్వమెనఁగ
నీదు శూలహతిన్ జేసి ♦ నిహతుఁడై య
రల భవదనుగ్రహంబున ♦ బ్రతుకుఁ గాంచె. 199

క॥ పోరిఁబోరి నిను సంస్తుతులన్, మఱిమఱి సంతోసపెట్టి ♦ మరలఁ దనదియగా
నురవగు నధికారముఁగొని, పోరిగొనుచుండెను యక్షేచ్ఛ ♦ భూతవితతులన్.

వనమయూరము : అక్కటతన దేవర ! ద♦యామతి నెసంగన్
దిక్కఱి మృతిన్ గొనెడు ♦ దీనులను నెంతేఁ
జక్కఁగని చెప్పు మిఁక ♦ సాయమగు మార్గం
బెక్కరణిఁ గాలుని జ♦యింతురొ మహాత్మా ! 201

— * మృత్యుంజయ యోగములు * —

వ. అనిన మహేశ్వరుండు.

గీ॥ ధ్యానపరులైన యోగు లె♦ద్దాననేని, పంచతను జెంద రిద్ధి ధ్రు♦వంబు వారు
కాలునిన్ గెలుచుటకెందుఁ♦జాలువారు, రమ్యతరగాత్రి ! పర్వత ♦ రాజపుత్రి !

వ. ఆయోగంబును జెప్పెద.

క॥ హిమకరవదనా! చెప్పెద వినుము మేదురయోగవిధము♦నున్ సులువుగ భూ
తములైదు తద్గుణములును, నమరగ దేహంబు జనన♦మగు నిలలోనన్. 203

గీ॥ ఆకసంబున వాయువా ♦ యనిలమునను, నగ్గి యుద్దాన నుదకంబు ♦ లాజలములఁ
బృథివిజనియించువినుమువి♦భీతహరిణ,నయనరో! విలోమగతినశైలి♦లయముఁ జెందు

క॥ ఇల యైదు గుణంబులతో, సలిలము నాలుగుగుణముల ♦ జ్వలనుడు మూటన్
జెలువుగ రెంట సమీరం, బలయంబర మొక గుణమున♦నలరెడు సాధ్వీ! 205

వ. శబ్దస్పర్శరూపరసగంధంబులనెడు నీగుణంబులెప్పుడు భూతంబులఁ బాయునో నప్పుడవ్వి విపన్నంబులగును. అందువలనఁ గాలజిగీషుండగు యోగిచే శబ్దాది గుణంబులు స్వస్వకాలంబందుఁ జింతనీయంబులు. 206

క॥ దేవి! రహస్యముఁజెప్పెద, నీవిఁక నిద్దాని భక్తి ♦ నిరతుఁడును గడున్
బావనుఁడు శ్రద్ధధానుం, డౌ వానికిఁ జెప్పు వలవ♦దన్యున కెపుడున్. 207

గీ॥ రాత్రులందున దీప వి♦రహితమైన, యంధకారమునన్ జను♦లందఱును ని
దురను జెందుచునున్నప్పు♦డరసి సెజ్జ, యందుఁగూర్చుండి నుశ్వాస♦మమరుచుండ,

వ. యోగంబు సల్పవలయు నది యెఱింగింతు వినుము.

గీ॥ రహినిఁదర్జనిచేతఁ గ♦ర్ణములనొక్కి, యొక్కముహూర్తంబుకాలంబు ♦ నుచితగతి
అగ్నిసంభూతమైయొప్పు♦నట్టిశబ్ద,మును వినంగవలయు యోగి ♦ పువ్వుఁబోఁడి!

వ. ప్రత్యహంబిట్లు ఘటికాద్వయంబున నాయూకారంబుఁ దెలియుచుండిన. 210

క॥ ఇదిసర్వరోగములనుఁ, గుదురఁగఁ జేయును జయించు ♦ ఘోరపుమిత్తిన్
జదలున వర్షాబ్దములటు, చదురున గర్జిల్లఁజేయుఁ ♦ జంద్రార్ధముఖీ ! 211

వ. మఱియు నానాదంబును వినుచున్నట్టివాఁడు సర్వజ్ఞుండును సర్వదర్శియునై సర్వ
సిద్ధులొందును సంసారబంధంబునుండి ముక్తుండగు. యోగులలో శ్రేష్ఠతరుం
డగు. దేవీ ! నీకిట్లు శబ్దబ్రహ్మవిధిక్రమంబును జెప్పితిని. 212

గీ॥ ధాన్యమును గోరువాఁడెట్లు ♦ దాఁబలాల
మును విడి ప్రయత్నమున ధాన్య ♦ మును బడయునో
నిత్యమగు బ్రహ్మమునుగోరు ♦ నేర్పుకాఁడు
దా నటులు బంధమునువీడఁ ♦ దలఁపవలయు. 513

వ. మఱియు నన్నకాంక్షులగువారలు శబ్దబ్రహ్మమునుజెంది యాఁకలి దప్పులఁ
బాయుదు రిఁకను. 214

గీ॥ కాలపాశవిమోహితుల్ ♦ కడఁగి మిత్తి, జెందువారు కుబుద్ధులు♦ చెనఁటులిలను
శాబ్దిక బ్రహ్మ మెఱుఁగఁగాఁ♦జాల రెందు, వారు సంసారబంధంబు♦వదలలేరు.

క॥ నిద్దుర యాలస్యం బను, పెద్దయరుల్ గలవు వేగఁ ♦ బేరిమి వీనిన్
హద్దుగ లోఁబడునట్టుల, దిద్ది యొనర్పంగవలె స ♦ తీ ! యోగంబున్. 216

ఆ॥ పిన్నపాప మొదలు ♦ వృద్ధునివఱకిటు, లాత్మహితమునకు సు♦ఖాసనమునఁ
గూరుచుండి సలుపఁ ♦ గూడు శబ్దబ్రహ్మ, యోగకలను నాయు ♦ వుండువనుక

వ. ఇద్దాని పరిపాకంబున మృత్యుంజయదేహపుష్టియై యాయువును వీర్యవృద్ధిని
జెందు. ముదుకనియందుఁగూడ లాభించు నని విశ్వాసము కలదిఁకఁ దరుణులఁ
గురించి చెప్పవలసినదియేమి. 218

ఉ॥ అక్కఱలేదు మంత్రజప ♦ మక్కఱలేదిఁక బీజసంచయం
బక్కఱలేదిఁకాప్రణవ ♦ మక్కఱలేదిఁక లాఁతిమార్గముల్
జక్కఁగనిట్లు శబ్దమయ ♦ చారుతరంబగు బ్రహ్మమున్ జనుం
డెక్కుడుయత్నముల్ గొని య♦పేక్షనెఱుంగఁగఁ జెల్లుఁ గోమలీ ! 219

వ ఆశబ్దము నవవిధంబులుగఁ బ్రాణవిదులగు యోగులచేఁ జూపఁబడినది. ఆనాద
స్థితినిఁ గ్రమానుసారముగఁ జెప్పెదనువినుము. ఘోషము, కాంస్యధ్వని, శృంగ
రవము, ఘంటానాదము, వీణానిక్వాణము, వంశనినదము, దుందుభిధ్వానము,
శంఖారావంబు, మేఘగర్జనమను తొమ్మిదివిధములివ్వానివిడిచి పదియవదియగు

తుంకారమును బాగుగా నభ్యసింపవలయును. ఈ ప్రకారమభ్యసించిన యెడల యోగి పాపంబులఁ జెందడు. యోగపరిపాక మొందిన మృత్యుజిత్తగును. ఈనవ విధముల ఫలితంబుఁ జెప్పెద నాలకింపుము. 220

సీ॥ ఘోష మొప్పెడు నాత్మ ♦ కున్ శుద్ధిదము రోగ, హరము వశ్యాకర్ష ♦ కరమునగుచు
కాంస్యధ్వనియుఁ బ్రాణి ♦ గతుల నిరోధించు, భూతంబులను గ్రహం ♦ బులను నెట్టు
సతి! శృంగరవ మభి ♦ చారశాత్రవజనో, చ్చాటనమారణ ♦ సాధకంబు
ఘంటానినాద మా ♦ కర్షణంబొనరించు, నైలింపసిద్ధ క ♦ న్యలకు నేని
గీ॥ ఇఁకను వీణాక్వణనము ద ♦ క్స్యందు నేని, బరఁగు వానిఁ గనంజేయు ♦ వంశనినద
మఖిలతాత్త్వికసిద్ధిని ♦ నమరఁ జేయు, దుందుభిధ్వానము జరామృ ♦ తులను బాపు.

క॥ వినుశంఖారావమున భువనముల నెల్లను జరించు ♦ వలతియగుఘనా
ఘనగర్జనమున నాపద, లను బాయు మఱెట్టివైన ♦ లలితాంగి! ధరన్. 222

వ. ఇఁకను.

ఆ॥ ఏకచిత్తమొంది ♦ యెంతయు బ్రహ్మరూ, పంబుగాఁ దనర్చు ♦ భవ్యమైన
యనుపమంబునైన ♦ యల్లతుంకారంబు, విన నసాధ్యమొకఁడు ♦ వెలయుదెందు.
గీ॥ మఱియు నా శ్రోత సర్వజ్ఞ ♦ మండనుఁడును, సర్వదర్శియునై యుఁక ♦ సర్వలోక
చారియునునై చరించు వి ♦ కారములను, జెందఁడొక్కింతయాతఁడు ♦ శివసముండు.

వ. పరమేశ్వరి! యిట్లు శబ్దబ్రహ్మస్వరూపంబుతీ రెఱింగించితి నిఁ కేమి విననెంచెద వన నఖిలేశ్వరి యిట్లనియె. దేవా! వాయుమార్గంబు ననుసరించి ప్రాణాయామం బొనర్చినవారు కాలుని జయింతురందు రద్దాని నెఱుంగఁ జెప్పుమన్న శంకరుం డిట్లనియె. 225

క॥ దేవీ! చెప్పెద వినుమిఁక, బావనమగు యోగమద్ది ♦ ప్రాణాయామం
బేవాఁడొకమాసార్ధముఁ, దా విడువక చేయు మిత్తి ♦ దాఁటఁగలఁడిలన్. 226

వ॥ పవనధారణంబున జ్ఞానవిజ్ఞానంబులు నుత్సాహమును బ్రవర్తించును. 227

గీ॥ ఎవఁడు పవనంబును జయించి ♦ మెసఁగునట్టి, వాఁడు సర్వజగజ్జయ ♦ భాగ్యమొందు
నిల జరామృత్యువులను జ ♦ యించుఁ బ్రాణ, ధారణాధ్యానపరుఁడయి ♦ తనరవలయు.

గీ॥ లోహకారుఁడు భస్త్రిక ♦ లోనగాలి, నెట్లు నిండించి తన పను ♦ లెసఁగఁ జేసి
కొనునటులె యోగియగువాఁడు ♦ కూర్మి మీఱ, పవనధారణమభ్యసిం ♦ పంగవలయు.

గీ॥ వ్యాహృతిపురస్సరముగ గా ♦ యత్రిమనువు, రహిఁ శిరముతోడ నాయత ♦ ప్రాణుఁడగుచు
మూఁడుమాఱులు దా జపం ♦ బును నొనర్ప, వలెఁ దదేకాత్ముఁడగుచుఁ ♦ బుష్పంధయాలక!

ఆ॥ వాయవీయతత్త్వ ♦ వరయోగ మీయది, పరమయోగిజనుల ♦ భాగ్యలక్ష్మి
గృహము లర్కశశులు ♦ గ్రచ్ఛ అమరలుదు, రెపుడు మరలఁడతివ! ♦ యీసుయోగి.

క॥ నూఱేండ్లు విమలతరకుశ, నీరముఁగ్రోలుచుఁ దపించు ♦ నేర్పరికిఁగడున్
జేరెడు సుకృతఫలంబది, చేరుఁ బవనధారణంబుఁ ♦ జెందెసుకృతికిన్. 232

వ. వెండియు నెవఁడు మాంద్యముఁబాసి యేకాంతమందుఁ బ్రాణాయామం బొన ర్చునో యవ్వాఁడు ముసలితనమును రోగంబును మిత్తిని గెల్చి వాయుగమనంబున ఖేచరత్వమొందుచు మఱియు సిద్ధస్వరూపంబుఁ జెంది కాంతిని మేధను బరాక్రమంబును శౌర్యంబును గాడ్పుతోఁ దుల్యంబగు గమనంబును సుఖంబుగఁ జెందు నిఁకఁ బెక్కులేల? యే బాపఁ డుదయమున లేచి ప్రాణాయామం బొనరించునో యవ్వాఁడు బ్రహ్మలోకంబును జెందు నిందు సందియంబు లేదిట్లు వాయుసిద్ధిని జెప్పితి నిఁకఁ దేజంబువల్ల నగుదానిన్ జెప్పెదు వినుము. జనులెల్ల నిద్రించియున్నప్పుడు దీవియ లేని యంధకారంబందు సుఖాసనంబునఁ గూర్చుండి భ్రూమధ్యమందుఁ బ్రకాశించు వహ్నిజ్యోతినిఁ జూడవలయు నిది భ్రూచరీముద్రా యోగము. మఱియుఁ జేతివ్రేళ్ళతోఁ గన్నులనించుక పీడించి సగము ముహూర్తమేకభావుఁడై వెలుంగు జోతిసిఁ జూడఁదగుఁ దెల్లనై యెఱ్ఱనై నల్లనై చిత్రవర్ణమై యొప్పు నిది ఖేచరీ ముద్రా యోగము. 233

గీ॥ కనుబొమలమధ్యయం దలి ♦ కంబునందుఁ, బరఁగుబాలార్కతేజోవి ♦ భాసురమగు
జోతిఁగనుచున్న పురుషుఁడు ♦ సురుచిరేష్ట, గాత్రమును జెందు నిఁకఁ బర ♦ కాయమొందు.

వ. మఱియు నణిమాదిసంపన్నుండై దూరదర్శన దూరశ్రవణజ్ఞానవంతుండై బహురూపధారణ సామర్థ్యంబును ఖేచరతాసిద్ధినిఁ జెందు నిఁక వేదాధ్యయన సంపన్నులును నానాశాస్త్రవిశారదులును నగువారు సైతము పూర్వకర్మవశంబున మోహంబుఁ బాయలేరు. 235

గీ॥ కనుచుఁ గనలేరు వినుచును ♦ వినఁగలేరు, పాపమోహితులై యంధ ♦ బధిరులట్లు
తమమునకుఁ దొలనున్న య ♦ త్తపనవర్ణు, నా మహాపూరుషునిఁ దెలి ♦ యంగఁజెల్లు.

ఆ॥ విను సహస్రశీర్షుఁ ♦ డును సహస్రాక్షుఁడు, నును సహస్రపదుఁడు ♦ నునయి యొప్పు
నల పురుషుఁడు విశ్వ ♦ మందు దశాంగుల, సీమ నావరించి ♦ చెన్ను మీఱు. 237

వ. ఇఁక భూతములలో నాలవదగు నుదకభూతంబున నగు నమరత్వంబును జెప్పెదను వినుము. నియతమనస్కుండై యోగి సుఖాసనంబునఁ గూరుచుండి సమున్నత శరీరుండై కూర్పఁబడిన కరపుటములుగలవాఁడై చంచువునుబోలిన ముఖంబున మెలమెల్లగ గాడ్పుఁ బీల్చుచుఁ దాలుమూలంబులనుండి జీవదాయకములై స్రవించు నుదకంబులఁ గ్రోలుచుండవలయు నవి శీతలంబు లమృతజలంబు

లిట్లు నీని నిత్యంబు గోరిలువాఁడు మిత్త్రినిఁ జెందఁ డాకలి దప్పుల గెల్చి మహా తేజస్కుఁడై దివ్యకాయుండగును మఱియును.

గీ॥ ఏనుఁగువంటిబలంబు హరీంద్రుపట్టి, వేగము సుపర్ణువంటి మేల్ ♦ వీక్షణంబు
గలిగి కృష్ణకచములొప్పి ♦ పొలుచు దేవ, గురునిభుండయి దివ్యవత్సరశతంబు.

వ. ఇంకను నొకవిధంబుఁ జెప్పెదనువినుము రహస్యము. యోగియగువాఁడు నాలుకను దవడలనువంచి కొంచెముకాలముంచవలయు నట్లైనఁ గ్రమమున లంబికాయోగమును జెందును. అటుమీఁదఁ బ్రసరించు చల్లని జలంబును సుధనుబోలెఁ ద్రాగినయెడల నమరత్వమునుజెందును. ఇట్లు తపోవ్రత నియమ యోగాపథములచే ధర్మవిదులును నయవినయయుతులగువారు నై శారద్యంబున మిత్త్రిని గెలువవలయు నిట్లు నీవడిగినవానిఁ దెల్పితినని శివుం డుమతోఁ జెప్పెనని సూతుండు మునుల కెఱింగించిన నవ్వారు మహాత్మా! మన్వంతరంబులను దద్వంశంబుల నెఱింగింపు మనుటయు సూతుం డిట్లనియె. 240

## ప్రతిసర్గము - మన్వంతరంబులు - వంశములు - తదనుచరితములు

క॥ ధ్రువుని సమున్నతపదవీ, నివేశితు నెఱుంగఁ జెప్ప ♦ నే! మును మీకున్
సువిహితుఁ డాతఁడు పెక్కేం, డ్లవనిన్ బాలించె విబుధు ♦ లందఱు మెచ్చన్.

క॥ ఆ విభునకు సుతు లిర్వురు, పావనులగు పుష్టి ధాన్య ♦ భాసుర నాముల్
శ్రీ వెలయఁగఁ బుష్టికి సుతు, లావిర్భావంబుఁ జెంది ♦ రైదుగురు తగన్. 242

వ. రిపుఁడు రిపుంజయుండు విప్రుఁడు వృకలుఁడు వృషతేజుండు ననువారు. 243

క॥ సురుచికుమారుం డుత్తముఁ, డురుగుణనిధియైన నాతఁ ♦ డొక గుహ్యకుచే
దురమునఁ జంపంబడె నా, పరితాపంబున జననియుఁ ♦ బంచత నొందెన్. 224

వ. ధ్రువపౌత్రులైదుగురలో జ్యేష్ఠుఁడగు రిపునకుఁ బుష్కరిణియందు సర్వతేజుండను సుతుండు పొడమె నవ్వానికిఁ జాక్షుష మనువు జన్మించె. ఆ మనువునకు నడ్వలయందుఁ బురువు, మాసము, శతద్యుమ్నుఁడు, తపస్వి, సత్యజిత్తు, కవి, అగ్నిష్టోమాతిరాత్రులు, అతిమన్యువు, సుయశుఁడు ననువారు పదిమంది కొమరులు జన్మించిరి. అందుఁ బురువున కాగ్నేయియందు దాఱుగురు కొమరులంగుఁడు, సుమనుఁడు, ఖ్యాతి, క్రతు వాంగీరసుఁడు, గయుఁడు ననువారు జన్మించి రందు నంగునకు సునీథ యను ధర్మపత్నియందు దుష్టచేష్టుండగు వేనుండు పొడమె.

క॥ తనయుని చెడునడతలకున్, మనమునఁ గడు రోసి యంగ ♦ మనుజవిభుఁడు గా
ననుబడి యెందున నేనియుఁ, జనియెను జిత్తంబు కొంత ♦ శాంతిన్ జెందన్. 246

వ. అనంతరము.

గీ॥ రాజుగాఁ దనరిన వేనుఁ♦డోజఁ దప్పి, చెడ్డసేఁతలఁ బ్రజల హిం♦సించుచుండ
దివ్యమును లందఱును జేరి♦ తేఁకు వెసఁగ, నుగ్రులై చంపి రవ్వాని♦హుంకరించి.

వ. అటుమీఁద సునీథాప్రార్థనచేతను నరాజకంబగు లోకంబుఁ గాంచియును దద్దుః
ఖంబుఁ బాపఁగోరి దివ్యమును లవ్వేనునికుడిభుజంబును మథింప నందు ధన్వియుం
గవచియు సూర్యతేజస్వియు నారాయణావతారంబగు పృథువు జనించె. 248

క॥ ఆతఁడు గడుధార్మికుఁడై, భూతలమును నేలెఁగడిమి ♦ పొలుపొప్పఁగ వి
శ్వాతీతంబగు తేజము, ఖ్యాతియునున్ గ్రమ్మికొనఁగఁ ♦ గరమనురక్తిన్.

వ. మఱియు,

గీ॥ రాజసూయాహ్వయమహాధ్వ♦రం బొనర్చి, నట్టి యష్టలలో నీతఁ ♦ డగ్రగణ్యుఁ
డశ్వమేధశతంబుల ♦ నమరఁ జేసె, నర్చియను భార్యతోఁగూడ ♦ నాస్థమెఱయ.

వ. అమ్మహీనాథున కర్చియందు విజితాశ్వుఁడు, హర్యశ్వుఁడను వారలిద్దఱుపుత్రు
లుద్భవించిరి. ఆవిజితాశ్వునకు శిఖండినియందుఁ బ్రాచీనబర్హియను వాఁడుపుట్టె.
ఆతండు సముద్రరాజసుత యగుశతధృతియనుకన్యన్ బెండ్లాడె. ఆపెకు బహు
యజ్ఞకరుండగు ప్రాచీనబర్హివలనఁ బదిమందిసుతులు జన్మించిరి. ప్రాచేతసులనఁ
బడు నవ్వారు పిత్రాజ్ఞచే సాముద్రోదకంబందుండి రుద్రగీతంబు జపించుచు శివ
ధ్యానపరాయణులై పదివేలేండ్లు తపించిరంతఁ బ్రాచీనబర్హి యస్తమించుడు నర
క్ష్యమాణయగు పృథివియందుఁ బ్రజాక్షయంబయ్యె నదికాంచి యంతకుమున్న
దపఃఫలంబుఁ జెందియున్న ప్రాచేతసులు నిజరాజధానిన్ జేరుచుఁ బుడమియందలి
వృక్షంబులెల్లఁ బెచ్చుబెఱిఁగి మార్గంబులను నిరోధించి ప్రబలియుండుటఁగాంచి
యవ్వాని దహింపఁబూనిముఖమునుండియగ్నిమారుతుల విడిచిన నవ్వివనంబులఁ
గాల్చుచున్నఁ జూచి కొంతవడికి సోముఁడు వారిఁ దారసించి యిట్లనియె.

ఉ॥ కాల్పకుఁడింక భూజములఁ ♦ గానన మీయది దగ్ధమయ్యె నిం
దల్పతరంబులౌ ద్రుమము ♦ లా యెడ నా యెడ నున్నవిట్టి లీ
స్వల్పములైనవాని నిఁక ♦ సాఁకఁదలంపుఁడు మన్యువేగముం
మఱల్పుఁడు వేగ మామకకు♦మారిక యిందు వసించుఁ గాంచుడీ! 252

క॥ ఆకన్నియ వర్చస్విని, మీకదియగు ధర్మపత్ని ♦ మీరిఁక దానిన్
జేకొని వివాహమొందుఁడు, జోకగ నాదక్షుఁ డష్ట ♦ సుతుఁడై పొలుచున్.

క॥ పదిమంది కెట్టు లాలగు, నిది యొకతుక యని మనమున ♦ నెంచంబోకుం
డిది దైవచోదితంబై, యొదవిన దన వారలట్టు ♦ లొడఁబడి పేర్మిన్. 254

ఆ॥ వృక్షజాతమైన ♦ వెలఁదిని వారిని, బెండ్లియాడిరంతఁ ♦ బేర్మిదనర
వారి కాపెయందుఁ ♦ బ్రభవించె దక్షుండు, చాక్షుషాఖ్యమనువు♦ సమయమందు.

ప. అతండు ప్రజాసర్గరతుండై మానసికసృష్టిన్ గూర్ప నయ్యది వృద్ధిగామిం జేసి బ్రహ్మచోదితుండై మిథునవిధువనధర్మంబునఁ బ్రజావృద్ధిఁ బొనరింప నెంచి పరమేష్ఠితనూజయగు నసిక్ని యనుదానిన్ బెండ్లాడియున్నంత నాపెయందు.

క॥ ఆ దక్షుని కఱువదిగురు, పైదలులు జనించి రధిక ♦ భాసురచరితల్
సౌదామనీప్రకాశలు, మేదురతరశేముషీస ♦ మీహితలు గడున్. 257

ఉ॥ వారలలోన ధర్మునకుఁ ♦ బద్గురఁ జంద్రున కిర్వదేడ్గురన్
ధీరుఁడు కశ్యపాఖ్యకను ♦ ధీమణికిన్ బదుమూఁగు రంగిర
స్సూరికినిన్ గృతాశ్వునకు ♦ సొంపుగ భూతున కిద్దఱిద్దఱిన్
గోరి యరిష్టనేమికినిఁ ♦ గూతుల నల్వుర నిచ్చెఁ బ్రీతిమై. 258

ప. ధర్ముని సతులగు పదుగురు—భానువు, లంబి, కకుప్పు, జామి, విశ్వ, సాధ్య, మరుత్వతి, వసువు, ముహూర్త, సంకల్ప యను వార లందు భానువునందు సుతుండై ఋషభుండు పొడమిన నవ్వాని కింద్రసేనుండు జన్మించె. లంబియందు విద్యోతుండును మేఘంబు లుద్భవిల్లె. కకుప్పునందు సంకటుఁడుపుట్టుడు నవ్వానికిఁ గీకటుండు జనింప వానికి దుర్గాభిమానులగు దేవతలు జన్మించిరి. జామికి దుర్గాధిష్ఠానదేవతలు జన్మించిరి. వారికి స్వర్గుఁడు నందియునుం బుట్టిరి. విశ్వయందు విశ్వేదేవులు పొడమిరి. సాధ్యయందు సాధ్యులు జన్మించిరి. మరుత్వతియందు మరుత్వంతుఁడు (ఇంద్రుఁడు) జయంతుడునను వా రుద్భవించిరి. జయంతుండు విష్ణువగు నుపేంద్రుండు. ఇఁక వసువునం దయుఁడు ధ్రువుఁడు సోముఁడు ధరుఁ డనిలుఁ డనలుఁడు ప్రత్యూషుఁడు ప్రభాసుఁడు ననువారష్టవసువు లుత్పన్నులైరి. అందయునకు వైతండుండు శాంతుఁడు మునియనువారు కొమరులై పుట్టిరి. ధ్రువుండనువానికి కాళుండును సోమునకు వర్చుండును నవ్వానికి వర్చస్వియు ధరునకు ద్రవిణుండనువాఁడును, అనిలునకుఁ బురోజవుం డవిజ్ఞానగతియు ననువారును నగ్నికి శరస్తంబమునఁ గుమారుండు జన్మించుడు నాతని శాఖలందు శాఖుండు విశాఖుండును బృష్టమందు నైగమేయుండును జన్మించిరి. ప్రత్యూషునకు ఋషి యను దేవలుండు నవ్వానికిద్దఱు సుతులు మనీషులు ప్రజ్ఞావంతులు పొడమిరి. ప్రభాసునకు విశ్వకర్మ జనియించె. ఆ విశ్వకర్మకు మనువుజన్మించె. ముహూర్తయందు మాహూర్తికులను దేవగణంబులును సంకల్పుఁడగు కాముఁడునుబొడమిరిఁక భూతునకును రూపయనునాపె యందు రైవతాజభవభీమవామోగ్రవృషాకప్యజైకపాదహిర్బుధ్న్యబహురూపమహత్తులను నేకాదశరుద్రులును రుద్రపారిషదులగు భూతగణంబులు నుత్పన్నంబులయ్యె నిఁకఁ గశ్యపున కదితి దితి సురస అరిష్ట యిల దను సురభి వినత చేల తామ్ర క్రోధవశ కద్రువు ముని యను పొలఁతులు పదుమువ్వురు భార్యలైరి. వారియం దదితికి వైవస్వత మన్వంతరంబునం దింద్రోపేంద్రులును మఱియు నర్యముఁడు ధాత విధాత, త్వష్ట పూష వివస్వం

తుఁడు సవిత మిత్రావరుణులు, అంశుండు, భగుఁ డతి తేషుఁడు నను పన్నిద్దఱు
సూర్యులు జన్మించిరి. 259

ఆ॥ దితికిఁబొడమిరిఁకను ♦ సుతులు హిరణ్యాక, శిపు హిరణ్యాసయను ♦ లు పొలుపమరు
సింహికయను సుతయుఁ ♦ జెలువొప్ప నాహిర, ణ్యకశిపునకు సుతులు ♦ నల్వురిలను.

వ. అనుహ్లాద సంహ్లాద హ్లాద ప్రహ్లాదు లనువారలం దనుహ్లాదునకు సూర్యయందుఁ
బులోముఁడు మహిషుండును, హ్లాదునకు ధమనియందు వాతాపీల్వలులును సంహ్లాదు
నకుఁ గృతియందు బంచజనుండును, ప్రహ్లాదునకు విరోచనుండును జన్మించి రా
విరోచనునకు బలియును నాతని కశన యను భార్యయందుఁ బుత్రశతంబు
జన్మించె నందు జ్యేష్ఠుఁడగు బాణుండు శివభక్తాగ్రగణ్యుండై శివుని మెప్పించి
తద్గాణాపత్య మొందె నిఁకను. 261

గీ॥ ఆ హిరణ్యాక్షునకుఁ బుత్రు ♦ లై దుగురగు, కురు శకుని భూతసంతాప ♦ కులును గాల
నాభుఁడును బిరుదగు మహా ♦ నాభుఁడు నను, వార లెంతయు విశ్రాంత ♦ భూరిబలులు.

వ. సింహికను విప్రచిత్తి యనువాఁడు పరిగ్రహించె నిఁక దనువనునాపె కయోము
ఖుండు శంబరుండు కపోలుండు, వామనుఁడు, వైశ్వానరుండు, పులోముఁడు,
విద్రావణుండు మహాశిరుండు, స్వర్భానుండు వృషపర్వుండు విప్రచిత్తియను
మున్నగువా రనేకు లుద్భవించి రందు స్వర్భానునకుఁ బ్రభయును కన్యకయును
బులోమునకు శచియును వృషపర్వునకుపదానవిహయశిరశ్శర్మిష్ఠలును వైశ్వా
నరునకుఁ బులోమకాలకలును బొడమిరి.

సీ॥ ప్రభయనునామె చే ♦ పట్టె నానముచిని, శచియును జేపట్టె ♦ శక్రుఁబ్రీతి
నలయుపదానవి ♦ యాహిరణ్యాక్షునిఁ, జెందెను హయశిర ♦ చేరెఁ గ్రతుని
శర్మిష్ఠయు యయాతి ♦ జననాథు వరియించె, నిఁకబులోమయును గా ♦ లక మరీచిఁ
బెండ్లాడి రరువది ♦ వేలపుత్రులు వార, లకు నుద్భవించిరి ♦ ప్రకటబలులు

గీ॥ ఘనులు పౌలోములనువారు ♦ కాలకేయు, లనెడువారు నవధ్యులు ♦ నాఢ్యచరితు
లాహిరణ్యపురంబున ♦ నధివసించి, యుండిరవ్వారు ప్రతివీరుఁ ♦ డొండు లేక.

వ. సింహికయందు విప్రచిత్తికి రాహుప్రముఖులగువారు పదుమూఁగురు కొమరులు
జన్మించిరిఁకను దామ్రియను కశ్యపపత్నికి. 265

క॥ కాకియు శ్యేనియు భాసియు, లూకియు గృధ్రియును శుకి చె ♦ లువగశ్వియునా
జోకగు సుగ్రీవియునున్, వీఁకన్ జనియించి మిగుల ♦ వెలసిరి పుడమిన్. 266

వ. ఇఁకఁ గాకికిఁ గాకులును శ్యేనికి డేగలును భాసికి బాతులును నులూకికి గుడ్ల
గూబలును గృధ్రికి గద్దలును శుకికిఁ జిలుకలును అశ్వికి లొట్టిపిట్టలును గుఱ్ఱములు
గాడిదలును సుగ్రీవికి శుభపక్షులును జన్మించె. మఱియు నిఁకఁ గశ్యపపత్నులందు

వినతయందు దరుణ గరుత్మంతులును సురసయందును ననేక శిరోమండితంబులగు సర్పశ్రేష్ఠములు జన్మించె నాసర్పశ్రేష్ఠులలోఁ బ్రధానులు - శేషుఁడు, వాసుకి తక్షకుఁడు, ఐరావతుఁడు, మహాపద్మఁడు, కర్కోటకుఁడు, ధనంజయుఁడు, ధృతరాష్ట్రుఁడు, కుమారుఁడు, పుష్పదంతుఁడు, దుర్ముఖుఁడు, ఖరరోముఁడు మున్నగువారు. ఇఁకను గ్రోధవశకును గద్రువకుఁగూడ నిట్లే సర్పంబులు పుట్టె. సురభికి గోమహిష శశంబులును నిలకు లతావృక్షంబులు దృణజాతులు మున్నగునవి. యరిష్టకు మహాబలు లేఁబదిమంది దివ్యులును మునియను నాకె కచ్చరలును చేలయనుదానికి జక్కులు రక్కసులును బొడమి రియ్యాది కశ్యపసంతానం బిద్దానిచే జగంబెల్ల నిండెనిఁక 267

క॥ చందురుఁ డిరువదియేడ్వురు, సుందరులను జేకొనియు శ్వ ♦ శురు శాపమునన్
గుందుపడి యాత్మకాంతల, యందు నపత్యంబుఁ జెందఁ ♦ డయ్యెను మానుల్.

వ. ఇఁక గురుదారయగు తారయందుఁ జందురునకు జన్మించిన బుధుండు వంశకరుండయ్యె. మఱియుఁ గృశాశ్వుం డర్చియను నాపెయందు ధూమ్రకేశుని ధిషణయందు దేవలునిఁ గనె ననిన సూతునకు మహాత్మ! మన్వంతరంబుల నెఱింగింపుఁడనిన సూతుఁడిట్లనియె. స్వాయంభువుఁడు స్వారోచిషుం డుత్తముఁడు తాపసుఁడు రైవతుండు చాక్షుషుఁడు ననువా రతీతమనువులు. వర్తమానమనువు వైవస్వతుండు, మఱియిఁకను సావర్ణి, రౌచ్యకమనువు, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, దేవసావర్ణి, యింద్రసావర్ణియను మనువులు ముందఱ రాఁగలవారలు. వీరలందఱు పదునాలుగు రీవైవస్వతమన్వంతరమం దీమనువున కిక్ష్వాకువు నభగుఁడు ధృష్టుఁడు శర్యాతి నరిష్యంతుండు, నాభాగుఁడు, దిష్టుఁడు, కరూశకుఁడు, పృషధ్రుఁడు, వసుమంతుఁడునను వారు పదుగురు పుత్త్రులు-ఆదిత్యవసురుద్ర విశ్వేదేవమరుద్గణములు దేవతలు-పురందరుండను వాఁ డింద్రుండు, కశ్యపాత్రి వశిష్ఠవిశ్వామిత్ర గౌతమజమదగ్ని భరద్వాజులు సప్తర్షులు. కాశ్యపుండగు వామనుండు విష్ణుం డిట్టులే యతీతమన్వంతరంబులందు నాగామిమన్వంతరంబులందు, ఋషీంద్రదేవమనుపుత్త్రులు తత్తాదృశు లొప్పువారిఁక రాఁగల సావర్ణిమనూద్భవంబు నెఱింగింతు వినుండు. 269

## —* సావర్ణిమను జననము *—

చ॥ అతులతపోనిధానులు మ ♦ హాత్మకు లారయుఁ డాష్ట్యుఁ డావివ
స్వతునకు సంజ్ఞనాఁగ నొక ♦ చాన సధర్మిణి యుండె నాపెకున్
సుతులు జనించి రిద్దఱు య ♦ శోధను లమ్మనువున్ యముండునన్
సుతయు నొకర్తుకా యమున ♦ శోభితనిర్ఝరిణీవతంసమున్. 270

చ॥ మగని మహోష్ణరోచులకు ♦ మానినిసంజ్ఞ కడుఁ గనలంగి యి
మ్ముగ నొకకొన్నినాళ్ళు తన ♦ పుట్టినయింట వసింపఁగోరి చె
ల్వుగఁ దగుదాని ఛాయయను ♦ పొల్తినొకండు సృజించి యిట్లనెన్
మగువరో! నేనుబోలె విభు ♦ మానకకొల్చుచునుండు మిందులన్. 271

ఉ॥ నీకును సంతుగల్గినను ♦ నీవిఁక భేదముసేయ కెంతయున్
నాకొమిరెన్ గుమారులను ♦ నచ్చికమీఱఁగ నొక్కతీరుగా
సాఁకుచునుండు మివ్వితము ♦ స్వాంతమునందున నుంపు మేరికిన్
జోకఁదొలంగి చెప్పకుము ♦ చూడుము నాదుహితంబు సోదరీ! 272

చ॥ అననది యిట్లువల్కె విను ♦ మక్కరో! నావలనైన యంతకున్
బెనఁగివచింప నీవితము ♦ బిట్టగునొత్తిడి తారసిల్లి వే
ణిని గ్రహియించి నప్పుడెటు ♦ నిబ్బరమూనఁగఁ జెల్లుఁ? జెప్పెదన్
మనమున నుంతు నంత కను♦మానముసేయకు సుంతయేనియున్. 273

క॥ అనియిటులు వల్క నొడఁబడి, తనసంతతి నప్పగించి ♦ తరుణి దరలి పు
ట్టినయింటికేగి యందుల, మనమది నచ్చనికతమున ♦ మరలిరయమునన్. 274

ఆ॥ విభునిఁ గలసిమెలసి♦వేడుకలొప్పఁగా, నతులసౌఖ్యముల వి♦హారమొందు
చున్న ఛాయ నప్పు♦డువిద గనుంగొని, తనప్రవేశమునకు ♦ ననువుఁగనక

గీ॥ మూఢమతినయి యిట్టుల♦ముందువెన్క, లరయకొకచేడెఁబుట్టించి♦యాత్మవిభుని
బిడ్డలను గాపురంబు న♦ర్పించితి నిటు, లేకు మేకయ్యె నిపుడిఁక♦నెందుఁజొత్తు?

క॥ అనివనరుచు సంజ్ఞయు వే,గనె కురుదేశాటవులకుఁ ♦ గ్రక్కునఁజని య
వ్వలనునొక ఘోటియై తప,మును సల్పుచునుండెఁ దనవి♦భునిఁ గూర్చికడున్.

గీ॥ పద్మమిత్రుండు సంజ్ఞయన్ ♦ భావముననె,చాయతోడుత సౌఖ్యము♦ల్దక్కఁబడయ
ఘనుఁడు సావర్ణి యనుమను♦వును శనైశ్చ,రుఁడుఁ దపతియనుకన్యక♦పొడమిరంత.

మ॥ తనసంతానమునందు నెక్కుడుగ నా♦స్థన్ జూపుచున్ సంజ్ఞ సం
తునెడన్ భేదముసేయు చాయఁగని క్రు♦ద్ధుండై యముం డప్డు ద
ల్లినిఁ దన్నన్ బదమెత్త నాపెయు నటుల్ ♦ వీక్షించి నీకాలు మే
దినిఁ గూలంబడుఁగాకనా నతఁడు బల్ ♦ దీనాత్ముఁడై కుందుచున్. 279

ఆ॥ తండ్రిఁజేరఁబోయి♦తల్లివిధం బిట్టు, లెఱుకసేయ భానుఁ ♦ డెంతయేని
సందియంబుఁజెంది ♦ చనునె యిట్టులు పక్షపాత మంబకెం ద♦పత్యమందు.

క॥ తల్లియుఁ బెక్కులు దిట్టినఁ, జెల్ల నపత్యమున నిందుఁ♦జెట్టయదేవో
పెల్లెసఁగెనంచు బాలుని, తల్లడమది వాయ వేగఁ ♦ దరణి యిటు లనెన్. 281

వ. కుమారా! కృములు నీపాదంబందలి క్రొవ్వించుక హరించి పుడమిఁ జొచ్చు దాన నీకు మాతృశాపంబు చరితార్థంబగు. సత్యవాదివగు నీకిం దరిష్టంబును నఘంబును బొడమదని చెప్పి సత్వరంబున సతిం జేరి యిట్లనియె. 282

ఉ॥ కోమలి! నీవు నాయెడలఁ ♦ గూరిమిచేయుచునుండు వెంతయుం
నీమది నిర్మలం బిపుడు ♦ నీవు కుమారు నిటుల్ శపింపఁగా
నామనసొందె సందియము ♦ నచ్చికతో నెఱిఁగింపు సర్వముం
దామరసాక్షిరో! యింకను ♦ దైవముసాక్షిగ నచ్చుమానుచుం. 283

ఆ॥ చెప్పకున్న నిపుడె ♦ శిక్షింతునన నాపె, బెదరి సంజ్ఞ నీదు ♦ వేడికోపఁ
జాల కిట్లు నన్ను ♦ జన్మింపఁగాఁజేసి, నీదు సేవలోనఁ ♦ బాదుకొలిపి. 284

క॥ తరలెను బుట్టింటికి నా, తెఱఁగిది యన నాతఁడరసి ♦ తెఱవయెడల నే
దురితము లేదనుకొని స, త్వరమున యోగమతి సంజ్ఞ ♦ వసతి నెఱుంగం.

## — * అశ్వనీదేవతల జననము * —

క॥ కురుకాననములలో నొ,క్కరితయు గోడిగయునై ని ♦ కామతపంబుం
గురుకొని చేసెడు సాధ్విని, బరికించి మనమున నార్తి ♦ వడివేగమునన్. 286

క॥ ఘోటకమై సకిలింపుచు, ఘోటిం జేరంగఁబోయి ♦ కూరిమిఁగదియం
బాటించి పరుఁడొ యనువగ, దాఁటుచునుండంగ నినుఁడు ♦ దన్నుఁ దెలుపుచుం.

క॥ హేషలచేయుచు వెనుకొన, యోషారత్నంబు సంజ్ఞ ♦ ద్యుమణియె దను న
న్వేషించి వచ్చె ననుచు మ,నీష నెఱిఁగినంతఁ దరణి ♦ నెక్కొని బడబం. 288

గీ॥ క్రీడసేయఁగ జనియించి ♦ రీడు లేని, చక్కఁదనమున కిక్కలౌ ♦ చారుమూర్తు
లాశ్వినేయులు భాస్వంతుఁ ♦ డంత నాత్మ, తనువుఁగొనసంజ్ఞయున్నిజ ♦ తనువుఁ జెందె.

వ. అంత లోకబాంధవుం డపత్యకళత్రంబులఁగొని స్వీయమందిరముఁ జేరి భార్యాద్వయంబుతోఁ బుత్రషట్కంబుతోఁ బుత్రీద్వయంబుతో సుఖంబుండె నీ భాస్కరపుత్రులలో జ్యేష్ఠుండగు మనువె యీవర్తమాన వైవస్వతమనువు. ద్వితీయుండగు యముండు ధర్మనిబద్ధుండై ధర్మరాజనం బరఁగి జీవులకుఁ బుణ్యపాపంబుల ననుభవింపఁజేయు నధికారంబున నియుక్తుండయ్యెఁ దత్సోదరియగు యమున పుణ్యనదీవతంసంబై స్వీయోదకస్నానపానంబులఁ జేసి సకలదురిత ప్రశమని యయ్యె. ఇఁకఁ దృతీయపుత్రుండగు సావర్ణియనువాఁడు రాఁబోవు మనువై మెసంగఁగలఁ డిప్డు మేరుశిఖరంబునందుఁ దపించుచున్నవాఁడు. శనైశ్చరుండు శివుం గొలిచి తత్ప్రసాదంబున నవగ్రహంబులలో నొకగ్రహంబై బృహస్పతి మండలంబుకన్న నూర్ధ్వభాగంబందు వసించెఁ దపతియనుకన్యను సంవరణుండను రాజర్షి వరించి పెండ్లాడెనిక నాశ్వినేయులు స్వర్వైద్యులై తనరిరంత వైవస్వతమనువు

## —* వైవస్వతమను వంశము *—

క॥ చిరకాలము సంతతిలే, కరసి వశిష్ఠునిపనుపున ♦ యజ్ఞము సేయన్
గరమరుదుగ నిలయను కూఁతురు జన్మింపంగ నడలి ♦ ద్రుతముగమనువుఁ,

గీ॥ దేశికు వశిష్ఠుఁజేరి యు ♦ త్తేజఁగుఁ దెల్పి,కూఁతు రేటికిఁబుట్టెనో ♦ కో? యనఁ మ
హాత్ముఁడాతం డరసి తావ ♦ కాత్మపత్ని, కూఁతుఁ గోరుట నాతీరు ♦ హోత వ్రేల్చె

వ. దాన గన్యక జనియించె నైన దీని నా తపోబలంబునఁ బురుషుఁ జేసెదనని
యట్లు సాధించి పురుషునొనర్చిన నతండు సుద్యుమ్నుఁడను పేరఁ బరఁగుచు వర్ధిల్ల
నంత మనువు గొమరుని బట్టాభిషిక్తుఁ జేసిన నతండు. 293

క॥ లీలమెయి నొక్కనాఁడు భటాళియుఁ గరితురగవితతి ♦ యలరఁగ మృగయా
కేళీరతుఁడై ధరణీ, పాలుం డటవీస్థలికినిఁ ♦ బయనము చేసెన్. 294

వ. అట్లు జనపాలుండొక్కయుత్తమాశ్వంబెక్కి వెడలి మేరుపర్వతాగ్రారణ్యంబుఁ
జేరి యందొకకనుమనుబట్టి పోవుచు.

మ॥ పులులన్ దుప్పుల నెల్గుబంటుల వనీ ♦ భూదారరాజిన్ సివం
గుల సింగంబుల నేదుపందుల కదుర్ ♦ గుట్టల్ వలెన్గూల్చి శో
పిలి దూపన్గొని నీటికై వెదకి రా ♦ జీవాకరం బొండు ద
వ్వులఁగన్పట్టినఁజేరి రాజసుతుఁ డ ♦ ప్పొల్ గ్రోలె నెంతేనియున్. 296

క॥ తోడను వచ్చినవారలు, గూడను గంభీరవరము ♦ గూడజలములన్
బోడిగఁ దాగ్రివఁగ దొర యొక, యాఁడుదియయ్యెను జనంబు ♦ లాండ్రై రివెసన్.

క॥ గోడిగ యయ్యెను గుఱ్ఱము, వ్రీడయు వెలిపగ్గలింప ♦ విపినస్థలి న
చ్చేడియ లెల్లరునున్ గడుఁ, బోడిమిచెడి మెలఁగిరెంతొ ♦ పొగులుచు వగలన్.

ఆ॥ అనిన శౌనకుఁడు మ ♦ హాత్మ! యక్లేటికి, నాఁడువారలైరి ♦ అశ్వరత్న
మెట్టులయ్యె ఘోటి ♦ యెఱిగింపుమీ యన, సూతుఁడిట్లు సెప్పెఁ ♦ జోద్యమొదవ,

మ॥ ఒకనాఁడీశ్వరుఁ డార్యతో నచటఁ గా ♦ మోద్రేకయుక్తిన్ మహా
త్సుకుఁడై కేళి యొనర్పుచుండుడు ముని ♦ స్తోమంబు లానుస్థలీ
నికటంబున్ దఱియంగవచ్చిన భవా ♦ నీదేవి లజ్జించెఁ జే
రక దవ్వేగిరి తాపసేంద్రులు నగా ♦ రణ్యంబు వేఱొక్కచోన్. 300

గీ॥ అంత శంకరుఁ డాత్మ ప్రి ♦ యానురంజ,నార్థమైపూన్కితో నివ్వ ♦ నాగ్రిభూమిఁ
బురుషు లెవ్వారు చేరినఁ ♦ బొలఁతులగుదు, రంచు శపియించె నద్దాన ♦ నబలలైరి.

వ. అంత రాచపూఁబోఁడి నెచ్చెలులంగూడుకొని చింతతో నవ్వనాంతరంబులందు
లజ్జాభువై పరితపించుచుఁ దిరుగుచుండుడు దైవేచ్ఛచే రాజనందనుండగు బుధుం
డచ్చోటుఁ జేరి యచ్చపలలోచనను గనుకనిన్ గాంచి. 302

ఉ॥ బంగరుబొంగరంబులన ♦ భాసిలునట్టి మెఱుంగుగుబ్బదో
యిం గరుకొప్ప చూపుల వ ♦ హించి యలంచెడి వాలుఁగన్నులన్
రంగగుభృంగమాలయన ♦ రాజిలుపెన్నెఱివేణియందు మ్రు
హ్రంగుగఁజూచి రాజసుతుఁ ♦ డార్తత నచ్చపలాక్షి డాసినన్,

క॥ అక్కలికియు నక్కాంతుని, నక్కజముగఁగాంచి మరుని ♦ యలమటకుఁ గడున్
జిక్కి యనుమతినిఁ జూపినఁ, గ్రిక్కున నాతండు దేల్చెఁ ♦ గలికిన్ రతులన్.

—* పురూరవశ్చక్రవర్తి జననము *—

గీ॥ తోడ నెపురూరవుఁడుపుట్టెఁ ♦ దోయజాక్షి, కంత యక్కాంతయు వసిష్ఠు ♦ నంతరంగ
మందుఁ జింతింపవిచ్చేసి ♦ యమ్మహాత్ముఁ, డరసి తద్విధమెల్లఁ బో ♦ యనికరుణను.

క॥ శివునిన్ ముని గడుఁగొలిచిన, నవిరళకృపఁ దఱియవచ్చి ♦ యభవుఁడు వరమే
మి వలతో కోరుమన ముని, ప్రవరుఁడు సుద్యుమ్నపుంస్త్వ ♦ భావమునడిగెన్.

చ॥ అరసి శివుండు శాపగతి ♦ నమ్మునియందలి కూర్మిపేర్మి న
త్తెఱవను బూరుషున్ సలుప ♦ ధీరత నాతఁడు పుత్త్రితోడుతన్
బురమున కేగి పత్నియెడఁ ♦ బొందికతో గుణధుర్యులైనము
వ్వురు సుతులన్ గనెన్ మునుల ♦ పూన్కికి సిద్ధులు గల్గుటబ్రమే! 307

వ. అట్లుత్కలుండును గయుండును విమలుండునను పుత్త్రులు జన్మించిన సుద్యుమ్నుం డవ్వారిని బెంచి వారలం దుత్కలున కుత్కలదేశంబులను గయునకుఁ బూర్వ దేశంబును విమలునకుఁ బశ్చిమదేశంబు నొసంగి ప్రతిష్ఠానపురంబుఁ బురూరవునకిచ్చి యంతఁదపోర్థియై తాను వనంబునకేగినంత మనువు మరల పుత్త్రకాముండై శతాబ్దంబులు దపంబొనరించిన నిక్ష్వాకుఁడును శిబి నభగుండు ధృష్టుండు శర్యాతి నరిష్యంతుండు కరూషుండు నృగుండు వృషధ్రుండు కవియను వారలు పదుగురు పుత్త్రులు జన్మించిరందు నభగునకు నాభాగుండుపొడమె. నాభాగునకంబరీషుండు జన్మించె నాతనికి విరూపుండనువాఁ డతనికిఁ బృషదశ్వుండును నాతనికి రథీతరుండును జన్మించిన నందు రథీతరునకు సంతానంబు లేకున్న నంగిరసుండను బ్రాహ్మణునివలన స్వక్షేత్రంబందుఁబుత్త్రులంగనుటయు నవ్వారు రథీతరగోత్రులై పరఁగి రిఁక ధృష్టుని సంతానంబును దార్ష్టంబను వంశంబై బ్రాహ్మకులంబయ్యెనిఁక శర్యాతికి. 308

క॥ ఆనర్తుండను సుతుఁడు గ, లానిధియు సుకన్యయనెడు ♦ లలితసుతయునన్
మానుగ నుద్భవమొందిరి, మౌనిన్ బెండ్లాడె నక్కు ♦ మారియుఁ జ్యవనున్.

గీ॥ ముదుకమునిఁబెండ్లియాడియు ♦ ముదితమేలి, శీలమునవశ్వినులసాయ ♦ నోలిఁబడసి
విభునిసుందరుఁదరుణుఁగా ♦ వించి మేటి, భోగములఁజెందియలరెను ♦ బూర్వకోటి.

క॥ ఆనర్త సుతుఁడు రైవతుఁ, డానర్తాఖ్యమగు దేశ ♦ మందుం గడుఁ జె
ల్వా నగరి గుశస్థలినిఁ, దా నిర్మాణంబుచేసి ♦ తనరెనట రహిన్. 311

వ. అవ్వానికిఁ గకుద్మి మున్నగువారు నూర్గురుసుతు లుద్భవించి రందుఁగకుద్మి యను వానికి రేవతియను గన్యారత్నంబు లక్ష్మియట్లు జన్మించిన నవ్వాఁడా మెకు మగని నడుగుటకై యాపెన్ దోడ్కొని బ్రహ్మలోకంబున కేగి యా హిరణ్యగర్భు నడిగిన నాతండు మందహాసంబొనర్చి యిట్లనియె. 312

ఉ॥ నీ విటఁజేరినంత నవ ♦ నీవర! నీదగు బంధులెల్లరున్
నీవనుకొన్న రాసుతులు ♦ నీల్గిరి నీదగు రాజధానియున్
గావలులైన రక్కసులు ♦ గ్రిచ్చఱఁ బాడొనరించినార లా
శ్రీవిభుఁడైన కృష్ణుఁడటఁ ♦ జెల్వుగఁ గట్టెను ద్వారకాపురిన్. 313

చ॥ ఇరువదియేడుద్వాపరము ♦ లిప్పటికిం జనె నీవుచేర నిం
దిరువదియెన్మిదాయుగ మ ♦ హీనతరవ్రత! ద్వాపరంబిదే
జరుగుచునున్న దిప్డు చని ♦ చయ్యన శ్రీబలరామమూర్తికిన్
గరితనొసంగు మట్లయినఁ ♦ గాంక్షితముల్ సమకూరు నిండుగాన్. 314

వ. అనినఁ దన్నిమేషంబున బ్రహ్మచోదితుండై వచ్చి యక్కన్నెన్ బలభద్రమూర్తి కిచ్చి పెండ్లిచేసెనిఁకఁ బృషధ్రుండనువాఁడు గురునిచే గోరక్షణంబున నియోగింపఁబడి యొకచీఁకటియర్ధమరేయి వడిగ వానగురియుచుండ నొక్క శార్దూలంబువచ్చి కదుపునొకకంటింబట్టరా నది మొఱఁగి యఱచిన నతండు ఖడ్గపాణియైవచ్చి కటికిచీఁకటినరయక బెబ్బులియని యావుతలన్ ద్రుంచె నంతఁబులియు నలుకొంది పఱచెనంత నతం డుషస్సునఁదెగి పడియున్న మొదవున్ గాంచి దుఃఖితుండై యున్నసమయంబున గురుండెఱింగి తారసించి యిట్లనియె. 315

గీ॥ ఓరి! యనవహితాత్మక! ♦ యోరిపాపి!, సురభిఁ దెగఁదున్మి తిట్టుల ♦ నూటిదప్పి
నీయఘంబిఁక సురుఁగదు ♦ నీకు రాజ్య, లబ్ధిలేదిఁకఁ జను వృష ♦ లత్వమొంది.

వ. అనుటయు నతండజ్ఞానకృతదోషంబు హరించునట్లు మరల గురునిచే ననుగ్రహంబువడసి పెద్దకాలం బడవియందుఁ దపించి నిర్మలుండై శివానుగ్రహంబున మోక్షంబు బడసె నిఁక నృగుండనువాఁడును నజ్ఞానంబున గోదానవ్యత్యయంబునఁజేసి కృకలాసంబై పెద్దకాలంబుఁగడపి కృష్ణునిచే నద్దురితంబుఁబాసి యుత్తమలోకంబుఁజెందె. కరూశుండనువానికిఁ గారూశులను తనయులుజన్మించి యుత్తరంబుననున్న కరూశదేశంబునకు రక్షకులైరి పరిష్యంతుండను వానికిఁ జిత్రసేనుండను పుత్త్రుండు జన్మించె నవ్వానివంశంబున నగ్నివేశుండనువాఁడు జన్మించి మహర్షి యయ్యె నాతని సంతతివారు బ్రాహ్మణులైరి. 317

క॥ కడఁగొట్టు మానవుండీకఁ, గడుఁబుణ్యుఁడు కవిసమాఖ్యు ♦ గనినట్టిఁడు దాఁ
బుడమిని భోగంబులఁబడి, పడసె శివానుగ్రహమును ♦ బరమపదంబున్. 318

క॥ ఇల నిక్ష్వాకునృపునకు సుతులు నూర్గురు వారిలోన ♦ దోర్బలధుర్యుల్
విలసితయశులు వికుక్షి మొదలుగాఁ గలవారు మిగుల ♦ దంటలు కడిమిన్. 319

వ. అవికుక్షి పురంజయుఁడనియు నింద్రవాహుండనియుఁ గకుత్స్థుండనియుఁ జేకొంది పెక్కురు రక్కసులం జదిపి వేల్పులఁ బ్రోచె నయ్యనఘునకుఁ బృథుండను సుతుండు పొడమె నాతనికి జంద్రుండనువాఁడును నాతనికి యువనాశ్వుండును నాతనికి శావస్తియనువాఁడు జన్మించి శావస్తియను పట్టణంబుఁ గట్టె. ఇతని నాశావస్తికిఁ గువలయాశ్వుండు జనించె నాతండు మునిప్రార్థనచేఁ బుత్త్రిశతంబుతో ననికి వెడలి దుంధుండను మహాశూరుండగు దానవుఁ బొలియించె మఱియు సంగరంబం దా రాజోత్తముని పుత్త్రులలో ముగ్వురు దక్కఁ దక్కిన వారు మృతులైరి. మిగిలినవారు దృఢాశ్వుండు గపిలాశ్వుండు భద్రాశ్వుండు ననువారు. దృఢాశ్వునకు హర్యశ్వుండును నవ్వానికిఁ గుంభుఁడును వానికిఁ గృతాశ్వుండును వానికి సేనజిత్తనువాఁడును నవ్వానికి యువనాశ్వుండు జన్మించి యనపత్యుండై మహర్షులయనుమతితో నింద్రేష్టి నొనరించి యర్ధ రాత్రి పిపాసతోఁ గలశంబందలి మంత్రోదకంబుఁ ద్రావె. దానఁ జూలేర్పడ గర్భంబుఁ జించుకొని మాంధాతయను చక్రవర్తి జన్మించె నింద్రప్రసాదంబున యువనాశ్వుండంతముఁ జెందక జీవించె. మాంధాతయు దిగ్విజయంబు చేసి శశిబిందుఁడనువాని కూతున్ బెండ్లాడి యాపెయందు ముగ్వురు కొడుకులను నేఁబదిమంది కన్నెలనుగని యక్కన్నెల సౌభరియను మునికిచ్చి పెండ్లిచేసె. మాంధాతపుత్త్రులు పురుకుత్సుం డంబరీషుండు ముచికుందుఁ డనువారు. అంబరీషునకు యువనాశ్వుం డాతనికి హారితుండుపుట్టె. అంబరీష యువనాశ్వ హారితులు మాంధాతృగోత్రంబునఁ బ్రవరులు. ఇఁకఁ బురుకుత్సుం డనువాఁడు నర్మదయను నాగకన్యకన్ బెండ్లాడి యాపె యందుఁ ద్రసదశ్వుం డనువానిఁ బుట్టించె నవ్వాని కనరణ్యుండు పొడమె వాని సంతతియందుఁ ద్రిశంకుండు జన్మించె. 320

గీ॥ గురునిశాపవశంబునఁ ♦ గూలి యంత్య, జత్వమొందె త్రిశంకుండు ♦ చటులతేజుఁ
డైన కౌశికునయనొంది ♦ యాకసమున, నుండె నెంతయు దీప్తులు ♦ దండికొనఁగ.

వ. ఆతనిపుత్త్రుండు లోకోత్తరుండగు హరిశ్చంద్రుం డాయనకు రోహితుండను పుత్రుండు నవ్వానికి హారితుం డతనికిఁ జంపనాముండగు సుతుం డుద్భవించి చంపయను పట్టణంబుఁ గట్టె నాచంపుని సంతతియందుఁ గ్రమంబుగా బాహుకుండు జన్మించి దైవప్రాతికూల్యంబున శత్రువులగు హైహయులచేఁ బరాజితుండై.

గీ॥ ఎండకన్నను వానక♦న్నెఱుఁగనట్టి, పొలతులనుదోడుకొని వేగ ♦ భూరిగహన
తలముఁజొచ్చియటను నౌర్వ♦తాపసేంద్రు,నాశ్రమముఁ జేరియుండె భ♦యంబుఁదక్కి

గీ॥ అరసి యేయెండ కాగోడు ♦ గంచు నెంచి, భక్తిమెయిఁ దాపసేంద్రుని♦పాదసేవ
నంబుఁజేయుచునుండికొ♦న్నాళ్ళమీఁదఁ,గాలధర్మంబుఁజెందఁద♦త్కాంతలపుడు.

వ. చిచ్చురుకంబూనుడు నందొక్క దాని నంతర్వత్నిగా నెఱింగి యౌర్వుం డాఁపె
నాపె నమ్మానిని చూలొందియున్నపు డొర్వక సవతులు గరళంబుఁ దినిపించి
రద్దాన నాపెయు గర్భస్థపిండంబును నీశ్వరేచ్ఛచే మరణింపక మనిరి. 325

ఆ॥ మంచితారయందు♦మంచిలగ్నమునందు, నైదుగ్రహము లుచ్చ♦యందునుండ
సగరచక్రవర్తి♦జన్మించెఁ గరముతోఁ,గూడ శత్రుకోటి ♦ గుండెలవియ. 326

—* సగరచక్రవర్తిచరిత్రము *—

క॥ మునివరుఁడగు నౌర్వుండా, జనపతితనయునకు జాత♦సంస్కారములన్
బొనరిచి వేదత్రితయం, బును నాగ్నేయాస్త్రమొసఁగెఁ ♦ బూర్ణతరకృపన్.

వ. ఇఁకనారాజపుత్త్రుండు గరంబుతో జనించుటఁజేసి సగరుండనాఁ బరఁగి మహా
శూరుండై. 328

చ॥ కడఁగి రిపూత్కరంబులను ♦ గార్ముకధారల నస్త్రవహ్నిచే
సుడియఁగఁ జేసి హైహయులఁ ♦ జొప్పడఁగించి స్వకీయరాజ్యమున్
బడసి శకాధిరాజులను ♦ పారదులన్ యవనాధినేతలన్
జెడుఁగుల గెల్చి పట్టి కడు ♦ శిక్షయొనర్చెఁ బ్రతాపమేర్పడన్. 329

క॥ ఆనృపునకు సతులిద్ద ఱ, నూనవ్రత లిద్ధమతులు ♦ యోగ్యచరిత్రా
ధీనలు కేశిని సుమతి య, నానొప్పెడువారు వికచ ♦ నాళీకముఖుల్ . 330

క॥ వారలలోఁ గేశినికిఁ గు, మారుఁడొకండు వొలిచె నస ♦ మంజసుఁడనఁగా
ధీరులు పెక్కురుతనయులు, శూరులు జన్మించిరల్ల ♦ సుమతికిఁ గడిమిన్. 331

క॥ అసమంజసుఁడను వాఁడిల, నసమంజసుఁడై ప్రజలకు ♦ ననిశము బాధల్
విసువక కూర్చుచునుండినఁ, గసితో నృపుఁ డడవి కనిపెఁ ♦ గన్నకుమారున్.

వ. ఆయసమంజసపుత్త్రుండు.

క॥ నీతియుతుఁ డంశుమంతుం, డాతతభుజవిక్రముఁడు మ ♦హాబాహుం డా
ఖ్యాతుఁడు శూరాగ్రణులం, దాతని మెచ్చెదరు పౌరు ♦ లందఱొకమతిన్. 333

వ. సుమతీ పుత్రు లఱువదివేలవారు శూరులై యొరుల లెక్కసేయక యుక్కు
తునియలై యెక్కుడు గరువంబుతో నిక్కుచుండి రంత సగరుం డశ్వమేధ దీక్షి
తుండై మఖాశ్వంబువెంట రక్షార్థంబు గొడుకులన్ బనిచిన. 334

క॥ జనపదములఁ బట్టణముల, వనపదముల మండలందుఁ ♦ బర్వతములయం
దనువుగ నాహయము చరిం, చెను దన్ను సగరజులరసి♦చెంతల వెలయన్. 335

వ. అంత.

గీ॥ నారదుని చోదనన్ జేసి♦నాకవిభుఁడు, హయముఁ గొనిపోయి తగఁగపి♦లాశ్రమంబు
ముందఱన్ గట్టివేసెను♦మోసపోయి, హరినిఁ గోల్పడి సాగరు♦లాతురులయి. 336

క॥ పురమును బురమును గిరినిన్, గిరిని వనంబును వనంబుఁ ♦ గ్రేకమనక వే
తిరుగుచు వెదకుచునుండిరి, తురగం బెచ్చోటనుగాని ♦ దోఁపకయుండెన్. 337

గీ॥ అంత వారలు భూవల♦యాంతరాళ, మంతటను శోధన మొనర్చి♦హయము నెందుఁ
గనక వ్యాకులచిత్తులై ♦కడిఁది వగను, బుట్టలనుఁ ద్రవ్వుకొనుచు ద♦ వ్వులకుఁ జనిరి.

క॥ ఏపుట్ట నెట్టిశేషుఁడో?, రాపొనరింపంగఁ జనునె? ♦ రాజసుతులు దో
ర్త్సపరవశులై యరయక, యాపగిదిగఁ బృథివిఁ ద్రవ్వి♦యరయుచునుండన్. 339

గీ॥ ఒక్కచోఁ బూరిమేయుచు ♦ నున్నయశ్వ
రత్నమును గని చాలహ ♦ ర్షంబుఁ జెంది
ఎవ్వఁడో కో? వాజి ముచ్చిలి ♦ యిందుఁ జేర్చె
వానిఁ దెగటార్చవలదె మె ♦ వ్వఁడుగాని. 340

చ॥ అనుకొని వారలంద ఱర ♦ యన్ గపిలర్షి మహాత్ముఁ డుండు పా
వనుఁ డగుపట్టి నంత వడిఁ ♦ బారివనూనులు కొవ్వుమీఱి మా
నిని గని యోరి! నిల్వుమిఁక ♦ నీవు మఖాశ్వము ముచ్చిలించి యిం
దనువుగ దాఁచికొంటివె ? దు♦రాత్మ! యెఱుంగక సాగరావళిన్: 341

## —* సగరసుతులు కపిలకోపాగ్నిచే బూదియగుట *—

క॥ అనియిటు లహంకరించిన, విని యమ్ముని హుంకరించె ♦ వేగ సగరజుల్
మునుకొని దహింపఁబడి యం, తనె భస్మంబైరి తమదు ♦ దర్పముతోడన్. 342

గీ॥ జన్మమునుగాని జన్మపుం♦జక్కిగాని, యెఱుఁగక మహాతపంబున ♦ నెసఁగు కపిల
సంయమునిఁ దాఁకి సురిగిరి ♦ సాదురేగె, నేని తల పొలమునఁ గాని♦నిలువదనరె!

చ॥ కొమరులు రాకయుండుటయు ♦ ఘోటక మాసరివాద్దు నెందు నా
గమనము సేయకుండుటయుఁ ♦ గన్గొని యాసగరప్రభుండు జ
న్నము నెడ దీక్షితుండగుట ♦ నందననందను నంశుమంతు డి
ప్రిముగ హయంబు జాడఁ గనఁ ♦ బంచెను బావనదీప్తిసంచయున్. 344

గీ॥ అంత నతఁడును వసుమతి♦నంతఁ దిరిగి, గర్తములదారి యందందుఁ♦గలయఁ జూడ
నొక్కచోఁ గానవచ్చె న♦శ్వోత్తమంబు, దానిదగ్గఱఁ గనువచ్చెఁ ♦ దావనుండు.

చ॥ కని మునివర్యు పాదముల ♦ గ్రక్కున వ్రాలిన నమ్మహాత్ముఁడా
తనికి సమస్తమున్ దెలిపి ♦ తా హయరత్నమునిచ్చి పంపఁగా
వనరుచు నాతఁడున్ హయముఁ ♦ బట్టుకపోయియుఁ దాతకిచ్చి తా
వినిచెఁ దదీయపుత్త్రికుల ♦ వృత్తము నశ్రుల వెల్లిగొల్పుచున్. 346

గీ॥ ఘోరమగు వాక్యముల తేఁడు ♦ కూలిపడి క
డున్ గడున్ దుఃఖమునను మి♦డ్కుచు మఖంబుఁ
గల్పవిధితోడ సంపూర్తి♦గా నొనర్చి
యవభృథముఁ జెందె భూప్రజ ♦ లంత మెచ్చ. 347

చ॥ మునికినుకన్ గరంగిన య♦మోఘులఁ బుత్త్రుల నుద్ధరింపఁ బా
వనియగు స్వర్ధునిన్ భువికిఁ ♦ బాఱఁగఁ జేయుఁ డటంచు నారదుం
డనఘుఁడు సెప్పిపోయె నిఁక ♦ నట్టులొనర్పఁగఁ జాల కెట్టులో
వనరుచు రాజ్యమేలి త్రిది♦వంబున కేగె నృపుండు పేర్మిమై. 348

గీ॥ అంశుమంతుండు ప్రభుఁడయి♦యవని నేలి, ఘనభుజు దిలీపుఁడను నొక♦తనయుఁ బడసి
రాజ్యమున వానినిల్పి య♦రణ్యమునకుఁ, దపసుఁ జేయఁగఁ జనియె ను♦దారమతిని.

వ. అంత.

క॥ భూపుండై చెల్వొమరు ది, లీపుడు ధర్మిష్ఠుఁడును బ♦లిష్ఠుఁడునైనన్
బాపఘ్నయైన గంగను, భూపదవినిఁ జేర్పలేక ♦ పొగలెన్ మదిలోన్. 350

ఉ॥ ఆనృపవర్యపుత్త్రుఁడు మ♦హాబలుఁ డిద్ధపరాక్రముండు నా
నానరపాలశేఖరఘ♦నద్యుతిరంజితపాదపద్ముఁడున్
మౌనిజనప్రియుండును స♦మంచితకీర్తియునౌ భగీరథుం
డానరనాథశాసనము ♦ నంది నృపాసనమెక్కి యుక్కునన్. 351

—* భగీరథుఁడు పుడమికి గంగను దెచ్చుట *—

వ. ప్రపితామహులపాటు విని యవ్వారల నుద్ధరించుటకై దేవగంగావతరణంబుఁ గూరుపంబూని హిమశైలారణ్యంబున కేగి యందు దేవగంగఁ గూరిచి తపించిన నాయమ పొడసూపి యభిమతంబడుగు మనుడు దివినుండి తన్ను ధరిత్రి నవతరణంబు సేయుమన్న నా త్రిభువనపావని యిట్లనియె. 352

చ॥ హరుని భజింపు మాయనఘుఁ ♦ డాశ్రితసౌఖ్యకరుండు నన్ను శం
కరుఁడు వినాగ నొండొకఁడు ♦ కౌశలిమై ధరియింపలేఁ డిటుల్
ధరణికిఁ జేరవచ్చిన వృ♦ధాయగు నీకు ఫలంబు గల్గ ది
త్తెఱఁగునఁ బాటిపోదు బలి♦ధిష్ణ్యముఁ బన్నగలోక ముద్ధతిన్. 353

క॥ అని యంతర్ధానం బా ధునీవతంసంబు సేయఁ♦దోడనె శివునిన్
మనమున నిల్పి భగీరథుఁ, డనువుగఁ దపమున్ బొనర్చె♦ హాయనము విధిన్. 354

గీ॥ అంత బాలేందుమౌళి ప్ర♦త్యక్షమొంది, యాభగీరథునకు ననె♦ హాసమమ్యో
గంగను ధరించి నీకొసం♦గఁగల నిప్డు, నీదు ప్రపితామహులఘంబు♦ నిస్తరింప.

## —* గంగావతరణము *—

క॥ అని మందాకినిఁ దలఁపుడు, ఘనవేగముతోడ నాకె♦ కనుపడి శివునిన్
గొని పాతాళముఁ జేరుట, కును దలఁప శివుఁడు కపర్ద♦కుహరమున ధునిన్. 356

గీ॥ వేగఁ జేరిచి బంధించి♦బిందువొకటి, నృపునకొసఁగఁగ ధారయై♦ నెగడి ధంధ
ణాధణాధణధణధణ♦నాదములను, బెక్కు సేయుచు నురువడి♦ యుక్కు మీఱి. 357

క॥ కలహంసగతులతోడను, సలలితముగ గంగ వెడలఁ♦ జక్కఁగ నృపుఁడా
నెలతల దొరకును గంగకుఁ, బలుతీఱు నుతులనుసల్పి♦ వాహిని కనిమెన్.

క॥ గంగా! మాకలుషము లడఁ, గంగాఁ బొనరింపు మమ్మ!♦ కారుణ్యమెసం
గంగా నీసరిధుని కలు, గంగా వినమెందు నిజము♦ కంజాతముఖీ! 359

క॥ గంగా గంగా యనుచు మ, దిం గడు నిను దలఁచిరేని♦ దేహాలఘములన్
భంగింతురు నాకముకే, గంగల రీనుడినిఁ గల్ల♦ గలుగదు గంగా! 360

గీ॥ అని రథంబెక్కి యానృపుఁ♦డరుగుచుండఁ, దోడనే గంగయును సము♦త్తుంగభంగ
రంగదున్నతమీనతి♦మింగిలాహి, చక్రచక్రాంగచక్రాభి♦నందితయయి. 361

చ॥ చనిచని కాపిలాశ్రమముఁ♦ జక్కఁగఁ జేరఁగఁ బోయి యందులన్
మునివరకోపదగ్ధుల స♦మున్నతులన్ సగరాత్మపుత్త్రులన్
ఘనజలపూతులన్ సలిపి♦ గ్రచ్చఱ నాకముఁ జేరఁబంపి జీ
వననిధిఁ జెందె దివ్యముని♦వర్గ మనర్గళభంగిఁ బాడఁగన్. 362

వ. మఱియు భగీరథానీతయగుట భాగీరథియనియుఁ ద్రోవలో జహ్నుముని గృహీతయై తత్కర్ణంబునుండి మరల స్రవించుటంజేసి జాహ్నవియనియు నిట్లనేకాహ్వయంబుల ధరించి సువిశాల కూలంకషయై యలరె మఱియు నీగంగావతరణ చరిత్రం బెవ్వరేని చదివిన వినిన నవ్వారైహికాముష్మికసుఖంబులొందెదరిఁక.

ఆ॥ అల భగీరథునకు♦నాత్మజుండు శ్రుతుండు, పొడమె వానివంశ♦మున నెడల ఋతు
పర్ణుఁ డుద్భవించె♦ వానికినిన్ సుదాసుండు పుట్టె మిగుల♦ శుభ్రయశుఁడు.

వ. అవ్వానివంశంబున ఖట్వాంగచక్రవర్తి యుదయించె, నాతనికి దీర్ఘబాహుండును వానికి రఘుండును రఘునకుఁ బృథుశ్రీవుండును నాతని కజుండును నతనికి దశరథుండును జనియించి రా దశరథునకుఁ గౌసల్యాకైకేయీసుమిత్రలను భార్యాత్ర

యంబునందు శాంతయనుకన్యయును శ్రీవిష్ణుతత్త్వంబు నాల్గువిధంబులై రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులనువారలు నవతరించి రా శాంతను ఋష్యశృంగుండు పెండ్లియాడెనిఁక రామచంద్రుండు. 265

క॥ శివువిల్లువిఱిచి జానకి, నవనీజను బెండ్లియాడె ♦ ననుజన్ములు మాం
డవి యూర్మిళ శ్రుతకీర్తిని, సువిహితగతిఁ జేకొనిరి వ♦సుంధర మెచ్చన్. 366

వ. మఱియు నారామచంద్రుండు పితృాజ్ఞాపాలనార్థంబు రాజ్యంబుఁ బాసి జటావల్కలంబుల ధరించి సీతాలక్ష్మణసమేతుండై దండకారణ్యంబుఁ జేరి పదునాలుగేండ్లందు వసించె నింకను, 367

సీ॥ గాధిజసవనంబుఁ ♦ గావఁగాఁ బోయి సు, బాహుదైత్యునిఁ జంపె ♦ బాహుశక్తిఁ
బదునాల్గువేలపైఁ ♦ బదునాల్గురను జన, స్థానంబునఁ జంపె ♦ దానవులను
ఆవిరాధుని గబం ♦ ధాసురు వనపథ, మందు వధించెఁ బే♦ర్మైనకడిమి
వాలినిసమయించి ♦ వనధివారధిఁ గట్టి, పంక్తికంఠు సబాంధ♦వముగఁ గడపె
గీ॥ రామనాథుఁ బ్రతిష్ఠించె ♦ రాణ గదుర, నశ్వమేధంబుఁ బొనరించె ♦ నతులదీప్తిఁ
బదియువేలేండ్లు భూమిని ♦ బాలనంబు, చేసె శ్రీరామచంద్రుండు ♦ వాసిమీఱ.

వ. అని చెప్పుటయు శౌనకాదులాకర్ణించి, మహాత్మా! మానసంబులు తృప్తినొందవు శ్రీరామచరిత్రం బించుక విస్తరించి యానుపూర్విగ వక్కాణింపుమని యర్థింపుటయు.

ఆశ్వాసాంతము.

క॥ కాళీశశిశేఖరపద, నాళీకారాధ్యహృదయ ♦ నళినవిరాజ
త్కాళేశారాధ్యానుజ, వ్యాళేశ్వరహారతత్త్వ ♦ వశ! లక్ష్మాంబా!

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వరనామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి యుమా ఖండంబునఁ
బ్రథమాశ్వాసము సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## ఉ మా ఖ ం డ ము

### ద్వి తీ యా శ్వా స ము.



శ్రీ ముదిగొండ కులార్ణవ
సోమా! సోమేశ్వలింగ ♦ శోభితపూజా
కామా! కామాదిరిపు
స్తోమజయోద్దామ! దామ♦సురుచిరకీర్తీ!

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె.

—* రా మా య ణ చ రి త ము *—

చ॥ విశదయశోభిశోభితుఁడు ♦ విశ్వమహోన్నతసారవిక్రిమ
ప్రశమిత సర్వదిగ్వలయ ♦ పార్థివవీరవరప్రతాపుఁడా
దశరథరాజసత్తముఁ డు ♦ దారపవిత్రచరిత్రిభూషితుం
డశనిధరాభవైభవర ♦ మాస్పదుఁ డుండె నయోధ్య శోభిలన్.

గీ॥ ఆ ధరాపాలకునకు జా ♦ యాత్రియంబు
వెలసెఁ గౌసల్య కైకేయి ♦ యలసుమిత్ర
యనఁగఁ దనయులు శ్రీరాముఁ ♦ డును భరతుఁడు
లక్ష్మణుండు శత్రుఘ్నుఁ డా ♦ లలనలకును. 3

క॥ శ్రీనారాయణ తేజం, బా నలువురుగా విభక్త ♦ మై తనరెను సు
శ్రీనిధి యం దగ్రిజుఁడు ప్ర, ధానుండై యునితరప్ర ♦ తాపుఁ డయి తగెన్. 4

గీ॥ రామలక్ష్మణులకు నిద్ద♦ఱకును చెలిమి, యెడ తెగకయుండు నెప్పట్ల♦నేని యట్లె
భరతశత్రుఘ్నులకు మైత్రి ♦ పరగునైన, నంద ఱందఱి యెడల సౌ♦హార్ద్రివరులు.

సీ॥ అఖిలజనమునకు ♦ హర్షంబొసంగును, శ్రీరామముఖసర ♦ సీరుహంబు
కడుభయార్తుల కేని ♦ నడలు పోకడఁబెట్టు, శ్రీరామసదయదృ ♦ ష్టిప్రసార
మెట్టిశూరుల కేని ♦ హెచ్చొవెలుపుఁ గూర్చు, శ్రీరామవిక్రమో ♦ దారగరిమ
ప్రబలసంతాపత ♦ ప్తజనంబు నలరించు, శ్రీరామవాక్సుధా ♦ సారధార

గీ॥ మహితసహకారపరిపాక ♦ మధురమధుర, నవనవరసంబు శ్రీరామ ♦ నామధేయ
మతులవిజ్ఞానభాగ్యమా ♦ గ్రావలంబ, నంబు శ్రీరామపరమపు ♦ ణ్యాచరితంబు.

క॥ అని విజ్ఞవరులు మనముల, ఘనముగ నభినుతిని సల్పఁ ♦ గా గాధిసుతుం
డనఘుం డంత నె దశరథ, జనపాలుని జేరి యడిగెఁ ♦ జనువున నిటులన్. 7

చ॥ తనయుల రామలక్ష్మణుల ♦ ధన్యపరాక్రమ చైత్రులన్ యశో
ధననిధి ! పంపు మత్సవన♦ధర్మము నిర్వహణం బొనర్ప ! వే
గనె కొని పోదు వీరలు జ♦గన్నుతదివ్యధనుఃకలాభిమం
డను లిఁక యాతుధాననిధ ♦ నమ్మొనఁగూర్చి ఘటింత్రు జన్నమున్. 8

చ॥ అన జననాథుఁ డాత్మమున ♦ నక్కజమున్ భయమున్ వహించి యి
ట్లనె మునిచంద్ర! మత్తనయు ♦ లర్భకు లుద్ధత దైత్యమర్దనం
బున కుపయుక్తులౌదురె ? స ♦ మున్నతసారశరాసనంబుఁ జే
కొని వనిఁ జేరి రక్కసులఁ ♦ గూల్చెద నేనె మఖంబు నెగ్గఁగాన్. 9

గీ॥ అనుడు నగి తాపసేంద్రుఁ డా♦తని మనమున,బుగు లడంచికుమారుల♦భూరిశక్తిఁ
దెలిపి యంగీకృతిన్ జెంది ♦ ధీరుఁ డైన, రామలక్ష్మణులఁ గొని య♦రణ్యభూమి

గీ॥ చేరి నడుచుచుఁ జిత్రవి ♦ చిత్రకథల, నలరఁజేయుచు బల నతి ♦ బల యనెడు
విద్యలనొసంగిస్వాశ్రమ♦విపిననికట, మొందరాఁబథమందుఁదా♦నొక్కయసురి.

క॥ తాటకి యనునది జనముల, వేటాడెడునద్ది వారి ♦ వేఁ గని యెదురన్
మేటియగు మాని యనుమతి, వ్రేటున వధియించె రామ ♦ విభుఁ డద్దానిన్.

మ॥ పరితోషంబును జెంది రామునకు న ♦ వ్వాచంయమీంద్రుండు స
త్వర ముద్యత్తరబాణజాలమును దీ ♦ వ్యజ్జృంభకాస్త్రంబులన్
వరుణాస్త్రం బనిలానలాస్త్రములు నా ♦ బ్రహ్మాస్త్రమున్ మున్న గా
నరుదా నస్త్రము లిచ్చి తెల్పెను దదీ ♦ యాధానసంహారముల్. 13

వ. అంత నచ్చోటనుండి.

మ॥ నికటోర్విన్ జెలువొందు స్వాశ్రమము నెం♦ తేఁ బ్రీతి సావిత్రపు
త్రకులన్ జేరిచి యజ్ఞవిఘ్నకర దై ♦ త్యస్తోమసంహార్య నె
ష్ఠికు తానట్లు విధించి యంతమునిరో ♦ చిష్మంతుఁ డొందెప్ వ్రతం
బకలంకాత్మములోడఁ గాంచుచు మఖం ♦ బం దుండి రారాసుతుల్. 14

గీ॥ జన్న మకుతోభయంబుగా ♦ జరుగుచుండె, నంతఁ బిశితాశు లరుదెంచి ♦ యధ్వరాంచి
కనిసి విఘ్నవిధానులై ♦ కేరి చదలఁ, జేరి కురిసిరి నెత్తురుఁ ♦ జీము నంత. 15

—* శ్రీరాముఁడు మారీచుని సముద్రమునవేసి సుబాహుని జంపుట *—

మ॥ మును లెల్లన్ జలితాత్ములై యపుడు సం ♦ బోధింప శ్రీరాముఁ డం
తనె మారీచుఁ బ్రభంజనాస్త్రమున హే ♦ నప్రజ్ఞఁ గావించి య
వ్వనధిన్ గూలఁగ నేసె భాసురబృహ ♦ ద్భాన్వస్త్రధారన్ వధిం
చెను దుర్వ్యూహు సుబాహు దత్పరిజన ♦ శ్రేణిన్ నిమేషంబులోన్, 16

గీ॥ అంతరాయంబు లెల్ల ని ♦ ట్లంతరింప
మునులు నిర్భీకులై ముదం ♦ బున మఖంబుఁ
బూర్తిచేసిరి కౌశిక ♦ మునియు రామ
లక్ష్మణులఁ దోడుకొని మిథి ♦ లకుఁ జనుటకు. 17

గీ॥ తలఁచి పయనంబు సల్ప న ♦ ధ్వంబునందు, గౌతమమహర్షిపత్ని రా ♦ ఘవపదాబ్జ
రజము సోఁకినతోడనే ♦ ప్రకృతిఁ జెంది, పూజనం బొనరించె రా ♦ మునకు భక్తి.

క॥ మునియును దాశరథులు న, వ్వనినుండి యహల్య నాపె ♦ పతిసన్నిధికిన్
బనిచి మిథిలాపురికిఁ జని, కొనిరి విదేహాతిథేయ ♦ గురుతరపూజన్. 19

గీ॥ బ్రహ్మఋషి సీతకును రామ ♦ భద్రునకు వి, వాహ మొనరింప నెంచి వి ♦ దేహరాజ
మౌళిరచితోరునియమాభి ♦ మతమనమున, నతని కిట్లనె హర్షభ ♦ రాత్మ మెసఁగ.

ఉ॥ చూపుము శైవచాపము వి ♦ శుద్ధచరిత్ర! వికర్తనాన్వయుం
డీ పురుషోత్తముండు భవ ♦ దీప్సితమున్ నెరవేర్చి నీదు క
న్యాపరిదత్తధర్మసుమ ♦ హారము నొంది వరించు నా సతిన్
నీ పరితాప మింతును జ ♦ నించు శుభప్రకరాయతీగతుల్. 21

క॥ నీ సఖుఁడగు దశరథునకుఁ, గౌసల్యకు సుతుఁడు శౌర్య ♦ ఘనుఁ డీ రాముం
డా సౌమిత్రిలలో న, గ్రేసరుఁ డీ లక్ష్మణుం డ ♦ రిందముఁడు నృపా! 22

వ. అనుటయు మిథిలానాథుం డొక్కించుక సంశయించి తాపసేంద్రున కిట్లనియె.

చ॥ దినదిన మెందరో పృథుల ♦ దీర్ఘభుజుల్ బలశాలు లిద్ధపా
వనతరతేజులైన నృప ♦ వర్యులు నన్ దనుజేంద్రులున్ మహీ
జను వరియింప వచ్చి శివ ♦ చాపము నెత్తఁగ లేక నొచ్చి సి
గ్గును గొని పోదు రార్య! తమ ♦ గొప్పతనం బది తప్పిపోవఁగన్. 24

వ. అందును.

ఉ॥ బాలురు వీరు కోమలవి♦భాస్వరకాంతిసహస్రకోటులన్
మేలిమిసంతసం బొసఁగు ♦ మేనులజానగుతీరు విల్లుగో
సేల మహాత్మ ! యాదశర♦థేంద్రుడు నా చెలికాఁడు వీరికిన్
బోలదు రుద్రచాపమును ♦ మోపొనరింపఁగ నాలకింపుమా ! 25

వ. అనుడు విని మందహాసంబుచేసి యా బ్రహ్మర్షి సంక్రందనుండు రాజర్షి యగు
సీరధ్వజున కిట్లనియె. 26

ఉ॥ ఏటికి సంశయించెద వ♦హీనతరాజ! మహీజ జానకీ
హాటకమూర్తి యీ రఘుకు♦లాబ్ధిశశాంకునకై జనించె ము
మ్మాటికి నమ్ము మీతఁ డస♦మానమహామహిమోజ్జ్వలుండు విల్
నేటుగ నెక్కువెట్టి వడి ♦ నీ తనయన్ గ్రహియించుఁ గాంచుమా! 27

ఆ॥ అని నుడువుడు జనకుఁ♦డా చాపమును జూపె, రాముఁ డద్ది లాఁగ♦భీమధను
రెండు తునకలయ్యె♦నిండు వేడుక సీత, విరులసరము రాము ♦ నరుత నేసె. 28

—* సీ తా క ల్యా ణ ము *—

వ॥ జనకుఁ డుప్పొంగి గాధేయానతి దశరథభూమీంద్రుని వైభవంబున రప్పించి
తదనుమతి శ్రీరామునకు మహీజాతయగు సీతను లక్ష్మణున కాత్మజాతయగు
నూర్మిళను భరతశత్రుఘ్నులకు నిజానుజతనూజలగు మాండవీ శ్రుతకీర్తులను
గ్రమంబుగ నిచ్చి యుద్వాహంబు చేయందొడంగి యందు శ్రీరామహస్తంబు
నందు సజలధారంబుగ సీతాహస్తం బునిచి యిట్లనియె. 29

గీ॥ ఇది మదీయదుహిత సీత♦యినకులీన!, భార్యగా నిచ్చితిని నీకుఁ ♦ బడయు మట్లు
భద్రమగు నీకు నిక్కొమ్మ♦పాణిపల్ల, వమును గ్రహియింపు పాణి సం♦బరముమీఱ

వ. అని కన్యాదానంబుచేసి తక్కినకన్యలకుఁ గూడ పూర్వోక్తభంగిఁ గన్యాదా
బుల నెరవేర్చి వివాహంబుల నిర్వహించి బహుతరపారిబర్హంబుల నొసఁగి
యయోధ్య కనిపె నంత మధ్యేమార్గంబునఁ దపోధనాగ్రణియును ధానుష్క
శిరోమణియునగు భార్గవముని యెదుర్కొని యుగ్రంపశ్యుండై సామర్షంబుగ
సన్నికర్షంబొంది దాశరథి కిట్లనియె. 31

మ॥ వడి మాహేశ్వరచాపమున్ విఱిచి యా ♦ వైదేహిఁ బెండ్లాడి యి
ప్పుడమిన్ నాసరిలేరు ధీరు లని బల్ ♦ ప్రోద్యత్తరాహమ్మతిన్
దుడుకున్ జెయ్వును జూపి తౌర ! యిఁక నీ ♦ దోశ్శక్తిఁ గన్గొందు న
ప్పుడె మాటాండెనె భార్గవాగ్రికరవి ♦ స్ఫూర్జత్కుఠారచ్ఛవుల్. 32

గీ॥ అనుడు రాముఁడు మ్రొక్కి భ♦క్త్యతిశయప్ర, మోదవినయాదధానోక్తి♦పుంజమంద
కలన వారింప నుడుగని ♦ కతన గెలిచె, దపసి మెచ్చి యాశీస్సిడి♦తఱలెవనికి

వ. అనంతరం బవ్వారలయోధ్యకుం జేరి సుఖంబుగ నున్నంతం గొలఁది దినంబుల
మీఁద మేదినీనాథుండు భరతుని దన్మాతులాభ్యర్థితుండై శత్రుఘ్నునితోఁ
గైకయరాజధాని కనిపె నావైని. 34

మ॥ ధరణీపాలకుఁ డగ్రపుత్రుని ఘనో ♦ ద్యద్బాహువిక్రాంతికిన్
వరసాద్గుణ్యవిభూతికిన్ మురిసి భా ♦ స్వద్వంశసామ్రాజ్య వి
స్తరభారంబు వహింప నర్హుఁడని యా ♦ త్మప్రేయుల్ మంత్రులన్
గురులన్ యోజనచేసి మూరుతపుబా ♦ గున్ జూచి భూకేప్సుఁడై. 35

మ॥ పురిన్ గైసేయఁగఁ బంచి రామునకునున్ ♦ భూజాతకున్ దివ్యగం
ధరసాభ్యంజనసేకభర్మపరి ♦ ధానస్ఫారకస్తూరికా
గరుదివ్యత్తిలకాంగరాగమకుట ♦ గ్రైవేయముక్తావళీ
తరళాద్యాభరణప్రసాధనము ల ♦ త్యంతంబు గూర్పించియున్. 36

క॥ గురుని వశిష్ఠుని మంగళ, పరికరములతోడ సచివ ♦ బాంధవహితనా
గరముఖ్యుల్ దనయులనున్, ధరణిజ నాస్థాని కనిపి ♦ దర్పం బెసఁగన్, 37

క॥ తానును రయమునఁ గైకే, యీనిలయముఁ జేరి యామ్ర ♦ గేక్షణతోడన్
ధీనిధులు కడమరాణుల, తో నాస్థానికిఁ జనన్ గు ♦ తూహలి యగుచున్,

గీ॥ తదవరోధముఁ జేర నం♦తకును మున్నె, జలధి దుర్లంఘ్యమైన మం♦థరయు నెందు
దాసి బోధఁ బంకేరుహా ♦ దళనయనయు, గినిసి కోపగృహమునకు♦ జనివసించె.

చ॥ అరసి నరేశ్వరుండు దయి ♦ తాంతికభూమికిఁ జేరి యోసి! యీ
తెఱగది యేమి? హేతువికఁ♦ దెల్పు మనంగఁ గురంగనేత్ర శం
బరవధమం దొసంగిన భ♦వద్వరయుగ్మము నాత్మమందు సం
స్మరణమొనర్చి వేగ నిడి ♦ సత్యవచస్కుఁడవై పరంగుమా! 40

గీ॥ రాముఁ బదునాలుగేడు ల♦రణ్యభూమి, నుండఁ బంపుటయొండు వే♦ఱొండుసకల
వసుమతీమండలికి నెల్ల ♦ భరతుని యువ, రాజు సేయుట యినకుల♦రాజవర్య!

క॥ అనుడు నడలి భూనాథుం, డనుకంపార్థియయి రాము ♦ నటవీస్థలికిన్
బనుపగ మానుము వేఱొకఁ, డనువుగఁ గోరుము దయామ♦యాత్మం బెసఁగన్.

ఉ॥ రాముడు నాదుప్రాణములు ♦ రాజముఖీ! విను మల్లరాముఁ డీ
గ్రామము రాష్ట్రమున్ విడిచి ♦ కానకుఁ జెందిన డిందు జీవితం
బేమియు సందియం బొనర ♦ దింతకు నోర్చెదవేని భర్తృహిం
సామహనీయమూర్తి వయి ♦ శాశ్వతమేలుము! యీవె మేదినిన్. 43

వ. ఇవ్విధంబుగ

గీ॥ ఎంతవేడిన నైనన మ ♦ దేభయాన
యదయమై పట్టువదలక ♦ యదియె కోర
నృపతి యుద్విగ్నుఁడై ఘోర ♦ విపులదుఃఖ
హతి భువిఁ బడియెను మూర్ఛ ♦ తాత్ముఁ డగుచు. 44

ఉ॥ అంతనె రాముఁ డవ్విధము ♦ నంత నెఱింగి సభన్ దొరంగి కా
సంతయుఁ జింతసేయకయె ♦ యాత్మపితన్ వడిఁజేరి కాననా
భ్యంతర మేగువాఁడ నని ♦ యంబల కట్టులె చెప్పి యాన మ
త్యంతయుఁ బూన్కిఁజేసెను మ ♦ హీంజయు లక్ష్మణునుండు తోడురాఁగ. 45

వ. కుమారోన్నతికై యిష్టదేవార్చనఁ బొనర్చుచున్న కౌసల్యయుఁ దదనుసారిణియైన సుమిత్రయు నవ్వైపరీత్యంబంతయు నారసి యత్యంతంబువగచి రంత వెల్లువయై పొంగివచ్చుచున్న దుఃఖంబు నాపుకొనలేక రామజనని రాముం బట్టుకొని యిట్లనియె. 46

మ॥ కొడుకా! యేటికి పుట్టుకొందితివి యే ♦ గొడ్డేని యీలాటియా
రడికిన్ భాజన మౌనె నిన్నును గన ♦ దారిజీవమ్మృద్వంగి యీ
పడుచున్ నట్టడవిన్ దిగన్ బరపి యీ ♦ పాపిష్ఠమృష్టాన్నముల్
గుడువన్ జాల నిఁకన్ దయన్ బరపి నన్ ♦ గొంపొమ్ము నీతోడుతన్. 47

చ॥ అటు లొనరింపకున్న నిను ♦ నక్కట! కోల్పడి జీవితంబు నే
నిట ధరియించి యుండునె భ ♦ రింతునె నీవనవాసదుఃఖమున్
గుటిలయుఁ గ్రూరయా సవతిఁ ♦ గొల్చుదునే నిముసంబులోన ను
త్కటగతిఁ బ్రాణముల్ సురుగుఁ ♦ దప్పదు నీ మదిలో నెఱుంగుమా! 48

వ. అనిన రామచంద్రుండు తల్లి కిట్లనియె.

చ॥ వలవ దటుల్ దలంపకుము ♦ వాసవసన్నిభుఁ డుత్తముం డక
ల్మలచరితుండు నీ విభుఁడు ♦ మా జనకుం డిటు మా యరణ్యపుం
జలనము నీవియోగమును ♦ నైతము నోర్వఁగఁ జాలఁ డమ్మ! య
గ్గలమగుదుఃఖ మొంది విడఁ ♦ గాఁగలఁ డీతనువున్ రయంబునన్. 49

చ॥ పతి శరణంబు దైవ మిలఁ ♦ బాటలగంధుల కమ్మరో! తదు
న్నతపరిసేవనంబె యగు ♦ నాయము హేయము తద్విరుద్ధ మా
నతి యిడు పోయివచ్చెదఁ బ్రి ♦ ణామముల్ బొనరించెదన్ గృపా
తతకుశలోక్తిగీతి శత ♦ ధా యొనరింపు! వహింపు మోరిమిన్. 50

ఆ॥ అనిన యంత నామె ♦ యాత్మంబు దిటమొందఁ, జేసి యనియె నినుఁడు ♦ శీతరశ్మి
భూతపంచకంబు ♦ భూతనాథుఁడు మిమ్ముఁ, గాఁచుచుండ్రు శివము ♦ గాతఁబథము.

వ. అప్పుడు సుమిత్రాదేవియు సీతారాములతో వనవాసమున కరుగనిశ్చితుండైన లక్ష్మణుని జూచి యెట్టకేలకుఁ గొండలం బణచికొని లక్ష్మణుని మూకటి మువ్వాచుం దలపైఁ జేయుంచి యిట్లనుశాసించె.

గీ॥ రాము దశరథుఁ గాఁగ ధ • రాతనయను
నన్నుఁ గా నమ్మహాకాన • నంబు నీయ
యోధ్యఁ గా హృదయంబున • నూహసేయు
మయ్య! యింకఁ బోయి రమ్ము! సౌ • ఖ్య మగునట్లు. 53

—* శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతో నరణ్యమున కేగుట *—

వ. అంత వార లయోధ్యనుండి నిర్గమించి యటవీప్రదేశంబుఁ జేరుటయు. 54

క॥ పౌరులు పెక్కురు వెంబడి, రా రాతిరి వారి నిద్దు • రను గూరిచి తా
మా రేయిఁ బయన మొంది మ, హారణ్యముఁ జేరి తఱిసి • రా యమరధునిన్.

గీ॥ భవజటామండలాంతర • పతితపూత, వారివాహినియైన ది • వ్యధుని స్నాన
మాడి యచట వసించు గు • హాభిధానుఁ, డైన వ్యాధునిచే దాటి • రా స్రవంతి.

వ. అంత భరద్వాజాశ్రమంబుఁ జేరి యవ్వారి సేవించి తదీయనిర్దేశానుసరణి గమించి చిత్రకూటాచలప్రాంతంబుఁ జేరి

చ॥ మునిజనసేవితంబును స • మున్నతసుందరకందరోరు వా
వనవనవాహినీతటవి • భాసితదివ్యఫలద్రుమావళీ
కనదురుమాకరందరస • గంధసుగంధలతావితాన కా
ననఘనమండలంబు నగు • నాగపదంబును గాంచి వేడ్కమై. 58

వ. అందు.

గీ॥ పర్ణశాలను నొక్కఁడే • ర్పఱచుకొని వసించి రిఁకను నయోధ్య శో • కించుచున్న
దశరథనృపాలవర్యుండు • తనయవిరహ, దుస్సహాగ్నిసంతప్తుఁడై • దొరఁగె నసువు.

ఉ॥ పౌరులు మంత్రులున్ భటులఁ • బంచి తగన్ భరతున్ గనిష్ఠుతోఁ
జేరఁగఁ దెచ్చి సర్వమును • జెప్పఁగ నవ్వడె రామసోదరుం
డోరువలేక మంథరను • నుత్పథయౌ జననిన్ వధింపఁగా
భూరికృపాణమెత్తఁ గృపఁ • బూని వశిష్ఠుఁడు మాన్పె నుద్ధతిన్. 60

వ. మఱియు భరతుం డాగ్రహంబున నిజజననిన్ బరికించి తత్ప్రాతికూల్యహింసా కృత్యంబుల కెంతేని దుఃఖించి యిట్లు నిరసింపుచు ననియె. 61

ఉ॥ ఏమనె నిన్ను రాఘవుఁ డ • శోకించుక యేవములేక లేకి! శ్రీ
రాముని సీతనున్ నడియ • రణ్యము లక్ష్మణుతోడఁ ద్రోఁచి నీ

స్వామిని ద్రింగి దుర్యశము । జక్కఁగ దిక్కుల నింపి తిట్లకే
భూమిని నాకొసంగెదవె । పోయది నెత్తిని నీవె కొట్టుకో. 62

వ. అని యంత.

చ॥ జనకున కౌర్ధ్వదైహికము । జక్కఁగ సల్పి దుకూలరత్నకాం
చనమణిభూషణంబులను । సర్వముఁ బోవిడి వల్కలంబులన్
గొని ధరియించి వాజిరథ।కుంజరయోధచయంబుతోడ స
జ్జనహితనాగరప్రముఖ । చక్రముతోడ గమించి కానకున్. 63

గీ॥ చిత్రకూటాచలముఁజేరి । శ్రీరఘువరు, జాడ లరయుచుఁ దటిసి వి।పాదవేగ
భరితుఁడై భరతుఁడురామ।పదములందుఁ, బడివడిన్ దెల్పె దశరథ।స్వర్గమనము.

వ. శ్రీరామలక్ష్మణులు వైదేహియు నత్యంతంబు వగచి దశరథున కుత్తరక్రియలు
నిర్వర్తించి రట మీఁద. 65

చ॥ భరతుఁడు రామచంద్రుపద । పద్మములన్ బడి యేను దీర్త దు
ష్కరవిపినవ్రతంబు నిఁక । సత్వర మీవు మహీజ లక్ష్మణుం
డురుకరుణానిధాన! పుర । మొంది యఖండవసుంధరాస్థలిన్
నిరుపమలీలఁ బాలన మ । నిందితరీతి నొనర్పఁగాఁ దగున్. 66

చ॥ పదుగురు చుట్టి తిట్ట నిది । పాపపథం బనుకోక లోభమున్
మదిఁ గొని నాదుతల్లి జన । మాన్యునిఁ బుణ్యుని నిన్నుఁ గానకున్
వదలి పతిన్ వధించినది । వాస్తవ మన్నిరయంబు నొందు న
య్యదయ యిఁకేల నామనవి । నారసి వేగ నయోధ్యఁ జేరుమా! 67

చ॥ శునకము సింహపీఠమునఁ । జేరినకైవడి నీదు పీఠమున్
వెను గన కెక్కువాఁడనె! ప।విత్రిత నర్మత నెంచి చూడనే
దినకరవంశభూషణ! మ।దిన్ గురితించి ననున్ క్షమించి నీ
ధనమును రాజ్యమున్ గొని ము । దమ్మున నేలవె మమ్ము నందఱన్

వ. అని వేడుటయు.

చ॥ అనుజునిఁ బ్రేమచేసి వర । మట్టిది కాదని తాతపాదునిన్
దినకరవంశమండనుని । దేవసమానుని సత్యనిష్ఠునిన్
మనమున నెంచుమంచుఁ బతి । మాలె రఘూద్వహుఁ డంతఁ దమ్ముఁడున్
విని రఘునాథపాదుకల । వేఁగొని రాష్ట్రముఁ జేరి ధీరుఁడై. 69

గీ॥ పాదుకల సింహపీఠంబు।పై నమర్చి, పూజయొనరించి తా నంది।పురమునందు
వాస మొనరించి భూపరి । పాలనంబు, సేయుచుండెను భూరిసా।శీల్యమునను.

వ. ఇట్లు నిండు సీతారామలక్ష్మణు లాకాంతారాంతరంబు నుండి విప్రకృష్టాటవీయి యాసుతై ప్రియాణాం బొనరించి 71

చ॥ ఒక వనభూమి నుండి మఱి ♦ యొక్కవనస్థలి కేఁగుచున్ మహో
త్సుకమతి వన్యపుష్పఫల ♦ తోయము లొందుచు సత్త్రపోధన
ప్రకరసమర్పితాతిథిస ♦ పర్యలఁ జెందుచు నల్ల యుజ్జ్వలో
దకకణభుగ్ఘనీతలని ♦ ధానఘనావని దండకావనిన్. 72

గీ॥ అగ్రమందు రఘుశ్రేష్ఠుఁ ♦ డవల సీత, వెనుక సౌమిత్రి నడుచుచు ♦ విపినపదముఁ
జేరుచుండ విరాధుఁడన్ ♦ జెనఁటి దైత్యుఁ, డాకఁ దుపరికించి నిబిడప ♦ రోష్ఠితుఁడయి.

—* శ్రీరాముఁడు విరాధుని వధించుట *—

చ॥ ఎదురుగ వచ్చి మైథిలిని ♦ నేత్రెర నెత్తి నిజోరుపీఠిపైఁ
జదురుగఁ జేర్చి రాము నను ♦ జన్ముని జూచి కఠోరవాక్తతిఁ
బెదరు ఘటింపఁ జేయ నరి ♦ భీషణుఁ డారఘువంశవర్ధనుం
డుదితరుషాధితప్తుఁ డయి ♦ యుద్ధతదానవు గిట్టి ద్రెంచెనన్ 74

గీ॥ వాని మఱిఁ గాంచి వసుమతీ ♦ శ్వభ్రమందుఁ, గూల్చి శరభంగమౌనిని ♦ గొలిచి కుంభ
సంభవాశ్రమమును జేరి ♦ చాల మురిసి, భక్తిఁ బూజించి కొనె శుభ ♦ వాదములను.

క॥ మఱియు నగస్త్యసమర్పిత, పురుహూతధనుశ్శరప్ర ♦ ముఖములఁ గొని భా
స్వరసుస్వరశుకపికచయ, తరువాటినిఁ బంచవటినిఁ ♦ దఱిసె యట రహిన్. 76

గీ॥ లక్ష్మణరచితపర్ణశా ♦ లాస్థలిన్ వ, సించి జనకజతో సుఖ ♦ శ్రీ లెసంగ
మునిచయస్తూయమానుఁడై ♦ యినకులపతి, గడపెను బదేండ్లు దినవశ ♦ కంబువగిది.

వ. అంతఁ గొంతకాలంబు జరిగినమీఁద నొక్కనాఁడు.

చ॥ అసురి యొకర్తు శూర్పణఖ ♦ యంచుఁ బ్రతీతి వహించినట్టి దా
యసమవనాంతరస్థలి వి ♦ హారము సేయుచు రాఘవాశ్రమా
వసథసమీప మొంది రఘు ♦ వల్లభు నల్లనఁ జూచి యంత నే
కుసుమశరార్తచిత్తయయి ♦ క్రొవ్వున డాసి వచించె నిట్టులన్. 78

ఉ॥ కాముఁడవో వసంతుఁడవొ ♦ కానకుఁ జెందిన చందురుండవో
శ్యామలకోమలాంగ ! నిను ♦ జక్కఁ గనుంగొని మెచ్చి వచ్చితిన్
నీమనసార భోగము ల ♦ నేకవిధంబుల నొందు మిందు నీ
భామినితోడ నేమిపని ♦ భావజకేళుల నేన తన్పెదన్. 79

క॥ కుసుమశరభోగముల నన్, గుసి వెట్టుము నీకుఁ దగిన ♦ కొమ్మం బోలఁతిని నీ
ముసలివిను గేల విడు సం, తసమున్ బొనరింతు నీకు ♦ సకలవిధములన్. 80

శా॥ నీయుల్లంబున కెట్లు మెచ్చొదవునో ♦ నేనట్టు లూహించి యా
యా యింపైన వనప్రదేశముల నా♦యా రమ్యనేపథ్యలీ
లాయోగం బలరంగ నంగభవగా ♦ ధానంద కేళీప్రభో
గాయత్తున్ బొనరింతుఁ దీర్తును మనో ♦ జానూననానారుజల్. 81

శా॥ ఒచ్చెం బన్నది లేదు నాయెడల నీ ♦ కుల్లాసమున్ గూర్తు నా
హెచ్చున్ గన్గొని నీవ మెచ్చెదవు ముం ♦ దేలా! ప్రగల్భోక్తులీ
విచ్చంబాటిన కమ్మపూఁబొదల బల్ ♦ విందొప్పఁ గ్రీడింపుమా!
యుచ్చైశ్శ్రీనిఁ బరిత్యజింపకుమ నీ ♦ కొందించు నిష్టార్థముల్. 82

వ. అనినంత శ్రీరాముఁడు సహేలుండై యనుజునిఁజూపి యతండొంటిగనున్న
వాఁడాతనిదండనుండెదననుము పొమ్మనిన దానవియు ననుమతించి లక్ష్మ
ణున్ జేరఁజని నిజాభిమతంబెఱింగించుటయు నాతం డభిముఖుండుగాకుండుటకు
గినిసి యవధీరతయై రాముఁదఱిసి పృథులజిహ్వన్ పాచి మైథిలిన్ మ్రింగఁబో
చున్నంత దాశరథి యడ్డుపడి తమ్మునకిట్లనియె. 73

క॥ నీచుఁతోఁ బరియాచక, మేచక్కిన్ గూడదరయు ♦ మీయసురి ననిన్
జూచి వెడలింపుమన నతఁ, డాచెన్నఁటికర్ణనాస ♦ లసిఁగోసె వెసన్. 84

ఉ॥ శోణితవృష్టు లెంతయు వ ♦ సుంధర ముంపఁగ మాంసఖండపా
షాణతతుల్ గడున్ గుఱియ ♦ సాధ్వసశోకమహారుషార్తిని
ర్యాణగభీరగర్జనవి ♦ రావము లాశలఁ దూట్లుపుచ్చ దు
ర్వాణులఁ గూయుచున్ జనియె ♦ రక్కసి ప్రక్కనఁ బాసి వారలన్.

మ॥ ఖరుఁడన్ సోదరుఁ జేరి యేడ్చుచుఁ గడున్ ♦ గంపంబు ద్రాసంబు దు
ర్భరదుఃఖంబుఁ గలంప నిట్లనెఁ బ్రవీ ♦ రా! నీదు తోఁబుట్టునై
సరియెవ్వారలు లేక యుండు నిను నీ ♦ చస్వాంతులా మర్త్యులి
క్కరణిన్ శిక్షయొనర్చి రోర్చెదవె వై ♦ కల్యంబు వీక్షింపుచున్. 86

చ॥ సముచితవల్కలాంబరవ ♦ సానులు సారసనేత్రులిద్ద ఱు
త్తమబలవిక్రమోన్నతు లు ♦ దారధనుశ్శరఖడ్గశోభితుల్
రమణి యొకర్తు కీగహన ♦ రాజి విహారముసేయుచున్ బ్రమో
దమున వసించియుండి రిఁక ♦ దర్పముతో నను గోసి రిట్టులన్ 87

ఉ॥ నీవును దక్కసోదరు ల ♦ నిందితశక్తి జిఘాంసులై వెసన్
గావలువైన యన్నరులఁ ♦ గామినితోడ వధించి వచ్చి నా
కీ వగఁబాపుఁ డట్లయిన ♦ నే నిఁకఁ దద్రుధిరంబు పాన మిం
పావహిలంగఁ జేసి ముద ♦ మందెదఁ బొందెద రీరు కీర్తులన్. 88

చ॥ అనుటయు నాతఁ డాగ్రహప ♦ రాయణుఁడై పదునాల్గువేలపై
నిని బదునాల్గురౌ దనుజ ♦ నిస్తులయోధులతోడఁ దమ్ములన్
గొని పృథివీపదం బదరఁ ♦ గోసలజాసుతుఁ జేరి సింహగ
ర్జన మొనరించి పిల్చె సమ ♦ రం బొనరింపఁగ రమ్మటంచు వేగిన్. 89

—* శ్రీరాముఁడు ఖరదూషణాధిరాక్షసులను జంపుట *—

చ॥ కని విని రాముఁ డా దనుజ ♦ కాండమునన్ బొడిసేయ నెంచి భూ
తనయను గాచుచుండు మని ♦ తమ్ముని నుంచి ధనుస్సహాయుఁడై
చని వనభూజరాజి దవ ♦ జాలశిఖావళి ప్రజ్వరిల్లి కా
ల్చినయటు లా నిశాచరుల ♦ చేవయడంచి వధించె నమ్ములన్. 90

ఉ॥ దానవి యంతఁ గన్గొని ని ♦ తాంతదురుద్ధరదుఃఖమగ్నయై
దీనతఁ జెందియున్ బగను ♦ దీర్పఁగఁ బూని రయంబునన్ జన
స్థానమునాఁగఁ బేర్వడిన ♦ దారుణకానన మప్డు వీడి లం
కానిలయంబుఁ జేరె క్షణ ♦ కాలములోన నె దాఁటి యంబుధిన్. 91

గీ॥ రావణాస్థానమున కార్త ♦ రావరోద, నములతోఁ జని మ్రొక్కి త ♦ నదువికృతిని
జూపి శ్రీరాముచే నాత్మ ♦ సోదరులు ఖ, రాదులెల్లరు మరణించి ♦ రనుచుఁ దెలిపి

క॥ ఆ రామలక్ష్మణులభుజ, సార మపారంబు రామ ♦ చంద్రునిసతి బల్
దీరిచిన పసిఁడిబొమ్మ యు, నా రహిఁదగుసొగసు నెఱుఁగ ♦ నా తరమగునే !

క॥ మోలో ! కనుదోయి లకో, రీలో ! పాలిండ్లు మరుసి ♦ రిన్ దనరిన మేల్
డాలో ! నూగా రిభతుం, డాలో ! తొడ లట్టిచెలిఁ బొ ♦ డయుట సులువౌకో.

క॥ పలుకులు పులఖండంబుల, వెలకమ్మను జిఱుతనగవు ♦ వేయేటి కిఁకన్
నిలువఁగ నీదెన్నఁడు వె, న్నెలచలువవుతళుకుబెళుకు ♦ నేటగునిగ్గున్. 95

ఉ॥ కాదదిమోము చందురుఁడె ♦ కాదదికన్గవ కల్వజంటయే
కాదది కేశపాశము ప్ర ♦ కాండఘనాఘనబృందమాలయే
కాదది బాహుయుగ్మమిఁకఁ ♦ గాంచనపద్మమృణాళయుగ్మమే
కాదదిచెల్వ నిల్కడను ♦ గన్నతటిల్లతయే దశాననా ! 96

వ. వెండియుఁ బరిశీలించినను గూడ

ఉ॥ కాదది యప్సరోరమణి ♦ కాదది నిర్జరనీరజాక్షియున్
గాదది భోగిరాజకల ♦ కంఠియుఁ గా దసురాబ్జగంధియున్
గాదది మానవేందుముఖి ♦ కల్కిని నేభువిఁ ద్రవ్వి తెచ్చెనో
నీదుకళత్రమైన నది ♦ నే ముదమొందనె మిన్ను ముట్టుచున్. 97

ఉ॥ నంత కళంకమున్ గొనని ♦ శుభ్రమరీచి యొకప్పుడేని ర
వ్వంతయు మోడ్పుచెందని సు ♦ వర్ణ వినూతనపద్మరాజ మె

పైంతకు వెత్తిగాని యమ్మ ♦ తేద్ధమణీఘటి యా మిటారి నీ
కంతటికాంత రాణి యగు ♦ నంతకుఁ జింతకు నంతమున్న దే? 98

ఉ॥ ఆ యరవిందగంధి విను ♦ మా శతపత్త్రవిశాలనేత్రి ఆ
కాయజమోహనాస్త్ర మల ♦ కమ్రపికస్వరసుస్వరోక్తి యా
ఆయత కేశపాశ యతు ♦ లాద్భుతబాహుపరాక్రమాంచితుం
డై యలరారునీకుఁ జెలి ♦ యైవిలసిల్లిన భాగ్య మెంతయో. 99

ఉ॥ దానిని నీకుఁ జేర్చుటకుఁ ♦ దద్వనభూమికిఁ జేరి లాఁగ రా
మానుజుఁ డుగ్రుఁడై యసిని ♦ నంతముచేసెను గర్ణనాసలన్
గానఁగలేక నా వ్యథను ♦ గాదిలిసోదరు లాఖరాదు ల
న్యూనరుపాత్తిమై యెదుర ♦ నుక్కఱఁజంపెను రాముఁ డందఱన్. 100

గీ॥ ఆ జనస్థానమంత శూ♦న్యాసురమయి, వెలసెనిపుడిఁకమీఁద భా♦విగతియెదియొ
విన్నవించితి నా గోడు♦విజితవైరి!, బలియుఁడవు నీవు నేఁ జెప్పఁ♦గలనె నీకు.

ఉ॥ ఆ చెలియల్ వచించిన య ♦ నర్థములన్ విని యాపెమోముపైఁ
జూచి వ్రణంబులన్ మనుజ ♦ సూదనుఁ డాగ్రహవేగ మొంది సీ
తాచతురేక్షణానుగత ♦ తర్షము హర్షము నొంది నీచు మా
రీచునిఁ దోడఁ దోడ్కొని స ♦ రిత్పతి దాటి నృపాలుపాలికిన్. 102

గీ॥ చేరి మారీచు నొక్కబం ♦ గారులేడిఁ, జేసి రామాశ్రమమునకుఁ♦జేర్ప నదియు
సీతకగుపడి నడువ భూ♦జాత దానిఁ, బట్టి యిమ్మనె శ్రీరామ♦భద్రుఁ డంత.

మ॥ శరచాపంబులు దాల్చి హేమమృగికై ♦ శశ్వత్తదన్వేషణం
బరుడై తోఁపఁగ దవ్వుఁ జేరి యట బ్రి ♦ హ్మాస్త్రంబు యోజించి వే
సె రహిన్ దాన నిశాచరుండు సమసెన్ ♦ స్వీయాకృతిన్ జెంది సో
దర! హా సీత! యటంచుఁ గూయుచు వినన్ ♦ దద్రావ ముర్వీజయున్. 104

వ. అంత జానకీదేవి

ఉ॥ అప్పుడె లక్ష్మణున్ బిలిచి ♦ యన్నను జేరు మదేమొ సంకటం
బుప్పతిలంగఁ దోఁచె నన ♦ నొప్పకయుండుడుఁ గాంచి యాతనిన్
దప్పులు పల్కి పంపె నిఁక ♦ ద వ్వతఁ డొందినమీఁద రావణుం
డొప్పుదలిర్ప భిక్షుతను ♦ వొంది హరిస్మరణంబు సేయుచున్. 105

వ. సీతావాసంబును దారసించినంత

—* రావణుఁడు సీతన్ గొనిపోవుట *—

ఉ॥ స్నాతకుఁ డన్న నూహఁ గొని ♦ జానకి వానికిఁ బిల్చి భిక్షమున్
బ్రీతి నొసంగఁ బో నతఁడు ♦ భీషణరూపముఁ జూపి భూమిజన్

చేతులనెత్తి ప్రస్ఫుటముఁ ♦ జేసి యుగ్రపదంబు నొందెఁ ద
న్నాతఁడు గొన్చుఁ బోవుటది ♦ యారసి జానకి శోకమొందుచున్. 106

ఉ॥ నా యనుతాప మట్లు తగు ♦ నా యను దేవరు నొవ్వఁ బల్కు టా
నా యను రాముఁ జూడఁ గల ♦ నా యను రావె మహోగ్రపానిధా
నా యను దుష్టదైత్యదమ ♦ నా యను నాశ్రితజీవితప్రదా
నా యను సర్వదుఃఖశమ ♦ నా యను మాటికి దుఃఖితాత్మయై.

వ. అంత రావణున్ జూచి రోజుచు నిట్లనియె.

చ॥ తగదిది రాక్షసేంద్ర! పర ♦ దారఁ బతివ్రతనైన దానినిన్
మగఁడు మఱంది దూరగమ ♦ నంబున కేగుట నొంటిదాని నీ
పగిదిగ దొంగలించి కొని ♦ పాఱుట చేటగు వేగ నన్నిఁకన్
దిగవిడి రాముఁ జేర్పు మిఁక ♦ ధీరుఁ డతండు క్షమించి కాఁచు నిన్. 107

వ॥ ఇట్లు చెప్పిన నాలింపక యుండుటన్ గాంచి విలపించుచు నెలుంగెత్తి యిట్లు మొఱ
పెట్టుకొనియె. 108

సీ॥ ధరణిజాతను దుష్ట♦దైత్యుండు గొనిపోవు, చుండెఁ గావరె దివ్య♦యోధులార!
సీరధ్వజకుమారిఁ♦జెనఁటిరక్కసి కొని, చనుచుండె మనువరే♦మునులు! మీరు
దశరథాగ్రసుతు ♦ దనుజుం డొడిసి యిట్లు, దరలె నారయరె గం♦ధర్వులార!
శ్రీరామచంద్రుని ♦ చెలువను బలలాశి, చెఱగొనెఁ బ్రోవరే ♦ సిద్ధులార!

గీ॥ గరుడులార! విద్యాధరా♦గ్రసరులార!, యక్షులార! ధర్మైకాధ్య♦పక్షులార!
వేగిరమె చేరి నన్ విడి♦పింపరయ్య!, కనికరము సేయుఁడయ్య! వం♦దనమొనర్తు.

వ. ఆయార్తస్వరం బాలించి పక్షీంద్రుండగు జటాయు వాకసంబున కెగసి రావణున
కడ్డుపడిన నతఁడు కృపాణంబుఁ బెఱికి యవ్వాని ఱెక్కల నఱికి పుడమిపయిన్
బడవైచి. 110

గీ॥ కడలి దాఁటి జవమున లం♦కాపురంబుఁ, జెంది యందు నశోకవి ♦ చిత్రవాటి
యందుఁ జేరిచి రాక్షసీ♦బృందమధ్య, సీత బొగులఁగఁ జెఱనుంచెఁ♦జేటుఁగనుక.

శా॥ మారీచున్ వధియించి స్వావసదభూ ♦ మార్గంబునన్ వచ్చునా
శ్రీరామున్ గని లక్ష్మణుం డఖిలమున్ ♦ జెప్పంగ హాసీత! హా
హా రక్షోహృతవైతివా! యనుచు నా ♦ ర్తారావముల్ సల్పుచున్
ధీరుండై మృతినొందుచున్ బలికెఁ బ ♦ క్షిశ్రేష్ఠుఁ డిబ్భంగిగాన్. 112

ఉ॥ తావకధర్మపత్నిని మ ♦ దంబున రావణదైత్యుఁ డుగ్రవం
శావిలచిత్తుఁడై కొని ర ♦ యమ్మునఁ బుష్పక మెక్కిపోయె నే
నే వినువీథి నడ్డపడి ♦ పీక దురం బొనరించినాఁడ దు
ర్భావుఁడు ఱెక్కలన్ దునిమి ♦ వైచెను బ్రాణము లుత్క్రమింపఁగన్.

వ. అని యనంతరంబే వీరశయ్యాశయానుండగు నవ్విహంగేంద్రుం డసువులం బాసిన శ్రీరామచంద్రుండు వగచి యాతని కగ్నిసంస్కారంబు లొనరించి సీతాశూన్యంబైన యుటజావాసంబుం బాసి యత్యంతంబు వలవించుచు "కాలో హి దురతిక్రమః" యనెడు వచనంబునుస్మరించుచు సీతాన్వేషణంబునకై సానుజుండై దక్షిణాధ్వంబు ననుసరించి నడుచుచుండెను. 114

## —* శ్రీరాముఁడు కబంధుని వధించుట *—

గీ॥ కాన నంతఁ గబంధుఁడన్ ♦ గర్బురుండు, వికృతుఁడు బుభుక్షు డాయ వే♦వేగ వాని
బాహువులఁద్రుంచి పావక♦జ్వాలఁగాల్చ,రతఁడు శాపవిముక్తి ది♦వ్యాధ్వ మెగసె.

వ. మఱియు నతండు రావణుండు సీతను గొనిపోయి లంకయం దుంచెననియు నిచ్చటి కనతిదూరంబునఁ బంపాసరోవరంబు పార్శ్వంబందు ఋష్యమూకాద్రియందు సుగ్రీవుండను కపికులనాథుం డాంజనేయునితో వసించి యున్నాఁడనియు నగ్రజునిచే నితం డపహృతదారుండై యుండుట మీర లాతనికి సాహాయ్యం బొనర్చిన నతండు కృతజ్ఞుండై సీతాన్వేషణ రావణసంహరణం బందుఁ దిరుగ సాయంబొనరింపఁ గలఁడనియు నుడివి యథేచ్ఛన్ జనియె నంత రామలక్ష్మణు లుత్ఫుల్ల రాజీవరాజీవిరాజితంబును జారుచక్రాంగచక్రమండలీపరిశోభితంబును నగు పంపాసరోవరంబుఁ జేరి యందలి రామణీయకంబు భూమిజావిశ్లేషదుఃఖంబు నత్యంతం బినుమడింపఁజేయుడు రాఘవుం డనుజున కిట్లనియె,

చ॥ స్ఫురదురుమాకరందరస ♦ భూషితభాసితపద్మషండసం
చరదలిమాత్రికూజితపి ♦ చండిలమానసవాసచక్రిసుం
దర మగు నీ సరోవరము ♦ దండ వసింపఁగఁ జెల్ల దుర్విజా
విరహభరంబు దుర్భరము ♦ వేగ మఱొండగు చోటుఁ జేర్పుమా, 117

వ. అని మఱియు నుద్విగ్నుండై సీతను దలంచి.

ఉ॥ జానకి! యెందుఁ జేరితివి ♦ జానగు నీనగుమోముఁ జూడకే
ప్రాణములన్ భరింపఁగ ను ♦ పాయముదోపదు డాయరాదె! నా
పై ననురక్తి భక్తి గల ♦ పావనమూర్తిని నిన్ను నట్టర
న్యానినిఁ గోలుపోయిన ఖ ♦ లాత్మునిఁగా నెదవా! కృపామయీ! 118

వ. అనుచు సరోవరంబుఁ బరికించి.

సుగంధి వృత్తము }
నీరజంబ! చూచినావె ♦ నీరజాతలోచనన్
సారసంబ! చూపరాదె! ♦ సారసానుయాననన్
చారుచక్రవాకి! చూపు ♦ చారుచక్రసుస్తనిన్
మీర లెల్లఁ బ్రేమ మెంచి ♦ మేలుఁగూర్పఁ డీయెడన్. 119

సీ॥ రాజీవముల నెట్లు ♦ రహిఁ నిరీక్షింతు నా, రాజీవగంధి పా♦ర్శ్వమున లేక
నవమృణాళములఁగాం♦చఁగ నోర్వఁగలనెట్లు, నవమృణాలభుజయుం♦డనుమెలఁగక
కలహంసగతు లెట్లు ♦ గదసి వీక్షించెదఁ, గలహంసయానసం♦గతి నడువక
చక్రిదంపతులరా♦జస మెట్లు కన్గొందుఁ, జక్రిస్తనీయోగ ♦ సరణిఁ గానక
గీ॥ భ్రమరమాలాభిగీతసం♦శ్రీవణ మెట్లు, భ్రమరమాలాంశుధమ్మిల్ల♦పథ మెనయక
యీ యెడ వసింపఁజాల వే♦ఱేడ కేని, పంప! పంపఁదలం పను♦కంప నింపి. 120

వ. అని యనంతరంబే ప్రయాణంబు చేసి యచ్చటికి సన్నికృష్టంబును నానావిధపుష్ప
ఫలవృక్షవిలసితంబును నగు ఋష్యమూకాచలంబుఁ జేరి రక్షస్తర్జనార్థంబు గుణ
ధ్వనిన్ బొనరింపుచు నడుచుచుండును. 121

ఉ॥ పావనమైన యక్కుధర♦భాగమునం దల వాలిభీతి సు
గ్రీవుఁడు తత్సహోదరుఁ డొ♦గిన్ నివసింపుచు నాంజనేయుతో
భీవహమైన రాఘవుల♦విండ్లరొదన్ విని వాలిమిత్రులే
భూవిభులో సమున్ గడుపఁ ♦ బూనికచే నిట వచ్చిరం చనన్. 122

చ॥ సచివుఁడు వాయునందనుఁడు ♦ జంకకుమంచు వచించి యంతఁ దా
నచకితవృత్తి నొక్కయతి♦యై నృపవీరులఁ జేరి తెచ్చి యం
దుచితగతిన్ విశేషితకు ♦ సుగ్రికరాన్వయమూర్తి కప్పసం
కుచితసఖత్వ మేర్పఱచెఁ ♦ గూరిమిఁ జేకొని వార లంతటన్ 123

క॥ అన్యోన్యోదంతంబుల, నన్యోన్యం బెఱిఁగికొని మ♦హాదరపూర్వం
బన్యోన్యసాహ్యములఁ దా,మన్యోన్యము సేయఁ బ్రతిన♦లాడికొని రటన్. 124

వ॥ అంత రాఘవుండు సుగ్రీవవిశ్వాసార్థం బందు దుందుభిశరీరోత్సాదనంబును సప్త
సాలభేదనంబును బొనరించుటను జూచి సంతుష్టాంతరంగుఁడైన ప్లవంగేశ్వరుఁడ
కిట్లనియె. 125

చ॥ సరవిగ నిన్ను దివ్యబల♦శాలిని వాలిని సంహరించెదన్
గురుతరవానరప్రముఖ♦కోటికి నిన్నొనరించెదన్ బ్రభున్
మురిపము మీఱ నీదు విరిఁ♦బోఁడిని జెంది యనంతసౌఖ్యముల్
దిరముగఁ జెందు దగ్రజునిఁ ♦ దెమ్మెఁకఁ బొమ్మి కపీశ్వరేశ్వరా! 126

—✱ శ్రీరాముడు వాలిన్ జంపుట ✱—

గీ॥ అని ప్రబోధించి వాలి నా♦హ్వానపఱచి, భానుజుని కంఠమందుఁ బు♦ష్పస్రజంబు
వైచి గురుతొందియొకదివ్య♦బాణరాజ, మేసె వాలిపైఁ బ్రాణంబు♦లెగిరి చనఁగ.

వ. వాలియు నిర్గతంబులగుచున్న ప్రాణంబుల నాఁగి రాముఁ బరికించి యిట్లనియె.

మ॥ అకటా యేటికి రాజవై యిటుల న♦న్యాయంపుహేయంపు ప
న్థకు లోనైతివి ధీరు లెన్నుదురె? దు♦స్తంత్రంబు నాతోడఁ జి
వ్యకు రాఁ జాలకపోతి వాయతతరు♦ప్రచ్ఛన్నగాత్రుండవై
యకలంకున్ నను జంపినాఁడవు మహా♦హత్యాప్రకారంబునన్. 129

వ. అనుటయు విని రామభద్రుం డిట్లనియె.

ఉ॥ కాదిది హత్య వాలి! విను ♦ కాననజంతువ వౌటఁ బొంచి వ్యా
పాదముసేయుటే తగవు ♦ బల్మి మఱందలిపొందుచేసి నీ
గాదిలి తమ్ము నుగ్రగిరి♦కానన భూమికిఁ ద్రోచినాఁడ వి
ట్లా దురితంబు సైపనగు♦నా! తగునా యది రాచవారికిన్ 130

వ. అని నుడివి యంగదుని యువరాజుఁ జేయుదునని కందుఁబాపి యభయ మిచ్చుటయు వాలి సంతసించి యసువులఁ బాసె నంతఁ దారాంగదాదులు తక్కుంగల వానర ప్రముఖులు విచ్చేసి వారలును సుగ్రీవుండును తడవుప్రొద్దు విలపించి రంత మహేంద్రతనయుని యౌర్ధ్వదైహికక్రియానంతరం బందు రఘునాథుండు సుగ్రీవునకుఁ గపిరాజ్యపట్టాభిషేకం బొనర్చి కపిరాజవంశకరీరుండగు నంగదునకు యౌవరాజ్యపట్టం బిచ్చి తా ననుజునితో మాల్యవద్గిరి నివసించెనంత. 131

మ॥ ఒకనాఁ డాశివతోఁ గిశోరశశిరే ♦ ఖోద్యత్కిరీటుండు సే
వకవర్యుల్ ప్రమథామరోత్తములు దీ♦వ్యద్భక్తి సేవింప బు
ష్పక మౌత్సుక్యముతోడ నెక్కి జగతీ ♦ భాగంబులన్ గాంచుచున్
వికలాత్ముండయియున్న రాము నచటన్ ♦ వీక్షించి తానిట్లనెన్. 132

ఉ॥ ఈ రఘురాముఁ డర్యమకు ♦ లేందుఁ డలంఘితదివ్యవిక్రమో
దారుఁడు ధీరుఁ డార్తజన♦తాపవిభంజనుఁ డాత్మవేది వి
స్తారవివేకకోశనిధి ♦ దానవరాట్టగు పంక్తికంఠుచే
దారను గోలుపోయి యిటఁ ♦ దల్లడమొందెడుఁ జూఁడు సుందరీ! 133

గీ॥ అనుడు హసితంబొనర్చి యి♦ట్లాదిదేవి, యనియె వేదనమేడ! యి♦ట్లాలికొఱకు
తప్తుఁడగుటేడ! దేవర! ♦ తత్జ్ఞులైన, వారలీతీరుగాంతురే ♦ వగలదగల.

వ. అనుడు భగవానుఁడు మరల నిట్లనియె.

గీ॥ ఎట్టివేత్తలకేనియు ♦ నింపుదనరు, పత్నియెడలను మఱియు న♦పత్యమెడలఁ
దగుల మణగకయుండు నెం♦తయునునైనఁ, బామరులకును వీరికి♦ వారయుండు.

వ. అందునను శ్రీరామచంద్రుం డనన్యసామాన్యవిజ్ఞానధనుం డంతర్ముఖుండనుటయు నఖిలాండేశ్వరి యిట్లనియె. 136

గీ॥ తార యెట్టిదిదేవ! నీ♦వ కనుగొనుము, సాంప్రతంబందె యీరాజ♦చంద్రుచంద
మేన్ బరీక్షింతునని యాళి♦నిగుడబోసి, జయజయ నెడు దాసిచిలిచితద్♦క్షణమునందు.

వ, సీతాదేవ్యాకృతినొసంగి శ్రీరాముని జూపి తదంతికభూమిన్ బుష్పవచయం బొన
ర్పుచుండుమని పంచిన నాపెయు నట్లొనర్పుచుండుడు రఘునాథుండు పరికించి.

గీ॥ అఖిలలోకనిదానుండ♦వఖవమూర్తి, సకలజగదేకమాతృక♦శాంకరియును
వేచియున్నారు నీకయి♦వేగనటకుఁ, బయన మొనరింపు మొక్కెద♦జయ! ముదంబ!

వ. అని నమస్కరించినంత నాయుమ మహాదేవిన్ జేరి యవ్విధంబుఁ దెలిపిన నంబిక
యాశ్చర్యంబొంది శ్రీరాముని యనాసక్త్యంబునకు మెచ్చి ప్రశంసించె నంత మహే
శ్వరుం డచిరకాలంబుననె శ్రీరాముఁడు సర్వలోకవిద్రావణుండగు రావణున్ బరి
మార్చి సీతన్ దోడ్కొనివచ్చునని యార్యతో నొడివి యటనుండి తిరుగఁ బరివారం
బులతోఁ బుష్పకం బెక్కి కదలి కైలాసగిరిన్ జేరె. 140

గీ॥ కపికులేశ్వరుఁ డంత నే♦కాంతభూమిఁ, జేరి తారాప్రముఖ భామి♦నీరతములఁ
దవిలి మధుపానమదమునఁ♦బవలు రేయి, ఖేదమరయక యెంతయుఁ♦బ్రీతినుండె.

గీ॥ నాల్గునెలలట్లు గడిపి యం♦తకును వాన, దప్పవరు యోజఁ గాంచక♦రామనృపతి
లక్ష్మణుని బన్పుడు నతండు♦ప్లవగపతుని, జూచి యతిశయకోపవి♦స్ఫూర్జితుండయి

ఉ॥ ఏమిది మర్కటేంద్ర! కృత♦మెంచక రాముని విస్మరించి యు
ద్దామమదంబునన్ జెలఁగి♦దారలతో విహరించుచుంటి వి
ట్లా మహనీయుసాయమును♦నారయవేని నిజాగ్రజన్మునిన్
రామశరంబు చేర్చును స♦రాసరి వేసరి యోజ సేయుమా! 143

వ. అనుడు విని తార కాతరయై సుగ్రీవానుమతితో ముందుగ సౌమిత్రిన్ దారసించి
మొక్కి యిట్లనియె. 144

ఉ॥ దేవర! వానరుండితఁడు♦దీనతఁ జేకొని యన్నభీతిఁ బె
ల్లావగ నిల్లునాలును స♦మస్తముఁ బాసి యొకండు ఋష్యమూ
కావనినుండె నిష్ఠ భవ♦దగ్రజు సాహ్యముతోడ సర్వమున్
గై వసమౌడు భోగములఁ♦గామనుఁడై కొనుచుండెఁ గ స్త్రిపై. 145

ఉ॥ ఐననితండు సత్యపథ♦మందె చరించెడు వాఁడుగాని యె
ప్డైనియుఁ గాపథంబుఁ జొర♦నెంచఁడు మేటి కృతజ్ఞమూర్తి నీ
యాన నొనర్చు విస్మృతక♦రంయంబునఁ బ్రత్యుపకార మెంతయున్
మానుము సందియంబు నస♦మానపరాక్రమశౌర్యభూషణా! 146

వ. అనుచుండ సుగ్రీవుండు ప్రహృష్టభూతుండై తటేసి మొక్కి రామానుజున కిట్లనియె.

ఉ॥ భూమిసుతాగవేషణను ♦ బూని హరీంద్రులఁ బంచితిన్ దిశా
స్తోమమునెల్లఁ గాంచుటకుఁ ♦ దోడనె వచ్చెద రింకవారు సా
ధ్వీమణి సీత నారసి ర ♦ విప్రభ! యల్కఁదొలంగు మేను శ్రీ
రాముని విస్మరింతునొకొ ♦ ప్రాణములర్థము లామహాత్మువే. 148

గీ॥ అని రయమ్మునఁ గదలి రా♦మానుజన్ము, తోడ రామునిఁ జేరి వై♦దుదినములకుఁ
గపులు సీతామహాదేవిఁ గాంచివచ్చు, వారని యమర్చుచుండెను♦భూరిసేన.

వ. అంతకుమున్ను సుగ్రీవాజ్ఞచే సీతామార్గమాణులై యరిగిన ప్లవంగప్రవరులు
వైదేహి నెందునుగానక సముద్రతీరంబుఁ జేరి పరితపించుచుండ సంపాతియను
విహంగేశ్వరుండు జానకీదేవిని రావణాసురుండీమార్గంబునఁ గొనిపోయి లంక
యందుఁ జెరనుంచెనని ప్రబోధించె. 150

క॥ ఆమీఁదఁ బంక్తికంఠుని, చే మూషితమైన యట్టి ♦ సీతను వెదుకం
గా మారుతతనయుడు తా, రామార్గము నెగసె దివిజ♦రాజి యలరఁగన్.

—* హనుమంతుఁడు సముద్రముదాటి లంకకేగుట *—

ఉ॥ ఆకసమందునుండియె ప్ర ♦ యాణముసేయుచుఁ జండమారుతా
స్తోకగతిన్ దినార్ధమునఁ ♦ దోయధి దాటి నిశాటవీరల
క్ష్మీకమనీయకర్బురవి ♦ చిత్రనివాసవసుంధరాంకల
ఙ్కాకటకంబుఁ జేరె వడిఁ గాండనిధిన్ బడఁద్రోచి సింహికన్. 152

గీ॥ సాయమగునంతకు సువేల♦శైలమందుఁ, గడపఁ దలఁచి యటన్ జేరి♦కాంచుచుండ
భాస్కరుండంత శ్రీరామ♦భద్రకార్య, మరసి యపరాశఁ జేరఁగ ♦ నరుగుచుండె.

గీ॥ కాలపురుషుం డపూర్వది ♦ క్కాంత కెలమి,నతులభాస్కరశోణర♦త్నాంగులీయ
కమును బంపినయట్టివై♦ఖరినినంత, ద్యుమణియొందెఁ బ్రాచీనతో♦యనిధిని

క॥ ఆకాంతయు నొకరత్నము, శ్రీకమనీయమును బతికిఁ ♦ జేర్పఁ బనిచినం
ట్లాకసమునందుఁ జంద్రుఁడ, నాకులుఁడై చేరి వెలిగె ♦ నమితజ్యోత్స్నన్. 155

గీ॥ అంత హనుమంతుఁ డెంతయు ♦ హరుస మొంది
కలయఁగని యల్పమూర్తియై ♦ గవను నెగసి
దాఁటి చనుచుండ లఙ్కిణి ♦ దటిసి యెదుర
దాని మదమార్చి యటుపైని ♦ దఱలె మరల. 156

ఉ॥ సంపదల గొందులన్ మఱియుఁ ♦ స్ఫాటికహాటక సౌధవీథులం
బైండవరత్ననిర్మిత గృ ♦ హాంతరభూములఁ బానశాలలన్
సుందర కేళికాభవన ♦ శోభితనిష్కుటకోటులందు న
స్పందమనీషఁ గాంచియును ♦ వందుతె నెందును సీతఁగానమిన్. 156

వ. మఱియుఁ బ్రదేశాంతరంబుల కేగి యందు.

క॥ చవికములంపలి మేడలఁ, గుదురగు గోపురవిహార♦కుట్టిమముల సొం
పొదవెడు నర్తనశాలల, గదుల వెదకి వెదకి కనక ♦ కాతరుఁ డగుచున్. 157

చ॥ పదఁపడి రాక్షసాగ్రిముల ♦ వాసగృహంబుల నెల్లఁ జూచి దు
ర్మదుఁడగు రావణాసురుని ♦ మందిర మంతయుఁ గాంచి కేళికా
సదనమునందుఁ దళ్కనక♦శయ్యను రావణుసందిటన్ రహిన్
నిదురను జెందుచున్న నవ♦నీరజనేత్రిను గాంచి ప్రీతుఁడై. 158

వ. తనలో రూపసాదృశ్యమాత్రించేయనుమానకంబుగాని

ఉ॥ మేలిపసిండిపూలమరి ♦ మీఱినవల్వయుఁ గుప్పసంబునున్
జాల సువాసనల్ విసరు ♦ చన్గవపున్నురజఃపరంపరల్
గ్రోలిన మద్యపుంజపులఁ ♦ గుప్పెడు కప్రపు వీటికమ్మనల్
కేళివిహారగోష్ఠి నెఱిఁ♦గింపుచు నున్నది యొక్కతె యుగన్. 159

ఉ॥ ఈ రమణీవతంసము ది♦నేంద్రకులోద్వహుసాధ్వి యానె? కా
నేరదు దీనిచంద మిది ♦ నే గ్రహియింపనె ? రామదేవి యి
ట్లాఁడిదుష్టదైత్యుని వి♦హారము లొందునె! యిద్ది ఏని దే
వేరి యథార్థ మల్ల పృథి♦వీసుత నెచ్చట దాచియుంచెనో. 160

చ॥ అనుకొని యా గృహంబు విడి ♦ యంతనె పట్టణవప్ర మెక్కి ద
వ్వున ఘనసాలనీలరుచి♦పుంజసురంజితదివ్యమార్గమా
వనపద ముందు టారసి జ♦వమ్మున నచ్చటఁ జేరుచుండఁగాఁ
దనకుడినేత్రమున్ భుజము ♦ తద్దయు స్పందన మొందఁ బ్రీతుఁడై. 161

## —* హనుమంతుఁడు సీతాదేవిన్ జూచుట *—

గీ॥ వేగఁ దఱిసి యశోకద్రు♦వితతవాటి, నెల్ల గాలించి చూచి యొ♦క్కెడను శింశు
పాతరుచ్ఛాయయెడ బహు♦యాతుధాన, వనితలలయించుభూమినం♦దవముగని యె.

చ॥ ఇనకులనాయకుండు దన ♦ కెంతయుఁ జెప్పిన దివ్యరూపసా
వనకమనీయలక్షణవి♦భాస్వరరేఖల నొప్పుదాని నా

ధుని విరహాతిదుఃఖమునఁ ♦ దూలుచు మజ్జనభోజనాదులన్
గొనక కృశించి సంతతముఁ ♦ గుందుచునున్న విదేహనందనన్. 163

ఉ॥ పాయక రామ రామ యని ♦ పల్కు సతమ్మును బల్కుదాని నీ
లాయతకేశపాశమున ♦ నాఁడిపంకము వొల్చుదానినిన్
గాయము కట్టుపుట్టములు ♦ గాసిలి మాసినదాని సుప్రభన్
శ్రీయనఁజాలుదానిని ♦ హరిప్రవరుం డటఁ గాంచెఁ బేర్మిమై. 164

చ॥ కని ముద మొంది తర్కమునఁ ♦ గాదని యౌనని కొంతసేపు వా
దన మొనరించి యంత వసు♦ధాసుతయే యని నిశ్చయించి రా
మునకును నాపెకున్ మది న♦మోయని తత్తరుపుష్పితాగ్రమం
దొనరఁగ నుండి వేళఁ గను♦చుండెను భూమిజదర్శనార్థియై. 165

క॥ ఇనుఁ డేగుదెంచుముందఱ, ఘనతరశోణాబ్జదామ♦కాండంబుల న
ధ్వను గై సేయఁగఁ దీర్చిన, యనువుగఁ దూర్పున నరుణమ♦హాద్యుతి యొదవెన్,

గీ॥ ప్రబలదోషాకరుం డాత్మ♦భాగ్య మెల్లఁ, బాసి సంద్రంబునన్ బడఁ♦బఱుగువెట్టె
కలువలార్తితోఁ దలవంచు♦కాల మమరె, నళిని వల్లభగోష్ఠి నా♦నంద మొందె.

మ॥ ఘనమందేహదనూజరాజిని జగ♦త్కల్యాణలిప్సాముదం
బున నాత్మీయకరంబులన్ జదిపి త♦ద్భూరిస్రవద్రక్తసా
రనితాంతాక్త శరీరుఁ డైన కతనన్ ♦ రక్తాకృతిన్ బ్రాగ్గిరిన్
దనరెన్ దివ్యులు గొల్వఁగాఁ ద్రిజగతీ♦బాంధవ్యుఁ డవ్వారిగాన్. 168

గీ॥ అట్లు భానుఁడు చేర ద♦శాస్యుఁ డచటి, కేగుదెంచి రఘూద్వహు ♦ నింతిదాని
సంకుచితగాత్రియై యున్న♦చంద మరసి, యిట్టులనెఁ బాపభీతి యొ♦క్కింతమాని.

ఉ॥ ఏటికి నన్ను జూచి యిటు ♦ లెంతయు నీదు మెఱుంగు చన్గవన్
మాటొనరింతు వాత్మమున ♦ మానుము పంతమొకింత వంతయున్
హాటకకేతకీదళని♦భాంగి! జగన్నుతదివ్యమూర్తి! యా
రాటముఁ బాసి నాదగును♦రమ్మునఁ జేరుము బిగ్గ కౌఁగిటన్. 170

ఉ॥ మాసిన చీరతోడఁ గడు ♦ మాసిన వేణిభరంబుతోడ బల్
గాసిలి రేల్ పవల్ నిదుర ♦ గ్రాసముఁ బాసి యిటుల్ గృశింపఁగా
వాసియొకో! కనద్వికచ♦వారిజలోచన! తేరిచూడుమా!
రోసముమానుమా! పదస♦రోజములొత్తెద నాజ్ఞ సేయుమా. 171

చ॥ చతురుఁడఁ గామశాస్త్రమునఁ ♦ జాలినవాఁడ సమస్తలోకసం
స్తుతుఁడ మహేంద్రుఁడాదిగల ♦ శూరుల నెల్ల జయించి తద్ధన
ప్రతతులఁ గొల్లగొన్న బల ♦ వంతుఁడఁ గాంతుఁడ దివ్యభామినీ
స్మితతర దృక్సమార్చితుఁడఁ ♦ బ్రేముడి నీమదిఁ గల్గ దేలొకో. 172

క॥ నీకును సమానులై తగు, నీకులసతులందు సతము ♦ నీవొందు మన
న్యాకాంక్ష నతనుభోగము, లీకరణిఁ మెలఁగఁబాయ ♦ వీనీసిరులన్. 183

శా॥ నీవొక్కండవు పాపకారివగుచున్ ♦ నీయందఱన్ జంపఁగా
నీ వాసంబగులంక రత్నమయి న ♦ గ్నిన్ గాల్పఁగా నీవునున్
జావంగా మదిలోఁదలంపకు మిఁకా ♦ జాడన్ విడన్ బూనుమా!
శ్రీవర్ధిల్లఁగ నన్నుఁజేర్పుము! జయ ♦ శ్రీరాము నారామునిన్. 184

చ॥ అతఁడు దయామయుండు శర ♦ ణాగతవత్సలుఁ డాఢ్యుఁ డుత్తమో
చితహితధర్మసంగతుఁడు ♦ జీవిత మాత్మఁ దలంతువేని యి
ప్డితరము మాని నన్నిటకు ♦ నెట్టులఁదెచ్చితో యట్లె వేగ నా
పతికడఁజేర్చి యాఘనుని ♦ పాదములొందు మతండు గాచు నిన్. 185

క॥ రాముఁడు వదాన్యజగదభి, రాముఁడు రక్షఃప్రికరవి ♦ రాముఁడు మాశ్రీ
రాముడు సుజనహితాత్మ, రాముఁడు దెలియు మిపుడేని ♦ రావణ! మదిలోన్!

ఉ॥ నేనిఁక నీకు లోభపడి ♦ నీసిరి కువ్విళులూరి లోఁగఁగా
ధ్యానముసేయ నెంచకు మ ♦ హస్కురతోడ నె యుండు చాయ యె
ప్డేనియుఁ బాయదంచెఱుఁగు ♦ మిాధ్యుఁడు రాముని చెట్టఁబట్టి వే
ఱేని భుజంబు నేవ మన ♦ కెట్టులఁబట్టెదనో తలంపవా! 187

గీ॥ గంధసింధురరాజభో ♦ గములఁ దనియు, నాకరేణువు సూకరం ♦ బభిలషింపఁ
గలియునే యెపుడేని నీ ♦ కరణి నాకు, నీకుఁగల యంతరంబు గ ♦ ణింపు మదిని.

ఆ॥ చేతఁజిక్కినట్టి ♦ చెలువయంచనుకోకు, మదిఁగరంగున నెడు ♦ మాటఁబోకు
దిక్కుమొక్కులేని ♦ దీనగాదిసీత, కలఁడు రాఘవుండు ♦ కాంతుఁ డెఱుఁగు.

వ. అంత వసుమతీతనయ విసువుతో సైరింపరాని యాగ్రహభరంబుతో మఱియు
నిట్లనియె. రాక్షసరాజా! వినుము వినుము. 190

ఉ॥ చెప్పితి ధర్మసూక్తులను ♦ జేడ్పడఁబోకుము చాపలాత్మమై
దెప్పరమైనసంకట మి ♦ దే చనుదెంచెను గాచికొమ్ము నీ
వప్పులఱేనికొల్వు నిఁక ♦ నా ధననాథునిగట్టు నొందినన్
దప్పక తెచ్చితుంచు దిన ♦ నాథకులోద్వహదివ్యబాణముల్. 191

గీ॥ నీదు శౌర్యంబు చెట్టెక్కు ♦ నీవు మిత్తి, నోటఁ జిక్కఁగలాఁడ వే ♦ నును విపత్తిఁ
గడచిగట్టెక్కఁగలనిఁకఁ ♦ గలనికావ్రి, చండుఁడిదెవచ్చువడి రాఘ ♦ వుండుఘనుఁడు.

గీ॥ అనియిటులఁ దన్ను లెక్కింప ♦ కతులపరుష, వచనములనాడిన రఘుప్రి ♦ వరుని సతిని
గాంచికోపించి తలఁద్రుంప ♦ ఖడ్గమెత్త, ధాన్యమాలిని యనురాణి ♦ తఱిసి విభుని.

వ: నాదుకల కల్లగాదు నిక్కాలయగు.

ఉ॥ కావున మీర లాగడ మిం♦కన్ విడి యీమెయిడన్ బ్రపన్నులై
సేవలఁ జేయఁజెల్లు నిది ♦ సిద్ధము రాముఁడు రాఁగలం డిటన్
గావలువైన రక్కసులు ♦ గాంచెద రంతము మీర లీసికన్
భావములందుఁ బాయుఁడు శు♦భంబగుమార్గ ముదాహరించితిన్. 207

క॥ అనుటయుఁ దుటారులించుక, మనముల నడలొంది నిదుర ♦ మైకమున నెడం
జని తూగుడును బిరుందనె, హనుమానుఁడు కుజము డిగ్గి ♦ హరుసముతోడన్.

గీ॥ సీతకు నమస్కరించి తా♦శిరము వంచి, యంజలియొనర్చి నిలిచియి♦ట్లనియెఁదల్లి!
దినకరకులామృతాకరేం♦దుని పురంధ్రి!, స్వస్తి నీకు విదేహరా♦జన్యపుత్రి!

క॥ అనుటయు వైదేహియు నా, ననపద్మం బెత్తి చూచి ♦ నక్తంచరుఁ డీ
యనువునఁ దిరుఁగవచ్చెనొ, యనుననుమానమును నాత్మ♦మందుఁగొనుటయున్.

వ. అంజనీతనయుఁ డారసి తల్లీ! సందేహింపకుము రామపాదములానయని రామ
లక్ష్మణుల కుశలోదంతంబును వాలినిగ్రహసుగ్రీవస్నేహంబులును దన్ను వెదకు
టకై నలుదిక్కుల వానరులఁ బంచుటయును భాగ్యవశంబునఁ దన్ను దానిపుడు
చూచుటయును మున్నగునవి చెప్పివిశ్వాసం బొదవఁగ మఱియు నాయమకిట్లనియె.

చ॥ రవికులనాథుఁ డల్ల రఘు ♦ రాముఁడు నీలపయోదవర్ణుఁ డా
హవకుశలారిభంజన స ♦ మర్థదృఢాయతబాహుయుగ్మకుం
డవిరళతేజుఁ డప్రతిముఁ ♦ డమ్మరో! లక్ష్మణుఁ డచ్ఛహేమమూ
ర్తి వనజనేత్రుఁ డగ్రజున♦రిందగు నించుక కేమి వారకుఱ్. 212

సీ॥ నీ వియోగంబొంది ♦ నీభర్తవిరహాగ్ని, కీలలఁగాగి శు♦ష్కించె నమ్మ!
సౌమిత్రియును రాము♦చందంబుఁ గాంచుచుఁ, గడుదుఃఖితుండయి♦యడలెనమ్మ!
వార లిర్వురు హరి♦ప్రభునిసేనలతోడఁ, ద్వరితంబె యిచటికి ♦ వత్తురమ్మ!
రఘుపతి రాక్షస♦రాజును వధియించి, నిన్నుఁదోడ్కొనిపోవు♦ నిక్కమమ్మ!

గీ॥ కొలఁదికాలంబు నోపికఁ ♦ గొని మనోర,థముల నెల్లను సానుబం♦ధముగ నొందు
మమ్మ! నా నుడులను మది♦నమ్ము మమ్మ!, జనక రాజన్యతనయ! వి♦స్తారసునయ!

వ. అని మఱియు నభిజ్ఞానార్థంబు శ్రీరామదత్తాంగుళీయకంబు సమర్పించి సందియం
బుండిఱిచి యాయమసందేశంబునకై వేచియున్న నమ్మహాసాధ్వి నాథుని
పచ్చరాముద్దుటుంగరంబుఁ జేకొని కన్నులఁగప్పికొని శిరంబునందిడుకొని
వామాక్షిస్పందనంబుఁ బరికించి వానరవీరుని యాథార్థ్యం బరసి మురిసి బాష్పం
బుల నుత్తరీయంబుఁ దడుపుచు నిట్లనియె హరివర్యా! 214

చ॥ ఒకనెలదాక ప్రాణముల ♦ నోపిక నెట్లో భరింతు దీనర
క్షకు దయమానమాననుఁ బ్ర♦చండభుజాహతదుష్టదానవున్
బ్రకటితశౌర్యధుర్యు రఘు♦వర్యు నిజానుజుతోడఁ దెచ్చి వం
చకుఁడగు రావణాసురునిఁ ♦ జంపఁగఁ జేసి హరింపు నావ్యథన్. 215

వ. ఇఁకను బ్రస్తుతం బందు నీకు బ్రబోధింప వచ్చిన నాదు హితోక్తుల నాకర్ణింపుము.

చ॥ ఎఱిఁగియొ యెఱ్ఱకుండియొ మ♦హీశ్వరపత్నిని దొంగలించి నీ
పురమునఁ జేర్చుకుంటి విఁకఁ ♦ బోవిడి దుష్టపథంబు మైథిలిన్
దిరుగ నృపాలుఁ జేర్చి విను ♦ తిన్ బొనరించి క్షమింపఁగోరుమీ
చిర మనువుల్ ధరింతు విఁకఁ ♦ జేటగు వేఱొక బాటఁ బోయినన్. 228

ఉ॥ పిల్లలు జెల్లలున్ మిగులఁ ♦ బెంపువహించి రహింపఁ బెండ్లముల్
కొల్లగఁదెచ్చి చేకొనిన ♦ క్రొత్తహారంగు మెఱుంగు గుబ్బెతల్
పెల్లుగ హావభావములఁ ♦ బేర్మిఁ దలిర్పఁగఁ జేయ హాయి రం
జిల్లఁ జిరంబు సౌఖ్యములఁ ♦ జెందు మలందురఁ బోక నీ విఁకన్. 229

వ. మఱియు లోకాతిక్రాంతవిక్రముఁడగు శ్రీరామచంద్రుని కొలంది జక్కఁగ
నీ వెఱుంగకున్న నే నొక్కింతఁ జెప్పెదను వినుము. 230

సీ॥ కార్తవీర్యార్జును ♦ గడపిన భృగురాము, నవలీల గెలిచిన ♦ యాజసికుఁడు
ఆ సుబాహు విరాధు ♦ నల్లమారీచుఁ గ, బంధుఁ జంపినయట్టి ♦ ప్రౌఢబలుఁడు
ఖరదూషణాదివి ♦ క్రాంతరక్షఃకోటి, నెల్ల హరించిన ♦ యాద్యమూర్తి
నిను గృమింబోలెఁ బ♦ట్టిన వాలి నొక బాణ, మునఁ గూల్చినట్టియ♦ద్భుతభుజుండు

గీ॥ అట్టి వీరాధినాథుని ♦ యట్టి దిట్ట, నట్టి దినకరవంశదు ♦ గ్ధాబ్ధిచంద్రు
నిప్పటికి నేనినాబోధ♦ నెఱిఁగి మెలఁగు, మురక యుసురులఁ గోల్పోక ♦సురవరేంద్ర!

చ॥ అనుడు దశాస్యుఁ డాగ్రహప ♦ రాయణుఁడై కపినిన్ వధింపుఁ డం
చనుచరకోటి కాజ్ఞ నిడ ♦ నాతనిభ్రాత విభీషణుండు దూ
తను వధియించు టెం దనుచి ♦ తంబు తృణంబులఁజుట్టి వాల మం
దనలముఁ జేర్చి కాల్పుఁ డది ♦ యర్హతరం బగు దండనం బగున్

క॥ అని సెలవొసఁగిన నంత నె, దనుజులు తృణవస్త్రఖండ ♦ తతిఁ గపిపుచ్ఛం
బునఁ జుట్టి తైల మాజ్యం, బును బోసి దహించి విడిరి ♦ భూరితరోషన్. 233

గీ॥ అంతనాజాడఁ దెలియఁగ ♦ నవనిజాత, చింతయొనరించియగ్నినొ♦క్కింతఁదలఁచి
వేఁడె హనుమకుఁ జల్లనై ♦ వెలయువహ్ని!, నేఁ బతివ్రతనగుదు నే♦నిన్ దయాళు!

—* లంకాదహనము *—

వ. అని ధ్యానించినంత నగ్ని దేవుండు పావనిన్ గాల్పక చందనశీలుండై యమరిన
ననిలనందనుం డానందించి నిజలాంగూలాంగారజ్వాలానిక్షేపంబున లఙ్కాపట్టణం
బెల్ల రగిల్చి దహియించి యశోకవనంబున కేగి జానకీదేవిన్ గాంచి మ్రొక్కి
సెలవొంది మున్నీటిదాఁటి జాంబవత్ప్రముఖులఁగలిసికొని మ్రొక్కి వార్తావా
బుల కెడమీక తా నంబుధి తరణంబొనర్చిన యనంతరంబ లంకాపురిన్ బ్రవేశిం

చుటయు రావణాంతఃపురంబుతో నగరంబునంతయు శోధించి యశోకవని కేఁగు
టయు నందు భాగ్యవశంబున సీతాసందర్శనంబు సేయుటయుఁ జెప్పెను.

సీ॥ రాకాసితతుల న♦నేకాకృతులఁ దర్జ, మానమై కను నల ♦ మరెదు సాధ్వి
ఘనమేఘమండలీ ♦ క్రాంతయౌ శశిరేఖ, వడువునఁ దేజ మే♦ర్పడని రమణి
దుస్తరంబై నట్టి ♦ దుఃఖసముద్రంబు, నోంచెయీఁదఁగ లేక ♦ కుందు నబల
బలదర్పితుండైన ♦ పంక్తికంఠుఁ దలంచి, మాటిమాటికి భయం♦పడుల తాంగి

గీ॥ కడుమలినమైన వల్వయు ♦ నొడలువేణి, నొప్పమానిని నిదురను ♦ దప్పి నాక
లిని నెఱుంగని ధీరను ♦ ననవరతము, రాముఁ జేరఁగఁ దలఁచునట్టి♦రామసతిని.

గీ॥ కాంచి సాష్టాంగపడి నమ♦కంబు దోప, రామదూతుఁడ ననియుంగ♦రంబొసంగి
ఆనవాల్గ్గి పడసి తా♦ నసురనాథు, నగరిఁ గాల్చి యిటకు వచ్చి♦నాఁడ ననిమె.

వ. అందఱతోడ నానందంబున నంత వెడలి మాల్యవద్గిరిఁ జేరి సుగ్రీవాది సంసేవితు
లైన దాశరథులకు మ్రొక్కి శ్రీరామునితో నిట్లనియె. 238

ఉ॥ చూచితి సీత నాతతవి ♦ శుద్ధమహస్కరభాసమాననో
త్రా! చిరతావకోరువిర ♦ హార్తినుదుస్సహదుఃఖితఁ హిమా
నీచయపీడ్యమాననళి ♦ నీగతి రాజిలు పుణ్యమూర్తి సం
కోచము మాను మిద్ది కను ♦ గొన్ము సతీధృతదివ్యరత్నముఁ. 239

గీ॥ కామనీయక మంతయుఁ♦గరగిపోమె, మిగులఁ గృశియించెఁ దనులత♦పగలు రేలు
మజ్జనాహారనిద్రల ♦ మానియున్న, దబల నీపయి నునిచి స♦ర్వాత్మ మథిప! 240

చ॥ తడవిఁక నోర్వజాలదు ని♦తాంతము దుఃఖపరీతచిత్తయై
యడలుచు నున్న దొక్కటఁ ♦ మబ్జమువోలెఁ దలంచు మాసమేఁ
గడువఁగ లేదు యీనము నిఁ ♦ కఁ వడిఁ జేసి పలాశనాథుఁ గ్రొ
వ్వడచి వధించి దేవిచెఱ ♦ కంతము సేయుము దేవ! మ్రొక్కెదఁ. 241

క॥ ఒత్తిడి సేయుచు నుండిరి, మత్తలు రాత్రిందివంబు ♦ మనుజాదిను లా
యుత్తమను వేగిరము దం, డెత్తు మిదే యదను తడ విఁ ♦ కేల! మహాత్మా!

క॥ వచ్చునని వేగ నొడయుఁడు, హెచ్చునని ముదంబు దనకు♦హింస్యాంశీకఁ దాఁ
జచ్చునని రావణుఁడు వన్, మెచ్చునని యునాథుఁ డంటి♦మేలుగను విభూ!

వ॥ అని యడిగాలా బా చూడారత్నంబు సమర్పించి యచ్చటి వృత్తాంతవిశేషంబు
లశేషంబుగ యాథాతథ్యంబుగ నెఱింగించుటయు దాశరథి దుఃఖాశ్రులనించి
రత్నంబుఁ జేకొని గన్నులఁ గప్పికొని సీతాసందేశంబున కానందించి హను
మంతు నాలింగనంబొనర్చె. సౌమిత్రియు సుగ్రీవాంగదప్రముఖులు హర్షించి.

హనుమంతుఁ బ్రశంసించి రంత రామచంద్రుం డచ్చటి దైత్యులతీరు లడుగు
టయుఁ బావని యిట్లనియె. 244

గీ॥ చదువు శౌర్యంబు ధైర్యంబు♦సాహసంబు, బలముసిరియు రవలరక్క♦సులకునిఁకను
దయయు దాక్షిణ్యమును సత్య♦తత్పరతయు, దేవ! నిప్పచ్చరం బిట్లు♦దెలియుమదిని.

వ. అనుటయు నంత.

ఉ॥ వానరఋక్షకోటిబల ♦ వంతుల నేటి గ్రహించి మేటి యా
సేనను గూర్చి భానుజుఁడు ♦ శీఘ్రమె యంగదజాంబవన్మరు
త్సూను సుషేణనీలనళ ♦ ధూర్వహులన్ గొని రామచంద్రునిన్
సానుజుఁ గొల్చుచున్ నలిపె ♦ యానము యామ్యదిశాభిగామియై. 246

క॥ సాగరతీరముఁ జేరి మ, హాగలతాకుంజమంజు ♦ లాచ్ఛాంబుసరి
త్సాగము మహేంద్రశైలం, బేగి యటన్ విడిసి రాహ♦వేచ్ఛాపరులై. 247

గీ॥ కాలరులచే నది యెఱింగి♦కర్బురేంద్రుఁ, డనికిఁ గడగుడు వలదు సీ♦తను రఘుపతి
కిమ్మని విభీషణుఁ డనుడు ♦ నీరసమున, మందలించిన నతఁ డనె ♦ మగుడ నిట్లు.

సీ॥ పుంఖానుపుంఖంబు ♦ బాదలు రాఘవబాణ, జాలంబులకు నోర్వఁ♦జాల వన్న!
అతనికి నెనయగు ♦ నా లక్ష్మణునితోడ, సమర మొందుటయు దు♦స్సాధ్యమన్న!
పారదారికభోగ ♦ పరతంత్రత యదెల్ల, నెఱుఁగు మధఃపాత♦హేతు వన్న!
రక్షోవిలాసినీ ♦ రాజితో రమమాణ, వృత్తివై సుఖముల ♦ వెలయు మన్న!

గీ॥ నిన్నుఁ జుట్టినజన మెల్ల ♦ నీవునున్ సు, రక్షితముగాఁగ మనుట క♦ర్జంబు గాన
నరసి యిట్లు వచించితి♦నన్న! దాని, యాభిముఖ్యం బెఱుఁగుమన్న!♦యాత్మమందు.

గీ॥ శక్తిధరునకు సబ్రహ్మ♦చారియైన, భార్గవున కోటుఁగూర్చిన ♦ బల్లిదుండు
ఘనుఁడుశ్రీరాముఁడవ్వానిఁ♦గడఁగిదురము, సేయఁగాలేమురయమున♦సీతనిమ్ము.

వ. అనుటయు దుర్వినీతుండగు రావణాసురుండు కుపితుండై హిత మరయక విభీష
ణున్ జంపఁ గడంగుచు నాతని కిట్లనియె. 251

సీ॥ పంక్తికంధరు బాహు♦బల మెఱుంగక యిట్లు, పలుకుట యనుచిత♦పథముగాదె
జట్టుమార్గముఁ బట్టి ♦ పరిత్యర్థులను వదా, వదగతి నెన్న నే♦వంబు గాదె
ఇది నింద్య మ దనింద్య ♦ మని వచించుట యెల్ల, భీరులయర్థంబు♦తీరు గాదె
దానవాంగనలు బృం♦దారకస్త్రీలు భూ, జాతపదముఁ బోలఁ ♦ జాలువారె

గీ॥ తెగి యిటులనొవ్వఁబల్కిబల్ ♦ నిగుడుచున్న, నిన్ను రక్షింప నెవ్వరు♦నేర్తురో య
రయు! మిటకుఁ దెమ్ము కనెద వ♦రాతివర్గ, గామి! రావణహస్తఖ♦డ్గప్రహతిని.

వ. అని సెగలుపొగలునిగుడఁ గాలకూటంబుఁ గ్రక్కుచు నిట్లుతర్జించిభర్జించి యువ్వె

త్రిగాఁ గాక్షేయకంబు నొరనుండి వెలువడుచున్నంతలో విభీషణుండు భీతుండై
తత్క్షణంబున.

క॥ అనుచరచతుష్టయముతోఁ, దనయుగ్రజుఁ బాసి కడలి ♦ దాటి రఘుపతిన్
గని శరణముఁగోరుటయును, దినకులపతి యభయ మొసఁగె ♦ నెంతయుఁ గరుణన్.

వ. పుణ్యజనేంద్రున కన్నిమేషంబున లంకారాజ్యపట్టాభిషేకం బొనరించి పంక్తికం
ధరబలస్వరూపంబు కొలందు లెఱుంగఁ గోరుడు విభీషణుండు రామున కిట్లనియె.

చ॥ అనిమిషదైత్యయక్షపవ ♦ నాశనపీడల నొంచినట్టివాఁ
డనితర శౌర్యధుర్యవిభ ♦ వాతిశయంబునఁ బొల్చువాఁడు బ్ర
హ్మను నలరుద్రులన్ గొలిచి ♦ యద్భుతదివ్యవరంబులన్ గనన్
గొనినఘనుండు రావణుఁ డ ♦ కుంఠితవిక్రముఁ డెందు భూవరా ! 256

వ. మఱియు నాతనికంధరావ్రాతంబునం దమృతకుండంబు గలదుగావున మస్తం
బులు విచ్ఛేదించినను గూడ మఱల నావిర్భవించు నొక్క బ్రహ్మాస్త్రంబున
నయ్యవి యంతమొందు నింక నాతనికిఁ గుడిభుజంబట్లు యుద్ధమునోదఁ డొకండు
గలఁడు. 257

చ॥ అతిబలుఁ డున్నతాయతభు ♦ జాంతరుఁ డుగ్రకరాళవక్త్రుఁడు
ద్ధతపరిపంథివీరసము ♦ దాయవిఘాతకుఁ డిద్ధమూర్తియ
ప్రతిముఁడు కుంభకర్ణుఁ డని ♦ వార్యపరాక్రముఁ డగ్రజాత్మసం
గతుఁ డింక వానితో దురము ♦ కష్టతరంబు నరేశచంద్రమా ! 258

వ. ఇఁక స్పృహణీయవిక్రముఁడగు రావణజ్యేష్ఠపుత్త్రుండు,

మ॥ శతమన్యున్ ధృతసైన్యు నల్పిన మహా ♦ చండప్రతాపుండు సం
సితదర్పుండు నికుంభిలావ్రతుఁడు రా ♦ శీభూతతేజస్కుఁ డం
చితదివ్యాస్త్రనిధాన ముత్తమరణ ♦ శ్రేణీపురోగామి యూ
ర్జితసత్త్వుం డలమేఘనాదుఁడు ధరి ♦ త్రీపాలచూడామణీ ! 259

వ. ఉక్కువుండగు వీనితోఁ బోరు మిక్కిలి వెక్కసంబగు వెండియుఁ దక్కిన రావణత
నయులును బవరంబునం దుక్కుమీఱినయులు. 260

క॥ మఱియుఁ బ్రహస్తుండు మహో, దరుఁడు విరూపాక్షవజ్ర ♦ దంష్ట్రప్రముఖుల్
పరచక్రమర్దనులు త, ద్వరూథినీపతులు రామ♦భద్ర! యనేకుల్. 261

వ. ఐనను వినుము.

ఉ॥ రావణ కుంభకర్ణులిఁక ♦ రామ! భవచ్ఛరపాతి కాదు రా
రావణి నింద్రజిత్పరుని ♦ భ్రాత వధించును లక్ష్మణుండు ను

గ్రీవహనూమదంగదులు ♦ కీశవరేణ్యులు తక్కినట్టి దు
ర్భావులఁ దచ్చమూపతులఁ ♦ బట్టి వధింతురు చింత మానుమా! 262

వ. అనుటయు శ్రీరామలక్ష్మణులు వలీముఖబుకువీరులు సంతసించిరంత రామ
భద్రుండు మహోర్మిమాలాశోభితంబై యగాధంబగు సాగరంబుఁబరికించి
మహేశ్వర సాహాయ్యంబులేక యకూపారంబుఁదరింప దుర్లభంబనియెంచి
స్నాతుండై. 263

గీ॥ కంధితటిఁ బార్థివేశలిం♦గ ప్రతిష్ఠ, * సల్పి యర్చించి శంభుప్ర ♦ సాద మొంది
కడలి నొప్పించి సేతువు♦గట్టి దాఁటెఁ, గపిబలంబులతోడ రా♦ఘవుఁడు గడిమి.

గీ॥ వృక్షచరబలములతో సు♦వేలకూట, మందుఁ జేరి రఘూద్వహుం♦డందు సైన్య
మొక్క మొగ్గరముగఁబన్ని ♦యోధనాధు, లనువిభాగించెరక్షణం♦బనువుమీఱ.

చ॥ హరివరు లంత విక్రమప♦రాయణులై రజనీచరాధిరా
ట్పురమును ముట్టడించి ఘన♦భూధరగండశిలాభివర్షణో
ద్ధురతర కేళి రక్కసులఁ ♦ ద్రుళ్ళడగించి వధించుచుండ సం
గరమొనరింపఁ బంపె దశ♦కంఠుఁ డకుంఠితయోధవర్యులన్. 266

వ॥ అందుమహోదరవిరూపాక్షధూమ్రాక్ష వజ్రదంష్ట్రాకంపనవిద్యున్మాలి ప్రహస్త
ప్రముఖులు తుములసమరంబున మర్కటసైన్యంబుల దైన్య మొందించి మ్రం
దించుటయు వలీముఖశ్రేష్ఠు లగు సుగ్రీవహనూమదంగదనీలసుషేణాది యోధు
లును భల్లూకపతియగు జాంబవంతుండును పుణ్యజన భూషణంబైన విభీషణుం
డును నెదుర్కొని రక్కసులనిక్కుఁబాపి యంత మొందించి రంత. 267

ఉ॥ రావణదైత్యుఁ డాగ్రహాభ ♦ రాత్మకుఁడై త్రిదశేంద్రజిత్వర
శ్రీవహు మేఘనాదుఁ దన♦జ్యేష్ఠకుమారు సమీకధీరు యు
ద్ధావని కంపె నాతఁ డుర♦గాస్త్రము నేసి నరేంద్రపుత్త్రులన్
బావని నర్కజప్రముఖ ♦ వానరులన్ ఘనబంధనంబునన్. 268

ఆ॥ కట్టివేసి దివి కె♦గసి చేరెలంకకు, యాతుధానవిభుఁడు ♦ హరుసమొందె
నంత వైనతేయుఁ♦డా యనీకిని జెంది, సర్పులకును బాపె ♦ సర్పబాధ. 269

ఆ॥ ఆ మఱుసటి యహము♦నందు జీమూతనా, దుండు మరల రణముఁ♦దొడరి రోష
రయముతోడ వేసె♦బ్రహ్మాస్త్రమది వాయు, సూనుబుక్షపతుల♦జోలి మాలి.

---

* శివపురాణే కోటిరుద్రసంహితాయాం త్రింశాధ్యాయే.

శ్రీరామః - శ్లో॥ పునశ్చ ప్రార్థయామాస సాంజలి ర్నతమ స్తకః - త్వయా స్థేయ మిహ స్వామిన్
లోకానాం పావనాయచ పరేషా ముపకారార్థం యదీ తుష్టోసి శంకర। సూతః
ఇత్యుక్తస్తు శివ స్తత్ర లింగరూపోభవ త్తదా రామేశ్వరశ్చ నామ్నావై
ప్రసిద్ధో జగతీతలే రామస్తు తత్ప్రసాదేన సింధు ముత్తీర్య చాంజసా రావణాదీన్
నిహత్యాశు రాక్షసాన్ ప్రాప తాం ప్రియాం.

క॥ తక్కినవారల నందఱఁ, జక్కఁ దేఁచి దినేంద్రవంశ • చంద్రుల మదికిన్
మిక్కిలి వెఱపుఁ గూర్చుడు, నక్కాకుస్థేంద్రుఁ డనిమె • సనుజునితోడన్. 271

గీ॥ ఆశరుఁడు వేసె బ్రహ్మాస్త్ర • మద్ది మసల
నిట్టు వేధించుచుండె నీ • విప్రుడు ధైర్య
మెనయు మని తాఁ గనుల నిమీ • లన మొనర్చె
నగ్రజుని సమరోధించె • ననుజుఁ డపుడు. 272

సుగంధి వృత్తము } అంత జాంబవంతుఁ డెంతో • యల్కియాంజనేయుతోఁ
జింతమాని మంచుకొండఁ • జేరి జీవవల్లరిన్
సంతరించి తెచ్చివాని • సౌరభం బొసంగుమా!
వింతగా నృపుల్ గపుల్ ను • వీడువారు మూర్ఛలన్. 273

వ: అని ప్రబోధించినంత నప్రమేయ విక్రమరయుం డగు నాంజనేయుండు మహా రయంబున సంజీవినీ లతలన్ దెచ్చి యాఘ్రాణింపఁ జేసినయంతనే రామలక్ష్మణులు సకల వానరవీరులు తత్క్షణంబున మూర్ఛన్ బాసి తెలివొంది రామీఁద మేఘనాధుండు. 274

గీ॥ మాయసీతను నాయాంజ • నేయు నెదుట, శిరసుఁ దెగ వేయుటయు వృక్ష • చరవరుండు
వెఱచి విలపింపఁగా నవ్వి • భీషణుం డ, తథ్యమని చెప్పి యుడిపె నా • దైన్యమెల్ల.

వ. మఱియు రావణప్రేరితయై.

క॥ విద్యుజ్జిహ్వాయనానొక, ప్రద్యోతిత మాయ యసుర • బాణాగ్రమునన్
సద్యోభిన్నంబై తగు, ప్రద్యోతనకులతిలకుశి • రసుఁ దెచ్చి వడిన్. 276

మత్తకోకిల॥ సీతముందఱ వేయ నంతనె • ఉగ్ర మాయను చూచి, దుః
ఖాతితాడితయై రయంబున • హా విభూ! యని కూయిడన్
ఘాతుకాగ్రణియైన రావణ • కార్య మీయది తల్లి! స
త్యేతరం బిది నమ్మ మంచని • యెన్ విభీషణపుత్త్రి దా. 277

వ. అట్లు త్రిజట యథార్థంబుఁ దెలిపి వైదేహివ్యాకుల తాపంబుఁ బాపె నమ్మఱు నాఁడు రావణుఁడు కుంభకర్ణునకు స్వాపంబుఁ బాపి రప్పించి తనయవస్థన్ దెలిపి సాయం బపేక్షింపుడు నాతం డిట్లనియె. 278

చ॥ ఎది హిత మంచుఁ జెప్పెను వి • యేంగిత వేది విభీషణుండు నీ
కదియె హితంబు దాశరథి • కర్పణసేయుము మైథిలిన్ గుణా
స్పద! మది రాయ తేమనలు • ధానుర వృత్తసమున్నత క్రమల్
వదలక నిన్ను గొల్చెదరు • వల్లురు వారలతో సుఖింపుమా! 279

వ. అటు సేయ వేని.

ఆ॥ సీత లంకకెల్ల ♦ చిచ్చు రగుల్కొల్పు, నగ్గిసెగలమూక ♦ యతివధాక
నాగుఁబాముపడగ ♦ నాతుకమ్మైందీగ, కాళరాత్రి యద్ది ♦ గడుపు మనల. 280

వ. అనిచెప్పుటయునంత జనకజాసమాగమోత్సవసమారంభసంభావనాపైశున్యపరాయణుండగురావణుం డా వచనంబులఁ జెవిఁబెట్టకయనాదరించి యాతనికిట్లనియె.

ఉ॥ శూరుఁడవంచు శాత్త్రివని ♦ షూదనమున్ బొనరింపఁ జాలుమేల్
ధీరుఁడవంచు నాకుఁ గల ♦ దీమస మీవ యటంచు నెంచి నిన్
భూరితరోద్యమంబునఁ బ్రబోధముఁగూరిచి సాహ్యామడ్గ నీ
తీరుగ భీరువృత్తముప ♦ దేశము చేసెద వేల సోదరా! 282

## — * శ్రీరాముఁడు కుంభకర్ణుని జంపుట * —

చ॥ అన నతఁ డగ్రజన్మమున ♦ మారసి కాలము దాపరించె నీ
తనికిని సీతనిన్ జెనయు ♦ తక్కిన వారల కంచు నెంచి యా
త్మను దృఢమున్ బొనర్చి రణ ♦ ధారుణిఁ జేరి హరీంద్రసేన నం
తను గబళించుచుండఁ గని ♦ దాశరథుండు వధించె నాతనిన్॥ 283

వ. అంత నింద్రజిత్తు నికుంభిలావ్రతానుష్ఠానం బొనర్చి రామలక్ష్మణులతో వానరసేన నంత నంత మొందింపఁ గడంగి యట్లొనర్పన్ బూనుడు విభీషణుం డెఱింగి హరివీరులచే నద్దాని భగ్నంబు సేయించుటయుఁ గృద్ధుండై నాలుకలు చాచుకొని వచ్చునాగుఁబాము చందంబున, 284

ఆ॥ మరల నింద్రజిత్తు ♦ దుర మొంది లక్ష్మణున్, గవియ నతఁడు లెక్కఁ ♦ గనకకినుకఁ
జెంది దివ్యశరని ♦ శితధార దైత్యుని, శిరముఁ ద్రుంచె దివిని ♦ విరులు గురిసె. 285

చ॥ దశముఖుఁ డంత దుఃఖ ♦ పరితప్తతరాత్ముఁడై కదనన్ వడిన్
నిశితకృపాణచాపశర ♦ నిష్ఠురశక్తులఁ దాల్చి సేనతో
దిశలు గలంగ వచ్చి కపి ♦ ధీరుల నెల్లర దాఁటి ధాటిమై
యశనిసహస్రశక్తిఁ బ్రబల ♦ యావహశక్తిని గొట్టె లక్ష్మణున్. 286

క॥ ఘనతరశక్తిప్రహరణ, మున రామానుజుఁడు నొచ్చి ♦ మూసెఁ గనులు గ
న్గొని రఘునాథుఁడు వనరెను, మనమందలి దీమసంబు ♦ మాటువడంగన్.

గీ॥ తండ్రి! సౌమిత్రి! తెలుపు క ♦ న్దమ్మి యొక్క, మాట తెగకుండుఁగాత స ♦ మస్తమిద్ధ
భానుకులభాగ్య మీ రాము ♦ ప్రాణమల్ల, యూర్మిళాగళ మాంగల్య ♦ మూర్జితంబు.

క॥ ఏ దేశముఁ జేరిన సతు, లే దేశముఁ జేరఁ జుట్ట ♦ లేర్పడుదు రటన్
సోదరుఁడై తనరెడు తన, సోదరుఁడిఁక వేఱుచోటఁ ♦ జూపట్టఁడటన్. 289

తరళ॥ చదివినాఁడను విన్ము రాఘవ! ♦ సర్వవేదచయంబులన్
బొదలఁజేసితి వానికెంతయుఁ ♦ బొందికొప్పఁగ నంకముల్
పదనుదప్పక దర్శనంబుల ♦ పారమొందినవాఁడ నె
ట్టిదియు లేదొక సుంత దక్కఁవ ♦ తీవిఁగన్గొను మీవునన్. 298

వ. మఱియుఁ బరదారాపరిగ్రహంబు దూష్యంబనుటయందిట్టుల వినుము.

క॥ రత్నంబులు రమణీజన, రత్నంబులు శూరవరక ♦ రగ్రాహ్యంబుల్
నూత్నముగాదిత్తెఱఁగు ప్ర, యత్నంబున సీతఁగొంటి ♦ నవల కనిపినిన్. 300

వ: ఇఁక సాంప్రతము సాంపరాయంబందు నీక విజయంబయ్యెడు నందు వేని వినుము.

మ॥ కడుక్రిందన్ గనుపట్టునట్టిఁడొకఁడున్ ♦ గన్పట్టు నొక్కప్పుడె
క్కుడుగా నుచ్చపదస్థుఁడై యటులనే ♦ గొప్పైనపీఠంబునన్
బెడగొప్పన్ వసియించునాతఁడును ♦ బల్ బీర్వోయి నీచైస్థలిన్
బడి కాన్పించెడు నేటికారయఁగ నీ ♦ ప్రాబల్యదౌర్బల్యముల్. 302

క॥ పుట్టినవారలు గిట్టుట, గిట్టినదేహియును బుట్టు♦గిన్ జెందుటయున్
దిట్టమె దీనిన్ గూరిచి, యెట్టివిచారంబు సేయ ♦ రెపుడును ధీరుల్. 303

వ. కావున నిపుడు యుద్ధంబు సేయుమనుడు రాఘవుండు గినిసి యిట్లనియె. 304

క॥ చపలుఁడ! "వినాశకాలే, విపరీతమతి"యనునట్టి ♦ విధమున నీ వి
ట్లపథంబుఁ జెందితివి క,న్నిపుడె సమీపించె భయద ♦ హింసాగతి దా. 305

చ॥ అని యసమానరోషవిక్ర ♦ తాననుఁడై పటుదీప్తబాణముల్
దనుజవరేణ్యునంగములు ♦ దల్లడిలన్ వడి నేసె నాతఁడున్
గనలి దినేశవంశ్యుపయి ♦ గాఢశిలీముఖరాజిగుప్పె న
య్యనువున వీరియాహవ మ ♦ నల్ప మకల్పము గాఁగ రాజిలెన్.

వ. ఇట్లు దినత్రయంబుఁ బోరిసంత

## —* శ్రీరాముఁడు రావణాసురుని సంహరించుట *—

మ॥ హరిదశ్వాన్వయతల్లజుం డలిగి బ్ర♦హ్మాస్త్రాభ్యుపేతంబు వి
స్ఫురదగ్నిప్రతిమాన మొక్కశరమున్ ♦ బోద్యద్గతిన్ రావణా
సురుపైవైచె శిరంబులున్ బదియునున్ ♦ జూరయ్యె దైత్యాధిరా
డ్వరుఁ డస్తంగతుఁ డయ్యెఁ బుష్పవితతుల్ ♦ వర్షించి రా నిర్జరుల్. 307

వ. అనుచరు లెల్లఁ బాఱి దిశాంతరంబుల కేగి రంత మందోదరీ ధాన్యమాలిన్యాద్య
వరోధజనములు విభీషణుండును రావణకళేబరంబుఁ జుట్టి మిన్ను ముట్ట విలపింపుడు
రాఘవుండు విభీషణున్ జేరఁబిలిచి తత్సమయసముచిత కర్మంబుల నాచరింపఁజేసి

యనంతరంబున వానరులకు వైదేహిఁ జెప్పుట కనుశాసించుటయు వారలంత నె యశోకవనిఁ జేరి. 308

చ॥ ఘనతరమానిదాఘమునఁ ♦ గ్రాగి కృశీకృతశోకదయార్తికై
వనరుచునున్న యట్టియల ♦ బల్లిణియట్లనుకీర్తితక్రియై
ఘనుఁడగు రాత్మనాథునను ♦ ధ్యుమ్నఁ గరమ్మున స్మరించుచున్న పా
వనతరమూర్తి జానకిని ♦ వానరనీకులుగాంచి రున్నతిన్. 309

వ. ముందుగ నాంజనేయుండును దెంబడి సుగ్రీవాంగదులు మున్నగువారు చేరి యాదేవికి నమస్కరించి రావణసంహారంబును శ్రీరామవిజయంబును దెలిపి సత్వరంబాయమను శ్రీరామసన్నిధానంబును జేర్చి యామహాత్మాన కీర్తించుటయు దాశరథి మైథిలిఁ బరికించి పేరలుక నిట్లనియె. 310

చ॥ చెఱవిడిపించితిన్ దనుజ ♦ చేవసడంచి వధించితిన్ బ్రజా
కరకులవిక్రమక్రమ మ ♦ ఖండమహోన్నతయంబు నొందె నీ
వారివరు లాంజనేయుఁ డను ♦ రాఘవమౌళి విశేషమంటనున్
బరపినసౌఖ్యమెంతయును ♦ భాసిలె నప్రతిమప్రకారమై. 311

శా॥ నీకై యత్నముసేయలేదిది మదిన్ ♦ నిక్కంబు భావింపు మ
ప్రాకంపా నరివంచనన్ గడపితిన్ ♦ శుద్ధుండనై దిన్ రహిన్
నీకిట్టుంబగు చోటి కేగు పురుషున్ ♦ నీయిచ్చవచ్చెంపు మే
చీకాకున్ బడఁబోకు పొమ్ము ♦ పని కించిత్తైన లేదిమ్మెడన్. 312

ఉ॥ ఎప్పుడు నిన్ను నెత్తికొని ♦ హెచ్చుగఁ బుష్పకమెక్కి రావణుం
డిప్పురిఁ జేర్చె యాత్మమది ♦ కింపగు పూవులతోటనుంచెనో
యప్పుడె లీతె నంతయుఁ దగ్గి ♦ పాశర మన్యవధంబు కామనుం
డొప్పరికించునే కలయ ♦ కొప్పగ నిప్పటిదాక నార్తలన్. 313

చ॥ అనవిని యంత వేగ జన ♦ కాత్మజ దల్లడమొంది కూలి ల
జ్జను గడురోసముఁ వగవు ♦ జాలవెఱుంపును జెంది యశ్రులన్
గనుగవ రాల్చుచున్ విభునిఁ ♦ గాంచి మొగంబొకకొంత వంచి మె
ల్లన నిటుబల్కె దైవము ద ♦ లంచి కలంచెడు మానసంబునన్. 314

మ॥ అకటా నన్నిటులాడఁగూడునె! మహా ♦ త్మా! కోవిదేంద్రుండవై
సకలంబారసినట్టి తేఁడవయి నా ♦ సర్వాత్మమందెవ్వ ని
న్నొకనిన్ గాక మఱొక్కనిన్ దలఁతునే ♦ యుర్వీప్రదేశంబు దీ
టికిఁ జేరన్ జనినన్ వధంబును ధరి ♦ త్రీమండలిన్ వ్రాలెదన్. 315

గీ॥ వల్లెవాఁడొక్కఁ డేపుమైఁ ♦ బల్లెపదుచు, తోడఁ బదరినయట్టులి ♦ ట్లాడఁదగునె
సర్వమెఱుఁగఁగఁ జాలిన ♦ జాణవింత, మెఱుఁగవే! దేవ! మామక ♦ హృదయసరణి.

ఉ॥ నీ వటునమ్మవేని ధర ♦ నీవర! యారయు పంచభూతముల్
గోవులు సూర్యచంద్రులును ♦ గోవిదు లష్టదిగీశు లెంతయున్
నే వెనుజూడ కాత్మమున ♦ నేరమి నెంచిననన్ను నీక్షణం
బే విగతాసుఁ జేయుదురు ♦ పేరిమిదక్కి యుదగ్రమూర్తులై. 317

క॥ నను రావణుం డిటకుఁ దె, చ్చినతఱి నాగాత్రమునకుఁ ♦ జెడుగని స్పర్శం
బనుచితమైనను లేశం, బును లేదాత్మాఘమద్ది ♦ పౌసఁగె విధివిధిన్. 318

చ॥ అనినను సందియంబు విడ ♦ కట్టులెయుండిన నాత్మనాథు నం
తనె పరికించి యుస్సురని ♦ తాప మణంచి మఱందిఁగాంచి చ
క్కనఁ జితినిన్ బొనర్చు మిఁక ♦ జాగొనరింపకు వేగ నగ్ని నీ
తనువును గాల్చి శుద్ధనగు ♦ దానఁ బనేమియులేదు లక్ష్మణా! 319

వ. అనుటయు రామచంద్రుఁడట్లొనర్పుటకు సౌమిత్రికిసన్నచేయుటయు నతండు
సేయునదిలేక యట్లుగూర్చుడు సీతామహాదేవి శ్రీరామునకుఁ బ్రదక్షిణంబొనరించి
గోవులకును దేవులకును బ్రణామంబులాచరించి కరంబులుమోడ్చి యిట్లనియె.

క॥ మనసున వాక్కునఁ గర్మం, బున రామునిదక్క యన్య♦మును దలఁప విభుం
డనుమానమొందె నాపయి, ననఘా! పాలింపు సర్వ ♦ మరసి హుతాశా! 321

గీ॥ అనివడిన్ బావకజ్వాల♦యందు దుముక, నంతనే దేవముఖుఁడు దా♦నదరియొదిగి
సాధ్వి కత్యంతచందన ♦ సారశిశురుఁ, డగుచు రాము నిరూపించి♦యనియె నిట్లు.

చ॥ అనఘమనీష!యిట్లు వసు ♦ ధాత్మజ నాడఁగఁ జెల్లునే సతీ
జనతిలకంబు శ్లాఘ్యతర♦సాధుచరిత్ర పవిత్రి యీమెయం
దనుచితమున్నదే యమరు ♦ లబ్జభవుండభవుండుమున్ను నా
యనిమిషు లేగుదెంచిరిదె ♦ యాయమశీల ముపన్యసింపగన్. 323

వ. అనంతరంబ పద్మసంభవుండును బరమేశ్వరుండును మరాష్ట్రప్రముఖనిఖిలామర
ప్రముఖులును విమానంబులెక్కి తారసించిరందు విధాత యిట్లనియె. 324

చ॥ పరమపతివ్రతామణినిఁ ♦ బామరుఁడట్టులఁ బల్కి తగ్నలం
దుఱుక నుపేక్షచేసితిది ♦ యొప్పునె? చెప్పుము రామచంద్ర! నీ
చరితమెఱుంగవైతి వల ♦ చక్రిధరుండగు విష్ణువీ విఁకీ
సురుచిరగాత్రి శ్రీరమణి ♦ చుమ్మలుమాన్పి సతిన్ గ్రహింపుమా! 325

క॥ అనుటయు రాఘవుఁడటఁ జే, రిన బృందారకుల కంద ♦ రికి వందనముల్
బొనరించి యిట్టులనియెను, గనదురు మకరందసార ♦ కమనీయోక్తిన్. 326

ఉ॥ ఎఱుఁగుదు జానకీహృదయ ♦ మిద్ధమటంచు మహాత్ములార! యి
త్తఱి నిటుసల్పనేని బెను ♦ తప్పుఁదలంచి జనంబులెల్లనన్

దురుసుగ నిందలాడుదురు ♦ లోకులు పాపపుగోత నీపై న
చ్చరితము లన్నుఁగాంచునని ♦ సల్పితి సల్పితి నోరిమిన్ మదిన్. 327

ఆ॥ అనిన నంత నగ్ని ♦ యమ్మహాసాధ్విని, జనకరాజసుతను ♦ జారుమూర్తిఁ
దెచ్చి రామచంద్రు ♦ దివ్యాంకపీఠిపై, నునిచె జయజయోక్తు ♦ లొనరితనర. 328

వ. అంత మహేశ్వరుండు రామునకిట్లనియె.

ఉ॥ తామరసాక్ష! దివ్యజన♦తా పరితాపముదీర రావణున్
గామదమదున్ వధించితివి ♦ కోశల మాళలఁబొల్చెఁ బావన
శ్రీమహనీయమూర్తిఁ దిక ♦ సీతను జేకొని సాకు పృథ్వి నిం
దే మహితుండు నీజనకుఁ ♦ డీతఁడె చూచి ప్రవృత్తి సల్పుమా! 329

క॥ అని దశరథనృపుఁ జూపుట, యును దాశరథియును సీత ♦ యును లక్ష్మణుడున్
ఘనభక్తిఁజేరి మ్రొక్కిరి, తనయుల జానకిని జూచి ♦ తా నృపుఁడంతన్. 330

వ. రామునిఁగ్రుచ్చికౌఁగిటన్ జేర్చిశిరంబాఘ్రాణించి పరమానందంబునొంది యిట్టు
లనియె. 331

చ॥ కొమరక! తరించినాఁడ నవి♦కుంఠితశౌర్య నమోఘవీర్య నిన్
బడసినయట్టి పుణ్యమున ♦ భాగ్యమునొందె దినేశవంశ మీ
వడుచు విదేహరాజసుత ♦ పావన మెంతయు నేని లక్ష్మణుం
డడుగక నిన్ను గొల్చుటను ♦ నుజ్జ్వలుఁ డయ్యె జగంబు పేర్కొనన్. 332

వ. అనంతరంబ లక్ష్మణుని నక్కునన్ జేర్చుకొని ముద్దుచేసి కోడలిననునయించి
రాఘువవంశవర్ధనం బొనరింపుమని యాశీర్వదించి దివ్యసముచ్చయంబుతో
దివికేగె నంత శ్రీరామచంద్రుండు సీతామహాదేవిన్ బరిగ్రహించివిభీషణునకులంకా
రాజ్య పట్టాభిషేకంబుఁ గావించి తత్క్షణంబున విభీషణునితోఁ గపియూథంబుతో
సీతాలక్ష్మణసమేతుండై పుష్పకంబెక్కి యబ్ధిన్ దాఁటి జానకీదేవికిట్లనియె. 333

గీ॥ ఇచట మున్నొనరించె మ♦హేశ్వరుఁడు, అమ్మహాదేవుఁడు ప్రసాద♦మబ్జనయన !
సేతుబంధంబునానిది♦ఖ్యాత మఖిల, పాతకహరంబు త్రైలోక్య♦పావనంబు. 334

వ. అని పుష్పకావరోహణం బొనర్చి యప్పుడప్పుణ్యప్రదేశంబునఁ బౌలస్త్యహత్యా
పరిహారంబుగా మరల శివలింగప్రతిష్ఠన్ జేయఁదలంచి లింగానయనార్థంబు మరు
త్పుత్రున్ బంచి యర్చనాపరికరంబులనెల్ల సమకూర్చుకొని బ్రహ్మమునిమండల
పరివృతుండై సుముహూర్తంబు ప్రత్యాసన్నంబగుట వీక్షించి పావన్యాగమ
నంబుఁగాంచక నిశ్చలసంకల్పుండై.

## —* శ్రీరామలింగ ప్రతిష్ఠ *—

గీ॥ సైకతంబున లింగంబుఁ ♦ జక్కఁజేసి, సన్మునీంద్రాభినందిత ♦ సమయమందు
దాశరథి శివలింగ సం♦స్థాపనంబు, సలిపి పూజించె నిజనామ ♦ మలరిచెలఁగ. *

వ. తదనంతరంబున శివలింగంబును మోచికొని రోజుచు వచ్చి యచ్చటివృత్తాం
బంతఁ బరికించి విస్తుపోయియస్వస్థచిత్తుండై సామీరి మీఁటి కినియుడు శ్రీరామ
చంద్రుండు తదానీత లింగంబునుగూడ శ్రీరామేశ్వరలింగంబు పార్శ్వంబందుఁ
బ్రతిష్ఠించి విశ్వేశ్వరలింగంబని యాహ్వయంబొనర్చి యద్దాని కగ్రపూజ్యత్వం
బేర్పఱచి మారుతిన్ సంతుష్టుని బొనరించి యంత మునిజనాశీర్వచనంబులతోఁ
బుష్పకారోహణంబొనర్చి, కదలియెక్కుఁ౦త తడవున శ్రీరాముఁడాత్మ దేవికిట్లనియె.

గీ॥ అదె కనుము ఋష్యమూకాద్రి♦యదియె వాలి, యేలినదియును సుగ్రీవు♦డేలుచున్న
యట్టికిష్కింధ యందుని♦న్నరయఁ బంపె, హనుమదాదుల లోకబం♦ధ్వాత్మజుండు.

గీ॥ నిముసమున ఋష్యమూక శై♦లమును జేరి, జనకజానుమతిన్ గపీ♦శాన రాజ్ఞు
లైన తారాదులను వ్యోమ♦యాన మెక్కఁ, జేసి వేగఁ బ్రయాణమ్ముఁ♦ జేసియంత.

వ. నిమేషాంతరంబున భరద్వాజాశ్రమంబుఁ జేరి యవ్వారి సేవించి యాంజనేయుని
భరతుని యొద్దకు స్వాగమనం బెఱింగించి రమ్మని యిట్లు చెప్పిపంచె. 340

ఉ॥ తల్లుల కెల్ల జోతలను ♦ దమ్ముల కెవ్వర శాశిషంబులన్
బెల్లుగఁ జేసినాఁడ నను ♦ బెన్మిటిఁ బాసి తపించు నూర్మిళన్
మెల్లగ సేదదేరు మను ♦ మే లను దక్కినతమ్ములాంద్రకున్
జల్లగ నెల్లపౌరులకు ♦ సంతసమున్ వచియింపు పావనీ! 341

## —* శ్రీరామపట్టాభిషేకము *—

వ. అంత హనుమంతు డట్లెఱింగించి వచ్చె ననంతరంబు భరతుండు రామాగమ
నంబు విన్నంత మురిసి సత్వరం బయోధ్య నలంకరించి మాతృజనంబును వధూ
జనంబుం దోడ్కొని శత్రుఘ్నునితో బంధుమిత్రామాత్యపౌరపరివారవర్గంబులతో
వచ్చి యగ్రజపాదారవిందంబుల కభివాదనం బొనర్చిన శ్రీరామచంద్రుండు
తమ్ముల నాలింగనంబు చేసికొని తల్లులకు నమస్కరించి యాశీస్సులొందె నమ్మఱు
నాఁడు నందిగ్రామంబున సీతాలక్ష్మణులు జటావిసర్జనాభ్యంజనస్నానంబు
లొనర్చి యలంకృతులై నంత వశిష్ఠుండు వాసుదేవాది ఋషులతోఁ గూడి

* పద్మపురాణే - శ్లో॥ సేతుమధ్యే-మహాతీర్థే గంధమాదనపర్వతే। కల్యాణమూర్తి శ్శ్రీరామః స్వయం
దశరథాత్మజః । నిహత్య రావణంమూర్ధం తత్పాపవినివృత్తయే । లింగం
సంస్థాపయామాస స్వనామ్నా లోకనాయకం.

శ్రీరామచంద్రుని స్తంబేరమాగ్రేసరంబు నెక్కించి యయోధ్యాస్థానికిఁ జేర్చి సింహాసనాసీనుఁ జేసి చతుస్సాగరతీర్థంబుల నభిషేకించి బ్రహ్మనిర్మితంబును మన్వాదిసావిత్రశిరోమండితంబు నగు వజ్రకిరీటంబు మౌళి నలంకరించి ముఖంబున హిరణ్యపట్టంబుఁ గట్టి యాశీర్వదించె. 342

సీ॥ పట్టాభిషిక్తుఁడై నట్టి రామునకుఁ జెల్లని గొడ్గు శత్రుఘ్నుఁ ♦ డొనరఁబట్టె
ఇరుపార్శ్వములయందు ♦ భరతుండు లక్ష్మణుం, డానందపారవ♦శ్యమున నిలిచి
రల విభీషణుండును ♦ హరికులేశ్వరుండును, జామరసేవను ♦ సల్పుచుండి
రమరనాయకచోది ♦ తానిలుండు సువర్ణ, పద్మమాలను రఘు♦పతికి వైచె.
గీ॥ పాడి రున్నతి గంధర్వు♦లాడి రచ్చ, రలు ప్రసూనంబులను నిలిం♦పులు గురిసిరి
జానకీకంఠమునఁ జంద్ర♦చారుదీప్తి, ఘనము మౌక్తికహార మే♦సెను విధుండు.

గీ॥ సీతయును నాథుననుమతిఁ ♦ జెంది దాని, నాంజనేయున కొసఁగెను♦హార్ద మొసఁగ
దాన నెంతయు నానంద♦మూని పవన, తనయుఁ డా దేవికిని రఘు♦పతికి♦మ్రొక్కె.

ఉ॥ రామనృపాలుఁ డప్డు కపి♦రాట్టున కంగదకీశభర్తకున్
ప్రేమ మెయిన్ సువర్ణమణి ♦ విస్ఫురదుత్తమభూష లిచ్చె ను
ద్దామధనంబులన్ నగలఁ ♦ దక్కిన మర్కటకోటి కిచ్చె గో
త్రామరవర్గముల్ దనియ ♦ నాలను రత్నము లిచ్చె హెచ్చుగన్. 345

వ. కతిపయదినంబులు శ్రీరాముని సేవింపుచు నయోధ్యయందుండి సంతసించి యంత రామానుజ్ఞఁ గొని యాంజనేయుండు దక్కుతక్కిన కపిఋక్షవర్యులందఱును విభీషణుండును నాత్మనివేశనంబుల కేగిరి. శ్రీరామచంద్రుండును సకలజనానందంబుగ వసుమతిన్ బాలింపుచుఁ దమ్ములఁ బ్రేమింపుచు గురుజనంబుల సేవింపుచు జానకీదేవియందుఁ గుశలవులను బుత్త్రద్వయంబును బడసె. 346

— * ఫలశ్రుతి * —

కం॥ శ్రీరామచంద్రచరితము, నామోదమునన్ జదివిన ♦ నాలించిననున్
శ్రీరామభద్రుఁ డర్మిలి, వారలకు శుభంబు లిచ్చు ♦ వాంఛలుదీర్చున్. 347

కం॥ రామునిఁ బోలిన పురుషుఁడు, భూమిజనున్ బోలినట్టి ♦ పుణ్యయువతియున్
సౌమిత్రిభరతులను బోల్, ధీమాన్యులు హనుమఁ బోలు ♦ దిట్టలు గలరే. 348

వ. ఆ కుశున కతిథియను పుత్త్రుండు జన్మించె నవ్వాని వంశంబున ననేకులు రాజన్యశ్రేష్ఠు లుదయించి రీయది మహనీయంబగు ప్రభాకరవంశచరితంబిఁకఁ జంద్రవంశంబు నెఱింగింతు వినుండు. 349

## —* చంద్రవంశము *—

చ॥ చినతనమందు దేశికుని ♦ చెల్వను దారను జంద్రుఁ డొందుటన్
గనదురుకాంతిమండలుఁ డ♦ఖండయశుండు బుధుండు పుట్టె నం
దనుఁడు పురూరవుం డిల యె♦డన్ బొడమెన్ శశిసూతి కూర్వశీ
వనరుహనేత్రి కాతనికిఁ ♦ బల్వురు పుత్త్రులు పుట్టి రిమ్ముగన్. 350

వ. ఆయువు శ్రుతాయువు సత్యాయువు జయంతుఁడు విజయుండు ననువారు, అందా యువునకు నహుషుండును, క్షత్రవృద్ధుండును రజియును రంభుండును ననువారు పుట్టిరి. అందు నహుషునకు యతియు యయాతియు సంయాతియు నాయాతియు వియాతియు గుంతియు ననునార్గురు కొడుకులు జన్మించిరి. వారిలో యయాతి పట్టాభిషిక్తుండై శుక్రతనూజయగు దేవయానను వృషపర్వసుత యగుశర్మిష్ఠను వివాహంబై వారియందు యదుదుర్వసుద్రుహ్యానుపూరు లనువారిఁ బుత్త్రులఁ బడసె.

క॥ వారలలోనఁ బూరుఁడు, ధీరుండై తండ్రియనుమతిని భూవిభుఁడై
శూరుండై దిగ్విజయముఁ, గూరిచి భూవలయమేలెఁ ♦ గుశలత యలరన్. 352

వ. అట్టిపూరుని సంతానపరంపరయందు దుష్యంతుండు పుట్టె. ఆ దుష్యంతునకు శకుంతలయందు భరతుండుజన్మించె. ఆ భరతునకుఁ గైకేయియందు హుత మన్యుడు పుట్టె నవ్వానికజామీఢుండును వానికి సంవరుణుండు జన్మించి సూర్య తనూజయగు తపతిన్ బెండ్లాడి యాపెయందుఁగురుండను సుతున్ బడసె. వాఁడు కురుక్షేత్రంబునిర్మించె నాకురుని వంశంబునఁ గ్రమంబుగ దేవాపిశంతనబాహ్లి కులు జన్మింప నందు శంతనుండు రాజయ్యె ఆశంతనునకు గంగాదేవియందు భీష్ముండును సత్యవతియందు విచిత్రవీర్యచిత్రాంగదులను వారునుజన్మించిరి, భీష్ముండు బ్రహ్మచారివ్రతమును ధరించుటను సాత్యవతేయు లనపత్యులై నశించు టను జేసి వ్యాసుండు వారి క్షేత్రంబులందు ధృతరాష్ట్ర పాండులన్ గనియె. ధార్త రాష్ట్రులు నూర్వురుపై శున్యంబు నొంది చెడుఁగులగుటఁ బాండుకుమారు లవ్వారిఁ గురుక్షేత్రంబున యుద్ధముజేసి సమయించి రం దర్జునున కభిమన్యుండును నాతనికిఁ బరిక్షిత్తయ్యానఘునకు జనమేజయుండును నవ్వానికి శతానీకశంఖులును గలిగిరి శతానీకునకు నశ్వమేధవంతుండను పుత్త్రుండు జన్మించె నవ్వానివంశం బున ననేకులుపొడమి రిందుఁ బురూరవుపుత్రులగు శ్రుతాయువు మున్నగువారల వంశపరంపరయందు దివోదాసుండు మున్నగువారలు పొడమి రందుఁ గొందఱు బ్రాహ్మణజాతిన్ జెందిరిఁక యయాతిపుత్త్రుండగు యదుఁడను వానివంగడంబున శ్రీమన్నారాయణుండు కృష్ణుండై యనంతుండు బలరాముఁడై యవతరించి దుష్ట జనమారణంబొనర్చి ధర్మరక్షణం బొనరించి రీయది చంద్రవంశచరిత్రం బిఁకేమి

వినఁదలంతుఁ దదనవ్యాకరలు మహాత్మా! వేదవిభాగంబుఁ జేసి యష్టాదశపురా
ణంబులను భారతేతిహాసంబును రచించిన శ్రీకృష్ణద్వైపాయనుని జన్మంబు తెలియఁ జెప్పు
మనుడు సూతుండిట్లనియె. 353

## —* వ్యాస జన్మము *—

చ॥ ఘనుఁడు వశిష్ఠపౌత్రుఁడు జ ♦ గద్వినుతుం డల శక్తి మౌనినం
దనుఁ డనవద్యతాపసధ ♦ నప్రచయుండు పరాశరుండనా
మునిపతి తీర్థసేవనముఁ ♦ బూని రహిన్ యమునాతటిన్ నిషా
దుని గని యోడఁ గూర్చి ననుఁ ♦ దొందర నావలి రేవుఁ జేర్పు నాన్. 354

క॥ వాఁడును బో సేయుచుఁ బూఁ, బోఁడిని దనకూఁతుఁ జూచి ♦ పుత్రిక! నీవీ
యీడైనయని మేటిమునిని, నోడను దాటింపు మవలి ♦ యొడ్డుకు ననుడున్.

క॥ అదియును నట్టులనే యని, ముదమునఁ గల మొక్కఁ జేసి ♦ ముని నవ్వలిగ
ట్టుదరికిఁ జేరుచుచుండఁగ, ముదితను బరికించి దివ్య♦ముని పరవశుఁడై. 356

చ॥ ముసిముసి నవ్వులొల్కు మొగ♦మున్ జెవులందెడు కన్నుదోయి పెం
పెసఁగు మెఱుంగురంగుల వ♦హించిన యందపుగుబ్బజంటల నీ
రసమయి తోఁచు నెన్నడుము ♦ రాణదలిర్పఁగ లేఁతప్రాయపుం
బసలఁ బసందులన్ దొలుకు ♦ భామను జూచి స్మరాశుగార్తుఁడై. 357

గీ॥ నావ దరిఁ జేరినంతనె ♦ నాతిఁ జేరి, చేయిఁ బట్టిన నయ్యాది ♦ సిగ్గుఁ జెంది
ఏమియిది దేవరా! యన♦ నెఱుక చేసెఁ, దనమహృదయంబుఁ బోలఁతికిఁ ♦ దాపసుండు.

వ. అంత నయ్యాది యింకను సిగ్గుతోఁ దలవంచుకొని యమ్మునివరేణ్యున కిట్లనియె.

ఉ॥ బోయకులంబుదాన, విను ♦ భూసుర! చేపలకంపు నాయొడల్
హేయముగాదె? నీకిది ము♦నీంద్రుఁడ వెంతయుఁ బావనుండవున్
న్యాయమె? యిట్టి నీచకుల ♦ నారులతో మరుకేళి సేయఁగా
నీమదికెట్లు దోఁచెనొకొ? ♦ నేర్పునఁ గాంచుము ముందువెన్కలన్. 360

ఉ॥ అంతియు నేను గన్నెను మ♦హాత్మక! తల్లియుఁ దండ్రియుం గలా
రందఱె గాంచుచుండి రిట ♦ నంగజకేళిని నిన్నుఁ జెందఁగా
ముందఱ నన్నుఁ గైకొనెడు ♦ పూరుషుఁ డుండునె? తల్లిదండ్రులున్
దొందర సేయరే? యొరులు ♦ తెందుడుకంచుఁ దలంపరే? గురూ! 361

తరళ॥ అనినఁ దాపసుఁ డిట్టులప్డు ల♦తాంగి! విన్మిక నీయొడల్
ఘనసుగంధపరంపరావృతిఁ ♦ గాంచు నీవిఁక రాజనం
దనవు నిక్కము బోయదాన నుడి ♦ తప్పు చూడుము కన్నెచో
ప్పును వడంగదు చూడరెవ్వరు ♦ పొంకమా హితమొప్పెడున్. 362

చ॥ సురతముసేయు వేగముగ ♦ సుందరిరో ! యిఁక నన్నుఁగూడి న
చ్చరలను లేఁత జవ్వనపుఁ ♦ జానలఁ బల్వురఁ జూచియుంటి నె
ప్పురుసుననేని నామనము ♦ బద్ధముగాకయె యుండె నేఁడు తోం
దరపడుచుండె నీయెడలఁ ♦ దప్పనె దైవగతుల్ మరల్పఁగాన్, 363

క॥ కనకఘటప్రతిభటనూ, తనపీన స్తనయుగమున ♦ దట్టపు నాలిం
గనమొసఁగి రతులఁదన్పుము, కనదిందీవరసుగంధి ! ♦ గరువమ్మొనరన్. 364

గీ॥ నీవు యోజనగంధివై ♦ నెగడఁగలవు, తనయుఁడుజనించుసత్తపో♦ధనుఁడుఘనుఁడు
రాణివగుదువు రాజాధి♦రాజు నిన్నుఁ, బడయుఁదడవేల చే♦సెదు? పద్మగంధి!

గీ॥ అనిన నది దేహసౌగంధ్య ♦ మమరుటయును
మంచు గడుఁ గ్రమ్మి తనవారు ♦ మఱుఁగుటయు
నరసి మునినిఁ దపోధను ♦ నెఱిఁగి మాఱు
పలుకుటకు నోడి రతికిష్ట ♦ పడియె మునికి. 366

ఉ॥ అంతనె మాని చెల్వఁగొని ♦ యయ్యమునాతటమందునన్ గడున్
సంతసమొప్పఁ బుష్పశర ♦ సంగరభంగులఁ దృప్తిదీరఁగా
నెంతయుఁ గ్రీడసల్పి చనె ♦ నీధ్యుఁడు వ్యాసమహామునీంద్రుఁ డ
శ్రాంతతపోధనుం డొదవె ♦ సారసనేత్రసమానుఁ డున్నతిన్. 367

క॥ కుడిచేతఁ గమండలువును, నెడమచెయిన్ సుదృఢ దండ ♦ మెసఁగంగ జడ
ల్గడుఁదనరఁ గృష్ణతనుఁడై, పొడమి జనని పాదములకు♦ మ్రొక్కి యిటులనెన్.
క॥ ఎప్పుడు పనిగలిగిన నీ, కప్పుడె ననుఁ దలఁపవలయు ♦ నాక్షణమున నే
నొప్పుగ వచ్చియు నాపని, తప్పక నెఱవేర్చువాఁడ ♦ తల్లిరో ! విన్మా! 369

క॥ అనియనుమతిఁగొని వేగమె, చనియెను వ్యాసుండు తపసు ♦ సాధింపఁగ నం
తనె తర్ణకంబువిడి యో, జనగంధియుఁగుందెనెద♦విచారంబెరయన్. 370

వ. సుతునియాకారంబును సద్గుణసౌష్ఠవంబును దలంచుచు మరల నోడయెక్కి యవ్వలిగట్టునందున్న తల్లిదండ్రులయెడ కరిగె నంత వ్యాసుండు యమునాద్వీపంబందుఁ బుట్టుట ద్వైపాయనుం డనియు నల్లనివాఁ డౌటకృష్ణద్వైపాయనుం డనియును వేదవిభాగంబు నొనర్చు వాఁడౌట వేదవ్యాసుం డనియుఁబేరులఁ జెంది ముందుగఁ దీర్థరాజంబగు ప్రయాగంబు నొంది యందునుండి నైమిశంబుఁ గురుక్షేత్రంబు హరిద్వారంబు నుజ్జయిని నయోధ్యను మధురను ద్వారకాపురి నమరావతిని సరస్వతిని సింధుసంగమమును గంగా సాగర సంగమమును త్ర్యంబకంబును సప్తగోదావరీతటంబును గాలంజరంబును బ్రభాసంబును గేదారంబును బదరీవనంబును ఓంకార క్షేత్రంబును బురుషోత్తమంబును గోకర్ణంబును

రామేశ్వరంబును గాంచిని భృగుకచ్ఛంబును భృగుతుంగంబును బుష్కరంబును
శ్రీశైలంబుధారాతీర్థంబును గుమారగిరిని సేవించి వారణాసిఁ జేరి. 371

గీ॥ అందు మణికర్ణికాస్నాన ♦ మమరఁ జేసి, విశ్వనాథునిఁ బూజించి ♦ విష్ణుపతుల
నెల్ల సేవించి గౌరుల ♦ నెల్లఁ గాంచి, కాలభైరవు నర్చించి ♦ గణములోడ. 372

క॥ కేశవుల నఖిలదేవా, ధీశుల లోలార్కముఖుల ♦ నినవర్యుల యు
క్షేశుని భజించి తగ వ్యా, సేశుఁ బ్రతిష్ఠించి కొలిచి ♦ యింపు లమరఁగా. 373

గీ॥ శ్రుతులనువిభాగమొనరించియతులితముగఁ, బదునెనిమిది పురాణముల్ పరగ రచన
చేయఁగా నెంచి తాదృశ♦సిద్ధియందు, నేమహాలింగమును భజి♦యింప నొవవు.

క॥ సంకటహరుఁడై శ్రితులకుఁ, బంకిలచిత్తులకుఁ గలుష ♦ భంజకుఁ డగునా
యోంకారేశ్వరుఁడును నత, శంకరుఁడగు విశ్వనాథ ♦ సన్మహాత్ముండెఁ. 375

సీ॥ కాలేశ్వరుఁడు వృద్ధ ♦ కాలేశ్వరుండును, కర్ణేశ్వరుండు గో ♦ కర్ణవిభుఁడు
జ్యేష్ఠేశ్వరుఁడు సుర ♦ జ్యేష్ఠేశ్వరుండును, చంద్రేశ్వరుఁడు హరి♦శ్చంద్రవిభుఁడు
ప్లాదేశ్వరుం డను ♦ ప్లాదేశ్వరుండును, భాండేశ్వరుఁడు తిల ♦ భాండవిభుఁడు
చండీశ్వరుఁడు ద్వ్యామ ♦ చ్చండీశ్వరుండును, భూతేశ్వరుఁడు భార♦భూతివిభుఁడు

గీ॥ మఱియుఁ గలశేశ రత్నేశ ♦ మధ్యమేశ, వీరభద్రేశ వీరేశ ♦ క్షైరవేశ
పార్వతీశ్వర ధర్మేశ ♦ బాష్కలేశ, కందుకేశ్వర గంగేశ ♦ కపిలవిభులు. 376

వ. ఇంకను కృత్తివాసేశ్వరుండును గామేశ్వరుండును దారకేశ్వరుండును దశాశ్వ
మేధేశ్వరుండును నందికేశ్వరుండును భవానీశ్వరుండును బర్వతేశ్వరుండును
వ్యాఘ్రేశ్వరుండును గోటిరుద్రేశ్వరుండును హాటకేశ్వరుండును భువనేశ్వరుం
డును జైగీషవ్యేశ్వరుండును గోకర్ణేశ్వరుండును బృహస్పతీశ్వరుండును బ్రసన్న
వదనేశ్వరుండును మహాలక్ష్మీశ్వరుండును మదాలసేశ్వరుండును నవిముక్తేశ్వరుం
డును విశాలాక్షీశ్వరుండును వరాహేశ్వరుండును లాంగలీశ్వరుండు మతంగేశ్వ
రుండు గపర్దీశ్వరుండు యమునేశ్వరుండును నర్మదేశ్వరుండును హారికేశ్వరుం
డును మోక్షేశ్వరుండు ప్రియోదేశ్వరుండు మున్నగాఁగల దివ్యలింగంబు లనేకం
బులుగల విందు నాయభిమతంబుఁ దీర్చెడు లింగం బెద్దియోయని కొండొకతడవు
యోజించి యంతనె యవగతంబైనట్లు సంతసించి యవ్వును మఱచితి. 377

సీ॥ తుంబురుఁడును నార♦దుఁడును నెవ్వనిఁ గొల్చి, సంగీతవిద్యలోఁ ♦ జతురులైరి
అంగిరసుండును ♦ నల శుక్రుఁ డెవ్వని, భజియించి పాండితీ ♦ ప్రౌఢిఁ గనిరి
పౌలస్త్యుఁ డెవ్వనిఁ ♦ బరఁగ నర్చించి ధ, నేశుఁడై విద్యాధ ♦ రేశుఁ డయ్యె
ఖట్వాంగుఁ డనపత్య♦కలుషుఁడై యెవ్వనిఁ, బూజించి కాంచె సు♦బుత్రలబ్ధి

గీ॥ శ్రీకరుఁడు గోపకుం డేని ♦ సేవఁజేసి, శాంభవగణాధిపత్యంబు ♦ సంతరించె
నట్టి శ్రీమధ్యమేశ్వరుం ♦ డభవుఁడుండ, గోరఁగ నేటికి సిద్ధుల ♦ కొఱకు నేను.

ఉ॥ నేమను మధ్యమేశ్వరుని ♦ నిష్ఠభజించి పురాణకర్తృతా
న్యానవిభూతిఁ గాంతునని ♦ యెప్పగ జావ్నవిఁ గ్రుంకి యెక్కుడౌ
పూనికి మధ్యమేశ్వరునిఁ ♦ బూజ యొనర్చుచునుండెఁ బెక్కునా
ళ్ళా నియతిన్ గనుంగొని ♦ మహాత్మకుఁ డిందుధరుండు వేర్మిమై. 379

గీ॥ లింగమధ్యను బాలక♦లీలఁ దోఁచి, వరము లిచ్చెద నడుగునా ♦ వ్యాసమౌని
సంబరంబున వందన♦శతముచేసి, యిట్లు వినుతించె నెంతయు♦నింపుగదుర. 380

క॥ వాకున మనసునఁ దనువునఁ, జేకొన రాదీశ ! నిన్నుఁ♦జెలఁగెడు శ్రుతుల్
నీకలిమి దెలియవిఁక నీ,వే కర్తవు భర్తవును మ♦హిన్ హర్తవునున్. 381

క॥ నీవే యమరులకాద్యుఁడ, వీవే భవపాశహరుఁడ ♦ వీవే బ్రహ్మం
బీవే యానందమయుఁడ, వీవే యీశ్వరుఁడ వగుచు ♦ నెసఁగెద వనఘా! 382

క॥ లేదీశ! నీకుజన్మము, లేదాహ్వాయ మెందుఁగులము ♦ లేదిఁక గోత్రిం
బేదియు లేదైనను నా, పాదింతువు త్రిజగములకు ♦ భద్రములరహిన్. 383

చ॥ ఎఱుఁగఁగ లేరు నిక్కముగ ♦ నెంతయు ధాతయు నిందిరావిభుం
డెఱుఁగఁగ లేఁడు శక్రుఁడును ♦ నెంచ నెలేరు సుపర్వవల్లభుల్
పరమము యోగిదుర్లభము ♦ భక్తజనప్రియమైన తావకా
క్షరమగు తత్త్వమట్టి నిను ♦ స్వాంతమునందు నుతింతు నీశ్వరా ! 384

గీ॥ నీవలన సర్వమేర్పడు ♦ నీవె సర్వ! మీశ ! పసిబాలుఁడవు యువ ♦ వెంతయేని
వృద్ధమూర్తివి నీకిదె♦వినుతిఁ జేతు, శర్వునకుఁ బరమాత్మకు ♦ శంకరునకు. 385

వ. అని యిట్లు వినుతించిన వ్యాసమునికిఁ బ్రీతుండై పరమేశ్వరుండు నీవభిలషించి నట్లు నీకఖిలవిద్యల నావహింపఁజేసితి నిఁక నీవాక్కునుండి పురాణేతిహాసంబుల రచింపఁజేయుదుఁ గీర్తికరుండ వగుము. నీవు నుతించిన యీ స్తవంబును నెవ్వరేనిఁ జదివిన వినిన నవ్వారు శ్రేయంబులొందెదరని యంతర్హితుఁగాంచెనంత వ్యాసమునీం ద్రుండు సంతసంబున బ్రాహ్మంబు, పాద్మంబు, వైష్ణవంబును శైవంబును భాగ వతంబును భవిష్యంబు నారదీయంబు మార్కండేయం బాగ్నేయంబును బ్రహ్మ వైవర్తంబు, లైంగంబు, వరాహంబు, వామనంబు, కౌర్మంబు, మాత్స్యంబు, గారుడంబు, స్కాందంబు, బ్రహ్మాండంబను పదునెనిమిది పురాణంబులను భార తేతిహాసంబును రచించి శిష్యులగు మాకందఱకుఁ జెప్పె నీ పురాణంబులను లోకంబందు వినునట్టి శ్రోతలు పురాణావసానంబందుఁ బురాణవక్తనుబూజించి సువస్త్రంబుల సువర్ణహస్తకర్ణాభరణంబుల సవత్సయగు పాడియావు నేనుంగును

నగ్రహారంబును సమస్తవస్తువుల శక్తిశాఠ్యంబుసేయక యొసంగి పురాణగ్రంథ
మును బూజించి సమర్పించి బ్రాహ్మణభోజనం బొనరింపఁజేసి దక్షిణలీవలయు
నట్లైనఁ బురాణశ్రవణఫలంబు నొందెద రిట్లు మీరడిగిన శ్రీకృష్ణ ద్వైపాయన
జన్మ చరిత్రంబుఁ జెప్పితి నింకేమి వినెదురనిన మునులు సూతునకిట్లనిరి. మహాత్మా!

గీ॥ శివుని చరితల విని ప్రీతిఁ ♦ జెందినాము, శివసనాతనశక్తి యా♦శివచరితలఁ
దనరు నద్దేవి దివ్యావ♦తారములను, బోధసేయుము మాకిప్డు♦పుణ్యమూర్తి!

వ. అనిన సూతుండు మునుల కిట్లనియె.

చ॥ సురథుఁ డనంగ నొక్కనృప ♦ సోముఁడు భూరిబలుండు కోలయున్
బురమును నేలుచుండఁగ రి♦పుల్ చతురంగచమూసమేతులై
పోరిఁబోరి ముట్టడించిరి నృ♦పుంగను సేనలనెల్లఁ గూర్చి సం
గరమున కేగి పోరితము ♦ గాటముగా నొనరించె ధీరుఁడై. 388

మ॥ వగవాం డొక్కుఁడు మూఁకలై సురథునిన్ ♦ బాహాబలం బెక్కు డౌ
వ్వఁగ నోడించి వరూథినిన్ జదువఁ ద♦త్పౌరుల్ ప్రధానుల్ హితుల్
దగురీతిన్ రిపురాజితోఁ గలసి నే♦స్తంబొంది రంతన్ గడున్
వగతోడన్ బురిఁ బాసి యా సురథభూ♦పాలుండు చేరెన్ వనిన్. 389

—* సురథుఁడు సుమేధఋష్యాశ్రమంబుఁ జేరుట *—

గీ॥ అంత నొక శాంతమైన ఋ♦ష్యాశ్రమంబుఁ, జేరనమ్ముని నవ్వాని ♦ గారవించి
యందునుండుమనియె నతం♦డట్టులుండెఁ, బిదప నొక్క కొన్నినాళ్ళకు♦బేరుఁడొకఁడు.

క॥ తనవారలతో లోభం, బున వెడలింపఁబడి వచ్చె ♦ భూపుఁడు వైశ్యుం
డును నన్యోన్యం బరసి జ, తనునొప్పి వసించి రందుఁ ♦ దగులముతోడన్. 391

గీ॥ అరిజితుండయి నిజజనా♦నాదరమున, మఱుఁగుచుండెను భూజాని♦మమతదక్కి
వంచితుండయి తనవారి♦వలన వెడలఁ, బడియుఁ గోమటి వారికై ♦పలవరించు.

వ. ఇట్లిద్ద ఱొకనాఁ డమ్మునివరుండు తీరికూర్చున్న సమయంబునఁ దారసించి
మ్రొక్కి యందు భూపాలుం డిట్లనియె. 393

గీ॥ శాత్రవతిరస్కృతుఁడ నౌట♦శత్రుజనులఁ, బొరిగొనఁగ నెంచు నామది♦పుణ్యమూర్తి!
అదయులైనాదు సచివాదు♦లరులఁ జేరి, రుల్లము తపించుచుండెడు♦నుడుకుమీఱి.

క॥ ఈ బేరుఁడు తనవారల, చే బిట్టుగఁ దరుమఁబడియుఁ♦ జెన్నఁటిమదితో
నాబందుగులను జేరఁగఁ, దాఁ బరితాపంబుఁ జెందుఁ ♦ దహతహయమరన్.

వ. ఈ రెండు దుఃఖంబులును మోహజాతంబులగుట నవ్వానిఁ బాపి మమ్మనుగ్ర
హింపు మనిన రాజునకు మునీంద్రుం డిట్లనియె. 396

గీ॥ విను మహామాయ శివ సనా♦తని నరేంద్ర!, సర్వజనమనములకు న♦జ్ఞానరూప
మైనరూపంబుఁగూర్చు న♦ద్దాని నజము, ఖామరులు పాయ లేరుస♦త్యంబువినుము.

క॥ సురలే యమ్మాయను బడి, పరతత్త్వము నెఱుఁగ లేరు ♦ పార్థివ! యిఁక నీ
నరు లెట్లెఱుంగ నేర్తురు, పరఁగ జగన్మాతృరచిత♦బంధాన్వితులై. 398

వ. మఱియు నాయంబ త్రిగుణయై వరదయై విరాజిల్లు.

క॥ ఆపెయె విశ్వముఁ గూర్చెడు, నాపెయె పాలించుచుండు ♦ నాదరమతితో
నాపెయె హరించు నిఁక జనుఁ, డాపె కృపన్ గనినఁ బాయు♦నమ్మోహంబుల్.

గీ॥ అనిన నానృపుఁడడిగె మ♦హానుభావ!, యామహామాయ యెవతియో♦యట్టిదేవి
యెట్లుజనియించెనో మాకు♦నెఱుఁగఁజెప్పు, మనినవారల కిట్టుల♦ననియెమౌని.

—* మధుకైటభ సంహారము *—.

ఉ॥ మున్నొకమాఱు సంద్రము స♦మున్నతవైఖరి నేకమై తగన్
బన్నగరాజతల్పమునఁ ♦ బద్మదళాక్షుఁడు నిద్రఁదూఁగఁగాఁ
బన్నుగ విష్ణుకర్ణయుగ♦పంకభవుల్ మధుకైటభాఖ్యులా
నెన్నికమీఱు రక్కసులు ♦ హెచ్చుమెయిన్ బరికించి నల్గడన్. 401

ఆ॥ కమలనయనునాభి♦కమలమునందున్న, విధినిఁజూచి వేగ♦వధయొనర్పఁ
గడఁగుచున్న నంత♦నడలి నల్వ శయానుఁ, డైన హరినిఁజూచి♦యాత్మయందు.

గీ॥ జగదధీశ్వరిఁగూరిచి ♦ చక్కనిట్లు, వందనముఁ బొనరించి క♦డిందిభక్తి
మెఱయసంస్తవమొనరించె♦దురితహంత్రి!, కాలరాత్రి! మహారాత్రి!♦గాఢరాత్రి!

క॥ రక్షింపు మహామాయా!, రక్షింపుము నన్ను మోహ♦రాత్రి! దయాళూ!
రక్షింపు యోగనిద్రా!, రక్షింపుము మెఱియ లీయ ♦ రాతులవలనన్. 404

ఉ॥ తల్లిరో! నీకృపాగతి ని♦తాంతము నేనును బద్మనేత్రుఁడున్
హల్లకబంధుమౌళియగు ♦ నాహరుఁడున్ జగముల్ రచించియున్
జల్లఁగ సాఁకుచున్ లయముఁ ♦ జక్కనొనర్చుచు నుందు మమ్మ! నీ
వెల్ల జగంబులన్ గరిమ ♦ నేలెడు రాణివి లోకపావనీ! 405

సీ॥ నీవె స్వాహావు మఱి♦నీవె యాస్వధవును, నీవె యాలజ్జవు ♦ నీవె ధృతివి
నీవె సద్బుద్ధివి ♦ నీవె యాసిద్ధివి, నీవె యాప్రీతివి ♦ నీవె మతివి
నీవె యాశాంతివి ♦ నీవె యాక్షాంతివి, నీవె యా దాంతివి♦నీవె స్మృతివి
నీవె యాభ్రాంతివి ♦ నీవె యాకాంతివి, నీవె యాశక్తివి ♦ నీవెరక్తి

గీ॥ వీవె తుష్టివి పుష్టివి ♦ నీవె క్షుత్తు, వీవె తృష్ణవు జాతివి♦నీవె వృత్తి
వీవె చిత్తువు మాయవు♦నీవె మోస, పరవు మనుజుల మేల్కొల్పు♦పద్మనయను,

గీ॥ వేధ యిట్టులు ప్రార్థింప ♦ వేదమాత, సిద్ధరూపిణి ఫాల్గున ♦ శుద్ధమందు
ద్వాదశీ తిథియందు ని ♦ తాంతకరుణ, నమ్మహాకాళియై భువి ♦ నవతరించె. 407

క॥ నలువను జూచి భయంపడ, వలదిక సత్వరము దైత్య ♦ వర్యులమాయన్
బొలియింపఁజేతు నిపుడే, జలజాక్షునికిన్ మెలఁకువ ♦ సమకూర్తు విధీ! 408

క॥ అని వేగ జలజనయను న,యనములు విప్పంగఁజేయ ♦ నచ్యుతుఁడును న
ద్దనుజులఁగని వారలతో, ననిఁ బొనరిచె నైదు వేల ♦ హాయనములోగన్. 409

గీ॥ అంత జగదంబమాయచే ♦ నసురవరులు
హరినిఁ గని వరమిచ్చెద ♦ మడుగు కొనుము
నాఁగ హరియును హరుసంబు ♦ నను వచించె
నాకు వధ్యులు గండని ♦ నయము మీఱ. 410

గీ॥ వారలాపైనిఁ గొంకియు ♦ నాకుమీఱ, కద్ధి మెల్లెడ నేకమై ♦ యమరుటయును
జూచి నీళులు లేనట్టి ♦ సుస్థలమునఁ, జంపునని నలినాక్షుఁడు ♦ సంతసించి. 411

క॥ తనయూరులఁగొని దైత్యుల, ఘనతరచక్రహతిఁ జంపెఁ ♦ గమలజుఁడంతన్
మనమున నలరి పరాంబను, చనువుగఁ గొనియాడి హరికి ♦ నభినుతి చేసెన్. 412

గీ॥ ఇది మహాకాళికోద్భవం ♦ బిఁకను జెప్పుదు, శ్రీమహాలక్ష్మ్యవతరణ ♦ శ్రీకచరిత
మింపుమై వినుఁ డెద్దాన ♦ నీతులవిసి, సంతసము సమకూడు న ♦ శాంతముగను.

## —* మహిషాసుర చరితము *—

క॥ రంభాసురతనయుండు వి,జృంభితవిక్రముఁడు దైత్య ♦ సింహము మహిషుం
డంభోజోద్భవువరమున, దంభోళిధరున్ జయించి ♦ తాఁ గొనె దివమున్. 414

గీ॥ ఇంద్రసింహాసనం బెక్కి ♦ హెచ్చుమీఱఁ, బదియునాలుగు జగములఁ ♦ బ్రాభవవర
వందయేండ్లేలె మహిషుఁడ ♦ వంధ్యవివిధ, భోగభాగ్యసుఖంబులు ♦ పొదలుకొనగ.

ఉ॥ దేవతలంతఁ జింతిలి మ ♦ దిన్ గడు వేసటి గుంపుగూడి వా
ణీవిభుఁ జేరఁబోయి కడు ♦ నిష్టనుతుల్ పొనరించి యెట్టులేన్
గావలెఁ గాసరాసురుని ♦ గండడఁగించి వధించి మమ్మిఁకన్
గావక యున్నఁ జత్తుమని ♦ క్రిచ్చఱవేడ విధాత యత్తఱిన్. 416

గీ॥ హరిహరులు వేడ్కనొక్కచో ♦ నపుడు చేరి
యుండు చెటఁగి విరించి ది ♦ వ్యోత్కరముల
నెల్లఁ గొనిపోయి యవ్వారి ♦ కెఱుకఁ జేసె
మహిషు దౌష్ట్యంబు వేల్పులు ♦ మఱుఁగుటయును. 417

చ॥ సురలు రమేశ్వరేశులకు ♦ జోతలొసంగి యులాయదైత్యదు
ర్భరతరబాధలన్ దెలిపి ♦ వాని వధింపఁగఁగోరనంత న
వ్వరదులు దేవదుఃఖములఁ ♦ బాపఁగఁగోరి రయంబుమీఱ నం
బరముఁగనన్ మహాంబొకఁడు ♦ భాసిలె వారల నేత్రజాతమై. 418

## —* దుర్గావతారము *—

గీ॥ అట్టితేజంబునం దమ ♦ రాధిపతుల, తేజులెల్లనుజేరి దే ♦ దీప్యమాన
కాంతిపుంజంబగుచునొక్క ♦ కన్నె వెడలెఁ, గనియువినియునెఱుంగని ♦ కాంతమూర్తి.

వ. అట్టియాయమ్మకు

సీ॥ శంభుతేజంబున ♦ సంభవించెను మోము, విష్ణుతేజంబున ♦ వెలసె బాహు
లాబ్రహ్మతేజన ♦ నలరెఁ బదంబులు, యామ్యతేజంబుచే ♦ నమరెఁగురులు
చందురుతేజన ♦ జానొందెఁజనుదోయి, శచితేజమున నడుమ ♦ చక్కనమరె
వరుణుతేజంబునఁ ♦ బరఁగెఁ బిక్కలు దొడల్, క్షమతేజమున నితం ♦ బముదనర్చె

గీ॥ గోత్రరిపుతేజమునఁ గరాం ♦ గుళులు పొదలె
గుముదరిపుఘృణులన్ బదాం ♦ గుళులు దనరె
శ్రీదుతేజన నాస సు ♦ శ్రీపరంగెఁ
దనరెఁ ద్రేతాగ్ని దీప్తినే ♦ త్రత్రయముగ. 421

క॥ రదములు ప్రాజాపత్యా, స్పదములగుచుఁ దనరె గాడ్పు ♦ భాసిలె శ్రుతులై
పొదలెడు సాంధ్యశ్రీలన్, గుదురగు కనుబెప్పలొప్పెఁ ♦ గోమలికట్టుల్. 422

క॥ అరుణమరీచుల నధరము, శరజన్ముని తేజమున నె ♦ సఁగె నూర్ధ్వోష్ఠం
బరుదొప్ప నిట్లు తక్కున, మరమహమున నొదవె లాఁతి ♦ మహితాంగములున్.

గీ॥ ఇట్లు పొడమిన యిందిర ♦ నీక్షఁజేసి, సురలు మురిసి రయంబున ♦ సుందరాంబ
రములభూషణములనాయు ♦ ధములనొసఁగి, సంతసింపఁగఁజేయ ని ♦ చ్చన్ బొనర్చి.

## —* దుర్గాదేవికి దివ్య లాయుధాదుల నిచ్చుట *—

సీ॥ దేవికిచ్చెను మహా ♦ దేవుండు శూలంబు, హరియిచ్చెఁ జక్రంబు ♦ నంబికకును
పాశి యిచ్చెను శంఖ ♦ పాశంబు లార్యకు, శక్తినొసంగెను ♦ శక్తినగ్ని
అమ్ములపొది ఘంట ♦ నశనినిచ్చెను వృష, ఘనమగు విల్లిచ్చె ♦ గంధవహుఁడు
యముఁడిచ్చెఁ గాలదం ♦ డమును బ్రజాపతి, యక్షమాలనుదెచ్చి ♦ యంబకిచ్చె

గీ॥ బ్రహ్మయిచ్చెఁగమండలుఁ ♦ బాలసంద్ర, మొసఁగెఁబట్టుపుట్టంబుల ♦ నురువుమీఱు
రవలకమ్మల వేళ్ళకు ♦ రవలయుంగ, రముల ముత్యాలపేరులు ♦ రవలనత్తు. 425

క॥ బంగరు మంజీరంబుల, బంగరుముంజేకడెములుఁ ♦ బహువపు వేడ్కన్
బంగరు నందెటి కడెముల, బంగరుపట్టములనూలు ♦ వార్ధి యొసంగెన్. 326

గీ॥ గంధర్విగోష్ఠాలి సల విశ్వ ♦ కర్మయొసఁగె, బాలుకస్త్రులసిచ్చెను ♦ గాలమూర్తి
కామధేను వొసఁగె వజ్ర ♦ కవచమును వ, హాస్త్రముల నెల్లఁ జేర్చి యై ♦ యంబికకును.

క॥ నగరాజు సింగమును నె, న్నఁగరానిరతనములిచ్చె ♦ నళినాక్షికి నిం
పుగ మధుపూరితకలశ మొసఁగెఁ జక్కులఱేఁడు భువన ♦ జననికి వేడ్కన్.

వ. మఱియు శేషుండు మణికిరీటకుండలంబులను విచిత్రరచనాయుక్తంబగు నాగహారంబును సమర్పించె నిట్లు తక్కిన వేల్పులును ననేకరత్నభూషణంబుల నాయుధంబుల నొసంగి రంత జగదంబ దివ్యాంబరభూషణాయుధాలంకృతయై యట్టహాసంబుతో గర్జనంబొనర్చె నంత యున్నాదం బాకసంబునిండి ప్రతిధ్వని యొదవఁ ద్రిలోకంబులు గలంగె సింధు చతుష్టయంబుతోఁ బృథ్వి చలించె. 429

ఆ॥ దానవార్ద్యమాన ♦ దైవతగణములు, భువనజననిఁ జూచి ♦ పొంగి మహిష
రాక్షసేంద్రుఁడింక ♦ రహిఁబాసి పొలసెడు, నంచు మదిని సంత ♦ సించి యంత.

వ. జయజయ ధ్వానంబులొనర్చి యనేకవిధంబుల మాతను వినుతించి యెలర్చి రంత నీయలు కుడువిని మహిషానుచరులగు నసురవరులేచి యాకసంబుఁజుట్టి సేనలఁ గూర్చినొని యాయుధంబులు ధరియించి యంబికను దారసించిరి. 431

—* మహిషాసురుఁడు దుర్గాదేవికడకు యుద్ధమునకు వచ్చుట *—

మ॥ మహిషుండున్ భువనత్రయంబు నిజధా ♦ మగ్రామసంఛన్నమున్
రహిమైఁ జేయు మహేశ్వరిన్ గనియు గ ♦ ర్జాఘోషమూలించి య
మ్మహితాకారను నాజినొంచుటకునై ♦ మాద్యద్భట శ్రేణితో
విహితోద్యత్సకలాయుధప్రితతితో ♦ విచ్చేసె నుచ్చైర్గతిన్. 432

గీ॥ కాసరానుచరులగు బా ♦ ష్కలుఁడు చిక్షు
రుండు జామరుఁడును నుద ♦ గ్రుండు నంధ
కుండు నసిలోముఁడును బిడా ♦ లుండు దామ్రుఁ
డును మహాహాను దుర్ముఖు ♦ లును రయమున. 433

క॥ నానాశస్త్రాస్త్రంబుల,తో నంబను బొదువ నార్య ♦ దోర్బలమొసఁగన్
దానవవీరుల శరసం, తానములన్ నొవ్వఁజేసె ♦ దర్పాన్వితయై. 434

గీ॥ మేటినిట్టూర్పు వలన బల్ ♦ మేలిబలము, గలుగు నవకోటిశక్తులఁ ♦ గ్రమ్మఁజేయు
శక్తులకు రక్కసులకును ♦ సమరమొనరె, ఘనగదాశక్తిముద్గర ♦ ఖడ్గములను. 435

ఉ॥ చండియు నంత వేగముగఁ ♦ జండతరాహవలోలయై మహో
ద్దండబలంబునన్ జెలఁగు ♦ దానవవర్యులఁ జిక్కఁబట్టి భే
రుండతరాసిధారలను ♦ ద్రెంచె శిరంబుల నేడ్తెఱన్ గరా
లుండగు సైరిభాసురుఁడు ♦ లోలత నంబను డాసిచెచ్చెరన్. 436

శా॥ లాంగూలంబున గొట్టెలన్ మఱియు వ♦ల్గత్తుండచండాహతిన్
శృంగద్వంద్వమునన్ పరాంబికచమూ♦శ్రేణిన్ విదారించి చం
పం గాత్యాయని యంత వానిపయి రా♦మత్తాత్ముఁ డద్దైత్యుఁడున్
సింగంబున్ బొలియింప వాల్విడ నసిన్ ♦ ఛేదించె నాదేవియున్. 437

గీ॥ కాసరుండంత నాగ్రహా♦కలితుఁడగుచుఁ, గొమ్ములన్ బెల్లగించి పె♦న్గొండఁ దెచ్చి
చండిపై వేసి గర్జించె♦శౌర్య మెసఁగ, నంబ శరతతి గిరినిఁ జూ♦ర్ణంబొనర్చె. 438

క॥ మరల మహిషుండు నట్టులె, యురవగు శైలముల శిలల ♦ నూడబెఱికి యే
డ్తెఱ నంబపైని విసరఁగ, శరధారల వాని నుమ ర♦జము చేసెవడిన్ 439

గీ॥ ఇట్లు మహిషునకును దుర్గ♦కేపుమీఱ, జరిగెఁ జిరకాలము దురంబు♦సర్వదేవ
తాంబయంతఁ గినుక మీఱి♦యడరి మహిషుఁ, బొల్లుసేయఁగ నిక్కచ్చిఁ♦బూనిమదిని.

చ॥ కరముననున్న పాశమునఁ ♦ గాసరు కాళ్ళను గట్టినంత నే
హరియయివాఁడు బిట్టగయ ♦ నంబ తదీయ శిరంబుఁ ద్రుంచె స
త్వర మతఁడొక్క యోధునివి♦ధమ్మునఁ జర్మకృపాణపాణియై
తఱుముచు నంబపైనడరఁ ♦ దా విశిఖమ్ములఁ గప్పె నంబయున్. 441

—* మహిషాసురసంహారము *—

చ॥ సరగున దైత్యుఁ డంత మద♦సామజమై యుమయెక్కనట్టి కే
సరితలఁదుండ దండమునఁ ♦ జక్కఁగ మోఁదఁగఁ జూచి యంత నే
సరసిజనేత్ర వేగనొక ♦ సాయకధారఁ దదీయతుండమున్
విఱుగఁగఁ ద్రుంచె నప్పసుర ♦ వీరుఁడు మేకొని సైరిభాకృతిన్. 442

గీ॥ దుష్టుఁడై దీవ్రశరముల ♦ రోదసీకు, హరము గంపింపఁగా నప్ప♦రాంబమీఁదఁ
గురిసి దిక్కులు భేదిల్ల♦గొప్పగర్జ,నం బొనర్చనఁగని జగ♦దంబ కనలి. 443

గీ॥ మొనసి పలుమాఱు మధుపాన♦మును బొనర్చి, రక్తలోచనయును మద♦రాగరుచిర
వదనయును నయి యసురను♦బాఱఁజూచి, యిట్టులనియెను నిగ్రహం♦బుట్టిపడఁగ.

క॥ ఓరీ ! చలమొనరించెదె, సారెకు నాయెదురఁ బెక్కు ♦ చందంబుల బృం
దారకులెవరేనియు నను, మీఱుదురె? దురంబునందు ♦ మేలరయవిటుల్. 445

చ॥ నిలువుమికఁ నంచు బిట్టుగని • నెట్టన దైత్యునికంఠ మంఘ్రితో
బలమునఁ ద్రొక్కిపట్టి నిజ • భాస్వరశూలముచేత వ్రచ్చి నా
బొలుపఱి యుత్తరార్ధతను • వ్రక్ బెకలించియు నెట్టులేని న
బ్బలియుఁడు వేగిరంబెగసి • భల్లములన్ గురియించె నంబపై. 446

వ. అంత

చ॥ కలకల నవ్వి పూన్కి మెయిఁ • గాళిక ఘోటకవైరి మస్తముల్
విలసదసిన్ దెగన్నఱకె • వేగ హరీంద్రము దక్కు దైత్యులన్
బొలియఁగఁజేసెఁ గొందఱికిఁ • బొల్పరి జీవితరక్షఁ జేచ్చుతై
యలభుజగేంద్రలోకమున • కాతురతన్ బరుగెత్తి రత్తఱిన్. 447

క॥ కురిసిరి పువ్వుల వానలు, సురలెల్లరు నంబపైని • సుసుచిరగతులన్
మురియుచు నాడిరి యచ్చర,లురువుగ గంధర్వగణము • లుబ్బుచుఁ బాడన్.

క॥ ఇది చండీచరితం బి,ట్లిది మీకెఱిఁగించినాఁడ • నింకను నేఁ జె
ప్పెదను శతాక్షీమహిమం, బుదగ్రయశు లాలకింపుఁ • సుసు మోదమునన్. 449

## —* దుర్గాసుర చరితము *—

క॥ దుర్గమతపోబలుండు ని,రర్గళ విక్రముఁడు రురుమ • హాసురసుతుఁడౌ
దుర్గాసురుండు దివిష,ద్వర్గంబులఁ దఱిమి స్వర్గ • భాగ్యములొందెన్. 450

ఉ॥ అంతయె కాక దైత్యుఁడు మ•హాకలుషాత్మకుఁడై జగంబులన్
బంతముతోడ వేల్పులను • బాపల నాల సతీవ్రజంబు న
త్యంతము వేఁపుచుండ నిఁక • హాయని కూయుచునుండి రెల్లరున్
సుంతఁదపంబు జన్నమును • జొప్పడకుండెను ధర్మమెద్దియున్. 451

గీ॥ మఱియుఁ బ్రాహ్మణకులనెల్లఁ • గరము సంగ్ర
హించి మించి జగంబుల • నేచుచుండె
బాపలెల్ల దురాచార • భరితులైరి
భువి ననావృష్టి పొదలె న•ప్పాలునునింకె. 452

గీ॥ ఇఁకను మేదిని నెచ్చోట • నేని నదులు
నదము లంబుధు లుదకశూ•న్యతను జెందె
వనతలములెల్ల బయలులై • వనరెఁ జెట్టు
చేమలెవ్వియు లేక న•శించె నెందు. 453

క॥ జనములు హాహాయనుచును, దినుటకుఁ ద్రావుటకు లేక • దీనసమితి రో
దన మొనరించుచు నుండిరి, యనిమేషులు యోగమాయ • నర్చించికడున్.

మత్తకోకిల॥ ఏలు మేలుముమా ! మహేశ్వరి! ♦ యీజగంబులఁ బ్రేమమైఁ
జాలుఁగోపము సంహరింపుము ♦ సారభూరికృపానిధీ !
బాలిశాత్ములఁ జండముండులఁ ♦ బాపు శుంభు నిశుంభులన్
గూలఁ జేసినయట్లు దుర్గముఁ ♦ గూల్పు మమ్మ! రయంబునన్. 455

ఆ॥ నిదుర మేలుకొలిపి ♦ నీరజాక్షునిచేతఁ, గంధిలోన మధునిఁ ♦ గైటభుని వ
ధింపఁజేసి బ్రహ్మ♦దేవునిఁ బ్రోచితి, వమ్మ యోగనిద్ర! ♦ యరసి దయను.

క॥ ఇఁక నింత తడవు నీదు మ, దికిఁ గృప రాకున్నఁ ద్రిజగ ♦ తీజనములు చా
వక మిగులరు తల్లీ! ర, మ్మిఁక లె మ్మసురన్ హరింపు ♦ మిడు జీవనమున్.

చ॥ అడుగడుగందు బాలురకు ♦ నక్కట! నేరము లొప్పుచుండు న
య్యెడఁ దమతల్లిగాక యిఁక ♦ నేరు సహింత్రు భవాని! మాకు నె
ప్పుడు కడగండ్లు వాటిలినఁ ♦ బొంకముగా నవతార మప్పుడే
కడిఁది దయన్ బొనర్చి మముఁ ♦ గాచుచునుంటివి తల్లి! చక్కనన్. 458

—* శతాక్షీ ప్రాదుర్భావము *—

క॥ అని యిటు దుఃఖితులై దను, వినుతించుచున్నయట్టి ♦ వేల్పులఁ గని చ
య్యన ననఘ కృపామయి తా, ననంత నేత్రమయి తనువు ♦ నప్పుడు చూపెన్.

గీ॥ విల్లునమ్ములుఁ దామర ♦ విఱియు వివిధ
మూలఫలములు నాలుగు ♦ కేలులందుఁ
దాల్చి దయనొప్పమోముతోఁ♦దప్తులై న
ప్రజలఁగనుఁగొని కరుణాశ్రు♦భరితయగుచు. 460

క॥ తొమ్మిది దివసమ్ములు గను, దమ్ముల నశ్రువులు రాల్చ ♦ ధర నల్గడ నీ
రమ్మేర్పడుడు నదులు సం, ద్రమ్ములు బావులు చెఱువులు♦రయమున నిండెన్.

గీ॥ దానధాత్రియు నంతనే ♦ తరులతా స, మృద్ధమై సస్యపూర్ణమై♦హృద్యశాక
మూలఫలభరితంబునై ♦మురువు మిగిలెఁ,బచ్చికలు హెచ్చెనాలకుఁ♦బరువమిడుచు

వ. అంత

ఉ॥ వేలుపులున్ మునుల్ మఱియు ♦ విశ్వమునన్ గలవార లెల్లరున్
జాలఁగ సంతసించి యల ♦ శక్తిని సన్నుతిఁ జేసిరంత ది
వ్యాలినిఁ జూచి యార్యయిఁక ♦ నన్యమభీష్టముఁ దెల్పుఁడన్న వే
దాలనొసంగు వేగముగఁ ♦ దల్లి!యనన్ జగదంబ యిట్లనెన్ 463

గీ॥ సైపుఁడించుక దడవు ప్రాఁ♦జదువు లిత్తు, నన నలరి యంబ కెఱఁగి వా♦రరిగి రిండ్ల
కాక్షణం బందె భయద ని♦ర్హ్రాద మొదవి,భూనభంబులు నిండెన♦ద్భుతముగ దుర.

—* శతాక్షి దుర్గాసురుని సంహరించుట *—

క॥ కౌరవబలములు వడిఁ బా, కారిపురిన్ ముట్టడించె ♦ నడిగొని యుమ యా
వ్వారలఁగావఁగఁ జక్రిము, ధీరతనందుంచి యసుర ♦ దెసఁ గన్గొనఁగాన్.

క॥ సురరిపుఁడు కఱకుటమ్ముల, సురవృగ జగదేకమాత ♦ యురమున నేయన్
సరకుఁగొనక మ్మహేశ్వరి, దురుసగు నారసము లేసె ♦ దుర్గాసురుపై.

గీ॥ మఱియు నాయమ్మ మెయినుండి ♦ మంజుమూర్తు, లెన్మదుగు మాతలావిర్భవించి చక్క నవ్వుచు
వారు చంద్రార్ధశేఖర ♦ భాసమాన, లతులవిద్యుత్సమప్రభా ♦ యుతలు హితలు.

గీ॥ కాళి తారయు ధూమ్రి బ♦ గళయు ఛిన్న,మస్త శ్రీవిద్య భువనేశి ♦ మఱియు భైర
వియుఁ ద్రిపురసుందరియు మహా ♦ విద్యయనెడు, వారధిష్ఠాత్రులై యొప్పఁ ♦ బరఁగిరందు.

క॥ ఆయసురులకును మాతల, కాయోధన మొనరఁగా శ♦తాక్షీ హితులా
నాయత దైత్యవరూధిని, కూయిడి తెగటార్చె శక్తి ♦ కోటులచేతన్. 469

ఉ॥ దేవియు నంత దుర్గముని ♦ దివ్యతరాయతశూలధారతోఁ
జేవయడంగ మోఁదె నొక ♦ చెట్టువలెన్ దనుజుండు నేలపైఁ
గావరమెల్లఁ దీఱిపడె ♦ గౌరియిటుల్ దనుజున్ వధించి యా
దైవతరాజికిచ్చె శ్రుతి ♦ తండములన్ మరలన్ బ్రియంబుగన్. 470

వ. అంత నిలుంపులంద అత్యంత సంతుష్టులై యమ్మహాదేవికి జోహారు లర్పించి యిట్లు
వినుతించిరి. 471

—* దేవీస్తుతి *—

క॥ జననిరో! మాకొఱకై నీ, వనంత నేత్రమయరూప ♦ మర్థిఁగొనుట ని
న్ననుమదు శతాక్షియని యను, దినము జనంబులు జగమున ♦ దేఁకువవిరాజన్ 472

క॥ నీకాయముతోఁ బొడమిన, శాకంబులచేత మేలు ♦ సమకూరుటచే
శాకంభరియను పేరును, లోకంబునఁ జెందు దీవ ♦ లోలమనీషా! 473

క॥ దుర్గమదైత్యుని విష్టప, వర్గము లలరంగఁ జంపి ♦ వైచుట చేతన్
దుర్గాహ్వాయమునఁ బరఁగెదు, భర్గాత్మామోదదాత్రి ! ♦ పావనగాత్రీ! 474

సీ॥ విశ్వజననికిని ♦ విజ్ఞానదాత్రికి, యోగనిద్రకు జోత ♦ లొసఁగుదు మిదె
తత్త్వమస్యాదివా ♦ క్యతతిబోధిత యనంత, కోట్యజాండేశ్వరి! ♦ గొను నుతు లివె
వాఙ్మనఃకాయదు ♦ ష్ప్రాప ! యినేందు పా, వకనేత్ర ! విను మఱిం ♦ పఁగఁ దరంబె
తల్లి శతాక్షి! నీ ♦ దయవక్క జేజేల, కున్న దే మొందేని ♦ నొంచుదిక్కు.

గీ॥ ఇట్టియిడుములు కలనేని ♦ యెసఁగకుండుఁ, గావుత ! జగంబులకునికఁ♦గన్నతల్లి!
అరసి శత్రునిబర్హణం ♦ బమరఁ జేసి, సాఁకుమిట్టుల యత్నంబుఁ♦జక్కఁ జేసి. 475

## —* శతాక్షీ దివ్యుల నను గ్రహించుట *—

వ. అనినంత మహాదేవి యిట్లనియె.

క॥ క్రొవ్వులు పరుగిడ నొండొక, వైపుచనక యాలు వాని ♦ వరుసనె యురుకున్
దేవకునటు మీ వెంబడి,కాపుగనే వచ్చుచుండుఁ ♦ గ్రచ్చుబలేఖుల్ ! 476

సీ॥ ఎడపక నాభక్తి ♦ నెసఁగుమీరలు మది, నే చింతసేయకుఁ ♦ డింకమీఁద
మున్ను నంజుడు దిను♦మూఁకలఁ జంపితి, నెల్లప్పుడును సమ♦యింతువారి
భ్రామర రూపంబుఁ♦బడసి యరుణుగిట్టి, భ్రామరి యనుపేరు ♦ బరఁగఁదాల్తు
భీమరూపముఁ జెంది ♦ భీష్మదైత్యులఁ ద్రుంచఁ, జేసి భీమాఖ్యను ♦ జెందుదాన

గీ॥ నంద నందన నైయల♦ మందలోన
శుంభుని నిశుంభునిని బట్టి ♦ చూఱఁబుచ్చి
నందసుత యనుపేరఁ జె♦న్నొందు దానఁ
గాఁచుదాన మిముఁ గల ♦ కాలమిఁకను. 477

వ. అని చెప్పియమ్మహేశ్వరియంతర్ధానంబుఁ జెందనవ్వేల్పులలరిసిజవాసంబులకరిగిరనిన సురధుంతు మునివరునకుమాసేవాప్రకారం బెఱింగింపుమనిన ముని యిట్లనియె.

గీ॥ సిద్ధకల్యాణి శ్రీదేవి♦ సేవయందుఁ, గర్మయోగంబు భక్తియో ♦ గంబుమఱియు
జ్ఞానయోగంబుగలవిఁక ♦ వానియందు, మొదటఁ గర్మయోగంబునే♦పూనవలయు.

గీ॥ కర్మయోగంబునఁ భక్తి ♦ గ్రందుకొనెడు, దాన జ్ఞానంబు సమకూరు♦జ్ఞానసిద్ధి
వలన మోక్షంబుచేకుఱు ♦ వసుధనెందుఁ, గర్మయోగంబె శ్రేష్ఠమై♦గానుపించు.

క॥ మాయయనంగాఁ బ్రకృతియె, మాయి మహేశ్వరుఁడు శివుఁడు♦మహనీయుండా
ధ్యేయుని భేదం బొందని, కాయం బెఱుఁగుటయె ముక్తి ♦ గాఁ దెలియఁదగున్.

## —* దేవీపూజనము నవరాత్రపూజ *—

గీ॥ దినదినంబర్థిమై మహా ♦ దేవిపూజ, సేయు పుణ్యఫలంబును ♦ శివకు దేవ
ళంబు నిర్మించి తద్విగ్ర ♦ హంబునుం బ్ర, తిష్ఠఁ జేసినవాఁడొందుఁ♦ దేజరిలుచు.

క॥ దేవీమూర్తిని నడుమను, శ్రీ వెలయఁగనిల్పి తక్క ♦ జేజేలను నా
యావిధిఁ జుట్టుప్రతిష్ఠం, గావింపఁగ నెగడు సకల ♦ కల్యాణంబుల్.

గీ॥ అట్లుచేయఁగ లేనివాఁ ♦ డాత్మమందు, భగవతీకృప గల్గినఁ ♦ బట్టుబట్టి
కట్టెదను దివ్యహర్మ్యంబు♦గౌరికేన, టంచుఁదలఁచిన సిరులొందు♦నఘముఁబాయు.

ఉ॥ ఎవ్వఁడు భక్తితోడఁ బర ♦ మేశ్వరి నిచ్చలుఁ గొల్చుచుండు నిం
కెవ్వఁడు తన్మహామనువు ♦ నిద్ధమతిన్ జపియించుచుండుఁ దా
నెవ్వఁడు చక్రిరాజమున ♦ నింపుగఁ జందనకుంకుమాగరుల్
మవ్వపు వేడ్కనుంచు ననుమానమె? వాఁడిల ధన్యుఁడౌటకున్ 485

ఆ॥ దుర్గ నెపుడుగాని ♦ దులసివిష్ణుక్రాంత, లను సమర్చనంబు ♦ నొనరుపకుఁడు
పద్మములను బిల్వ♦పత్రంబులను జాతి, కుసుమములను బూజఁ♦గూర్పఁ డెపుడు.

వ. మఱియుఁ గేతకీ మల్లికా చంపకాది సుగంధ కుసుమంబులన్నియుఁ బూజా యో
గ్యంబులే యిఁకను. 487

గీ॥ దేవిఁ బ్రతిమాస శుద్ధ తృ♦తీయయందు, భక్తిమైఁ బూజఁ జేసినఁ♦బడయు జనుఁడు
సంపదల నాయురారోగ్య♦సంతతులను, భోగమోక్షంబులను నిందు♦బొంకు లేదు.

వ. వెండియు నిఁక నాశ్వయుజశుద్ధప్రతిపత్తు మొదలుగఁ దొమ్మిదిరోజులందును
శ్రీ దేవీపూజనంబుఁ గల్పోక్తప్రకారంబొనర్చినట్టి వానికిఁ ద్రిలోకంబులందు
దుర్లభంబగు శ్రేయంబు లేదనిన సురథుండును వైశ్యుండును మిగుల నలరి యువ్వ
నంబున శరన్నవరాత్రి వ్రతంబునొనర్చి సురథుండు నిజరాజ్యంబును, సమాధి
యను వైశ్యుఁడు దుఃఖోపశమనంబునొంది రిఁక నీ శ్రీదేవీమహాత్మ్యంబును జది
విన వినినవారల కిష్టార్థంబులు చేకూరుననిన సూతునకు శౌనకాదిమునులు
మహాత్మా! శివవాచకంబైన యొప్పు ప్రణవార్థంబు తిరెఱింగింపు మనుటయు.

క॥ సమధికతపోవిభూతి, క్షమ మంత్రారాధ్యసుత! య♦జాతవిరోధీ!
విమలమతికలితశైవాగమ ధర్మరహస్య! గళిత♦కాలుష్యతతీ! 490

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వర నామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి ఉమా ఖండంబున
ద్వితీయాశ్వాసంబు సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## శ్రీ కైలాసఖండము

### ప్రథమాశ్వాసము.



హైమవతీశివపూ
జేహాప్రవణాంతరంగ ♦ యిద్ధ జనశ్లా
ఘాహృద్యతరచరిత్రా!
ప్రాహుణికాన్నప్రదాన ♦ పర లక్ష్మ్యంబా!

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె.

చ॥ ఎవఁడు జనించుచుండఁగనె ♦ యీశ్వరభావముఁ జెందెనో ముని
ప్రవరులలోన నెవ్వఁడు వి♦భాసితమోక్షపథోపదేష్టయా
నెవఁడు మహామహుండతులుఁ డెవ్వఁడు ధ్వస్తగుణత్రయుండు బ్ర
హ్మనిభుఁడు వామదేవుఁడను ♦ నాతఁడు దివ్యమునీంద్రుఁ డున్నతిన్. 3

గీ॥ జ్ఞానియు మహేశనిభుఁడయి♦ఘనత మీఱు, నమ్మహాముని శిష్య వ♦ర్గమ్ముతోడ
ధరను శుద్ధిఁబొనర్చుచు♦దక్షిణాశఁ, దనరిన కుమారగిరినొక్క♦దినమునందు. 4

—* వామదేవముని కుమారాద్రిఁజేరి కుమారుని సేవించుట *—

గీ॥ చేరి స్కంద సరోవర♦నీరమందు, మజ్జనముఁ బొనరించి కు♦మారదేవ
సముఖమున కేగి మునినిక♦రములు గొలువ, వఱలు గీర్వాణగేయు శ్రీ♦పార్వతేయు.

క॥ దరిసించి మ్రొక్కి మనమునఁ, గరము మురిసి యంజలిన్ ద♦గఁ బూనియిటుల్
వరమధురాక్షరములతో, నరుదుగ సంస్తవము చేసె ♦ నతిశయభక్తిన్. 6

సీ॥ ప్రణవరూపునకును ♦ బ్రణవార్థవేదికిఁ, బ్రణవార్థమునకును ♦ బ్రణవమునకు
నుపనిషదర్థమై ♦ యొప్పినసామికి, నుపనిషద్రూపున ♦ కున్నతునకు
నణువునకు నణీయుఁ ♦ డై తగువానికి, గొప్పకు గొప్పయై ♦ యొప్పువాని
కాత్మగుహారూపుఁ ♦ డగువాని కాత్మకు, హానిహితునకు గు ♦ హ్యార్థవేది
గీ॥ కిని గుహున కర్కతేజున ♦ కును మహేశ,సుతునకు మహేశశిష్యున ♦ కతులితునకు
శివకరునకు శివాస్యరా ♦ జీవమిత్రు,నకును స్కందునకివె వంద ♦ నములు సేతు, 7

క॥ శరకాననశాయికినిఁ, గిరిజాపుత్త్రునకుఁ గార్త్తి ♦ కేయునకును దు
ర్ధరశక్తిధరున కాశ్రిత, వరదున కసురసముదాయ ♦ భంజకునకొగిన్. 8

క॥ అల్లషడక్షరమూర్త్తికి, నల్లషడక్షరమహాప ♦ దార్థజ్ఞున కు
త్ఫుల్లారవిందనయనున, కుల్లాసము మెఱయఁ జేతు ♦ నొగి వందనముల్. 9

గీ॥ అభ్రగంగాసుతునకు ష ♦ డధ్వబాహి,రునకు షణ్ముఖునకును శాం ♦ తునకు సింధు
రానన సుబుద్ధి వైభవ ♦ హార్షితునకు, దివ్యవర్గ సమాశ్లిష్ట ♦ దేహునకును. 10

క॥ సకలామరమణిమకుట, ప్రకటస్ఫూర్జితాంఘ్రి ♦ పంకజునకు మా
మకహృదయాధిష్ఠితగురు,నకుఁ జేసెద వందనముల ♦ నమ్రుఁడనగుచున్. 11

గీ॥ తవిలి యిట్లనుతించి ప్ర ♦ దక్షిణత్రి,యంబునొనర్చి సాష్టాంగ ♦ ములర మ్రొక్కి
చేతులను మోడ్చినిలిచిన ♦ శిష్టమునిని, వామదేవుని గన్గొని ♦ భర్గసుతుఁడు. 12

ఉ॥ సంతసమయ్యె నీమనికి ♦ సన్మునినాయక! యేమొనర్తు నీ
వెంతయు నిస్పృహుండవును ♦ నీద్యతరుండవు యోగి వెద్ది యేన్
సుంతయు నీకు గాంక్షితము ♦ చొప్పడదెప్డు పరోపకారమున్
జింతయొనర్చి యిప్పుడమిఁ ♦ జేరిచరించుచు నుందు విమ్మగన్. 13

క॥ వినఁదగినది యెదియేనియు, మనమున నున్న యెడఁ దెల్పు ♦ మానీశ్వర! నే
ననువుగ లోకానుగ్రహ, మునుగోరుచుఁ దెల్పువాఁడఁ ♦ బూనికి నాఱయన్. 14

గీ॥ అనిన స్కందుని వచనము ♦ లాలకించి,వామదేవుఁడు ప్రశ్రయా ♦ వనతుఁడగుచు
మేఘగంభీరనాదముల్ ♦ మెఱయనిట్లు, పల్కె షాణ్మాతురునితోడఁ ♦ బ్రౌఢిమీఱ.

ఉ॥ దేవర! నీసదేశమునఁ ♦ దేఁకువ నేమని విన్నవించెదన్
జీవుల మయ్య! మేము కృపఁ ♦ జేకొని యిట్టులమమ్ము సాఁకుటన్
భావమునందుఁ జన్నమరి ♦ పల్కెద జంకును గొంకులేకిటుల్
తావకవాక్ప్రసారము ను ♦ దారముఁ గోరుచు నల్పమేధతో. 16

క॥ ప్రణవము శివవాచకమగుఁ, బ్రణవమునకు వాచ్యమరయఁ ♦ బశుపతి శివుఁడా
ప్రణవముతోడ నమరి పశు, గణముల బంధములఁ బాపుఁ ♦ గద లోకమునన్.

క॥ ఓ షనునది బ్రిహ్మంబగు, నోమనునది యీసమస్త ♦ మూహింపంగా
నోమనిపాడెడు సామము, లోమని బ్రాహ్మణుఁడు బ్రహ్మ♦మొందుజగమునన్.

గీ॥ ఇట్లు శివతత్వమునకన్న ♦ నితర మొకఁడు
నుంతయును లేదు జగమునఁ ♦ జూడనభవుఁ
డొక్కఁడె మహేశ్వరుఁడు శివుఁ ♦ డొప్పమీఱు
సర్వరూపధరుంఁడు శా♦శ్వతుఁడు హరుఁడు. 19

క॥ ఇఁకను సమష్టివ్యష్టి, ప్రకారముల తీరులొప్పఁ ♦ బ్రణవార్థము నా
కొకఁడును జెప్పఁడు నేఁటి ద,నుక దొరకం డొజ్జ యెందు♦ను భవాదృశుఁడై.

క॥ తెలుపుము దేవ ! తదర్థము, మలపుము నా సందియముల ♦ మానసమలరన్
నిలుపుము నీభక్తులలో, సలుపుము తావకకృపాప్ర ♦ సారాస్పదుఁగాన్, 21

గీ॥ ఇట్లు మునియడ్గఁగాఁబర♦మేశ్వరాత్మ, భవుఁడుసంతోసమునమనః♦ప్రథమునందు సాష్టత్రింశత్కలాంచితు♦సాంబశివునిఁ,బ్రణవగాత్రునిఁగొలిచి తా♦పససహితుని.

వ: ఇట్లు వక్కాణింప నుపక్రమించె.

క॥ బాగుగ బాగుగ నడిగితి, వో గుణనిధి ! వామదేవ ! ♦ యున్నతభావా !
యీగరిమనొప్పు భావము, లే గుణశాలియును నడుగఁ ♦ డెందు మునివరా !

—* వామదేవమునికిఁ గుమారస్వామి ప్రణవార్థము చెప్పుట *—

క॥ శివభక్తవతంసుండవు, వివేకనిధివౌట నిట్లు ♦ పృచ్ఛించితి వీ
వవగతము కాకకాదై, నవచింతును విను మఖిలజ ♦ నశ్రేయముగాన్. 24

ఉ॥ లోకములో జనుల్విషయ ♦ లోలుపు లెంతయు భిన్నభిన్న మా
ర్గాకులు లైశమోహజితు ♦ లారయలేరు మహేశతత్త్వమున్
నీకు వచించెదన్ వినుము ♦ నిప్రవరా ! ప్రణవార్థ మల్లను
శ్రీకరుఁడౌ శివుండు శశి ♦ శేఖరుఁ డారయుమీ యథార్థమున్. 25

గీ॥ ఇదియెసత్యము వినుము చే♦యెత్తి చెప్ప, వాఁడశ్రుతిమతమీయదే♦బ్రహ్మవేత్త లైనమునులు పురాణంబు♦లందు ధర్మ, శాస్త్రములయందుఁజెప్పిరి♦సత్యమిదియె.

గీ॥ ఎవనిదెసనల్లవాక్కులు♦హృదయమునను, నరయఁగాలేకమరలెడు♦నక్కజముగ నెవనియానందమెఱిఁగిన♦యిభ్యజనుఁడు, భయపడండెందు నేనియు♦భవ్యమూర్తి !

గీ॥ ఎవనివెలుఁగున నినచంద్ర♦ఋక్షవహ్ను, లాతటిత్తులు వెలుఁగక♦యట్లెయుండు నెవనివెలుఁగుకులోఁగి దా♦మెల్ల వెలుఁగు, నెవనివెలుఁగున నీసర్వ♦మిట్లువెలుఁగు.

క॥ సర్వైశ్వర్యయుతుండును, శర్వుం డాకాశమధ్య ♦ సంచారియునై
సర్వవ్యాపియునగు నా, సర్వేశుఁడు చిన్మయుండు ♦ సంసేవ్యుఁడిలన్. 29

గీ॥ ఆపరాశక్తి నిర్గుణ ♦ మై మనోహ, రయును నై భావగమ్యమై ♦ ప్రాణిమాత్ర
యేపురుషునందుగూఢమై ♦ యెసకమెసఁగ, నిష్కలయు నయిశివమయి ♦ నెగడు నెపుడు.

గీ॥ వెలయు శివరూపమిలను ద్వై ♦ విధ్యమొంది, స్థూలసూక్ష్మపరంబులన్ ♦ లీలలొప్పు
మోక్షకాములగు యోగ ♦ పురుషులరసి, వాసిఁబూజింతురెందు దై ♦ వాలునిష్ఠ.

క॥ సకలము నిష్కలమనియును. నిఁక నొక భేదంబు పొసఁగు ♦ నెంతయు జ్ఞానా
త్మకుఁడై పరమాత్మయనన్, రకముగ నిష్కలప్రవృత్తి ♦ రాజిలు మౌనీ! 32

వ. ఇఁక సకలంబగు సదాశివమూర్తి.

గీ॥ పంచమంత్రతనుఁడు కలా ♦ పంచవిగ్ర, హుఁడును శుద్ధస్ఫటికసన్ని ♦ భుఁడును పంచ
వక్త్రుఁడు శతభుజుండు త్రి ♦ పంచలోచ, నుఁడును శీతలరశ్మిప్ర ♦ భుఁడునయి తగు.

—* మంత్రమయమూర్తి *—

సీ॥ ఈశానమస్తకో ♦ పేతుండును బురాత, నుఁడును తత్పురుషాన ♦ నుఁడు నఘోర
హృదయుండు వామదే ♦ వదృథగుహ్యుండు స, ద్యోజాతపాదుండు ♦ యోగధరుఁడు
సర్వజ్ఞతాది ష ♦ ట్ఛక్తిషడంగికృ, తతనుండు శబ్దాది ♦ వితతశక్తి
విస్ఫురితహృదబ్జ ♦ విలసితుండును మనో, మయి స్వీయయునగు వా ♦ మస్థశక్తి

గీ॥ తో సతమ్మును మిగుల వి ♦ భాసితుఁడయు, సకలనిష్కలమూర్తి ప్ర ♦ శస్తిమీఱ
దనరు నారయుదు రిది త ♦ త్త్వజ్ఞజనులు, వామదేవమునీంద్ర! స ♦ ద్భావసాంద్ర!

వ. మంత్రాది షడ్విధార్థంబుల యథోపన్యాసమార్గంబున సమిష్టివ్యష్టి భావార్థ
పురస్సరంబుగఁ బ్రణవస్వరూపంబు నెఱిఁగింతు నం దుపదేశక్రమంబు ముందు
గాఁ జెప్పెదను వినుము. 35

గీ॥ ఇలమనుష్యులు నాల్గు జా ♦ తులుగ నుందు, రందుఁ ద్రైవర్ణికులకె వే ♦ దాధికార
మొప్పియుండుటచే స్వాశ్ర ♦ మోచితముగ, ధర్మమును వారనుష్ఠింపఁ ♦ దగుఁ జగమున.

గీ॥ విను శ్రుతిస్మృత్యుదితమగు ♦ విమలధర్మ, మరసి చేయుజనుఁడు సిద్ధి ♦ నందఁగలఁడు
ఇట్లు వేదపథమును దా ♦ నెఱుకఁ జేసి, నట్టి శివుఁడే వచించె ది ♦ వ్యమునిచంద్ర!

వ. ఇట్లు ప్రసిద్ధులగు సర్వమునీంద్రులు వర్ణాశ్రమాచారపుణ్యంబులఁ బరమేశ్వరు
నర్చించి తత్సాయుజ్యంబుఁ బడసిరి. 38

గీ॥ మూఁడు ఋణములతోఁడఁ దాఁ ♦ బొడము ద్విజుఁడు
బ్రహ్మచర్యంబునన్ ముని ♦ ప్రకరఋణము

యజ్ఞమున దేవఋణముఁ బుత్రాప్తిఁ బితల
ఋణముఁ దీర్పంగ వలయు మునీంద్రవంద్య! 39

క॥ మానుగ ఋణములఁ దీరిచి, వానప్రస్థాశ్రమంబుఁ బడసి సమమతిన్
బూని విజితేంద్రియుండై, తా నభ్యాసంబు సేయఁ దగు యోగంబున్. 40

గీ॥ ఎపుడు బుద్ధి దృఢంబయి యించుకేని, చలనమొందక యుండు నాచందమెఱిఁగి
సర్వకర్మంబులను వేగ సన్యసించి, జ్ఞానపూజాపరుండయి క్రాలవలయు.

వ. మఱియు సన్న్యాసాశ్రమదశ యనన్యాదృశమని యెఱుంగుదువు కదా! 42

క॥ ఏవికృతుల నొందక యే, తా విలసిలు నిద్ది యతహృదయులకుఁ బేర్మిన్
శ్రీ వెలయ శివైక్యమునన్, జీవన్ముక్తి ఫలమిదును సిద్ధము మౌనీ. 43

వ. అని యంత సన్న్యాసాశ్రమస్వీకార ప్రకారం బంతయు విధ్యుక్త ప్రకారం
బుగ సాంగోపాంగంబుగఁ దెలిపి యంత వామదేవుండు కుమారున కిట్లనియె.

గీ॥ షడ్విధార్థ పరిజ్ఞాన సరణి యెట్లు, షడ్విధార్థంబుఁ దెలిపెడు జ్ఞానమెద్ది
ఇంతకును బ్రతిపాద్య మిఁకెవ్వఁడిట్టి, యెఱుక కెయ్యది ఫలము నాకెఱుఁగఁ జెప్పు.

క॥ ఇవి తెలియక నేఁ బశుశాస్త్ర విమోహితుఁడనగుచును భృశము శివమాయన్
మిపుల భ్రమించుచునుంటిని, శివనందన! మోహమఱి వచింపుము కరుణన్.

గీ॥ అనిన గుహుఁడిట్టులనియె సంయమివతంస!, నీవడిగినట్టి యర్థంబు నే వచింతు
తనరు వ్యష్టిసమష్టిభేదములనొప్పు, ప్రణవశివరూప షడ్విధార్థముల నిపుడు.

వ. ప్రథమంబు మంత్రరూపంబు; ద్వితీయంబు మంత్రభావితంబు; తృతీయంబు దేవ
తార్థంబు; చతుర్థంబు ప్రపంచార్థంబు; పంచమంబు గురురూపదర్శకంబు, షష్ఠం
బు శిష్యాత్మరూపదర్శకంబునా నివి షడ్విధార్థంబులు. మంత్రస్వరూపంబు నెఱిం
గింతు విను మద్దాని విజ్ఞానమాత్రంబున నరుండు జ్ఞాని యగు. 48

## —* ప్రణవస్వరూపము *—

గీ॥ ఆద్యమై యొప్పు స్వరమును నైదవదియు, నైన స్వరమున్ బవర్గావసానవర్ణ
మును బిదప బిందునాదంబులును సమష్టి, రూపమగు మంత్రరూపంబు జూపినాఁడ.

వ. ఇట్లు వేదంబులచేఁ జెప్పఁబడె నందు నాదము సర్వసమష్టియగు బిందాద్యాంబగు
వర్ణచతుష్టయంబున శివవాచకంబగు. ప్రణవంబు వ్యష్టిరూపంబిక యంత్ర
రూపంబగు శివలింగంబును గుఱించి విను మన్నిటికన్న క్రిందుగ లింగపీఠంబును
నద్దానికిఁ బైనిఁ బ్రథమ స్వరంబును దానిపై "ఉ" వర్ణంబును, అందుపై "మ్"
వర్ణంబును దచ్చిరంబుపై బిందువును దానిపైని బ్రణవరూపమైన నాదమును
లిఖింపవలయును. ఈయంత్రము సంపూర్ణంబుఁ జెందిన సర్వకామంబులుసిద్ధించును.

గీ॥ ఇట్టియంత్రమ్ము నులిఖించి యింపు మెఱయఁ, బ్రణవవేష్టన మొనరింప వలయు దాన
నుత్థమగు నాదమునను దా నూహసేయ, వలయు నాదావసానంబు పరమహంస!

వ. ఇఁకను గూఢంబును శంకరప్రోక్తంబునగు దేవతార్థంబుఁ జెప్పెద వినుము "సద్యోజాతం ప్రపద్యామి" యను నుపక్రమంబు మొదలుచేసి "సదాశివోం" మనువఱకు బ్రహ్మపంచక వాచకంబులగు నైదుమంత్రంబులు సూక్ష్మంబులైన బ్రహ్మరూపంబు లివియె పంచదేవతలు. 52

క॥ ఆయా దేవతలే విను, మా యాదిమదేవుఁడైన యజభవుని మూర్తుల్
శ్రీయలరఁగ నీమంత్రము, లాయజభవుని వాచకంబు లరయుము హంసా! 53

వ. మూర్తి మూర్తిమంతంబులకు నెక్కుడు భేదంబు లేదు. ఈశానముఖ్యోపేతుండని శివుని విగ్రహము మున్ను చెప్పితినిగదె! సద్యోజాతాద్యనుక్రమముగా నీశానాంతము వఱకు శివుని ముఖపంచకము చెప్పఁబడినది. మఱియు నీశానదేవునకుఁ జతుర్వ్యూహపదమందుఁ దత్పురుషాద్యంబును సద్యోజాతాంతంబునగు బ్రహ్మరూపంబు చతుష్టయంబు గలదు. ఈయది పంచబ్రహ్మ సమిష్టియగు నీశానబ్రహ్మరూపంబుగ విశ్రుతంబైనది. పురుషాద్యంబు సద్యోజాతాంతంబగునది వ్యష్టిరూపంబు, అనుగ్రహమయంబగు నీచక్రము పంచార్థకారణంబు పంచబ్రహ్మాత్మకంబు సూక్ష్మంబనామయంబు నిర్వికారంబు. 54

గీ॥ తగ ననుగ్రహమును ద్వివిధంబు గాఁగ, బరఁగుఁ బ్రభువకు నాతిరోభావముఖ్య
గోచరంబును మఱి జీవకోటికిం బ, రావరవిముక్తిదంబును శ్రేవహిల్ల. 55

వ. సదాశివునకీయది కృత్యద్వయముగా నుదాహరింపఁబడినది. అనుగ్రహము సృష్ట్యాది కృత్యములలో నైదవది. పరబ్రహ్మస్వరూపులును గల్యాణదాయకులునునగు నీ సద్యోజాతాద్యులగువారిందు దేవతలుగఁ జెప్పఁబడుచున్నారు. అనుగ్రహమయంబగు నీచక్రము శాంత్యతీతకలామయంబై చెప్పఁబడినది. భావితాత్ములును సదాశివోపాసకులును బ్రణవాసక్తచేతస్కులును నగు యతులకీ పదము గమ్యస్థానము. వారీపదమును బొంది విపులంబులగు భోగంబులను బ్రహ్మరూపియగు దేవునితోడ ననుభవించి మహాప్రలయసంభవమందు శివసామ్యంబును బొందుచున్నారు. అట్టివారు మరల సంసారాబ్ధియందుఁ గూలరు. "తే బ్రహ్మలోకే" యనెడు సనాతనియగు శ్రుతియిట్లు చెప్పుచున్నది. ఈయదియె శివునియొక్క సమష్టియగు నైశ్వర్యము. "సర్వైశ్వర్యేణ సంపన్న" యనెడు నథర్వశిఖ యిట్లు చెప్పుచున్నది. ఈశివునకే సర్వైశ్వర్యప్రదాతృత్వమును జెప్పుచున్నారు. ఈ సదాశివునియొక్క పదముకన్న నధికమగు పదము లేదు. అందు బ్రహ్మపంచకవిస్తారప్రపంచ మగుపట్టుచున్నది. ఈ పంచబ్రహ్మములనుండి నివృత్తిముఖ్యగు కలలు పొడముచున్నవి: అవ్వి సూక్ష్మభూత స్వరూపంబులుగలవియై యీస్థూలరూపస్వరూపంబగు నీప్రపంచకమునకు గారణములై విశ్రుతంబులైనవి. ఏతద్విధము

ఆ॥ ఇది నివృత్తిరూప♦మింపగు సృష్టిచ, క్రంబు శోభితంబు ♦ కాంచనోద
రాదికృతము పద్మ♦జారాధకులకిది, ప్రాప్యపదము ముక్తి♦భాగ్యకరము. 65

వ. ఈనాల్గు చక్రములందు మహేశాది క్రమముగఁ బ్రణవము గౌణవృత్తిచే వాచకంబగును. ఇది వేదవిశ్రుత వైభవంబగు జగచ్చక్రము. శ్రుతియు "పంచారం చక్రం" అని స్తవము చేయుచున్నది. ఆలాతచక్రభ్రమివలె నవిచ్ఛిన్నలయోదయంబును సృష్ట్యాది పంచావయవంబును బంచారంబును నగు జగచ్చక్రమిది యొక్కటే. అంతట వర్తించునది గనుకఁ జక్రమని చెప్పఁబడుచున్నది. అమిత తేజస్కుండును హిరణ్మయుండునునగు శివదేవుని యొక్క శక్తికార్యమగు నీచక్రము హిరణ్యజ్యోతిస్సేవితము. ఇఁకనీచక్ర ముదకముచే నావరింపఁబడినది. ఆయుదక మగ్నిచేతను నాయగ్ని వాయువుచేతను, వాయువాకాశము చేతను నాయాకాశము భూతాదిచేతను నాభూతాది మహత్తుచేతను నామహత్తవ్యక్తము చేతను నావరింపఁబడినది. సప్తావరణంబు లిట్లు విశ్వముయొక్క రక్షణమునకై యేర్పఱుపఁబడినవి. ఇఁకఁ జక్రముకన్నఁ బదిగుణము లుదకంబెక్కుడుండును. సలిలముకన్నఁ బదిగుణము లెక్కుడుగా నగ్నియును నటుమీఁదఁ దక్కినవికూడను త్తరోత్తరము దశగుణాధికంబులై యుండును. ఇదియే బ్రహ్మాండము. ఈ యర్థమునే ప్రకటముగాఁ జక్రసామీప్య మందు జలంబుండుటవలన "సలిలస్య మధ్యే"యని యుపక్రమించి శ్రుతి చెప్పినది. శక్తివిశిష్టుఁడగు నొక్క శివుఁడే యీయనుగ్రహతిరోభావసంహారస్థితి సృష్టులచే సంతతంబు లీలఁ గావించుచుండును. ఇఁక బహూక్తు లేల ? మునీంద్రా ! సారము చెప్పుచున్నాను. శక్తివిశిష్టుఁడగు శివుఁడే యీయఖిలమని నిశ్చిత తాత్పర్యము. అంత గురూపదిష్టమగు వేదార్థమును విని వామదేవముని పరమాత్మయందు సందిగ్ధార్థంబు నిట్లు సాదరంబుగ నడిగెను. 66

గీ॥ జ్ఞానశక్తిధర! పరమా♦నందమూర్తి!, స్వామి! నీముఖకమల ని♦ష్యందసుధను
ద్రావి చెందితి శేముషీ♦దార్ఢ్యమునుమ, నమున సందియమంతభి♦న్నమయిసురిఁగె.

క॥ మఱియు నొకఁడడిగెదను గని, కరమున నద్దానిఁ దెల్పు ♦ కారుణికాత్మా !
సిరిమీఱనిన్నుఁ బోలెడు, గురుఁడెచ్చట నాకుదొరకు ♦ గుహా ! పరమగురూ!

గీ॥ వినుము బ్రహ్మాదికీటాంత♦విశ్వమునకు, స్త్రీపురుషరూపమున స్థితి♦ చెలఁగుచుండు
నిట్టిజగమున కాదియై♦నట్టి మేటి, కారణంబేదొ మదిఁ బొడఁ♦ గానకుంటి. 69

గీ॥ స్త్రీయొ పూరుషుఁడో క్లీబ♦మఱియు నపుంస, కంబొ మిశ్రంబొ యన్యమో♦ కారణంబు
పలుపురిద్దానిఁగూఱిచి♦బహువివాద, ములను సల్పుచునుందురు♦బుధులు భువిని.

క॥ జగదుత్పత్తినిఁగూరిచి, తగఁదెల్పెడునట్టి వేద ♦ తతులు బహువిధం
బుగఁబల్కుచుండు నిక్కము, ఱుఁగజాలరు హరియు నేని ♦ ద్రుహిణుండేనిన్. 71

గీ॥ కారణోక్తులు సర్వమే ♦ కత్వ మొందఁ, దెలియఁజెప్పు! మహాశక్తి ♦ దివ్యమూర్తి!
తెలియుచున్నాఁడఁ జేసెద ♦ దీనిన నెఱు, వాఁ డెవండాత్మయొక్క ♦ తత్త్వ మెఱుఁగువాఁడు?

వ. సర్వదేహేంద్రియమనోబుద్ధ్యహంకారసంభవంబగు నిత్యవహారం బాత్మరూపం బనుటయందు సందియ మొక్కడుగల దీసం దేహంబులు రెండువిధ్రమంబుల చందంబున మనోభూమి నావరించియున్న యజ్ఞానసంభూతంబులగు సర్వానిఁ బెక లించివేసి శివాద్వైతకల్పవృక్షావని నొనర్చుమనుచుఁ సుబ్రహ్మణ్యుండు వేదాంత గర్భితంబగు తత్ప్రశ్నద్వయంబునాలించి స్మేరాననుండై మునికిట్లనియె. 73

—* కుమారుఁడు నామదేవునకు జచత్కారకునిగుఱించి చెప్పుట *—

గీ॥ ఇదియె మును నాజనకుఁడౌ మ ♦ హేశ్వరుండు, నాదుమాతకు నీహార ♦ నగదుహితకు
నే వినుచునుండఁగాఁ దెల్పు ♦ నీకు దానిఁ, దెలియఁజెప్పెద వినుము సు ♦ ధీవతంస!

క॥ చాలరహస్యంబైనను, మేలిమిశిష్యుండ వౌట ♦ మిాఱక నీకున్
లోలతఁ జెప్పెద దీనిన్, బాలసులకు నుడువవలదు ♦ పామరులకున్. 75

క॥ కొందఱు కాపిలదర్శన, మందును దాదృశములందు ♦ నధికశ్రమములై
యుందురు మునిశ్రేష్ఠులు వా, రందున నవ్వారిపథము ♦ లారయుదు మునీ! 76

వ. విను మనుమానప్రయోగంబు కిం దవకాశంబులేదు. అయ్యాది ప్రతిజ్ఞాహేతూ దాహరణోపనయనిగమంబులను పంచావయవంబులతోఁ గూడుకొనిన ధూమంబు యొక్క దర్శనంబునఁ బర్వతంబున కగ్నిమద్భావంబుఁ జెప్ప. ప్రత్యక్షంబగు ప్రపంచంబు దర్శనాలంబంబందు చేఁబరమాత్మయగు పరమేశ్వరుండు జ్ఞాతవ్యుండు. స్త్రీ పుంరూపమయంబగు ప్రపంచంబు ప్రత్యక్షంబుగఁ గన్పట్టుచున్నది గదా!

గీ॥ వినుముషట్కోశరూపమా ♦ పిండమందు, అద్యమైనట్టి త్రయముమా ♦ తృంశజము త
దన్యమైనట్టిత్రియము పి ♦ తృంశజముగ, శ్రుతివచించెడు వినవా సు ♦ శ్లోక! నీవు.

వ. ఇట్లు సర్వశరీరంబులందును బరమాత్మయందును స్త్రీ పుంభావంబు నెఱుంగు చున్నారు. శ్రుతి బ్రహ్మమునకు సచ్చిదానందరూపంబు గలుగుటను జెప్పుచు న్నది. అందు సచ్ఛబ్దం బసన్నివర్తకంబై పరమాత్మను జెప్పుచున్నది. చిచ్ఛబ్దము జగత్త్వమునకు వివర్తకంబై విధింపఁబడినది. సచ్ఛబ్దము త్రిలింగములం దొప్పి నను నిచ్చటఁ బురుషుండె విధింపఁబడును. మఱియు నది ప్రకాశంబుఁ జెప్పెడి దౌట సప్పురుషుండు ప్రకాశవిశిష్టుండగును, జ్ఞానశబ్దమునకుఁ బర్యాయమగు చిచ్ఛబ్దము స్త్రీత్వంబు నొందినది. ప్రకాశంబును, చిత్తును మిథునమై జగత్కా రణత్వము నొందినది. ఇట్లు సచ్చిదాత్మకము జగత్కారణత్వము నొందఁగా శివశక్తిభావం బొక్కయెడనే విధింపఁబడినది. తైలవర్త్యాది మాలిన్యము వల్ల నుంచి ప్రకాశమునకుఁగూడ మాలిన్యము గనుపట్టును. అట్లు మాలిన్య మగ

వత్వము చిత్ప్రకాశములయం దగుపట్టుచున్నది. అందుచే శివత్వము వివర్తకంబై నట్లు శ్రుతిచోదితము. ఇఁక జీవాశ్రితంబగు చిచ్ఛక్తికెప్పుడును దౌర్బల్యమొప్పు చుండు. తన్నివృత్త్యర్థమై శక్తిత్వము సార్వకాలికంబుగ నీశ్వరునియందొప్పు. బలవంతుఁడు శక్తివంతుఁడని వ్యవహారము లోకవేదములందుస్ఫుటము. ఈ ప్రకారము పరమాత్మయందు శివత్వమును శక్తిత్వమును జూపఁబడినది. శివశక్తి సంయోగంబున నానంద ముద్భవిల్లు. అందుచేఁ బరమాత్మను యోజించి మునులు క్షీణకల్మషులగుచుందురు. మఱియు శివరూపంబగు పరమాత్మయందు మనంబును బదిలపఱచి యనామయంబగు శివతత్త్వమును జెందుచున్నారు. సర్వాత్మత్వము శివశక్తులకేయనియు శివతత్త్వమె బ్రహ్మమనియు నుపనిషత్తులందు గానముసేయఁబడుచున్నది. బృహిధాత్వర్థమగు బృంహణత్వము బృహత్త్వము బ్రహ్మశబ్దము పంచబ్రహ్మమయుంఁడగు సదాశివునియందు విశ్వప్రతీతితో వెలయుచున్నది. స్వాంగరూప భావంబుల యందు మాయాతత్త్వవిభేద బుద్ధియగు శివుఁడెపుడు పరమైశ్వర్య పూర్వకంబగు స్వకీయరూపంబుదాచి మాయచే సమస్తపదార్థ గ్రాహకుండగుచున్నాఁడో యపుడు పురుషుండను నాహ్వయంబుఁ బొందుచున్నాడు, "తత్సృష్ట్వాతదేవాను ప్రావిశత్" అనెడు శ్రుతి యీయర్థంబును జెప్పుచున్నది. 79

గీ॥ ఇట్టిపురుషుండెసంసారి♦యెంతయేని, మాయచేమోహితుండయి♦మఱుఁగుపశుపు
ఈశ్వరజ్ఞానలేశవి♦హీనుఁడగుచు,బొదలు నానాదురితకర్మ ♦ మూఢబుద్ధి. 80

గీ॥ విశ్వమెల్ల శివునికన్న♦భిన్నమెపుడు, గాకయున్నను దన్ను జ♦గంబు శివుని
కన్నభిన్నంబుగానెంచి♦కాంచుచుండు,పశువుకీమోహ మది లేదు♦ప్రభునకెపుడు.

క॥ కనుమైంద్రజాలకుని భ్రమ, ఘనుఁడగు శివయోగి యెపుడు♦గననియటులఁబా
వనుఁడైన సద్గురుని బో, ధను నాత్మైశ్వర్య మెఱుఁగ♦దా శివుఁడెయగుఁ.

వ. శివునియందు సర్వకర్తృత్వరూపమును సర్వజ్ఞత్వ స్వరూపిణియుఁ బూర్ణత్వరూప
యును నిత్యత్వవ్యాపకత్వస్వరూపిణులగు నైదుశక్తులు సంకుచద్రూపభాస్వరం
బులై సంకోచరూపంబున నెప్పుడును బ్రకాశించుచుండునిఁకఁ బశువునకు. 83

గీ॥కలయువిద్యయురాగంబు♦కాలమునుని,యతియునగు బంచతత్త్వంబు♦లమరియుండు
నందుఁగర్తృత్వహేతువై ♦యలరెడుఁగల,విద్యతత్త్వసాధకమయి♦ వెలయునలఁతి.

క॥ ఇఁకరాగము విషయసురం, జకమై తగుఁగాలమది యె ♦ సంగు నవచ్ఛే
దక మెల్ల భావములకుఁ, సకలము లాభాసములకు ♦ సంధాయకమై. 85

వ. ఈయదియె భూతాదియని చెప్పఁబడు చున్నది.

గీ॥ అదియుఁగర్తవ్యమిద్దికా♦దనెడునట్టి, నియమమేనియతియగుము♦నీ! యివియు మ
హేశశక్తులుపీనియ♦హీనకలన, మునఁబశువుపడుభ్రమమందు♦మూఢుఁడగుచు.

వ. ఈ పంచకంబే స్వరూప వారకంబగుటచేఁ గంచుకంబని పేరొందినది; అంత రంగంబు సాధనం బనిన వామదేవమునీంద్రుం డు షణ్ముఖున కిట్లనియె. 87

-* వామదేవమునికిఁ గుమారస్వామి శక్తివిశిష్టశివాద్వైతంబును జెప్పుట *-

గీ॥ దేవర! యధర్షలింగ బ్రకృ♦తియలరారు, పురుషుఁడు పరిస్ఫుడిది నేమ♦ మరయుఁడనుచు
మున్ను చెప్పితిరిపుడెట్టు♦ లన్నె మగును, బ్రకృతిచేసంకుచితుఁడయి♦ప్రభుఁడెసఁగునె?

వ. ఈ సందియంబును విచ్ఛేదించి తత్త్వం బెఱింగింపుమనిన వామదేవమునికి సుబ్ర హ్మణ్యుం డిట్లనియె. 89

క॥ అద్వైతము శివవాదం, బాద్వైతంబును సహింప♦దరయు మది మునీం
ద్రా! ద్వైతము నశ్వరము శి, వాద్వైత మనశ్వరంబు ♦ హరువొప్పనిలన్. 90

గీ॥ శివుఁడు సర్వేశ్వరుండును♦సర్వకర్త, సర్వసంవేదియుఁ ద్రిదైవ♦జనకుఁ డగుచుఁ
దరయ సచ్చిదానందరూ♦పాత్ముఁడైన, సంకుచితుఁడగు స్వేచ్ఛచే♦స్వప్రకృతికి.

వ. అట్టి మాయాసంకుచితరూపుం డేపురుషుండనంబరఁగు నాతఁడే కలాపంచకంబు చేత భోక్తగాఁ గల్పితుండగు 92

గీ॥ ప్రకృతితోఁగూడి పురుషుండు ♦ ప్రకృతిజాత
గుణము లనుభవించుచు నుండుఁ ♦ గుతుకమునను
అట్లు స్థానద్వయాంతస్థుఁ ♦ డగు పురుషుఁడు
సంకుచన్నిజరూపుండు ♦ శంక లేదు. 93

వ. చిత్తము ప్రకృతితత్త్వ మయ్యాది సత్త్వాదిగుణకారణంబు. సత్త్వరజస్తమోగుణం బులనుండి వస్తునిశ్చయకారిణియగు బుద్ధి యుత్పన్నంబయ్యె. అద్దియెమహత్తద్దాని చే నహంకారంబును, అయహంకారంబున సూక్ష్మంబులగు శబ్దస్పర్శరూప రసగంధములతో శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వానాసికలను పంచజ్ఞానేంద్రియంబులును సంకల్ప వికల్ప కారణంబగుమనంబునుబుట్టె వానితోడనె స్వకార్యసహితంబులగు వాక్పాణిపాదపాయూపస్థ లనెడు పంచకర్మేంద్రియంబులును బొడమెను. ఈ కర్మేంద్రియ పంచకంబునకు వచనదానాగమనవిసర్గానందంబులను కార్యంబు లైదు. మఱియు శబ్దాదిపంచతన్మాత్రంబులనుండి ఆకాశవాయ్వగ్నిజలభూము లను పంచభూతంబు లుత్పన్నంబులయ్యె. వీని కవకాశంబునిచ్చుట, వీచుట, కాల్చుట, తడుపుట, మోచుట యనునవి కార్యంబులనిన గుహునకు వామ దేవముని యిట్లనియె.

గీ॥ మును గలాదులనుండి య♦భూతసృష్టి, తెలుపఁబడె నిప్పుడేటొండు♦ తెఱఁగుగాను
దెలుపుచుంటివి యెట్లిది ♦ దేవ! మేటి, సందియం బుదయించెను♦ జక్కఁ జెపుమ.

వ. మఱియును, ఆత్మతత్త్వ మకారంబనియును విద్యాతత్త్వం బుకారంబనియును శివతత్త్వము మకారంబనియు బిందునాదంబు సర్వతత్త్వార్థకంబులనియు నీపంచకంబునకు బ్రహ్మవిష్ణురుద్రమహేశ్వర సదాశివులు దేవతలనియుఁ జెప్పియుంటి విపుడు తన్మాత్రలనుండి భూతపంచకం బుదయించెనని చెప్పితి వెట్టు లనిన సుబ్రహ్మణ్యుండిట్లనియె "తస్మాద్వా" యనెడు శ్రుతిప్రకారము భూతసృష్టి క్రమమందుఁ బంచభూతంబులు గలలచేఁ బుట్టబడిన విద్ది నిశ్చిత మీయవి స్థూల ప్రపంచరూపములై పరమేశ్వరుని తనువులై యొప్పు. శివతత్త్వము మొదలుకొని పృథివ్యంతతత్త్వంబు లుదయక్రమమందుఁ దన్మాత్రలనుండి పుట్టఁబడిన వనుటలోఁ గల్ల లేదు. కలలకును దన్మాత్రలకును భూతకారణంబం దవిరుద్ధంబగు నైక్యంబొప్పు -స్థూలసూక్ష్మాత్మకంబగు నీవిశ్వంబందు సనక్షత్రంబులగు సూర్య చంద్రాది గ్రహంబులును లోఁతిజ్యోతిర్గణంబులును బ్రహ్మవిష్ణు రుద్రాది దేవ జాతులును నింద్రాది దిక్పాలురును దేవరక్షోభూత మానుషకోటులును బశువులుఁ బక్షులును గీటములుఁబన్నగంబులు మున్నగు సకలజంగమంబులును స్థావరంబులగు తరుగుల్మలతౌషధులును సప్తకులపర్వతంబులును గంగాది పుణ్య నదులును సప్తసముద్రంబులు మొదలగునవి యన్నియు జగంబున సర్వవస్తు జాతంబును స్త్రీపుంసరూపంబగు విశ్వంబంతయు శివశక్త్యాత్మకంబుగ నంతరంగంబున నెఱుంగు మిందు సందియంబు లేదు. ఇట్టి తత్త్వంబే శివజ్ఞాన విశారదులగు నీబోటి విబుధుల కుపాస్యంబు. "సర్వంబ్రహ్మేత్యుపాసీత సర్వో వై రుద్రః" అనెడు శ్రుతులీ యర్థంబు నే సెప్పుచున్నవి. అందువలన సదాశివుండే ప్రపంచాత్మకుండట్టి సదాశివుండను నేననియెడు నా యష్ట త్రింశత్కలాన్యాస సామర్థ్యసిద్ధ శివాద్వైతభావనచే భావితాత్ముండగువాఁడే గురుండునుశివుండును నగు.

గీ॥ సద్గురుమహాప్రబోధన ♦ క్షపితసకల, బంధనుండయి శంకర ♦ పాదపద్మ
సక్తుఁడై నట్టి శిశువేని ♦ సత్యముగను, సద్గురుండగు విను తాప ♦ సకులతిలక!

క॥ ఎందు గుణోన్నతి నొప్పుచు, విందగు నేవస్తువేని ♦ వెలసినచోఁదా
నిం దలపు ప్రణవవాచ్యము, నుం దళితాఘంబుగాగ ♦ నున్ మునివర్యా! 98

## -* కుమారుఁడు వామదేవమునిని శివతత్త్వప్రచారకుఁడవౌదువని చెప్పుట *-

గీ॥ ఇట్టులు శివప్రియంబును ♦ నీడ్యమైన, నీ శివాద్వైతతత్త్వంబు ♦ నెలమి తోడ
నీకుఁ జెప్పితిభక్తిచే ♦ నీవుదీనిఁ, బదిలముగ హృదయంబునఁ ♦ గుదురు పఱచి.

క॥ పొడువుము సకలాఘంబులఁ, దుడుపుము పాషండతండ ♦ దుర్వాదములన్
విడువుము పెఱదర్శనముల, నడువుము శివభక్తపదవి ♦ నయమొసలారన్. 100

వ. ఎవ్వండేని మదగర్వితుండై యీయర్థంబున కన్యథాత్వంబును వ్యపదేశించె నేని యవ్వాని మస్తకంబు శత్రుకాలాగ్నికల్పంబగు శక్తిచే ఛేదించెదను. నీవు శివాద్వైతవిదులలో నెల్ల నెక్కుడై శివజ్ఞానోపదేష్టవై శివాచారంబునకుఁ బ్రవర్తకుండవు గాఁగలవు. 101

ఆ॥ ఎవని దేహభస్మ ♦ మింత సోఁకిన సక, లాఘపుంజమెల్ల ♦ నంతరించి
బ్రహ్మరాక్షసుండు ♦ వడసె సద్గతి నట్టి, నిన్ను నెఱుఁగ నొక్కొ ♦ నిర్మలాత్మ !

వ. మఱియు శివయోగివగు నీకటాక్షసంపర్కమాత్రంబునఁ బశువు పశుపతియగును. లోకోపకారకరణార్థంబిట్లు నీవు నన్నడిగితివి—సాధులగు వారల చరిత్రంబిట్టులే. ఇఁకను లోకరక్షణంబొనర్చుచు సుఖంబునొందుమని షడాననుండు నుడివిన వామదేవముని విని వినమ్రమూర్తియై సాష్టాంగముగాఁ బ్రణమిల్లి గుహపాదారవిందమకరందరసాస్వాదనమిళిందుండై సెలవొంది యథేచ్ఛన్ జనియెనని సూతుండు శౌనకాదులకు వక్కాణించిన నవ్వారలు మురిసి సూతున్ గొనియాడి మహాత్మా! మున్ను నైమిశారణ్యవాసులును షట్కులీనులునగు బ్రాహ్మణులకు బ్రహ్మచోదితుండై వాయుదేవుం డీశ్వరతత్త్వం బెఱింగించెనని వింటి మద్దాని నీవెఱింగి యుందువుగావున మాకిపుడయ్యది బోధింపుమని యర్థింపుడు.

క॥ పులిపాకవంశముక్తా, ఫలమంజులమూర్తి! పరమ ♦ పావనకీర్తీ!
లలితస్వచిత్త పద్మభ, సలదార్యాశంభు మిథున ♦ జననీ! లక్ష్మీ! 104

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వర నామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి కైలాస ఖండంబున
ప్రథమాశ్వాసంబు సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీశివపురాణము

## వాయవీయఖండము

### ప్రథమాశ్వాసము.



యుతగురుకుల సకల
శ్రేయస్సంపాదకేందు ♦ శేఖరలింగా
ర్చాయత్తాత్మాంబుజ! యన
పాయయశోధుర్య! వీర ♦ భద్రారాధ్యా!

వ, అవధరింపు మక్కథకుండు మంగళమధ్యంబుగ జగన్మంగళుండగు పరమేశ్వరు
నిట్లు భజనంబొనర్చె. 2

తే॥ సోముఁడును సగుణుండు స♦సూనుఁడును బ్రి,ధానపురుషేశుఁడును జగ♦త్సర్గరక్ష
ణాంతహేతువునై శరం♦బలరునట్టి, శివున కేను బ్రణుతులను ♦ జేయువాఁడ. 3

తే॥ ఇఁక ననన్యాదృశంబయి ♦ యెసఁగు నెవని, శక్తి యైశ్వర్య మెవనిది ♦ సర్వగంబు
స్వామియై విభుఁడై జగం♦బోము నెవఁడు, అట్టిశివుని భజింతు నే♦ననవరతము. 4

తే॥ ఆయజుని విశ్వకర్మను♦నవ్యయాత్ము, శాశ్వతుని శివు శ్రితలోక♦శరణు శర్వు
నమ్మహాదేవు వరదు మ♦హాత్మునాత్మఁ, గోరిపూజింతుఁగోర్కులు♦గొనలుసాగ.

వ. ఇట్లు వాఙ్మయోపాస్తిఁ బొనరించి శౌనకాది మహామునుల కిట్లనియె. 6

చ॥ మును జిరకాలమందుఁ గడు ♦ పూర్వపుఁగల్ప మతీతమైన నం
తనె మఱినూత్నకల్పమిది ♦ తారసిలంగఁ బ్రవృత్తమయ్యె నం
దనువుగ సృష్టికార్యమిఁక ♦ నయ్యెడ బోద్ధలుగాఁదనర్చు స
న్మునివరులందు నెక్కుడుగఁ ♦ బుట్టె వివాదమొకండు బిట్టుగన్. 7

—* మునులు బ్రహ్మజిజ్ఞాసులై చతుర్ముఖునియొద్దకుఁ బోవుట *—

క॥ ఇది పర మిద్ది కాదనుచు ♦ నెంతయు భూరివివాదశీలురై
వదలక తత్త్వవస్తువును ♦ బ్రౌఢి నిరూపణసేయలేక య
ప్పదనున నంద ఱేకమయి ♦ బ్రహ్మపదంబును జేరఁబోవఁగా
మదినిఁ దలంచి మేరుగిరి ♦ మధ్యమశృంగముఁ జేరి యందొగిన్. 8

సీ॥ సిద్ధచారణయక్ష ♦ సేవితంబగుదాని, ఘనమణీమయగుహల్ ♦ గలుగుదాని
శుకపికశారికా ♦ సుస్వనంబులదానిఁ, గలహంసయూథముల్ ♦ గలుగుదాని
సురసరోవర ♦ స్తోమంబెసఁగుదాని, స్వర్ణదీకూలమై ♦ పరఁగుదాని
మత్తభ్రమరదివ్య ♦ మానతరులదానిఁ, దరుణార్కసన్నిభమై ♦ తనరుదాని
గీ॥ వేదఘోషపరీతమై ♦ వెలయుదాని, దురితపరుల కగమ్యమై ♦ తోఁచుదాని
సన్మునికదంబకంబుల ♦ జానుమీఱు, దాని బ్రహ్మవనంబును ♦ దఱిసి మునులు. 9

గీ॥ ఆవనముమధ్యసుందరం ♦ బైతనర్చు, నొకఁడు పురము గలదునూఱు ♦ యోజనముల
పొడవువది యోజనమ్ముల ♦ వెడలుపునుగ, లిగిపసిఁడిమాడుగుల బారు ♦ లొగి వెలయఁగ.

వ. అందు.

గీ॥ స్ఫటికమణిమయమై యాక ♦ సమున లేలి, హానముగ నొప్పు నొక సము ♦ దారహర్మ్య
రాజమున హేమరాజీవ ♦ రాజదగ్రి, పీఠమునఁ గనకాద్రినా ♦ వెలయువాని. 11

క॥ దివ్యధవళవసనుండై, దివ్యవిలేపనసుదామ ♦ దీప్తతనుండై
దివ్యరుచిహిండనుండై, దివ్యమరాళాధిరాజ ♦ దివ్యత్తనుఁడై. 12

గీ॥ దేవఋషిగణస్తుతులచేఁ ♦ దేజరిల్లు, వానిఁ బ్రిభయట్టి చామర ♦ పాణియైన
వాణిచే సేవితుండగు ♦ వాని నజునిఁ, గాంచి సాష్టాంగపడి మ్రొక్కి ♦ కరము భక్తి.

—* మునులు బ్రహ్మను నుతించుట *—

క॥ మూగురు మూర్తుల రూపున, బాగుగ సర్గస్థితిలయ ♦ వైఖరులను బల్
రాగిలుచుఁ గూర్చుప్రధికి వ,చోగురుతర బొల్చుదొరకు ♦ జోతలి వెయగుర్.

ఆ॥ ఆ ప్రధానతనున ♦ కాపరిధానక్షోభ, కున కిరువదిమూడ ♦ గు వికృతులను
జెందినను వికార ♦ మొందని యట్టివా,నికిఁ బురాణపురుష ♦ నకివె నుతులు. 15

క॥ పరమాత్మకు బ్రహ్మకు భా, సురసర్వజగత్పదార్థ ♦ సురుచిరలీలా
కరునకు జగన్మయునకిదె, వరగ నొనర్చెదము భక్తి ♦ వందనశతముల్. 16

క॥ మించుగ జగంబులను సృష్టించియుఁ బెంచియు హరించి ♦ చేవమెసఁగ రా 17
ణించుచు నున్నను నిను భా, వించఁగ లేమైతి మకట! ♦ బిట్టుగమాయన్.

గీ॥ అని నుతించుచు నున్న యా ♦ మ్మునులఁ జూచి, వనజసంభవుఁడని యెడఁదా ♦ పసవతంసు
లార! మీరంద ఱిచటికిఁ ♦ జేరినట్టి, కారణంబేమొ చెప్పుఁడన్నఁ ♦ గడఁగి వారు,

క॥ కంజోద్భవునకు నెంతో సమంజసముగ మరల మ్రొక్కి ♦ యతిశయభక్తిన్
సాంజలిబంధంబుగ నిటు, లంజనపునఁ దెలిపి రాత్మ ♦ లన్ గలకుందుర్. 19

ఉ॥ దేవర! యంధకారమునఁ ♦ దెంపనునట్టిది లేకయుండి యే
వేవొ యనేకవాదముల ♦ నెప్పుడు సల్పుచునుందు మజ్ఞతన్
నీవు జగన్నిదానుఁడవు ♦ నేతవు ధాతవు సర్వకారణం
బీవిఁక నీవెఱుంగనిది ♦ యెందును లే దొకయించుకేనియున్. 20

ఉ॥ ఎవ్వఁడు సర్వభూతముల ♦ కెల్లఁబురాణుఁడుగాఁ దనర్చు ? నిం
కెవ్వఁడు శాశ్వతుండు ? పర ♦ మేశ్వరుఁ డెవ్వఁడు నిత్యశుద్ధుఁడౌ
నెవ్వఁడు? చిత్రకృత్యముగ ♦ నెవ్వనిచే జనియించె నీజగం
బెవ్వనియందు సర్వము ల ♦ యించునొ? మాకెఱుఁగంగఁ జెప్పుమా! 21

క॥ ఎవనికి పశ్యములగు నీ, వివిధములగు భూతములును ♦ వినియోజకుఁ డిం
కెవఁడగు సర్వమునకు నా, యవికారునిఁ జూచుటెట్టు ♦ లజ! తెల్పఁగదే! 22

—* బ్రహ్మదేవుఁడు మునులకుఁ బరతత్త్వంబును జెప్పుట *—

క॥ అనియిట్లడిగినఁ బద్మజుఁ, డనఘుల నమ్మునివరులను ♦ నభ్రము లేన
వ్వును దొలుకు వీక్షణంబులఁ, గని తడవాత్మమున నోజఁ ♦ గాంచి 'శివుఁ'డనెన్.

గీ॥ అనియు నానందకలితస ♦ ర్వాంగుఁడగుచు, దోయలిన్ జెందియిటుల నెఁ ♦ దోయజజుఁడు
సకలజగదంత రాత్మయా ♦ శర్వవిభవ, మరసి చెప్పెద వినుఁడు స ♦ త్యముగ మునులు!

గీ॥ వాక్కులెచ్చోటనుండి భా ♦ వంబుతోడ, మరలు నెవ్విధి నిర్ణయిం ♦ పంగదక్క
యెవనియానంద మెఱిగిన ♦ యిద్ధమూర్తి, యెందునుండియుభయ మొందఁ ♦ డెప్పుడేని.

ఉ॥ ఎవ్వనిచేత నీయఖిల ♦ మీవిధివిష్ణులు రుద్రశక్రులున్
జివ్వనఁ బంచభూతములు ♦ శ్రీయలరారెడు నింద్రియంబులున్
నివ్వటిలంగ నాదిఁదగె ♦ నేటగుకారణకోటికెల్ల దా
నెవ్వఁడు కారణంబయి ర ♦ హించునొ శంభుఁడు మింటిమధ్యలోన్. 26

క॥ ఎవఁడు గనె సుతుని నను మొద, లెవఁడిడె జ్ఞానంబునాకు ♦ హెచ్చుగనిటులిం
కెవని ప్రసాదంబున నీ, కవినుతమగు బ్రహ్మపదముఁ ♦ గాంచితి నేనున్. 27

క॥ మ్రానువలె నిశ్చలుండై, మానుగ నెవఁ డొకఁడు గగన ♦ మధ్యవసించున్
బూనిక నీయఖిలంబును, బూని మహాత్మకుఁ డెవండు ♦ పూర్ణముగాగన్. 28

చ॥ ఎవఁడొక బీజముఁ ధర న ♦ నేకవిధంబులఁ బుట్టఁజేయు నిం
కెవఁడు సమస్తలోకముల ♦ నేపునఁగూర్చెడు బీజరాజిచే
నెవఁ డఖిలప్రజాహృదయ ♦ మింపుగఁ జెంది కనంబడండొ తా
నెవఁడొకఁడట్టి రుద్రుఁడు మ♦హేశుఁడు లేఁడు ద్వితీయుఁ డెందునన్. 29

క॥ కాలాత్మయుతములై కడుఁ, గ్రాలెడు కారణములను స♦కలముల నెవ్వం
డోలిగ ననంతశక్తి, శ్రీలలితుండగుచు నధివ ♦ సించును బేర్మిన్. 30

గీ॥ కటికిచీఁకటి తగఁ బవ♦ల్గాని రేయి,గాని లేకయుసత్తు స♦త్తైని లేని
తఱి శివుండొకఁడుండె నా♦తండె సవిత్రు, వంద్యుఁడాతనిచేత నే ♦ ప్రజ్ఞ వడసె.

క॥ ఆతనికిఁ గార్యకరణము, లేతఱిని గలుగనేర ♦ వీడగునట్టిం
డాతనికి మిన్నయును లేఁ, డాతనినిజశక్తి నిత్య♦మై జ్ఞానదయా. 32

క॥ క్షరమగు ప్రధాన మమృతా, క్షరమగు పరమాత్మహరుఁడు ♦ శంకరుఁడొకఁడే
క్షరరూప జీవుఁడగు నిది, యరసి యెఱుంగఁదగు దేవు ♦ నాత్మజ్యోతిన్. 33

క॥ వెలుఁగడు భానుం డచ్చోట, వెలుఁగఁడు చందురుఁడు భములు♦విద్యుల్లతలున్
వెలుఁగవు హవ్యవహుండును, వెలుఁగడు తత్తేజమునను ♦ వెలుఁగు నఖిలమున్.

క॥ ఒకఁడే దేవుఁడు శంకరుఁ, డకలంకాత్ముఁడు మహేశుఁ ♦ డాతఁడె సేవ్యుం
డికఁ నాపరమునకన్న న, ధికమగు పదమొండు లేదు ♦ తెలియుం డీరల్. 35

క॥ ఆతని ధ్యానమువలనను, నాతని యోజనమువలన ♦ నాతనితత్త్వం
బూతగఁ దెలియుటవలనను,నాతనిమాయ యది దొలఁగు ♦ నవని నరునకున్.

ఉ॥ అందఱికన్న మీఁదఁదగు ♦ నావసథంబున నుండువాఁడు బి
ట్టందఱియందు నుండెడు మ♦హాత్ముకుఁ డెల్ల నెఱింగినట్టివాఁ
డందిక షడ్విధాధ్వమయ ♦ మైన జగంబునకెల్ల వల్లభుం
డంద తెఱుంగుఁడీరు పర ♦ మాత్ముని నిట్లు మహామునీశ్వరుల్ ! 37

గీ॥ ఉత్తరోత్తరభూతాళి ♦ కుత్తరుఁడు ని, రుత్తరుండును నానంద ♦ రుచిరభూమి
ప్రభుఁ డరయ ననవచ్ఛిన్న♦వైభవుండు, నైజశక్త్యమృతాస్వాద ♦ వరసికుండు.

గీ॥ అవిరతానందభూరిర ♦ సైకమాక, రందసందోహభోగమి ♦ ళిందమూర్తి
అఖిలజగదండపిండక్రి♦యాచతురుఁడు, అరయుస్వేచ్ఛానియుక్తచ♦రాచరుండు.

క॥ ఈతఁడె యాది జగంబుల, కీతఁ డనంతుండు పరముఁ♦డీతఁడె నాథుం
డీతఁడె స్వతంత్రుఁడెంతయు, నీతఁడె పరిపూర్ణమూర్తి♦యెఱుఁగుఁడీ కమునుల్!

గీ॥ ఇఁకను నెక్కుడుభక్తిచే♦నీశ్వరుండి, తండు పొడసూపుఁగాని వే♦ఱొండువిధము
తోడ నెవ్వఁడుఁ గనరాఁడు ♦ దొడ్డతపము, లేని దానంబులేని యు♦వ్వానికొఱకె.

గీ॥ శివునిరూపంబు త్రివిధమై ♦ చెలఁగు స్థూల సూక్ష్మపర భేదములతోడ ♦ స్థూలమస్మ
దాదిదృశ్యంబు సూక్ష్మమా ♦ యలఘుయోగి, దృశ్యము పరంబు నిత్యమై ♦ తేజరిల్లు

వ. ఆ పరరూపంబు జ్ఞానరూపం బానందమయం బీక పరమేశ్వరనిష్ఠులును దద్వ్రత
పరాయణులునగు నప్పారమేశ్వరులచే నద్ది చూడంబడు నట్టివారు ముక్తులని
యెఱుంగుఁడు. 43

గీ॥ భక్తిపొడమును శివుని దీ ♦ వ్యప్రసాద, మున నది జనించు శివుని ప్ర ♦ భూతభక్తి
బీజ మంకురమున నట్లు ♦ బీజమునను, నంకురంబు జనించెడు ♦ నవనియందు. 44

వ. సర్వంబులగు నర్థసిద్ధులు ప్రసాదపూర్వకంబులగు నందుచే సకలసాధనంబులచేత
శివప్రసాదంబు సాధింపఁజెల్లు. ప్రసాద సాధనంబె పరమధర్మంబని వేదంబునఁ
జూపఁబడినది. 45

గీ॥ అధికధర్మపరుండైన ♦ నఘము పొలియు, గళితమలునకు విజ్ఞాన ♦ కలితభక్తి
సాంబశివునందుఁ బొడము దృ ♦ ఢంబుదాన, జగతిశివభావతుల్య ప్ర ♦ సాదమమరు.

ఆ॥ ఆ ప్రసాదముననుఁ ♦ నఖిలకర్మత్యాగ, మొనరు నది స్వరూప ♦ మునను గాదు
ఫలముగూర్చియగును ♦ ఫలపరిత్యాగము, నను మహేశధర్మ ♦ మనువుపడును.

వ. అదియు గుర్వపేక్షంబనియు దదనపేక్షంబనియు రెండు తెఱంగుల నొప్పు
నం దనపేక్షంబుకన్న సాపేక్షంబు శతగుణాధికంబు. ఇఁక శివధర్మాన్వయంబున
శివజ్ఞాన సమన్వయంబును నద్దాన సంసారదోషదర్శనంబును దాన విషయ
వైరాగ్యంబును, వైరాగ్యంబున భావశోధనంబును, భావశుద్ధునకుఁ గర్మమం
దుఁగాక ధ్యానమందు నిష్ఠయును జ్ఞానధ్యానయుక్తుఁడగు పురుషునకు యోగ
లబ్ధియును, యోగంబున నుత్తమభక్తియును ననంతరంబునఁ బ్రసాదంబును,
బ్రసాదంబున మోక్షంబును బ్రాప్తించు. ముక్తుఁడగువాఁడు శివసముండగు నను
గ్రహప్రకారమున కొకనియతి లేదు: 48

గీ॥ ఎట్టియోగ్యతగలిగిన ♦ నట్టనుగ్ర, హముదనరుఁ బూరుషునకు గ ♦ ర్భముననున్న
వాఁడుముక్తుఁడగుమఱొక్క ♦ వాఁడుపుట్టుఁ, జెందినంతనె మోక్షంబుఁ ♦ జెందు మునులు!

క॥ బాలుఁడు తరుణుఁడు ముదుకఁడు, కాలునినరకముననున్న ♦ ఖలుఁడును దిర్య
గ్జాలములోఁ బ్రాణియునుర్, మేలుగ ముక్తిఁగొను శివుని ♦ మేలిమికరుణన్. 50

క॥ స్వపదక్షయమున జనుఁడీక, నపరపదంబొంది మోక్ష ♦ మందు నొకఁడు క్షీ
ణపదుఁడయి మఱొకజన్మము, విపులమతుల్! చెంది ముక్తి ♦ వేఱొకఁడొందుర్.

గీ॥ ఊర్ధ్వలోకంబులొంది యం ♦ దుండియుండి
యొకఁడు మోక్షంబుఁదడవుగ ♦ నొందఁగలఁడు
ఇట్లనేక ప్రకారంబు ♦ లెసఁగ దేహు
లల్లమోక్షంబు లెందెద ♦ రరయుఁడీరు. 52

వ. జ్ఞానభావానురూపంబగు శివప్రసాదంబుననె మోక్షంబు లభించు వేఱొక్క మార్గంబు లేదు.

ఉ॥ కావున మీరలెల్లరును♦గారుణికాగ్రణియైన యమ్మహా
దేవుని సుప్రసాదమును ♦ దేఁకువనొందఁగఁ గోరి వాఙ్మనః
శ్రీవిభవంబునన్ సుతులు ♦ చేడెలుఁగూడి శివున్ మహేశ్వరున్
భావనఁజేయుఁ డెల్లపుడు ♦ భక్తిఁ దొనర్పుఁడు కొల్వుఁడీ రహిన్. 54

ఆ॥ దీర్ఘసత్త్రమొకఁడు ♦ దివ్యవర్షసహస్ర, కముగఁ గూర్పుఁడందుఁ♦గడకు నాదు
సెలవుతో మరుత్తు♦చేరరాఁగలఁ డతం, డానతిచ్చు శ్రేయ♦మౌ తెఱంగు. 55

కం॥ అటుమీఁద వారణాసీ, పుటభేదనమునకుఁ బ్రీతిఁ ♦ బొండాశ్రితలం
పటుఁడగు విశ్వేశుం డ,చ్చోట నీశ్వరితోడనుండు ♦ శుభకరుఁడగుచున్. 56

గీ॥ అందు నక్కజమును గాంచి♦యవల నాదు
సన్నిధికిఁ జేరరండు మో ♦ క్షంబు చంద
మంతయును జెప్పెదను నొక్కఁ ♦ డైన జన్మ
మందె మోక్షంబు దొరకు మీ ♦ యంజలి యెడ. 57

—* నేమిపతనంబున వనంబు నైమిశారణ్యసంజ్ఞను జెందుట *—

వ. మనోమయచక్రంబొకండు నిర్మించి యిదియె విడుచుచున్నా నద్దాని నేమి యెచ్చటఁ బ్రాలునో యద్ది పావనంబగు తపోయోగ్యప్రదేశంబని యెఱింగి యందువసించి సత్త్రంబు సల్పుఁడని యట్లు చక్రంబు నిర్మించి విడిచిననంత మునులెల్లఁ బితామహునికి మ్రొక్కి సెలవొంది చక్రంబు వెంటనడచి రయ్యది కదలి వివిధ రాజీవ రాజీవిరాజిత మధురాచ్ఛోదవైశంతసరోవేష్టితంబును నానావిధ పుష్పఫల భరిత తరులతావ్రాత సంశోభితంబును నగు నొక దివ్యవనంబున నొక్క శిలాతలంబున నేమి వ్రాలి యొఱగిన నలువ సెలవు చొప్పున మునులందు వసించి రయ్యది నైమిశవనంబని పేరొందె. 58

కం॥ పదునెనిమిది ద్వీపంబులు, పదవిగ నేలిన పురూర♦వస్సమ్రాట్టా
పదమున యూర్వశికివశం, వదుఁడయ్యెను దైవయత్న ♦ పరతంత్రుండై. 59

ఉ॥ ఎచ్చట మున్ను విశ్వసృజు ♦ లింపుగ సత్రముఁగూర్చిరో మఱిం
కెచ్చట వేదవేత్తలు జ♦యింతురో వేదబహిష్కృతావలిన్
హెచ్చుగ వేదవిజ్ఞబుధు ♦ లెచ్చట వేదవిధుల్ పొనర్తురో
యచ్చటఁజేరి మౌనివరు ♦ లాఁదటఁగూర్చిరి సత్త్రయాగమున్. 60

గీ॥ స్ఫటికమయపర్వతాశ్మప్ర♦సరదమృతని, ర్ఝరరమ్యం బతిరసఫ♦లాగమంబు
వ్యాలసత్త్వంబు లుండని♦మేలివనము, మునులతపసుల కుచితమై ♦ తనరెమిగుల.

గీ॥ అట్టిసుస్థలమందు ది♦వ్యఋషులంద, ఱోలసి సత్రంబు నారంభ ♦ మొనరఁజేసి
సంతతంబు శివార్చన♦సలుపుచును స,మాప్తిచేసిరి దక్షిణ ♦ లధికమొసఁగి. 62

గీ॥ అంత బ్రహ్మాజ్ఞనొంది మ♦హాబలుండు, వారిఁజేరుటయును నంత♦వారుమురిసి
యెదిరికొని వందనముచేసి♦హేమమయపు, విష్టరంబునొసంగిబల్♦వేడ్కమిగుల.

క॥ ప్రాణాదులచే నిఖిల, ప్రాణుల సర్వాంగములను ♦ భాస్వద్గతులన్
బూనఁగఁ బ్రేరణచేసెడు, వాని శరీరములఁ దాల్చు ♦ వాని మహాత్మున్. 64

క॥ చదలునఁబుట్టినవానిన్, బొదలఁగ శబ్దంబు స్పర్శ ♦ మును గలవానిన్
వదలక తనయం దగ్గిని, నొదవించెడువాని నెందు ♦ నుండెడువానిన్. 65

గీ॥ బ్రహ్మదేవుని శిష్యుఁడై ♦ పరఁగినట్టి, వాని నణిమాదిసిద్ధుల♦చే నితాంత
మలరువాని నటకువచ్చి ♦ నట్టివానిఁ, బూజచేసిరి ప్రియమంది ♦ మునితిలకులు.

—* ముని వాయుదేవ సంభాషణము *—

వ. అంత గంధవహుండు మునులన్ గలియన్ గని పరితోషంబున నిట్లనియె. 67

చ॥ కుశలమె మీకు నందఱకు ♦ గొప్పదనర్చిన నిమ్మఖంబునన్
బిశితభుగగ్రిణుల్ పొదలి ♦ విఘ్నములన్ బొనరింపకుండిరే
వశులయి దేవతాపితల ♦ వాసిగ సర్వగతిన్ భజించి కీ
దృశమగు చెట్టలేకయె వి♦ధిన్ బొనరించినవారె సత్రమున్. 68

వ. వెండియు సత్రానంతరం బిపుడు మీ రేమిసేయఁ గడంగియుంటిరి చెప్పుఁడన్న
వాయుభట్టారకునకు మునులు సంతసంబుతో నిట్లనిరి. 69

శా॥ మాకెల్లన్ గుశలంబు సేకుఱెఁ గదన్ ♦ మాన్యత్వమున్ మాతప
శ్శ్రీకిన్ జెందె మహాత్మ! నీవిటకు మా ♦ శ్రేయోర్థివై వచ్చుటన్
లోకేశుండగు పద్మసంభవుని మున్ ♦ యోజించి పూజించ సు
శ్లోకుం డాతఁడు మమ్ముమెచ్చి యనియెన్ ♦ శుద్ధాంతరంగంబునన్. 70

గీ॥ దీర్ఘసత్రంబుఁదొడరి యా♦దేవదేవు, పరమకారణు రుద్రుని ♦ భక్తిఁగొలువ
నామఖానంతరమున మ♦హాబలుండు, మిమ్ముఁజేరి విజ్ఞానంబు♦మీకొసంగు. 71

క॥ అనిచెప్పిన మేమందఱ, మును దోయజసంభవునకు ♦ మ్రొక్కి వెడలి యీ
ఘననైమిశవనమున సవ, మును బొనరించితిమి యబ్ద♦ముల నొకవేయిన్. 72

గీ॥ అజునినుడి తీరు మీరిట ♦ కరుగుదెంచి, తిరి మఱొండిఁక లేదెట్టి♦తృట్టుమాకు
మీవలనఁ జెందువార మ♦మేయతేజ!, జ్ఞానబోధంబనిన జగ♦త్ప్రాణుఁడలరి.

వ. మీకెద్ది ప్రష్టవ్యంబెద్ది సందిగ్ధంబది యడుగుఁడన్న మునులు వాయుదేవునకిట్లనిరి.

గీ॥ ఈశ్వరజ్ఞాన మెట్టుల ♦ నెఱుకఁజెంది, తరయ నవ్యక్తజన్ముఁడౌ♦యబ్జభవున
కెట్లు శిష్యుఁడవైతివి♦యెఱుఁగఁజెప్పు,మయ్య!మాకందఱకుమహా♦త్మా!ముదమున.

గీ॥ అనియడుగవారలకు వాయు♦వనియె శ్వేత, లోహితంబనుకల్పంబు♦లోనమున్న
నాచతుర్వదనుండు స♦ర్గాభిలాషఁ, జేసితపియించె నెంతయు ♦ వాసిమీఱ. 76

క॥ ఘనమగు నాతపమున విధి, కనువుగ శంకరుఁడు శ్వేతుఁ ♦ డనుమునినై ద
ర్శనము నొసఁగి గాయత్రీ, మనువును విజ్ఞానధనస ♦ మస్తము నొసఁగెన్. 77

గీ॥ దాన విజ్ఞానమొంది ప♦ద్మజుఁడు సర్వ, భూతములను జరాచరం♦బుల రచించె
దేవదేవునివలన నెం♦తేనిబడసి, నట్టిజ్ఞానామృతము నాకు ♦ నర్థినొసఁగె. 78

వ. అనిన మునులిట్లనిరి.

గీ॥ ఎట్టి జ్ఞానము నొసఁగె ద్రు ♦ హిణుఁడు నీకుఁ
దథ్యమగునద్ది యెఱిఁగింపు ♦ తజ్ఞతిలక !
యెందు నిష్ఠనుబూనరించి ♦ యీజగమునఁ
బురుషుఁడు సుఖంబుఁజెందును ♦ బుణ్యమూర్తి ! 79

వ. అనిన వాయుదేవుం డిట్లనియె.

—* వాయుదేవుఁడు మునులకుఁ బశుపాశపతి స్వరూపంబుఁ జెప్పుట *—

క॥ పశుపాశపతిజ్ఞానము, విశదంబుగఁ బడసినాఁడ ♦ విధివలన మునుల్ !
విశయంబుదీఱ నాయెడ, పశుపై కడు నిష్ఠసేయ ♦ భావుక మమరున్. 80

గీ॥ అవని నజ్ఞానజన్యమై ♦ నట్టిదుఃఖ, మెల్ల జ్ఞానోదయంబున ♦ నింకిపోవు
నరయ వస్తుపరిచ్ఛేద ♦ మగును జ్ఞాన, మట్టివస్తువు త్రివిధమై♦యలరుమునులు!

గీ॥ అజడముజడంబువానిని♦యంతయనియు, పశువుపాశము పతియని♦పరగుమూఁడు
నక్షరంబు క్షరంబు క్ష♦రాక్షరపర, మనియు నవె చెప్పఁబడియె వి♦జ్ఞాళిచేత.

క॥ అరయుఁడు పశు వక్షరమగు, క్షరమగు పాశంబు తాప ♦ సతిలకులు క్షరా
క్షరపరమగు పతియన న, మ్మరుత్తు కిట్లనిరి మరల ♦ మౌనిశ్రేష్ఠుల్. 83

గీ॥ ఎద్దిక్షర? మక్షరంబిఁక ♦ నెద్ది?యీద్వ, యికిఁబరమమెద్ది? యనవతం♦డిట్టులనియె
ప్రకృతిక్షరముపురుషుఁడక్ష♦రంబు వానిఁ, బ్రేరణముసేయుబరముఁడు♦విశ్వవిభుఁడు.

వ. అనిన మునులిట్లనిరి.

గీ॥ ఏది ప్రకృతి యది పురుషుం♦డెవఁడు వీరి, కరయ నెద్దాన సంబంధ♦మమరునెవఁడు
ప్రేరకుండగునీశుండు♦ప్రియముతోడఁ, దెలియఁజెప్పుమనంగ న♦నిలుఁడునుడివె.

క॥ మాయయె ప్రకృతి వినుండ, మ్మాయావృతుఁడా పురుషుఁడు♦మలకర్మములన్
జేయంబడు సంబంధం, బాయీశుఁడు ప్రేరకుండు♦నగు శివుఁడు మునుల్ ! 86

వ. అనిన మునులిట్లనిరి.

గీ॥ మాయయనునది యెద్ది య♦మ్మాయచేత, నెట్టిరూపంబుతోడుత♦జుట్టఁబడియె
పురుషుఁ డామలమెట్టిది♦పరగెనెట్లు, శివుఁడెవఁడు చెప్పుమా! మాకు♦సేవ్యమూర్తి!

వ. నావుడు వాయుదేవుండిట్లనియె.

—* వాయుదేవుఁడు మునులకు మాయాస్వరూపంబుఁ జెప్పుట *—

గీ॥ మాయయన శివశక్తియ♦మ్మాయచేతఁ, జుట్టఁబడియెఁ జిదాత్మపుండు♦సొంతమైన
మలమెయాచ్ఛాదకంబయ్యె♦మఱివిశుద్ధుఁ, డాశివత్వాస్పదుండర♦యంగఁదగును.

వ. అనిన మునులిట్లడిగిరి.

గీ॥ వ్యాపియగువాని నెట్లుమా♦యయదియావ, రించు నెక్కారణముననా♦వృతిపురుషున
కేటికెంతకు నయ్యది ♦ యెట్లుపాయుఁ, గడగిచెప్పుము మాకు ని♦క్కముగ దేవ

వ. వాయుదేవుం డిట్లనియె.

గీ॥ వ్యాపిమైననుగలుగునా♦వరణమింకను, నెందునఁగలాదివ్యాపిమై♦యెసఁగుచుండు
కర్మమే హేతువగును భో♦గమునకైమ, లక్షయంబున నద్దితో♦లంగు వినుఁడు!

వ. మును లిట్లనిరి.

గీ॥ ఎదియఘఁగలాది?యక్కర్మ♦మేది? యేది, మొదలుగాఁగల? దెయ్యది♦తుదఁదనర్చు
నట్టి దిఁక దీనిఫలమేది?♦యాశ్రయ మెది?, యెందుకీభోగమాభోగ్య♦మేదొ చెపుము!

వ. మఱియు భోగసాధనంబెద్ది ? మలక్షయంబునకు హేతువేది? క్షీణమలుండగు
పురుషుం డెట్టులుండు నెఱుంగఁ జెప్పు మన్నఁ బవమానుం డిట్లనియె. 92

—* వాయుదేవుఁడు మునులకుఁ గలాదిపంచకంబు నెఱింగించుట *—

గీ॥ కలయు విద్యయు రాగంబు ♦ కాలమును ని
యతియు నను నైదు నవ్వి క ♦ లాదు లనుచు
ఖ్యాతిఁ జెందెఁ బురుషుఁడు భో ♦ క్తయన నెగడెఁ
గర్మమనఁ బుణ్యపాపాత్మ ♦ కం బరయుఁడు. 93

గీ॥ అదియనాది నిజమలభో♦గాంతమైత, నర్చు సుఖదుఃఖఫలక మ♦జ్ఞాన వేష్టి
తాత్మసంశ్రయమింక భోగ♦మగునుగర్మ, నాశమునకయి తెలియుఁడు♦జ్ఞానధనులు!

వ. భోగ మవ్యక్తంబు బాహ్యాంతఃకరణద్వారంబగు. శరీరంబే భోగసాధనంబు.
భవానీశయలభ్యంబగు ప్రసాదంబుచే మలక్షయంబగు క్షీణమలుండగు పురు
షుండు శివసముండనిన మును లిట్లనిరి. 95

ఆ॥ అక్కలాదులైన ♦ నైదుతత్త్వముల ప్ర, త్యేక మొప్పుకర్మ ♦ మెద్దియాత్మ
పురుషుఁడనుచు నిఁకను♦భోక్తయనుచును నె, ద్దాన నేర్పడును స♦దాచరిష్ణు!

వ. అవ్యక్తంబే స్వరూపంబుగ నుండు. ఎట్టియాకారంబుచేఁ గర్మఫల మనుభవింపం గలండు, మఱి యిఁక శరీరంబనిన నెట్టిది యనినఁ బ్రభంజనుం డిట్లనియె.

గీ॥ దృక్క్రియావ్యంజకములు వి♦ద్దియుఁ గలయును
రాగము ప్రవర్తకమయి ప♦రగెడుఁ గాల
మగు నవచ్ఛేదకంబు ని♦యతి నియామి
క యగు నరయుఁడు మౌనిప్ర ♦ కాండులార! 98

వ. ఇఁకఁ గారణంబగు నవ్యక్తంబు, త్రిగుణజనకం బిద్దానినే తత్త్వశాస్త్రవేత్తలు ప్రధానంబనియుఁ బ్రకృతియనియుఁ జెప్పుదురు. మఱియు నీయది యనభివ్యక్తరూపం బైనను గాలవశంబున నభివ్యక్తంబగు. ఇఁక సుఖదుఃఖవిమోహాత్మంబు సత్త్వరజస్తమోగుణంబులచేఁ ద్రివిధంబుగఁ గర్మఫలంబు ననుభవించును. 99

—* వాయుదేవుఁడు మునులకు గుణత్రయస్వరూపంబుఁ జెప్పుట *—

గీ॥ సత్త్వము రజంబుఁ దమమునాఁ ♦ జను గుణత్ర
యము ప్రకృతిసంభవంబయి ♦ యలరు నిదియుఁ
బ్రకృతియందున సూక్ష్మరూ♦పమున నుండుఁ
దిలలయందెట్టు తైలంబు ♦ వెలసియుండు. 100

గీ॥ సుకము సుఖహేతు లిలను సా♦త్త్వికముగాఁగఁ
సాత్త్విక విరుద్ధమంత రా♦జసముగాఁగ
స్తంభమును మోహమును దామ♦సంబుగావ
చింతురల తద్జ్ఞులరయుఁడు♦శిష్టమునులు. 101

వ. సాత్త్వికి యూర్ధ్వగతియుగను దామసి యధోగతియుఁగను రాజసి మధ్యమగతి 102
గను జెప్పఁబడుచున్నవి.

గీ॥ వినుఁడు శబ్దాదులైదును ♦ బృథ్వి మొదలు
గాఁగఁదగు నైదుభూతముల్ ♦ గరిమ మెఱయు
జ్ఞానకర్మేంద్రియములు మ♦నంబు బుద్ధ్య
హంకృతులును బ్రధాన మ♦వ్యక్తమగును. 103

వ. మఱియు నది కారణదశాపన్నంబై యవ్యక్తంబనియును గార్యదశాపన్నంబై 104
ఘటాదివలె వ్యక్తమై శరీరాది యగును.

గీ॥ ఘటము మున్నగు కార్యంబు♦గడఁగి మృత్తు, మున్నగాఁగలయవ్యాని♦కన్న భిన్న
మెపుడుగానట్లువ్యక్తమౌ♦నీశరీర, మల్లయవ్యక్తమునకు న♦న్యంబుగాదు. 105

వ. అందువలన నవ్యక్తమునే ముఖ్యకారణంబుగఁ దెలియుఁడు. ఇఁక నాయవ్యక్తమే యాధారంబుగాఁగల శరీరంబు భోగసాధనం బనిన మునులు బుద్ధీంద్రియ శరీరం

బులకన్న భిన్నమైన యాత్మ మెద్ది ? అయ్యది యట్టులుండుకుట హేతు వెద్ది యనిన
వాయుభట్టారకుం డిట్లనియె. 106

—*వాయుదేవుఁడు మునుల కాత్మస్వరూపంబును జెప్పుట*—

గీ॥ వినుఁడు బుద్ధీంద్రియశరీర ♦ భిన్నమయి వి
భువునయి ధ్రువంబగుచు నాత్మ ♦ పొలుచు నొకడు
అందు హేతువు దుర్విభా♦వ్యముగఁ దెలియుఁ
డాత్మము సకలాంతర్యామి ♦ యనును శ్రుతులు. 107

వ. బుద్ధీంద్రియ శరీరంబుల కాత్మత్వంబును విచక్షణులంగీకరింపరు. 108

గీ॥ సర్వమాత్మంబున వసించు♦సర్వమందు, శాశ్వతంబయి యాత్మంబు♦చక్కనుండు
అరయఁగానెట్టి వారల♦కైన నెందు, వ్యక్తమైచూడఁబడదద్ది♦పరమమునులు!

క॥ కనుపడదది నేత్రములకుఁ, గనుపడదది యిఁకను నన్య♦కరణములకునున్
మనమయ్యది శుద్ధంబై, తనరిన నెఱుఁగఁబడు దాన♦తజ్ఞులకెపుడున్. 110

క॥ కాదది స్త్రీయున్ బురుషుఁడు, గాదు నపుంసకము గాదు♦కర మూర్ధ్వమునన్
లేదిఁక నెక్కుడుకిందన్, లేదంతరభాగమందు ♦ లేదు మునీంద్రుల్! 111

గీ॥ ఆరయ శరీరముల నశ♦రీరమగుచుఁ, జలములందును నెల్లెడ♦స్థాణువగుచు
సురుఁగ కున్నట్టియాత్మను♦జూచు నెపుడు, ధీరుఁడై ననరుఁడు జ్ఞాన♦దీప్తిచేత.

క॥ పలుమాటలేల? వినుఁడీ!, యలపురుషుఁడు దేహభిన్నుఁ ♦ డని తెలియుం డ
ట్టులగాక దేహమేయని, తెలిసినవాఁ డెపుడు నిజము ♦ తెలియనివాఁడౌ. 113

గీ॥ ఆపదలకెల్లబీజమై♦యమరు దేహ, మునఁబురుషుఁడు స్వకృతకర్మ♦మునవిమూఢుఁ
డగుచు సుఖియునుదుఃఖియు♦నగుచునుండు, మౌనులార! మహాతపో♦భానులార!

క॥ నీటఁ దడుపంబడిన భువి, నీటుగ మొలకెత్తఁజేయఁ♦నేర్చునొ యిటులన్
గాటమగు నజ్ఞతాపరి, పాటిన్, గర్మంబు దేహ♦వర్గముఁ గూర్చున్! 115

గీ॥ మిగుల వగనిచ్చునట్టియుఁ♦దెగులు కెవ్వా, డాటపట్టయినట్టియు♦నంతకునికిఁ
జేర్చునట్టియుమునుఁగడ♦చినవిగడవఁ, దగుతనువులాత్మకమరు సం♦తతము వినుఁడు!

వ. శరీరంబులు జీర్ణంబులగుచుండ రానురా నీయాత్మ కెచ్చటనెద్దాన వసతియు
లభింపబడదు. 117

గీ॥ ఆత్మమిది పెక్కుతనువుల♦నావరింపఁ, బడుచువిడువబడుచునుండుఁ♦బరఁగ నెపుడు
చంద్రమండల మెట్లాక♦సంబునందుఁ, దరళధారాధరావళిఁ♦దగిలియుండు. 118

గీ॥ వీనికై యొకఁడుండడు♦ వీఁడొకనికి, నై వసింపఁడు బందుగు ♦ లాత్మసుతులు
బాటయందుగలియుదురు♦పథికులట్లు, వృథగ మోహంబుఁగాంతురు♦విత్తములను.

సీ॥ కదళియం దెన్ని కల్లులు♦గలిసి మెలసి
యంత నొకపరి యెడఁబాయు ♦ నట్లెయవని
భూతములుగూడు నెడఁబాయుఁ ♦ బొందుమాలి
యెఱుఁగుఁ డిట్టులు బ్రహ్మము ♦ నీంద్రులార! 120

గీ॥ అతఁడుసూచు శరీరంబు ♦ నవిరతంబు, నాతనిఁ జూడదు శరీర♦మాతనిఁ శ
రీరమును బరికించును ♦ దారుఁ డీశుఁ, డాయిరువురీశుఁగనఁజాల ♦ రరయుఁడీరు.

గీ॥ బ్రహ్మదేవుఁడు మొదలుస్థా♦వరమువఱకు,బశువులుగఁగీర్తితంబులై♦పరఁగుచుండు
రిట్టి పశువులకెల్లను ♦ నిది నిదర్శ, నంబుగాఁజెప్పఁబడియె ని♦క్కం బరయుఁడు.

గీ॥ అట్టిపశువు దురధిగమ్యుఁ♦డై నయీశు, లీలలకుసాధనంబుగాఁ♦గ్రాలి పాశ
బద్ధుఁడై సుఖదుఃముల్ ♦పడసికుడుచు, చుండు నెఱుఁగుఁడు తాపసో♦త్తంసులార!

వ. మఱియు

గీ॥ అజ్ఞుఁడై సుఖదుఃఖంబు ♦ లందుఁదాఁబ్రి, వేశ నిర్గమములమెద♦విభుఁడుగాక
యుండు నీతండువిభుచోది♦తుండయి త్రిది,వమ్మునఁగాని చెందుశ్వ♦భ్రమ్ముగాని.

గీ॥ అనిన మునులిట్టులనిరిమ♦హానుభావ!,యెవ్వఁడాపశు వాపాశ♦మెద్ది వీని
కిఁ విలక్షణుఁడెవ్వఁడో♦గి నుభయులకు, విభుఁడెవండొకఁడెఱిఁగింపు♦విజ్ఞవర్య!

వ: అనిన వాయుదేవుం డిట్లనియె,

—* వాయుదేవుఁడు మునుల కీశ్వరవిషయంబును జెప్పుట *—

గీ॥ అపరిమితరమణీయగు♦ణాశ్రియుండు, పశువునకుఁ బాశముకువేఱు♦పరఁగువాఁడు
విశ్వనిర్మాతమైకడు♦వెలయువాఁడు, కలడు పతియొక్కరుఁడుబ్రహ్మ♦కల్పులార!

గీ॥ అతఁడు లేకున్న సర్గమె♦ట్లమరుఁగనుఁడు, అజ్ఞుఁడగుపశువున జడం♦బై తనర్చు
పాశరూపప్రకృతిచేతఁ ♦ బరఁగునొక్కొ, బుద్ధిమత్కారణము లేక♦భూతసృష్టి.

వ. జగంబు కర్తృసాపేక్షంబును గార్యంబును సావయవంబునగుటఁ దత్కర్తృ
త్వంబు పశుపాశంబులకు సంభవింప దొక్కింతకర్తృత్వంబు పశువునకుఁబతిప్రేరణ
పూర్వంబై యంధునకూతకట్టనుబోలి యొదవినను నద్దియథార్థజ్ఞానకారణంబుగా
దిఁక నీపశుపాశపతులయొక్క సత్యంబైన యంతరంబెఱిఁగినవాఁడు బ్రహ్మవేత్త 128
యై ముక్తుండగును.

గీ॥ ఒకఁడుప్రేరిత తానుమ♦ఱొక్కఁడనియుఁ,బ్రేరకుఁడెసర్వమునకు నా♦ధారమనియు
నెవఁడెఱిఁగికొల్చునో యట్టి♦యుభ్యజనుఁడు, అమృతపదవికిఁజెందుట♦కర్హుఁడగును.

గీ॥ భోక్తయొకఁడని వేఱొండు ♦ భోజ్యమనియు
ప్రేరయిత యొకఁడని యిట్లు ♦ ద్వివిధముగను
దెలియుఁడిఁక నన్యమేదియుఁ ♦ దెలియఁదగిన
దించుకయు లేదు దివ్యము ♦ నీంద్రులార! 130

గీ॥ తిలలయందున నూనె ద♦ధిఁ ఘృతంబు, నదిని నీళుల నరణి న♦నలముఁబోల్కి
జగమున నెసంగు నొక్కఁడీ♦శ్వరుఁడు విభుఁడు, చూతురవ్వానిఁ దపసున♦సూనృతమున.

గీ॥ జాలవంతుండు నొక్కఁడీ ♦ శానుఁడాత్మ, శక్తిబృందంబుచేత నీ ♦ జగములెల్ల
సృష్టిచేసి ప్రభుత్వంబు ♦ చేయు నెప్డు, డతఁడు రుద్రుండు లేఁడిఁక♦నన్యుఁడెటను.

గీ॥ విశ్వతశ్చక్షుఁడింకను♦విశ్వతోము, ఖుండునున్ విశ్వతఃపరి♦వేష్టుండు విశ్వ
తోంఘ్రికుండును నగు మహా♦త్ముండొకండు, పుడమిదివి నెల్ల సురలను♦బొడమఁజేసె.

గీ॥ అరసి విశ్వాధికుండు మ♦హర్షియైన, రుద్రుఁడాది హిరణ్యగ♦ర్భుని జనింపఁ
జేసె నాతనికన్నను♦శ్రేష్ఠుఁడును గ, నీయుఁడును లేఁడు తన్మయం♦బీ యఖిలము.

గీ॥ సర్వభూత రూపంబుల ♦ సంతరించి, పేరులను బెట్టి పిలుచునే ♦ ధీరుఁడట్టి
పురుషు నాదిత్యవర్ణుఁ ద♦మోబహిర్గ, తుని దెలిసికొంటి నేను స♦న్మునితిలకులు.

ఉ॥ ధాతయుఁ బద్మలోచనుఁడు ♦ దారవిదగ్రణి శక్రుఁ డన్యది
జ్ఞేతలు నెవ్వనిన్ గుఱిచి ♦ నేర్పుమెయిన్ గమనించి ప్రస్తుతి
వ్రాతముతో భజింతురు ప♦రాత్పరు నాహరునాదిదేవు మా
ర్గేతర మెందు లేదిటుల ♦ నెఱ్గినవాఁ డమృతుండగున్ మునుల్! 136

క॥ లేదితనికన్నఁ బరమది, లేదపరంబితనికన్న ♦ లేదల్పంబున్
లేదురువైనది యొకటియు, నాదివిభునిచేతఁ బూర్ణ ♦ మఖిలజగమునున్. 137

క॥ ద్రుమానువలె నిశ్చలుండై, జానుగ నొక్కరుఁడు గడఁగి ♦ చదలున నుండున్
బూనిక జగములసలుపఁగఁ, బూనినమాత్రమునఁ బొడము♦భువనములెల్లన్.

ఉ॥ ఎల్లెడ నొప్పు నెమ్మొగము ♦ లెల్లెడ నొప్పు శిరస్సు లింకఁదా
మెల్లెడ నొప్పు కంధరలు ♦ నెల్లెడ నొప్పు కరాంఘ్రులట్టులే
యెల్లెడ నొప్పు వీనులును ♦ నెల్లెడ నొప్పెడు నీక్షణంబులున్
గొల్లగ నొప్పి సర్వజన ♦ కోశములందు శివుండు వెల్గెడున్. 139

గీ॥ కనులు లేకున్నఁ గాంచు లో♦కముల నెల్ల, వీనులును లేక యున్నఁదా ♦ వినునఖిలము
సర్వమును నారయు నతండు ♦ సర్వమతని, నారయఁగ లేదు వినుఁడిఁక♦ధీరులార!

గీ॥ అణువున కణీయుఁడయ్యు మ♦హత్తునకు మ
హీయుఁడును నైన నవ్యయుం♦డితఁడు ప్రాణి
హృదయ గుహనుండు నిఁక జనుం♦డితని సుప్ర
సాదమున నీతనిన్ జూచు ♦ ఖేద మెడసి. 141

చ॥ అజయును నేక లోహితయు ♦ నస్జనకృష్ణయుఁ జాలనెక్కుడౌ
ప్రజఁ బ్రసవింపుదానిని వి♦భాస్వర నాత్మసమానరూపఁదా
నజుఁడొకఁడొంది సౌఖ్యముఁ ద ♦ దన్యముఁ జెందుచునుండు వేఱొకం
డజుఁడిక దానిదవ్వులనె ♦ యారసిపాయును భుక్తభోగనున్. 142

గీ॥ పక్షులిలరెండుసమముగు ♦ వృక్షమొండి,కూడుకొనియుండునొకఁడందుఁ ♦ గూర్మితోడ
స్వాదువగుపిప్పలంబు న♦శనమొనర్చు, ననశనుండయి వేఱొకం♦డఖిలమరయు!

క॥ మాయనుగాఁ బ్రకృతిని నిఁక, మాయినిగాఁగను మహేశు♦మఱిమెల్ల జగం
బాయనఘుని యవయవభూ,తాయతతతమని యెఱుగుఁ♦డాత్మములందున్. 144

గీ॥ సూక్ష్మమునకన్నమిక్కిలి♦సూక్ష్మమగుచు.సలిలమధ్యంబునందువి♦శ్వంబుసృష్టి
చేసియువ్విశ్వమునుజుట్టి♦ వెలఁగుశివుని, బహువిధాకారునెఱిఁగి తా ♦ పంబువిడుఁడు

గీ॥ ఈతఁడే పరదైవతం ♦ బీతఁడే మ,హేశ్వరుఁడు విశ్వకర్మ యి ♦ ట్లితని నొకని
జన్మభీతులజాతుగాఁ♦జక్క దెలిసి, రుద్రుదక్షిణముఖముఁ జే♦రుదురు నిష్ఠ. 146

గీ॥ ఈశ్వరులలోన నెవఁడు మ♦హేశ్వరుండు,దైవతములందును బరమ♦దైవమెవఁడు
పతులలోపల నెవ్వఁడు ♦ పరమపతియు, భువనవిభుని నెఱుంగుఁడా♦భూతనాథు.

క॥ అతఁడే కాలము రక్షకుఁ, డతఁడే విశ్వమునకెల్ల ♦ నధిపతియగువాఁ
డతని నెఱింగినయట్టిఁడు, వెతనొందఁడు మృత్యుపాశ ♦ వేధఁగనఁడికన్. 148

గీ॥ అరయబంగారుమృల్లిప్త♦మైమలినము, గాఁగనంబడియును నగ్గిఁ♦గాచఁబడి య
ఖండతేజోమయంబుగాఁ♦గానుపట్టు, నాత్మగనుపట్టుఁ జిమ్ముక్తి ♦ నల్లైమునులు!

క॥ కొందఱు స్వభావమనియున్, గొందఱు కాలంబనుచును ♦ గొణుగుదురదియొ
ప్పొందెడు శివుమహిమమె యీ, చందము భ్రమమొందఁ జేయు♦సర్వజనములన్.

గీ॥ ఎవఁడు కాలాత్మ యుతములై ♦ యొసఁగు సర్వ
కారణముల నొకఁడు శక్తి ♦ కలితుఁడగుచు
నప్రమేయుఁ డధిష్ఠించు ♦ నతని దెలిసి
పాశములఁ బాపికొనుఁడు ము♦నీశులార! 151

గీ॥ కారణంబులకెల్లను♦గారణమయి, సర్వభూతాంతరాత్మమై♦సాక్షియై వ
శియునునై యాత్మయందుండు♦సేవ్యునెవ్వ, రెఱుఁగఁజాలుదురో వారి♦కేసుఖంబు.

గీ॥ ఆకసంబును జర్మంబు♦నట్టు లెపుడు, చుట్ట సాధ్యంబుగానట్టు♦లెట్టివారు
పరమశివతత్త్వమెఱుఁగక♦పాయలేరు, దుఃఖములనెందు నేని య♦తులచరితులు!

గీ॥ బ్రహ్మముఖమున నాచేతఁ♦బడయఁబడిన, పావనాశనమైన యీ♦పరమగువ్యా
మిట్లు మీకెఱిఁగించితి♦నిపుడుమీరు, శమములేనట్టివాని కొ♦సంగఁదగదు. 154

వ. అనినంత మునులిట్లనిరి.

—* మునులు వాయుదేవునిఁ గాలస్వరూపంబుఁ జెప్పుమనియడుగుట *—

క॥ కాలమునఁ బొడము సకలము, కాలమున విపత్తిఁ జెందు ♦ గంధవహా! య
క్కాలంబు నపేక్షింపని, దేలాటిది సుంతయెచట ♦ నెసఁగదు గాదే. 155

వ. మఱియును.

క॥ కాలాంతర్గతమై జగ, మోలిగ సర్గంబు లయము ♦ నొందుచు మిగులన్
మేలగు చక్రింబట్టులఁ, జాలఁగఁ బరివర్తనంబు ♦ సల్పుచునుండున్. 156

గీ॥ ద్రుహిణుఁడును గేశవుం డురు ♦ ద్రుండు లాఁతి, నిర్జరులు కాలకృతమగు ♦ నియతిఁ జెంది
దాఁటఁగా వలఁతులుగారు ♦ తథ్యమిద్ది, కాలమే సర్వమున కధి ♦ కారియేమొ! 157

గీ॥ అట్టి యీ కాలమెట్టిది ♦ యెట్టివాని, కిద్ది వశవర్తిగా నుండు ♦ నెవఁడు దీని
వశుఁడుగాకుండుఁ జెప్పుము ♦ వాయుదేవ!, సర్వమును దెలిసినయట్టి ♦ జాణవనుఁడు.

వ. వాయుదేవుం డిట్లనియెఁ గలాకాష్ఠానిమేషాదికలాఘటితంబగు కాలంబనునది
యుత్కృష్టంబగు మహేశ్వర తేజంబు' 159

గీ॥ వినుఁడు సర్వచరాచర ♦ విశ్వమున క, లంఘ్యమైనట్టిదియును బ ♦ లమయినట్టి
దియు శివాజ్ఞాస్వరూపమై ♦ తేజరిల్లు, నద్ది విశ్వనియామకం ♦ బై తనర్చు. 160

క॥ అక్కతనఁ గాలవశమగుఁ, జక్కఁగ జగమది జగతికి ♦ స్వాధీనముగా
దక్కాలము శివవశమగుఁ, నక్కాలవశత్వమొందఁ ♦ డాశివుఁ డెపుడున్. 161

గీ॥ అడ్డులేకయెసఁగు శార్వ ♦ మైన తేజ, మెలమిఁ గాలంబునన్ నెల ♦ కొలుపఁబడియె
నట్టికాలంబు నెవఁడు ప్ర ♦ జ్ఞాతిశయము, చేత మీఱఁగఁ జాలెడు ♦ క్షితితలమున.

క॥ ఏకచ్ఛత్రింబుగ నీ, లోకంబును నెల్ల నేలు ♦ లోకోత్తరుఁడున్
వీఁకన్ దాఁటఁగఁ జాలం, డీకాలముఁ గడలిదాఁటు ♦ నెట్టుల వేలన్ ? 163

గీ॥ ఎవ్వరింద్రియముల నిగ ♦ హించి సకల, మీజగంబును గడిమి జ ♦ యించియున్న
వారలేని జయింపఁగ ♦ లేరు కాల, మునునిఁకన్ గాలము జయించుఁ ♦ బూని వారి.

గీ॥ శీలమున రూపమున బల ♦ శ్రీలఁ గులము, చేతఁ జేతనుఁ డేదేనిఁ ♦ జింత సేయుఁ
గాలమిఁక నన్యమాపని ♦ గడఁగి సేయుఁ, గాలము దురతిక్రమ మెందుఁ ♦ గనుఁడు మునులు.

గీ॥ యువయు ముదుసలియగు బలీ ♦ యుఁడును గరము
దుర్బలుండగు భాగ్యవం ♦ తుఁడును పేద
యగును గాలవిపర్యయం ♦ బైనఁ జిత్ర
మగుఁ దదీయప్రసక్తి సం ♦ యమితిలకులు ! 166

గీ॥ ఆభిజాత్యంబు బలము శీ ♦ లాభిపత్తి, నైపుణియుఁ గాల్యనిర్వాహ ♦ ణక్షమములు
గావు కాలము ప్రతిబంధ ♦ కముగనున్న, నారయుండెద నిద్ది మ ♦ హర్షులార! 167

క॥ వినుఁడు రసాయనములునుఁ, ఘనమగు నౌషధములును న♦కాలంబున సి
ద్ధినిఁ గూర్పవు కాలంబది, యనుకూలించిన ఫలంబు ♦ నందఁగఁ జేయున్. 168

గీ॥ ఇంక నకాలంబునను నెవ్వఁ♦డేని సురుగఁ, డెవ్వఁడేనియు జనియింపఁ♦ డెవ్వఁడేని
పుష్టినొందఁడు సుకమును♦ బొగులుటయును, కాలమునుబట్టి కలుగు ని♦క్కంబు వినుఁడు.

గీ॥ కాలమున వీచుఁ జల్లనై ♦ గాడ్పు పుడమిఁ, గాలమున వృష్టి చేయు మే♦ఘములు గములు
కాలమున నెల్ల సస్యముల్ ♦ గమియఁ బండుఁ, గాలమున సర్వజీవలో♦కంబు మనెడు.

## —* కా ల ప రి మా ణ ము లు *—

వ. కావున నిట్లు కాలాత్మంబు తత్త్వంబు నిజంబుగ నెవండెఱుంగునో యవ్వాఁడు కాలాత్మంబు నతిక్రమించి కాలాతీతంబగు పరమాత్మంబును బరికించు ననిన సూతునకు మునులు మహాత్మా! యీకాలంబునం దెట్టి మానంబున నాయుస్సంఖ్య కల్పింపఁబడినదో సంఖ్యారూపంబగు నిక్కాలంబునకుఁ బరమావధి యెద్దియో యెఱింగింపు మనుడు మునులకు సూతుండిట్లనియె. కనుఱెప్పపాటగు కాలంబు నిమేషంబని కీర్తింపఁబడును. అయ్యది యాఖ్యమానం బట్టి నిమేషంబులు పదియైదైన నొక కాష్ఠయగును. అట్టి కాష్ఠలు ముప్పదియైనఁ గలయనఁబడును. అవి ముప్పదియైన నొక ముహూర్తం బవ్వి ముప్పదియైన నొక యహోరాత్రంబగును. ముప్పది యహోరాత్రింబులైన సితాసితపక్షద్వయాత్మకంబగు నొక మాసంబగును. అద్ది పితృదేవతల కొక్క యహోరాత్రము. మాసంబు లాఱైన నొక్క యయనంబగు నివ్వి రెండైన సంవత్సరమగును. ఈయది దేవతలకొక్క యహోరాత్రము. అందు దక్షిణాయనంబు రాత్రియును నుత్తరాయణంబు దినంబునగును. ఇట్టివి ముప్పది యహోరాత్రంబులైన మనుష్యమాసంబువలెనే దేవమాసంబగును. ఆ దేవమాసంబులు పదిరెండైన దివ్యవత్సరంబగు నివ్విధంబున మూడువందలయఱువది మనుష్యసంవత్సరంబులైన నొక్క దేవవత్సరంబగును. దివ్యసంవత్సరప్రమాణంబుచేతనే యుగసంఖ్య ప్రవర్తిల్లుచున్నది. ఈ భారతవర్షంబునఁ గృత త్రేతా ద్వాపర కలియుగంబులను నాల్గుయుగంబులు పండితులు పరిగణించిరి. అందుఁ గృతయుగంబున నాల్గువేల వత్సరంబులును నెన్మిదివందలేండ్లు సంధ్యాతదంశంబుగను దక్కిన మూడుయుగంబులందు నేకాపాయంబుగ సహస్రశతంబులు పరఁగుననుటచేఁ ద్రేతాయుగంబందు మూఁడు వేల వత్సరంబులును సంధ్యాతదంశంబు లాఱునూఱులును ద్వాపరంబున రెండు వేల వత్సరంబులును సంధ్యాతదంశంబులు నాల్గునూఱులును గలియుగంబున వేయి వత్సరంబులును సంధ్యాతదంశంబు లిన్నూఱేండ్లు నగును. ఇట్లు నాల్గు యుగంబులు పదిరెండువేలసంవత్సరంబులగు నీచతుర్యుగసహస్రంబు కల్పంబనఁ బడును మఱియు డెబ్బదియొక్క చతుర్యుగంబు లొక మన్వంతరంబగును. కల్పం

బందుఁ బదునాల్గు మన్వంతరంబులు పరివర్తనంబు సేయును. ఈ క్రమముచేతఁ
గల్ప మన్వంతరంబు లనేకంబులు గడిచినవి. అవ్వియందఱుఁ దెలియని వాటను
లెక్కించుటకు శక్యంబుగాని వాటను వానినానుపూర్విగఁ జెప్పుటకు శక్యముకాదు.

గీ॥ ఇఁకను గల్పంబనునది ద్రుహిణున కొక్క, పగలగు నదే విధంబు విభావరియును
గల్పయుగ్మంబు దినమిట్లు కంజజునకు, నవి సహస్రంబయిన నబ్దమగు నతనికి.

గీ॥ అందజుని పగలు నసృష్టి యగును రాత్రి, యందుఁ బ్రళయంబానరు నహోరంతమందుఁ
బ్రజలు తత్పతులును దేవ రాక్షసులును, భూతపంచకతన్మాత్రములును బొలియు.

గీ॥ అటులె రాత్ర్యంతమందు సురాసురులఁ బ్రజాపతులనుఁ బ్రజల భూతసమితి దైవ
తములతో సృష్టి చేయు నెంతయును ధాత, శంకరుని యాజ్ఞ చేత నిచ్చలును మునులు!

వ. ఇట్లు బ్రహ్మయొక్క సంవత్సరంబు లేఁబదియైన నొకపరార్థంబనియుఁ దక్కిన
యేఁబది మఱొకపరార్థంబనియు ననఁబడును. మొత్తం బీబ్రహ్మవత్సరంబులు
శతంబైన బ్రహ్మయుర్దాయంబు నిండు. అపుడు శంకరుని మాయయందు సకల
లోకంబులుడిందు. ఇంకను బెద్దకాలంబునకుఁ దారతమ్యప్రకారంబుగ విష్ణు
రుద్రేశ్వరుల కాయుర్దాయంబమరు. అటుపైన సదాశివునకు లోఁబడి కాలంబు
ప్రవర్తించు ననాదినిధనుండగు సదాశివుండొకండు పునస్సర్గంబు వఱకు నిండారు
తమంబునడుమ ప్రకాశమాత్రుండై వెలయు నిద్దికాలతత్త్వస్వరూపంబిట్లు చెప్పితి
నిఁకేమి విననెంతురనిన వాయుదేవునకు మునులు మహాత్మా! పరమేశ్వరుండెట్లు
జగంబు రచించి క్రీడనొనర్చుచుండునో మొదట నెయ్యది జనించినదో దేనిచే
జగము వ్యాప్తంబైనదో పృథుకుక్షియగు నెద్దానజగంబు గ్రసింపఁబడునో యెఱిం
గింపుమనిన వాయుభట్టారకుం డిట్లనియె.

—* వాయుదేవుఁడు మునులకు సృష్టిలయప్రకారంబులఁ జెప్పుట *—

గీ॥ శాంత్యతీతపదోత్తర శక్తిశక్తి, మంతుఁడగు శివువలన సంభవము చెందె
దానమాయ జనించె నద్దాన వెడలెఁ, బరమ మవ్యక్తమది యెవిశ్వజనకంబు.

వ. మఱియు,

గీ॥ శాంత్యతీతపదముచేత శాంతిపదము, దాన విద్యాపదమ్ము నద్దాని చేత
నా ప్రతిష్ఠాపదంబును నలరె దానఁ, దనరెను నివృత్తియనెడు పదంబు మునులు!

వ. ఈ పంచకముచే నవ్యక్తకారణంబగు నీవిశ్వంబు వ్యాప్తంబై యాత్మాధిష్ఠితంబై
యెసంగు నిఁక నీకలలయొక్క యానులోమ్యంబున సృష్టియును బ్రాతిలోమ్యంబున
సంహృతియును బ్రవర్తించు మఱియు నిఁక విశ్వకర్తృత్వం బవ్యక్తంబున కావ

చారికంబుగఁజెప్పఁబడినదికానియథార్థంబుకాదు.ప్రధానపరమాణ్వాదులెల్లనచేత
నంబులు. 178

గీ॥ అట్లచేతనమగుటచే • నాప్రకృతికి, సజ్ఞుడైన కతమ్మున • నాపురుషున
కీ జగత్కర్తృతఘటిల్ల • దిద్దియెట్లు, బుద్ధి మత్కారణము లేక • పొసఁగు మునులు!

వ. జగంబు కర్తృసాపేక్షంబును గార్యంబును సావయవంబునగుట వద్దానికి 180

గీ॥ సర్వశక్తిసంపన్నుండు • సర్వవేత్త, శక్తుఁడు స్వతంత్రుఁడును మహై • శ్వర్యయుతుఁడు
ఆదిమధ్యాంతరహితుఁడ • నన్యకల్పుఁ, డీశ్వరుఁడు కర్త యదియుఁడ • దిచ్ఛఁబొదలు.

వ. మఱియు బ్రహ్మయొక్క నూఱుసంవత్సరముల కాలముతో నొప్పు బరంబనెడు
పేరుగల బ్రహ్మాయుర్దాయమ్మెప్పుడు ముగియునో యప్పటివఱకీ పొడమిన జగంబు
వృద్ధిపొందుచు నప్పుడు ప్రలయంబు నొందును. ఈ పరంబునందలి సగము పరా
ర్థంబని చెప్పఁబడును. పరార్థద్వయకాలాంతంబగు సర్వప్రలయంబు చేకూరినపుడు

గీ॥ ఆత్మకార్యంబయితగున • వ్యక్తమును గ్రహించియాత్మము వెలయఁగా • నెల్లవికృతు
లింకును దేకముందక్కు • యేర్పడుదురు, ప్రకృతిపురుషులోతప్రోత • భావయుతులు.

వ. అపుడు సర్వము మహాకాలుండగు నీశ్వరునియందె లయించు నంత. 184

గీ॥ శాంతవాత్రైకనీరమై • సమగుణంబు, నైన యవిభాగవుఁ దమోద • యంబునందు
నెట్టిజగమును గనుపట్ట • దట్టియప్పు, డేకముగనుండుఁ దానమ్మ • హేశ్వరుండు.

గీ॥ ఇట్టి మాహేశ్వరియగు నా • గట్టిరజని, నెల్లఁగడపి యుపన్నవ • నీశ్వరుండు
పొరిఁ బ్రధానపురుషులని • ర్వ్వరను జెంది, మాయతో క్షోభపఱచున • ముకుజగములు.

వ. ఇట్లు పరమేశ్వరాజ్ఞచే నవ్యక్తంబునుండి జగత్సృష్టి యేర్పడు నియ్యాది సృష్టి
ప్రకారంబెఱిఁగించితి నికేమి వినుమరనిన మునులు దేవా! సృష్టిస్థితి సంహారం
బంతయు నీశ్వరవశంబై యున్నట్లును బ్రహ్మవిష్ణులకా మహేశ్వరుండు కారణం
బైనట్లు నీ నుడులఁ దెలియఁబడె నిఁక లోకంబున రుద్రుండు బ్రహ్మపుత్రుండని
యొకవచనంబుఁ జెప్పుదు రద్దియెట్లుపపన్నంబగు నీవాదద్వయంబందు సత్యంబే
దియో యెఱిఁగింపుమనుడు గంధవాహుండిట్లనియె. 187

ఉ॥ మూఁగురు కారణాత్ములు స • మున్నతులా పరమేశ్వరాత్మజుల్
యోగధనుల్ విరించిహరి • సోములు శాంభవశాసనంబునన్
బాగుగ విశ్వసర్గపరి • పాలనసంహృతులన్ బొనర్చుచున్
లోఁగఁగఁజేయ నొండొరుల • లోనఁదలంచి కడున్ జవంబునన్. 188

గీ॥ తండ్రియగు పరమేశు ను • దారతపము, చేత మెప్పించి శక్తులఁ • జెందిరంత
రుద్రుఁడొక కల్పమందు స • రోజభవుని, విష్ణునిన్ సృష్టిచేసె బ • ల్మ్యేకదనర. 189

సీ॥ అట్లె వేతలోకకల్పమం ♦ దజుఁడు విష్ణు,రుద్రులను సృష్టిచేసెబల్ ♦ రుచిరతనుల
మఱొకకల్పమునందున ♦ మ్మాధవుండు, బ్రహ్మరుద్రులసృష్టించెఁ ♦ బ్రౌఢమతుల.

వ. ఇట్లుత్రిమూర్తులనేకప్రకారంబులఁబరస్పరజయేచ్ఛులై కల్పకల్పంబందుఁ బరస్పరము సృష్టి చేయుచుందు రొక్కొక కల్పంబునం దొక్కొక రధికులై యుండుట ఆయాకల్ప వృత్తాంతంబు ననుసరించి యవ్వారి యాధిక్యంబు మహర్షులచేఁ జెప్పఁబడియె. 191

చ॥ నళినజవిష్ణు రుద్రసుర ♦ నాథులు పుట్టుక లొందుచుందురా
యలఘులు సర్వకారణము ♦ లౌటకుఁ జాలరు కారణంబులన్
సలిపెడువాఁడు కారణ వి♦చారణసల్పెడు కారణాత్ముఁడా
విలసితవైభవుండు విను ♦ వీధి నుపాస్యుఁడు శంభుఁ డొక్కఁడే. 192

వ. ఈ మువ్వురకుఁ బరమేశ్వరుండు కారణం బాతండే జగత్కారకుఁడని యెఱుంగుఁడనిన మునులు మహాత్మా! మున్ను శివుండు మృత్యువును సంహరించి మరల నుత్పాదించినట్లు వినియుంటి మదియెట్టు లెఱుంగఁజెప్పు మనిన వాయు భట్టారకుం డిట్లనియె, 193

## —* మార్కండేయ చరిత్రము *—

ఉ॥ శ్రీహిమభూధరాంతికముఁ ♦ జెందిన పుణ్యవనప్రదేశమం
దా హరిదశ్వతేజుఁడు మ♦హాత్ముఁడునైన మృకండుమౌని త
ద్దేహినియౌ మరుద్వతిస ♦ తీతిలకంబును భూరిశిష్యసం
దోహము గొల్వఁగా నియతి♦తో శివుఁగొల్చుచునుండె నిచ్చలున్.
ఉ॥ కంటికిఱెప్పవోలెఁ దన ♦ కన్నకుమారులయట్లు శిష్యులన్
దంటయతండు సాఁకుచు స ♦ తమ్మును నర్థుల గోరులమ్మలన్
గుంటువడంగ నీక కడుఁ ♦ గూరిమిఁ బ్రోచుచు నెల్లవారికిన్
బంటవలెన్ దనర్చెడు వి♦భాసురభూసుర రాజమౌళియై. 195
గీ॥ ఆ మరుద్వతియును సత్త్వ♦మామలకను, బ్రీతిమై సేవఁజేయుచుఁ ♦ బెన్మిటికి స
తమ్ము ప్రియ మొనరించుచుఁ♦దమదుశిష్య, జనులఁదల్లివలెన్ గాఁచు♦సంబరమున
ఉ॥ ఆమునిదంపతుల్ సతత ♦ మావనియందు గృహస్థధర్మముల్
బ్రేముడి నిర్వహింపుచును ♦ బెంపెసఁగంగ వసించి రెలోకో!
యామహనీయమూర్తులకు ♦ నక్కట! సంతతి లేకయుండె వా
రేమియుఁ జింతసేయకయె ♦ యీశ్వరుఁగొల్చుచునుండి రిమ్మెలన్. 197
మ॥ ఒకనాఁ డమ్ముని బంగరంపుమలయం ♦ దొప్పొందుపై తామహ
ప్రకటారామముఁ జేరి బ్రహ్మసభఁ జే♦రన్ బోవ ద్వారంబునం
దకలంకుండగు నామృకండుని యప♦త్యం బడ్డ దౌవారికుల్
రకమౌ నావిభవంబు లేదనె మునీం♦ద్రశ్రేష్ఠుఁ డవ్వారితోన్. 198

గీ॥ అంత వారు మహాత్మ! బ్రహ్మసభ కీవు, చేరుట కనర్హుఁడవు సంతు • చెందనట్టి
వారు చేరఁగఁజాల ర • వైధ్యసము స, భాలయంబిఁక మరలిపొ • మ్మనరి కిపుడు.

చ॥ అనవిని మౌనియంత హృద • యంబున నెవ్వగఁజెంది కుంది య
వ్వనమును బాసి స్వీయమగు • వాసముఁజేరఁగ వచ్చుచుండె నా
దినమున కొండజెంటికి వి • దేశమునీంద్రులభార్య లిద్దఱో
గిను లరుదేర న త్తపసి • గేహిని వారలఁ గాంచి ప్రేమమై. 200

గీ॥ ఎదురుకొని తోడికొనివచ్చి • యింపుమీఱఁ, బీఠములనిచ్చికూర్చుండఁ • బెట్టియర్హ
సత్కృతుల నెల్లసలిపిభో • జనముకొఱకుఁ, బంచభక్ష్యాన్నములనుంచెఁ • బాత్రలందు.

క॥ వారలు గని నీబిడ్డలఁ, జేరఁగఁబిలువు మిట శిశులు • చేరిన మేముర్
వారులు బోసేయుదుమిట, ధీరమతీ! యనిన నాపె • దిగులుఁగొని యనెన్.

ఉ॥ నోములు నోఁచలేదు కొఱ • నోములదానను దల్లులార! న
న్నోమ్ముఁ డిఁకెట్టులేనియును • నోదనముల్ దగ నారగించుఁడీ!
శ్రీమహితుల్ దయానిధులు • చెల్వగుమీఁదు సమాగమం బిఁకన్
నామది వేడ్కఁదీర్పుఁడు ప్ర • ణామము లివ్వె యొనర్తు నర్మిలిన్. 203

—* మరుద్వతి మునిభార్యలచే నవమానపడుట *—

గీ॥ అనిన వారందఱరసి ర • యమునఁ బీట, లవలికిన్ద్రోసి శిశులు లే • నట్టివారి
యన్నములు మేము సాపడ • మంచుఁగదలి, పోయిరిమరుద్వతియుఁగడుఁ • బొగులవగల.

సీ॥ సంతానచింతాదు • రంతాధిపీడిత, స్వాంతుఁడై నమ్మకండు • సంయమియులుఁ
జేరరా మానిరా • జారవిందానన, యెదురేగిపీఠంబు • నిచ్చి మ్రొక్కి
ఎదుట దుఃఖభరంబు • పొదలఁగరుదితయై, కన్నీరు రాల్పనా • కాంతఁజూచి
ఏల సుశీల! యీ • లీలఁ బెల్లశ్రులఁ, బఱపెద వనుడు నా • పరమసాధ్వి

గీ॥ మునిసతులువచ్చి వంచించి • చనిన విధము
నంతయును బూస గ్రుచ్చిన • యట్లు దెలిపి
తిరుగవందురుచుండ నా • ధీరుఁడాత్మ
పరిభవంబును దెలిపి యి • క్కరణిఁ బలికె. 205

చ॥ వనరకు మింక దేవి! భగ • వానుఁడు రాజకిరీటుఁ డున్నవాఁ
డనితరతుల్యుఁ డాతఁడు ద • యాళుఁడు భక్తవరప్రదాత య
మ్మునునిగుఱించి నేఁ దపము • గాటముగా నొనరించి మంచిపు
త్త్రునిఁ బడయంగఁజాలుదు స • రోజముఖీ! ముదమొందు మాత్మలో. 206

ఉ॥ మున్ను శిలాదమౌనిజన • ముఖ్యున కిచ్చెను సత్కుమారు దీ
వ్యన్నలినాక్షుఁడైన యదు • భర్తకుఁ బుత్త్రులనిచ్చెఁ బల్వురన్

బన్న్నగ నిచ్చునందనుని ♦ భర్గుఁడు నాకును సందియంబులే
దన్నగజామనోదయితు ♦ నాదృతిఁ గొల్వుము చెల్వ! యీవునుఁ. 207

చ॥ అనుటయు నాసతీమణియు ♦ నాత్మమునందుఁ బ్రమోదమంది యి
ట్లనె మునినాథుతో హరుస♦మర్చ్య మహాత్మక! ధన్యురాల నా
దును దమ కిట్టిభావ మది ♦ తోఁచిన సర్వసమర్థు లీర లా
యనఘుఁడు శంకరుండు కరు♦ణాత్ముఁ డొసంగును బుత్త్రభాగ్యముఁ. 208

చ॥ తడవిఁక నేల ? యీక్షణమె ♦ తాము మహేశ్వరు మానసంబునఁ
బడసి తపంబు సేయుటకుఁ ♦ బొల్పడుఁ డేనునుఁగూడ డెందమం
దొడిసి యుమాకళత్రుని స♦మున్నతిఁ గొల్చుచునుందు నాథ! యే
ర్పడెడు శుభంబు వేగ నిదె ♦ స్పందనమొందెను వామనేత్రముఁ. 209

## —✱ మృకండుముని తపస్సొనరించుట ✱—

గీ॥ అనినఁ దత్క్షణమునఁ దీర్థ♦మాడి మౌని, బూదినిధరించి గణపతిఁ♦బూజచేసి యగ్నిఁ బ్రతిష్ఠచేసి పం ♦ చాక్షరీ మ,ఖాత్మకతపంబు దీక్షఁ దా♦నపుడుఁ జెందె.

గీ॥ కడఁగిఫలమూలదళములఁ♦గ్రమముగనువి,సర్జనము చేసిమారుతా♦శనమెగొనుచు రేయుఁ బవలును నేకాగ్ర♦రీతి శంభు, ధారణ నొకంటఁదవిలి యు♦తండుదనరె.

క॥ సతి గుణవతియైన మరు,ద్వతి తనపెనిమిటి నరయుచుఁ ♦ దాను నుమాసం యుతునిఁ బశుపతిని మానక, సతము మదిఁ గొలుచుచుండె♦సముచితభక్తిన్.

గీ॥ అట్లు లాయిరువురు నిద్ధ♦మైనభక్తిఁ, గోమ లేందుని సిగయందుఁ♦గొన్న దొరను గుఱిచి తపమొనరించుచుం♦డిరి కరంబు, తడవుకాలంబుజరిగె నం♦తట నొకపుడు.

క॥ నారదమౌనీంద్రుండ, వ్వారలఁ జేరంగవచ్చి ♦ వారితపంబుఁ గూరిమిఁగని రజతాద్రికిఁ, జేరి యుమాశివుల కెఱఁగి ♦ శ్రీప్రమితులనెన్. 214

చ॥ కనికరమారయఁ వలదె? ♦ గాదిలి భక్తుల సాఁక రాదె? నీ
మనము దయామయం బిటుల ♦ మార్పడెనేలొకో! తండ్రి! యింకనై
నను మునియుగ్మమున్ దలఁపు ♦ నమ్మికతో నిను గొల్చుచున్నవా
రనిశము లెమ్ము రమ్ము రయ ♦ మాదటఁ గావఁగ వారలఁ విభూ ! 215

క॥ మాతల్లియేనియును దన, చేతంబున నెన రొకింతఁ ♦ జెంది నిను వడిఁ
బ్రీతిమెయిఁ బంపకుండిన, దాతురతఁ మునిమిధునము ♦ నారసి కావఁ. 216

చ॥ అనినఁ ద్రిలోకమాత దన ♦ యాత్మము పుల్లవడంగ నిట్లనెఁ
విను ముని! నేఁ బ్రతిక్షణము ♦ వేడుచునుంటిని నిమ్మహాత్ము నం
దనుఁడు జనించునట్లు వర♦దానము వారికిఁ జేయుమంచు జా
గును బొనరించుచుండె మదిఁ ♦ గొంకుచునుంటిని నేను నిట్టులఁ. 217

వ॥ అని యిట్లు నారదమునితోఁ జెప్పి యా యఖిలాండేశ్వరి ప్రాణేశ్వరున కిట్లనియె:

ఉ॥ పోదము వేగ నవ్వనికిఁ ♦ బూనికి నొక్కక్షణంబు నేనిఁ గా
లూదివసింప నిప్పుడె ద♦యోన్నత! లెమ్మిఁక రమ్మి నాదుపై
నాదరముంపు భక్తజను♦లం దిటు జాలముసేయ వెన్నఁడున్
మోదముతో నిఁకన్ బయన♦మున్ బ్రకటింపుము నంది కిమ్ముగన్. 219

వ. అనుటయు నంత

చ॥ పరమశివుండు వారల కృ♦పావచనంబుల నాలకించి తాఁ
జిఱునగ వొంది నేను నదె ♦ చింతయొనర్చుచునుంటి నల్లె వే
గిరముగఁ బోద మచ్చటి కొ♦గిన్ వృషమున్ గయిసేయు నందికే
శ్వర! యని యానతిచ్చె గరు♦వంబును జెందఁగ నద్రిజాతయున్. 220

గీ॥ మేలు మేలని కిన్నెర ♦ మేళగించి, శంభుకరుణను గానంబు ♦ సల్పి దేవ
ముని యథేచ్ఛ జనియెనంత♦ ముగ్ధచంద్రధరుఁడు పార్వతితో సవు♦త్రియుగ వేగ

—* పార్వతీ శివులు మునిదంపతులకు సాక్షాత్కరించి వరమిచ్చుట *—

వ. నందికేశాదిగణపాలురతో గూడ యానంబులెక్కి ప్రయాణంబుచేసి మృకండు
ముని యున్న బిల్వవనంబుఁ జేరి యవ్వారిఁ దఱిసిన వారలును. 222

క॥ కనుఁగొని గౌరీకాంతుని, మనమున ముదమొంది వే న♦మస్కృతిశతమున్
బొనరించి సంస్తుతులఁ జె, న్కొనరిచి నిలువంబడుదు మ♦హోల్లాసమునన్.

చ॥ శివుఁడును మౌనిఁ జూచి యనెఁ♦ జిత్తమునన్ దగ మెచ్చినాఁడ నీ
దువిమలమైనచిత్తమును ♦ దోరపుభక్తిఁ దపంబు పెంపు నా
యువు కడుఁగల్గువారల న♦యోగ్యుల గొడ్కుల నిచ్చునట్లు నెం
తువా? పదియాఱువర్షముల♦తోఁ బరమొందు సుపుత్రుఁ గోరెదో! 224

క॥ అని యడిగిన విని మౌనియు, మనమున సంకోచమొంది ♦ మఱిఁగి తఱిఁగి యం
తనె సర్వము శివవశమని, యనఘునిఁ బదియాఱుసమల ♦ యర్భకుఁ గోరెన్.

గీ॥ ఓమని వచించి గణముల♦తో మహేశుఁ, డంత నంతర్ధిఁ జెందె సం ♦ యమివతంసుఁ
డపుడు దీక్షాంత మొనరించి♦ యాత్మదయిత, యగు మరుద్వతితో నిట్టు♦లని యెవరపి

క॥ ఎప్పటి మేలప్పుడె శివుఁ, డెప్పుడునున్ గలఁడు మనకు ♦ నిందుముఖి! నీ
వప్పటిమాటఁ దలంపకు, మప్పుడునున్ దోడువడెడు ♦ నఖిలేశుఁ డొగిన్. 227

వ. ఇఁకను

గీ॥ పలువురు కుమారకులు కుల♦పాంసనులు జనించి దీర్ఘాయువొందిన♦ మంచిదగునె!
కులము సత్పుత్రుఁ డొక్కఁడు♦ గలిగెనేని, నెల నభంబట్లు సన్నుతి♦ నెగడు జగతి.

వ. అనినంత నా సాధ్వియును

క॥ కాఁగలదగు సర్వేశుఁడు, బాగే యొనరింపఁగలఁడు♦ప్రస్తుతమున నెం
తే గరువము మన మొందని, లాగున నిమ్మౌడ్కిగాఁ ద♦లంచి యిటులనెన్. 229

వ. అని యిరువురు పూర్వంబట్లకలంకమనస్కులై సుఖంబుగనున్నఁ గొన్నినాళ్ళకు

చ॥ నెలమసలెన్ మరుద్వతికి ♦ నెట్టనఁ జూచుకముల్ పొరిం బొరిన్
బలుపును నల్పుఁజెందెఁ గడుఁ ♦ బాండురతన్ జెలువొందెఁ జెక్కులున్
లలితపు దేహయష్టియును ♦లావుదొరంగె నెసంగెఁ గోర్కులి
ట్టలముగఁజిట్టుముల్ దగె న♦డల్ జడిమన్ గడునొప్పి నొప్పఁగా. 231

గీ॥ పుంసవనమును సీమంత♦మును మృకండు, మౌని సతికొనరించి యు♦మామహేశు
లనుమదిన్నమ్మియుండె నె♦లలును దొమ్మి,దియునునిండిన నొకమంచి♦దినమునందు.

—* మృకండు పుత్రోదయము *—

గీ॥ సౌమ్యమైనట్టి మేలిన♦క్షత్రమందు, జీవుఁడు విశేషముగఁజూచు ♦ శ్రీకరమగు
లగ్నమందుఁ గుమారుని♦లాగునామృ,కండుసతిగర్భమునఁ గుమా♦రుఁడువొడమె.

వ. అంత నమ్మునీంద్రుండు స్నాతుండై.

గీ॥ సౌరభేయీగణంబుల♦సన్మునులకు, దానములఁ బొనరిచి నిజ♦తనయునకును
జాతకర్మమొనర్చిస♦త్సుముఖమందు,నాహ్వయంబుమార్కండేయుఁ♦డనుచునుడివె

క॥ నెలబాలునివలె బుడుతఁడు, చెలువుగ దినదినము పెంపుఁ♦జెందుచుఁగడుకాం
తులఁదనరుచుండెఁ దలిదం,డ్రులు బంధుగులును మదులఁగ♦డున్ ముదమొందన్.

గీ॥ పెన్నిధినిఁ బడసినయట్టి♦పేదలట్లు, లామృకండుఁడు తత్సతి ♦ యనవరతము
ముద్దుకొమరునిఁ గాంచుచు♦హద్దులేని, యరుసమున నోలలాడుదు♦రన్నివిడిచి.

గీ॥ శివునివరమపుడప్పుడు♦చిత్తమునకుఁ, దాఁకుచుండినఁగొంకి యం♦తటనుదిటము
సేయుచున్ మానసంబున♦శివుఁడెమరల, సాఁకఁగలఁడనుచును ముని♦చక్కనుండు.

వ. అంత బాలుండు క్రమంబుగ వర్ధిల్లుచు.

—* మార్కండేయుని బాల్యవర్తనము *—

సీ॥ నడువఁగావచ్చిన ♦ నాటనుండియు శివు, దేవళంబుల కేగు♦దెంచుచుండు
పలుకఁగావచ్చిన♦ప్పటినుండియు "నమశ్శి,వాయ" యంచే ప్రొద్దు♦పలుకుచుండు
చదువఁగా వచ్చిన ♦ సమయంబునుండిశై, వప్రబంధములను ♦ బఠనసేయు
వ్రాయఁగావచ్చిన ♦ వరుసనే శివకోటి, మించిననేడ్కి లి♦ఖించుచుండు

గీ॥ బూది సర్వాంగముల నెప్పుఁ♦బూయుచుండుఁ
దవిలి రుద్రాక్షలను మెండు ♦ దాల్చుచుండుఁ
బార్థివేశార్చ యేరోజుఁ ♦ బాయకుండు
భూషణంబయి తనరు న♦మ్మునిసుతుండు. 238

వ. గర్భాష్టకంబరసి యంత మునిదంపతులు బాలున కుపనయనంబును బాశుపత
దీక్షయు నొనర్చి వేదాధ్యయనంబునకై యొజ్జకప్పగించిన. 239

ఉ॥ వేదములన్ దదంగములు ♦ వేగ నెఱిఁగి శివాగమంబు ల
త్యాదర మొప్పఁగాఁ జదివి ♦ యారసి దర్శనజాలమంతయున్
మీఁదట శైవతత్త్వమును ♦ మేల్మి నెఱింగి శివుండె సర్వసం
పాదకుఁ డంచు లోఁ దెలిసి ♦ పాయక కొల్చుచునుండె శంకరున్. 240

వ. అంత మునిదంపతులును.

ఉ॥ చిన్నతనంబునుండి తమ ♦ చిన్నికుమారుని సత్త్వపోర్షసం
పన్నుల కెల్ల పెద్దలకు ♦ బంధుగులై తగువారి కెంతయున్
మన్ననతోడ జోతల న ♦ మర్పఁగఁ జేయుచు వారిదీవెనల్
చెన్నగు నాయువిచ్చునని ♦ చేతమునందుఁ దలంత్రు నిచ్చలున్. 241

గీ॥ అట్లు పదియైదువర్షంబు ♦ లరిగి పదియు, నాఱవ శరత్తు ప్రాపింప ♦ నారదర్షి
వారిఁ జేరగవచ్చి కు ♦ మారుఁ గాంచి, యలరి వారలతో నిట్టు ♦ లనియె నపుడు.

ఉ॥ మేలగు నందనుం డిటుల ♦ మీ కుదయించెఁ గులంబు వెల్గఁగాఁ
జాలఁగ సంతసం బొదవె ♦ సద్గుణశాలి యితండు సంతత
శ్రీలెసఁగంగ నివ్వడమి ♦ శ్రేయము లందఁగలండు గాని మీ
రాలము సేయ కొక్కనుడి ♦ నారయఁగావలె మౌనిదంపతుల్ ! 243

—* నారదుఁడు మృకండునకు మార్కండేయాయువు చెప్పుట *—

ఉ॥ చేరఁగవచ్చుచున్నయది ♦ చేటొకఁ డీతనిజాడఁ జూచుచున్
మీ రిఁక నప్రమత్తులయి ♦ మీఱి తదీయవిధం బెఱింగి వి
స్తారపుశక్తి యేర్పడఁగ ♦ దాని హరింపఁగఁ జేయఁబూనుఁ డే
తీరున నేని పుత్త్రునిమృ ♦ తిన్ దొలఁగించుకొనుండు పూన్కి మై. 244

క॥ అనినంతనె వారలు మే, దినిఁ బడి యొడలెఱుఁగక యె యుం ♦ దీర్ఘ విషాదం
బున వాపోవుచు నారద, మునియడుగులఁ బడిన నతఁడు ♦ భూరితరకృపన్. 245

ఉ॥ కుందఁగ నేల? మీరిటులు ♦ కోమలచంద్రధరుండె భక్తులన్
వందురనీక సాఁకు నదె ♦ వాసినుమీ! యలశూలపాణి కే
గందరగోళముల్ గొనక ♦ గాదిలిపుత్త్రుఁ దపింపుమంచు ము
న్నుంచుగఁ బంపుఁడంత శుభ ♦ ముల్ సమకూరుఁ దొలంగు నంగదల్. 246

క॥ అని వేగ నతఁడు చనియెను, మునులును నిట్టూర్పు విడిచి ♦ ముద్దుఁగొమరునిన్
గని పాయలేక యెంతయు, వనరుచునుండుటయుఁ గాంచి ♦ బాలకుఁ డనియెన్.

ఉ॥ వీటికిఁ దల్లి! తండ్రి! యిటు ♦ లేడుచుచుంటిరి తద్విధంబు నా
కేటికి జెప్పరైతి? రిఁక ♦ నేనియుఁ జెప్పెఁడనుగ్రహించి చే
డ్పాటదియేమొ దానిని దృ♦ఢంబుగఁ బాపి సుఖంబుఁగూర్తు నా
రాటముఁబాయుఁడీ! మనకు ♦ రాజకిరీటి గలండు తోడుగన్. 248

వ. అనిన నవ్వారలు శివునివరప్రకారంబునంతయుఁ దెలిపి తనకుఁబంచదశవత్సరంబులు గడచుటయు షోడశవత్సరం బారంభమగుటయు నేఁడు నారదమునీంద్రుం డాపదను సూచించి తత్పరిహారంబునకై తన్నుఁదపంబున కనుపుమనుటయుఁ జెప్పిన నతండువిని యిట్లనియె.

ఉ॥ ఇంతకె గొప్పచేసి యిటు ♦ లెంతయునున్ విలపింపఁ జెల్లునే ?
యంతయుఁ జక్కనయ్యె విడ♦నాడుఁడు దైన్యము మన్యువేగమున్
శ్రాంతినిఁ జెందుఁ డిష్టె యుల ♦ శంకరుఁ గూర్చి తపింపఁబోయెదన్
జింతలఁదీర్చి యఘ్నుఁడు ♦ సిద్ధికొసంగుఁ బొసంగు సౌఖ్యముల్. 250

— * మార్కండేయుఁడు తల్లిదండ్రుల సెలవొంది తపంబునకేగుట * —

మ॥ అనుమానం బొక సుంతయేనియును మీ ♦ రాత్మంబులన్ జెందఁగాఁ
బనిలేదమ్మరో! నాయనా ! వినుఁడు ది♦వ్యంబౌ తపంబొంది నే
ననఘున్ జంద్రకళావతంసుని శివున్ ♦ హర్షింపఁగాఁ జేసి మి
త్తిని భంగంబొనరించి నిశ్చితముగా ♦ దీర్ఘాయువున్ జెందెదన్. 251

చ॥ తగునొకొ! యంతకుండు నను ♦ దారసిలంగ మహేశభక్తకో
టిగతు సహించునే యలత♦టిద్రుచిరోరుజటాకలాపుఁ డిం
పగునది మీఁదటన్ దెలియ♦నయ్యెడు మీకిది చెప్పనేల? యి
మ్మగనిఁక నాజ్ఞనిండిదియె ♦ పోయి శుభంబును జెంది వచ్చెదన్. 252

చ॥ అనిన మృకండుఁడంతఁ దన♦యాత్మము దిట్టమొనర్చి పుత్రకున్
గని యిటువల్కె తండ్రి! నిను ♦ గన్నఫలంబుఁ గనంగఁజేయు మా
కనుపమశక్తియుక్తుఁడు మ♦హాకరుణాకరమూర్తి శంకరుం
డనయము నీకు భద్రముల ♦ నాఁదటనిచ్చుతఁ బోయిరమ్మిఁకన్. 253

వ. అంత మరుద్వతియును.

ఉ॥ కానక కానకట్లు నిను ♦ గంటిఁ దపస్సొనరించి, యింతతో
మానకపోయెఁ దాపము కు♦మార! మనం బురియాడుచుండె నే
నీనగుమోముఁ జూడకెటు ♦ నేర్తు దినంబులఁ బుచ్చనక్కటా !
దీనత దాపరిల్లె నల ♦ దేవుఁడె తీర్పఁగలండు సర్వమున్. 254

చ॥ హిమకరశేఖరుండు నువు • యిందిర యల్ల రథాంగహస్తుఁడున్
కమలజుఁడున్ దదీయసతి • కంజహితుండు కువాలయాప్తుఁడున్
క్షమయును నాకసంబును ది•శల్ సురభివ్రజముల్ గ్రహంబు లిం
పమరఁగ నిన్నుఁ బ్రోచెద ర•హర్నిశ లాత్మజ! తోడునీడలై. 255

గీ॥ ఇట్లు దీవింప వారంత • నెలమిఁజెంది
మునికుమారుఁడు జననికి • జనకునకును
మ్రొక్కులనొనర్చి శుభలగ్న•మునఁబ్రయాణ
మును బొనర్చి హిమాచలం•బునకుఁ జనియె. 256

గీ॥ అభ్రగంగాతరంగిణీ•హారివిమల, వారిపూరితమై సిరిఁ • బరఁగునట్టి
బిల్వవనమొందుచేరి సం•ప్రీతి శంభు, లింగసంస్థాపనమొనర్చి • లీలమెసఁగ.

క॥ శతరుద్రీయజపంబునఁ, బ్రతిదినముఁ ద్రిసంధ్యమందుఁ • బదునొకమాఱుల్
గుతుకమున నర్చనంబు ని, యతిమీఱక సల్పుచుండె • నతిశయనిష్ఠన్. 258

వ. కందమూల ఫలాశనంబుల విడనాడి యేకబిల్వదళమాత్రభోజనుండై యాఱు
మాసంబులు గడపిన నంతసంయమనీపురంబునందు. 259

—* యముఁడు మార్కండేయునియొద్దకు దూతలను బంపుట *—

శా॥ కాలుం డుగ్రతరాత్ముఁడై యడరి మా•ర్కండేయు హింసింప నా
భీలాకారుల నాత్మదూతులఁ గడున్ • భీమక్రియాధుర్యులన్
వైళంబారసి పంప వారలు మహా•వష్టంభ మేపారఁగాఁ
బ్రాలేయాద్రితటిన్ వసించు మునిరా•డ్బాలున్ వడిన్ జేరుడున్. 260

గీ॥ యమునిదూతలఁ గాంచి సం•యమికుమారుఁ
డించుక చలింప కాత్మ మ•హేశునందె
తిరముగా నుంచి పూజనం•బురువు మీఱ
సల్పుచుండఁగ వారలా • చంద మెఱిఁగి. 261

ఉ॥ కోవెలలోని కేగుటకుఁ • గొంకి మునీంద్రజఘోరదివ్యతే
జోవిసరాగ్నులన్ బడలి • చూడఁగఁజాలక మౌనిపుత్త్రుకున్
భీవశులై వడిన్మరలి • బిట్టుగ నంతకుఁజేరఁబోయి య
ప్పావనువృత్తమంతయును • భాస్కరికిన్ దెలుపంగ నాతఁడున్. 262

చ॥ కడువడి రోషవేగమునఁ • గన్నుల నిప్పులురాల వీఁకమై
నడరి చనుండు మీరలు భ•యాకులు లెంతయుఁ బ్రల్లదంబులన్
బడుగులువోలె నాడుదురు • బాలు వధింపఁగ నేన పోయెదన్
కడిఁదిమగం డెవండొ నను • గానఁగవచ్చును గాక యుద్ధమై. 263

చ॥ అనియనుచుండ నాక్షణమె ♦ యంబరభాగమునుండి నారదుం
డనఘుఁడు సేరవచ్చిన ని♦నాత్మజుఁ డమ్మునికిష్టసత్కృతుల్
పొనరఁగఁ జేయుడున్ మునియుఁ ♦ బొంకముగా నెవియేవొ ముచ్చటల్
వినిచి మృకండుపుత్రకుని ♦ వృత్తముఁగూర్చి వచించెఁ బ్రీతిమైః 264

చ॥ అతఁడును నాలకించి ముని! ♦ యమ్మునిబాలుని జీవనంబు ను
ద్ధతిఁగొని తేరఁ బృథ్వికిఁ బ్ర♦యాణము సేయుచునుంటి నీదు నా
గతిఁగని యింతకాఁగితి నిఁ♦కన్ జనుటొప్పు ననంగ మౌని యా
దృతిమెయిఁబల్కె నప్పితృప♦తిన్ గని యల్లనఁ జల్లఁగానిటుల్. 265

చ॥ వినుము దయాళు! నీ వఖిల♦ వేదివి యమ్మునిదంపతుల్ గడున్
ఘనతరపుణ్యవర్తను ల♦కల్మషు లేకకుమారు లర్భకుం
డనఘుఁడు శంభుభక్తుఁడు ద♦యన్ వెదఁజల్లుము కొల్లగా నెటో
మనుపు మృకండునందనుని ♦ మాన్పుము తత్పరితాప మిమ్మగన్. 266

క॥ అనుటయు నంతకుఁడది విని, వినుముని! యాయువదినిండ ♦ వేలుగఁదలఁపన్
జనునే యుడుగుమిఁకన్ బో, దు నిదే తజ్జీవితంబుఁ ♦ దొలగించుటకై. 267

గీ॥ అనిన నారదుఁడిట్లనె♦నరయవైతి, వకట! నానుడి మునిబాలుఁ♦డభవుఁగొలుచు
చున్నవాఁడిక నీకసా♦ధ్యుండు శివుఁడు, భక్తజనముల పాలిటి ♦ పట్టుఁగొమ్మ.

వ. అనినంత యముం డాగ్రహంబున నొడుగఱచి నారదా! నారద! యేమంటి
వేమంటివి ? వినుమువినుము. 269

మహాస్రగ్ధర ॥ దిననాథుం డెంత యేనిన్ ♦ దిశమకవడి ధా♦త్రీతలం బొందెనేనిన్
కనకక్ష్మాభృత్తు దా లా♦ఘవమమరఁ గడున్ ♦ గంపమున్ జెందెనేనిన్
వనజాక్షుండున్ హరుండున్ ♦ వనరుహభవుఁడున్ ♦ వచ్చి పోరాడిరేనిన్
ఘనశక్తిన్ బట్టి తెత్తున్ ♦ గదిసి కడిఁది కీఁ♦కన్ మునిప్రాణరాజిన్.

క॥ అని రయమునఁ బాశంబులఁ, గొని సైరిభమెక్కి కడిమి♦ఘూర్ణిల్లుచు న
మ్మునిసుతునిఁ జేరి తద్వర్తనమంతయుఁ గాంచి యనియెఁ ♦ దామసమొదవన్.

—* యముఁడు మార్కండేయుని ధర్షించుట *—

చ॥ చాలును జాలుఁ బూజనము ♦ శర్వుఁడు సంతసమొందె నీకిఁకన్
గాలము చేరువయ్యె మృతిఁ♦గాంచెదు వెల్పలకేగుదెమ్మ నేఁ
గాలుఁడ నీదుప్రాణములఁ ♦ గైకొనఁగా నిటువచ్చితిన్ జుమీ!
మేలుగ నీకు మోక్షమది ♦ మేకొను సందియమొందు లేఁదికన్. 272

మ॥ అనినన్ బాలకుఁ డంతకున్ గని రవం ♦ బైనన్ భయంబొంద కి
ట్లనియెన్ భానుజ! నే మహేశ్వరుని ని♦ష్ఠర్చించుచున్నాఁడ న
య్యనఘుం డాఢ్యుఁడు సర్వలోకవిభుఁ డా♦హ్లాదంబునన్ నన్నుసాఁ
కును నాజీవితమున్ హరింపఁదరమో♦కో! నీకుఁ బో పొమ్మికన్. 273

వ. అనుటయు నంతకుండును.

చ॥ తెలియదు పిల్లకాయ విటు ♦ తెంపుగ నోటికి వచ్చినట్టులన్
బలుకుచునుంటి వోచ్చెముగ ♦ బైసికిఁజెల్లదు లేచిరమ్మ వే
ల్పులు నిను సాఁకువారె? కడ♦ముట్టఁగఁ జేయుదు నిప్డె కన్మ నా
యలవును బాశపుంబలిమి ♦ నర్భక! నిర్భయసూక్తు లింకఁగన్. 274

క॥ శివుఁడు గివుఁ డడ్డమే? యీ, యువు చెల్లిన కన్క నీకను♦యోగ్యుఁడవని యి
ట్లవబోధము నొనరించితి, నవునిది కాదనియెఱుంగ ♦ వకటా తగునే? 275

వ. అనిన మార్కండేయుం డిట్లనియె.

ఉ॥ ఏటికిటుల్ ప్రగల్భముల ♦ నొతయు గర్వము మీఱ నాడఁగా
మేటితనంబె? శంకరుఁడు ♦ మిన్నగఁ గన్పడఁడయ్యెనే! యిఁకన్
మాటలు వేయునేల? నను ♦ మన్పఁగలండు శివుండు నీవిఁకన్
మోటుతనంబుపాల్పడక ♦ మాఁదటిపాటుఁ దలంచుకొన్మదన్. 276

గీ॥ మంచిసెబ్బర లరయక ♦ మందమతులు, ముక్కుసూటిగఁజని కర్మ♦ములఁబొనర్చి
ముప్పుఁజెందుదురిందు మో♦మోటపడక, చెప్పచుంటిని దలపోయు♦చిత్తమందు.

చ॥ అనినఁ గడున్ గడున్ గినుక♦నంది మహాద్భుత దారుణధ్వనిన్
బొనరిచి చూడు చూడు మిదె ♦ పోంకమణంగు సురుంగుఁ బాశముల్
మునిసుత! యంచు దేహాళికి ♦ ముందటనుండి కరాళపాశమున్
గొని శిశుకంధరన్ వయిచి ♦ కొంకక లాగఁదొడంగె నత్తఱిన్. 278

వ. అంత మార్కండేయుండు కీనాశపాశంబు కంఠగతం బగుట నెఱింగి తనకు శంక
రుండే శరణంబని కడంగి శివలింగంబు నాలింగనంబు నొనర్చికొని స్థిరమతి నిట్లు
శివునిగూర్చి వాఙ్మయోపాస్తిఁ జేయుచుండె. 279

— * మార్కండేయకృత శివస్తోత్రము * —

సీ॥ బంగారుమలవిలుఁ ♦ బరఁగఁ బట్టెడువాని, వెండికొండను సతం ♦ బుండువానిఁ
బాపరానారితోఁ ♦ బరిఢవిల్లెడువాని, వెన్నుండు తూపుగా ♦ వెలయువానిఁ
గడువేగఁ దిప్రురముల్ ♦ గాల్చిమీఱినవానిఁ, జేజేలజోతలఁ ♦ జెందువాని
వేల్పుచెట్టులవిరుల్ ♦ వెలయు నడ్గులవానిఁ, గాముఁగాల్చిన యగ్గి♦కంటివాని.

గీ॥ బూదిఁబూసిన మెయివానిఁ♦బొలియనట్టి, వాని దోసంబులను నెడఁ♦బాపు వాని
నేన్గుచర్మంబుఁ బైఁగప్పి♦యెసఁగువానిఁ, గొలుతు నెలతలదారమిత్తి♦గెలుతునిపుడు,

సీ॥ నల్వవెన్నులయర్చ♦నఁదగు నడ్గులవాని, చదలేటినీరొందు ♦ జడలవానిఁ
జిలువరాపోగులఁ ♦ జెలఁగు వీనులవాని, గిత్తకిలాతంబు ♦ సొత్తువాని
నారదాదుల నుతుల్ ♦ నయముగ వినువాని, నెల్లజగంబుల ♦ నేలువాని
అంధకుండను మేటి ♦ యసురఁ గూల్చినవానిఁ, జేరుభక్తుల వేల్పు♦చెట్టువాని

గీ॥ జక్కులొడయని చెల్మి నె♦నంగువాని, భగునికను లూడబెఱికిన♦బలియుఁడైన
వానిఁ బాములసొమ్ముల♦వాని నెలమిఁ, గొలుతు నెలతలదారమిత్తి♦గెలఁతునిపుడు,

సీ॥ విసముమెక్కుట నల్పు♦వెలయు కుత్తుకవాని, గొడ్డలి లేడిఁగై♦కొనెడువాని
భవరుజలిక్కట్లు♦పాపఁగాఁ దగువానిఁ, ద్రిగుణాత్ముఁడై తేజ♦రిల్లువానిఁ
గడగి దక్షునవంబు♦నడఁగఁద్రొక్కినవాని, మూడుకన్నులుగల్గి♦మురెయువాని
బోనంబు ముత్తినిఁ♦బొసఁగ నిచ్చెడువానిఁ, జెలఁగి దోసముల భం♦జించువాని

గీ॥ భక్తులందునఁ బ్రేముడిఁ♦బరగువాని, క్షయములేనట్టివానిఁ బ♦చ్చనివలువలఁ
గట్టువానినిఁ గొలత లే♦నట్టివానిఁ, గొలుతు నెలతలదార మిత్తి♦గెలుతునిపుడు,

గీ॥ పొలియఁ జేయుచునున్నను♦భువనములను, మరలజనియింపఁగాఁ జేసి♦మనుచువానిఁ
బ్రమథగణములచేఁ గొల్వఁ♦బడెడువానిఁ, గొలుతు నెలతలదారమిత్తి♦గెలుతునిపుడు

గీ॥ అవని నీళులు నగ్గి గా♦డ్పాకసంబు
చదలుమానికమును నికఁ ♦ జలువలదొర
యాఁజి యనుతనువులఁ జెంది ♦ యమరువానిఁ
గొలుతు నెలతలదార మిత్తి ♦ గెలుతునిపుడు, 284

క॥ కొండలయొడయనికూఁతును, గొండగుతమి సాము మేనఁ ♦ గొన్నట్టిదొరన్
నిండారు నెనరుకడలిని, నిండగు బత్తిన్ గొలుతును ♦ నిరసింతు జమున్. 285

క॥ అవిరతము రుద్రుఁ బశుపతిఁ, గవిసన్నుతు స్థాణు నీల♦కంఠు నపర్ణా
ధవుఁ గాలానలమూర్తిన్, శివుఁ గొలిచెదఁ గాలుఁడేమి♦సేయఁగలఁడిఁకన్. 286

క॥ కాలగళుఁ గాలమూర్తిన్, గాలనియామకునిఁ గాల♦కాలు ననంతున్
శూలాయుధధరుని మహా, వ్యాళధరున్ గొలుతు గెలుతు ♦ నంతకుఁ బెలుచన్,

క॥ అవ్యయుని శాంతు యోగిజ, నవ్యక్తుని నక్షరక♦నద్ఘనకరునిన్
దివ్యజనేశ్వరుఁ బరమున్, భవ్యాత్మున్ గొలుతు గెల్తు ♦ వైవస్వతునిన్. 289

క॥ ఆనందమయుని నిత్యుని, గోనాథధ్వజుని హరునిఁ ♦ గువలయహితశే
ఖానద్ధపాటలజటున్, దీనశరణుఁ గొలుతుఁ బితృప♦తిన్ గికురింతున్. 290

క॥ భస్మోద్ధూళితవిగ్రహు, సస్మితముఖు మోక్షదాన ♦ చణు సర్వేశున్
విస్మయకరవైభవు నా, కస్మికకారుణ్యుఁ గొలుతుఁ ♦ గాలుని గెలుతున్. 291
క॥ శివ! శంకర! యీశ! సదా, శివ! శర్వ! మహేశ! శ్రీశ ♦ సేవితచరణా!
భవ! కల్పాయువు నాకి, మ్మవిరళకృపఁ దెవ్వలులేని ♦ యట్టులు చక్కన్. 292

శంభుప్రియ వృత్తము } శంకర! ప్రోవుము ♦ చంద్రకలాధర! సంకటభంజన! ♦ సన్మునిరంజన!
పంకజలోచన ♦ బాణ! కృపాఘన! కింకరుఁ గావుము ♦ కీర్తనచేయుదు.

శివప్రార్థనా వృత్తము } మాతండ్రి! నీవు రావె ♦ మారసంహార! హర!
చేతోముదంబుతోడ ♦ సేవచేసెద శివ!
నాతల్లి గౌరితోడ ♦ నన్ను గావఁగ మది
నాతప్పులొప్పిగమ్మి ♦ నందివాహన! ఘన! 294

వ. అని యిట్లు చిఱుతతపసి మదిఁ గట్టిచేసి గట్టువిలుతు దొరకఁ గొలుచుచుండునంతలో

గీ॥ నారదుండట్లు యమునిన ♦ నాదరించి, మునిసుతుని రక్షయందుఁ బూ ♦ న్కి వివహించి
వేగమున నాకసంబున ♦ వెడలి యల్ల, రజతశైలంబుఁ జేరి బల్ ♦ రాణగదుర.

—* నారదుఁడు మార్కండేయుని రక్షింపుమని పార్వతీశివుల నర్థించుట *—

శంకరప్రియ వృత్తము } కావఁగ రావే ♦ గణపతిలోలా!, ప్రోవఁగ లేవే ♦ మునిజనపాలా!
ఈ వేళ రణ్యం ♦ బిదిగను పుణ్యం బోవరమూర్తి! ♦ యురుతరకీర్తి!

మ॥ అని గానం బొనరింపుచున్ గిరిసుతా ♦ ప్రాణేశ్వరున్ దేవదే
వునిఁ జేరన్ జని మ్రొక్కి మానిసుతువి ♦ స్ఫూర్జత్తపోశీలఁ ద
జ్జననీగుర్వనపాయదుఃఖగతినిన్ ♦ జండాత్మలన్ మిత్తిపై
కొని వేగంబున వచ్చు నుద్ధతిని సం ♦ కోచంబులే కెంతయున్. 298

గీ॥ నాఁడివి రక్షింపుమనుచు నా ♦ యుడుపతిధరు, దేవియగు జగదంబను ♦ దేవ్రరింప
శివయురయమున బాలుర ♦ క్షింపుమనుచు, విభుని నెంతయు బ్రతిమాలి ♦ వేడవారుఁడు.

చ॥ మునితనుజన్మ కంఠమున ♦ మొక్కలుఁడై యముఁ డేసినట్టి య
ఘ్నునమగు కాలపాశమది ♦ కంఠగతంబయి కానువట్ట నం
తనె పెనుమ్రోఁత బిట్టడర ♦ దారుణరోషపరీతచిత్తుఁడై
యనువుగ లింగమధ్యమున ♦ నద్భుతరీతిగఁ దోఁచి యుద్ధతిన్. 300

* శివుఁడు త్రిశూలధారచే యమునిఁ గూల్చి మార్కండేయున కభయ మిచ్చుట *

చ॥ కరతలశూలధార యము ♦ కంఠము గ్రుచ్చ నతండు శోణితం
బురవుగఁ గ్రక్కుచున్ దొలఁగి ♦ యుర్వి నమాంతము గూలినంత నా
దరమున బాలునెత్తిపయిఁ ♦ దాఁ జెయినుంచి కుమార! యీవికన్
వెఱవునుమాని యిష్టముల ♦ వేడుము బాధముగా నొసంగెదన్. 301

గీ॥ అనిన మునిపుత్త్రుఁడభవుని ♦ యడుగులందు, వ్రాలియిక్కాలు బ్రదికింపు ♦ రాజమకుట!
ఎట్టులైనను నాకోస ♦ మీతఁడిట్టు, లయ్యె నందఱకును శుభం ♦ బగుత సతము.

—* శివుఁడు మార్కండేయ ప్రార్థనచే యముని జీవింపఁజేయుట *—

వ. అనిన నమృతాంశుమౌళి యంతకున్ మరల జీవింపఁజేసి యాతని కిట్లనియె. 303

చ॥ ఎఱుఁగవె? నాదుభక్తుల మహిన్ ఘనశక్తులఁ బుణ్యయుక్తులన్
మఱచితివే? ననున్ బలిసి ♦ మానసమందు నిఁకేని యెప్డిటుల్
గరువముఁజెంది నాయలరు ♦ గాదిలిభక్తులపైనిఁ జేయిడన్
దొరకొన్న కిట్టిబెట్టిదపుఁ ♦ దుందుడుకుల్ పొనరింపఁబోకుమీ! 304

వ. అనిన నంతకుండు నుదుట నంజలిని గదియించి మ్రొక్కి యిట్లనియె. 305

గీ॥ దేవరయె పదియాఱేడు ♦ లీవడుగున, కాయువంచు వచించుట ♦ యరసి యేను
పాశమును వేసితిని ముని ♦ బాలునిపయిఁ,దలఁపునకు రాదు నాకు నా ♦ తప్పిదంబు.

వ. అనిన శివుఁడు మందహాసంబుచేసి యిట్లనియె.

గీ॥ ఎప్పటికిఁ బదియాఱేండ్ల ♦ యెలవయస్సు, తోడనొప్పెడు నాయువుఁ ♦ బాడిమీఱ
నిచ్చితిని దాని నిష్ఠ నీ ♦ వెఱుఁగకిట్టు, లాఱడికి నొడిగట్టితి ♦ వైనఁజనుము. 307

వ. అనుచుండ నారదోద్బోధితులై మృకండుమునియును మరుద్వతియును కుమారుని జాడ లరయుచు నచ్చటికివచ్చి యవ్విధమంతయుఁ గాంచి యఖిలేశ్వరుని దయామయత్వంబుఁ బెక్కుభంగుల బ్రశంసించుచుండిరి. నారదుండును బరివాదినిఁ గర హరప్రియరాగంబున మేళగించి గానంబొనర్చుచు నచ్చటికి వచ్చి మహేశ్వరునకు మ్రొక్కి యమునిఁ గుశలం బడిగిన నంతమీఁద యముండు విన్నఁబోయి బింకంబణంచికొని శివుని సెలవొంది నిజపురంబునకుఁ జనియె శివుండును శివయును మార్కండేయునిఁ జూచి యిట్లనిరి. 308

—* పార్వతీపరమేశ్వరులు మార్కండేయునకు బ్రహ్మాయువు నిచ్చుట *—

గీ॥ ఎప్పుడజకల్పమగునో యిఁ ♦ కెప్డుగడలి,జలజనయనుండు వటపత్ర ♦ శాయియగునో
అంతవఱకీవు పుడమిపై ♦ నధివసింపు, కరము చిరజీవియగుచు మృ ♦ కండుతనయ!

వ. మఱియు నీయొనరించిన స్తవరాజం బెవ్వరేని యస్మదీయలింగసన్నిధిఁ జేరి పఠించిరేని యవ్వారలు మృత్యుభయంబుఁ జెందరని వరంబిచ్చి మృకండుమునినిఁ జూచి మునీంద్రా! వరంబు లిఁకేమేనిఁ గోరుదువేని నిచ్చెద ననిన నతండిట్లనియె.

గీ॥ ఇంతకన్న వరంబు నా ♦ కేమివలయు, దేవ! తీర్చితివయ్య! నా ♦ దీనదశను
దయకుఁ బాత్రునిఁజేసి నన్ ♦ దనిపినావు,వరద! యేమనికొనియాడ ♦ వలఁతినగుదు.

వ. అని యమ్మునిదంపతులు మార్కండేయుండును మహేశ్వరులకు మ్రొక్కినయంత మహేశ్వరు లంతర్ధానంబు నొందిరి. నారదుండును శివుని గానంబునల్పుచు

యుధేచ్ఛఁ జనియె. మరుద్వ్రతీమ్సకందు లానంద పారవశ్యంబునొంది కొమరునిం
దోడ్కొని స్వాశ్రమంబునకరిగి సుఖంబుండిరి. 312

క॥ ఈచరితం బెవ్వరుగా, నీ చదివిన వినిన మర్త్తి ♦ నెట్టి చిరాయు
శ్శ్రీచెలువుమీఱ సౌఖ్యము, లాచంద్రకిరీటుఁదయను ♦ సందెద రవనిన్. 313

వ. ఇట్లు శివుఁడు మిత్త్రిఁ భంజించి మరల సంజీవితుఁ జేసెననిన వాయుభట్టారకునకు
మునులు దేవా! మున్నొకప్పుడు మహాదేవిని సమాధానింపఁజేయుటకై మహా
దేవుఁడు విశ్వంబునెల్ల వాగర్థాత్మకమనియు నాజ్ఞైకసారంబనియు, ఆజ్ఞ ఆమహా
దేవియే యగుటను నెఱింగించెనని వింటి మాసర్వంబును నానుపూర్విగ మాకు
పన్యసింపుమనుటయు నామరుద్దేవుండిట్లనియె. 314

—* వాయుదేవుఁడు మునులకు షడధ్వప్రకారంబుఁ జెప్పుట *—

క॥ వినుఁడిక వాగర్థాత్మం,బును మఱియు షడధ్వరూప♦మును వచియింతున్
కనరాద శబ్దమర్థము, కనరాదెందును నిరర్థ♦కము శబ్దంబున్. 315

గీ॥ ఇట్టి సమయంబు నెఱఁగిన ♦ నెల్లశబ్ద, ములును నర్థబోధంబులై ♦ యలరుచుండు
ఇట్లు శబ్దార్థభావితం♦బిదిద్వివిధము, ప్రకృతి పరిణామమరయుఁడు♦ ప్రాజ్ఞులార !

క॥ అదియును బరమాత్మలునున్, సదయులునగు శివులభూతి ♦ సంపత్తిగ మీ
ర్మదిఁ దెలియుఁడు శబ్దాత్మిక,మిది త్రివిధయటంచు విబుధు ♦ లెంచిరియిట్టుల్.

గీ॥ స్థూలసూక్ష్మయుఁ బరయంచు ♦ స్థూల శ్రోత్ర
గోచరయటంచు సూక్ష్మచిం ♦ తాచితయు న
టంచుఁ జింతారహితము ప♦రాఖ్యనమరు
నంచు వచియింతురాచార్య ♦ లనఘులార ! 318

వ. ఆ పరయే శివతత్త్వసమాశ్రియయగు క్రియాశక్తిగ నెఱుంగుఁడు జ్ఞానశక్తిసమా
యోగంబున నిచ్ఛాశక్తి యుద్భవిల్లు. 319

గీ॥ సర్వశక్తి సమస్త్వాత్మ ♦ శక్తితత్త్వ, నామమున సర్వకార్యసం ♦ ధానమూల
హైతువగుప్రకృతియయితా ♦ నెసఁగెమాయ,ఆమెయేకుండలినియుశు♦ ద్ధాధ్వపరమ

గీ॥ అదివిభాగాకృతిఁగొనిష ♦ డధ్వరూప, మునవిరాజిల్లె శాబ్దాధ్వ♦ములుత్రియంబు
అట్లె అర్థాధ్వములు♦త్రియంబనిరి యెల్ల, వారలకు నివ్వి నిజశుద్ధి♦కారణములు.

వ. మంత్రాధ్వము పదాధ్వము వర్ణాధ్వము భువనాధ్వము తత్త్వాధ్వము కలాధ్వమను
నవి షడధ్వము లిందు మంత్రాధ్వ పదాధ్వ వర్ణాధ్వములు మూడును శబ్దాధ్వ
ములు. భువనాధ్వ తత్త్వాధ్వ కలాధ్వములు మూడును నర్థాధ్వములు. ఇందన్నిటి
కిని బరస్పరంబు వ్యాప్య వ్యాపకత్వము చెప్పఁబడినది. మంత్రంబులన్నియు
వాక్యరూపంబులగుటఁ బదములచే వ్యాప్తంబులు. పదములు వర్ణసమూహంబు

లగుటఁ వర్ణవ్యాప్తంబులు. వర్ణంబులు(అక్షరంబులు)భువనంబులందు వెలయుట భువనవ్యాప్తంబులు భువనములును నండమున కంతర్బహిస్సులందుఁ గ్రమముగఁ గారణములగు తత్త్వములచే వ్యాప్తంబులగుటఁ దత్త్వవ్యాప్తంబులు. భువనంబు లండాంతస్థితంబులు, పురాణప్రసిద్ధంబులు. తత్త్వంబులు సాంఖ్యయోగప్రసిద్ధంబులు, ఆతత్త్వంబులు శివశాస్త్రప్రసిద్ధంబులునై యున్నవి. కలలచేత వ్యాప్తంబులు. కలలు పరమైనప్రకృతియొక్క పంచధా పరిణామంబులు, నివృత్తి ప్రభృతులు. షడధ్వలలో నవిభక్తయగుపరాశక్తిచే నివియైదును వ్యాప్తంబులు. వ్యాపిక పరాశక్తియగు నీక నీపరాశక్తియు శివతత్త్వమునుండి వెలసినదాట.

గీ॥ శక్తిప్రభృతిపృధివ్యంత ♦ సకలతత్త్వ, సముదయంబిది శివతత్త్వ♦జనితమగును
అరయఁడొకమృత్తుచేత ♦ గుంభాదిసర్వ, పరికరంబులు పుడమినే♦ర్పడెడునట్లు.

వ. కావున నీ షడధ్వములచేత శివతత్త్వంబు ప్రాప్యంబు. ఈపంచతత్త్వపరిశోధనంబునఁ దద్వ్యాపికయగు శక్తియే ప్రాపికయగుచున్నది. నివృత్తిచేత రుద్రపర్యంతమండంబు స్థితి శోధింపఁబడుచున్నది. ప్రతిష్ఠచేతఁ దదూర్ధ్వం బవ్యక్తగోచరంబగువఱకును విద్యచేతఁ దదూర్ధ్వంబు విద్యేశ్వరాదిగను శాంతిచేఁ దదూర్ధ్వమును శాంత్యతీతచే నధ్వాంతమందు విశుద్ధియు శోధింపఁబడుచున్నది. ప్రశాంత్యతీతను బరప్రకృతియోగంబునఁ బరమంబగు వ్యోమయని పరమార్థజ్ఞులు చెప్పుచున్నారో. ఇవి పంచతత్త్వములు, వీనిచే జగంబంతయు వ్యాప్తమైనది. సాధకులచే నిదియే సర్వము చూడఁదగినది.

మత్తకోకిల॥ ఎవ్వఁడధ్వవిధానమిట్టుల ♦ నెంచకెంతయు శుద్ధిఁదా
నివ్వటిల్లఁగఁ జేయఁబూనునొ ♦ నిందితుం డది చెందలేఁ
డెవ్విధంబుగ శక్తిపాతమ♦హిష్ఠయోగము లేక తా
నివ్వసుంధర తత్త్వతత్త్వము ♦ లెఱ్ఱు దద్గతి శుద్ధులౌ. 325

సీ॥ శక్తియనశివాజ్ఞ ♦ చిద్రూప పరమేశి, యెద్దానశివుఁడొందు ♦ నీయఖిలము
దానిచేతవికార ♦ మూనడాయఖిలేశు, డదియునాశివునందు ♦ నడఁగియుండు
లేదు బంధంబును ♦ లేదు మోక్షంబును, బరమశివునకు నె♦ప్పట్లనేని
బంధమోక్షవిధాత్రి ♦ బహుభాగ్యపరశక్తి, అవ్యభిచారిణి ♦ హరునకిద్ది

గీ॥ అగుసమానధర్మిణియునా♦యావిశేష, భావములచేత నీ పెచేఁ♦బరమశివుఁడు
గృహియగునుదద్విధంబుగ♦గృహిణియగును,శక్తిశివుచేతజగముత♦త్సంతతియగు.

వ. కావున.

గీ॥ ఆశివుఁడు కర్త కరణమా♦యాదిదేవి. వారలకు భేదమద్ది వ్య♦వస్థితంబు
శివుఁడు తానొక్కరుఁడెయిట్లు♦ద్వివిధముగను, స్త్రీపురుషభావముననుండు♦సిద్ధమిద్ది.

క॥ శివునకు సమవాయినియై, శివ వెలయు నభిన్నయగుచుఁ ♦ జిన్మాత్రికి తా
రవియందుఁబ్రభ తెఱంగున, వ్యవస్థితి యిదనిరి కతిప♦యబుధవరేణ్యుల్: 328

ఆ॥ అందు చేశివుండె♦యఖిలమునకు హేతు,వామహేశ్వరియుఁద♦దాజ్ఞ యాపె
చేతఁబ్రేరిత యయి♦చెలఁగునిట్టులశైవి,మూలప్రకృతిమాయ♦ఘనమాయ. 329

క॥ త్రిగుణయయిమూడు విధములఁ, దగుకార్య విభేదములను ♦ తానపడధ్వల్
జగము రచించు నెఱుంగుఁడు, జగమిది వాగర్థమయము ♦ షడ్విధమధ్వా. 330

వ. ఇట్లు షడధ్వరూపంబగు జగంబు నెఱుంగుఁడిద్దాని విస్తరంబ శేషంబు శాస్త్ర జాతంబెఱింగించు ననుడు మునులుసంతుష్టులై దేవా! మున్నుపమన్యు మునీంద్రుండు శ్రీకృష్ణునకు శైవదీక్షయొసంగిన పిదప శివతత్త్వరహస్యంబఖిలంబును దెల్పెననివిందుము. 331

సీ॥ ఎట్లులుపమన్యుమౌని మ♦హేశతత్త్వ, మాహరికిఁజెప్పె నెఱిఁగింపు♦మయ్య!మాకు
పాశుపతమగు జ్ఞాన మే♦పగిదినుండు, శివుఁడు పశుపతి యెటులయ్యె♦సేవ్యమూర్తి!

వ. అనియడిగిరని సూతుండు చెప్పిన శౌనకాదులావలియుదంతంబుఁ జెప్పుమనుటయు.

క॥ కుసుమశరాంతకపూజా, ప్రసక్తబసవార్యసహజ! ♦ బహుశిష్యసము
ల్లసదర్చనాభిరామాం, ఘ్రిసరోరుహ! బుధజనాభి♦గీతచరిత్రా! 334

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వర నామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి వాయవీయఖండంబునందు
ప్రథమాశ్వాసంబు సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## వా య వీ య ఖ ం డ ము

### ద్వి తీ యా శ్వా స ము.



శివలింగసమర్చా
కౌశల్యాయతనమూర్తి! ఘనకారుణ్యా
వేశమనోవర్తీ! యా
త్మేశ మహావ్రతవిధానహిత! లక్ష్మ్యంబా!

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదుల కిట్లనియె నంత మహాబలుండు నైమిశ
మునులకీ వక్ష్యమాణ ప్రకారంబుగఁ జెప్పఁదొడంగి. 2

గీ॥ ప్రబలసంసారచక్ర విభ్రమణ హేతు,వునకు గౌరీఘనస్తనాభోగలిప్త
సురభికస్తూరిగంధ విస్ఫురితవక్షు,నకును బ్రహ్మాండ విభునకు నతులొనర్తు. 3

వ. అని యిట్లు మంగళంబొనరించి యిట్లనియె.

క॥ మును శ్రీకంఠుఁడు మందర, మను పర్వతశిఖరమందు నార్యకుఁ దాఁజె
ప్పిన పాశుపత జ్ఞానం,బును గృష్ణున కెఱుఁగఁజెప్పె మునివరుఁడెలమిన్. 4

క॥ అది మీకెఱుఁగఁగఁజెప్పెద, సదయున కుపమన్యుమునికి జలజాక్షుఁడు వం
దనమునొనరించి పరిశ్రయ, మున నిట్టులఁ బల్కె వినుఁడు మునికులతిలకుల్! 5

చ॥ మునికులసార్వభౌమ! మును ముగ్ధశశాంకధరుండు భూమిభృ
త్తనయకు నాదిశక్తికి ముదంబున మందరశైలమందుఁ దె
ల్పిన ఘనమౌ విభూతియును వేద్యము పాశుపతంబు జ్ఞానమి
ష్టనువుగఁ దెల్పునాకు వితతాయతదుఃఖతమంబు లింకఁగన్. 6

వ. అనుటయు మౌనీంద్రుండు సంతుష్టుండై మనంబందు మహాదేవీమహాదేవులకుఁ
బ్రణమిల్లి యిట్లనియె. 7

—* ఉపమన్యుముని శ్రీకృష్ణునకు శివమహత్త్వంబుఁ జెప్పుట *—

గీ॥ కమలజాదులు స్థావరాం♦తములు శర్వు, నకుఁ బశువులై పరంగుదు♦రీశమహేశుఁ
డతఁడు పతియౌట నతనికి♦నఖిలజగము, లందుఁ బశుపతియను నాఖ్య♦యావహిల్లె.

మ॥ మలమాయాదికపాశజాలముల సం ♦ బంధించు పశ్వావళిన్
గలయన్ జూచి ప్రపత్తిమైఁ గొలుచు భ ♦ క్తశ్రేణికిన్ మోక్షమున్
సలుపున్ లీలగ శర్వుఁడీశ్వాదియున్ ♦ నాల్గైన తత్త్వంబులే
బలమౌ జీవనిబంధనంబులునునున్ ♦ బాశంబులై యొప్పెడున్. 9

గీ॥ ఇట్టిపాశంబులనునా మ♦హేశ్వరుండు, బ్రహ్మమొదలుగ స్తంబంబు♦వఱకుఁగలుగు
పశులబంధించి చేయించు♦స్వకముకార్య, మనవరతమిది తెలియు ప♦ద్మాక్ష!నీవు.

క॥ ఇఁక నమ్మహేశునానతిఁ, బ్రకృతియుఁ బురుషోచితమతిఁ ♦ బ్రసవించును మా
రక నదహంకృతి నదియుఁ బ,దొకఁడగు నింద్రియనిచయము♦నుత్పాదించున్.

గీ॥ మఱియుఁదన్మాత్రపంచకం♦బు రహిసల్పు, నల్లతన్మాత్రిలొనరించు♦నభవునాజ్ఞ
నానుపూర్విగఁదా మెయి♦యఖిలభూరి, భూతములసర్వబ్రహ్మాది♦ములరచించు.

ఆ॥ బుద్ధి నిశ్చయమును♦బొనరించు నాయహం, కృతి యహమ్మతిని నొ♦గిన్ రచించు
చిత్తమెపుడు భావ♦సిద్ధినిగూర్చు సం, కల్పములనుసల్పుఁ ♦ గాదె మనము

సీ॥ వేత్త్వరుశబ్దాది ♦ విషయములఁగొను శ్రో, త్రాదీంద్రియములు శ♦ర్వాజ్ఞచేత
అటులె వాగాదీంద్రి ♦ యము లీశ్వరాజ్ఞచేఁ, దమతమకర్మంబు ♦ లమరఁజేయు
శబ్దాదికంబులు ♦ శంభ్వాజ్ఞగ్రహియింపఁ, బడువచనాది స♦ల్పబడునట్లై
ఆకాశము శివాజ్ఞ ♦ నవకాశమిడునట్లై, బహిరంతరంబులఁ ♦ బవనుఁడొనరు

గీ॥ ఆహరుని యాజ్ఞచేత హు♦తాశనుండు, హవ్యము సుపర్వులకును గ♦వ్యాశులకును
గవ్యమువహించి యొసఁగు పా♦కంబుమున్ను, గాఁగలుగు వానిసల్పుము♦ఖంబుగాను.

చ॥ సలిలము లీశ్వరాజ్ఞ మెయిఁ♦జక్కఁగ జీవనమున్ రచించు నీ
యిలయు జగంబు మోయుఁ బర♦మేశ్వరునానతి శేషుఁడట్లె నీ
శ్చలుఁడయి సర్వలోకముల ♦ సంతతమున్ వహియించుచుండు నా
బలరిపుముఖ్యులా శివుని ♦ పన్పున నేలుదు రెల్లలోకముల్. 15

గీ॥ హరుని శాసనమునఁజతు♦రాననుండు, జగములసృజించు హరియుర♦క్షణమొనర్చు
నట్లె రుద్రుండు సమయించు♦నఖిలభువన, జాలముల నెల్లఁ దెలియుము♦జలజనయన!

వ. మఱియును.

క॥ కాలము రచించు జగములఁ, గాలమె యవ్వాని బెంచుఁ ♦ గాలమెల్యించున్
కాలమె సర్వముఁగూర్చును, గాలహరుని శాసనమునఁ ♦ గాంచుముకృష్ణా! 17

క॥ దివి భానుఁడు వెల్గుచు శాం, భవశాసనమునఁ బ్రబోధ ♦ వర్షము నొసఁగుఁ
గువలయబాంధవుఁడట్లే, కువలయసస్యములఁ బెంచుఁ♦గూర్చుఁ ముదముఁ. 18

వ. మఱియు నాదిత్యులు వసువులురుద్రులాశ్వినులు మరుత్తులు ఋషులు సిద్ధులు గంధర్వయక్షరక్షో విద్యాధరగణంబు లప్సరోగణంబులు కిన్నరులు నరులు పన్నగవ్రాతంబులు పశుపక్షికీటవ్రాతంబులు నదులు సముద్రంబులు వారిధరంబులు జ్యోతిర్వితానంబులు శైలంబులు వృక్షలతాగుల్మంబులతోఁ గూడినకాననంబులు జలచరోత్కరంబుతో నమరిన సరోవరంబులు సాంగవేదంబులు శాస్త్రంబులు మంత్రంబులు సోమయజ్ఞాదులు కాలాగ్ని ముఖ్యంబులును శివాంతంబులు నగు భువనంబు లసంఖ్యాకంబులగు బ్రహ్మాండంబు లవ్వానియావరణంబులు భూత భవిష్యద్వర్తమానకాలంబులు మఱియుఁ గాలభేదంబులు కలాదులు నిఁకనీ జగంబందుఁ గన్పడునట్టిదియు వినఁబడునట్టిదియు స్థిరమైనట్టిదియుఁ జరమైనట్టిదియు చిద్విశిష్టంబు నచిద్విశిష్టంబునైన యత్కించి త్పదార్థమది సర్వంబును శివాధిష్ఠితంబుగ నెఱుంగవలయును.

—* శ్రీకృష్ణున కుపమన్యుముని పంచబ్రహ్మతత్త్వంబుఁ జెప్పుట *—

గీ॥ అరయు! శ్రీకృష్ణ! శివపర ♦ మాత్మ నిజత, నువుల నీజగమంతయు♦నుఁ జరాచ
రంబు వ్యాప్తంబుగాను స♦ర్వమగుజగము, నామహేశుం డధిష్ఠించె♦నాత్మతనుల.

క॥ ఆవిభునకుఁ బరశివునకుఁ. నావిష్కృతమూర్తు లెఱుఁగు ♦ మరవిందభవుం
డావిష్ణుండును రుద్రుం, డావిశ్వేశ్వర సదాశి♦వాహ్వయులు హరీ ! 21

గీ॥ పంచబ్రహ్మసమాఖ్యముల్ ♦ పరమశివత
నువులు మఱియైదుగలవు వి♦నుము క్రమముగ
అల్ల ఈశానపురుషంబు ♦ లాయఘోర
వామసద్యోజములు నాగ ♦ వాసుదేవ ! 22

క॥ అందీశానతనువు మొద, లందనరు గరిష్ఠమగుచు ♦ ఠవణిల్లెడు నిం
కం దాఁబ్రకృతికి భోక్తయు, నందగు క్షేత్రజ్ఞునందు♦నధ్యక్షించున్. 23

గీ॥ భువననాథు తత్పురుషాఖ్య ♦ మూర్తి భోగ్య
మును గుణాశ్రయాత్మకమునై ♦ పొదలుచున్న
యట్టి యవ్యక్తమందుఁ దా ♦ నధివసించు
దేవకీసతిగర్భశు♦క్తి ఫలమూర్తి ! 24

గీ॥ భోగిభూషునఘోరాఖ్య♦మూర్తిమిగుల
పూజ్య ధర్మాదికాష్టాంగ ♦ బుద్ధితత్త్వ

మును నధిష్ఠించియుండుఁ బెం ♦ పొనర నరయు
యదుకులక్షీరసింధుహి♦మాంశుమూర్తి! 25

గీ॥ ఆ మహాదేవు వామదే♦వాఖ్యమూర్తి, యలయహంకారమందుఁదా ♦ నధివసించి
యుండునని వేదవిద్వదు♦ద్దండులనుచు, తెల్లముంగుము నీమది♦నిద్ధహృదయ! 26

గీ॥ అమితవర్చస్కుఁడైన దే♦వాధినాథు, నల్లసద్యోజ నామధే♦యమగు మూర్తి
మానసంబునధిష్ఠించి ♦ జానుమీఱుఁ, దెలియుదురు మతిమంతులో♦శ్రీకృష్ణ! 27

గీ॥ శ్రుతులకును వాక్కులకు శబ్ద♦తతికి గగన, మునకునున్ విభునీశాన♦మూర్తియనుచు
త్వక్కునకుఁ బాణికిఁ స్పర్శ♦వాయువులకు, నేతగాఁ దత్పురుషమూర్తి♦నీ వెఱుఁగుము

గీ॥ అక్షిపదరూపములకును ♦ నగ్నికిని న, ఘోరమూర్తి యధిష్ఠాత ♦ గోపమూర్తి!
రసనకుఁ బాయువునకును♦రసమునకుద, మునకు నావామదేవాఖ్య♦మూర్తి ప్రభువు

గీ॥ ఘ్రాణమునకు నుపస్థకు ♦ గంధమునకు, భూమికిని నీక సద్యోజ♦మూర్తి తాన
ఈశ్వరియగు నెఱుంగుమీ♦యేను శివుని, మూర్తు లర్చనీయంబులు♦బుధులకెల్ల.

—* ఉపమన్యుఁడు శ్రీకృష్ణున కష్టమూర్తితత్త్వం బెఱింగించుట *—

క॥ ఇఁకఁగూడ శివుని మూర్త్య, ష్టకమయమీ సర్వవిశ్వ ♦ సముదాయంబా
సకలేశునందె జగము ల, వికలంబుగనుండు సూత్ర ♦ వేష్టితమణులై. 31

వ. శర్వుండు భవుండు రుద్రుం డుగ్రుండు భీముండు పశుపతి యీశానుండు మహా
దేవుండు ననువార లష్టమూర్తులుగ విశ్రుతులు. భూమ్యుదకాగ్ని మరుదాకాశ
క్షేత్రజ్ఞ రవిచంద్రులు మహేశ్వరుని శర్వాదిమూర్తులచే నధిష్ఠితులు. 32

క॥ వినుము చరాచరవిశ్వం, బునునంత ధరించు పృథివి ♦ పురుషోత్తమ! శం
భుని యలశర్వునిమూర్తియె, యనియామ్నాయముల నిశ్చ♦యంబిదియరయన్.

గీ॥ జగములకు జీవనంబైన ♦ సలిలమెల్ల, శివుని భవమూర్తిగా నెంచు♦శ్రీసహాయ!
జగము బహిరంతరంబులఁ♦జక్కనిండి, యలరు తేజము శివునిరు♦ద్రాఖ్యమూర్తి

క॥ కదలింపుచు విశ్వంబును, గదలుచు ధరియించుచుండు ♦ గంధవహుండు శ
క్తిదయితుని యుగ్రమూర్తిగ, యదువంశోద్భూతమౌక్తి♦కమ! యరయు మదిన్.

గీ॥ సర్వమున కవకాశంబొ♦సఁగుచు సర్వ, మందు వ్యాపించియును భూత♦బృందభేది
కయయి రాజిల్లు మందునా♦కసము హరుని, భీమమూర్తిగఁ దెలియుము♦బిసరుహాక్ష!

క॥ సర్వాత్మాధిష్ఠాతయు, సర్వక్షేత్రతలవర్తి ♦ చక్కనరయుమా!
శర్వుని పశుపతిమూర్తియె, సర్వపశుల పాశములను ♦ సంఛేదించున్! 37

గీ॥ దివ్యమూర్తి జగములకుఁ♦ దెల్విదీప్తి, జక్కనిడు రవి శివునియీ♦శానమూర్తి
అఖిలవిశ్వంబునకునునా♦ప్యాయ మొసఁగు, శశి మహాదేవమూర్తియే♦శౌరి యరయు!

గీ॥ ఇట్లు మూర్త్యష్టకంబున ♦ నీజగములు, సర్వములునిండి వెలసెడు ♦ శంకరుండు
ఆ శివునిగొల్వ జగముల♦కమరువృద్ధి, శాఖి మూలసేకంబున ♦ శాఖలెసఁగు. 39

క॥ సర్వాభయప్రదానము, శర్వానుగ్రహణమును ♦ బ్రశస్త చరిత్రా!
సర్వోపకారకరణము, శర్వార్చనమనుచుఁదెలియు ♦ స్వాంతములోనన్. 40

గీ॥ పితకుఁ బుత్రపౌత్రాది సం♦ప్రీతియెటులఁ, బ్రీతికరమో యటుల్ జగ♦త్ప్రీతిశివునిఁ
బ్రీతుఁజేయు నెవ్వనికేని♦బీడసేయ, శంకరునకగుఁబీడ సం♦శయములేదు. 41

వ: అని యుపదేశించిన విని మరలఁ బురుషోత్తముఁ డిట్లడిగె.

క॥ దేవా! మూర్త్యష్టకమున, నీవిశ్వము సర్వమిట్టు ♦ లీశ్వరమయమై
తా వెలయఁగ స్త్రీపూరుష, భావాత్మంబెట్లు హేతు♦భావము నొందెన్. 42

వ. అని యడుగుడు గురుం డిట్లనియె.

—* శివశక్తి సమాన ధర్మకథనము *—

క॥ శక్తి మహాదేవియెయిఁక, శక్తి యుతుఁడు శివుఁడు దేవ♦చక్రేశ్వరుఁడా
శక్తి శివభూతిలేశమె, నక్తంచరహర! జగద్గ ♦ ణం బఖిలమునన్. 43

గీ॥ అరయు మొక్కింత చిద్రూప♦మైన వస్తు, వట్ల చిద్రూపమొక్కింత♦యైనవస్తు!
వదియు శుద్ధమశుద్ధము♦నపరమును బరమును శివశక్తిమయముస♦ర్వమిదిచక్రి

గీ॥ శౌరి! చిచ్చక్రమెదియచి♦చ్ఛక్రియుతము, నగుచుసంసృతినొందున♦య్యదియెశుద్ధ
మదియెయపరంబు తదితరం♦బై నయద్ది, పరమనుచునీ వెఱుంగుము♦ భావమందు.

గీ॥ చిదచిదాత్మకమీద్వయి ♦ శ్రీకళత్ర! శివునియొక్కయు శివయొక్క♦శ్రీఘనంపు
స్వాత్మ్యముగను దదీయని♦సర్గజముగఁ, దెలియు మంతరంగంబునఁ♦దేటపడును.

క॥ వశమగువిశ్వము శివులకు, వశులు శివుల్గారు విశ్వ ♦ వలయమునకటుల్
కుశల! జగమీశితవ్యము, విశదంబిది తెలియుశివులు♦విశ్వేశానుల్. 47

క॥ శివుఁడెట్లో శివ యట్లే, శివయెట్లో శివుఁడునట్లె♦సిద్ధంబిదియా
కువలయరాట్కౌముదులకు, నవిరళయోగంబెకాక♦యంతరమెట్లా. 48

గీ॥ చంద్రిక వినాగ మెరయఁడు ♦ చందురుండు
శివుఁడు శక్తివినాయున్న ♦ శ్రీలఁగనఁడు
ప్రభవినా భానుఁడెపుడు సం ♦ భవము నొందఁ
డా ప్రభయుభానుని వినాగ ♦ నమరదరయు. 49

వ, ఇట్లు శక్తి శక్తిమంతుల సంస్థితి పరస్పరాపేక్షంబై యొనరుచుండు.

క॥ శక్తి శివుఁబాసియొనరదు, శక్తిని బాసి శివుఁడొనరఁ ♦ జాలఁడు వినుమా
శక్తుఁడగు శివుఁడు శక్తిని, భుక్తిని ముక్తినిడు భక్త ♦ పుంజంబులకున్. 51

గీ॥ ఆద్య పర చిన్మయియును శి♦వాశ్రియయును, ఆశివానుగుణయును శి♦వానుధర్మ
యును బ్రసవధర్మిణియునయి♦యొప్పుశక్తి, విశ్వమునొనర్చునుశివేచ్ఛ♦వివిధగతుల.

—* శక్తిమయ జగద్వర్ణనము *—

గీ॥ అట్టి మూలప్రకృతి మాయ♦మైన శక్తి, త్రిగుణమై త్రివిధంబుగఁ ♦ దేజరిల్లు
నాపెచేతనె యీవిశ్వ♦మంతనిండు, నాపెచే విశ్వమిది విప♦ర్యస్తమగును. 53

గీ॥ తానయేకవిధయు ద్వివి♦ధయును ద్రివిధ, దశవిధయు శతవిధ శత♦దశవిధయును
నగుచుఁ బెక్కురుశక్తులై♦వ్యవహరించు, విశ్వమందిట్లుదెలియు సం♦విన్మయాత్మ!

గీ॥ ఆదిసర్గమందాశక్తి♦యలశివేచ్ఛఁ, బరమశివతత్త్వమందైక్య♦భావమొంది
విస్ఫురించుచునుండు బల్♦విందుమీఱఁ, దిలలయందెట్లు తైలంబు♦తేజరిలునో,

గీ॥ శక్తిమంతునిచే శక్తి ♦ జనితమైన, ఆక్రియాశక్తి విక్షోభ ♦ మందనంత
నాదము సముద్భవంబయ్యె♦నాదముననుఁ, బిందువాబిందువున నుద్భ♦వించెశివుఁడు.

క॥ ఆయతులుచే మహేశ్వరుఁ డాయనచే శుద్ధవిద్య ♦ యది జన్మించెన్
ఆయమవాక్కులకీశ్వరి, యై యలవాగీశరాజ్ఞి ♦ యై చెలువొందెన్. 57

వ. ఆ వాగీశ్వరియే వర్ణస్వరూపంబుచేత మాతృకయని వ్యవహరింపఁబడును. 58

గీ॥ అంత విను యదునాథ! య ♦ నంతయోగ
మునను నమ్మాయ దాఁ గాల ♦ మును గలను ని
యతిని విద్యను రాగంబు ♦ నాక్రమమునఁ
బూరుషులను నిర్మించెబల్ ♦ పొంకముగను. 58

గీ॥ తిరుగ నామాయచేతనే ♦ త్రిగుణరూప, మైనయవ్యక్తమొదవె న♦ద్దానఁద్రిగుణ
ములు విభక్తంబులై జగం♦బునను సత్త్వ, మును రజంబుతమంబునా♦వవరెనిండి.

గీ॥ క్షోభ్యమాణత్రిగుణముల ♦ గుణపతులయి, బ్రహ్మవిష్ణురుద్రాఖ్యులు♦వరఁగిరంత
నాత్రిమూర్తులువారిచే♦నమ్మహత్తు, మున్నుగలతత్త్వములు గ్రమ♦మ్ముగనుబొడమె.

వ. శివాజ్ఞచే నవ్వానిచేత నసంఖ్యాకంబులగు నండపిండంబులుద్భవించె. అవ్వి చక్ర
వర్తులగు ననంతాది విద్యేశ్వరులచే నధిష్ఠితంబులై యుండు. ఇఁక శరీరాంతర
భేదంబున స్థూలసూక్ష్మంబులననుసరించి నానారూపలగు శక్తులయొక్క భేదం
బులు కీర్తితంబులయ్యె. త్రిమూర్తులందాశక్తి త్రిశక్తిస్వరూపిణియగు. సర్వ
విశ్వంబు శక్త్యాత్మకంబు శక్తిభరితంబు. దేహంబెట్టు లంతరాత్మలో నెలయునట్లే
ఈ స్థావరజంగమంబగు నఖిలజగంబు శక్తిమయంబుగ నెఱుంగుము. పరమాత్మ 62
కలచే నీ పరమశక్తి నిరూపింపఁబడినది,

గీ॥ ఈశ్వరేచ్ఛానుయాయిని ♦ యిదియె పరమ, శక్తి యిద్దిచరాచర ♦ జగము నెల్లఁ
జక్కనిచ్ఛాక్రియాజ్ఞాన ♦ శక్తులనెడు, నాత్మశక్తులచేఁ జేయు ♦ నబ్జనాభ! 63

గీ॥ శక్తిమంతుఁడీశ్వరుఁడు వి ♦ శ్వంబు నెల్ల, నిండియుండును దానెప్డు ♦ నీరజాక్ష!
ఇద్దియిట్టులనిట్లుకా ♦ దద్దియనెడు, నదియె శివుని యిచ్ఛాశక్తి ♦ యదెనియంత్రి.

గీ॥ జ్ఞానశక్తియె తత్కార్య ♦ సాధకములు, కరణకారణములును జో ♦ క్కమగు బుద్ధి
ఇఁకఁ గ్రియాశక్తి యాప్పితం ♦ బెట్టులట్లు, జగమునన్ సర్వకార్యముల్ ♦ సరగఁ దీర్చు.

గీ॥ ప్రసవధర్మిణి శక్తి యీ ♦ సకలజగము, నిట్లు విరచించు శివుఁడు దా ♦ నిట్లు శక్తి
యోగమున శక్తిమంతుఁడై ♦ యొప్పు విశ్వ, మిట్లు శైవంబు శాక్తమై ♦ యెసఁగె వినుము.

క॥ తలిదండ్రి లేక కొమరుఁడు, పొలుచునె విశ్వమున శివశి ♦ వుఁడును వినా తా
వెలయునెటుల్ చరమచరమ, ఖిలవిశ్వము నీ వెఱుఁగుమొ ♦ గిన్ శ్రీకృష్ణా! 67

## —* పార్వతీపరమేశ్వరాత్మక స్త్రీపుంస స్వరూప నిరూపణము *—

క॥ స్త్రీపుంసప్రభవంబును, స్త్రీపుంసాత్మకమునైన ♦ త్రిభువనమెల్లన్
స్త్రీపుంసాధిష్ఠితమును, స్త్రీపుంస విభూతియనుచుఁ ♦ దెలియుము కృష్ణా! 68

క॥ పరమాత్మ శివుఁడు శివయును, బరమాత్మ శివుఁడు సదాశి ♦ వప్రథనమరన్
హరి! శివ తానమనోన్మని, యరయు మహేశ్వరుఁడు శివుఁడె ♦ యలమాయ శివా.

సీ॥ రుద్రుఁడు శివుఁడు దా ♦ రుద్రాణి శివ యగు, హరి శివుండా శివ ♦ యగును లక్ష్మి
బ్రహ్మయే శివమూర్తి ♦ బ్రహ్మాణి శివ తానె, భానుండు శివుఁడు శి ♦ వయె ప్రభ యగు
ఇంద్రుండు శివుఁడు దా ♦ నింద్రాణియగు శివ, అగ్ని శివుండు స్వా ♦ హాయె శివ యగు
యముఁడల్ల శివుఁడు త ♦ దవరోధమే శివ, క్రవ్యాది శివుఁడు త ♦ త్కాంత శివయె
గీ॥ వరుణుఁడు శివుండు వరుణాని ♦ యరయు శివయె
గంధవహుఁడు శివుండు త ♦ త్కాంత శివయె
రాజరాజు శివుండు త ♦ ద్రాజ్ఞి శివయె
శివుఁడె యీశానుఁడాతని ♦ చెలువ శివయె. 70

క శివుఁడే సోముఁడు రోహిణి, శివయె యనంతుండు శివుఁడు ♦ శివ తత్సతియా
శివుఁడెల్ల పూరుషులు దా, శివయే భువనములలోని ♦ స్త్రీలెల్ల హరీ! 71

క॥ విషయంబా పరమేశ్వరి, విషయి మహేశ్వరుఁడు క్షేత్ర ♦ వితతి శివ యగున్
విషహరుఁడా క్షేత్రజ్ఞుఁడు విషజాతనయన! యెఱుంగు ♦ విదితమిది మదిన్. 72

క॥ ద్రష్టవ్య వస్తువులును, ప్రష్టవ్య పదార్థములును ♦ బరమేశ్వరియే
ద్రష్టయును మఱియు నిఁకా, ప్రష్టయుఁ బరమేశ్వరుండె ♦ జలజాతాక్షా! 78

గీ॥ అరయు ప్రాణస్థితి యఖిలం ♦ బా శివాని, ప్రాణమా శివుఁ డుత్ఫుల్ల ♦ పద్మనేత్ర!
శబ్దజాలంబు సర్వమా ♦ శంభురాజ్ఞి, అర్థమఖిలంబు దెలియు చం ♦ ద్రార్ధమౌళి.

—* జగదంతర్భూత శివ విభూతి *—

వ. ఇఁక విశ్వమందలి పదార్థంబులలోని శక్తియుఁ దేజంబు సర్వంబు మహేశ్వరీ మహేశ్వరులుగఁ దెలియుము, జగంబందుఁ బుణ్యంబైనదియుఁ బవిత్రంబైనదియు మంగళంబైనదియునగు నెల్లనుమామహేశ్వర తేజంబుగ నెఱుంగుము. మఱియు శ్రావ్యమంతవ్యబోద్ధవ్యంబులు మున్నగునవి మహేశ్వరిగను శ్రోతయు మంతయు బోద్ధయు మున్నగునట్టేఁడు మహేశ్వరుఁడుగ నెఱుంగుము. 75

క॥ శివతా నిశ శంకరుఁడే, పవ లాకాశంబు శివుఁడు ♦ వసుమతి శివ సిం
ధువు శివుఁడు వేలయే శివ, భవుఁడు మహావృక్షమా భ ♦ వానిలతయగుఁగా. 76

క॥ దీపశిఖ యెట్లు గృహమును. దీపింపఁగఁ జేయునో య ♦ దేవిధ మొప్పన్
దీపింపఁ జేయు బూర్ణం, బాపరమేశ్వరుల తేజ ♦ మఖిలజగంబున్. 77

క॥ సర్వాకారాత్మకులును, సర్వ శ్రేయస్సమృద్ధి ♦ సంధాయకులా
శర్వుఁడు శర్వాణియునున్, సర్వజగత్పూజ్యులనుచు ♦ శౌరి! యెఱయుమా! 78

గీ॥ ఇట్లు నా ప్రతిజ్ఞ కొలది మ ♦ హేశ్వరులయ, థార్థమగునాత్మవిభ ముప ♦ న్యాస మొనరఁ
జేసినాఁడను నీకిష్టు ♦ శివులయాత్మ, వైభవంబింతయే కా ద ♦ వాచ్యమరయ. 79

గీ॥ చెప్పఁటకు శక్యమోటులగు ♦ శివులయాత్మ, విభవము మహాపురుషమనో ♦ విధులకు బ
హిర్గతంబయి యేయుండు ♦ నీశ్వరైక, చిత్తులకనన్యులకు ♦ నది చేత మొందు. 80

గీ॥ అట్లు తక్కిన వారికి ♦ ప్పట్లనంద, దందిననునట్లుగాదు ప ♦ ద్మాక్ష! యిదియుఁ
బ్రాకృతివిభూతియిఁకనున ♦ ప్రాకృతియొప, రంబుగుహ్యంబు గుహ్యవి ♦ ద్రాజధనము.

గీ॥ మరలు నెద్దాన వాక్కులు ♦ మానసంబు, తోడ నింద్రియవర్గంబు ♦ తోడఁ గూడ
అద్దియప్రాకృతియుఁ బార ♦ మాత్మికయును, నైనయట్టి విభూతి శు ♦ ద్ధాత్మ! తెలియు.

క॥ అదియే పరమపుధామం, బదియే పరమమగు గతియు ♦ నదియే పరమా
స్పదమగు పరశివవిభవం, బదినొందయతింతు రియోగు ♦ లాజితచిత్తుల్. 83

క॥ సంసారాశీవిషవిష, హింసాహరణౌషధము మ ♦ హేశవిభవమా
శంసార్హ మెఱిఁగినట్టేఁడు, కంసాంతక! వెఱవ డెట్టి ♦ కారణములచే. 84

గీ॥ ఇట్లెఱింగించితిని పర ♦ మేశ్వరులయ, థార్థమానాత్మవిధమునీ ♦ వస్తుఁడవు మ
హేశ్వరాత్యంతభక్తుడ ♦ వెఱిఁగి మదిని, నీవునున్ దెల్పుకు మభక్త ♦ నికరమునకు.

క॥ తెలిపెదు నెడ నిను బోలున, ఖలులకు భక్తులకు బోధఁ ♦ గావింపుము ! యో
గ్యులకిది యుపదేశంబును, సలిపిననతఁడొందు శర్వ ♦ సాయుజ్యంబున్. 86

క॥ ఇది తెలియలేరు పశుల, జ్ఞులు పాశబలంబుఁ జేసి ♦ నూత్నమరయకే
యదునందన! శివునొక్కని, బదుగురు పదివిధములుగను ♦ వచియింతురొగిన్. 87

## —* శివధృత నానారూప వర్ణనము *—

గీ॥ హరి! పరబ్రహ్మరూపంబు♦పరమునపర, ముగవిలసిలు ననాద్యంత♦ముగఁదనరుఁబ
రమని భూతేంద్రియాంతఃక♦రణప్రధాన, విషయరూపంబపరమని♦విశదముగను.

వ. పరమగు పరబ్రహ్మరూపంబు చిదాత్మకంబనాద్యంతంబు "బృహత్త్వాత్ బృంహణత్వాత్ పరం" బని విజ్ఞులు నిశ్చయించిరి. పరమపరంబను నీరెండును బ్రహ్మణఃపతియగు పరమేశ్వరునిరూపంబులే. 89

క॥ ఇఁకనునవిద్యావిద్యా, త్మకుఁడీశ్వరుఁడని కతిపయ ♦ తజ్ఞులనుదు రీ
సకలప్రాణులు విద్యయు, సకలాచేతన మవిద్య ♦ శౌరి! యరయుమా! 90

వ. విద్యావిద్యాత్మకమగు విశ్వంబంతయు విశ్వగురునిరూపంబుగా విజ్ఞులు సెప్పుదురు విశ్వంబంతయు నీశ్వరునికి వశంబైయుండుటను—ఇఁక. 91

గీ॥ భ్రాంతివిద్యయుఁ బరమును ♦ బరమశివుని, రూపమంచు వచింతురు♦రూఢి మెఱయ
అర్థముల నయథాబుద్ధి♦యగును భ్రాంతి, విద్యయొ యథార్థసంవిత్తి♦వినుముకుంద!

వ. ఇఁక వికల్పరహితంబైనది పరంబుగా నెఱుంగుము. తదాజ్ఞాధిష్ఠితంబై జగంబు వెలయుటచేత మఱియును గొందఱీశ్వరుని సదసద్రూపుఁడనియును సదసత్పతియనియును జెప్పుచున్నారు. 93

గీ॥ సత్యమున సాధువందును♦సత్పురుషులు, పరగ సచ్ఛబ్దమునువాడు♦దురు తదితర
మందసచ్ఛబ్దమును నెప్డు♦వ్యాహరింతు, రిట్టి సదసజ్జగంబు మ♦హేశమూర్తి! 94

వ. ఇందుచే సదసద్రూపుఁడనియు నిట్లే సదసజ్జగంబునకుఁ బతియౌట సదసత్పతియనియును జెప్పుచున్నారు. 96

క॥ అవ్యక్తమును సమష్టిగ, నావ్యక్తము వ్యష్టిగాఁగ ♦ ననుశాసింత్రా
యవ్యక్తవ్యక్తములా, యవ్యయునకు రూపములు త♦దాత్మానుస్మృతిన్. 96

వ. మఱియు నివ్వానికి శివుండే కారణంబగుటఁ గారణార్థవిదులు శివుని సమష్టివ్యష్టికారణంబనియును జెప్పుచున్నారు. 97

గీ॥ అనెదరు ప్రధానపూరుష ♦ వ్యక్తకాల, రూపుఁడని మఱికొందఱా♦రుక్మభుజుని
బ్రకృతియె ప్రధానమగును క్షే♦త్రజ్ఞుఁడల్ల, పురుషుఁడావ్యక్తమిట్టిది♦మూఁడుచూఁడు.

వ. కాలము కార్యప్రపంచమునకుఁ బరిణామకారణము. ఈయన్నింటికీశ్వరుఁడును ధాతయుఁ బ్రవర్తన నివర్తకుఁడును నావిర్భావతిరోభావహేతుండును నజుండును నగు వాఁడొక్కండు పరమేశ్వరుండేయగుటఁ బ్రధానపూరుష వ్యక్తకాలస్వరూపుఁడని యనుచున్నారు. మఱికొందఱు విరాట్టగు హిరణ్యగర్భుండనియు వేఱొక్కరంతర్యామియనియును జెప్పుచున్నారిట్లనేకప్రకారంబుల నూహించి వచింపుచుఁ బరమేశ్వరుని యాథాత్మ్యంబు నిశ్చయింపలేకున్నారు. 99

## —* శివపరిభావ ప్రతిపాదనము *—

గీ॥ కలుగ దాణవబంధంబు • కార్యబంధ, మింక నురూహ్యేయ బంధము • ప్రకృతిబంధ
మల్లబొద్ధమౌ బంధమ • హంకృతిజవు, బంధమును లేవు శివునకే • బంధములును. 100

క॥ కాలముఁగలయును విద్యయు, నీలగ్రీవునకు లేవు • నియతియు రాగం
బేలాటి వగయు మఱియుఁ, నేలిప్సయు లేదు తెలియ • మిాశునకుహరీ. 101

గీ॥ కనుము! సత్కర్మమును నస • త్కర్మమును దదీయము విపాకమా మహా • దేవునకుఁ
లేవు సుఖదుఃఖములు నస్లి • వేవు తత్ఫలములు లేవెట్టి కాలభో • గములు కృష్ణ! 102

క॥ హరి! శివునకుఁ గర్తయు నున్, గరణంబును లేదు మొదలు • గలుగదు తుదియున్
మఱి బాంధవుండు నుండం, డరియును విభుఁడును సముండు • నధికుండరయన్. 103

క॥ జననము మరణము శివునకు, నొనరదు విధియును నిషేధ • మొనరదు బంధం
బును మోక్షంబును నొనరదిఁ, కొనరద కల్యాణమెదియు • నూహింపు మిటుల్.

వ. పరమశివుండగుట సకలకల్యాణంబులు స్వతస్సిద్ధంబులై యుండు.

మత్తకోకిల॥ ఈశితవ్యము నీ ప్రపంచము • నెంతయేని ముదంబులో
నీశలై చెలువెందు శక్తుల • నెవ్వఁగూడి యనాదియౌ
నీశుఁడచ్యుత భావుఁడొక్కరుఁ • డేసమస్తము నిండి ల
క్ష్మీశ! పాలనసేయుచుండు గ్ర • హింపు! స్థాణుసమాఖ్యుఁడై. 106

గీ॥ పరశివాధిష్ఠితంబు వి • శ్వంబు సకల, జంగమస్థావరంబిది • శర్వరూప
మనుచు నెవ్వఁడెఱుంగునో • జనుఁడతండు, మోహమును జెందఁడెప్పట్లఁ • బురుషతిలక.

చ॥ పురుషుఁడు రుద్రుఁడీశ్వరుఁడు • భోగివిభూషణుఁడద్రిజేశుడున్
బరుఁడు పినాకపాణివృష • వాహనుఁడున్ భగవానుఁడాద్యుఁడా
యరుణుఁడు కృష్ణపింగలుఁడ • నంతుఁడు సౌమ్యుఁడు ఘోరమూర్తియ
క్షరుఁడు హిరణ్యకేశుఁడును • స్వర్ణభుజుండు శివుండుచూఁడుమా. 108

క॥ ఆ పురుషవిశేషుండును, నాపరమశివుండు నంత • కాంతకుఁడును నా
నాపరమ పరముఁడే స, ర్వోపరివర్తి యని యెఱుఁగు • మున్నతచరితా! 119

శా॥ వాలాగ్రప్రకృతిమాత్రుఁడై వెలయు హృ • త్పద్మంబు మధ్యంబునం
దాలోకేశ్వరుఁడా జగన్మయుఁడు ప • ద్మాక్షుండు తామ్రుండునున్
నీలగ్రీవుఁడునై చరించు నితఁడే • నిత్యుండు భావంబునం
దీలీలాధరు నీవారున్ దెలియ లే • రేలాటి మోహాత్మకుల్. 110

వ. ప్రతిసర్గప్రసూతులును గాలావచ్ఛేదవర్తులునగు బ్రహ్మలకెల్ల నితఁడే యామ్నా
యపాతంబు నుపదేశించు. మఱియు గాలావచ్ఛేదయుక్తులగు గురులకెల్ల నితండే
గురుఁడీశ్వరుండు కాలావచ్ఛేదవర్జితుండు. 111

గీ॥ అతనిసిద్ధిస్వాభావికి ♦ యతనిశక్తి, దెలియుసర్వాతిశాయిని♦దివ్యమూర్తి!
అప్రతిమముజ్ఞానంబు దే♦హంబునిత్య, మునువిశుద్ధమైశ్వర్యమో♦యనితరంబు.

క॥ మఱియున్ దేజమువీర్యం, బరయుప్రభావంబుక్షమయు ♦ నలకరుణయునున్
సరిలేనివనుచుమనమున, నెఱుఁగుము శివునందుసతత ♦ మిద్ధవిచారా ! 113

క॥ అనఘ! పరిపూర్ణుఁడా శ,ర్వున కీసర్గాదులను నె♦పుడు నెట్టిప్రయో
జనమదిలేదన్నియునా, పనులకితరులఁగలకృపయె♦ఫలమరయంగన్. 114

గీ॥ అట్టిదేవుండు శివపర ♦ మాత్మ యతని, వాచకము ప్రణవంబు శి♦వభవరుద్ర
శబ్దములలోనమిగులు వా♦చకముప్రణవ,మాప్రణవజపమున నెక్కు♦డగునుసిద్ధి.

క॥ అక్కతనఁజెప్పుదురుబుధు, లక్కోమలచంద్రధరుని ♦ నఖిలగురుని దా
నొక్కయక్కరపువేల్పని, యొక్కటి శబ్దార్థములని ♦ యూహింపుమిటుల్.

వ. ఈప్రణవంబునకు నాల్గుమాత్రలలరు. అకారంబు ఉకారంబు మకారంబు నాదంబు అకారంబుమహాబీజంబు రజంబు స్రష్టయగు చతుర్ముఖుండు ఉకారంబు సత్త్వగుణంబు ప్రకృతి యోని పాలయిత విష్ణుండు మకారంబుపురుషుండుబీజంబు తమస్సుసంహారకుఁడుహరుండు నాదముపరమపురుషుం డీశ్వరుండు నిర్గుణుండు నిష్క్రియుండు శివుండు. ఇట్లీశ్వరుండు మూడుమాత్రలచేతఁ ద్రివిధంబుగఁ బ్రతిపాదించి యర్ధమాత్రముచేత స్వకీయంబగు శివాత్మమును బోధించుచున్నాఁడు. అకారము ఋగ్వేదంబుగ ఉకారంబు యజుర్వేదంబుగ మకారంబు సామవేదంబుగ నాదంబాథర్వణ వేదంబుగఁ జెప్పఁబడినది. 117

ఉ॥ ఎవ్వఁడు సర్వభావముల ♦ నీశ్వరునందుఁబ్రపన్నుఁడో నతం
డవ్విభునామహేశ్వరున ♦ యత్నముగాఁ గొని శాంతినొందు నిం
కెవ్వఁడుశంకరున్ దెలియ ♦ నెంచఁడొ దుర్భవపాశబద్ధుఁడై
యవ్వెడ నుగ్రదుఃఖభవ ♦ మందు భ్రమించును జక్రనేమియై. 118

క॥ ఎవఁడుగను రుక్మవర్ణుని, గవినిజగత్కారుబ్రహ్మ ♦ కారణుఁబురుషున్
సువిదితుఁడా విద్వాంసుఁడు, భవముల నెడఁబాసిచెందుఁ ♦ బరమపదంబున్. 119

గీ॥ ఆ విరూపాక్షుశక్తిస్వా ♦ భావికియును, విద్యవిశ్వవిలక్షణ ♦ వివిధరూప
ములనుబెక్కులనొంది యం♦భోజబంధు, భాయనన్దగిభాసిల్లు ♦ బద్మనయన!

గీ॥ అట్టిశక్తికిశక్తుల ♦ నంతలుందు, రిచ్ఛజ్ఞానంబుక్రియయు నా♦నెసఁగువార
లల్లమాయాదికలునుమహ ♦ వ్యవహునందు, విస్ఫులింగంబులట్టుల ♦ విశ్వమందు.

క॥ పురుషులుసదాశివాద్యులు, మఱియునువిద్యేశ్వరాది ♦ మహితులునట్లే
కరములరుదు రవ్వారికి, బరాత్పరయుప్రకృతి శక్తి ♦ భాసిలుసతమున్. 122

గీ॥ వినుము! మహదాదితత్త్వంబు ♦ లును నజాది
మూర్తులును నన్యమును సర్వ ♦ మును నశక్తి
కార్యమాశంక లేదు సూ ♦ క్ష్మయుఁ బ్రబోధ
రూప సర్వగ యానంద ♦ రూప యాపె. 123

క॥ శివుఁడరయు శక్తిమంతుడు, శివుఁడేక వేద్యమగు నెప్డు ♦ శివవిద్యయగున్
శివయే శ్రుతియును స్మృతియును, శివయే ప్రజ్ఞయును నాజ్ఞ ♦ శివస్థితి ధృతియున్.

చ॥ శివుఁడటు సర్వకర్తయయి ♦ చెన్నెసలారునో విశ్వకోటికా
శివయును సర్వకర్త్రియయి ♦ చెన్నెసలారునటుల్ సతంబిఁకీ
శవకు వియుక్తియుండదు సు ♦ గంధము పద్మముఁ బాయనట్లు స
త్కవి నమృతోక్తిపీడనిప్ర ♦ కార మెఱుంగు రమామనోహరా! 125

గీ॥ ప్రకృతియలమాయ జీవుఁడు ♦ వికృతియట్లు, సర్వమగుసదసత్తులా ♦ శక్తితతము
లామహాదేవిమాయ మో ♦ హమ్ముఁ గూర్చు, మోక్షమిడు లీల చే సర్వ ♦ భువనములకు

వ. సర్వేశుండీపెతోఁ గూడి సప్తవింశత్ప్రకారంబుగ విశ్వంబు వ్యాపించియుండు నాతని
వలన మోక్షంబు ప్రవర్తిల్లు. మున్నొకప్పుడు ముముక్షులగు కొందఱు మునులు
బ్రహ్మను గూర్చి సంశయావిష్టహృదయులై యిట్లు విమర్శించిరి. 127

—* ఉపమన్యుఁడు కృష్ణునకు జగత్కారకుని గూర్చి చెప్పుట *—

గీ॥ ఎద్ది కారణమగు బ్రహ్మ ♦ మెందువలన, బుట్టినారమిఁ కెద్దానఁ ♦ బోషితులము
ఎందునున్నారమిట్టుల ♦ నీసుఖ తదితరములందు వర్తింతుము ♦ తవిలిసతము

గీ॥ కాలమొ స్వభావమొక్కొ య ♦ క్కడిఁది నియతి
యో యదృచ్ఛయో భూతంబు ♦ లో ప్రకృతియొ
పురుషుఁడో వీనిసంయోగ ♦ మో యరయఁగఁ
గారణము తానె జడము లె ♦ క్కడను గాని. 129

క॥ పూరుషుఁడు సుఖియు దుఃఖియు, గారణమగునొక్క విభుఁడు ♦ గాని యతఁడిటుల్ 130
సారెకుఁ బరస్పరంబు విచారణ యొనరించి ధ్యాన ♦ సంగతినంతన్.

గీ॥ అపుడు నూచిరి మునులు దే ♦ వాత్మశక్తి, నీశ్వరినిఁ ద్రిగుణంబుల ♦ నెంతయును వి
గూఢమగు దానిఁ బాశంబుఁ ♦ గుశలగతినిఁ, ద్రెంచు దాని వివేకంబుఁ ♦ బెంచు దాని.

గీ॥ ఆపెచే భిన్న పాశులై ♦ యచ్ఛదృష్టి, సర్వకారణ కారణు ♦ శక్తిమంతు 132
నమ్మహాదేవుఁ బొడఁగని ♦ రప్రమేయు, నేక తేజమై యెల్లెడ ♦ నొప్పువాని.

వ. అద్దేవుని ప్రసాదయోగంబున దృఢంబగు భక్తియోగంబునను దివ్యపదంబు 133
నొందిరందున.

గీ॥ అట్టి చిచ్ఛక్తితోఁ గూడ ♦ నమ్మహేశు, నెవఁడెఱిఁగి హృదయంబున ♦ నెప్డుఁ జూచు
అట్టివానికి శాశ్వత ♦ మైన శాంతి, యమరు నితరులకమర ద ♦ ట్లరయు మెదను

గీ॥ విప్రయోగంబు శక్తితో ♦ వెలయు దేవుఁడు, శక్తిమంతుండు శివునకే ♦ చందమునను
ఈద్వయంబు ప్రసాదంబు ♦ నెలమిఁ జెంది, కరతలస్థితముగ ముక్తిఁ ♦ గాంచు జనుఁడు.

వ. మోక్షమందు జ్ఞానకర్మంబుల క్రమంబు వివక్షింపఁబడలేదు. ఇకఁ నెట్టివాఁడుగాని పరమేశ్వరప్రసాదంబు నొందెనేని నిస్సంశయంబుగ ముక్తుండగును. ఆప్రసాదంబు భక్తిచేతను భక్తి శివప్రసాదంబుచేతను జనియించుననియు ఈప్రసాదభక్తులు రెండును బరస్పరము కార్యకారణభావంబు నొందుననియుఁ జెప్పుదు రనేకజన్మంబులందు శ్రౌతస్మార్తానువర్తులును విరక్తులగు ప్రబుద్ధులయెడ మహేశ్వరుండు ప్రసన్నుఁడగుననియు ఆయన ప్రసాదంబున భక్తిపొడముననియు నది వృద్ధినొంది క్రమమ్ముగ సర్వపాశంబులనుండి మోక్షంబొనరించుననియు నుపమన్యుమౌనీంద్రుండు చెప్పినవిని శ్రీకృష్ణుండు మరల యిట్లని రించె. 136

క॥ దేవా! వినఁదలఁతు మహా, దేవోక్తము వేదసార ♦ దీపిత మాత్మ
శ్రీవిజ్ఞానము నిజభ, క్తావళికిన్ ముక్తిజనక ♦ మగునద్దానిన్. 137

సీ॥ భక్తిలేనట్టివారి క ♦ ప్రాజ్ఞులకును, గోచరముగానిదెంతయు ♦ గూఢమైన
దా శ్రుతితదంగములనుసాం ♦ ఖ్యమునసుద్ధృతంబయిన దానిఁ దెల్పుము ♦ తాపసేంద్ర!

—* ఉపమన్యుముని శ్రీకృష్ణునకుఁ దెల్పిన ఆత్మజ్ఞానము *—

క॥ అనుడు నుపమన్యుఁడిట్లనె, వినుమికఁ దెల్పెదను సర్వ ♦ వేదోక్తము శ
ర్వునిచేఁ బరిభాషితమును, ఘనము ననాయాసమోక్ష ♦ కారణము హరీ!

మ॥ మును నవ్యక్తమునుండి శర్వుఁడు జగ ♦ మ్మున్ సృష్టిచేయంగ నీ
హను మున్ముందుగ దేవపూర్వు నలబ్ర ♦ హ్మన్ బ్రీతిఁ బుట్టించె న
ఘునుఁడున్ దండ్రిని సర్వకారణునిఁ దాఁ ♦ గాంచెన్ మహాదేవు నం
తనె రుద్రుండు సృజింపు విశ్వమని వే ♦ దంబుల్ సమర్పింపుడున్. 140

గీ॥ అతఁడు జగముసృజించి వ ♦ ర్ణాశ్రమవ్య, వస్థ వేల్పులు చేసెస ♦ వంబుకొఱకు
సోము వెడలించె నాతని ♦ చొప్పునన్ ధ, రాగ్ని రవిసురరాడ్యజ్ఞ ♦ హరులమరిరి.

క॥ వారందఱు వేగంబుగ, శ్రీరుద్రాధ్యాయగీతి ♦ శివుని నుతింపన్
భూరికరుణాలుఁడై య, వ్వారలముందఱను దోఁచె ♦ వైభవమలరన్. 142

గీ॥ అంత లీలార్థమై యమ్మ ♦ హాత్ముఁ డప్డు, వారిజ్ఞానంబును హరింప ♦ వారలపుడు
నీవెవండవనుచు మోహ ♦ నిష్ఠితులయి, యడుగ సురలకు రుద్రుఁడి ♦ ట్లనియె వేగ.

గీ॥ నేనొకండనె పూర్వుండ♦నే నెతొలుత, నుండియుండెడి నిప్పుడు♦నుంటి నుండఁ
గలను నాకంటె నన్యుఁడొ♦క్కండు లేఁడు, నేనె నడిపెద జగముల♦నెమ్మిఁగనుము

ఆ॥ ఇట్లు చెప్పి రుద్రుఁ♦డెలమి నంతర్థినిఁ, జెందె నంత సురలు ♦ దేవదేవుఁ
బరమశివునిఁ గనక♦భక్తితోడ నథర్వ, శిరసుతోడ నుతులు ♦ చేసిరంత. 145

క॥ వారల ననుగ్రహింప న, మారమణుఁడు దేవితోడ ♦ మన్ననలమెఱుగ్
భూరికరుణాహృదయుఁడై, చేరఁగ నవ్వారుగాంచి ♦ చెలఁగి ప్రణతులై. 146

గీ॥ పరమశక్తి యెడమప్రక్క♦భాసిలంగ, సిద్ధులౌ పాశుపతు లోలి ♦ సేవసల్ప
యోగులకు నెపుఁగన్పడు♦చుండువాని, శివునిఁజూచి నుతుల్ పెక్కు♦చేసిరంత,

వ. పరమేశ్వరుండును గృపచే నవ్వారిఁ గాంచి సంతుష్టుండనై తినను దివ్యజను
లాదరంబున నిట్లడిగిరి. 148

గీ॥ దేవ! నీకపచితి యెట్లు♦దీర్చవలయు, నెవనికర్చయం దధికార♦మేర్పడునొ య
థార్థమంతయు మాకిప్పు♦డానతిమ్ము,నుడు శివుం డల్పహాసంబు♦నుంబొనర్చి. 149

— ✱ శివుఁడు దేవతలకు సూర్యాత్మక నిజతనువుఁ జూపుట ✱ —

క॥ దేవినిఁ గని యంత మహా, దేవుఁడు సూర్యాత్మకంబు ♦ దివ్యతనువు స
ద్భావంబునఁ జూపుటయుఁ, దేవతలంతయునుజూచి ♦ తేఁకువ మెఱయన్.

గీ॥ ఘోరమును సకలాశ్చర్య♦గుణయుతమును, సర్వతేజోమయంబును♦శక్తియుతము
అష్టభుజము చతుర్వక్త్ర♦మద్భుతమును, నర్ధనారీకమును గాంచి♦హరుస మొంది.

క॥ తెలిసి దివాకరుదేవునిఁ, గలువలరాజైన దేవిఁ ♦ గనుగొని భువనం
బులు తన్మయములుగాఁగని, సలిలము నర్ఘ్యమునుబట్టి ♦ సల్పి రటు నుతుల్.

క॥ సింధూరవర్ణునకు సం,కంక్రిందనగోవిందధాతృ♦కారణునకునున్
సుందరసుమండలున కర, విందధరున కబ్జనేత్ర♦విలసితునకునున్. 153

క॥ కనకమణిభూషణునకును. ఘనరవిరూపునకు నాది♦కారణునకు వి
ష్ణునకును బ్రహ్మకునుగ్ రు, ద్రునకార్యాసహితునకు ను♦తులివె శివునకున్.

గీ॥ రత్నపూర్ణాంబు ససువర్ణ♦రసము సకుశ
సుమమును సుకుంకుమాద్యంబు ♦ సుప్రశస్త
మును సహేమపాత్రంబును♦మోదమెసగఁ
గొను మొసంగెద మర్ఘ్యమున్ ♦ గోశతాంగ ! 155

వ. అని ప్రార్థించి పరమపురుషున కర్ఘ్యంబు లొసఁగిరి.

గీ॥ ఇట్టు లినమండలంబున ♦ నింపుమీఱ, శివుని నవధానమునఁ బూజ♦చేసి యెవ్వఁ
డర్ఘ్యమిచ్చునొ కాలత్ర♦యంబునందు, వాని కిలదుర్లభము లేదు♦పదయుముక్తి.

వ. మఱియును.

క॥ ఈస్తుతి నెవ్వండేనిఁ బ్రశస్తమతిన్ జపముసేయు ♦ జదువుచునుండున్
నిస్తులవిభవములొందును, స్వస్తిన్ జేకొను నతండు ♦ సత్యమిదియగున్. 157

—* తిరోహితశాస్త్రప్రతిష్ఠ *—

వ. అంత మండలాంతర్గతుండగు హరుండు సర్వాగమోత్తరంబగు శాస్త్రంబు నొసంగిన నందుఁ బూజాధికారంబు ద్విజాతుల కని యెఱింగి మహేశ్వరుని సెలవొంది బృందారకు లందఱు యథాగతంబుగఁ జనిరంతఁ బెద్దకాలంబున నా శాస్త్రంబు తిరోధానంబగుడు నొకప్పుడు మహేశ్వరిచే సంబోధితుండై శివుండు మరల సర్వాగమోత్తరంబగు శాస్త్రంబు ననువదించె నద్ది బ్రహ్మానుమతి నాచే నగస్త్యునిచే దధీచి మున్నగువారిచే స్వయంబుగ శివావతారంబుల చేతను లోకంబునఁ బ్రవర్తితంబయ్యె. 158

చ॥ అనవుడుఁ గృష్ణుఁడిట్లనె షడాననసన్నిభ! జ్ఞానమూర్తి! నీ
వనయము శిష్యపాశహర♦నాథ్యుఁడ వీశ్వరతత్త్వయోగచిం
తనుఁడవు నీముఖాబ్జశివ ♦ తత్త్వసుధారసధార లాని తృ
ప్తినిఁ గొనజాలకుంటి నిటు ♦ దెల్పుము శార్వవిభూతి నింకనున్. 159

గీ॥ మును జగన్మాత శర్వాంక♦మునవసించి, లోకనిశ్రేయసంబెంచి♦లోకగురుని
శివుని నేమిప్రశ్నించెనో♦శివకు నాథుఁ, డేమి తెల్పెనో యెఱిఁగింపు♦మిపుడుదయను.

వ. అనిన నుపమన్యుం డిట్లనియె. 160

—* ఉపమన్యుఁడు కృష్ణునకు ముఖ్యాంశంబును జెప్పుట *—

చ॥ విను యదువంశమౌక్తికమ! ♦ విశ్వగురుండు హరుండు మందరా
ద్రిని నొక చారుకందరస ♦ రిత్తటదివ్యవనస్థలిన్ జగ
జ్జననియుఁ దా విహారమును ♦ సల్పుచు నెచ్చెలి దెచ్చినట్టి నూ
తనవికచప్రసూనదళ ♦ దామములన్ గయిసేయఁగా నుమన్. 161

గీ॥ తనదులోడ నెక్కఁజేసి ని♦తాంతకాంతు, కమున క్రీడఁగ్గ సేసి ♦ కడిఁదిహర్ష
మొప్పనున్నతఱిన్ దేవి♦యొప్పమీఱ, విభుని లోకోపకృతి కిటుల్ ♦వేగనడిగె.

గీ॥ దేనిచే వశమయ్యెదు ♦ దేవదేవ!, అల్పశక్తులు నకృతాత్ము♦లైన యట్టి
మానవులకీవువచియింపు♦మా! కరంబు, నాదుచిత్తంబుహొంగనా♦నందమునను.

వ. అనియడిగిన మహేశ్వరికి మహేశ్వరుండాదరంబున నిట్లనియె.

గీ॥ కానుపశ్యుఁడనెపుడును♦గర్మమునను, జపమునన్ దపమునను వి♦జ్ఞానమునను
వన్యమున దేనిచేనిఁక ♦ నవధరింపు, భక్తి చేతను వశమాదు ♦ భక్తతతికి. 164

గీ॥ భక్తి యెక్కుడు గలిగినఁ ♦ బడఁతి! మానిసులకు వశమౌదుఁ బ్రేమతోఁ ♦ జూడఁబడుదు
మాటలాడుదు ముట్టుదు ♦ మఱియు నెంత, యేని బ్రియమొనరింపుదు ♦ నిగురుఁబోఁడి!

క॥ డాసన్ బడయఁగ వలయు న, నూనంబగు భక్తి భువి న ♦ నూర్జఁ గోరెడు న
మ్మానవులు వర్ణయుక్తులు, మానిని! ధర్మాభివృద్ధి ♦ మనుదురు దీనన్. 166

గీ॥ భామ! వర్ణాశ్రమాచార ♦ పరులకే యె, సంగు నచ్చంపుభక్తి పొ ♦ సంగ దవ్య
జనులకిది మామకాజ్ఞ చే ♦ వనజభవుఁడు, వారలకుఁ గూర్చుచుండును ♦ వైభవముగ.

వ. మఱియు వర్ణాశ్రమధర్మంబు గూడ నాచే నుత్పాదింపఁబడి చతుర్ముఖునిచేఁ బ్రవర్తింపఁ జేయఁబడినదాట నన్నుఁ గోరువారెల్ల నియతితో వర్ణాశ్రమ ధర్మంబు ననుష్ఠింపవలయును. అట్టి వర్ణధర్మానుష్ఠాతలకే మదీయభక్తిజ్ఞానంబులం దధికారం బన్యులకు లేదు. 168

ఆ॥ అందుఁ జేసి మామ ♦ కాజ్ఞానువర్తులై, వర్ణధర్మనిరతి ♦ వాసి మీఱ
భక్తిఁ జెంది పాప ♦ పాశంబులను బాసి, నన్నుఁ జేరవలయు ♦ నలిననేత్రి! 169

వ. ఇఁక త్రైవర్ణ్యసంజాతులుగాక తక్కిన వారలుగూడ వేదోక్తవిధానంబు లేకయే నిర్మలహృదయంబున విశుద్ధభక్తిఁ జెంది దృఢభక్తులై నన్ను సేవించిరేని సత్యంబుగ మత్ప్రసాదంబు నొందుదు రిందు సందియంబు లేదు. అజ్ఞుఁడును నమాయికుఁడునగువాని కొదవు భక్తి నిశ్చలయగు ననియిట్లు చెప్పినంత నమ్మహేశ్వరి సంతుష్టయై దేవా! జనంబులందలి నీదు భక్తి నెఱుంగుటకుఁ దగులక్షణంబులను నీవా నర్చినట్టి వర్ణాశ్రమధర్మనిబంధనంబుల నెఱింగింపుమని ప్రార్థించిన మహేశ్వరుం డిట్లనియె. 170

గీ॥ విను! మదర్పితచిత్తులై ♦ తనరు నమ్మ, హాత్ములఁ గలట్టి గురుతులె ♦ న్నియిపుడు
బుధులు లెక్కించి రవియష్ట ♦ విధములనుచు, వాని దెల్పెద వినుము పు ♦ వ్వారుఁబోఁణి!

గీ॥ నాదుభక్తజనంబులం ♦ దలి ప్రవత్తి, నాసమర్చనమతి యర్చ ♦ నము స్మరణము
నాకొఱకుఁ దగుకృషి నాక ♦ థాకుతుకము, స్వరదృగంగవికృతిజీవ ♦ చర్యయివియు.

క॥ ఇవి చిహ్నంబులరయు మ, ష్టవిధంబులు భక్తికద్రి ♦ జాతరో! జగమం
దెవనియెడ నుండునో యీ, యవి వాఁడే పూజ్యుఁడును మ ♦ దాకారుఁడునౌ. 173

గీ॥ పత్రపుష్పఫలాంబుల ♦ భక్తితోడ, నెవఁడు నాకొసఁగునో వాని ♦ కెపుడు నేను
గన్పడుచునుందు వాఁడును ♦ గన్పడుచునె, యుండు నాకును దెలియుస ♦ మున్నతాత్మ! 175

వ. ఇఁక వర్ణాశ్రమధర్మనిబంధనం బిట్లు తెలియుమందు బ్రాహ్మణులకు.

గీ॥ స్నానము త్రికాలముల నగ్ని ♦ చర్య శర్వ
లింగపూజయు శివభావ ♦ ముం గరుణయు

దానము నహింస మదము సత్యంబు హ్రీయు
యోగ మధ్యయనము బోధయును మఱియును. 176

గీ॥ బ్రహ్మచర్యముసత్త్ర ధా శ్రవణముతప, మునుక్షమయు శౌచమునుశిఖా పుణ్యతంతు
ధృతియును త్తరీయోష్ణీష ధృతియు భస్మ, ధారణంబక్షశివలింగ ధారణంబు. 177

క॥ మఱియు నిషిద్ధత్యాగం, బురువుగఁ బర్వములనర్చ యును సల్పవలెఁ
హరువొప్పనన్నదానం, బరవిందనయన! యొనర్ప నగునారయుమా! 178

వ. ఇఁకనుమిక్కిలి నిషిద్ధంబులై నభోజనంబులనత్యంతంబువర్జింపవలయునిట్లువినుము.

గీ॥ అగ్రికులజుఁడు హీనక్రియాన్నములను, నల్లిపర్యుషితాన్న శ్రాద్ధాన్నములను
యావకాన్నముఁగాపిశాయనముఁబిశిత, మునునిరాగంధిలపదార్థములవిడవలె.

వ. ఈధర్మంబులు బ్రాహ్మణసామాన్యోపాదేయంబులిఁకనిందు గృహస్థులగువారలకు
ధర్మపత్నీగమనంబు యుక్తంబు. బ్రహ్మచారివానప్రస్థయతులు స్త్రీపరాఙ్ము
ఖులై యుండవలయును. మఱియు దివాభిక్షాన్నంబు రాత్రియందుపవాసంబు
నీబ్రహ్మచారివానప్రస్థయతులకుచితంబిఁక వీరిధర్మంబులు.

క॥ క్షమయునుశాంతియు సంతో, షమునుఁ సత్యంబు బ్రహ్మచర్యము వైరా
గ్యము నస్తేయము మఁడి జ్ఞా, నము భసితపు సేవ వర్జ నము సంగమునన్. 182

వ॥ ఇఁక క్షత్రియులకు.

సీ॥ సర్వవర్ణములకు సంరక్షణంబును, సమరమందున శత్రు జనవధంబు
దుష్టసత్త్వములకు దుష్టులకునుశాత, నంబు నెల్లజనంబు నమ్మకునికి
కాలమందు స్వకీయ కాంతావిహారంబు, సైన్యరక్షణమున శాంతముగను
కోశరక్షణ మనా క్రోశమన్యులమెడ, బంధుసుహృజ్జన పాలనంబు

గీ॥ అనుదినము చారవిదితవృత్తాంతవేద, నంబు శస్త్రాస్త్రచమూధారణంబుసతము
భసితకంచుకధారణంబసితవేణి!, క్షత్రియులకెల్లనిది ధర్మసంగ్రహంబు. 183

వ. మఱియును.

గీ॥ తగదు క్షత్త్రికులజుల కధ్యాపనంబు, యాజనంబు ప్రతిగ్రహం బబ్జవదన!
వైశ్యులకుఁగూడ తగదివ్వి వారుసల్ప, వలయుబేహారమునుగృషి పశులరక్ష.

వ. ఇఁకఁ జతుర్థకులజులగూర్చి

క॥ సర్వోపకరణనిర్మితి, సర్వభవన నిర్మితియును సమ్యఙ్మతిమై
సర్వవసననిర్మితియునున్, హర్వగసల్పుటయె యుచితమంఘ్రిజులకిలన్.

వ. ఇఁక స్త్రీజనంబులకు

క॥ పతియేగురుఁడునుదైవము, పతిసేవయె పరమహితము ♦ భామలకెందున్
పతియేముఖ్యంబన్నిటఁ, బతిఁబాసిన లేదిహంబు ♦ పరముపిదలకున్. 186

వ. పతియనుజ్ఞనిచ్చిన దేవతారాధనంబుసేయవలయు లేకయున్న మానవలయు నింక వితంతు స్త్రీధర్మంబులు వినుము. 187

గీ॥ బ్రహ్మచర్యంబుస్నానంబు♦భసితలేప, నమునుశాంతియుమౌనంబు♦క్షమయు నక్త
భుక్తి పర్వోపవాసంబు♦భూశయనము, నాదుధ్యానజపంబులు♦నాసమర్చ. 188

వ. ఇఁక నెల్లవారలర్హత నెఱింగి మదీయ మంత్రజప ధ్యానంబులను లింగపూజనంబున భోగమోక్షంబుల నొందవలయునని మహేశ్వరుండు చెప్పినంత మహేశ్వరి సంతుష్టయై భక్తిభావంబునఁ బరమేశ్వరు నుపాసించెననిన శ్రీకృష్ణుండు మురిసి నమస్కరించి, 189

క॥ సర్వజ్ఞాన మహార్ణవ! సర్వజ్ఞ! మహర్షి వర్య! ♦ సమ్యక్చర్యా!
శర్వాంతరంగ! పంచా, క్షర్యరువైభవముఁ దెల్పి ♦ కరుణింపు నన్నుఁ. 190

వ. దేవా! సర్వవిద్యాధిరాజంబును బ్రహ్మవిద్యాపట్టభద్రంబును నగు నీపంచాక్షరీవిద్యయొక్క స్వరూపంబును నుపాసనావిధానంబు మంత్రార్థంబును విశదంబుగ నెఱింగింపుమనుటయు. 191

గీ॥ అనఘుఁ డుపమన్యుఁ డహాహ పం♦చాక్షరీమ
హిమముఁ గోట్యబ్దములకును ♦ నేని యఖిల
మును వచింప నశక్యంబు ♦ వనజ నయన!
వినుము సంక్షేపముగఁ జెప్పె ♦ దను క్రమముగ. 192

గీ॥ వేదమందు శివాగమ ♦ విసరమందు, శ్రీషడక్షర మంత్రంబు ♦ చెలువు మీఱు
నద్ది పంచాక్షరంబుగ♦నమరి లోక, మందు ముఖ్యంబయితనర్చు♦నరయు మెపుడు.

గీ॥ అరయు ప్రణవాద్య మగుచు ష♦డక్షరి యయి
యలరుమంత్రంబు సర్వమం♦త్రాధిక మగు
నఖిల శివభక్తుల కిది స♦ర్వార్థసాధ
కంబయి విరాజిలెడు విక ♦ చాంబుజాక్ష! 194

క॥ అది స్వల్పాక్షరమైనను, బొదలెడు నర్థాఢ్యమై వి♦ముక్తిదమై యా
స్పదమై శ్రుతిసారమునకు, సదనమయి యుమా శివులకు ♦ సారసనయనా! 195

మ॥ సులభోచ్చారణ మొప్పియుండు నదియై ♦ సుస్పష్టార్థ వంతంబునై
విలసత్సర్వ మహార్థసిద్ధికరమై ♦ విశ్వాత్మ సంప్రీతమై
దళితాత్యంత దురంత దోషనిచయ ♦ ధ్వాంతంబునై శాంతమై
యలరుఁ విన్మ షడక్షరీమనువు పు♦ల్లాంభోజపత్రేక్షణా! 196

ఆ॥ వరుస "ఓంనమశ్శి♦వాయ" యనెడు నక్ష, రంబులే షడక్ష ♦ రమనువండ్రు
బ్రణవ మది వినాగఁ ♦ బంచాక్షరీ మంత్ర, మగు "నమశ్శివాయ" యనిన శౌరి!

క॥ విను వటబీజమువలె నీ, మనువు గడుఁ సూక్ష్మమైన ♦ మహితార్థంబై
తనరెడు సర్వజ్ఞుఁడు శివుఁ, డొనరు జగజ్జాల కారుఁ ♦ డోంకారమునన్. 198

గీ॥ తక్కిన "నమశ్శివాయ" నాఁ♦దనరు నైదు
నక్కరముల నీశానాదు ♦ లైదుగురగు
బ్రహ్మములు వసియింతురు ♦ క్రమముగాను
తెలియు మిది యాదవాన్వయా♦బ్ధి శశిమూర్తి! 199

ఉ॥ వాచ్యము వాచకం బనెడు ♦ భావముచే నిఁక బ్రహ్మపంచక
ప్రోచ్యదఖండ మూర్తి యగు ♦ భోగివిభూషణుఁ డా శివుం డని
ర్వాచ్యమహుం డనారతము ♦ భాసిలు మంత్రమె వాచకంబగున్
వాచ్యము శర్వుఁ డాతఁ డగు ♦ వైభవ మిద్ది యెఱుంగు మచ్యుతా! 200

గీ॥ ఎట్లు సంసార సాగరం ♦ బిది యనాది, యై యెసంగెనో శివుఁడు తా♦నట్లనాది!
యగుచు సంసార మోచకుఁ♦డై యెసంగె, నఖిల రుజలకు నౌషధ♦మట్లు కృష్ణ

క॥ శివుఁ డొకఁడు గన్పడనియెడ, భువనం బిది యెల్లఁ దిమిర♦భూతంబగు నా
రవి గన్పడకున్న జగం, బవలోకవిహీన మెట్టు ♦ లగునో మురారీ! 202

గీ॥ ఈశ్వరుఁడు లేనియెడ జగం♦బిద్ది యెట్లు, జాతమగుఁ బ్రకృతియది చే♦తనముగాదు
పురుషుఁ డజ్ఞుండు గావున ♦ భువనజాల, మేర్పడదు వీరిచేత నూ♦హింపు మీవు.

గీ॥ బుద్ధిమత్కారణము లేక ♦ భువన సృజన
మున కెటు ప్రధాన పరమాణు ♦ ముఖ్యములగు
నాయచేతనములు కర్త ♦ యగు? నరయుము
దేవకీముఖనాళీక ♦ తిగ్మకిరణ! 204

గీ॥ అరయు! సర్వజ్ఞుఁడును బర ♦ మాత్మ యగు శి
వునివినా నాదిసర్గమం ♦ దనఘ! ధర్మ
తదితరోప దేశంబు ను♦దారబంధ
మోచన విచార మెట్టులు ♦ పొసఁగు? నిలను. 205

క॥ వెజ్జువినాగ భువి రుజా, పజ్జన మెటు గ్లేశపడునో ♦ పద్మనయన! యీ
ముజ్జగములు శివుని వినా, యొజ్జను వేఁడోకనిఁ జేర ♦ నొందుఁ బతనమున్. 206

క॥ కావున సర్వజ్ఞుడు శివుఁ, డా విభుఁడు స్వభావవిమలుఁ ♦ డా పరిపూర్ణుం
డా వర్జితాదినిధనుం, డావిష్ణ్వాదుల కొసంగె ♦ నాదిన్ శ్రుతులన్. 207

క॥ ఇదియే శివవిజ్ఞానం, బిదియే యామ్నాయసార♦మిదె పరమపదం
బిదె "ఓం నమశ్శివాయ" యనఁదగు షడక్షరమనువు స♦నాతనము హరీ! 208

చ॥ ఇదివిధివాక్య మాజగద ♦ ధీశ్వరరూపము సర్వసంపదా
స్పదమును మోక్షదాయకము ♦ శర్వుఁ డనుగ్రహ మెంచి చెప్పె ని
ట్లిది మృషగాదు పల్కెనె మ ♦ హేశ్వరుఁ డెప్పుడు నేని కల్లలన్
పదరెద రజ్జులా మృషను ♦ బాయక రాగవిమోహితాత్ములై. 209

ఉ॥ సాంగములైన వేదములు ♦ శాస్త్రములెల్లను నీవడక్షరీ
రంగదుదారమంత్రమున ♦ రాజిలు దీని సమాన మన్యమెం
దుం గనుపట్ట దీయదియె ♦ తోయజనేత్ర! సమస్తవేదవే
దాంగకలాకదంబమున ♦ కారయు సాత్రిక మండలంబుగా. 210

వ. తక్కిన వేదశాస్త్రంబులెల్ల నీమంత్రంబునకు వృత్తులుగాను భాష్యంబులుగా
నెఱుంగుము. 211

గీ॥ పతితుఁడైనను బంచమ ♦ వర్ణజాతుఁ, డైన నెట్టి సంకరకులుఁ ♦ డైననేని
అవనిఁ బంచాక్షరీమంత్ర♦మాత్మజిహ్వఁ, బూనువాఁడె మహాత్తర♦పుణ్యమూర్తి

వ. హరీ! మున్నిట్లు మహాదేవుండు మహాదేవికిఁ జెప్పిన విని దయాళువగు నా మహా
దేవి క్రమ్మర విభుని నిట్లడిగె. 213

గీ॥ అఘయుగంబగు కలియుగ ♦ మందుఁ బుణ్యుఁ
డెందుఁ గల్గును? దేశికుఁ ♦ డెటదొరకును?
అఖిల మంధతమఃప్రాయ♦మై జగంబు
తనరు నిదియెట్లు ప్రజలకుఁ ♦ దారసిల్లు. 214

వ. అని యడిగిన సర్వేశ్వరుం డిట్లనియె.

క॥ నేనే యేరూపంబున, నేనియుఁ బ్రకటింతుఁ బ్రజల ♦ కిమ్మంత్రంబున్
మానక వారలు భక్తిన్, బూని యుపాసింపఁ బావ ♦ పుంజములవియున్.

గీ॥ అనుడు జగదంబ మఱియు ని♦ట్లనియె దేవ!
జగతిఁ బతితులు సత్క్రియా ♦ చరణమున క
నర్హులనియు నొనర్చిన ♦ నఘము నొందఁ
గలరనియు విందు విధి పొసఁ ♦ గఁబడు టెట్లు?

వ. అనిన మహేశ్వరుం డిట్లనుశాసించె.

క. ఇదియె రహస్యము దేవీ!, మది నారయు మితర సర్వ ♦ మంత్రములకు నీ
పదరినయట్టులె యడ్డది, యొదవదు పంచాక్షరికి మ♦హోన్నత మిదియా,

క॥ భక్తుఁడు గావలయును జి, చ్ఛక్తీ! పంచాక్షరంబు ♦ జపియించిన న
వ్యక్తుండేని నశుచియైన , ముక్తుఁడు గాఁగలఁడు నమ్ము♦బొంకొనర దిటన్.

గీ॥ తొల్లి యెల్లజగంబులు ♦ డుల్లి ప్రబల, తమమునిండారి తనరిన♦సమయమందు
శేషశయనుఁడు బాలుఁడై ♦ చిన్నమఱ్ఱి,యాకునందుఁదాఁబవళించి♦యలరునపుడు

క॥ ఆతని పొక్కిలితమ్మిని, ధాత దశార్ధవదనుం డు♦దారతపుఁడు సం
జాతుఁడయి భువన సృష్టిని, బ్రీతిని సలుపంగ నెంచి ♦ పెం పమరకయే. 220

క॥ పదుగురుమునులను మనమున, నొదవించి కుమారులను ద♦దున్నతికై న
న్ను దలఁచి మహేశ! శక్తిని, సదయత నిమ్మనుచుఁజాల ♦ సన్నుతిఁ జేసెన్. 221

సీ॥ అట్లు విరించిచే ♦ నర్థింపఁబడియేను, బంచముఖంబులఁ ♦ బంచవర్ణ
ఘటితమైనట్టి యీ ♦ ఘనవిద్య పంచాక్ష, రీమంత్ర మిచ్చితి ♦ నేమెుప్ప
స్వర్ణగర్భుండు దా ♦ జపియించి సుతుల కో, సంగివాచక వాచ్య ♦ సరణిదెల్పె
అంత నవ్వారు మ♦హాభక్తి యుక్తులై, ముంజవత్పర్వత ♦ మున వసించి

గీ॥ దివ్యవర్ష సహస్రంబు ♦ దీప్తిమీఱ, వాయుభక్షులై తపియించి♦రాయతదయ
నేను బ్రత్యక్షమై వారి ♦ కెఱుఁగఁజేసి, నాఁడ ఋషిబీజములను ఛం♦దస్సుశక్తి.

వ. మఱియుఁ గీలకదైవతంబులను న్యాసషడంగదిగ్బంధములను వినియోగంబును సర్వంబుఁ దెలిపి నాఁడ ననంతరం బవ్వారలీ మంత్రంబు విధివిధానంబుగ నుపాసించి తపించి దేవాసురమానుషవిశిష్టసృష్టికి సమర్థులై యద్దాని రచించిరి కావున నీ పరమవిద్యాస్వరూపం బిపుడుపదేశింతు వినుము.

గీ॥ ఆదియందు "నమః"పద♦మంత్రమై"శి,వాయ" యనుపద మిదియె దే♦వి!యఖిలని
గమశిరోగతపంచాక్ష♦రమను విదియె, సర్వశబ్దజాతమున బీ♦జముగ నెఱుఁగు.

సీ॥ మేల్మిబంగరుచాయ ♦ మెఱయుచుండెడు నది, పీన స్తనద్వయి ♦ విలసిలునది
కలువయుఁ దమ్మియుఁ ♦ గలకేలుగవయది, బాలేందుమౌళియై♦పరగునద్ది
వరదాభయదపాణి♦భాగ్యంబు గలయది, బ్రధ్నేందు వహ్ని నే♦త్రములు గలది
నీలకుంచితకేశ జాల ♦ మొప్పినయది, నవరత్న చయభూష♦ణములయద్ది

గీ॥ శ్వేతపద్మాసనస్థమై ♦ చెలగునద్ది, సర్వలక్షణయుతయయి♦జానుమీఱు
నద్ది పంచాక్షరీవిద్య ♦ యాది నాము, ఖముల వెడలిన దది వాచ♦కమగునాకు.

గీ॥ దీని పంచవర్ణంబు ల♦నూనరశ్మి, చక్రములు పీతమునును కృ♦ష్ణమునుధూమ్ర
మును సువర్ణాభమును ర♦క్తమునునయితగు,నవ్యవికసితరాజీవ♦నయన!యరయ.

వ. ఈ పంచవర్ణంబులు వేర్వేఱుగాఁ బ్రయోగించునెడల బిందునాదములతోఁ జేర్చి ప్రయోగింపవలయును. అందు బీజం బర్థచంద్రాకృతిగను నాదము దీపశిఖా

కారముగ నుండును. ఇట్టి ఈ మంత్రమునకు నం అనునది బీజము వాం అను నది కీలకము యం అనునది శక్తియు వామదేవుఁడు ఋషియును పంక్తి ఛంద స్సును శివుఁడు దేవతయు నగును. గౌతముఁ డత్రి విశ్వామిత్రుఁ డంగిరసుఁడు భరద్వాజుఁ డీ పంచాక్షరంబులకు గ్రమంబుగ ఋషులును గాయత్రి యనుష్టుప్పు త్రిష్టుప్పు బృహతియు విరాట్టును ఛందస్సులును ఇంద్ర రుద్ర హరి బ్రహ్మ స్కం దులు దైవతములుగాను జెప్పఁబడిరి. మ దూర్ధ్వముఖము మొదలుకొని పూర్వదక్షిణోత్తర పశ్చిమముఖములవఱకు "నమశ్శివాయ" యనెడు పంచ వర్ణములకు స్థానములు. ఇందుఁ బ్రథమ చతుర్థ ద్వితీయవర్ణము లుదాత్తస్వరం బు లై దవది స్వరితస్వరంబు తృతీయం బనుదాత్తంబు ఇఁక నీమంత్రమునకుఁ బ్రణవంబు హృదయంబు. 227

క॥ కనుము నకారంబును శిర, మునుగ మకారమును శిఖగ ♦ ముదిత! శివర్ణం
బును గవచము వావర్ణం, బును నేత్రము యయనువర్ణ♦మును నస్త్రముగాన్.

వ. నమస్స్వాహా హుం వౌషట్ వషట్ ఫట్ పదంబులు మంత్రాంగంబులుగ నెఱుంగుము. ఈ మంత్రమునకు మొదటఁ బ్రణవంబునకు మాఱుగ హ్రీం చేర్చి చివర యకారంబుపై అవర్ణమునకు బదులుగ ఐవర్ణమునుఁ జేర్చినయెడల గౌరీ పంచాక్షరి యగును. 229

తరల॥ మనల నిద్దఱఁ గూడ నీ ఘన ♦ మంత్రరాజముతోడ న
ర్చనము చేసి జపంబు హోమము ♦ సల్పి తర్పణ విప్రభో
జనములన్ బొసగించి శక్తియు ♦ శ్రద్ధయుం మఱి బుద్ధియుం
దనర శక్తికొలందిఁ గొల్చిన ♦ ధన్యుఁడాతఁడు ముక్తుఁడౌ. 230

వ. మఱియు నాయందాసక్తంబైన మనస్సుతో నన్ను బ్రియంబుగ నుపాసించెనేని వాని కొకక్రమం బనియు నక్రమంబనియు లేదు. ఎట్లొనర్చినను నేను మెచ్చె దను. వానికి శ్రేయమగును. ఇంక మంత్రోపదేశవిధానంబును జెప్పుచున్నాఁ డను వినుము. విధాన మెఱుంగక యుపదేశ మొందిన నది ఫలింపదు. 231

గీ॥ ఆజ్ఞఁ గొననిది క్రియలేని ♦ దశ్రద్ధ, లేకయె జపించునది లబ్ధి ♦ లేకపోవు
ఆజ్ఞఁగొని క్రియతోడ శ్ర♦ద్ధాంతరంగుఁ, డై యుపాసింప సకలఫ♦లాప్తి యగును.

తరల॥ గురుని విప్రుని వేదవేదిని ♦ గూఢతత్త్వవిశారదున్
పరమసద్గుణయుక్తు జాపిని ♦ భావశుద్ధిసమన్వితుం
హరపదాబ్జపరాయణాత్ముఁ బ్ర♦యత్నమొప్పఁగఁ జేరి సం
బరముఁ గూర్పవలెం మనస్తను ♦ వాగ్ధనంబుల చేతనుం. 233

క॥ కరితురగరథముల వసుం, ధరను గృహంబులను భూష♦ణముల దుకూలాం
బరముల ధనధాన్యములను, గురున కొసంగవలె విత్త ♦ గుప్తి నరయకే. 234

గీ॥ అంతఁ దనవారితోఁ దన్ను ♦ నర్పణంబు, చేసికొని గురుఁ సంతుష్టుఁ ♦ జేయవలయు
గురునివలనఁ గ్రమంబొనఁ ♦ గూర జ్ఞాన, మును నేతన్మహామంత్ర ♦ మును గొనవలె.

వ. ఇఁక.

సీ॥ శుచి నహంకారరహితు శు ♦ శ్రూషు శిష్యు, నొక్కవత్సరపర్యంత ♦ మొజ్జ తాఁ బ
రీక్ష చేసి యుపోషితు ♦ రిక్తదురితు, స్నాతు నీక్షించి శుభదిన ♦ సమయమందు,

ఉత్సాహవృత్తము॥ తిరుగ మంత్రశుద్ధమైన ♦ దివ్యతీర్థధారతోఁ
బరగ శిష్యు స్నాతుఁ జేసి ♦ వస్త్రభూతి గంధస
గ్ధరునిఁ జేసి సింధురాస్యుఁ ♦ దా భజించి తీర్థ భూ
పరిసరప్రదేశమందు ♦ స్వగృహంబునందు నేని. 237

క॥ దేవీ! రహస్థలిని నీ, పావనమంత్రము స్ఫుటముగఁ ♦ బలిక గురుం డం
తేవాసిని బలుకింపం, గావలయు శుభంబు లగును ♦ గాత యనవలెన్. 238

ఆ॥ ఇట్లు గురుఁడు మంత్ర ♦ మిచ్చి యాజ్ఞనొసంగి, నంత మీఁద శిష్యుఁ ♦ డతిముదమున
శైవశాస్త్రవిధిని ♦ సంకల్ప మొనరించి, తాఁ బురశ్చరణముఁ ♦ దగ రచించి. 239

గీ॥ నిత్య మష్టోత్తరసహస్ర ♦ నియతితోడఁ, బ్రాణధృతి యున్నదనుక నీ ♦ బ్రహ్మవిద్య
ననితరమనస్కుఁడై జపం ♦ బును నొనర్ప, వలయు నిట్టులఁ దెలియుమై ♦ వాత్మకాస్య!

వ. మఱియుఁ బురశ్చరణం బొనర్చునపుడు నక్తాశియు జితేంద్రియుఁడునై యిర్వది నాల్గులక్ష లిమ్మహామంత్రంబును జపించి తర్పణహోమాదు లొనర్పవలయు నట్లొనర్చి ప్రతిదినము విధిపూర్వకముగ జపించినట్టివాఁడు సిద్ధపురుషుండై పరమేశ్వర ప్రసాదభాజనుం డగును. లోకంబునం దవ్వానికి సమానుఁడు గల్గఁడు,

గీ॥ జపముఁ బ్రారంభ మొనరించు ♦ సమయమందు
స్నానమాడి శుచిప్రదే ♦ శమున భాసు
రాసనంబునఁ గూర్చుండి ♦ యాత్మగురుని
నిన్ను నన్నును స్మరియించి ♦ నిష్ఠతోడ. 242

వ. ప్రాఙ్ముఖుం డేని యుదఙ్ముఖుం డేనియు నయి భూశుద్ధి భూతశుద్ధుల నొనర్చి పాపపురుష దహనామృతాప్లావనంబులఁ బంచతత్త్వంబుల శోధించి మాతృకాది మంత్రన్యాసంబు లొనర్చి సకలీకృతవిగ్రహుండై ప్రాణాపానంబుల నిరోధించి నీతోఁగూడ నన్ను ధ్యానింపవలయును. మఱియు విద్యాస్థానంబును మంత్ర రూపంబును ఋషిచ్ఛందో దైవతంబులఁ బీజశక్తులను స్మరించి యంతఁ బైఁ బంచాక్షరిని జపింపవలయును. 243

గీ॥ మనసున జపించుటది యుత్త ♦ మంబు పాంశు
వరయు మధ్యమ మిఁకను వా ♦ క్సరణిజనిత

మధమ ముత్తమ మధ్య మాం ♦ త్యములు రుద్ర
విష్ణువిధిదైవతములు భా♦వింపు మదిని. 244

గీ॥ సతి! యుదాత్తానుదాత్తస్వ♦రితములైన, స్వరము లొప్పఁగ విస్పష్ట♦వర్ణములను
నుచ్చరించుట వాచకం♦బొప్పజిహ్వా, గదలననుటయుపాంశువు♦గాఁ దెలియుము.

వ. మనసునందే వర్ణంబుల గురుతించుచు శబ్దార్థంబుల నరయుచు జపించునది మానసికం బని యెఱుంగుము. వాచికమునకన్న నూఱురెట్లధికంబుగ నుపాంశువును నద్దానికన్న మానసికంబు వేయిరెట్లధికంబుగను ఫలంబు నొసంగును. 246

గీ॥ వ్రేళ్ళలెక్కతో జపము గా♦వించునెడల, నొకటితద్రేఖలను లెక్క♦నొందిచేయు.
టష్టగుణితమౌ పుత్రజీ ♦ వ్యచ్ఛబీజ, గణనలో సల్పిన దశాధి♦కము గుఁ జపము.

సీ॥ శంఖమణులతోడ ♦ జపము శతం బగు, నలవిద్రుమముల స♦హస్ర మగును
స్ఫటికమాలికతో జ♦పము దశసాహస్ర, మగు మౌక్తికములతో♦నగును లక్ష
పద్మాక్షములతోడ ♦ బదిలక్ష లగునది , హాటకంబులతోడఁ ♦ గోటియగును
ఆదర్భముకుల రు♦ద్రాక్షంబుల జపింప, నది యనంతఫలంబు ♦ లమరఁజేయు

గీ॥ త్రింశదక్షరచితమాల ♦ శ్రీప్రదంబు, సప్తవింశతి సంఖ్యాక ♦ సరము పుష్టి
దమగుఁబంచవింశతిసంఖ్య♦నమరుమాల, మోక్షమిడుఁబంచదశికత్ర♦మోచనంబు

గీ॥ మోక్షమిచ్చు నంగుష్టంబు♦పూని తర్జ, నియది నాశనియగుమధ్య♦మయుమధనద
యగు ననామిక శాంతికం ♦ బై తనరుఁ గ, నిష్టయది జప మందెప్ప♦నిష్టకారి.

వ. ఇతరాంగుళుల సమేతంబుగ నంగుష్ఠంబుతో జపింపవలయును. అంగుష్ఠంబువినా జపించిన నది ఫలంబు నీదు. మఱియు గృహమందుకన్న గోష్ఠంబందుఁ గూర్చుండి జపించిన నది నూఱు మడుంగు లెక్కుడుగ ఫలించును. 250

శా॥ ఆరామంబున నేనియుఁ మహిత పు♦ణ్యారణ్యమందేనియుఁ
శ్రీ రంజిల్ల జపింప వేయిమడుగుల్ ♦ చెన్నొందఁ బెంపౌ నదీ
తీరంబందున నేనిఁ బేరగు మహా ♦ ద్రిన్ గాని సేవింప ల
క్షై రాణించును దేవళంబునను గో ♦ ట్యాకార మెచ్చొ నుమా! 251

వ. ఆదేవళంబు శాంభవ మైన ననంతఫలప్రదంబు.

క॥ రవిచంద్రాగ్ని జలంబుల, సవిధంబున దీపవిప్ర ♦ సన్నిధినిన్ గో
సవిధంబందుననుఁ గురు, భవనంబందున జపింప ♦ ఫల మధికమగున్. 252

వ. మఱియుఁ బూర్వదక్షిణ పశ్చిమోత్తరాభిముఖుండై యొనర్చిన జపంబు గ్రమంబుగ వశ్యసిద్ధి ధన విద్యా శాంతి కరంబులని యెఱుంగవలయును. 253

నెపుడుగాని సూర్యాగ్నివిప్ర విద్వద్గురు గో దైవములకుఁ బృష్ఠంబుచేసి కూర్చుండి జపింపఁ గూడదు. వెండియు నపవిత్రప్రదేశమందుఁ గాని చీకటి నెలవునఁ గాని జపింపఁ దగదు, 253

క॥ ఆచారము పరమధనం, బాచారము పరమధర్మ ♦ మగు నెయ్యెడనా
యాచారమె సద్విద్యయు, నాచారమె పరమగతి హి♦మాచలతనయా! 254

క॥ పలుమాటలేల విన్మిఁక, నలికులవేణిరో! జనుఁడు స♦దాచారుండై
సలిపిన జప మత్యంతము, ఫలియించును వేఱుసరణి ♦ ఫలియింప దటుల్. 255

క॥ మదమును గ్రోధము దుఃఖము, వదలి యొనర్పవలె జపము ♦ శ్వాఖలేక్షణమున్
వదలి యొనర్పవలయు నది, యొదవిన నను నిన్నుఁ దలఁచు♦టొప్పవినుమటుల్.

వ. పూర్వోక్త నిలయంబులందెల్ల శక్తుం డగు వాఁడే యిట్లాచారవంతుండై యుపాసింపవలయు గాని యశక్తుఁ డెట్లు జపించినను దోషంబులేదు, మఱియు దుర్దర్శనాదులందు నాచమించి ప్రాణాయామం బొనర్చినను సూర్యాదిజ్యోతిర్దర్శనం బొనరించినను నా దోషంబు శమించును. ఇఁక సదాచారం బెట్టి దనెద వేని వినుము వర్ణాశ్రమ వయ స్త్రీపురుషధర్మంబుల నెఱింగి. 257

గీ॥ ఎవరి కెట్టికర్మంబు శా♦స్త్రవిహితంబొ, యట్లు మీఱక చేయ స♦దాచరణము
అదియె సజ్జనా చరితమై♦యవనిఁ బేరు,గొనె సదాచారమని పుణ్య♦గుణనిధాన!

వ. ఇందులకుమూల మాస్తిక్యము. ఆస్తికుండైన నొకప్పు డొక్కింత యాచారము లోపించినను బ్రత్యవాయంబులేదు. ఆస్తిక్యమనిన జగత్కారకుఁడీశ్వరుండును పుణ్యపాపంబు లున్నవనియు వానిచే నీ జగంబందు సుఖదుఃఖంబులు గల్గు ననియుఁ బరంబందుఁ గూడ నిట్లే కలుగునని భావించుటయే. ఇఁక రహస్యం బొక్కటి చెప్పెద వినుము. 259

గీ॥ కను మనాచారుఁడేనిఁ బు♦ల్కసుఁడు నేని
బతితుఁడేనియు నిమ్మంత్ర ♦ వర్ణములను
దనపను లొనర్చుకొనుచు గ ♦ మనము చేయు
చును నిలిచియున్నపుడు పల్కు ♦ చున్న హితము. 260

క॥ ప్రేమమెయి నాదుమంత్రము, నేమి విధులు లేకయున్న♦నెపుడుస్మరింపన్
నే మెచ్చెద నవ్వానిని, నామోదముతోడ వాని ♦ కఖిల మొసఁగెదన్. 261

క॥ నాయందును గురునందు న, మేయంబీ మంత్రమందు ♦ మెప్పొదవగఁ శ్రీ
ద్ధాయుతుఁడై జపియించిన, శ్రీమతి! సిద్ధించు నద్ది ♦ శ్రేయము లమరన్. 262

క॥ ఈ మనుజపమందుఁగుల, ప్రాముఖ్యము వలవదఖిల♦వర్ణజనంబుల్
దాము జపింపన్ దగు నీ, శ్రీమనువున క్షుద్రఫలముఁ ♦ జెందఁ దగ దిఁకన్.

గీ॥ ఇట్లు సాక్షాన్మహాదేవుఁ♦డింపు మీఱ, నమ్మహాదేవి కెఱిఁగించె ♦ నఖిలలోక
హితముఁ గోరి పంచాక్షరీ ♦ హృద్యవిద్య,విధము దీని జదువ విన♦వెతలుడిగు.

వ. అని యిట్లుపమన్యుమహాముని దెల్పిన విని శ్రీకృష్ణుండు సంతసించి దేవా! మంత్రస్వరూపంబును మంత్రసంగ్రహణవిచారం బొకింతఁ దెల్పితివిగాని అయ్యది విశదంబుగాఁ దెల్పి మంత్రార్థంబు నుపాసనా విధానంబును దెల్పి యనుగ్రహింపుఁ డనుటయు దేశికుం డిట్లనియె. నీవు నన్నడిగిన యట్లుగా మున్ను మహేశ్వరి మహేశ్వరు నడుగఁగా నా యాదిదేవుండు దెల్పినవిధానం బుపదేశింతు వినుము. 265

వ. ఇఁక.

గీ॥ జ్ఞాన మిచ్చుటచేతఁ బా♦శంబు బంధ
మోచనం బొనరించుట♦బూని యిద్ది
దీక్షయని చెప్పఁబడియె ని♦దియె వచింపఁ
బడును సంస్కార మనియుఁ బ♦ర్వతకుమారి! 266

* వ. అది శాంభవియనియు శాక్తియనియు మాంత్రియనియు శైవాగమములందు ద్రివిధంబుగ దీక్ష చెప్పంబడియె. 267

ఉత్సాహ వృత్తము:
గురునిచూపుచేతను బలు ♦ కునను స్పర్శ చేతనుఁ
త్వరగ శిష్యునకుఁ బొసంగుఁ ♦ బాశభంజనియగుసం
జ్ఞ రహి నదియె శాంభవియని ♦ శైవశాస్త్రవేదులం
దురు నదియును ద్వివిధయగుచుఁ ♦ దోచు విన్ము రూఢిగన్. 268

వ. తీవ్రయనియుఁ దీవ్రతరయనియు ద్వివిధయగు. సద్యస్కాలమందే మోక్షమిచ్చునది తీవ్రతరయనియు జీవితదశయందుఁ గ్రమంబుగాఁ బాపశోధనంబుచేయుచుఁ జివఱయందు ముక్తి నొసంగునది తీవ్రయనియుఁ జెప్పఁ బడును. 269

గీ॥ శాక్తియన జ్ఞానవతి దీక్ష♦చాత్రదేహ, మును బ్రవేశించి యోగపం♦థను గురుండు
జ్ఞాన చక్షుస్సుచేఁ జేయఁ♦గాఁదగునది,మాంత్రియనఁగుండమండల♦మహితయురయు.

గీ॥ శక్తిపాతానుసారంబు♦చాత్రుఁడిలను, గుర్వనుగ్రహార్హుండగు♦గురుతర శివ
ధర్మ మలశక్తిపాతవి♦ధానమును న,నుసరణమొనర్చుటను జేసి ♦ బిసరుహాక్షి.

క॥ ఎట శక్తిపాత మొనరదో, యట శుద్ధి పొసంగ దరయు ♦ మావిద్యయుఁదా
నటఁబోదు శివాచారం, బటఁజేరదు ముక్తిసిద్ధ ♦ లటఁజేర వికన్.

గీ॥ కావునన్ శక్తిపాత ల♦క్షణము లరసి, జ్ఞానమునఁ గానిక్రియచేతఁ♦గాని గురుఁడు
శిష్యు శోధించి దీక్షను ♦ జేయవలయు, గాని యూరక సేయంద♦గదు వినుమిది.

---

* ఈ శాంభవీదీక్షను - వేధాదీక్షయనియు నందురు

సీ॥ శక్తిపాతలక్షణము వి♦జ్ఞానమునుమ,హితతరానంద మొదవుట♦ నెఱుఁగవలయు
నల్లశక్తియానందబో♦ధాకృతియవి,మంత్రవిక్రి-యచేబొల్చు♦మహితహృదయ!

గీ॥అట్టిక్రియచేతఁగంపరో♦మాంచములును,స్వరనయనముఖవిక్రియల్ ♦పొరయునిట్లు
శిష్యుఁడును దా గురుని బరీ♦క్షింపవలయు, స్వగత తద్గతములగుల♦క్షణములరసి;

గీ॥ శిక్షణీయుండు శిష్యుండు♦సేవ్యుఁడెపుడు,గురుఁడు గౌరవార్హుండౌట♦గురునిక్రహ
గౌరవముచేయఁగాఁదగుఁ♦గడఁగిగురుఁడె,శివుఁడుశివుఁడేగురుండుమం♦త్రవిధతనులు.

క॥ ఎటులు శివుఁడో విద్యయు నది, యటులే విద్యయది యెట్లొ♦యటులే గురుఁడౌ
నిటు శివవిద్యాగురులన్, బటుమతి నారసి యజింప ♦ ఫలము సమంబౌ. 277

గీ॥ సర్వదేవాత్మకుండును ♦ సర్వమంత్ర
మయుఁడు గురుఁడౌటను దదాజ్ఞఁ ♦ బ్రియము మెఱయ
నల్పవలయును శ్రేయార్థి ♦ సంతతము గు
రుని ముసల మీరఁ దగ దర్శ ♦ బొనరు బోధ. 278

వ. మఱియు నీకను జ్ఞానక్రియాచర్యాయోగంబులను చతుష్టయంబు సనాతనంబు
లగు మద్ధర్మంబులు. 279

క॥ జ్ఞానము పశుపాశపతి. జ్ఞాన మిఁక షడధ్వశుద్ధి ♦ సద్గురునాధా
ధీనము క్రియ కులధర్మా, ద్యానుసరణమౌ మదర్చ ♦ యలచర్యయగున్. 280

మత్తకోకిల॥ యోగ మన్న మదుక్తరీతినె ♦ యుండి మద్గతచిత్తుఁడై
తా గరిష్ఠత నన్యవృత్తులఁ ♦ దారసింపక చేతమున్
బాగుగాఁ బదిలంబుసేయుటె ♦ భామ! దీనికి నెల్ల స
ద్యోగముల్ వ్రతరాజముల్ సరి ♦ దూగ విట్టు లెఱుంగుమా!

గీ॥ ఇదివిషయకాములకసాధ్య ♦ మిదియె మోక్ష
దము జితేంద్రియచయునకు ♦ యమమునను ని
యమమునను సర్వపాపక్ష ♦ యం బొనర్చు
వీతరాగికె ప్రాదుర్భ ♦ వించు నిద్ది. 282

వ. ఇఁక

గీ॥ ఇట్లు వైరాగ్యమున జని♦యించుజ్ఞాన, మట్టిజ్ఞానంబుచేత నా♦యతనుఁ యోగ
మది ప్రవర్తిల్లు యోగియై♦నట్టివాఁడు, మోక్షమును జెందుఁ సందియము వల దిందు,

వ. మఱియు నీ జ్ఞానయోగంబులకై.

గీ॥ దయ యహింసయు జ్ఞానసం♦ధానమునును,సత్య మస్తేయ మాస్తిక్య♦శ్రద్ధలును జి
తేంద్రియత్వాధ్యయనబోధ♦లీశభావ, యజనయాజనధ్యానంబు♦లవసరములు.

వ. అట్టివాని నార్జించినవానికి జ్ఞానయోగంబు లచిరంబందే సిద్ధించును. అట్లు జ్ఞానయోగవంతుఁడై ఈ మంత్రంబు జపించిన వాఁడొక క్షణంబున నీకర్మబంధంబుఁ బాసి మత్ప్రసాదంబున మోక్షంబు నొందు నీక మంత్రార్థంబును వినుము.

క॥ ఓమనఁగా బ్రహ్మంబగు, నోమన సర్వప్రపంచ ♦ మోమనుచులరీ
వేమాపఁబాడు సామము, లోమనఁగ నుమామహేశు ♦ లూహింపుమదీ.

క॥ హరపదము సర్వహృతిని న, మరు విష్ణుపదము విభుతను ♦ మానితమగు ద
న్విరో! "యో"మనుపదమునఁ జే,కురు సర్వత్రాణమునుసు♦గుణుసుగఁగ.నుమా

క॥ మనుజుల కెల్లప్పుడు శివ, మును గోరుచు వారిసర్వ ♦ పురుషార్థా రం
భనియత సిద్ధిని బొనరుచు, టను శివుఁడని యనఁబడితి దృ♦ఢంబుగ జగతిీ.

క॥ అమరులునుఁ దానవులును, సములై యుండుదురు నాకు ♦ సర్వులును నజ
స్రమునుఁ నేను నఖిలభూ, తములకు శివమిడుట శివప ♦ దము దగె నాకుఁ.

గీ॥ అలయనాది మలత్రయ ♦ కలితబంధ
మాదినే లేమిచేత న♦త్యంత శుద్ధ
మైనయాత్మము గలవాఁడ ♦ నగుట నేను
శివుఁడనుచుఁ జెప్పఁబడితిని ♦ శివ! యరయుము. 289

గీ॥ ఇఁకననంతకల్యాణగు♦ణైక నిధిని, యగుటచే నీశ్వరుండను ♦ నగుటచేత
శివుఁడనుచుఁ జెప్పఁబడితివా♦సిగనుసర్వ, పర్వతేంద్రకుమారి! యఁ♦బ్జదళ నేత్రి.

గీ॥ ప్రకృతిమున్నగువానిని♦వశముచేసి. కొనివిరాజిల్లుటను జేసి♦యును నఖిలము
వశమగుటఁజేసియును శివ♦పదముదనరె, నిస్పృహుఁడసర్వవేదినై ♦నిండియుండు.

గీ॥ ఓమనఁగరక్షకుండయి ♦ యుండువాని, కై శివాయయనఁగ శివు♦కై నమయన
దాస్యవిహితార్చనంబువం♦దనముచేయు,చున్న వాఁడననుటయర్థ♦మును మొఱంగ.

వ. రక్షకుఁడగు శివునకు నమస్కారమనుట పిండీకృతార్థ మిట్లు పరమేశ్వరుండు పరమేశ్వరి కెఱింగించిన నాజగదంబ కరంబు సంబరంబొంది మహేశ్వరుం బ్రశంసించెనని తెల్పిన కృష్ణుండు హృష్టుండై. దేవా! శ్రీపంచాక్షరీ మహామంత్రోపాసనా విధానంబుపట్ల సాధారణ జనుల కనుష్ఠేయంబగునట్లు సౌలభ్యంబారసి లఘుసరణి నుపదేశింపుమని కోరిన గురుండిట్లనియె. 293

గీ॥అశివుఁడుశివుఁ యజింపన♦నర్హుఁడగును,శివుఁడయిశివార్చనంబుఁ దాఁ♦జేయవలయు
*నట్లుగావునదీక్షాత్ర♦యంబుగురుని, చేతఁబడసి యుపాసింపఁ ♦ జెల్లుశివుని 294

---

* వేధాదీక్ష క్రియాదీక్ష మంత్రదీక్ష ఈదీక్షల కుపదీక్ష లిఱువదియొకటి.

వ. మఱియుగురుండు శిష్యునియోగ్యతనారసి షడధ్వశుద్ధిన్ బొనరించి శివదీక్షల నొసంగవలయును. ఆషడధ్వశుద్ధిక్రియంబు లాఘవంబుగ నెఱిఁగింతువినుము. 295

క॥ కలలైదు నివృత్త్యాదులు, జలజాక్ష! కలాధ్వయనుచుఁ ♦ జక్కనెఱుఁగు! పైఁ
గలయైదధ్వములైదగు, కలలన్ వ్యాప్తములుగాఁగఁ♦గనుమష్టిమదిన్. 296

గీ॥ వినుము శివతత్త్వమాదిగాఁ ♦ బృధివివఱకుఁ
నమరుతత్త్వంబు నిఱ్ఱది ♦ యారుచెప్పఁ
బడియెఁ దత్త్వాధ్వమాధార ♦ ప్రభృతియున్మ
నాంతమఱువది భువనాధ్వ ♦ మింతఁ దెలియు! 297

గీ॥ అక్షరము లేఁబదియును వ♦ర్ణాధ్వమిఁకను,పదములాను ప్తిజంతముల్ ♦ప్రాబలుకుల
కవయవములై యమరుచుఁబ♦దాధ్వమనఁగఁ, బరగెనారయుయాదవ♦పట్టభద్ర!

వ. ఇఁక సప్తకోటి మహామంత్రంబులు మంత్రాధ్వమనఁబడియె.

గీ॥ తత్త్వనాథుండుశివుఁడు త♦త్త్వంబులందు, గణనఁజెందనియట్టుల ♦ గణనచెంద
దెఱుఁగుమంత్రనాయకమును♦నిద్ధపరమ, విద్యయగుశివమంత్రంబు♦!విమలహృదయ

వ. ఇఁకనీషడధ్వములందుఁ గలాధ్వంబు వ్యాపకంబనియుఁ దక్కిన పంచాధ్వంబులు వ్యాప్యంబులనియుఁ దెలియుము. ఇట్లు దెలియనివాఁడు షడధ్వశోధనంబున కనర్హుండు. మఱియునీషడధ్వములస్వరూపంబెఱుంగనివానికందు వ్యాప్యవ్యాపకభావంబెఱుంగఁబడదు. కావున ముందుగ షడధ్వస్వరూపంబును ఆపైని తద్వ్యాప్యవ్యాపకత్వమునెఱింగి యనంతరము షడధ్వశోధనమొనర్పవలయును.

గీ॥ శ్రీషడక్షరమంత్రప్ర♦సిద్ధవిధివి, ధానమెఱిఁగించెద విను దై♦త్యఘ్న! యిఁకను
మంత్రమూర్తియా శ్రీగురు♦మహితచరణ, నళినములఁబూజచేసియా♦నందమతిని!

గీ॥ ఆదియందు నమః పద♦మంతమున శి,వాయ యనుపదమిది మంత్ర ♦ వర్ణసరణి
ఇదియె పంచాక్షరీమను ♦ విందు ముందు,తారమమరషడక్షరి ♦ తానయగును.

క॥ గాయత్రీచ్ఛందంబును, నాయతబ్రహ్మఋషికంబు ♦ నలశివదైవం
బైయలరుప్రణవబీజం, బైయార్యాశక్త్యుభవ మ ♦ హాకీలకమై. 303

గీ॥ తనుషడూర్మినివృత్తికై ఘనతరంపు, షట్స్థలబ్రహ్మనిర్వాణ ♦ సౌఖ్యసంప
దాప్తికై శ్రీషడక్షరా♦ యతమనుజప, మేనొనర్చెదననిపల్కి ♦ పూనినియతి,

గీ॥ అవహితమనస్కుఁడైకర♦న్యాసమును గ్ర,మముగ నంగన్యాసమునునీ♦మంత్రవర్ణ
ములను నొక్కొకఁడనుచును♦సలిపియంత, గురుని మనువునుధ్యానింపఁ♦గూడునిట్లు

గీ॥ ఆశివాగ్ని బీజునకును ♦హరునకుఁబర,మాత్మ కోమంత మంత్రరూ♦పాంచితునకు
మూలపంచాక్షరస్వరూ♦పునకు శివున,కిదెనమస్సని జోతల♦నిడఁగవలయు. 306

గీ॥ పరగ నోంకార వదనంబు ♦ వాయకార, బాహుయుగ్మంబును శికార ♦ భాసమాన
మధ్యమునునమకారస ♦ మంచితాంఘ్రి, యుగముసై యొప్పు పంచాక్ష ♦ రోపనిష్య

గీ॥ తారయుక్తయు లింగరూ ♦ పోరుతరయు, శివమహామంత్ర వాదిని ♦ శివనిధాన
మద్వపుః ప్రతిష్ఠితమైయ ♦ మరునుగాత, సనుచుఁదలఁచి యుపాస్తి సే ♦ యంగవలయు.

గీ॥ షట్స్థలబ్రహ్మరూపిణి! షడ్స్థలప్ర, సాదపరమసుఖప్రద! జనని! శుభద
శ్రీషడక్షరమను దేవి! సిద్ధవిద్య, నీకగు నమస్కృతంబులు ♦ చేకొనుము ప. 309

వ॥ ఇట్లనుజ్ఞనొంది ప్రత్యహంబిరువదియొక్క వేయి యేనూరునందలు సమకూరి జపం
బొనర్పవలయును. శక్తిచాల నివారును దీక్షికలేనివారును నరువదియొక్క వంద
యేసి జపించవలయును. పూజాసమయంబు నందొక్క సహస్రంబుగాని యేను
శతంబులుగాని యథమము త్రిశతంబుగాని జపింపవలయును. 310

గీ॥ ప్రణవమర్థంబు నాదివ ♦ ర్ణద్వయంబు, యాంతవర్ణత్రయంబును ♦ నగునవష్టి
ఒక్క వాక్యంబుగామది ♦ నూహసేయు, మనఘ! వికసితపద్మదళాక్ష! నీవు 312

గీ॥ అర్థరూపమైనట్టి వి ♦ ద్యయెపరయగు, వర్ణరూపమె పశ్యంతి ♦ పదసమాఖ్య
తియగుమధ్యను వాక్యరూ ♦ పమె యెఱుఁగుము, వైఖరియటంచునిర్భంగి ♦ వాను దేవ!

గీ॥ అర్థము మనోభవంబగు ♦ నక్షరంబు, దృగ్భవంబగు పదమిఁక ♦ వాగ్భవంబు
వాక్యము వపుర్భవంబిట్లు ♦ భాసిలెడును, మనసుదృగ్వాగ్వపున్సులు ♦ మహిత తేజ!

గీ॥ మననలక్షణమైయొప్పు ♦ మనమువినుము, దృక్కగువిలోకనాకృతి ♦ వాక్కు వచన
లక్షణయగువపుస్సు త ♦ లంపఁ దాలు, దంతజిహ్వోష్ఠయోగ వి ♦ ధంబెఱుఁగుము.

వ. ఇట్లీబ్రహ్మవిద్య మానసియుఁ జాక్షుషియు జాప్యయు వాచకియునై పరాపశ్యంతీ
మధ్యమావైఖరులనుచుఁ గ్రమముగ వ్యవహరింపఁబడు నిఁక మంత్రార్థమందీ
విశేషంబు నెఱుంగుము

గీ॥ ఆనమఃపదమగు నుమ ♦ యల్లశివప, దంబు శివుఁడయశ్శబ్దంబు ♦ శదుభమైక
యోగమిఁకసోమతత్త్వమి ♦ యుత్తమమను రాజసిద్ధార్థమిది యదు ♦ రాజతిలక!

క॥ లింగము శివుఁడిఁక నుఘయే, యంగం బిద్దానఁ జేరిభయ ♦ వుఁడు సోమా
ఖ్యంగరిమ నెసఁగునిట్టులె, ఱుంగుము హృదయంబునన్ ♦ గరుత్మద్గమనా! 317

వ. ఇఁక నిమ్మనురాజంబునకుఁ బురశ్చరణప్రకారంబు జెప్పెద వినుము. 318

గీ॥ ఆరులక్షలు జపమును ♦ నలువదియగు, వేలుతర్పణమును నాలు ♦ వేలుహోమ
మాఱునూఱులు శంభుభ ♦ క్తాగ్రణులకు, భోజనంబిడవలయును ♦ బూర్ణిమెఱయ.

గీ॥ శక్తిచాలని చోనొక ♦ షష్టికేని, నాలుగురికేని జగ్ధిస ♦ మర్పణంబు
చేయవలయు మహాత్ములౌ ♦ శిష్టజనుల, కట్లునన్ జాలకున్న ను ♦ నరయుమిట్లు.

గీ॥ అరసి పటస్థలబ్రహ్మ స♦మాకృతియు ష, డంగలింగసంయుక్తుఁడై ♦ యమరునట్టి
సిద్ధమూర్తి నొక్కనిఁ ♦ జేరఁబిలిచి, స్వర్ణపటగంధపుష్పభూ♦షణములొసఁగి
భోజనంబిడి కొలిచినఁ ♦ బూర్తియగును, మనుపురశ్చరణం బస♦మానగతుల.

వ. ఇఁక నీపంచాక్షరీ మహావిద్య పరిస్తారవశంబున భిన్నభిన్నరూపంబుగ అష్టావింశత్యుత్తర శతనామంబులతో నష్టావింశత్యుత్తర శతవిధంబై యుపాసకులకు సర్వవిధార్థసిద్ధులనొసంగువాని స్వరూపంబులఁ బంచాక్షరీ కల్పంబునం దెఱుంగుము. మఱియు నిమ్మహావిద్యకు శివాస్త్రంబును బాశుపతాస్త్రంబును బ్రహ్మాస్త్రంబు క్షురికాస్త్రంబు వ్యోమాస్త్రంబ ఘోరాస్త్రంబు మున్నగునవి యంగవిద్యలుగ నారయుమనిన శ్రీకృష్ణుండు సంతుష్టుండై మహాత్మా! సర్వైహికాముష్మికఫలదాయకంబగు శివపూజాక్రమంబును పదేశింపుమనుటయు నుపమన్యుఁడలరి యిట్లనియె.

గీ॥ సారమేమియు లేని సం♦సారమందు, సారము చతుష్టయము మాన♦సమునఁ దెలియు
జాహ్నవీవారి బిల్వసం♦శ్రయము సాధు, సంగమును లింగపూజయు ♦ సత్యమిద్ది.

చ॥ శివుఁడిక లింగమారయుము ♦ శ్రీవనితాప్రియ! లింగపీఠమా
శివయగు లింగపూజనము♦చే నుభయార్చన సంఘటిల్లు నా
భవునికి నిన్ భవానికిని ♦ భాస్వరదేహము లింగ మెల్ల రా
దివిజులు లింగపూజను వి♦ధిం బొనరింతు రనారతంబునున్. 324

వ. ఈలింగార్చనం బాభ్యంతరంబు బాహ్యంబని ద్వివిధంబు. అందాభ్యంతరంబును యోగులగువారొనరింతురు. బాహ్యార్చనంబిఁకఁ బంచసూత్రఘటితంబులగు బాణస్ఫాటికాదిలింగంబులను శిరోముఖ్యాంగంబులందు ధరించి శైవాగ్రణులు పూజింతురు. మఱికొందఱట్టిలింగంబులను బరివారంబులతోఁ బీఠమందమర్చి యర్చింతురిఁకను గొందఱు పార్థివలింగంబుల నొనర్చి యర్చించి యర్చాంతంబున నుత్సర్జనంబు సేయుదురు. మఱియును గొందఱాలయంబులందు సుప్రతిష్ఠితలింగంబులఁ బూజింతురు. వీరందఱకు శివప్రసాదంబు చేకూరునిఁకను నుత్తమంబగు శివారాధనంబు మఱొకవిధం బెఱింగింతు వినుమని యిట్లనియె.

### — ఉపమన్యుఁడు శ్రీకృష్ణునకు శివపూజాక్రమంబును జెప్పుట —

సీ॥ కేశవ! విన్ముమ వి♦శ్వేశపూజాక్రమం, బాముష్మికఫలంబు ♦ నంతనిపుడు
దీనిఁబోలెడునద్ది ♦ త్రిభువనంబుల లేదు, పుణ్యాతిశయయుక్త ♦ భూరిగరిమ
అజహరిరుద్రులు ♦ హరిహయుండాదియా, దిక్పతుల్ భాస్కరా♦దిగ్రహములు
అలవశిష్ఠాది మ♦హర్షి వరేణ్యులు, నంది మహాకాల♦నాథ ముఖ్య

గీ॥ గణములు రసాతలాదిలో • కములనొప్ప, తక్షకానంత ముఖ్యులౌ • దందశూక
రాజులీయర్చనంబును • రాణగదుర, సలిపి వడసిరి తత్పదం • బులనుసతము, 326

వ. కావున నట్టియర్చనాప్రకారంబు మఱొకతీరుపదేశించెద సావధానంబుగవినుము.

గీ॥ తెల్లనౌ మంచిగంధంబు • తీర్థమునను, శంభులింగంబునున్ శివర • స్నానమాడ
జేసియవదాతవికచకు • శేశయములఁ, బూజనొనరించిభక్తిమై • మ్రొక్కవలయు.

వ. ఇఁక ధనవంతుఁడగు నేని.

గీ॥ రత్నముల చేతఁగాని స్వ • ర్ణమునఁగాని, పద్మపీఠంబుఁదీరిచి • వరగకేస
రములమధ్యమునందులిం • గమునుగంధ, మయమునంగుష్ఠనిభముఁ బ్రే • మమునఁగూర్చి

వ. లింగంబుయొక్క వామభాగంబునం దంబికను సంయోజించి బిల్వదళముల గౌరీశంకరుల నర్చించి. 329

గీ॥ అగరుదక్షిణపార్శ్వంబు • నందునునిచి, మణిశిలన్ బశ్చిమమున న • మర్చియుత్త
రమునఁ జందనమొసఁగి పూ • ర్వదిశయందు, నింబుగాహరిదళమర్ప • ణంబు చేసి.

క॥ సురభిళకుసుమంబులను రు,చిరబిల్వదళంబులను వి • చిత్రసుమములన్
హరువుగఁ బూజించి ఘృతా, గరుగుగ్గులు ధూపమును ద • గనొసఁగి యంతన్.

వ. అతిసూక్ష్మంబులు ధవళంబులగు వస్త్రంబుల సమర్పించి సర్పిర్దీపంబుల వెలిగించి ఘృతమిశ్రితంబగు పాయసంబును నివేదించి ప్రదక్షిణ నమస్కార స్తవంబులొనర్చి క్షమాపణంబు నర్థింపవలయు ననంతర ముపాసకుఁడు దక్షిణామూర్తి నాశ్రయించి సర్వోపహారసమ్మిశ్రింబగు నైవేద్యంబును శివమంత్రంబులతో శివునకు సమర్పింపవలయు నిట్లుపంచగంధమయంబును శుభంబునునగు లింగంబు నెవ్వండు నిత్యంబర్చించునో యట్టివాఁడు సర్వాఘముక్తుండై శివలోకంబు నొందు నిందు సందియంబు లేదు.

ఉ॥ ఓయదురాజవంశకల • శోదధి! శారదపూర్ణచంద్ర! వి
న్నీయది చాలగోప్యమిఁక • నిద్ధుఁడవౌట హితుండవౌట నీ
కే యనుమానమున్ గొనక • యే నెఱిఁగించితినిట్లు నీవునుం
బాయక పద్ధతిన్ నిగమ • బాహిర కోటికిఁ జెప్పఁబోకుమా, 333

వ. ఇట్లు విధిప్రకారంబుగ నుపదేశించి యిందేవిధంబుగ నేనిశివలింగార్చనంబొనరించి యనంతరంబీ వక్ష్యమాణప్రకారంబుగ నుమామహేశ్వరులను స్తుతింపవలయును.

— * ఉమామహేశ్వరస్తుతి * —

సీ॥ జగదేకనాయక! • శంభూ! ప్రకృతిమనో. హర! నిత్య! శుద్ధగు • ణాబురాశి!
కలుషప్రపంచాతి • గత! వాఙ్మనసనమ, శీకాంతతత్త్వ! చిద్విహితమూర్తి

స్వాత్మసంకాశమహాశక్తి! నిర్మలా, భోగ! యతులమూర్తి! భూరికాంతి!
అవితర్క్యఘనమహిమాధార! మంగళ!,నిష్కారణోద్యమ!నిష్కళంక!

గీ॥ అసదృశైశ్వర్య! యతులకల్యాణ! మోక్ష,కారణ!నిరంతరానంద! గాఢకరుణ
అవృతమహాభువన! పరానావృత!యఖి, లోత్తర!నిరుత్తర!నమోనమోస్తు దేవ!

క॥ జయమద్భుత! జయమక్షత!,జయమవ్యయ! జయము మేయ! జయమగునమలా!
జయముమహాబల! దేవా!,జయమభయా! జయమమాయ!జయముమహేశా!

గీ॥పరమదేవునకునమస్సు పరమహేతు,వునకునునమస్సు శాంతువకునునమస్సు
శివునకునమస్సు సతతంబు శివతరునకు,నర్ఘనమస్సనవధికశ్లాఘ్యునకునమస్సు.

చ॥ జగమిదియెల్ల నీవశము సత్రిదశాసురవర్గకూటమో
యగణితతేజ! త్వద్విహిత మాజ్ఞనుమీరఁగ శక్తుఁడెవ్వఁడొ
న్నగ భవదేకసంశ్రియుఁడ నర్ఘబడు నీజనుఁడిందు వీనిపైఁ
దగుకృపనింపి ప్రార్థిత ముదారతరాత్మముతోనొసంగుమా!

కవిరాజ హృదయరంజనము.

జయజయశాంకరి! సర్వజగన్మయి! జయజయ సర్వజగజ్జననీ!
జయజయ దివ్యసముజ్వలితాకృతి! జయజయవాఙ్మనసాతిగతీ!
జయజయ మోహతమఃపటలాపహా జయజయ జన్మజరాతిగమా!
జయజయ సర్వసురార్చితపాదుక! జయజయమంగళదాత్రి! శివా! 339

క॥ జయమంగళచారిత్రా!, జయమంగళదివ్యదీప!జయలలితతనూ!
జయమంగళదానపరా!.జయగుణసముదాయమూర్తి! జయకల్యాణీ! 340

క॥ జయమంగళచారిత్రా!, జయమంగళ దివ్యమూర్తిజయమంగళదా!
జయమంగళప్రదీపా!, జయగుణసముదాయలలిత జయకల్యాణీ! 341

క॥ శివశక్తికి వందనములు, శివకివె వందనము లఖిల చిత్రితభువనో
ద్భవమూర్తికి వందనములు, కవివినుతకు వందనములు గావింతురహీ. 342

ఉ॥ నిన్నువినా మహేశ్వరుఁడు నేర్చునెభక్తుల నీప్సితార్థసం
పన్నుల సల్ప నీజనుఁడు ప్రాశితుఁడంబిక! జన్మమాదిగా
పన్నగ వీనికిమ్మిపుడు ప్రార్థిత మిందుధరోరువాసినీ!
పన్నగరాజశేఖరవి భాస్వరహారమనోనురంజనీ!

క॥ శివభావులు శివకరులును, శివవిజ్ఞానామృతాంబు సేవులుమఱియుఙ్
శివసంస్కృతులగుగణరాట్, దివిజచమూపతులుమాకు దీర్తురుముదముల్.

గీ॥ మందరతుషారశైలోప♦ మానతనుఁడు, ధవళసుందరతరకకు♦ ద్మంతుఁడిద్ధుఁ
డీశ్వరధ్వజవాహనుం♦ డీశనిభుఁడు, నందికేశుఁడొసఁగుత నా♦నందములను.

## —* అష్టత్రింశత్కళావిశిష్ట *—

వ. ఇఁక శుద్ధస్ఫటికసంకాశంబును మూర్ధాభిమానంబును శాంతంబును శాంత్యతీతాత్మకంబును స్వస్థలస్థితంబును పంచాక్షరాంతిమబీజంబును కలాపంచకయుతంబును శక్తివిశిష్టంబగు నీశానాఖ్యపరబ్రహ్మంబును బాలసూర్యప్రతీకాశంబును బూర్వవక్త్రాభిమానంబును శాంత్యాత్మకంబును మరుత్సంస్థంబును దురీయశివబీజంబును జతుష్కలంబును బూర్వాదిజ్మండితంబును శక్తివిశిష్టంబగు తత్పురుషపరమబ్రహ్మంబును అంజనాదిప్రతీకాశంబును దక్షిణవక్త్రంబును ఘోరవిగ్రహంబును విద్యాపదయుతంబను వహ్నిమండలమధ్యస్థంబనుద్భృతీయశివబీజంబును అష్టకలాన్వితంబను శక్తివిశిష్టంబగు నఘోరపరబ్రహ్మంబును కుంకుమక్షోదశశాంకశంబను త్తరవక్త్రంబను బ్రతిష్ఠాపద (కలా) ప్రతిష్ఠితంబు నుదకమండలమధ్యస్థంబును ద్వితీయశివబీజంబును త్రయోదశకలాసమన్వితంబును శక్తివిశిష్టంబునగు వామదేవపరబ్రహ్మంబునుశంఖకుందేందుధవళంబును పశ్చిమవక్త్రంబును సౌమ్యలక్షణంబును నివృత్తిపదనిష్ఠంబును పృథివీసమవస్థితంబును బ్రథమశివబీజంబును కలాష్టకయుతంబును శక్తివిశిష్టంబునునగుసద్యోజాతపరబ్రహ్మంబును నాచేఁ దత్తత్ప్రదేశంబులందర్చింపఁబడిన వీయవియును బంచావరణస్థదేవతలును నాకుఁ బ్రార్థితంబు నొసంగుదురుగాతయని యిట్లు ప్రస్తుతింపవలయున యుపమన్యుమునీంద్రుండు చెప్పిన విని శ్రీకృష్ణుండు సంతుష్టుండై మఱియును శివలింగతత్త్వంబను బూజాయోగరహస్యంబులనడిగి తెలిసికొని కృతార్థుండయ్యెనని వాయుదేవుండు మునులకుఁదెల్పి యంతర్హితుండయ్యెనంత మఱునాఁటి ప్రభాతంబునఁ దపోధనులగు నానైమిశీయఋషులు సత్రాంతంబున నవభృథంబునొనర్పఁబ్రసన్నస్వాదుసలిలయగు సరస్వతీనదిఁజేరి యందు శివంబులగు తజ్జలంబుల స్నానమాడి దేవాదితర్పణంబులొనర్చి పూర్వవృత్తాంతంబును స్మరించి వారణాసి కేగిరి.

గీ॥ అందు నుత్తరవాహిని♦యైన గంగ, మునుకలొనరించియల యవి♦ముక్తనాథ
లింగమును విధినర్చించి♦లీలమరలు, చుండనచ్చోట నొకతేజ♦ముద్భవించె. 347

క॥ ఆతేజ మర్కకోటి, ప్రాతప్రతిమానమగుచు ♦ వరుసగ రోదః
స్థితంబై కరమలరుడుఁ, గౌతుకమున మునులు మహము ♦ గాంచు చుమందగ.

గీ॥ పాశుపతులగు సిద్ధులు♦పరమమునులు, భస్మసంఛన్నతనులు త♦పస్వు లట్టి
తేజమునవచ్చి చేరయం♦దే విలీను, లైరియత్తేజ మటుమీఁద♦నంతరించె. 349

క॥ అదిగని నైమిశవనమునఁ, బొదలెడు నమ్మునివరులు ప్ర♦భూతాశ్చర్యం
బొదవఁగ నిది యేమని యజ, సదనమునకు మేరువనికిఁ♦జనిరి రయమునన్.

—* నారదుఁడు తుంబురునితో సామ్యంబుఁ బడయుట *—

క॥ ఇంతకుమున్నే పవనుం, డెంతయు వేగముగ నటకు ♦ నేగి విధికిఁ గా
లాంతకతత్త్వము మునులకు, నంతయుఁ జెప్పితిని సత్ర ♦ మవసితమయ్యెన్.

గీ॥ నీదు సెల వొనరించితి ♦ నిగమవంద్య!, యనుచు విజ్ఞప్తియొనరించి♦యబ్జభవుని
యానతిన్ గొని నిజపురి♦కరిగెనంత, బ్రహ్మ యాస్థానికేగె సు♦రలుగొలువఁగ.

గీ॥ అందుఁదుంబురుతోఁ గల♦హాశనర్షి, గానమున స్పర్థసేయుచుఁ♦గడిఁదిపూన్కి
నాఁడు తనశక్తిఁ జూపింప♦వేఁడుటయు వి, రించియియ్యకొనియెను జే♦రిరిపలువురు.

వ. గంధర్వు లప్సరోజనంబులు గీతవాదిత్రకుశలులగువారు చేరి రా సమయంబున సభాప్రదేశంబు మిక్కుటంబుగ నిండియున్న కతంబున ద్వాస్థజనులు నైమిశారణ్యమునుల నడ్డగించుటఁ జేసి యవ్వారు సభాలయంబుఁ బ్రవేశింపలేక దివాజంబుముందరి పంచలోని పటికంపు టరుగుపయిం గూరుచుండి యుండిరంత.

గీ॥ నారదుం డాటితేటిగా♦నమున నాఁడు, తుంబురునితోడఁ దాఁదులఁ♦దూఁగెనపుడు
బ్రహ్మదేవుండు మెచ్చి నా♦రదమునికిని. దుంబురున కనపాయస♦ఖ్యంబుఁ గూర్చె

వ. అంత నారదుండును.

క॥ కైలాసపర్వతంబున, శైలాదిమునీంద్రునకును ♦ శంభునకును వీ
ణాలలితకౌశలంబును, జాలఁగఁ జూపింప గీత♦చతురుల తోడన్. 356

వ. తుంబురుఁ దోడ్కొని బిరబిరఁ జనుచుండ నైమిశమునులు డాసి బ్రహ్మసభాప్రవేశంబు నర్థింపుచు నతండు బ్రహ్మకెఱిఁగించి యాస్థానముఁ జేర్చుఁడని ద్వారికులకుఁ జెప్పి చనుటయు వార లట్లొనర్ప నమ్మునులు బ్రహ్మన్ జేరి సాష్టాంగ మొంది నిలిచిన నలువయు నవ్వారల కుశలం బడిగి యిట్లనియె. 357

గీ॥ మీసమాచారమంతయు♦నాసదాగతి ముఖమున నింతకున్ మున్నె♦ తెలిసికొంటి
నతఁడు మీసముఖముఁ బాసి♦యవలకేగి, నంతమీఁదియుదంతంబు♦నంతఁ జెపుఁడు.

వ. అనుటయు మును లవబృథావసానంబున వారణాసి కేగుటయు నందు గంగాస్నానం బొనరించి దేవప్రతిష్ఠితంబులగు శివలింగంబుల దర్శించుటయు నవిముక్తేశ్వరలింగంబు నర్చించుటయును నాకాశంబున మహాతేజం బొకఁడు గన్పట్టుటయు నందుఁ బాశుపతసిద్ధమునులు చేరి తిరోధానంబు నొందుటయు నద్దాని యాథాత్మ్యంబు దెలియకుండుటయు నటుమీఁదఁ దమ సన్నిధానంబున కరుగుదెంచుటయును జెప్పి ప్రణమిల్లిన విని చతుర్ముఖుండు శిరఃకంపం బొనరించి గంభీరవాక్కుల నిట్లనియె. 359

ఉ॥ దాకొని మోక్షలక్ష్మి నియ ♦ తమ్ముగ సత్రమునందు శంకరున్
లోకగురున్ భజించితిరి ♦ లోలతఁ దక్కి మునీంద్రతల్లజుల్!
మీకిది భావిసూచకము ♦ మీరలు గన్గొనినట్టి తేజమా
శ్రీకరుఁడౌ మహేశ్వరుఁడు ♦ చెందుదు రీరలు దత్ప్రసాదమున్. 860

గీ॥ అట్టిసమయమునఁ డగ్గఱ ♦ నభవక్త్రపను, మీరలిఁక దక్షిణంబగు ♦ మేరుశిఖర
మునకుఁ జేరుఁడు మామక ♦ పుత్త్రుఁడౌ స,నత్కుమారుండచటనుండు ♦ నందికొఱకు.

—* బ్రహ్మ సనత్కుమారుని శాపమోక్షము తెలుఁగు చెప్పుట *—

చ॥ శివుఁడును మున్ను నాకొమరుఁ ♦ జేరఁగవచ్చినఁ జూచి వాఁ డనూ
భవుఁడు భ్రమంబుఁ జెంది గరు ♦ వంబున వందనపూజనాదికా
ర్యావిధుల సల్పకున్నఁ గని ♦ యక్కట తండ్రుఁడు గిన్క మేటిపో
ట్రైవయి చరింపుమిందని క ♦ డిందిరయంబున శాపమిచ్చెఁ దాన్. 862

గీ॥ పుత్త్రుఁడు క్రమేళకంబయి ♦ పొగలుచుండ, నే మహాదేవునంబను ♦ విష్ణుఁ గొలిచి
నందినిం బుజ్జగించి నా ♦ నందనునకు, నుష్ట్రతను బాపితి స్వమూర్తి ♦ నొందె నతఁడు.

ఉ॥ అత్తఱి దేవదేవుఁడు మ ♦ హాద్యుతి నందినిఁ జూచి పల్కె ధీ
రోత్తమ! బ్రహ్మపుత్త్రుఁ డితఁ ♦ డుల్లమునం దనుఁ బోల్ప లేక కిం
చిత్తవరాకుఁ జెంది యిటు ♦ శిక్షితుఁ డయ్యె నిఁకన్ మదీయ భా
స్వత్తరతత్త్వమున్ దెలుపు ♦ చక్కని శిష్యుఁడు నీకుఁ జేకుఱెన్. 864

గీ॥ ఇట్లు నందికిఁ జెప్పి మ ♦ హేశ్వరుండు, నందియును చిత్తమందు నా ♦ నంద మొంది
విభుని యాజ్ఞ తలన్ దాల్చి ♦ వేగ నిటకు, రాఁగ డఁగియుండె నీలోన ♦ వేగ మీరు.

గీ॥ నాదు పిలుపున నందిప్ర ♦ సాదమొంద, నందుఁ దపియించుచున్న నా ♦ నందనుఁడు స
నత్కుమారుని కడ కేగి ♦ నందికేశ, బోధలను వినుఁ డిఁక మీరు ♦ మునితిలకులు! 866

—* నైమిశమునులు స్కందసరోవరంబుఁ జేరుట *—

వ. దాన మీ కచిరంబుగ శివప్రసాదంబు సమకూరుననుటయు నవ్వారలు సుమేరు దక్షిణంబందలి కుమారశిఖరమ్మునఁ దనరు నచ్ఛశీతచ్ఛస్వాదుశిశిరాగాధలఘూదకంబును సర్వర్తుస్ఫుట కలికాకుసుమస్తోమోత్తమఫలస్తబకమంజరీపుంజరంజితానేక తరువాటికాచ్ఛాదితాఖిలదిఙ్ముఖంబును, పరితస్సంఘటితాయత విభాస్వరస్ఫాటికోపల వేదీవిరాజితంబును స్థూల నీలశిలామయసుఖావతరణారోహావిలసితంబును వివిధవర్ణారవిందేందీవరవిరాజిత పద్మినీకుముద్వతీలతావ్రాత సంశోభితంబును రంగదుత్తుంగాభంగతరంగసంశోభితంబునునగు స్కందసరోవరంబుఁగాంచి యందు,

సీ॥ ఒకచోట మునుఁగుచు ♦ నొకచోటఁ దేలెడు, గజయూథపతుల న♦క్కజముఁ గనుచు
నొకచోటఁ బల్లాప ♦ నొంది బల్ పరువుల, బరతెంచు లేళ్ళ యా♦తురతఁ గనుచు
నొకచోటఁ దటమున ♦ నుత్ఖాత కేళుల, నొనరించు వృషముల ♦ యొప్పుఁ గనుచు
నొకచోట నుదకంబు ♦ నొందియచ్చటినుండి, వెడలెడు నెమ్మల ♦ వేడ్కఁ గనుచు

గీ॥ నొక్కచో నవగాహంబు ♦ లొంది దేవ, మునిపితల తర్పణము సేయు ♦ మునుల గనుచు
నొక్కచో నంచపిండుల ♦ నొక్కచోటఁ, గోకముల మూఁకఁ గనుచు బల్ ♦ కుతుకమునను

వ. అన్వేషింపుచుఁ జని సరోవరోత్తరతీరంబందుఁ గల్పవృక్షంబునీడను వజ్రమయ వేదియందు మృదులంబగు మృగచర్మంబందుఁ గూర్చుండియుండినవాని నప్పుడే సమాధినుండి బహిర్గతుండయినవాని యోగీంద్రులగు పలువురు మునీంద్రులచే సేవింపఁబడుచున్న వానిఁ గుమారాకారుని సనత్కుమారమునినిఁ గన్గొని ప్రణతులై తత్ప్రశ్నంబున ననుసరించి తమ వచ్చిన కతంబుఁ జెప్పుచున్నంత నాకసంబునందు దివ్యులనగారామోగ్రితలతో భానుసన్నిభంబగు నొకవిమానంబు దోఁచి యందు గణేశ్వరబృందంబులతోఁ బరివేష్టితుఁడై సేవింపఁబడుచున్న సుకీర్తిప్రాణవల్లభుం డపరహరుండు పొడసూపిన సనత్కుమారుండెదుర్కొని జోతఁ గావించి సముచితార్చనలఁ బ్రీతుఁ జేసి దోయిలొగ్గి షట్కులీయులగు నైమిశమునులు బ్రహ్మానుజ్ఞచేఁ దమ యనుగ్రహార్థమై వచ్చిరని చూపిన నద్దేవుండు సనత్కుమారుని నుడులాలకించి దృష్టిపాతమాత్రంబున మునులపాశంబులఁ ద్రెంపివేసి నైశ్వరంబగు శివజ్ఞాన యోగంబు సనత్కుమారునితోఁ గూడ మునులకొసంగి జయధ్వానములతోఁ దిరుగ శివసన్నిధానంబున కేగెననుచు శౌనకాదిమునులు సూతుఁ గాంచి మహాత్మా! నందికేశుండు సనత్కుమారునకు షట్కులీయమునులకుఁ జెప్పిన శివజ్ఞానయోగంబందలి ముఖ్యసారంబు మా కెఱింగింపుమనిన సూతుండిట్లనియె.

—* నందికేశుఁడు చెప్పిన ముఖ్యసారము లింగధారణము *—

గీ॥ వినుఁడు జ్ఞానసారంబును ♦ విమలమును బవిత్రమును నగు శివలింగ ♦ వితతధార
ణముఁ గుఱించి వచించెను ♦ నందికేశుఁ, డెఱుఁగుఁడీ యదివిూరు మౌ ♦ నీంద్రులార!

గీ॥ భ్రమరసంగతిఁ గీటంబు ♦ భ్రమరమైన, కరణి శివలింగసంగతిఁ ♦ గాంచి జీవుఁ
డభవుఁడగు నిట్లు శ్రుతి చెప్ప ♦ హరివిరించి, ముఖులు శివలింగధారణం ♦ బును బడసిరి.

క॥ మఱియుఁ గౌతమముఖముని, వరులును దిక్పాలకులును ♦ వాసిగఁ బాణిఁ
శిరసునఁ బవిత్రమనుచును, హరువుగ శివలింగ మొంది ♦ రరయుఁడు తపసుల్!

వ. ఆ లింగధారణంబునందును.

గీ॥ స్ఫాటికంబును బాణంబుఁ ♦ జంద్రకాంత, మయమునున్ దినమణికాంత ♦ మయము హేమ
రౌప్యకృతమును శ్రీగిరి ♦ గ్రావకృతము, నైన లింగంబు ధరియింప ♦ నగును మునులు.

వ. తక్కినవి పూజనీయంబులుగావు. మఱియును,

గీ॥ స్ఫాటికాదిలింగంబులు ♦ శక్తియుక్త, ములును బంచసూత్రఘటిత ♦ ములునునరసి
ధారణమునొందిపూజింపఁ ♦ దగునులింగ, మరయుఁడర్ధాంగుళిన్యూన ♦ మైనఁదగదు.

వ. అంగుళిత్రియంబుకన్న నున్నతంబైనదియుఁగూడ ధారణార్హంబుగాదు.

క॥ శక్తియనలింగపీఠం, బుక్తము శర్వుండులింగ ♦ మూహింపుఁడిటుల్
శక్తియురువైనధనవ్యాప్తి, భక్తునకగుఁగీడు శివుని ♦ పరిమితియురువేఁ.

వ. ఇఁకఁ బంచసూత్రములననిట్లు దెలియుఁడు.

గీ॥ లింగమస్తకవిస్తృతి ♦ లింగపున్న, *తియునుదుల్యంబుగానర ♦ సియు గుణితము
బరిధిఁగూరిచి పీఠమా ♦ పగిదిఁదీర్చి, యట్టులెప్రవాళికనుగూర్ప ♦ నగునుబుధులు'

వ. పంచసూత్రనిర్ణయంబన నీప్రకారమే. ఇఁకనీలింగధారణంబు నిగమాగమ కల్పోక్తప్రకారంబు షడధ్వశోధనపురస్సరంబుగానొంది యావజ్జీవంబన పాయంబుగ శివలింగంబు నర్చింపవలయు నట్లు ధరించి పూజింపఁజాలకున్న సామాన్యశైవదీక్షనొంది ప్రాణంబులున్నంతవఱకు శివలింగంబును బూజింపవలయు నిది వేదసారంబు జ్ఞానసారంబని యుపదేశించె. 378

క॥ శ్రీవీరభద్రగురురా, జ్ఞీ! విమలజ్ఞానదీప ♦ నిశ్చలహృదయా!
సేవితమహేశపదరా, జీవా! నిరతాన్నదాన ♦ శీలా! జననీ: 379

క॥ ధవళేశలింగసంగత, ధవళపురీరాజ్యవిభవ ♦ దక్షిణభగినీ!
కవిజనసన్నుతచరితా, శివతత్త్వవిచారపూత ♦ శేముషి! జననీ! 380

క॥ నాగేద్భూషణపదరత, నాగాంబానుజ! నగేంద్ర ♦ నాథకుమారీ
నాగాజినచేలార్చా, జాగరహృదయా! దయావ ♦ శా! లక్ష్మాంబా! 381

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వర నామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి వాయవీయఖండంబునందు
ద్వితీయాశ్వాసంబు సర్వము సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



* గౌతమీతంత్రే॥ శ్లో॥ లింగమస్తకవిస్తారో। లింగోచ్ఛ్రాయస్సమోమతః। పరిధిస్త్రిగుణితః॥
తద్వత్పీఠం వ్యవస్థితం। ప్రణాళికాతద్దైర్ఘ్యాత్। పంచసూత్రవినిర్ణయః॥



శ్రీ శివాభ్యాన్నమః

# శ్రీ శివపురాణము

## విద్యేశ్వర ఖండము

### ప్రథమాశ్వాసము.



శివమంత్రధ్యానని
వేశమనఃపుండరీక ♦ విలసితఘనవిద్
కోశార్జితశివతత్త్వ
ప్రాశస్త్య! మహాత్మ! వీర♦భద్రారాధ్యా!

వ. అవధరింపుము.

క॥ సూతునితో మునితల్లజు, లాతతసంప్రీతినిట్లు ♦ లనిరి మహాత్మా!
చేతము శుద్ధంబయ్యెం బు, నీతులమైతిమి కరంబు నీదగుబోధన్, 2

గీ॥ లింగపూజాప్రకారంబు ♦ లింగభేద,సంగతిని భూతి రుద్రాక్ష♦సంగతులను
గ్రమముతోడుతనవ్యాని ♦ గల్పవిధముఁ,దెలియజెప్పుముమాకిందుఁ♦దేటపడఁగ

వ. నావుడు సూతుండు

చ॥ మునివరులార! లింగమును ♦ బూజయొనర్పఁగఁజెల్లుఁ బీఠమం
దున నిఁక హస్తపీఠమునఁ ♦ దోరపుభక్తిచెలంగ వేదవ
ర్త్మనియతి నాగమోక్తవిధిఁ ♦ దద్విధమున్ మును గొంతదెల్పియుం
టిని నిపుడున్ వచింతు వినుఁ ♦ డీ సకలంబు ముదంబు మీఱఁగన్. 4

—* హస్తపీఠంబులందుఁ లింగమును బూజించిన ఫలములు *—

గీ॥ రహిశివార్చనమందు బే♦రమునులింగ, మును యజించెద రద్దాన♦ముఖ్యమగుచు
లింగసంపూజనం బొప్పె♦సంగు బేర, పూజనముగూడ యుక్తమై♦పొల్పుమీఱు

క॥ పెఱవేల్పులకెల్లను నెవ్వరుసునఁ బ్రీతిమూర్చనంబె ♦ పరిధవిలు నీకన్ బరముఁడగు శివునకొక్కని. కరుదుగ నిత్తెఱఁగు ద్వివిధ♦మర్చ తనర్చున్. 6

గీ॥ ధరఁ బ్రవృత్తపథంబునఁ♦దనరి సతత, మైహికసుఖంబులనుమాత్ర♦మభిలషించు వాఁడు పీఠస్థలింగంబు♦వాసియమరఁ, బూజసేయంగ వలయును ♦ భాంకముగను.

వ. శాల్యన్నవైవేద్యం బొసంగి పూజావసానంబున సంపులంబునందుంచి పూజా గృహంబున నుంచవలయును. 8

గీ॥ ఇఁకఁ బ్రవృత్తినివృత్తుల♦నెసక మెసఁగ, భోగమోక్షంబులను జెందఁ బూనువాఁడు ఆత్మకరపీఠమున లింగ♦మర్థి సముచి, తార్చనము సేయవలయు నా♦హ్లాదమొప్ప

వ. స్వభోజ్యపదార్థంబు నివేదనం బొనరించి పూజావసానంబందు లింగంబును శిరో ముఖ్యోత్తరకాయంబులందు ధరించవలయును. 10

## —* లింగభేదంబులు *—

గీ॥ క్షత్రియునకొప్పు బాణలిం♦గంబు రాజ్య, సంపదావహమగు నూరు♦జాతునకు సు వర్ణలింగంబు ధనధాన్య♦వర్గమిచ్చుఁ, బాదజుల కశ్మలింగంబు♦వైభవమిడు. 11

గీ॥ స్ఫాటికము బాణలింగంబు♦సర్వులకును, సర్వకామదమగును యో♦షాజనంబు లందుఁ బార్థివలింగమా♦మైదువులకుఁ, బటికపుర్లింగము వితంతు♦భామినులకు.

వ. పూజార్హంబై యభీష్టావహంబై యొప్పు

క॥ మఱియు నివృత్తిపథంబునఁ, బరఁగెడు ననదలు యజింప♦వలె రసలింగం బిరవుగ బాలలు వృద్ధులు, ధరఁ బటికపులింగమర్థిఁ ♦ దగఁగొల్వవలెన్. 13

వ. ఇఁక నెవరికెట్టిలింగంబులు విధించినను దాదృశలింగంబుదొరకమి నితరలింగంబు నర్చించుటయందుఁ బ్రత్యవాయంబులేదిఁకను బార్థివలింగంబుఁగూరిచి వినుండు.

గీ॥ లింగములలోనఁ బార్థివ♦లింగముత్త, మంబయితనర్చు వద్దాని♦మహి వనేక మునులు పూజించి సిద్ధులఁ♦బొందిరఖిల, సురలునర్గొల్చి పడసిరి♦సిరులమిగడు.

గీ॥ ప్రథమయుగమున శ్రేష్ఠంబు♦రత్నలింగ, మల్లత్రేతాయుగంబున♦హైమలింగ మాతృతీయయుగమునర♦సాధ్యలింగ, మిఁకఁగలిఁ బార్థివపులింగ♦మేహితంబు.

క॥ శివు నెనిమిదిమూర్తులలో, భువిమెట్టుల ముఖ్యమగుచుఁ♦బొలుపొందెనో పా ర్థివలింగ మట్టులే యా, వివిధములగు లింగములను ♦ వెలయును సిరులన్. 27

మ॥ సురలం దెక్కుడు శ్రేష్ఠతన్ దనరునో ♦ నుక్షత్రాంశుచూడుండు ని ర్ఝరిణీవర్గమునందు జాహ్నవియెటుల్ ♦ రాజిల్లునో శ్రేష్ఠమై

ధరలో వర్ణములందు బ్రాహ్మణుఁడెటుల్ ♦ డై వాఱునో ముఖ్యుఁడై
సిరిమీఱన్ బ్రణవంబు వర్ణములలో ♦ శ్రేష్ఠత్వ మెట్లొందెనో! 18

క॥ ఎట్టులఁ గాశి నగరులం, దెట్టుల దేవీతతిన్ మ♦హేశ్వరి యురవా
నట్టులఁ బార్థివలింగము, నెట్టన లింగంబులందు ♦ నేటు మునీంద్రుల్! 19

గీ॥ తనకు నుపలబ్ధమగు పదా♦ర్థములతోడ, నాస్థఁ బార్థివలింగస♦మర్చనంబు
సేయువాఁడాయురున్నతిన్ ♦శ్రీలఁబుత్ర, సంతతినిఁజెందుఁబరమున♦శంభుఁడగును.

గీ॥ ఇఁక ద్రిసంధ్యంబునం దెవఁ♦డింపుమెఱయఁ, బార్థివేశ్వరలింగంబుఁ♦బట్టుదలను
బ్రాణమోక్షంబువఱకుస♦మర్చనంబుఁ, జేయునో దానిఁగూర్చి నేఁ♦జెప్పుదువినుఁడు.

క॥ శివలోకమునకుఁ జని యట, శివసవిధంబునఁ జిరము వ♦సించి తిరుగ నీ
భువియందు మేటి యగు బా♦ర్థివుఁడై జనియింపఁగలఁడు ♦ తేజంబెసఁగన్.

వ. సకాముఁడై యర్చించినవాఁ డివ్విధం బిఁక నిష్కాముఁడై యర్చించినవాఁడు
శివసాయుజ్యంబునొందును మఱియుఁకను. 23

గీ॥ పంచసూత్రఘటితమైన♦పార్థివంపు, లింగమిట్టులఁ గల్పోక్త♦లీలఁబూజ
సేయవలయుఁ గుతర్కంబు♦సేయరాదు, వేదశాస్త్రాభిమతమిది♦విజ్ఞులార! 24

క॥ మేలగుఁ బ్రాణత్యాగము, మేలు శిరఃకర్తనంబు ♦ మేదినిలోనన్
బాలశశిమౌళిలింగము, లోలతఁగొలువకయె కుడుచు ♦ లోలుపునకిలన్. 25

క॥ భువి విప్రుండయి పొడమియు, శివలింగము నెవఁడుప్రీతి♦సేవింపఁడో యా
యవివేకి నరకమున నను,భవించు దుఃఖములఁ బెక్కు ♦ వత్సరశతముల్. 26

వ. మఱియు నీలింగంబులలో స్థావరలింగంబులందు ద్విఖండంబులుగ చరలింగంబులం
దఖండంబులుగను సమకూర్చుకొనవలయు నిఁక రత్నస్వర్ణపారదస్ఫాటిక పుష్య
రాగపార్థివలింగంబులందఖండలింగంబులనే స్వీకరించవలయును. 27

గీ॥ స్థావరంబు నఖండంబు♦చరమిఁకను ద్వి,ఖండమునునగు లింగంబు♦గడఁగిపూజ
సేయుటొప్పదిది యెఱింగి♦సేయుఁడీరు, శంభులింగార్చనంబు ప్ర♦శస్తముగను. 28

## — * పార్థివలింగ పూజావిధానము * —

క॥ ఇఁకఁ బార్థివలింగార్చా, ప్రకారమంతయును నిష్ఠ ♦ బ్రహ్మాదులుల్ వై
దికమార్గముతో మీకిటఁ, బ్రకటముఁ జేసెద వినుండు♦బద్ధాదరులై. 29

వ. సూత్రోక్తవిధి నుషఃకాలంబున స్నాతులై సంధ్యనుపాసించి బ్రహ్మయజ్ఞతర్పణ
ములనొనర్చి నైత్యకర్మల నన్నిటన్ జక్కనొనర్చి శివస్మరణతో భస్మరుద్రాక్ష
ధారివై పార్థివలింగంబును బూజింపవలయును. 30

గీ॥ అరసి పుణ్యనదీతీర♦మందునుం జలాశయాంతికమున శైల♦మందు వనము
నందు శ్రీశంకరాలయ♦మందు శుద్ధతలమునఁ బార్థివార్చన♦సలుపవలయు. 31

క॥ తెల్లనిమృత్తున బాపం, డల్లనృపతి యెఱ్ఱమట్టి ♦ నర్యకులుం బసుఁ
నల్లనిమట్టిని లింగము, నుల్లమలర సల్పవలయు ♦ నున్నతచరితుల్. 32

వ. అంఘ్రిజుం డెద్ది సంభవించిన నద్దానితో లింగంబుసల్పి పూజింపఁదగు. 33

గీ॥ శుద్ధమైన ప్రదేశంబుఁ♦జూచి యచటి, మృత్తికను దెచ్చి యింటిలో♦మిగుల శుద్ధ
మైన సుస్థలమందు న♦ద్దాని నుంచి, దినదినమును లింగంబులఁ♦దీర్పవలయు. 34

వ, మఱియు సద్యోజాతమంత్రపఠనం బొనరింపుచు మృదాహరణం బొనరించి వామదేవమంత్రంబున నుదకప్రక్షేపం బొనరించి, యఘోరమంత్రంబున లింగనిర్మాణం బొనరించి, తత్పురుష మంత్రంబున నావాహనం బొనర్చి, యీశాన మంత్రంబున వేదీసంయోజనంబు సేయవలయు. 35

ఆ॥ మఱియు నంతఁదా "న♦మశ్శివాయ" యను మంత్రంబుతోడ వస్తు♦రాజిపైను
దకముఁ జల్లి చేయఁ♦దగు క్షేత్రశుద్ధిని, "భూరసి" యనుమంత్ర♦మునను మునులు.

వ. అనంతరమం "దాపస్స్మా" ననుమంత్రంబున జలసంస్కారం బొనరించి "నమస్తే రుద్ర" యనుమంత్రంబున క్షేత్రశుద్ధినిఁబొనర్చి "నమః" పూర్వకంబగు నద్దానఁ బంచామృతంబులకుఁ బ్రోక్షణం బొనర్పవలయు. "నమోనీలగ్రీవాయ" యను మంత్రంబున శివలింగప్రతిష్ఠఁ బొనర్చి "ఏతత్తేరుద్రాయ" యనుమంత్రంబున లింగమున కాసనం బొసఁగవలయు. "మానోమహాంత" మనుమంత్రంబున నావాహనం బొనరించి "యాతేరుద్ర" మంత్రంబున నుపవేశనంబు భావింపవలయు "యామిషు" మను మంత్రంబున న్యాసం బొనరించి "అధ్యవోచ" యను మంత్రంబునఁ బ్రేమతో నధివాసం బొసర్పవలయు. "జీవ" యనుమంత్రంబున దేవతాన్యాసం బొనరించి "అసౌయోవసర్పతి" యను మంత్రంబున నుపసర్పణంబు చేయవలయును. "నమస్తే నీలగ్రీవాయ" యనుమంత్రంబునఁ బాద్యంబును రుద్రగాయత్రీ మంత్రంబున నర్ఘ్యంబును "త్ర్యంబక" మంత్రంబున నాచమనంబు నొనర్పఁదగు. 'పయఃపృథివ్యామ్' అను మంత్రంబున క్షీరస్నానంబును దధిక్రావణ్ణ' మంత్రంబున దధిస్నానంబును 'ఘృతయావ' యను మంత్రంబున ఘృతస్నానంబును 'మధువాతా' యనుమంత్రంబున మధుస్నానంబును 'శాచ్చర్కరా' యనుమంత్రంబున శర్కరాస్నానంబును నొనర్పఁదగు. 'నమస్సేమాయేతి' మంత్రంబున శుద్ధోదకస్నానంబు నొనర్పఁదగు. అటుపై 'మానస్తోకే' యనుమంత్రంబునఁ గటిబంధనం బొనర్చి 'నమోధృష్ణవే' యనుమంత్రంబున మృత్తికయును ధరింపఁజేయవలయును. "యాతేహేతి" యను మంత్రచతుష్టయంబుతో శివునకు

వస్త్రసమర్పణంబొనరించి "నమశ్శ్వభ్య" యనుమంత్రింబున శ్రీగంధంబును 'నమస్త క్షభ్య' యను మంత్రంబున నక్షతలను సమర్పించవలయును. 'నమః పార్యాయ' యనుమంత్రింబునఁ బ్రత్యగ్రపుష్పంబులను 'నమః పర్ణ్యాయ' యనుమంత్రంబున బిల్వపత్రంబులను "నమఃకపర్దినే" యనుమంత్రంబునధూపంబును 'నమఆశవ' యనుమంత్రింబున దీపంబును 'నమో జ్యేష్ఠాయ' యనుమంత్రింబుననుత్తమంబగు సన్నబియ్యంపుటన్నంబు నైవేద్యంబును 'త్ర్యంబక' మనుమంత్రంబున బునరాచమనమును, 'ఇమారుద్రాయ' యనుమంత్రంబున పణసామ్ర దాడిమ ద్రాక్షా రంభాది ఫలసమర్పణంబును 'నమోపజ్యాయ' యనుమంత్రింబున తాంబూలాది సకలమును శివున కర్పింపవలయును 'మానోమహాంత' మనునట్టియు 'మానస్తోకే' యనునట్టియు మంత్రద్వయంబుతో నేకాదశాక్షతలతో నేకాదశ రుద్రులగూర్చి లింగమును బూజింపవలయును. 'హిరణ్యగర్భ' యనుమంత్రింబున దక్షిణనిచ్చి 'దేవస్యత్వా' యనుమంత్రంబునఁ బునరభిషేకంబుఁ జేయఁదగు. దీపమంత్రములచేతఁ గర్పూరనీరాజనంబిచ్చి 'ఇమారుద్రాయ' యనుమంత్రంబునఁ బుష్పంబులనొసఁగి 'మానోమహాంత' మనుమంత్రింబునఁ బ్రదక్షిణంబొనర్చి 'మానస్తోకే' యనుమంత్రింబున సాష్టాంగ వందనంబొనర్చి "ఏష తేరుద్ర" యను మంత్రంబున శివముద్రనుజూపి 'యతేయత్ర' యనుమంత్రంబున నభయముద్రను "త్ర్యంబక" మంత్రంబుచే జ్ఞానముద్రను, "నమఃసేనాయ" యనుమంత్రింబున మహాముద్రను 'నమోగోభ్య' యనుమంత్రంబున ధేనుముద్రను నిట్లు పంచముద్రలను జూపించి శివమంత్రంబును శతరుద్రీయంబునుజపింపవలయును ననంతరంబునఁ బంచాంగపఠనం బొనర్చి "దేవాగాతు" మనుమంత్రింబున శివుని విసర్జనము సేయవలయునిది వైదికశివపూజా విధాన మింక మఱొకపద్ధతి వినుఁడు. 37

క॥ గురుసత్తమైనపంచా, క్షరమనువును షోడశోప ♦ చారంబుల శం
కరలింగపూజనంబును, సరవిగ నొనరింపవలయు ♦ సన్మానివరుల్ ! 38

వ. వెండియు నిఁక వేఱొండుపద్ధతి.

శ్లో. భవాయ భవనాశాయ । మహాదేవాయధీమహే
ఉగ్రాయచోగ్రనాశాయ । శర్వాయ శశిమౌళినే ॥ 39

ఈ మంత్రముచే శివలింగమును బూజింపవలయును నీయవి వైదికపూజన క్రమములింకను వేఱొకరీతి నారయుఁడు. మృదాహరణంబు మొదల్కొని ప్రతిష్ఠాహ్వానస్నపనపూజన విసర్జనాంతము "ఓం హరాయనమః ఓం మహేశ్వరాయనమః ఓం శంభవేనమః, ఓం శూలపాణయేనమః ఓం పినాకధారిణేనమః ఓం శివాయనమః ఓం పశుపతయేనమః. ఓం మహాదేవాయనమః" అను

నీ నామంబులచేఁ గ్రమంబుగ సర్వోపచారంబుల భక్తితోఁ బూజింపవలయును. అటుమీఁద షడక్షరీ మంత్రంబున షడంగన్యాసములొనర్చి యిట్లు ధ్యానము సేయవలయును. 29

"శ్లో. కైలాసపీఠాసనమధ్యసంస్థం । భక్తైస్సనందాదిభి రర్చ్యమానమ్ ।
భక్తార్తిదావానలమప్రమేయం । ధ్యాయేదుమాలింగిత విశ్వనాథమ్ ॥

శ్లో. ధ్యాయేన్నిత్యం మహేశం రజతగిరినిభం । చారుచంద్రావతంసం
రత్నాకల్పోజ్జ్వలాంగం పరశుమృగవరా । భీతిహస్తం ప్రసన్నం
పద్మాసీనం సమంతాత్ స్థిత మమరగణై । ర్వ్యాఘ్రకృత్తింవసానమ్
విశ్వాద్యం విశ్వవంద్యం నిఖిలభయహరం । పంచవక్త్రం త్రినేత్రం॥"

ఈ మంత్రంబులచేతను శతరుద్రీయము మున్నగువానిచేత శివుని ధ్యానము చేసి యిట్లు ప్రార్థింపవలయును. 30

క॥ నీవాఁడను నీభక్తుఁడ, నీవిమలగుణముల నుసురు ♦ నిలిపితి నీయం
దే వెలయించితి మదినిఁ గృపావార్థీ! భూతనాథ! ♦ పాలింపఁగదే ! 31

క॥ ఎఱిఁగియొ యెఱుఁగకయో యిటు, వరద! జపార్చల సలిపితి ♦ వాసిగ నీబం
ధురకృప సఫలమొనర్పుము, పరమేశ్వర ! సర్వలోక ♦ పాలనచతురా ! 32

గీ॥ కడిఁదిపాపుఁడ నేను నిక్కముగ దేవ!, పావనుఁడవీవు లోకైక ♦ పాలమూర్తి !
దీనినారసినీకెట్లు♦మానసమునఁ, దోచునోయట్టు లొనరింపు♦తుహినధవళ ! 33

గీ॥ వేదములచేత బహుశాస్త్ర ♦ వితతిచేత
వివిధదర్శనసిద్ధాంత ♦ వేదులైన
ఋషివతంసులచేత నీ♦ వెఱుకవడక
యుందువిఁక మాదృశుండెట్టు ♦ లూహసేయు. 34

క॥ ఎట్టులుగాని యిఁకను నే, గట్టిగ నీవాఁడ వినుము♦గౌరీశ్వర! నీ
వెట్టులో యక్కటికఁ గొని, నెట్టన రక్షింపవలయు ♦ నేరిమి మీఱన్. 35

వ. ఇట్లర్థించి పుష్పాంజలినొసంగి ప్రదక్షిణవందనంబు లొనర్చి విసర్జనము సేయవలయు నిట్లు పార్థివపూజావిధానం బనేకవిధంబు లుపన్యసించితి. 36

క॥ ఇఁకనిష్టలింగపూజను, సుకరంబగు భంగివినుతు ♦ సురుచిరచరితుల్
ప్రకటనమున దొసఁగెది మా, మకధోరణిఁ బొసఁగనట్ల ♦ మర్చ్య శివుఁడిటన్,

—* మహాశివలింగపూజ *—

*క॥ ఇఱువదినాల్గుపచారము, *లరుదగుపదిరెండుపూజ ♦ నాంగంబులుగ
ప్పురపునివాళియు జోతుల, లర*దశనీరాజనంబు ♦ లనొసంగవలెన్ 38

గీ॥ తద్విధానంబెఱుంగు డం♦తయువచింతు, స్నానమొనరించి శుద్ధవ♦స్త్రములఁగట్టి
భస్మరుద్రాక్షములమేనఁ ♦ బడసిసంధ్య, వార్చి బ్రహ్మయజ్ఞాదుల♦వరుసదీర్చి.

గీ॥ గోమయాంభః ప్రోక్షి తమౌ♦క్తికతలమందు, శ్వేతతండులరజమునఁ ♦ జిత్రమొప్ప
*భద్రమండలమమరించి♦పొప్పచయము, జల్లిపూజాపరికరముల్ ♦సంతరించి. 40

వ. ముందు గణనమస్కారంబొనరించి "నతత్రసూర్యోభాతి" యను మంత్రమున మండలమందు దీపద్వయంబును వెలిఁగించి శివనామములతో నాచమనముచేసి ప్రాణాయామ దేశకాలసంకీర్తనపూర్వకముగ "పరశివేష్టలింగముద్దిశ్య పరశివేష్టలింగ ప్రీత్యర్థం ప్రాతర్మాధ్యాహ్నిక (రాత్రియందు) సాయాహ్నిక మహాపూజాం కరిష్యే" యని సంకల్పమొనర్పవలయును.

ఆ॥ అంత రంగవల్లి♦యందుసామాన్యార్ఘ్య, పాత్రమునిచియందు ♦ భస్మచంద
నములఁబుష్పములను♦నమరించిహృదయమం,త్రముననుదకమునిచి♦తలఁచిసుధగ.

---

ఇరువదినాల్గుపచారములు. శైవాగమే వాతూలోత్తరే—

*శ్లో॥ ఆవాహనాసనార్ఘ్యాణి । పాద్యమాచమనీయకం । యజ్ఞోపవీతమాల్యాని । లేపనాభరణానిచ । ఛత్రించచామరంచైవ । తాళవృంతంచదర్పణం।ఘంటాంశంఖంచగీతంచ। వాద్యంనృత్తంప్రదక్షిణం । నమస్కారస్తుతిర్యాచ్నా । విజ్ఞప్తిశ్చవిసర్జనం । ఇత్యేవముపచారాశ్చ । చతుర్వింశతిధాన్స్మృతాః॥

పదిరెండు పూజనాంగంబులు —

*శ్లో॥ విభూత్యభ్యుక్షణంలింగే । కరణన్నపనస్యచ । అంగారతాపనంచైవ । ధూపనంవీజనంతథా ధూపప్రసారణంచైవ । తతోగంధావతంసకం । అక్షతారోపణంచైవ । నైవేద్యస్యసమర్పణం। తాంబూలస్యప్రదానంచ । వస్త్రసావరణంతతః ।ఏవంద్వాదశధాప్రోక్తాః । శివలింగార్చనక్రియాః॥

దశనీరాజనంబులు —

*శ్లో॥ సానురాగందర్శనావ । సరోమజ్జపమేవచ । మాంగల్యంచైవశృంగారో।మహానీరాజనంతథా। ఆనందశ్చైవతాంబూల । మసంఖ్యాతందశైవహి।నీరాజనానిప్రోక్తాని। శివపూజాపరాయణై రపికర్పూరదీపశ్చ।జ్యోతింషికరదీపికాః।అభితశ్శాంకరంలింగం।దర్శయేత్ పూజకోత్తమః॥

భద్రమండలం —

*శ్లో॥ క్షేత్రేనప్తపదీకృతే।నవపదేమధ్యేలిఖేత్ । కర్ణికాం కింజల్కాన్వితమష్టపద్మసహితం । పద్మం తదభ్యగ్రగే । వేదాశాస్థితకోష్ఠకాని । మతిమాన్ సంత్యజ్య శిష్టేషుస। తోక్ర్తిష్ఠేష్వల్పసరోరుహాణి । విలిఖేత్ స్యాద్భద్రదంమండలం॥

వ. పంచబ్రహ్మమంత్రములచేత నభిమంత్రించి నిరీక్షణ ప్రోక్షణ తాడనావకుంఠనా భ్యుంక్షణములచేత సంస్కరించి ధేనుముద్రచే నమృతీకరించి కమలలింగముద్రలఁ గాన్పింపఁజేసి సామాన్యార్ఘ్య పాత్రకుత్తరముగాఁ బాద్యార్ఘ్యాచమన పాత్రంబులఁ బంక్తిరూపంబుగనునిచి పాద్యపాత్రమునఁ దెల్లావాలు కుంకుమపువ్వు గరికె చెంగల్వకోష్టు పచ్చకర్పూరము విభూతి చందనకుసుమంబులను జేర్చి "ఓం హాం హృదయాయనమః। ఓం హీం శిరసేస్వాహా। ఓం హూం శిఖాయై వషట్। ఓం హైం కవచాయహుం। ఓం హ్రౌం నేత్రత్రయాయ వౌషట్। ఓం హ్రః అస్త్రాయఫట్" అను మంత్రముచేత నుదకముఁబూరించి సద్యోజాతాది పంచబ్రహ్మమంత్రములచే నభిమంత్రించవలయును. ఆపాద్యపాత్రకుత్తరమందున్న అర్ఘ్యపాత్రయందు కుశాగ్రములను దిలయవవ్రీహులను దెల్లావాలను నావుపాలను భస్మచందనసుమంబులను జేర్చి "ఓం హాం హృదయాయనమః" అను మంత్రంబున నుదకముఁబూరించి మూలమంత్రమునఁ బదునొకొండుమాఱు లభిమంత్రింపవలయును. తదుత్తరమందలి యాచమనపుపాత్రయందుఁ దిప్పలము జాపత్రి పచ్చకర్పూరము వట్టివేరు చంగల్వకోష్టు విభూతి చందనకుసుమములఁ జేర్చి షడంగమంత్రములతో నుదకముఁబోసి పంచబ్రహ్మమంత్రములతో నభిమంత్రించవలయును. ఈపాద్యాదిపాత్రములకుఁ దూర్పుదెసను ద్యాగపాత్రంబును జ్ఞానపాత్రంబును ఆనందపాత్రమును వరుసగనునిచి త్యాగపాత్రమందు భస్మచందనకుసుమంబులనునిచి షడంగమంత్రములతో నుష్ణోదకముఁబూరించి ఓం హ్రీం హౌం నమశ్శివాయ యను ప్రాసాదపంచాక్షరీమంత్రముతో నాలుమాఱులభిమంత్రించి తదుత్తరమందున్న జ్ఞానపాత్రమందు భస్మచందనపుష్పంబుల నునిచి హృదయమంత్రములచేతఁజందనోదకముఁబూరించియఘోరమంత్రంబున నాలుమాఱులభిమంత్రించి యానందపాత్రమందు భస్మచందనపుష్పంబుల నునిచి హృదయమంత్రముచేత శీతలోదకముఁబూరించి వామదేవమంత్రముచే నొకమాఱభిమంత్రించవలయును. ఈపాత్రములకుఁ దూర్పుదిశను స్నానోదక పాదోదక ప్రసాదోదక ధారణార్థమై మూడుపాత్రలను వరుసగఁ బంక్తిరూపంబున నుంచవలయును. సామాన్యార్ఘ్యపాత్రకుఁ దూర్పుదెసను శివకుంభమునునిచి యందు భస్మచందనాక్షత పుష్పబిల్వంబులనునిచి హృదయమంత్రముచేఁ బానీయోదకమునుబూరించి "ఆకలశేషుధావతి" యను మంత్రమునను, "కలశస్య ముఖేరుద్రః" యను మంత్రమునను "ఈశానః కలశస్యాగ్రే" యను మంత్రమునను శివకుంభమునర్చించి, ప్రాసాదమంత్రమునను, "ఆపోవా ఇదగ్ం సర్వం" అను మంత్రమునను నుదకంబునభిమంత్రించి పూజాద్రవ్యంబులందాయుదకంబును బుష్పంబుచేఁ జల్లవలయును. అనంతరము శ్రీగురునిబూజించి తదనుగ్రహంబుఁ బడయవలయు నిది భక్తస్థలకృత్యం బామీఁద "అయం మేహస్తోభగవాన్" అను మంత్రముతో వామహస్తంబుఁగడిగి యభిమంత్రించి "సర్వభూతక్షమాత్మానం"

అను మంత్రమున భస్మాసనంబు సేర్పఱచి "వేదాహమేతం పురుషం మహాంతం" అను మంత్రమునను "సర్వాలింగగ్గ్ స్థాపయతి పాణిమంత్రం పవిత్రం" అను మంత్రమున, లింగమును గరపీఠమందునునిచి "తపశ్రియే మరుతో మర్జయంతః" అను మంత్రమున అవాహనము నాసనమునర్పించి ఆపైని షడక్షరీమంత్రమును సహస్రంబునుగాని షట్ఛతంబునుగాని జపింపవలయు నిది మాహేశ్వరస్థలకార్యంబింక లింగముమీఁద భస్మంబునిచి "తమేవ ధీరో విజ్ఞాయ" అను మంత్రముచేత తెప్పలార్పక లింగమును దశావధానములతో * నిరీక్షింపవలయు నిది ప్రసాదిస్థలకార్యంబిఁకఁ బ్రారంభమందు "యతే రుద్రశివాతనూరఘోరాపాపకాశినీ" యను మంత్రంబున లింగమునకు సానురాగనీరాజనంబు సమర్పించి, మూలమంత్రమున లింగమునకు విభూతినలఁది లింగమందొక పుష్పమునిచి "అసౌ యస్తామ్రో అరుణ" యను మంత్రమున దర్శననీరాజన మొసఁగవలయును. అటుమీఁద లింగమునకుఁ బాద్యమర్ఘ్యము నాచమనముఁ దదాఖ్య పాత్రోదకముల నొసఁగి త్యాగపాత్రోదకమున స్నానముచేయించి యాయుదకధారను శిరస్సునఁజల్లికొని "అవహంతీవితన్వానా" యను మంత్రమున లింగమునకుఁ దడియొత్తి యాచమనమర్పించి జ్ఞానపాత్రోదకమునఁ బాద్యమొసఁగి "ఇమం మేవరుణ" యను మంత్రమున మంత్రించి "కద్రుద్రాయప్రచేతసే" యను మంత్రమున సంస్కరించి "ఋతగ్ంసత్యం" అను మంత్రమునఁ బ్రాశనముచేయవలయును. అనంతరము లింగమునకు విభూతిగంధాక్షతపుష్పములను దత్తన్మంత్రములచే నర్చించి "యో వైరుద్రస్సభగవాన్ । యశ్చాగ్నిర్యాభుర్భువస్సువః । తస్మైవైనమోనమ । శ్శ్రీరంజనదోంవిశ్వరూపోసి" అను మంత్రమున నవసరనీరాజనమొసఁగి యవసరార్థమై ద్రాక్షాఫలాదినైవేద్యమును ఆనందపాత్రోదకపానీయము నర్పించి నివేదిత ప్రసాదతీర్థంబులఁ దదాధారపాత్రములఁబట్టి ప్రాశనముచేసి, ఆనందపాత్రమును బ్రసాదోదకపాత్రమును మున్నున్నచోట్ల నధోముఖంబుగనుంచవలయు నంత మూలమంత్రముతోఁ బుష్పపూజనొనర్చి సుగంధధూప మొసఁగి "ఈరాంవహాతో" యను మంత్రమున మజ్జననీరాజన మర్పించి లింగముపై నొకపుష్పముమాత్రమునిచి తక్కిన నిర్మాల్యమును దీసివేసి "ఏతావానస్యమహిమా" యను మంత్రమునఁ బాద్యమొసఁగి ఆపాద్యపాత్రమున్నచోటనే యధోముఖంబుగ నుంచవలయును. తర్వాత అర్ఘ్యపాత్రోదకముచే "హగ్ంసశ్శుచిషద్వసు" అను మంత్రమున నర్ఘ్యమిచ్చి అర్ఘ్యపాత్రమున్నచోటనే యధోముఖముగనుంచవలయును. ఇఁక ఆచమనపాత్రోదకముచే గాయత్రీమంత్రమున ఆచమనమునొసఁగి ఆచమనపాత్రమున్నచోటనే యధోముఖంబుగ నుంచవలయును.

---

* దశావధానవైశద్యమును గురుముఖంబునఁగాని మహాశివపూజానిబంధనగ్రంథముఖమునఁగాని యెఱుఁగఁదగును.

గీ॥ అంతఁబైఁ ద్యాగపాత్రస్థితాంబుధార, నమకచమకపూరుషసూక్తవిమలమంత్ర
తతులనభిషేక మొసఁగి యాధారపాత్ర, మునఁ దదంబులఁ గొని మూర్ధమున గ్రహించి.

వ. త్యాగపాత్రమును దదాధారపాత్రమును బూర్వస్థానములం దధోముఖంబుగ నుంపవలయును. "ఆవహంతీవితన్వానా" యను మంత్రమున లింగమునకుఁ దడియొత్తి జ్ఞానపాత్రోదకముచే లింగమునకుఁ బాద్యమిచ్చి యాతీర్థమును దదాధారపాత్రమునఁ బట్టి "కద్రుద్రాయ" యను మంత్రముతో నభిమంత్రించి "ఋతగ్ం సత్యం" అను మంత్రముతో బ్రాశన చేసి జ్ఞానపాత్రమును దదాధారపాత్రమును బూర్వస్థలములం దధోముఖంబుగ నుంపవలయును. అటుపై "ఆవహంతీ" యను మంత్రమున లింగమునకుఁ దడియొత్తి "యో వై రుద్రస్స భగవాన్ । యశ్చ వాయు ర్భూర్భువస్సువః" అను మంత్రమున ధూపసంయోజన మొనర్చి "యో వై రుద్రస్స భగవాన్ । యశ్చ వ్యోమ భూర్భువస్సువః" అను మంత్రమున ధూపప్రసారణము చేసి "ఉద్దీప్యస్వ జాతవేదో" అను మంత్రమున మాంగల్యనీరాజన మొసఁగి "యస్తంతునాభవ" యను మంత్రమున వస్త్రార్ధాక్షతములర్పించి "అగ్నిరితి భస్మ" యను మంత్రమున భస్మావలేపన మొనర్చి "నమో హరికేశాయోపవీతినే" యను మంత్రమున యజ్ఞోపవీతార్పణము చేసి "గంధద్వారాం" అను మంత్రమున సాక్షత గంధార్పణము చేసి "యో వై రుద్రస్స భగవాన్। యశ్చ సోమో భూర్భువస్సువః" అను మంత్రమున గంధానులేపనము చేసి "ఆకాశాద్వాయుః" అను మంత్రమునను "యో వై రుద్రస్స భగవాన్ । యశ్చ నక్షత్రాణి" యను మంత్రమున ధవళాక్షతములర్పించి "అపాణిపాదోహం" అను మంత్రమును "యో వై రుద్రస్స భగవాన్ । యాచ జ్యోత్స్నా" యను మంత్రమునను గర్పూరనీరాజనమీవలయును. "త దేవర్తం తదసత్యమాహుః" అను మంత్రమున సురభికుసుమమాల్యములనర్పించి "ఓం నమో హిరణ్యబాహవే...పశుపతయే నమో నమః" అను మంత్రమునఁ గటకమకుటాద్యాభరణములనొసఁగి "యా తే రుద్ర శివా తనూశ్శివా" యను మంత్రమున శృంగారనీరాజనమిచ్చి "నిధనపతయే నమః" అనెడు నమవాకంబునను సహస్రనామముల అష్టోత్తరశతనామములఁ బుష్పార్చనము చేసి "వాదితో జాయత తతో బిల్వ ఉదతిష్ఠతు" అను మంత్రమునను "త్రిసుపర్ణమయాచితం బ్రాహ్మణాయ" అను మంత్రమునను బిల్వపూజనొనర్చి బిల్వదళంబులపై విభూతిఁ జల్లవలయును. "నమ ఉద్గ్రియాయ చాతప్యాయతో" అను మంత్రమున ఛత్రముఁ బట్టి "నమో వాత్యాయ చ రేష్మియాయ చ" అను మనువునఁ జామరము వీచి "చంద్రమా మనసో జాతః" అను మనువునఁ దాళవృంతములో విసిరి "సదృశ్యాయం పురుషే" అను మనువున నద్దముఁ జూపి "యో వేదాదౌ స్వరః ప్రోక్తః" అను మనువున ఘంటాధ్వని వినిచి "అధ్యవోచదధివక్తా" యను మంత్రమున శంఖధ్వని చేసి "నమో దుందుభ్యాయ చాహనన్యాయ చ" అను మనువున వాద్య

మునిచి "అసౌయోవసర్పతినీలగ్రీవో" యను మనువున గుడిచేతితో నాట్యమభిన యించి "ఉద్యంతమస్తంయంతమాదిత్య" మను మంత్రమునఁ గుడిచేతితోఁ బ్రదక్షిణమభినయించి "నమోఅస్తునీలగ్రీవాయ" అను మంత్రమున నమస్కారంబు లర్పించి "నమోవృద్ధాయచ సంవృధ్వనేచ" అను మంత్రమున స్తుతిచేసి "దైవో యోమానుషోగంధః" అనుమంత్రమున ధూపమర్పించి "నతత్రసూర్యోభాతి" అను మంత్రమున మహానీరాజనమొసఁగి "ఈరాంవహాతో" అను మనువునఁ గరదీపికలనుబట్టి "జ్యోతిష్మతీంత్వాసాదయామి" అను మంత్రమున జ్యోతులనువెలిఁగించి చూపి "యాతేరుద్ర శివాతనూరఘోరా" అను మంత్రమున యాచ్ఞ చేసి "ఆజాతఇత్యేవకశ్చిద్భీరుః ప్రపద్యతే" అను మనువున విజ్ఞప్తి చేసి లింగముమీఁద నిర్మాల్యలేశమునిచి తక్కినవాని దీసివేయవలయు నిది ప్రాణలింగిస్థలకార్యము. "అగ్నిరితిభస్మ" యను మంత్రమున భోజ్యపదార్థములందు భస్మోదకమునుజల్లి గాయత్రీమంత్రముచేతను రుద్రగాయత్రీమంత్రముచేతను బరిషేచనమొనర్చి భోజ్యపదార్థములను బరిశీలించి తెలిసికొని పదార్థనామములుచ్చరించి "ఆచారలింగ గురులింగ శివలింగ చరలింగ ప్రసాదలింగ మహాలింగ ముఖేభ్య స్సద్యోజాత వామదేవాఘోరతత్పురుషేశాన పరశివలింగేభ్యః । అన్నాదిభోజ్యమహానైవేద్యం సమర్పయామి" అని నైవేద్యముచేయవలయును. ఇది శరణస్థలకార్యమిఁక నైకృస్థలమందు మూలమంత్రముతో లింగముమీఁదఁ బుష్పమునిచి ధూపమువేసి "యతో వాచో నివర్తంతే" యను మంత్రమున నానంద నీరాజనమిచ్చి "సవిశ్వకృద్విశ్వవిదాత్మయోనిః" అను మంత్రమునఁ దాంబూలమొసఁగి "ఆరభ్య కర్మాణి" యను మంత్రమునఁ దాంబూలనీరాజనమొసఁగవలయు నామీఁద "సహస్ర శీరుషం దేవం" అను ననువాకముఁ జదివి మంత్రపుష్పమొసఁగి "అసంఖ్యాతా స్సహస్రాణి" అను మంత్రమున అసంఖ్యాత నీరాజనమిచ్చి "సోబ్రవీత్ అహమేకః ప్రథమమాసం" అను మంత్రమున వస్త్రప్రావరణమునల్పి "అణోరణీయానహమేవ...శివరూపమస్మి" అను మంత్రమున హృదయపేటికయందిష్టలింగమునునిచికొనవలయును. అనంతరమందుఁ బ్రసాదమునారగింపవలయును.

క॥ ఇదె యిష్టలింగపూజన, మిదె వేదాగమనిబంధ ♦ నేద్ధవిధానం
బిదె యైందుశేఖరకృపా, స్పదము పదము భోగమోక్ష ♦ భాగ్యములకిలన్. 46

వ. అని యుపదేశించి సూతుఁడిఁ కేమి వినఁదలఁతురనిన మునులిట్లనిరి. మహాత్మా! జగజ్జేగీయమానంబుగ నిట్లు శివపూజనంబు ప్రతిపాదితంబయి యుండఁగా. 47

క॥ శివలింగనివేదితములు, భువనచ్ఛదసుమఫలాన్న ♦ ములు గైకొనరా
నివియనియు వానినొందుట, యవినీతియనియును గొంద ♦ ఱందురదియెటుల్. 48

వ. ప్రసాదంబుఁగొనక పూజించుటెట్టు లీ సందియంబుఁబాయ నెఱింగింపుమనుటయు సూతుండిట్లనియె. 49

## —* శివనిర్మాల్యము శైవదీక్షితునకు గ్రాహ్యము *—

గీ॥ శుచియు శుద్ధుండు సద్వ్రతనిష్ఠుడునునైన, శంభుభక్తుండొకింతయు సందియంబు
లేక యె శివప్రసాద మస్తోకభక్తి, ననుభవింపఁగఁ దగును మహాత్ములార! 50

క॥ శివనైవేద్యముఁజూచిన, నవియును ఘోరంబులైన నఘతతులు చెంకఁ
శివనైవేద్యముఁ దినినన్, వివిధమహాపుణ్యతతులు వేగమె చెందుఁ. 51

క॥ చాలును యజ్ఞ సహస్రము, చాలును యజ్ఞార్బుదములు చక్కఁగ నికనా
బాలేందుధరుప్రసాదము, మేలుగ భుజియించి నరుఁడు మేకొనుముక్తిన్. 52

క॥ వచ్చిన శివనైవేద్యము, మచ్చికతోఁగాంచి తనదు మస్తకమునఁదా
హెచ్చుగ మ్రొక్కులనిడి శివు, మెచ్చుచు భోజనముసేయు మేలగు మౌనుల్!

క॥ ఎవనికి శివనైవేద్యముఁ,న విరుద్ధమనీపపాడమి నట్టుచు విడునో
యవిరళనరకాగ్నులఁబడి, యవిరతముఁ దపించుచుండు నాతండు మునుల్!

క॥ శివదీక్షఁగొనిన భక్తుం, డవని నిఖిలలింగవితతి యందుఁ బ్రసాదం
బవునని కాదనియెంచక, పరివిమలమతి నారగింప వలయు మునీంద్రుల్!

వ॥ భగవతి యగు శ్రుతియేయిట్లు; "రుద్రభుక్తంభుంజీయాత్ రుద్రపీతంపిబేత్ రుద్రాఘ్రాతం జిఘ్రేత్" అని శివతీర్థప్రసాదపుష్పాదుల గ్రహణంబు నుపదేశించిన వేఱొక్కఁడు కాదనఁగలఁడే! ఇకను శివేతరదీక్షఁ జెందినవారలకొఱకై మునికృతనిర్ణయం బిట్లు వక్కాణించెద వినుండు. 56

గీ॥ హృదయమునస్వర్ణరౌప్యాఖ్యహృద్యలింగ, మునను శిశాంతమణిలింగ మునను రత్న
లింగమునను స్ఫటికరసలింగములను, బాణలింగంబునందు బాషాణమునను.

క॥ జ్యోతిర్లింగములందును, ఖ్యాతమహాసిద్ధమౌని కలితములమెడఁ
బ్రీతి స్వయంభూలింగ, వ్రాతములఁ బ్రసాదభుక్తి వరలవైభవమా. 58

వ. తక్కినచోట్ల.

క॥ చండాధికార మెచ్చట, నుండునొయట సాపడఁగ ననుచితంబగు నా
చండాధికారమెచ్చోట, నుండదొయట నారగింప నుచితమొయుఁగుఁడి. 59

సీ॥ బాణలింగములందు స్ఫటికలింగములందుఁ, గాంచనరౌప్యలింగములయందు
సరవి సాలగ్రామ జాతలింగములందు, రసలింగములయందు రత్నలింగ
మందు లోహితలింగమందు జ్యోతిర్లింగ, ములయందును సుసిద్ధమునివరప్ర
తిష్ఠితములయెడ దేవప్రతిష్ఠిత, ములయెడలను స్వయంభువులయెడల

గీ॥ ప్రతిమలందెల్లయెడల ని♦ష్పాత్రికముగ, లేదుచండాధికారంబు ♦ లేదుదోస
మరసితత్ప్రసాదంబుల♦నారగించ, వలయు శ్రేయంబులొందఁగాఁ♦దలఁచువారు. 60

గీ॥ బ్రహ్మహింసకుఁడైనను♦భర్గలింగ, మూర్తినైవేద్య మర్థిమై ♦ భోజనంబు
చేసెనేనియుఁ బాపంబుఁ♦బాసిసుఖము, లొందునిశ్చితమిందువే♦ఱొండు లేదు.

గీ॥ వీరభద్రునిచేత శ♦పింపఁబడిన, వారలు మహేశభక్తివి♦వర్జితులును
నిఁక శివేతరభక్తులై♦యెసఁగువారు, శివప్రసాదచతుష్కంబుఁ♦జెందఁదగదు.

గీ॥ విధియుతంబుగ లింగంబు♦విమలవారి. స్నానమొనరింపఁజేసి యా♦సలిలమర్థి
మూడుమాఱులుగ్రోలిన♦మాడిపోవు, త్రివిధదురితము లీధరి♦త్రీతలమున. 63

వ. ఇట్లుమీకునైవేద్యనిర్ణయంబెఱింగించితినిఁక బిల్వమాహాత్మ్యంబుఁ దెల్పెదవినుఁడు.

## —* బిల్వమాహాత్మ్యము *—

చ॥ ఇలపయిఁ బుణ్యతీర్థతతు ♦ లెన్ని విరాజిలుచుండునో సిరిన్
వెలసిన యవ్వియన్నియును ♦ వేడుక మీఱఁగఁ జెందియుండు శ్రీ
ఫలతరుమూలమందు నిఁక ♦ భర్గుని నచ్చటఁ బూజచేసినన్
విలసిలు వైభవంబు లిఁక ♦ విశ్వగురుండు హరుండు ప్రీతుఁడౌ. 65

గీ॥ మఱియు నిఁకబిల్వమూలంబు♦మంత్రయుక్తి, గంధపుష్పాక్షతాదులఁ♦గరముభక్తిఁ
బూజచేసినసుఖములఁ ♦ బొందిశంభు, లోకమునకేగిశివునితో♦జోకనమరు. 66

వ. ఇఁకను బిల్వదళంబుల స్వయముగఁ గోసితెచ్చి శివునిఁబూజించిన వాఁడును బిల్వాలవాలంబు నుదకంబునఁ బూరించినవాఁడును బిల్వసాన్నిధ్యంబున మహేశభక్తునకు జగ్ధినిడువాఁడును నక్షయంబగు శివలోకంబుఁ జెందుదురిందు సందియంబు లేదిఁక భస్మమాహాత్మ్యంబుఁ జెప్పెద నాకర్ణింపుఁడు. 67

## —* భస్మవిషయము *—

గీ॥ భస్మమిది రెండువిధములఁ♦బరఁగునిల మ, హాభసిత మల్పభసితమం♦చాద్యమిఁకను
శ్రౌతమనిస్మార్తమనిలౌకి♦జాతమనియు, త్రివిధమైయొప్పుచుండునెం♦తేనిదీప్తి.

క॥ శ్రౌతస్మార్తములైనవి, భూతులు రెండునుధరింపఁ ♦ బోలు ద్విజాతుం
డేతదితరమగు లౌకిక, భూతిని నితరుండు దాల్పఁ♦బూనఁగవలయున్. 69

గీ॥ "అగ్నిరితి" యనుమంత్రంబు♦నగ్రజనుఁడు, చదువుకొనుచుభస్మంబును♦సలిలమునను
దడిపిధరియింపవలయుమం♦త్రంబులేక, యితరులీభస్మమునుధరి♦యింపవలయు.

గీ॥ పరఁగ యజ్ఞాగ్నిభస్మ మౌ♦పాసనాగ్ని, భస్మమును దగ్ధగోమయ♦భస్మరజము
బిల్వకాష్ఠాగ్నిభస్మంబుఁ♦బ్రీతితోఁగ్ర, హించిధరియింప వలయుము♦నీంద్రులార!

క॥ శివుఁడును బంకజనేత్రుఁడు, శివయును నిందిరయునున్ గుశేశయగర్భో
ద్భవుఁడును దత్సతి బూదిన్, దవిలి ధరించెదరు మేటితర్షముతోడన్. 72

గీ॥ బ్రాహ్మణక్షత్రియోరుజ పాదజులును, సంకరకులులు భస్మంబు సంతరించి
తనువుల ధరించి బహుపాపతండములను, బాయఁ జిమ్ముదు రెంతయుఁ బరమమునులు!

వ. ఇఁకను

సీ॥ భస్మత్రిపుండ్రముల్ పరఁగఁ దాల్పనివాఁడు, వర్ణాశ్రమాభ్యుపవత్తిఁ గనఁడు
భస్మత్రిపుండ్రముల్ పరఁగఁ దాల్పనివాఁడు, భవదుఃఖముల నెడఁబాసిపోఁడు
భస్మత్రిపుండ్రముల్ పరఁగఁ దాల్పనివాఁడు, ఘనదురితంబులఁ గడవలేఁడు
భస్మత్రిపుండ్రము ల్పరఁగఁ దాల్పనివాఁడు, దివ్యశివజ్ఞాన దీప్తిఁ గనఁడు

గీ॥ భస్మమునను ద్రిపుండ్రముల్ పరఁగఁ దాల్ప, నట్టిఁడు విరుద్ధఫలములనందఁ గలఁడు
ఘోరపాపావళులఁ గూడుకొన్న నరున, కమరు భస్మత్రిపుండ్రంబులందు నరతి.

క॥ ఎనలేని దోసకారియుఁ, జనవున మెయి బూదినొందఁజను దోసము లిం
కను దేవమాన్యుఁడగు భ, క్తునకమరిన నద్దిమెంతో గొప్పగునో మునుల్!

వ. "మానస్తోక" యను మంత్రంబున మంత్రితంబొనర్చి బ్రాహ్మణక్షత్రియులును
త్రియంబకమంత్రంబున వైశ్యుఁడును పంచాక్షరమంత్రంబున స్త్రీలును వృషలుం
డును భస్మంబును ధరింపవలయును. మఱియు బ్రాహ్మణులలోఁ బంచబ్రహ్మ
మంత్రపఠనంబుతో గృహస్థులును ద్రియంబకమంత్రపఠనంబుతో బ్రహ్మచారు
లును, అఘోరమంత్రపఠనంబున వానప్రస్థులును ప్రణవోచ్చారణంబున యతు
లును భస్మంబును ధరింపవలయునిఁక భస్మధారణంబు లేక భుజించిరేని దత్ప్రా
యశ్చిత్తంబుగ నాశ్రమత్రితయులు గాయత్రీజపంబునను జతుర్థాశ్రమంబువారు 76
ప్రణవజపంబునను శుద్ధిఁగాంతురు.

గీ॥ శ్రాద్ధమున యజ్ఞ జపహోమ సమయములను దానవేదాధ్యయనముఖ్య కృత్యములయందు
భూతిపుండ్రముల్ దనువునఁ బూసినట్టి, వాఁడు మిత్తిని గెలువంగ వలఁతియగును.

వ. మఱియు స్నానంబులలోనెల్ల భస్మస్నానం బుత్తమంబై సర్వపాపహారంబై 78
యలరారు.

గీ॥ ఉదకమునఁ దానమాడిన నుడుగు రజము, భస్మమున స్నానమొనరింపఁ బరఁగు శుద్ధి
మంత్రజపమున జలమాడ మలము లుడుగు, జ్ఞానమున స్నానమొనరింపఁ గలుగు ముక్తి.

క॥ కాదది శుద్ధిస్నానము, కాదది హరిహరులధ్యాన కలనం బింకన్
కాదది యాత్మజ్ఞానము, బూదియొకఁడు దాల్పకున్న మునికులచంద్రుల్! 80

గీ॥ వితయగును భస్మమొందని ♦ వెడఁగు మొగము
వితయగు శివాలయములేని ♦ వెడపురంబు
వితయగు శివుఁ గొలువనిమ♦గ్గతితనువది
వితయగున్ శివుఁజెందని ♦ వెఱ్ఱివిద్దె. 81

వ. ఇఁక భస్మరేఖాత్రయంబున నొక్కొక దానియందుఁ దొమ్మండ్రుగురు వేల్పులుండు రాక్రమం బెఱింగింతు వినుఁడు. ప్రథమరేఖయం దకారము, గార్హపత్యాగ్ని భూమియు ధర్మంబు రజోగుణంబు ఋగ్వేదంబును గ్రియాశక్తియుఁ బ్రాతస్సవనంబును మహాదేవుండు నుండును. ద్వితీయరేఖయం దుకారంబు దక్షిణాగ్నియు నభము సత్వము యజుర్వేదము మధ్యందినసవన మిచ్ఛాశక్తి, అంతరాత్మము మహేశ్వరుఁడు నుండును. తృతీయ రేఖయందు మకారం బాహవనీయాగ్నియు పరమాత్మయు తమము దివంబును జ్ఞానశక్తి సామవేదంబును సాయంసవనమును శివుండునునుండు నిట్లు శివదీక్షాపరులు దెలిసికొని స్థానదేవతలఁ భక్తితోఁ దలఁచి కొలిచి భస్మత్రిపుండ్రముల ధరింతురుగాక. మఱియు నీభస్మపుండ్రములు ముప్పదిరెండుస్థానములందుఁ గాని పదియాఱుస్థానములందుఁ గాని యెనిమిది చోటులందుఁగాని యైదుచోటులందుఁగాని త్రియాయుష మంత్రంబులతో ధరింపవలయు నవి వక్కాణింతు వినుండు. 82

సీ॥ శిర సలికమ్మును ♦ చెవిదోయి కనుఁగవ, ముకు నోరు కుత్తుక ♦ భుజయుగంబు
మఱియు మోచేతులు♦మనికట్టు లెదయును, ప్రక్కలజతయును♦బొక్కిలియును
ముష్కద్వయం బంక♦ములు చీలమండలు, జానులు జంఘులు♦జరణములును
పరఁగునీయవి యెము♦ప్పదిరెండుస్థానంబు,లిఁకఁ బదియాఱు చో♦ట్లెలుఁగఁ జెపుదు.

గీ॥ శిరసునిటలంబునుఁ గండ♦సీమలంస,యుగమునుఁ భుజకూర్పర♦ యుగ్మములును
బరఁగుమనికట్టు లెదనాభి♦ప్రక్కలకవ, పృష్ఠమివిపదియాఱు చో♦ట్లెఱుఁగుఁ డెలమి.

వ. ఇఁక నష్టస్థానంబులు వినుఁడు.

గీ॥ అలికమును శ్రుతియుగ్మంబు♦నంసయుగ్మ, మెదయుఁబొక్కిలిగుహ్యామి♦ట్లెనిమిదియగు
చోటులింకనువినుఁడైదు♦చోట్లుశిరసు,భుజయుగముహృదయంబును♦బొక్కిలియును

వ. ఈ స్థానంబుల నెఱింగి శక్త్యనుసారంబుగ భస్మత్రిపుండ్రంబుల నొనర్పందగు. ఈ నాల్గువిధంబులందుఁగూడ నశక్తుండైన ద్రినయనుండును త్రిగుణాధారుండును ద్రిమూర్తిజనకుండు నగు శివుని స్మరింపుచు లలాటంబున భస్మత్రిపుండ్రములు ధరించునది. ఇట్లు ధరించినవాఁడు సర్వతీర్థస్నానఫలంబును సర్వ వేదాధ్యయనఫలంబును సకలరుద్రజపఫలంబును జెంది సకలభోగంబు లొంది దేహావ

స్నానంబున శివసాయుజ్యంబు నొందు. ఈభస్మమాహాత్మ్యంబు శ్రద్ధతోఁ జదివిన
వినిన యట్టివాఁడును గృతార్థుఁడగు నిఁక రుద్రాక్షమహిమంబు వినుండు. 83

### —* రుద్రాక్షధారణము — తన్మాహాత్మ్యము *—

క॥ మును బరదేవత కీయది, పినాకధరుఁ డెఱుఁగఁ జెప్పెఁ ♦ బ్రీతిమెయి భుశుం
డున కెఱిఁగించెను మోదం, బున శ్రీకాలాగ్నిరుద్ర♦మూర్తి మునీంద్రుల్! 86

వ. నేనును దత్ప్రకారంబు మీ కెఱింగించెద నిప్పు డాలకింపుఁడు.

గీ॥ చిరముదపియించి యాశశి ♦ శేఖరుండు,కనులు దెఱచిన జలజల♦కాంశకణము
లవనిరాలినయంతరు♦ద్రాక్షతరులు, పొడమె రుద్రాక్షఫలములు♦పొలిచె నందు.

క॥ ప్రియతమములు రుద్రాక్షలు, త్రయీతనుఁడు శివుని కెప్డు ♦ దర్శనమునఁ గ్ర
మెయి ధరియించుటవలనఁ, గయికొని మంత్రజపకృతిసఁ♦గలుషములడఁగుఁ.

గీ॥ గౌడదేశంబునజనించుఁ♦గాశిమధుర,యులయు మోక్షనులంక ♦ సహ్యాద్రియందుఁ
బేర్మిఁబొలుచువిశదరక్త ♦ పీతకృష్ణ, వర్ణములతోడ విప్రాది♦వర్ణములయి. 89

గీ॥ బ్రాహ్మణుఁడువిశదంబును♦బరఁగక్షత్రి,యుండునుఁ లోహితంబువై♦శ్యుండుపీత
మునుజఘన్యజుఁడునుగృష్ణ♦మునుధరింప,వలయురుద్రాక్షములయందు♦వరుసమీఱ

క॥ ఈరుద్రాక్షలఁదాల్చి ది,వారాత్రిఁకృతాఘతతులఁ♦బాయుదురు జనుల్
తేటికన లక్షపుణ్యము, ధారణమొనరింపఁ గోటి ♦ తనరు మునీంద్రుల్! 91

ఆ॥ నిరతధారణమున ♦ నెగడుపుణ్యముకోటి, శతము తజ్జపమునఁ♦జక్కనొందు
లక్షకోటిశతము ♦ లక్షకోటిసహస్ర, ముల సుకృతఫలంబు ♦ పొందుమీఱ. 92

చ॥ ఉసిరికపండ్లఁబోలినవి ♦ యొప్పగశ్రైష్ఠ్యముఁగాంచు రేగుపం
డ్లసరిగనున్నయవ్వియొ దృ♦ఢంబుగ మధ్యమరీతినొందు సెం
పెసగుచణాకృతిఁబొలిచి ♦ యేపుదనర్చినవే కనీయముల్
పసఁదగు వీనివైభవము♦ బాగుగఁజెప్పితి మీకు వేఁకతో. 93

క॥ సమములు దృఢంబులును స్నిగ్ధములును స్థూలములు కంట♦కయుతంబులు శ్రే
ష్ఠములై తనర్చువాని ముదముతో ధరియింపవలయు♦ధార్మికవర్యుల్! 94

గీ॥ వినుఁడు క్రిమిదష్టమును ఛిన్న♦భిన్నమునునిఁ,కనుసకంటకమును వ్రణ♦కలితమును న
యుక్తమునునగునద్దాని♦నొంది ధారణంబు సేయుంగఁదగదు శ్రా♦వ్యంబరయుఁడు.

గీ॥స్వయముగ నెద్వారయుక్తమై♦వాసినమరు,నట్టిరుద్రాక్ష ముత్తమం♦బగుననుచును
యత్నసంయోజితద్వార♦మైనదాని, మధ్యమంబుగఁ జెప్పుదురు♦మానివరులు. 96

గీ॥ కుందనపు రేకచందంబుఁ♦జెందు రేక, నొప్పు రుద్రాక్షశ్రేష్ఠమై♦ యొప్పమీఱు
నిట్టివానిని మెఱయుచు♦నెసఁగునట్టి, వానిఁబట్టునఁగ్రుచ్చి తా♦ల్పంగవలయు.

వ. ఆధారణం బిట్లు లెక్కయెఱిఁగి యొనర్పఁదగు.

సీ॥ సిగయందునొక్కటి♦శిరసున మున్నూఱు, పరఁగ గళమున ము♦ప్పదియునాఱు
బాహుద్వయంబునఁ♦బదియాఱుబదియాఱు, మణికట్టులందునుం♦బదియు రెండు
బదియు రెండును స్కంధ♦పదమున నేనూఱు, వందపై నెనిమిది♦జందియంబు
గాఁజేసి ధరియింపఁగా♦నొప్పుఁగంఠంబు, నందుఁ బెక్కుసరంబు♦లొందవలయు

గీ॥ మఱియు రుద్రాక్షకుండల♦మకుటములును, గర్ణికాహార కేయూర♦కటకములును
నమరుకటిబంధనమును శ్రే♦ష్ఠముగఁగూర్చి, ధారణము సేయువారలు♦ధన్యులెందు.

గీ॥ నిదురనొందుచునున్నను♦నీరుద్రాక్ష, చున్న రుదురాకలను దాల్చి♦యుండవలయు
వేయి లేకున్న నేనూఱు♦వియును లేక, యున్న మున్నూఱు నేనిదా♦నొందవలయు. 99

## —* మంత్రపూర్వకరుద్రాక్షధారణము - తత్ఫలము *—

వ. సహస్రధారణం బుత్తమంబిఁకను శిరసున నీశానమంత్రంబుచేతను, గంఠమునఁ దత్పురుషమంత్రముచేతను, గళహృదయంబుల నఘోరమంత్రంబుచేతను హస్తంబులం దఘోరబీజమంత్రంబుచేతను, ఉదరంబున వామదేవమంత్రంబునను బంచబ్రహ్మాంగమంత్రంబులచేతను బంచదశరుద్రాక్షగ్రథితంబులగు మూఁడుగాని యైదుగాని యేడుగాని మాలలను ధరింపవలయును. మఱియు మూలమంత్రంబుచేఁ దక్కినచోట్లను నెల్లెడ దక్కిన రుద్రాక్షంబుల ధరింపవలయు నిఁకను నీరుద్రాక్షము లనేకముఖంబులై యొప్పొందు నవ్వాని భేదంబులను దత్కృతఫలంబులను దెల్పెద వినుండు. ఏకవక్త్రంబగు రుద్రాక్షంబు పరతత్త్వస్వరూపంబు ఓం హ్రీం నమః అని ధరింపవలయు నద్దానిధారణంబున జనుం డింద్రియజయంబును బడసి తత్త్వంబున లీనంబగు మఱియు నీయది పూజింపఁబడుచున్నచోట మహాలక్ష్మి సాన్నిధ్యమొందు నుపద్రవంబులెల్ల దొలఁగును. సర్వకామార్థంబులు సంఘటిల్లును. ద్విముఖం బర్ధనారీశ్వరాత్మకంబు నద్దాని ఓంనమః యను మంత్రంబున ధరింపవలయు నట్లు ధరించుటచే నర్ధనారీశుండు ప్రియంబొందు. త్రిముఖరుద్రాక్షంబు త్రేతాగ్నిస్వరూపం బద్దాని క్లీంనమః యనుమంత్రంబున ధరింపఁదగునట్లు దాల్చుటవలన నగ్నిసంతోషించు. చతుర్ముఖరుద్రాక్షంబు బ్రహ్మస్వరూపంబు. ఓం హ్రీం నమః యను మంత్రంబున నద్దాని ధరింపవలయు నిట్లుధరించిన బ్రహ్మదేవుండు ప్రీతుండగు. పంచముఖంబు పంచబ్రహ్మస్వరూపంబు, ఓం హ్రీం నమః యనుమంత్రంబున నద్దాని ధరింపవలయు నట్లు ధరించినఁ బంచవక్త్రుండు బ్రహ్మహత్యాదోషంబుఁ బాపు. షణ్ముఖంబు కార్తికేయవినాయకాధిదైవతంబు.

ఓం హ్రీం హుంనమః యనుమంత్రంబున నద్దాని ధరింపవలయును. అట్లు ధరించిన నుత్తమారోగ్యము నొందును. మఱియు మేధాసంపత్తిఁ గోరువారల కీయది ముఖ్యంబు. సప్తముఖంబు సప్తమాత్రాధిదైవతంబు. ఓం హుం నమః యను మంత్రంబున ధరించిన నుత్తమారోగ్యంబుఁ జెందును. జ్ఞానసంపత్తియు గొప్పగాఁ గలుగును, అష్టముఖరుద్రాక్షంబు వస్వష్టకాధిదైవంబు. ఓం హుంనమః యను మంత్రంబున నద్దానిధరించినఁ బూర్ణాయుర్దాయంబును నవసానంబున శివత్వంబును జెందును. నవముఖంబు నవశక్త్యాధిదైవతంబు. ఓం హ్రీం హుం నమః యను మంత్రంబున ధరించిన జనుండు శివసమానుండగు. దశముఖంబు యమదైవతంబు. ఓం హ్రీం నమః యనుమంత్రంబున ధరించిన సర్వపాపక్షయంబగు. నేకాదశ ముఖంబు రుద్రైకాదశదైవతంబు. ఓం హ్రీం హుంనమః యనుమంత్రంబున ధరించిన సౌభాగ్యవృద్ధియగు. ద్వాదశముఖంబు ద్వాదశాదిత్యదైవతంబు. ఓం క్రోం క్షౌం రౌం నమః యనుమంత్రంబున నాదిత్యరూపంబుఁ జెందును. త్రయోదశ ముఖంబు కామదైవతంబు. ఓం హ్రీం నమః యనుమంత్రంబున ధరించినఁ గామదేవుండు ప్రసన్నుండగు. సర్వకామంబులు సంఘటిల్లు. చతుర్దశ ముఖంబు శివాధిదైవతంబు ఓం నమః అనుమంత్రంబున ధరించిన సకలరోగ పరిహారంబును నారోగ్యంబును జెందునిట్లు మంత్రజపంబుతో రుదురాకలఁ దాల్పవలయు. మంత్రము వినాగ ధరించిన నది యెక్కుడు ఫలసిద్ధినీయదు. 100

గీ॥ ఎలమి రుద్రాక్షముల ధరి ♦ యించినట్టి, వానిఁగని భూతపైశాచ ♦ వర్గములును
శాకినీఢాకినీప్రేత ♦ సంతతులును, నాభిచారికదుర్విధు ♦ లంతె మొందు. 101

వ. ఇఁకనీరుద్రాక్షంబుల సర్వవర్ణాశ్రమంబులవారలు స్త్రీలుం బురుషులు కన్నియలైదువులు వితంతులు సర్వజనంబులు ధరింపఁజెల్లు. 102

క॥ శివుఁడును శివయును లక్ష్మియు, ధవుఁడును సిరి తమ్మిచూలి ♦ తద్దేహినియున్
రవియును గణనాథుండును, మివులన్ రుద్రాక్షమొంద ♦ మెచ్చెదరు మునుల్!

గీ॥ అలరు రుద్రాక్షమాలంబు ♦ నందు బ్రహ్మ, నాళమందున నరవింద ♦ నయనుఁడుండు
మొకమునందునరుద్రుండు ♦ పొలుచునిక్కడ, దీయబిందునమందురు ♦ దివ్యులెల్ల.

గీ॥ గ్రహణమున విషువమున సం ♦ క్రమణమందు
నయనమునఁ బున్నములయందు ♦ నమవసలను
నిండురోజుల రుదురాక ♦ దండినిడ్డఁ
దాల్చినట్టివానికి దురి ♦ తములు సమయు. 105

సీ॥ ధరలోన రుదురాకఁ ♦ దలఁచినవానికిఁ, బదియూలదానంబు ♦ ఫలముగలుగు
చేత రుద్రాక్షము ♦ స్పృశియించి తాల్పద్వి, సాహస్రగోదాన ♦ శర్మమగును

చెవులందు రుదురక్కఁ ♦ జేర్చినఁ బడుకొండు, వేలయావులయీవి♦శ్రీలనొందు
శిరసున రుద్రాక్షఁ ♦ జెందింపఁగోటియా, వులదాన మొసఁగిన ♦ ఫలముఁ జెందు

గీ॥ సక్తిజాబాల సదుపని ♦ షత్తునెవఁడు, నిత్య మధ్యయనము సేయు ♦ నేర్పుమీఱ
బాలుఁడై ననుయువయైనఁ♦ బ్రౌఢుఁడగుచు, సర్వులకుమంత్రిగురుఁడగు♦ శాసకుఁడగు.

క॥ గురుదత్తము రుద్రాక్షం, బిరవుగ గళమందుఁగాని ♦ యిఁక బాహులఁగా
ని రహిం సికయందు నేనియు, నరుఁడొంది గురునకు దక్షి♦ణనొసంగఁదగున్. 107

వ. సప్తద్వీపవతియగు వసుమతినంతను దక్షిణనొసంగినను జాల దట్లుగావున భక్తితో నొక్క పాడియావును సమర్పింపవలయునిఁక నీరుద్రాక్షోపనిషత్తును బ్రాతస్సాయంబుల బఠించినవార లనేకజన్మాఘంబులఁ బాయుదురు. లక్షయు నాఱువేల గాయత్రీజపఫలంబు లొందుదురిఁక పంచమహాపాతకంబులనుండి విడువఁబడుదురు పంక్తి శత సహస్రంబును బావనంబుచేయుదురు శివ సాయుజ్యంబు నొందుదు రట్టివారలకు మరలఁ బుడమి జన్మంబు లేదిఁక శివనామవైభవంబును గూరిచి కొండొకవినుండు. 108

## —* శివనామ పుణ్యము *—

గీ॥ సర్వపాపజనితదుఃఖ॥♦సంచయములు, సమయు శివనామ సంస్మర♦ణమున నిఁకను
నరయుఁడెంతేనిఁబుల్కసుం ♦ డైన శివుని, బలికినన్ వానిబంతి సా♦పడఁగనొప్పు.

వ. నిరపేక్షప్రమాణంబగు నామ్నాయవచనంబే "అపివాయశ్చండాలశ్శివ ఇతివా చంవదేత్తేనసహభుంజీత" యని ప్రతిపాదించినది. కావున 110

సీ॥ పంచమహాపాప ♦ పావకాంబుధరంబు, శివనామమున్నత ♦ శ్రీపదంబు
ప్రబలరోగాహితీ♦వ్రవిషజాంగులికంబు, శివనామమున్నత ♦ శ్రీపదంబు
ఘోరదారిద్ర్యదు ♦ ష్పారాబ్ధిపోతంబు, శివనామమున్నత ♦ శ్రీపదంబు
సమధికారిత్రాస ♦ హిమచయబ్రధ్నంబు, శివనామమున్నత ♦ శ్రీపదంబు

గీ॥ చటులతాపత్రయానలా ♦ క్రాంతదుఃఖ, బృందనిపతితశాశ్వతా ♦ నందపదము
శంభుపదగతికుశలపు♦ష్పకవరంబు, సేవ్యశివనామమున్నత ♦ శ్రీపదంబు. 111

క॥ వాఁడే వైదికజనుఁడును, వాఁడే పుణ్యాత్మకుండు ♦ వాఁడే ధన్యుం
డీడెనయని పుణ్యుండే, వాఁడిల శివనామజపము ♦ వాసినొనర్చున్. 112

క॥ శివనామం బిలనగు జా, హ్నవి భసితము యమునయై త ♦ నర్చును రుద్రా
క్ష విధివధూటియునగు నీ, త్రివేణిఁబూతుఁడగు జనుఁడు ♦ దివ్యుండుభువిన్.

వ. ఉపలక్షణంబుగ శివనామంబునుగూర్చి బోధించితిని. తక్కినట్టి శంభు శంకర శర్వాది నామంబులన్నియు నిట్టివేయని యోజింపుఁడు. 114

సీ॥ కడజాతివాఁడేనిఁ ♦ గాలకంఠు స్మరింప, వేద్కానాతని గార ♦ వింపవలయు
అలగాపరియేని ♦ నభవుని బాడిన, మేల్మినవ్వాని బ్రే ♦ మింపవలయు
పల్లెవాఁడైనను ♦ బరమేశుగుడిఁజుట్టఁ, బ్రేమమై ధనముల ♦ ర్పింపవలయు
జడుఁడేని శివనామ ♦ మెడపకనుడువుచో, దేవగురునిగ గు ♦ ర్తింపవలయు

గీ॥ మోరకుండైన నుపవీత ♦ భూతులకు, నరము శివలింగ మొందిన ♦ శంకరుఁడని
మనమునన్ దలపోసి స ♦ న్మానరీతిఁ, బ్రీతినానార్థముల సమ ♦ ర్పింపవలయు. 115

చ॥ చెలఁగి సనత్కుమారముని ♦ చేతను మాగురుఁ డీ సమస్తమున్
దెలిసి కడింది పేర్మి నుప ♦ దేశము నాకొనరించె నేనునున్
జెలువుగ మీకుఁ జెప్పితిని ♦ జెప్పకుఁ డెప్పుడు నాస్తికాళికిన్
ఖలుల కభక్తకోటికినిఁ ♦ గాదని చెప్పినఁ గల్గు దోసముల్. 116

— ♦ పురాణఫలశ్రుతి ♦ —

గీ॥ మఱియు వేదానుగతమగు ♦ మార్గమునను, నీశివపురాణమును నెవ్వ ♦ రేనిఁ జదివి
రేని వినిరేనిఁ బాత్రము ♦ నిచ్చిరేని, ఆత్రివర్గముఁగొని మోక్ష ♦ మధిగమింత్రు. 117

క॥ వాసువుగ నాచే మీచేఁ, బురాణయజ్ఞోత్సవంబు ♦ పుణ్యశ్లోకుల్ !
జరుపఁబడె నిట్టు లుపకృతి, పరస్పరం బమరెఁ జనుడు ♦ భద్రము మీకౌ. 118

గీ॥ ఇట్టులాశీస్సులిడి సూతుఁ ♦ డేగినంత, నానువృత్తులు మునులు యా ♦ గావసాన
మవుడు పొనరించి వేగ మో ♦ యచటినుంచి, కాశికేగిరి నిర్వాణ ♦ రాశికలరి. 119

క॥ అందును బశుపాశమును, ద్రుంచనరుచు పశుపతివ్ర ♦ శస్తవ్రతమున్
జెంది యధిగతసుబోధా, స్పందితులై యొందిరంతఁ ♦ బరమపదంబున్. 120

గీ॥ శివపురాణంబు ప్రియమగు ♦ శివునకును శి, వకును దత్పుత్రులకు గణ ♦ పాలురకును
నిఁకను బాఠకులకు భక్తి ♦ నిచ్చువిగుల, భుక్తిముక్తిప్రదంబగు ♦ మోదమొసఁగు.

గీ॥ శివపురాణంబుఁ జదివిన ♦ శిష్టులకును
శివపురాణంబు వినిన సు ♦ శ్రీకులకును
శివుఁడు శివయును దత్సుతుల్ ♦ శివగణములు
శివమునిచ్చుచు మనుతురు ♦ స్థిరముగాను.

మత్తకోకిల॥ మంగళంబగు శంభుమూర్తికి ♦ మంగళంబగు గౌరికిన్
మంగళంబగుఁ దారకారికి ♦ మంగళం బిభవక్త్రికిన్
మంగళంబగు వీరరాట్టుకు ♦ మంగళంబగు నందికిన్
మంగళంబగు సంతతంబు స ♦ మస్తశాంభవకోటికిన్. 123

క॥ ఆశశితారార్కముగా, నీశైవపురాణకృతి మ♦హేశుఁడు విబుధా
ధీశు లలరసాఁకుతఁ గా, వ్యేశుల కిడుఁగాత మోక్ష ♦ మెంతయుఁ బ్రీతిన్. 124

క॥ శ్రీవేదవిహితధర్మా, శ్రీవిభవ విరాజమాన ♦ సిద్ధతరాత్మా!
కోవిదజనపరిమోదిత, పావనఘనచర్య! వీర ♦ భద్రారాధ్యా! 125

క॥ సారశివలింగయోగ వి, శారద వీరేశలింగ ♦ శర్మాగ్రజ! వి
స్తారకరుణాంతరంగా!, శ్రీరాజచ్ఛరభమంత్ర ♦ సిద్ధవతంసా! 126

వనమయూరవృత్తము. శ్రీమనుమహాజపసు ♦ సిద్ధమహిమా! యు
ద్దామరసవత్సుకవి♦తాప్రబలకామా!
తామరసపత్రసమ♦తా మహితనేత్రా!
హేమవరవర్ణరుచి♦రేద్ధతరగాత్రా! 127

శ్లో॥ శివోమేస్తి శివోమేస్తి ♦ శివోమేస్తి శివాస్తిమే
శివస్త్రాత శ్శివామాతా ♦ శివస్త్రాతా శివావనీ. 128

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వర నామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి విద్యేశ్వరఖండంబు
సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





క॥ ఆశశితారార్కముగా, నీశైవపురాణకృతి మ♦హేశుఁడు విబుధా
ధీశు లలరసాంశుతఁ గా, వ్యేశుల కిడుఁగాత మోక్ష ♦ మెంతయుఁ బ్రీతిన్. 124

క॥ శ్రీవేదవిహితధర్మ, శ్రీవిభవ విరాజమాన ♦ సిద్ధతరాత్మా!
కోవిదజనపరిమోదిత, పావనఘనచర్య! వీర ♦ భద్రారాధ్యా! 125

క॥ సారశివలింగయోగ వి, శారద వీరేశలింగ ♦ శర్మాగ్రజ! వి
స్తారకరుణాంతరంగా!, శ్రీరాజచ్ఛరభమంత్ర ♦ సిద్ధవతంసా! 126

వనమయూరవృత్తము. శ్రీమనుమహాజపను ♦ సిద్ధమహిమా! యు
ద్ధామరసవత్సుకవి♦తాప్రబలకామా!
తామరసపత్రసమ♦తా మహిత నేత్రా!
హేమవరవర్ణరుచి♦రేద్ధతరగాత్రా! 127

శ్లో॥ శివో మేస్తి శివో మేస్తి ♦ శివో మేస్తి శివా స్తి మే
శివస్తాత శ్శివా మాతా ♦ శివస్త్రాతా శివావనీ. 128

గద్య. ఇది శ్రీ బుధజనవిధేయ ముదిగొండ నాగవీరేశ్వర నామధేయ
ప్రణీతంబైన శివపురాణంబందలి విద్యేశ్వరఖండంబు
సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



కొండా శంకరయ్యగారి ప్రీమియర్ పవర్ ప్రెస్సున ముద్రింపబడియె, సికింద్రాబాద్.